# సాహిత్య వ్యాసాలు

## వ్యాస ప్రపంచం - 5

రచన

**కొడవటిగంటి కుటుంబరావు**




విప్లవ రచయితల సంఘం
ఆంధ్రప్రదేశ్

వ్యాసప్రపంచం - 5

**సాహిత్య వ్యాసాలు**

**కొడవటిగంటి కుటుంబరావు,**



ప్రచురణ

**విప్లవ రచయితల సంఘం**

ఆంధ్రప్రదేశ్

మొదటి ముద్రణ

**మే 2001**

కవర్ డిజైన్

**మోహన్**

కంపోజింగ్

ఎస్ కె ఎం ఎల్ గ్రాఫిక్స్,
విశాఖపట్నం ఫోన్ 596728

ముద్రణ

నాగేంద్ర ప్రెస్, విజయవాడ

సోల్ డిస్ట్రిబ్యూషన్,
నవోదయ బుక్ హౌస్,
కాచిగూడ, హైద్రాబాద్ - 500 027

వెల రూ 150/-

# కృతజ్ఞతలు

సారస్వతి నికేతనం, వేటపాలెం
గౌతమీ గ్రంధాలయం, రాజమండ్రి
భ్రమరాంబ గ్రంధాలయం, విజయవాడ
ఆంధ్రమహిళాసభ, మద్రాసు
కధానిలయం శ్రీకాకుళం
ఈ వ్యాసాలు వివిధ పత్రికలలోనూ, సావనీర్లలోనూ అచ్చుయినవి
ఆయా బాధ్యులకి మా కృతజ్ఞత

'పుస్తక పరిచయం'లోని వ్యాసాలు ఆయాపుస్తకాలకి ఆయన రాసిన ముందు మాటలు ఆ రచయితలకీ, రచయిత్రులకి మా కృతజ్ఞత

పురాణం సుబ్రహ్మణ్యశర్మ (ఆంధ్రజ్యోతి)
నండూరి రామమోహనరావు (ఆంధ్రజ్యోతి)
లీలావతి రాఘవయ్య (జ్యోతి)
ఆలూరి సుధాకర్, ఆలూరి రంగారావు (యువ)

కె వి ఆర్ వి సుబ్రహ్మణ్యం - కావలి
డా పి దక్షిణామూర్తి, కొత్తపల్లి రవిబాబు - తెనాలి
లంకా సూర్యనారాయణ - గుంటూరు
సజ్జా వెంకటేశ్వర్లు - వేటపాలెం
సన్నిధానం నరసింహశర్మ - రాజమండ్రి
దాసరి సుబ్రహ్మణ్యం, కాకరాల - మద్రాసు
కాత్యాయనీ విద్మహే - వరంగల్లు

చలసాని ప్రసాదరావు, కతు విశ్వనాధరెడ్డి, ఎన్ వేణుగోపాల్, వాసిరెడ్డి వేణుగోపాల్
బి జగన్ శివలక్ష్మి, వసంతలక్ష్మి - హైదరాబాద్

ఆంధ్ర శేషగిరిరావు, స్థానాపతి రుక్మిణమ్మ, మసూనా , అత్తలూరి నరసింహారావు, అత్తిలి కృష్ణారావు, టి వేణుగోపాలరావు, బి టి రామానుజం, విశాఖవర్మ
విశాఖపట్నం

మరెందో అజ్ఞాత మిత్రులు - అందరికీ కృతజ్ఞతలు

కొడవటిగంటి వరూధినిగారి సహకారం ప్రోత్సాహం
మాకెంతో ఉత్తేజాన్నిస్తున్నాయి

**- విరసం**

# సాహిత్యం : స్వరూప స్వభావాలు

సాహిత్యం అంటే ఏమిటి ? ఎప్పుడు పుట్టింది ? సాహిత్యం ఎందుకు ? సౌందర్యం, రసానందం కోసమేనా ? సాహిత్య విమర్శ కూడా సాహిత్యమేనా ? సాహిత్యానికి సంఘాలు అవసరమా ? రాజకీయాలు సాహిత్యానికి అంటరానివా ? సామాజిక సిద్ధాంతాలకీ, ఉద్యమాలకీ సాహిత్యం బహుదూరపు బాటసారా ? ఇలాంటి శతకోటి ప్రశ్నలు ఎప్పటినుంచో సాహిత్యంలో పీటలు వేసుకూర్చున్నాయి వీటన్నింటినీ తోసిరాజని ఇప్పుడు అందలమెక్కుతోంది పోస్ట్‌మోడర్నిజం దీనికీ చరిత్రకీ చుక్కెదురు అయితే మరి చరిత్రకి ముందు వెనకలుండవా ? చరిత్రలో మనం సొంతం తెగతెంపులు చేసుకోవాలా? ఎక్కడి నుంచి బయలుదేరామో తెలిస్తేనేగాని మనం ఎక్కడికి చేరుకోవాలో తెలుసుకోలేం అని కుటుంబరావుగారే అన్నారు చరిత్రతోపాటు సాహిత్యానికీ గట్టి సామాజిక పునాది వుండాలి సాహిత్యం నేలవిడిచి సాము చేయలేదు ఇవన్నీ మనసులో వుంచుకుని పరిశీలనకి పూనుకుంటేనే సాహిత్యం ఆనుపాలు మనకి అవగతమవుతాయి

సాహిత్యం సామాజికమైనది సమాజంతో పుట్టింది, పెరిగింది, మారింది, మారుతుంది కథలు, గాథలు, పిట్టకదలు, పొడుపు కథలు, నుడులు, నానుడులు, సామెతలు, సూక్తులు, పల్లెపదాలు, పాటలు – అన్నీ సాహిత్యమే ఇవేవీ లిఖితం కావు లేఖనం కన్నా చాలా ముందునుంచే ఇవి సమాజ హృదయపు పొరల్లో దాక్కుని వున్నాయి లేఖనంతో పాటు వచ్చిందే లిఖితసాహిత్యం ఉన్నదున్నట్టు పదిలపరచుకునే సదుపాయం లిఖిత సాహిత్యానికి వుంది

సాహిత్యానికి మూలం మానవ సంబంధాలు ఆమాటకొస్తే, అసలు మాటే ఒక మానవ సంబంధం సాటివారితో, తోటివారితో మనందరం మంచి చెడులు మాట్లాడుతూనే వుంటాం కష్టసుఖాలు కలబోసుకుంటాం సాటివారిని పట్టించుకుంటాం అభిమానాలు, అనుబంధాలు, ఆవేశాలు, ఆనందాలు, కోపాలు, తాపాలు – వీటన్నిటితో పెనవేసుకు పోయిందే మానవ మనుగడ ఎందరెందరితోనో మసలుకోవడం మానవుల ఉనికికి అవసరం మన ఉనికి నుంచే మన చైతన్యం రూపొందుతుంది

చైతన్యం పెంపొందడానికి ఎన్నో అంశాలు దోహదం చేస్తాయి అనుభవం అపారంగా తోడ్పడుతుంది అసలు జీవితమే అనుభవసారం అంటారు అనుభవాలు

అందరికీ ఉంటాయి అనుభవానికి ఆసరాగా వుంటుంది ప్రత్యక్ష పరోక్షజ్ఞానం అటు అనుభవం, ఇటుజ్ఞానం ఈ రెంటి మేళవింపే ఆలోచన ! ఇది భాషద్వారా వ్యక్తమవుతుంది సాహిత్యానికి భాష జీవగర్ర అయితే ఇది పూర్వజన్మ సుకృతం కాదు కేవలం గ్రంథాలకి పరిమితమయిందీ కాదు వేల ఏళ్ళుగా సాగుతున్న చరిత్రకీ, కొనసాగుతున్న సమాజానికీ, వివిధ పరిణామ దశలకి చెందింది భాష ప్రాచీన కాలం నుంచీ కూడా భాషతో పెనవేసుకుపోయింది సాహిత్యం ఎన్నో మార్పులకి లోనవుతూ కూడా వచ్చింది ప్రాచీనసాహిత్యం పనికిరానిదని ఎవరం అనం ఎలా రాయకూడదో, ఏమి రాయకూడదో తెలుసుకోవడానికికైనా పాతసాహిత్యం చదవాలి ఇవి ప్రతికూలాంశాలు అయితే మనం అనుకూలాంశాల్ని కూడా పరిశీలిద్దాం అడవుల పాలైన పంచపాండవుల్నీ, ద్రౌపదినీ పరామర్శించడానికి బృహద్వశ్యుడు అనే మహాముని వెళతాడు ధర్మరాజు మునిదగ్గర దుఃఖం వెళ్ళబోసుకుని "అయ్యా మాలాగా అడవుల్లో ఎవరైనా ఇలా ఇడుములు పడ్డారా?' ' అని అడుగుతాడు అప్పుడు మహాముని నోటి నుంచి వెలువడిందే 'నలోపాఖ్యానం' ఇది కూడా కుటుంబరావుగారు ఇచ్చిన ఉదాహరణే

అందుకని ప్రాచీన సాహిత్య మూలాల్ని మనం విస్మరించం అధ్యయనం చేస్తూనే వుంటాం సాహిత్యరంగంలో ప్రవేశించే వారికి ఈ ఆసక్తి తోడ్పడుతుంది అయితే ఆసక్తితోపాటు అభ్యాసం కూడా ఉండాలి ఎవరూ సహజ కవచకుండలాలతో పుట్టరు అటు పరిస్థితులూ, ఇటువాతావరణం, నిత్యసాధన - ఇవి ముప్పేటగా రచనని పదునెక్కిస్తాయి

సాహిత్య రచన చేసేవాళ్ళు సిద్ధాంతాల జోలికి పోగూడదని తరుచుగా వింటూంటాం ఇది చాలా పేలవమైన వాదం ఎందుకంటే ప్రపంచంలో తత్త్వవేత్తలందరూ ఆలోచించిందీ, వ్యాఖ్యానించిందీ మానవ సంబందాల గురించే ఆమాటకొస్తే మానవ సంబంధాలే మార్క్సిజం సారాంశం అయితే ఆలోచనతో, వ్యాఖ్యానంతో ఆగిపోలేదు మార్క్స్ మానవ సంబంధాలు ఎలా ఉన్నాయో, అలా ఎందుకున్నాయో, అవి ఎలా మారాలో, మారడానికి మనం ఏం చెయ్యాలో విశదపరిచింది మార్క్సిజం ఇది ఒక సామాజిక దృక్పదాన్ని కలిగిస్తుంది ఈ దృక్పదం ఏర్పడ్డానికి ఎన్నో ప్రభావాలు తోడ్పడతాయి ఈ మాటలు కుటుంబరావుగారిక్కూడా వర్తిస్తాయి ఒక ఉదాహరణ 'సాహిత్యంలో

కలగవలసిన మార్పు' అనే వ్యాసమూ, 'అర్ధికోపన్యాసాలు' అనే కథా కొకు (1938) రాశారు ఆ వ్యాసం ఈ సంపుటిలో వుంది కద మాత్రం కొకు సాహిత్యం – 3వ సంపుటం (విశాలాంధ్ర ప్రచురణ)లో వుంది "నా జీవితంలో నేనవలంబించిన కమ్యూనిస్టు వ్యతిరేకత అంతా ఈ రెండు రచనలకే పరిమితమైందనుకుంటాను నా అజ్ఞానాంధత్వానికి ఇవి మచ్చుతునకలు' అంటూ ఆయన ఆత్మవిమర్శనా వ్యాసం (1964) రాశారు ('కమ్యూనిస్టు విముఖత అంటే ' అనే ఈ వ్యాసం ఆయన రాజకీయ వ్యాసాల్లో చోటుచేసుకుంటుంది ) ఆ తర్వాతే ఆయన సాహిత్య సంఘాలతోనూ, సామాజిక ఉద్యమాలతోనూ, రాజకీయ పోరాటాలతోను ప్రమేయం పెట్టుకున్నారు

అయినా సాహిత్యంలో ముఖ్యంగా వుండవలసింది జీవితచిత్రణ అయితే ఏదో ఒక తాత్త్విక దృక్పథం, ఏవోకొన్ని రాజకీయ అభిప్రాయాలు లేని రచయిత్రులు, రచయితలు ఇవాళ అరుదు అందుకని రాజకీయాలు రచనలలోకి చొరబడక తప్పదు

అందుకని ఈ సంపుటిలోని చివరి మూడు అధ్యాయాలు అందరూ అధ్యయనం చెయ్యాలి అప్పుడే సాహిత్యం మీద రాజకీయాల ప్రభావం స్పష్టంగా తెలుస్తుంది రచయితకి ముఖ్యంగా జీవితానుభవం, సమాజ స్వరూప పరిజ్ఞానం, వర్గదృక్పథం వుండాలన్నారాయన

కుటుంబరావుగారు ఇంచుమించు అర్ధశతాబ్దం పాటు సాహిత్యంలో తలమునకలై, నిర్విరామంగా రాస్తూనే వున్నారు ఆయన ఎప్పుడూ నేలవిడిచి సాము చెయ్యలేదు

వాస్తవికత ఆయన సృజనాత్మక సాహిత్యానికి పట్టుగొమ్మ

విశ్లేషణ ఆయన విమర్శనా వ్యాసంగానికి చోదకశక్తి ఇవి రెండూ రెండు కళ్ళు ఆయన మనకి కలిగించిన చూపు చూపించిన బాట

ఆధునిక తెలుగు సాహిత్య మార్గదర్శకుల్లో నిస్సందేహంగా ఆయన ఒకరు

మార్చి 8, 2001

**– కృష్ణాబాయి, ప్రసాద్**

# కొకు వ్యాస ప్రపంచం

* 1) సైన్సు వ్యాసాలు - మొదటి ముద్రణ - జనవరి 1989
రెండవ ముద్రణ - జనవరి 1997

* 2) చరిత్ర వ్యాసాలు అక్టోబర్ 1999

* 3) సంస్కృతి వ్యాసాలు అక్టోబర్ 1999

* 4) సినిమా వ్యాసాలు 1, 2 భాగాలు - డిసెంబరు 2000

5) సాహిత్యవ్యాసాలు

6) రాజకీయ వ్యాసాలు

7) తాత్విక వ్యాసాలు

8) లేఖలు

---

* అచ్చు అయినవి

# దర్పణం

## I. భాష



## II. సాహిత్య వేత్తలు

## III. నేనూ – నా రచనలూ

## IV. సాహిత్య రూపం

## V. సాహిత్య సారం

## VI. సాహిత్య విమర్శ

## VII. లేఖలు



## VIII. పుస్తక పరిచయం

## IX. పుస్తక సమీక్ష

## XI. సాహిత్యంలో రాజకీయాలు



## XII. సాహిత్య ఉద్యమాలు

## XIII. ఇష్టాగోష్ఠి

# 1. కొన్ని సంశయాలు

కొంతకాలం కిందట - నాలుగోఫారం, అయిదో ఫారం చదివేటప్పుడు - వాడుక భాషను చులకనగా చూసేవాణ్ణి నేను తరువాత కాలేజీలో ప్రవేశించినప్పుడు భారతి మొదలైన మాసపత్రికల్లో వాడుకభాషలో రాయబడ్డవి చాలా అందమైన వ్యాసాలు చదివాను నా మనసు వాడుకభాషకూ గ్రాంధికభాషకూ మధ్య ఊగుతున్న సమయంలో గిడుగు రామమూర్తి పంతులు గారు మా హాస్టలుకు దయచెయ్యటం, కాలేజీలో ఉపన్యాసం ఇవ్వటం జరిగినై అప్పుడే వారు ''అట్టిడు'' అనే పదానికి ద్వితీయావిభక్తి బహువచనం ఎవరైనా చెప్పగలిగితే తమ ప్రయత్నమంతా మానేసి గ్రాంధికభాషాసేవ చేస్తానని ఛాలెంజ్ చేశారు ఆ రోజునుంచి నాకు గ్రాంధిక భాష మీద అభిమానం పోయింది కాని అప్పటి నుంచి ఇప్పటి వరకు ఒక సంశయం ఉండనే ఉంది

అదేమిటంటే - అందరికీ ఉపకరించే తెలుగేది?

తూర్పున ''అలా'' అంటారు మావైపున ''అట్లా'' అంటాం మేం ''ఏమిటి'' అంటాం ఒంగోలువైపున ''ఏంది'' అంటారు ఇటువంటి భేదాలుండి తీరాలి వాటిల్లో ఒక విధమైన మాధుర్యం లేకపోలేదు ఇన్ని లక్షల ఆంధ్రులకు పనికి వచ్చే భాష ఒకటి ఉండాలా వద్దా? ఇది శాస్త్రసమ్మతమైన ఇంగ్లీషూ, ఇది వాడుక భాషా అని ఉంది ఇది శాస్త్ర సమ్మతమైన తెలుగు, ఇది వాడుక భాష అంటే ఏది? శాస్త్రమేది? పోనీ తెలుగులో నిఘంటువు ఒకటి వచ్చి ఇది స్టాండర్డు తెలుగు మాట, ఇది వాడుకపదం అని చెప్పేవరకూ కాస్త అటూ ఇటూగా వాడుకభాష రాద్దామనుకున్నాను

అందువల్లనే భమిడిపాటి కామేశ్వరరావుగారూ, గుడిపాటి వెంకటాచలం గారూ, కవికొండల వెంకటరావుగారూ (వారు రాసినట్టే మాట్లాడతారని నాకు నమ్మకం లేదు మాట్లాడతారని తెలిస్తే మాత్రం నేను చాలా ఆశ్చర్యపడతాను ) వారివారి భాషల్లో రాస్తుంటే సంతోషిస్తున్నాను

ఫిబ్రవరిలో ''బిడ్డల శిక్షణ'' తలపేర ప్రచురింపబడ్డ టేకుమళ్ల కామేశ్వరరావు గారి వ్యాసంలో చివరి భాగం చూస్తే నేనింకా పెరటి దారినే ఉన్నట్టు కనిపిస్తుంది

శైలి ఎవరు మాట్లాడే భాషవారు రాయటానికుపయోగిస్తున్నారని నా ఉద్దేశం ''పూర్ణా రోగ్యం, విస్తీర్ణం, సంస్థ'' మొదలైన వాటిల్లోణా వత్తూ, పొట్టలో చుక్క ధావత్తూ వెంకటాచలంగారు సరిగా పాటించకపోవటం వారి శైలిలో లోపంగా కామేశ్వరరావుగారు అభిప్రాయపడ్డారు మరి వెంకటాచలం గారు ''పూర్ణారోగ్యం, సంస్థ'' అనరు నోటి వెంట అనకపోయినా వారెవరూ అటకాయించటం లేదు పొట్టలో చుక్క, ధావత్తులు కాశిలో వదిలేసి వచ్చిన వాణ్ణి నేనొకణ్ణున్నాను అనేక మందిమి వాడుకభాషలో రాయనిచ్చిన తరువాత దాస్య విముక్తి లభించినట్టు ఫీలవుతున్నాం కామేశ్వరరావు గారు చెప్పేది చూస్తే అటువంటి విముక్తి మాకింకా లభించినట్టు కనిపించదు

వాక్యారంభంలో అచ్చులు, ''యిష్టం, వురుమూ, య[illegible],'' మొదలైనవి వాక్యా మొదట వచ్చినప్పుడు అచ్చుగానే ఉంటే బాగుంటుందని కామేశ్వరరావు గారి అభిప్రాయం

''ఉండాలి'' అనే మాటను '' వుండాలి'' అని కామేశ్వ(రావుగారు రాస్తూనే ఉన్నారు ఉ।। '' ఎట్టి మాటలు అచ్చుతో వుండాలి '' (''వు'' అచ్చు పొరపాటయితే నేను జవాబుదారీ కాదు ) ''తో'' అనే ప్రత్యయం ''తోన్'' కానంతవరకూ ''ఉండాలి'' అనే మాట ''తో'' తరువాత వచ్చినా వాక్యారంభంలో వచ్చినా ఒకటే

తెలుగు మధ్య ఇంగ్లీషు కాల(క్రమాన బండిరాలు అరసున్నాలు, ఇదేమిటిదేమిటి? మొత్తం మొత్తంగా గ్రాంధికభాషనే విసర్జించిన వారిలో కూడా అనేకమంది సంస్కృత పదాలు దొర్లితే గమనించరు కాని ఇంగ్లీషు ముక్క దొర్లినట్లాయనా గు(రుమంటారు సంస్కృత పండితులు సంస్కృతం మనస్ఫూర్తిగా (సరియయిన తెలుగా మాట ఉన్నా) వాడవచ్చును కాని తప్పని సరిగా ఇంగ్లీషు చదివిన వాడు ఒక్క ఇంగ్లీషు ముక్క రాయరాదు! కామేశ్వ(రావుగారు ఈ విషయం అంత పట్టుదలగా ఉండలేదు పుస్తకం ఆడవారికోసం రాయబడ్డదికదా ఇంగ్లీషెందుకన్నట్టు చెప్పారు ''ప్రిన్సిపల్సు, టెంపరమెంటు'' మొదలయిన మాటల జాబితాలో ఒక్క ముక్కకు కూడా నాకు తెలుగు తేలీదు శంకరనారాయణ డిక్షనరీ చూస్తే తెలుగు తెలుస్తుందేమో, కాని ఆ మాటలు ప్రతి రోజూ ఉపయోగించనివి కావటం చేత తర్జుమాకన్నా ఇంగ్లీషు ముక్కే రాయబుద్ధవుతుంది

కామేశ్వ(రావుగారి యందు నేనేవిధమైన తప్పు ఆరోపించ బోవటంలేదు వారు భాషను గురించి ఈ మూడు విషయాలు బయటపెట్టారు ఈ విధంగానే మరొకరు మరికొన్ని కట్టుబాట్లు కోరవచ్చును ఈ విషయాల్లో ఒకరు చెప్పవలసిందీ మిగిలినవారు వినవలసిందీ కాని గత్యంతరం లేదు కట్టుబాట్లు వద్దనటానికి వీల్లేదు, మనిషికొక తెలుగై ఊరుకుంటుంది - ఇప్పుడు కానే అయింది అటువంటప్పుడు చేయదల్చుకున్న కట్టుబాట్లన్నీ ఒక గ్రంథంలో రాసి పబ్లిషు చేస్తే అందరం కొనుక్కుంటాం నా మటుకు నాకు ఇంగ్లీషు మాటలకు సరియయిన తెలుగు రాదని చెప్పుకోటంలో నామర్దా లేదు ఉన్నదే ఒక ఇంగ్లీషు-తెలుగు డిక్షనరీ అది సరయినదని నమ్మకం లేదు సంస్కృతం చదువుకోలేదు నామర్దా ఏదన్నా ఉంటే, చక్కని తెలుగు మాని ఇంగ్లీషు చదువుకోవటంలోనే ఉండాలి కాని అదీ అనటానికి వీల్లేదు తెలుగులో కృషి చేయ్యాలంటే ఆ పని కాలేజీలో జరుగదు (ఆంధ్రా యూనివర్సిటీలో కూడా!) ఇంగ్లీషు లిటరేచరు చదివే విద్యార్థులు ఎమ్ ఎ కు పోయే వరకు చాసరు గాని అంతకు పూర్వపు రాతగాళ్ల రాతలు కాని చదవక్కర్లేదు తెలుగు సారస్వతం చూడబోతే నన్నయ భట్టారకుడితో ప్రారంభమై పెద్దన్న దగ్గిరో ఆ ప్రాంతాల్లో ఆగిపోయినట్టు కనిపిస్తుంది ఈ కాలపు తెలుగు రాస్తే సున్నా పెడతారు పరీక్షల్లో ఇక వాడుక భాషలో రాసేవాళ్ల గతి ఏమిటి? తాత్కాలికంగా ఒకసారి చదివి ఆనందించి అవతల పారేసే కథలు (వాటిల్లో ఒక మొగుడూ, ఇద్దరు పెళ్లాలు ఉంటే ఒకత్తి చస్తుంది అంతా బాగుంటారు) ఏదో భాషలో రాస్తారు ఇబ్బంది లేదు అదంతా లైట్ లిటరేచర్ రేపు నేను చుక్కల మీద ఒక వ్యాసం రాయాలనుకుంటాను వ్యావహారిక భాష అనేపదం ఆధారం చేసుకుని చూస్తూ చూస్తూ కోర్టుభాష ఎట్లా ఉపయోగించగలను? చాతనయినదేదో, మాట్లాడేదే ఉపయోగిస్తే ఎవరి ఇష్టం వచ్చిన తప్పులు వారు పడితే నేనేం కావాలి?

కాబట్టి రాయగల ప్రముఖులను, ప్రబుద్ధాంధ్రలో వ్యాసాలు రాసి, భాషకు అవసరమైన కట్టుబాట్లన్నీ చేసి, ప్రతి గాలికీ ఎగిరిపోకుండా అవయవాలు స్వేచ్ఛగా కదిలించడానికి వీలు లేకుండా ఉండకుండా తగిన ఏర్పాటు చేసి తెలుగు భాషను కూడా స్టాండర్డైజు చేసి పుణ్యం కట్టుకోమని ప్రార్థిస్తున్నాను

*ప్రబుద్ధాంధ్ర, మాస పత్రిక, మార్చి 1934*

## 2. దేశీయ భాషల భావిగతి

మనం ఇంతకాలమూ ఇంగ్లీషు బాషద్వారా సంస్కారం సంపాదించాం బోలెడంత ప్రపంచ సాహిత్యం మనకు ఇంగ్లీషు ద్వారా అందుబాటులోకి వచ్చింది అనేక శాస్త్ర విషయాలూ, వార్తలూ కూడ ఇంగ్లీషులోనే చదివి అర్థం చేసుకున్నాం మనమంతా ఆంగ్ల మానస పుత్రులమైపోయినామని మన ముందుతరం వాళ్ళు మనని ఎద్దేవా కూడా చేశారు ఇంగ్లీషు మాట దొర్లకుండా మనం అయిదు నిమిషాలు పట్టుమని మాట్లాడలేం మనం తెలుగులో రాయటానికి ప్రయత్నించినా ఇంగ్లీషు భాషా ధోరణి అందులోకి దిగుతుంది వీరేశలింగం గారి వంటి తెలుగు పండితులకు సయితం ఇంగ్లీషు తనంతో కూడిన వాక్యధోరణి అప్పుడప్పుడు కలగిందంటే సామాన్యులమాట చెప్పేదేమిటి?

పరిస్థితి మంచిదా చెడ్డదా అంటే దాన్ని గురించి అటూ ఇటూకూడా బోలెడంత వాదించవచ్చు ఇందులో కొంత మేలూ ఉంది, కొంత కీడూ ఉంది కాని నేనా విషయం తర్కించబోను ఇప్పుడు నేను చర్చించే సమస్య ఏమిటంటే, ఇంగ్లీషును మనం ఎంతోకాలం నమ్ముకోలేం ఇప్పుడున్న స్థితిలో దేశీయభాషలు మన సంస్కారాన్ని ప్రతిఫలించ లేవు ఈ భాషలు చాలా సంస్కారం పొందాలి ఈ సంస్కారం ఎట్లా జరుగుతుంది? దాని విషయంలో మన కర్తవ్యమేమిటి?

బొంబాయి పత్రికల్లో ఈ విషయం తర్జన భర్జనలు జరుగుతూ ఉన్నాయి కొందరు "ఇంగ్లీషును మనం తక్షణం జార విడవాలి" అనీ, మరికొందరు "అది అసంభవం - మన భాషలు మన సంస్కారానికి తగ్గ పరిణామం పొందేవరకూ మనం ఇంగ్లీషును పోవిడువలేం," అనీ అంటున్నారు నా బుద్ధికి ఇద్దరి వాదనలూ లోప భూయిష్టంగానే తోచాయి ఇంగ్లీషు విసర్జించినంత మాత్రంచేత దేశీయ భాషలు సత్వరంగా అభివృద్ధి చెందుతాయని నేను నమ్మలేకుండ ఉన్నాను దేశీయ భాషలు వాటి ధర్మమా అంటూ అవి అభివృద్ధి అయిన నాటికి మనం ఇంగ్లీషును వర్జింతామనుకోవటం చూస్తే, "ఈత వచ్చాకనే నీటిలో దిగుదాంలే" అన్నట్టున్నది

సమస్యకి సరి అయిన పరిష్కారమార్గం లేకపోలేదు అయితే అది ఒక్క తీర్మానంతోగాని, తీర్మానాన్ని శాశ్వతంగా వాయిదా వెయ్యటంతోగాని జరిగేదికాదు

భాషలో జరిగే పరిణామం దానంతట అది జరగటం గాని, బలాత్కారంగా తెచ్చిపెట్టటంగాని అసంభవం సమర్థులైన వాళ్లు ఆధునిక ప్రయోజనాలకు భాషను వాడుతున్న కొద్దీ భాష కూడా ఆధునికమవుతంది సాహిత్యమూ, రాజకీయ ప్రకటనలూ, ఉపన్యాసాలు, సినిమాలూ, మొదలైన వాటి ద్వారా భాషకు ఉమ్మడి ఉపయోగం జరుగుతుంది

ఇట్లా భాషను ఉపయోగించి దానిలో పరిణామం తెచ్చేటప్పుడు, ఆ భాష యొక్క పరిణతికి రెండురకాల అంతరాయాలు కలుగుతూ వుంటాయి మొదటిది, దానికి పెద్దలు పెట్టే ఆంక్షలు, తెలుగు భాషకి అతిహేయమైన, అనర్ధకమైన గ్రాంధిక భాషావాదం-అంటే కవిత్రయం వారి భాషలోనే గ్రంధమంతా నడవాలనే వాదం- ఒకటి ఉంది దీన్ని ఎవరూపాటించటం లేదు గనక - తెలుగు భాష ఇవాళ ఈమాత్రం సజీవంగా ఉంది

రెండో విషయం ఏమిటంటే, వెనుకబడి వున్న భాషను, ఆధునిక ప్రయోజనాలకు వాడటంలో ఇతర ఆధునిక భాషల పోకడలు దీనికంటగడతారు అంటే ఇంగ్లీషులాంటి తెలుగు రాయటమనుకోండి

ఈ రెండూ తప్పే, ఇంగ్లీషు విద్య చదివిన మన యువకులు తమకు తెలుగురాదనీ, తెలుగు చదవమనీ చెప్పుకోవటం గర్వం ఇందులో గర్వించటానికేమీలేదు ఈనాటి రచయితలు ఇంగ్లీషులాటి భాషల్లో ఉండే ఆధునికత్వం తెలుగులోకి తెస్తున్నారు ఇంగ్లీషు తప్ప చదవని యువకుల కా సంగతి తెలియదు

ఆ విధంగానే తెలుగులో రాసే యువకులకు ''మాకు పాత గ్రంధాలు గురించి పరిచయం లేదు'' అని చెప్పుకోవటం గర్వం వీరే ఇంగ్లీషు తెలుగూ అపభ్రంశపు తెలుగూరాస్తున్నది తెలుగు నుడికారమూ, తెలుగు జీవమూ తెలియాలంటే పాత సాహిత్యం చదివి తీరాలి

మనం ఇంగ్లీషును బహిష్కరించ నవసరం లేదు తెలుగు మీద ఆదరం పెంచుకుంటే చాలు, దాన్ని ఆధునిక ప్రయోజనాలు అర్థించి ఉపయోగించటం పనిగా పెట్టుకుంటే చాలు క్రమంగా అదే పరిణామం చెందుతుంది ఇంగ్లీషు ఎల్ల ప్రయోజనం దానంతట అదే తరిగిపోవాలి దేశభాషలవల్ల ప్రయోజనం పని పెట్టుకుని సాధించాలి ఇదీ నా నమ్మకం

ఆధునిక రచయితలు తెలుగు భాషలో అదివరలో జరిగిన పరిణామాన్ని పాటించక పోవటం చేత సామాన్య ప్రజలకి ఈ భాష కృతకంగానూ విజాతీయంగానూ కనిపించడం జరుగుతున్నాది దానివల్ల ప్రజాసామాన్యం ఆధునికత్వం పొందలేకుండా ఉన్నారు

సంస్కారం గల యువకులు తెలుగు సాహిత్యాన్ని భాషనూ అనాదరంతో చూడటంవల్ల వాళ్ళకు ఇంగ్లీషు బొత్తిగా తప్పని సరి అవుతూ వుంది

మన రచయితలు పాత సాహిత్యమూ, మన విద్యార్ధికులు కొత్త సాహిత్యమూ ఆదరంతో చదివిననాడు ఈ సమస్య దానంతట అదే విడిపోతుందనటానికి సందేహం లేదు

ఇంగ్లీషు పత్రికలతోనూ, పుస్తకాలతోనూ దేశభాషల్లో వెలువడే పత్రికలు పుస్తకాలూ, పోటీ చెయ్యలేనంత కాలమూ మన భాషలకు మోక్షంలేదు ఇంగ్లీషులో పత్రికలు అచ్చుకాకూడదనీ, ఇంగ్లీషు పుస్తకాలు చాలా పరిమితంగా దిగుమతి కావాలని శాసనం చెయ్యటం ఒక్క క్షణం పని కాని దానివల్ల దేశ భాషలు బాగుపడతాయనేది చాలా అనుమానాస్పదం అనేకమంది తెలుగు పెద్ద మనుషులను ఉపన్యాస వేదికల మీద ''అయ్యా తెలుగులో మాట్లాడండి,''అని అడిగితే వారు తెలుగులో చెత్తగా మాట్లాడటం మనం చూశాం ఇంగ్లీషును బలాత్కారంగా పంపిస్తే మనకు చెత్త మిగులుతుంది ఇంగ్లీషును నమ్ముకున్నా కూడా మన భాషలు ఈ చెత్త స్థితిలోనే ఉంటాయి

*తెలుగు స్వతంత్ర వారపత్రిక, 20 8 1948*
*పునర్ముద్రణ విశాలాంధ్ర, ఏప్రిల్ 1969*

# 3. భాషలో కలిగే మార్పులు

రష్యాలో ఇటీవల భాషను గురించి తర్జన భర్జనలు జరిగాయి ఎన్.వై. మార్ అనే భాషా తత్వవేత్త భాషను గురించి కొన్ని సిద్ధాంతాలు చెప్పాడు సాంఘిక వ్యవస్థనుబట్టి భాష మారుతూ ఉంటుందనీ, భాషకు వర్గ స్వరూపం ఉన్నదనీ మార్ సిద్ధాంతీకరించాడు ఈ సిద్ధాంతాలు మార్క్స్ సిద్ధాంతాలకనుగుణంగా ఉన్నాయని ఆయన శిష్యులు తలపోశారు దీనిపై ''ప్రవ్దా'' పత్రికలో తర్జన భర్జనలు జరిగాయి కమ్యూనిస్టు యువకులు స్టాలినును భాషా విషయమై ప్రశ్నించారు ఈ ప్రశ్నలకు సమాధానం చెబుతూ స్టాలిను అనేక విషయాలు వివరించాడు ఈ వివరణ అచ్చుగా మార్క్సిస్టులకే కాక భాషను గురించి తెలుసుకోగోరేవారికి కూడా తెలియదగినది

స్టాలిను చెప్పిన ముఖ్య విషయాలివి

భాష ఒక ప్రత్యేక సాంఘిక వ్యవస్థను పురస్కరించుకొని ఉండేది కాదు దానితో మారదు అది చిరకాల సాంఘిక చారిత్రక పరిణామ ఫలితంగా ఏర్పడి వృద్ధి చెందుతుంది ఒక వర్గమే దాన్ని ఉపయోగించదు అన్ని వర్గాలు ఉపయోగిస్తాయి ప్రతి వర్గానికీ ఒక్కొక్క భాష ఉన్నట్లయితే వర్గాల మధ్య సంపర్కమే సాధ్యం కాదు

భాష ఒక పనిముట్టు పెట్టుబడిదారీ యుగంలో పెట్టుబడిదార్లకు పనికివచ్చిన యంత్రాలు విప్లవానంతరం అందరికీ పనికి వచ్చినట్టుగానే భాష కూడా ఉపకరిస్తుంది

వర్గాలు ప్రత్యేక పదజాలాన్ని వాడవచ్చు ఆ పదజాలం వేరే భాష కాదు భాషకు ప్రధానమైనది వ్యాకరణమూ, మూలపదాలూనూ ఇవి సాంఘిక వ్యవస్థ మారి సంత త్వరగా మారవు

మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్‌లు భాషను గురించి చెప్పిన మాటలకు కొందరు ఎటువంటి అపార్థాలు తీశారో కూడా స్టాలిను వివరించాడు

స్టాలిన్ నిర్వచించే భాష జాతి వెంట పుట్టి పెరిగేభాష ఆ భాషలోని వ్యాకరణము, మూలపదాలూ కలిసి ఆ జాతి యొక్క స్థాయిని సూచించవు ఈ శక్తి పదజాలానికున్నది ప్రస్తుతం మన తెలుగు భాషలో శాస్త్ర విషయాలనూ, రాజకీయ విషయాలనూ, చర్చించే పదజాలం లేదు అనేక వందల ఏళ్లుగా తెలుగువాళ్ళకు శాస్త్రపరిజ్ఞానము, రాజకీయాలతో సంపర్కమూ లేకపోవడమే దీనికి కారణం భాషతాలూకు పదజాలం వేగంగా మారుతుందనీ కొన్ని వ్యర్థపదాలు పోయి, అనేక కొత్తమాటలు భాషలోకి వస్తాయని స్టాలిన్ ఒప్పుకుంటున్నాడు ఈ మార్పులు తప్పనిసరిగా సాంఘికావసరాలను బట్టే జరుగుతాయి ఈ పదజాలంలో కొంత వర్గ సంబంధమైనది కూడా ఉంటుంది వివిధ వృత్తులవారు వాడే సాంకేతిక పదాలు కాక, సాధారణ క్రియా రూపాలలో కూడా వర్గానికీ వర్గానికీ మధ్య తారతమ్యం ఉంటుంది ఈ తారతమ్యం వివిధ వర్గాలు ఒకరినొకరు అర్థం చేసుకొనేటందుకు అడ్డం రాకపోవచ్చు గాని, అది మొండిగా ఉండే తీరుతుంది 'ఏంది?' అనే వాళ్ళకు 'ఏమిటి' అనే మాట అర్థం కాకపోదు కాని వారీ మాటను ఉపయోగించరు వీరా మాటను ఉపయోగించరు

మనలో జాతీయోద్యమం తల ఎత్తే దాకా, మన భాష కులాలవారీగా ఉండేది ఇప్పుడది మారిపోతున్నది అన్ని మాటల వారిలోనూ, సాంఘికంగా ముందుకు వచ్చిన వారు ఒకే రకం

భాష మాట్లాడటం అలవాటు చేసుకుంటున్నారు భాష ప్రజల సంస్కృతిని ప్రతిబింబించే సాధనమై ప్రజల సంస్కృతి వర్గాలకు అనుగుణంగా ఉండేటప్పుడు భాషలో వర్గ లక్షణాలుండక తప్పదు వర్గ సంబంధాలతో పాటు అది మారకా తప్పదు అంత మాత్రాన జాతీయ భాష యావత్తు మారుతుందా అంటే మారదు వ్యాకరణమూ, మూల పదాలూ అట్లాగే ఉండవచ్చు అంతమాత్రాన సాంఘిక వ్యవస్థతో పాటు భాషకు సంబంధించిన మార్పులుండవనటం పొరపాటేమో

సంఘానికి పునాది ఆర్థిక వ్యవస్థ అనీ, రాజకీయాలూ, న్యాయమూ, మతమూ, కళలూ, మొదలైనవి కట్టడమని, పునాదిలో మార్పులకనుగుణంగా పై కట్టడంలో మార్పులు జరుగుతాయని, భాషలో ఎటువంటి మార్పులుండవని స్టాలిన్‌వాదం కాని భాషలో కూడా పునాదికి అనుగుణంగా మారే అంశాలు లేకపోలేదు మన దేశంలో జాతీయోద్యమం రావటంతో కొన్ని కులాలకు చెందిన కొన్ని వర్గాల వారు తమ భాషను మార్చుకున్నారు ఈ దేశంలో వర్గరహిత సమాజమేర్పడేట్లుంటే వివిధ కులాల వర్గాల భాష ఒకే పంథాలోకి వస్తుందనటానికి సందేహం లేదు కార్మిక వర్గం నుంచి రాజకీయాలలో ప్రవేశించిన వారు తమ సంస్కృతికి అవసరమైన పదజాలాన్ని సమీకరించుకొని ఆ సంస్కృతి ఆచారంగా గల వారిలాగ మాట్లాడ నేర్చారు ఈవాళ సెక్రెటేరియటుకు పోయి అక్కడ తెలుగు మాట్లాడే ఉన్నతోద్యోగులలో ఎవరు ఏ కులము వారైందీ వారి భాషను బట్టి కనుక్కోవటం సులభం కాదు

జాతీయ భాషను గురించి ఒక్క ముక్క జాతి అంటూ ఉన్నంత కాలమూ దానికి సంబంధించిన భాష ఉంటుంది దాని తాలూకూ వ్యాకరణమూ మూల పదాలూ ఒకటిగానే ఉంటాయి కాని అంతమాత్రాన అందరు గుర్తించే జాతీయ భాష అంటూ ఒకటి వాడుకలో ఉండకపోవచ్చు కేవలం పాలకులు ఒక భాష వాడుతూ, ఆ భాషనే తమ ఉద్యోగుల చేత వాడుకచేయించవచ్చు మిగిలిన ప్రజలందరూ తమ తమ మాండలిక భాషలూ, కుల భాషలూ, వర్గ భాషలూ వాడవచ్చు జాతీయ భాష అనిపించుకోదగిన భాషే ఎక్కడా అమలులో లేకపోవచ్చు

గత నూరు, నూట ఇరవై యేళ్ల కాలంలో తెలుగు భాషకు ఇటువంటి దశ సంప్రాప్తమయింది 1830 ప్రాంతాల ఏనుగుల వీరాస్వామయ్య 'కాశీయాత్రా చరిత్ర' వ్యవహారిక భాషలో రాశాడు హైకోర్టులో తర్జుమాదారుగా ఉండి ఆయన ఆ భాషే వాడి ఉండవచ్చు కాని కాలక్రమాన గ్రాంధిక భాషావాదం వచ్చింది గ్రాంధిక భాషా వ్యాకరణం వ్యావహారిక భాషకు వర్తించదు గ్రాంధిక భాషలో వాడు వచ్చెను, ఆమె వచ్చెను, అది వచ్చెను, అనవచ్చు వ్యావహారికంలో వాడు వచ్చాడు, ఆమె వచ్చింది అయినా అసంఖ్యాకులైన విద్యార్థులు గ్రాంధిక భాషలో విద్యాభ్యాసం చేశారు అసంఖ్యాకులైన రచయితలు ఆ భాషలో గ్రంథాలు రచించారు ప్రజలు మటుకు మాండలిక భాషలూ, కుల భాషలూ వాడారు పల్నాటివాడూ, తెలంగాణా వాడూ, నెల్లూరువాడూ ఒక చోట చేరితే తలలు పగలగొట్టుకోవలసిందేనన్నమాట

పెట్టుబడిదారీ ప్రోద్బలం కింద జాతీయ భాషలు గ్రామ్యభాషల సంకలనం ద్వారా ఏర్పడతాయని మార్క్స్ చేసిన సూచన చాలా సరి అయినది తెలుగుదేశం అన్ని మూలలవారూ గుర్తించి అర్థం చేసుకొనే భాష ఏర్పడటానికి రైళ్లూ, తపాలా, అచ్చు యంత్రాలూ, పత్రికలూ,

బూర్జువా సాహిత్యమూ, సినిమాలూ తోడ్పడుతున్నవి జమీందారీ వ్యవస్థలో అనేక వర్గాలు రాయటం చదవటం కూడా అవసరం లేదు వాళ్లు ఆర్థికంగా తమ సమీపస్థులపైనే ఆధారపడే వాళ్ళు తమ వృత్తులు వంశానుగతంగా తమకు సంక్రమించేవి చదువు లేకుండానే విద్య లభించేది

భాష కేవలమూ ఆర్థిక పునాది మీదనే పెరుగుతుంది వర్గతత్వాన్ని ఆధారం చేసుకుంటుంది కనక విప్లవంతో బాటు పూర్తిగా మారుతుందన్న వాదాన్ని స్టాలిను ఖండించవలసిందే కానీ భాషలో జాతికి చెందిన లక్షణాలతో బాటు సాంఘిక వ్యవస్థకూ, వర్గాలకూ చెందిన లక్షణాలు కూడా ఉంటాయని గుర్తించాలి సంఘంలోనూ, వర్గాలలోనూ కలిగే మార్పులకు అనుగుణమైన మార్పులు కూడా భాషను వెన్నంటి ఉండక తప్పదు ఈ మార్పులు పదజాలంలోనే ఉండవచ్చు కాని పదజాలంలో మార్పులు భాషకు సంబంధించిన మార్పులు కాకపోవు ఒక్కొక్కసారి పదజాలంలో మార్పులు జరగకుండానే వాటి భావ ప్రేరణాశక్తి మారుతుంది ఏదైనా ఘోరం జరిగితే నిరీశ్వరవాది కూడా 'రామా రామా' అనవచ్చు కాని ఒకప్పుడది నిస్సందేహంగా రామనామ స్మరణే

అయితే ఒకటి ఉంది సాంఘిక వ్యవస్థలో మార్పు జరిగి ఒక వ్యవస్థ పోతున్నప్పుడు దాని స్థానే మరొక వ్యవస్థను ప్రయత్నపూర్వకంగా నిర్మించుకోవాలి భాషలో కలిగే తత్సంబంధమైన మార్పులు నూతన సాంఘికావసరాలను బట్టి వాటంతట అవే జరుగుతాయి

*తెలుగు స్వతంత్ర వారపత్రిక, 21-7-1950*

# 4. జాతీయ భాష

భాషలో కలిగే మార్పులను గురించి రాస్తు నేను తెలుగు జాతీయ భాష ఇంకా అమలులో లేదన్నమాట అపార్థానికి దారి తీసింది "ముక్కంటి" గారి రచనకు అదే ప్రధాన కారణమయింది

తెలుగు జాతి అంటూ ఏర్పడిన నాటి నుంచీ తెలుగు జాతి యొక్క భాష ఉంటూనే ఉన్నది కాని అది జాతీయ భాష కాదు ఈ తేడా వివరించటానికి స్టాలిన్ వాక్యాలు కొన్ని ఉదహరిస్తాను ఒక భాషను 'లాంగ్వేజ్ ఆఫ్ నేషనాలిటీస్' అనీ రెండవ దాన్ని 'నేషనల్ లాంగ్వేజ్' అనీ స్టాలిన్ విడదీసి చెప్పాడు

"As to the subsequent development from clan languages to tribal languages, from tribal languages to the languages of nationalities, and from languages of nationalities to national languages — everywhere and at all stages of development, languages, a means of intercourse between the people of a society was the single and common languages of that society serving its members eqully irrespective of their social status"

"Later, with the appearance of Capitalism, the elimination of feudal division and the formation of national markets, nationalities, developed into Nation, and the languages of nationalities into national languages "

"Marx, touching on the way single national languages arose, speaks of 'the concentration of dialects into a single national languages as the result of economic and political concentration" అనీ అన్నాడు స్టాలిన్

పై వాటిని బట్టి తెలుగు జాతియొక్క భాష అంటూ ఉన్నది కనుక, తెలుగు జాతీయ భాషగా అమల్లో ఉండి ఉన్నదని అనటానికి ఆధారం లేదని స్పష్ట మవుతుంది Languages of nationalities అనే దానిని గురించి చెబుతూ స్టాలిన్-

"Side by side with this there were, of course, dilects, local vernaculars" అన్నాడు ప్రస్తుతం మన భాష ఈ స్థితిలోనే ఉన్నది (clan) దశ నుంచి సంఘం (nationality) వరకు పెరిగే సమయంలో విశేష మార్పు చెందినవి మూల పదాలూ వ్యాకరణమూ మాత్రమే దానినే జాతీయ భాష అనుకోవటంలో అర్థం లేదు

ప్రాంతీయ పదజాలాన్నీ వివిధ వర్గాలకు చెందిన 'జార్గన్' నూ వేరు వేరు భాషలని ఎవరూ అపోహ పడరాదు కానీ జాతీయత ఏర్పడే సమయంలో జాతీయ భాష యొక్క స్వరూపం ఏ విధంగా ఉంటుందనేది జాతి ఏర్పడే విధానాన్ని బట్టి ఉంటుంది

సిద్ధాంతాలను సూత్రాలనూ ఒక్క క్షణం వదిలేసి మనస్వంత సమస్యకు వచ్చినట్లయితే ఈ విషయం బాగా స్పష్టమవుతుంది మనం ప్రస్తుతం జాతీయ భాషకొరకు సంఘర్షణ చేస్తున్నాం వ్యవహారిక భాషావాదం జాతీయ భాషోద్యమమే జాతీయోద్యమంతో ప్రయేయం లేకుండా జాతి కంతకీ ఒకే భాష ఉండాలనే ఆదర్శవాదులు మన నెత్తిన గ్రాంధిక భాషావాదం రుద్దారు ప్రాంతీయి భాషల్లో వ్యత్యాసాలుంటాయి కనక వ్యవహారికం పనికిరాదన్నారు వ్యవహారిక భాషను గ్రామ్యభాషతో సమం చేశారు కాని వ్యవహారిక భాషావాదం జాతీయ భాషను ఒకవైపు నుంచి నిర్మించనారంభించు చున్నది ఈ వాదం వచ్చిన ఈ కొద్ది దశాబ్దాల కాలంలో అన్ని వైపుల నుంచీ, ప్రాంతాలనుంచీ వెలువడే వ్యవహారికం ఒకే ధోరణిలోకి వస్తున్నది గ్రాంధిక భాష అందరికీ ఒకటిగానే ఉండి కూడా సాముదాయిక ప్రయోజనాలకు రాజకీయంగా గానీ సాంఘికంగా గానీ ఎన్నడూ ఉపయోగపడలేదు ఈనాటి తెలుగు జాతియొక్క అవసరాలకు పనికివచ్చే పదజాలమే అందులో లేదు

ఈనాటి వ్యవహారికభాష ఇంకా జాతీయభాష అనిపించుకోదగిన పరిణతికి రాలేదు ఇందులో విద్యాభ్యాసం జరగటంలేదు జాతి యొక్క వైజ్ఞానిక రాజకీయావసరాలకు ఉపకరించే పరిభాష ఇందులోకూడ ఇంకా పూర్తిగా ఏర్పడలేదు కాని పత్రికలు మొదలైనవి ఈ లోటు తీర్చటానికి కొంతవరకు ఉపయోగపడుతున్నాయి

ఈ జాతీయభాష - తెలుగువారి ఏకైక జాతీయభాష - ఏర్పడేనాటికి దీనిమీద తెలుగు వారందరి ప్రభావమూ ఉంటుందా ఉండదా? ఈ విషయం ఈనాడే నిర్ణయించటం సులభం కాదు విశాలాంధ్రోద్యమం విజయవంతమైతే ఏర్పడే జాతీయ భాషకూ అది శాశ్వతంగా విఫలమైతే ఏర్పడే జాతీయ భాషకూ తప్పక వ్యత్యాసం ఉండి తీరుతుంది

సాంఘిక పరిణామంతో బాటు భాషలో కలిగే మార్పులకు ప్రాముఖ్యం ఉంటుందని నేను శంకించడానికి ప్రధాన కారణం ఇదే భాషంటే అచ్చంగా మూల పదాలే అయితే సాంఘికపరిణామాలు ఆ భాషను అంటవని చెప్పవచ్చును వివిధ వర్గాలవారూ, ప్రాంతాలవారూ వాడే పదజాలానికి భాషలో ఎట్టి ప్రాముఖ్యమూ ఉండనవసరం లేదు సాంఘిక వ్యవస్థను బట్టి పదజాలంలో కలిగే మార్పులు భాషకు సంబంధించినవి కావనుకోవలసి వస్తుంది

*తెలుగు స్వతంత్ర వారపత్రిక, 25-8-1950*

# 5. కృతక భాష అయిన గ్రాంధికం సాధించిన ప్రయోజనం ఏమిటి?

నిడదవోలు వెంకటరావు గారి ప్రసంగం పై కొన్ని సంశయాలు

ఇటీవల ఢిల్లీలో జరిగిన ఆకాశవాణి సాహిత్య సమారోహంలో గద్య రచనల భవిష్యత్తు గురించి వివిధ భాషలకు చెందిన మేధావులు వెలువరించిన అభిప్రాయాలలో కొన్నిటి ప్రసారం విన్నాను అలా ప్రసారమైన ప్రసంగంలో శ్రీ నిడదవోలు వెంకటరావు గారి ప్రసంగం ఒకటి ఈ ప్రసంగంలో వారు వెలువరించిన కొన్ని అభిప్రాయాలు ఆశ్చర్యకరంగా ఉన్నాయి

గడచిన నూరేళ్ళ కాలంలో కాబోలు మూడు రకాల గద్య భాష లు అమలులోకి వచ్చినట్టు, దేని ప్రయోజనం అది సాధించినట్టూ, శ్రీ వెంకటరావు గారు సెలవిచ్చారు ఆ మూడు రకాల గద్య భాష ఏమంటే గ్రాంధికమూ, సులభ గ్రాంధికమూ, వ్యావహారికమునూ

ఇందులో గ్రాంధికం పచ్చి కృతక భాష దీనిని చిన్నయ సూరి మాష్టారు పని పెట్టుకుని సృష్టించి తమకు గల అవకాశాలనూ, ప్రజల అమాయకత్వాన్ని పురస్కరించుకొని ప్రచారం చేశారు (ఈ కృతక భాష ఎలా వచ్చిందీ ఏ మహోపకారం చేసిందీ శ్రీ తెలికిచర్ల వెంకటరత్నంగారి రేడియో ప్రసంగం ఇటీవలే స్పష్టం చేసింది )

గ్రాంధిక భాషాఘట్టం తెలుగు సాహిత్య చరిత్రలో అమిత హేయమైన ఘట్టం అప్పటికి 800 సంవత్సరాల క్రితం నన్నయ భట్టారకుడు, తరవాత మరి రెండు శతాబ్దాల అనంతరం తిక్కన రాసిన భాషలో అందరూ గద్యం వ్రాయాలని చిన్నయసూరి వాగనుశాసనుడు చెప్పేదాకా గద్య దచనలు - పండితులు రాసినవి సైతం - వ్యవహారిక భాషలోనే జరిగాయి షేక్స్పియర్ భాషే అందరికీ ప్రమాణంగా ఉండాలని ఈ నాడు పండితుడెవడైనా అంటే అతగాణ్ణి తప్పక వెర్రాసుపత్రికి పంపిస్తారు మరి షేక్స్పియర్ గతించి మూడు వందల చిల్లర యేళ్లయింది!

కాని చిన్నయసూరి వెలిగించిన కాష్టం గిడుగు రామమూర్తి పంతులుగారు, గురజాడ వారూ చల్లార్చినదాకా మండుతూనే ఉంది కొక్కొండ వెంకటరత్నం పంతులు గారనే ఒక పెద్దమనిషి తన భార్యతోనే గ్రాంధికం మాట్లాడే వారట! కొద్ది సంవత్సరాల క్రిందట కూడా నేనెరిగిన ఒక యువకవి సాహిత్య పరిషత్తును ఆది కూర్మంలాగా మోసిన ఒకానొక జమీందారు గారి వద్దకు వెళ్ళగా ఆయన గ్రాంధికం మాట్లాడటమే కాక మామూలు మనుషులుగా మాట్లాడిన యువకవితో ''మీరు నుంగ్రామ్యంబు పలుకుదురా?'' అన్నాట్ట!

ఈ దిక్కుమాలిన గ్రాంథికం ఏదో గొప్ప సాహిత్య ప్రయోజనం సాధించిందని వెంకటరావు గారి వంటి అనుభవజ్ఞులు చెబుతుంటే నా బోటి పామరుడికి దిగ్భ్రమ కలుగుతున్నది నేను ఊహించగలిగినంత వరకూ ఈ గ్రాంథికము వచ్చి సజీవమైన వ్యావహారికమైన భాషా సంప్రదాయానికి గండికొట్టి, తిరిగి వ్యావహారిక భాష పునరుజ్జీవనం పొందే నాటికి విద్యావంతులైన వారికి సయితం పుష్కలమైన పదజాలమూ నుడికారమూ అందుబాటులో లేకుండా చేసింది

అవతల గ్రాంథికభాష నాగజముడల్లే వ్యాప్తి చెంది ఉండకపోతే సులభ గ్రాంథికమనేది పుట్టవలసిన అగత్యమే ఉండకపోను ''మాల్యవంతంబు పొంత సంతత పరిణీత ఫల కలిలో తరుషండ ముండితంబగు వనం బొండుగలదు'' అని రాసిన వీరేశలింగం పంతులుగారే తమ భాషాపాటవ ప్రదర్శనకన్న తమ భావాలు పదిమందిలో వ్యాపించడం ఎక్కువ అవసరం అని తోచగానే ''సులభ'' గ్రాంథికాన్ని ఆశ్రయించవలసి వచ్చింది అలాగే చిలకమర్తి వారు కూడా ''సులభగ్రాంథికం''లో వచన రచన చేశారు

ఈ సులభ గ్రాంథికానికి ఒక ప్రత్యేక ప్రయోజనం ఏమీలేదు సకాలంలో వీరేశలింగం గారు, రామమూర్తి పంతులు గారు తారసిల్లినట్లయితే వీరేశలింగంగారి గద్యరచనలన్నీ నిక్షేపంగా వ్యావహారికంలోనే వెలువడి ఉండేవి ! అందువల్ల వాటిమహత్తు ఈ షత్తయినా క్షీణించి ఉండేది కాదు

గ్రాంథిక భాషకు ఒక వ్యాకరణం ఉన్నట్లూ, అది వ్యావహారికానికి లేనట్లూ ఎవరూ విచారించవలసిన పని లేదు అందుకు సమర్థులైన వారుగ్రాంథికభాషా వ్యాకరణాలనూ, ప్రత్యేకించి బాల వ్యాకరణాలని అదివరకే చీల్చి చెండాడారు అదిఅటుంచి ఈ 1960లోవ్యాకరణాలని భాషను నిర్ణయించినా, భాషవెనకేవ్యాకరణాలు గెంతుతాయనీ పెద్దలుకూడా గ్రహించకపోవటం శోచనీయం

విశ్వవిద్యాలయాలవారు వ్యావహారికభాషను గుర్తించ నట్టయితే ఆ లోపం భాషది కాదు ఆ విశ్వవిద్యాలయాలను నడిపించే వారిది

వర్తమాన తెలుగు గద్య భాషను గురించి ఎవరన్నా మాట్లాడుకోదలిస్తే క్షుద్రమైన గ్రాంథిక భాషను, హాస్యాస్పదమైన ''సులభ'' గ్రాంథికాన్ని గురించి ప్రస్తావించకుండానే అనేక సమస్యలను ఎదుర్కోవలసి ఉంది నాకు చూడగా ఏం తోస్తుందంటే ఈనాడు కావలసింది వ్యావహారిక భాషలో పండితులైన వారూ -స్వర్గవాసి చెళ్ళపిళ్ళ వంటి వారు ఈనాడు వెలువడే గద్య రచనలలో నాబోటి అసంఖ్యాకులైన వారికి పదాల వ్యుత్పత్తి మొదలైనవి తెలియవు భాష యొక్క నుడికారం తెలియదు అనేక సంవత్సరాల పాటు చిన్నయసూరి గారి పుస్తకాలు పాఠ్య పుస్తకాలుగా పెట్టినట్టు పండితులైన వ్యావహారిక భాషావాదుల రచనలు అనేక తరాల వారికి పాఠ్య గ్రంథాలుగా ఉంచినట్టయితే చిన్నయసూరి గారు తెలుగు భాషకు చేసిన ద్రోహం చక్కబడుతుంది ''మాట్లాడినట్టు రాసినదంతా వ్యావహారికమే''ననే దృక్పథం వెనకబడితేనే గాని వాడుక భాషకు భవిష్యత్తు లేదు సర్వతోముఖాభివృద్ధి లేదు

గద్య రచనలంటే కేవలమూ కథలూ, నవలలూ మాత్రమే కావు ఈనాడు సమస్తమైన వాఙ్మయమూ గద్యంలోనే వెలువడాలి ఏ శాస్త్ర రచనలో, విమర్శనకు సంబంధించిన రచనలో రాయటానికి ఈనాడు కూడా గ్రాంధికం పనికి వస్తుందని ఎవరన్నా అనుకుంటే అది వొట్టి భ్రమ న్యాయశాస్త్ర రచనకూ, శాస్త్ర రచనకూ, వార్తలకూ, సమస్తానికీ వ్యావహారికాన్ని మించిన భాష లేదు ఉండబోదు తెలుగు వ్యావహారిక భాషకు ఇంకా పటుత్వం చేకూరలేదు అది చేకూరటానికి అవసరమైన కృషి ఇంకా ప్రారంభమయినదని కూడా అనిపించటం లేదు

*కృష్ణా పత్రిక, 23-4-1960*

# 6. సాంకేతిక పదకోశం

పరిభాష అంటే ఏమిటి? ఏవి సాంకేతిక పదాలు?

ఒక్కొక్క జీవిత శాఖలో ఒక్కొక్క రకం భాష వాడుకవుతుంది కోర్టు భాష వేరు తద్దినాలు పెట్టేటప్పుడు వాడే భాష వేరు పొలాలు దున్నే సందర్భంలో వాడే భాష వేరు ఇది నిత్య జీవితంలో వాడే భాషకు కొంచెం భిన్నంగా ఉంటుంది కొత్త కమ్యూనిస్టు, హోటలు ఇడ్లీలలో ''పురోగమనం'' కనిపిస్తున్నది అంటే, అనవసరంగా పరిభాష వాడుతున్నాడన్న మాట

పరిభాష వెంట ''సాంకేతిక పదాలు'' అనేవి కూడా ఉంటాయి సాంకేతిక పదాలు ఎప్పుడు పుట్టాయో చెప్పడం సాధ్యం కాదు మనిషి మొట్టమొదటిసారిగా రాళ్ళను చెక్కి పరికరాలను చెయ్యడం మొదలుపెట్టినప్పటి నుంచీ సాంకేతిక పదాలు పుట్టాయనుకోవచ్చు విజ్ఞానంతో పాటు అలాంటి మాటల సంఖ్య పెరిగింది మన పురాణాలలో అనేక అస్త్రాలు, శస్త్రాలు, యుద్ధ ప్రక్రియలూ, వాటికి సంబంధించిన పరిభాషా, సాంకేతిక పదాలూ కనిపిస్తాయి అర్జునుడు బాణాలు వేస్తాడు, అస్త్రాలు ప్రయోగిస్తాడు మనం అనాగరిక దశ అనుకునే దానిలో కూడా సాంకేతిక పదాలు పుష్కలంగా ఉండేవి

అయితే నాగరికత పెరుగక పూర్వం సాంకేతిక పదాలు సర్వ సామాన్యంగా అందరికీ తెలిసి ఉండేవి పల్లెటూళ్ళలో రైతులూ, వడ్రంగులూ, కమ్మరులూ, కుమ్మరులూ, సాలీలు, వర్తకులూ, చెప్పులు కుట్టేవాళ్ళు వాడే సాంకేతిక పదాలు అందరికీ తెలిసి ఉండేవి దానికి కారణం, ఆ పదజాలం ప్రజలలో పుట్టినది ప్రజలలో అతి త్వరగా వ్యాపించినది ప్రత్యక్షానుభవంతో కూడుకున్నది

ఈనాడు సాంకేతిక పదాలను కృత్రిమంగా కల్పించవలసి రావటానికి, వాటిని పుస్తకాలలోకి ఎక్కించటానికి ప్రధాన కారణం అపారంగా పెరిగి పోవటమూ, ప్రజలకు శాస్త్ర ప్రక్రియలతో ప్రత్యక్షానుభవం లేకపోవటమూనూ, దీనితోబాటు మన దేశంలో వర్గ జీవితం కరుడు కట్టుకుపోయింది, పాత కాలపు వడ్రంగులూ కమ్మరులూ వాడే మాటలు కూడా కొత్త కాలపు విద్యావంతులకూ, పట్టణవాసులకూ ఈనాడు తెలీవు! ప్రపంచం చిన్నదవుతూంటే వర్గ జీవితం మరింత కుచించుకుపోతున్నది

దీని ఫలితంగా జరిగినదేమంటే, గోడలో మేకు కొట్టటానికి ''మెకానిక్'' రావాలి సిమెంటులో బొక్క కొట్టటానికి వాడు ఉపయోగించే దానికి ''జంపర్'' (జామర్?) అనేది ఒకటి ఉంటుంది ఇస్త్రీ పెట్టె పనిచెయ్యకపోతే ''కనెక్షన్'' పెట్టటానికి ఎల్కక్ట్రీషియన్ రావాలి రకరకాల వాళ్ళూ, సాంకేతికజ్ఞులూ వాడే మాటలు అందరికీ అందుబాటులో ఉండడానికి సాంకేతిక పదావళి పుస్తక రూపంలో రావలసిన అవసరం ఎంతైనా ఉన్నది

అలాగే పదావళి సృష్టించవలసిన అవసరం కూడా ఉన్నది వీటిని ఎవరు సృష్టించాలి? ఏ పద్ధతిలో సృష్టించాలి?

సాంకేతిక పదాలు అనే వాటిలో రెండు రకాలున్నాయి ఒక రకం మాటలు అంతర్జాతీయ స్థాయి గలవి ఇవి ''శుద్ధ శాస్త్రం''లో పుష్కలంగా ఉంటాయి ''ప్రయోగశాస్త్రం'' (టెక్నాలజీ)లో అంతర్జాతీయ పదజాలం చాలా తక్కువ ఈ మాటలను ఎవరి భాషలో వారు సృష్టించుకోవాలి కాని ఆ సృష్టించే వారు ఎవరు?

సాధారణంగా ఈ పని ''పండితులు'' చేస్తున్నారు రైలు ఇంజన్ను ''ధూమశకటం'' అనవచ్చు మోటారు కారును ''స్వయంచోదిత శకటం'' అనవచ్చు కాని పండితులు సృష్టించే ఈ మాటలను ప్రజలు ఆమోదించరు ఎల్కక్ట్రిసిటీని ''విద్యుత్తు'' అనవచ్చు ఇంగ్లీషు మాటలనే ఉపయోగించి ''రైలు'', ''కారు'' ''కరెంటు'' అంటారు వాటికి ప్రచారం వస్తుంది ఆ మాటలే నిలబడతాయి ఎవరి చేతనైనా పోలీసును ''రక్షకభటుడు'' అనిపించగలమా? అసాధ్యం

ఇక పరిశ్రమలో పని చేసే నిరక్షరులు ఫ్యాక్టరీలో ఉండే వస్తువుకూ, ప్రక్రియకూ మాటలు సృష్టించటం నాకు తెలుసును ఆ మాటలు-ఇంగ్లీషు పదాల అపభ్రంశ రూపాలే ఐనా-వాడుకలోకి తీసుకురావటం సర్వోత్తమం మనం రైలు అనే మాటను (rail-పట్టా) అనే మాటకు బదులుగా వాడుతున్నాం అసలు rails అనే వాటిని ''పట్టాలు'', 'రైలు పట్టాలు'' అంటున్నాం అందువల్ల నష్టమేమీ జరగలేదు అది అలా ఉంచుదాం

ప్రజలలోనుంచి సాంకేతిక పదాలు వచ్చేదాకా మన దేశం వేచి ఉండే అవకాశం లేదు మనం వ్యవసాయ ప్రధానులుగా ఉన్నాం మనకు పరిశ్రమలు అంతంత మాత్రం విజ్ఞానంలో మన దేశం 150 ఏళ్ళు కాబోలు వెనక ఉన్నదంటున్నారు ఆ నూటయాభైని నూరుకు తగ్గించాలన్నా కూడా చెయ్యవలసిన పనులలో సాంకేతిక పదాల సృష్టి ఒకటి

సాంకేతిక పదాలను సృష్టించే పని ఒక్క కమిటీకే వేస్తే బాగా ఉండేది అలా జరగలేదు ఆంధ్ర రాష్ట్రం ఏర్పడక ముందు మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం వివిధ శాస్త్ర శాఖలకు చెందిన పారిభాషిక, సాంకేతిక పదాలు 1947లో అచ్చు వేసింది దరిమిలా తెలుగు భాషా సమితి తమ విజ్ఞాన సర్వస్వం రెండో సంపుటంలో ఫిజిక్సు, కెమిస్ట్రీలకు సంబంధించిన మాటలకు తెలుగు మాటలు సృష్టించారు ఈ రెంటి మధ్యా తేడాలున్నాయి తరువాత తెలుగు అకాడమీ వారు ఇంటర్మీడియట్‌కు రచించిన పాఠ్య పుస్తకాలలో ఇంగ్లీషుకు సరి అయిన మాటలు కొన్ని వాడారు ఇప్పుడు విశాలాంధ్ర వారు గణిత, భౌతిక, రసాయన, వృక్ష, జంతు, శరీర శాస్త్రాలకు సంబంధించిన సాంకేతిక పదాలను ఒకే పుస్తకంగా ప్రచురించారు

పాఠ్య పుస్తకలలో కొన్ని సాంకేతిక పదాలను ఉపయోగించి, వాటిని రెండు మూడు తరాల విద్యార్థుల చేత చదివించి, విద్యావంతులు వాడుకునేటట్టు చేయవచ్చు అర్ధశతాబ్దం

క్రితమే మంత్రిప్రగడ సాంబశివరావుగారు నైట్రోజన్ అనే మాటకు నత్రజని అనే మాట వాడితే నేను నాలుగోఫారంలో చదువుకున్నాను కాని ఈ పదాలను జనసామాన్యం ఆమోదించేటట్టు చెయ్యటం ఎలా? సాంకేతిక జ్ఞానం కల వారికీ సామాన్య ప్రజలకూ మధ్య ఈ పదజాలం అడ్డుగోడగా ఉండిపోదా? సాహిత్య భాషలో గిడుగు రామ్మూర్తి పంతులు గారు ''కృతక'' భాష అని నిర్వచించినది సాంకేతిక భాషలో కూడా ఉత్పన్నమవుతున్నదని నా అనుమానం

ఇది ఇలా ఉండగా, సామాన్య ప్రజల కోసం శాస్త్ర విజ్ఞానాన్ని పుస్తక రూపంలో వెలువరిస్తున్న వారు చాలా మంది ఉన్నారు వీరిలో కొందరైనా సాంకేతిక పదాలను స్వతంత్రంగా సృష్టిస్తున్నారు

ఈ తేడాలన్నీ పరిశీలించి ఏ పదాలు ''మంచివి'' ఏవి 'చెడ్డవి'' అనేది ఏదో ఒక స్థాయిలో నిర్ణయించటానికైనా అనేకమంది ''ప్రవీణులు'' కొన్ని ఏళ్ళపాటు శ్రమిస్తే గాని సాంకేతిక పదావళి ఒక దారికి రాదు

ఈ సమీక్ష కోసం నేను వ్యయపరచగల కొద్ది కాలంలో కొన్ని వ్యత్యాసాలు మాత్రమే స్థాలీపులాకంగా చూపగలను నా దృష్టిలో ఏ మాటలు బాగున్నాయో, ఏవి బాగా లేవో చెప్పగలను కాని నా అభిప్రాయం ఎలా ప్రమాణమవుతుంది

ఉదాహరణకు తెలుగు ఎకాడమీ వారు ఆమోదించిన మాటలనూ కొండెపూడి వారు సేకరించిన మాటలనూ ఇస్తున్నాను

Speed అనే మాటకు 'వేగమూ, త్వర'' అని కొండేపూడి వారు అన్నారు velocity అన్న మాటకూ వారు ఆ మాటలే వాడారు ఇది స్పష్టంగా తప్పు తెలుగు ఎకాడమీ వారు Speed కు వడి అనీ, velocity కి వేగం అనీ వాడారు కనీసం రెంటికీ తేడా చూపారు

Acceleration అనే మాటకు కొండేపూడి వారు 'వేగోత్కర్షణ, వేగాధిక్యత, గతివృద్ధి'' అనే మాటలు ఇస్తే, తెలుగు ఎకాడమీ వారు ''త్వరణం'' అనే మాట ఇచ్చారు 'వేగవృద్ధి'' అనే అందరికీ అర్థమయ్యే మాట ఇద్దరూ ఇవ్వలేదు

"Boiling point" అనే దానికి కొండేపూడి వారు ''క్వథన బిందువు'' అనే మాట ఇచ్చారు తెలుగు ఎకాడమీ వారు ''మరుగు ఉష్ణోగ్రత'' అని కుండ పగలేసి అన్నారు

Atom Bomb ను మొదటి వారు ''ఆటంబాంబు'' అనీ, రెండో వారు ''పరమాణు బాంబు'' అనీ అన్నారు ''ఆటంబాంబు, అణుబాంబు'' అనీ వాడుకలోకి వచ్చేసింది "atom" పరమాణువు కాదని ఏనాడో తేలిపోయింది

Boyl's Law అనే దాన్ని కొండేపూడి వారు ''బోయిల్ సూత్రం'' అన్నదే సబబుగా తోస్తుంది తెలుగు ఎకాడమీ వారు ''బాయిల్ నియమము'' అనటం సబబుగా కనబడదు బాయి సూత్రీకరించాడు కానీ, నియమించలేదు

Chemical reaction అన్న మాటకు కొండేపూడి వారు ''రసాయనిక ప్రతిచర్య'' అనటం ''ముక్కుశ్చముక్కః''గా ఉన్నది తెలుగు ఎకాడమీ వారి ''రసాయన చర్య'' అన్నది సరిగా ఉన్నట్టు తోస్తుంది

ఇలా వివరిస్తూ పోతే ఎన్ని రోజుల పాటైనా వివరించవచ్చు, కాని ఆ వివరణ కూడా ప్రమాణం అనిపించుకోదు

ఒక్క ముక్కలో చెప్పాలంటే ఇన్ని రకాల సాంకేతిక పదాలు తాత్కాలికమైనవే అనుకోవాలి తుది నిర్ణయం కాలానికీ, ప్రజలకూ వదలవలసిందే

ప్రస్తుతానికి పార్య పుస్తకాలలో ఉండే పదజాలం, మంచో, చెడో నెగ్గేస్తుంది కాని ఆ పదజాలం చిరంజీవిగా నిలవదు కొండేపూడి వారు సేకరించిన పదజాలం చాలా విస్తృతమైనది ఎంతో కష్టసాధ్యమైనది జనసామాన్యం కోసం విజ్ఞాన గ్రంథాలు రాసేవారు తమకు మాట తోచని పరిస్థితిలో ఈ సాంకేతిక పదకోశాన్ని ఉపయోగించుకోవచ్చు

*సృజన - 27వ సంచిక, డిసెంబర్ 1971*

# 7. వ్యావహారిక భాష

చాలా కాలం క్రితం ఒక మిత్రుడు మరొక మిత్రుడికి వ్యావహారిక భాషలో ఉత్తరం రాయటానికి యత్నించి, తనకు వ్యావహారికంలో రాయటం చేతకాదని తెలుసుకుని ఆశ్చర్యపోయాడు అతను ఆ ఉత్తరమే గ్రాంధికంలో అయితే అవలీలగా రాసి ఉండేవాడు

ఒక నటి - గ్రాంధిక నాటకాలలో నటించి పేరు తెచ్చుకున్నది వ్యావహారిక సంభాషణం గల నాటకంలో నటించటానికి ఉక్కిరిబిక్కిరి కావటం నేనొక నవలలో చిత్రించాను, అది కల్పన కాదు

నిజం ఏమిటంటే మనలో చాలమందికి వ్యావహారిక భాష కూడా సరిగా రాదు మనకు తెలుగు మాతృభాష కదా అని గర్వించి లాభం లేదు చెళ్ళపిళ్ళ వారి లాంటి కొద్దిమందిని మినహాయిస్తే పేరుపడ్డ రచయితలు కూడా వ్యావహారికం రాని వారే వారిలో కొందరికి గ్రాంధిక భాష బాగా తెలిసి ఉండవచ్చు కాని అందువల్ల కూడా లాభం లేదు

అయితే ఈనాడు వెలువడుతున్న సాహిత్య మంతా ఎలా వస్తున్నదని అడగవచ్చు చాలామంది మాటలను తప్పుగా ఉపయోగిస్తూనే ఉన్నారు కొందరు తమకు తెలిసిన పదజాలంతోనే పని జరుపుకుంటున్నారు మరికొందరు ఇంగ్లీషు మాటలను (తెలుగులో మాటలున్న సందర్భాలలో గూడా) వాడేస్తున్నారు నిత్య వ్యవహారంలో లక్షల కొద్దీ మాటలున్నాయి వివిధ వృత్తుల వాళ్ళు వాడే పరికరాల పేర్లు గూడా అందరికీ తెలీవు వెనకటికెవరో మంత్రి గారు ''బియ్యం చెట్లు'' అన్నాట్ట

8, 10 శతాబ్దాల్నాటి భాషే ప్రమాణం అని అన్నవాడు భాషా మూఢుడు కావాలి ప్రపంచంలో ఎక్కడా ఇటువంటి ప్రమాణం ఉన్నట్టు చదువుకున్నవాడెవడూ ఊహించను గూడా లేడు కాని తెలుగు వాళ్ళు ఆ పని చేశారు ప్రాచీన సాహిత్యం పఠించరాదని కాదు కాని అది వెయ్యి మందిలో ఒకడికి అవసరం కావచ్చు చదువుకున్న ప్రతివాడూ, రాయదలచిన ప్రతివాడూ కవిత్రయం భాషే వాడాలన్నది మౌఢ్యం

ఎవడూ తన భావాలను శిథిలమైన భాషలో - హాస్యానికి తప్ప - వ్యక్తం చెయ్యలేడు, చెయ్యడు ఈ కారణం చేతనే గిడుగు వారు కృతక భాష అన్నదీ, తదితరులు సులభ గ్రాంధికం అన్నదీ, ఉద్భవించాయి

మాతృభాషలో విద్యాబోధ అంటున్నారు కవిత్రయం వారి భాష ఈనాడు ఏ తెలుగు వారికీ మాతృభాష కాదు ఒక వంక ఇంగ్లీషూ, మరొకవంక హిందీ, మూడో వంక గ్రాంధిక భాషా వ్యవహారం భాషను పెరగకుండా చేస్తున్నాయి

చదువుకునే కుర్రవాళ్ళు వ్యావహారికంలో విద్యాభ్యాసం ప్రారంభించి, కొద్ది సంవత్సరాలలోపల అనేకవేల మాటలను - వ్యవహారంలో ఉన్న వాటిని నేర్చుకోవాలి తరవాత ఇచ్ఛ ఉంటే వెనక్కు వెళ్ళి ప్రాచీన సాహిత్యాన్ని అధ్యయనం చేయవచ్చు, లేకపోతే మానవచ్చు భారతదేశంలోని భాష తెలియని వాడు చదువురాని వాడు కానవసరం లేదు, తన మాతృ భాషలో ఒక ఉత్తరం రాయటం చాతగానివాడు ఎన్ని డ్యాక్టరేట్లు సంపాదించినా నిరక్షరుడే

వ్యావహారికం అభివృద్ధి కావటానికి చాలా మార్గాలున్నాయి వాటిలో ముఖ్యమైనవి ఆ భాషలో వివిధ విషయాలు చదవటమూ, రాయటమూనూ అర్ధ శతాబ్దం క్రితం కన్న ఈనాడు వ్యావహారికం చాలా అభివృద్ధి చెందింది దానికి కారణం ఆ భాషలో విరివిగా సాహిత్యం వెలువడటమే

ఈ సాహిత్యం ఇప్పటికి సాధించిన ఒక విజయం ఏమిటంటే, ప్రాంతీయ భాషలు క్రమంగా ఒక మూసలోకి వస్తున్నాయి ప్రాంతీయమైన తేడాలుండటం వ్యావహారిక భాషకు ఒక పెద్ద లోపంగా కొందరు చెప్పారు ప్రాచీన కవులు గూడా ప్రాంతీయాలు వాడారు గ్రాంధిక భాష నిండా పర్యాయపదాలు కొల్లలుగా ఉన్నాయి

వ్యావహారికానికి వ్యాకరణం లేదని ఒక సొడ్డు ఉన్నది వ్యాకరణమంటే ఏదో స్వరూప నిర్ణయం అని కొందరికి అపోహ ఉన్నట్టు కనిపిస్తుంది మనం నిత్యమూ మాట్లాడే భాషకు వ్యాకరణం ఉంటూనే ఉన్నది ఆ మాటకు వస్తే కృతక భాషకే వ్యాకరణం లేదు ''సమావేశమునకు నెహ్రూ, రాజేంద్రప్రసాద్, వల్లభాయి పటేలు వచ్చెను '' ఇలాంటి వాక్యాలను దినపత్రికల సంపాదకీయాలలో కొల్లలుగా చూశాను ''వచ్చిరి'' అనే మాట ఉన్న సంగతి గూడా సంపాదకీయాలు రాసే వారికి తెలియదన్న మాట!

అది అలా ఉంచి ఉన్న భాషకు వ్యాకరణం కోసం భాషను మార్చుకోరు ఇది సాధ్యం కాదు వాంఛనీయం కాదు ''ఏలవదు వలదు, వల్దు'' అనేవన్నీ సాధువులై, ''వద్దు, ఒద్దు'' అనేవి అసాధువులయాయా అని గిడుగువారు అడిగారు ఆ ప్రశ్నకు సమాధానం లేదు పద స్వరూపాలు గ్రాంధికంలో కూడా ఒక రకంగా అఘోరించలేదు

మాతృభాషలో విద్యాబోధ అన్నది చాలా మంచిదే గాని, మాతృభాషపటిష్టం కావటానికి కృషి ముందు జరగాలి

*పుస్తక ప్రపంచం, 1971 మే-జూన్*

## 8. భాష 'నేటి సమస్య'

దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక పాలక వర్గాలు ఈ రెండు అంశాలను గురించీ అవాస్తవికంగా ఆలోచించటానికి సందేహం లేదు దేశీయ సమైక్యత సాధించటానికి అనుసరించవలసిన ముఖ్య విధానాలు రెండున్నాయి ఒకటి, వెనకబడి ఉన్న ప్రాంతాలను ముందుకు తేవటానికి ప్రత్యేక కృషి చెయ్యటం, రెండు, రాజకీయ కారణాల మూలంగా కొన్ని ప్రాంతాల పట్ల సవతితల్లి వైఖరి అవలంబించకుండా ఉండటం

ఈ రెండూ ఆది నుంచీ విస్మరించబడ్డాయి స్వాతంత్ర్యం వచ్చిన నాటికి ఆర్థికంగా వెనకబడి, పారిశ్రామికంగా క్షీణదశలో ఉన్న ప్రాంతాలు ఈనాటికీ అదే స్థితిలో ఉన్నాయి కేంద్రంలో అధికారం గల పార్టీని ఎన్నుకోని రాష్ట్రాలలో ప్రభుత్వాలను పడగొట్టటానికి విశ్వప్రయత్నాలు జరిగి, ఆ విధానం నిరంకుశంగా కొనసాగింది ఇలాటి విధానాల ప్రభావం ఉండకుండా ఎలా ఉంటుంది?

దక్షిణ ప్రాంతాన్ని ఉత్తర ప్రాంతం నుంచి వేరు చెయ్యాలన్న నినాదం చాలా పొరపాటు నినాదమే కావచ్చు కాని అది వొట్టి పుణ్యానికి రాలేదు దక్షిణ ప్రాంతం ప్రజలు ఉత్తరాది వాళ్ళను విజాతీయులుగా చూడటం మొదలుపెట్టి చాలా కాలమైంది రాజగోపాలాచారీ, కామరాజూ అనంతరం తమిళ సోదరులు విశ్వసించగల కాంగ్రెసు మహానాయకుడు తమిళనాడులో లేడు అదేం ఖర్మో ఆ ఇద్దరుకూడా బతికి ఉండగానే కాంగ్రెసు నుంచి విడిపోయారు అటు తర్వాత డి ఎం కె గద్దె ఎక్కింది ఏదో వంక పెట్టి డి ఎం కె ప్రభుత్వాన్ని కూడా ఎమర్జెన్సీలో దించారు వెంటనే సినిమా రంగం నుంచి ఎం జి ఆర్ అధికారం అంది పుచ్చుకున్నాడు

కాంగ్రెసును పడగొట్టటానికి జనతా పార్టీ ఎన్నికల సమయంలో తమిళనాడులో మంచి ప్రయత్నమే చేసింది కృపలానీ, మొరార్జీదేశాయి మొదలైన వాళ్లు మద్రాసులో చాలామంది ప్రసంగాలే చేశారు కాని వాళ్ళు "విజాతీయులు" ఎన్నికలలో జనతా పార్టీ ఎక్క రాలేదు ఇదే ప్రాంతీయాభిమానాలు పశ్చిమబెంగాల్, మద్రాసు, కాశ్మీర్, పంజాబ్, గోవా మొదలైన ప్రాంతాలలో జనతా పార్టీకి అపజయం కలిగించాయి నేషనల్ ఇంటిగ్రేషన్ కనుచూపు మేరలో కానరాదు చిత్రం ఏమంటే, కేంద్రం తమకు హస్తగతం అయినాక జనతా మహానాయకులు ప్రాంతాలను గురించి అంతగా బాధపడినట్టు గాని, ఆత్మవిమర్శ చేసుకున్నట్టు గాని కనబడలేదు పైపెచ్చు తమ అధికారంలోకి రాని ప్రాంతాలను రెచ్చగొట్టే ప్రసంగాలు కూడా చేశారు

తమిళులను రెచ్చగొట్టే అంశాలలో హిందీ భాష ఒకటి నిజానికి దేశానికంతకూ ఒక జాతీయ భాష ఉండటం జాతీయ సమైక్యతకు మొట్ట మొదటి మెట్టు నూటికి ఒకరికి కూడా అర్థం కాకపోయినా, ఎవరికీ మాతృభాష కాకపోయినా గుప్తరాజుల కాలంలో సంస్కృతం జాతీయ భాషగా పని చేసింది ఈనాడు అంతకన్న ఒక పిసరు మంచి స్థితిలోనే ఉన్నా కేంద్రంలోని కొందరు నాయకులు ఇంగ్లీషును జాతీయ భాషగా ఆమోదించలేకపోతున్నారు భాషా దురభిమానం హిందీ వాదులలో మాత్రమే కనిపించటం గమనార్హం తమిళాన్ని జాతీయ భాష చెయ్యమని ఎం జి ఆర్ అడగటం లేదు ఇంగ్లీషు కావాలంటున్నాడు ప్రాంతీయ భాషలను ప్రాంతీయ పాలకులు కాకపోతే ప్రాంతీయ ప్రజలైనా పెంపొందించుకుంటారు ఈనాడు తెలుగు భాష ఇంతగా అభివృద్ధి చెందటానికి రాజకీయాధికారులూ, విద్యాశాఖ వారూ చేసిన కృషి ఏమీ లేదు ఈ తేడా చూడాలంటే యాభై ఏళ్ళ నాటి పత్రికలు చూస్తే తెలుస్తుంది

అయితే హిందీవాదులు మొదటి నుంచీ ఒక్క విషయం నొక్కి చెబుతున్నారు హిందీ అధిక సంఖ్యాకుల మాతృభాషట ఇది పచ్చి అబద్ధం నిజం ఏమిటంటే నాలుగు హిందుస్థానీ

ముక్కలు వచ్చినవాడు దేశంలో చాలా ప్రాంతాల పని గడుపుకోవచ్చు అంతేగాని హిందీ అధిక సంఖ్యాకుల మాతృభాష కాదు

నేను హిందీ ప్రాంతంలో (కాశీలో) రెండేళ్ళున్నాను మాకు వండి పెట్టే ''మహారాజు'' హిందీ మాట్లాడేవాడు వాడి అసిస్టెంటు ఒకసారి నా దగ్గరికి వచ్చి ''మహారాజు'' ఏదో చెప్పమన్నాడని చెప్పటానికి హిందీ మాటలు పట్టి పట్టి అప్పగించినట్టు మాట్లాడాడు తరవాత '' ఇదేమిటి'' అని ''మహారాజు''ను అడిగితే 'మేం దేశవాళీ మాట్లాడతాం మాకు తెలిసిన హిందీ మీ వంటి వాళ్ళ నుంచి నేర్చుకున్నదే!'' అంటూ ఒక సంఘటన చెప్పాడు హిందూ యూనివర్సిటీలో రిసెర్చి చేస్తున్న ఒక ప్రముఖ ఆంధ్రుడు ''మహారాజు'' నౌకర్ని ''తుమ్'' లన్నందుకు చెంప పగలగొట్టాడట వాడికి '' ఆప్'' అనే గౌరవ వచనం తెలీదు ''తుమ్'' అన్నది బహువచనమే!

నేను హిందూ యూనివర్సిటీలో ఉండగానే ఇంకో సంగతి జరిగింది మా హాస్టల్ బ్లాక్‌లోకి కొత్తగా వచ్చిన ఒక విద్యార్థి హాస్టల్ నౌకర్ను నా దగ్గరికి తెచ్చి, ''వీడు ఏమిటి అంటాడు?'' అని అడిగాడు నేను నౌకర్ను అడిగితే ''ఆ బాబూజీని బకెట్ తెచ్చుకోమను నీళ్ళు నింపి పెడతాను'' అన్నాడు నేనామాట కొత్త విద్యార్థికి చెబితే అతను నన్ను ''థాంక్'' చేసి వెనక్కు తిరిగాడు నాకేదో అనుమానం వచ్చి, అతన్ని వెనక్కు పిలిచి ''మీ మాతృభాష ఏమిటి?'' అని అడిగాను 'నేను మీరట్ నుంచి వస్తున్నాను నా మాతృభాష హిందీ!'' అన్నాడతను ''నౌకరు కూడా హిందీయే మాట్లాడుతున్నాడు,'' అన్నాను ఆ విద్యార్థి ఆశ్చర్యపోయి ''అది హిందీ కాదు'' అన్నాడు

రెండు విషయాలు 1) హిందీ అంతా ఒకటి కాదు, 2) ఇద్దరు హిందీ వాళ్ళు ఒకరినొకరు అర్థం చేసుకునేటందుకు ఇంగ్లీషు ''లింక్'' లాంగ్వేజ్‌గా ఉపకరించింది

దేశంలో అధిక సంఖ్యాకులు మాట్లాడతారన్నది నిజం కాకపోగా, అది జాతీయ భాషగా పనికి వచ్చేటంతగా అభివృద్ధి పొందలేదు - కాలక్రమాన అభివృద్ధి చెందవచ్చు, అది వేరే విషయం

మన రాజ్యాంగంలో ఒక పేరాకు మూడు హిందీ అనువాదాలు ప్రకటించాడు రాజశేఖర్‌బోస్ ఒక దానికీ ఒక దానికీ సంబంధం లేదు ''వీటిలో ఏది ప్రమాణం?'' అని బోస్ అడిగిన ప్రశ్నకు ఎవరూ సమాధానం చెప్పినట్టు లేదు అలాంటి భాషలో శాసనాలు చేస్తే చెప్పాలా?

హిందీ ఉచ్చారణ అపభ్రంశంగా ఉంటుంది దేవనాగర లిపిలో పొట్టి '' ఎ, ఒ''లు లేవు నా ఇంటి పేరు హిందీలో రాస్తే ''కొడ్‌వటిగంటి'' అవుతుందనుకుంటాను హిందీ వాళ్ళు ప్రకాశ్‌ను పర్కాష్ అనీ, రామచంద్రను రామచందర్ అనీ అంటారు శ, ష్‌లు షగానే ఉచ్చరిస్తారు ఇలాటి లోట్లు ఇతర భాషలకు లేవా అనవచ్చు అవన్నీ దేశీయభాషలు కావాలని చిందులు తొక్కటం లేదు తెలుగులో ఉన్న నుడికారం హిందీలో లేదని ఒక తెలుగు ప్రముఖ హిందీ రచయిత ఒప్పుకున్నాడు

*భరణి, మాసపత్రిక 1973*

# 9. రాజకీయ సమైక్యత : ఇంగ్లీషు భాష

మొదటి ప్రపంచ యుద్ధం అనంతరం దేశంలో సాగిన జాతీయోద్యమం కాలంలో ఎన్నడూ లేని విధంగా జాతీయ సమైక్యత సాధించబడింది రాజకీయంగా దేశం సమైక్యం కావటం వెయ్యేళ్ళలో ఇదే మొదటిసారి అనుకుంటాను దానికి సాధనంగా ఉపయోగించినది మరింత ఆశ్చర్యకరంగా ఇంగ్లీషు భాష ఇంగ్లీషు భాషతో బ్రిటీష్‌పాలకులు అది వరకే తమకు అవసరమైన జాతీయ సమైక్యత సాధించారు అయితే, అది పట్టణాలకూ, విద్యావంతులకూ పరిమితమయింది అది రాజకీయ సమైక్యత అనటానికి కూడా వీలు లేదు అంతేగాక అది దేశంలో వ్యాప్తంగా వున్న సంస్కృతికి ఎదురు నడిచింది

పాశ్చాత్య భాషతో పాటు సంస్కృతిని కూడా అవలంబించి, సంఘ సంస్కరణలూ, ఏకేశ్వరోపాసనతో కూడిన బ్రహ్మసమాజాలు, ఆధ్యాత్మిక తత్వంతో కూడిన థియోసఫీ లాంటి మతాలూ అవలంబించిన 'మేధావి'' వర్గం వారు జనసామాన్యానికీ, రాజకీయ విముక్తి భావాలకూ అతీతంగా వుండిపోయారు

జాతీయోద్యమం ఈ పరిస్థితిని పూర్తిగా మార్చేసింది ఇంగ్లీషు భాష ధర్మమా అంటూ దేశం అంతా తమ నాయకులుగా గుర్తించిన వారు పంజాబు నుంచి బెంగాలు వరకూ, హిమాలయాల నుంచి కన్యాకుమారి దాకా అన్ని ప్రాంతాల నుంచీ వచ్చారు

జాతీయోద్యమ ప్రభావాన్ని ప్రజలలోమరింత బాగా నాటటానికి గాంధీగారు నైతిక విలువలూ, రాంభజనా, అహింసతో బాటు హిందీ దేశవాసులందరికీ జాతీయ భాషకావాలంటే అది సబబుగానే కనిపించింది జాతీయోద్యమ వ్యాప్తికీ, ప్రపంచ దృష్టి దానికేసి మళ్ళించటానికీ ఇంగ్లీషు ఎంతగా తోడ్పడినదీ చాలా మంది గమనించను కూడా లేదు ఇంగ్లీషు భాష భారతీయులకు తమ సొంత సంస్కృతికి దూరమయేటట్టు చేసిందనీ, దాని ప్రభావం సాహిత్యం మీద కూడా అమితంగా పడిందని మాత్రమే జనం గమనించారు దీనికితోడు హిందీని జాతీయోద్యమ కాలంలో వ్యతిరేకించిన వారు సంకుచిత భావాలూ, స్వభాషా దురభిమానమూ ప్రదర్శించిన మాట అబద్ధం కాదు

ఏమైనా ఎలాటి ప్రోద్బలమూ లేకుండా, స్వార్థచింతనకు అవకాశం లేని సమయంలో తెలుగుదేశంలోని పల్లెటూళ్ళ నుంచి వేల సంఖ్యలో హిందీ పారాలు చదివి, పరీక్షలు ప్యాసయ్యారు ఒకప్పుడు సంస్కృతం నుంచి దేశీయ భాషలలోకి సాహిత్యం దిగుమతి అయినట్లుగానే, అప్పుడు దేశంలోని అన్ని ప్రాంతాలా వెలువడిన వివిధ భాషా సాహిత్యాల నుంచి హిందీలోకి అనువాదం పొంది ప్రాంతీయ రచనలకు 'జాతీయ సాహిత్య' గౌరవం లభించింది ఈ ధోరణిలోనే అనేకమంది బెంగాలీ రచయితలూ, మహారాష్ట్ర రచయితలూ తెలుగువారికి పరిచయమయారు

హిందీ భాష దేశీయ సంస్కృతిని ఏకం చేయగలదన్నది రుజువైపోయింది

అయితే అదే కాలంలోమన ప్రాంతీయ సంస్కృతులు విశ్వ సంస్కృతికేసి కూడా దృష్టి సారించాయి ఇంగ్లీషు ధర్మమా అంటూ ఒనేక డజన్ల మంది అంతర్జాతీయ రచయితలు -

టాల్‌స్టాయ్, చెహూవ్, గోర్కీ, షా, వెల్స్, ఇబ్సెన్, రోమే రోలా, హ్యూగో, అనటోల్ ఫ్రాన్స్ లాంటి వాళ్లు మన దేశపు రచయితల మీదా, సాహిత్యాభిమానుల మీదా తమ ప్రభావాన్ని ప్రసరింపజేశారు ఇది ఇంగ్లీషు భాష ద్వారానే సాధ్యమయింది అందుచేత ఇంగ్లీషు స్థానాన్ని హిందీ ఆక్రమించుకుంటున్నదన్న నమ్మకానికి ఆ సమయంలో కూడా ఆస్కారం లేకపోయింది

మనకు స్వాతంత్ర్యం వచ్చే నాటికి సమాజం గురించీ, దాని భవిష్యత్తు గురించీ, భిన్నభిన్న భావాలు తుఫానులాగా వీస్తూ వున్నాయి స్వాతంత్ర్య పోరాట కాలంలో భారతీయుల మధ్య పెరుగుతూ వచ్చిన సమైక్యత స్వాతంత్ర్యం రావటంతో చప్పున అదృశ్యమయింది కారణం స్వాతంత్ర్య పోరాటంలో అధికార వాంఛ లేదు స్వాతంత్ర్యం తెచ్చుకున్న విధానంలో అధికార వాంఛ తప్ప మరొకటి లేదు ఈ అధికారం కోసం దేశాన్ని రెండుగా చీలనిచ్చారు మత ప్రాతిపదిక మీద జాతుల వేర్పాటును ప్రతిపాదించకపోయినా ఆమోదించారు దాచినా దాగని సత్యంలాగా ఉత్తరదేశం దక్షిణదేశం మీద పెరిగిపోసాగింది వివిధ ప్రాంతాల మధ్య సమత్వం సన్నగిల్లింది ఎంత కూడదనుకున్నా ఉత్తర-దక్షిణ భారతాలు వేరువేరుగా కనిపించసాగాయి కాంగ్రెసుకు కొన్ని ప్రాంతాల పరపరతి తగ్గింది స్థానిక పార్టీలు బలం పుంజుకున్నాయి

ఈ పరిస్థితిలో దేశీయ సమైక్యత కోసం హిందీ భాషను ఉపయోగించుకోవాలని ఉత్తరాది వారు చూశారు

ఒకప్పుడు వాంఛనీయమైనది రానురాను అవాంఛనీయంగా పరిణమించింది ఎందుచేత? ప్రాంతీయ సంస్కృతులు స్వతంత్రంగా అభివృద్ధి కావటం చేత హిందీ భాష వెంట ఒక సంస్కృతి ఉండటమూ, దాని వెంబడి దేశీయ సమైక్యత బలపడటమూ జరుగుతుందన్న ఆశ పోయింది తరువాత, బ్రిటీషువారు మన దేశాన్ని దోచుకోవటానికి ఇంగ్లీషు ఉపయోగించినట్లే ఉత్తర భారతీయులు హిందీ భాషేతర ప్రాంతాలను దోచుకోవటానికి హిందీని జాతీయ భాషగా ఉపయోగించుకో జూస్తున్నారన్న అనుమానానికి అవకాశం ఏర్పడింది మూడో సంగతి, హిందీకి అంతర్జాతీయ భాషగా ఉండదగిన పరిస్థితి లేదు శాసనాలు చెయ్యటానికైతేనేం, వైజ్ఞానిక రచనలు చెయ్యటానికైతేనేం అది తగినంతగా పెరగలేదు దాని పదజాలమూ, నుడికారమూ సనాతన సంస్కృత మయం హిందీ భాషా సాహిత్యం ఏ ఇతర భారతీయ భాషా సాహిత్యంతోనూ పోటీ చేయగలిగినట్టుగా కనబడదు

అధిక సంఖ్యాకులు హిందీ మాట్లాడతారు గనక హిందీ జాతీయ భాషగా వుండాలన్న అర్థం లేని వాదం అమలులోకి వచ్చింది ఒకప్పుడు జాతీయ సమైక్యతను సాధించిన సంస్కృత, ఆంగ్ల భాషలు ఎవరి మాతృభాషలూ కావు దేశం స్వతంత్రమైనాక ఇంగ్లీషు పీడకుల సాధనం అన్న మచ్చ కూడా పోయింది అది ఏ ప్రాంతం వారి ఆధిక్యతకూ దోహదం చెయ్యదు అది అన్ని ప్రయోజనాలకూ పనికి వచ్చే అంతర్జాతీయ భాష అధికార భాషగా వుండటానికి గల అర్హతలలో ఏ ఒక్కటీ హిందీకి లేదు అంతేకాదు ప్రాంతీయ భాషలలో విద్యాబోధన అన్నది ఎంతో వాంఛనీయమైనప్పటికీ, ఏ ప్రాంతం వాళ్ళు ఆ ప్రాంతంలో కూరుకుపోకుండా వుండాలంటే కనీసం పై తరగతుల వారైనా ఇంగ్లీషు చదువులు చదవకతప్పదు

సాంస్కృతికంగా కూడా హిందీ భాష 40 ఏళ్ళ క్రితం సాధించిన విజయాలు ఈనాడు సాధించలేదు ఇప్పుడు హిందీ సాహిత్య(అనువాద) వ్యామోహం ఎవరినీ పట్టలేదు తెలుగులో శరత్ వెనకబడి రచయిత్రులు ముందుకు వచ్చారు హిందీ భాష తలకిందులుగా తపస్సు చేసినా జాతీయ సంస్కృతిని నిలబెట్టలేదేమోననిపిస్తుంది

భవిష్యత్తులో ఎప్పటికైనా మళ్ళీ జాతీయ సమైక్యతకు దోహదం జరిగితే అది సోషలిస్టు, కమ్యూనిస్టు ఉద్యమాల ద్వారా మాత్రమే జరుగుతుందని నాకు తోస్తుంది

*యుగవాణి, 1978*

*పునర్ముద్రణ అరుణతార, జూన్-నవంబర్ 1978*

# 1. నాకు నచ్చిన గ్రంధాలూ – రచయితలూ

అందరూ రాసేవాళ్ళలాగే నేనుకూడా ముందు చదవటంలో ఆసక్తి ఉండి, తరవాత రాయటంలో ఆసక్తి తెచ్చుకున్నాను అయితే నాలో ఒక వక్రత కనిపిస్తుంది నన్ను రచనకు పురికొల్పినది ఇతర కథలను అనుకరిస్తే బాగుంటుందన్న ప్రేరణకాదు, ఇతరులు రాసే కథలు బాగుండటం లేదన్న అసంతృప్తి ఆ కారణంగా, నేను కథలు వ్రాయటం మొదలు పెట్టేనాటికి ఒక అభిమానరచయితా (కథకులలో) లేక పోవడం జరిగింది త్వరలోనే ఈ లోటు తీరిపోయిందనుకోండి

నా సాహిత్య పరనాసక్తి చాలా చిన్నతనంలోనే ప్రారంభమయింది కాకతాళీయంగా నేను చదివిన తొలి గ్రంధాల రచయితలు గురజాడ, వీరేశలింగంగార్లు, పుస్తకాలు ''కన్యాశుల్కం'', ''తిర్యగ్విద్వన్మహాసభ'', ''మహారాజ్య పురాధిపత్యం'' నేను మొదటిసారి ''కన్యాశుల్కం'' చదివినప్పుడు నాకు అందులోవున్న ఇంగ్లీషు ముక్కలు చదవటం చాతకాలేదు అంటే నావయసు ఎనిమిదికి లోపు అయి ఉండాలి ''కన్యాశుల్కం'' ఎన్ని సార్లు చదివానో జ్ఞాపకం లేదు అటుతరవాత అనేక దశాబ్దాలపాటు ఆ పుస్తకము కంటపడకపోయినా అందులోని వాక్యాలు నాకు డజన్లకొద్దీ జ్ఞాపకం ఉండేవి వీరేశలింగం గారి ''తిర్యగ్విద్వన్మహాసభ'', ''మహారాజ్య పురాధిపత్యం'' విడి పుస్తకాలుగా, బొమ్మలతో, మా యింట్లో ఉండేవి మా అన్న వెంకట సుబ్బయ్యగారు చేర్చి ఉంటాడు వాటిని కూడా చాలాసార్లు చదివాను జంతువులు మనుషుల్లాగే మాట్లాడటమనేది నాకు మొదట ఈ నాటకంలోనే పరిచయం అయింది మాయలమారి మల్లయ్య కథ ఇందులోనే చదివాను కాని ఆ నాటకాలలోని సంభాషణ ఒకటీ కంఠస్థం కాలేదు (గురజాడ, కందుకూరి రచనలకున్న తేడాలలో ఇది వొకటేమో)

తరవాత నేను పదేపదే చదివిన ఆధునిక రచన చింతా దీక్షితులుగారి ''ఏకాదశి'' అన్న కథల సంపుటి అందులో ''సాహితికి కథ'' అన్న కథ గాని కథ నన్ను చెప్పతరంకానంతగ ''టికిల్'' చేసింది ఇంచుమించు అదే సమయంలో మొక్కపాటివారి ''బారిష్టరు పార్వతీశం'', నండూరువారి ''యెంకిపాటలు'' చదివాను నేను ఇంటరు చదివే రోజుల్లో ఒక విద్యార్థి మా హాస్టలుకు వచ్చి యెంకిపాటలు పాడేవాడు అది విని నాకు వాటిమీద చదివినప్పుడున్న అభిమానం కూడా పోయింది కాని ''యెంకిపాటలు'' పుస్తకం, బాపిరాజుగారి అందమైన బొమ్మలతో నాచేతికి వచ్చేసరికి అందులో పారుపల్లి రామకృష్ణయ్య గారి స్వరరచన కనిపించింది ఆ స్వరాన్ని బట్టి పాటలు చదువుకుంటే నాకు మతిపోయినంత పనయింది అవి ఎంత అందమైన పాటలు! ఎన్నా పాటలు ఏళ్ళ తరబడి 'హంట్ ' చేశాయి దరిమిలా నండూరి సుబ్బారావుగారు భావ కవిత్వ వ్యామోహంలో పడి ఏరుచేత ''ఎన్నెలను'' నెమరేయించిన రకం పాటలు నన్ను కొంచెం కూడా కదిలించలేదు ''ఆనాటి నా తోడు'', ''ఉత్తమ యిల్లాలిని'', ''సుక్కేక్కడున్నదో'' లాంటి పాటలు చదువు తుంటే నాకు కళ్ళు చెమర్చేవి (నాచే కన్నీరు కార్పించే సాహిత్యం దాదాపు లేదనే చెప్పాలి)

నేను రచనలు ప్రారంభించక పూర్వం నా అభిమాన రచయితలు మునిమాణిక్యం, వేలూరి శివరామ శాస్త్రి, కవులలో కృష్ణ శాస్త్రి, శివ శంకర శాస్త్రి

చలంగారి కథలు నేను కథలు వ్రాయటం ప్రారంభించాక చదివాను ఆయన రచనలు పూర్వ రచనలకు కాలదోషం పట్టించాయని వెంటనే తెలిసిపోయింది అదేనాకు చలం అభిమాన రచయితవడానికి బలమైన కారణం నేను ఆయన కథలు ''పాపం!'' పుస్తకంగా కూడా వేశాను (1937 లోనో 38లోనో)

ఆనాడు నన్ను ఆకర్షించిన రచయితలలో శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారొకరు ఆయన భాషలో మాధుర్యం ఉండేది కథలలో కత్తులుండేవి చలంగారి కథలలో సమాజం మీద శాపనార్థాలే ఉండేవి కాని శాస్త్రిగారి కథలలో సాంఘిక విమర్శ ఉండేది

ఇంచుమించు యుద్ధం ఆరంభమయే కాలంలో గోపీచందు కథకుడుగా ముందుకు వచ్చాడు గోపీచందు ఆధునిక మేధావి వర్గానికి చెందినవాడు ఒక విధమైన '' ఆస్థ'' కలవాడు అతని తొలి కథా సంపుటి '' ఆడమళయాళం'' నాకు అంతగా నచ్చలేదు కాని తరవాత తరవాత గోపీచందు పెరిగాడు అయినా గోపీచందు రచనలు నన్ను బలంగా ఆకర్షించడం జరగలేదు నాకన్న చాలా గొప్ప రచయితలుగా విమర్శకులు నిర్ణయించిన వారిలో గోపీచందూ, బుచ్చి బాబూ నన్ను కదిలించలేక పోయారు, నా దురదృష్టం అనుకోవాలి

యుద్ధకాలంలో వచ్చిన కథా రచయితలలో గోఖలే నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేశారు గోఖలే రచనావిధానమూ, వస్తువూ, భాషా పూర్తిగా ప్రోలిటేరియన్ అలగాజనం వాడుకునే సంక్షిప్త పదజాలంతో గోఖలే బొమ్మ కట్టించగలిగాడు గోఖలే కళాకారుడు కాని గోఖలే కథలకు చెప్పుకోదగిన సాంఘిక ప్రయోజనం లేకపోయిందేమో

''కరుణ కుమార'' కథలు కూడా నాకు చాలా అభిమానపాత్రమయ్యాయి గ్రామీణ జీవితాన్ని ''కరుణ కుమార'' చాలా బాగా చిత్రించాడు

యుద్ధానంతర కాలంలో సాహిత్య రంగంలో చాలా మార్పులు వచ్చాయి ఒక మార్పు అభ్యుదయ సాహిత్యోద్యమం ఈ ఉద్యమం యువరచయితల దృక్పథాన్ని చాలవరకూ మార్చింది మరికొంచెం ఆలస్యంగా రచయిత్రులు ముందుకు వచ్చారు ఈ కొత్తదశలో నాకు రచనలు హెచ్చుగా లభించినది పత్రికల ద్వారానే

రచయిత్రులలో యిద్దనపూడి సులోచనారాణి, ముప్పాళ రంగనాయకమ్మ, అచ్యుతవల్లి లాంటి వాళ్లు ప్రతిభా వంతులుగా కనిపించారు సులోచనారాణి నవలలు రాయటం మొదలు పెట్టినాక నా అభిప్రాయం మారింది రంగనాయకమ్మ నవలలు చదివినాక నా అభిప్రాయం బలపడింది ఆమెకు జీవితాన్ని వాస్తవంగా చిత్రించడంలో గొప్ప నేర్పున్నది కాని విశ్లేషించడానికి తగిన శక్తి లేదు చిత్తశుద్ధి దీక్షా గల రచయిత్రి

ఇటీవలి కాలంలో కథారచనలో ఒక కొత్త శకం ఆరంభమయింది రాచకొండ విశ్వనాథశాస్త్రితో ఒకప్పుడు చలంగారిలాగే విశ్వనాథశాస్త్రిగారు తనకు పూర్వం వచ్చిన రచనలకు కాలదోషం పట్టించెయ్యగలిగారు ఆయనకు మనస్సును -తన మనస్సునూ పాత్రల మనస్సునుకూడా - మాటలలో వ్యక్తం చెయ్యటం చాతనవును వచనానికి కవిత్వం హోదా ఇవ్వటం చాతనవును అంతేగాక ఆయనకు తానురాసే పాత్రలలో తాదాత్మ్యం ఉన్నది ఇలాంటి తాదాత్మ్యం ఉన్న మరొక రచయిత కాళీపట్నం రామారావుగారు విశ్వనాథశాస్త్రిగారి

రచనలకి ప్రతిబింబాలుగా పరిగణించబడే బీనాదేవి రచనలు శాస్త్రిగారి రచనలతో ''బ్రాకెట్'' చెయ్యదగినవి నాకు వీరందరి పుస్తకాలూ చాలా ఇష్టం

ప్రతి రచనా పాఠకుడికి ఒక నిజమైన అనుభూతిని పరోక్షంగా కలిగించాలి అలాంటి రచనలు ఎన్నో నేను చదివి ఉంటాను కాని ఈ కొద్ది జాగాలో, నాకు విశేషానుభూతిని కలిగించిన రచయితలనే చెప్ప గలిగాను

*తరుణ, మాసపత్రిక, ఆగస్టు 1971*

## 2. జాత్యుద్ధరణే పరమ లక్ష్యంగా కల వీరేశలింగంగారి సాహిత్య కృషి

ఈ యుగంలో తెలుగు జాతికి పెద్దదిక్కుగా పరిగణించ వలసినవాళ్ళు ఇద్దరున్నారు ఒకరు వీరేశలింగం పంతులుగారు, రెండోవారు గురజాడ అప్పారావు పంతులుగారు అప్పారావుగారు మహాకవి ప్రతి తెలుగువాడు భగవద్గీత కింద ప్రతిరోజూ పఠించవలసిన ఒక గేయంద్వారా ఒక సమగ్ర జీవిత సందేశం యిచ్చాడు అభ్యుదయ జీవితానికి కావలసిన నీతీ, విశ్వాసాలూ, కార్యక్రమం యావత్తూ అందులో ఉంది

వీరేశలింగం గారు కర్మిష్ఠి ఆయన కార్యక్రమం ఒక సందేశంతో తీరిపోయేది గాదు జాతిని చెవులు పిండి, బుద్ధి చెప్పి, కోప్పడి, కొట్టి అడుగడుగునా విమర్శిస్తూ, మంచి మార్గాలు చూపిస్తూ నిజంగానే ఒక పెద్దదిక్కై వుండి కాపాడుతూ వచ్చారు గారాబంతో గాని, లేని పోని మెప్పులతోగాని, లాలనతోగాని ఆయన తెలుగు జాతిని మభ్యపెట్టి ''పాడు'' చెయ్యలేదు మౌఢ్యమూ, మకురుతనమూ బలిసిపోయివున్న యీ జాతి వీరేశలింగంగారి పెంపకానికి లొంగివచ్చిందిగాని, దాన్ని పట్టుకు రావటం మరొకరివల్ల సాధ్యమయ్యేది కాదు

తన సమకాలికులలో బలవంతుల వర్గాన్ని తన రచనలద్వారా శ్లాఘించీ, రంజింపజేస్తే, సమర్థించీ, వారి ఆదరాభిమానాలు సంపాదించుకుని వారిచేత బ్రహ్మరథం పట్టించుకోవాలంటే వీరేశలింగం గారికి అసాధ్యమైన పనిగాదు ఆయనకు బహుభాషా పాండిత్యమూ, వివిధ సాహిత్య సంపర్కమూ, శీఘ్ర రచనాశక్తి ఉండేవి కాని జాతికి ఎడంగా నిలబడే స్వార్థమూ, జాతియొక్క యోగక్షేమాలను గురించి నిర్లక్ష్యమూ మాత్రమే ఆయనలో లోపించాయి తల్లి పిల్లలకు ఎడంగా నిలబడి వారి మన్ననల కొరకు తాపత్రయ పడటం ఎంత అసాధ్యమో వీరేశలింగంగారు సాహిత్యం ద్వారా స్వార్థంచూసుకోవటం అంత అసంభవం తన ద్వారా జాతిపైకి రావటమే ఆయన ఆత్మ విశ్వాసం అదే ఆయనకు కీర్తీనూ

తన తెలుగు జాతి ఏయే ప్రభావాలవల్ల బాగుపడగలుగుతుందో ఆయా ప్రభావాలన్నిటికీ వీరేశలింగం గారు గురికావటం జరిగింది ఇందులో వింత ఏమాత్రమూ లేదు ఎందు చేతనంటే ఏయే ప్రభావాలవల్ల ఆయన తెలుగుజాతికి పెద్ద దిక్కుకాగలిగాడో ఆ ప్రభావాలనన్నిటినీ ఆయన తన రచనల ద్వారా జాతికి అందించాడు - సాధారణంగా ఇతర రచయితలు ఆత్మ సంతృప్తి కోసమో, కాకతాళీయంగానో కొన్ని ప్రభావాలను తమ రచనల

ద్వారా ప్రపంచంమీద రుద్దేస్తారు కొంతకాలం జరిగినాక ఈ ప్రభావాలు సంఘానికి ఉపకరించాయా అని అంచనా కట్టుకోరు తాము ఆ ప్రభావాల నుండి విముక్తులైనప్పటికీ, వాటితో కూడుకున్న తమ రచనలను ఖండించుకోరు ఇక సంఘం అవసరాలనుబట్టి పని పెట్టుకుని కొత్త ప్రభావాలను తమ మీద తెచ్చి పెట్టుకోవటమనేది ఒక్క వీరేశలింగం గారికే చెల్లిపోయింది

మొదట్లో వీరేశలింగంగారు అప్పటి కవి పండితుల ప్రభావానికి లోనైనవారే ప్రబంధ, చిత్ర, బంధాదికవిత్వాలు చేశారు కాని వాటి మీద ఆయనకు త్వరలోనే విసుగుపుట్టింది కాని, ఆయన సమకాలికుల దృష్టిలో ఆయనకు సాహిత్య పట్టభద్రత లభించివుండాలి

వీరేశలింగంగారి ఇతర రచనల్లో వివిధ ప్రభావాలు కనిపిస్తాయి ఇంగ్లీషులో నుంచి షేక్స్పియరు నాటకాలూ, షేక్స్పియరు నాటక కథలూ, గలివర్స్ ట్రావెల్స్ మొదలైన గ్రంధాలకు తర్జుమాలున్నాయి వికార్ ఆఫ్ వేక్ ఫీల్డ్ నవలను అనుసరించి రాజశేఖర చరిత్రమనే నవల ఒకటున్నది ఏసుచరిత్ర ఉన్నది రసాత్మకంగానూ, సంస్కారదృష్టితోనూ రచించిన ప్రహసనాలున్నాయి విద్యార్థుల ఉపయోగం కోసం వాచకపుస్తకాలున్నాయి సంస్కృతంనుంచి తర్జుమా చేసిన శాకుంతలమూ, రత్నావళీ నాటకాలున్నాయి సంఘాన్ని విమర్శించుతూ, ప్రజలకు ఉద్బోధచేస్తూ వ్యాసాలున్నాయి తర్కమూ, శరీర శాస్త్రమూ మొదలైన శాస్త్ర గ్రంధాలున్నాయి అద్భుత పరిశోధనతో గూడిన కవుల చరిత్ర ఉన్నది

సంఘ దృష్టి తనమీదకు తిప్పుకుని తన గొప్పతనం సంఘానికి చెప్పి గొప్పవాడనిపించుకునేటందుకు తాపత్రయ పడేవాడు ఇన్ని రకాల రచనలకు పూనుకోడు కవిత్వం రాసేవాడికి గద్యం రాద్దామంటే ఆ కాస్త కీర్తీ పోతుందేమోనని భయం కథకుడుగా పేరు పడ్డవాడికి నాటకాలు రాయటమంటే భయం అటువంటి పరిస్థితిలో వీరేశలింగంగారు కేవలం ఆత్మ సంతృప్తి కోసమే ఇంత సాహిత్య కృషిచేసి ఉంచటం అసంభవం

ఇందులో మరొక వింతకూడా ఉంది సంఘ కార్యం ఏది నెత్తిన పెట్టుకున్న వాడుకూడా సాహిత్యం జోలికి రాడు మన రాజకీయవేత్తలూ, సంస్కారులూ, నటకులూ, తదితర గౌరవనీయులూ సాధ్యమైనంతవరకు కలం పట్టరు కీర్తికాయులై ఉండటం చేతనో ఏమో, వారికి తాము చేసే పని మీద ఉండే శ్రద్ధ ప్రయత్నఫలితాల మీద ఉండదు తాము చేసే ప్రయత్నం సమగ్రంగా ఫలించాలంటే సాహిత్య సహాయం ఉండి తీరాలి వీరేశలింగం గారికి ముందుగాని లేక వెనకగాని సంఘసేవ చేసినవారు తమకు సహకారిగా సాహిత్యం సృష్టించింది లేదు అయితే వీరేశలింగం గారు ఒక్కరే ఈ పనిచేశారు ఒక వంక వితంతు వివాహాలు చేయిస్తూ, తుచ్ఛ మూఢాచారాలను ఎదుర్కొంటూ, సంఘ విద్రోహులను ఎదిరించి శత్రువులను చేసుకుంటూ, అవసరమైనప్పుడల్లా సంఘాన్ని అంతనీ ఎదిరించి పోరుతూ, జనసామాన్యంలో వివేకాన్ని కలించారు

*అభ్యుదయ, మాసపత్రిక, ఏప్రిల్ 1948*
*పునర్ముద్రణ విశాలాంధ్ర దినపత్రిక, 15-4-1962*

# 3. ఆంధ్రుల ఆలోచనా ధోరణిపై వీరేశలింగం గారి ప్రభావం

ఒక్కొక్క జాతి అంధకారంలో మునిగి అధోగతి పాలైనప్పుడు ఆజాతి భవిష్యత్తు మూర్తీభవించినట్లుగా ఒక్క మహాపురుషుడు పుట్టుకొస్తాడు ఆంధ్రజాతి పురోభివృద్ధికి ప్రతిరూపంగా నిలచి ఉద్బోధించి, పోరాడి హెచ్చరించి ఆంధ్రుల భావి సంస్కృతికి పునాదులు వేసినవాడు కందుకూరి వీరేశలింగం ఆంధ్రుల జీవితంలో ఏ ఒక్క రంగాన్నీ ఆయన ఉపేక్షించలేదు ''ఇంచుమించుగా వున్న విషయములయందును సమానముగా వృద్ధినొందుచుండుటయే అభివృద్ధియగును, గాని తక్కిన విషయముల యందధమ దశలు నుంచి విషయమునందు మాత్రము వృద్ధి చెందడం నిజమైన యభివృద్ధి కాదు'' అన్నది ఆయన మతం

ఈ ''అభివృద్ధి'' కోసం పాటుపడడంలో ఆయన రెండు విధాల ''పూర్ణత్వం'' ప్రదర్శించాడు చివరిదాకా ఆయన అభివృద్ధి పొందవలసిన రంగాలను అన్వేషిస్తూనే వచ్చాడు ఆయన వ్యవహారిక భాషావాదాన్ని బలపరచటం ఇందుకు ఉదాహరణ మరొకటి ఏమంటే, తాను చేపట్టిన ప్రతి కృషిని, తన సర్వశక్తులను ధారపోసి కొనసాగించాడు అనేక రంగాలలో ప్రసిద్ధి సాధించిన వారందరికీ అభ్యంతర జీవితమంటూ వుంటుంది వీరేశలింగంగారికి దాదాపు అలాటిది లేనట్టే కనిపిస్తుంది మామూలు సంసార తాపత్రయాలన్నీ ఆయన ఉద్యమంలో లీనమైపోయాయి తన పిల్లల కోసంగాని, డబ్బు పోగుచేయడంకోసం గాని ఆయన సొంత తాపత్రయంగా భావించలేదు ఆంధ్రజాతే ఆయన పిల్లలు, తన సంపాదన అంతా వారి భవిష్యత్తుకే అంకితమయింది ఆంధ్రులకు ఆయన తండ్రే- ఆదర్శమైన తండ్రి కూడాను

ఈ సందర్భంలో ఆయన పూర్ణత్వానికి తోడ్పడిన మరో అంశం కూడా వున్నది జాతిని సంస్కరించడానికి పూనుకొన్న వీరేశలింగం తనను తాను సంస్కరించుకుంటూ వచ్చాడు

ఆయన సాగించిన సంస్కరణోద్యమం సాగాలంటే ఆత్మబలం కావాలి పై వాళ్ళ సపోర్టు కూడా కావాలి తమ విశ్వాసాలలో తనకుగల బలమైన విశ్వాసం అనన్యమైన కార్యదీక్ష, మొండితనం, ధైర్యసాహసాలు ఆయనకు ఆత్మబలం చేకూర్చాయి విద్యార్థులు, సంస్కార హృదయులు ఆయనను బలపరిచారు నాయకుడికి వుండదగిన అన్ని లక్షణాలు వీరేశలింగంలో వుండడం గొప్ప విషయం ఒక నాయకుణ్ణి అనుసరించగోరేవారు ఆ నాయకుడి బలం గుర్తించి తాము బలం పొందుతారు ఎంత మందికైనా బలాన్నివ్వగల శక్తి ఆయనలో వున్నట్లు కనిపిస్తుంది

దేవులపల్లివారు ఒకసారి ''వీరేశలింగం రాక్షసుడు'' అన్నారు అవును అంచనాలకు అందనిది రాక్షసబలమే అందుకే ఆయన తన శత్రువులను హడలగొట్టగలిగారు

వీరేశలింగం అభ్యుదయం కోసం సాగించిన అపారకృషిని గురించి ఇక్కడ వివరించనవసరంలేదు ఈ సావెనీర్ చదివిన వారందరికి ఆ వివరాలు తెలుస్తాయి

ప్రస్తుత సమస్య ఏమిటంటే - ఈ సమస్య సావెనీర్ లోని వ్యాసాలలో తల యెత్తు తున్నది వీరేశలింగం గారి కృషికి పర్యవసానం ఏమిటి? దీని గురించి అభిప్రాయ భేదాలు వున్నాయి

"Veeresalıngam pantulu worked mıracles ın the fıeld of socıal reform partıcularly But ıt wıll be wrong to suppose that thıs was the last word ın the field The efforts of Veeresalıngam pantulu and hıs frıends should not be taken as anythıng more than pıoneerıng and experımental or symbolıc endeavours at best" అన్నారు గొట్టిసుబ్బారావుగారు

''వీరేశలింగంగారే లేకపోతే తెలుగుదేశం ఎంత అధోగతిలో వుండి వుండేదే ఊహించడం కష్టం'' అన్నారు మంత్రి వాసుదేవరావుగారు

''ప్రస్తుతం సమాజంలో వస్తున్న మార్పులను వీరేశలింగంగారి కృషి కోణాల నుంచే మేము కొలవకపోలేదు కాని వచ్చిన మార్పు, జరిగిన చైతన్యం బహు కొద్ది పాటిది మాత్రమే కాదా?'' అని అడ్డుమిల్లి పూర్ణచంద్రరావుగారు అడుగుతున్నారు ''మన స్వాతంత్ర్యోద్యమం ఒక విధంగా సాంఘిక సంస్కరణోద్యమాన్ని నీరుగార్చినదేమోనని అనిపిస్తున్నది'' అని కూడా వారు సంశయించారు

ఇదొక ప్రశ్న వీరేశలింగంగారు చించి చెండాడిన దుష్ట సాంఘికాచారాలలో చాలా భాగం ఈనాడు మరింత తీవ్ర రూపంలో మన ఎదుట వున్నాయి అయితే, ఆయన కృషివృ ధా అయిందనాలా?

ఈ ప్రశ్నకు తారకంగారు ఒక సమాధానం ఇచ్చారు ''సంఘ సంస్కరణకు అంతులేదు సమాజంలో ఎప్పటికప్పుడు ఆచారాలు వెర్రితలలు వేస్తూనే వుంటాయి ఏ మహానుభావుడో వీటిని నిర్మూలించడానికి జన్మిస్తూనే వుంటాడు ''

దీనికి ఒకటే అభ్యంతరం అన్నప్పుడల్లా ఒక వీరేశలింగం జన్మించడు అంతదాకా జాతి రొచ్చులో పొర్లవలసిందేనా?

నాకు ఒకటి తోస్తుంది వీరేశలింగంగారు సంఘ సంస్కరణలను స్వాతంత్ర్యానికి ముందు మెట్టుగా భావించారు తన వంటి సంస్కారి సిగ్గుపడదగిన స్థితిలో వున్న జాతి స్వాతంత్ర్యాన్ని ఎలా జీర్ణించుకుంటుంది? ఇది ఎంతైనా సమర్థనీయం

రెండో సంగతి ఏమంటే, సంస్కర్తలు ప్రారంభించిన దాన్ని రాజకీయవాదులు పూర్తి చెయ్యాలి వీరేశలింగంగారి సంస్కరణోద్యమం కొనసాగినంత వరకు ఆయనకు అధికారుల అండ వుంటూ వచ్చింది ఆయన ప్రారంభించిన సంస్కరణ, సంఘర్షణ రాజకీయ సంఘర్షణ రూపం దాల్చనేలేదు

నేటి రాజకీయ సంఘర్షణ అనివార్యంగా వచ్చిపడింది చివరకు స్వాతంత్ర్యం కూడా వచ్చింది కాని ఈ స్వాతంత్ర్యాన్ని అందిపుచ్చుకున్న వారికి వీరేశలింగంగారి సంస్కృతిలో శతాంశం లేకపోయింది వీరేశలింగం హేతువాది, మూఢభక్తిని, స్వార్థంతో కూడిన ప్రార్థనలను, ధనదాహాన్ని, అధికార దుర్వినియోగాన్ని తీవ్రంగా ద్వేషించిన వాడు, సర్వతోముఖాభివృద్ధి గురించి స్పష్టంగా చెప్పినవాడు, కులతత్వాలనుఖండించిన వాడు

ఈ జాడ్యాలను నిర్మూలించడానికి మన పాలకులు ఎలాంటి కృషి చేయకపోగా, వీటన్నిటినీ పెంపొందించే భౌతిక జీవిత పరిస్థితులను ప్రోత్సహించారు అది వీరేశలింగంగారి తప్పు ఎలా అవుతుంది? అందుచేతనే అడ్డుమిల్లి పూర్ణచంద్రరావుగారన్నట్టు ''విప్లవం, ఒక సాంఘిక విప్లవం, ఒక సాంస్కృతిక విప్లవం, ఒక మానసిక విప్లవం మనకిప్పుడవసరం ఈ విప్లవాలకు పాలకులు ఎంతవరకు సహకరిస్తారు మన పాలకులు ''ప్రయారిటీలు'' జనసామాన్యానికి అర్థం కావు టూరిస్టు హోటళ్ళ నిర్మాణానికి కోట్లకొద్ది ఎందుకు ఖర్చవుతున్నదో ఇళ్లు లేని జనానికి ఏం తెలుస్తుంది? ఏ క్షణాన ఏ రాజకీయ బురఖా తగిలించుకుంటారో తెలియనివాళ్ళకు ఎలా ఓటు వెయ్యాలో చదువుకున్నవాడికి కూడా తెలియదుగదా, మంత్రులు, శాసనసభ్యులు తిరుపతి యాత్రలు చేస్తుంటే వీరేశలింగంగారి ఉపదేశాలు ఎవరు పాటించేటట్టు?

ఇంకొకటి కూడా జరిగింది తెలుగు వాళ్లు వీరేశలింగాన్ని విస్మరించారు ఆయన రచనలన్నీ కాకపోయినా ఆయన ప్రబోధాలన్నీ ప్రతి తెలుగువాడు అనుక్షణం మనసులో వుంచుకుంటే వాటి ప్రభావం మన రాజకీయ జీవితంపైన ఎంతైనా వుండేది అది జరగలేదు

వీరేశలింగంగారి '' ఆత్మకథ'' ప్రచారంలో వున్నట్టు కనబడదు కాని, నార్ల వారు సాహిత్య అకాడమీ వారికి వీరేశలింగం మీద ఒక అద్భుతమైన, క్లుప్తమైన పుస్తకం రాసిపెట్టారు అది తెలుగులో అచ్చువేసి బైబిల్‌లాగ పంచదగిన పుస్తకం ఆ నార్లవారే అంతకన్న సంగ్రహంగా వీరేశలింగం మీద ఇంగ్లీషులో ఒక వ్యాసం రాసి ఈ సావెనీర్‌కు ఇచ్చారు అది వ్యాసాలన్నిటికి మణిపూసలా వున్నది ఆంధ్రులందరు కనీసం ఈ వ్యాసం చదివినా చాలుననిపిస్తుంది

నార్లవారి వ్యాసం తరువాత మరో అరడజను ఇంగ్లీషు వ్యాసాలు, ఒక డజను తెలుగు వ్యాసాలూ, ఒక అరడజను పద్యాలు ఈసూవెనీర్‌లో వున్నాయి వ్యాసాలలో కొంత పునరుక్తి తప్పనిసరి అయినా, సంకలనం చక్కగానే జరిగిందని చెప్పాలి

వీరేశలింగంగారిలాగే టాగోర్‌గారు కూడా దేశానికి సంఘ సంస్కరణ ఎక్కువ అవసరమన్నారన్న సంగతిని ఎస్ బి పి పట్టాభిరామారావుగారు గుర్తు చేస్తూ, స్వాతంత్రోద్యమంలో ''రివైవలిజం'' అంతర్భాగంగా వుండిన సంగతిని ప్రస్తావించారు స్వాతంత్ర్యం వచ్చాక, సంఘ సంస్కరణ లేని ప్రాంతాలలో మతమౌఢ్యం మరింత విస్తరించడం మత ప్రాతిపదికపైన ఏర్పడిన రాజకీయ పార్టీలు బలపరచడం మనకు తెలుసు కొద్ది విషయాలలో సంఘ సంస్కరణోద్యమం స్వాతంత్రోద్యమంతో ఏకీభవించింది పట్టాభిరామారావుగారన్నట్టు గాంధీగారి కన్న చాల ముందే వీరేశలింగంగారు అస్పృశ్యత పైన ధ్వజమెత్తాడు కొంతవరకైనా పరిష్కారం కావడానికి కారణం సంస్కరణోద్యమం అయివుండవచ్చు

స్త్రీల ఉన్నతికి వీరేశలింగం చేసిన కృషి గురించి ఆవుల సాంబశివరావుగారు ప్రస్తావించారు ప్రజలలో వుండే రకరకాల మౌఢ్యాన్ని వీరేశలింగం ఎలా ప్రతిఘటించినదీ మాలకొండయ్యగారు వివరించారు

"With the astonishing means he achieved in all his crusades against our cruel customs, Veeresalingam has proved to the successive generations

that the toleration of any custom which does not stand to reason leads to social anarchy ''

అని వీరేశలింగం జీవితం నుంచి మనం నేర్చుకోదగిన గుణపాఠాన్ని ఒక్క ముక్కలో చాల చక్కగా చెప్పారు మూడు తరాలవాళ్ళు ఈ గుణపాఠాన్ని నేర్చుకోకపోవడం చేతనే ఇవాళ సాంఘిక అవ్యవస్థ పెచ్చుమీరింది

వీరేశలింగంగారి నాటక రచన గురించి కూర్మా వేణుగోపాలస్వామిగారు రాశారు నాటకస్రష్టగా వేణుగోపాలస్వామిగారు మరింత హెచ్చుగా అంచనా వేశారేమో ''శాకుంతలం'' అనువాదం ఒకటే నిజమైన విజయం సాధించినట్టు కనబడుతుంది నాటకాలలో పాత్రోచిత భాష ప్రవేశపెట్టడానికి వీరేశలింగంగారు చేసిన కృషిని కాదనడానికి వీలులేదు అయితే అలాటి భాషను సాధారణంగా హాస్యానికి వాడేవారు నా చిన్నతనంలో ఒక నాటకంలో ఈ సంభాషణ ఉండేది ''అగేయిస్సమ్మ, అని కోర్టు ప్యూను మూడు సార్లు పిలుస్తాడు, '' ఆశమ్మా పిలుస్సున్నారే,'' అంటుంది సాక్ష్యం చెప్పే వితంతువు నాటకం పేరు గుర్తు లేదు కాని, వ్యావహారిక భాషావాదం తల ఎత్తక ముందు వ్రాసిన నాటకమే దాన్ని మా మేనమామలు ఆడారట మా రెండో మేనమామ నాటకాలలో హాస్య పాత్రలు ధరించి, మామూలు భాష మాట్లాడి జనాన్ని నవ్వించే వాడట

వీరేశలింగంగారు అనేక పరువునష్టం దావాలకు గురికావటమూ, నవలలను ధారావాహికంగా అచ్చువేసే విధానం ప్రారంభించటమూ బి వి చలపతిరావుగారు గుర్తు చేశారు

తెలుగు వ్యాసాలలో డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు తమ వ్యాసంలో హెచ్చుగా కవుల చరిత్రలు రాయటంలో గల కష్టాలను పేర్కొన్నారు

అడ్డుమిల్లి పూర్ణచంద్రరావుగారి వ్యాసం ఈనాటి పరిస్థితులను తూర్పారబడుతున్నది ఆనాడు వీరేశలింగం ఒక్కడు సాగించిన కృషి ఈనాడు మేధావులు కనీసం సమష్టిగానైనా సాగించవచ్చునని ఆయన సూచన ఈనాడు దేశంలో ఇంత రాజకీయ చైతన్యం ఉండి సాంఘిక చైతన్యం లేకపోవడం ప్రజా జీవితం పట్ల ఎవరికీ శ్రద్ధ లేకపోవడం చిత్రమే

వీరేశలింగంగారి ''త్రికరణశుద్ధి''ని మెచ్చుకుంటూ డాక్టర్ అక్కిరాజు రమాపతిరావుగారు ''గొప్ప మానవతావాది పంతులు గారు దీనుల పట్ల కరుణతో మనస్సు కరిగిపోగా, చేతగానితనంతో చేతులు ముడుచుకుని కూర్చోలేదు ఒంటరిగా రంగంలోకి దూకి, మహా భయంకరంగా యుద్ధం చేశాడు'' అన్నారు ఈనాడు మానవతావాదులైతే చాలామంది ఉన్నారు వారు మిగిలిన విషయాలలో పంతులుగారిని అనుకరించడానికి సిద్ధంగా లేరు, ప్రారబ్దం!

''పౌరాణికయుగం, ప్రబంధయుగాల నాటి పాండిత్యానికి, రచనా కౌశల్యానికి ఏమాత్రం తీసిపోని ప్రతిభ ప్రకటించి కూడా, ప్రజానీకానికి అందుబాటులో వుండే సరళమైన శైలిలో, తేటతెల్లమైన తెలుగులో రకరకాల జ్ఞానాన్ని, వాఙ్మయాన్ని, ఆంధ్రులకు అందిచ్చాడు'' అన్నారు తారకంగారు

ఒక్క భాషా, వాఙ్మయాల విషయంలోనే కాదు మతాచారాల విషయంలో కూడా వీరేశలింగం అనేక యుగాలు దాటి భవిష్యత్తులోకి అడుగుపెట్టిన అసాధారణ జీవి ఆయన పాండిత్యానికి ఉద్వాసన చెప్పి ''సులభ గ్రాంధికం'' అవలంబించి గిడుగు వారి వ్యావహారిక

భాషావాదానికి రంగాన్ని సిద్ధం చేశారు ఆయన భాషలో తెచ్చిన ఈ మార్పు భాషాతత్వ జ్ఞానం వల్ల వచ్చినది కాదు ప్రజలకూ, సాహిత్యానికీ ఉండవలసిన సాన్నిహిత్యాన్ని పురస్కరించుకుని వచ్చినది ప్రజలకు సన్నిహితం కావటం అభ్యుదయానికి మార్గమని ఇదే రుజువు చేస్తుంది అంతేగాని సిద్ధాంతాలను వల్లెవేసిన మాత్రాన ప్రజలు సన్నిహితులు కారు ''మన దేశాభివృద్ధికిపుడు పని కావలెనుగాని యది లేని పొడి మాటలు కావలసి యుండలేదు '' అని వీరేశలింగం గారే అన్నారు మన దురదృష్టంకొద్దీ ఈనాడు ''పొడిమాటలు'' జాస్తిగానూ పని చాలా తక్కువగానూ ఉండడం జరుగుతున్నది

వీరేశలింగం 122వ జన్మదినోత్సవాలు కాకినాడలోను, రాజమండ్రిలోను జరపడంలో శ్రీ మాలకొండయ్యగారు(తూర్పు గోదావరి కలెక్టరు, జిల్లా మేజిస్ట్రేటు) చాలా ఘనమైన పాత్ర నిర్వహించినట్టు స్పష్టమవుతున్నది ఈ సూవెనీర్ ప్రచురణలో కూడా వారు ప్రముఖ పాత్ర వహించారు

**అక్షర లక్షలు**

మాలకొండయ్యగారు మరో మంచి పని కూడా చేశారు ''వీరేశలింగం సాహిత్య రత్నాలు'' అన్న చిన్న పుస్తకం ప్రచురించారు ఇది జేబులో ఇమిడే పుస్తకం సిగరెట్టు పెట్టెలో మూడో వంతు మందం వున్నది ''వీరేశలింగంగారి పద్య, గద్య రచనలలోను, ప్రసంగాలలోను తులలేని సూక్తి రత్నాలు అనేకం వున్నాయి వాటిలో కొన్ని మచ్చుతునకలు మాత్రం యువ సమాజానికి, నవ సమాజానికి, వీలైనప్పుడల్లా సులభంగా పఠించడానికి, గీతాప్రవచనాలవలె - ఈ చిన్న పుస్తక రూపంలో ఎప్పుడూ తమతోడునే వుండడానికి అనువుగా అందజేస్తున్నాం సంతోషంగా స్వీకరించి, ఉపయోగించమని కోరుతున్నాం'' అని తొలి పలుకులో చెప్పారు

వీరేశలింగం నాస్తిక వాది కాడు కాని ఆయన ఉపాసించే ఈశ్వరుడు నాస్తికులకు రోత కలిగించే దేవుడు కాడు ''మనమీశ్వరుని కోరునది అంతయు నాధ్యాత్మిక లోపములను పోగొట్టుటకును, ఆధ్యాత్మిక సుఖములను, మనోబలమును కలిగించుటకును అయియుండవలెను అంతేకాని మనమైహికమయిన శరీర సుఖముల నిమిత్తమును, ధనము నిమిత్తమును, కీర్తి నిమిత్తమును, ఇతరములయిన ప్రాపంచిక లాభముల నిమిత్తమును ప్రార్థించిన పక్షమున మన మనోరథములెప్పుడును సాఫల్యము నొందవు మన ప్రార్థన ఎప్పుడును పరమాత్ముడేర్పరచిన స్థిరమైన వాస్తు ధర్మములను మార్చజాలవు

ఇది నిరీశ్వరవాది గాని భౌతిక వాది దృక్పథం

''నా బుద్ధి ప్రచారమునకు గోచరము గునంతవరకు పూర్వోత్తరజన్మములు లేవనుకొనుటవలన గలిగెడు నష్టమొక్కటియుగాన రాకున్నది పూర్వజన్మ కర్మలను నమ్మకపోవుట వలన ప్రతి మనుష్యుడును తాను చేసెడు పనులను తానే యుత్తరవాదినని తెలిసికొని మంచి పనులను చేయ బ్రయత్నించును ''

'' ఎలాంటి మూఢునకును భగవంతుని తెలిసికొనుటకయి మూగవిగ్రహము ఆవశ్యకముండునా?''

''పుస్తకముల కంటె మనకు యమూల్యమయినది కాబట్టి సత్యము పుస్తకమునందున్నను మనము దానిని గ్రహించుచుండవలెను ''

''ఒక సద్ధర్మమును ప్రతిష్ఠింప పాటుపడు వారికి వచ్చే కష్టాలనేకములుగా నుండును మనమెవ్వరి క్షేమము నిమిత్తమయి సత్కార్య దీక్షను వహించుచుమో వారే కార్య విఘాతమునకు ప్రయత్నింతురు ''

ఇది గుర్తించే వీరేశలింగంగారు ప్రజలను జ్ఞానవంతులను చేయడానికి తమ శక్తిని చాలా వరకు ధారపోశారు

''మత విషయములయిన నా విశ్వాసములను కొన్నిటిని కార్యములలో జూపక యాత్మవంతుడనయి వితంతు వివాహ సంస్కారము కడచిన ఇరువది అయిదు సంవత్సరముల నుంచి ఈశ్వరించికుడినయి ప్రవర్తించినాడను'' ఆత్మవిమర్శ!

''అభివృద్ధి పొందుటకయి కృషి యావశ్యము జ్ఞానహీనులయి కృషిచేయక యుపేక్షించను వచ్చిన పక్షమున మునుపున్న స్థితియందైన నుండక క్రమక్రమముగా హీన కళను బొందుచు వచ్చి కటకడపట మరల మృగప్రాయులగుట సంభవించును'' వెల లేని హెచ్చరిక!

''తినుటకు కడుపునిండ పుష్కలముగ నన్నము లభించు సాధనములను గల్పించక ధనము నుపయోగించవలసిన మార్గములను వేయిటి నుపదేశించిన పక్షమున అందువలన లేని ప్రయోజనములు కలుగును?'' నిజమే కాని మన దేశంలో తిండి లేని వారికి కూడ వోటున్నది!

ఇలాటి ఎన్నో విషయాలు ఈ చిన్న పుస్తకంలో ఉన్నాయి దీని వెల అర్ధరూపాయి మాత్రమే

వీరేశలింగంగారు పుట్టి 122 యేళ్ళు అయింది పోయి 50 ఏళ్ళు దాటింది కాని ఆయన రచనల అవసరం మనకు ఏమాత్రం తీరలేదు ఆయనను మరచిపోవడం మనకు చాల నష్టం ఈ నష్టాన్ని ఈనాడు మనం అనుభవిస్తూనే ఉన్నాం దేశాభ్యుదయానికి నిజంగా పాటుపడగోరే ఏ రాజకీయ పక్షమూ ఈ ఆంధ్ర మహాపురుషుడ్ని, ఆయన బోధనలనూ విస్మరించరాదు

*ఆంధ్రజ్యోతి దినపత్రిక, 18-10-1970*

# 4. ఉపోద్ఘాతం మారుగా

*(శ్రీ పి వరవరరావుగారికి లేఖ)*

*మద్రాసు, 3-5-75*

కొల్లా వెంకయ్యగారి రచన మొదటినుంచీ తప్పుగాట్లోపడింది ఆయన రాసింది సంస్కృతి గురించే అయినా, సాంస్కృతిక రంగం గురించి ఆయనకు సరిగా అవగాహన లేనట్టు కనబడింది అది చదివి నేను రాసుకున్న నోట్స్ సారాంశం మీకు తెలియజేస్తున్నాను ఇవి కేవలమూ నా అభిప్రాయాలు మాత్రమే వాటిని (చలసాని) ప్రసాద్‌తో గాని, శ్రీశ్రీతో గాని చర్చించే అవకాశం ఇంకా దొరకలేదు

''1 వీరేశలింగం అప్పారావుగార్లు ఫ్యూడల్ ప్రభువుల అండదండలు గల వాళ్ళే జాతీయోద్యమం ప్రభావం వారి మీద అంతగా లేదు వీరేశలింగంగారు మూఢ విశ్వాసాలతో పోరాడినా ఆయిన మూఢవిశ్వాసాలు ఆయనకున్నాయని ఆయన డైరీలు సమీక్షిస్తూ నేను చూపాను సంస్కర్తగా ఆయిన బ్రిటిషు పాలకుల సహాయం పొందాడు జాతీయోద్యమంలో అవాంఛనీయ వ్యక్తులు నాయకులు కావటం చూసి ఆయన జుగుప్సపడ్డాడు (కమ్యూనిస్టు పార్టీ అవతరణలో కూడ చాలా మంది ఇదే సాకుతో కమ్యూనిజాన్ని ప్రతిఘటించారు ) లైబ్రరీలో ఖుదీరాం బోస్ ఫోటో పెట్టించిన వాళ్లు జాతీయోద్యమ చైతన్యం గల వాళ్ళు దాన్ని తీసేయించిన వీరేశలింగం పొత్తిగా లేనివాడు

''2 అప్పారావుగాని, వీరేశలింగంగాని బ్రిటిషువాళ్ళ పరిపాలనలో విశ్వాసం ఉంచిన కాలంలో ఈ దేశంలో వలస విధానాన్ని అర్థం చేసుకున్న వాళ్ళు గట్టిగా ఎందరున్నారో చెప్పటం అసాధ్యం అప్పటి తిరుగుబాట్లన్నీ స్థానికమైనవి బెంగాలు టెర్రరిస్టులతో సహా వాళ్ళు బ్రిటిషువాళ్ళ స్నేహం కోరారంటే గాంధీ చచ్చిందాకా కోరుతూనే ఉన్నాడు ఆయన మన జాతీయోద్యమ పితామహుడు మరి?

''3 'మనిషి చేసిన రాయిరప్పకి మహిమ గలదని (సాగి) మ్రొక్కుతు' అన్న మాటలు విగ్రహారాధన పట్ల తిరుగుబాటును రేకెత్తించడం లేదని వెంకయ్యగారి ఆరోపణ అప్పారావు ఏ తిరుగుబాట్లూ రేకెత్తించలేదు అది రాజకీయవేత్తల పని అనే విమర్శ 'వర్ణ ధర్మము ధర్మంబే? అన్న దానిదీనూ సాహిత్యం పట్ల ఈ దృక్పధం నాకు silly గా కనిపిస్తున్నది ఇంతకన్న silly గా ఉన్నది గిడుగు రామమూర్తిగారి మీది విమర్శ ఆయన 'శిష్టవ్యావహారికం' అన్నాడట గ్రాంధిక భాషావాదాన్ని ఖండించేవాడు ఇంకేమంటాడో నాకు తెలీదు 'అశిష్టులు' రచనలు చేస్తారని ఆయినకు తట్టలేదు ఆయన విప్లవానికి దోహదం చెయ్యలేదన్న ఆక్షేపణ హాస్యాస్పదం వీరేశలింగంగాని, అప్పారావుగాని, గిడుగు గాని, విప్లవానికి దోహదం చెయ్యలేదు ఆ మాట అనటం వేరు వాళ్లు విప్లవానికి ద్రోహం చేశారనటం అర్థం కాని విషయం

''వాళ్ళు తాత్వికులు కారు వాళ్ళ రచనల ప్రభావం ప్రత్యక్షంగా ఈనాడు ఎవరి మీదా లేదు వాళ్ళ పుస్తకాలు కూడా దొరకటం లేదు ఒక్క విషయం కొల్లా వారు విస్మరించారు ఆనాడు గురజాడ లేకపోతే ఈనాడు శ్రీశ్రీ లేడు ఆనాడు ఆధునిక గిడుగు లేకపోతే ఈనాడు ఆధునిక సాహిత్యం లేదు ముక్కుపొడుం పండితులు చిన్నయసూరిని అడ్డంపెట్టుకుని కుళ్లు సాహిత్యాన్ని ఊరేగించే వారు

"Prince of wales" మీద Tagore రాసిన జనగణమణ ఈనాడు మన జాతీయ గీతం! మన సంస్కృతి ఏ అందలాలు ఎక్కిందనీ, దాన్ని గురజాడ, కందుకూరి ప్రభృతులు మోయలేదనీ అనటం పెద్ద ఛాందసం

''4 వీరేశలింగం మీద వచ్చిన తిరుగుబాటును వెంకయ్యగారు పూర్తిగా అర్థం చేసుకోలేదు రచ్చకెక్కిన తిరుగుబాటు వీరేశలింగం అనుయాయుల నుంచి, ఆయన బ్రహ్మసమాజ దృక్పధానికీ, high handedness కూ విరుద్ధంగా వచ్చింది వాళ్ళంతా progreesives కాదు రచ్చకెక్కని తిరుగుబాటు జాతీయోద్యమం నుండి వచ్చింది ఇది సబబైనది

'వేమన చెప్పిన తిరుగుబాటు చాలా గొప్పదనటం fantastic వేమన ప్రజలకు సన్నిహితుడు అప్పటికి మధ్యతరగతి అంటూ లేదు 'కవుల చరిత్ర'లో వీరేశలింగం వేమనను కవిగా గుర్తించలేదు నిజానికి వేమన కవిగా గొప్ప చేయదగిన వాడు కాడు వేమన బలం ఆయన సాంఘిక దృక్పథంలో వున్నది 'కవుల చరిత్ర'లో సాంఘిక దృక్పథాల ప్రసక్తి లేదు వీరేశలింగం కన్న, వేమనను గుర్తించిన బ్రౌన్ మన సంస్కృతికి హెచ్చు సేవ చేశాడనాలా?

'' ఆనాటి రైతాంగపు తిరుగుబాట్లకు వేమన దోహదం చేశాడనటం Conjecture గా కనబడుతుంది ఉత్తరాన ఇంకా హెచ్చు తిరుగుబాట్లు జరిగాయి రైతాంగపు తిరుగుబాట్ల వెనక కొంత సాంస్కృతిక ప్రేరణ ఉన్నదని నాకు తోచలేదు అవి జీవిత సంఘర్షణ నుంచి వచ్చాయనుకుంటున్నాను

5 ఇంగ్లీషు భాషావ్యామోహం మాటకు వస్తే అందుకు ఎవరినీ తప్పుపట్టే అవసరం కనిపించదు దేశాన్ని ఇంగ్లీషే ఏకం చేసింది తిలక్, గాంధీలు ఇంగ్లీషును విసర్జించి జాతీయోద్యమం నడిపివుందురా? ఈనాడు మాత్రం మనం ఇంగ్లీషును వదులుకునే స్థితిలో ఉన్నామా? వీరేశలింగంగాని, గిడుగు రామమూర్తి గాని హిందీ కోసం ప్రచారం చెయ్యకపోవటమా వాళ్ళ తప్పు దేశ భాషలు అడుగంటటానికి వాళ్ళు ఎంతమాత్రమూ కారకులు కారు వాళ్లు తెలుగుభాషకు ఎనలేని సేవ చేశారు దేశభాషగా ఇంగ్లీషు ఉండరాదన్నందుకు వెంకయ్యగారు గురజాడనూ, వీరేశలింగాన్ని తప్పుపట్టుతున్నారు (This sort of lack of Perspective characterises the whole pamphlet )

''వాళ్ళు సృష్టించిన సాహిత్యం అభ్యుదయ నిరోధకమైనదన్న statement చాలా dogmatic గా ఉన్నది కమ్యూనిస్టులు కందుకూరి, గురజాడలను ఆకాశానికెత్తినందుకు ఇవాళ తప్పుపట్టటం కోసమే కావాలి అప్పటికి కమ్యూనిస్టు పార్టీలో విప్లవ భావాలేమీ లేవు దీన్ని చీనాలోని anti-confucianism తో సమం చెయ్యటంలో అర్థం లేదు

''మార్క్సును Marxists గుర్తిస్తారు Loyalist వర్గాల నుంచి మనుషులు వచ్చి Communist Party లో చేరితే వాళ్ళ Past ను గురించి ఎవరూ తప్పుపట్టలేదు కొల్లా వెంకయ్యగారు ఈనాటి దృక్పథంతో ఆనాటి మేధావులను విమర్శించి సాధించేది ఏమీ లేదు వాళ్ళ రచనలు ఈనాటి పురోగతికి అడ్డంగా వున్న సందర్భాలు ఎత్తి చూపటం వల్ల ఎక్కువ ప్రయోజనం ఉండేది

సొసైటీ ఫర్ సోషల్ ఛేంజ్, డిసెంబర్ 1980

# 5. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు

ఆధునికాంధ్ర వాఙ్మయానికి దిగ్గజాలనదగిన నలుగురిలోనూ ఆఖరువారయిన చిలకమర్తివారు అస్తమించారు కందుకూరీ, గురజాడా, గిడుగూ, చిలకమర్తి - ఈ నలుగురూ కలిసి ఆధునిక గద్య సాహిత్యానికి పునాదులు వేశారు వీరిలో గురజాడా, గిడుగూ కలిసి చేసిన కృషి అనంతమయినది వారికి జీవితంతో కల సంబంధం తాత్త్వికమైనది శిష్టవ్యావహారికమే తప్ప వేరే గ్రాంధికం లేదని గిడుగు వారు రుజువు చేశారు గురజాడ వారు శిష్టవ్యావహారికంలో

గద్య పద్య రచనలు చేశారు ఈ ఇద్దరి అనంతరమూ కూడా గ్రాంధికంలో పద్యరచన జరిగింది గిడుగు వారిని అధిష్ఠాన దేవతగా పెట్టుకున్న నవ్యసాహిత్య పరిషత్తు వారే గురజాడవారు పెట్టిన ఒరవడి దిద్దలేదు కాని ఆధునిక సాహిత్యం మటుకు గిడుగువారూ గురజాడవారూ నిర్ణయించిన ఆదర్శాలకేసి నడుస్తున్నది గిడుగు, గురజాడల కృషి ఫలితాలు ఒకనాటికే లభించేవి కావు

కందుకూరి, చిలకమర్తి మరోరకానికి చెందినవారు వారికి జీవితంతో ఉండిన సంబంధం సన్నిహితమైనది - తాత్వికమైనది కాదు జీవితం ఇచ్చిన ప్రేరణలతో ఈ ఇరువురూ సాహిత్యం సృష్టించారు వీరి సాహిత్య సృష్టి చాలా విస్తీర్ణమయినది కాని వ్యావహారిక భాషోద్యమానికి ఈ ఇద్దరూ కూడా క్రియకు ఉపకరించనే లేదు ఆఖరుదశలో కందుకూరి వారు వ్యావహారిక భాషావాదాన్ని ఆమోదించనైనా ఆమోదించారు, చిలకమర్తివారు బొందెలో ప్రాణం ఉండగా దాన్ని ఆమోదించనే లేదు అందుచేత సాహిత్యరంగంలో కందుకూరి రచనలూ, చిలకమర్తి రచనలు తాత్కాలికమైన పరిమిత ప్రయోజనాన్నే సాధించగలిగాయి ఈ వ్యక్తులు జీవించి ఉండగానే వీరి చార్జీ ఇతర రచయితలు పుచ్చుకోవలసి వచ్చింది చిలకమర్తివారి సాహిత్యాన్ని ఈ దృష్టితోటే చూడాలి

సాహిత్యంలో ఒక విప్లవం తీసుకురాకుండానే, అప్పటికి అమలులోవున్న సాహిత్య సంప్రదాయాలనన్నిటినీ ఆమోదిస్తూ చిలకమర్తివారు సాహిత్యానికి ఎంతో సేవ చెయ్యగలిగారు ఆయన నీనాడు మనం కవిగా పరిగణించటంలో అర్థం లేదు చిలకమర్తివారి కాలానికి రచయిత అన్న ప్రతివాడూ ఛందస్సునేర్చి పద్యాలు రాయటం ఒక సంప్రదాయం రాసే పద్యాలలో ''కవిత్వం'' అవసరము లేదు అదీకాక నాటకాలలో పద్యాలుండటం రివాజు (''కన్యాశుల్కం'' మినహాయించెయ్యండి, అది ఈనాడు కూడా భావికి చెందిన నాటకమే ఆధునిక సాహిత్యమంతా కలిసి కన్యాశుల్కం దగ్గిరకే వెళుతున్నది ) ఈ కారణాలచేత చిలకమర్తివారు పద్యాలు రాశారు కాని ఆయన ముఖ్యంగా గద్యరచయిత తెలుగులో నాటకాలూ, నవలలూ, కథలూ విరివిగా రాసి ఆధునిక గద్య సాహిత్యానికాయన చేసిన సేవ అపారమయినది పాండిత్య-కవిత్వ శృంఖలాల నుంచి సాహిత్యం విడిపడటం ప్రజల దగ్గరికి దిగి రావటానికి మొదటిమెట్టు వెంటనే ప్రజలలో చైతన్యం కనిపించింది అంతకుపూర్వం సాహిత్యాభిలాష ఏమీ ఎరగని వారు వేనకువేలు చిలకమర్తివారి రచనలు చదవసాగారు కందుకూరివారి రచనల కంటె ఎంతో అధికంగా చిలకమర్తివారి రచనలు స్త్రీల దగ్గరికీ పిల్లల దగ్గరికీ వెళ్ళాయి ఆయన గయోపాఖ్యానమూ, ప్రసన్న యాదవమూ మొదలైన నాటకాలు లక్షల మంది ఆంధ్రులు ఇంకా చూస్తూనే ఉన్నారు ''అల్లుడారమ్మని'' లాంటి పద్యాలు ఆటవిడుపు పద్యాలుగా పరిణమించాయి ''బలవంత బ్రాహ్మణార్థం'' లాటి ప్రహసనాలు ఎన్నోసార్లు విద్యార్థులు ప్రదర్శించారు ముఖ్యంగా చిలకమర్తివారి ''ప్రహసనాల'' కథలు చదవని ఆంధ్రుడుండడు

చిలకమర్తివారి రచనలు ప్రజాదరం పొందటానికి ప్రత్యక్ష కారణాలు రెండు స్పష్టంగా గోచరిస్తాయి ఆయనలోచక్కని హాస్యం వుంది మాటలను విరవకుండా, ద్వంద్వార్థాలలో వాడకుండా, దుంపనాశనం చెయ్యకుండానే, సున్నితంగా, భావోపేతమైన హాస్యం ఆయనకు అవలీలగా వచ్చేది రెండవది ఆయన శైలి వాడుకభాష వుపయోగించకుండానే

చిలకమర్తివారిలాగా నోటిమాటలు పలికించిన రచయిత మరొకడు లేడని చెప్పవచ్చు అనేకమంది వాడుకభాషలో రాసిన వారు సహితం అంత సుగమమైన, సహజమైనశైలి రాయలేదని చెప్పవచ్చు ఇది చిలకమర్తివారి ప్రత్యేకత ఈయనే వ్యావహారికవాదం ఆమోదించి వున్నట్లయితే ఈయన రచనలు అద్వితీయంగా వుండుననటానికి సందేహం లేదు

చిలకమర్తివారి రచనలు ఎంతవరకు శాశ్వతంగా వుంటాయనేది అనుమానాస్పదమైన విషయం ఈయన కథాప్రహసనాలూ నాటక ప్రహసనాలూ అందరికీ అందుబాటులోవుండదగినవి ఇటీవల అచ్చయిన స్వీయచరిత్ర ఆంధ్రదేశ చరిత్రా సాహిత్యంలో తప్పక చోటు సంపాదించుకుంటుంది కాని సాహిత్యరంగంలో ఈయన శకం అదివరకే అయిపోయింది ఈయన నాటకాలూ, నవలలూ ఈనాడు మనకు గతించిన సాహిత్యానికి స్మృతిచిహ్నాలు మాత్రమే

*ఆంధ్రజ్యోతి మాసపత్రిక, 1 -7- 1946*

# 6. ఆంటన్ చెకోవ్

రష్యా దేశంలో 1917 విప్లవానికి పూర్వం ప్రపంచ ప్రసిద్ధికెక్కిన సాహిత్య సృష్టి చేసిన అనేకమంది రచయితల్లో చెప్పుకోదగినవాడు ఆంటన్‌చెకోవ్ పుష్కిన్, టాల్‌స్టాయ్, డాస్టొవిస్కీ, టర్జెనీవ్, గొగోల్, గోర్కీ మొదలైన రచయితలు పుట్టిన రష్యాలోనే చెకోవ్ కూడా జన్మించాడు ఇతడు గోర్కీ, టాల్‌స్టాయ్‌లకి సమకాలికుడే కాక వారికి దగ్గిర స్నేహితుడుకూడాను

చెకోవ్ 1904లో తన 45వ ఏట చనిపోయాడు తండ్రి చిన్న దుకాణం వర్తకుడు తాత బానిస రైతు చెకోవ్ సాహిత్య ప్రతిభకు చిన్నతనంలో అనేకమైన అడ్డంకులు కలిగాయి ఆకలిబాధల నుంచి సంకుచిత మూఢవిశ్వాసాల సంకెళ్ల వరకూ అతడు ఎన్నో కష్టాలకు గురి లయ్యాడు అయినా అతడు వాటన్నిటినీ అధిగమించి ఉజ్జ్వల కళాశిఖరాల నందుకోగలిగాడు టాల్‌స్టాయ్ వంటి ఉద్దండుడు బ్రతికున్న కాలంలోనే అతన్ని రష్యన్ సారస్వతానికి చక్రవర్తి అని సమకాలికులన్నారు చెకోవ్ కీర్తి అతని కథల మీద, నవలల మీద, అతనికే ప్రత్యేకంగా చెందిన నాటకాల మీద ఆధారపడి వుంది గోర్కీతో కలిసి లతడు మాస్కో ఆర్టు థియేటరులో నాటకాలు ప్రదర్శించేవాడు

చెకోవ్ ఆశావాది రష్యా భవిష్యత్తును అతడు తన రచనల్లో ఉత్తేజకరంగా ఊహించి ఆహ్వానించాడు అతడు తన కాలపు రాజకీయ జీవితంలో ప్రత్యక్షంగా పాల్గొనలేదు కాని జార్ చక్రవర్తి కారాగారాలను, నిరంకుశపీడనను అతడు వర్ణించటం చూస్తే, నిజమైన విప్లవవాది అని గ్రహించగలం ఒకసారి 'అకాడమీ ఆఫ్ సైన్సెస్ ' సంస్థకు ఎన్నిక జరిగినప్పుడు గోర్కీ ఎన్నికను జార్ అక్రమంగా రద్దు చేశాడు ఈ రద్దును నిరసిస్తూ చెకోవ్ తాను ఎన్నుకోబడినప్పటికీ, సభ్యత్వాన్ని కాలదన్ని వద్దన్నాడు

చెకోవ్ 1905లో జరిగిన మొదటి విప్లవానికి ముందే చనిపోయాడు కాని చనిపోయే వరకూ ఎంతో కుతూహలంతో, సంతోషంతో ప్రజాశక్తుల పురోగమనాన్ని గమనించాడు అతడు వ్రాసిన ఆఖరు కథ ''బ్రైడ్''లో అతని బలమైన విప్లవోత్సాహం ప్రతిధ్వనిస్తుంది

చెకోవ్ రచనల్లో అపారమైన దేశ ప్రేమ కనిపిస్తుంది అతని పాత్రలు ఆవేశంతో జార్ నిరంకుశత్వాన్ని ఖండించటం చదివితే మన నెత్తురు ఉడుకెక్కుతుంది రష్యన్ ప్రజల్లోని ఉత్తమ గుణాలన్నీ అతని రచనల్లో స్థానం సంపాదించుకున్నాయి

టాల్‌స్టాయి ఒకసారి చెకోవ్‌తో ఇలాగన్నాడట ''నువ్వు నిజమైన రష్యన్‌వి నీలో రష్యన్‌తనం పరిపూర్ణత చెందింది '' ఇల్లాగని, ప్రేమగా నవ్వి టాల్‌స్టాయి చెకోవ్‌ను కౌగలించుకున్నాట్ట ఈ సంగతిని తరవాత ఎప్పుడో గోర్కీ బయటపెట్టాడు

చెకోవ్ వాస్తవికవాది అతని కథల్లో రష్యన్ జీవితంలోని ప్రతి రంగమూ, ప్రతి తరగతీ, వృత్తి, రష్యాలోని ప్రతి రాష్ట్రమూ వర్ణితమయ్యాయి ఆ కాలంలోని జమీందార్లు, వర్తకులు, విజ్ఞాన శాస్త్రజ్ఞులు, పేద రైతులు, కూలీలు - అందర్నీ పాత్రలుగా స్వీకరించాడు ముఖ్యంగా మనం రోజూ చూసే మామూలు మనుషుల్నే ఎంతో అందంగా తిరిగి కథల్లో సృష్టించాడు

1880-1890 సంవత్సరాలలో రష్యాలో అతి క్రూరమైన నిరంకుశత్వం తాండవం చేసింది చెకోవ్ సునిశిత హృదయం చుట్టూ వున్న దుస్సహవాతావరణానికి మహాక్రోధంతో స్పందించింది నిజమైన మానవత్వంతో కూడిన కొత్త జీవితం కోసం అతడు తహతహలాడిపోయాడు తన కాలంలోని నిర్జీవ సంఘ ధర్మాన్ని నిరసిస్తూ కథలు వ్రాశాడు, ఉజ్వలమైన, విభిన్నమైన భవిష్యత్తును గూర్చి కలలు గంటూ కథలు వ్రాశాడు

చెకోవ్ ఆ భవిష్యత్తులోకి ఎలా చూడగలిగాడు? నీచం, అశుభ్రం, హేయమైన వర్తమానాన్ని అతడంత శక్తివంతంగా ద్వేషించగలగడమే దానికి కారణం అతని రచనల్లో అతని ఉదాత్తమైన మనస్తత్వం, అతని నిగ్రహం, నిరాడంబరత ప్రతిఫలిస్తాయి అందుచేతనే చెకోవ్‌కు సాహిత్య ప్రపంచంలో గల స్థానం అంత అననుగమ్యంగా కనిపిస్తుంది

రాజుల్నీ, వారి సామంతుల్నీ, జలగల వంటి జమీందారుల్ని, అధిమానవత్వాన్ని ఆశించే అహంభావపరుల్ని, ''ఎస్టేట్'' ''ప్రిన్సెస్'' మొదలైన కథల్లో తూర్పారబట్టాడు పెట్టుబడిదారీపరిపాలనం ప్రజలను అన్ని విధాలా నడుములు విరగ్గొట్టి, అధఃపతితుల్ని చేస్తుందని అతడు దృఢంగా నమ్మాడు 'మైలైఫ్' అనే నవలలో ఒక మనిషి మరొక మనిషిని ముడివస్తువుగా వాడుకోవటం, సాంఘిక అసమానత్వంలోని అన్యాయం చాలా గొప్పగా చిత్రించాడు విప్లవానికి ముందటి రష్యన్ గ్రామాల యధార్థపరిస్థితిని గ్రహించాలంటే, అతని ''ముజిక్స్'', ''డిచ్'' అనే కథలు చదవాలి కాయకష్టం చేసే కర్షకుల చీకటి జీవితాలని, అజ్ఞానాన్ని, భూస్వాముల అంతులేని దురాశని అతడు చిత్రించిన విధం చూస్తే అతడు సంఘ పరిస్థితులనెంత విభజనగా, లోతుగా అర్థం చేసుకోగలిగాడో, అతని కళానైపుణ్యం ఎంత నిశితమో బోధపడుతుంది

చెకోవ్ కథల్లోను, నవలలు, నాటకాలలోను 'పండితులను' నిర్దయగా విమర్శిస్తాడు అతని సానుభూతి అంతా మామూలు మనుష్యుల మీద, పేరు లేని స్వార్థత్యాగుల మీద కేంద్రీకృతమైంది తమ పాండిత్యానికీ, తెలివితేటలకు తామే మురిసిపోయే మేధావంతులను, ధనిక తరగతిలోని సోమరులను, తక్కువ తరగతి ప్రజలను వేళాకోళంగా, అణచివేసే భూస్వాములను, సాంఘిక సమస్యలకేసి ఒక్కసారైనా చూడని రష్యన్ రచయితలను అతడు

తన రచనల్లో అతి సూక్ష్మమైన దెబ్బలు తీశాడు అయోనిచ్, గూస్‌బెర్రీ, గ్రామర్ టీచర్ అనే అతని ఉత్తమ కథల్లో సంకుచిత వాదుల మీద ఎంత తీవ్ర విమర్శ చేశాడో కనిపిస్తుంది

ఒక వినూత్న జీవితం ఉదయిస్తున్నదనీ, సంకుచిత విశ్వాసాలు, విధానాలు దాని ముందు నశిస్తాయనీ, నిజమైన మానవత్వం, సౌందర్యం ఉద్భవిస్తాయనీ చెకోవ్ గ్రహించాడు రష్యా భవిష్యత్తులో అతనికి అచంచల విశ్వాసం ఉంది

'' ఒక్కొక్క రోజు గడుస్తుంటే మన విజయం దగ్గిరపడుతున్నట్లు అనిపిస్తున్నది ఆ విజయం చూసేదాకా జీవించాలని, ఆ విజయంలో నేను కూడా పాల్గొనాలని, నా ఆశ '' అని ఒక కథలో ఒక పాత్రచే అనిపిస్తాడు

''సమయం వచ్చింది ఒక మహాశక్తి నేల మీదకు దిగి వస్తోంది శక్తివంతమైన, ఆరోగ్యవంతమైన తుపానొకటి ముంచుకువస్తోంది త్వరలో అది మన సమాజం మీదుగా వీచి మన అలసతని, నిర్లక్ష్యాన్ని, మన నిరుత్సాహాన్ని, అన్నిటినీ తుడిచి పెట్టివేస్తుంది 25, 30 ఏళ్ల తరువాత ఈ దేశంలో ప్రతి మనిషి కష్టపడి పని చేస్తాడు, ప్రతి మనిషి '' అని మరొక కథలో అనిపిస్తాడు

చెకోవ్ సోవియెట్ ప్రజలకి చాల యిష్టుడు లెనిన్ స్టాలిన్‌లు చెకోవ్ రష్యన్ ప్రతిభకు ప్రతినిధి అన్నారు అతని రచనలు ఈ రోజుకీ ఎన్నో ప్రతులు అమ్ముడుపోతూనే వున్నాయి ఇప్పటికీ అతని నాటకాలు విరివిగా ప్రదర్శితమౌతూ ప్రజలకానందం చేకూరుస్తూనే వున్నాయి అతని జీవితం మీద, రచనల మీద, ఇంకా పరిశోధనలు జరుగుతూనే వున్నాయి

ఆంటన్‌చెకోవ్ సాహిత్య ప్రభావం పశ్చిమ యూరప్‌లో కూడా ఒక్క సాహిత్యంలోనే కాక మిగతా రంగాల్లో కూడా గాఢంగా పడింది బెర్నార్డుషా తన 'హార్ట్‌బ్రేక్ హౌస్' అనే నాటకం చెకోవ్ ఆవేశంలో పడి వ్రాసిందేనన్నాడు

**చెకోవ్ సాంఘిక దృక్పథం**

''మీరు భయపడకండి మంచి రోజులు వస్తాయి కొత్త జీవితం ఉదయిస్తుంది సత్యం జయిస్తుంది'' అని ఒక కథలో చెకోవ్ అన్నాడు

ఆ రోజుల్లో కుళ్లిపోయిన సంఘధర్మాల మీద చెకోవ్ తన కథలను కత్తులుగా విసిరాడు 'గూస్ బెర్రీ' అనే కథల్లో ఇట్లా అంటాడు

''తృప్తిగా ఆవులిస్తూ హాయిగా నిద్రపోయే ప్రతి మనిషి యింటి తలుపుల్నీ సమ్మెటతో కొట్టి, అతన్ని లేపి, ప్రపంచంలో దుర్భర జీవితాలతో కృశించి క్రుంగిపోయే జనులున్నారనీ, ఆ మనిషి తనకు తానెంత సుఖంగా వున్నా జీవితం అతన్ని ఎప్పుడో గుప్పిలిలో బిగించి వేస్తుందనీ, ఏదో వ్యాధి, దారిద్ర్యం, ఏదో దుఃఖం అతన్ని ముట్టడించి వేస్తుందనీ, ఇప్పుడు అతనికి మల్లేనే అప్పుడు ప్రపంచం అతనికేసి కన్నెత్తి చూడదనీ, ఎవరన్నా జ్ఞాపకం చేస్తే ఎంత బాగుండును!''

చెకోవ్ అల్లాంటి తృప్తజీవులకు, అలసులకు, స్వార్థ సౌఖ్యాలాలసులకు, సమ్మెట మనిషిలాగా ప్రవర్తించాడు సంఘపీడితులైన శ్రామికుల దుర్భరజీవితాలను, వారి బానిసత్వాన్ని పదేపదే తన కథల్లో చిత్రించాడు మన కర్మ అనుకుని కుమిలిపోయే వారిలో ఉద్రేకాన్ని రెచ్చగొట్టాడు జార్ పరిపాలన మీద విద్వేషం పురికొల్పాడు

దుర్మార్గాన్ని ప్రతిఘటించవద్దని, నైతిక ఔన్నత్యానికి ప్రయత్నించాలనీ, టాల్‌స్టాయి బోధించిన సిద్ధాంతాలను చెకోవ్ తీవ్రంగా ఖండించాడు గూస్ బెర్రీ కథలో ఒక పాత్ర ఇలా గంటాడు ''మనిషికి ఆరడుగుల నేల కంటే ఎక్కువ అక్కర్లేదని కొందరంటారు కాని, ఆరడుగుల నేల కావలసింది మనిషికి కాదు, శవానికి '' (టాల్‌స్టాయి మనిషికి ఆరడుగుల నేల చాలని ఒక కథ వ్రాశాడు )

నగరాల నుంచీ, సంఘర్షణ నుంచీ, జీవితపు హేయత్వాన్నుంచీ పారిపోవడం కాదు మన ఆదర్శం అది స్వార్థపరత, అలసత, మనిషికి కావలసింది ఆరడుగుల నేల కాదు ఒక పల్లెటూరు కాదు, భూగోళమంతా ''ప్రకృతి యావత్తూ, తన మేధాశక్తిని, ఆత్మ గొప్పతనాన్ని ఇముడ్చుకొనే విశ్వమంతా అతనికి కావాలి '' అని ఆ కథలో అంటాడు

శ్రమ వల్ల, ప్రకృతితో పోరాడి జయించటం వల్ల మనిషి పురోగమిస్తాడని చెకోవ్ తన కథల్లో వ్రాశాడు జీవితాన్ని మార్చివెయ్యాలంటాడు చెకోవ్ అతడు విప్లవవాది కాకపోయినా సంఘంలో పూర్తిగా మార్పులు తెస్తేనే గాని భవిష్యత్తు ఉజ్వలం కాజాలదని నమ్మాడు 'మైలైఫ్'' అనే నవలలో ఒక పాత్ర ఇలాగంటాడు ''పోరాటానికి మనం కొత్త మార్గాలు, బలమైన, సాహసోపేతమైన, శీఘ్రమైన మార్గాలు వెతుక్కోవాలి నువ్వు నిజంగా ప్రయోజనకారి కావాలంటే నీ చవకబారు సరిహద్దుల్ని దాటి బయటికి రా ప్రజల్లో తీక్షణావేశాన్ని పురికొల్పు ''

చెర్రీ ఆర్చర్డ్ అనే గొప్ప నాటకంలో జీవితాన్ని కొత్తగా నిర్మించాలన్న చెకోవ్ ఆవేదం కనిపిస్తుంది ''పదండి ముందుకు, దూరంగా, ఉజ్వలంగా ప్రకాశించే నక్షత్రం కేసి పోదాం పదండి రష్యాయావత్తూ మన ఉద్యానవనం'' అంటాడు ఒక పాత్ర

రష్యా దేశపు ప్రకృతి సౌందర్యాన్ని, విశాల మైదానాల్ని, అంతు లేని స్టెప్పీ బయళ్ళని, పర్వతాలని చెకోవ్ తరుచు తన కథల్లో మనోహరంగా వర్ణిస్తాడు

మనిషి ప్రవర్తనకు సత్యం అన్నిటికంటే ఉన్నతాదర్శమని చెకోవ్ విశ్వసిస్తాడు 'మైలైఫ్''లో ఒక పాత్ర ''తీగెలను చీడ తినివేస్తుంది ఇనుమును తుప్పు తినేస్తుంది ఆత్మని అసత్యం తినేస్తుంది'' అంటాడు

చెకోవ్‌కు విశాలమైన సాంఘిక దృక్పథం వుంది మనిషిని మనిషిగా గౌరవించే జీవితం, శ్రమని గౌరవిస్తూ, నిరంకుశత్వాన్ని, బానిసవిధేయతని నిరసించే జీవితం, కొత్త రకం జీవితం ఎప్పుడు వస్తుందా అని చెకోవ్ కలలు కన్నాడు అందుచేతే అతని కళ సోవియెట్ యుగానికి సన్నిహితమైంది ఆ రోజుల్లోని రష్యన్ సమాజంలో సంపూర్ణమైన మార్పు రావాలని ఎంత తీవ్రంగా ఆవేదన పడకపోతే చెకోవ్ ఈ మాటలు వ్రాస్తాడు!

'' ఈ నూత్న, పరిశుభ్ర జీవితం త్వరలో వస్తే ఎంత బాగుండును! అప్పుడు మనిషి భవిష్యత్తులోకి ధైర్యంగా, నమ్మకంగా చూడగలుగుతాడు నిటారుగా నుంచొని తను చేసింది సరియైనదేనని, తన మార్గంలో అడ్డాలు లేవని ఆత్మవిశ్వాసముతో, సగర్వంగా చూస్తాడు ఈ జీవితం ఉదయించటానికి అట్టే కాలం పట్టదు ''

('సోవియట్ లాండ్' నుంచి)

*ఆంధ్రపత్రిక వారపత్రిక, 30-8-1950*

# 7. జార్జి బెర్నార్డ్ షా

దాదాపు ముక్కాలు శతాబ్దం కిందట జార్జి బెర్నార్డ్ షా అనే ఐరిష్ యువకుడు పొట్ట చేతబట్టుకుని ఇంగ్లాండుకు వచ్చినప్పుడు ఆయన అనామకుడు నవంబరు 2న ఆయన 94 ఏళ్ల వృద్ధుగా దేహం చాలించే నాటికి ఈ జార్జి బెర్నార్డ్ షా పేరు ఇంగ్లండు అంతటా మాత్రమే కాక ప్రపంచం నలుమూలలా మారుమోగిపోయి ఉన్నది కనీసం యాభై యేళ్లపాటు ప్రపంచం షాను గురించి విన్నది, అతని రచనలు చదివింది, అతని నాటకాలు చూసింది, అతని భావాలు స్మరించింది మానవ చరిత్రలో ఏ మహాయోధుడి జైత్రయాత్రలూ షా విజయం ముందు నిలబడలేవు

రచయితగా గాని, కళాకారుడిగా గాని, ప్రబోధకుడుగా గాని షాకన్న గొప్ప వ్యక్తులు లేకపోలేదు ఒక ఉదాహరణ లియో టాల్‌స్టాయ్ కాని ప్రచారకుడుగా షాను మించిన రచయిత దాదాపు లేడనే చెప్పవచ్చు అయితే ప్రచారకుడి విజయం అచ్చుగా ప్రచార సామర్ధ్యం మీదనే ఆధారపడదు - ప్రచారం చేసే భావాల మీద కూడా ఆధారపడుతుంది షా తన అపార ప్రచారశక్తికి తోడు ప్రపంచాన్నంతా ఆకర్షించే భావాలనే ప్రచారం చేశాడు ఆ విషయంలో షా గొప్ప విక్రయదారు

బెర్నార్డ్‌షా బుద్ధి వికసించేనాటికి ప్రపంచ పారిశ్రామిక సంస్కృతి సామ్రాజ్యవాదాన్ని కని ప్రపంచ సంఘర్షణకు పునాది వేస్తున్నది ఈ తరుణంలో షా మార్క్స్ సిద్ధాంతాలు తెలుసుకుని పెట్టుబడిదారీ మూలంగా సాంఘిక వ్యవస్థలో కలిగే పరిణామాలను సమగ్రంగా అవగతం చేసుకున్నాడు ఆ పరిజ్ఞానం సహాయంతో షా తన చుట్టూ ఉన్న జీవితాన్ని అతి నిశితమైన విమర్శనాదృష్టితో చూసి దాని మర్మాన్ని బయటపెట్టగలిగాడు అందుచేత షా తన రచనల ద్వారా సంఘాన్ని కొట్టిన దెబ్బలు చాలా సూటిగానూ, ఘాటుగానూ తగిలాయి అనేక లక్షల మంది యువకులూ, మేధావులూ షా భావాల వాత పడ్డారు తమ చుట్టూ ఉన్న సాంఘిక వాతావరణాన్ని వారు షా నుంచి తెలుసుకున్న భావాలతో చక్కగా అర్థం చేసుకోగలిగారు

అయితే బెర్నార్డ్‌షా సంఘ సంస్కర్తగా పని చెయ్యలేదు, కేవలం సంఘ విమర్శకుడిగానే పని చేశాడు రోగాన్ని కనిపెట్టటంలో అత్యద్భుతమైన ప్రావీణ్యం ఉండి కూడా, ఆత్మలాభం కోసం సరియైన చికిత్స చెయ్యటం ఇష్టం లేని వైద్యుడిలాగా బెర్నార్డ్‌షా తాను ప్రచారం చేసే భావాలవెంట సంఘం మార్పు చెందకుండా తగు జాగ్రత్తపడ్డాడు ఈ పని షా ఎట్లా చెయ్యగలిగాడు? సంఘ విమర్శకుడుగా ఉండి సంఘ సంస్కర్త కాకుండా ఉండే పద్ధతి ఏది?

మొదటి సంగతి సంఘంలోని లోపాలను గురించి ప్రపంచం నవ్వేటట్టు షా చేశాడు ఈ నవ్వుచాటున ప్రపంచం తన లోపాలకు ఆవేదన చెందటం కూడా మరిచిపోయింది దేన్ని చూసి నవ్వుతామో దాన్ని మనస్ఫూర్తిగా ద్వేషించలేం

ఇంతకంటే ఎక్కువైన పని షా మరొకటి చేశాడు అదేమిటంటే ప్రపంచానికి ఉద్యమంలో విశ్వాసం లేకుండా చెయ్యటం షా తత్వానికి ప్రజా చైతన్యంతో కూడుకున్న ఉద్యమాలు పనికిరావు సృష్టి పరిణామమే బుద్ధిజనితమైనది డార్విన్‌కు పరిణామం గురించి ఏమీ తెలియదని

దుర్మార్గాన్ని ప్రతిఘటించవద్దని, నైతిక ఔన్నత్యానికి ప్రయత్నించాలనీ, టాల్‌స్టాయి బోధించిన సిద్ధాంతాలను చెకోవ్ తీవ్రంగా ఖండించాడు గూస్ బెర్రీ కథలో ఒక పాత్ర ఇలా గంటాడు ''మనిషికి ఆరడుగుల నేల కంటే ఎక్కువ అక్కర్లేదని కొందరంటారు కాని, ఆరడుగుల నేల కావలసింది మనిషికి కాదు, శవానికి '' (టాల్‌స్టాయి మనిషికి ఆరడుగుల నేల చాలని ఒక కథ వ్రాశాడు )

నగరాల నుంచీ, సంఘర్షణ నుంచీ, జీవితపు హేయత్వాన్నుంచీ పారిపోవడం కాదు మన ఆదర్శం అది స్వార్థపరత, అలసత, మనిషికి కావలసింది ఆరడుగుల నేల కాదు ఒక పల్లెటూరు కాదు, భూగోళమంతా ''ప్రకృతి యావత్తూ, తన మేధాశక్తిని, ఆత్మ గొప్పతనాన్ని ఇముడ్చుకొనే విశ్వమంతా అతనికి కావాలి '' అని ఆ కథలో అంటాడు

శ్రమ వల్ల, ప్రకృతితో పోరాడి జయించటం వల్ల మనిషి పురోగమిస్తాడని చెకోవ్ తన కథల్లో వ్రాశాడు జీవితాన్ని మార్చివెయ్యాలంటాడు చెకోవ్ అతడు విప్లవవాది కాకపోయినా సంఘంలో పూర్తిగా మార్పులు తెస్తేనే గాని భవిష్యత్తు ఉజ్వలం కాజాలదని నమ్మాడు 'మైలైఫ్'' అనే నవలలో ఒక పాత్ర ఇలాగంటాడు ''పోరాటానికి మనం కొత్త మార్గాలు, బలమైన, సాహసోపేతమైన, శీఘ్రమైన మార్గాలు వెతుక్కోవాలి నువ్వు నిజంగా ప్రయోజనకారి కావాలంటే నీ చవకబారు సరిహద్దుల్ని దాటి బయటికి రా ప్రజల్లో తీక్షణావేశాన్ని పురికొల్పు ''

చెర్రీ ఆర్చర్డ్ అనే గొప్ప నాటకంలో జీవితాన్ని కొత్తగా నిర్మించాలన్న చెకోవ్ ఆవేదం కనిపిస్తుంది ''పదండి ముందుకు, దూరంగా, ఉజ్వలంగా ప్రకాశించే నక్షత్రం కేసి పోదాం పదండి రష్యాయావత్తూ మన ఉద్యానవనం'' అంటాడు ఒక పాత్ర

రష్యా దేశపు ప్రకృతి సౌందర్యాన్ని, విశాల మైదానాల్ని, అంతు లేని స్టెప్పీ బయళ్ళని, పర్వతాలని చెకోవ్ తరుచు తన కథల్లో మనోహరంగా వర్ణిస్తాడు

మనిషి ప్రవర్తనకు సత్యం అన్నిటికంటే ఉన్నతాదర్శమని చెకోవ్ విశ్వసిస్తాడు 'మైలైఫ్''లో ఒక పాత్ర ''తీగెలను చీడ తినివేస్తుంది ఇనుమును తుప్పు తినేస్తుంది ఆత్మని అసత్యం తినేస్తుంది'' అంటాడు

చెకోవ్‌కు విశాలమైన సాంఘిక దృక్పథం వుంది మనిషిని మనిషిగా గౌరవించే జీవితం, శ్రమని గౌరవిస్తూ, నిరంకుశత్వాన్ని, బానిసవిధేయతని నిరసించే జీవితం, కొత్త రకం జీవితం ఎప్పుడు వస్తుందా అని చెకోవ్ కలలు కన్నాడు అందుచేతే అతని కళ సోవియెట్ యుగానికి సన్నిహితమైంది ఆ రోజుల్లోని రష్యన్ సమాజంలో సంపూర్ణమైన మార్పు రావాలని ఎంత తీవ్రంగా ఆవేదన పడకపోతే చెకోవ్ ఈ మాటలు వ్రాస్తాడు!

'' ఈ నూత్న, పరిశుభ్ర జీవితం త్వరలో వస్తే ఎంత బాగుండును! అప్పుడు మనిషి భవిష్యత్తులోకి ధైర్యంగా, నమ్మకంగా చూడగలుగుతాడు నిటారుగా నుంచొని తను చేసింది సరియైనదేనని, తన మార్గంలో అడ్డాలు లేవని ఆత్మవిశ్వాసముతో, సగర్వంగా చూస్తాడు ఈ జీవితం ఉదయించటానికి అట్టే కాలం పట్టదు ''

('సోవియట్ లాండ్' నుంచి)

*ఆంధ్రపత్రిక వారపత్రిక, 30-8-1950*

ఎవరైనా విమర్శించవచ్చు ఇది సరి అయిన విమర్శే అయినప్పటికీ సహృదయ విమర్శ కాదు ఎందుచేతనంటే షా క్రియారూపకమైన చైతన్యం తీసుకురాకపోయినా చాలా భావ చైతన్యం తెచ్చాడు ఎన్నో మూఢ విశ్వాసాలనూ, కపట నాటకాలనూ ఆయన తన రచనల ద్వారా బట్టబయలు చేసి రెండు మూడు తరాల వారికి వాటిలో విశ్వాసాన్ని పోగొట్టాడు ఇవాళ బ్రిటిషు సామ్రాజ్యవాదం లేబరు బురఖా వేసుకోవలసిన పరిస్థితిలో ఉన్నదంటే దానికి షా రచనలు ఎంతవరకు కారణమైనా ఆశ్చర్యపడనవసరం లేదు

షా మాదిరిగానే కళను ప్రబోధానికి బలి చేసి అపారంగా మేధావులను ఆకర్షించిన వెల్స్, బెర్నార్డ్‌షా చేసిన దానిలో ఎన్నో వంతైనా చేయలేకపోయినాడు వెల్స్ షా కన్నా శాస్త్రజ్ఞానం మీద ఎక్కువ ఆదరం కనబరిచినప్పటికీ ఆయన జీవితంలో కలగవలసిన పరిణామాన్ని గురించి కేవలం పగటి కలలు మాత్రమే కన్నాడు కాలక్రమాన మేధావులంతా ప్రపంచాన్ని తమ వశం చేసుకుని శ్రామికులందర్నీ భూగర్భంలోకి తరిమి వారు పైకి వచ్చినట్లయితే కాల్చి చంపుతారు, శ్రామికులు మేధావులతో కలిసి జీవించటానికి అయోగ్యులుగా పరిణమిస్తారు ఇది ఒక వెల్స్ కల ఒకడు బాంకులో కొంత డబ్బు పెట్టుకుని రెండు మూడు శతాబ్దాల పాటు నిద్రపోయి లేచి భూమికంతా ఖామందై, ప్రపంచాన్ని దుర్మార్గంగా పరిపాలించే వారందర్నీ నిర్జిస్తాడు ఇది మరొక కల ఒక తోకచుక్క భూమిని స్పృశిస్తుంది ఆ తరవాత మానవుల మనస్తత్వంలో పరిణతి కలిగి వారి మనోమాలిన్యమంతా కడిగేసుకుని ప్రపంచానికి ఆనగింజంత ఉపయోగించలేదు శాకాహారం గురించీ, పరిణామవాదాన్ని గురించీ, మానవాతీతులను గురించీ, జీవశక్తిని గురించి షా ఎన్ని అయోమయ సిద్ధాంతాలు, ప్రచారం చేసినా ఆయన పగటికలలు మాత్రం కనలేదు షాను గురించి లెనిన్, 'ఫేబియనులతో చేరిపోయిన సత్పురుషుడు'', అన్నాడు ఈనాడు మనం షాను గురించి ఇంతకంటె కఠినంగా అనుకోవలసిన అవసరం లేదు సామాన్య ప్రజలలో ఎట్టి భావచైతన్యమూ, జీవిత పరిజ్ఞానమూ లేని మన దేశములో బెర్నార్డ్‌షా లాగా కృతకభావాలనూ, కపట వేషాలనూ, దురాచారాలనూ తీవ్రంగా విమర్శించే రచయితలు ఎంతైనా అవసరం జీవితం తాలూకు వివిధ సమస్యల పట్ల షా చూపించిన ఆసక్తిలో పదో ఎంతు చూపగలిగిన రచయిత ఈనాడు మన సమాజానికి ఎంతైనా మేలు చేకూర్చగలడు షా నుంచి మన రచయితలు నేర్చుకోవలసినది లేకపోలేదు

*ఆంధ్రజ్యోతి మాసపత్రికలోని సంపాదకీయం, డిసెంబరు 1950*

## Engels on Bernard Shaw

" The paradoxical belletrist Shaw - very talented and witty as a belletrist but absolutely useless as an economist and politician, although honest and not a careeriest "

*Engels in his letter to Kautsky*
*4-9-1892*

## Winston Churchill on Bernard Shaw

Few people practise what they preach, and no one less so than Mr Bernard Shaw Few are more capable of having the best of everything both ways His spiritual home is no doubt in Russia, his native land is the Irish Free State, but he lives in comfortable England

He is at once an acquisition capitalist and a sincere communist

*From his book "Great Contemporaries"*
*- 1937 Sept*

## 8. ''గురజాడ'' కథలు - వాటి ప్రత్యేకత

తెలుగు సారస్వతంలో నాటకానికీ, కవిత్వానికీ, కథానికకూ శంకుస్థాపన చేసిన మహా పురుషుడు గురజాడ అప్పారావు నాటకాల మాటా, కవిత్వం మాటా అటుంచి కథా రచనలో గురజాడ సాధించిన కొత్తదనం ఏమిటో, ఆయన కథలలో ఆధునిక లక్షణాలేమేమి ఉన్నాయో చూద్దాం

ఆధునిక యుగానికి పూర్వం మనకుండిన కథలు పాత కాలపు జీవితానికీ, చరిత్రకూ సంబంధించి ఉండేవి ''అనగనగా ఒకరాజు'' సర్వసాధారణమైన కథారంభం ఆ రాజు ఏకాలపువాడు? ఏదేశాన్ని ఏలాడు? ఇత్యాది ప్రశ్నలు పుట్టేవికావు ఆధునిక యుగంలోనే కథ అన్నది వర్తమాన జీవితాన్ని వివరించటం నేర్చుకున్నది ఆధునిక కథలలో పాతకాలపు సంఘటనలకు తావే లేదని కాదు, రాయసం వెంకట శివుడు గారు భద్రాచల గోపన్నగాధ ఆధునిక కథగా రాశారు సురవరం ప్రతాపరెడ్డిగారు దక్షిణ తీరానికి చెందిన ఒక స్థల పురాణగాధను అత్యంత రమ్యమైన కథగా రచించారు అయినప్పటికీ సమకాలిక జీవితాన్ని కథలలో చిత్రించటం స్పష్టంగా ఆధునిక యుగ లక్షణం ఈ లక్షణం అప్పారావు గారి కథలలో కనిపిస్తుంది ఆయన కథల తొలి వాక్యాలు చూడండి ''పురాణములను గురించి మేము శంకలు వేస్తే, మా గురువుగారు 'వెధవ చదువు మీ మతులు పోతున్నాయి మీరు వొట్టి బౌద్ధులు'' అనేవారు'' (''మీ పేరేమిటి'') 'తలుపు! తలుపు! (''దిద్దుబాటు'') 'నేను వృక్షశాస్త్రము యమ్ యే పరీక్షకు చదువుతూ ఉండే రోజులలో మైలాపురి పెద్ద రోడ్డున ఒక మిద్దెయింట్లో బసచేసి వుంటిని'' (మెటిల్డా'')

ఆధునికత యొక్క మరొక ప్రత్యేక లక్షణం వాస్తవికత పూర్వకాలపు కథలలో కథానాయకుడికి గండభేరుండ పక్షుల భాష తెలిసి ఉండవచ్చు కాని ఈ కాలపు కథలలో అసాధారణ శక్తులూ, మహిమలూ, ప్రజ్ఞలూ గలవాళ్ళకు స్థానం లేదు ఈ పాత్రలు పాఠకుడికి వాస్తవ వ్యక్తులుగా ఉండాలి వారి అనుభవాలు లోకవిరుద్ధంగా ఉండరాదు నిజానికి వాస్తవికత అనే లక్షణం సమకాలీనతను ఆశ్రయించుకున్నదే అపూర్వమైన, అద్భుతమైన వ్యక్తుల ఆసాధారణమైన అనుభవాలను కథగా రాయదలిస్తే వారిని గతంలోనే ఉండనివ్వటం మంచిది అప్పారావుగారి కథలలో వాస్తవికత నూటికి నూరుపాళ్లు మనకు కనిపిస్తుంది

ఈ వాస్తవికత గురించి అప్పారావుగారికి గల పట్టుదలకు ఒక చక్కని ఉదాహరణ మనకు ఆయన కథలోనే కనబడుతుంది "మీరేమిటి?" అన్న కథలో శాయన్నభుక్తకృష్ణమాచార్యుల భార్య అయిన నాంచారమ్మకు ఆంధ్ర గీర్వాణాలందు మంచి జ్ఞానం ఉన్నదనీ, పురాణం ఆ యిల్లాలు చదివినంత శ్రావ్యంగానూ, రసవంతంగానూ యెవరూ చదవజాలు" అనీ "రూపమూ రూపానికి సదృశ్యమైన గుణ సంపత్తీ" కలదనీ చెప్పగానే శ్రోతలలో ఒకడైన వెంకయ్య చప్పున అడ్డొచ్చి, " ఇది కవిత్వమా, నిజమా" అని అడిగేస్తాడు నిజానికి నాంచారమ్మ ప్రబంధనాయికలతో పోలిస్తే అసాధారణ వ్యక్తి కానేకాదు కాని ఆధునిక శ్రోతకు ప్రతినిధి అయినవెంకయ్య అప్పుడే శంకచేస్తాడు అప్పారావుగారి వాస్తవిక దృష్టికి ఇది మంచి ఉదాహరణ

పాత్రలూ, సన్నివేశాలూ వాస్తవికంగా ఉండాలంటే పాత్రల మనస్తత్వ చిత్రణ స్వాభావికంగా ఉండాలని వేరే చెప్పనవసరం లేదు దురదృష్టవశాత్తూ ఆధునికులు రాసే సామాజిక కథలలో కూడా పాత్రలకు - ముఖ్యంగా నాయకా నాయకులకు - కొన్ని ఆదర్శలక్షణాలు అంటగట్టి, ఆ పాత్రలు నలుగురికీ గుణవంతంగానూ, ఆదర్శంగానూ ఉండేలాగ చెయ్యాలన్న వైఖరి అప్పుడప్పుడూ కనిపిస్తుంది ముఖ్యంగా సంఘ దురన్యాయాలకు గురి అయే పాత్రలను చిత్రించేటప్పుడు కథకులు పాఠకుల సానుభూతిని ఆ పాత్రలపైకి మళ్ళించటానికి ఆ పాత్రలను తోమిన చెంబుల్లాగ తయారు చేస్తారు ఇటువంటి ధోరణి అప్పారావుగారి కథల్లో మచ్చుకూడా కనపడదు ఆయన కథలలో నాయిక అనే పదానికి అర్హురాలై ఒక ఘనమైన పనిచేసిన నాంచారమ్మను కూడా మామూలు మనిషిని చెయ్యకుండా అప్పారావుగారు విడిచిపెట్టలేదు చూడండి "కష్టసాధ్యమును సాధించిన నాంచారమ్మ కరదీపం తిరిగి చేతబూని, యింటికి సవిలాసముగా నడిచిపోవుచుండగా, పెనిమిటి యెదురైనప్పుడు ఆమె ప్రేమ పరిహాసములు పెనుగొను దృష్టిలో చూచెను ఆ దృష్టి తనకు దేవత్వమిచ్చి తన్ను అవతార పురుషుణ్ణి చేసిందని కృష్ణమాచారి మర్నాడు నాతో చెప్పి ఆ అర్థంతో శ్లోకం రచించాడు " ఈ కృష్ణమాచారి ధీరుడైనా కాడు, పెచ్చుమీరిపోతున్న సాతాని వైష్ణములను తన భార్య ఒంటరిగా ఎదుర్కొని వారి వెర్రికి విరుగుడు చేస్తుంటే అటక ఎక్కి దాక్కున్న దద్దమ్మ!

"దిద్దుబాటు" లో నాయికుడు గోపాలరావు సంస్కారి, ఆత్మ విమర్శన చేసుకోగలవాడు "భగవంతుడి సృష్టిలోకెల్లా ఉత్కృష్టమైన వస్తువ విద్య నేర్చిన స్త్రీరత్నమే"నని మనస్ఫూర్తిగా నమ్మినవాడు యాంటినాచ్, భార్య పట్ల అపార గౌరవాభిమానాలు కలవాడు అయినా అతని బుద్ధి సానివాళ్ళ పాటలమీదా, మళ్ళీ మాట్లాడితే సానివాళ్ళ మీదా లగ్నం అవుతూండటంవల్ల అర్ధరాత్రి ఒంటిగంటకు ఇల్లు చేరుకుంటూ పశ్చాత్తాప పడతాడు "రేపటి నుంచి మరి పాటకు వెళ్ళను, నిశ్చియం, నిశ్చయం" అనుకుంటాడు కాని ఇవాళ మాటేమిటి? భార్య ఎదుట పడి తన తప్పు ఒప్పుకుని ఆమెకు క్షమాపణ చెప్పుకుంటాడా? ఉహుఁ! "గట్టిగా పిలిచితే కమలిని లేవగలదు మెల్లిగా తలుపుతట్టి రాముడిని లేపగలిగితినా చడిలేకుండా పక్కజేరి పెద్దమనిషి వేషము వెయ్యవచ్చును," అనుకుంటాడు, తన భార్య కమలిని కనబడక బోయే సరికి రాముణ్ణి రెండు గుద్దులు అకారణంగా గుద్దుతాడు ఈ సంగతి తన భార్యకు తెలిస్తే తనను గురించి తక్కువగా అనుకుంటుందని రాముడితో "దెబ్బలమాటమరిచిపో,

శైలికూడా ఆయన ఎక్కువ లక్ష్యం చెయ్యరని నా అనుమానం అనేక చోట్ల ఆయన వాక్యాలను కొద్ది మార్పులతో బాగు చెయవచ్చుననిపిస్తుంది కాని ఆయన భాషలోవున్న విశేషం ఏమిటంటే, ఆయన చెప్పదలచుకున్న విషయాన్ని ఏదో విధంగా పారకుడి బుర్రకు ఎక్కేటట్టు చెప్పితీరుతారు ఆ తరువాత కథాఘట్టం యొక్క ''మూడ్'' (Mood) అనుసరించి అక్కడక్కడి వర్ణనలల్లో ఆయనకు మాటలు దొర్లివస్తయి ఇది దాదాపు ''జీనియస్'' ఈ జీనియస్ అనేకమంది కవులకు కూడా ఉన్నట్టు కనిపించదు

*భారతి, ఆగస్టు 1937*
*పునర్ముద్రణ ''సాహిత్య ప్రయోజనం''*
*విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, అక్టోబరు 1969*

# 18. రసమయ జీవి

అభ్యుదయ రచయితలు కొందరు చెప్పేమాటలు వింటే ప్రపంచంలో కార్మికులూ కర్షకులూ తప్ప ఇంకెవ్వరూ లేరనీ, వీళ్ళను గురించి రాసేదే సాహిత్యమనీ అభిప్రాయం కలుగుతుంది

నిజం ఆలోచిస్తే ఈ కార్మిక కర్షకులు మన దేశంలో నూటికి ఎనభైమందే ఉన్నారు అదీ కాక వీళ్ళదగ్గిరికి వెళితే కంపు అదిన్నీ కాక వీళ్ళకి చదువు సందెలు లేవు అది కూడా కాక వీళ్ళు కాయ కష్టం చేస్తారు ఇస్త్రీగుడ్డలూ, సిల్కులూ వేసుకోరు, మేడల్లో నివసించరు కళలు గురించి మాట్లాడరు, వేదాంతం మాట్లాడరు, పిల్లి జపం చెయ్యరు

ఒక్క ముక్కలో చెప్పాలంటే కార్మిక కర్షకులు రసమయజీవులు కారు

అసలు రసమయజీవులే మనం తెలుసుకోదగిన వాళ్లు వీళ్లు నూటికి ఇరవై మంది ఉన్నారనుకోవటం పొరపాటు వీళ్ళు పదివేలలో ఒకడు చొప్పునే ఉంటారు మిగిలిన మన బోటి వాళ్ళం కార్మిక కర్షకులమూ కాము, రసమయ జీవులమూ కాము మనం అనామకులం మన దృష్టిని అభ్యుదయవాదులు కార్మిక కర్షకులమీదికి తిప్పాలని ప్రయత్నిస్తే రసమయజీవులు తమవేపు తిప్పుకోవటానికి ప్రయత్నిస్తారు మనం ప్రస్తుతం అభ్యుదయవాదులను తోసేసి ఈ రసమయజీవులచేతనే ఆకర్షించబడాలి

ఈ రసమయ జీవులు - వీళ్ళని ముచ్చటగా ఇంగ్లీషులో elegant souls అంటారు - సరుకులు ఉత్పత్తి చెయ్యరు వాడుకుంటారు అంతే సరుకులు స్వాధీనం కావాలంటే ఏదో విధమైన సంఘ చాకిరి చేసి జీతం డబ్బులు పుచ్చుకోవాలి, లేదా సంఘదోపిడి చెయ్యాలి వీళ్ళు ఈ రెండు పనులూ చెయ్యరు కూలి చెయ్యటమూ, ఉద్యోగం చెయ్యటమూ వీళ్ళకెంత అసహ్యమో, పెట్టుబడిద్వారా శ్రామికుల్ని దోచటంకూడా అంత అసహ్యమే రెండూ వీరి దృష్టిలో శ్రమతో కూడుకున్న పనులే వీరు వ్యంగ్యంగా ప్రచారం చేసే ఈ అభిప్రాయాన్ని శ్రామికులు హర్షించక పోవచ్చుగాని పెట్టుబడిదార్లు హర్షిస్తారు కారణం ఏమిటి? పెట్టుబడిదార్లు కూడా కష్టపడి పని చేసేవాళ్ళేననే అభిప్రాయం ప్రచారం కావటం వాళ్ళకభ్యంతరం లేదు

తాము ధనికవర్గంవేపు ఉన్న సంగతి రసమయ జీవులకు తెలుసు ఎందుచేతనంటే వాళ్ళు ఏదో స్వరూపంలో సంస్కారాన్ని డబ్బుతో ముడి పెట్టి తీరుతారు ఖరీదైన వస్తువులలో వారికెక్కువ ప్రయోజనం కనిపిస్తుంది వాళ్లకు నచ్చిన పుస్తకం చౌకలో దొరికితే తల్లడిల్లిపోతారు అది అందరూ కొని చదివేస్తారేమో అని వారి బెంగ

అయితే మనకొక సందేహం కలుతుంది! ఖరీదైన పుస్తకాలలోనే విజ్ఞానం ఉందనుకునే వారికి చౌక పుస్తకాలు నచ్చటం ఎట్లా జరుగుతుంది? దురదృష్టవశాత్తూ జరుగుతుంది ఎందుచేతనంటే, వీ రే సిద్ధాంతాలను పట్టుకు వేళ్ళాడతారో ఆ సిద్ధాంతాలకు వీరే తప్ప మరో ఆధారం లేక మధ్య మధ్య అవే వీరిని పట్టుకు వేళ్ళాడటానికి ప్రయత్నిస్తాయి

తమ సొంత సిద్ధాంతాలనే గాక శాస్త్రజ్ఞులు సేకరించిన విజ్ఞానాన్ని కూడా వీరు ఈ విధంగానే ఉపయోగించుకుంటారు శాస్త్ర విజ్ఞానానికి నిజమైన ఆధారం ఏమిటి? నిరూపణశక్తి అంటే ఒక శాస్త్రసిద్ధాంతం తీసుకుంటే దానిద్వారా అనేక ప్రకృతి ప్రవృత్తులు నిరూపించవచ్చు అయోమయంగా, అగమ్యగోచరంగా ఉన్న ప్రాకృతిక జగత్తు, శాస్త్రవిజ్ఞానంవల్ల భావనాశక్తికి అందుబాటులోకి రావటమే గాక భావనకు లొంగి పోయి మనిషికి ప్రయోజనకారి అయింది భయోత్పాతాన్ని కలిగించే పిడుగు ట్రాములూ యంత్రాలు నడుపుతున్నది దీపాలు వెలిగిస్తున్నది వరదలు వచ్చి ఊళ్ళు ముంచేసే నదులు సాగుబడికి సాధనాలుగా ఉన్నై ఎందుకూ పనికి రాని ఇసకనుంచి రకరకాల గాజుసామాలును తయారవుతున్నై ఒక నాడు గుహల్లో తలదాచుకుని, చెట్టు బెరళ్లూ, చర్మాలూ వొంటిమీద కప్పుకుని, రాతిబాణాలతో ఆహారాన్ని వేటాడటం తప్ప ఇంకో వ్యాపకానికి వ్యవధి లేకుండా, నలభైసంవత్సరాలు పూర్ణాయుర్దాయంగా జీవించిన మానవుడు శాస్త్రవిజ్ఞానం ద్వారా గగన సౌధాలూ (sky scrapers) రైళ్ళూ, విమానాలు, ఓడలూ, రేడియో, విద్యుత్తు బ్రహ్మాండమైన ఉత్పత్తి సాధనాలూ, అచ్చు యంత్రాలూ నిర్మించటం నేర్చుకున్నాడు అప్పుడే ఈ నాడు దోపిడివిధానం సాగించి తన స్వార్థం నిలబెట్టుకోవడానికి భీకరమైన మారణ యంత్రాలు నిర్మించటం నేర్చుకున్నాడు ఆ మానవుడే ఈ నాడు తన కంపు చూసి తానే అసహ్యించుకోవటమూ, తన అంతరాత్మను పరీక్షించి వెర్రెత్తిపోవటమూ నేర్చుకుని రసమయంగా కూడా తయారయినాడు

అయితే ఈ రసమయజీవికి శాస్త్రజ్ఞానం గురించి అభిప్రాయమేమిటి? సామాన్య మానవుణ్ణి పోషించటానికి ఇతను శాస్త్ర జ్ఞానాన్ని వినియోగపరుస్తాడు కాని శాస్త్రజ్ఞానానికి జీవితాన్ని చూపించే శక్తి ఉంది, ఆ శక్తి ఇతనికవసరం లేదు జీవితరహస్యం ఏమిటని శాస్త్ర జ్ఞుల్ని అడక్కండి - శాస్త్రజ్ఞులు కూడా శ్రామికులే! మరి ఆ రహస్యం ఎట్లా తెలుస్తుంది మనకు? అందరికీ అది ఎన్నటికీ తెలీదు దానికి రసమయజీవి కావాలి అప్పటికి తెలీదు ఎందుచేతనంటే మనలో ఏమీ లేదు అంతా భగవంతుడే ! ఆ భగవంతుడే మనని నవ్విస్తాడు, ఏడిపిస్తాడు మనచేత వెధవ పన్లన్నీ చేయిస్తాడు మనకు కార్మిక కర్షక యువతుల మీద బుద్ధి పోయేట్టు చేస్తాడు ఆ భగవంతుడి మీద ప్రపంచాన్ని నడిపెయ్యడం చెయ్యక జీవితాన్ని మనంతట మనం ఒక్కొక దృష్టితో అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తే శాస్త్రజ్ఞుడో, కమ్యూనిస్టో కాక తప్పదు అది రసమయజీవిత సూత్రాలకి విరుద్ధం భౌతిక వాదులు జీవితాన్ని మార్చలేరు ఒకవేళ మార్చినా జీవనాశనం చేస్తారు రష్యా వంటి దేశంలో అందరూ పని చేసి, అందరూ తిండి

తింటూ, అందరూ చదువుసంధ్యలు కలిగి, దేశాన్ని రక్షించుకోవటానికీ స్త్రీలు పురుషులూ పిల్లలూ కూడా తుపాకులు తీసుకుని ఎగబడుతూంటే, అదేం రసమయి జీవితం?

యదార్థ జీవిత సమస్యలను గురించి రసమయ జీవి ఏం చెబుతాడు? దరిద్రమూ ఆకలీ క్షుద్ర సమస్యలు ఎందుకంటే అవి రసమయజీవుల్ని బాధించేవి కావు అవి తాత్కాలిక సమస్యలు ఏమంటే ఆకలితో బాధపడేవాడెంత కాలం బతుకుతాడు? ఇవాళ కాకపోతే రేపైనా చస్తాడు ఇక తెగని సమస్య, శాశ్వత సమస్య, ఏది? భౌతికమైన ఆధారం లేని నిరుపయోగమైన సిద్ధాంతాలను పట్టుకుని వాటిమీద మన బరువంతా వేసి అవి మనమీదికెక్కి వాటి బరువు మనమీద వెయ్యకుండా చూసుకుంటూ ఉండటం, ఎక్కాల పుస్తకం వంటి సుగమమైన జీవిత విషయాలను గురించి సహితం అయోమయంగా చర్చించటం, తెలిసేటట్టు మాట్లాడేవాడికన్న అర్థం కాకుండా మాట్లాడేవాడే జనాన్ని అధికంగా ఆకర్షిస్తాడు - వాడు కథకుడయేది, కవి అయేది, అతి వాస్తవికుడయేది

ఈ కొద్ది జాగాలో రసమయజీవిని సమగ్రంగా చిత్రించటం సాహసమే రసమయజీవి పరిచయం చేసుకోగోరిన వారు చలంగారి ఉత్తరాలూ, మ్యూజింగ్సూ చదవాలి ఆంధ్ర దేశంలో చలాన్ని మించిన రసమయజీవి లేడనటం అతిశయోక్తి కాదు

*ఆనందవాణి, వారపత్రిక, 8-6-1947*

# 19. ఒంటరివాడుగా జీవించిన చలం

కళాకారులు ఒకంతట మరణించరు అందులోనూ రచయిత తన రచనలు బతికున్నంత కాలమూ బతికుంటాడు చలం తన రచనా జీవితాన్ని కొంతకాలంగా సంక్షేపించుకున్న కారణంచేత ఆయన భౌతిక మరణానికి ప్రత్యేకమైన విలువ ఏమీ లేదు ఆయన మృతికి ఇవాళ సంతాపం వెలిబుచ్చే వారందరూ భౌతికంగా ఆయనకు చాలా దూరంగా వుంటున్నవాళ్ళే

చలం రచనలు బతికున్నాయి, చలంతోపాటే చలాన్ని చూచి రచనలు ప్రారంభించిన వారి రచనలు ఏనాడో కాలగర్భంలో కలిసిపోయాయి కాని చలం రచనలు ఒకటికి రెండుసార్లు సమగ్రంగా ప్రచురించబడటమేగాక, పాఠకులు వాటిని చదువుతున్నారు

ఆ రచనలను ఆకాశానికెత్తినవారున్నారు చలం సాహిత్యాన్ని 'శవసాహిత్యం' అన్నవారున్నారు రెండు అభిప్రాయాలకు ఆధారాలు చలం రచనల్లో వున్నాయనుకోవాలి

ఆ రచనలలో జీవితం మీద రోతపుట్టి ఏకాంతవాసం చేసే వాడి లక్షణాలు కొన్ని వున్నాయి అవి సమాజం మీద శాపాలు అందులో దీవెనలు లేవు తన వ్యక్తిగత సంస్కృతిని అవమానించిన మేరకు చలం సమాజాన్ని దుమ్మెత్తిపోశాడు సమాజంలోని కుసంస్కారానికి కూడా ఏవో భౌతికాధారాలు వుంటాయన్నది చలం పట్టించుకోలేదు '' ఏం చేస్తే ఈ సమాజం నాకు నచ్చుతుంది!'' అని ఆయన తనను తాను ప్రశ్నించుకోలేదు సమాజం బురదలో పొర్లి వచ్చిన గొడ్డు అని, తాను దగ్గరకి పోతే తన మీద బురద విసురుతుందని భయపడ్డాడు చలంలాంటి సంస్కారం గల వారందరికి చలం సమాజానికి పెట్టిన శాపనార్థాలు బ్రహ్మాండమయిన సంతృప్తినిచ్చాయి

**మారని సంఘం**

సమాజాన్ని నిజంగా సంస్కరించే వుద్దేశం చలానికి లేకపోయినా ఆయనది ఆకాలపు సంస్కర్తల బాణీయే సంస్కర్తల ప్రచారాలలో వుండే లోపాలు చలం రచనలలోనూ ఉన్నాయి ఆయనచేత తిట్లు తిన్న సామాజిక మాయరోగాలన్నీ సుఖంగా వున్నాయి కొన్ని చిలవలు పలవలు కూడా వేశాయి

ఇంకో దృష్టి నుంచి కూడా చలం రచనలు చాలా వుదాత్తంగా వున్నట్లు కనిపిస్తాయి ఈనాడు రాజకీయ నాయకులను సైతం తమ వ్యూహంలోకి దింపేసిన సినిమా సంస్కృతితో పోల్చితే చలం రచనలలోని సంస్కృతి ఆకాశం ఎత్తు ఇంకో ప్రక్క గాంధీ భక్తులు ప్రచారం చేసే నీతి నియమాలతో పోల్చితే చలం రచనలలో కనిపించే విశృంఖలత చాలా ఆరోగ్యమైనదనిపిస్తుంది

సినిమా సంస్కృతికి చలం రచనలలోని సంస్కృతికి ఏదన్నా పోలిక చూపాలంటే అది సెక్స్ విషయంలోనే, కాని చలం రచనలలోని సెక్స్ సినిమాలో దానికన్న వుదాత్తం అనిపిస్తుంది జంతువుల మైధునం లాంటిది సినిమాలలో వుంది కాని చలం రచనలలో లేదు అచ్చుగా సెక్స్ కోసమే బతికినట్లుగా కనపడే జంట కూడా ''మైదానం''లో మనుషులకు దూరంగా చేరింది గాని, ప్రఖ్యాత తమిళ దర్శకుడు సేతుమాధవన్ తీసిన ''కన్యాకుమారి''లో ఒకడు ఒక ఆడదాన్ని ఇంకో మగవాడు చూస్తుండగానే ''రేప్'' చెయ్యటానికై యత్నించటం లాంటి అసభ్యత చలం రచనలలో లేదు చలం పాత్రలు ''రేప్'' చేయవు జంతువులు కూడా చెయ్యవు - కాని చెయ్యటానికి ప్రయత్నిస్తాయి మనకు నచ్చినా నచ్చకపోయినా చలం తన రచనలలో సమర్ధించే పాత్రలు జంతువులు మటుకు కావు

**కవితా హృదయం**

వ్యక్తిగా చలం కవి కవిత్వం కోసం బతికినంతగా కవిత్వాన్ని ప్రేమించాడు కవిత్వం చలం కంట నీరు తెప్పించటం నేనెరుగుదును ఇతర మనుష్యులలో వుండే దౌర్బల్యాలు చలంలో వుండి వుండవచ్చు కాని అనేక విషయాలలో ఆయన విశిష్టవ్యక్తి ఆయన కీర్తి కోసం తానయి పాటుపడలేదు ఏ సాహిత్య ఉద్యమంలోనూ చేరలేదు సాహితీ సమితిని ''మ్యూచువల్ అడ్మిరేషన్ సొసైటీ'' అన్నాడు కాని కీర్తి తనను వెతుక్కుంటూ వస్తే దాన్ని పరీక్షించకుండా కావలించుకున్నాడు అప్పుడప్పుడూ కనువిప్పు కలిగేది

''నన్ను మెచ్చుకునేవాళ్ళంతా నా రచనలు అర్థం చేసుకున్నారని భ్రమపడ్డాను!'', అన్నాడాయన ఒకసారి

ఒంటరితనం, బహుకొద్దిమంది స్నేహితులు, బంధువులతోనైనా గాఢమైన సంబంధాలు లేవు ఒంటరితనం ఆయన చుట్టూ వున్న వారికి కూడా సోకిందేమో అనుకుంటాను అదే ఆయనను రమణాశ్రమం చేర్చింది చివరకు ఒంటరితనం పరాకాష్ఠకు వచ్చి, ఆయన రజనితో ఇంటర్వ్యూలో, '' ఈ చలం నన్ను వదలకుండా ఉన్నాడు!'' అని విసుక్కున్నాడు

చలం ఎంత ఒంటరివాడో చలం రచనలు అంతగా జనాదరణ పొందాయి చిత్రం

*ముద్రణ ఆంధ్రజ్యోతి దినపత్రిక, 13-5-1979*

*పునర్ముద్రణ 1 సృజన మాసపత్రిక, జూన్ 1979 2 కళలు - శాస్త్రీయ విజ్ఞానం విరసం ప్రచురణ, సెప్టెంబరు 1980*

# 20. పాపం, శ్రీశ్రీ!

ఈ మధ్య రేడియోలో ''పిచ్చివాళ్ళ పంచాయతీ'' అనే నాటిక ప్రసారము అయింది ఈ విషయం శ్రీశ్రీకి తెలియదు కాని రూపవాణి, ఢంకా పత్రికల్లో నడిచే రేడియో విమర్శల మధ్యని ఈ సంగతి కూడా అతనికి తెలియదు అందులో ప్రత్యేకించి ఢంకా పత్రికలో శ్రీశ్రీ కూడా రేడియోకి అమ్ముడుపోయినట్టు రాసిన తరువాత వొట్టి అభూతకల్పన అని రుజువు చెయ్యటానికి ''పాపం, రేడియో'' అనే కరుణామయ శీర్షిక 12-10-47లో ''నవోదయ'' వ్రాసి ప్రచురించింది ఏమిటి అవి? -

1 విమర్శించే పత్రికల నోళ్ళు మంచిగా వుండాలి ఆ చేసే విమర్శనే మరింత మృదువుగా చేసి ఆ పెట్టే చివాట్లే మరింత చల్లగా మృదువుగా చేసి అంటించాలి అప్పుడా విమర్శ ప్రజాస్వామ్యానికి పరిపుష్టి

2 ముచ్చట కోసం రాయిచౌదరి బట్టతలనీ, కృష్ణశాస్త్రి జుట్టును సూచించటం వ్యక్తిగత విమర్శ(?)

3 డబ్బు పుచ్చుకున్నంత మాత్రానా ఎవడూ అమ్ముడుపోయినట్టు కాదు - ''ఓ మహాత్మా! ఓ మహర్షీ!'' లాటి పాటలు రాసి డబ్బు పుచ్చుకున్నప్పుడు కూడాను(!)

4 నెత్తిన మొట్టే వాళ్ళుంటే నోరు మూసుకునే పత్రికలకి కాస్త స్వేచ్ఛ రాగానే నోరు మహా పెరుగుతుందేం? స్వాతంత్ర్యం అలంకారార్థం కదూ?

5 ఈ పత్రికలు ప్రకటన కోసం గడ్డి కరవటం లేదా? (గమనిక ఇక్కడ శ్రీశ్రీ పత్రికల వ్యక్తి దూషణకు దిగి తద్వారా కూడా అందులో పడే విమర్శలను ఖండించటానికి ప్రయత్నించి ఇతర విమర్శకులకు చక్కని మార్గదర్శి అవుతున్నాడు)

6 ఏ విమర్శ అయినా ఎటువంటిదో తేల్చుకోవాలంటే దాన్ని చదవటం కంటే ముఖ్య విషయం ఏమంటే విమర్శించే వ్యక్తికీ, పత్రికలకీ వెనక వుండే పూర్వచరిత్ర (చూ చలం, రూపవాణి, వగైరాల పూర్వ చరిత్రలు)

7 పులుసు బాగా చెయ్యలేని వాడు బాగులేని పులుసును ఏమని విమర్శిస్తాడు ఆలిండియా రేడియోను రూపవాణికిచ్చేస్తే (ఇమ్మని ఎవరూ అనలేదు) ఏమవుతుంది (చూ రూపవాణి సంచికలు)

8 ఏ విమర్శకైనా పూర్వచరిత్రా ఇత్యాది ఉన్నట్లుగానే మనం వెనకేసుకొచ్చే మనిషి మీద వ్యక్తిగతమైన అభిమానం కూడా వుండాలి మాటవరసకి ఆలిండియా రేడియో వారు నాటకంలో కృష్ణశాస్త్రిని పట్టుకొని ఏకేశారనుకోండి నాకు కృష్ణశాస్త్రి గారి మీద వల్లమాలినదేదైనా వుండి వుంటేనే 'నేను'' రేడియోని విమర్శించాలి వ్యక్తిగత నింద తప్పు అనే ధర్మం పురస్కరించుకొని విమర్శించకూడదు (శ్రీశ్రీ అంటే ఏదో పగ ఉంటేనే నేను ఈ నాలుగు పంక్తులూ రాయాలి!)

9 మామూలు మహాకవి అయితే ''నా కవిత్వాన్ని విమర్శించు సహిస్తాను నన్ను వ్యక్తిగతంగా తిడితే సహించను'' అంటాడు కాని శ్రీశ్రీ అట్లా గాదు అతని వ్యక్తిని దూషించండి పడతాడు కవిత్వాన్ని ఏమన్నా అనేరు ఉరిమిచూడగలడు ఉప్పెనై ప్రవహించగలడు

10 సాహిత్య విమర్శ అంటే, సినిమాల కూటాన్నీ, రాజకీయ మందల్నీ విమర్శించడం కాదు, రేడియో కూటాల్ని విమర్శించటం కూడా ఆ జాతిలోదే। అన్నట్టు ఏ జాతిలోది? పర్యవసానం ఏమంటే

పాపం కవి - కాదు
పాపం, కృష్ణశాస్త్రి - కాదు
పాపం, రేడియో। - కాదు
పాపం, రిజర్వు బ్యాంక్। - కాదు

*ఢంకా, మాసపత్రిక, అక్టోబరు 1947*

# 21. శ్రీశ్రీకి ఎన్నేళ్లు?

కాలం సాపేక్షకమన్నాడు మహామేధావి ఐన్‌స్టయిన్ నిజమే తెల్లవారగట్ల బి బి సీ లో బిగ్‌బెన్ నిసిరాత్రి దాటి పావుగంట కొట్టినప్పుడు నా గడియారం 5 45కు సరిచేసుకుంటాను భూమి చుట్టూ తిరిగే కృత్రిమ ఉపగ్రహాలకు ముప్పావుగంటకొకసారి తెల్లవారుతుంది పొద్దుకూకుతుంది అనంతాకాశంలో ఒక నక్షత్రం భగ్గున వెలగటం కనిపించేసరికి అది 90,000 ఏళ్ళ క్రితం జరిగిందన్నారు చంద్రుడి రోజు మనకు నెల ఉత్తర దక్షిణ ధ్రువాలకు ఆరు నెలలు పగలూ ఆరు నెలలు రాత్రీనూ కాలం సాపేక్షకమనటానికి ఇంతకన్న ఏం నిదర్శనం కావాలి?

దేన్నయినా కాలమానంతో కొలవచ్చుగాని ఆయుః ప్రమాణాన్ని కాలంతో కొలవటం బొత్తిగా అర్థం లేని పని రేడియం, ఫ్లుటోనియమ్, థోరియం, యురేనియం మొదలైన నిర్జీవ పదార్థాలకు కూడా ఆయుః ప్రమాణాన్ని శాస్త్రవేత్తలు నిర్ణయిస్తున్నారు అయితే వాటి ఆయుర్దాయం అంచనా కట్టటం వారి తరమా? యురేనియం ఎంతకాలం జీవిస్తుంది? ఎవరికీ తెలియదు కాని దాని అర్ధాయువు కావాలంటే చెప్పగలరు। అర్ధాయువును రెండు పెట్టి హెచ్చువేస్తే పూర్ణాయువు రాదా? రాదు

జడపదార్థాల ఆయుర్దాయమే ఇలా వుంటుంటే ప్రాణులను గురించి అందులోనూ మానవులను గురించి, ప్రత్యేకించి మానవులలో శ్రేష్ఠులైన వారి గురించి కాలమానాన్ని ఉపయోగించటం బొత్తిగా కూడనిపని

నిన్న పుట్టిన బిడ్డ గురించి ఎవరన్నా, '' ఈ బిడ్డకు ఆయుర్దాయంలో ఒకరోజు తగ్గిపోయింది।'' అనగలరా? అసంభవం పుట్టినబిడ్డ రోజులు గడిచే కొద్దీ మరింత సజీవమవుతుంది మనుషులు జబ్బు పడ్డప్పుడల్లా వారి ఆయుర్దాయం తగ్గి మళ్లీ పెరుగుతుంది మరీ దారుణమైన వ్యాధి నుంచి కోలుకున్నవాడు చచ్చిబతికాడంటాం ఈ మాట అక్షరాలా నిజం మనిషి ఆయుర్దాయానికి కొలబద్దలు గడియారాలూ, కాలెండర్లూ, పంచాంగాలూ కావు

శ్రీశ్రీ ''మహాప్రస్థానం'' రాసిన నాటికన్న ఇవాళ కొంచెం చిన్నవాడు కాడని మనం చెప్పగలమా? అసాధ్యం ఆఖరుకు శ్రీశ్రీ రచించిన ''మహాప్రస్థానం''కూ, ''ఖడ్గసృష్టి''కీ ఇన్నేళ్లు అని చెప్పడం కూడా సాహసమే ఎందుచేతనంటే పుస్తకాలు ప్రచురణ అయినప్పటినుంచే

వాటి జీవితం ఆరంభమవుతుందని నా ఉద్దేశం కవిత్వం మెదడులో వున్నంతకాలమూ గర్భస్థ శిశువే అందుకనే ప్రచురణ అయినప్పుడు అన్ని కవితలూ ఒకటే - వాటి జాత్య లక్షణాలు భిన్నం కావచ్చుగాక కాని బయటికి వచ్చి కవితలు పుష్టీ శక్తి సంపాదించుకుని, పెరిగి పెద్దవై చరిత్ర ప్రసిద్ధాలవుతాయి కొన్ని ఈసురోమంటూ జీవిస్తాయి కొన్ని పురిట్లోనే సంధిగొట్టి పోవటమూ కద్దు

శ్రీశ్రీ కవిత్వం రాసి, ఆ కవిత్వం వస్తాదులాగా జయించి, అనేక విజయాలు సాధించి, హర్షధ్వానాలు తెచ్చుకోబట్టే మనం శ్రీశ్రీ షష్టిపూర్తి గురించి ఆలోచిస్తున్నాం నా మటుకు నాకు శ్రీశ్రీ వయస్సుతో ఏమీ పని లేదు నేను మొదట చూసినప్పటికన్నా ఇప్పుడింకా బాలుడుగా నాకు కనిపిస్తున్నాడు ఏదన్నా జోక్ చెప్పి శ్రీశ్రీ హార్టీగా నవ్వితే చూడండి పసిపిల్లలు తప్ప అంత ఆనందం కనబరచలేరు శ్రీశ్రీ పక్కన వున్నప్పుడు నేను '' ఓల్డ్‌మాన్ ఆఫ్ ది హిల్స్'' అన్నట్లు ఫీలవుతాను

ఒంటరిగా వున్నప్పుడూ, లోకం పోకడ గురించి ఆలోచించి ఆవేశం వచ్చినప్పుడూ శ్రీశ్రీ భీష్ముడంత ముసలివాడైపోతాడని నా అనుమానం నిజమైన ఆగ్రహం వృద్ధుడికే వస్తుంది శ్రీశ్రీ కవితలో వెయ్యేళ్ళ వయసు కూడా అక్కడక్కడా కనిపిస్తుంది కాని శ్రీశ్రీ స్వయంగా నిత్యబాలుడు అతని కవిత్వం అమరం, చిరంజీవి శ్రీశ్రీకి షష్టిపూర్తి అయిందన్నది ఉల్లిపొరలాంటి అసందర్భ సత్యం దాన్ని ఆటే పాటించకండి

*'జ్యోతి' మాసపత్రిక, జనవరి, 1970*
*శ్రీశ్రీ షష్టిపూర్తి సంచిక*

# 22. శ్రీశ్రీ పిలుపు

చరిత్రలో సమాజాలు నడవటం కనిపించదు ముందుకు దూకటమూ, వెనక్కు పడటమూ, పక్కలకు ఒంగటమూ కనిపిస్తుంది పాశ్చాత్యులరాకతో మన జాతీయ సంస్కృతి చతికిలబడి ఎటూ కదలేని స్థితిలో చాలా కాలం ఉండిపోయింది ఆ పాశ్చాత్య సంస్కృతితోనే మన సమాజాన్ని దానికాళ్ళమీద నిలబెట్టవచ్చుననుకున్న వాళ్ళు బ్రహ్మసమాజం లాంటి ఉద్యమాలు కొనసాగించి, సంఘ సంస్కరణకు పూనుకుని గొప్ప కృషి చేశారు

అయితే ముందడుగు వెయ్యటానికి అవసరమైన 'మేనిఫెస్టో'' ఇచ్చినవాడు గురజాడ దేశ ప్రజలు - తెలుగువాళ్లే మాత్రమే కాదు - ''మందగించక ముందు కడుగు'' వెయ్యటానికి జీవితాన్నీ, సంస్కారాన్ని ఏ విధంగా తీర్చిదిద్దుకోవాలో చెప్పాడు చరిత్రలో జరిగిన తప్పులన్నీ దిద్దేమార్గాలు ఆ 'మేనిఫెస్టో''లో ఉన్నాయి ''రివైవలిజం'' నిరుపయోగం, ''మంచిగతమున కొంచెమేనోయ్'' దేశం వైషమ్యాలతో చీలి దాస్యానికి గురి అయింది, ''దేశమందభిమానాలు'' మొలకెత్తాలి అందుకు కవికోకిలలు నిరాడంబరంగా '' ఆకులందున అణగిమణగి'' పలకాలి (ఇది కోకిలలకు సహజం, కవులకు కాదు) కార్మికులను ఏమంటాడు ''నరుల చెమటను తడిపి మూలం ధనం పంటలు పండవలెనోయ్'' అన్నిటికన్నా ముఖ్యం ''దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్''

ఇది ఒక విధంగా సంపూర్ణసత్యం కాదు ''రాష్ట్రం'' (స్టేట్) అన్నది ఏర్పడాలనే నాగరికత పెరిగింది స్టేట్ అంటే మట్టికాకపోదు కాని ఈ మట్టి పరిపాలకుల అధీనమయింది అందుచేత గురజాడ దేశమంటే మనుషులనేది గట్టిగా చెప్పవలసి టొచ్చింది

భారతదేశాన్నంతటినీ మేలుకొల్పదగిన గేయం రాసి గురజాడ వైతాళికుడయాడు అటుతరవాత ఈ దేశానికి దారిచూపిన ఘనత శ్రీశ్రీకి దక్కింది

''మరో ప్రపంచం'' పిలుపువిన్న మొదటి తెలుగు కవి అతనే ఇతర ప్రాంతాలకు చెందిన ఎందరు కవులు ఆ పిలుపు విన్నదీ అన్వేషకులు నిర్ణయించాలి కాని అతను ఆ పిలుపును కేవలమూ తెలుగువాళ్ళ తరఫునే వినలేదు అనేక దేశాల ప్రజల తరఫున, ఆ ప్రజల కోసం విన్నాడు ఏడ్చేపతితులకూ, భ్రష్టులకూ, బాధాసర్పదష్టులకూ రథచక్రాలు వస్తున్నాయని ధైర్యం ఇచ్చాడు మామూలు రథచక్రాలు కావు జగన్నాథుని రథచక్రాలు సర్వం జగన్నాథం అక్కడ ఏ తేడాలూ లేవు రథచక్ర ప్రళయఘోష భూమార్గం పట్టించి, భూకంపం పుట్టిస్తానని మాట కూడా ఇచ్చాడు ఈ లోకం మీదేననీ, మీ రాజ్యం మీదేలెండనీ వాళ్ళతో అన్నాడు

''నిజంగా నిఖిలలోకం నిండు హర్షం వహిస్తుందా? మానవాళికి నిజంగానే మంచికాలం రహిస్తుందా?'' అని ఆశాభావంతో ప్రశ్నించిన శ్రీశ్రీ పదాలతల్లి పురిటినొప్పుల్లో నూతన సృష్టి జరిగే సూచనలు చూడగలిగాడు

అతను సమకాలికులకు చూపింది ఒక మధురస్వప్నం కాదు జనాన్ని ముందుకు పదమన్నాడు తోసుకుపదమన్నాడు పైపైకి దారి చూపాడు కదం తొక్కుతూ, పదం పాడుతూ, హృదంతరాళం గర్జిస్తూ, దారి పొడుగునా గుండెనెత్తురులు తర్పణ చేస్తూ, నదీనదాలూ, అడవులూ, కొండలూ కడచి కోటలన్నిటినీ దాటమన్నాడు ఎముకలు కుళ్ళిన, వయస్సు మళ్ళిన సోమరులను చావమని, నెత్తురుమండే, శక్తులు నిండే సైనికులనే పిలిచాడు మరోప్రపంచపు కణకణమండే త్రేతాగ్నిని చూపించాడు జలప్రళయనాట్యం చేస్తున్నా సముద్రాలనూ, ఉష్ణరక్తకాసారాలనూ చూపాడు విరామమెరుగక మోగే మరో ప్రపంచపు కంచునగారా వినిపించాడు

శ్రీశ్రీ ఈ కవిత్వం రాసిన రోజుల్లో ఇది హర్షధ్వానాలు సృష్టించే కవిత్వం కాదు ఆ రోజుల్లో కవితాకన్య అనేక సుకుమారసోయగాలు పోతున్నది శ్రీశ్రీ కవిత్వం విని చాలామంది ఉలిక్కిపడ్డారు శ్రీశ్రీ ఈనాటికీ కొన్ని బ్లాక్ లిస్టులలో ఉండనే ఉన్నాడు అదే శ్రీశ్రీకి గొప్ప పతకం అనుకుంటున్నాడు

శ్రీశ్రీని దాటి ఆధునిక కవిత్వం ముందుకు పోయిందన్నారు పోయింది కాబోలు కాని శ్రీశ్రీ ఎత్తు ఎదిగిన కవి మరొకడు కనిపించకుండా ఉన్నాడు మన జాతీయ కవులలో అతనిది చాలా ఉన్నత స్థానం

*పుస్తక ప్రపంచం, మాసపత్రిక, జనవరి 1970*

# 23. నాకు తెలిసిన శ్రీశ్రీ

నేను విజయనగరంలో చదువుతూ హోమిక్ హాస్టల్లో ఉండే రోజుల్లో కొడవంటి బ్రహ్మాజీరావుగారు కూడా మా కాలేజీలో చదువుతూ, మా హాస్టల్లో ఉండేవారు ఈ రోజుల్లో విద్యార్థులకు సినిమా ''దురద'' ఉన్నంతగా కాకపోయినా, ఆ రోజుల్లో మాలో కొందరికి సాహిత్య ''దురద'' తగుమాత్రంగా ఉండేది అప్పట్లో మాకు మహాకవులు కృష్ణశాస్త్రి, నండూరి నాకు ఎంకి పాటలే గాక, వాటి వెంట ఉన్న సంగీతం (పారుపల్లి వారి స్వరం ప్రకారం) చాలా గొప్ప ఆనందాన్ని చేకూర్చేది ఎవరన్నా వాటిని అల్లాయి పదాలల్లే పాడితే నాకు చాలా కోపం వచ్చేది

1928 అప్పుడే కృష్ణశాస్త్రిగారి ఊర్వశీ ప్రవాసం వచ్చింది బ్రహ్మాజీరావుగారి దగ్గరకేననుకుంటాను ఇద్దరమూ కవులను గురించి మాట్లాడుకోవటంలో, శ్రీరంగం శ్రీనివాసరావు తనకు తెలుసుననీ, అతను ప్రాడిజీ అనీ, మా వయసువాడేననీ బ్రహ్మాజీరావుగారు చెప్పారు

నాయీడు వాడే ఒకడు ప్రాడిజీ అంటే నాకేదో అవమానం జరిగినట్టనిపించింది శ్రీరంగం శ్రీనివాసరావు పద్యాలు కొన్ని భారతిలో అంతకముందు చదివాను అవి నాకు అర్థమైనట్టు జ్ఞాపకం లేదు అర్థం కాని కవిత్వం రాయిటంలోనేనా శ్రీనివాసరావు ప్రాడిజీ అనిపించుకున్నది అయినా సహృదయుడు బ్రహ్మాజీరావుగారి మాట కొట్టెయ్యలేక శ్రీనివాసరావును గురించి ఇంకాస్త తెలుసుకోవాలన్న ఆలోచన ఒక మూల మనస్సులో దాచుకున్నాను

ఆ తరవాత శ్రీరంగం శ్రీనివాసరావును శ్రీశ్రీగా పరిచయం చేసుకోవటానికి కొన్ని ఏళ్ళు పట్టింది మేం బందరు నవ్యసాహిత్య పరిషత్తు సమావేశమప్పుడు కలుసుకున్నాం (గుంటూరు సమావేశానికి శ్రీశ్రీ వచ్చినట్టు గుర్తు రావటం లేదు)

అప్పటికి శ్రీశ్రీ వృత్తాలు రాయిటం మానేసి కొత్త బాణీలో పడ్డాడు అతని కవిత్వం చదవని వాణ్ణి ఆ బందరు సమావేశంలో నేనొక్కణ్ణే కనపడ్డాను అందరూ అతని కవిత్వం కొంచెం కొంచెం నెమరువేస్తున్నారు అందరికన్న హెచ్చుగా నెమరువేస్తున్నాడు జరుక్ ఈ కవిత్వం నన్ను బలంగా ఆకర్షించింది కృష్ణశాస్త్రినీ, నండూరినీ దాటి చాలా దూరం వచ్చేశాడు శ్రీశ్రీ విషయం కొత్త, విధానం కొత్త ఈ కవిత్వంలో ''ఘాటు'' చాలా ఉన్నది

జరుక్ ఆశ్చర్యంగా అన్నాడు

''అమ్మయ్యో, శ్రీశ్రీ రాక్షసుడు! 'పులి చంపిన లేడి నెత్తురు ఎలా పట్టావయ్యా?' అని ఎవరో అడుగుతున్నారు 'ఇలా పట్టాను,' అన్నాడు శ్రీశ్రీ, చేతిలో నెయ్యి పోయించుకుంటూ!''

మామూలు మనుషుల్లో ఆడని శక్తివంతమైన ఇంజను ఏదో ఆడుతున్నట్టు శ్రీశ్రీని చూస్తుంటే నాకు అనిపించింది ఈ ఇంజను తెలుగు కవిత్వంలో ఒక శకం సృష్టిస్తుందని తెలుసుకోవటానికి ఎంతో కాలం పట్టలేదు

తరవాత ఒకటి రెండేళ్ళలో మా తెనాలి పిల్లకవి ఒకడు, ''ఈ శ్రీశ్రీతో ఛస్తున్నామండీ! 'మరో ప్రపంచం, మరో ప్రపంచం' అంటే అది కవిత్వమా? 'పదండి, పదండి, పదండి' అంటే అందరూ వెర్రెత్తిపోవటమా?'' అన్నాడు

''పదండి, పదండి'' అంటూ ఈ పిల్లకవి కూడా ఒక గేయం రాశాడన్నది చెప్పకపోతే, శ్రీశ్రీని ఆ రోజుల్లో వ్యతిరేకించిన వారి మనస్తత్వం సరిగా బోధపడదు అది వ్యతిరేకించడం కూడా కాదు, నిష్కల్మషమైన ఈర్ష్య

1940, 41లలో శ్రీశ్రీ మరికొంచెం సన్నిహితుడయ్యాడు

అతని ప్రోత్సాహంతో నేను కొన్ని సర్రియలిస్టు రచనలు చదివాను జేమ్స్ జాయిస్ రాసిన ''యులిసిస్'' చదివాను ''ఫినిగాన్స్ వేక్'' చదవటానికి ప్రయత్నించాను ఆ రోజుల్లో శ్రీశ్రీ సర్రియలిజంలో జలకాలాడుతూ ఉండేవాడు

★ ★ ★

శ్రీశ్రీని వ్యక్తిగా అంచనా కట్టటం తేలిక కాదు మామూలు మనుషుల ప్రమాణాలేవీ అతనికి వర్తించవని నా అనుమానం

శ్రీశ్రీ కారమ్స్ బల్లముందు కూచుని స్ట్రైక్ చెయ్యబోయేముందు అతని వేళ్ళు వణకటం చూసిన వారు ఒక్క కాయిన్ కూడా పాకెట్ అవుతుందనుకోరు - కాని మూడు కాయిన్లు కూడా పాకెట్ కావచ్చు

శ్రీశ్రీ మనసూ, బుద్ధీ మనం అనుకునే నియమాలకు లొంగి పని చెయ్యవు చెయ్యలేవు అతన్ని శాసించే నియమాలు వేరే ఉన్నాయి అవి మనకు స్పష్టంగా తెలీవు ఒకటి నమ్మకంగా చెప్పవచ్చు - అతని బుర్రలో చెలరేగే తుఫానుల్లో ఒక భాగం మాత్రమే పైకి వస్తుంది

రచయితలను ఆవేశించే ''జబ్బులు'' దాదాపు అన్నీ నాకు తెలుసును కవిగా శ్రీశ్రీ చాలా ఆరోగ్యవంతుడు అతని కవిత్వంలో మనం మెచ్చుకునేదాన్లో ఈ ''ఆరోగ్యం'' కూడా ఉన్నది

చలానికీ, శ్రీశ్రీకి ఏమిటి సామ్యం అని కొందరు ఆశ్చర్యపడ్డారు ఇద్దరూ ఆధునిక సాహిత్యానికి గిరులుగీసిన వారే! చలం కల్పనాసాహిత్యానికీ, శ్రీశ్రీ కవితకూ ఆధునిక కవులు శ్రీశ్రీని దాటి ముందుకు పోయారా లేదా అని వితర్కిస్తున్నారు కథకులు ఈనాడు చలం కన్న జీవితాన్ని సూక్ష్మంగా పరిశీలిస్తూ ఉండవచ్చు కాని వాళ్ళు చలం గీసిన గిరి దాటలేదనే నా నమ్మకం శ్రీశ్రీ విషయంలో కవులూ అంతే శ్రీశ్రీ మానవజీవితాన్ని విశాలంగా చూశాడు ఆధునిక కవులు విపులంగా చూస్తున్నారు అంతే తేడా

శ్రీశ్రీని కొందరు ఎనార్కిస్టంటారు శ్రీశ్రీ అంత శాంతికాముకుడు ఉండడని నా నమ్మకం కాకపోతే, జీవితంలో శాంతి ఎందుకు లేదో కూడా శ్రీశ్రీకి బాగా తెలుసును

శ్రీశ్రీ సినిమా పరిశ్రమకు అమ్ముడుపోయాడని కొందరి ఆక్షేపణ నాకు తెలిసినంతవరకు శ్రీశ్రీ డబ్బుమనిషికాడు అందరిలాగే అతనికీ డబ్బు అవసరం కాని డబ్బులేని సమాజం సృష్టి అయితే అందులో శ్రీశ్రీ వెయ్యింతలు సుఖంగా బతకగలడు

దేశంలో శ్రీశ్రీ అభిమానులు ఒక లక్షమంది ఉండరా? వాళ్ళు నెలకు ఒక్కొక్క పైస చొప్పున ఇస్తే శ్రీశ్రీ డబ్బు గురించి ఆలోచించే పని ఉండదు కాని అటువంటి ఏర్పాట్లు జరిగే కాలంలోనూ, దేశంలోను మనం ఉండటం లేదు

ఆఖరుకు ఎకాడమీ వారైనా శ్రీశ్రీని పిలిచి, ''మంచి కవిత్వం రాశావు అందుకో వెయ్యిన్నూటపదహార్లు!'' అనలేదు కాని ఎకాడమీలు చెయ్యనిపని ఇప్పుడు ప్రజలు చేస్తున్నారు శ్రీశ్రీ షష్ట్యబ్ది పూర్తి తెలుగువాళ్ళందరికీ పెద్ద పండగ అనటానికి సందేహం లేదు

*(శ్రీశ్రీ సన్మాన సంచిక, విశాఖపట్నం, ఫిబ్రవరి 1, 1970)*

# 24. శ్రీశ్రీ వచన రచన

సిద్ధహస్తులైన కవుల వచనానికి ఒక ప్రత్యేకత ఉంటుంది - ఉండాలి - అన్న భావం స్వాభావికమైనది నన్నయ్యభట్టుగారి గిద్యల్ని గుంచి గొప్పగా చెప్పుకునేవారు ఈనాటి కవులలో చాలామంది వచన రచనలు చేశారు - కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, పిలకా గణపతిశాస్త్రి, బాలగంగాధర తిలక్, ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి మొదలైన వారు స్త్రీ హస్తపాకానికీ, పురుషహస్తపాకానికీ తేడా తెలిసినట్టుగానే కవులు రాసే వచనానికీ, కవిత్వం చేతగాని వాళ్ళు రాసే వచనానికి తేడా తెలుస్తూనే ఉంటుంది విశ్వనాథ సత్యనారాయణ, నోరి నరసింహశాస్త్రి వంటి సవ్యసాచుల దారి వేరు

కథలూ, నవలలూ, విమర్శలూ, తదితర వ్యాసాలూ రచించేవాళ్లకు సాహిత్యమన్నది వచన మహాసముద్రమనీ, కవిత్వం ఆ సముద్రంలో తేలే చిన్న పెద్ద తెప్పలనీ అనిపిస్తుంది కాని కవులకు అట్లా కాదు, కవిత్వమే మహా సముద్రం, వచన రచనలు ఆ మహాసముద్రంలో చిన్న పెద్దదీవులు

రెండు అభిప్రాయాలూ వేరువేరు దృక్కోణాలనుంచి సరిఅయినవే కవి వచన రచన చేసినా తనకు సహజమైన కవి దృష్టిని విడనాడడు వచనరచయిత కవిత్వాన్ని - ఎంత నచ్చిన కవిత్వాన్నైనా సరే ఆటవిడుపు రచనగానే చూస్తాడు

'నేను వచనం రాస్తున్నా నా హృదయాంతరంలో మట్టుకు కవిత్వం అంటే మట్టుకు మహా అభిమానం,'' అంటాడు శ్రీశ్రీ (''సీతయ్య'') అయితే వచనం రాయటం దేనికి? పద్యాలతోనే పని కానిచ్చుకోకూడదూ? కూడదు వచనంలో సాధించవలసిన విషయాలు కొన్ని ఉన్నాయి శ్రీశ్రీకి అవి వివిధంగా కూడా ఉన్నాయి వాటిని గురించి సంగ్రహంగా తెలుసుకుందాం

**ఆశయాలు**

శ్రీశ్రీ ఆశయాలన్నిటిలోకీ అతి ముఖ్యమైనది ఈనాటి జీవితాన్ని అభ్యుదయవాద భౌతిక దృష్టితో విమర్శించటం 'నేస్తం! నేటి ప్రపంచానికి తెలిసింది ఒక్కటే విలువ ధనం! సంగీతాన్నీ, కవిత్వాన్నీ, చిత్రలేఖనాన్ని ఎవరో హర్షించారు డాక్టరునై డబ్బు తీసుకోకుండా వైద్యం చేస్తానంటే వెర్రివాడి కింద కట్టేస్తారు ఉత్పత్తి ప్రాథమిక దశలో ఉన్నప్పుడు వ్యక్తి సామర్థ్యానికి ప్రాముఖ్యం ఉండేది ఇది జూదంగా మారలేదు! అంతా లాటరీ! అంతా గాండీ! ఎవడెప్పుడు గెలుస్తాడో తెలియదు ఎవడెందుకు ఓడిపోతాడో తెలియదు నేటి వ్యవస్థకొక నీతి లేదు, ఒక నియమం లేదు తానే చెయ్యగల పని తన మనస్సంతా పెట్టి చెయ్యడం, చేసినందు ఎల్ల తాను ఆనందం పొందడం, దాని ఫలితం అందరినీ అనుభవించనివ్వడం, ప్రస్తుత పరిస్థితులలో సాధ్యమవుతుందా? నేను సుఖంగా ఉండడానికి నా నౌఖరును కష్టపెడతాననడానికి (ఇప్పుడు) వీలు లేదు విద్యుచ్ఛక్తి నిన్ను సుఖపెడుతుంది ఆవిరి నిన్ను సుఖపెడుతుంది విజ్ఞానం నిను సుఖపెడుతుంది నీ సుఖాలను నీ సోదరులందరికీ పంచిపెట్టు అందులోనే అనల్పసౌఖ్యం ఉంది ఈ ప్రపంచం మిథ్య అనీ, జీవితం దుఃఖభూయిష్ఠమనీ అనే వాళ్ళను నేను లక్ష్యపెట్టను ధనికవర్గం ఈ సుఖాన్ని దాచుకుంది

అలా దాచుకోడానికి వీలుగా నేటి పద్ధతి సర్వమూ నిర్మించబడింది ధనవంతులకే మరింత ధనం! వెనుకబడినవాడు వెనకనే దరిద్రుడుగా పుట్టడమే తప్పు అది వాడి కర్మం అది వాడి పాపం(అని) ఈ వ్యవస్థను సమర్థించడానికి కూడా మన పండితులు కొందరు బయలుదేరుతున్నారు డబ్బు ఎంత క్షమించరాని నేరం చేస్తోంది! అమూల్యమైన రసాత్మలను కొనేస్తోంది సహజగమనాన్ని శాస్త్రీయంగా అర్థం చేసుకున్నవాడు ఎవరి పక్షం వహించాలి ఈనాడు? పురుషులదేం కష్టం? కష్టాలనీ, కష్టాల సహనాన్నీ చెప్పాలంటే స్త్రీలని స్మరించు ( ఆహా, స్త్రీ లోకంలో ఉదాహరణలు స్మరిస్తే చెయ్యి వణకుతోంది ) ఈ భూలోకానికి నా ఆశీర్వాదం నదుల వల్ల, పర్వతాల వల్ల, అరణ్యాల వల్ల, మహానగరాల వల్ల, పల్లెటూళ్ళవల్ల సౌందర్యాన్ని ప్రదర్శిస్తూ భూలోకం అభ్యున్నతిని కాంచునుగాక! ఆనకట్టలతో, వంతెనలతో, వేనవేలమైళ్ళరాళ్ళ దారులతో, విమానాలతో, శాస్త్రపరిశోధనలతో, టెలిగ్రాఫ్, రేడియో శ్రవణాలతో, సినీమా, టెలివిజన్ నేత్రాలతో మానవత్వం విజృంభించునుగాక! లోకమంతా ఏక కుటుంబమై, తన విధిని తానే నిర్ణయించుకోగల శక్తిని మానవుడు సాధించును గాక'' (''చరమరాత్రి'')

'' ఎంత కలికాలమైనా ఎక్కడో ఒక నాయకుడు దొరక్కపోడు ఆంధ్రదేశంలో నాయకులకే కొదవా? అయితే ఒక చిక్కున్నది వాళ్లు తమమీద పద్యాలు రాయమంటారు పువ్వులదండలు వెయ్యమంటారు స్వాగత పత్రాలు సమర్పించమంటారు ఇది వరకు ఏం చేస్తున్నారు తమరంటే, స్వరాజ్యం తేవడానికి ప్రయత్నిస్తున్నామనేవారు ఇప్పుడు మాత్రం ' ఇంగ్లీషువాడు మనకిచ్చిన స్వరాజ్యం ఏమీబాగోలేదు దీన్నిపట్టిగెల్లి వాడికే ఇచ్చేద్దాం' అంటున్నారు బజారులో దొరికే సరుకుకాదుగదా నాయకుడంటే! ఎవరో పెద్దపెద్ద పెట్టుబడి దారులు తప్ప సామాన్యులెవరూ నాయకులను కొనలేరనుకుంటాను '' (''అనామిక'')

'' ఈనాటి రాక్షసులు ఎంతో అందముగా కనబడతారు నమశ్శివాయ దొంగ, పచ్చిదొంగ దొంగతనాన్ని ఒక లలితకళగా అభివృద్ధి చేశాడు కాని ఆ దొంగకు శిక్ష లేదు అసలు నమశ్శివాయ చేస్తున్నది దొంగతనం అని గుర్తించడమే కష్టం బోలెడంత ఆస్తి ఉన్నవాడు వ్యాపారం చేసి ఆ ఆస్తిని మరింత అధికం చేశాడు ఎంత పెద్దమనిషి తరహాగా కనబడతాడు! ఊళ్ళో అతనికెంత పలుకుబడి ఉంది! అతనా దొంగ? అలా అన్నవాడినే అంతా తిడతారు '' (''నేటి హిరణ్యాక్షుడు'')

''సంఘం అనకు ప్రజలంటే ఒప్పుకుంటాను ప్రజలనగా గవర్నరు నుంచి గవరయ్య దాకా అందరూ ప్రజలే కాని గవర్నరు సంఘం వేరు, గవరయ్య సంఘం వేరు '' (''శూర్పణఖామాన సంరక్షణం'')

''మీ రాజకీయ నాయకులు చేసే ఉపన్యాసాలలో ఎంత నల్లమందులేదు? - ఎక్కడుందయ్యా, మీ సౌందర్యం? అసలు మీరు సౌందర్యాన్ని కనిపెడుతున్నారా? కనిపెడితే గౌరవిస్తున్నారా?'' (''హేమంతం''లో అవ్వ)

''దిగడం, దించడం సులభం, సుఖం! ఎక్కడం, ఎత్తడం (మనల్నీ మన సహచరులనీ) కష్టం, దుఃఖం'' ('' ఒక్కటి'')

"అక్రమలాభాల మీద అదనపు పన్ను తగ్గింపు ఆర్థిక పరిస్థితి మీద కేంద్ర ప్రభుత్వపు దండయాత్రక్రుషి, ఇతోధిక కృషి, ద్రవ్యోల్బణము దాని నరికట్టుటకు ఆరు మార్గాలు" "స్వరాజ్యం వచ్చిన తర్వాతనో అంతక్రితం ఆరేడు నెలల పూర్వమో జమీందారూ జాతీయ మతం తీసుకుని దీక్షావస్త్రాలు ధరించాడు" "కమ్యూనిస్టులను పాతేస్తున్నాం' అన్నారు దొరతనంవారు పాతేస్తున్నారు వానలు కురిస్తే దేశం అంతటా కావలసినంత పంట" ("క్షణంలో సగం")

ఈ భావాలన్నీ ప్రతి అభ్యుదయవాదీ ఆమోదించేవే హర్షించేవే అయితే వాటిని ఇలా "ప్రచారం" అనిపించుకునే ధోరణిలో చెప్పే వచన రచయితలు అరుదు, కథకులు ఇంకా అరుదు

వచన రచనలో శ్రీశ్రీ novice అన్న అనుమానం కలుగుతుంది ముందు చెప్పబోయే విషయాలు ఈ అనుమానాన్ని బలపరుస్తాయి

**వచన రచనల మీద దాడి**

వచన రచనలు సాగించటంలో శ్రీశ్రీ కనబరిచే మరో ఆశయం వచన రచనలపై వ్యాఖ్యానించటం కొన్ని కొటేషన్లు

"సీతయ్య నా చేతిలో యంత్రం నా హార్మోనియంపెట్టె, కేరమ్స్ బల్ల"

" ఓ గొప్ప కథానాయకుణ్ణి సృష్టించుదామని నేను చాలా యత్నించిన మాట వాస్తవమే ఇంతసేపూ సీతయ్య ఒక యదార్థ వ్యక్తి అనీ, వాడి గురించి యావత్తు నాకు తెలుసుననీ మీలో ఒక అభిప్రాయం కలిగించాను "

ఇప్పటికి మీకు కొంత విసుగుపుట్టి తటాలున తర్వాతిపుటలకు పోదామని వుంటుంది కాని, 'సీతయ్యను గురించి పూర్తిగా తెలుసుకొని మరీ పోదాం ఎలాగూ రానే వచ్చాం' అనే ఆస్థ పీకుతూ ఉంటుంది కల్పితవ్యక్తి అయితేనేం? కథ బాగుంటే చాలునని నిలబడతారు "

కథకుడికీ, పాత్రలకూ, పరితలకూ ఉండే సంబంధాలను ఇంతకన్న తప్పుగా భావనచెయ్యటం సాధ్యం కాదేమో

సుమారైన మంచి కథలు రాసేవాడు కూడా తాను సృష్టించిన పాత్రలు తన యిష్టం వచ్చినట్టు ఆడవని గుర్తించి ఉంటాడు పాత్రలు కల్పితమైనవి కావని ఏ పాఠకుడూ అనుకోడు, కాని వాటిలో వాస్తవికత కోసం పాఠకుడు అన్వేషిస్తాడు

ఈ మారు మీ దేశాభిమానాన్ని రెచ్చగొట్టుతున్నాను ఇవన్నీ మామూలు పద్ధతులే అనుకోండి "

" ఈ సీతయ్యతో నేను ఎంత పనైనా చెయ్యగలను వీడు నా సృష్టి పూర్తిగా నా చెప్పుచేతలలో మెలగవలసిన వాడు వీడికి రూపం యిచ్చి, గుణాదులు కల్పించి, సంఘటనలో నిలిపి కథ నడిపించాలన్నా నడిపించవచ్చు అదో కష్టమైన పని కాదుకూడా!"

మరేది కష్టమైన పని? ఆ పనిని శ్రీశ్రీ చేశాడా?

"కథ వండుదామని కలంపట్టుకుని కాగితాలు పెట్టుకుని కూచున్నాను ఇతివృత్తాన్ని ఎసరుమీదికెక్కించాను కథానాయకుణ్ణి ముక్కలుగా తరిగి కారప్పొడి చల్లి పచ్చడి చెయ్యాలనుకున్నాను కథానాయకులందరినీ ఇదివరకే సినిమా వాళ్ళు పచ్చడి చేసి నంచేసుకున్నారు నాకొక్కడినీ మిగల్చకుండా "

ఇది సినిమాకు డిజర్వ్కాని కాంప్లిమెంటు సాహిత్యంలో పనికివచ్చే నాయకులు దాదాపు సినిమాలలో లేరనే కొందరం అనుకుంటున్నాం

'నేటికాలం కథలకి కాలమే కాదు '' సినిమా కథల దృష్టిలో ఈ మాట నిజమే శ్రీశ్రీ వండుదామనుకుంటున్నది సినిమా కథ కాదు గద! అయే ఉండాలి '' ఈ రోజుల్లో ఎవరి కథలు వాళ్ళే రాసుకుంటున్నారు వాళ్ళకు మనం రాసిపెట్టే కథలు సాయించవు '' నిశ్చయంగా ''వాళ్ళు'' సినిమా ప్రొడ్యూసర్లే

''చాలా కథల్ని సంపాదకుడు చంపేస్తుంటాడు '' ఇవి మళ్ళీ మామూలు కథలు

''కొంతమంది ఒక చిటికెడు కథావస్తువు తీసుకుని గంగాళాలకొద్దీ విషయాన్ని కలుపుతారు మరికొంతమంది చవగ్గా దొరికింది గదా అని గంగాళమంత కథావస్తువు తీసుకుని చెమ్చాలో ఇమిడిపోయేటంత చిన్నకథ రాస్తారు కథ అయిపోతుంది, కథావస్తువు మిగిలిపోతుంది '' ఇదంతా మళ్ళీ సినిమా గురించే

''కథానాయకుడితో ఒక రకం బాధయితే కథావస్తువుతో ఇంకొకరకం బాధ'' - సినిమాలు తీసేవాళ్ళకి వాళ్ళ బాధలైనా శ్రీశ్రీ సరిగా బయటపెట్టకపోవటం శోచనీయం

**కథకుడుగా శ్రీశ్రీ**

''చరమరాత్రి'' ప్రచురణ కర్తలు ఇలా అన్నారు మహాప్రస్థానం కవితలు విప్లవం తెస్తే, చరమరాత్రి కథల్లో విప్లవం సృష్టిస్తుంది ''

ఈ దేశంలో విప్లవాలు అంతతేలిగ్గా రావని వారు గుర్తించలేదు మహాప్రస్థానం కలిగించింది సంచలనాన్ని దాన్ని చూసి అనేకులు ఆనందంతోనూ, కొద్దిమంది ఆవేశంతోనూ పరవళ్ళుతొక్కారు కొన్ని వందలమంది యువకవులు దాన్ని కాపీకొట్టారు ఇంతే జరిగిన విప్లవం ''చరమరాత్రి'' అలాంటి సంచలనాన్ని కూడా కలిగించలేదు

''సంఘటనల్లేని సంచలనం లేని కర్త, కర్మ, క్రియల్లేని కథనాన్ని కాదనడం ఎలా? ఒక్క పూరిల్లుగాని, పచ్చకర్పూరంగాని, చివరికొక సిగిరెట్టుకాని తగలెట్టేటప్పుడు బయల్దేరే పొగలో కనిపించే కదలిక పాటిది కూడా ఈ రాతలో మీకు కనబడదు,'' అని శ్రీశ్రీ ఒప్పుకుంటున్నాడు

అయితే అతని సాధన దేనికి?

'మెదడు తగలబడిపోయేటప్పటి పొగకాని పొగ, కదలనట్లు కనిపించే కదలడం, జరగనట్టు కనిపించే జరగడం ఇందులో చూపించాలని ఎందుకో ప్రయత్నం ''

ఈ ప్రయత్నం జరిగిన రచన పేరు ''బాధ కవిత్వానికి పర్యాయపదం '' కథలతో నిమిత్తం లేదు, వచన రచనే అయినా!

శ్రీశ్రీ రాసిన వాటిని కథలనేకన్న వచనప్రయోగాలనవచ్చు వచనం రాయటంలో శ్రీశ్రీకి ఆసక్తి అంతగా లేనట్టే, కథ రాయటంలోనూ లేదు శ్రీశ్రీ ఇంచుమించు కథలకు శత్రువు

అయితే శ్రీశ్రీ ప్రయోగాలు పూర్తిగా విఫలం కాలేదు కొనేటిరావుకు సంబంధించిన మూడు కథలూ విజయవంతమైనవే ''బొమ్మ''లో నాకు మంచి కథ కనిపించింది ఒక్కముక్కలో చెప్పాలంటే, శ్రీశ్రీ తాను రాసే దానికి తానే అడ్డంగా నిలబడని రచనలన్నీ రక్తిగానే ఉన్నాయి ''కథ లేదు, కథకుడు మాత్రమే ఉన్నాడు'' అనిపించే ప్రయోగాలు విజయవంతం అయినట్టు కనబడవు

**అంకెల వ్యసనం**

''రాత్రి పదకొండు గంటలయింది ఇంకొక గంట, ఇంకొక్క అరవై నిమిషాలు, సరిగ్గా పన్నెండు కాగానే చచ్చిపోదలచుకున్నాను '' ఎందుకింత ప్రిసిషన్?

''ఆరు నెలల నుంచీ నాకిదే ఆలోచన'' (వుళ్ళా) '' ఆరు నెలల నుంచి సిద్ధమవుతున్నాను ఆరు నెలల కిందటే తెగించాను '' అరవై నిమిషాలు- ఆరు నెలలు - ఇందులో న్యూమరాలజీ ఏమైనా ఉందా? ఈ ఆరు నెలలు మనని ఒకంతట వదిలిపెట్టదు '' ఆరునెలలు అహోరాత్రాలు అవభృదస్నానాలు ఇదివరకు ఆరునెలల క్రితం, ఎప్పుడో ఆరు నెలలకిందట ''

''ప్రేక్షక జనం అయిదు నిమిషాల ఇరవై సెకండ్లసేపు కరతాళధ్వనులు చేసి ''

1-1 = 1

1 + 1 = 1, అని అనడం మానలేను ''

నిజానికి అంకెలు సంకేతాలు గణిత సత్యాలను జీవిత సత్యాలుగా మార్చేటందుకు ''కీ'' ఏదీలేదు

2 X 4 = 8

రెండేమిటి? నాలుగేమిటి? ఎనిమిదేమిటి? అడుగులను అడుగులు పెట్టి హెచ్చిస్తే చదరపుటడుగులు వస్తాయి పండురెండణాల చొప్పున నాలుగు పళ్ళు కొంటే ఎనిమిదణాలు అవుతాయి రూపాయకి రెండు చొప్పున నాలుగు రూపాయలకు కొంటే ఎనిమిది పళ్ళవుతాయి నారింజ కాయలను వంకాయలు పెట్టి హెచ్చించలేం హెచ్చిస్తే ఏం వచ్చేదీ చెప్పటం ఎవరితరమూ కాదు ఈ అంకెల సహాయంతో ఏదో తాత్విక సత్యాన్ని నిరూపించటం ఎవరివల్లా కాదు ( ఔను - కాదు) + (మంచి-చెడ్డ) - (వెలుగు - చీకటి) + (చావు-బదుకు) అన్నది లెక్క కాదు, పచ్చి మిస్టిసిజం

**శైలి, ఛలోక్తులు, సూక్తులు**

ఒక రేడియో ప్రసంగంలో శ్రీశ్రీ, తనకు ఎవరి శైలి ఇష్టమన్న ప్రశ్నకు తనశైలే ఇష్టమన్నాడు

నిజానికి ప్రతి రచయితకూ తన శైలి విధిగా ఇష్టమవుతుంది ఎవడూ తనకు ఇష్టంలేని శైలిలో పనిపెట్టుకు రాయడుగద ప్రతి రచయితా తన భావప్రకటనకు అనుకూలించే శైలిని ఆలంబన చేసుకుంటాడు

అయితే, నా అనుభవంలో, రచయితకు తాను రాసే శైలి ఒకటే ఉన్నప్పటికీ, తాను చదవగోరే శైలులు చాలా ఉంటాయి నామటుకు నాకు చాలా మంది శైలి ఇష్టం గురజాడ అప్పారావు దగ్గిర ప్రారంభించి గుండ్రంగా తిరిగి రాచకొండ విశ్వనాధశాస్త్రి దాకా వచ్చింది నా అభిరుచి మధ్యలో భమిడిపాటి కామేశ్వరరావూ, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రీ, గోపీచందూలాంటి వాళ్ళు ఎందరో తగిలారు నాకే ఒక శైలి అంటూ ఉన్న పక్షంలో అది నేను రాయటానికి ఉపయోగించేదే గాని చదవటానికి ఎంతమాత్రమూ ఉపయోగపడదు

శ్రీశ్రీకి తాను రాసే శైలే, తాను చదివే శైలి కూడా అయితే, అది ఆశ్చర్యమే శ్రీశ్రీ వచన రచననిండా పుష్కలంగా 'నేను'' ఉండటాన్ని బట్టి ఆశ్చర్యాన్ని కొంత తగ్గించుకోవచ్చునేమో

కాని శ్రీశ్రీ surrealist ధోరణిలో పడ్డాక అతన్ని అందుకోవటం చాలా కష్టం

'హెడ్డు గుమాస్తా కోనేటి రావు పంతులు పదకొండు గంటలయింది గుమాస్తా కోనేటి హెడ్డు పదకొండు గంటలు కొడుతున్నారు ఆఫీసువేళ కోనేటి గంటల గందరగోళం తొందర భోజనం ముగించుకుని చుట్ట బిగించుకుని బట్ట సవరించుకుని ఒసే కుర్రాళ్లు జాగ్రత్త కోనేటి కాగితాల దొంతినిండా కోపం జోళ్ళలో కాళ్ళు జారబడ్డాయి ''

ఇలాటి పరుగులో శ్రీశ్రీని అందుకోవటం కష్టం అది శ్రీశ్రీకి స్వక్షేత్రం

'' ఎంతలా సుఖంగా దిగిపోతున్నాం! గబగబా! గభగభా! భగభగా! గాగాభాగగా! గభగా! గాగా! గాభగాగా! గగభగగా! గగభగగా! బాగా!''

శ్రీశ్రీ కవిత్వం నుంచి కొటేషన్లు అంతా సులువుగా దొరకవని నేనంటే, ''కోట్ చేస్తే అంతా కోట్ చెయ్యాలి '' అన్నాడు ఆరుద్ర అదే నిజంలా కనబడుతుంది

కాని శ్రీశ్రీ వచనంలో మెరిసే వాక్యాలు చాలా దొరుకుతున్నాయి

'' ఇంకో దినం దగ్ధమయిపోయిందనే సూచనగా ( ఎదురుగుండా పశ్చిమాకాశం మీద) ఎర్రని మంటలు కనబడ్డాయి ''

'చేసుకున్న పాపంలాంటిది కొనుక్కున్న బొమ్మ ''

''నలుగురితో పెళ్ళి చావుతో సమానం ''

'స్నేహం కన్న పరిచయమే డబ్బు పలికిస్తుంది ''

''తెలుగు కథలకి మాత్రమే కంచి గమ్యస్థానమనమంటాను బంగాళీ కథలు ఎక్కడికి వెళతాయో? ఇతర భాషల్లోకి కాబోలు ''

''కోల్పోవడానికి నాకసలు మనశ్శాంతి అనేదే లేదు ''

''నా గురించి ఎవరు ఏమనుకున్నా నాకు లక్ష్యం లేదు ఏమీ అనుకోకపోతేనే బాధపడతాను ''

''శూర్పణఖకి మాత్రం మానం లేదా? దాన్ని సంరక్షించడం ఉత్తమాదర్శం కాదా? శూర్పణఖ తనకి మానభంగం చెయ్యవలసిందనే రాములవారి నడిగింది ''

'వెధవ ఊహలు, పాపిష్టి మనస్సు, మనలో ఇంత కుళ్ళు పెట్టుకుని లోకాన్ని తిడతాము ''

'' ఈ లోకంలో ఆడదై పుట్టడమంత హీనం ఇంకోటి లేదు

''చలం కలం విశృంఖలం ''

''ఎడంచేతివేపు నుంచి రమణ మహర్షిని, అంటూ అవ్వ అంతర్ధానమయింది ''

''ఈ రోజుల్లో రెండురకాల మాలవాళ్ళున్నారు సినిమాలవాళ్ళు, డ్రామాల వాళ్ళు ''

'రెక్కలు ధరిస్తే మాత్రం ఎక్కడికి వెళ్ళగలవోయ్, మానవుడా?''

**తాత్విక చింతన**

''దేవుడు లేడు'' అని నేనన్నప్పుడు నా ఉద్దేశం 'దేవుడు ఉన్నాడు' అని ఇది ఎవరికర్థం అవుతుంది? నా ' ఔను'కి, 'కా'దని, నా ' ఉంది'కి 'లే'దని అర్థం ఉందనీ, లేదనీ, ఉండి లేదనీ, లేక ఉందనీ ఎలా నచ్చచెప్పగలను?''

కష్టమే

''నిరీశ్వరుడే ప్రత్యక్షమై 'నేనున్నాను' అంటే నమ్మకం లేకుండానే నమ్మకాన్ని ప్రకటిస్తాను ''

'' ఔను/కాదు, మంచి/చెడ్డ, వెలుగు/చీకటి, చావు/బ్రతుకు, మనిషి/దేవుడు అంతా ఒకటే''

అంటే?

''జీవించినా మరణించినా నేను నేనే కాబట్టి జీవితం సుఖమనీ, మరణం దుఃఖమనీగానీ, జీవితం బానిసతనం, మరణం స్వాతంత్ర్యం అనిగాని వాదించడం మానేస్తున్నాను''

?

''భూత, వర్తమాన, భవిష్యత్కాలాలను ఒకే క్షణంగా ముద్ద చేసి నేను కల్పించుకున్న, నేను నివసిస్తున్న స్వర్గం''

ఇందులోకి ఎందరు పాఠకులు తొంగిచూడగలరు?

ఓహో! సత్యాసత్యాల కవితల సాఫల్యం! నిత్యానిత్యాలను మించిన సాంగత్యం! మానవ మనశ్శాఖల మీద పుష్పించిన సంగీతం! అనేక తరాలలో ఏక కాలమే జీవిస్తున్న అనుభవం! ఏక కాలంలో ఉండడాన్ని, ఉండకపోవడాన్నీ సాధించే స్వాతంత్ర్యం ఇది నా కావ్యం! ఇది నా కామ్యం! ఇదీ నా స్వర్గం!''

ఇంత ఎత్తు నాలాటివాడు ఎలా ఎగరడం? నాకంటె కూడా అర్భకుల మాటేమిటి?

నన్నడిగితే శ్రీశ్రీ వచనం రాయనవసరం లేదు అతనిది గరుత్మంతుడి దృష్టి మూడులోకాలను ఒక్కసారి చూడగలవాడు అలాటివాడు అల్పవ్యక్తుల్లోకి చూస్తే, గొప్పవాళ్ళు కావటానికి వాళ్ళు పడే పాట్లూ (సీతయ్య), వ్యాపార ప్రకటనల వెనక ఉండే దగా (హేమంతం) సినిమాల అబ్సెషనూ (అంతటా) కనిపిస్తాయి వీటిని గురించి మూడో రకం, నాలుగో రకం రచయితలు రాస్తూనే ఉన్నారు

శ్రీశ్రీ వేదాంతం కూడా రాయనవసరం లేదు ఆనల్లమందు శ్రీశ్రీ పాఠకులకు ఉపయోగపడదని శ్రీశ్రీ ఆరాధకుల్లో ఒకడుగా నేను చెబుతున్నాను

*సృజన, మాసపత్రిక, ఫిబ్రవరి, 1970*

# 25. దృక్పథం

కళ సంస్కృతికి సంబంధించినదని మనకందరికీ తెలుసు సంస్కృతి సమాజానికి సంబంధించినది ఎవరూ ఉత్తి పుణ్యానికి రాయరు చదవరు ఎవరూ తమకునచ్చిందే రాయరు తమకు నచ్చిందే చదవరు అంతవరకూ ఒప్పుకోవచ్చు రాజులకు మంత్రులకు చదువులు అఖ్ఖరలేదు వాళ్ళ పిల్లలకు చదువులు అక్కర్లేదు వారిపిల్లలకు వారసత్వంగా అధికారం వస్తుంది జీవితానికి సంబంధించిన విషయాలలో రాజుకొడుకు రాజవుతాడు వడ్రంగి కొడుకు వడ్రంగవుతాడు కాని LDC కొడుకు ఆటోమేటిక్‌గా కాడు వేరేగా చదవాలి సాహిత్యం డెమొక్రాటిక్ అని నిరూపించడానికి ప్రతి తరం రచయితలు ఆ సంస్కృతిని upto date గా రాయాలి రచయిత తన గొంతు వినిపిస్తూ కొత్తగా ఎప్పటికప్పుడు రాస్తూండాలి సమాజం కోసం ఎప్పుడూ ఓ పరంపర సాహిత్యంలో అవసరం వచ్చిన సాహిత్యం అలా రాకపోడంలో నేల విడిచి సాము ఉంటుంది ఉత్తమ సాహిత్యంని నిర్ణయించేటప్పుడు

సమాజాన్ని గీటురాయిగా పెట్టుకొని ఆ సమాజానికి ఈ సాహిత్యం ఎంత పనికొస్తుందో నిర్ణయించిన విమర్శకులు చెప్పిందాన్ని జేరీజు వేసుకుని పాఠకులు నిర్ణయించాలి

సమాజం, సాహిత్యం అనే మాటలు వాడుతున్నాం ఒకటి clarify చెయ్యాలి నేను చెబుతున్నది ప్రత్యేకంగా విశాఖ విద్యార్థులకు సమాజం అంటే ఎవరి సమాజం వారికుంది వియత్నాంలో ఏదో జరుగుతోందంటే ఏడ్చేవారిదొక సమాజం నీగ్రోలని వేటాడుతోంటే బాధపడేవాళ్ళదొక సమాజం శ్రీకాకుళంలో చంపేస్తున్నారంటే 'పోన్లే' అనే వాళ్ళదొక సమాజం సమాజం అనేది అందరిదీ ఒకటికాదు రష్యా మీద జర్మనీ పడితే శ్రీశ్రీ 'లేలేరష్యా' రాశాడు శ్రీశ్రీ రష్యా పోయటా? రష్యా పాయెటే విశ్వకవి అని టాగూరుకి ఓ టైటిల్ యిచ్చారు అయితే ఆయన మానవతావాదం తెచ్చి మనుషులంతా ఒకటని వేదాంతపరంగా చెప్పాడు కాని అది ఒట్టి మానవతా వాదం కాని విశ్వమానవతా వాదం కాదు నాకు తెలిసినంత వరకూ ఇండియా మొత్తం మీద విశ్వకవి అనిపించుకొనేవారు శ్రీశ్రీ ఒక్కరే

*విశాఖపట్నంలో శ్రీశ్రీ సన్మానం (1-2-1970) నాటి ఉదయం*
*సాహిత్య గోష్ఠిలో ప్రసంగం*

# 26. మరో ప్రపంచం

తెలుగు సాహిత్య చరిత్రలో నా ఆశయం ఏమిటంటే శ్రీశ్రీ సన్మాన సంచిక కొడవటిగంటికుటుంబరావు అనేవాడు ఆవిష్కరించాడు అని రాస్తే తృప్తిపడతాను సన్మానం చెయ్యాలంటే మన తాతాజీ చెప్పినట్టు వీడికి చెయ్యాలనో, తప్పదనుకొని చెయ్యకపోతే వీళ్ళకు నామర్దా

శ్రీశ్రీ ని ప్రభుత్వం కూడా గొప్పగా గౌరవించినట్టు లేదు కాని ఇది స్పెషల్ సన్మానం కాదు శ్రీశ్రీకి నాకు తెలిసి ఉన్నంతవరకూ ఏదో రూపంలో జరుగుతుంది సన్మానం అది ఓ నలుగురు కూర్చుని శ్రీశ్రీ గేయాలు చదివినప్పుడు ఈ సన్మాన సంచికలో శ్రీశ్రీ గురించి వుంది శ్రీశ్రీ గురించి అబద్ధాలు రాయటానికి అవకాశం లేదు మరో ప్రపంచం మొదట అచ్చయినప్పుడు ఇదే కవిత్వం పదండి పదండి అంటున్నాడు, కవిత్వం లేదిందులో అన్నారు నాతో కూడా అన్నారు రెండేళ్ళలోనో ఏడాదిలోనో complete change శ్రీశ్రీ గేయాలు చదివారా? అని అడగడం మొదలెట్టారు

విమర్శలు, నోటి విమర్శలు, పత్రికలలో శ్రీశ్రీ మీద వ్యాసాలు వచ్చాయి వారికి దుర్గలున్నాయి నాయినా అభ్యుదయ సాహిత్యానికి దారి మర్చిపోయావు, ఇంకో దారి గుర్తుందా అంటారా - ఇది ఏడుపు కల్తీలేని దుఃఖం కాని యివి కూడా శ్రీశ్రీని పెంచాయి మనకు విమర్శనా సాహిత్యం చాలా తక్కువగా ఉంది హిందీ సాహిత్యంలో విమర్శ ఎక్కువగా ఉంది దానివల్ల సాహిత్యం బాగుపడుతుంది

*విశాఖపట్నంలో శ్రీశ్రీ సన్మానం (1-2-1970)*
*నాటి సాయంత్రం బహిరంగ సభలో ఉపన్యాసం*

# 27. శ్రీశ్రీ కవిత ఒక మహాశక్తి

కేంద్ర సాహిత్య అకాడమీవారు ఢిల్లీలో లెనిన్ శతజయంతి జరిపారు దానికి శ్రీశ్రీనీ, నన్నూ పిలిచారు ఉపన్యాసాలూ, ప్రసంగాలూ ముగిసిన విశ్రాంతి సమయంలో నేను అటూ ఇటూ తిరుగుతుండగా శ్రీశ్రీ తనకవితను ఇంగ్లీషులో చదివి ఎవరికో వినిపిస్తున్నాడు దగ్గరికి వెళ్ళి చూస్తే జ్ఞానపీఠ కార్యదర్శి జైన్ శ్రీశ్రీ చదువుతున్నది ''కవితా ఓ కవితా''కు స్వీయ ఇంగ్లీషు తర్జుమా జైన్ శ్రీశ్రీ కవిత్వాన్ని నోరు తెరిచి వినటమేకాక, మధ్యమధ్యలో చాలా ఉద్రేక పడిపోతున్నాడు

శ్రీశ్రీ చదవటం పూర్తి కాగానే అతను '' ఇంగ్లీషు తర్జుమాలోనే ఇంత బాగుంటే మాతృక ఎంత బాగుండాలి!'' అన్నాడు ఆవేశంతో

నేను కలగజేసుకుని - ''నిజమే! మీ లక్షరూపాయల అవార్డు మాత్రం శ్రీశ్రీ కిచ్చారు కారు శ్రీశ్రీకి సమానమైన కవి - ఇండియాలో మరొకరున్నట్టు మేమనుకోవడంలేదు'' అన్నాను జైన్‌తో

''అలా అనొద్దు! శ్రీశ్రీకి జ్ఞానపీఠ్ అవార్డు తప్పక వస్తుంది'' అన్నాడు జైన్

''అది మాత్రం జరగలేదు జరుగుతుందని నేను అనుకున్నానని కూడా కాదు జ్ఞానపీఠం వారి అవార్డులు ఏ పంపిణీ మీద ఇవ్వబడతాయో జైనుకు తెలిసే ఉండాలి లక్షరూపాయలు శ్రీశ్రీని ఉద్ధరిస్తాయని కూడా కాదు కాని అటువంటి బహుకృతి శ్రీశ్రీనీ, అతని కవిత్వాన్నీ యావద్భారతానికీ పరిచయం చేసే అవకాశం ఉందని అప్పట్లో అనుకున్నాం ఇప్పుడనుకోవడంలేదు అందుకు కారణం శంకర్‌కురుప్‌తో ప్రారంభించి, అనేకమంది జ్ఞానపీఠ్ బహుకృతులు పుచ్చుకున్నారు కాని వారి సాహిత్యకృషి ఈ బహూకృతుల ఫలితంగా భారతీయులెవరికీ అందలేదు అవార్డు ఎవరిచ్చేదయినా కానీయండి, అది ఇచ్చుకునేవారికీ, పుచ్చుకొనేవారికీ మధ్య 'నూస్‌వేల్యూ' గల ఏర్పాటుగా మాత్రమే భావించబడుతుంది రాష్ట్ర అకాడమీలూ, కేంద్ర అకాడమీలూ బహూకృతులిస్తాయి కానీ ఆ బహుకృతులు అందుకున్న రచనలు భారతీయభాషలన్నింటిలోకి తర్జుమా అయి యావద్భారత సాహిత్యంలో చోటుచేసుకోవు ఒక విధంగా అదే మంచిది ఎందుకంటే, అలా బహుకృతులు పొందిన కొన్ని రచనలు, ఆయారచయితల ఉత్తమరచనలు కావు వాటికి బహుమానాలు ఎందుకిచ్చారో ఇచ్చినవారికే తెలియదనుకోవచ్చు

చిత్రమేమిటంటే శ్రీకృష్ణదేవరాయలు అల్లసాని పెద్దనను సన్మానిస్తే, అది సాహిత్య చరిత్రలో శాశ్వతంగా ఉండిపోయింది నా అభిప్రాయంలో ఆ సన్మానం అల్లసాని పెద్దన కన్నా గొప్పది సన్మానాలు అల్లా ఉండాలి సన్మానితుడి ఘనతను పెంచగలిగి ఉండాలి కానీ రేపు సూర్యుడు పడమట పొడిచి, శ్రీశ్రీకి జ్ఞానపీఠం వారు లక్షరూపాయలు బహూకరించినా, ఆ బహూకృతి కన్నా శ్రీశ్రీయే ఎత్తున ఉంటాడు ఇందులో సందేహంలేదు శ్రీశ్రీ కన్నా మిన్న ఏదన్నావుంటే అది శ్రీశ్రీ కవిత

ఈ దిక్కుమాలిన దేశంలో, ఐక్యభారత సంస్కృతి అంటూ ఒకటి ఆవిర్భవించి, ఉత్తమ భారతీయ సాహిత్యం ప్రశస్తి పొందితే, శ్రీశ్రీ అగ్రభారతీయ కవుల జాబితాలో గొప్పస్థానం పొందుతాడు అంత దాకా శ్రీశ్రీ సన్మానాలు చిల్లరవార్తలుగానే వుండిపోతాయి

*శ్రీశ్రీ అభినందన సంచిక - 70వ జన్మదిన మహోత్సవాలు*
*కాకినాడ, 14-12-1979*

# 28. విశ్వనాథ ఆరాధన : సూటిప్రశ్నలు

విశ్వనాధ సత్యన్నారాయణగారు పోయాక, సాహితీ పరుడుగా ఆయనను గురించిన (నాదృష్టిలో) వాస్తవమైన అంచనా మీ సంపాదకీయంలో మాత్రమే చదివాను ఇతర పత్రికలు కొన్ని నిజం చెప్పాయేమో అది నాదృష్టికి రాలేదు

ఇప్పుడు మళ్ళీ నవంబరు 24 తేదీగల పత్రికలో ప్రచురించిన నార్లగారి ప్రసంగ సారాంశంతో నేను పూర్తిగా ఏకీభవించే అదృష్టం లభించింది ఈ సారి నార్ల గారు తమ అభిప్రాయాలను సహేతుకంగా ప్రకటించారు కనుక 'నాదృష్టిలో' అని చేర్చడం అనవసరం

పత్రికలూ, వ్యక్తులూ సాధారణంగా గొర్రెదాటు మనస్తత్వం అవలంబించడం ఎందుకు జరుగుతున్నది? ఒక కారణం గొర్రెల మనస్తత్వమే ఇంకా పై వర్గాలకు పోతే వారు ప్రదర్శించే కళాభిమానం వెనుక కళా పరిచయం ఉంటుందని నాకు తోచదు సినిమాలాటి అల్ప కళల విషయంలో వారి అభిమానం పరిచయాన్ని పురస్కరించుకున్నది కాదని నేను అనలేను గాని, సాహిత్య విషయంలో ఆశయాంతరాలు తప్పకపని చేస్తున్నాయి నార్లగారు వాటిని వివరించారు

*ఆంధ్రజ్యోతి దినపత్రిక 'జనవాక్యం' 2-12-1976*
*(విశ్వనాధ 18-10-1976న విజయవాడలో చనిపోయారు*
*నార్ల ఆంధ్రజ్యోతి దినపత్రిక (19-10-1976)లో రాసిన సంపాదకీయానికి*
*కుటుంబరావు గారి స్పందన)*

# 29. నా చిన్నన్నగారు (కృష్ణశాస్త్రి)

మొన్న జనవరి 13 ఆదివారం నాడు కృష్ణశాస్త్రిగారు మా ఇంటికి వచ్చినప్పుడు ఎందుకోమా అన్న (వెంకటసుబ్బయ్య) గుర్తుకు వచ్చి, ''మీ అన్న గట్టివాడు మా ఇద్దరిదీ ఒకే వయస్సు'' అని రాశారు (మాట పోయిందిగద!)

''కాదు మీరు మా అన్న కన్నా రెండేళ్లుచిన్న మీరు నాకు చిన్నన్న గారు'' అన్నాను

నాకు మా అన్నను జ్ఞాపకం చేసేవారు ఇద్దరే ఉండేవారు అబ్బూరీ, దేవులపల్లి వాళ్ళు మా అన్న గురించి మాట్లాడేవారని కాదు కృష్ణశాస్త్రిగారు మా అన్న గురించి తానై మాట్లాడటం మొదటిసారీ, చివరిసారీ కూడా ఆ ఆదివారంనాడే

అయితే 1927 లో నేనూ, ఆయనా ఒకే రైలు పెట్టెలో కలుసుకున్నప్పుడు నన్ను నేను పరిచయం చేసుకున్నది వెంకటసుబ్బయ్యతమ్ముడిగానే లేక పోతే నన్ను గురించి ఆయనకు చెప్పడానికి ఏమీలేదు

నేను మాత్రం అయనను 1925లోనే మొదటిసారిగా చూశాను నేను గుంటూరులో ఇంటరు చదువుతూ హాస్టల్లో ఉండేవాణ్ణి మా వార్డెన్ తెలికిచర్లవెంకటరత్నంగారు దేవులపల్లి వారి చేత మాకు గోష్ఠి జరిపించారు అప్పటి అధునాతన కవిత్వంలో నాకు తెలిసినవి యెంకి పాటలు మాత్రమే కాని దేవులపల్లి వారు ఆనాడు ఆధునిక కవిత్వం చాలా వినిపించారు యెంకి పాటలు కూడా పాడారు

మళ్ళీ నేను విజయనగరంలో బియ్యే చదివేటప్పుడు కృష్ణశాస్త్రిగారు మా కాలేజీకి వచ్చి భావ కవిత్వం చదివారు ఆ రోజే కొందరు విద్యార్థులు డాక్టర్ బుర్రా శేషగిరిరావుగారిని కృష్ణశాస్త్రి గురించీ, భావకవిత్వం గురించీ అడిగితే, ఆయన ఎక్కువగా ఏమీ చెప్పలేదుగాని, భావ కవిత్వం లిరికల్ పొయిట్రీ కాదన్నారు

మాకిద్దరికీ పరిచయం 1940లో ప్రారంభమై తరువాత అయిదేళ్ళ అనంతరం బంధుత్వం ప్రమాణానికి పెరిగింది కొమ్మూరి పద్మావతిగారి కూతురిని పెళ్ళాడిన నాటి నుంచీ నేను శాస్త్రిగారి ఆప్త వర్గంలో వాణ్ణి

ఆయన ఉపన్యాసాలు, సినిమా భాషలో సూపర్‌హిట్స్ అయన ఒక్క గేయంగాని, పద్యంగాని రాయకపోయినా ఉపన్యాసకుడుగా ఆయనను నేను మరువడం సాధ్యం కాదు

ఆయనలో ఎవరన్నా విసుగు చూసి వుండొచ్చుగాని, కోపం చూసిన వారు బహుశా వుండరు అయినా ఈయనకు కొన్ని విషయాలలో Strong feelings ఉండేవి తన ఉపన్యాసానికి ఏ మినిస్టరో, సెక్రటరీయో అధ్యక్షత వహిస్తే అయనకు అరికాలిమంట నెత్తికెక్కేది 'నేను మాట్లాడేది వాడికేం తెలుస్తుంది ఎవరన్నా తెలుగు మేష్టర్ని కుర్చీలో కూర్చోబెట్టండి! ''అనేవారాయన

ఇంకోసారి నేనూ, శాస్త్రిగారు బెజవాడ గోపాలరెడ్డి గారిని కలవటానికి కాస్మాపాలిటన్ క్లబ్బుకు వెళ్ళాం గోపాలరెడ్డి గారు బయటకు వెళ్ళారట ఆయన గదిలో ఒక ఎమ్మెల్యే కూర్చుని వున్నాడు శాస్త్రిగారిని అతగాడు పలకరించలేదు శాస్త్రిగారిలో లావా ఉడుకుతున్నది కాస్సేపు ఆగి చాలా నమ్రతగా, "తమ నామధేయం?" అని అడిగారు ఆయన గారు గొణుగుతూ చెప్పాడు శాస్త్రిగారు సరిగా విననట్టు నటించి అతని పేరు తప్పుగా అన్నారు ఆ పెద్దమనిషికి తనను శాస్త్రిగారు ఏడిపిస్తున్నారని అర్థమయింది కాబోలు ఈ సారి తన పేరు స్పష్టంగా చెప్పి అక్కడినుంచి వెళ్ళి పోయాడు శాస్త్రిగారు జుట్టు విదిలించి పళ్ళు బిగబట్టి "నా కర్మకాలి వీడు నా రాజకీయ ప్రతినిధి!"అన్నారు సింహాలకు కోపం రాదనుకోకూడదు కాని వాటిహుందా తనంలో ఈ కోపం అలా క్షణికంగా మాత్రమే కనిపిస్తుంది

శాస్త్రిగారు సినిమా రంగంలో ప్రవేశిస్తున్న కొత్తల్లో నాకు ఆయన ఈ రంగంలోకి రాకూడదన్న భావం ధృడంగా వుండేది ఆ రోజుల్లో చిత్ర నిర్మాతలు తమ ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్‌ను తమ కన్న చాలా గొప్ప వాళ్ళను ఎద్దేవా చెయ్యటం ద్వారా ప్రదర్శించుకునే వారు ముఖ్యంగా పేరు మోసిన రచయితలకు సినిమా గురించి తెలియదన్నది ప్రచారం చెయ్యటంలో వారికి చాలా ఆనందం ఉండేది పేరు మోసిన రచయితలు చేత కాకుండా రాసిన సినేరియోలు నాకు చూపించి, "చూడు, బ్రదర్ పేరుపడ్డ రైటర్స్‌ను మేము తీసుకొవటంలేదంటారు వాళ్ళు ఎలా రాస్తారో చూడు!" అన్న నిర్మాతలు ఇద్దరుండేవారు వారిలో ఒకడు తాను నియమించిన కవినిగురించి నాతో ఒకసారి " ఆయన నేను చెప్పందే రాసి తెచ్చి నాకు చూపిస్తాడు" అనీ, వారం తిరిగేలోపల, "సీన్ రాయమంటే ఏమేమిటో రాస్తాడు కనీసం నేను చెప్పింది రాసినా నాకు చాలు!" అనీ అన్నాడు శాస్త్రిగారు ఈ చచ్చు సంస్కృతిలో కూరుకు పోవటం నాకు చాలా బాధగా వుండేది ఆయన ఓర్పును నేను మెచ్చుకోవటానికి

ఎంతో కాలం పట్టలేదు సినిమాలకు నిజమైన గౌరవం చేకూర్చిన బహు కొద్ది మందిలో ఆయన ఒకడని లోకమంతా త్వరలోనేగుర్తించింది సినిమాల కుసంస్కారులు కూడ ఆయనను ఊరేగించక తప్పలేదు

కృష్ణశాస్త్రిగారి పాటలలో మార్దవం ఈనాడు సినిమా ప్రేక్షకులందరికీ తెలుసు కాని నేను ప్రత్యేకంగా కనిపెట్టాననుకుంటున్న దేమిటంటే, ఆయన పాటలుపాడే పాత్రలు గొప్ప కవులు కానక్కర్లేదు అయినా వాటిలో స్వచ్ఛమైన కవిత్వం ఉంది! ఈ సామరస్యాన్ని సాధించిన జీనియస్‌ను విశ్లేషించటం నాకు సాధ్యం కాలేదు

శాస్త్రిగారు ఆఖరుసారి జనవరి 25న మా ఇంటికి వచ్చినప్పుడు కారు దిగలేక పోయారు నేనే కారుదగ్గరకు వెళ్ళి మాట్లాడాను నన్నూ, నాభార్యనూ తమ ఇంటికి రమ్మన్నారు ఆయన నన్ను కలుసుకున్నప్పుడల్లా రమ్మంటూనే వుంటారు ఇద్దరమూ జబ్బు మనుషులం నేను కిందటిసారి నాభార్యతో వారింటికి వెళ్ళినప్పుడు ఆయన కిందికి రాలేని స్థితిలో వున్నారు నేను మెట్లు ఎక్కి పైకి వెళ్ళే స్థితిలో లేను దాదాపు రెండు గంటలపాటు బుజ్జాయితోనూ, అతని భార్యతోనూ, ఇతరులతోనూ మాట్లాడి ఆయనను చూడకుండా వచ్చేశాను అందుచేత ఈ సారి శాస్త్రిగారితో ''తప్పకుండా వొస్తాను మెట్లుకూడా యెక్కుతాను'' అనిమాట యిస్తూ అన్నాను

నా మాట నిలబెట్టుకున్నాను ఫిబ్రవరి 25 ఉదయం వెళ్ళి మెట్లెక్కి, ఆయన భౌతిక కాయాన్ని ఆఖరిసారి సందర్శించాను

*'ఆంధ్రజ్యోతి' వారపత్రిక 28-3-1980 (ఉగాది సంచిక)*
*పునర్ముద్రణ కళలు, శాస్త్రీయ విజ్ఞానం*

# 30. రుక్మిణీ నాధ శాస్త్రి

''ఇతనెవరో తెలుసా? కొడవటిగంటి కుటుంబరావు ''

రుక్మిణీనాధశాస్త్రి నాకేసి ఎగాదిగా చూసి శ్వాస ఎగబీల్చి ''కాదు!'' అన్నాడు

''అదేమిటి?'' అన్నాడు నన్ను పరిచయం చేసిన వ్యక్తి అశ్చర్యంతో సాహిత్య రంగంలో నకలులేని వ్యక్తిని పరిచయం చేసుకోబోతున్నానని అప్పుడే అనుకున్నాను

''కుటుంబరావైతే కోరలూ, రక్తనేత్రాలు, చేతిలో బరిశెలూ అవీ'' ఏవీ?'' అని అడిగాడు రుక్మిణీనాధశాస్త్రి

ఆ విధంగా ప్రారంభమయింది మా పరిచయం గుంటూరు నవ్య సాహిత్య పరిషత్సమావేశంలో

అటుతరువాత మేం అడపాదడపా కలుస్తూనే వచ్చాం ఆరోజుల్లో నాకతడు అభినవ నారదుడులాగా కనిపించేవాడు ప్రతిచోటికీ వెళ్ళేవాడు రచయితలందరినీ ఎరుగును ఊరికే ఎరగటం కాదు వాళ్ళనూ వాళ్ళ రచనలనూ, జీర్ణించుకునేవాడు మనుషుల్లోనూ, రచనల్లోనూ ఉండే అయువుపట్లు పసికట్టడంలో అతన్ని మించిన వేటకుక్కలుంటారనుకోను ఆ శక్తి పేరడీల రూపంలో కొంతవరకే వ్యక్త మయింది

1940-42 మధ్య నేనూ, అతనూ కలిసి ఆంధ్ర వారపత్రిక చూస్తూ ఉండిన రోజుల్లో శ్రీ పాదవారి ''వడ్లగింజలు'' సీరియల్‌గా వేశాం (రుక్మిణీనాధశాస్త్రి ఆ రచనకు ''బహుబ్రీః'' అని పేరుపెట్టాడు ) శ్రీ పాదవారికి పాత్రల మనఃప్రవృత్తులను చేతలద్వారా వ్యక్తీకరించటం మహోయిష్టం, రుక్మిణీనాధశాస్త్రి ఈ గుణాన్ని ఉదహరించటానికి ''యాజులు పూటకూళ్ళమ్మకేసి చూశాడు, పూటకూళ్ళమ్మ శంకరప్పకేసి చూసింది, శంకరప్ప కప్పుకేసి చూశాడు,'' అని ముక్త సరిగా అన్నాడు

నేను మెచ్చుకున్నాను విశ్వనాధ సత్యనారాయణగారి ధోరణి ఏమిటని అడిగాను

రుక్మిణీనాధశాస్త్రి మోహం గంభీరంగా పెట్టి ''ధర్మారావు వచ్చెను ''అన్నాడు చాలునన్నాను సత్యనారాయణ రచనల్లో ధర్మారావు వంటి వ్యక్తి రావటమే ఒక గొప్పసంఘటన

రచయితలా, రచనల ఆయువుపట్లు పట్టటంలో రుక్మిణీ నాధుడికి గల శక్తి తాలూకు మరో ప్రదర్శన చాలా మందికి తెలియదేమో ఒకరోజు బెజవాడలో చలంగారింటికి నేనూ, రుక్మిణీనాధుడు వెళ్ళాము శ్రీశ్రీ కవిత్వం విషయం ప్రస్తావన వచ్చింది రుక్మిణీనాధుడు శ్రీశ్రీ ''జీవఫలం - చేదువిషం - చేదువిషం - జీవఫలం - ఔను నిజం, ఔను నిజం '' అన్నది మృదువుగా చదివాడు చలంగారి కళ్ళ వెంబడి అశ్రువులు జలజలరాలాయి ఆ పొడి మాటలను రుక్మిణీనాధుడు కన్నీరు తెప్పించేటట్టుగా ఎట్లా చదవగలిగాడంటే చెప్పటం కష్టం అతనిలో ఆశక్తి ఉండేది అతను ఉత్త పేరడీ శాస్త్రుల్లు మటుకుకాడు

ఒకసారి అతను రైల్లో మద్రాసు వస్తూ పైబెంచీ మీద పడుకున్నాట్ట కింది బెంచీ మీద కూర్చున్న వాళ్లెవరో ఏదో పత్రిక చదువుతున్నారుట రెండుమూడు వాక్యలు చెవినిపడగానే అతను కిందికి తొంగిచూసి ''అది రాసింది కుటుంబరావు''అన్నాట్ట నిజమేట

సాహిత్యమంటే అభిలాష ఉండేవారున్నారు ఏన్సైక్లోపీడియాలాగా ప్రతి రచనా జ్ఞాపకం పెట్టుకునే వాళ్లూ ఉన్నారు రుక్మిణీనాధుడిలాగా ఇంతమంది రచయితల సారాన్ని సంగ్రహించిన వాడు మరొకడుండడేమో అతని ''సాహిత్య పిపాస అనన్యమైనది ''

అతను పత్రికా ప్రపంచంలోనే ఉండదగినవాడు ఎవరన్నా ఒక ఐడియా అందిస్తే చప్పున దాని ఒడుపు గ్రహించి చక్కని రచన చేసేవాడు ఒకసారి చక్రపాణిగారు బెంగాలీ పత్రికల్లో నుంచి ఒక ఐడియా చెప్పారు గొప్ప వాళ్ళు ప్రతి చచ్చు వ్యాపారానికి సిఫార్సులివ్వటం వెంటనే రుక్మిణీనాధుడు అ ఐడియాను దించేశాడు ఒక కూరల అంగడివాడికి విశ్వనాధ సత్యనారాయణా, తల్లావఝుల శివశంకరశాస్త్రి మరొకరు యోగ్యతా పత్రాలిచ్చినట్టుగా వ్యాసం రాసాడు చాలా చక్కగా వచ్చింది

ఎన్నో శక్తులూ, స్నేహపాత్రంగా, మేధాతృష్ణగల రుక్మిణీనాధశాస్త్రిలో అనేక సంఘర్షణలుండేవి తనకు ఇంగ్లీషు రాదన్న దిగులుండేది నిజానికి అందువల్ల అతనికొచ్చిన లోటేమీ లేదు తన ప్రవర్తన సక్రమంగా ఉన్నట్టున్నదేమోనని చేతికర్ర ఒకటి ఏర్పాటు చేసుకున్నాడు అనవసరం ఇవి చిన్న ట్రాజెడీలు పెద్ద ట్రాజెడీ అతను రేడియోలో చిక్కుకుపోవటం కాని ఆర్థిక కారణాలు తెచ్చిపెట్టే ట్రాజెడీలంత అనివార్యమైనవి ఏమీ ఉండవు రేడియో ఆర్టిస్టుగా అతను రచనవెనక ఉండే సహజ ప్రేరణలను ఎండగట్టుకున్నాడు బతికినన్నాళ్లూ బాలా కుమారుడుగా ఉండదగినవాడు వార్ధక్య లక్షణాలకు క్రమంగా గురి

అయాడు  అతను మద్రాసు నుంచి వెళ్ళిపోక మునుపే ఏ పాండి బజారులో నైనా కలిస్తే, ''అబ్బాయి కులాసా? అమ్మాయి కులాసా? వరూధిని ఆరోగ్యంగా ఉందా?'' అనటంతో ప్రసంగం ముగిసే స్థితివచ్చేసింది  రుక్మిణీనాధశాస్త్రి వంటివాడు అదృశ్యమైపోతే ఏమీ మిగలకపోవటం మరీ పెద్ద ట్రాజెడీ

*ముద్రణ   ఆంధ్రజ్యోతి వారపత్రిక, 23-8-1968*

# 31. మునిమాణిక్యం గురించి

''      అతని పేరూ, యింటిపేరూ వినగానే మునిమాణిక్యంవారి నరసింహారావు '' ఏమండోయ్ మీకో అబ్బాయిగాని, కనీసం అమ్మాయిగాని వుంటే నేనొచ్చి ఒక దెబ్బ కొట్టాలి!'' అన్నాడు  రామ్మూర్తి తెల్ల మొహం వేశాడు  ''ఎందుచేతనంటే, మీ నాన్నగారు చిన్నతనంలో నాకు మేష్టరు  నన్ను నిష్కారణంగా కొట్టారు'' అన్నాడు మునిమాణిక్యం  దేనికి కొట్టారని ఎవరో అడిగారు  ''పొడుమ్ముకు్క మేష్టారు'' అని నల్లబల్లమీద రాస్తూంటే రామ్మూర్తి తండ్రిగారు చూసి కొట్టారుట  మరీ అన్యాయం ఏమిటంటే పొడుమ్ముకు్క మేష్టారు రామ్మూర్తిగారి తండ్రిగారు కారట  ఈ కధవిని అందరూనవ్వారు

*(ఎం పి పేరుతో అట్లూరి పిచ్చేశ్వరరావు మునిమాణిక్యం '' ఇంటావిడతో పోట్లాట''*
*(గంధ సమీక్షలో ఉదహరించాడు )*
*ముద్రణ   విశాలాంధ్ర దినపత్రిక, 29-6-1958*

# 32. కొవ్వలి

మీరు శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావు గారి షష్ట్యబ్దపూర్తి మహోత్సవం జరపటం నాకెంతో ఆనందాన్ని కలిగిస్తున్నది  తెలుగులో పఠనాశక్తి పెంపొందించటానికి కృషి చేసిన వారిలో ఆయన ప్రధముడు  ఆ కృషిఫలితాన్ని ఈ నాడు అనేక పత్రికలూ, రచయితలూ అనుభవించుతూ ఉండటం మనం చూస్తున్నాం  ఆ ఫలితం ఆయనకు అంతగా దక్కకపోవడం శోచనీయం

*కొవ్వలి సావనీర్, 1972*

# 33. ఆలూరి బైరాగి కవి

సాహిత్య సముద్రంలోకి అనేక దిక్కులనుంచి నదులు వచ్చి చేరుతాయి  దాని విజృంభణకు సూర్యచంద్రులూ, వాయువూ, ఇతర భూతాలు లాగా అనేక శక్తులు తోడ్పడతాయి

జీవితం అనేకరంగాలతో కూడుకున్నది  ప్రతిరంగంనుంచీ సాహితీపరులు రావటం మనకు తెలుసు  రచయితల రచనలవాతావరణంలో పెరిగి, సాహిత్యపుగాలులు పీల్చినవారు

సాహితీ పరులు కావటంలో ఏమంత వింతలేదు కాని సంస్కరణాభిలాషులూ, రాజకీయ వాదులూ, వైద్యులూ, లాయర్లూ, ఒక్కొక్కసారి నటులూ, కార్మికరంగం పని చేసేవారూ మొదలైనవారిని వారివారికి సన్నిహితంగా గల జీవితం రచనలకు పురికొల్పుతుంది వారు తమ వృత్తి జీవితాలనుంచీ జీవితసత్యాలను తెలుసుకుంటారు అలాంటివారికి రచన చేసే ఉత్సాహమూ, శక్తీ తోడయేసరికి సాహిత్యం పుట్టుకొస్తుంది ఇలాటి పేరూ ఏదీ లేకుండా బతుకు తెరువుకోసం సాహిత్యరచనచేసి 'కమర్షియల్' సాహితీపరులు అయే అవకాశం ఇప్పుడిప్పుడు కలుగుతున్నదేమోగాని లోగడలేదు

బైరాగి నాకు దగ్గిర అయినది చక్రపాణి గారి ద్వారా నేను మొదట చూసినప్పుడు బైరాగి ''టీనేజర్'' అతను రాయిస్టులవెంట తిరుగుతున్నట్టు తెలిసింది కాని అప్పటికే కవిత్వం రాసే ధోరణి వున్నట్టు నాకు చక్రపాణిగారు చెప్పేదాకా తెలియదు

నా ఉద్దేశంలో అచ్చంగా సాహిత్య సంప్రదాయిం ప్రేరేపించి కవులూ కథకులూ అయిన వారికన్న, జీవితాన్ని విశ్లేషించే సాధన ఏదో ఒకటి-రాజకీయ సిద్ధాంతమో, మనోవిజ్ఞానమో, న్యాయజ్ఞానమో, గాఢమైన జీవితానుభవమో - కొలబద్దగా పెట్టుకొని తమ కళ్ల ఎదట ఉన్న జీవితానికిభాష్యం చెప్పేరచనలు చేయగలవారు సార్థకమైన రచనలు చేస్తారు వాటితో పాఠకలోకంలో ఒక భాగాన్ని కదిలిస్తారు

బైరాగి జీవితాన్ని విశ్లేషించటానికి తోడ్పడిన ప్రధానాయుధం ''రాయిజం'' అనుకుంటాను దాని సహాయంతో బైరాగి కవి తన భావాలను ఆవిష్కరించుకునే శిల్ప సంపదను తెలుగు, హిందీ కవితల నుంచి నేర్చుకుని, వాటిని అలాగే కాపీ చెయ్యకుండా, సొంత బాణీ ఒకటి సృష్టించుకుని, తన కవితలతో పాఠకులలో చైతన్యం కలిగించగలిగాడని నేను అర్థం చేసుకున్నాను

మంచిరచనకు కొన్ని ప్రమాణాలున్నాయి ప్రతీ రచనకూ ఒక లక్ష్యం ఉంటుంది అది ఎంత సూక్ష్మమైనదైతే దాని గురి అంత నిర్దుష్టంగా ఉండాలి వెనకటికి ఒక వేటగాణ్ణి '' ఆ పక్షి కంటిని కొట్టగలవా?'' అంటే ''కుడి కన్నా , ఎడమకన్నా ?'' అని అడిగాడు! రచయితకు కూడా గురి ఉండాలి అది ఎంత బాగా ఉంటే, రచన యొక్క ప్రభావం పాఠకుడిమీద అంత బలంగా ఉంటుంది

గొప్ప రచనలకు మరొక లక్షణం ప్రజలలో సాహిత్యాభిలాషను విస్తరించగలగటం దాదాపు అర్ధశతాబ్దంక్రితం కపిలవాయి రామనాథశాస్త్రి గ్రామఫోనురికార్డులిస్తే ఎన్నడూ పాటలు వినటానికి ఉత్సహించని వాళ్ళు గ్రామఫోన్లు కొన్నారు దేవులపల్లివారూ, శ్రీశ్రీ, ఆరుద్రలలాంటివారు ఎన్నడూ పద్యాలను లక్ష్యపెట్టని వారిలో పద్య పఠనాసక్తి కలిగించారు ఇంకా పూర్వం తిరుపతి వెంకట కవులు దాదాపు ప్రతి విద్యార్థిచేతా కవిత్వం రాయించారని చెబుతారు!

బైరాగి కవితలద్వారా కవిత్వశక్తిని గ్రహించినవారు ఉన్నారని నాకు తెలుసు

నాకు తెలిసినంతవరకు బైరాగికి గల సామాజిక విశ్వాసాలు-నా దృష్టిలో నిర్దుష్టం కానట్టు కనబడినా - చాలా స్పష్టంగా, అయోమయమూ, పులుముడూ అనేవి లేకుండా ఉండేవి ఆ విశ్వాసాలు కాలగమనంతో, బైరాగి జీవితానుభవంతో మారటంకూడా నాకు తెలుసు ఏ

దశలోనైనా బైరాగి సామాజిక భావాలు స్ఫటికంలాగా విస్పష్టంగానూ, నిర్మలంగాను ఉండేవి అందుచేత అతని కవితలు చదివి ఆనందించటానికి అతని భావాలతో ఏకీభవించనవసరం లేకపోయేది ఇది కవిలో చాలా అపూర్వమైన గుణం అనుకుంటాను కొందరు ప్రయోజనాత్మకమైన రచనలు ఘాటుగానే చేస్తారు అయితే ప్రయోజనంతో ఏకీభవించనివారిచేత తమరచనలు చదివించలేరు అలా చదివించగలిగిన ఆధునిక తెలుగు కవులను వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు ఆ వేళ్ళలో ఒకటి నిస్సందేహంగా బైరాగిది!

*ఆలూరి బైరాగి సంస్మరణ సంచిక, మద్రాసు, 1979*

# 34. నేనెరిగిన చక్రపాణి

నాకు చక్రపాణితో పరిచయం 1935లో మాపరిచయానికి ఆధారం సాహిత్య పరమైనది అప్పటికే ఆయనకు హిందీ,బెంగాలీ సాహిత్యంతో ప్రగాఢమైన పరిచయం ఉన్నది ఆయనవద్ద బెంగాలీ, హిందీ మాస, వారపత్రికలు గుట్టలు గుట్టలుగా ఉండేవి నాకు కొన్ని రాగూరు కథలూ, గోరా నవలలు తప్పిస్తే బెంగాలీ సాహిత్యం గురించి ఏమీ తెలీదు హిందీ సాహిత్యం గురించి ప్రేమచంద్ పేరు మినహా దాదాపు ఏమీ తెలియదని చెప్పొచ్చు రాజశేఖర్ బోస్ (''పరశురాం'') రవీంద్రనాధ మైత్రా, శరత్, ''వనఫూల్ మొదలయిన బెంగాలీ రచయితల రచనలు నాకు లభ్యం కావటానికి కారణం చక్రపాణి పరిచయమే

చక్రపాణి ఆ రోజులలో ఆసక్తితో చదువుతూ వచ్చిన పత్రికలలో ముఖ్యమైనది ''శనివారేర్ చిటీ'' అనే బెంగాలీ పత్రిక కొందరు బెంగాలీ మేధావుల సమిష్టి కృషితో, వ్యంగ్య-హాస్య సాహిత్య సాంస్కృతిక పత్రికగా అది వెలువడేది ఆధునిక విజ్ఞానమంతా ఇంగ్లీషు భాష ద్వారానే వెలువడుతుందన్న భ్రమ నాకు ఆనాడే పోయింది ఎందుకంటే నేను ''డయలెక్టిక్స్'' అనే మాటకూడా వినని రోజులలోనే చక్రపాణి ఆ విషయం బెంగాలీ పత్రికలలో చదవటం జరిగింది

చక్రపాణి అనువాదాలు కొన్ని నేను యుద్ధానికి ముందు కాలంలోనే చదివాను ఆయన కొందరు బెంగాలీ ప్రముఖ రచయితలతో ఉత్తరప్రత్యుత్తరాలు ఇంగ్లీషులో జరపటానికి నేను కొంత సహాయం చేశాను చక్రపాణి అనువాదాలు విశిష్టమైనవి తాను అనువదించదలచిన రచనల స్వారస్యాన్ని పూర్తిగా గ్రహించటమేకాదు, చక్రపాణికి వాటిని దాదాపు తెలుగు రచనలు అనిపించేటట్టు పునఃసృష్టి చేసే శక్తి కూడా ఉండేది (రుక్మిణీనాధశాస్త్రి ఏదో అనువాద గ్రంధంమీద విమర్శిస్తూ, ''అనువాదం చక్రపానీయంగా ఉన్నది,'' అని రాశాడు ) అప్పటికే మాలో చాలా మందికి చక్రపాణి అనువాదమంటే ప్రామాణికమైనదనే

1935 లోనే మొదటిసారి ''యువ'' పత్రిక పెట్టి నాలుగైదు సంచికలు తెచ్చాను అది ఆగిపోయింది తరవాత ''యువ'' పేరుతో కొన్ని పుస్తకాలుకూడా ప్రచురించాను అదీ సాగలేదు తరవాత కొంత కాలానికి ''యువ''ను తిరిగి పత్రికగా ప్రారంభించటారికి నేను పూనుకున్నప్పుడు చక్రపాణి దానికి ఒక మకుటం - ''మూకం కరోతి నా చాలం'' - అన్నది

సూచించాడు ఆ మకుటంతోనే ''యువ'' రెండోసారి వెలువడింది కాని నా చేతిమీదుగా ''యువ'' వర్ధిల్లనేలేదు ఆ పేరు చిరస్థాయి చేసిన ఘనత చక్రపాణికే దక్కింది

నా మిత్రులు బి ఎన్ రామారావు గారూ, పి పుల్లయ్యగారూ బెజవాడలో ఆఫీసుపెట్టి, చక్రపాణిని తాము తీయబోయే చిత్రానికి రచయితగా పెట్టుకోగోరారు చక్రపాణికి ఆ ఇద్దరితోనూ వ్యక్తిగతమైన పరిచయంలేదు అందుచేత 1939 లో చక్రపాణి వెంట నేను కూడా తెనాలినుంచి బెజవాడవెళ్ళి ఆయనను పుల్లయ్యగారి ఆఫీసులో దిగబెట్టాను తరవాత వారు కొల్హాపూరులో ''ధర్మపత్ని'' సినిమా తీశారు

చక్రపాణి గ్రహణశక్తి అసాధారణమైనది ఆయనను ఏ కొత్తరంగంలో ప్రవేశపెట్టినా దాని అంతుకనుక్కొని, ఆ రంగంలో ఏళ్ళతరబడి కిందా మీదా అవుతున్న వారికన్నహెచ్చు జ్ఞానం సంపాదించగల సూక్ష్మబుద్ధి చక్రపాణిది ''ధర్మపత్ని'' పూర్తి అయేలోపల ఆయనకు చిత్ర నిర్మాణం గురించి ఆమూలాగ్రం తెలిసి ఉండాలి అయితే ఆయనకు మరొక సినిమా ''చాన్స్'' వాహినీ వారి ''స్వర్గసీమ'' లోనే వచ్చింది

ఆ మధ్య కాలంలోనేను పత్రికా రంగంలో ప్రవేశించాను నేనూ, రుక్మిణీనాథశాస్త్రి ఆంధ్ర వారపత్రిక చూస్తూ ఉండేవాళ్ళం ఆ కాలంలో చక్రపాణి హాస్యరచనలు కొన్ని వెలువడ్డాయి అందులో ఒకటి ''చక్రపాణీ ఫిలిమ్స్ వారి గజేంద్రమోక్షం'' తీయబోతున్నట్టు ప్రకటన అందులో - ''కావలెను పాడగల ఏనుగూ, పట్టగల మొసలీ కావలెను షరా మోత్ ఆర్గన్ వాయించే సర్కస్ ఏనుగులు అవసరం లేదు ''

దీని తరవాత ''చక్రపాణీ ఫిలిమ్స్ వారి గజేంద్రమోక్షం విడుదల ప్రముఖుల అభిప్రాయాలు '' ఆ రోజులలో సారధీ వారి ''మాలపిల్ల'' మీద చెలరేగిన దుమారం మీద ఈ రచన సెటైర్

ఆంధ్ర వారపత్రికలో నేను కొన్ని శ్రీశ్రీ సర్రియలిస్టు రచనలు వేశాను చక్రపాణి అదే ధోరణిలో ఒక సర్రియలిస్టు కవిత పంపాడు అది చాలా మందికి తగిలే రచన కాని ఎవరి మటుకు వారు అంతా తమమీదనే అనుకొన్నారు అయితే అందులో తమ మీద ఉన్న ''నింద'' ఏమిటో ఎవరికీ అంతు బట్టలేదు నిజానికి అందులో ఎవరిమీదా నిందలేదు ఏమీ అనకుండానే ఇతరులను ''గిల్టీ''గా ఫీలయేటట్టు చెయ్యటం గొప్ప విద్యకాదా

యుద్ధకాలంలో చక్రపాణి ప్రచురించిన సొంత కథలు వ్యంగ్య హాస్యపూరితమైనవి అవి "పాతమంగలి", "తోకచుక్క" అనే సంపుటాలుగా యువప్రచురణలలో వెలువడ్డాయి

''స్వర్గసీమ'' విడుదల ఆయిన తరువాత చక్రపాణి పూర్తిగా సినిమా మనిషి అయినట్టు భావించవచ్చు పాత సంపర్కాలు కొన్ని పోయి, కొత్త సంపర్కాలూ, కొత్త వాతావరణమూ ఆయనకు ఏర్పాటయాయి అది ఒక రకం పునర్జన్మ బొత్తిగా స్తబ్దజీవితం గడిపేవాళ్ళను మినహాయిస్తే చురుకుగా కార్యకలాపాలలో మునిగితేలే ఏ బుద్ధి జీవి అయినా అనేక జన్మలు ఎత్తక తప్పదు అయితే చక్రపాణికి గతం చివరిదాకా సజీవంగానే ఉంటూ వచ్చింది దశలు మారి, హోదా పెరిగి ధనం సంపాదించినవాళ్ళు తమ గతాన్ని మరిచిపోవటం సహజం కాని

చక్రపాణిలో ఎన్ని మార్పులు వచ్చినా, గతం ఆయనకు సజీవంగానే ఉండింది ఏ అవకాశం దొరికినా ఆయన గత స్మృతులు ఆసక్తితో నెమరు వేసుకునేవాడు వర్తమాన సమస్యలపట్ల ఆయన దృక్పథంలో ఎన్ని మార్పులు ఏర్పడినా తన పూర్వానుభవాలపట్ల ఆయన వైఖరి ఏమీ మారినట్టు కనబడేదికాదు మనిషి మారటమనేది ఆయన దృష్టిలో దాటరాని నియమం ఆయనకు తన పాత ఫోటోలు చూడబుద్ధి అయేదికాదు

చక్రపాణిలో అరువు తెచ్చుకున్న సంస్కృతి నాకెన్నడూ కనబడలేదు ఆయన సంస్కృతి పూర్తిగా ఆయనదే చిత్రనిర్మాణంలో కూడా ఆయనది ఒక ప్రత్యేక సంస్కృతి తన చిత్రాలను పత్రికలు పొగడాలన్న దుగ్ధ ఆయనకు ఏన్నడూలేదు, కాని తన చిత్రం ఆర్థిక విజయం సాధించలేకపోతే అది ఆయన ప్రాణానికి అపజయమే ఆయినకు తెలిసినంతవరకు చిత్రం విజయవంతం కావటానికి ఆర్థిక కొలబద్ద తప్ప మరొకటి లేదు అయినా ఆ విజయం కోసం ఆయన తన శక్తి మీద ఆధారపడినట్టుగా ఇతర ఫార్ములాలమీద ఆధారపడలేదు ఫార్ములాలను ఆశ్రయించటం ప్రతిభాశూన్యులు చేసే పని

''షావుకారు'' చిత్రం ఎన్ని ప్రశంసలు సంపాదించినా ఆయన దృష్టిలో విఫలమైన చిత్రం నిజానికి అందులో సాహిత్యపు విలువలూ, అభ్యుదయ దృష్టీ ఉన్నాయి అటు తరవాత అలాంటి దృక్పథంతో చక్రపాణి ఏ చిత్రమూ తీయలేదు కాని ఆయన స్వయంకృషిమీద మాత్రమే ఆధారపడి తీసిన చిత్రాలన్నిటిలోనూ ఆయన మేధస్సూ, హాస్యమూ, కథనాచాతుర్యమూ ఉన్నాయి అనారోగ్యంవల్ల ఆయన స్వయంకృషితో ఎక్కువ చిత్రాలు తీయలేదు 'పెళ్ళిచేసి చూడు'' ''మిస్సమ్మ'', గుండమ్మకథ'' చిత్రాలు పూర్తిగా ఆయన సృష్టే అని చెప్పాలి

ఆయన జీవిత కృషిలో అత్యుత్తమ స్థానం అలంకరించదగినది పత్రికా నిర్వహణ యువపత్రిక మాసపత్రికలలో ఒకప్పుడు భారతి సాధించినంత ఖ్యాతి సంపాదించింది యువలో తమ కథ అచ్చయితే కొండెక్కినట్టు భావించే రచయితలు ఉండటం నాకు తెలుసు యువకు పూర్వం ఆంధ్రజ్యోతి మాసపత్రికకూడా, గొప్ప ఆర్థిక విజయం సాధించలేకపోయినా, ఒక పాఠక వర్గం అభిమానాన్ని అపారంగా చూరగొన్నది ఆ పత్రికను నిలిపినప్పుడు ఎంతో మంది నా దగ్గిరనే సంతాపం వెలిబుచ్చారు, చక్రపాణి ముందు ఎంతమంది వెలిబుచ్చారో నాకు తెలియదు వారి దృష్టిలో ఆనాటి ఆంధ్రజ్యోతి అత్యుత్తమ సాహిత్య పత్రిక

చక్రపాణిపేరు దేశమంతటా మాత్రమేకాక, దేశాంతరాలకు కూడా పాకేటట్టు చేసినది చందమామ నాకు చక్రపాణితో పరిచయం కలగక పూర్వమే ఆయనవద్ద హిందీ, బెంగాలీ పిల్లల పత్రికలు ఉండేవి అలాంటి పత్రిక తెలుగులో ఎవరైనా పెట్టితే ఎంతో బాగుంటుందని ఆయనకు ఎంతో కోరికగా ఉండేది దానికి చందమామ అని పేరు పెట్టాలనికూడా ఆయన ఏనాడో అనుకున్నట్టు కనబడుతుంది అయితే పిల్లల పత్రిక పెట్టటానికి కావలసిన హంగులు చక్రపాణికి అందుబాటులో ఉండేవి కావు అలాంటి హంగులు గల వాళ్ళకు ఆలోచన ఏ కోశానాలేదు

నాగిరెడ్డి-చక్రపాణి జంట సమైక్యకృషి ప్రారంభమైనాక చందమామకు సరి అయిన దోహదం జరిగింది చందమామ ఆరంభంనుంచి నేను సన్నిహితంగానే ఉన్నాను - అందులో జీతానికి

పనిచేయకపోయినా, కొద్దికాలంపాటు చందమామమీద చక్రపాణి ప్రభావం అంతగా లేకుండానే జరిగింది కాని త్వరలోనే అది పూర్తిగా చక్రపాణి నిర్వహణలోకి వచ్చి, అయన నిశిత పర్యవేక్షణ కింద మహా వృక్షమై శాఖోపశాఖలుగా విస్తరించింది దాని విస్తరణ ఇంకా సాగుతూనే ఉన్నది

చక్రపాణితోకలిసి పని చేసినవారూ, సన్నిహితులూ ఎందరైనా ఉన్నారు గాని ఆయనచేత ప్రభావితులైనవారు చాలా అరుదు ఒక్క ఉదాహరణ చెప్పమంటే చెప్పే స్థితిలో లేను ఆయన మానసికంగా ఏకాంతజీవి ''షావుకారు'' చిత్రంలో షావుకారు పాత్రలో ఒంటరి లక్షణం చక్రపాణిదే

*ముద్రణ యువ మాసపత్రిక, నవంబరు 1975*

# 35. అభిమన్యుడు (ఎన్నెస్ ప్రకాశరావు)

ఇటీవలి కాలంలో ఇద్దరు యువకుల మరణం నన్ను దారుణంగా బాధించింది ఒకరు శ్రీరంగం రాజేశ్వరరావు, రెండోవాడు ఎన్ ఎస్ ప్రకాశరావు ఇద్దరూ అభిమన్యుడిలాంటివాళ్ళు వీరమరణంపాలయారని కాదు బతికి ఉంటే ఉజ్వలంగా ప్రకాశించదగినవాళ్ళు సాహిత్యరంగింలో నాకు పరమ ఆప్తులయినారు ఈ ఇద్దరూ

ప్రకాశరావు నాకు బంధువుకాదు అతని ఇంటిపేరూ, రెండోపేరూ ఏమిటో కూడా నాకు తెలియదు మా ఇద్దిరిమధ్యా ముఖా ముఖీ పరిచయంకూడా చాలా కొద్దిపాటిది కాని అతను నాకు రాసిన మొదటి ఉత్తరం తోనే అతను నాకు ఆప్తుడైనాడు అది సాహిత్యానికి సంబంధించిన ఉత్తరం తరువాత మేము కలుసుకుని మాట్లాడుకున్నాక అతను నాకు పరమాప్తుడైపోయినాడు నాలుగేళ్ల కాలంలో ఈ భావం బలపడిందే గాని తరగలేదు

ప్రకాశరావు నన్ను ఆఖరుసారి చూడటానికి కిందటి మార్చి 21న తన నూతన వధువుతో సహా వచ్చి, కొంతసేపు కబుర్లు చెప్పాడు అంతకు మందు మూడు రోజుల క్రితమే వివాహం నిశ్శబ్దంగా జరిగిందట ఈ వివాహం జరుగుతుందని నాకు చాలా మాసాలు ముందే తెలుసును గుంటూరులో విరసం మహాసభలప్పుడు భోజనాల దగ్గర, కాబోయే భార్యా భర్తలు నాకు చెరో వైపూ కూర్చోబోతుంటే, ఇద్దరినీ పక్కపక్క నకూర్చోబెట్టి చాలా ఘనకార్యం చేసినట్టు సంతోషించాను ఈ సంతోషం ఇంతలో విషాదమవుతుందని అనుకోలేదు

రచన చెయ్యటం మొదలుపెట్టినప్పటినుంచీ నేను ఏదో ఒక సాహిత్యోద్యమం ద్వారా చైతన్యాన్ని నిలుపుకుంటూ వచ్చాను - నవ్యసాహిత్య పరిషత్తు, అభ్యుదయ రచయితల సంఘం, అభ్యుదయ రచనోద్యమం జీవితపు ఎడారిలో ఎక్కడో ఇంకిపోయింది తరువాత పాత ''ఇనర్షియా''తో చాలాకాలం రచనలు చేశాను కాని 1964లో నా రచనలు సమాజాన్ని ఏమీ చెయ్యలేవన్న నమ్మకం కలిగి, బుద్ధి మొద్దుబారిపోయింది దాన్ని దిగంబర కవులు తిరిగి చైతన్యవంతంచేశారు విప్లవ సాహిత్యోద్యమాన్ని గురించి నాకు స్పృహ కలిగించినది వాళ్ళే

ప్రకాశరావును నాకు సన్నిహితుణ్ణి చేసినది కూడా విప్లవసాహిత్యోద్యమమే ఈ ఉద్యమంలోకి అడుగుపెట్టిన తరువాత నన్ను తీవ్రంగా ఆలోచింపజేసినవాడుకూడా ప్రకాశరావే

విప్లవ కథలు ఎలా ఉండాలి? విప్లవ నవలలు ఎలా ఉండాలి? ఈ ప్రశ్నలకు సమాధానాలకోసం అతను బుర్ర బద్దలుకొట్టుకోవడమేగాక నా బుర్రనుకూడా తెగ కెలికాడు అలాగే మరువాడ రాజేశ్వరరావు బుర్రకూడా కెలికాడు ఇంకా ఎందరి బుర్రలు కెలికాడో నాకు తెలీదు అలాటి అస్థ నేను ఏ సాహితీపరుడిలోనూ చూసినట్టు జ్ఞాపకం రావటంలేదు

మొట్టమొదటిసారి అతని ఉత్తరంలో ప్రశ్నల పరంపర చూసి అతనిది వట్టి ఆందోళన అనుకున్నాను కాని అతని ఆందోళనకు లక్ష్యం ఉందనీ, అతను ఎక్కుపెట్టిన బాణం లాటివాడనీ తెలుసుకునేటందుకు నాకెంతో కాలం పట్టలేదు మహాస్త్రంలాంటి ఈ బాణాన్ని ద్రావకం విరిచేసింది అతన్ని కోల్పోయినవారిని ఎలా ఓదార్చాలో నాకు తెలీదు వారిలో ఒకడినైన నేను నన్ను నేనే ఓదార్చుకోలేకపోతున్నాను

*రచనాకాలం, జూన్, 1973*

# 1. నా కథలు

నేను కథలు రాసి ప్రచురించటం ప్రారంభించి ఆరు సంవత్సరాలు దాటింది జనసామాన్యానికీ, పాఠక లోకానికి నా కథలను గురించి ఎటువంటి అభిప్రాయం ఉందో తెలుసుకోవటానికి నాకు అవకాశం దొరకలేదు నా మీద గల అభిమానం చేతనైతేనేమీ, నాకు ప్రోత్సాహం యిచ్చే సదుద్దేశంతోనైతేనేమి చాలా మంది పెద్దలు నా రచనలను నా ప్రోద్బలం అవసరం లేకుండా శ్లాఘించారు ఒకరిద్దరు మరి కొంచెం పైకి వెళ్ళి నా మాదిరిగా కథలు రాసే వాళ్ళు లేరనే దాకా వెళ్ళారు వారి సదభిప్రాయాలకు నేను కృతజ్ఞుణ్ని

అయితే ఆ సదభిప్రాయాలకు నేను చలించలేను ఒకరి మెప్పు కోసం ఇంతవరకు నేను ఏ కథా రాయలేదు నాకు ఒకటే ఆశయం నా రచనల వల్ల కూడా మనోవికాసం పొందదగిన వాళ్ళు తెలుగువాళ్ళలో వుండితీరాలి, వారందరూ నా కథలు చదవాలని నా కోరిక వారందరికీ నా రచనల మీద ఎంత త్వరగా ఏవగింపు కలిగితే అంత ఉపకారం చేసిన వాళ్ళవుతారు తెలుగు సారస్వతానికి, అప్పటికి తెలుగు సారస్వతానికి నాతో పని అయిపోతుంది నా కథలు చిరస్థాయిగా ఉండిపోవాలనే ఆశ నాకు ఏ కోశానా లేదు

ఇంకా ఎప్పుడో పుట్టబొయ్యే వాళ్ళ కొరకు రాస్తున్నాననే అహంకారం కూడా నాకు లేదు నేను ఆకాశం నుంచి ఊడి పడలేదు నాకు పూర్వం కథలు రాసిన వారు ఎక్కడ వదలిపెట్టారో నేను కథా రచనను అక్కడే అందుకోగలను కాని అంతకుపైన ఎట్లా అందుకోగలను?

అనేక కారణాల వల్ల నేను పత్రికలకు పంపటం మానుకున్నాను

కొద్దిమంది ధనికులు ఒక కళను పోషించటమనేది రుచించలేదు కళను ఎవరెవరు అనుభవించగలుగుతున్నారో వారి వల్లనే కళ పోషించబడాలి తెలుగులో జయప్రదమైన పత్రిక ఒక్కటి లేదు అందుచేతను ఆయా పత్రికలు తమ రచయితలకు ఏమీ ఇవ్వలేవు ఏ దాత అయినా ఇస్తుంటే అది ''ముష్టి'' అన్న మాటే కాని వేరొకటి కాదు లేదా పత్రికలకు రచయితలు వ్యాసాలను ఉచితార్థం పంపాలి నాకీ రెండు పద్ధతులు సరిపడవు అదీగాక కథలు రాసినంత వేగిరంగా అచ్చువేసే పత్రికలు - రచనలకు ప్రతిఫలం ఇచ్చే పత్రికలు కూడా లేవు నా కథలు నలుగురి కథలతో పాటుగా పత్రికలలో ప్రకటించబడుతూ ఉంటే నా కథలు ఎంతమందికి కావాలో తెలియటం అసంభవం పత్రిక ఎన్నివేల కాపీలు అమ్మినా, నలుగురూ నన్ను మెచ్చుకున్నారు గదా అని కళ్ళు మూసుకొని తృప్తిపడే కంటే కేవలమూ నా కథలే కలిగిన గ్రంథం ఒక వెయ్యి కాపీలు అమ్మినా నాకు గర్వించటానికి కొంత అవకాశం ఉంటుంది ఈ కారణాల వల్ల నేను కథలను పత్రికలలో ప్రచురించటం మానుకున్నాను ఇకముందు నా రచనలు ఈ విధంగానే సంపుటాలుగా ప్రకటించబడతై

ఇక నేను సారస్వతానికి చెయ్యజూస్తున్న ఉపకారాన్ని గురించి

నేను ప్రచారకుణ్ణి కాను, ప్రతి సమస్యనూ నేను రెండు వైపులనించీ చూడగలను

నేను సహజంగా ఉండేటటువంటి కథలు రాయటానికి కంకణం కట్టుకోలేదు ఈ సంపుటంలోనే అసహజంగా కనిపించే కథలు రెండు మూడున్నై

నేను నీతులు కూడా బోధించను అమలులో ఉన్న నీతి చట్టానికి విరుద్ధంగా ప్రవర్తించిన వారిని నేను సమర్థించుతూ రాసిన కథలు కూడా ఈ సంపుటంలో లేకపోలేదు ఆ కథల్లో నీతి ఉన్నదని ఎవరైనా భావించినట్టయితే వారందరూ ఆ విధంగా ప్రవర్తించటానికి నేను అనుమతించిన వాణ్ణి అవుతాను నేను అనుమతి ఎంతమాత్రమూ ఇవ్వటం లేదు

ప్రతి విషయాన్నీ నూతన దృష్టితో చూడటం నాకు చాలా ఇష్టం అదేసరి అయిన దృష్టి అని నేను వాదించను మరికొంత కాలానికి మరొక దృష్టితో ఆ విషయాన్ని చూడగల సమర్థుడు రావచ్చును

సారస్వతం బోధ చెయ్యగూడదని నా నమ్మకం సరి అయిన సారస్వతం మనలో ఆలోచనలు రేపి ఆలోచనాశక్తిని వృద్ధిపరచి వదిలెయ్యాలి

నా పాత్రలలో నేను ఒకటైపోవటం నాకిష్టం లేదు అటువంటి రచనలను నేను ఉత్తమ తరగతిలో వెయ్యలేను కథలలో పాత్రలను కథకుడు ఎందుకు నిర్బంధించాలో నాకు అర్థం కాకుండా ఉంది నా విశ్వాసాలను నేను నా పాత్రల మీద గాని పాఠకుల మీద గాని ఎందుకు పామాలి?

''అనంతం'' కథలో భగవంతుడున్నాడనే నమ్మకాన్ని ఆకాశానికెత్తాను అది నా విశ్వాసం కాదు అట్లాగే 'పెంకిపిల్ల'' అనే కథలో కొసక ఒక ప్రశ్న వేశాను ఆ అనుమానం నాది కాదు

ఈ సంపుటాలలో మొదటి కథను గురించి ఒక ముక్క చెప్పవలసింది Strand Magazine లో కొన్ని మాసాల క్రితం The quality of Mercy అనే కథను చదివి ఆనందించాను అది చదవక పోయినట్టయితే నేను ఈ ''కారుణ్యం'' అనే కథను రాసి ఉండను

*తన మొట్టమొదటి కథా సంపుటి 'కారుణ్యం' (1937)కి రాసుకున్నముందుమాట*

# 2. వ్యాఖ్యానం

నా కారుణ్యం మీద పత్రికలు చేసిన విమర్శలు చూసిన తరువాత నాకు విమర్శకులను గురించి పెద్దగాకనువిప్పయింది నా భాష బాగుంటుందన్న వారున్నారు, బాగా లేదన్నవారున్నారు నా కథలుపాశ్చాత్య కథలల్లే ఉన్నవన్న వారున్నారు అచ్చదేశీయమైన కథలన్నవారున్నారు కథలు బాగానే రాసేవాళ్ళలో నేను కూడా ఒకణ్ణని అంగీకరించిన వారున్నారు కథలు రాసే వైనం నాకు తెలిసినట్లే కనపడుతోందని సంశయించిన వారున్నారు! - నన్ను గురించి ఇట్లా ఒకరు చెప్పినట్టు ఒకరు చెప్పకుండా, చెప్పారు కాని ఆ కథలను ప్రచురించి పాఠక లోకానికి పనికివచ్చే ముక్క ఒక్కటయినా చెప్పాలని ఏ విమర్శకుడికి తట్టలేదు

న్యాయంగా జరిగి ఉండవలసిందేమిటంటే ముందు నా కథలకు ఎటువంటి విలువ అయినా ఉన్నదో లేదో నిర్ణయించి ఆ తరువాత నన్ను గురించిన విమర్శ చెయ్యటం మనకు అవసరం లేని వస్తువును గురించి గంటసేపు బేరం ఆడం! ఒక కథలో కొంత గుణం కనిపించితేనే గాని ఆ కథ రాసినవాణ్ణి గురించిన ఆలోచన నేను చెయ్యను నాకు అవసరం లేని కథలో శిల్పం ఉంటే నాకేం లేకపోతే నాకేం? భాష బాగుంటేనేం? అసహ్యంగా ఉంటేనేం?

''కథ ఏమిటి? ఎందుకు రాశావు? ఇది ఇట్లా రాయటంలో నీ అభిప్రాయం ఏమిటి?'' అని నన్ను స్వయంగా అడిగి, నా సమాధానంతో తృప్తిపడి వెళ్ళిపోయిన పెద్దమనుషులున్నారు విమర్శకులకు కూడా అటువంటి సందేహాలు కలిగినప్పుడు నన్నడిగి తమ సందేహాలు తీర్చుకుని ఉండటం వారి విధి తమకు అటువంటి సందేహాలున్నట్టు ఇతరులకు తెలియనివ్వటం ఇష్టంలేక ఈ విమర్శకులు తమకు తెలుసుననుకునే భావన గురించీ కథా శిల్పాన్ని గురించీ, అంతు లేకుండా రాసుకురావటం ప్రారంభిస్తారు ''హిందూ'' పత్రిక ''కారుణ్యం'' గురించిన విమర్శ నాలుగు పంక్తులలో ఇమిడ్చినట్టు ఇమిడ్చేవారిని నేను తప్పు పట్టను కాని పత్రికల్లో రెండు మూడు కాలములో రెండు మూడు పేజీలో ''కారుణ్యం'' మీద విమర్శ కింద వ్యయం చేస్తూ అందులో ఉన్న కథలను గురించి చర్చించకపోవటంలో నేను పైన చెప్పిన అర్థం తప్ప మరేమీ ఉండటానికి వీలు లేదు

అది అట్లా ఉండగా మనకు ఒక కత చప్పున అర్థం కాకపోయినప్పుడు, అందులో ఏమీ ఉండి ఉండదనుకోటానికి ఎంత అవకాశం ఉందో అందులో ఏదో గొప్ప అర్థం ఉందనుకోవటానికి కూడా అంత అవకాశం ఉంది

అన్నివిధాల ఉపయోగంగా ఉంటుందని ఈ సారి నా కథలకు నేనే వ్యాఖ్యానం రాస్తూ విమర్శకులు ఏమి చేయవలసింది సూచిస్తున్నాను

విమర్శించటం అవసరమని భావించినవారిని గురించే చెబుతున్నాను -- నా కథలను విమర్శించవలసిన అవసరమే లేదన్నవారు మరీ పెద్దలు!) అందువల్ల కూడా సరిఅయిన విమర్శన రాలేదని తోచినట్టయితే - ఆ తోచటంలో కొంత ఆత్మవంచన తావు ఉండదని నేనను! ఇంకోసరి నన్ను నేనే విమర్శించుకొంటాను ఆ పైన నా కథ మాట అటుంచి విమర్శకులు నా విమర్శనే విమర్శించవలసి వస్తుంది

''అరణ్యం'' అనే కథలో శారద చెయ్యదలచిన దానికి ఆఖరుకు ''తమ'' చేసిన దానికీ మనం ఆమోదించే నీతి యొక్క దృష్టిలో ఏమీ తేడా లేదు భాస్కరావు దృష్టిలో ఆ రెంటికి తేడా ఉన్నట్టు స్పష్టమవుతున్నది అతను తన సవతి తల్లితో లేచిపోవటానికి నిశ్చయించుకుని కూడా తన తండ్రి సంసారంలో ఉన్న అనాగరికతా అజ్ఞానాలలోపాటు అవినీతిని కూడా నిరసించుతున్నాడు ఇందులో భాస్కరావు ఆత్మవంచన ఏమీలేదని పాఠకులను నమ్మించేటందుకు ప్రయత్నించాను ఈ నా ప్రయత్నం ఎంతవరకు సఫలమయిందో, నేనటువంటి ప్రయత్నం చెయ్యటం ఎంతవరకు వివేకంతో కూడినపనో విమర్శకులు నిర్ణయించాలి

''వరాన్వేషణ'' అనే కథ ఇంగ్లీషు కథ కాదు - నాకు తెలిసినంతవరకు అనుకరణం కూడా కాదు ఇదిమన సంఘంలోనే జరగటానికి అవకాశం ఉందని పాఠకులూ విమర్శకులూ నా మాటమీద నమ్మవచ్చును ఇందులో సుశీలా పార్వతులు ''సహజమైన'' స్త్రీలు కారు, అయితే సాగర్‌కోసం ఇద్దరూ కొట్టుకుని ఉండేవారే వారిద్దరికీ ఉన్న సంస్కారం లేని సామాన్య స్త్రీకి మెప్పుతో మొహం మొత్తదు!

''కాలభైరవుడు'' నీతితో కూడుకున్న కథ ఆ కథ యొక్క నీతి కథ చివరనే ఉంచాను నీతితో కూడుకున్న కథ ఆధునికంగా ఉండటానికి అవకాశం ఉందనీ, కథయొక్క నీతి కథ

చివర ఉండటం వల్ల కథ యొక్క అందం ఉందనీ నిరూపించటానికి ఇది రాశాను ఈ కథలో కుక్కను గురించి మనం నేర్చుకోదగినది మనిషికి కూడా వర్తించుతుందని మనం తెలుసుకోవాలి

ఉగ్గుపాలతో మనకు జీర్ణమవుతున్న అసంస్కారం వల్ల ఎంత హాని కలగటానికి అవకాశం ఉందో సూచించటానికి '' ఇంతలో ఉంది!'' అనే కథ రాశాను అతను తెలివితక్కువవాడూ అజ్ఞానీ కాకపోయినా, తన డబ్బు తన భార్య తినటం సరి అయినదనీ, తన భార్య డబ్బు తను తినటం తప్పనీ అపోహపడ్డాడు ఈ అపోహే అతని సంసారం విచ్ఛిన్నం కావటానికి కారణభూతమయింది పాఠకులు గమనించవలసిందేమంటే తమ ఎడబాటుకు తన అసంస్కారమే కారణభూతమయిందని అతనికి '' ఇప్పటికీ'' తెలియదు

'అశోకవనం' అన్న కథకూ శ్రీ ముద్దుకృష్ణగారు రచించిన 'అశోకం' అనే నాటకానికీ ఏమీ సంబంధం లేదు వాల్మీకి రామాయణం కంటే, ముద్దుకృష్ణ గారి అశోకం కంటే ఇది ఎక్కువనుకోటానికి అవకాశం లేదు కాని రావణుడికి ఎవరూ చెయ్యని న్యాయం కొంత ఈ కథ ద్వారా చేశానని నేను నమ్ముతున్నాను

'పశ్చాత్తప్తుడు' నా ఊహానించి ఊడిపడిన వ్యక్తి అని నేను చెప్పలేను మన దేశంలో అతను ఎక్కడపడితే అక్కడే ఉండవచ్చును కాని ఆఖరుకు అతను చేసిన ప్రతిజ్ఞను నేను శ్లాఘిస్తున్నాననే కాని అతని మీద దెబ్బతియ్యటం లేదు

ఇందులో ఉన్న కథలు ఎక్కువ భాగం ఆయా పాత్రల స్వగతాలుగా రాసి ఉండటం వల్ల దీనికి 'స్వగతం' అని పేరు పెట్టటమయింది

*తన రెండో కథల సంపుటం 'స్వగతం' (1938) కి*
*చివర రాసిన వ్యాఖ్యానం*

# 3. నా స్వగతం

నాకు మన విమర్శకుల మీద ఎక్కువైన అభిప్రాయం లేదని, అదివరకే బహిరంగంగా తెలియజేసుకున్నాను నా స్వగతానికి నేనే వ్యాఖ్యానం రాసుకోవటానికి కూడా అదే కారణం సమర్థులైన విమర్శకులు లేరని తోచినప్పుడు ఎవరి రచనలకు వారు వ్యాఖ్యానాలు రాసుకోవటంలో మహాపాతకమేమీ లేదు వ్యాఖ్యానాన్ని విమర్శ కింద గణించే విమర్శకులుండటం నాకు విమర్శకుల మీది అభిప్రాయాన్ని బలపరుస్తున్నది

నా కథలు చప్పున అందరికి అర్థం కావటం లేదన్న విషయం నా అంతట నాకు తట్టినది కాదు అది కాలక్రమాన నాకు అవగాహన అయిన సంగతి నాలుగైదేళ్ల క్రితమే ఒక దినపత్రికలో (ఇప్పుడది అంతరించిపోయింది) నా కథలు ''పూర్వం'' ఒకటి రెండుసార్లు చదివితేనే కాని అర్థం అయేవి కావనీ, '' ఇప్పుడిప్పుడు'' ఎన్నిసార్లు చదివినా అర్థం కాకుండా ఉండే కథలు రాయటానికి నేను కంకణం కట్టుకున్నాననీ ఒకరు అభిప్రాయం వెలిబుచ్చారు ఆ అభిప్రాయాన్ని అప్పట్లో నేను సరిగా పాటించలేదని ఒప్పుకుంటాను కాని రాను రాను నన్ను కూడా ఒక కథకుడి కింద కట్టి కొందరు పత్రికా సంపాదకులూ, తదితర పరిచితులు కూడా నా రచనలను

గురించి నన్ను అనుమానాలడగటం ప్రారంభించిన తరవాత నా రచనలో లోపం నాకు అర్థం కాసాగింది (నేను ఎవరి ఉపయోగం కోసం కథ రాస్తున్నానో వారికాకథ అర్థం కాకపోవటం నిజంగా నా లోపమే మరి )

చాలా కాలం నించీ నేను అందరికీ అర్థమయ్యేటట్టే రాయాలని ప్రయత్నం చేస్తున్నాను కాని నా కథలు నాకు ఎప్పుడూ అర్థం అవుతూ ఉండటం వల్ల కథను చవుక చెయ్యకుండా, నేను కథలో ఎత్తుకునే అంశాలను ఎంత విపులీకరించితే పాఠకులకు సులభంగా అర్థమవుతుందో నా అంతట నేను ఊహించుకోలేని స్థితిలో ఉంటూ ఉంటిని నా ''కారుణ్యం'' మీది విరుద్ధ విమర్శలను గురించి ''స్వగతం'' వ్యాఖ్యానంలో చెప్పే ఉన్నాను ఆ వ్యాఖ్యానం ఎంతో అవసరమని తోచిన మీదటనే అది రాశాను ఒకరిద్దరు విమర్శకులు నాకు ఆపాదింపించిన అభిప్రాయాలు కేవలమూ నిరాధారాలు అవి వారి inferiority complex మాత్రమే ప్రకటిస్తున్నవని చెప్పటానికి నాకు చాలా విచారంగా ఉంది

నేను స్వగతానికి రాసిన వ్యాఖ్యానంలో కొందరు నా ప్రశంసాప్రేమను కనిపెట్టారు మరికొందరు నా అహంకారాన్నీ, ఆత్మశ్లాఘా పరాయణత్వాన్నీ కనిపెట్టారు ఆ వ్యాఖ్యానం రాసినందుకు నన్ను తప్పుపట్టిన వాళ్లలో నన్ను మెచ్చుకునే వాళ్లూ, నా స్నేహితులూ ఉన్నారు సాఫీ అయిన తెలుగు వాక్యాలను సాఫీగా చదవకపోవటం వల్ల ఇటువంటి దురభిప్రాయాలు బయలుదేరుతై

కొన్ని ఉదాహరణలిస్తాను ''నాకథలను గురించి పాఠకలోకానికి పనికివచ్చే ముక్క ఒక్కటయినా చెప్పాలని ఏ విమర్శకుడికీ తట్టలేదు'' అందువల్లకూడా (వ్యాఖ్యానం రాసినందువల్లకూడా) సరిఅయిన విమర్శన రాలేదని తోచినట్టయితే - ఆతోచటంలో కొంత ఆత్మవంచనకు తావుండదని నేననను! ఇంకో సారి (''వచ్చేసారి'' అని ఉండవలిసింది) నన్ను నేనే విమర్శించుకుంటాను ఆ పైన నా కథలమాట అటుంచి విమర్శకులు నా విమర్శననే విమర్శించవలిసి వస్తుంది,'' ''నీతితో కూడుకున్న కథ ఆధునికంగా ఉండటానికి అవకాశం ఉందనీ, కథయొక్క నీతి కథ చివర ఉండటంవల్ల కథయొక్క అందం చెడదనీ నిరూపించటానికి ఇది (కాలభైరవుడు) రాశాను '' ఇటువంటి వాక్యాలు విమర్శకుల గొంతులకు పచ్చి వెలగకాయలవలె అడ్డం పడుతూ ఉన్నై

నాకథలను గురించి పాఠకలోకానికి పనికివచ్చే ముక్కలు చెప్పమనటం నన్ను మెచ్చుకోమనటం కింద కట్టివేసిన విమర్శకుడికి విమర్శన అంటే ఏమిటో తెలుసునని ఎట్లా భావించటం '' ఈ పుస్తకాన్ని ఎవరూ చదవరేమో అనే అభిప్రాయంతో గ్రంథకర్తే పుస్తకాధిక్యాన్ని చెప్పదలచుకొన్నట్లు కనబడుతుంది'' అని ''ప్రతిభ'' 22లో అంటున్నారు ''రా సు'' అనే ఒకానొక వ్యక్తి ఈ అభిప్రాయాన్ని రుజువుచెయ్యటానికి నావ్యాఖ్యానంలోనించి శ్రీ రా సు గారు ఎన్ని వాక్యాలు ఎత్తిచూపగలరు?

సరిఅయిన విమర్శన అనేది రాలేదని నేను అనుకోవటంలో ఆత్మవంచనకు నాకు అవకాశం ఉందని నేను ఎరిగి ఉన్నట్టు స్పష్టంగా మనవిచేసుకున్నాను అది ఎవరికీ అవసరమైనట్టు కనిపించదు

కథ యొక్క నీతి కథ చివర ఉండటంవల్ల కథయొక్క అందం చెడదని నిరూపించటానికి నేను కాలభైరవుడు రాశాను అని అనేసరికి ''కాలభైరవుడు'' అందంగా ఉందని నేను ఆత్మప్రశంస

చేసుకున్నాననే అపోహతో కాబోలు బుర్రా వెంకట సుబ్రహ్మణ్యంగారు ''కాలభైరవుడు అందంగాలేదు'' అని అనేశారు నేను రాసిన వాక్యంలో కాలభైరవుడు అందంగా ఉందనే అర్థంలేదు ఆ నీతి తీసి వెయ్యటంవల్ల అది ఉన్నదానికి అందంగా ఉండదు అని మాత్రమే ఉంది విమర్శించుతున్న గ్రంధాన్ని ఎదురుగా ఉంచుకుని వ్యాకరణ దోషాలు లేని తెలుగువాక్యాన్ని అర్థం చేసుకోవటానికి ఒక తెలుగువ్యక్తి ఊహించటం మొదలుపెట్టవలసిన అవసరమేమిటో నాకు తెలియకుండా ఉంది

నన్ను విమర్శించేవాళ్ళు నేనంత తేలికగా ప్రతిమామ్మాయికీ జగ్గాయికీ దొరికిపోయ్యేటట్టు రాసేవాణ్ణి కానని తెలుసుకోవటం మంచిది నేను అహంకారినీ, గర్విసీ, ఆత్మవంచకుణ్ణీ, ఆత్మశ్లాఘాపరాయణుణ్ణీ, ఇంకేమేమైనా కావచ్చును కాని నాయీ లోపాలు నేనురాసే ప్రతి వాక్యంలోనూ బయట పెట్టుకుంటానని నమ్మటం నాకు అన్యాయం చెయ్యటం అవుతుంది

నాకు విమర్శకులమీద గల అభిప్రాయం నేను బహిరంగంగానే చెప్పాను అది నా అభిప్రాయం మాత్రమే! దానికి నేను ప్రచారం ఇవ్వబోను కాని నా అభిప్రాయమైనప్పటికీ బయటపెట్టాను కనక దాన్ని సమర్థించటానికి ఉదాహరణ లిచ్చాను డ్మాక్టర్లమాదిరిగానే విమర్శకులుకూడా ఆత్మసంరక్షణార్థం ఒకరితో ఒకరు ఏకీభవించవలసి ఉంటుంది ఒకసారి అచ్చుఅయిన కథయొక్క విలువ తిట్టినప్పుడు తగ్గి, మెచ్చుకోగానే పత్తిధరలాగా ఎక్కదు

అయినా నావంటి రచయితల రచనలు ప్రజా బాహుళ్యానికి ఎరుకపరిచే విమర్శకుల యొక్క ఆవశ్యకత నేను గుర్తించకపోలేదు అందుకనే కథ రాయటంలో నా అభిప్రాయం మాత్రమే నేను చెప్పి ఆ అభిప్రాయాన్ని విమర్శించే పని విమర్శకులకు వదిలిపెట్టాను అటువంటి పని అసంగతమని ఎవరైనా నిరూపించవలసి ఉంది

''అతివినయం ధూర్తలక్షణ''మని నమ్మినవాణ్ణి కావటంచేత నేను ''రా సు'' గారి సలహా ప్రకారం ''సవినయంగా పరిచయ వాక్యాలు'' రాసుకోలేదు 'నేను వట్టి చవటను, గడ్డితిని ఈ గ్రంథం రాశాను దీన్నిండా తప్పులే అయినా పండితులైన తమరు ఇందులో తప్పులు విసర్జించి ఒప్పులే గ్రహించండి'' అని పీరికలో రాసుకున్న రచయితయొక్క గ్రంథాలు బుద్ధిమంతుడెట్లా చదవగలడు? నేను వ్యాఖ్యానం రాసుకోవటం కొందరికి కంటకింపుగా ఉండటానికి ఒకటే కారణం ఉంది - ఆ వ్యాఖ్యానంలో 'నేను'' కర్తగాకల వాక్యాలు చాలా ఉన్నై! అందులో అంతకంటె తప్పేమున్నదో ఎవరు చూపినా నేను వారికి శాశ్వతంగా కృతజ్ఞుణ్ణి అయి ఉంటాను

ఇక స్వగతంలో కథలను గురించి

మొదటిది ''అరణ్యం'' ఇందులో ''భాస్కరరావుపాత్ర కొంత ప్రకృతివిరుద్ధంగా ఉంది'' అని ''రా సు'' గారు, దానికి కారణం ''కథాప్రారంభంలో అతను (భాస్కరరావు) అరణ్యానికి ఇంచుమించు తగిపోయేటట్లు చెప్పి (''మాట్లాడి'' అని అభిప్రాయం) చివరకుమాత్రం మామూలు ప్రపంచంలోసంఘ సంస్కర్తల జాబితాలోచేరాడు '' కథారచనలో అభిప్రాయమే ఇంచుమించు అది అందులో సామాన్యజీవితానికి కొంచెం కిందుగా ఉండే ఒక అరణ్యాన్నీ, సామాన్యజీవితానికి కొంచెంపైగా ఉండే ఇద్దరువ్యక్తులనూ కల్పించాను

భాస్కరరావు అరణ్యానికి సరిపెట్టుకుపోయిన 'వేదాంతి' ఆఖరుకు తన వేదాంతాన్ని విసర్జించి మానవప్రపంచంలో పడుతున్నాడు అందులో కథానాయికవంటి స్త్రీని నేనెన్నడూ చూడనిమాట నిజమేకాని ఇకముందు చూడనని భయంలేదు నాకు మనోవైజ్ఞానికంగా ఆ పాత్రల నిర్మాణంలో తప్పున్నదని ఎవరైనా నిరూపించవలసి ఉంది ఆ కథలో వచ్చిన మిగతా పాత్రలనన్నిటినీ నేను స్వయంగా చూశాను చూడని వారిదృష్టికవి అసహజంగా కనిపిస్తే దానికి నేను బాధ్యుణ్ణి కాదు ఆ కథ కంగారుగా ఉందన్నారు బుర్రా వెంకట సుబ్రహ్మణ్యంగారు ఎందులో కంగారు? శిల్పంలోనా, భాషలోనా, భావనలోనా? ఆ కథ చదవగానే '' ఇది జరిగి ఉండవచ్చును!'' అని అనిపించేకథ కాదు ''అరణ్యం'' నాకథలు ఆ విషయంలో సహజంగా ఉండవని నేను ''కారుణ్యం''లోనే మనవి చేసుకున్నాను సహజంగా ఉండని కథ వల్ల ప్రయోజనం లేదని ఎవరు వాదించటానికి సాహసించుతారు? ''కాకీ-నక్క'' కథ సహజంగా ఉందా? నా వ్యాఖ్యానం తప్పుపట్టటానికి కాకుండా చదివినవారికి, ఆ కథ రాయటంలో నా అభిప్రాయం ఒకరినీతి ఒకరికి వర్తించదని తెలియజేయటమేనని సులభంగా అర్థమౌతుంది నా ప్రయత్నం మంచిదో కాదో, అందులో నేను సఫలుణ్ణి అయినానో కాలేదో చెప్పకుండా, విమర్శకులు నేను మరోపని ఏదోచెయ్యలేదని ఎంతరాస్తే ఏం లాభం?

''ప్రేమ'' అనేది వాఙ్మయంలో బాగా ప్రవేశించింది పూర్వులు ''ప్రేమ'' అనేదాన్ని ఇప్పుడు మనం వాడుతున్న సంకుచితార్థంతో వాడేవారు కారు వారు మోహమూ, కామమూ అన్న భావాలసమ్మేళనాన్ని మనం ప్రేమ అనటం ప్రారంభించుతున్నాం భావి నాగరికతలో ఈ ప్రేమకూ వివాహానికీ కొంత బాంధవ్యం ఏర్పడబోతున్నది 'సెంటిమెంటాలిటీ'తో కూడుకోని వివాహం గురించి ఒక కథ రాయాలని సంకల్పించుకున్న తరవాత దానికి పాత్రలను మనసంఘంలోనే కొంతవరకు పాశ్చాత్యనాగరికత అబ్బినవ్యక్తులను తీసుకోకతప్పకపోయింది ఎందుచేతనంటే మన పల్లెటూరి గ్రామాల్లో పాత సంప్రదాయికులు చేసే వివాహాల్లో 'సెంటిమెంటాలిటీ' ఎప్పుడూలేదు అట్లా ఉండటానికి అవకాశం ఉండి కూడా లేకుండా జరిగిన వివాహానికి పాత్రలు బి ఏ దాకా చదివిన బాలవితంతువు సుశీలా, మొదటినుంచీ బ్రాహ్మసామాజికుల ధోరణిలో పెరిగిన భద్రమూ, పార్వతీ నాకు దొరికారు స్వగతపు ధోరణిలో రాసిన ''వరాన్వేషణ'' అనే కథలో పార్వతీ, భద్రమూ బ్రాహ్మసామాజికులు అని చెప్పించవలిసిన అవసరం నాకు కనిపించలేదు ఆ మాట చెప్పటంవల్ల ఆకథయొక్క శిల్పం బాగుపడి ఉండేదని ఎవరికైనా తోస్తే వారిది చదివి ఆ కథను మరింత బాగా ఆనందిస్తారని నమ్మటానికి నాకేమీ అభ్యంతరం లేదు వారు పాశ్చాత్య సంప్రదాయాలు గమనించేవారు కావటమే నాకు అవసరమై ఉండింది ఆ కథలో సంభాషణతో అసంతృప్తి చెందినవారు ఆ వాక్యాలలో కొన్ని చాలా భాగం - ఇంగ్లీషులోకి తర్జుమా చేసుకుంటే అంత అసహ్యంగా ఉండదని నమ్ముతున్నాను ఆ పాత్రల సంభాషణాధోరణి మామూలు తెలుగువాళ్లు మాట్లాడినట్టు ఉండగూడదనే అభిప్రాయంతో ఆ సంభాషణ అట్లారాయటమయింది '' ఇంగ్లీషుకథ'' అని అభిప్రాయం పడిపోయిన తరవాత పాఠకుడు లేనిచోట కూడా ఆ పాత్రల ప్రవర్తన పాశ్చాత్యుల ఆచారాలకు సరిపుచ్చాలని ప్రయత్నంచెయ్యటానికి వీలుంది ఉదాహరణ భద్రం సుశీలను పెళ్లి చేసుకోమని అడగటానికీ ఆమె ఒప్పుకోటానికీ అనంతరం పాఠకుడు

వారిద్దరూ Engage అయినట్టు ఊహించుకుని కథను మరింత పాశ్చాత్యంగా చెయ్యవచ్చును ఈ విధంగా కథలో ఉన్న దానికంటే ఎక్కువ ఊహించుకోకుండా ఉండగలందులకే ఆ కథ ఇంగ్లీషుకథ కాదు, అనుకరణంకూడా కాదని మనవిచేశాను అప్పటికీ నామాట నమ్మనివారిని నేనేం చెయ్యగలను? ''దైవమిచ్చిన భార్య'' అని వెంకటచలంగారు "Passionate Friends" అనే H G Wells నవలను అనుసరించి రాస్తూ ఆ గ్రంథంలోనే అది అనుకరణమని ఒప్పుకున్నారు దాన్ని విమర్శిస్తూ ఒక విమర్శకుడు '' ఇది అనుకరణం ఆ మాట దాచిపెట్టారు'' అంటే వెంకటచలంగారు ఏంచేశారు కనక?

స్వగతంలో మూడోకథ ''కాలభైరవుడు'' ఇందులో ఉన్న కథలన్నిటిలోకీ నా అభిప్రాయంలో ఇది ఉత్కృష్టమైనది దీనికి ఒక నీతి ఉందనే కాదు ఇటువంటి కథ రాయటం సులభం కాదు నేను మళ్లీ ఇటువంటి కథ ఇంకొకటి రాయటానికి ఎంతకాలం పడుతుందో చెప్పలేను ఇందులో ఉన్న ముఖ్య పాత్ర ఒకకుక్క (దీనికి శ్రీనివాసరావు కథానాయకుడని భ్రమపడవలసిన అగత్యం లేదు ఇది 14 పేజీల కథ నాలుగో పేజీలోనే కుక్క విషయం వచ్చింది ) ఇతర కథలలో ముఖ్య పాత్రలను ప్రవేశపెట్టినట్టు కాకుండా ఈ కుక్కనం ఈ కథలో పాఠకులకు ప్రవేశపెట్టటంలో కొంత తెలివితేటలు వినియోగించగలిగాననుకుంటున్నాను కథ చదివేటప్పుటు పాఠకుడు కథలో పాత్రలలో దేన్నో ఒక దాన్ని నమ్మలేకపోతే చాలా ఇబ్బంది ఉంది ఈ కథలో ఉన్న విషయం పాఠకులు సులభంగా నమ్మజాలనిది శ్రీనివాసరావు శాస్త్రీయమైన శోధన చెయ్యటానికి ఉద్యుక్తుడైనా మూఢవిశ్వాసపరుడు ఆ కుక్కే '' ఆదినారాయణ'' అనే అభిప్రాయం అతనికి ఎప్పుడో పడిపోయింది కనక ఆ పాత్రవల్ల పాఠకులకు ఏమాత్రమూ లాభంలేదు అందుకని పాఠకులను నమ్మించగల మరొకపాత్రను ప్రవేశపెట్టాను అతనే కథచెబుతాడు ఆ కుక్క '' ఆదినారాయణో'' అని అతనెప్పుడూ నమ్మలేదు కాని ఆ కుక్క సామాన్యమైన కుక్క కాదనీ, దానికి మనిషిని అర్థం చేసుకునే శక్తి ఉందనీ అతను నమ్మగలిగాడు పాఠకులు కూడా అంతవరకూ నమ్మాలి అది నమ్మిన తరవాత మిగిలినకథ సులభంగా అర్థమౌతుంది తనకు ప్రసాదించబడిన అసామాన్యశక్తిని వినియోగించి మానవుణ్ణి వంచించాలని చూసింది మానవత్వానికి కొద్ది పాటి అర్హతగల తను దేవత్వానికే గాలంవేసింది మానసికంగా అది దాదాపు మనిషి అయినా శారీరకంగా అది కుక్క మాత్రమే తనశునకత్వాన్ని దాచాలని అది చేసిన ప్రయత్నం ప్రకృతి విఫలంచేసింది ఆ కుక్కకు రుగ్మత ప్రారంభమయింది మానవులను వంచించిన కుక్క తన biology జయించలేక దొంగ వేషాలు ప్రారంభించింది కొన్ని సార్లు పట్టుబడ్డదికాని దాని శునకత్వాన్ని బయటపెట్టడానికి మూఢలోకానికి సాహసం చాలక పోయింది ఆఖరుకు దేవత్వం ఆ కుక్కకు ఒక పెద్ద తద్దినమయింది ఆ కుక్క తన భక్తులను నడిసముద్రంలో ముంచి తనశునకత్వం సార్థకం చేసుకొటానికి పరారి అయిపోయింది అది ఒక ఆడకుక్క వెంట పోతూండగా ఒక ఆసామి చూసినప్పుడు దాని ఆరోగ్యం చాలా బాగుపడింది తనకు ఉన్న కొద్దిపాటి శక్తితో సాధించదగినదానితో తృప్తిపడక అధికమైన దానికి ఆశించి ఈ ప్రయత్నానికి అడ్డువచ్చే తన ప్రకృతిని అణిచిపెట్టాలని ప్రయత్నించి దెబ్బతిని ఆఖరుకు తనకు ప్రసాదించబడిన కించిత్తూ విసర్జించి ప్రకృతికి వశుడైన నిర్భాగ్యుడు ఈ ప్రపంచంలో అక్కడక్కడా కనిపిస్తూ

ఉంటాడు సన్యాసం పుచ్చుకుని తిరిగీ కాపరం పెట్టినవారందరికీ ఈ కథలో ఉన్న నీతి అర్థమౌతుంది కొందరు సన్యాసులు చాటుగాచేసే దురాగతాలను పాపభీతి చేత కప్పిపెట్టేవారికి కూడా ఈ కథనించి నేర్చుకోవలిసింది కొంత ఉంది మానవత్వం పరిపూర్ణం చేసుకోగలిగిన మానవుణ్ణి మెచ్చుకోలేని లోకం కొంచెం మానవత్వం చూపిన పశువును దైవంకింద ఆరాధించటానికి సిద్ధపడుతుంది జీవితంలో ఇటువంటిది జరిగితే అది మౌఢ్యం అనిపించదు అందుకని ఈ కథలో ఉన్న కుక్కను దేవుడుగా భావించక దాన్ని శాస్త్రీయంగా విమర్శించగల మనుషులను ఇద్దరిని ఉంచాను అందువల్ల ''భక్తుల'' అవివేకం స్పష్టంగా తెలిసిరావటానికి అవకాశం ఉంది

ఈ ''కాలభైరవుడు'' ఇంత అసహజంగా కనిపిస్తున్నప్పటికీ నేను రాసిన కథలలో ఇంత కంటె సహజమైనకథ లేదు ఎందుచేతనంటే ఈ కథ చాలా వివరాలతో సహా నిజంగా జరిగింది కాని నిజంగా జరిగినప్పుడది కుక్క కాదు ఎద్దు ప్రత్యక్షంగా జరిగినప్పుడీకథకు నీతిలేదు నీతి నేను స్వయంగా కల్పించాను

''ఇంతలో ఉంది'' అనేకథ ''పశ్చాత్తప్తుడు'' అనే కథమాదిరిగానే చెప్పదగిన విశేషం అట్టే లేనిది ఈ రెంటినిగురించీ వ్యాఖ్యానంకూడా అనవసరంగా రాశాను వాటిల్లో ఉన్న విషయం అంత విదితంగా ఉండి ఉండటంవల్ల కాదుకద, బుర్రా వెంకట సుబ్రహ్మణ్యంగారి కారెండు కథలూ కొంతవరకైనా నచ్చింది?

ఇక మిగిలింది ''అశోకవనం '' నేను ఈ కథ రాయటంలో రామాయణాన్ని తిరగరాశాను ''ప్రతితరంలోనూ చరిత్ర తిరగ రాయవలసి ఉంటుంది'' అని ఒక పెద్దమనిషి అన్నాడు నేను పురాణాలను చరిత్రగానే భావిస్తూ వస్తున్నాను నేను వాటిని అంతవరకన్నా విశ్వసించినందుకు నన్ను ఎగతాళిచేసినవారున్నారు ఈ రామాయణభాగాన్ని తిరగరాయబూనినప్పుడు నన్ను నేను వాల్మీకితోగాని, నా కంటె ముందే ''అశోకం''రాసిన ముద్దుకృష్ణగారితో గాని పోల్చుకోలేదు వాటితో కొంతవరకు అసంతృప్తి చెందటంవల్లనే నేను మళ్లీ ''అశోకవనం'' అంటూరాశానని సులభంగా ఊహించవచ్చును నా అసంతృప్తి కారణాలు నా అశోకం వేళాకోళానికి కాకుండా చదివిన వారికి ఎవర్కైనా సులభంగా అర్థమై ఉండును వాల్మీకి రామాయణం మార్చి ఇంకొక రామాయణం రాయటం నాపని అయినట్టయితే, రాముడికీ సీతకూ అన్యాయంచెయ్యటమే నాపని అయినట్టయితే రాముడు రావణుడిచేత చచ్చినట్టూ, సీత రావణుడి భార్య అయినట్టూ రాసి ఉందును

రావణుడికి విమానం ఉండేదనీ, ఒకకోతి సముద్రం లంఘించిందనీ అనుకోవటంవల్ల నా సంస్కారానికి జరగని అవమానం రావణుడు సీతను లంకలో ఖైదుచేశాడనీ, రాక్షస స్త్రీలను ఆమెకు పోలీసులుగా పెట్టాడనీ, రాముడు లోకోపకారార్థం వాలిని చాటుగా నుంచుని కొట్టాడనీ, శూర్పణఖముక్కు చెవులుకొయ్యటం లక్ష్మణుడికి ధర్మమేననీ, విభీషణుడు భ్రాతృద్రోహికాడనీ అనుకోవటంవల్ల కలుగుతున్నది రావణుడు సీతను చెరచదలిచినట్టయితే సీతకు దిక్కెవరు? రాక్షసులను కాపలా పెట్టకపోతే సీత ఎక్కడికి పారిపోగలదు? ఆమె భర్త కోసం తపించి ఆత్మహత్య చేసుకునేటంతటిపతివ్రత అయితే ఆమె చావు వల్ల రావణుడికి ఏం నష్టం ఏ విధంగానూ మృత్యువుకు లొంగని రావణుడికి నలకూబరుడి శాపంవల్ల హాని

కలుగుతుందనుకోవటం కంటె, ఒకసారి రంభను చెరిచిన రావణుడికి అటువంటి పనియొక్క హైన్యము తెలిసివచ్చిందనుకోవటం సహజంకాదా?

వేదవిభజనచేసి నాలుగవబ్రహ్మ అనిపించుకున్న రావణాబ్రహ్మ సీతను తీసుకొని వెళ్ళిన రావణుడు కాదనుకున్నప్పటికీ, ఈ రావణుడు ఆర్యుడు కాడని చెప్పటానికి ఆధారం లేనిమాట నిజమే కాని రాక్షసులు ద్రావిడులు కారని వాదించటానికి ఆధారం ఏముందో నేనెరగను రావణుడు ఆర్యద్వేషి అనేది నిశ్చితం

రావణుడికి నేను చేసిన న్యాయం ఎవరైనా చెయ్యవలిసే ఉంది అతనికి సీతమీద భ్రమ పోలేదని నేననలేదు రావణుడికి న్యాయం చేసే ప్రయత్నంలో సీతకుకాని రాముడికి కాని అనవసరమైన అన్యాయం జరిగి ఉంటే అది నా తప్పే సీతవంటిభర్తృపర అశోకవనంలో సీతమాదిరిగా ప్రవర్తించటం అసహజంకాదు ఆమె అప్పటికే లక్ష్మణుడిమీద మోపరాని నింద మోపి ఉంది రావణుడు తనను లంక చేర్చటంతో రాజకీయాలకుగల సంబంధం ఆమెకు తెలిసి ఉంటే లంకలో ఆమె అంత ఖేదించి ఉండదు ఆమె ఎంతోసేపటికీ తనకు కలిగిన భర్తృవియోగాన్నే అర్థంచేసుకుంది నాకథలో సీత తనంతటతను బంగారుమేడల్లో ఉండాలని వాంఛించినట్టు విమర్శకులు అభిప్రాయపడుతున్నారు ఆ మేడల్లోకంటె అశోకవనంలో ఎక్కువ హాయిగా ఉంటుందని ఆమెకు తట్టకపోవటం నాకు సహజంగానే ఉంది ఆమె లంకలో ఉన్న కాలంలో ఒక్క సారయినా కన్నెత్తి అశోకవనసౌందర్యానికి ఆనందించినట్టు మనకు నిదర్శనం లేదు నేను సీతను రావణుడితో ధాటీగా మాట్లాడగల ధైర్యంతో కూడుకున్న మనిషిగానే చిత్రించాను ఇక రాముడికి నేను ప్రత్యేకించి చేసిన అన్యాయం ఏమీ లేదు ఆ కథాధోరణిలో సందర్భానుసారంగా రాముడు చేసిన పనులు చెప్పిన మాత్రానే రాముడితత్వం నూతనదృష్టిలో కనిపిస్తుంది

రామాయణ కథ వల్ల నా సంస్కారానికి అవమానం జరగకుండా ఉండాలంటే నేను తీసుకున్న భాగంలో ఏయేమార్పులు చెయ్యవలిసి ఉంటుందో అవన్నీ చేశాను అందువల్ల ఎవరెవరి సంస్కారానికి ఎటువంటి హాని కలగగలదో నేను ఊహించగలగటం అసంభవం రచయిత ఇటువంటి విషయాలలో తన మనోవికాసాన్ని ఆధారం చేసుకుని రచన సాగించవలెనేకాని మార్గాంతరం లేదు - ఉంటే ఆ మార్గంతర మేదో నేనెరగను

కథాశిల్పకారణాల ననుసరించి అశోక వనానికి ఈ కథలో ప్రాముఖ్యత కొంత ఇవ్వవలసివచ్చింది రావణుడికి అశోకవనం మీద కల ప్రేమకు మొహం మొత్తేవారికి సీతకు రాముడిమీదగల అపార ప్రేమ మొహం మొత్తదని గ్యారంటీ ఏమిటి? లంకలో అశోకవనం ఉండటమే రావణుడి సౌందర్య పిపాసను సూచిస్తున్నది ఈ పిపాసలకు సంస్కారి వెగటు చెందడు నా ప్రత్యేక పిపాస సంగీతానికి సంబంధించినది నాకు సంగీతం మీదకల అభిరుచిలో నారావణుడికి అశోక వనం మీద నూరోవంతు మోజుకూడా నేను సూచించలేదు ఈ సంగతి తెలిస్తే బుర్రా వెంకటసుబ్రహ్మణ్యంగారు నాపేరు విన్నప్పుడల్లా ఎంతవెగటు చెందుతారో!

ఇతర విమర్శనల సంగతి నాకు బాగా తెలియదుకాని ప్రస్తుతం కథకులు ఒకరికొకరు విమర్శించవలిసినవారు కావటం కొంతదరిద్ర హేతువుగా ఉంది (అదృష్టవశాత్తూ నేను మాత్రం విమర్శకుణ్ణి కాను సుబ్రహ్మణ్యంగారు అభిప్రాయపడ్డట్టు నా వంతు ఎప్పుడన్నా

ఎవరినన్నా మెచ్చుకోవటమే నా మెప్పుకు చాలాపాత్రులైన వారిలో బుర్రా వెంకటసుబ్రహ్మణ్యంగారు కూడా ఒకరు వారి విమర్శను బట్టి వారి కథలను కొలవటానికి లేదు )

ఈ విమర్శకుల స్వంతంత్రరచనలకు అలవాటుపడినవారు కావటంచేతను వారి విమర్శలు స్వతంత్రవ్యాసాలుగా పరిణమించి అందులోకి వారి వ్యక్తిత్వం రాదగినదానికంటె సుమారు పదింతలు అధికంగా వచ్చి, విమర్శించబడేగ్రంధమూ, తత్కర్తా ఎటో అణిగిపోతారు

విమర్శలు ప్రకటించే పత్రికల అజ్ఞానానికి కూడా మేర ఉన్నట్టు కనిపించదు అది ఉదహరించటానికి నామీద ''ప్రతిభ''లో చేసిన ప్రతికూల విమర్శను తీసుకోవడం ఏమీ బాగాలేదుకాని ప్రస్తుతం నాకు అందుబాటులో అంతకంటే మంచి ఉదాహరణ లేదు (ప్రతిభ అంటే నవ్యసాహిత్య పరిషత్పత్రిక!) అందులో రా సు గారు స్వగతాన్ని గురించి చేసిన విమర్శలో కొన్ని వాక్యాలు ఎత్తి చూపిస్తాను

''అసలు కథా సంపుటికి స్వగతం అనే పేరు సరిపోవడంలేదు'' - కారణం ఊహ్యం

''వరాన్వేషణలో భద్రం సుసీని ఎప్పుడూ పెళ్ళి చేసుకొవాలె అని అనుకోలేదట కాని ఆమెసాంగత్యంమాత్రం అతనికి ఆనందం కలిగించేదట అకస్మాత్తుగా భద్రానికి ఆవేశం పుట్టి చటుక్కున ఆమెను కొండలన్నీ మారు మ్రోగేటట్టు ముద్దు పెట్టుకున్నాడు పాపం మొదటిసారి కాదూ!'' - ఆకథను గురించిన విమర్శ అంతా కలిపి ఇదే!

''అశోకవనం'' మీద విమర్శ - ''అశోకవనం''లో లంకలో ఉన్న రాక్షసులంటే కథకుని ఉద్దేశం ద్రవిడులని, రావణుడు పెద్ద కళావంతుడట!''

''పశ్చాత్తప్తుడు'' అనేకథలో పశ్చాత్తాపం ఎవరిది? - ఈ సందేహం నివారణ కాలేదీ పెద్దమనిషికి

''విమర్శకు లెవ్వరూ తన కథలలో ఉన్న స్వారస్యాన్ని బయటపెట్టడం లేదని ఈ కథకుడు స్వయంగా తన గ్రంధాన్ని ప్రశంసించుకొన్నాడు'' - అని ''రా సు '' ఊహించుకున్నాడు!

ఇంతే కాదు! మరొక ముఖ్య విషయం - ఒక పత్రికలో రెండు గ్రంధాలు విమర్శించబడితే ఆ విమర్శనలు బట్టి వాటి తారతమ్యం గ్రహించేటందుకు లేదు ఒక చచ్చుగ్రంధంలో లోపాలేవీ పట్టటానికి వీలుండకపోవచ్చును మరొక తెల్వైన గ్రంధంలో పురుగేరటానికి లక్షఅవకాశాలు దొరకవచ్చును విమర్శకులు వాటిమీద విరుచుకుని పడటం కంటె ఉచితం కాని సంగతి ఉండబోదు నా వ్యాఖ్యానంలో నేను మనవి చేసిన విషయమే అది - ''మనకు అవసరంలేని వస్తువునుగురించి గంటసేపు బేరం ఆడం! నాకు అవసరం లేని కథలోశిల్పం ఉంటే నాకేం లేకపోతే నాకేం? భాష బాగుంటే నేం? అసహ్యంగా ఉంటేనేం? అవి నా మాటలు తెలివితేటల్లో రచన ఏ తరగతికి చెందుతుందో అందువల్ల ఎవరికికాని ఏకించిత్తుగానీ అవసరం ఉండడానికి వీలుందో లేదో ఏమాత్రమూ నిర్ణయించలేకపోగా ''రావణుడు కళావంతుడట!'' అని ఆశ్చర్య పడితే విమర్శన అవుతుందా?

జన్మలో ఎన్నటికీ అవగాహనకాని అస్పష్టమైన ఆదర్శాలను పట్టుకుని వేళ్లాడే వ్యక్తులకు తమరచనలవల్ల వెంటనే ప్రజలకు జరుగుతున్న లాభమేమిటో అర్థం కావటానికి అవకాశం

లేదు పది సంవత్సరాల క్రితం కంటె ఇప్పుడు తెలుగులో ఎక్కువ తెలివైన సంభాషణ జరుగుచున్నదని నేను కళ్లారా చూసి నమ్మగలుగుతున్నాను ఇప్పటి సాహిత్యం వల్ల ఇటువంటి ఉపకారం జరుగుతూ వెళ్లటానికి ఏ విధమైన ఆటంకమూ అవసరంలేదు ఈ తెలివితేటలను మనం రచనలో వినియోగపరిచినట్టు విమర్శనలో వినియోగపరచలేకుండా ఉన్నాం దానికి కారణమేమంటే స్వతంత్రరచన చేసేవాడు తన తెలివితేటలను స్వేచ్ఛగా వెళ్ళనివ్వవచ్చును అతనికి ఆ వ్యాపారంలో మరొక వ్యక్తితో ప్రమేయం లేదు కాని విమర్శకుడు ఒకవైపున రచయితను - వివిధ రచయితలను అర్థం చేసుకోగలవాడై ఉండాలి మరొకవైపున ఆరచన యొక్క ఫలం అనుభవించేవారి మనఃప్రవృత్తి అర్థం చేసుకోగలవాడై ఉండాలి - విమర్శవల్ల ప్రయోజనం ఉండాలంటే దీనికి కూడా ఒక ఉదాహరణ చూడండి గొప్ప రచయితల మనుకునే వారంతా తెగతిట్టే ఒక పత్రికవేలకువేలు అమ్ముతుంది అటువంటప్పుడు వీరితిట్లు వీరి vanity తృప్తి పరచటానికే అవుతూ ఉంటుంది అటువంటి గతి ఉత్తమ తరగతి విమర్శలకు పట్టకుండుగాక అని నా ఆశ!

*ముద్రణ భారతి, మాసపత్రిక, ఫిబ్రవరి 1938*

# 4. నా కథా రచన

నేను కథలు రాయడానికి పుట్టాననుకోవడానికి ఆధారాలు లేవు పదో యేట ఒక స్నేహితుడికి తొమ్మిది రోజులపాటు తరగని కథ ఒకటి చెప్పాను పదమూడో యేట తలతోకా లేని డిటెక్టివ్ నవల ముందు వాక్యంలో ఏమి వ్రాస్తానో నాకే తెలియకుండా కొంత రాశాను నిజమే దాన్ని పట్టే నేను కతలు రాయడానికి పుట్టినవాణ్ణి కానని ఎవరన్నా సందేహించవచ్చు ఈ విషయం నా పదిహేడవేట గట్టిగా రుజువైంది నేను ఇంటరు చదువుతూ వుండగా కత రాయాలని '' నిజంగా'' ప్రయత్నించేసరికి నా అశక్తత చూచి నాకే ఆశ్చర్యం కలిగింది

కథ రాయడం నిజంగా ఎంత కష్టమైతే ''కథలు రాసేవాళ్లు, చచ్చు కథలు రాసేవాళ్లు కూడా చాలా గొప్పవాళ్ళే'' అనుకొన్నాను ఎందుచేతనంటే నా బుర్రలో ఒక్క సన్నివేశమూ స్ఫురించలేదు స్ఫురించినదాన్ని వాక్యాలలో పెట్టడానికి మాటలే వున్నట్లు కన్పించలేదు

''కథలు రాయాలంటే ఏం చెయాలీ?'' అని అడుగుదామన్నా నేనే కథకుణ్ణే ఎరగను

''నాకది సాధ్యమయ్యే పనికాదు'' అని రుజువు చేసుకునేటందుకే నేను పని పెట్టుకుని దీక్షగా డజన్లకొద్దీ కథలు రాసి చించి పారెయ్యసాగాను ఈ కృషి శిల్పం అలవరచుకోడానికి పనికివచ్చింది అనేక ఏళ్ళపాటు నే కథలు రాయటంలో శిల్పాన్ని తప్ప మరేమీ లక్ష్యపెట్టలేదు

మొదటినుంచీ నాకు నేనే విమర్శకుణ్ణి నా కథలు పత్రికలలో పడటం ఆరంభమైన తరువాత కూడా మా తమ్ముడు కృష్ణమూర్తికి తప్ప ఇంకెవరికీ నేను కథలు రాస్తున్నానని తెలియదు

నేనిట్లా దాగి వుండటానికి కారణం ఉంది తెలుగు పత్రికల్లో పడే కథలూ, ఇంగ్లీషు పత్రికల్లో పడే కథలూ చదివి పోల్చి చూస్తే తెలుగు కథకులు ఇటువంటి కథలు ఎందుకు రాస్తారా, పత్రికలెందుకు వేస్తాయా అనిపించేది శిల్పంలో బాగా చెయ్యి తిరిగి కథనంలో కొంత సామర్థ్యం చేకూరేవరకూ అజ్ఞాతంగా వుండటమే మంచిదనిపించింది మొట్టమొదటిసారి పత్రికలో అచ్చయిన నా కథ ''ప్రాణాధికం'' దాన్ని శ్రీ ఆంధ్ర శేషగిరిరావు

''గృహలక్ష్మి''లో అచ్చు వెయ్యడమే గాకుండా ఆ నెల ప్రకటితమైన కథలలో అగ్రస్థానం ఇచ్చినా నా భయం తీరలేదు కథా రచనలో శ్రీ ఆంధ్ర శేషగిరిరావు గారు నాకిచ్చిన ప్రోత్సాహం అంతా ఇంతా కాదు

కొత్తగా కథలు రాయటం ఆరంభించిన వారు నామాదిరిగా శిల్పానికి ప్రాముఖ్యం ఇవ్వటం నాకభ్యంతరం లేదు గాని, నా మాదిరిగా సాంఘిక ప్రయోజనాన్ని తృణీకరించమని మటుకు సలహా ఇవ్వను

నా కథలో అప్పట్లో ఏ ప్రయోజనమూ లేదని కాదు జీవితంలో నేను చూసిన మనస్తత్వాలలోని లోపాలు విమర్శిస్తూ పాత్రలను సృష్టిచేసి, ''కుటుంబరావు పాత్ర పోషణలో అద్వితీయ ప్రతిభ చూపుతున్నాడు'' అన్న మాట కూడా సంపాదించాను కాని నేనవలంబించిన వ్యక్తివాదం వల్ల నా ప్రయోజనం కొనసాగిందేమోగాని, సాంఘిక ప్రయోజనం నా కలల్లో వ్యు గ్యమయింది ఈ కాలములో సాంఘిక స్వరూపాన్ని గురించిన విజ్ఞానం ప్రజలలో బాగా వ్యాప్తి చెందింది వ్యక్తుల దుర్భావాల వల్లనే సంఘం అధోగతిలో వుందనీ, అవి మారితే ఇదీ మారుతుందనీ ఈనాడెవరూ భావించనవసరం లేదు ఆర్థిక రాజకీయ పరిస్థితులకు అనుగుణంగా మనఃప్రవృత్తులుంటాయనేది ఈనాడు సులభంగా గ్రహించవచ్చు

శిల్పంమీద కేంద్రీకరించటంవల్ల నాలో చాలా దురలవాట్లు కలిగాయి మొదటిది, ఏ విషయం తీసుకొని అయినా సరే కథ రాసెయ్యటం రెండోది, అచ్చయిన కథలను గురించి పట్టించుకోకపోవటం నేను రాసినకథల కటింగులు గూడా ఎన్నడూ దాచిపెట్టుకోలేదు ఈ విధంగా నా పాత కథలు వందకు పైగా పోయాయి మూడోది రాసుకొన్నది తిరిగి చూచుకోకపోవటం, నాలుగోది, కథలు రాసినా వాటిని ఎంతమంది మెచ్చుకున్నా తృప్తి లేకపోవటం ఆసక్తిగల కథకుడికి వుండదగిన లక్షణాలు లేవు

దీనికి తోడు ఇంకొక ఆలోచన కూడా నన్ను బాధించసాగింది నేనెప్పుడూ బుద్ధిపూర్వకంగా ఇతి వృత్తాలు 'చేతివాటు' వేయిలేదు కాని నేను వ్రాసే కథల్లో ఇంగ్లీషు ప్రభావం లేదా? అవి ఇంగ్లీషు కథలకు తర్జుమాలు కాకపోవచ్చు గాక, అయివుండే అవకాశం లేదా? నా కథల్లో ఏ కథన్నా తీసుకుని ''ఇది తెలుగు వాడు తప్ప రాయలేడు, తెలుగు వాళ్ళలో కూడా నేను తప్ప ఇంకెవరూ రాసి వుడటానికి వీల్లేదు' అనుకోడానికుందా? లేదు

'తాతయ్య' అనే కథ రాసి చాలా గొప్ప పని చేసినట్టు సంతోషించాను నా కథ చూసి నాకు తృప్తి కలగటం అదేమొదటిసారి ఆ కథను తెలుగువాడు తప్ప రాయలేడు తెలుగువాళ్ళలో కూడా నేను తప్ప మరొకరు రాసే అవకాశం లేదు 'తాతయ్య' రాసేనాటికి నేను కథారచన ఆరంభించి పదేళ్ళయింది ఆ కథతోనే నేను ఊహాప్రపంచం నుంచి వాస్తవిక ప్రపంచంలోకి రావటం మొదలు పెట్టాను ఈ రావటం పూర్తి కావటానికింకా రెండేళ్ళు పట్టింది ఈ మార్పు కంతటికీ యుద్ధం చాలా తోడ్పడింది

రచయితలకు బిడియాలు (ఇన్‌హిబిషన్స్) వుండరాదు బిడియాలు అభివృద్ధి నిరోధకాలు నేన చాలా బిడియాలతో యుద్ధం చేసినవాణ్ణి గనుక ఈ విషయం గట్టిగా చెప్పగలను కళ్ళ ఎదురుగా కనిపించే జీవితాన్ని కథలలోకి ఎక్కించడానికి నాకు బిడియంగా వుండేది నా కళ్ళయెదుట కాంగ్రెసు ఉద్యమాలూ, లాఠీ చార్జీలూ జరిగితే వాటిని గురించి నేను రాయలేదు దారిద్ర్యం నన్ను వేధిస్తున్న రోజులలో నేను ప్రణయ కథలు రాశాను

డబ్బుకోసం రాసుకునే జర్నలిస్టులు తప్ప కళారాధకులు ప్రజలకెదురుగా వుండే విషయాలను గురించి రాయకూడదనీ, ప్రజలందరికీ వుండే విశ్వాసాలను బలపరచకూడదనీ అనిపించేది కాంగ్రెసు గురించి రాసిన రెండు కథలలోనూ కపట కాంగ్రెసు వాదులను అవహేళన చేశాను కానీ కాంగ్రెసు ఉద్యమం ప్రజలలో రేకెత్తించిన ఉత్సాహాన్ని బలపరచలేదు అట్లానే తాగుడు గురించి రాసిన ఒక కథలోనూ తాగుడుకు విరుద్ధంగా ప్రచారం చేసేవాళ్ళని అవహేళన చేశాను 'అవతలి' వేపు వుండే సత్యాన్ని అన్వేషించటంలో వుండే ఉత్సాహం నాకు 'ఇవతలి' వేపు సత్యాన్ని బలపరచడంలో వుండేది కాదు ఇది చాలా నిష్ప్రయోజనకారి అని నేను ఈనాటి కథకులకు వేరే తెలియచెప్పనవసరం లేదు

సామ్యవాదమూ, సోషలిజమూ, కమ్యూనిజమూ, డయలెక్టికల మెటీరియలిజమూ, మార్క్సిజమూ అనే మాటలు నన్ను చుట్టిముట్టినప్పుడు కూడా నేను వాటిని గురించి సరిఅయిన అభిప్రాయాలు సంపాదించడానికి ప్రయత్నించలేదు జీవితం నాకు అయోమయంగా కనిపించింది ఆ అయోమయత్వం జీవితంలో స్వతస్సిద్ధంగా వుందనే విశ్వాసంతో దాన్ని కూడా కథలలో పెట్టాను వాటిని తీవ్రంగా విమర్శించినవారు లేకపోవటం నా దురదృష్టం

కాని జీవితమూ, కళలూకూడా నిత్యమూ కలిగించే అసంతృప్తినుంచి బయట పడటానికి ఎన్ని ప్రయత్నాలన్నా చేయవల్సివచ్చింది మార్క్స్ 'కాపిటల్' చదవడంతో సహా, మార్క్సిజం చదవటం నాకు చాలా మేలు చేసింది సంఘం వ్యాధిని గురించి నేను కొంత అర్థం చేసుకోగలిగాను కాని అది కూడా ముఖ్యమైన విషయం కాదు నా మాదిరిగా కథలు రాసుకునేవారికి ముఖ్యమైన సంగతేమంటే, కథలవల్ల సాధించదగిన సాంఘిక ప్రయోజనం గురించి స్పష్టమైన అభిప్రాయాలేర్పడటం

ఈ పాటి జ్ఞానోదయం కలగగానే నేను చేసిన మొదటి రచన ''కులంగాడి అంత్యక్రియలు'' అటు తరువాత కథల్లో మనస్తత్వం గురించి గాలికబుర్లు రాయడం మానేసి ఆ మనస్తత్వాన్ని ఆడించే సాంఘిక శక్తులను కూడా చిత్రించడం మొదలుపెట్టాను ''నీ కథలు వెనుక వున్నట్లుగా లేవు అవే బాగున్నాయి'' అని కొందరు అభిమానులు నన్ను హెచ్చరించసాగారు

నేను అభ్యుదయ వాదిని, సాహిత్యం ద్వారా మనుష్యులు ఉత్తేజితులవుతారనీ వారి భావాలు ముందుకు పోతాయనీ నా దృఢ విశ్వాసం

అయితే నేను మధ్య తరగతి సంస్కారం గలవాణ్ణి ఈ సంస్కారంతో నేను అభ్యుదయ రచనలు చేయగలను గాని ప్రజా సాహిత్యమూ, శ్రామిక వర్గ సాహిత్యమూ సృష్టి చేయలేను అందుచేత నా రచనలు ప్రజాసామాన్యాన్నీ, శ్రామికులనూ ఉత్తేజపర్చలేవు కాని మధ్యతరగతి వారిలో ప్రజా జీవితానికి అనుకూలించే పరివర్తన తెచ్చే అవకాశం వుంది ఈ పని ఎంత విజయవంతంగా చెయ్యగలిగితే నేనంత ఉత్తమ కథకుణ్ణిఅనిపించుకుంటాను

*ముద్రణ తెలుగు స్వతంత్ర వారపత్రిక 9-9-1949*
*పునర్ముద్రణ సంవేదన పక్షపత్రిక అక్టోబరు 1969*
*ఆంధ్రజ్యోతి వారపత్రిక 24-8-1980*
*కళలు - శాస్త్రీయవిజ్ఞానం విరసంప్రచురణ సెప్టెంబరు 1980*

# 5. నేనే కవినైతే

నేనసలు కవిగావలసినవాణ్ణి సాహితీ సమితి ఇంచుమించు మాయింటిలోనే పుట్టి పెరిగింది రోజూ నాకు కనిపిస్తూ, నన్ను పలకరించే శివశంకర శాస్త్రిగారూ, స్వామిగారూ, పూర్ణశర్మగారూ, బాబూరావుగారూ మొదలైన వాళ్ళంతా నేను చూస్తుండగా కవితాగోష్ఠి చేసేవారు నాకు దగ్గరవాళ్ళయిన మా అన్నగారూ, చారి కూడా సాహితీ సమితిలోని వాళ్ళేనాయె వీళ్ళమధ్య పెరిగిన నేను కవిని కాకపోవటమే ఆశ్చర్యం కాని ఐవుంటే ఆశ్చర్యం ఏమీలేదు కవితమ్ముళ్ళయి వుండి కవి కాని వాళ్ళు చాలా అరుదు నేను అరుదు మనుషుల్లోవాణ్ణి

అయితే నేను కవిత్వం రాయటానికి ప్రయత్నించకపోలేదు నాకు పదిమూడో ఏడు వస్తుండగా కవి కావాలనే ఆవేదన కలిగింది కవిత్వం రాయాలంటే ఏం చెయ్యాలని మా బంధువొకాయన్ని అడిగాను ఆయన నాకు ''యమాతా రాజభానస'' అనే తారక మంత్రం ఉపదేశించి దాని ప్రకారం గణాలు చూసుకోమన్నాడు బుద్ధికి తట్టిన ప్రతి మాటకూ, పేరుకూ గణాలు చూసుకుంటూ గణ సాధన చేశా ఆ రోజుల్లోనే స్వరసాధన చేసుకుంటూ ఉండటం నాకభ్యాసంగా వుండేది ఆ చేత్తోనే గణ సాధన కూడా చేశాననుకోండి

ఆ తరవాత సులక్షణసారం కొని ఆ సులక్షణసారం చదవనారంభించగానే నాకు కవిత్వం అంటే భయం ఆరంభమయింది ''యమాతారాజభానస''వట్టి ఓనమాలని నాకు తెలిసివచ్చింది ఇన గణాలూ, ఇంద్రగణాలూ, చంద్రగణాలు కాక లగమూ, గలమూ మొదలైనవి చూస్తుంటే నాకు రారెత్తింది ఈ గుణిత్వమంతా సరిచూసుకునే కంటే హాయిగా చెవిని బట్టి రాసుకుంటేను నయమనిపించింది నాకప్పటికి ఫ్రీహాండు, డ్రాయింగు అలవాటున్నది ఆ పద్ధతినే ముందు స్థూలంగా పద్యానికొక స్వరూపం ఇచ్చుకుని తరవాత neat line చేసుకొవచ్చు మచ్చుకు చూడండి

''కందము-నన-నన-నన-అర
విందము-నన నాన-ననన-వీనులలర ఆ
నందము-నానవనా-మక
రందము-నన-నానననన-రామ-నృపాలా''

ఇట్లు outline తయారయినాక నకారాలు ఎత్తేసి అక్కడ మాటలు పెడితే అదే పద్యమవుతుంది ఈ పద్ధతిని కొన్ని పద్యాలు రాసి ఒకసారి ప్రచురణార్థం పత్రిక్కి కూడా పంపాను అదృష్టవశాత్తూ అవి అచ్చుకాలేదు మంచిపనే అయింది ఎందుచేతనంటే మరికొంత కాలానికి నాకే తెలిసి వచ్చింది-పద్యాలన్నీ నిజమైన కవిత్వం కాదని

ఛందస్సే కవిత్వమైతే ఇక లేనిదేమిటీ, కాని అట్లాకాదు అప్రయత్నంగా మనం నోటంట అనే మాటలు పద్య పాదాలవుతై ఒక్కొక్క అదృష్టవంతుడు పేరు పద్యపాదం అయి ఊరుకుంటుంది నన్నయ భట్టారకుడివంటి మహాకవి ''అనవిని యాతనిట్లనియె'' అని వచనం రాస్తే అది పద్యంగా పరుగెత్తింది ''పిలకాగణపతి శాస్త్రి'' అన్నా ''సోమయాజులు వెంకటరామమూర్తి'' అన్నా పద్యాపాదాలే ''కొరకరాని కొయ్య కొడవటిగంటి కుటుంబరావు'' అని ఆరంభిస్తే అప్పుడే పద్యం నడుస్తున్నది కాని ఇది అంతా కవిత్వమా? ఒక్కనాటికీ కాదు

ఈ సంగతి గ్రహించగానే కవిత్వమంటే నాకు మరింత భయం వేసింది కవిత్వం రాయాలంటే ఛందస్సుకాక ఇంకేదో ఉండాలి అది ఉండే వచనం రాసినా కవిత్వమే అవుతుంది చూడండి

''ఏ దేశ చరిత్ర చూసినా
ఏమున్నది గర్వకారణం?
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం ''
మరొకటిని చూడండి
''నిజంగానే నిఖిలలోకం
నిండుహర్షం వహిస్తుందా
మానవాళికి నిజంగానే
మంచి కాలం రమిస్తుందా
నిజంగానే, నిజంగానే
నిఖిల లోకం హసిస్తుందా
దారుణ ద్వేషాగ్ని నిండే
దానవత్వం నశిస్తుందా ''

ఇది కవిత్వమే కాని ఇందులో ఉషస్సులూ, విపంచులూ, తమస్సులూ, ఎడదలూ, నిర్ఝరులూ మొదలైన పదజాలంలేదు అటువంటి అర్థంగాని మాటలుంటేనే కవిత్వమవుతందనే భ్రమ కూడా పోయింది కాళిదాసులోను, నన్నయ భట్టులోనూ, శ్రీనాథుడిలోనూ, కృష్ణశాస్త్రిలోనూ, శ్రీశ్రీలోనూ ఉండేదేదో నాలోలేదు వాళ్లు కవులు నేను కాను ఒకటికి పదిసార్లు అనుకుని ఏం లాభం?

ఒకవేళ వారిలో ఉన్నదేదో నాలో కూడా ఉంటే ఏం చేస్తాననేది ప్రశ్న ఆశకు అంతుంటుందా? ఎన్నైనా చేద్దామనే ఉంటుంది అయినా టూకీగా చెబుతాను

ఈకాలంలో పుట్టాను గనక నాకు సంస్కృతమే మాట్లాడే ఆ రోజుల్లో - దర్శనమాత్రం చేతనే ప్రతివాడిలోనూ కవితాశక్తి కలిగించిన ఆ భోజుడికాలంలో - పుట్టి కాళిదాసులాగా కవిత్వం చెప్పి ఉంటే ఎంత బాగుండును ఎప్పుడూ కవిత్వంలో ఓలలాడుతూ, వింజామరలు వీచే దాసిదాని చేతిగాజుల చప్పుడు మీదా, అందంగత్తెలైన దాసీజనం మీదా పద్యాలు చెబుతూ, భోజుడిచ్చే సమస్యలు పూరిస్తూ, పూర్ణిమ రాత్రులందు ప్రచ్ఛన్నంగా భోజుడి వెంట ఉజ్జయినీ పురవీధుల్లో తిరుగుతూ ఉండే వాణ్ణి

భోజుడు కవిత్వ ప్రియుడేగాని, పాపం మంచికవిగాడు ''చరమ గిరి నితంబే చంద్రబింబం లంబంబే'' అని ఎవరైనా అనుకోవచ్చు ''యువతి జనకదంబే నాథ ముక్తోష్ఠబింబే'' అనటంలోనే కవిత్వం ఉంది

''కళ్ళ ఎదట కనబడే దృశ్యాన్ని మాటల్లో పెట్టినవాడు కవా? కంటికి కనిపించని దానికి ఒకరూపం కట్టడంలోనే కవిత్వం ఉంది అట్లాగే, ''భోజనం దేహి రాజేంద్ర ఘృతసూప సమన్వితం'' అనటానికి కవి కావాలా! ''మహిషంచ శరచ్చంద్ర చంద్రికా ధవళం దధి'' అని ఉత్ప్రేక్షించేసరికి అది కవిత్వం అవుతుంది ఆవిధంగానే భోజరాజు ''దివా కాకరు తాద్భీతా''

అనటంలో ఏమీ విశేషంలేదు ''దివా'' అనటంలో ఏదో దాస్తున్నాడనేది కూడా వెంటనే అర్థమైపోతుంది అందులో గాంభీర్యంలేదు భోజుడు ఆత్రంగా బయట పడిపోయినాడు కాని ''రాత్రౌతరతి నర్మదానాం'' అనేటప్పటికి వినేవాడి భావన రేకెత్తుతున్నది రాత్రివేళ నర్మదను తరించడం సాహస కార్యమే కాని ఎందుకని ఒక ఆడది అర్ధరాత్రివేళ నర్మదను తరించాలి? ఏమో! మీరే ఊహించుకోండి కవి అటువంటి చచ్చు వివరాలు చెప్పడు భోజుడల్లేనే కాళిదాసుకూడా ఏదో దాస్తున్నాడుగాని చవుక బారుగా దాయటంలేదు ''తత్ర సంతి జలేగ్రాహా'' అన్న ముక్క ఎంత కుర్రతనంగా ఉందో వేరే చెప్పనక్కర్లేదు ''మర్మజ్ఞానైన సుందరీ'' అనటం చెప్పుతీసుక్కొట్టినట్టు మాత్రం ఉంది

కవికి భావన ఉంటుంది దానికి కవి వివశుడైపోడు దానికంటే పైగా పెరిగి దానిమీద తనకుగల అధికారం ఋజువు చేసుకుంటాడు కాళి దాసువంటి కవి అందగత్తెను చూసి, ''అయ్యో నీ మెడకింద వొంపులు చూస్తోంటే నేనేదో అయి పోతున్నాను'' అంటాడా? ''కుచ భారాత్కచభారః, కచ్చ భారాత్ భితిమేతికుచ భారః, కచ కుచ భారాత్ జఘనం, కోయం చంద్రాననే చమత్కారః?'' అని ప్రశ్నిస్తాడు భావ నఅనేది కవి వశమైనపుడే గద రససిద్ధి?

శ్రీనాధుడు ''దాహం, దాహం'' అని కేకలు వేస్తే ఎవరు చెప్పుకుంటారు

''సిద్ధిగలవారికి చెల్లును తరుణులపదియారువేల తగిపెండ్లాడన్, తిరిపెమునకిద్దరాండ్రా? పరమేశా గంగవిడువు పార్వతి చాలున్'' అన్నాడు గనుక అది కవిత్వమయింది

నిజంగా శ్రీనాధుడు గట్టివాడు శ్రీనాధుడి లాగా నైషధమూ, కాశీఖండమూ, వీధినాటకమూ, పల్నాటి వీరచరిత్ర మొదలైనవి రాయాలని నాకు లేనేలేదు నేనే కవినై ఉంటే శ్రీనాధుడిలాగా ఆపత్సమయంలో కూడా దర్జావదలకుండా ''కవిరాజు కంఠంబు కౌగలించెను గదా పురవీధి నెదురెండ పొగడదండ, సార్వభౌముని భుజాస్కంధ మెక్కెనుగదా నగరి వాకిట నన్ను నల్లగుండు' అనీ, ప్రాణావసాన దశలో సయితం, 'దివిజకవివరుగుండియల్ దిగ్గురనగ అరుగుచున్నాడు శ్రీనాధుడమరపురికి' అనీ అనగలిగితే ఇంకేం కావాలి? కథలు రాసుకునే నాబోటి వాడెవడైనా ఈ ఎత్తుకు పెరగ గిలడా?

ఒక్కొసారి ఆలోచిస్తే ఉదాత్తత కవినుంచి కవిత్వానికి సంక్రమిస్తుందా కవితనుంచి కవికి సంక్రమిస్తుందా అనేది తేల్చుకోవటంకష్టంగా ఉంటుంది ఆ గొప్పతనమంతా కవిత్వంలోనే ఉందేమోననిపిస్తుంది ''నిజదార సుతోదర పోషణార్థమై హాలికులైన ''వారంతా'' ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు, వాహనంబులు నే సొమ్ములు కొన్ని పుచ్చుకుని'' అని పోతన్నలాగా గర్జించ గలరా? పాలక వర్గాన్ని పట్టుకొని సకారణంగా గాని, అకారణంగాగాని మనుజేశ్వరాధమునలడానికి ఎన్నిగుండెలు కావాలి? పైపెచ్చు ''కొన్ని'' సొమ్ముని తూస్కారమా? నాకు భాగవతమూవద్దు భోగినీ దండకమూ వద్దు, ఆ ఒక్క పద్యమూచాలు, అది నేను రాసి ఉండకూడదూ?

ఈ మధ్యకాలపు కవులలో నన్నెవరూ ఆకర్షించటంలేదు ఆరో అక్షరం తకారం పెట్టిచంపటంలో నాకు విశ్వాసంలేదు ''శుభమగుగాతనీకు'' అని ఎవరిమీదనన్నా పద్యం చెపితే వాళ్లు కాస్తా చచ్చి ఊరుకుంటారంటే నమ్మను ఒకవేళ చచ్చేదే నిజమైతే అందులో

కవితాభావం ఏమీ ఉందనుకోరాదు అదీకాక ఇట్లా చంపేవారిని హంతకుల కింద విచారణచేసి ఉరితీయవలసి ఉంటుంది

ఆరింట ''త''పెట్టి చంపటమేకాదు, కవిత్వం ద్వారా శపించటం కూడా నాకు నమ్మకం లేదు ''ఆ పామే నిన్ను గరవ అయ్యల గురవా'' అన్న కవి గోడమీద పామును చూచి ఆమాట అని ఉండాలి

చిత్రబంధ కవిత్వాలు కూడా ఎందుకోనన్నాకర్షించటంలేదు ''ధీర విరామా కుజప ధీరవిరామా కనయనధీ పరవరధీ ధీర వరపధీన యనక మారా వరధీపజ కుమారా వరధీ'' అనే పద్యం ఎటుచదివినా ఒకటిగానే ఉంటుందంటే నిజమోకాదో కూడా నాకు చూసుకో బుద్ధిపుట్టలేదు అల్లసాని పెద్దన ఆశువు చెప్పి రాయలచేత గండపెండేరం తొడిగించుకున్నాడు గనుక నేను కూడా ఆశుధార చెప్పాలని కాస్త ఊగుతున్నప్పటికీ పానుగంటివారి కంఠాభరణంలో రామలక్ష్మణుల జ్ఞాపకం వచ్చి ఆకోరిక ఇగిరి చక్కా పోతున్నది

ఇన్ని మాటలనుకోవటమే కాని నేనే కవినైతే ఎన్నడో పుట్టి గిట్టిన కవుల జాడల్లో పోదామనుకోవటం దేనికీ నాకు దగ్గర్లో లేరా దిగ్గజాల్లాంటి కవులు? వేదుల, దేవులపల్లి, అబ్బూరి, నండూరి, దువ్వూరి, విశ్వనాథ, తల్లావఝల, నోరి, నాయని, బసవరాజు, శ్రీశ్రీ - వారంతా ఎంతటి ప్రజ్ఞావంతులుకారు?

ఇంతమందిని చూడగానే ఒక్కటే అనుమానం ఇంతమంది అయిపోవటమా లేక కొందరే అయిపోవటమా అని తెల్సుకోవటం చాలా కష్టం ఇంకా స్థూలంగా ఆలోచిస్తే భావి కవి కానా, దేశభక్తి కవి కానా, విప్లవ కవి కానా?

శ్రీశ్రీ లాగా విప్లవ కవి అయి జగన్నాథ రథచక్రాలు భూమార్గం పట్టించి భూకంపం పుట్టించటం ఒక వంక ఉపద్రవకరంగా కనిపిస్తుంది మరోవంక రాయప్రోలులాగా ''లేదురా ఇటువంటి భూదేవి యెందు, లేరురామనవంటి ధీరులింకెందు'' అనటం బొత్తిగాజడత్వానికి దారి తీసేటట్టు కనిపిస్తుంది గురజాడలాగా ఒక మహత్తరమైన దేశభక్తి సందేశం ఇస్తే చాలా బాగుంటుందికాని ఏమిటి ప్రయోజనం? ఒక చెంప బౌండరీ కమిషన్లు ఏర్పడుతుండగా, ''దేశమంటె మట్టికాదోయ్-దేశమంటే మనుషులోయ్'' అని చెప్పి ఏం లాభం? పైగా దేశభక్తి గీతాలు ఒక దాన్నొకటి ఖండించటంకూడా జరుగుతుంది 'వెనుక చూసిన కార్యమేమోయ్, మంచి గతమున కొంచెమేనోయ్'' అంటాడు గురజాడ ''గోదా వరీ పావనోదార వాఃపూత మఖిల భారతము మాదన్ననాడు'' అంటాడు విశ్వనాథ

అందుచేత నేను పచ్చి భావకవినౌతాను భావకవి కావటంలో చాలా సుళువులున్నాయి భావ కవి ఒకసారి విహాయాస విహంగమౌతాడు, మరుక్షణానే ''పాతాళ లోకంపు టిరుందు సందులందు దిగబ్రాక వెరచు గాఢాంధరేఖ'' కావటమే కాక 'నేనెటు పక్షినౌదు?'' అని కూడా దబాయిస్తాడు భావ కవి కాలేనిది లేదనే అనుకోవచ్చు అతనొక వియోగ గీతిక, ఒక వియోగ శాలినీ హృదయ వేదనా రేఖ మొదట ఏగూడూ లేని పులుగు రాయుడుగా ఉండి, సంధ్యామనోజ్ఞచిత్ర సింధూర రేఖగా మారి మెల మెల్లగా రిక్క అవుతాడు ఆకులో ఆకు, పూవులో పూవు, కొమ్మలో కొమ్మ, నునులేత రెమ్మ అయిపోగలడు చేతలదగ్గిర కూడా భావకవికి అడ్డు లేదు ప్రేమించగలడు నిట్టూర్చగలడు, గొంతెత్తి ఏడవగలడు, మధురంగా

బాధపడగలడు ఈ పనులు చెయ్యటంలో కూడా తన వ్యక్తిత్వాన్ని విశిష్టతనూ, ప్రత్యేకతనూ నిలబెట్టుకోగలడు తన గొంతు మూగవోయిందంటూనే తియ్యని గానం చెయ్యగలడు

''నా మరణశయ్య పరచుకొన్నాను నేనె
ఏనె నాకు వీడ్కోలుపు లిప్పించి నాను
ఏనె నాపయి వాలి నాను, ఏనె జాలి
నెద నెద గడించినాను, రోదించినాను ''

ఇంతకంటె మానవ మాత్రుడికి అతీతమైనదేముంటుంది? మామూలు మనిషి ఎవడైనా తన ప్రియురాలిని, ''ఓ యమావాస్యా తపస్వినీ'' అని సంబోధించగలడా?

కనీసం ఇందుకోసమైనా నేను భావ కవినై భావ కవిత్వం రాస్తాను

*ముద్రణ తెలుగు స్వతంత్ర, వారపత్రిక 23-12-1949*
*(ఆలిండియారేడియో సౌజన్యం)*
*పునర్ముద్రణ సాహిత్య ప్రయోజనం (వ్యాసావళి) విశాలాంధ్ర*
*పబ్లిషింగ్ హౌసు , అక్టోబరు 1969*

# 6. నేనుకథలు ఎలా వ్రాస్తాను?

ఒకనాడు ఏదో రాసుకుంటూ ఉండగా ఒక మిత్రుడు వచ్చి నేను బోర్లాపడుకుని, రొమ్ముక్రింద దిండు పెట్టుకుని రాసే తీరు చూసి, ''నువ్వు ఇట్లా రాస్తావన్నమాట'' అన్నారు

నేను ఏ ''పోశ్చర్''లో రాస్తాను అన్న విషయం గురించి అతను ఆసక్తి కనబరచడం నాకు ఆశ్చర్యం కలిగించింది ఐతే ఇటువంటి వివరాలు ఇతర రచయితలను గురించి తెలుసుకున్నప్పుడు నాకు కూడా ఆసక్తి కలిగినమాట జ్ఞాపకం వచ్చింది ఈ వివరాలు తెలుసుకోవడంచేత మనకు ఏం లాభం ఉంటుందో చెప్పడం కష్టం ఐనా నేను ఇతర రచయితల వ్రాసే పద్ధతులు తెలుసుకోవటానికి ఇష్టపడతాను

స్వవిషయానికి వస్తే, రాసే పద్ధతికీ, ఆలోచించే పద్ధతికీ సంబంధం ఉన్నదని నాకు తెలుసు నేను రచన చేస్తే మధ్యలోనిడి ఆలోచన సాగించలేను రాసినది తిరిగి చూసుకుని సవరణలు చెయ్యలేను ఇది బద్ధకం కాదు, కేవలం అశక్తతే మొదట్లో నాకలం నా ఆలోచనలకు కళ్ళెంలాగా ఉండేది ఆలోచన ముందుకు పొయ్యేది, కలం వెనకపడేది ఇందువల్ల కొంత మానసిక వ్యధ కలిగేది ఐతే కొద్ది కాలంలోనే నేను రాసే వేగంతో ఆలోచించి బుర్రను అదుపులోకి తెచ్చుకున్నాను

రచన ప్రారంభిస్తే ఆగకుండా రాయాలి గనకా, రాసింది తిరిగి చూసుకోలేను గనకా రాయబోయేదాన్ని గురించి ముందుగానే సాధ్యమైనంత వివరంగా ఆలోచించటం నేను అలవాటు చేసుకోవలసి వచ్చింది ఎప్పుడన్నా అతిశయానికి పోయి ముందుగా తగినంత ఆలోచన చెయ్యకుండా రచన ప్రారంభించానో, అది మధ్యలో నిలచిపోతుంది అనేక గంటలపాటు రాసిన కాగితాలు చించి పారెయ్యవలసి వస్తుంది ఇల్లా జరిగినప్పుడల్లా అతిశయం దిగిపోతూ ఉంటుంది

కనక, కథ ఎల్లా రాయాలన్నదానికి ఒక నియమం ఏమీలేదు రచనకూ, రచయితకూ గల సంబంధం అనేక విషయాలపై ఆధారపడి ఉంటుంది వాటిలో రచయిత యొక్క చిత్తవృత్తి చాలా ప్రధానమైనది కథకుడు కథ అల్లి, పాత్రలను కల్పన చెయ్యటమేగాక రచన చేస్తూ ఉన్నంత సేపూ ఆ పాత్రలవెంట ఉండాలి తాను సృష్టించిన జీవితాన్ని మానసికంగా తానుకూడా జీవించాలి

ఇతర మానసిక వ్యాపకాలూ, చింతా లేని రచయిత తన రచనలనుంచి వాస్తవజీవితంలోకి, అందులో నుంచి రచనా ప్రపంచంలోకీ సంచారాలు చెయ్యవచ్చు ఇతర వ్యాపకాలు కలవాడు సాధ్యమయినంత త్వరగా రచనలోనుంచి బయటపడగోరడు నేను రెండవ రకానికి చెందినవాణ్ణి తమ రచనలలో ఓలలాడటం కొందరికి చాలా ఆనందంగా ఉంటుంది నేను అటువంటి ఆనందాన్ని ఎన్నడూ ఎరగను కొందరు ఒకే భావాన్ని రెండు మూడు రకాలుగా ప్రకటించి చూసుకుని తమకు ఇంపుగా తోచిన మాటలే ఉపయోగిస్తారు ఇల్లా రాసిన రచన ''రుచి'' గా ఉంటుంది నా రచన రుచికరంగా తయారు చెయ్యాలన్న కాంక్ష నాకు లేదు అందరూ వాడే మాట అందుబాటులో ఉంటే, మారు మూల మాట ఉపయోగించటానికి నాకు చెయ్యిరాదు

నేను ఎలా రాస్తాను అన్నది ఎందుకు రాస్తాను అన్నదానితో కొంత ముడిపడి ఉన్నది నేను రచన ప్రారంభించి 30 ఏండ్లు దాటింది ఈ 30 ఏండ్ల కాలంలోనాకూ, నా రచనకూ మధ్య ఉండే సంబంధం పరిణామం పొందుతూ వచ్చింది అది సహజమే ఏ కళలో కృషి చేసేవాడైనా తొలిదశ తనను తాను అన్వేషించుకునేందుకు తన కళను సాధనంగా చేసుకుంటాడనుకుంటాను ఈ అన్వేషణలో మొదటిదశ కళాకారుడు తన కళా సామర్థ్యాన్ని పరీక్షించుకోవటం నేనుకూడా మొదట్లో కథా శిల్పానికి అత్యంత ప్రాముఖ్యం ఇచ్చే వాణ్ణి ''టెక్నిక్'' బాగుంటే కథలో ఇంకేమి లేక పోయినా ఫరవాలేదు అనుకునేవాణ్ణి ఇతరులు వ్రాసిన కథల్లో విషయం ఎంత బాగున్నప్పటికీ టెక్నిక్ లోపించినట్టుతోస్తే ఆ కథలు నాకు నచ్చేవికావు

శిల్పానికి ప్రాధాన్యం ఇచ్చినప్పటికీ ఆత్మాన్వేషణలో నేను నాకూ, నా పరిసరాలకూ గల సంబంధాన్ని విధిగా గుర్తించవలసి వచ్చింది ఇంగ్లీషు చదువు చదివి, కొంత శాస్త్ర పరిజ్ఞానం సంపాదించి, పాశ్చాత్య వాఙ్మయ ప్రభావాలతో బుఱ్ఱ నింపుకుని జీవితంలోకి అడుగుపెట్టేసరికి నాకు సంఘమంతా వక్రంగానూ, అపసవ్యంగానూ కపిపించింది అందులో ఎన్నో మూఢాచారాలు, ఎన్నో మూఢ విశ్వాసాలూ, ఎంతో అజ్ఞానం, అర్థంలేని వ్యథలు, కుతర్కం, చదువు ద్వారానూ, పుస్తకాల ద్వారానూ నేను సంపాదించుకున్న సత్సంస్కారానికీ, జీవితంలో అమలులో ఉండే సంస్కారానికీ మధ్య ఉండే అగాధాన్ని ఎల్లా పూడ్చటం? ఇది అవసరంగా కనపడింది నా కథలు ఇందుకు సహాయ పడతాయా అని చూశాను ఇందుకు రెండే మార్గాలు నాకు మంచిదిగా తోచిన సంస్కారాన్ని ప్రచారం చెయ్యటమూ, కుసంస్కారాన్ని దులిపి వదిలి పెట్టడమూనూ

ఈ కృషిలో నేను విజయం సాధించానని చెప్పలేను దానికి కారణం లేకపోలేదు మనుషుల మనసులు మారితే చాలు జీవితం మారుతుందని నాకొక అపోహ ఉండేది మనసుల ప్రభావం జీవితంమీద ఉన్నట్టే జీవిత ప్రభావం మనసులపైన ఉంటుందని నాకు స్పష్టంగా తెలియదు మేధస్సుకు కిరీటం పెట్టి భౌతిక పరిస్థితుల ప్రాముఖ్యాన్ని గుర్తించలేకపోయాను జీవిత

వాస్తవాన్ని తెలుసుకుంటున్న కొద్దీ ఆత్మజ్ఞానం కూడా జరుగుతుంది జీవితంతో నేను పెట్టుకునే సంబంధాలు ఎంత స్ఫుటంగా ఉంటే నా రచనయొక్క సాంఘిక ప్రయోజనం అంత హెచ్చుగా ఉంటుందని యీనాడు నేను నమ్ముతున్నాను

*ముద్రణ పుస్తక ప్రపంచం, మాసపత్రిక, ఏప్రిల్ 1962*

# 7. కథా సాహిత్యం – నాడూ, నేడూ

సాహితీ ప్రియులలో చాలా మంది సాహిత్యంలో కాలక్రమేణా, కాలానుగుణంగా కలుగుతూ వచ్చే మార్పులను గమనిస్తారుగాని సాహిత్యానికీ పరితకూ మధ్య ఉంటూ వస్తున్న మార్పులు అంతగా గమనించటం లేదు కాని సాహిత్య రంగంలో కృషి చేసేవాడికి అది కూడా తెలుసుకోదగిన సంగతే

ప్రతి సాహిత్యంలోనూ కథఅన్నది అనాదిగా ఉంటూనే ఉన్నది మన పురాణాలలో కథలు తీసుకోండి అవి పరితకుల సమకాలికమైనవి కావు వారికి పూర్వం ఎప్పుడో గడిచిపోయిన జీవితానికి సంబంధించినవి అవి ఎక్కడో ఆకాశంలో ఉండేవి పరితలు భూమి మీద ఉండి, తలలు పైకెత్తి వాటిని భక్తితో చూసేవాళ్ళు

కొంతకాలం గడిచాక సాహిత్యం దిగి వచ్చి గురుపీఠం ఎత్తున నిలిచింది పరితలు శిష్య పరమాణువుల పాత్రలు ధరించి, వాటి ద్వారా ఉపదేశాలు పొందారు

తరువాత సాహిత్యం ఇంకోంచెం దిగి వచ్చి రాజుల ఎత్తున నిలిచింది పరితలు ఎప్పటిలాగే నేలమీదనే ఉండి ఆ రాజులను గిలిగింత పెట్టే విషయాలనే తాముకూడా ఆస్వాదించి, గిలిగింతలు తెచ్చుకున్నారు అది హేయమనిపించినవారు "కావ్యలాపాంశ్చ వర్జయేత్" అనుకుని సాహిత్యాన్ని తిట్టి సంధ్యా వందనాలతో తృప్తిపడ్డారు

తరువాత సాహిత్యం పండితుల ఎత్తున నిలచి, పామరులకు భయం పుట్టించి, వారిలో యే మాత్రమైన సాహిత్యాభిలాష ఉంటే దాన్ని కాస్తా నాశనం చేసింది తిరిగి ప్రజలలో సాహిత్యాభిలాష రేకెత్తించటానికి పెద్ద పెట్టున ఉద్యమాలు నడపవలసి వచ్చింది

ఈనాటికింకా సాహిత్యం నేలకు దిగి రానేలేదు అది యింకా మార్కెట్ అరుగుల ఎత్తులోనే ఉంది దుకాణదారింకా దాని స్వరూప స్వభావాలు నిర్ణయించ గలుగుతున్నారు ఇది ఏమంత ఎత్తులో జమకాదనుకోవటం పొరపాటు ఈ కొద్ది ఎత్తునుంచి సాహిత్యాన్ని కిందకి దించటానికి ఒకమహత్తరమైన సాంఘిక విప్లవం అవసరమైతే నేను ఆశ్చర్యపడను - ఇతరుల మాట ఏమో కాని

సాహిత్యం ఎత్తు గురించి చెప్పకున్నట్టే దూరం గురించి కూడా చెప్పుకోచ్చు సాహిత్యం చాలా ఎత్తున ఉన్న కాలంలో దూరమూ, ఎత్తూ ఒకటిగానే ఉండేది వాటిని గురించి విడివిడిగా చెప్పకోవలసిన పనే లేదు అయితే ఆ ఎత్తున ఉన్న సాహిత్యం క్రమంగా దిగుతూ వచ్చినా, పరిత ఉండే చోటికి దగ్గిరగా దిగలేదు ఒక పెద్ద ఆర్క్ కొట్టి పరితకు దూరం అవుతూ వచ్చింది

ఈనాడుకూడా పరితకు సాహిత్యం సినిమా ప్రేక్షకుడికి వెండితెరలాగ, అల్లంత దూరంలో ఉన్నది ఆ పాటి ఎత్తులోకూడా ఉన్నది అయినప్పటికీ జీవితంలో లీలగా ఒక ధోరణి కనిపిస్తుంది కొద్ది మంది రచయితలు నేల నంటి రాయాలన్నా ఆసక్తిని కనబరుస్తున్నారు అలాగే కొద్దిమంది పరితలు తమను సమీపించి, తమతో కరచాలనం చెయ్యగల సాహిత్యం కోసం తహతహలాడుతున్నారు ఈ రెండు రకాల ధోరణులనూ వమ్ము చేస్తున్నది సమాజం యొక్క వర్గ స్వభావం వర్గ సమాజంలో కళాకారుడికీ, ప్రజా సామాన్యానికీ మధ్య అఖాతం ఉండి తీరుతుందని మార్క్సిజం చెబుతున్నది

నా బాల్యంలో ఆధునిక కథా సాహిత్యం కూడా బాల్య దశలోనే ఉండేది నేను చదివిన మొదటి ఆధునిక కథలు ''సాహితి''లో ప్రచురితమైనవి ఆనాటి తెలుగు కథక చక్రవర్తి చింతా దీక్షితులుగారు అప్పటికే ఆయన కథ రాయటం గురించి కథ రాశారు - సాహితికి కథ

అంతకు ముందే గురజాడ అప్పారావు గారు ఆధునిక కథా సాహిత్యానికి నమూనాలు సృష్టించారు కాని వాటిని నేను చదవటానికి చాలా కాలం పట్టింది కారణమేమిటంటే అవి పత్రికలలో పడకపోవటం

ఆధునిక కథలనేసరికి వాటికి వాహనాలుగా పత్రికలే, నాకు స్ఫురిస్తాయి 'ఫలానాకథ చదివావా?' అని ఎవరన్నా అడిగితే, ఏ పత్రికలో పడింది? ఏ నెల లేక ఏ వారం సంచికలో అని అప్రయత్నంగా అడిగేస్తాను తెలుగు దేశంలో ఇన్ని వందల మంది కథకులూ, ఇన్ని వేల కథలూ రాయటానికి అంత ముఖ్యమైన సాధనం పత్రికలే పుస్తకాలుగా వేసుకుందామని కథలు రాసి పెట్టుకునే వాళ్ళను నేనూహించలేను - ఉంటే ఉంటారేమో

అందుచేత కథా సాహిత్యంతో నా పరిచయం పత్రికల ద్వారానే అభివృద్ధి అయింది సాహితి ఆగిపోయాక భారతి వచ్చింది దాని ద్వారా పూడిపెద్ది రమణయ్య గారు (కథలు రాయటం ఆయనకు మంచి నీళ్ళ ప్రాయం) వేలూరి శివరామశాస్త్రి గారూ, శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారూ మొదలైన హేమాహేమీల కథలు చదివి సంతోషించాను అప్పటికే చలం గారు కథలు రాస్తున్నప్పటికీ పత్రికలు ఆయనను బాయ్‌కాట్ చెయ్యడం వల్లనే అయివుంటుంది నేను వాటిని చాలా కాలం చదవటం పడలేదు

తెలుగు పాఠకులలో హెచ్చుగా కథలను చదివే అభిలాష తెచ్చిపెట్టినది ''వినోదిని'' అయి వుంటుంది శ్రీనివాస శిరోమణి గారి సంపాదకత్వం కింద ఈ పత్రిక ఏడెనిమిది వేల సర్క్యులేషన్ ఆ డిప్రెషన్ రోజులో - అందుకున్నట్టు చెప్పుకున్నారు

యుద్ధకాలం వచ్చేదాకా సామాన్య తెలుగు పరిత కథను కొంత దూరం నుంచే చదివేవాడనీ, తన జీవితానికీ, దానికీ మధ్య ఎలాటి సంబంధం వుండవచ్చు నని గాని, ఉండాలని గాని అనుకునేవాడు కాడని నా అనుమానం ప్రయోజనాత్మకమైన కథలు రాక కాదు, చలంగారూ, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారూ సంఘం దుమ్ము దులుపుతూ కథలు రాశారు కాని అలాటి కథలు చదివి గొప్పగా ఉన్నాయన్న వాళ్ళు కూడా అందులోని భావాలను ఏ మాత్రమూ ఆమోదించలేదు

నాకు తెలిసినంతవరకు యుద్ధకాలంలోనూ యుద్ధానంతర కాలలోనూ సాహిత్యం రాసే వాళ్ళతో బాటు చదివే వారిలో పరివర్తన వచ్చింది ఈ పరివర్తనకు కారణభూతమైన విశ్వాసాలు,

జీవితానికీ సాహిత్యానికీ సన్నిహిత సంబంధం ఉండాలి సాహిత్యం సమకాలీన జీవితాన్ని ప్రతిబింబించాలి, విమర్శించాలి, సాహిత్యం చదివేవాడికి ఒక ఉపయుక్తమైన అనుభూతి కలగాలి, ఆలోచనలు రేకెత్తించే సాహిత్యం కావాలి

ఫాసిజం పురాణకాలపు రాక్షసుడిలాగా విజృంభించి, ప్రపంచ జీవితాన్ని సంక్షోభింప జేసి మానవ రక్తం ఏరులై పారించి, అంతులేని నష్టమూ, ఆవేదనా, శోకమూ, మరణమూ కలిగించి తాత్కాలికంగా దెబ్బతిన్న మీదట, అన్ని దేశాలవారూ ఒక్కసారి నిద్రమత్తు నుంచి లేచి కళ్ళు నులుముకుని, జీవితం తాలూకు నగ్నసత్యాన్ని కొంతవరకైనా చూడగలిగారు భవిష్యత్తుకు బాట ఏదో అస్పష్టంగా గోచరించింది ఈ మార్పులను అర్థం చేసుకున్న రచయితలలో ప్రముఖుడు గోపీచందు

యుద్ధం అయిపోతూనే అభ్యుదయ రచయితల ఉద్యమం ఒకటి ఆంధ్రలో చురుకుగా సాగింది ఇది సంకుచితమూ పాక్షికమూ అయినది కాదనటానికి ఆధారాలున్నాయి నవ్య సాహిత్య పరిషత్తుకూ, అభ్యుదయ రచయితల సంఘానికీ మధ్య మంచి సంబంధాలేర్పడ్డాయి డా పి వి రాజమన్నార్ లాంటివారు అభ్యుదయ రచయితలతో చేరి ఎంతో ప్రోత్సాహం యిచ్చారు

కళాకారుడికీ జనసామాన్యానికి మధ్య గల అఖాతానికి వంతెన కట్టటానికి చేసిన కృషితో అభ్యుదయ సాహిత్యోద్యమమే చెప్పుకోదగినది అనేక మంది ఉత్సాహవంతులైన రచయితలు అలాంటి అఖాతం లేనట్టే ఊహించి రచనలు చేశారు ప్రోలిటేరియన్ సాహిత్యం, ప్రజా సాహిత్యం, సోషలిస్టు వాస్తవికత, సాహిత్యంలో మార్క్సిస్టు దృక్పథం మొదలైన వాటిని గురించి చర్చలు సాగాయి ఒక అభ్యుదయ కథకుడు తన కథలలో సోషలిస్టు వాస్తవికత ఉన్నదని వాదించాడు వర్గసమాజంలో అభ్యుదయ కథలు విమర్శనాత్మక వాస్తవికతను అనుసరిస్తాయన్న వాదాన్ని కూడా అతను కొట్టి పారేశాడు

ఏమైనా యుద్ధానంతరం తెరుచుకున్న కళ్ళు మూతబడసాగాయి భవిష్యత్తుకు బాటలాగా లీలగా కనిపించినది కాస్తా, ముళ్ళ కంచెలు పెరిగి మూసుకు పోయింది ఫాసిస్టు విద్వేషం స్థానాన్ని కమ్యూనిస్టు వ్యతిరేకత కాజేసింది భారత స్వాతంత్ర్యమూ, దేశ విభజనా, రాజకీయ పార్టీల మధ్య ఘర్షణా జీవితంలో ప్రాముఖ్యం వహించాయి

ఈ గందరగోళం మాస్ ప్రొడక్షనుతో పత్రికలు వెలువడి సాహిత్యాన్ని అపహరించాయి మాస్ సాహిత్యం పెరుగుతున్న కొద్దీ, పుస్తక ప్రచురణ విజృంభిస్తున్న కొద్దీ పఠితల సంఖ్య అపారంగా పెరుగుతున్న కొద్దీ, సాహిత్య సిద్ధాంతాలు మాటున పడిపోయాయి ఆదర్శాలను జీవితం పడదోసింది

రాక్షసి బల్లుల మధ్య ఎలాగో బతుకుతూ వచ్చిన తొలి సస్తన జంతువులాగా ఈనాటి సాహిత్యపు వరదకు ఎదురీదుతూ కొద్ది మంది కథకులు - బహు కొద్ది మంది - రేపటి సాహిత్యాన్ని సృష్టించనారంభించారు భావి కథా సాహిత్యంపై వారి ప్రభావం ఎలా వుండేదీ ఇంకా కొంతకాలానికి గాని స్పష్టంగా తెలియదు

నేను కథలు వ్రాయటం ప్రారంభించాక గడిచిన 35 ఏళ్ళ చిల్లర కాలంలో కథారచనలో విశిష్టమైన ధోరణులు ప్రదర్శించిన వారిని కొందరిని సంస్మరించడం నా విధి

వీరిలో చలంగారు మొట్ట మొదటివారు ఆయనను చూసీ, ఆయనను అనుసరించి కథా రచన సాగించినవారు చాలా మంది ఉండేవారు ఆయన శిల్పం చక్కగా ఉండేది భాష పరిత ఈడ్చుకు పోయేటట్టుండేది కాని అది నిజంగా సౌష్టవం గల భాష కాదు

శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి భాష చాలా చిక్కగా ఉండేది మంచి నుడికారానికీ, సాంఘిక మర్యాదకూ, చక్కని కథనానికీ ఆయన భాష ఆదర్శ ప్రాయంగా ఉండేది అయితే ఆయన తమ కథలలో శిల్పం అటే పాటించేవారు కారు చాలా వరకు ఆ కారణంచేత ఆయన కథలలో విషయాన్ని మించిన విస్తృతి ఉండేది

''మా గోఖలే'' ''అలగా'' జనం జీవితాన్ని తీసుకుని వాళ్ళ భాషలోనే చాలా అపూర్వమైన కథలు కొన్ని రాశాడు ఆ తరగతి పాత్రల కష్టసుఖాలు, మనస్తత్వమూ అద్భుతంగా చిత్రించటం అటుంచి, కథనంలో కళ్ళకి బొమ్మ కట్టేటట్టు చేసి, సన్నివేశాలకు అవసరమైన ''వూపు'' తెప్పించడంలో గోఖలే అసాధారణ ప్రజ్ఞ కనబరిచాడు ఈ శక్తి నేనింకే తెలుగు కథకుడిలోనూ చూడలేదు గోఖలే మంచి చిత్రకారుడు భాషలో కూడా చిత్రాలు నిర్మించగలిగాడు ఇతన్ని అనుకరించటానికి బహు కొద్దిమంది మాత్రమే యత్నించారు

''కరుణకుమార్'' గ్రామీణ జీవితం గురించి అమిత వాస్తవికమైన కథలు రాశారు ఆయన కృషికి శాశ్వత చిహ్నాలుగా రెండు కథా సంపుటాలు మాత్రమే మిగిలినట్టు గుర్తు

అనేక మంది యువ కథకులకు ఇన్‌స్పిరేషన్ ఇచ్చిన మరొక కథకుడు గోపీచందుగారు తెలుగు కథకులందరికన్నా రాజకీయ తాత్విక దృక్పథాలను తన రచనలలోకి జాస్తిగా ప్రవేశ పెట్టిన కథకుడు కూడా ఈయనే ఆరంభ దశలో ఈయన శైలి అప్పుడే వికసించిన పువ్వులాగా అతి నేవళంగా ఉండేది రాను రాను ఆ శైలి బిరుసెక్కినట్టు కనబడుతుంది

కొద్ది సంవత్సరాల క్రితమే కథా వీధిలో కొత్తగా ఉదయించిన సరికొత్త తార రాచకొండ విశ్వనాధ శాస్త్రి, కవి హృదయంతో, హృదయంలోనుంచి పొంగివచ్చే భావాలతో కథలు రాయటం ఈయన ప్రత్యేకత ఈయన పరితను ఎదురుగా పెట్టుకుని మరీ కథ రాస్తారు ''విన్నవాళ్ళు వినండి'' అన్న ధోరణి ఈయనలో ఏ మాత్రం లేదు ఉపమానాలు విరివిగా వాడతారు గోఖలే లాగా బొమ్మలు కళ్ళ ఎదుట ఆడించలేదేమో గాని, మెదడు లోని భావాలను అద్భుతంగా ఆడిస్తారు గోఖలే కథలలోని పాత్రలను ఈయన పాత్రలు కొంత వరకు జ్ఞాపకం చేస్తాయి, అయితే శాస్త్రిగారు తమ పాత్రల అంతస్తులలోకీ , జీవితాలలోకీ చాలా లోతుగా వెడతారు వాళ్ళ ద్వారా జీవిత సత్యాన్ని వ్యక్తం చేస్తారు ఆయన అచ్చగా కూడూ, గుడ్డాలేని వాళ్ళను గురించీ కథ చెబుతున్నా పరితను కార్లలో తిరిగేవాళ్ళనుక్లబ్బుల్లో తిరిగే తాజా జల్సారాయుళ్ళను గురించి తెలుసున్నట్టే ఉంటుంది ఆయనది ఏక పక్షమైన, జీవిత చిత్రణ అనటానికి లేదు ఆయన కథలలో స్థానం లేనిది మామూలు మనుషులే

శాస్త్రిగారి పంధాలోనే అయినా, కొంత భిన్నంగా ఈనాడు చాలా మంచి కథలు రాస్తున్నవారు ''బీనాదేవి''గారు వారు పరితను ఎదుట కూర్చోబెట్టుకుని కథ చెప్పకపోయినా, కథ చదివేవాడు తనంతట తానే అప్రయత్నంగా వచ్చి ఎదురుగా కూర్చుంటాడు వారి కథలో కూడా ఉపమానాలూ, కవిత్వ ధోరణీ కొంత ఉన్నప్పటికీ ఈ కథలు పాఠకుడి

భావోద్రేకాన్ని మరీ రెచ్చగొట్టవు ''ఆలోచనను'' కుదిలించి వదిలేస్తాయి ముందుముందు ''బీనాదేవి''గారి కథలు చాలా చదువుతాం

''బీనాదేవి''తో పాటు స్త్రీ కథకులను మిగిలిన వారిని కూడా పేర్కొనాలి ముప్పాళ రంగనాయకమ్మగారి కథలు నేను వరుసగా చదివాను జీవితాన్ని, మధ్య తరగతి పాత్రలనూ, జీవితాన్ని చిత్రించటంలో ఆమెకు మంచి శక్తి సామర్థ్యాలున్నాయి కథనం సూటిగానూ, సమగ్రంగానూ ఉంటుంది అయితే మానవుల ప్రవర్తన గురించి రంగనాయకమ్మగారు చేసే వ్యాఖ్యానం నా దృష్టిలో అప్పుడప్పుడూ గురి తప్పినట్టుంటుంది ఈనాడు స్త్రీలు చాలా మంది కథా సాహిత్య సృష్టిస్తున్నారు వీరిలో కొందరికైనా మంచి స్థానం లభిస్తుందనుకోవచ్చు

ప్రస్తుతం ఈ పుస్తకంలో ఉండే కథలు 1933-35 మధ్య ''ఆంధ్రభూమి''లో ప్రచురితమైనవి ఇవి నా తొలి కథలని చెప్పవచ్చు ఇవి రాయక పూర్వం పది పన్నెండు కథలు మించి ప్రచురించి ఉండను ఇవి రాసేనాటికి ఈనాడు కథలు రాస్తూన్నవారెవరూ కథలు రాయడం ప్రారంభించి ఉండరు అందుచేత ఇవి మరొక యుగానికి సంబంధించినవని చెప్పవచ్చు

నన్ను కథలు రాయటానికి ప్రేరేపించిన వారు శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారు నా తొలి కథలు ''గృహలక్ష్మి''లో ప్రచురించినది కూడా ఆయనే తరువాత ''ఆంధ్రభూమి'' ఆయనే స్థాపించి కొంతకాలం నడిపారు ఆయన వేసిన పునాది చాలా గట్టిదై ఉండాలి తెలుగు కథకుడిగా నేను చాలా కాలం చలామణీ అయ్యాను ఆయన ఋణం తీర్చుకోలేను

శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారు నన్ను కథకుణ్ణి చేశారే కాని, నాలో కీర్తి కాంక్ష రేకెత్తించలేకపోయారు నేను నా కథల కటింగు లేనాడూ జాగ్రత్త పెట్టలేదు తరువాత తరువాత నా కోసం ఈ పని ఇతరులు చెయ్యటం వల్ల కొన్నికథల సంపుటాలైనా మిగిలాయి నేను అనేక పత్రికలకు రాసిన కథలు ఆ పత్రికలతోనే అంతరించాయి ఈనాటికీ వాటి జాడలేదు అందువల్ల తెలుగు సాహిత్యానికి తీరని లోటు జరిగిందని నేననుకోవటం లేదు, కాని నన్ను అభిమానించే వారు నా అశ్రద్ధకు మందలించారు

ఈ పరిస్థితిలో ఈ కథలను ఆర్కియాలజిస్టులాగా తవ్వి తీసినవారు మిత్రులు శ్రీ అట్లూరి పిచ్చేశ్వరరావు గారు ఆయన ప్రోద్బలం మీదనే ఈ పాత కథలు పుస్తక రూపంలో బయట పడుతున్నాయి ఆయనకు నేను ఎంతైనా కృతజ్ఞుణ్ణి

రాసినది తిరిగి చూసుకుంటే నాకేదో గుబులుపుట్టుకొస్తుంది అందుచేత వీటిని మా అమ్మాయి చేత కాపీ చేయించు కున్నాను అందుకే మా అమ్మాయికి కూడా ఋణపడి ఉన్నాను యువకథకులూ, తమాషా తమాషా కథలూ కోకొల్లలుగా ఉండే ఈ రోజులలో పాతకథలను పునరుద్ధరించి ప్రచురిస్తున్నను

*'బలిభక్తి' (తనకథల సంపుటి) కి ముందుమాట 1996*

# 8. ముందుమాట

''మరో ప్రపంచం'' అన్న భావం ఒక కాలానికీ, ఒక దేశానికీ చెందినది కాదు భావన చేసేవాడి అవసరాలను బట్టి ''మరో ప్రపంచం'' అనేక రకాలుగా ఉంటుంది పాపపుణ్యాలకు ఈ లోకంలో శిక్షా బహుమానాలు లేవన్న సంగతి గమనించిన మనపూర్వులు స్వర్గ నరకాలను భావన చేశారు మరికొందరు వాటితో తృప్తి పడక ఏడు ఊర్ధ్వలోకాలనూ, మోక్షాన్నీకూడా భావన చేశారు

సర్ థామస్ మూర్ అనే ఆయన యుటోపియా అనే నిర్దుష్ట ప్రపంచాన్ని భావన చేశాడు అది పగటి కలలు కనే వాళ్ళ భూలోకస్వర్గం

శ్రీశ్రీ రష్యాను ''మరో ప్రపంచం''గా భావించి, దాని పిలుపు విన్నాడు

సాధారణంగా ఏవ్యక్తీ కూడా ఈ ఉన్న ప్రపంచంతో తృప్తి చెందలేడు గనక తీరిక దొరికినప్పుడల్లా తనకిష్టమైన మరో ప్రపంచాన్ని ఊహించుకుని ఆనందిస్తాడు

ఇలా ఆనందించే హక్కు మానవజన్మ ఎత్తిన ప్రతివాడికీ ఉన్నది

అందుకే, ఎవరన్నా మరీ పరధ్యానంలో ఉంటే '' ఏ ప్రపంచలో ఉన్నావ్?'' అని అడుగుతాం ఎవడన్నా ప్రేమలోనో, చీట్లపేక మహోత్సాహంలోనో, తాగినమత్తులోనో, గంజాయి నిషాలోనో ఉంటే ''వాడు మన ప్రపంచంలో లేడులే!'' అంటాం

''మరో ప్రపంచం'' అన్నది తత్కాలానికి కాల్పనికమే కావచ్చు కాని ఆ కల్పన ఒక్కొక్కసారి నిజమవుతుంది కారల్ మార్క్స్ కన్న కలలు క్రమంగా నిజమవుతున్నాయి అదే విధంగా త్సియోల్కవెస్కీ అనేరష్యను శాస్త్రజ్ఞుడు అంతరిక్షయానాలను గురించీ ఇతర లోకాలకు మానవులు ప్రయాణించడం గురించీ చేసిన ఊహలు నిజమవుతున్నాయి

అనేకమంది భావన చేసే ''మరో ప్రపంచం'' భావన చెయ్యలేని వాడు పాపాత్ముడు ఉన్న ప్రపంచంతో పూర్తిగా సంతృప్తి పడ్డవాడు మందబుద్ధి

సాహిత్యంలో కూడా ''మరో ప్రపంచం'' అన్నదానికి చోటున్నది సినిమా చిత్రాలు చూసి కాస్సేపు ఉన్న ప్రపంచాన్ని మరిచిపోయినట్టే ఇటువంటి నవలను చదివి కాస్సేపు ఈ ప్రపంచాన్ని మరిచి పోవచ్చు దీని ముఖ్య ప్రయోజనం కూడా అదే

ఇది ఒక ఇంగ్లీషు నవలకు అనుసరణ ఇందులో గౌరాంగుడనే పాత్ర కేవల కల్పిత పాత్రకాదు ఆయనను గురించి ఇచ్చిన వివరాలు చరిత్ర నుంచి తీసుకున్నవే - ఆయన అనేక వందల ఏళ్ళు బతికాడన్నది మినహాగా

కొడవటిగంటి కుటుంబరావు నవల ''మరో ప్రపంచం'' కి ముందుమాట అనేక మంది భావనచేసే మరో ప్రపంచాలు వట్టి మోసం కిందా, దగా కిందా భ్రమలకిందా తయారవుతాయి ఈ సంగతి ప్రేమికులకూ కవులకూ, సినిమా చిత్రాలు తీసే వాళ్ళకూ, పత్రికలు ప్రారంభించే వాళ్ళకూ, గుప్పుందాలకు పోయే వాళ్ళకు నిత్యానుభవం లోనిదే

*ప్రచురణ శ్యామలా పబ్లికేషన్స్, తెనాలి, 1967*

# 9. ప్రస్తావన

ఈనాటి మన సమాజంలో అనుకోని విషయాలు అనేకం జరుగుతుంటాయి నవ్విన నాపచేలు పండుతాయి ఎన్నో ఆశలు రేకెత్తించిన వాళ్ళు ఎందుకూ కొరగాకుండా భ్రష్టులై పోతూవుంటారు

ఈ రూలు పుస్తకాలకు కూడా వర్తిస్తుంది (సినిమాలకు వర్తించటం అందరికీ తెలిసినదే!) రచయిత తాను బాగా రాశాననుకున్న పుస్తకం ఎవరి దృష్టినీ ఆకర్షించదు ఏదో మొక్కు తీర్చుకున్నట్టుగా రాసిన పుస్తకం అందలం ఎక్కి కూర్చుంటుంది Paradise Lost రాసిన మిల్టన్ మహాకవి Paradise Regained అనే పుస్తకం కూడా రాశాడు రెండో పుస్తకమే తాను బాగా రాశాననుకున్నాట్ట మిల్టన్ కాని దాన్ని తల్చుకునే వాళ్ళు లేరు

నవలాకారుడుగా నాకు పేరు వస్తుందని నేను అనుకోలేదు, ఆశించనూలేదు కథకుడుగా నేను కొంత కీర్తికి అర్హుణ్ణని సాహిత్యాభిలాషులు కొందరు నన్ను నమ్మించగలిగారు అయినా నేను చిన్న చిన్న నవలలు కొన్ని రాశాను వాటిలో కొన్ని బాగా రాశాననుకున్నాను మరికొన్ని కేవలమూ పరిస్థితుల ప్రోద్బలం వల్ల రాశాను

ఈ 'తార' (నేను మొదట పెట్టుకున్న పేరు 'తారాపథం') పరిస్థితుల ప్రోద్బలంతో రాసినదే అది మొట్టమొదట 'కినిమా' పత్రికలో సీరియల్‌గా వెలువడినప్పుడు నేనాపేరుకూడా పెట్టలేదు

నాన్నా! ఎవడురా నీకు నాన్న? నేను నీకు నాన్ననూకాను, నువ్వునాకు కొడుకువూ కావు'' అని తండ్రి చేత యింటినుంచి తరిమివేయబడిన హీరో చిట్టచివరకు తండ్రికి కీర్తి తెచ్చినట్టుగా, ఈ నవల నన్ను ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీ వారి ఆదరణకు పాత్రుణ్ణి చేసి, నన్ను తెలుగు నవలాకారుల లిస్టులోనుంచి తీసేసే హక్కు ఎవరికీ లేకుండా చేసింది నేను రాసిన వాటిలో మంచి కథలని అందరూ మెచ్చుకున్నవి ఏవీ ఈ పని చెయ్యలేక పోయాయి ఇంతకంటే బాగా రాశాననుకున్న నవలలు ఏవీ కూడా ఈ పని చేయలేకపోయాయి

సాహిత్య ఎకాడమీ వారి బహూకృతి పొందుతున్నందుకు నన్ను అభినందిస్తూ ఉత్తరాలు రాసిన (ఉజ్జాయింపుగా) 32 మందిలో ఒక్కరు కూడా 'తార'ను చదివి వుండలేదనే రాశారు అందులో 30 మందికి నేను అటువంటి నవల రాసినట్టుకూడా తెలీదుట మరెవరో రాసిన నవలకు పొరపాటున బహుమతి నాకు లభిస్తున్నదేమోనని సంశయించినవారుకూడా లేకపోలేదు

దీనిని బట్టి ఎంత మారుమూల చీకటికోణాలలో నిక్కినా 'ప్రతిభ'ను వెలికి తీసే సత్తా ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీ వారికి వున్నదని గట్టిగా రుజువవుతున్నది అంతా ''వాడి లీల!''

*మదరాసు, 24-2-68*

*'తార' నవలకి సాహిత్య అకాడమీ బహుమతి ఇచ్చినప్పుడు రాసింది*

*తార రెండవ ముద్రణ మార్చి 1968 లో వెలువడింది*

# 1. కొత్తా - పాతా

అనేకమంది మాట్లాడేటప్పుడు వెనుకా ముందూ చూడకుండా మాట్లాడతారు అనేకమంది ఆ విధంగానే రాస్తారు వీరికి దేన్ని గురించీ దీర్ఘంగా ఆలోచించటం అలవాటు ఉండదు చేతకానూ కాదు తాగినవాడి శరీరం దానికి చెందిన చైతన్యం వాడి వశంలో లేనట్టు, వారి మనస్సులూ, ఆలోచనలు వారి కట్టుబాటులో ఉండవు అటువంటి వారి అభిప్రాయాలను బులుసు వేంకటరమణయ్యగారు ''తెలుగు వారి దేశ భాషాభిమానం'' అనే వ్యాసంలో చక్కగా ఖండించారు వారు కొత్తా-పాతా వాఙ్మయాలను గురించి మూడో పేరాతోనే ఆపక చర్చించుకుపోయినట్లయితే ఆ వ్యాసం మరో విధంగా పరిణమించేదని నా అభిప్రాయం

వేంకటరమణయ్యగారు సెలవిచ్చినట్టు కొత్త పాతలకు మంచి చెడ్డలకు సంబంధం లేదు ఆ రెంటిలోనూ ఈ రెండూ ఉన్నై కాని చెడుకు మంచి ఎట్లాగో పాతకు కొత్త అట్లాగని వారు గమనించలేదు మిగతా వ్యాసం అది రుజువు చెయ్యటానికి వినియోగిస్తాం

ప్రకృతిలోనే పాతవి నశించి అవి నశించే లోపల కొత్త వాటి అంకురాలు ఏర్పడటం ఉంటున్నది ప్రతి వస్తువూ పాత పడుతుంది వాఙ్మయం కూడా అంతే శాశ్వత వాఙ్మయం (books for all time) అనే మాట అక్షరాలా నిజం కాదు షేక్స్పియరు పుస్తకాలకు చావు లేదనటం కార్లైల్ మొదలైన వాళ్ల ఛాందసం

వాఙ్మయంలోకి అప్పుడప్పుడూ అమూల్యమైన గ్రంథాలు రాకపోవు వాటి మీద మనకు గల అభిమానం చేత మనం వాటిని వదిలిపెట్టక పోవచ్చును ఎంత కాలానికీ - మహా ప్రస్థానానికి అర్జునుడు గాండీవం చంక పెట్టుకుపోయినట్టు ఒక ఇల్లాలు పెళ్లికి పిల్లిని చంక పెట్టుకుపోయినట్టు కాని తెలివిగల వాడు ఏ పుస్తకం పని ఎప్పుడైపోయిందీ తెలుసుకోగలిగి ఉండాలి రిఫ్రెష్మెంటు రూములో మేసి వచ్చిన పదిహేను రూపాయల భోజనమైనా సరే ఇరవై నాలుగు గంటలలో విసర్జించవలసిందే జీర్ణమలకోశాల మీద అభిమానం కల వాడైతే అంటే ఇన్ని రోజులకో కొత్త పుస్తకం చొప్పున కావలసి వస్తుందా అని ఎవరైనా అడగవచ్చును శరీరం ఎంత సున్నితంగా ప్రిషిషన్‌తో పని చేస్తున్నదో మనసు కూడా అంత సున్నితంగా పని చేస్తే అటువంటిది జరుగవచ్చును

''అబద్ధం ఆడకూడదు'', ''దొంగతనం చేయరాదు'' అన్న ముక్కలకూ కూడా మార్పు రావాలి ఒకప్పుడు అబద్ధం ఆడకూడదనే నీతి చెప్పి హరిశ్చంద్రోపాఖ్యానం ఉదాహరణగా చెబితే అద్భుతమైన పని జరుగవచ్చును ఇప్పటికీ కూడా ఈ పని చేసే నీతి కథా మంజరులు లేకపోలేదు కాని ఎప్పటికైనా క్లాసులో కుర్రవాడు లేచి, ''అయ్యా, హరిశ్చంద్రుడు అబద్ధం ఆడలేదేమో కాని అతని ప్రవర్తన చాలా అఘోరించినట్టున్నది అందులో ఒక్క రవ్వ సత్యం లేదు ఆస్థితిలో మేమేం చెయ్యాలి? నక్షత్రకుడి గుడ్లు తోడాలా? బాకీ లేదు పో పొమ్మనాలా? లేక ఏ పరమేశ్వరుడో అడ్డుపడకపోతాడా అని పెళ్లాం గొంతు కోయాలా?'' అని అడిగితే ఏం చేస్తారు? వాణ్ణి రెండు గంటలసేపు బెంచి ఎక్కిస్తారా? లేక పాతపడ్డ హరిశ్చంద్రోపాఖ్యానం అవతల పారేసి ''అబ్బాయీ, నిజం ఎందుకు చెప్పాలంటే, నిజం చెప్పటానికి భయపడటం నామర్దా కనక! నిజం చెప్పి ఎవరికి చెయ్యలేని ఉపకారం అబద్ధంతో చెయ్యగలిగితే అవశ్యం

అబద్ధం ఆడు?'' అని చెబుతారా?     ఈ పద్ధతి కూడా ఎప్పటికీ పనికొస్తుందనుకోబోకండి! దానికీ మార్పు రావాలి

అమూల్యమైన పుస్తకాలన్నీ సంస్కృతంలోనే ఉన్నవన్నారు వేంకటరమణయ్యగారు ఇంగ్లీషులోనూ, ఫ్రెంచిలోనూ, రష్యనులోనూ ఇంకా అనేక భాషల్లో కూడా ఉన్నవి నా ముత్తాత యొక్క గొప్పతనం నాకెంత ఉపకరిస్తుందో సంస్కృతంలో ఉన్న గొప్పతనం తెలుగుకంత ఉపకారం చేస్తుంది నా ముత్తాత నాకెట్లా బంధువో సంస్కృతం తెలుగుకు అంతే చుట్టం సంస్కృత పదాలు తీసుకుని భయంకరంగా మార్చి తజ్ఞలన్నారు మృత్యువు అనే మాటను మిత్తిగా మార్చిన వారు ఎంతకైనా సమర్థులే ఏ భాష చదివిన వాడికా భాషలో రాయాలని ఉత్సాహం ఉండటం సహజం సంస్కృతం చదువుకున్న పండితులు జాస్తిగా తెలుగులో సంస్కృతం వాడారు ఒక్క సంవత్సరం టైమిస్తే ఇరవై వేల ఇంగ్లీషు మాటలనో వాటి తద్భవాలనో తెలుగులోకి తెస్తాను!

నేటి వాఙ్మయం యొక్క నమూనాల కింద రెండో మూడో చాతకాని వారు రాసిన కథలూ, కేవలం పది మందీ చదివి అవతల పారేసే నిమిత్తం రాసిన కథలూ తీసుకోవటంలో వేంకటరమణయ్యగారు పొరపాటు చేశారు అచ్చుపడ్డదల్లా వాఙ్మయమే అయితే మా ఊళ్లోనే అచ్చయిన కంపెనీ నోటీసులతో ఒక గ్రంథాలయమౌతుంది

ఈ వ్యాసం పొడిగించి లాభం లేదు నా అభిప్రాయం ఏమిటంటే? గురజాడ అప్పారావు కంటే గొప్పవాడు అంతకన్న హృద్యంగా రాసేవాడు కాడు అంతకన్నా ఒక అడుగు ముందుకు వెళ్లిన వాడు ఈ ముందుకు వెళ్లటం ఏమిటని అడగవచ్చు ప్రస్తుతం సత్యాన్వేషణ అమలులో ఉంది ప్రతి దాన్ని గురించీ నిజం తెలుసుకోగోరుతున్నారు ప్రతి రచయితా ఆ అనుమతి మీదనే ఉండాలి ఏదో రూపంలో ఆ పని చెయ్యాలి ప్రతివాడూ ( ఆ లెక్క ప్రకారం కూడా పద్య వాఙ్మయంతో మనకు పని లేదు )

ఇట్లు పోగా పోగా సత్యాన్ని చేరుకుంటామనేది పొరపాటు సత్యం తీక్ష్ణమైనది అందరూ దాన్ని తేరి చూడలేరు సూర్యుణ్ణి సమీపించిన సంపాతి మోస్తరుగా అవుతుంది మన గతి అందుచేత మనం జటాయువల్లే త్వరలోనే మేలుకుని వెనక్కి తిరిగి పరిగెత్తుకొస్తాము అప్పుడు గొప్పవాడు సత్యాన్ని కప్పిపెట్టేవాడు మన రొమాన్సులకూ, కావ్యాలకూ, పద్యాలకూ భలే టైం!

ఈ సందర్భంలోనే ఇంకో పని జరిగితే చాలా బాగుండును ప్రతి వ్యాసం వాఙ్మయానికి బొజ్జ పెంచుతున్నదనీ, ప్రతి రాతగాడూ సారస్వత సేవకుడని ఒక దురభిప్రాయం ఎక్కడ పడితే అక్కడ కనబడుచున్నది ఒక చెంప మడిగట్టుకున్న వాళ్లనూ చూస్తే అరసున్నాలు సరిగా ఉంటేకాని తాకేట్టు లేరు మరో చెంప ఒక్కొక్క పత్రికా సంపాదకుల అహంకారం చూస్తే, ''డు, ము, వు, లు, ప్రథమా విభక్తి అవునా? కాదా?'' అనే దాని మీద నాలుగు పేజీలు రాసి అవునని తెలిస్తే కాని సాహిత్యం కాదు ఏదో విధంగా తాత్కాలిక వాఙ్మయాన్ని శాశ్వత వాఙ్మయాన్నీ విడదీసే ఏర్పాటు జరిగితే బాగుండును

*ప్రబుద్ధాంధ్ర, మాసపత్రిక, జూన్ 1934*

# 2. హిందీ వల్ల తెనుక్కి జరుగుతూ వున్న అపకారం (ఎ)

జూను సంచిక ''ప్రబుద్ధాంధ్రలో'' సంపాదకులు ''హిందీ వల్ల తెలుక్కి జరుగుతున్న అపకారం'' గురించి పేజీ మించని అభిప్రాయాలు కోరుతూ, హిందీ ప్రచారకులను హద్దులో ఉంచటమే తమ అభిప్రాయమని చెబితే హిందీ భాషవల్ల తెలుక్కి జరుగుతున్న అపకారమేమిటో నాకు తెలీకపోయినా, తెలుగు వాళ్లు దేన్లో జొరబడ్డా వేలం వెర్రేనని తెలుసు కాబట్టి హిందీ ప్రచారంలో అంత వేలం వెర్రి అవసరం లేదని ఉద్బోధిస్తారేమో కదా అనుకున్నాను కాని జూలై సంచిక మీదట వ్యవహారం చాలా ముదిరినట్లు కనిపిస్తున్నది టేకుమళ్ల కామేశ్వరరావుగారు అనేక పేజీలు రాయటమే కాకుండా హిందీ ఉద్యమానికి ప్రతి ఉద్యమం ఒకటి బయల్దేరదియ్యాలని కూడా స్పష్టంగా చెబుతున్నారు వారి అభిప్రాయం కేవలం హిందీ ప్రచారకులను హద్దులో ఉంచటంగా కనబడదు

అభిప్రాయాలు వెలిబుచ్చిన వారు ఈ క్రింది విషయాలను గురించి పొరపాటు పడ్డారని నాకు తోచింది

## (1) హిందీ భాష తెలుక్కి ఏమపకారం చెయ్యగలదు?

ఏమీ అపకారం చెయ్యలేదు మనకు సంబంధించినంత వరకూ హిందీ భాష చచ్చిన భాషతో సమానం దీనికి మనం జీవం ఇవ్వలేం అది మన మాతృభాష కాదు ఇంగ్లీషయినా అంతే ఈ రెండు భాషలూ చెయ్యలేని అపకారం చచ్చి శిథిలమైన గ్రాంథిక భాష తాలూకు జీవం లేని ఎముకలు బతికున్న తెలుగుకు చేస్తున్నై సజీవమైన మాతృభాషను తొక్కి పెట్టేటందుకు బంధుకోటిలో చేరిన సంస్కృతం, గ్రాంథిక భాషలైతేనేం ఇరుగుపొరుగు హిందీ ఇంగ్లీషు భాషలైతేనేం? గ్రాంథిక భాష మన తెలుగు మీద పెట్టిన మోపు హిందీ కాని, ఇంగ్లీషు కాని ఎన్నడూ పెట్టలేదు అయితే ఈ భాషలను చూస్తే వ్యామోహమెందుకు? ఎవరికీ సజీవంగా ఉండని గ్రాంథిక ఆంధ్రమే మనవాళ్లనింత వ్యామోహపెడుతుంటే, ఒకరికైనా సజీవంగా ఉన్న హిందీ ఇంగ్లీషులను చూస్తే వ్యామోహం ఎందుకుండదు? స్వదేశీ వస్తువులంతా కొనాలంటే దేశభక్తి అనటం కన్నా మంచితర్కం ఏమిటంటే స్వదేశ వస్తువులు విదేశ వస్తువులతో సమానమైనవిగా చెయ్యటమే అంతవరకూ కొంత శ్రమ తప్పదు ఇప్పుడిప్పుడే సజీవమైన తెలుగుకు బంధవిముక్తి కలుగుతున్నది నలుగురు పెద్దలూ చేరి దాని అస్పృశ్యత తొలగించారు తన భాషలో భావాన్ని చక్కగా ప్రకటించగల వాడు తనది కాని ఇతర భాషకు పోతాడని ఎన్నడూ తలచవద్దు పొరుగింటి పుల్లకూర అనటమే కాని, ఎప్పుడూ రుచి కాదు అనేక వందల మంది కాశీ హిందూ విశ్వవిద్యాలయానికి పోయి హిందీ అక్షరాలు కూడా తెలుసుకోకుండా ప్రతి సంవత్సరం కొంప చేరుకుంటున్నారు

## (2) మనకు హిందీ ఎంతవరకు ఆవశ్యకం?

హిందీ భాష నేర్చుకోవటం, రాయకలగటం, మాట్లాడకలగటం, అరవలు తెలుగు మాట్లాడినట్టుగానైనా సరే - చాలా అవసరం - మనకే కాదు - ప్రతి హిందువుకీ! భాషా భాంధవ్యం ఎంత దూరం వెళుతుందో అందరం గమనించాలి ఒక్క భాష నాగరికతను, మతాన్ని, ఆచారాలను అద్భుతంగా కలుపుతుంది రాజకీయంగా హిందూ దేశం యావత్తూ

ఒక్క మెట్టు మీద నిలబడాలిసిన రోజు వచ్చింది ఈ రోజున ఎవరి భాష కోసం వాళ్లు పోట్లాడి దేశంలో ఎన్ని భాషలున్నవో అన్ని వెళ్లలుగా దేశాన్ని విరగదియ్యటం ఘోరమైన పని అంతా ఒకటే కుటుంబం ఇందులో పిన్నలకూ పెద్దలకూ ఒక భాషకాక మధ్య దుబాసి లచ్చన్న లెందుకు? కాశీనాధుని నాగేశ్వర్రావు పంతులు గారు దేశమంతా ఒక్క హిందీ భాషయితే సంతోషిస్తాననటం నాకెంతో ముచ్చటగా ఉంది అది చాలా గొప్ప ఆశయం శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారు అసమ్మతి చూపటానిక్కారణం కనబడదు దేశమంతా ఒకటే భాష అయిన తరువాత అది హిందీ అయినా తెలుగైనా ఒకటే అప్పుడక్కడ మరో భాష ఉండదు ఎవరు గ్రహించటానికైనా దేశమంతా ఒకటే భాష కావటానికి తెలుగుకన్న హిందీ కెక్కువ అవకాశం ఉంది కాని మరేమీ లేదు అయితే అటువంటిది సంభవమా అట్లు కాదు మంచి ఆశయమౌనా కాదా అంటే కాదనటానికెవరికీ ఎట్ల నోరువస్తుంది? దేశమంతా ఒక భాష కావటం వల్ల ప్రయోజనము చాలా ఎందల సంవత్సరాల క్రితం రోము దేశమే ఎరుగను ఇప్పుడింగ్లీషు వారే ఎరుగుదురు?

అంతకన్నా మనకు హిందీ భాషతో పనిలేదు నాక్కావలసిందెంతవరకంటే హిందూ దేశంలో ఏమూలకు పోయి నా హిందూ సోదరులు మాట్లాడేది నేనర్థం చేసుకుని నేను నా మాటలు వారికి తెలపగలగాలి హిందూ దేశంలో ఏ మూలకు పోయినా '' ఇది నాది''! అనిపించాలి మన పూర్వులు హిమాలయాపర్వతాలకి కన్యాకుమారికి మధ్య ఉన్న ప్రతి వస్తువూ తమ సొంతంగా భావించి అట్లా రాయగలిగారు నేను మొదటిసారి కాశీ విశ్వేశ్వరుడి గుడి ప్రవేశించి '' ఇది నాది!'' అనుకోవాలని ప్రయత్నం చేసి ఓడాను

హిందీ సారస్వతంతో నాకు పనిలేదు ఏ తెలుగు వాణ్ణి కూడా ఒక్క హిందీ పుస్తకం చదవమని చెప్పను, హిందీలో పుస్తకాలు రాయమని చెప్పను, హిందీ పత్రికలు సారస్వతాభివృద్ధికి నడపమని చెప్పను హిందీ భాషకోసం ఏ హిందువుకు కూడా ఒక సంవత్సరంకన్న ఎక్కువకాలం వ్యయం చెయ్యటం వ్యర్థం ఆ ఒక్క సంవత్సరం ఎంత మాత్రం వృధాకాదు

కామేశ్వర్రావు గారు కూడా భాషా సేవ అంటూ మాట్లాడటం చాలా విచారకరం భాషచేత సేవ చేయించుకుంటూ ఎన్ని భాషలు మాట్లాడగలిగితే అంత బానిసని కామేశ్వర్రావు గారి అభిప్రాయం కాదనుకుంటాను!

**3. హిందీ, తెలుగు పత్రికలు**

తెలుగులో మంచి పత్రికలింకా ప్రారంభం కాలేదని చెప్పాలి ఇంకా కొత్త మన పత్రికలు అప్పుడే హిందీ పత్రికలతో పోటీకి రాలేవు పత్రికా సంపాదకులకూ, వ్యాస రచయితలకూ జర్నలిజం అంటే ఏమిటో తెలీదు పత్రిక యొక్క బిజినెస్ సైడ్ తెలీదు నలభై సంవత్సరాలనుంచి నడుస్తున్న పత్రికలతో మన పత్రికలు పోటీ ఏమిటి? తెలుగు రాతలో కొమ్ములు తిరిగినవాడికి వెట్టివాడి వేతనం కూడా లభించలేదు ధైర్యంచేసి వ్యాసరచనకు జీవితం అర్పిస్తాడు? అట్లా కొంతమంది చొరబడకపోతే తెలుగుపత్రిక లెట్లా పైకి వస్తై? తెలుగు దేశంలో భారతి సంచికలకన్న మాధురి సంచికలెక్కువ అమ్ముడు పోతున్న వనే అనకపోతే తెలుగు దేశంలో భారతి అమ్మినదానికన్న మాధురి హిందీదేశంలో ఎక్కువ పర్సెంటేజి అమ్ముతున్నదని గమనించరాదూ? ఆ లోపం భారతిలోనే ఉందనుకోరాదా?

హిందీ పత్రికలు కనక హిందీ ప్రచారాన్ని దూషించాం మై మాగజైన్ నలభైవేలమ్ముతున్నది వాన్లో పడే వ్యాసాలు చూడబోతే ఎట్లా ఉండాలో అట్లాగే ఉన్నై దాదాపు ఆ పక్కీగానే నడుస్తున్న వినోదినికి అంత అమ్మకం కనిపించదు ఆ ఇంగ్లీషు పత్రిక కొనవద్దని కాని ఈతెలుగు పత్రిక కన్నా ఇంగ్లీషు పత్రిక ఎక్కువమందిని తృప్తి పరుస్తున్నదని గ్రహించి ఊరుకోవలిసిందే నేనట్లే గమనిస్తున్నాను ప్రబుద్ధాంధ్రను మూసేవాడులేడు తెలుగులో అటువంటి అమూల్యమైన వ్యాసాలిస్తూ, రాయల్‌సైజులో, ఇంగ్లీషు బాడీలో ప్రింటు చేసిన పేజీలతోచక్కని ప్రింటింగుతో రూపాయి సంవత్సర చందాకు వచ్చే పత్రికకన్నా కారు చౌక ఏదో నాకు తెలీకుండా ఉంది వేలకువేలు అమ్మటం లేదంటే అది కావలసినవాళ్ళు చాలా కొద్దిమందేనన్నమాట ! ఆ మాటని ఊరుకోవటం కన్నా చేసేదేముంది? హిందీ ప్రచారక్ అమ్ముతున్నదంటే భాష నేర్చుకోవాలని ఉన్న ప్రతివాడికీ దాంతో పనుంది

**4 అభిప్రాయాలు**

''ఈ హిందీ ఆరాటంతో తెలుగువారిలోని రవంత తెలుగుతనమున్నూ రాలిపోతున్నది'' అని హనుమచ్ఛాస్త్రిగారి అభిప్రాయం ఈ హిందీ ప్రచారం రాకమునుపు మనలో ఉండి ఇప్పుడు పోయిన తెలుగు తనమేమిటి? శాస్త్రిగారీ విషయం స్పష్టంగా చెప్పలేదు

'' ఒక భాష అభివృద్ధయిందంటే మరో భాష క్షీణించిందన్న మాటే'' నన్నారు నా మిత్రులు శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు ఒకరికిద్దరు హిందీ నేర్చుకోటం అభివృద్ధి కాదు అసలా హిందీ ఏంతిని బతుకుతుందో మనకు తెలీదు ఇంగ్లీషు మనదేశంలో ఎంత అభివృద్ధయిందో హిందీ కూడా అంతే (ఒక తెలుగు హిందీ పండితుడు హిందీలో రాసిన ఒకానొక ఉపోద్ఘాతం చూసి హిందీ వాళ్ళు నవ్వుతుండగా నేనక్కడ ఉండటం జరిగింది ఆయనకు మంచి హిందీ రాదంటే అమాంతం మీదపడి కరుస్తారు!)

''చంద్రిక''కూడా హిందీ ప్రచారానికి ఆగ్రహించడం చూస్తే నాకు నవ్వాలో చింతించాలో తెలీడంలేదు ''చంద్రిక'' భక్తితో పూజిస్తున్న తెలుగు ఎముకలకిక చలనం లేదే! ఏమైనా ప్రమాదం జరిగితే మేమంతా ప్రాణ ప్రదంగా పట్టుకొస్తున్న వాడుక భాష కుండాలి కాని ''చంద్రిక'' వారి గ్రాంధిక భాష మార్పుకూ చావుకూ అతీతమైపోయింది లేక జీవభాష నెత్తిన మేం కాలుపెట్టి ఉండగా మధ్య ఈ హిందీ ఎక్కణ్ణించొచ్చిందని అసూయా? మాకే రాయ్యైతేనేం తలపగలగొట్టుకోటానికి గ్రాంధిక భాష చెయ్యగల పనేమిటో తేలిపోయింది ఒక్కసారి బయటికెళ్ళి మళ్ళీ లోపలికొచ్చి వీధిలో గమనించిందంతా రాయాలంటే కవిత్రయం, వారెక్కడా ఉపయోగించని మాటలు రొండు డజన్లు కావాలి మా ఆశలన్నీ ఇంకా పసికూనగా ఉన్న వాడుక భాషమీదనే ఉన్నై కనక ''చంద్రిక'' హిందీని చూసి అట్టే ఆగ్రహిస్తే హాస్యాస్పదంగా ఉంటుందని మనవిచేస్తున్నాను

*ప్రబుద్ధాంధ్ర మాసపత్రిక, ఆగష్టు 1934*

# 3. హిందీ వల్ల తెనుక్కి జరుగుతూ వున్న అపకారం (బి)

అయ్యా, ఆగష్టు సంచిక ''ప్రబుద్ధాంధ్ర'' ఇప్పుడే అందింది చూశాను నా వ్యాసం నేను కోరిన ప్రకారం ఈ సంచికలో చేర్చినందుకు కృజ్ఞుణ్ణి మీరు నావ్యాసాన్ని గురించి రాసిన దానిమీద ఒక్క ముక్క రాయదలచుకున్నాను ప్రచురణార్థంకాదు చేస్తేవద్దనను

ఒక్క విషయం గమనించండి ఒక్క నాగేశ్వర్రావు గారి ఆదర్శం తప్ప మిగిలిన విషయాలను గురించి మీతో నాకు పేచీ లేదు మీరు తూకంగా చెప్పే ముక్కలకూ అభిప్రాయాలిచ్చే గొర్రెదాటుకూ ఏమీ సంబంధంలేకుండా ఉంటున్నది హిందీ ప్రచారకుల్ని నేను హద్దులో ఉంచవద్దన్నానా? మీరు చెప్పిన ఉదాహరణలను తాక్క పోవటానికి నా సమ్మతే కారణం నాకు హిందీ వ్యామోహం ముమ్మరంగా ఉందని ఎట్లా గ్రహించారో తెలీదు నాకు హిందీ అక్షరాలైనా వచ్చునని ఎవరికీ తెలీదు హిందీ అర్థంచేసుకోవటం సుమారుగా మాట్లాడగలగటంతో, నాపని అయిపోయిందని కూడా స్పష్టంగా చెప్పాను ఇక నాగేశ్వర్రావుగారు చెప్పినముక్క నాకు ముచ్చటగా ఉండటానికి కా్కరణం ఆయన చెప్పేది సంభమని కాదు చాలా ఆశయాలు గొంతెమ్మకోరికలు గానే ఉంటై కాని నేను ముచ్చట పడ్డది నాగేశ్వర్రావుగారు తెలుగు సారస్వతానికి శరీరద్రవ్యాలర్పిస్తూ కూడా భాషకు రాజకీయంతో గల సంబంధం గ్రహించినందుకు నాగేశ్వర్రావు పంతులుగారెంత అజ్ఞాని అని భావించుకున్నా హిందూదేశంలో హిందీ తప్ప మిగిలిన భాషలన్నీ నశిస్తవనినమ్ముతారనుకోటానికి కారణం లేదు అటువంటి నమ్మకం ఏరోజున కలిగితే ఆ రోజునించీ భారతీ ఆంధ్రపత్రికలు హిందీలోనే వచ్చేవి వాటి సర్క్యులేషను కూడా పెరిగే ఉండేదేమో! - పరిస్థితులు చూస్తే

పత్రికలవిషయం మీరు చెప్పింది చూడండి ఇంగ్లీషు పత్రికకొనేవాడు భాష అభివృద్ధి చేసుకోటానికి కొనడు హిందీ వచ్చీరాని వాడు కూడా భాషకోసం హిందీ పత్రిక కొంటాడు ఇక ఇంగ్లీషు తెలుగు పత్రికల్లో ఒక తారతమ్యం ఉంది ఇంగ్లీషు అర్థమైనవాళ్లలోకూడా సగం మంది ఇది పిచ్చి ఇంగ్లీషు, ఇది మంచి ఇంగ్లీషు అని చెప్పలేరు తెలుగట్లాకాదే! తెలుగుపత్రికలు బాగుపడాలంటే తెలుగు పత్రికలు బాగుపడటమే మార్గం కాని ఇతర పత్రికలు పడిపోవటంకానేకాదు మీరాపాయింటు గ్రహించవలసిందేకాని వాదన లాభంలేదు ఆంధ్రులోపదిహేను వీసాలు ఇతర భాషల వెంట పరిగెత్తినా మనం ఆదుర్దాపడవలసిన అవసరం లేదంటున్నాను కాని మీరు ఒక్కటి రుజువు చెయ్యగలిగితే నేను రాసిన వ్యాసం వ్యర్థమౌతుందని ఒప్పుకుంటాను హిందీ నేర్చుకునేవాడు తెలుగుకు సహాయం చెయ్యటం అసంభవమా? అయితే హిందీ పోతే గాని తెలుగు నిలవదు నా మట్టుకు నాకా అనుమానం లేదు ప్రతి ఆంధ్రుడూ హిందీ నేర్చుకుని కూడా తెలుగు అభివృద్ధికి అడ్డంలేకుండా ఉండవచ్చును తెలుగువదిలి హిందీ ఎత్తుకోండి అని ఎవడైనా ప్రచారం చేస్తే వాడివల్ల తెలుగుకు కలిగే లాభంలేదు ఇంకొకటి గమనించండి వీధి ప్రక్కనమురుగుకాలువలు తప్పవు జైలుకు పోయినవాళ్లలో ఎటువంటి వాళ్లున్నారో చూడండి ప్రచారకులు - హిందీ ప్రచారకులు కూడా అంతే వాళ్లకోసం ఎదురు ప్రచారం చెయ్యాలో నాకర్థం కాలేదు

మీరు చెప్పేదానికీ ఇతరులు చెప్పేదానికీ సంబంధం లేకుండా ఉంది వాళ్ళను మీరు వెనకేసుకొస్తే లాభంలేదు

నావ్యాసం చిత్తురాసి తిరిగిరాయటంలో " ఆంధ్రభూమి" పేరు ఎట్లా వదిలేశానో వదిలేశాను కాని నేను రాసినదాన్లో ఆంధ్రభూమికి సమాధానం "హిందీ, తెలుగు పత్రికలు" అనే ఘట్టంలో ఉంది గమనిస్తారుగాక! సెలవు

*ప్రబుద్ధాంధ్ర, మాసపత్రిక, సెప్టెంబరు 1934*

# 4. కథారచన

ఇతర రచలకంటె కథారచన చాలా తేలిక పనల్లే కనిపిస్తుంది చప్పున చూసేవాడికి ప్రస్తుతం మన దేశంలో రాతగాళ్ళను తీసుకుంటే పద్యాలూ, నాటకాలూ మొదలైనవి రాసేవాళ్ళకంటె కథలు రాసేవాళ్ళే ఎక్కువగా ఉన్నారు దీనికంతటికీ ఒకటే కారణం- కథలు ఎట్లా పడితే అట్లా రాయవచ్చుననే ఒక దురభిప్రాయం

దీన్ని ఎవరో ఒకరు ప్రకటించాలి, ఇది నలుగురిచేతా చదవబడాలి అనుకుని మరీ కలం పట్టుకునే వాడేది రాయటం మొదలుపెట్టినా కొన్ని నియమాలూ కట్టుబాట్లూ అడ్డు పడతై అవి లేకుండా రచనే లేదు

అయితే ఏమిటంటే కథారచన ఎంత భిన్నంగా ఉందంటే, దాన్ని నియమబద్ధం చెయ్యబూనటం సులసాధ్యమైన పని కాదు అటువంటిదింతవరకు జరగలేదు కట్టుబాట్లకు లోబడటం ఇష్టంలేక, ఏదో ఒకటి రాయాలని ఉండి రాయబూనిన వారికి, శారదాబిల్లు తప్పించుకోదలిచిన వారికి బందరు ఫ్రెంచి పేటా నిజాం రాష్ట్రమూ దొరికినట్టు, కథారచన ఒకటి తేరగా ఉన్నది పత్రికా సంపాదకులు కూడా పెద్ద చిక్కులోనే ఉన్నట్టున్నారు ప్రకటనార్థం వచ్చిన కథల్లో వేటిని స్వీకరించాలి? వేటిని తోసెయ్యాలి? తోసేసిన వాటిని ఏ వంకపెట్టి తోసెయ్యాలి? 'నాకిది బాగుండలేదు దీన్ని నే ప్రకటించను!' అనవచ్చుననుకోండి, సొంత అభిరుచులమీద ఆధారపడటం తప్ప గత్యంతరం లేదా? వాదించలేనివాడు 'నా ఇష్టం!' 'అన్నట్టు, కేవలం' ఇది నాకు బాగుండలేదు' అనటంతోనే పోనివ్వకుండానే, అనేక మార్గాల కథలు స్వీకరించటం, నిరాకరించటం జరుగుతున్నది కథావస్తువు సంపాదకుడికి ఆమోదకరంగా ఉండదు, కథలో కాంగ్రెసు సంప్రహేళన చెయ్యబడటమో, స్వేచ్ఛానురాగం ప్రశంసించబడటమో, సనాతన ధర్మం సమర్ధించబడటమో, సంపాదకుడి బుద్ధికి దారుణంగా తోచే సందర్భం ఏదో కలుగుతుంది లేదూ భాష దుర్భరంగా తోస్తుంది, రచన నిండా పాషాణాల వంటి సమాసాలుండటమో, వాడుక భాషలోనే మరీ గ్రామ్యమైన - బొత్తిగా వ్యాకరణంలేని - రచన కావటమో జరుగుతుంది లేదా, కథ అచ్చుపుటలు ముప్పైమూడు ఆక్రమించటమో, మొదటి పేజీకే చివరల్లా రాకపోవటమో అవుతుంది ఇంతకుమించి సంపాదకుడి చేతిలో ఆయుధం లేదు ఇక చదివేవాడి సంగతీ అంతే ఎవడి అభిరుచిని బట్టి వాడు ఫలానా కథ బాగుందనీ, ఫలాని కథ బాగాలేదనీ, తన అజ్ఞానాన్ని బయటపెట్టటానికి జంకని ధైర్యస్తుడయితే తనకొక కథ అర్థం కాలేదనీ అన్నాడు అంతతో సరి అప్పుడప్పుడూ చదివేవాడి అభిరుచిని ధిక్కరిస్తూ మునిమాణిక్యం వారి కాంతం కథలంటివి బయలుదేరతై అందరికీ బాగుండేవి అటువంటి వాటిలో బాగేమిటో అర్థం చేసుకుందామని చదివేవాడు బలహీనంగా ప్రయత్నం చేసి, చివరకు

- నేనెక్కడో రాసినట్టు - కాంతం కథలో కొంచెం 'ఇది' ఉందని తేల్చుకుంటాడు వాటిలో ఉన్న ఇది ఇతర కథల్లో ఎందుకులేదో, అది లేని కథలెందుకు పత్రికల్లోకెక్కాలో చదివేవాడికి పట్టదు కథలకు ఏ నియమాలుండాలనే విషయాన్ని గురించి రాసే వాళ్ళూ, సంపాదకులూ, చదివేవాళ్ళూ అజ్ఞానంలో ఉండటం శోచనీయమైన విషయమే కాని నియమాలు ఏర్పాటు చెయ్యటం ఎప్పటికీ జయప్రదం కాని వాటిల్లో ఒకటి పద్యాలను లక్షణాలన్నీ ఏర్పాటు చేసినంత మాత్రాన ఏం జరిగింది? వాటన్నిటినీ పాటిస్తూ ఎందుకూ కొరగాని పద్యాలు రాయవచ్చును, వాటన్నిటినీ ధిక్కరించి చక్కని పద్యాలు రాయవచ్చును ఈ నియమాలు అసమర్థుడికి సహాయం చెయ్యలేవు, కాని సమర్థుడికి అడ్డం వస్తాయి వాటి పనే అది రాయగల వాడికి స్వేచ్ఛ ఎంత ఉపకరిస్తుందో రాయలేని వాడికది అంత దుర్వినియోగానికి ఉపకరిస్తుంది కనక ఎటొచ్చీ జరగవలసిందేమిటంటే పత్రికా సంపాదకులు విడవకుండా రకరకాల కథలు చదువుతూండటమే మంచి కథకూ చెడ్డ కథకూ వ్యత్యాసం కనుక్కోటానికంత కన్న మంచి అభ్యాసం లేదు అక్కడక్కడా కథా రచనను తృణీకారభావంతో చూసే సంపాదకులున్నట్టు నా కనుమానం ఉంది వారు వారి పత్రికల్లో కథలు ప్రకటించడమే మానివెయ్యటం బహు యోగ్యమైన పని మంచి కథను వారు గుర్తించటం జరగని పని

కథల్లో అనేక జాతులుంటై కథా రచన కళగా చూసుకొని రాసే వారున్నారు ప్రచారార్థం కథలు రాసే వారున్నారు తమ అక్కర నిమిత్తం - గిట్టని వాళ్ళని తిట్టి ఏడిపించుదామని - కథలు రాసి ఆత్మవంచనా పరవంచనా చేసుకునే వారున్నారు కేవలం ఉత్సాహం కొద్దీ రాసి ఇతరులను సంతోషపెడదామని కథలు రాసే వారున్నారు

కళాసహితమైన కథా రచన ఇతర కళలతో పాటు స్థానం పొందుతుంది ప్రచారార్థం రాయబడే కథలను చదివేటప్పుడు ఏమరుపాటున ఉండరాదు టాల్‌స్టాయ్ వంటి రాతగాడు ఒక్క క్షణంలో మన కళ్ళలో దుమ్ముకొట్టి మనల్ని తన వెంట ఈడ్చుకుపోగలడు అటువంటి వాడి చేతులో చిక్కామో, మన దేశ పరిస్థితులు రష్యాలో మాదిరిగానే ఉన్నావనీ, బుర్రతో పని చెయ్యటమంటూ లేనే లేదనీ, కూలినాలి చేసుకు బతికే వాళ్ళ హృదయాలు మన హృదయాలకంటె స్వతస్సిద్ధంగా పరిశుద్ధమైనవనీ అవలీలగా నమ్మించగలడు కథల ద్వారా పగ తీర్చుకోవటంలో గల అవినీతిని గురించి చెప్పేదేమీ లేదు ఉత్సాహంతో రాసే కథలు సరదాకు చదవదగినవే కాని వాటికి సారస్వతంలో తావు దొరకటం అసంభవం

నూటికీ కోటికీ ఒక చిత్రం జరుగుతుంది ఏ ప్రచారార్థం రాయబడ్డ కథో, లేక పగ తీర్చుకోటానికి రాయబడ్డ కథో ఇతర కారణాల వల్ల అత్యద్భుతంగా తయారయి సారస్వతంలో స్థానం పొందుతుంది ఒక నిజమైన మూఢుణ్ణి తీసుకుని, రచనలో వెకిలితనం లేకుండా - నేను 'పెళ్ళినాడిచ్చిన కట్నం' అన్న కథ రాసినట్టు కాకుండా - ఆ మూఢుణ్ణి జయప్రదంగా కథానాయకుణ్ణి చేశాడు టాల్‌స్టాయ్ ఇది ఎంత కష్టమో ప్రయత్నించి చూస్తే తెలుస్తుంది అటువంటి కథ ఇంకొకటి రాయటానికి మరో టాల్‌స్టాయ్ పుట్టాలి ఆ మహాశయుడి ప్రచారోద్దేశం అవతలపెట్టి ఆ కథకు నేను ఉత్తమ స్థానం ఇస్తాను ఈ విధంగానే లార్డ్ చెస్టర్‌ఫీల్డ్‌ను బహిరంగ లేఖ ద్వారా అనవసరంగా (అందుకేమీ సందేహం అవసరం లేదు) తిట్టి, ఆ ఉత్తరానికి ఘనత సంపాదించాడు డాక్టర్ జాన్సన్ ఆ ఉత్తరం యొక్క ఘనత

జాన్సన్ యొక్క దూషణయందు గల న్యాయం వల్ల రాలేదు, దాన్ని రచించటంలో జాన్సన్ చూపిన నిపుణత వల్ల కలిగింది

ఎవడన్నా అమానుషంగా ప్రవర్తిస్తే 'వీడు మనిషి కాదురా!' అని ఏ ఉద్దేశంతో అంటామో, ఆ ఉద్దేశంతోనే ఒక నాటకాన్ని నాటకం కాదనీ, కథను కథ కాదనీ అనవచ్చును మనిషిని మనిషి కాదనేటప్పుడు మనిషి ఒక విధంగా ప్రవర్తిస్తాడని ఒక అస్పష్టమైన జ్ఞానం ఉంటుంది అట్లాగే కథలను గురించీ చూడదగినది కాకపోతే నాటకం కాదు, చెప్పదగినది (వినదగినది) కాకపోతే కథ కాదు

అప్పుడే కథ అనే దానికొక అస్పష్టమైన ఆకారం వచ్చేసింది కథకిది మొదటి నిబంధన కనీసం చెప్పదగినదీ వినదగినదీ అయినా కాకపోతే కథ కాదు ఈ మొదటి నిబంధనలే తట్టుకోలేని కథలెన్ని ప్రకటించబడుతున్నై ప్రతి నెలా?

ఇప్పుడు మనం కథలనేవి ప్రపంచంలోలేవని భావించుకుని ఈ సూత్రం మీద కథ జన్మించి ఎట్లా పెరుగుతూ ఎట్లా మారుతుందో ఆలోచిద్దాం

సహజంగా మొదటి కథలు చాలా అసామాన్యంగా, దాదాపు అసహజంగా, అసంభవంగా ఉంటై వాటి నిండా ఉద్రేకపూరితాలైన హత్యలూ, ఎవరూ కనీ వినీ ఎరగని నరకాలూ (స్వర్గాలూ-రెండూ ఒకటే!) ఉంటై కాలక్రమాన చదివేవాళ్ళకిటువంటి అసహజమైన రచనలను చూస్తే అసహ్యం పుడుతుంది క్రమంగా ఈ అసంభవాలు స్థానే సులభంగా ఊహించుకోదగినవీ, అయినా అసామాన్యమైనవీ బయలుదేరతై ఈ కథలు వెనకటి వాటికన్న ఎక్కువ కాలం నిలబడతై కాని చదివే వాళ్ళకు వాటి మీదా రోత పుడుతుంది అక్కడక్కడా కథలు గమనిస్తారు, వినదగిన విషయాలు మన నాలుగు బజార్ల మధ్యా జరుగుతుంటే ఏవేవో ఊహించుకోవటం అవసరం కాదా అని కథల్లో వ్యక్తులు క్రమంగా సంఘంలో వ్యక్తులను సమీపిస్తారు కథల్లో జరిగే విషయాలు సంఘంలో జరగదగిన విషయాలుగా మారతై ఇంకా కాలం గడిచినకొద్దీ నాలుగు బజార్ల మధ్య జరిగే వాటి స్థానే నాలుగు గోడల మధ్య జరిగేవి వస్తాయి 'పాతాళ గృహం' అవతల పారేసి 'కాంతం కథలు' చేపడతారు జనం

ఇదంతా శాస్త్రీయంగా చర్చించదగిన కథ యొక్క అభివృద్ధి కథకులు అశాస్త్రీయంగా అనేక అలంకారాలు తెచ్చిపెడతారు కథల జీవం యావత్తూ ఈ అలంకారాల్లో ఉంటుంది ఒక్కొక్క కథకుడు కథను కొసతుంచి మెయిలుబండి స్టేషనులో ఆగినట్టు చేస్తాడు మరొకడు తను చెప్పదలచుకున్న విషయం తప్ప మిగతాదంతా చెప్పి సూచన ఇచ్చి వదిలిపెట్టేస్తాడు ఇటువంటి కథలు రాసేటప్పుడు చదివే వాడికి రెండు మూడు రకాల భావించటానికవకాశం ఇస్తే కథ యొక్క విలువ పోతుంది ఆ చేసే సూచన పొరపాటు లేకుండా చెయ్యాలి మరొకడు కథను కావాలని తారుమారు చేసి వెనకది ముందూ ముందుది వెనకా చెప్పి తన కథను మరోసారి చదివిస్తాడు ఒక ఇంగ్లీషు కథకుడు ఏ క్షణానికాక్షణం కొంపలు మునగబోతున్నట్టు రాసుకొచ్చి చివరకేమీ లేకుండా కథ తేలుస్తాడు ఇటువంటి స్వల్ప విషయాలతో కథకులు తమ కథలకు తమ వ్యక్తిత్వాన్ని కలిగిస్తారు పత్రికలు చదివే వాళ్ళు ఒక కథకుడి రచనలు కొన్ని చదివి అవి రుచించిన మీదట అతడు ప్రకటిస్తూ ఉండే కథలను అతని ద్వారా ప్రేమిస్తారు (అతన్ని గురించి అతను రాసే కథలు మినహా ఏమీ తెలీకపోయినా సరే!) ఇది చాలా చిత్రం

కాని నిజం నేను మొదటిసారి చింతా దీక్షితులుగారి పిల్లల కథలు చదివినప్పుడు ఇతర కథలు చదివినట్టే చదివాను కాని ఆయన 'పర్సనాలిటీ' నాకు కథల ద్వారా చిక్కిన తరవాత ఆయన కథలలో నేను వెతికేది నాకు పరిచితమైన ఆయన వ్యక్తిత్వమే కనక కథలు ఒక్కసారే రెండు పనులు చేసేస్తయి మొదట వాటిని చదివిన వాళ్ళకు రాసిన వాడియొక్క 'పర్సనల్ టచ్' కలిగించి, ఆ వెనక ఆ 'పర్సనల్ టచ్' యొక్క ఆధారం వల్ల కొంత వ్యక్తిత్వం పొందుతై

కనక, కథలేవిధంగా ఉండాలంటే ఉజ్జాయింపుగా ఈ మూడు విషయాలూ చెప్పవచ్చును ఒకటి, కథ చెప్పబడ్డట్టుండడం, రెండు సంఘం (చదివే వాళ్ళు) యొక్క నాగరికతా అభిరుచులను బట్టి చెప్పదగినదిగా (వినదగినదిగా) ఉండటం, మూడు, రాసే వాడి యొక్క 'పర్సనాలిటీ' కథలోనించి తొంగి చూస్తుండటం

మాట్లాడటానికి ఉపయోగించే ధారాళమైన భాష ఉపయోగించకపోతే (మాట్లాడేటప్పుడొచ్చే తొస్సులు మాత్రం లేకుండా) మొదటి నియమానికి భంగం వస్తుంది వినదగిన విషయాలూ - వీటి విచక్షణ తెలీని కథకుడయితే రెండో నియమం చెడుతుంది ఒకరి కథలను ఒకరు ఆకారంతో సహా దొంగిలించటం మొదలుపెడితే మూడో నియమం చెడుతుంది (మూడు నియమాలూ చెడ్డ కథలు అప్పుడప్పుడూ పత్రికలలో కనిపించటమూ కద్దు!) కథలు రాసే వారింకో పని కూడా చెయ్యాలి కొంత మందికి జరిగిన విషయాలు కథలో రాస్తేనే బాగుంటుందని ఒక అభిప్రాయం ఉంది అంటే కథడుకు తన భావనాశక్తి వినియోగించి కథ రాయటం కంటే అనుభవం మీద రాస్తే కథ బాగుంటుందని దానికి ఒకటే అభ్యంతరం చూడదగినవన్నీ చెప్పదగినవిగా ఉండవు వ్యాసం రాయటానికి కిందుమీదవుతున్న తండ్రికి కొడుకు ఖగోళశాస్త్ర సమస్యలతో అడ్డురావటంలో చూడదగినదేముంటుంది? ఒక్కోసారి మనం కళ్ళారా చూసిన విషయాలే మరో డింకోడితో చెబుతుంటే మనకు వినబుద్ధి పుడుతుంది అట్లా చెప్పగలవాడు సహజ కథకుడు ఇటువంటి సహజ కథకులు సామాన్యంగా కాగితం మీద కలం పెట్టలేదంటే, ఆ పని చెయ్యటానికి కొన్ని నిబంధనలు వాళ్ళని భాధిస్తవని సులభంగా ఊహించుకోవచ్చును అవేవో రాయటం మొదలుపెట్టినవాడికి గాని తెలిసి రావు అవి ఒక కథా రచననేకాక రచనకు సంబంధించినది కావటంచేత మనకవసరం లేదు తెలుగులో ఇంకా చెప్పుకోతగ్గ కథలు లేకపోయినా కథలుగా ప్రత్యేకత పొందిన వారి కథలను గురించి క్లుప్తంగా రాస్తాను

దీక్షితులుగారి చిన్న పిల్లల కథలు - అనుభవం జ్ఞానంకాదని నిరూపిస్తాయి ఈ కథలు మనకందరికీ బాల్యం గడిచింది జరిగినదంతా మరిచిపోయినం వెనక్కు తిరిగి చూసుకుంటే అయోమయం ఒక్కసారి దీక్షితులుగారి కథలు తిరగవెయ్యగానే అయోమయం మాసిపోయి కలలో చూసినట్టున్న ఒక నూతన ప్రపంచం కాంతి వంతంగా మన ఎదట సాక్షాత్కరిస్తుంది

వెంకటచలం గారి 'బూతు' కథలు - వీటికదే పేరు! ఇంతకూ వెంకటచలం గారు చేసిన తప్పేమిటంటే మనం అశుద్ధమన్నట్టుగా కప్పిపెడుతున్నదాన్ని బయటికీడ్చి అవివేకం, అజ్ఞానం, మూఢత్వం, మొండితనం, చాటుబుద్ధి మొదలైన దుర్గుణాలమీద తీవ్రమైన జ్ఞాన ప్రకాశం చేస్తున్నారు చేజేతులా అశుద్ధం చేసుకున్నామంటారు కథలలో కొంత ప్రచారధోరణీ,

జ్ఞానబోధచేసే ఉద్దేశమూ ఉన్నై ఇవి ఆయనయొక్క మత కథలనీ, ఆయన దృష్టిలో పవిత్రములైనవిగా ఉద్దేశించబడ్డవనీ చెప్పవచ్చును

నరసింహరావుగారి కాంతం కథలు - కాంతం తెలుగువాళ్ళకు కొత్త సాంప్రదాయం ప్రబంధాలనాటినుంచీ ఆడదానికి వ్యక్తిత్వం లేకపోవటం, ఆడది నోరుతెరిస్తే వెధవకంపూ ఆచారంగా వస్తున్నాయి కాంతం (తెలుగు సారస్వతంలో కొత్త) తెలివిగలది కొయ్య బొమ్మ కాదు స్వతంత్రంగా ఆలోచిస్తుంది తప్పులు చేసి దిద్దుకుంటుంది ఇంట్లో సందడిగా ఉంటుంది కాంతం లేకపోతే ఇల్లు చిన్నబోతుంది వెంకట్రావు మనస్సు చిన్న బోతుంది పిల్లలు నాగరికత పోగట్టుకున్న జాతి మాదిరిగా ప్రవర్తిస్తారు మళ్ళీ కాంతం ఇంట్లో అడుగుపెట్టగానే ఎవరి స్థానంలో వారు అమరి ఊరుకుంటారు

సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సాంసారిక కథలు - ఈ కథలలో విశేషమేమిటంటే పాత్రలు మాట్లాడటై - ఇతర కథలలో పాత్రలల్లే పోర్షను వప్పించకుండా కథ చదవటం మొదలుపెట్టగానే ఒక తెలుగు కుటుంబం మధ్య వెళ్ళి పడతాం కథ అంతమయ్యేవరకూ ఆ భావం పోదు కథ వినదగడం యావత్తూ కథనంలోనే ఉంటుంది సంభాషణ జాస్తిగా ఉండటంవల్ల కథ కుదుపులేకుండా దొర్లిపోతుంది సంభాషణలో పాలు తీసుకునేవాళ్ళు మాట్లాడే విషయం మీదికి ఎగబడా మాట్లాడతారు (ఇతర్ల సంభాషణల్లో పాత్రలు దూరాన నుంచుని దేవుడి మీద అక్షింతలు విసిరేసినట్టు విషయచర్చ జరుగుతుందని గమనించేది!)

ఇంకా ఇతర కథకులనేకమంది ఉన్నారు కాని వారి వారి కథల ప్రత్యేకత నేను గ్రహించలేకపోవటం చేత వాటిని గురించి రాయలేదు

తెలుగు కథలు చాలా అభివృద్ధి కావలిసి ఉంది ఇప్పుడు జరుగుతున్నదాని కన్న ఇంకా చాలా దృఢంగా భావ ప్రకటన చెయ్యటం ఒకటి అవసరం తరవాత కథలు యావత్తూ ఒక్క బ్రహ్మణ సంసారాల చుట్టూ తిరుగుతున్నై సంసార్లను గురించి రాయబడే కథలలో మించరాని అబద్ధాలూ, తప్పులూ కనబడుతున్నై కాకపోయినా అ కథలకు ప్రత్యేకత ఇవ్వగలిగినంత రాతగాళ్ళు రాకుండా ఉన్నారు తెలుగు సంఘం ఒక్క బ్రాహ్మణులతోనే లేదు బి ఏ లు పాసయిన యువకులతోనూ లేదు తెలుగువాళ్ళ ముఖ్య వ్యాపారం స్త్రీ పురుషులొకరొన్నొకరు ప్రేమించుకోవటమూకాదు కాని కథలు ఎంతసేపటికీ ఈ ధోరణి లోనే ఉంటున్నై దానికి కారణం రాసేవాళ్ళను సంఘం యొక్క నాలుగు మూలల్నీ గురించి కథలు రాయటానికి కావలిసినంత తెలీకపోవటమే తరువాత కథకుడు చదువరిని బుర్ర లేనివాడల్లే చూసి ప్రతి స్వల్ప విషయమూ వాడికి మేస్టరు బోధ చేసినట్టు చూస్తూ చెబితే చదువరి ఊరుకోడు ఇప్పటి కథకులు చదివేవాళ్ళకు పనికలిపించటం నేర్చుకోవాలి వాళ్ళకు తెలీని విషయాలుకూడా తెలిసినట్టు మనకు తెలుసునన్నట్టు నటించాలి ఇప్పటి రాజకీయాలూ సాంఘికాలూ మనమీద ఎట్లా పని చేస్తున్నవో కథలలో పనిగాని పనిగా సూచించి వదిలిపెడితే ముందు కాలంలో ఇప్పటి కథలకు చారిత్రాత్మకమైన గౌరవం కొద్దిగా ఉంటుంది

*ఆంధ్రభూమి - మే 1935*

# 5. సంపాదక లేఖ

మీ హిందీ విషయం - నా ఉద్దేశం మీరు సరిగా అర్థం చేసుకోలేదు ఈ విషయంలో మీ వ్యాపాయంటు నేను తీసుకోలేనందుకు చెబుతాను మీరు హిందీని, హిందీ ప్రచారకులనూ మాత్రమే అనుమానంతో చూస్తున్నారు నేను ఇంగ్లీషు, ఇంగ్లీషు ఉపాధ్యాయులనూ గ్రాంధికాన్ని గ్రాంధిక వాదులనూ కూడా అనుమానం లోనే చూస్తున్నాను అయిదోఏట హిందీ అభ్యాసం చెయ్యటానికి మీ కభ్యంతరం ఆరో ఏట ఏబీసీడీలు చెప్పటం నాకభ్యంతరం పన్నెండేళ్ళు వచ్చేదాకా ఇతరభాష కుర్రవాడికి నేర్పకూడదు శాస్త్రప్రకారం ఏ కొద్ది మంది కోసమో మీరు ఆందోళన చేస్తున్నారని అనుకోకుండా ఉండలేకపోతున్నాను మీరింతా చెప్పి ఒక్క విషయం చెప్పరేం? అదేమిటంటే హిందీ చదువుకున్నవాళ్ళు హిందీకథలు తెలుగులో రాయటానికి ఉపయోగించే తెలుగు అది చూస్తే నాకు మండిపోతుంది ఆ మాటకొస్తే ఇంగ్లీషువాళ్లు (చదువుకున్న వాళ్లు) రాసే తెలుగూ ఉందనుకోండి ఇంతకూ - మీ భయాలు నిరాధారాలని నేను రుజువు చెయ్యలేను ''

*ప్రబుద్ధాంధ్ర మాసపత్రిక, జూన్ 1935*

# 6. కథా – కల్పనా

కల్పనతో కూడుకున్నది కథ కథ లేకపోయినట్టయితే సాహిత్యం లేదు చిన్నకథలూ, నవలలూ, నాటకాలూ, నాటికలూ, గేయాలూ, ఆఖరికి పద్యాలూ - వీటన్నిటికీ కల్పనతో కూడుకున్న కథ అత్యవసరం ఒకరికి చిన్నకథలూ, మరొకరికి నాటకాలూ, వేరొకరికి గేయాలూ, ఇంకొకరికి పద్యాలూ రుచిస్తవంటే దానికి కారణం ఆయా వ్యక్తులకు ఈ భిన్న స్వరూపాలకు చెందిన శిల్పంమీద కల అభిరుచి భేదమే కావ్య ప్రయోజనం లోకసంగ్రహమే నని నమ్మే పెద్దలు పై శిల్పానికి అట్టే ప్రాముఖ్యము ఇవ్వరనుకోవాలి

ఎంత లోక సంగ్రహం గురించి మాట్లాడేవారైనా తప్పనిసరిగా గగనమార్గం వదిలి కిందికి వచ్చి నలుగురితో పాటు తమ అభిరుచులను గురించి ప్రకటించుకోవటం తప్పు కాదు మరీ ఇంటిదగ్గిర కూడా కలెక్టరే అయితే మటుకు ఏమంత బాగుంటుంది గనకా?

కాని నాకు పద్యాలంటే అభిమానం గనకనేను కథలను గురించి అసహ్యంగా మాట్లాడటం నా అభిరుచిని ప్రకటించటానికి వింత మార్గం అవుతుంది! ఈ మాట ఎందుకంటున్నానంటే నవ్య సాహిత్యానికి స్తంభంలాటి ఒకానొకరు నాతోనే ''ప్రతిభలో కథలు లేకుండా చెయ్యాలని ఉంది కాని పడటం లేదు!'' అన్నారు పడటం లేదన్నది వారు ఎంతో అణకువతో అన్న ముక్క వారు తలుచుకుంటే కథకు ''ప్రతిభ''లోనే కాదు నవ్యసాహిత్యంలోనే మంచి తీర్థం పుట్టకుండా పోతుంది ఏమీ సందేహం లేదు

నవ్య సాహిత్యాన్ని గురించిన ఆవేదన ఏ ఇతరుడికైనా ఉన్నదానిలో సగంపాలు నాకు కూడా లేకపోలేదు కాని ఈ విషయంలో నేను నా అభిరుచులను ప్రచారం చెయ్యటానికి ఎంత జంకుతానో ఇతరుల అభిరుచులను పాటించటానికి కూడా అంత అశ్రద్ధగా ఉంటాను

ఏ ఒక్కరి అభిరుచిని పురస్కరించుకునీ ఈ సాహిత్యం అభివృద్ధి పొందదని నా విశ్వాసం ఆ విశ్వాసం నానాటికీ బలపడుతున్నది కాని ఇంకొకటి జరగటం లేదు

కాని చదువుకున్న వారిలో కూడా కథలను గురించి నీరసమైన దృష్టి ఉండటం అనేక పర్యాయాలు చూసిన తరవాత నవ్యసాహిత్యానికింకా దేశంలో స్థాయి చిక్కలేదేమో అనిపించింది

ఏమంటే నవ్యసాహిత్యం ప్రొలిటేరియన్ సాహిత్యం ఇది అందరికీనీ ఇందులో నండూరివారి యెంకిపాటలకీ, దీక్షితులుగారి పిల్లలకథలకీ సన్మానం ఒకప్పుడు సాహిత్యాన్ని పండితులే రాశారు దాన్నిమళ్లా పండితులూ పండితులుగా కనిపించ దలిచినవారూమాత్రమే ఆస్వాదించారు ఈనాడు అందరికీ అర్థమయ్యే భాషలో, అందరి హృదయాలకూ మనస్సులకూ నాటేలాగు రాయబడుతున్నది ఈ సాహిత్యాన్ని సృష్టించే అర్హత అందరికీ ఉంది దీన్ని చదివే యోగ్యతా అందరకీ ఉంది ఈ కొత్త ఉద్యమంలో పండితుడు వెనక్కు వెళ్లాడు గుడిపాటివారూ, మునిమాణిక్యంవారూ, చింతా వారూ, శ్రీరంగంవారూ ముందుకు వచ్చారు శ్రీ పాదవారి వంటి పండితులు కూడా తమ పాండిత్యాన్ని పెట్టెలో పెట్టేసి తాళం చెవి విసిరివేశారు

తన కర్తవ్యం లోకసంగ్రహమని గ్రహించింది సాహిత్యం ఈ కొత్తదారి తొక్కిన సాహిత్యానికి అస్పృశ్యులు లేరు ఇది లోక మంటే ఏమిటో లోకసంగ్రహం ఎట్లా ఉంటుందో తెలుసుకున్నకొద్దీ ఇంకా ఇంకా విస్తృత మవుతుంది కాని గోడలూ గొబ్బెలూ ఎక్కి కూర్చుని ''నన్ను తాకకు!'' అనదు తెలుగుభావాన్ని అర్థం చేసుకునే మనస్సులూ తెలుగు ఉద్రేకాన్ని అర్థం చేసుకునే హృదయాలూ ఎన్ని ఉన్నవో అన్నింటినీ తాకి వచ్చేదాకా దీనికి ముక్తి లేదు

ఈ సాహిత్యంలో దేనికి అగ్రతాంబూలమో నిర్ణయించవలిసింది నేను కాదు మరొకరు కారు - ఈ రెండున్నరకోట్ల హృదయాలూ మనస్సులూనూ ఆదృష్టితో చూసినట్టయితే కథకే అగ్రస్థానం ఉందో కవిత్వానికే ఉందో తెలుస్తూనే ఉంది ఈ సాక్ష్యానికి తట్టుకోలేక నవకవులు మళ్లీ మడులు కట్టడం లేదు కద!

రచనలలో తారతమ్యం ఉండదా? నవ్యసాహిత్యానికి మటుకు కట్టుబాట్లు అవసరం లేదా? కావాలి సాహిత్యం ఏ ఉద్దేశంలో బయలుదేరుతున్నదో ఆ ఉద్దేశాన్ని సగంలో మరిచిపోవటంలో అర్థం లేదు జీవిత ప్రవర్తనను కట్టుబాటు చేసుకోకుండా సార్థకజీవి కాలేడు ఆ కట్టుబాట్లు తెచ్చిపెట్టుకున్నవాడల్లా సార్థకజీవ అవుతాడని కాదు - సార్థకజీవి కాదగినవాడికి ఆ కట్టుబాట్లు తప్పనిసరి అందుచేత లోకసంగ్రహానికి పూనుకున్న సాహిత్యం కట్టుబాట్లు లేకుండా కాలు కదపలేదు అవి ఎంత అవసరమైన కట్టుబాట్లంటే, వాటిని మానవుడు నిర్ణయించలేకపోయిన పక్షాన కాలమైనా నిర్ణయించుతుంది

అందులో ముఖ్యమైన కట్టుబాటు శిల్ప, కళాకారణాలవల్ల కలిగేది భగవంతుణ్ణి ధ్యానించాలనే యావ కలవాడు ఏకాంతంగా కూర్చుని స్మరించుకుంటే తరించకపోడు వాడే నలుగురిలోకీ వచ్చిందరిని వెంట వేసుకుని భగవంతుణ్ణి గానం చెయ్యదలిచినట్టయితే వాడు గానశాస్త్రాన్నీ కళనీ గుర్తించకుండా ఎట్లా ఉండగలడూ? వాళ్లంతా పాడే దానికి రాగమూ, తాళమూ, శ్రుతీ ఉండితీరాలి ఆ మీదట అందులో నిర్వచించరాని దైవ కళకూడా ఉండాలి

అది లేకపోతే వాళ్ళ భక్తి శ్రోతల కది అంటువ్యాధి కాకపోయినట్టయితే వాళ్ళు చేసేదంతా వట్టి డంబాచారం అవుతుంది

రచన అయినా అంతే ఒక భావం నన్ను దహించినంత మాత్రంచేతనే నేను కవిని కాను భావాన్ని ప్రకటించే నేర్పూ, కవిత్వకళా నాలో ఉండాలి నా మనసులో ఉన్న భావాన్ని నేను సంపూర్ణంగా, నేను ఏవిధంగా అనుభవించానో ఆ విధంగా పాఠకులు అనుభవించేటట్టు ప్రకటించగలిగినట్టయితే నాకు ఆ కళాదృష్టీ, శిల్పజ్ఞానమూ ఉన్న వనుకోవాలి ఏ అలంకారికులోనిర్ణయించిన కట్టుబాట్లు నేను పాటించానా, లేదా అనే సమస్యే రాదు విమర్శకుడు కూడా కళాదృష్టీ శిల్పజ్ఞానమూ కలవాడయితే ఏ శ్లోకాలూ ఏకరువుపెట్టకుండానే ఒక రచనలో ఈ సంబంధమైన లోపాలను అర్థంచేసుకోగలడు రచన యొక్క ఆదర్శం శిల్పాన్నీ కళనీ పరిపూర్ణం చెయ్యటమని భ్రమపడడు

పోతే రచనలో మిగిలేది వస్తువు లేక కథా, దానికి సంబంధించిన కల్పనా

కల్పనకు సంబంధించిన కట్టుబాట్లు కూడా చాలా ఉన్నై వాటిని ఈనాటి రచయితలు ఎక్కువగా పాటించకపోవటం చాలా శోచనీయమైన విషయం

కల్పనను గురించి ఈ రెండు విషయాలూచాలామంది స్పష్టంగా తెలుసుకున్నట్టు కనిపించదు కల్పనలో కూడా నిజమూ అబద్ధమూ ఉంటుంది కల్పనలో అనుచితమైన కల్పనా, అనవసరమైన కల్పనా ఉంటుంది హరిజన దంపతులను గురించి రాస్తూ వాళ్ళ ప్రణయాన్ని ఉత్తమసంస్కారయుతంగా చిత్రించితే అది అసత్యపు కల్పన ఏ కృష్ణుడి బాల్యాన్నో వర్ణించుతూ మంత్రసాని పిల్లవాడికి ఆముదం ఎట్లా తాగించిందో, పిల్లవాడి శరీరానికి ఆముదం ఎట్లా పట్టించిందో వర్ణించటం అనవసరమైన కల్పన అనుచితమైన కల్పనకు ఉదాహరణలు సులభంగా ఊహించుకోవచ్చును

తమకు ఏమేమి అనుభవాలు జరిగితే బాగుంటుందని తోస్తుందో ఆ అనుభవాలను గురించి కలలు కని ఆ కలలను కథారూపంగా లోకంమీద పారేసేవాళ్ళూ, తమ శిల్పాన్ని ప్రకటించుకోవటానికని ఎవరికీ అంటని సంఘటనలు కల్పించి కథలు రాసేవాళ్లూ, లేని సంఘదోషాలను సంస్కరించేవాళ్లూ కల్పనకు అవసరమై కట్టుబాట్లను పాటించని తరగతికి చెందుతారు వీరి సంఖ్య ప్రస్తుతం చాలాజాస్తిగా ఉందనే చెప్పాలి కాని కొద్దికాలంలో ఈ విషయం లోకం గుర్తించుతుందని నమ్మవచ్చును ఈనాడు ఏ ఆశయాలు కూడా లేకుండా ఎవరికీ ఉపకరించని కథలు కూడా ప్రకటించే పత్రికలు లేకపోలేదు పత్రికలు కొనేవారికి సాహిత్యాన్ని గురించి ఏ మాత్రమూ అనుభవం లేకపోవటమేకారణం వీరు మొదటి సారి అచ్చు తమకు అర్థమయ్యే కథలు చదువుతున్నారు వారికి అప్పుడే పూర్వానుభవం ఎక్కడినించివస్తుంది?

కాని బాగా చదువుకున్న వాళ్లు కూడా - ఆమాటకు వస్తే బాగా చదువుకున్న వాళ్లే - " ఈ కథలు చదవటానికైతే బాగానే ఉంటై కానివ్వండి, ఈ కథల పుస్తకాలు ఒకసారి చదివి అవతల పారవెయ్యటానికి తప్ప ఎందుకూ పనికిరావు వాటిల్లో మనకు నేర్చుకునే దేమీ కనిపించదు!" అనటం ఇంత సులభంగా తోసివెయ్యవలసిన విషయం కాదు

మనము నేర్చుకోదగిన ఉత్కృష్టభావాలన్నీ కవిత్వం ద్వారానే నేర్చుకోవాలనీ సామాన్యపుకథలు ఊరికే చదివి అవతల పారవేసేటందుకే పనికి వస్తవనీ - ఈ విశ్వాసం మనవాళ్లకు పూర్వసాహిత్యం చేసిన గాయం తాలూకు మచ్చ

అసంతృప్తి లేకుండా అభివృద్ధి లేదు మానవప్రకృతిలో ఒక విధమైన జడత్వం ఉంది దానివల్ల మనం ఎటువంటి పరిస్థితులకు కూడా అలవాటుపడిపోయి తృప్తి అనేది తెచ్చి పెట్టుకుంటాం ఆ తృప్తి మనకు స్వస్వరూపజ్ఞానం లేకుండా చేస్తుంది రెండు విధాలుగా ఈ తృప్తిని మనం దగ్గిర చేరకుండా చెయ్యవచ్చును ఒకటి - ఆదర్శాలను తదేకంగా మననం చేస్తూ ఉండటం, రెండు - స్వస్వరూపజ్ఞానం సంపాదించటం ఇందులో మొదటి మార్గం విఫలమయింది ఇక సాహిత్యానికి రెండవది మిగిలి ఉన్నది

ఈ స్వస్వరూపజ్ఞానం మనకు దానంతట అది కలగదు ఉగ్గుపాలతో రక్తంలో జీర్ణించిన అనాగరికతనూ కుసంస్కారాన్ని చూసి మనంతట మనం మన జీవితాన్ని మార్చుకోవటం చాలా కష్టసాధ్యమైన పని అట్లా చెయ్యగలవాడు ఎక్కడో ఒకడు ఉండినప్పటికీ వాడుమాత్రము బాగుపడగలడు కాని ఇతరులకు వాటివల్ల ప్రయోజనం తక్కువ అట్లా కాకుండా ఇది ఉమ్మడి కార్యం కింద భావించి జీవితాన్ని ఎవరికి చాతనయిన విధంగా వారు, ఎవరికి చాతనయినంతవరకు వారు విమర్శించి అటువంటి విమర్శనంతా సాహిత్య రూపంగా పోగువేస్తే అది అందరి ఉపయోగార్థమూ వినియోగిస్తుంది

ఇక్కడ శుష్క విమర్శకంటె కల్పన ఎక్కువగా పని చేస్తూ ఉంటుంది మనం పొద్దున్నే లేచి ఎన్నివందల అనాగరిక కార్యాలు చేస్తామో జాబితా వెయ్యవచ్చును నలుగురు ప్రయత్నించి కొద్దికాలంలోనే ఆజాబితా పూర్తి కూడా చెయ్యవచ్చును కాని అది అందరిమనస్సులకూ నాటుకునేటట్లు చెయ్యటం వేరేకథ

కల్పనవల్ల సజీవ పాత్రలను సృష్టించి వారిచేత మనం రోజూ చేసే పనులే చేయించి వాటిలో ఉన్న అనాగరికత పాఠకులకు ఎక్కించవచ్చును ఒక నటుడి నటనను ఊరికే విమర్శించటంలోనూ, అదంతా సినిమా తీసి వాడికే చూపించడంలోనూ తేడా లేదా? వట్టి విమర్శవల్ల విమర్శకుడిది పై చెయ్యి, విమర్శించబడేవాడిది కింది చెయ్యీ అవుతుంది సరి అయిన కల్పన వల్ల ఎవరిని వారు విమర్శించుకునేటట్లు చెయ్యవచ్చును నేను ఊహించగలిగినంత వరకు కల్పన వల్ల సాధించదగినది ఇంతకంటే లేదు

కళనూ శిల్పాన్నీ ఆధారంగా పెట్టుకుని కల్పన ద్వారా లోకసంగ్రహం చెయ్యటమే సాహిత్యం యొక్క ఆశయమనుకున్నట్టయితే, నాటకమూ, తప్పితే నవలా, చిన్న కథ- వీటివల్ల జరిగే ఉపకారం లోకానికి పద్యాల వల్లా, గేయాలవల్లా ఎట్లా జరుగుతుందో నేను ఊహించలేకుండా ఉన్నాను

నేను పద్యకావ్యాలను అణిచివెయ్యాలని ప్రయత్నించటం లేదు అవి మానవజీవితానికి పరిపూర్ణత్వం కలిగించుతై అనేక కారణాలవల్ల మనహృదయాలు జీవితంలో సంకుచితత్వం పొందుతై దరిద్రుడు దయకు దూరుడౌతాడు - నీతిపరులమని చెప్పుకోనివాళ్లం కూడా అట్లాగే ఉన్నాం కవిత్వం - పద్యకవిత్వం - ఈ జీవితలోపాలను సరిచెయ్యగలదు

ఇంత రాసిన తరవాత కూడా నేను కథను అనవసరంగా ఎక్కువచేసి పద్యాలను తెలియక తక్కువ చేసి ఉండవచ్చు ననుకోవటానికి సిద్ధంగా ఉన్నాను కాని కథలను తోసివెయ్యటమూ, నీరసదృష్టితో చూడటమూ ఎవరికీ భావ్యం కాదంటాను దేనికన్న ఏది ఎక్కువ అయినప్పటికీ ఒక దాని ఉనికి రెండవదాని ఉనికిని నిరాకరించదు - నిరాదరించటం ఎందుకూ?

*ముద్రణ ప్రబుద్ధాంధ్ర, మాసపత్రిక, 30-3-1938*

# 7. సారస్వత సేవకుడు

తన బావమరిది ఒక కథ రాసి సుప్రసిద్ధ మాసపత్రికలో ప్రకటించేవరకూ గణపతి రచయితలను తనకు విజాతీయులుగా చేసేవాడు వాళ్ళు ఏవిధంగానో తనకు భిన్నంగా ఉంటారని అతి దృఢవిశ్వాసం ఏ రచయితతోనూ పరిచయం లేకపోవటం చేత గణపతి రచయితలను ఒక విధంగా ఊహించుకోవలసి వచ్చింది - వాళ్ళ చేతుల్లో కలాలుంటవనీ, వాళ్ల ముందు కాగితాలుంటవనీ, వాళ్ళ కళ్ళలో ఆలోచనలుంటవని ఏ కవి నన్నా పలకరించి, ''ఏవండీ?'' అంటే, అతను తనవంక ''ఎవడురా నువ్వు'' అన్నట్టు చూస్తాడని అతని కొక సంశయం ఉండేది

కాని తన బావమరిదే ఒక రచయితగా పరిణమించే టప్పటికి, గణపతి పూర్వ విశ్వాలన్నీ తారుమారయినై వెధవ! నాగాయికూడా ఒక రాతగాడా?

చిరకాలంనించీ వస్తున్న అభిప్రాయాలను మార్చుకోవటం ఎవరికైనా కష్టమేకదా తన బావమరిది కథను ఆ పత్రికవాళ్లు పొరపాటున వేసుకున్నారేమో ననుకున్నాడు గణపతి మొదట్లో ఆ కథ చదివిన మీదట ఆ అభిప్రాయం తాత్కాలికంగా వెనుక పడింది తను వెనక చదివిన కథల్లో వచ్చే పాత్రలు నిజంగా ఎక్కడో ఉన్నట్లూ వాళ్ళు నిజంగా అట్లా ప్రవర్తించినట్లూ అట్లా సంభాషించినట్లూ నమ్మబుద్ధి అయ్యేది కాని ఈ కథ అట్లా లేదు ఎవరో శ్రీనివాసరావుట! సీతను ప్రేమించాడుట! అవన్నీ వట్టివే! వెధవ కల్పన - అట్లా ఎక్కడా జరగదు అసలు శ్రీనివాసరావు లేడూ! సీతా లేదు! ఉంటే తనకు తెలియదా ఏమిటి?

ఈ ఆలోచన వెంట మరొక ఆలోచనకూడా వచ్చింది - ఏం? మనం మటుకు కథలెందుకు రాయకూడదూ? వెధవ, నాగాయే రాసినప్పుడూ!

ఇప్పుడాలోచించితే రచన తనకు విజాయితీయంగా ఉన్నట్టు కనిపించలేదు ఎందుచేతనంటే నాగాయికి వచ్చినంత తెలుగు - కావలిస్తే ఇంకా అంతకంటే ఎక్కువ తెలుగు! - తనకూ వచ్చు నాగాయి తన మాదిరిగా స్కూలు ఫైనలుతో ఆగలేదనుకో! అయితే ఏం? కాలేజీలో వాడు నేర్చి ఏడిచిన తెలుగేముందీ? ( ఇంకా తాను స్కూలులో తెలుగు విద్యార్థి నాగాయి ఇంకా సైన్సు వెధవ! కథలు రాయటం కాలేజీలో చెప్పరుకదా?

తనకు ఇంతకాలం నుంచీ తెలియదుగాని కథలు రాయటం తనకూ చాతనయే ఉండాలి!

ఆ సాయంకాలమే ఒక కానీ ఊదారంగు సీరాబిళ్ళలూ, ఒక కలమూ, ఒక దస్తా కాగితాలూ తెచ్చి ఆ రాత్రి కథ రాయటానికి కూర్చున్నాడు

ముందు కథకు పేరు ఒకటి ఉండాలని అందరికీ తెలిసిన విషయమే ఆ పేరు కుదిరితే కాని కథకుదరదు కథ పేరేమిటో నిర్ణయించుకోకపోతే కథ యేమిటో ఎట్లా తెలుస్తుంది?

తను కూడా ప్రేమవిషయికమైన కథే రాతామనుకొన్నాడు గణపతి అసలంతకంటె కథ రాయటానికి విషయం ఏముంటుంది? నాయకీ, నాయకుడూ? వాళ్ళున్న తరువాత ప్రేమించుకోక పోట్లాడుకుంటేే ఏం బాగుంటుందీ? కథలు రాసేవాళ్లంతా ప్రేమకథలే రాస్తారు నాగాయి చూడరాదూ? కాశీమజిలీలు చూడరాదూ? ''ప్రేమబంధం'' అంటే బాగానే వుంటుంది కాని నాగాయి ఆ పేరు అదివరకే కొట్టేశాడు, వెధవ! తనకు కథ రాయాలనే ఆలోచన నెల క్రితమే వచ్చి ఉంటేనా?

''ప్రేమ- ?'' ప్రేమతో కలిసే చక్కని మాట ఉండదూ? ''ప్రేమ మహిమ'' అంటే బాగుండదూ?

కాగితం పై భాగంలో ''శ్రీరామానీవే కలవు'' అని రాసి, దానికింద ''ప్రేమ మహిమ'' అని రాసి, దానికింద చిన్న శేషశాయివంటి అలంకారం ఒకటి పెట్టాడు గణపతి ఆ తరువాత తను రాయబూనిన కథ యొక్క ''ప్లాటును'' గురించి ఆలోచించసాగాడు

కథలకు ''ప్లాటు'' కుదురటమే కష్టమనీ, అది దొరకకనే చాలామంది సుప్రసిద్ధ కథకులు చాలా బాధపడతారనీ గణపతి విని ఉన్నాడు కాని తీరా ఆలోచిస్తే కథకు ప్లాటు కుదరటం ఏమీ కష్టం కాదని తేలిపోతుంది ఎందుచేతనంటే తన బుర్రలో ఒక చక్కని ప్లాటు అదివరకే సిద్ధంగా ఉంది - వివరాలతో సహా!

అమితమైన ఉత్సాహంతో గణపతి కథారచన ప్రారంభించాడు కాలం ఎట్లా వెళ్ళుచున్నదో అతనికి తెలియలేదు గడియారం పన్నెండు కొట్టింది గణపతి రెండవ అరటావు సహానికి వచ్చాడు గడియారం అతన్ని ఒక నిద్రలో నించి లేపినట్టయింది అతని తల యావత్తూ సెగలు వెళ్లుతున్నట్టున్నది కలం గట్టిగా పట్టుకోవటం వల్ల వేళ్ళు నొచ్చుతున్నై వాటికి సిరా కూడా అంటింది గణపతి తృప్తితో ఒక్క నిట్టూర్పు విడిచాడు రచనలో ఇంతగా మునిగిపోగల రచయితలు ఎంతమంది యున్నారు? తన నాయికా నాయకుల ప్రణయానికి తన హృదయం కరిగిపోతున్నది వాళ్లు అనే మాటలు తన చెవులలో ప్రతిధ్వనించుతున్నై - ముఖ్యంగా నాయిక ''నాథా, నన్ను నమ్మవా?'' అన్న ముక్క ఇంకొక నిట్టూర్పు విడిచి గణపతి రాసినదంతా ఒక్కసారి తిరిగి చూసుకున్నాడు అతని గుండె ఆగిపోయినట్టయింది ఏదో పొరపాటు జరిగింది, చూడటానికే సరిగా లేదు వెంటనే తట్టింది జరిగిన పొరపాటేమిటో - తన రచనలో పేరాలు లేవు అవును మరి రచనలో పేరాలు లేకుండా ఎట్లా? నాలుగైదు వాక్యాలకు ఒక పేరా చెయ్యకపోతే చూడటానికి ఎంత అందవికారంగా ఉంటుందీ? ఇంకా నయం - తనకు వెంటనే తట్టింది కనక సరిపోయింది లేకపోతే ఆ పత్రిక వాళ్లు పేరాలు లేకుండా తన కథ ప్రకటిస్తే నాగాయి ఎంత ఎగతాళి చేసేవాడు!

ఇప్పుడు మళ్లీ కథ యావత్తూ తిరగరాయటం అసంభవం నాలుగైదు చోట్ల పేరాల కోసం గుర్తులు పెడదామని కథ రాసినంత వరకు మళ్ళా చదవటానికి సంకల్పించుకున్నాడు

అప్పుడు తెలుసుకున్నాడు గణపతి - తను కూడా నాయకుడికి శ్రీనివాసరావని, నాయికకు సీత అనీ నామకరణం చేశాడు! కూడనిపని! కొంచెం సేపు ఆలోచించిన మీదట గణపతికి

తట్టింది పాత్రలకు పేర్లు పెట్టటం కూడా యాతన పనేనని ఎందుకంటే, ఎంతసేపు ఆలోచించినా శ్రీనివాసరావు వంటి మంచి మగపేరు, సీతవంటి మంచి ఆడపేరు, కనిపించవు గణపతికి, అదేం ప్రారబ్ధమో!

విశ్వప్రయత్నం చెయ్యగా సీతారామారావూ కమలా అనే పేర్లు దొరికినై గణపతికి ఆ కమల అన్న పేరు చాలా ముద్దుగా ఉంది నిజంగా (కొత్తగా కథలు రాసే వాళ్లు తప్పక ''కమల'' అనే పేరు వాడితీరాలి! ఆటే చూస్తున్నాను )

పాత పేర్లు కొట్టేసి కొత్త పేర్లు ఇరికించి రాత్రి మూడు గంటలు కొట్టేటప్పటికి గణపతి ఎట్లా గయితే ఏం కథ పూర్తి చేశాడు

అతనికి కలిగిన తృప్తి వర్ణనాతీతం అతనికింకా నిద్ర రావటం లేదు తను పూర్తి చేసిన కథలోని సంఘటనలు అతని బుర్రలో ఇంకా పరిభ్రమిస్తున్నై ఆ పాత్రలు అతని హృదయం చుట్టూ మూగి దాన్ని మథించుతున్నై తను రాసిన కథ నిజంగా జరిగి ఉండినా అతనికి అంత ఆవేదన కలిగి ఉండేది కాదు

ఇంతకూ ఆ కథ ఎవర్కైనా చదివి వినిపించాలి తన అన్న రాసిన కథకు భార్య మురిసిపోవటం చూసినప్పటినించీ గణపతికి అమిత అసూయగా ఉండింది గణపతి భార్యను లేపి ''ఒసేవ్! నేను కూడా కథ రాశానే!'' అన్నాడు అతని భార్య నిద్ర మత్తున ''సరేలెండి!'' అని మళ్ళా నిద్రపోయింది

గణపతికి మండిపోయింది తన అన్న కథ రాస్తే అంత మురిపెమా, తను రాస్తే ''సరేనా?'' గణపతి భార్యను లేచేదాకా లేపి బలవంతాన మంచంమీద కూర్చోపెట్టి కథ చదవసాగాడు ఆవిడ నిద్రాభంగమయినందుకు విసుక్కుంటూ, తెరపుడు పడని కళ్ళతో భర్తవంక చూసి, ''ఇంతలో ఏం మునిగిపోయిందండీ? రేపు మధ్యాన్నం చదవకూడదూ?'' అంది రేపు మధ్యాన్నం! తెల్లవారి లేచి కూడా కాదు!

గణపతి తన కథ చదువుకుపోయినాడు కాస్సేపు గణపతి భార్య మంచం మీద జోగుతూ కూర్చొని ఆఖరుకు ''ఇది మా అన్నయ్య రాసిన కథేగా!'' అని బోర్ల పడుకుని మళ్ళీ నిద్రపోయింది

అప్పటిదాకా గణపతికి స్ఫురించలేదు - తను ఇంతా కష్టపడి తిరగరాసింది నాగాయి రాసిన కథే!

రచయిత కావాలని ఒకసారి కలిగిన సంకల్పం గణపతి హృదయంలో అట్లాగే ఉండిపోయింది అప్పుడు వెలిగించబడిన ఆశాదీపం ఈమాత్రపు గాలికి ఆరిపోలేదు కథకుడు కావాలని గణపతి చాలా ప్రయత్నాలు చేశాడు కొన్ని కథలు రాసి అనేక పత్రికలకు పంపాడు కాని వాటి సంగతి ఏమయిందో తెలియదు నాగాయి పత్రికలకు పంపాడు కాని వాటి సంగతి ఏమయిందో తెలియదు నాగాయి కథ వేసుకోవటానికి పాల్పడ్డ పత్రికకు కూడా తన కథ అవసరం లేకపోయింది! అదే చిత్రం!

ఇంతలో వాళ్ల వూళ్లో ఒక సారస్వత సమాజం వెలిసింది అందులో చాలా చదువుకున్న వాళ్లు-సభ్యులుగా చేరారు వాళ్లందరూ తనకు ఆప్తుల వల్లే కనిపించారు గొప్ప రచయిత అవుదామని ప్రయత్నిస్తున్న గణపతి ప్రాణానికి! రచన తాలూకు సుళువులూ మెళుకువలూ

తెలుస్తువని, గణపతి వారందరితోనూ పరిచయం కలిగించుకుని, వారి కాఫీ సిగరెట్టు ఖర్చులు సయితం తనే చాలా వరకు భరించటం నేర్చుకున్నాడు అతను కూడా రాయాలని ప్రయత్నిస్తున్నట్టూ, అతని రచనలను ఎవరూ ఆదరించనట్టూ తెలిసిన మీదట, సమాజం అధ్యక్షుడు అతన్ని కూడా సమాజంలో చేర్చుకుని, అతనికి రచన విషయమై అమితమైన ప్రోత్సాహం ఇచ్చాడు

"కొంత పాండిత్యమూ, భాషా పరిచయమూ ఉంటే రచన జోరుగా సాగుతుంది!" అన్నాడు అధ్యక్షుడు కాలం గడిచింది గణపతి దీక్షతో తెలుగూ, సంస్కృతమూ, హిందీ, బెంగాలీ మొదలయిన భాషలలో కృషిచేశాడు అప్పటికీ అతనికి మాతృ భాషలో - వాడుక భాషలో - వ్యాసం కుదరకపోవటం చూసి, అధ్యక్షుడు, "అన్నగారికి కల్పన తక్కువ హిందీ బెంగాలీ భాషల్లో చక్కని గ్రంధరాజాలున్నవి అన్నగారు వాటిని తర్జుమా చెయ్యరాదూ?" అని సలహా ఇచ్చాడు

ఆ సలహా మీద గణపతి ఒక బెంగాలీ నవలా, ఒక హిందీ నాటకమూ, నాలుగైదు పాశ్చాత్య కధలూ (హిందీలోకి అదివరకే తర్జుమా అయినవి), తెలుగులో కొన్ని భావగీతాలు, రచించి అచ్చు వేయించగలిగాడు ఇవన్నీ అధ్యక్షులవారిచేత సంస్కరించబడినవి (గిట్టనివాళ్ళు, గణపతి రాసిన పద్యాలలో, గణపతి రాసిన పదాలు లేవని కూడా అంటారు )

ఈ గ్రంధాలన్నీ గణపతి స్వంత డబ్బుతో సమాజ ప్రచురణాల కింద అచ్చు వేసినవి అవి సమాజ సభ్యులలో కొంతమందికి అంకితం ఇవ్వబడి మిగిలిన వారు రాసిన పరిచయాలతో కూడుకున్నవి సమాజ సభ్యుల ఇతర రచనలు కొన్ని గణపతికి అంకితం అయినై

సమాజం వల్ల గణపతికి ఇంకా చాలా పేరు వచ్చింది అతని పేరు దేశమంతటా ప్రచారం అయింది గణపతి ఏమి రాశాడో, ఎందుకు రాశాడో తెలియని వారికి కూడా అతను పెద్ద సారస్వత సేవకుడని తెలుసు అతని పేరు తెలియని రచయిత దేశంలో ఎవడన్నా ఉన్నాడనుకోను కొత్తగా రచన చెయ్యాలని సంకల్పించుకున్న యువకులు గణపతి ఆశీర్వాదం తీసుకుంటారు ఏ సాహిత్య సమ్మేళనమూ అతను రాకపోతే చిన్నబోతుంది

"గణపతిగారు వస్తున్నారా?" అని అందరూ ఆదుర్దాగా అడుగుతారు కారణాంతరాల వల్ల గణపతిగారు రావటం పడలేదు!

"గణపతిగారు రాలేదట!"

"అయ్యో, ఏమండీ?"

"గణపతిగారు రాలేదుట!"

"నిజంగానా?"

"విన్నారా? గణపతిగారికి రావటానికి పడలేదట!"

కవులంతా దిగులుగా ఈ విషయం చెప్పుకుంటారు కవి సమ్మేళనం కళాహీనమైపోతుంది!

*మహతి మాసపత్రిక, 15-4-1938*

*(కొ కు సాహిత్య సంపుటాల్లో (విశాలాంధ్ర) ఇది ప్రచురితం కాలేదు కొ కు దీన్ని వ్యంగ్య కధగా రాశారు దీనిలో కధ గురించి ఆయన అభిప్రాయాలున్నాయి కనుక ఇక్కడ పొందుపర్చాం)*

# 8. నవలా – చిన్నకథా

ఈనాటి నవలకూ, చిన్న కథకూ పూర్వ స్వరూపాలు ఇతిహాసము, ఉపాఖ్యానమూను అప్పట్లో వీటికి రెండు ఆశయాలుండేవి

1 చరిత్రను సజీవంగా ఉంచటం

2 జీవితం గురించి objective గా రచించటం

Subjective, objective అనే దృష్టిపథాలను గురించి కొంత తెల్సుకోవాలి జంతువుల జీవితాలు subjective గా అంటే వాటి భావాలు కష్టసుఖాలతో లగ్నమై ఉంటై నిర్లిప్తత ఏర్పడితే తప్ప జీవితాన్ని గురించి శాస్త్రీయంగా ఆలోచించి సంస్కారం పొందే శక్తి రాదు సంస్కారం పెరిగిన కొద్దీ ఈ నిర్లిప్తత కూడా హెచ్చవుతుంది నిర్లిప్తత అంటేనిర్లక్ష్యం అనుకోరాదు నిర్లిప్తత వెంట నిర్లక్ష్యం కూడా వుంటే వేదాంతం పుట్టుకొస్తుంది మనకు కావలసింది వేదాంతం కాదు సంస్కారం

ఉదాహరణకు పామును తీసుకోండి పాము మనకు భయం ప్రేరేపిస్తుంది ఈ భయం మనల్ని ఆవేశించినంతకాలమూ మనకు తెచ్చిపెట్టే సమస్యల్ని పరిష్కరించలేం పాముకాటుకు విరుగుడు కనిపెట్టాలంటే పాము యెడల వుండే భయాన్ని దాటి పాముని పట్టుకుని విషం పిండి దాని విరుగుళ్లు అన్వేషించే శక్తి రావాలి జీవితం తాలూకు సమస్యలకు పరిష్కారమార్గాలన్వేషించే వారందరూ సమస్యలను మించి పెరిగిన సంస్కారం కలవారేగాని సమస్యలతో బాధపడుతూ దానిలో లగ్నమైవుండేవారాపని చెయ్యలేరు

జీవితంలో లగ్నమైన సంస్కారం లేనిజీవులు కష్ట సుఖాలు మటుకే గుర్తిస్తారు కాని ఆబ్జెక్టివ్‌గా చూసే సంస్కారి ఆనందం పరమావధిగా పట్టుకుంటాడు నిర్లిప్తత ద్వారా ఆనందమనేది కష్టసుఖాలు రెంటినుంచీ ఉత్పన్నమవుతుంది జాతీయవీరుడు జైలుకి పోయో, దెబ్బలు తినో, ప్రాణాలర్పిస్తూనో ఆనందం పొందగలుగుతాడు సుఖంలో నుంచి మటుకే ఆనందం పుడుతుందనుకోరాదు కళల ద్వారా ఉత్పన్నమయే సంస్కారానికి ఈ ఆనందమే పరమావధి

మనిషి బుద్ధిని జీవితం నుంచి విడదీసి నిర్లిప్తత చేకూర్చే టందుకు మానవుడు చేసిన తొలి సాంస్కారిక ప్రయత్నాల ఫలితంగా భగవంతుడూ, విధీ వచ్చాయి మనిషికి కలిగే కష్ట సుఖాలన్నిటికీ ఒక బాహ్యకారణం ఉందనే విశ్వాసం ఏర్పడగానే మానవుడి దృష్టి కష్టసుఖాలను దాటి పై కారణం కేసి మళ్ళింది పిల్లవాడు ఏ పీటో తగిలి ఏడుస్తూంటే మనం వాడా మనస్సును బాధ నుంచి మరల్చటానికి పీటను కోప్పడతాం కొడతాం దాంతో పిల్లవాడేడుపు మాని పీటను గురించి ఆలోచిస్తాడు

భగవంతుడూ, విధీ మనసులో ఉంచుకుని అవే బాహ్యకారణాలుగా నిరూపించిరాసిన కథల్లో భగవంతుడు గాని, అతని అవతారంగాని ప్రధానపాత్ర ధరించింది ఈ ప్రయత్నంలోచరిత్రగా ఉండవలసిన ఇతిహాసాలు వక్రస్వరూపం పొందినాయి కాని అప్పట్లో అదే సంస్కారసాధనంగా ఉండింది

కాని రానురాను భగవంతుడు, విధి అనేవి - సత్య కారణాలు కాని కారణం చేత - సంస్కారాన్ని విశేషం ముందుకు పట్టుకు వెళ్ళలేకపోయినాయి అంతా విధేననే నెపం మీద ఏ దుర్మార్గమైనా సహించవలసిన స్థితి ఏర్పడింది ఈ స్థితిలో సంస్కారానికి మరో ఆధారం దొరికింది అది నీతి మనిషి యొక్క కోరికలు చైతన్యానికి దారి తీస్తూ ఉండడం చేత - వాటి ద్వారా మానవబుద్ధి జీవతంలో లగ్నమైపోతూ ఉండడంచేత కోరికలను ఆబ్జెక్టివ్‌గా, నిర్లిప్తంగా చూసుకోగలందులకు నైతికదృష్టి కథా సాహిత్యం ద్వారా ప్రచారం చెయ్యటం జరిగింది దీనికి ఫలితంగా పంచతంత్రం కథలే గాక, ఈసప్ కథలు మొదలైనవి అనేకం పుట్టుకొచ్చినై

ఈ పరిణామంలో ఆఖరుదశ ఇటీవలనే దాదాపు మన కళ్ళ ఎదటనే కలిగింది సంఘాన్ని గురించీ, ఆర్థికాలను గురించీ, మానవ మనస్తత్వం గురించీ జరిగిన శాస్త్రీయమైన పరిశోధనల మూలంగా సాంఘిక జీవితంలోనూ, వ్యక్తి జీవితం లోనూ కలిగే ప్రతి మార్పునీ మనం అర్థం చేసుకుని ఆ మార్పును నిర్ణయించే శక్తి మానవుడికి అందుబాటయింది అందుచేత కథా సాహిత్యం శాస్త్రజ్ఞానాన్ని నిర్లిప్తతా సాధనంగా పెట్టుకుని యదార్థ జీవితాన్ని ప్రతిబింబించటానికి పూనుకుంది ఇది ఆఖరు పరిణామం ఈ విధానమే పోనుపోను మరింత సమగ్రం కావచ్చు ఉత్తమ కథలు రావచ్చుగాని, ఇక మరోమార్పు వచ్చి సాహిత్యం నిర్లిప్తత కోసం కొత్త మార్గాలు తొక్కే అవకాశం లేదు

ఈనాడు మనకు నీతికథలు అనర్థంగా కనిపిస్తాయి ఉదాహరణకు చూడండి పరశురాముడనేవాణ్ణి అతిని తండ్రి ''నీ తల్లిని వధించు'' అని శాసించాడు పరశురాముడు ముందు వెనకలాలోచించకుండా తల్లి మెడ నరికేశాడు తండ్రి మాట తక్షణం పాలించిన పరశురాముడి కథలో ఒకనీతి మనం చూస్తాం చిరకారి అని మరొకడున్నాడు అతణ్ణి కూడా తండ్రి తల్లిని చంపమని ఆజ్ఞాపించి అరణ్యానికి పోతాడు కాని చిరకారి పరశురాముడల్లే తల్లిని చంపక తండ్రి కోపంలో అన్నమాట పాటించడానికి సందేహిస్తాడు ఇంతలో తండ్రి తన కోపం చల్లారి తిరిగివచ్చికొడుకు నిదానానికి సంతోషిస్తాడు ఈ రెండూనీతికథలే ''నీతికథల ఉద్దేశం నిజంగా ప్రవర్తన ఉపదేశించటమే అయితే ఈ రెంటిలో ఏదో ఒకటి తప్పయి వుండాలి కాని వాటి వుద్దేశం అదికాదు ప్రవర్తనను గురించి నిర్లిప్తంగా - మరోదృష్టి నుంచి- ఆలోచించేటందుకు ప్రేరేపించటమే ఈనాడు పాఠ్యపుస్తకాలలో పెట్టే నీతికథలు చూస్తే అందులో కొన్ని హాస్యాస్పదంగా ఉంటాయి దానికి కారణం మన ఈనాటి సంస్కారం శాస్త్ర విజ్ఞానంతో కూడుకున్నది కావటమే

కథారచనలో విషయమూ, విధానమూ అని రెండున్నాయి వెనకటి వారికి విషయం గురించి బాధ ఉండేది కాదు ఉపనిషత్తుల్లో భావాలూ, పురాణాల్లో గాథలు తీసుకుని అవేమళ్ళా మళ్ళా రాస్తూ శిల్పాన్ని పదును పెట్టుకుంటూ, ఒకరిని మించి ఒకరు రాయాలని ప్రయత్నిస్తూ వచ్చారు దీనివల్ల శిల్పం మెరుగు తేలిందిగాని దానికి ప్రాధాన్యత కూడా ఏర్పడింది క్రమంగా సాహిత్యం జీవితానికి ఎడంగా కూడా పోయింది విషయ దారిద్ర్యం వల్ల

కాని ఇప్పుడు అభ్యుదయ సాహిత్యంలో యదార్థ జీవితాన్ని ప్రతిఫలించాం కనక, మనకు తాత్కాలికంగా విషయ ప్రాధాన్యత ఏర్పడింది విషయం గురించి చర్చలేకుండా పోయిన తరువాత కళా సృష్టిలో విధానానికి తగిన ప్రాముఖ్యం ఏర్పడక తప్పదు యదార్థ జీవితాన్ని

గురించి రాయటమే పరమాదర్శంకాదు దాన్ని గురించి నిర్లిప్తమైన సంస్కారికమైన దృష్టి ప్రజాసామాన్యంలో వ్యాప్తం కావాలి అది ఈనాడు లేదు 'పాపం' అనేదాన్ని తీసుకోండి 'పాపం' సాంఘిక వ్యవస్థ నంటిపెట్టుకుని వుంది వ్యక్తులు పాపాన్ని ఎంత పోగొట్టుకోవడానికి చూసినా, పాపులను మనం ఎంతకాలం శిక్షించినా సాంఘిక వ్యవస్థనంటిపెట్టుకున్న పాపం నుంచి పాపులు పుట్టుతునే వుంటారు పాములను చంపటం అవసరం కావచ్చుగాక కాని పాము విషానికి విరుగుడు కనిపెట్టటం సంస్కారదృష్టిలో ఇంకా ముఖ్యమైనది జీవితాన్నిగురించిన నిర్లిప్తమైన సంస్కారిక దృష్టిపెరిగిన కొద్దీ, జన సామాన్యం జీవిత సమస్యలతో సరిగా పోరాడగల్గుతుంది

ఇకశిల్ప విషయం ఒకే పుస్తకాన్ని పది మంది చదివి పది మందీ ఒకే రకమైన ఆనందం పొందరు అందుచేత అందరు వ్యక్తులకూ ఆనందం ఇచ్చే శిల్పాన్ని నిర్ణయించటం సాధ్యం కాదు కాని ఒక వర్గానికి మట్టుకే ఇంపుగా వుండే శిల్పాన్ని నిర్ణయించటం ఇంతకంటే తేలికైన పని అచ్చుగా జమీందార్లకే రుచించేటట్టు శిల్పం నిర్ణయించవచ్చు

శిల్పమనేది సహజంగా మన అందరిలోనూ వుంది ఏడిచే పిల్లవాణ్ణి నవ్వించవచ్చు మభ్యపెట్టి అయితే సాహిత్య కళకి చెందిన శిల్పం యొక్క ఆశయం ప్రజలను మభ్య పెట్టటం కాదు వారి దృష్టి జీవిత కష్ట సుఖాల దగ్గర్నుంచి మరల్చి వాటి వెనక వుండే కారణాల మీదికి మరల్చటం ఆ కారణాలను ఎట్లా సంస్కరించుకునేదీ ప్రజలే నిర్ణయించుకుంటారు శిల్పం అసమర్థంగా ఉంటే బుద్ధి విషయం మీద నుంచి విముఖం అవుతుంది అందుచేత శిల్పం యొక్క ఆశయం విముఖుల్ను కూడా విస్మయోన్ముఖులు చెయ్యటం

శిల్పికి మానవ మనస్తత్వం తెలిసి ఉండటం అవసరం నటుడయినా, కథకుడయినా, ఏకళాకారుడైనా మానవ మనస్తత్వ అవగాహన చేసుకోకుండా ప్రేక్షకుల నాకర్షించలేడు మనకు ప్రత్యక్షానుభవం లేని జీవిత ఘట్టాలలో కూడా మన బుద్ధిని లగ్నం చెయ్యాలంటే కళా కారుడు మనస్తత్వాన్ని ఎంత బాగా గ్రహించగలవాడై ఉండాలో ఊహించవచ్చు

మరో ముఖ్య విషయమేమంటే రచయిత తన అనుభవాన్ని దాటిపోరాదు తనకు సమగ్రంగా తెలిసిన జీవితభాగం అవగాహన చేసుకుని అందులోని సత్యాన్ని ప్రకటించనంతసేపూ రచయిత మధ్య తరగతి వాడయినా, జమీందారయినా కూడా అభ్యుదయ సాహిత్యం రాయగలడు ప్రజాజీవితానికి ఎంతో ఎడంగావున్న రచయిత కూడా ప్రజలకు సన్నిహితుడు కావటానికి సరయిన మార్గం ఇదే

రచయితకూ అతను రాసే జీవితానికీ ఉండదగిన సంబంధం ఏమిటంటే ఆ జీవితం కంటే ఆ రచయిత సన్నిహితంగా ఉండికూడా కొద్దిగా పైగా వుండి దాన్ని సమగ్రంగా అవగాహన చేసుకోగలవాడై ఉంటేనే ఉత్తమ సాహిత్యం పుడుతుంది కొందరు కథకులు అత్యాశకు పోయి తమకు ఒక మెట్టు పైన ఉన్న జీవితాన్ని చిత్రించబోతారు కొందరు రచయితలు నెలకో మూడొందలు సంపాదించే పాత్రను సృష్టించి కూడా సరిగా నిర్వహించలేకపోతారు తనను ఆకర్షించే జీవితాన్ని మట్టుకే రాసే రచయిత విఫలుడై తీరుతాడు తనకు కొంచె కిందుగా వున్న జీవితం గురించి రాసినప్పుడే రచయిత సంపూర్ణ సంస్కారం

ప్రకటించగలడు ఆ మాట అని మరీ కిందుగా వున్న జీవితాన్ని తీసుకున్నట్టయితే రచయిత యొక్క నిర్లిప్తత నిర్లక్ష్యంగా మారి వేదాంతం చెప్పే అవకాశం వుంది

కథా శిల్పంలో సూత్రప్రాయంగా గమనించవలసిన అంశమేమంటే కథంతా చెప్పాలి కథ తప్పమరేమీ చెప్పకూడదు కథలో ఏకత్వం (organic unity), పరిపూర్ణత్వమూ ఉండాలి

కథా శిల్పానికి సంబంధించిన ఇతర సూత్రాలేమంటే పరితల రసగ్రహణ శక్తిలో కొంత విశ్వాసం ఉంచాలి ప్రతి స్వల్ప విషయాన్ని అంతులేకుండా వ్యాఖ్యానం చేసి కథ చెప్పటమంటే బుట్టలో ఏకులు కుక్కటం లాగా చెయ్యకూడదు చదివేవాడు ఒక్కముక్కలో తెలుసుకునే విషయాన్ని పది వాక్యాలలో వ్రాస్తే చదివేవాడి ఆసక్తి ఎటో పోతుంది వెనుకటి కథలు శిల్పం లోపించిన కారణంచేత పూర్వకథలు దీర్ఘంగా వుండేవి సమయనిరూపణకు మూడు పేరాల వర్ణనా, స్థల నిరూనణకు మరో మూడు పేరాలూ, పాత్రను ప్రవేశపట్టటానికి మరోకొంత స్థలమూ వినియోగపరిచేవారు ఈ నాటి కథలు చాలా సంగ్రహంగా వుంటాయి కథనానికి అవసరంలేని వివరాలుండవు

కార్డు కతలు చూసినట్టయితే పాత్రలను పరిచయం చేసి ఒక సంఘటన చెప్పి ఆ సంఘటనకు ఒక మొన ఏర్పరచటం అతి కొద్ది లోగా అయిపోతుంది కార్డు కథలు శిల్పంలో మంచి శిక్షణ ఇస్తాయి కాని వాటిద్వారా ఉత్తమ సాహిత్యం రావటం అనుమానాస్పదం కార్డు కథలు బాగా రాయటం సులభంకాదు

కథ సంఘటనను అరిటిపండు ఒలిచినట్టు ఒలిచి పెట్టలా, లేక చదివేవాడి ఆలోచనకేసి వదలాలా అంటే నా అభిప్రాయం ఆలోచనరేపి వదలాలనే సరిఅయిన సాహిత్యం చదివే వారి భావాలను ఒక మార్గంగా నడపాలి గాని ఒక గమ్య స్థానం చేర్చి వదలరాదు అట్లా ఒక సందేశం ఇచ్చివదలినట్లయితే సాహిత్యం పరమార్థమైపోయి, అది మరో చైతన్యానికి దారి తీయదు కథలో ఉండే సంఘటన అసమగ్రంగా ఉండాలని కాదు కాని దానిమీద కథకుడు తీర్పు చెప్పరాదు కథ చదివినాక చదివిన వాడి తలలో భావాలు నలుముఖాలు పోయినా కూడా శిల్పంలో లోపం వున్నట్టే

ఒకే సంఘటనను చిత్రించేది చిన్నకథ, ఒక జీవిత భాగాన్ని చిత్రించేది నవల, కథకు వాతావరణం పాత్రల మనస్తత్వం, నవలకు వాతావరణం సంఘం లాటరీలో ఒక లక్షరూపాయలు రావటం లాటి మారుమూల సంఘటనలను కూడా సరి అయిన మనస్తత్వ వాతావరణంతో చిత్రించవచ్చు కాని నవలలో యదార్థ జీవిత వాతావరణం ఒదిలేసి మారుమూల సంఘటనల పరంపర చిత్రించటం సాధ్యంకాదు నవల పాత్ర జీవితం ద్వారా కొంత వరకు సంఘ జీవితం కూడా చిత్రించక తప్పదు నవలలో పాత్రలు పరిణామం చెందుతాయి చిన్నకథల తాలూకు సంఘటనలు పాత్రల పరిణామానికి ఎంత ప్రబలమైన అవకాశం ఇచ్చినా ఆ పరిణామాన్నిచిత్రించటం చిన్న కథ ఆశయం కాదు

రచన అనేది తదేక దీక్షతో చేసినప్పుడే ఉత్తమ సాహిత్యం వెలువడుతుంది రచయిత పొట్ట పోసుకునేందుకు ఇతర వ్యాపారాలలో నిమగ్నుడై ఉంటే ఉత్తమ సాహిత్య సృష్టి కాదు ఈనాటి సంఘంలో రచనద్వారా పొట్టపోసుకునే అపూర్వ అవకాశం దొరికిన వానికి ప్రజా

జీవితం ఎడమవుతూ వుంది ప్రజా జీవితంతో సన్నిహితంగా వుండి రచన ద్వారా పొట్టపోసుకునే అవకాశాలు గలవారికి మంచి సాహిత్యం సృష్టించే అవకాశం కూడా వుంటుంది కథా రచనలు చెయ్యదలచిన వారు విరివిగా కథా సాహిత్యం చదవాలి మొదట్లో అన్ని కథలూ బాగున్నట్టే కనిపించినా, రాను రాను వాటి మంచి చెడ్డలూ, గుణలోపాలూ కనిపిస్తాయి శిల్పం కూడా పరిచయం వల్ల లభ్యమవుతుంది

*ముద్రణ అభ్యుదయ, మాసపత్రిక, అక్టోబరు, 1946*

# 9. కథా సాహిత్యం – పత్రికలూ

కథ అనేది ఏ భాషలోనైనా అతి ప్రాచీన మైనదే ప్రపంచంలో మానవ సమాజం ఏర్పడుతూనే కథ అనేది పుట్టివుండాలి కథ మానవ సమాజానికి పునాదిగా కూడా పని చేసి వుండాలి చరిత్రా, వ్యక్తుల భిన్న భిన్నానుభావాలు కథల రూపంలో సమాజానికి సంక్రమించాయి ఆచార వ్యవహారాలు, విజ్ఞానము, నీతి మొదలైనవి కథల ద్వారానే ప్రచారం అయివుండాలి సాంఘిక పరిణామంలో ఎన్నెన్ని సాహిత్య స్వరూపాలు వెలువడినా వాటికి కథే ఆధారంగా ఉంటూ వచ్చింది కాని ఈ ఇతర సాహిత్య రూపాలు వెలువడినా వాటికి కథే ఆధారంగా ఉంటూ వచ్చింది కాని ఈ ఇతర సాహిత్య రూపాలు కథను వెనక్కి తోసేశాయి

మొదట ప్రపంచ యుద్ధం అయే వరకూ ఆధునిక తెలుగు సాహిత్యంలో కథకు ఎటువంటి స్థానమూలేదనే చెప్పాలి అన్ని సాహిత్య రూపాలలోనూ కృషి చేసిన వీరేశలింగం గారు కథ జోలికి రాలేదు అప్పట్లో పద్యానికీ, నవలకీ, నాటకానికీ వ్యాసానికీ ఉన్న ఘనత కథకి లేకపోయింది దానికి కారణం లేకపోలేదు సాంఘిక ప్రయోజనం సాధించటానికి చిన్న కథ ప్రశస్తమైన పరికరంకాదు అందులో సంఘాన్ని విపులంగా చిత్రించే అవకాశంలేదు శిల్ప చాతుర్యం చూపటానికి మటుకే అవకాశం ఉంది

1919 నుంచి ఈ శిల్ప చాతుర్యానికి కూడా స్థానం లభించసాగింది సాహిత్యంలో, ఈ నూతన పరిణామం ఫలితంగా ఖండ కావ్యమూ, చిన్నకథా ప్రాముఖ్యానికి వచ్చాయి అచ్చుగా కథలు రాసిన వారు కూడా సాహితీ పరులనిపించుకోసాగారు మొదటి ప్రపంచ యుద్ధానికి పూర్వం ఇది సాధ్యం కాలేదు

తెలుగు సాహిత్యంలోకి అడుగుపెడుతూనే చిన్నకథ ప్రజాదరణ సంపాదించుకుని ఇతర సాహిత్య స్వరూపాలను వెనక్కు తోయసాగింది చిన్న కథా, ఖండ కావ్యమూ బయలుదేరి దిగ్విజయం చేసి వచ్చాయి ఇందువల్ల తెలుగు సాహిత్యానికి కొంత అపచారం జరిగిందనేది నిర్వివాదాంశం ఈ దిగ్విజయం వల్ల ప్రజలకి ఘనమైన సాహిత్యం మీద విముఖత్వం కలిగింది యదార్థమైన సాహిత్యం ప్రయోజనం వెనక బడి రచయితల విశిష్టతకూ, ప్రత్యేకత్వాలకూ, శిల్పానికీ ప్రాధాన్యం ఏర్పడింది నవలా, నాటకమూ వెనకపడి చిన్న కథా, కండకావ్యమూ ఏకాంకికా మొదలైన వాటికి ప్రచారం హెచ్చింది నిజానికి ఇవి బలమైన సాహిత్యం కావు

అయితే ఒకటి అనుకోవచ్చు సాహిత్యం ఏ కొద్ది మంది ఆదరణో పొందుతూ అసంఖ్యాకులైన ప్రజలకు అది అందుబాటులో లేని సమయంలో ఈ చిన్న కథా,

ఖండకావ్యమూ వచ్చి వారిలో సాహిత్య పిపాస రేకెత్తించాయని అనుకోవచ్చు ఈ స్వరూపాలు పైకి వచ్చి ఉదాత్తమైన సాహిత్యం మీద అభిమానం గలవారిని పాడు చేయలేదనుకోవచ్చు ఈ వాదన కొంత మటుకే నిజం ఎందుకంటే చిన్న కథకు ప్రాముఖ్యం లేని కాలంలో నాటకమూ, నవలా ముందుకు వచ్చాయి వీరేశలింగా గారు పాతిన చెట్టు ఫలించి అనేక నవలలూ, నాటకాలు వెలువడాయి చిన్నకథ బయలుదేరిన తరువాత కూడా వీటి ప్రచారం కొంతకాలం బాగానే ఉండింది అయితే ఇంత లోపల పత్రికలు వచ్చాయి చిన్న కథా, ఖండ కావ్యమూ ఆరంభించిన పనిని ఈ పత్రికలు పూర్తి చేశాయి పత్రికల విజృంభణలో ఈ స్వరూపాలకు ఎంత ప్రచారమైనా సాగింది (పత్రికలు లేని చోట చిన్న కథకు యింత ప్రాముఖ్యం వచ్చే అవకాశమే లేదనుకోవచ్చు)

పత్రికలు పుస్తకాలకంటే చౌక ప్రకటనలు ఆధారంతో అవి చౌకబారు అభిరుచులను సంతృప్తి పరుస్తూ, అసంఖ్యాక ప్రజలకు చౌకబారు సాహిత్యాన్ని అందిస్తాయి అనేకమంది రచయితల, వివిధ రూపాల రచనలు వాటిలో ప్రకటితమవుతాయి జరుగుతున్న విషయాలమీద వ్యాఖ్యానాలుంటాయి బరువైన సాహిత్యం జోలికి పోని లక్షలాది ప్రజలు పత్రికలకెగబడతారు సుదీర్ఘమైన నవలలూ, నాటకాలూ వీటిలో వెలువడే అవకాశం తక్కువ విడిగా అచ్చు వేసినట్లయితే నవలలూ, నాటకాలూ, ఈ పత్రికలంత చౌకగా అమ్మవు నికరమైన, నిశ్చలమైన సాహిత్యాభిలాష కలవారు కొందరు పుస్తకాలు కొన్నప్పటికీ పత్రికలు చదివే వారి సంఖ్యతో పోలిస్తే వారి సంఖ్య అల్పం

పత్రికలు వచ్చి అధిక సంఖ్యాకులలో చౌకబారు సాహిత్యం మీద అభిలాషకలిగించిన మాట నిజమే అయినా, బలమైన సాహిత్యం మీద అభిలాషగలవారి సంఖ్య వీటివల్ల పెరగలేదని నిశ్చయం అటువంటి సాహిత్య ప్రియుల సంఖ్య తగ్గిందేమో అనిపిస్తుంది కూడానూ జరిగిన ముప్ఫయ్యేళ్ళ కాలంలోనూ ఒక లక్ష చిన్న కథలు పత్రికల ద్వారా వెలువడ్డాయనుకోవటానికి అవకాశంలేదు వైపెచ్చు ఈ ముప్ఫయ్యేళ్ళలోనూ నవలా, నాటకమూ క్రమంగా క్షీణించాయి

ఇది తెలుగు సాహిత్యానికి తీరని నష్టం అందువల్ల మనం పత్రికలను అణచటం గాని, కథా సాహిత్యాన్ని వెలివెయ్యటం గాని సాధ్యం కాని పని ఈ నష్టం మరొకవిధంగా మనం పూడ్చుకోవాలి దీనికోసం ఇదివరలో జరిగిన ప్రయత్నాలు విఫలమయినాయనే చెప్పాలి సాహితి, శారద, సఖి, భారతి,జయంతి, ఉదయిని, తెలుగుతల్లి, అభ్యుదయ, ప్రతిభమొదలైన సాహిత్య పత్రికలకు ఆంధ్రలోకం చూపిన ఆదరం చూస్తే దేశంలో సాహితీ ప్రియులంటూ ఎవరైనా ఉన్నారా అనే సందేశం ఎవరికైనా కలుగుతుంది

చౌకబారు పత్రికల్లో మంచి సాహిత్యంగా పరిగణించదగిన కథలూ ఖండకావ్యాలూ కూడా వెలువడుతున్నాయి, తుక్కు రచనలతో బాటు ఈ పరిస్థితి ఏ యితర భాషా సాహిత్యంలోనూ ఉన్నట్టు కనబడదు తెలుగులో నాలుగైదు ఉత్తమ సాహితీ పత్రికలు వెలువడి, ఆర్థికంగా వాటికి మంచి పునాది ఏర్పడి సాహిత్య ప్రియులు కాగోరిన వారు విచక్షణా జ్ఞానంతో వాటిని పోషించటానికి పూనుకున్నాడు నీళ్ళకి నీళ్ళూ, పాలకు పాలూ విడిపోతాయి

సాహిత్య సంస్థలు నడిపే పత్రికలు కూడా కళాకాంతులు లేకుండా నాశనమై పోవడానికి కారణాలు ఆలోచించ దగినవి ఈ పత్రికలకు ఆర్థిక సహాయం లేదు ఇందులో రాసేవారికి

పారితోషికాలు లేవు మనకున్న ఉత్తమ రచయితలు వీటిలోనే వ్రాస్తారనే నమ్మకం లేదు వీటికి ప్రకటనల మద్దతులేదు వీటికి ప్రత్యేకించి అందమైన స్వరూపం లేదు ఇదంతా ఒక ఉద్యమంగా సాగాలి సాహిత్య ప్రియులైన రచయితలూ, పాఠకులూ కలిసిగాని, వేరువేరుగా గాని, ఈ ఉద్యమానికి స్వరూపం ఇవ్వాలి

కథా స్వరూపం పత్రికల దోపిడీకి అనుకూలంగా ఉన్నదన్నమాటే గాని, కథ కూడా కొద్దిలో ఉత్తమ సాహిత్య ధర్మం నెరవేర్చ కలదనటానికి ప్రబలమైన సాక్ష్యం ఉంది ఆ సాహిత్యం చౌకపత్రికలలోబడి వాటితో పాటే నశించిపోకుండా చూడాలి

పత్రికల కన్నా కూడా అధిక ప్రచారం జరగవలసినది పుస్తకాలకు ఉత్తమ తరగతి కథలతో పాటు నవలలూ, నాటకాలూ వెలువడేందుకు మార్గం ఏర్పడ్డనాడు మన సాహిత్యానికి చౌకబారు సాహిత్యం నుంచీ, పత్రికలనుంచీ విముక్తి ఏర్పడుతుంది

*ముద్రణ అభ్యుదయ మాసపత్రిక, సంపుటి-2,*
*సంచిక-9, 10, నవంబరు 1948*
*పునర్ముద్రణ సాహిత్య ప్రయోజనం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,*
*విజయవాడ, అక్టోబరు 1968*

# 10. చిన్న కథ : : ఆధునిక సాహిత్య స్వరూపం

మానవ సమాజం పుడుతూనే కథ అనేది పుట్టి ఉండాలి ఆది మానవులు ఎక్కువ విశ్రాంతి విరామాలు కలవారు కాదు వారి కాలమంతా ఆత్మ రక్షణతోనూ, ఆత్మ పోషణ తోనూ గడచిపోయేది ఆ సమాజంలో ఉత్పత్తి సాధనాలు చాలా కొద్దిగా ఉండటం వల్ల వాళ్ళు తమ కనీసావసరాలు గడుపుకొనేటందుకైనా తీరని కృషి చేయవలసి ఉండేది ఇంత అవిరామ కృషిలోనూ వారు సాహిత్యం సృష్టించలేదనుకోనవసరం లేదు కాని ఆ సాహిత్యం వారు చేసే నిత్య సామాజిక కర్మకు సంబంధించి ఉండేది అంతే కాదు అది వారి సాంఘిక కార్యాచరణకు అవసరమై కూడా ఉండేదేమో

కానీ ఆ సమాజంలో కథలకున్న స్థానం వేరు గేయాలూ, పాటలూ ఆనాటి సామాజిక శక్తులను సామాజిక కర్మ సాగించే నిమిత్తమూ ఆవాహన చేసేవి కథలు విశ్రాంతి సమయంలో పైకి వచ్చేయి వాటి ద్వారా ఆ సామాజిక వ్యక్తులు తమ జ్ఞానాన్ని పెంపొందించుకునే వారు వాళ్ళ కథలు నిజానికి సాహిత్యం కావు వాటి పరమార్థం రసనిష్పత్తి కలిగించటం కానే కాదు వయో వృద్ధులూ, అపూర్వానుభవం గడించిన వారూ, దేశాటన చేసి కొత్త విషయాలు తెలుసుకున్న వారూ కథలు చెప్పేవారు మిగిలినవాళ్ళు వినేవారు ఇతిహాసాల ద్వారా చరిత్రా, సాంఘిక విజ్ఞానమూ ఒక తరం నుంచి మరొక తరానికి సంక్రమిస్తూ ఉండేవి ఈ విధంగా నాగరికతతో బాటు అంతులేని కథా వాఙ్మయం పెరుగుతూ వచ్చింది పురాణాల నిండా అనేక కథలు చేరాయి అయితే ఈ నాటి చిన్న కథకూ ఈ కథలకూ ఏమీ సంబంధం లేదు

నాటి కథలు చరిత్రను ప్రచారం చేశాయి అందులో సంఘనీతి కూడా కాకతాళీయంగానే ఉండేది ఆనాడు కథ అనేది ప్రత్యేక సాహిత్య రూపం కాదు అప్పటి సాహిత్యంలో కథ

అంతర్భూతమై ఉండేది అయినా సాహిత్య స్వరూపాలు కొత్తవి ఉత్పత్తి అయి అభివృద్ధి చెంది సాహిత్య పరిణామం సాగినకొద్దీ కథ అభివృద్ధి చెందడానికి మారుగా కవిత్వమే అభివృద్ధి చెందుతూ వచ్చింది ఈ విషయం తెలుగు సాహిత్యంలో స్పష్టంగా కనిపిస్తుంది

కథచెప్పటంలో నన్నయ్యకూ, తిక్కన్నకూ, పోతనకు కూడా ఉన్నదక్షత ప్రబంధయుగం వారికి లేదు ఆ తరువాత వచ్చి నలసంఖ్యాకులైన ప్రబంధకారులలో కళా పూర్ణోదయం రచించిన పింగళి సూరన్న వంటి వారిని ఒకరిద్దర్ని తీసేస్తే మిగిలిన వారికి కథనం చాతే కాదని చెప్ప వచ్చు అయినా వారు కవిత్వం చెప్పటంలో చిత్ర విచిత్ర ప్రతిభలు ప్రదర్శించారు

ఇటువంటి పరిణామంలో ఆధునిక - చిన్న కథ ఒక ప్రత్యేక సాహిత్య కళా స్వరూపంగా అభివృద్ధిచెందటం ఒక విచిత్రమైన సన్నివేశం దానికెన్ని సాంఘిక శక్తులు ఎంతగా తోడ్పడ్డాయో తెలుసుకుంటేనే గాని సాహిత్యంలో చిన్న కథకు గల స్థానాన్ని సరిగా అంచనా కట్టలేం

చిన్న కథను గురించి మనం తెలుసుకోవలసిన మొట్టమొదటి అంశమేమంటే ఇది ఏయితర ఆధునికసాహిత్య రూపం కన్నకూడా ప్రజాజీవితానికి అతి సన్నిహితంగా వచ్చింది సంఘంలో ఉండే ప్రతి వ్యక్తికీ కథానాయకుడయే అర్హత ఉన్నది ఒక విధంగా చూస్తే రాజులకూ మహారాజులకంటే ప్లీడరు గుమస్తాలకూ, బడిపంతుళ్ళకూ, విద్యార్థులకూ, పాలేళ్ళకూ, బిచ్చగాళ్ళకూ చిన్న కథలో ఎక్కువ ఆదరణ ఉంది సంఘంలోని వ్యక్తుల నిత్యజీవితంలో ఏ భాగాన్నయినా చిన్న కథ చిత్రించగలదు చిన్న కథ పుట్టుక పూర్వం సంఘంలో ఇంత స్వాతంత్ర్యం సంపాదించుకున్న సాహిత్య స్వరూపం లేనేలేదంటే అతిశయోక్తి కాదు ''గళ్ళచీరె'', ''నల్ల బిందె - దుక్క చెంబు'', ''చల్లపులుసు'' మొదలైన కథల పేర్లు ఈ విషయాన్ని రుజువు చేస్తాయి అట్లాగే ''భగ్నవీణ'', ''అగ్ని వీణ'', ''రాలినపూలు'', ''రుధిరజ్యోతి'' మొదలైన పేర్లు వింటే ఇవి ఈనాటి కథల పేర్లు కాజాలవని తోస్తుంది

పాత్రల విషయంలోనూ, పేర్ల విషయంలోనూ, సన్నివేశాలలోనూ కూడా చిన్నకథ ప్రజాజీవితానికి అతి దగ్గరగా వచ్చింది శర్మ కాఫీ త్రాగటం ఒక కథ చిన్న పాటి ఉద్యోగం చేసుకునే వాడు తన భార్యను సినిమాకి తీసుకుపోవటం ఒక కథ

ఇట్లాగే భాష విషయంలో కూడా చిన్న కథ ప్రజలకు చాలా దగ్గరగా రాగలిగింది గిడుగువారి వ్యవహారిక భాషా వాదాన్ని తొలి భావకులంతా ఆమోదించినప్పటికీ అమలులోకి తెచ్చిన వారు కథకులు ఈ నాడు చిన్న కతను గ్రాంధిక భాషలో రాయటం వల్ల కథా సాహిత్యానికి జరిగే సేవ సంశయాస్పదం కథకుడు స్వేచ్ఛగా తన భాషలో కథ చెప్పడంతో కూడా తృప్తి పడక తాను తీసుకునే పాత్రల భాషలోనే కథ యావత్తూ నడిపించటం ఆరంభించాడు గోఖలే వంటి ఒకరిద్దరు కథకులీవిధంగా రసవత్తరమైన కథలు వ్రాశారు

ఇటువంటి సాహిత్య స్వరూపం సాధ్యం చేసిన సాంఘిక శక్తులేవి? మొదటి ప్రపంచ సంగ్రామానంతరం ప్రజాస్వామిక శక్తులు ఇండియా వంటి పరాధీన దేశాలు కూడా తల యెత్తి విజృంభించాయి ఒక వంక రాజకీయ రంగాలలో ఇవి సహాయ నిరాకరణోద్యమానికి, దారి తీస్తే మరొక వంక సాహిత్య రంగంలో ఖండ కావ్యాలలోని భావకవిత్వానికీ చిన్నకథలకూ దారి తీశాయి ఈ సాంఘిక విజృంభణకు వెన్నెముక వ్యక్తి వాదము, వ్యక్తి స్వాతంత్ర్యమునూ భావకవి తన స్వంత ఆవేశాలను అతి పవిత్రంగా భావించి, వాటికి ఉదాత్తమైన స్వరూపం ఇచ్చి

వాటిని ప్రకటించుకోవటంతో బాటు తన స్వాతంత్ర్యాన్నికూడా ప్రకటించుకున్నాడు ఇతడు సంఘాన్నీ, సంఘ నియమాలనూ ధిక్కరించి అందరి మెప్పు సంపాదించాడంటే దానికి కారణం,అప్పుడు ఇంకా అమలులో ఉన్న సంఘ నియమాలు శిధిల మవుతున్నవి అవతల ప్రజాస్వామిక శక్తులు చరిత్ర పరిణామాన్ని ఆసరా చేసుకొని ఆ నియమాల మీద ధ్వజం ఎత్తే ఉన్నది భావకవి ఏ వ్యక్తి వాదాన్ని ప్రకటిస్తూ ఉన్నాడో ఆ వ్యక్తి వాదమే సంఘంలో ఉన్న ప్రతి వ్యక్తినీ చైతన్య వంతుణ్ణి చేస్తూ ఉండడం వల్ల సాంఘిక శక్తిగా రాణించగలిగింది

అయితే ఈ వ్యక్తి వాదంలో కథకుడు భావకవిని మించి చాలా ముందుకు పోగలిగాడు కారణమేమంటే కథకుడు భావకవికన్నా కూడా ప్రజాజీవితానికి సన్నిహితంగా వెళ్లగలిగాడు ఎంత వ్యక్తి వాది అయినా భావకవి కొంత విశిష్టతను తనలో ఉంచుకున్నాడు సంఘానికి ఎడంగా ఉండగోరాడు కాని కథకుడు సంఘంలో కలిసిపోయినాడు సాధారణ వ్యక్తులందరికీ ప్రతినిధిగా నిలబడి వారి జీవితాన్ని వివిధ ఆశయాలతో వివిధ రీతుల చిత్రించ సాగాడు

చిన్న కథలు వ్రాసేవాడు తన వ్యక్తిత్వాన్ని తాను చిత్రించే పాత్రల ద్వారానూ, భావాల ద్వారానూ, సన్నివేశాల ద్వారానూ మాత్రమే కాక తన శిల్పంలో కూడా చిత్రించ సాగాడు చిన్నకథ యొక్క శిల్పంలో కూడా చిత్రించ సాగాడు చిన్న కథ యొక్క శిల్పానికి అవధులు లేవు ప్రతి ఒక్క కథకుడూ తన ప్రత్యేకతను శిల్పంలోనే చూపవచ్చు చలం, మునిమాణిక్యం, చింతాదీక్షితులు, మొదలైన కథకుల రచనలు ఒకరివి మరొకరివని పొరపాటు పడడానికి అవకాశంలేదు

చిన్న కథలు సాగించిన ప్రయోజనాలలో కూడా వైవిధ్యం ఎంత ఉన్నదో దానికి తగ్గట్టే వ్యక్తిత్వంకూడా ఉన్నది ముని మాణిక్యం గారి కథలు అచ్చుగా గృహ జీవితాన్ని చిత్రించి అందులో పరితులకు ఆసక్తి కలిగించాయి చలం గారి రచనలు పాత కాలపు సాంఘిక నీతినీ, ఆచారాలనూ తూర్పారబట్టాయి దీక్షితులు గారు చిన్న పిల్లల కథలనూ, ''కరుణకుమార'' గ్రామీణ జీవితాన్ని, గోఖలే క్షుద్రజీవులనూచిత్రించి తమ తమ ప్రత్యేకతలను చాటుకున్నారు శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రి మొదలైన అనేక కథకులు చిన్నకథను అనేక రకాలుగా ఉపయోగించుకున్నారు

చిన్నకథ యొక్క వ్యాప్తికి ఆధునిక యంత్ర పరికరాలు కూడా ఎంతో ఉపయోగించాయి తాటాకుల మీద గంటాలుచే పుస్తకాలు రచించే రోజులలో ఈనాటి చిన్నకథ ఒక ప్రత్యేక సాహిత్య స్వరూపంగా వేరు పడి అభివృద్ధి కావటం అసంభావ్యం పత్రికలూ, సామాన్య ప్రజలతో వాటికి హెచ్చిన ఆదరణా అధునిక అచ్చు యంత్రాలూ చిన్న కథ యొక్క వ్యాప్తికీ, ప్రజలలో వాటి ప్రచారానికీ అంతులేని సేవ చేశాయి కేవలమూ పత్రికలనూ, చిన్న కథలనూ ఆశ్రయించుకుని సాహిత్య రంగంలో ప్రవేశించిన వారే ఈ నాటి కథకులలో నూటికి తొంభై తొమ్మిది మంది పద్యాలు రాసినవాడే సాహితీ పరుడనే నిర్బంధం ఉంటే ఈనాటి ప్రసిద్ధ కథకులలో దాదాపు ఒక్కడైనా సాహిత్య రచన చేసి ఉండక పోవచ్చు

అదే విధంగా ఈనాడు కథలు చదివి ఆనందించే లక్షలాది ప్రజలలో చిన్నకథల ద్వారా మాత్రమే సాహిత్యాభిలాష రేకెత్తిన వారే అత్యధిక సంఖ్యాకులు

ఈ విధంగా ప్రజాజీవితానికి అది సన్నిహితంగా పుట్టి రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలో చిన్న కథ దిగ్విజయ యాత్ర సాగించింది

*తెలుగు స్వతంత్ర వారపత్రిక 24-3-1950*
*పునర్ముద్రణ - సాహిత్య ప్రయోజనం,*
*విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1969, అక్టోబరు*

# 11. ఉత్తమ కథ

కుటుంబరావు ఏమండీ పద్మరాజు గారూ, మీరు కొత్త కథానిక ఏదైనా రాస్తున్నారా?

పద్మరాజు లేదండి, ఈ మధ్య కథానికల మీదకి మనస్సంతగా పోవడం లేదు

కు ఎందుచేత ?

ప ఒహ కారణం, రాసిన కథలకి తగినంత ప్రచారం రాకపోవడమూ, రెండోది రాస్తున్నకొద్దీ దానిమీద మోజు తగ్గడమూనూ

కు కథల మీద మోజు తగ్గటం అన్నారే నా అనుభవంలో కూడా కథ రాయాలంటే ముందుండినంత ఉత్సాహం ఇప్పుడు ఉండటం లేదు దీనికి కారణం కథానిక యువకుల సొమ్మేమోనని నా కనిపిస్తున్నది మీరేమంటారో

ప కేవలం వయస్సే కారణం అని అనను గాని మీరు చెప్పినది ఒప్పుకుంటాను నేనొకప్పుడు పద్యాలూ, పాటలూ రాసేవాణ్ణి, ఇప్పుడసలు వాటి మీదకు మనస్సే పోదు ఈ మనస్సులో వచ్చే మార్పు - అంటే మనిషి అభిరుచుల్లోను భావావేశంలోను, దృక్పథంలోనూ వచ్చేమార్పు - ముఖ్య కారణమనుకుంటాను, కొందరు ఎన్నేళ్లు వచ్చినా భావకవిత్వమూ, చిన్నకథలూ రాయగలిగుండవచ్చు

కు ఈ విధంగా వార్ధక్యంలో కూడా చిన్నతనంలోలాగే రాయటానికి ప్రయత్నించే వాళ్ళని ఒకరిద్దరిని చూస్తున్నాను, వారిలో మానసిక పరిణామం పూర్తిగా స్తంభించిపోయినట్లు వారి రచనలను చూస్తేనే తెలుస్తుంది ఇంకొక విషయం కూడా ఉంది నేను పదిహేను పదహారేళ్ల కిందట రాసిన కొన్ని కథలు తిరిగి చూసుకుంటే వట్టి పిందెల్లాగున్నాయి

ప మనం వెనక రాసిన కథల్ని ఇప్పుడు మనం విమర్శించుకోటంలో కొంచెం పొరపాటుందనుకుంటాను, ఏ వుత్సాహమైతే మనచేత ఆ కథలు రాయించిందో ఆ వుత్సాహంతో మనకిప్పుడు అంత ప్రమేయం లేకపోవడం మీరన్నదానికి కారణం కాని ఆ వుత్సాహానికి తప్పకుండా విలువుందని నేనంటాను

కు విలువ లేకేం, వుంటుంది ఆ విలువను పాటించే వాళ్లు ఇప్పటికీ వాటిని చదివి సంతోషిస్తూనే ఉంటారు

ప అదేలెండి కథానిక యువకుల చేతుల్లోనే బాగా నడుస్తుంది, అని ఒప్పుకోవచ్చు వయసుమీరిన కొద్దీ లోకాన్ని గురించిన అనుభవం పెరిగి చెప్పదల్చుకున్న విషయం కథానికలో ఇమడ్చడం కష్టమవుతుందనుకుంటాను

కు   అవును పద్మరాజు గారూ, నేనింకా కథానికలు రాస్తూనే వున్నాను గాని కథ ఆలోచించినప్పుడల్లా ఆ పాత్రల వెనుక వుండే వాతావరణమూ మనస్తత్వమూ నా వూహలో తెగ పెరిగి పెద్ద కథ రాయాలనే ప్రేరణ కలుగుతూంటుంది  ఒక్కొక్కప్పుడు బుద్ధి నాటకం రాయాలన్నంత దాకా పోతుంది

ప   నాటకాల విషయం వచ్చింది కనక చెపుతున్నాను  ఈ మధ్య నేను రాసినవన్నీ నాటికలూ, నాటకాలూను  ఇంకో ధోరణిలోకి మనసు పోవటం లేదు  ఇందుకనే నాటకాంతం సాహిత్యం అని పెద్దలన్నారనుకుంటాను

కు   మీ అనుభవం తెలియదు కాని నేను వొకప్పుడు కథలో శిల్పం తప్ప మరేమీ చూసేవాణ్ణి కాదు  అప్పటి నా ఉద్దేశంలో కథకి శిల్పం తప్ప ఇంకేమీ అవసరం లేదు  ఆ వైఖరి ఇప్పుడు మారిందనుకోండి

ప   ఇప్పుడు మీ అభిప్రాయం, శిల్పం ప్రధానం కాదంటారా?

కు   అది కాదు  ఇప్పుడు కథాశిల్పం గురించి నాకు ఏ విధమైన జంకూ లేదు  ఒకప్పుడు 'నా శిల్పం ఎంత బాగుంటుందో చూడండి' అన్నట్టుగా కథ రాసేవాణ్ణి  ఇప్పుడు కేవలం శిల్ప ప్రదర్శన కోసమే కథ రాయటం వట్టి దండుగగా కనిపిస్తోంది

కాని కథకి శిల్పం ఆయువుపట్టు అని మాత్రం ఆనాడే కాదు ఈనాడు కూడా వొప్పుకుంటాను  కథలో శిల్పం లేకపోయినాక ఇంకెన్నున్నా దండుగే

ప   నా బాధేవిటంటే ఈ విషయం గుర్తించిన కథా రచయితలు చాలా తక్కువ మంది కనిపిస్తున్నారు  ఇప్పుడు వచ్చే పత్రికల్లో కొన్ని వందల కథలు ప్రచురణ అవుతున్నాయి  దాదాపు ఒక్క కథలోకూడా చక్కని శిల్పం కనిపించడం లేదు  చెప్పదలచుకున్న విషయం యెంత నిజమైనా, యెంత వాస్తవికమైనా కథానికలో శిల్పం కనపడకపోతే కథ కుంటుపడుతుంది

కు   మీరు చెప్పినదానికి ఒక ప్రబలమైన కారణం వుందనుకుంటాను  ఈ రోజుల ప్రభావాన్ని బట్టి కథకులు ముఖ్యంగా ఈనాటి యువకులు తమ కథల ద్వారా పరిస్థితులను మార్చాలని చూస్తున్నారే గాని, కథ యొక్క వాస్తవికత శిల్పం మీద యెంత ఆధారపడి వుందో గ్రహించటం లేదు  ఒక ఉదాహరణ చెపుతాను  నేను వట్టి అభూతకల్పనలు కథలుగా రాసే రోజుల్లో అప్పటికే పేరు పడ్డ ఒక కథకుడు నా కథలు చదువుతున్నంత సేపూ అవి నిజమైనట్టే అనిపిస్తుందన్నాడు  ఇది కేవలం శిల్పప్రభావమే అనటానికి నాకేమీ సందేహం లేదు  ఎంత వాస్తవికమైన పాత్రలూ, సంఘటనలూ తీసుకున్నా శిల్పలోపం చేత అవి అవాస్తవికంగా కనపడే అవకాశం లేకపోలేదు

ప   పాత్రలూ సన్నివేశాలూ, వాస్తవికాలైనంత మాత్రాన్ని కథలో వాస్తవికంగా కనిపిస్తాయని ఋజువేం లేదు  మనం సృష్టించేది వాస్తవిక భ్రాంతి గాని వాస్తవం కాదు

కు   అదీ నిజమే  ఇతివృత్తం నుంచి శిల్పాన్ని వేరు చేయటం సాధ్యం కాదని అనుకున్న తర్వాత, శిల్పంతో ప్రమేయం లేకుండా ఇతి వృత్తంలోని ఒక పాత్ర గాని ఒక సన్నివేశం గాని యదార్థం అనుకోవటంలో అర్థమే లేదు  నా ఉద్దేశంలో అనేకమంది రచయితలు శిల్పాన్ని పోగొట్టుకునేది జీవితంలో తాము గమనించిన కొన్ని విషయాలు తీసుకొని వాటికి బలాత్కారంగా తమ ప్రయోజనం జోడించటం వల్లనే అని

ప నాకు ఒక్కొక్కప్పుడనిపిస్తుందీ, అసలు యదార్థం అనేదే మనిషి మనిషికీ మారుతుందేమో అని ఒకే సన్నివేశం వుందనుకోండి, అది ముసలివాళ్లకో రకంగాను, చిన్నపిల్లలకి మరో రకంగాను కనిపిస్తుంది ఒక చిన్నపిల్లవాడు ఒక చావును గురించి కాని, తల్లిదండ్రుల మధ్య తనకి తెలియని కారణాల వల్ల వచ్చే ఘర్షణల్ని గురించి కాని చెప్పడం ప్రారంభించినపుడు చాలా చిత్రమైన భావన కలుగుతుంది అలాగే కథాశిల్పంలో ఏ దృష్ట్యా సన్నివేశాల్నీ, పాత్రల్నీ చిత్రించాలో నిర్ణయించుకోడం చాలా ప్రధానమని నాకు తోస్తుంది

కు అందుకేం సందేహం లేదు అక్కడే రచయితయొక్క ఆశయం వ్యక్తమయేది కూడాను మీరన్నట్టు జీవితంలోని ప్రతీ సంఘటనా చూసే వారిని బట్టి వేరువేరు అంతరార్థంతో కనిపిస్తుంది ఈ వైవిధ్యాన్ని కథాకారుడు కాచి వడపోసి నిగ్గుతేల్చి ఏ దృక్పథం నుంచి ఆ సంఘటనల్లోని సత్యాన్ని లోకానికి వ్యక్తం చేయాలో నిర్ణయించుకోవాలి నిర్ణయించుకున్న అనంతరం అతని కథ వివిధ మనస్తత్వాలవారికి ఒకే అనుభూతినివ్వగలగాలి ఇందులోనే కళ అనేదాని విశాల ప్రయోజనం ఇమిడి ఉంది

ప నేనిందాకా చెప్పిన ఉదాహరణ ఉందనుకోండి ఒక కుర్రవాడి ద్వారా తల్లిదండ్రుల మధ్య జరిగే ఘర్షణ కథకుడు చిత్రిస్తున్నాడనుకోండి, అతని రచనని బట్టి ఒక కుర్రవాడి అనుభూతే కాకుండా అసలు ఆ తలిదండ్రుల మధ్య ఏర్పడిన సమస్య, వారి వారి మనస్తత్వాలు కూడా కథలో వ్యక్తం కావాలి అవి కుర్రవాడి మాటల్లోనే వ్యక్తం కావాలి ఇదే అన్నిటికంటే కష్టమైన పని

కు అవును లేని పక్షంలో కథ కాకుల్ని కొట్టి గద్దలకి వేసినట్లవుతుంది కథకుడి ప్రయోజనం కోసం కథలోని పాత్రలు బలి అవుతాయి సాధారణంగా కథకుడి ప్రయోజనంలో సాంఘికమైన విలువ లోపించినపుడు ఇటువంటి రచనలు రాయటం జరుగుతుంది దానిని సహృదయులు ఆదరింపలేరు శిల్పం దృష్ట్యా కూడా అది మంచి రచన అనిపించుకోదు

ప ఉత్తమ కథలుగా ప్రఖ్యాతి పొందినవి చదివితే వాటిలో మనకి కొన్ని లక్షణాలు కనిపిస్తాయి ఒకటి - విషయాన్ని సూక్ష్మంగాను, సూటిగాను చెప్పడం సామాన్యంగా కొత్తగా రచన ప్రారంభించే రచయితలు తమకు తోచినవన్నీ విధి విరామం లేకుండా వర్ణించేస్తుంటారు ఈ సందర్భంలో చెహూవ్ - గోర్కీకి ఇచ్చిన సలహావొకటి జ్ఞాపకం వొస్తుంది నాకు ప్రకృతి వర్ణన కథలోని పాత్రలతోటీ, సన్నివేశాలతోటీ సంబంధం లేకుండా ఉండడం పెద్దలోపం అంటాడతను గోర్కీ 'పడవ ప్రయాణం' అనే కథలో దీర్ఘంగా నదీ, చెట్లూ, చేమలూ, పడవా అందులోని వ్యక్తులూ, సూర్యాస్తమయం, చంద్రోదయం దీర్ఘంగా వర్ణించుకుంటూ వెళ్ళాడు దాన్ని విమర్శిస్తూ చెహూవ్ అన్నాడు, ''నువ్వు వెన్నెలనీ, వనాన్నీ వేరేవేరేగా వర్ణిస్తున్నావు, నువ్వు చెయ్యవలసినది వెన్నెలపడి వనం ఎక్కడెక్కడ వెలుగుతోందో, ఆ భాగాలు వర్ణిస్తే చాలు అప్పుడు వెన్నెలనీ - వనాన్నే కాకుండా ఆ రెంటికీ ఉన్న అనుబంధాన్ని కూడా చెపుతున్నావన్న మాట, అటువంటివి ఏరుకోవడంలోనే కథాశిల్పం వుందీ'' - అన్నాడు

కు శిల్పం చెడకుండా వర్ణనలు చెయ్యటంలో చలంగారు ఒక్కొక్కప్పుడు అద్భుతంగా రాస్తారు కాని, అప్పుడప్పుడు ఆయన రచనలోనే వర్ణనలు పాత్రల మనస్థితిని మించి వెళ్ళిపోయినట్లు కనిపిస్తుంది నామట్టుకు నేనెప్పుడూ నా కథలలో ప్రకృతిని పాత్రలకి అనువుగా వుపయోగించుకోలేను అందుచేత వర్ణనల జోలికిపోను

ప ఒక్క వర్ణనలే కాదు ఇతివృత్తానికి సంబంధం లేని ఇతర విషయాల్ని కూడా కథల్లో ఇరికించడం జరుగుతోంది కొద్దిమంది సిద్ధహస్తులు ఏ విషయాన్ని తీసుకొచ్చినా కథలో దానికి స్థానం కల్పించగల్గుతారు దానివల్ల విచిత్రమైన ప్రయోజనాల్ని కూడా సాధించగల్గుతారు మొపాసా 'నెక్‌లేస్'' అనే కథలో కాలగతి సూచించడం కోసం ఫ్రాన్స్‌లో జరిగిన రాజకీయ పరిణామాలను కథతో బాటు ఏ సంబంధమూ లేకపోయినా వర్ణించి కథకు అద్భుతంగా ఉపయోగించుకున్నాడు

కు కాదా మరి? శిల్పంలో పొదుపూ ఉండాలి, ఉపజ్ఞా ఉండాలి మన కథకుల్లో వేలూరి శివరామశాస్త్రి గారి రచన ఎంత బిగువుగా పొంకంగా ఉంటుందో చూడండి మంచి కథ ఏది చదివినా అందులో ఒక వ్యర్థ పదం వున్నట్టు గాని వొక వాక్యం తేలిపోయినట్టు గాని వుండకూడదు మరొక విషయం ఏమిటంటే కథని ఏ పాత్ర ద్వారా చెప్పాలో కథకుడికి తెలియాలని మీరిందాకా అన్నారే, - కొందరు కథకులు కథను స్వానుభవంగా చెప్పాలో మరొకరి అనుభవంగా చెప్పాలో కూడా నిర్ణయించుకోలేరు నేను నేను అని కథ చెప్పుకుపోతూ ఇతర పాత్రలు అనుకున్న విషయాలు, రహస్యంగా చేసే పనులూ విపులంగా వర్ణిస్తారు

ప దీనికి కారణం రచన మీద కేంద్రీకరణ లేకపోవడం చాలా కథలు ఎక్కడో మొదలుపెడతాయి - ఎక్కడో ఆఖరవుతాయి నాకు కథా రచనకి ఒక ప్రధాన సూత్రం వుందనిపిస్తుంది కథా ప్రారంభం ఏమిటో, కథ ఎన్ని తిరుగుళ్ళు తిరిగినా, - చివరిదాకా జ్ఞాపకం వుండాలి

కు ఈ సూత్రాన్ని అక్షరాలా పాటించినట్టయితే మంచి కథలకి కొన్నిటికి దెబ్బ తగులుతుందేమో అని నా అనుమానం అయినా ఆ సూత్రంలో ఒక సత్యం లేకపోలేదు అదేమిటంటే ఒకే చిన్న కథను నాలుగైదు పాత్రల దృక్పథం నుంచి రచింపకూడదనేది ఆ విధంగా దృక్పథాలు మార్చి కథ చెప్పటం పెద్ద కథలకీ నవలలకీ సరిపోతుంది ఈ కారణం చేతనే పాత్రల పరిణామం చిన్న కథలో సాధ్యం కాదు కాని కొందరు కథకులు కథాశిల్పం తెలుసుకోలేక చిన్న కథలోనే ఒక జీవిత కథని ఇమడ్చటానికి ప్రయత్నిస్తారు

ప నవలకీ కథానికకీ వున్న పెద్ద భేదం ఇక్కడేనని అనుకుంటాను ఒక పాత్ర జీవిత కథని ఆమరణమూ వర్ణించినా చిన్న కథలో ఆ పాత్రలోని ఏ ఒక్క విచిత్ర ప్రకృతినో స్పష్టం చేయడం మట్టుకు సాధ్యమవుతుంది అంతే గాని, అతని మానసిక పరిణామం పూర్తిగా చిత్రించడానికి సాధ్యం కాదు

కు ఇంతకీ శిల్పానికీ రచనయొక్క ప్రయోజనానికీ అవినాభావం ఉన్నదని గ్రహించినట్టయితే, శిల్పంలో దోషాలన్నిటికీ మూలం కథ ప్రయోజనంలో దొరికిపోతుంది కనీసం శిల్పం బాగుండి ప్రయోజనం పల్చబడవచ్చుగాని, శిల్పం పల్చబడి ప్రయోజనం విస్పష్టం కావడం సాధ్యం కాదు

ప రచయితకుండే ప్రయోజనాలకు ఆనాటి సమాజంలో ఉన్న పరిస్థితులకు చాలా దగ్గిర సంబంధం ఉండాలి లేకపోతే ఆ రచన ఎందుకూ పనికిరాకుండా పోతుంది తనకోసమే తను రాసుకుంటున్నాను, అనెవరైనా అన్నారంటే అది వట్టి బూటకం ప్రతీ రచయితా ఒక పాఠకుణ్ణి మనస్సులో పెట్టుకోకుండా అసలు రచన సాగించలేడు

కు అంతేగదా మరి కథకుడు ఇతివృత్తం ఎన్నుకోవటంలోగాని దానికి తగిన శిల్పం అమర్చుకోవటంలోగాని పూర్తిగా ఏకాకిగా ఉంటాడు ఆ కథ రచించటంలో అతను పెట్టుకునే ఆశయం ఒకటే అతణ్ణి సామాజికుణ్ణి చేస్తుంది అతను ఒంటరిగా తన గదిలో కూర్చొని కథ రాస్తున్నప్పటికీ అతని మీద కథ చదవబోయే సహృదయుడి ప్రభావం అనుక్షణమూ వుంటుంది ఈ సహృదయుణ్ణి స్పష్టంగా భావన చెయ్యలేని రచయిత తన ప్రయోజనాన్ని కూడా స్పష్టంగా చూడలేడని నిస్సంకోచంగా చెప్పవచ్చు

ప ఈ సహృదయత అనేది పైపైని ఉండే వాదాలలోగాని, విశ్వాసాల్లోగాని కనిపించే సామ్యంగాదు అది మనిషిలోలోపల స్థిరంగావుండే మానవత్వానికి సంబంధించింది అంచేత రచయిత స్పష్టంగా వ్యక్త పరచే సిద్ధాంతాలతో సానుభూతి లేనివారు కూడా అతని రచనలు చదివి ఆనందించడానికి సాధ్యమౌతోంది

కు అప్పుడేగదా కళ ద్వారా సంస్కారం అనేది సాధ్యపడేది? ప్రతి రచననీ దాన్ని ఆమోదించే వాళ్లే చదవాలంటే రచన చెయ్యటమే వృథా ఇంతకన్న ప్రచార సాహిత్యమైనా మెరుగే

ప ప్రచార సాహిత్యానికీ కళకీ ప్రధానమైన భేదం వుంది సామాజిక సిద్ధాంతాలు జన బాహుళ్యానికి అనువర్తిస్తాయి వ్యక్తుల దగ్గిరకి వచ్చేసరికి ఆ సిద్ధాంతాల నిజానిజాలు ఋజువు కావు, వ్యక్తి సమస్య సంఘ సమస్య కొంత దూరదూరంగా వుంటాయి వ్యక్తి దగ్గిరకి వచ్చేసరికి ప్రతీ సమస్యా ఒక నైతిక, ఆధ్యాత్మిక స్వరూపాన్ని పొందుతుంది అంచేతే సాహిత్య స్వరూపంలో ముఖ్యంగా చిత్రణ జరిగేది ఈ వ్యక్తి యొక్క నైతిక సమస్యకి, సమాజ నియమాలకీ మధ్య వచ్చే ఘర్షణే సిద్ధాంతాలకి మొత్తం సంఘం ముఖ్యం, కళకి వ్యక్తి ప్రధానం

కు అందుచేతనే రచయితకు సంఘ సమస్యల్ని గురించి వుండే విశ్వాసాలు నేరుగా రచనలో పెట్టడానికి అవకాశం లేదు రచన యెప్పుడూ జీవితం నుంచి రావలిసిందే గాని సిద్ధాంతాల నుంచి వచ్చే అవకాశం లేదు కాకపోతే యేమిటంటే జీవితంలో మనుష్యులు ఎదుర్కొనే నైతిక ఆధ్యాత్మిక సమస్యలని తాను అర్థం చేసుకోటానికీ ఇతరులకి విస్పష్టంగా చెప్పటానికీ ఈ రచయిత విశ్వసించే సాంఘిక సిద్ధాంతాలు తోడ్పడవచ్చు ఒక ఉదాహరణ చెప్తాను ఒక రచయిత ధనికవాదం సంఘానికి ఉపకరించేదని నమ్ముతాడనుకోండి, ఆ రచయిత దృష్టినుంచి ఒక నిరుద్యోగి ఆర్థిక సమస్య ఒక విధంగా గోచరిస్తుంది ఈ నిరుద్యోగి అతని దృష్టికి సోమరిపోతుగానో అసమర్థుడుగానో గోచరిస్తాడు ఆ రచయిత ఆ నిరుద్యోగిని ఆ విధంగానే చిత్రిస్తాడు కూడా నిరుద్యోగానికి ప్రధాన కారణం పెట్టుబడిదారీ ఎని మరొక రచయిత నమ్ముతాడనుకోండి, అతని దృష్టికి నిరుద్యోగి సమస్యలు తీరనివిగాను, నిరంతరం పెరిగేవిగాను గోచరిస్తాయి ఈ నిరుద్యోగులందరూ సంఘటితపడి పెట్టుబడిదారీని ప్రతిఘటిస్తే తప్ప ఈ సమస్య పరిష్కారమయ్యేది కాదన్నట్టు అతడికి గోచరిస్తుంది

ప ఏ సిద్ధాంతాల్లో నమ్మకం ఉన్నా సమాజం ఎలా మారాలని రచయిత నమ్ముతున్నా తను చిత్రించే జీవితంతో రచయితకు దగ్గర సంబంధమూ ఆ జీవితాన్ని గురించిన పరిపూర్ణమైన అనుభవమూ ఉండాలి వట్టి సిద్ధాంతాలే గాని, రైతుల్ని గురించి, కూలీల్ని గురించీ ప్రత్యక్షమైన అనుభవం లేక, ఈనాటి కథకుల్లో చాలా మంది మంచి కథలు రాయలేకపోతున్నారని నా నమ్మకం

కు చిత్రం ఏమిటంటే, ఈ రైతుల్తోను కూలీల్తోను సన్నిహిత సంబంధం వున్న వాళ్ళు కూడా సానుభూతి వున్న వాళ్ళు కూడా ఒక్కొక్కప్పుడు సరియైన కథలు రాయలేకపోతున్నారు వీరిని గురించి ఒకవైపు కొన్ని సిద్ధాంతాలున్నాయి మరొకవైపు అనుభవం వున్నది కాని, యీ రెంటినీ సమన్వయించే శక్తి రచయితకుండటం లేదు దానికి ప్రధాన కారణం యేమిటంటే - రచయితకుండే సానుభూతి వెంట, ఆ రైతు కూలీల జీవితంలోని సత్యాన్ని గ్రహించే శక్తి కూడా లేకపోవటం, ఈ రైతుకూలీ పొద్దస్తమానం చెమటోడుస్తున్నాడని విచారిస్తాడు ఎవరో ఒకరు చెమటోడ్చకుండా పొలాలు పండవనేది గ్రహించలేడు చెమటోడ్చేవాడు ఎక్కడ అన్యాయానికి గురవుతున్నాడో కనుక్కోలేడు అన్యాయానికి గురి అవుతున్నాడని మాత్రం తెలుసుకుంటాడు ఈ రకం సానుభూతీ సిద్ధాంతాలూ మంచి రచనలు చెయ్యటానికి చాలవు మీరు చెప్పినట్టు తాను రచించే విషయాన్ని గురించి అనుభవంతో పాటు ఆ అనుభవం వెనక ఉండే జీవిత సత్యాన్ని తెలుసుకునే శక్తి కూడా ఉండాలి

ప ఒక్క చెమటోడ్చడమే రైతుకూలీ జీవితంలో ముఖ్యఘట్టమని రచయిత అనుకోడం దీనిక్కారణం రైతుకూలీ ఒక వ్యక్తిగా కాక తన సిద్ధాంతంలో ఇమిడే ఒక భావంగా అతనిక్కనిపిస్తాడు అంతేకాదు, ఒక రైతుకూలీ తన భార్యాపిల్లలతో ఇరుగుపొరుగులతో పంచుకునే సుఖదుఃఖాలని గురించి కూడా అతను తలపెట్టడు అంచేత ఒక అసంపూర్ణమైన చిత్రాన్ని ప్రదర్శించడం మాత్రమే జరుగుతుంది

కు అవునుగాని, ఒకటడుగుతాను చెప్పండి కళగా ఏ రచనైనా అన్ని రకాల వ్యక్తులకీ ఒకే భావన, అనుభూతీ ఇవ్వాలనుకున్నాంగాని ప్రత్యక్షంగా చూసినట్టయితే ఇది సాధ్యం కానట్టు కనిపిస్తుంది మీరేమంటారు?

ప పాత్రల చిత్రణా సన్నివేశాల చిత్రణా విషయంలో చదివే అందరికీ కొంచెం ఇంచుమించుగా ఒకటే అనుభూతి కలుగుతుందని అనుకుంటాను అయితే మీరన్నవాటి వెనక వున్న అంతరార్థం గురించి గాని, రచనలో వ్యక్తమయే సత్యాన్ని గురించిగాని భిన్నాభిప్రాయాలు తప్పకుండా కలుగుతాయి

కు అవునుగదా అటువంటప్పుడు రచయిత ఎటువంటి జీవిత సత్యాన్ని చిత్రించాలన్న సమస్య కలగటం లేదా? సంఘంలో వుండే వివిధ వర్గాలలో ఏ వర్గాన్ని తన కళకి సహృదయులుగా ఎంచుకోవాలో తేల్చుకోవాల్సిన అవసరం ఏర్పడుతోంది గదా

ప రచయిత సమాజంలో భాగమేకనుక అతని సానుభూతి కొంచెం ఇంచుమించుగా ఏదో ఒక వర్గంతో ముడిపడివుంటుంది అంచేత ఆ వర్గాన్నే అతను మనస్సులో పెట్టుకుని రచన సాగించడం కూడా జరుగుతుంది ఇంక మిగతా వర్గాలవారికి అతని రచనల్లో వున్న జీవితసాన్నిహిత్యం మట్టుకే నచ్చుతుంది అతను చిత్రించే జీవిత సత్యంతో మట్టుకు సానుభూతి వుండదు

కు ఈ రచయిత తన వర్గాన్ని గురించే రాయాలని కూడా లేదు అనేకమంది ప్రసిద్ధ కథకులు తమకు చాలా దూరంగా వుండే వర్గాలని గురించి కూడా కథలు రాసి, ఆయా జీవితాల్లోని సత్యాన్ని ప్రదర్శింపగలిగారు దీనికి టాల్స్టాయ్ మంచి ఉదాహరణ అనుకుంటాను

ప మీరన్న జీవితసత్యం టాల్స్‌టాయ్ తరచు తన రచనల్లో యిరికించే సిద్ధాంతాలు కావని నేననుకుంటాను ఆ సత్యాలు అతని వ్యక్తిగతమైనవి, మీరన్న జీవితసత్యం ఇంతకంటే సూక్ష్మమైనదీ, సూత్రప్రాయంగా చెప్పడానికి వీల్లేనిదీ అనుకుంటాను

కు నిజమే రచనలో రచయిత ప్రవేశపెట్టడానికి యత్నించే నీతీ వేరూ, రచన ద్వారా బయటపడే జీవిత సత్యం వేరూనూ మనం అనేక పాత కథలు చదివి, వాటిలో కొత్త నీతులు చూడగలుగుతాం, కాని, నీతి వుండే ప్రతీ కథలోనూ జీవిత సత్యం ఉండవలసిన అవసరం లేదు రచనలో జీవితసత్యం వ్యక్తం కావాలంటే రచయితకి జీవితం ఎంతబాగా తెలియాలో ఆ జీవితం తాలూకు పరమార్ధం కూడా అంత బాగా తెలియాలి

ప నీతులూ, సిద్ధాంతాలూ, అలా వుంచి రచనల్లో వ్యక్తమయే ఈ జీవితసత్యమే ఒక్కొక్కరికీ ఒక్కొక్కరకంగా అర్థమౌతుందని మనం ఇందాకా అనుకున్నాం అయితే ఈ భిన్నసత్యాల్లో ఏదో ఒకటి నిజమైనదైయుండాలి దాన్ని నిర్ధారణ చెయ్యడం ఎలాగ?

కు సంఘంలో ప్రతివ్యక్తీ అనుక్షణమూ తనకు కావలసిన సత్యం గురించి అన్వేషిస్తాడు నిరుద్యోగి ఉద్యోగం దొరికేచోట్ల చూస్తాడు పారిశ్రామికుడు తన కింద వున్న ఉద్యోగుల సంఖ్య తగ్గించేందుకు మార్గాలు చూస్తాడు ఇటువంటి సత్యాలు ఆయా వ్యక్తుల జీవితాలను ముందుకు తీసుకుపోతాయనటానికి సందేహం లేదు కాని, ఇవి సామాజిక జీవితాన్ని ముందుకు తీసుకుపోతాయనటానికి సత్యాలు మాత్రం కావు, ఒకే దేశంలో ఒక మనిషి నుంచి ఇంకో మనిషి లాభం పొందినపుడు దేశంలో వున్న డబ్బు పెరగనట్టు, జీవితసత్యం అయినపుడు దానికి రెండు దాఖలాలుండాలి ఒకటేమిటంటే, సత్యం అనేది అన్ని వర్గాల వారికీ నిర్వివాదంగా కనపడాలి రెండవది ఆ సత్యం తెలుసుకోవటం వల్ల ప్రతీ వ్యక్తికీ సమాజ స్వరూపాన్ని గురించిన జ్ఞానం విధిగా అభివృద్ధి చెందాలి

ప కథల్లో సామాజికమైన సమస్యలు చిత్రించినట్టయితే ఆ జీవితసత్యం అనేది కొంతవరకు గుర్తుపట్టడానికి అవకాశం వుంటుంది కాని, సాహిత్యంలో గొప్ప స్థానం సంపాదించుకున్న కొద్దిమంది రచనల్లో స్పష్టమైన ప్రయోజనం కాని, ఒక జీవితసత్యం కాని ఎత్తి చూపడానికి కనపడదు వాటి సాహిత్య ప్రయోజనాన్ని ఎలాగ అంచనా వెయ్యడం

కు ఇందులో ఒకటుందనుకుంటాను సామాజికసమస్యనెత్తుకున్నప్పుడు ఆ సమస్యను కథకుడు సరిగా చిత్రిస్తున్నాడో తారుమారు చేస్తున్నాడో ప్రజలకి సులభంగా తెలిసిపోతుంది అంతేగాక ఆ సమస్య ఎట్లా పరిష్కారం కావాలనే విషయం జనబాహుళ్యానికి తెలిసివుంటుంది కాని, స్పష్టమైన ప్రయోజనం కాని, జీవితసత్యం కాని ఎత్తి చూపడానికి కనపడని గొప్ప రచనల్లో రెండు రకాలుంటాయని నా అనుమానం ఒకటి, రచయిత ప్రతిభావంతుడై ఉండి కూడా, తానే సాంఘిక సత్యాన్ని సరిగా అవగాహన చేసుకోకపోవటం నిజానికి వాస్తవ జీవితాన్ని గురించి వాస్తవంగా రాయటానికి ఇది అడ్డు కాదు ఇందుకు గొప్ప వుదాహరణ జేమ్స్‌జోయ్స్ రాసిన యులిసిస్ నవల ఇక రెండవది రచయితకి ఒక ప్రయోజనం వుండీ కూడా తాను చెప్పదలచుకున్న జీవితసత్యాన్ని నిగ్గు తియ్యటానికి బదులు రచనలో అంతటా పరిచేస్తాడు ఇటువంటి రచనలో ఒక సాంఘిక సమస్య వుండదు కాని, సంఘం యొక్క ప్రతిబింబం సజీవంగా రచన అంతటా గోచరిస్తూంటుంది దీనికి మంచి వుదాహరణ గోర్కీ నాటకం

''లోవర్ డెప్త్స్'' అంతర్జాతీయ కథానికల పోటీలో బహుమానం పొందిన మీ 'గాలివాన' తీసుకోండి ఇందులో ప్రత్యేకించి ఒక సాంఘిక సమస్య లేదు కాని ఆ కథ అంతటా వాస్తవ మనస్తత్వ చిత్రణ గోచరిస్తుంది అందులో కనిపించే సాంఘిక సత్యం ఏమిటీ అంటే ఒక వాక్యంలో చెప్పటం సాధ్యం కాదు కాని, అటువంటి సాంఘిక సత్యం దానిలో తప్పకుండా ఉంది

ప అంటే ఏ రచనకైనా బలాన్ని చేకూర్చేది ఈ జీవిత సత్యమే అనాలి ఇది మానవత్వమంత విశాలమైంది కూడాను అంటే కళ నిష్ప్రయోజనమైంది కాదనీ, దానికి జీవితంతో, మనం నివసించే సమాజంతో దగ్గర సంబంధం వుండడమే కాక జీవితాన్ని అర్థం చేసుకోడానికి ఒక దృష్టిపథాన్ని కూడా కలిగించాలి

కు అంతే మీకభ్యంతరం లేకపోయినట్టయితే -యథార్థమయిన కళ 'జీవితం యొక్క జీవితం' అంటాను

ప మనం కథానికలతో ప్రారంభించి చాలా విశాలమైన సాహిత్య సమాలోచనలో పడ్డాం అయితే ఉత్తమ రచనలకి అన్నిటికీ ఉండవలసిన లక్షణాలు సామాన్యంగా ఒకటేగనక ఈ సమాలోచన తప్పదనుకుంటాను మన చర్చలో తేలిన అంశాల్లో గుర్తుంచుకోవలసినవి, ఇవి అని నాకు తోస్తుంది ఉత్తమ కథకి మొట్టమొదట ఉండవలసింది శిల్పం రెండోది వాస్తవికత మూడోది జీవిత సత్యానికి సంబంధించిన ప్రయోజనం

*ఆంధ్రజ్యోతి, మాసపత్రిక, మార్చి 1953*

## 12. కథా, నవలా

ఈనాటి తెలుగు సాహిత్యమంతటిలోకీ హెచ్చుగా పరిణామం చెంది యుగ ధర్మాన్ని సమగ్రంగా ప్రతిబింబిస్తున్నవి చిన్న కథా, నవలా అని ఒప్పుకుతీరాలి కాని ఈ పరిస్థితి మన సాహిత్యం తాలూకు ఆధునిక యుగం ఆరంభం నించి ఉన్నది కాదు ఈ యుగం 19వ శతాబ్దం చివరి భాగంలో, అక్కడక్కడా చెదురుగా వెలువడిన రచనలతో ఆరంభమై తొలి ప్రపంచ యుద్ధం ముగిసే నాటికి ఒక ఉద్యమరూపం దాల్చింది సాహితీ సమితి ప్రారంభమయే నాటికి ఉండిన రచయితలు ఆధునిక సాహిత్య యుగంలో నవశకం ఆరంభించారు

అప్పటికి కూడా రచయితలలో హెచ్చు భాగం కవులే కథకులూ, నవలాకారులూ ఉండేవారే గాని వారి సంఖ్య బహు తక్కువ వచన రచన గ్రాంధికంలోనే నడిచేది గిడుగు రామమూర్తిగారి వ్యావహారిక భాషావాదం నవ్యుల ఆమోదం పొందినప్పటికీ వ్యావహారిక భాషను సాహిత్యానికి పూన్చేవారు అంతగా లేకపోయారు తెలుగు సాహిత్యంలో ఆధునిక యుగాన్ని ప్రారంభించిన అమరకవి గురజాడ వ్యావహారిక భాషలో పద్యాలూ, కథలూ, నాటకాలూ రాసినా కథల శకం ఆరంభమయే దాకా వ్యావహారిక భాషలో వ్యవసాయం చురుకుగా సాగనే లేదు కథల శకం పత్రికలతో పాటు పుట్టి పెరిగింది పత్రికా పఠనం - ప్రజలలో అభివృద్ధి చెందిన కొద్దీ కథల సంఖ్యా, కథకుల సంఖ్యా అభివృద్ధి అయింది

పత్రికలు యంత్రయుగానికి చెందినవి అచ్చుయంత్రాలు చాలా కాలంగా ఉంటున్నా, ఈ యంత్రాలలో యిటీవల కలిగిన అభివృద్ధి చాలా గొప్పది ''సాహితి'' సంచికలు అచ్చువేసిన

ప్రెస్‌లో ట్రెడిల్ కూడ ఉండేది కాదు  ఈనాడు విస్తారమయిన ప్రచారం గల రెండు వార పత్రికలు రోటరీల మీద శరవేగంతో అచ్చవుతాయి  పూర్వం అయిదు పత్రికలున్న చోట ఇవాళ కనీసం నూరు పత్రికలున్నాయి  ఈ మార్పుల ఫలితాలు కథా సాహిత్యం మీద ఉండక తప్పదు

గురజాడ అప్పారావుగారు రెండు కథలు మాత్రమే తెలుగులో రాశాడు  నేను గడచిన పాతిక ఏళ్ళకాలంలో అనేక వందల కథలు రాసి ఉంటాను  డజన్ల లెక్కనా, వందల లెక్కనా కథలు రాసిన వారు ఆంధ్రలో చాలామంది ఉన్నారు  ప్రచురించటానికి పత్రికలు లేకుండా యిది సాధ్యం కాదు, పుస్తకాలు ప్రచురించి చేతిడబ్బు ముందు ఖర్చు చేసుకోవాలిసిన పరిస్థితిలో ఎవరూ వందల సంఖ్యలో కథలు రాయరు  పుస్తకాలు ప్రచురించి వాటి ద్వారా కథకులుగా గణనకు రాగోరిన వారు ఎంతోమంచి కథ అనీ, తప్పకరాసి తీరవలసిన కథ అనీ అనుకుంటే తప్ప రాయరు  పత్రికల ధర్మాన కథకులు ఒక మాదిరి కథలూ, అంత బాగా లేని కథలూ కూడా రాయటం జరిగింది  వాటిని రాసినందు వల్ల నష్టం లేదు  ప్రచురించే పత్రికలున్నాయి ఒక్కొక్కప్పుడు పడిన శ్రమకు తృణమో పణమో ముట్టుతుంది కూడ

ఇటువంటి కథలన్నీ రాసినందు వల్ల కలిగిన లాభమేమిటని అడుగవచ్చు  లాభం లేకపోలేదు  పత్రికలో అచ్చయినంత మాత్రాన తక్కువ రకం కథలకు సాహిత్య గౌరవం ఎన్నటికీ రాదు  కాని పత్రికలను మేపడానికి వందల సంఖ్యలో కథకులు పుట్టుకురావటం తటస్థించింది  '' ఉత్తమ సాహిత్యం అవుతుందా లేదా!'' అని ఆలోచిస్తూ కూచోకుండా పత్రికలు అనేక కథకుల కథలను, ఏదో ఒక సుగుణం చూసుకొని ప్రచురించాయి  ఇందువల్ల చాలా చెత్త సాహిత్యం సృష్టి అయినప్పటికీ అనేకమంది కథకులు రచన చెయ్యటానికి ప్రోత్సాహం లభించిన వారైనారు  వారిలో కొందరు ఉత్తమ తరగతి కథకులుగా పరిణమించటం కూడా జరిగింది

సాహిత్య రచన అందులోనూ కథా రచన, ఒక వృత్తి కాదు  ఈనాడు కూడాను ఉపాధ్యాయులూ, జర్నలిస్టులూ, వైద్యులూ, గుమస్తాలూ, వ్యాపారం చేసుకునే వాళ్ళూ కథలు రాస్తున్నారు  ఇంకే సాహిత్య స్వరూపం లోనూ కృషి చేయని వారు కేవలం కథలు రాసి పేరు తెచ్చుకోవడం జరిగింది  అవతల వీరిని ప్రోత్సహించే పత్రికలు లేకపోతే వీరిలో నూటికి ఒకరు కూడా సాహిత్యం ఛాయలకు వచ్చివుండరేమో!

ఇదే నవలకు కూడ వర్తిస్తుంది  పత్రికలు విజృంభించక పూర్వం నవలలు రచించిన వారు చరిత్ర మీద మమకారం కొద్దీ నవలలు రాసి అచ్చు వేయించుకుని కీర్తీ, కొంత ధనమూ సంపాదించుకుందామనీ రచన చేశారు  పత్రికలలో ధారావాహినిగా నవలలు ప్రచురణ కాసాగిన అనంతరం నవలలు రాసే ప్రేరణ ఇతరులకు కూడా కలిగింది

కథలూ, నవలలూ అభివృద్ధికి రావటంలో పత్రికలు నిర్వహించిన పాత్ర అనన్యమైనది  ఈనాడు కూడా పత్రికలు ప్రోత్సహించని సాహిత్య రూపాలు అడుగున పడి ఉండటం కనిపిస్తూనే ఉన్నది

మంచి చెడ్డల విచక్షణ అటుంచి సాహిత్యం పరిమితంగా సృష్టికావటంలోనూ, బహుళంగా సృష్టి కావటంలోనూ ఒక ముఖ్యమైన తేడా ఉన్నది  బహుళంగా ఉత్పత్తి అయే సాహిత్యం విధిగా ప్రజలకూ, జీవితానికీ సన్నిహితంగా వచ్చి తీరుతుంది  కొద్దిమంది కథకులే ఉన్నప్పుడు వెలువడిన కథలలో పాత్రలను ''ఉదాత్తం''గా ఉంచటానికి పడిన పాట్లూ వ్యావహారిక భాషలో

రాయటానికి చేసిన ప్రయత్నంలో రచయితలను పట్టుకున్న బెరుకూ స్పష్టంగా గోచరిస్తాయి రచయితల సంఖ్య హెచ్చిన కొద్దీ భాష ధారాళంగానూ, పాత్రలు స్వాభావికంగానూ పరిణమించడం జరిగింది ఇవి కథా సాహిత్యానికి జరిగిన సామూహిక లాభం ఈ ప్రయోజనం ప్రత్యేక కథలలో పాక్షికంగా మాత్రమే ప్రతిబింబించింది

అనాదిగా వచ్చే కథా సాహిత్యాన్ని పరిశీలించినట్లయితే కథల యొక్క స్వరూప, స్వభావాలలో పరిమాణం కనిపిస్తుంది పురాణాలలోని కథలు వాస్తవిక గాథలు వాటిలో అతిశయోక్తులుండవచ్చు వాటిని రాసిన వారి అపోహలూ, మూఢవిశ్వాసాలూ ఒక్కొక్కప్పుడు వాటిలో ప్రతిబింబించి ఉండవచ్చు కాని వాటిని రాసిన వారు, అవి యదార్థ సంఘటనలనే విశ్వాసంతోనే వాటిని రాశారు అవి గత చరిత్రకు చెందిన దృష్టాంతాలుగా మాత్రమే రచించబడ్డాయి కథకుడు ఆ కథలకు సాక్షి కాడు సమకాలికుడు కూడ కాడు ఈ కథలలో సామాజిక మనస్తత్వం ప్రతిబింబించదు

వీటి మీద ఎంతో పరిణామం చెందినవి నీతి కథలు అవి కేవలం కల్పితాలు పక్షుల మీద, జంతువుల మీద పెట్టి మానవుల వ్యాపకాలను తీవ్రంగా విమర్శించిన వ్యంగ్య రచనలు, వీటి సామాజిక మనస్తత్వం పుష్కలంగా ఉన్నది

ఆధునిక కథలు పురాణ కథలులాగా వాస్తవమైనవి కావు నీతికథల లాగా అభూత కల్పనలు కావు ఇవి కల్పిత వాస్తవిక కథలు స్వరూపాన్ని బట్టి ఈ కథలలో వాస్తవికత నూటికి నూరు పాళ్ళూ ఉండవలసిందే గత్యంతరం లేదు ఈ వాస్తవికత కథనంలో, పాత్ర చిత్రణలో, సంభాషణలో సంఘటనలే ఉండి తీరాలి వీటిలో మనస్తత్వానికి చాలా ప్రాముఖ్యం ఉన్నది ఇవి పురాణ కథలులాగ ఒక ప్రత్యేక సందర్భాన్ని పురస్కరించుకుని దృష్టాంతం కింద చెప్పుకునేవి కావు నీతి కథలలో లాగ వీటిలో ఒక విస్పష్టమయిన నీతి కూడా వుండదు వీటిలో జీవిత ఖండాలు ప్రతిబింబిస్తాయి - సమకాలిక జీవిత ఖండాలు

ఇది చాలా ముఖ్యమైన విషయం ఎందుచేతనంటే, కథలు చెప్పడానికి మూడు మార్గాలున్నాయి ఒకటి, ఎవరో చెప్పగా విన్న విషయాలు చెప్పటం, రెండు, కథకుడు తాను ప్రత్యక్షంగా చూసిన విషయాలను చెప్పటం, మూడు, కథకుడు తన అనుభవాలనే చెప్పటం ఇందులో మొదటి పద్ధతి పురాణాలలో కనిపిస్తుంది మిగిలిన రెండూ ఆధునిక కథా సాహిత్యంలో అమలులో ఉన్నాయి అందుచేత కథకుడు ఈనాడు విధిగా సమకాలిక సంఘటనలనే చెప్పాలి కథా సరిత్సాగరంలో చాలా చోట్ల తమ అనుభవాలను గురించి చెప్పటం మనకు కనిపిస్తుంది ఇదే పద్ధతిని కాశీమజిలీలలో కూడా మనం చూస్తాం అందుచేతే అటువంటి కథలకు శ్రోతలు పాఠకులు కారు - ఇతర పాత్రలు ఆ సాహిత్యంలో స్వానుభవాలు చెప్పించడం శిల్పి చమత్కృతి మాత్రమే

ఈనాటి కథ - నవల కూడా - స్వరూపం సంబంధించినంత మట్టుకు పరిపూర్ణమైన పరిణామాన్ని సాధించింది కథ చెప్పటానికి ఆదర్శప్రాయమైనదైన మాట్లాడే భాషలో ఈనాటి కథలూ, నవలలూ రచించబడుతున్నాయి, వీటిలో ప్రధాన పాత్రలు ఈనాటి జీవితంలోని అన్ని తరగతులకూ చెందినవిగా ఉంటున్నాయి వర్తమాన జీవితమే ఈ కథలలో, నవలల్లో ప్రతిబింబిస్తున్నది

కాని ఈ రచనల స్వభావమే ఒక్కొక్కసారి పెడతోవబడుతున్నది కథలకూ, నవలలకూ వుండదగిన స్వభావం గురించి ఒక్కొక్కప్పుడు కథకులకే స్పష్టమైన అభిప్రాయాలుండటం లేదు

ఆధునిక కథయొక్క స్వరూపాన్ని అర్థం చేసుకుని అటువంటి స్వరూపం గల సాహిత్యం యెటువంటి స్వభావం కలిగి వుండాలో అంచనా కట్టడం అసాధ్యం గాదు ప్రజలకు సన్నిహితమైన భాషలో ప్రజలను చైతన్యవంతులను చెయ్యలేని కథలు రచించి ప్రయోజనమేమిటి?

కందుకూరి వీరేశలింగంగారు మొదట్లో భాషతో గరడీసాము చేసి కూడా పదిమందికి తెలియవలసిన విషయాలు చెప్పటంకోసం అతి సులువయిన భాష అవలంబించారు ఆయనకు భాష తాలూకు స్వరూప స్వభావ సంబంధం తెలిసివచ్చింది ఈనాటి కథకులు మట్టుకు ఒక్కొక్కప్పుడు అందరికి అర్థమయే భాషలో దాదాపు యెవరికీ అక్కర్లేని కథలు రాస్తున్నారు ఇది తప్పు

కథలలో నిత్యజీవితం తాలూకు పాత్రలుంటున్నాయి కాని ఒక్కొక్కప్పుడు ఆ పాత్రల స్వరూపానికీ, స్వభావానికీ సంబంధం వుండదు కార్మికుడికి మధ్యతరగతి మనస్తత్వమూ, మధ్యతరగతి వాడికి జమీందారి మనస్తత్వమూ అంటగట్టబడుతూంది ఈనాటి కథలలో జీవితం ప్రతిబింబించబడుతుంది, కాని చాలా కథలలో జీవిత సత్యం లోపిస్తుంది

ఈ నాటి కథా సాహిత్యంలోని లోపాలన్నీ ఈ విధమైనవే ఈ కథలకు ఆయువుపట్టు వాస్తవికత వాటి స్వరూపం వాస్తవికతకు అనుకూలమయినది అది కథల స్వభావంలో కూడా ప్రతిబింబించినప్పుడే అవి ఉత్తమ కథలనిపించుకుంటాయి

కథలలో, నవలల్లో, ప్రతిబింబించే జీవితం తాలూకు వాస్తవికత, జీవితసత్యం మాత్రమే ఈ సత్యం వ్యక్తం కానప్పుడు జీవితాన్ని ఎంత వివరంగా చిత్రించి కూడా ఏమీ ప్రయోజనం లేదు ఆ జీవిత సత్యమే రచనను అభ్యుదయ రచనగా చేసేది

''జీవిత సత్యం'' ''వాస్తవికత'' ''అభ్యుదయం''మొదలైన మాటలు రాజకీయ పరిభాష అని అపోహపడే వాళ్ళు ఈనాడు కూడా చాలా మంది ఉండటం శోచనీయం మార్క్సిస్టు సాహిత్యం పరిచయం లేకుండానే శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు తాము రచించిన కొన్ని కథలలో జీవిత సత్యాలను ప్రతిభావంతంగా చిత్రించారు ఒక కథలో ఒక అస్పృశ్యుడు ఇస్లాం మతం పుచ్చుకుని సమాజం మధ్యకు వచ్చి వెలివెయ్యమని సవాలు చేస్తాడు ఆయన రచించిన మరొక కథలో ఒక శ్రోత్రియ కుటుంబానికి చెందిన యువకుడు బతుకుతెరువు గానక హోటలు పెడతాడు ఇదే విధంగా, కమ్యూనిస్టు రాజకీయాలను తీవ్రంగా ప్రతిఘటించిన సురవరం ప్రతాపరెడ్డిగారు తమ కథలు కొన్నిటిలో జీవితసత్యాన్ని చాలా చక్కగా చిత్రించారు పాఠకులను సమ్మోహింపచేయుటలో అసాధారణ ప్రతిభ గల చలంగారు జీవిత సత్యాన్ని అంతగా వ్యక్తం చెయ్యకపోయినా, జీవితంలో అసత్యాలను ఘాటుగా ఖండించారు

ఆధునిక యుగంలో అనేకమంది కథకులూ, నవలాకారులూ కూడా ఈ సాహిత్యం రూపాల స్వభావాన్ని తృణీకరించి, స్వరూపాన్ని తీర్చిదిద్దటంలో ప్రావీణ్యం సంపాదించి ఖ్యాతి సంపాదించుకున్నారు దీనికి మనం ఈనాడు విచారించనవసరం లేదు ఎందుకంటే కథ యొక్క స్వరూపంలో కలిగిన ఈ వాంఛనీయమైన పరిణామం ఏ ఉద్యమం లేకుండానే సాగింది నవ్య సాహిత్య పరిషత్తు పుట్టి ఉద్యమం సాగించినప్పటికే చాలామంది ప్రసిద్ధ

కథకులు దేశంలో ఏర్పడి ఉన్నారు వీరిని కూడగట్టి ప్రచారం ఇవ్వటం తప్ప సాహిత్య పరిషత్తు వచన రచనల స్వభావాన్ని తీర్చిదిద్దటంలో ఎంత మాత్రమూ కృషిచేయలేకపోయింది ఆ మాటకు వస్తే నవ్య సాహిత్య పరిషత్తులో వచన రచయితలు ఎప్పుడూ వెనక బెంచీల మీద కూచున్నారు

వచన రచయితలను ముందుకు తోసి కథకులకూ, నవలలకూ, ఇతర సాహిత్య రూపాలకు కూడా ప్రయోజనాత్మకమైన స్వభావాన్ని ఇవ్వడానికి మొట్ట మొదటిసారిగా ఉద్యమం సాగించినది అభ్యుదయ రచయితల సంఘం ఈ ఉద్యమం కొంతదూరం సాగి పరిస్థితులు వికటించటం వల్ల తాత్కాలికంగా నిలిచిపోయినాక కూడా ఉద్యమ ప్రభావం ఎంత మాత్రమూ నిలిచిపోలేదు గడిచిన పదేళ్ళ కాలంలో అనేక వందల మంది కథకులు తమ ద్వారా జీవిత సత్యాన్ని వివరించటానికి కృషిచేశారు వీరి రచనలన్నీ పత్రికలలోనూ వెలువడ్డాయి

ఈనాటి పరిస్థితి యేమంటే, యువక రచయితలకు కొంత మార్గ దర్శనం అవసరం కొందరు స్వరూపాన్ని గాలికి వదలి కథ యొక్క స్వభావానికి న్యాయం చేకూర్చాలనే ఆశతో వికృతమైన రచనలు చేస్తున్నారు మరికొందరు కొన్ని అభ్యుదయకర విశ్వాసాలయందు అపారమైన గురి వుండి, వాటిని నిరూపించటం కోసం జీవితాన్ని తారుమారు చేసి చిత్రిస్తున్నారు

రచయితలకు జీవితానుభవం వుండాలి జీవిత సత్యాన్ని గ్రహించే నిశితమైన దృష్టివుండాలి ఏ కళకైనా అపారమైన సాధన వుండాలి వాస్తవిక కళకు మరీనూ

ముందుకు చూస్తే కథా, నవలా సాహిత్యాలకు ఉజ్వలమైన భవిష్యత్తు కనిపిస్తుంది భావి సాంఘిక పరిణామానికి మూలకందమైన శ్రామిక వర్గంలో యింకా కళా చైతన్యం లేదు కాని వస్తుంది జీవిత సత్యం తాలూకు కీలకం వారి చేతిలో వుంది వారిలో నుంచి కథకులూ, నవలాకారులూ బయలుదేరి తమ జీవితాన్నీ, దాని వెనకదాగి ఉండే సత్యాన్నీ చిత్రించటం ప్రారంభించినాక ఈ నాడు మనం చూసి మురిసే సాహిత్యం పేలపిండిలాగా గోచరిస్తుంది ఆ వర్గం నుంచే గోర్కీలూ, ఫాస్ట్‌లూ, హార్డీలూ బయలుదేరే రోజు అట్టే దూరం లేదు అభ్యుదయ రచయిత సంఘం సరి అయిన పంథాలో కృషి చేసినట్లయితే, యీ కృషికి సంఘం నాలుగు మూలల నుంచీ ప్రోత్సాహం లభించినట్లయితే, ఆ రోజు మరింత దగ్గరపడి తీరుతుంది

*అభ్యుదయ మాసపత్రిక, జూలై 1955, పునర్ముద్రణ సాహిత్య ప్రయోజనం విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, అక్టోబరు 1969)*

# 13. రేపటి కథా సాహిత్యం

రెండవ ప్రపంచ యుద్ధానికి మూడు, నాలుగు సంవత్సరాల ముందు కాలంలో నేను నాల్గైదు కథలు కూడా ప్రచురించిన నెలలు లేకపోలేదు అది చూసి నన్ను కొందరు మిత్రులు, ''ఇంత విరివిగా ఎందుకు కథలు రాస్తావు? నాలుగు కాలాలపాటు ఉండే కథలు పరిమితంగా రాయరాదా?'' అని అడిగారు ''కథలు రాయటం చాలా తేలికైన పని అని కథకులు కాబోయే వారికి తెలియగలందులకే విరివిగా కథలు రాస్తున్నాను '' అని జవాబు చెప్పాను ''నాలుగు కాలాలపాటు ఉండే కథల''లో నాకిప్పుడంత నమ్మకం లేదు కూడానూ

లందుకనే "ప్రతి తరం వాళ్ళూ తమకు కావలసిన సాహిత్యాన్ని తాము సృష్టించుకోవాలి" అన్న అభిప్రాయాన్ని కూడా వెలిబుచ్చాను

కొందరు రచయితలు కథలు విరివిగా రాయటం వల్లనే కావచ్చు - కాకనూపోవచ్చు - కథ రాయటం బ్రహ్మ విద్య అనే భ్రమ మాత్రం ఈ మధ్య కాలంలో పోయింది దాని స్థానే "ఎవరైనా కథ రాయవచ్చు"అనే అభిప్రాయం కూడా వ్యాపించినట్టు కనిపిస్తుంది ఇది తప్పు అభిప్రాయమని నేననుకోను కాని ఈ అభిప్రాయంతో బాటు కథా శిల్పంతో తగు మాత్రం పరిచయమూ, ఆత్మవిమర్శనా శక్తి ఉండాలి - అంతే

ఇప్పుడు దేశంలో అనేక మాస, వారపత్రికలున్నాయి అన్నింటా కథా సాహిత్యం వెలువడుతున్నది "ఇన్ని కథలు నిజంగా కావాలా? ఒకటి రెండు పత్రికలే వుండి పరిమితంగా కథలు వచ్చినప్పుడే మంచి కథలు వచ్చాయి ఇప్పుడు వందల సంఖ్యలో వేల సంఖ్యలో కథలు వెలువడటం వల్లనే చెత్త కథలు జాస్తి అవుతున్నాయి గత్యంతరం లేక పత్రికల వాళ్ళు వేస్తున్నారు" అన్న అభిప్రాయం కొందరికున్నది ఈ అభిప్రాయంతో కూడా నేను ఏకీభవించలేను

పత్రికలలో ప్రచురణ అయ్యే కథల సంఖ్యకూ కథల బాగోగులకూ సంబంధం లేదు జీవితం చాలా విశాలమైనది సంఘంలో అనేక వర్గాల వారు, అనేక వృత్తుల వారూ, అనేక ప్రాంతాల వారున్నారు వీరందరికీ అనేక వందల సమస్యలున్నాయి వాటిని పరిష్కరించుకునే యత్నంలో వారు చిత్ర విచిత్రమైన నైతిక, ఆర్థిక పరిస్థితులకు గురి అవుతున్నారు విస్తృతమైన యీ జీవితాన్ని ప్రతిబింబించటానికి ఎన్ని కథలైతే చాలేటట్టు?

జీవితంలో వైవిధ్యంతో బాటు మార్పు కూడా చాలా వేగంగా జరుగుతున్నది రెండేళ్ళ క్రితం ఒక సమస్య ఏ రూపంలో ఉండిందో ఈనాడది ఆ రూపంలో లేదు ఈ మార్పు జరిగేది మాత్రమే కాదు దీన్ని సాహిత్యంలో చిత్రించవలసిన ఆవశ్యకత కూడా వున్నది

ఇన్ని పత్రికలుండి ఇన్ని వందల కథలు వెలువడుతున్నా ఆ అవసరం తీరటం లేదు పదిమంది మిత్రుల సొంత గొడవలు వింటే జీవితం గురించి తెలిసే అంశాలు నూరు కథలు చదివినా తెలియటం లేదు

ఇదే ఈనాటి కథా సాహిత్యం గురించి నేను చేయగలిగిన ప్రధాన ఆక్షేపణ

సాంఘికపరిణామ వాదులూ అభ్యుదయవాదులూ ఆశించేదేమంటే సంఘంలో ఏకత్వం, సంఘం మీద మమత్వం, ఇన్ని కులాలూ, ఇన్ని వర్గాలూ, ఇన్ని రకాల సంస్కృతులూ, మనుషులకూ మనుషులకూ మధ్య ఇన్ని గోడలూ, ఇంత నిస్సానుభూతి, ఇంత అసహనమూ - ఇదంతా పోవాలి, పోయి తీరాలి ఇవి గత చరిత్ర మనకు ప్రసాదించిన విషం దీన్ని దహించాలి వర్గరాహిత్యం కావాలి సోషలిజం రావాలి ప్రజల మధ్య సామరస్యమూ, సానుభూతీ రావాలి నా విషయం నేను చూచుకుంటూనే వున్నాను కాని సంఘం విషయం కూడా నాకు కావాలి కార్మికులు, కర్షకులు, కమ్మరి, కుమ్మరి, సాలె, వడ్రంగి మొదలైన అంతులేని వృత్తులవారు ఎట్లా జీవిస్తున్నారు? అట్లా ఎందుకు జీవిస్తున్నారు? వారి సమస్యలేవి? వాటిని ఎట్లా పరిష్కరించుకుంటున్నారు? నా తరఫున దేశాన్ని పరిపాలించే ప్రభుత్వం వారి సమస్యలను ఎట్లా పరిష్కరించబోతున్నది? ఇటువంటి ప్రశ్నలు రానురాను అధిక సంఖ్యాకులలో కలుగుతున్నాయి అది సహజ పరిణామం

ఇటువంటి ప్రశ్నలు కలగకుండా జీవితాన్ని చిత్రించి చూపగల సాహిత్య శాఖలలో కథాసాహిత్యం అగ్రగణ్యమైనది ఇది అన్ని వర్గాల నుంచి రాగలది అన్ని వర్గాలకు పోగలది అక్షరాస్యుడైన ప్రతి వాడికీ అత్యంత సన్నిహితమైనది

ఏయేటి సాహిత్యంలో ఆయేటి సామాజిక జీవితం ఎందుకు విస్తృతంగా ప్రతిబింబించటం లేదు? రచయితలలో ఉండదగిన ఒక ఆవేదన లోపించటం వల్ల తనను జీవితం హింసించినప్పుడూ, నవ్వించినప్పుడూ, కవ్వించినప్పుడూ తనకు కలిగే మనోభావాలను మిగిలిన సామాజికులతో పంచుకోవాలనే ఆవేదన ప్రతీ రచయితకూ - కవికీ, కథకుడికీ, నాటకకర్తకూ - బలంగా వుండి తీరాలి అప్పుడే అతని అనుభవం అందరి అనుభవమూ అవుతుంది అట్లాగే రచయిత ఒక సంఘటనలో ఒక జీవిత సత్యాన్ని చూడగలిగినప్పుడు, దాన్ని అందరితోటి పంచుకోవాలి అదొక హక్కు, ఓటు హక్కు లాగ ఆ హక్కును రచయితలు ఎంత బాగా ఉపయోగిస్తే సాహిత్యం అంతగా రాణిస్తుంది

కొందరు రచయితలు - కథకులు కూడాను - సాహిత్యాన్ని మేజువాణీ అనుకుంటున్నట్టు కనిపిస్తుంది ఫలాని ప్రణయ కథలు రాస్తే రసజ్ఞలోకం సంతోషిస్తుందనో, ఫలాని సెక్సు కథలు రాస్తే నాలుగు డబ్బులొస్తాయనో గజ్జె కట్టి మేజువాణీ చెయ్యటం హేయం '' ఆ హా! ఎంత గొప్ప కథకుడు !'' అనిపించుకోవటానికో '' ఏం మనస్తత్వ పరిశీలన!'' అనిపించుకోవటానికో రచన చెయ్యటం కూడా హేయమే మనస్తత్వ పరిశీలనా, రచనా సామర్థ్యమూ ఉండాలే గాని, అవి రచనలో ప్రతిబింబించకపోవు పని పెట్టుకుని జీవితాన్ని లక్ష్యపెడితే తప్ప ప్రతిబింబించనిదల్లా జీవిత వాస్తవికతే!

అభ్యుదయ సాహిత్యం రచించాలన్న అభిలాషలో అమాయక కథకులు కార్మికులే గుర్తించలేని కార్మికులనూ, కర్షకులే ఆమోదించని కర్షకులనూ సృష్టించటం మరింత శోచనీయం కాని ఈ రకం పొరపాటు క్రమంగా వెనకబడుతున్నట్టు కనిపిస్తుంది

కొద్దిమంది కథకులకు ముద్రవేసి వారు ఉత్తమ కథకులు అనుకుని వారి రచనల కోసమే పత్రికలు ఎగబడటం పెద్దపొరపాటు విస్తృతమైన జీవితానుభవంగల కథకుడు కూడా పరిమిత సంఖ్యలోనే పనికివచ్చే కథలు రాయగలడు అందరూ వాస్తవజీవితాన్ని గురించే రాస్తున్నారనుకున్న పక్షంలో ఒకే కథకుడు రాసిన పది కథల కంటె పదిమంది రాసిన పది కథలు ఎక్కువ జీవితాన్ని ప్రతిబింబిస్తాయి నేను కథల పత్రికకు సంపాదకత్వం వహించే పక్షాన పనికి వచ్చే కథల కోసం తప్పక కొత్తవారి రచనకే వెతుకుతాను ఒక కథకుడికి రచనా సామర్థ్యం లేక పోయినా సరిచెయ్యవచ్చు గాని, జీవితం తెలియకపోతే సరిచెయ్యటం ఎవరివల్లా కాదు

శిల్పమూ, భాషా రచనకు ముఖ్యంకాదని కాదు అవి చాలా ముఖ్యం అయితే అవి కథా రచనకు మూల పరికరాలు, ముడిపదార్థాం జీవితం

అభ్యుదయ రచనలనిపించుకునే రచనలన్నీ కరుణ రసంతోనో, భీభత్సరసంతోనే ఉట్టిపడాలనే భ్రమ యువకథకులకు అవసరం లేదు సంఘ విద్రోహులందరూ భీకర రాక్షసులు కారు అందులో చాలా మంది బడుద్ధాయిలున్నారు కథకులు వ్యంగ్యధోరణి అవలంబించి హాస్యరచనలు కూడా చేయవచ్చు

రాబోయే కథకులు ఒక బాధ్యతను గుర్తించాలి, తాము తమ వర్గాలకూ కులాలకూ, తమకు సన్నిహితంగా వచ్చే జీవితానికీ " ఎన్నుకోని ప్రతినిధులు" అని గుర్తించాలి " ఈ విషయం నేను సాహిత్యంలోకి' ఎక్కించకపోతే ఇటువంటివి జరుగుతున్నాయని ప్రజలకు తెలియదేమో!" అనే వైఖరి ప్రశంసార్హమైనది ఒకవేళ అదే విషయాన్ని గురించి మనకన్నరేఖు మరొకరు ఇంకా బాగా రాసినా అందువల్ల వచ్చే నష్టం తక్కువ ఎవరూ రాయకపోతే వచ్చే నష్టం జాస్తి

అన్నిటి కన్నా కష్టసాధ్యమైనది జీవితవాస్తవికత, వాస్తవజీవితం అందరికీ అనుభవంలోదే కాని జీవిత వాస్తవికతను గ్రహించటం చాలా కష్టమైనది అందుచేతనే జీవితాన్ని గురించి అనేక అసత్యవాదాలు ప్రచారంలో ఉన్నాయి వాటిని నమ్మేవారు కూడా ఉన్నారు విజ్ఞానమూ, ప్రజలతో సన్నిహితత్వమూ చాలా వరకూ రచయితకు ఉపకరిస్తాయి రచయితకు తనకు సన్నిహితంగా ఉండే జీవిత రంగంలో గల సత్యం బాగా అవగాహన అవుతుంది కార్మికులతో ఆత్మీయత లేనివాడు కార్మికుల జీవితాన్ని చిత్రించలేడు సినిమా ప్రపంచంతో పరిచయం లేనివాడు ఆ జీవితం గురించి వాస్తవికతతో కూడిన కథ రాయలేడు రష్యాలో డోన్బాస్ కార్మికుల జీవితాన్ని చిత్రించే ఒక చిత్రం తయారుచేస్తే ఆ కార్మికులు దాన్ని చూసి " ఇది మాచిత్రం కాదు" అనేశారుట తెలంగాణా పోరాటంగురించి తెలంగాణా వారు ఆమోదించలేని కథలు కొన్ని లోగడ వచ్చాయి ఇవి ప్రతి కథకుడూ జ్ఞాపకం ఉంచుకోవలసిన విషయాలు

కథా రచనగురించీ, కథల యొక్క సాంఘిక ప్రయోజనం గురించీ, కథకుడు నిర్వహించవలసిన పాత్ర గురించీ సరియైన అభిప్రాయాలు వ్యాప్తి చెందినట్లయితే రేపటి కథ సాహిత్యం ఉజ్వలంగా వుంటుంది ఇంతకు రెండింతలు కథలు వచ్చినా అవి జీవితాన్ని సాధించటానికి తోడ్పడగలుగుతాయి

*ముద్రణ అభ్యుదయ మాసపత్రిక, మే 1956*
*పునర్ముద్రణ సాహిత్య ప్రయోజనం,*
*విశాలాంధ్ర పబ్లిషింగు హౌసు, అక్టోబరు 1969*

# 14. MODERN TELUGU SHORT STORY

THOUGH stories are to be found in our ancient epics in the form of Akhyayikas and upakhyanas, and the Brihatkatha and a host of later works contain innumerable tales and anecdotes, the modern Short Story must be looked upon as a genre imported from the West It is the product of the machine age and is democratic in its form Much argument is not needed to adduce this fact The hero, or the leading character, in a modern short story can belong to any class, any rank It is no longer a part of a larger work, it stands by itself unlike the stories of old, it deals with the present and the current life Through the medium of periodicals printed in huge numbers it goes into the hands of hundreds of thousands of readers every week In fact it is the most popular form of literature for the masses

All these attributes are to be found in the modern Telugu Short Story It was born of the modern outlook and it has grown with the growth of the "Press" Today, about a thousand short stories appear every year in the various Telugu periodicals Several Hundred writers write them Indeed, several more stories are written, though not printed

An exhaustive account of the short Story in Telugu is not possible within this short space We may, however, turn to the main trends

Gurazada Apparao, unique in the Telugu literature of the Modern Age, is recognised as the Father of Modern Drama as well as Modern Poetry He was the first to write Modern Short Story too We have two stories from his pen, "DIDDUBATU" and "MI PE REMITI?* Both are written in the spoken dialect (Vyavaharika Bhasha), the language of the common man, and they have all the elements of a modern short story Indeed, the second story deals with an entire village community, which is still a rare thing in modern Telugu stories

Rayasam Venkatasivudu wrote some very good short stories though lacking in modern style – they were not in the spoken dialect (Vyavaharika Bhasha) – but they were certainly inspired by modern thought Venkatasivudu was thoroughly imbued with ideas of nationalism, social reform and the generous outlook that invaded the intelligentsia of his generation as the struggle for independence gathered momentum under the leadership of Mahatmaji

The first literary organisation which reflected the modern outlook in life as well as in literature, was the Sahiti Samiti Tenali, founded in 1919 It published short stories written in Vyavaharika Bhasha Chinta Dikshitulu, Munimanikyam Narasimha Rao, Srinivasa Siromani and Mokkapati Narasimha Sastry were some of the important story writers who were members of that Association T Sivasankara Sastry (now Swami), the President of Sahiti Samiti wrote some good short stories Chinta Dikshitulu wrote many stories some of which were published as a collection called "Ekadasi" His stories are always gentle like their creator, and very readable Munimanikyam became famous with his Kantham, a middle class women who helps her creator to produce gentle humour out of simple domestic happenings

The advent of Bharati in 1942 brought a host of able story-writers into light Among them were Pandits like Veluri Sivarama Sastry and Sripada Subrahmanya Sastri Poodipeddi Venkata Ramanayya, Kavikondala Venkata Rao, Kanuparthi Varalakshmamma and a host of others contributed short stories to Bharati which maintained very high literary standard

But the magazine that reached the masses for the first time was the Vinodini From the very outset, and more particularly under the able

editorship of Srinivasa Siromani, this magazine created more story writers on one hand and more readers on the other

The success of Vinodini led to the advent of several magazines and all of them published short stories Each magazine had its own group of short story writers But, not all of the great short story writers were made by the magazines

Gudipati Venkatachalam who made an epoch in the history of the Telugu Short Story started writing stories on his own He was a writer of great vigour and purpose His purpose was to attack whatever he did not like in society He was quite merciless in his attacks and some of his thrusts went home so effectively that on more than one occasion his books were publicly burnt This did not prevent a lot of younger writers from emulating him and holding him up as their ideal

In the wake of nationalist awakening that influenced Telugu Literature, there was the impact of Bengali Literature Bankim and Tagore were freely translated into Telugu There were quite a few among the Telugu writers who were acquainted with the Bangali language Still the translations were not very successful They did not grip the average reader

But around the middle of the thirties "Chakrapani" (A V Subba Rao) came forward with his unrivalled and eminently successful translations of the works of Sarat, Parasuram, Bana-phul and other Bengali writers, and the Telugu-reading public enthusiastically plumped for Sarat Many translators have spring up since, and twenty years later Sarat, in Telugu translation, is still the best seller !

Among the short story writers that made a name before the last world war, T Gopichand, Palagummi Padmaraju, Panyala Ranganadha Rao, "Butchi Babu," Gokhale, "Karuna Kumara" and Dhanikonda Hanumantha Rao must be mentioned Each has his own way of handling the short story Of these, Palagummi Padmaraju distinguished himself by getting a prize in the International Short Story Competition which was held some-time ago T Gopichand has dealt with a variety of characters and situations, while "Karuna Kumara" confined himself mostly to rural life Gokhale, an artist by profession, wrote quite a few remarkable stories depicting the struggles, sorrows and even happy moments in the lives of the very lowest class in society His narration too is in their own language

After the war there have been more short story writers than ever before The advent of several new magazines, including a few, popular weeklies, has been the main cause for it The post-war period has also witnessed a significant change in literary outlook Writers have come under the influence of socialist ideas and Marxism The Progressive Movement, which come to India in about 1935, spread to Andhra in 1943 Some

of the writers including the present writer have joined the Progressive Writers Association

It has never been possible for literature to remain aloof from social and political ideas and ideologies The earlier writers were inspired by ideas of freedom and nationalism which germinated on account of the nationalist struggle Now it was the turn of the socialist ideas to influence the younger generation On the side of art, the Progressive Writers tried their best to achieve realism At its best the progressive Telugu story has been very fine indeed, but there was not much of it

Now the trend towards realism has become fairly universal Pantula Srirama Sastry, the late "Sarada", D Subrahmanyam, Rachakonda Viswanatha Sastry, Mullapudi Venkataramana, Kommuri Padmavati Devi, V Sita Devi, N R Chandur, Malati Chandur, Avasarala Surya Rao, A Pitcheswara Rao, "Bharadwaja", "Hitasri", Narla Chiranjeevi and a host of young writers have written short stories, some of which can equal the best in any language Unlike the previous generation of writers who were greatly influenced by foreign literature, the present writers seek their inspiration from life as well as the older generation

Where there is a regular and large output of any commodity – the word is not inappropriate for short story today – there is bound to be good and bad mixed together Most of the short stories were come across today in the magazines are indifferent stuff They would not be printed but for the insatiable need of the modern periodicals These stories suffer from want of good technique, real feeling on the part of the writer, and at times the total ignorance of the writer with regard to life itself But there are, today, many publishers, and several collections of the better type of Telugu Short Story, are coming out Also a few authors' work is being translated into other Indian languages – mostly into Hindi – and is receiving the approbation of readers in those languages One can say with confidence that the future of the Telugu Short Story is very bright

*Andhra Pradesh Souvenir, Nov 1956*
*Andhra Association, Delhi*

# 15. వ్రాతబల్లవద్ద

బోలెడంత రాతపని పేరుకుని ఉంది ఇక బద్ధకించి లాభంలేదు ఆ పత్రిక వాళ్లను మొహమాటపెట్టి ఏనాడనగా డబ్బు తీసుకున్నాను? నాలుగు నెల్లు-నాలుగేం ఖర్మ? అయిదు నెల్లయింది ఒక ఉత్తమ కథానికగాని, అమూల్యమైన వ్యాసరాజముగాని పంపమని వాళ్లు ప్రతినెలా రాస్తూనే ఉన్నారు నేనూ రాద్దామనుకుంటూనే ఉన్నా, కాని పట్టంలేదు నాకున్న చిక్కులు వాళ్లకేం తెలుస్తయ్? చెప్పు కుంటే మటుకు వినేవాడెవడు? మూడే మూడు పంక్తులు

కార్డు ముక్క రాద్దామంటే మూడు రోజుల్నించీ పడకుండ ఉంది  అన్నట్టివాళ్ల శుక్రవారం కదూ? ఇవాళ ఉత్తరం రాయకపోతే సోంవారం ముందు వాడికి అందదు సోంవారమూ అందదు పోస్టు చేరేవేళకి వాడాఫీసుకు పోతాడు రాత్రికి గాని రాడు వాడు మంగళవారం రాస్తే నాకు బుధవారం చేరుతుంది అంటే నేను బుధవారం రాత్రి దాకా వాడి సమాధానం చూడనన్నమాట ఛత్  ఇవాళ ఆ కార్డు ముక్క రాయక పోయానో, వ్యవహారం ఇంకోవారం డేకిందన్న మాటే నూరు ఆరయేది, ఆరు నూరయేది ఇవాళ కార్డు రాయాలసిందే పత్రిక సంగతి తరువాత చూద్దాం

కొంపతీసి కార్డులన్నీ అయిపోయాయా ఏం? ఇంకా రెండుండాలే మూడణాలుపెట్టి నాలుగు పట్టుకొచ్చి అందులో ఒకటి ఆనాడే రాసేశా ఆతరవాత ఇంకోటిగామాలు రాశా అంతేగా? అన్నట్టు ఆవిడ వాళ్ల అన్నకొకటి రాసినట్టుంది అట్లా అయినా ఇంకోటుండాలే అది కూడా తీసుకుని వాళ్ల అక్కకి రాసేసిందేమో, కొంప తీసి కార్డు కనిపిస్తేచాలు, అర్జంటుగా ఉత్తరం రాయాలిసొస్తుంది ఆ మాట అంటినా, నేను తన కార్డులు ఖర్చు చేసిన సంగతి తెచ్చి చెప్తుతుంది కిందటేడు వాళ్ల నాన్న వచ్చినప్పుడు 'నీదగ్గర ఉంటుంది, సమయానికి లేకపోతుంది ఈ కట్ట ఉంచుకో' అంటే మొహర్బానీగా పదహారు కార్డుల బొత్తి ఇచ్చివెళ్లాడు ఆ ముష్టి కార్డుల్లో నేను అయిదో ఆరో వాడానుట అవసరానికి దగ్గిర కార్డులేకపోతే వాడుకున్నానుమరి అదో నిష్ఠూరమా? అంతలోనే వాళ్ల పుట్టింటి వాళ్ల సొమ్మంతా నేను తినేసినట్టు మాట్లాడక్కర్లేదే

కొత్త కవర్లుండాలి కవర్లు రాద్దామన్నా స్టాంపులు లేవే మొన్న పోస్టాఫీసు పక్క వెళ్లినపుపడు, ఏమిట్రా పోస్టాఫీసులో కొందామనుకున్నానూ? అని ఎంత ఆలోచించినా జ్ఞాపకం వచ్చి చావలేదు - స్టాంపులు, ఈ సారన్నా జ్ఞాపకం పెట్టుకొని నాలుగు అణా బిళ్లలూ, నాలుగు కార్డులూ కొనాలి తప్పదు  ఒక పని చేస్తా మావాడికి ఉత్తరం రేపు రాసి ఎక్స్‌ప్రెస్ డెలివరీవేస్తా వాణ్ణికూడా జవాబు అట్లాగే రాయమంటా ఎందుకొచ్చిన బెడద ఎవరో అన్నారు - ఏ ఉత్తరానికైనా  ాబు రాయకుండా రెండు మూడు నెల్లూరుకుంటే తర్వాత జవాబుతో నిమిత్తమే ఉ ండదని ఏడిసినట్టే ఉంది మనం రాయాలిసిన ఉత్తరాల మాటేమిటి? నేనీ ఉత్తరం రాయకపోతే వీలుందా? రానికి మావాడు మూడునెల్లు జవాబివ్వకపోతే? ఛత్ తోచీ తోచనివాళ్లు ఏదో చచ్చు కబుర్లు చెప్పటమూ, మనం వాటిని వేదంముక్కలల్లే జ్ఞాపకం ఉంచుకుని వేళగాని వేళ మననం చేసుకోవటమూనూ

ఈ పూటకి ఉత్తరం ముక్క రాసుకునే యోగ్యత లేనేలేదు ఆ పత్రిక కేదన్నా రాస్తే? నెలాఖరువారం వెంటనే పంపితే వచ్చే సంచికకు అందొచ్చు లేకపోతే ఇంకోనెల ఆలస్యం చేసినట్టవుతుందితప్ప ఇంకేమీ ఉండదు రాయటానికేదన్నా ఆలోచించైనాపెట్టుకున్నానుకాను

రాయటానికి కూచుని ఆలోచిస్తే బుర్ర కాస్తా కడిగేసిన పలకల్లే అయి చక్కాపోతుంది ఎక్కడో ఉంటారు అదృష్టవంతులు - లేడికి లేచిందే పరుగల్లే కలం పట్టుకోగానే వాళ్ళకు కావ్యం వస్తుంది మనకా అదృష్టంలేదు మనకు ఏదన్నా చదువుతున్నంతసేపూ బుర్ర జోరుగా పనిచేస్తుంది ఎక్కడెక్కడి కథలూ తడతయ్ కాని అవి అప్పుడే పోతై  ఈ సారి అటువంటి ఐడియాలు వచ్చినప్పుడు ఎందులో నన్నా రాసి పెట్టుకోవాలి ఈ సంగతి లోగడ ఎన్నోసార్లు

అనుకున్నదే కాని తీరా సమయానికి జ్ఞాపకం ఉండదు   అన్నట్టు కొందరు విదేశీయులు తమ అనుభవాలూ, తాము ఎక్కడెక్కడో చూసిన మనుషుల వర్తనా, వాళ్ల స్వభావ చేష్టలూ రాసిపెట్టుకొని, తరవాత ఏ కథలోకో, నవలలోకో ఎక్కించేస్తారుట  వాళ్లకు అదే వృత్తిగనక ఎన్నయినా చేస్తారు  వాళ్ళు ఒక్క పుస్తకం మీద సంపాదించే మొత్తం మనం యావజ్జీవితంలో సంపాదించలేం  వాళ్ళు మహారాజులు  సొంత ఖర్చుతో ప్రపంచమంతా చుట్టివస్తారు, అతి విచిత్రమైన అనుభవాలు సంపాదిస్తారు  ఒక కథకుడు బొగ్గుగనుల్లో పనిచేసే వాళ్ళ జీవితం చిత్రిస్తూ నవల రాయటానికని, తానే ఒక బొగ్గు పనివాడి ఉద్యోగం సంపాదించి ఆరునెల్లు పనిచేశాట్ట  అటువంటివాడు రాయలేక ఏంజేస్తాడూ?

మన సంగతి చూడబోతే ఇల్లూ, సంసారం, పిల్లలూ,  కీచులాటా, అరుపులూ, అల్లరీ, ఆఫీసూ, వెట్టిచాకిరీ, గదమాయింపులూ, నీరసం, నిస్పృహ, విరక్తీ విసుగూ-వీటిమధ్య ఏం రాసేట్టు, ఏ చెందేట్టు? చూసిన మొహాలే చూడటం, విన్న మాటలే వినటం, అన్న మాటలే అనటం  అంతా కలిసి గంజిగుంట ప్రమాణపు జీవితం  ఇందులో ఎరవేసి చేపలు పట్టాలి

ఏమిటో అనుకుంటాంగాని, కూచున్నచోటినుంచి కదలకుండా గొప్ప పుస్తకాలు రాసిన వాళ్ళు లేరూ? ప్రపంచమంతా చుట్టివచ్చిన వాళ్లు రాసిన పుస్తకాలు బాగుండి అఘోరించాయా ఏమిటి? అట్లా రాసిన పుస్తకాల్లోకూడా వాస్తవికత ఉండదు  ఎంతో డబ్బు తగలేసి, మారుమూల దేశాలన్నీ తిరిగి కూడా వాళ్లు ఆ దేశాల్లో తాము చూడదలిచిందే చూస్తారుగాని, కళ్ళ ఎదట ఉన్నది చూడరు  ఆ భాగ్యానికి వాళ్ళు ఇంత దూరం రావడం దేనికి? ఇంత శ్రమ దేనికి? అంతా భేషజం  పబ్లిసిటీ

ఆ మాటకొస్తే పబ్లిసిటీలో మాత్రం ఏముంది? అదృష్టం ఉంటే రాతగాడు  ఇట్టే పైకొస్తాడు  కొందరు ఏళ్ళ తరబడి రాసినా అడుగునే ఉండి పోతారు  న్యాయంగా మనం రాసింది ఎంతా?   అందుకే ఉట్టుడియంగా పైకి వచ్చేశానని కుళ్లే వాళ్లు కొందరున్నారు  పేరు చూసే ఇంత కుళ్లు తారే  రాతగాడికి డబ్బు కూడా వస్తే ఇంకెంత కుళ్లుతారో

అరె  చూస్తుండగానే పుణ్యకాలం వెళ్లి పోతున్నదే  ఇక ఆరంభించాలి  తాత్సారంచేసి లాభంలేదు   అన్నట్టు సీరాబుడ్డీ ఖాళీ అయినట్టుంది  కలంలో ఏపాటి సిరా ఉందో మధ్యలో సిరా అయిపోతే ఎంత శోభగా నన్నా ఉంటుంది  దీం దుంపతెగ  ఒక్క వ్యాసం రాయాలంటే ఇంత కృత్యాద్యవస్థా? ఇన్ని విఘ్నాలా? ఇంకా పెద్దపనులు చెయ్యాలంటే ఎట్లా?

కాకపోయినా మిగిలినవన్నీ ఒక ఎత్తూ, రాయటం ఒక ఎత్తూనూ  అందుకేగా  కవి అన్నాడూ   నిరుపహతిస్థలంబు రమణీ ప్రియ దూతిక తెచ్చి ఇచ్చు కప్పుర విడెము   అది అనాటివాళ్ల గొంతెమ్మ కోరిక  ఈనాడు రాతకు కావలిసింది అడపా దడపా ఒక అర కప్పు కాఫీ, ఒక ఖరీదైన సిగరెట్టు పాకెట్టూ, మంచి కాగితాలూ, దర్జా అయిన కలం, మంచి బల్లా సినిమాకు రాసేవాళ్లది అదృష్టమంటే-వాళ్ల కన్నివస్తయ్  డబ్బుకూడానూ  సినిమా కవి అయినా బాగుణ్ణు  ధూత్

ఈ బల్ల- ఇరవై రూపాయలు పోసి కొన్నా  నేలకు నాలుగు కోళ్ళూ ఆనవు  ముందు పక్క కుడిచేతివేపు కోడు గాలిలో ఉంటుంది  రాయటానికి బల్లమీదికి వంగితే వెనకవేపు ఎడంచేతి వేపు కోడు గాలిలోకి లేస్తుంది  పరధ్యానంలో చేతులు తీసేసరికి దఢాల్న వెనక్కు

పడిపోతుంది బల్ల ఇరవై రూపాయిలు పోసి కొన్న బల్లను చూస్తూ చూస్తూ శంకించలేక, లోపం నేలలోనే ఉన్నదనుకుని బల్లను గది అంతటా పెట్టి చూశా ఎక్కడ పెట్టినా ఒక కాలు గాలిలోనే ఉంది ఇక తప్పు బల్లదేనని ఒప్పుకోక తప్పిందికాదు మిగిలిన మూడు కోళ్లూ కోయిస్తే గాని బల్ల కుదురుగా నుంచునేట్టులేదు అది మాత్రం మాటలా? కోసేవాడు దొరికాలి వాడు నన్ను దివాలా తీయించటానికి చూడకుండా ఉండాలి సమయానికి నాదగ్గిర డబ్బులుండాలి అందుచేత తాత్కాలిక ఏర్పాటు కింద ఏవో కాగితాలు మడిచి కుంటికాలికింద ఎత్తుపెట్టా ఎప్పుడు మాయమయిందో ఆ కాగితం కాస్తా మాయమయింది నేను బల్ల ముందు కూచుని దానిమీద మోచెయ్యి ఆనించేటప్పటికి లది కాస్తా మాయమయింది నేను బల్ల ముందు కూచుని దానిమీద మోచెయ్యి ఆనించే టప్పటికి లది కాస్తా ముందుకు ఒరిగింది గత్యంతరంలేక కుంటికాలికింద మళ్లా కాగితాల మడతపెట్టా మళ్ళీ మర్నాటికది మాయమైంది పంచాయతీ చెయ్యగా అ కాగితం మడతలను పనిమనిషి గది ఊడ్చేటప్పుడు తీసిపారేస్తున్నట్లు తేలింది ఆ కాగితం మడతలను ముట్టుకుంటే ఎంతమాత్రం మర్యాదగా ఉండదని పనిమనిషికి గట్టిగా చెప్పా రెండు రోజులు ఊరుకుని మళ్ళీ తీసేసింది నేను చాలా పెద్ద యుద్ధానికే తయారయినా కాని ఆరోజు ఇల్లు కడిగారుట కాగితం తడిసిందిట తడి కాగితం తీసెయ్యకుండా ఎట్లా? బల్ల కాస్తా చీకి పాడైపోదూ

బల్ల కాళ్లు కొయ్యక తప్పదనిపించింది ఎవడో నాకు తగ్గవ్రడంగే దొరికాడు ముప్పావలా ఇమ్మన్నాడు కోడుకు పావలా అని వాడి లెక్క కామాలు నేను పావలా ఇస్తానన్నా కోసేది మంచి కోళ్ళే అయినా, ఇచ్చే డబ్బులు చెడినకోడుకే ఇయ్యాలని నా ఉద్దేశం తన వల్లకాదని వెళ్ళిపోయాడు ఇంకో బేడా ఇస్తానంటే వాడు ఒప్పుకునేవాడే అన్నారు మా వాళ్ళు కాని నాకు టోపీ పడటంమంటే చెడ్డ మంట నాపంతం నెగ్గించుకున్నా ఇంకోడు వచ్చి ఆపావలా డబ్బులకే కోసివెళ్ళాడు అనాటి నుంచీ ఆ బల్లకు రెండు కాళ్ళు పొట్టి త్రాసు దండంలాగా ఆపక్కకూ ఈపక్కకూ ఆడుతుంది ఏంచేసేదీ? దానితోనే కాలక్షేపం చేస్తున్నా

ఈ సిగిరెట్లన్నీ ఇప్పుడు కాల్చినవేనా? ఇంతలోనే ఆరు సిగిరెట్లు కాల్చానా, ఎదురుగా తెల్లకాగితం వెక్కిరిస్తున్నట్టుగా ఉంది ఇంకేం రాస్తానివాళ? పెట్టెలో రెండు సిగిరెట్లే ఉన్నయ్ తెప్పిద్దామన్నా పనిమనిషి వెళ్ళిపోయినట్లుంది కాస్త కాఫీ అయినా ఉంటే బాగుణ్ణు కాఫీ సిగరెట్టూలేకుండా రాయాలంటే చాలా కష్టం దీన్ని బట్టి రాస్తున్నది మనమే అయినా, మన చేత రాయిస్తున్నది కాఫీ సిగరెట్లనుకోవాలి ఒక రచయిత రచనలో హాస్యం గురించి చెబుతూ ఇంకో రచయిత ఆయన హాస్యం ఆల్కహాల్ ప్రేరేపించేది అన్నాడు సిగిరెట్లు తగలేసిరి, కాస్త కాఫీ ఇస్తుందేమో అడిగి చూద్దునా? పొడిలేదంటుందేమో కొంపలో ఎప్పుడూ ఏదీ ఉండదు అత్యావసరంగా కావలసినప్పుడే అసలుండదు మంచి మూడ్‌లోకి వచ్చి రాద్దామని కూచునేసరికి సిగిరెట్లో, అగ్గిపెట్టో ఖాళీ అయిపోతుంది లేకపోతే కలంలో సిరా అయిపోతుంది లేకపోతే రాసుకునే కాగితాలు అయిపోతయ్

ఇంట్లో కూడా ఇదేవరస ఇడ్లీ తిందామనుకున్న రోజున పచ్చడి చెయ్యటానికి శనగ పిండి వుండదు శనగపిండి పచ్చడిలేకుండా ఇడ్లీ తినటమేమిటి? ఉప్మా తిందామనిపించిన నాడు కరేపాకుండదు ఏ సినిమాకో వెళదామనుకున్న రోజున డబ్బులుండవు

అసలు ఇదే ఒక మంచి కథ అవుతుంది 'కలిగి ఖర్మం, లేక దరిద్రం' అనే పేరు ఆకర్షవంతంగా ఉంటుంది నువు కథలకి పేర్లు బాగా పెడతావోయ్ అని ఒక మిత్రుడు అభినందించాడు నీ కథలో సొగసంతా పేరులోనే ఉంది అని మెచ్చుకునే ధోరణిలో ఆక్షేపించిన వాళ్ళు కూడా ఉన్నారు కష్టపడి కథరాస్తూ మంచి పేరు పెట్టుకోరూ? సీతాఫలం పండు మాగాయి టెంక అరబ్బీగుర్రం అని కథలకు పేర్లు పెట్టుకోవటం దేనికీ?

అయినా ఒకళ్లగొడవ నాకెందుకు? కలిగి ఖర్మం, లేక దరిద్రం అన్న పేరు బాగానే ఉండి ఉంటుంది కథ వాస్తవికతే కావాలంటున్నారు కూడా కాని ఒక్కటితెలిస్తే బాగుణ్ణు మా ఇంట్లో ఎప్పుడూ అవసరానికి ఏ వస్తువూ ఎందుకుండదో మతిమరుపా అశ్రద్ధా, ముందాలోచన లేక పోవడమా, బతకటం చేతకాకపోవటమా, జాతక ప్రభావమా ఏమిటి? అదేదో తేలితేగాని కథకుదరదు మరి మా కొంపలో ఈ అన్ని కారణాలూ కనిపిస్తయ్ కథలో అట్లా కుదరదు పాత్రల అనుభవాలకు వాళ్ళ చిత్తవృత్తులే కారణంగా ఉండాలి

ఒకపనిచేస్తాం ఒక బీదకుటుంబాన్ని తీసుకుందాం అందరికీ ఏవో కోరికలుంటాయి గద అవి తీరటానికి దారిద్ర్యం అడ్డొస్తుంది అయిదారు ఉదాహరణలు తీసుకోవచ్చు ఇంతలో రోజులు మారతై నాలుగు డబ్బులు కళ్ళ బడతై కాని వాళ్లు తమ కోరికలు తీర్చు కోరు డబ్బు వెనకేస్తారు అదివరకల్లా అవేవీ లేకుండా గడుపుకున్నాం కదూ? మరికొంత కాలం ఆ స్థితిలో ఉన్నామనుకుంటే కొంతధనం చేర్చవచ్చు అనుకుంటారు ఒక్కొక్క వందే పోగుచేసి రెండువేలు మూడువేలో పోగుచేస్తారనుకుందా ఇందుకుగాను వాళ్ళు వెనకటికన్నా మరింత దరిద్రంగా జీవిస్తారు ఈ డబ్బంతా ఎవరికో పెద్ద వడ్డీ మీద అప్పిచ్చేస్తారు వాళ్ళు కాస్తా దివాళా ఎత్తుతారు ఈలోపల వాళ్ళు రాబడికూడా పోతుంది కథ బాగానే ఉండేటట్లుంది తాపీగా రాసుకుపోవాలి ఏదీ? టైమెంతా? అరె, ఆఫీసుకు టైమయిందే ఇంకేం? సిగిరెట్టు పెట్టెకూడా ఖాళీ కానే అయింది ఇంక రాసేదేవిటి? ఇదిగో, నిన్నే వడ్డించూ ఆఫీసు వేళ అయిందీ

*తెలుగు స్వతంత్ర వారపత్రిక 22-2-1957*

# 16. సాహిత్య రచనకు అనుబంధాలు

విద్యార్థులే దేశం యొక్క భవిష్యత్తు సంతకము కూడా సరిగా చేయలేని నిరక్షరులు వాణిజ్యములోనూ, పరిశ్రమలోనూ, ఆఖరుకు రాజకీయ రంగాల్లోనూ గొప్పపాత్రలు నిర్వహిస్తూ ఉండటము మనము ఈనాడు కూడా అక్కడక్కడ చూస్తూ ఉన్నప్పటికీ, దాన్ని గురించి గొప్పగా చెప్పుకునేటందుకు లేదు వర్తమాన సమాజంలో విద్యావంతులే అన్ని రంగాల్లోనూ కీలకస్థానాల నధిష్టించాలి ఇకముందు ఈ దేశంలో అలాగే జరుగుతుంది కూడా

అందుచేత భావినాయకులూ, ఇంజనీర్లూ, పరిశోధకులూ, ఇతర సంఘ నిర్మాతలూ, కళాకారులూ విద్యార్థులనుంచే వస్తారు రచయితలు కూడాను కొందరు వ్యక్తులు విద్యార్థులుగా ఉండగానే రచనలు సాగించారు, కొందరు పేరు తెచ్చుకున్నారు

చాలా మందికి మటుకు రాయాలనే ఉబలాటం ఉంటుంది రాయటానికి యత్నిస్తారు కాని విజయం సాధించలేక నిరుత్సాహం పొందుతారు ఒక్కొక్కప్పుడు ఈ నిరుత్సాహం వారిని రచనకు విముఖులుగా కూడా చేయవచ్చు ఇది చాలా శోచనీయం భావిరచయితలు తమ విద్యార్థి దశలోనే తొలిరచనలు చెయ్యటము స్వాభావికమూ, వాంఛనీయము కూడా

అయితే తమ ప్రయత్నాలు ఫలించక నిరుత్సాహపడే విద్యార్థుల కోసం కొన్ని విషయాలు స్పష్టం చెయదలిచాను

రచన విజయవంతం కావాలంటే - కనీసం మంచి రచయిత కావటానికి పునాది ఏర్పడాలంటే - కొన్ని విషయాలు పాటించాలి

అందులో మొట్టమొదటిది భాష రచయితకు కలం యెటువంటిదో, రచనకు భాష అటువంటిది-సాధనం భాషమీద కొంత అధికారం లేక రచన సాగించటం సాధ్యం కాదు

నిజానికి మాతృ భాషమీద ప్రతివాడికి సులువుగానే అధికారంలభించవచ్చు కాని మనదేశంలో ఇది సులభసాధ్యం కాని పని అయికూర్చున్నది దీని కారణమేమంటే మనకు మనోవికాసం చేకూరుస్తూ వచ్చిన భాషలు ఇతర భాషలే ముఖ్యంగా ఇంగ్లీషు, తరువాత హిందీ ఈనాడు కూడా మనిషి విద్యావంతుడు కావటమంటే ఇంగ్లీషు సంస్కృతిని అలవరుచుకోవటమే అవుతుంది ఈ శతాబ్దంలో వచ్చిన రచయితలు దాదాపు అందరూ ఇంగ్లీషు భాషలో తమకు అందిన సాహిత్యాన్ని చదివి దాని ప్రభావానికి గురి అయినవారే వారి భాషలో తమకు అందిన సాహిత్యాన్ని చదివి దాని ప్రభావానికి గురి అయినవారే వారి భాషలో ఇంగ్లీషు నుడికారం అక్కడక్కడా కనిపిస్తూనే వుంటుంది వీరేశలింగం గారి వంటి పండితుడు కూడా తన స్వీయ చరిత్రలో ఒకచోట "వీరిని గురించి ఒకటి కన్న ఎక్కువసార్లు చెప్పియుంటిని" అని రాశాడు! ఇక ఇతరులమాట చెప్పనే అక్కరలేదు ఇలాగే హిందీ భాష తాలూకు నుడికారాన్ని గూడా తెలుగులోనికి దించుతున్న వాళ్ళున్నారు

విజాతీయమైన నుడికారంగల భాషలో రచించే గ్రంధాలు ఇతర భాషలు రానివారికి పట్టవు జన సామాన్యం వాటిని చదవలేరుకూడా

భాషకు ఒక నుడికారమేగాక ఇతర లక్షణాలు గూడా ఉండాలి పల్లెటూళ్ళల్లో ఉండే జనం నిత్య జీవితంలో వాడే ప్రయోగాలూ, పదజాలమూ తెలియని "పేరుపడ్డ" రచయితలం చాలామందిమి ఉన్నాం ఈ లోపం రానురాను సర్దుకుంటుందని నేను ఒకప్పుడు ఆశించాను కాని అటువంటి లక్షణాలు ఏవీ ఇంత వరకు పొడగట్టటంలేదు పైపెచ్చు ఈనాటి యువకులు రాసే భాష బొత్తిగా పేలవంగా దుష్టంగా కూడా ఉంటున్నది

అందుచేత భావిరచయితలు ఇంగ్లీషు గ్రంధాలతో బాటు తెలుగు గ్రంధాలు కూడా చదవటం చాలా అవసరం "ఇతరుల భావాలను అరువు తెచ్చుకున్నంత మాత్రాన లాభం లేదు వాటిని స్వంతం చేసుకోవాలి!" అంటాం "స్వంతం" చేసుకున్నట్టు దాఖలా భాషలోనే కనిపిస్తుంది ఒక యెల్లయ్య వ్యక్తం చేసిన భావాన్ని మరొక పుల్లయ్య తన "స్వంత" భాషలో చెప్పగలినప్పుడే ఆ భావం పుల్లయ్య దవుతుంది విద్యార్థికి పాఠం వంటబట్టినదీ లేనిదీ చూడటానికి ఉపాధ్యాయుడు "నీ స్వంత భాషలో చెప్పు" అంటాడు పుస్తకంలో ఉన్న

భాష నప్పగించడానికి పుస్తకములో ఉండే విషయాలు ఏ మాత్రమూ అర్థం కానవసరం లేదు 'భట్టీయం వేసిన'' వేదం అర్థం కానవసరం లేదు!

ఇతర జాతుల సంస్కృతి అయినా అంతే మనం ఈనాడు పాశ్చాత్యుల నుంచి నేర్చుకోవలసిన విషయాలూ, స్వీకరించదగిన భావాలు బోలెడున్నాయి కాని అవి మన ''స్వంతం'' కావాలంటే మన భాషలోకి రావాలి! లేకపోతే అవి జీర్ణమయినట్లు కాదు

ఇక రెండవ విషయమేమిటంటే, ఇతర వృత్తులలోనూ, వ్యాపకాలలోనూ పరిశ్రమ చేసే వారిలాగే రచయిత కూడా ఒక 'స్పెషలిస్టు'' స్పెషలిస్టయిన వాడు తనకు సంబంధించిన విషయములో ఇతరులకు లేని జ్ఞానాన్ని ప్రదర్శించి, ఇతరులు గ్రహించలేని సత్యాన్ని గ్రహించగలుగుతాడు స్టెతోస్కోప్ తీసుకొని మనం కూడా ఇతరులను పరీక్షించవచ్చు కాని డాక్టరుకే నిజం తెలుస్తుంది అతను స్పెషలిస్ట్ గుండెకాయా, ఊపిరితిత్తులూ ఆరోగ్యంగా ఉంటే ఎలా వినిపిస్తుందో అతనికి తెలుసు స్టెతస్కోప్ సహాయంతో వినేటప్పుడు కొత్త చప్పుడు ఏమాత్రం వినిపించినా అతను వెంటనే ''రియాక్ట్'' అవుతాడు

రచయిత కూడా సమాజం విషయంలో ఒక విధమైన స్పెషలిస్టుగా తయారుకావాలి డాక్టర్లను తయారుచేయటానికి కాలేజీలున్నాయి రచయితలు స్వయం కృషి చెయ్యాలి '' ఒకడి జోలిసొంటే మనకెందుకు? మన మానాన మనం బ్రతుకుదాం!'' అనుకునే వాడు బతకనేర్చినవాడు అయితే కావచ్చు గాని రచయిత మాత్రం కాలేడు '' ఈ సమాజం నాది ఇందులో జరిగే దుష్పరిణామాలన్నీ నన్ను బాధిస్తాయి వాటిని నేను చూసీచూడనట్టు పోనివ్వలేను!'' అనే వైఖరి అవలంబించిన వాడే ఏనాటికైనా రచయిత అవుతాడు

అయితే ఇటువంటి వైఖరి రాజకీయవాదికి గూడా ఉంటుంది కాని రాజకీయవాది చైతన్యము మరొక విధంగా ఉంటుంది రచయితది కళాకారుడి చైతన్యం రాజకీయవేత్త కార్యసామాజిక జీవితంలో ఏయే మార్పులు తీసుకురావటానికి కృషిచేస్తాడో, తదనుగుణమైన మానసిక పరివర్తన మనుష్యుల హృదయాలలో కలిగించటానికి రచయిత కృషిచేస్తాడు

అందుచేత రచయితలూ, రాజకీయవేత్తలు వేరువేరు ప్రపంచాలలో ఉండటం అంత వాంఛనీయం కాదు మానవ చరిత్రలో సాహిత్యమూ, రాజకీయాలూ చేతులు కలిసిన నిదర్శనాలు వాలా కనిపిస్తాయి భారతం పదిహేను పర్వాలు రాసిన తిక్కన రాజకీయ రంగంలో గూడా కృషి జేశాడు సమాజంలో చైతన్యం తరిగి, సంఘం వెర్రెలువిచ్చినప్పుడు, వివిధ సామాజిక రంగాల మధ్య ఏకత్వం లేకుండా పోయి ''ఎవరికి వారే యమునా తీరే'' అవుతుంది కాని అది ఆదర్శం కాదు

విద్యార్థులకు రాజకీయాలు పనికిరావనే మాటలో కొంచెము కూడా అర్థం ఉన్నట్టు కనబడదు వారికి కళావ్యాసంగమూ, రాజకీయ - వ్యాసంగమూ కూడా ఉండవలసిందే దేశం యొక్క రాజకీయ భవిష్యత్తుకూ, భావి సంస్కృతికి పునాది విద్యార్థి లోకం లోనే ఏర్పడాలని నా నమ్మకం

*ముద్రణ తెలుగు విద్యార్థి, మాసపత్రిక, జూలై 1957*

# 17. సజీవ రచన

రచనలో ఉండే భాషను, భావాన్ని విడదీయడానికి వీలు లేకపోయినప్పటికి భావాన్ని గురించి విడివిడిగా చర్చించుకొనేందుకు మనకవకాశం ఉంది మనమిప్పుడు మాట్లాడుకునేది కేవలము రచనా సామగ్రిని గురించి కాదు కనుక సజీవ రచనకు పనికివచ్చే భాషను గురించీ, భావాలను గురించీ చర్చించుకొందాము సజీవరచనకు, సజీవ భాష, సజీవ భావము అవసరమని నేను యింతకుముందు చెప్పాను ఏది సజీవ భాష, ఏవి సజీవ భావాలు అనేదాన్ని గురించి మనమిప్పుడు ఆలోచించాలి ప్రభాకరశాస్త్రిగారు ఏమంటారో॰

- ప్రజలకు భావాలను సమగ్రంగా అందించి, ఆ భావాలకనుగుణమైన మానసిక చైతన్యాన్ని రేకెత్తించేది సజీవమైన భాష, అటువంటి భాషలోనే ఒక విధమైన తియ్యదనమూ, నుడికారపు సొంపు ఉంటాయి లోకోక్తులు వగైరాలు అటువంటి భాషలోనే ప్రకటిస్తారు సజీవమైన భావాలను గురించి ఒక ముక్క ప్రజల భావాలు వారి వారి కష్టసుఖాల ద్వారా ఏర్పడుతూ ఉంటాయి వీటన్నింటినీ కలిగి, ఈ అన్నింటిలోను అభ్యుదయం కలిగిస్తూ ప్రజాజీవితానికి వికాసం చేకూర్చేదే సజీవమైన భావం

- సజీవ రచనలు సాగడానికి నా దృష్టిలో ఈ అంతరాయాలు కన్పిస్తున్నాయి ఒకటి యితర భాషా సంపర్కం వల్ల జాతీయ భాషా భావాలలో నశించిపోతాయని నా అభిప్రాయం కాదు కాని ఈ సంపర్కం ప్రజా జీవితంలో కలిగే ప్రవర్తనకు అనుగుణంగా జరగలేదు ఒక వంక జీవితంలో ఉన్న సంస్కృతికీ, మరోవంక సాహిత్యంలో ఉన్న సంస్కృతికీ మధ్య అగాధం ఏర్పడింది వ్యక్తి స్వార్థాలకి, సంఘ క్షేమానికి సామరస్యం లేకుండాపోయింది మన దేశాన్ని యింతకాలమూ బాధించిన దాస్యం ఈ స్వాతంత్ర్యాన్ని రచయితలు ఉపయోగించుకునే స్థితిలో ఉండాలి అంటే, నా అభిప్రాయం - వారి జీవితాన్నీ, జీవిత సమస్యలనూ సాంఘిక పరిణామాన్నీ సంపూర్ణంగా అవగాహన చేసుకోవాలి జీవితం వారికి కరతలామలకంగా ఉండాలి ఆపైన, నిష్పాక్షిక బుద్ధితో రచయిత సంఘం యొక్క ఉమ్మడి మంచి కోసం కృషి చేసే విశాల హృదయమూ, సంస్కారమూ గల వాడై ఉండాలి స్వార్థం కొరకు అల్పసంఖ్యాక వర్గాలను సమర్థించరాదు రచయితలకు ప్రజల జీవితం మీదా, దేశభాషల మీదా ఆదరాభిమానాలుండాలి జీవితాన్నీ, జీవిత సమస్యలనూ, ప్రజల దుస్థితిని చూసి ఏవగించుకుని పలాయనం చేసే రచయిత సజీవ రచనలు చేయలేడు మూలంగా ఈ సమస్య మరింత క్లిష్టమైంది సామాజిక సమస్యల పరిష్కారానికి రాజకీయ ప్రతిబంధకాలు హెచ్చినకొద్దీ సజీవ రచన వెనుకబడింది గ్రాంథిక భాషావాదం కూడా సజీవ రచనలకు అవకాశం లేకుండా చేసింది వ్యావహారిక భాషావాదాన్ని ప్రచారం చేసిన గిడుగు రామమూర్తిపంతులుగారు సజీవ రచనలకు గొప్ప దోహదం చేశారు ఈనాడు ప్రజలను కదిలించే రచనలన్నీ వ్యావహారిక భాషలోనే వెలువడడం మనం చూస్తున్నాం ఇప్పటికీ మన విశ్వవిద్యాలయాలు వ్యావహారిక భాషను నిషేధించడం శోచనీయం

ఇకముందు సజీవ రచనలు విరివిగా రావాలంటే రావలసిన మార్పులు చాలా ఉన్నాయి అందులోకల్లా అతి ముఖ్యమయినది స్వాతంత్ర్యం వచ్చింది కాని భావస్వాతంత్ర్యం వచ్చినట్టు

కనపడదు రెండో విషయమేమిటంటే రచయితలకు భావస్వాతంత్ర్యం ఉన్నంత మాత్రాన సజీవ రచనలు రావడానికి మార్గం ఏర్పడదు

*రేడియో ప్రసారితం*
*ముద్రణ వాణి 1959 ఫిబ్రవరి 1-15*

*సర్వధారి సంవత్సరం (1959) ఉగాది, రేడియో వాళ్ళు ఏర్పాటు చేసిన కవి సమ్మేళనంలో బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షతన తల్లావఝుల శివశంకరశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి, జి వి కృష్ణారావు, నార్ల వెంకటేశ్వరరావు, కొడవటిగంటి కుటుంబరావు, శ్రీశ్రీ ఆ చర్చలో పాల్గొన్నారు వైది కొడవటిగంటి మాట్లాడిన భాగం మాత్రమే*

# 18. ఉత్తమ నవలా రచనకు కావలసిన కనీసపు హంగులూ, అవకాశాలు

ముందుగానే ఒక్క విషయం స్పష్టం చెయ్యాలి నవలలు ఎల్లా వ్రాయాలో తెలియని వాళ్ళకు చెప్పటం కోసం ఈ వ్యాసం వ్రాయటంలేదు ఈ నాడు తెలుగులో నవలలు రాయటానికి ఉన్న అవాంతరాలలో నన్ను ఎదుర్కొనే వాటిని వివరించటమే నా ఉద్దేశం నా చిక్కులే ఇతరులకు ఉండి ఉంటాయి ఈ చిక్కులలో హెచ్చుభాగం పరిష్కరించటం ఏ ఒకరి చేతిలోనూ ఉన్నట్టు నాకు కనిపించటంలేదు మన నవలా సాహిత్యం గురించి విమర్శించే వారు కూడా నేను మనవి చేయబోయే విషయాలను మనసులో ఉంచుకోవటం అవసరం

**శిల్పమూ – చిన్నకథా –**

శిల్పం దృష్ట్యా చూస్తే చిన్న కథ లాంటి ప్రతిభా సంపన్నమైన సాహిత్యరూపం కాకపోయినప్పటికీ, నవల చిన్న కథ కంటే హెచ్చు ప్రయోజనంతో కూడుకున్నదీ, రచయిత యొక్క జీవితానుభావాన్ని హెచ్చుగా ప్రతిబింబించేదీనూ చిన్న కథలు ఫోటోగ్రాపులు అయితే, నవల సినిమా చిత్రం లాంటిది వృద్ధాప్యంలో ఉన్న వాళ్లు చిన్న కథల జోలికి పోరాదు మీసకట్టురాని వాళ్లు నవలల ఛాయలకు రారాదు ఎక్కడైనా ఒక నార్మన్ మేలర్ ఎంటి యువకుడు ''ది నేకెడ్ అండ్ ది డెల్'' వంటి ప్రగాఢమైన నవల రాసినట్టయితే దాని వెనుక ప్రగాఢమైన యుద్ధానుభవం లాటిది ఉండనే ఉన్నది

**నవలా రచన –**

చిన్న కథ చక్కగా రాయటానికి ఒక కలమూ, కొన్ని కాగితాలూ చాలును కథకు కావలసిన ''పిండి '' బుర్రలోనుంచి వస్తుంది నవల - నిజంగా మంచి నవల - అంత సులువుగా ''అల్లేది'' కాదు చల్ల చిలికి వెన్న తీసినట్టుగా జీవితాన్ని మధించి నవలను తయారు చేయాలి నవల సమిష్టి జీవితంలో ఒక శకలాన్నయినా సమగ్రంగా చిత్రించాలి అందుకు తగిన వాతావరణమూ, జరిగిన ''చరితా'' అందులోకి రావాలి నవల రాసే వాడు వివరణ సేకరణ కోసం ఎంతో తిరగవలసి రావచ్చు ఎన్నో పాత పత్రికలు తిరగ వేయవలసి రావచ్చు

ఈనాడు విదేశాలలో వెలువడే ఉత్తమ నవలలు చూచినట్లయితే, నవల రాసిన వ్యక్తి సాంఘిక ప్రాముఖ్యంగల సంఘటనలను తీసుకోవటమే కాకుండా, వాటివెంట తాను స్వయంగా ఉండి సమర్థుడైన రిపోర్టరు లాగా వాటిని లిఖించాడన్న భావం కలుగుతుంది నేను ఇటీవల చదివిన పదిహేన్నెండు నవలలలో మంచివన్నీ ఇలాంటి భావాన్నే కలిగించేవే నిజానికి అట్లా రాసిన వాటికి ప్రాశస్త్యం ఉంటుంది

**ఎంతకీ అయిపోని పెద్దకథ –**

ఒకభార్య, ఒక భర్తా, పిల్లల్లూ మాత్రమే తీసుకొని ఆరువందల పేజీల కథ రాయవచ్చు అందులో వాళ్ళ జీవితమే తప్ప సంఘ జీవితం ప్రతిబింబించక పోతే అది మంచిరకం నవల కాదు చాలా నవలలు ఇదే ధోరణిలో- ఎంతకీ అయిపోని చిన్న కథలాగా - ఉన్నందుకు ఒకరు ఆక్షేపించారు ఆయన ఆక్షేపణ సమర్థనీయమైనది కాని నిజమైన నవలలుగా భావించేవి తెలుగులో ఎన్ని వచ్చాయి అంటే నాకూ తెలియదు నామాటకు నేను ఒక్కటి కూడా రాయిలేదు

చాలామంది ఇతరుల లాగే నేను కూడా నవల రాస్తున్న మొహం పెట్టి జీసితాన్ని పైపైన గోలుకుతున్నాను ''అరుణోదయం'' లాగా నాకు కరతలామలకంగా ఉండే అంశాలను తీసుకురాసినప్పుడు దానిని కేవలం నాతలలో నుంచే పేనటం అంతలో పట్టెయ్యక పోవచ్చు ఒక్కొక్కసారి పాత్రల చిత్రణ ఆకర్షవంతంగా కుదిరితే కూడా పాఠకుడు నవలలో ''లోటు'' లేక పోవటం గమనించడు

**నవలపై సాంఘిక ప్రభావము –**

నేను పుట్టినాక గడిచిన యాభై ఏళ్ళ కాలంలోనూ సంఘం ఎంతో మార్పులు చెందింది రెండు ప్రపంచయుద్ధాలూ, ఒక ఆర్థిక కాటంకమూ, అంతులేని రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక ఉద్యమాలూ, ఇతర జీవిత సంఘర్షణలూ జరిగాయి వీటిలో ఏ ఒకదాని ప్రభావం గాని సంఘంలోని వివిధ వర్గాలపైన ఏవిధంగా ప్రసరించినదీ దక్షతతో చిత్రించిన ఒక్క నవలకూడా నేను చదవలేదు యాభై ఏళ్ళలో వచ్చిన చిన్న కథలను ఎవరైనా చక్కగా ఎడిట్ చేస్తే ఈ యాభై ఏళ్ళ జీవితం తాలూకు '' ఆల్బం'' తయారు కావచ్చునేమోగాని, నవలలను ఎడిట్ చేసి తెలుగుదేశపు సాంఘిక చరిత్రను తయారు చేయటం సాధ్యంకాదని నా అనుమానం ఈనా అనుమానం నిరాధారమైతే ఎంతో బాగుండును!

**నవలా రచనకు కావలసిన అవకాశాలు –**

ఏమైనా నా ఉద్దేశ్యంలో విచారణీయమైనది - మంచి నవలలు రాకపోవటం కాదు - వచ్చే అవకాశాలు లేకపోవటం అవకాశాలు ఎందుకు లేవో నాకు తోచినంత వరకు చెబుతాను

1 జీవితాన్ని లోతుగా తరచి ఉత్తమ రచన అనిపించే లాగా నవల రాయాలంటే కొన్ని మాసాలూ, ఒక్కొక్క సారి ఒకటి రెండు సంవత్సరాలూ కూడా పట్టవచ్చును విషయ సేకరణ కోసం రచయిత కొన్ని ప్రయాణాలు చేయవలసి రావచ్చు కొంత డబ్బు ఖర్చు కావచ్చు

పాశ్చాత్య రచయితల లాగే ఒక నవలను ఆఫ్రికా వాతావరణం లోనూ మరొకటి జపాను వాతావరణంలోనూ మన వాళ్ళు కూడా రాయాలని నేను అనుకోవడంలేదు కాని తన పాత్రలను ఊటీకి, సిమ్లాకూ, బొంబాయికీ, కలకత్తాకూ పంప నిర్ణయించుకున్న రచయిత కనీసం ఆ ఊళ్ళన్నా చూడాలికదా! నా ఉద్దేశంలో నవల రాసేవాడు కూపస్థమండూకంలాగ

ఉండి లాభం లేదు, తనకు తెలిసినదాని కన్నా తక్కువ రాసేవాడి రచనే ఎప్పటికైనా నిండుగా ఉంటుంది

రాజకీయంతో సంబంధంలేని నవల రాసేవాడు కూడా రాష్ట్ర, కేంద్ర రాజకీయవాతావరణం ఎరిగి ఉండటంలో లాభం ఉన్నది నవలలు రాయిదలిచినవాడి అనుభవానికి పరిమితి అంటే ఏమీ లేదు ఉన్న ఊళ్ళోలోనే కూర్చున్న వాడికి తన ఊళ్ళోవాళ్ళు కనిపించే దానికీ, దేశం తిరిగిన వాడికి అదే మనుషులు కనిపించే దానికి చాలా వ్యత్యాసం ఉంది

ఇంతకూ ఈ సందర్భంలో నేను చెప్ప దలచినది ఏమంటే, ఏ మాస్టారో, ప్లీడరో, డాక్టరో పత్రికలకు అంటుకుపోయిన 'జర్నలిస్టో' 'హాబీ' గా నవల రాస్తే ఆ నవలలో ''లోయ''లోపిస్తుంది నవలలు రాయటం ఒక వృత్తి వృత్తిగా నవలలు రాయటానికి ఏమాత్రం అవకాశం ఉన్నా నేను ఆవృత్తిలో ప్రవేశించటానికి చాలా సార్లు అవకాశం ఎచ్చింది కాని లటువంటి అవకాశంలేదు ఎందుకంటే-

2 నవలలు రాసి ఎట్లా బతకటం? మిగిలిన వాళ్ళ అనుభవం నాకు అంతగా తెలియదు కాని, నా అనుభవంలో నవల రాసిన శ్రమకు వెంటనే ప్రతిఫలం రావాలంటే దాన్ని ఏ పత్రికలోనైనా సీరియల్‌గా ప్రయత్నించుకొనటం ఈ విధంగా నేను నా నవలలు '' సీరియలైజ్'' చేసుకు పుచ్చుకొన్న మొత్తాలు యాభై రూపాయలు మొదలుకొని కొన్ని వంద రూపాయల దాకా ఉన్నై ఎన్నడూ వంద దాటలేదు జీవితాన్ని పైపైన గోకి కూడా నేను ఏడాదికి పన్నెండు నవలలు రాయగలను అనుకోను ఒకవేళ రాసినా నా ఒక్కడి నవలలే ఏడాదికి పన్నెండు సీరియలైజ్ అవుతాయి అనుకోను ఒకవేళ అయినా ఆ వచ్చే డబ్బుతోనే నాకుటుంబాన్ని పోషించడం నాకు సాధ్యం కాదు

3 పుస్తకాలుగా వేయిస్తే? వేయించవచ్చు పుస్తకాలు ప్రచురించేవారు, డబ్బు న్యాయంగా ఇస్తారే అనుకున్నా పుస్తకం ఖరీదు నూరింట పదివంతులిస్తారు అంటే రూపాయి ఖరీదు గల నవల వెయ్యికాపీలు వేస్తే రచయితకు నూరు రూపాయలు ముడుతుంది పేజీకి రూపాయి అనే లెక్క ఒకటి కూడా ఉంది ఈ లెక్కన కూడా నూరు పేజీల నవల రాసిన వాడికొక నూరు రూపాయలు గిట్టుతుంది ఆ నవల రెండో ముద్రణ మంటే ఉంటే ఉన్నప్పుడు మళ్ళీ ఎంత ముట్టేదీ ఆ తరువాత చూసుకోవాలి!

**సొంతగా పుస్తకాలు వేసుకోవడం - –**

కొందరు ఉత్సాహవంతులు సొంతానా పుస్తకాలు వేసుకుంటారు సొంతాన పుస్తకాలు వేసుకోవటం సరదాకైతే ఎవరూ ఏమీ చెప్పేది లేదు అది వ్యాపార మని ఎవరన్నా అనుకుంటా అది చాలా పెద్ద అపోహ పుస్తక ప్రచురణ వ్యాపారంలో ఎన్ని చిరుగుళ్ళున్నాయంటే అది పెద్ద విద్య, ఒక వృత్తి - హాబీగా సాధ్యమయేది కాదు

ఈ పరిస్థితులన్నీ యీ విధంగా ఉండగా తెలుగులో మహత్తరమైన నవలలు ఇతర భాషలలోకి అనువదించ బడి రచయితకు దేశాంతర ఖ్యాతిని తీసుకు రాగలవి, రావటం దురూహ్యం

నవలలవల్ల రాబడి –

బెంగాలీలోనూ, హిందీలోనూ నవలకు మంచి డబ్బు ఇస్తారట! పత్రికలలో సీరియలైజ్ అయినప్పుడు కూడా బాగా డబ్బిస్తారుట! తమిళ పత్రికలు మంచి నవలలకు వెయ్యి, రెండువేలూ ఇస్తారని చెబుతున్నారు తెలుగుదేశంలో అటువంటి తాహతుగల పుస్తక ప్రచురణ సంస్థలుగాని, పత్రికలు గాని లేవు వాటిలో రచయితకు స్వతహాగా గల శక్తిసామర్థ్యాలు చూసి బాగున్నదని నలుగురూ అనుకోవడం జరుగుతున్నదేగాని సృష్టికావటానికి తగిన పరిస్థితులు కనుచూపుమేరలో ఎక్కడా లేవు

*ముద్రణ కృష్ణా పత్రిక, వారపత్రిక, 11-6-1961*

## 19. ఆనాటి కథా సాహిత్యం

కృష్ణా పత్రికకింకా రెండుదశకాలు నిండీ నిండని రోజుల్లో నేను ఆధునిక కథలు చదవటం ఆరంభించాను (నేను కృష్ణా పత్రిక కంటే ఏడేళ్లు చిన్న) నేను చదివిన "సాహితి" పత్రిక రెండు నెలలకొకసారి వెలువడుతూ ఉండిన కథలు బహుకొద్ది కథలు, బహుకొద్దిమంది కథకులు - చింతా దీక్షితులుగారు మా అన్న వెంకట సుబ్బయ్యగారు, నర్సుల బాబూరావుగారు, మొదలైనవారు అప్పటికి నేను చదివిన పాతకాలపు కథయినాడా కొద్దే కావటంచేత ఆ కొద్ది కథలే నాకు ఆధునిక కథయొక్క స్వభావాన్ని విశదపరిచాయి ఒక యువకుడు తన సర్వస్వమూ అర్బత్ నాట్ కంపెనీలో పోయినట్టు నటించి, పనిపాటులు చాతకాని తన భార్యకు పనులు చెయ్యటం నేర్పుతాడు ఒక గ్రామంలో ఉండే పెద్దలు ఒక గ్రామస్థుడి భార్యను ఒవర్సీరుగారికి తారుస్తారు! ఒక హాస్టల్‌లో ఉండే విద్యార్థులు తమలో ఒకడికి ఆడవేషం వేసి హాస్టల్ వార్డెన్‌ను "ఏప్రిల్ ఫూల్" చేస్తారు విదేశీ వస్త్రదహనం జరుగుతుండిన రోజులు తన స్నేహితులందరూ కలసి తాను కట్టుకున్న మల్లుపంచెను ఊడలాగేసినట్టు ఒక కథకుడికి కల వస్తుంది ఈ శ్రేణి కథల్లో నాకు అమోఘంగా కనిపించినది దీక్షితులుగారి "సాహితికి కథ" ఇది కథ రాయటం గురించి కథ ఈ కథతో నా చిన్న కథ పరిచయం ఒక మెట్టు పైకెక్కినది

"భారతి" రావటంతో కథా ప్రపంచం మరింత విశాలమయింది అనేక మంది కథకులు, అనేక రకాల ఇతివృత్తాలు భారతి ఒక్కొక్క సంచికే చదువుకు పోతూంటే సాహిత్య సముద్రంలోకి ప్రయాణం చేసి వెళుతున్నట్టుండేది అభిమాన కథకులంటూ ఏర్పడ్డారు పూడిపెద్ది వెంకటరమణయ్యగారి కథననైపుణ్యమూ, సౌలభ్యమూ, వేలూరి శివరామశాస్త్రిగారి హుందా, శిల్పంలో బిగువూ, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి అనుపమమైన, తియ్యనిభాష, ఆత్మీయతా - ఈవిధంగా, ఇతివృత్తానికి భిన్నమైన అంశాలు నా తలకు పట్టసాగాయి కథల చాటున ఉండే కథకుడి వ్యక్తిత్వం కూడా నన్ను ఆకర్షించసాగింది రాయసం వెంకటశివుడుగారు ముందు తరానికి అవసరమైన యువకులను తయారుచెయ్యటానికి పనికివచ్చే మేష్టరుగా నాకు స్ఫురించేవారు ఆయన కథలు భవిష్యత్తుకేసి చూస్తున్నట్లుండేవి

తెలుగు కథల ప్రభావం వెనకగా ఇంగ్లీషు కథల ప్రభావం వచ్చింది ముఖ్యంగా ''స్ట్రాండ్‌మాగ్‌జీన్'' దీన్ని నేను దాదాపు విడవకుండా అనేక సంవత్సరాలపాటు చదివాను అందులో సర్ ఆర్థర్ కొనన్‌డాయిల్, పి జి వుడ్‌హౌస్, డెనిస్ మాకేల్, ఫిల్ప్స్ ఒపెన్‌హామ్ మొదలైన కథకులు అనేకమంది ఆధునిక కథా రచనలు చేసేవారు కథాశిల్పం నిర్దుష్టంగా ఉండేది ఇతివృత్తాలలో అంతులేని వైవిధ్యం ఉండేది ''సాహిత్యపు విలువలు'' అనేది పాటించకుండా అన్నీ చదివి ఆనందించే వాణ్ణి

''సాహిత్యం'' అనేది మనసులో లేకుండానే నేను కథారచన లోకి దిగానుకూడా నాకు కావలసిన కథలు పత్రికాముఖాన చదవటంమానేసి కథా సంపుటాలు - హెచ్చుగా ఇంగ్లీషునే - చదవటం ప్రారంభించినమీదట, ''స్ట్రాండ్''లో చదివినవన్నీ ''సాహిత్య గౌరవం'' కలవేనా అన్న సందేహం నాలో తలెత్తింది టాల్‌స్టాయి ''23 కథలు'' లో ఒకటైనా ''స్ట్రాండ్'' ప్రకటించి ఉండేదా? అసంభవం

కథలు జీవితాన్ని ప్రతిబింబించటమే కాదు వ్యాఖ్యానించాలి, పాఠకుణ్ణి రంజించటంతోబాటు, మేధస్సును కూడా కదిలించాలి ఈ దృష్టితో చూస్తే తెలుగు కథాక్షేత్రంలో కొన్ని మహావృక్షాలనీ, మరికొన్ని అనుకున్నంత గొప్పవృక్షాలు కావనీ స్పష్టమయింది

కాని సరి అయిన విమర్శలేదు ఏ కథకు ఎంత సాహిత్య గౌరవం ఇవ్వాలో ఎవరు చెబుతారు? విమర్శ చెయ్యటానికి అర్హత ఏమిటి? విమర్శకు ప్రాణాలేవి చదివేవాళ్లే కథలకు సాహిత్యపు విలువలు నిర్ణయించాలనే నిర్ణయానికి వచ్చాను పత్రికల ఉప్పెనలేని ఆ రోజుల్లో ఈ నిర్ణయం సమంజసంగానే కనబడింది

ఇంతలో ''వినోదిని''కి శ్రీనివాస శిరోమణి గారు సంపాదకత్వం వహించి ''ఖులాసాకథలు'' అన్న నినాదం ఇచ్చారు ఈ నినాదం నాకు అంతగా నచ్చని మాట నిజమే, కాని ''వినోదిని'' దేశంలోని పఠితసంఖ్యను వృద్ధి చేస్తున్నది ఏ పత్రికా వెయ్యికాపీలు అమ్మని ఆ రోజుల్లో వినోదిని వేలకువేలు అమ్మసాగింది శ్రీనివాస శిరోమణి గారి ఒత్తిడివల్ల నేను కూడా అనేక నెలలపాటు ''ఖులాసా కథలు'' రాశాను

''వినోదిని'' ముమ్మరం తగ్గినాక మళ్ళీ సాహిత్యపు విలువలది పైచెయ్యి అయింది కథకులు అనేకమంది వచ్చారు కొందరు మనస్తత్వాన్నీ, జీవితాన్నీ నిశితంగా విమర్శించారు

దీనికి తోడు రాజకీయ భావాలుకూడా ప్రజలలో వ్యాప్తిచెందాయి అంతదాగా బ్రిటిషు సామ్రాజ్యం బలవత్తరమనుకున్న వాళ్లు, ఫాసిజముకు బ్రిటిషు సామ్రాజ్య వాదులు చేసేకైంకర్యం కళ్లారా చూశారు సామ్రాజ్య వాదంకన్న పెద్ద రాక్షసిగా ఫాసిజం వెలసింది రాజకీయ విజ్ఞానమూ, స్వాతంత్ర్యముకల దేశాలలో అభ్యుదయ రచయితలు ఒక ఉద్యమాన్ని లేవదీశారు ఈ ఉద్యమం ప్రపంచ యుద్ధానికి మూడేళ్లు ముందుగానే మన దేశానికి కూడా వచ్చింది ప్రేమచంద్ లాంటి సుప్రసిద్ధ రచయితలు దాన్ని బలపరిచారు

అదివరకు సాహిత్యంలో రాజకీయాలుండేవే భారతజాతీయోద్యమం ప్రభావం సాహిత్యంలో ప్రతిబింబించకపోలేదు కాని అది సాహిత్య చరిత్రలో ఒక దశగా మాత్రమే ఉండిపోయింది అభ్యుదయ రచయితలు రాజకీయ - సాంఘిక దృక్పథానికి సాహిత్యంలో

శాశ్వతమైన స్థానం కల్పించారు ప్రపంచమంతటా నాగరికతను వ్యాపింపజేసిన పెట్టుబడిదారీ సంస్కృతి ప్రజాస్వామ్యాన్ని తుడిచి పెట్టే ఫాసిస్టు శక్తులకు ఎందుకు తలవంచిందో, ప్రతి పాశ్చాత్య దేశం లోనూ ఒక్కొక్క ఫాసిస్టుకూటమి ఎందుకు తయారయిందో, చిట్టచివరకు ఫాసిజంను నిర్మూలించటానికి సోషలిస్టు శక్తులూ, ప్రజాస్వామిక శక్తులూ ఎందుకు చేతులు కలపవలసివచ్చిందో అర్థం చేసుకున్న రచయితలు సమాజపరిణామంలోగల రాజకీయ - ఆర్థిక సాంఘిక సూత్రాన్ని అందుకోగలిగారు కథారచనలో - సినిమా కథలలో కూడా - అభ్యుదయ భావాలను సరిగా అర్థం చేసుకోని వారు కూడా పాత్ర చిత్రణలో వర్గమనస్తత్వాన్ని అంతో ఇంతో చిత్రీకరిస్తున్నారు కథా సాహిత్యం ముందుకు పోతున్నది

*ముద్రణ కృష్ణా పత్రిక, వారపత్రిక ఎడ్రోల్లు సంచిక, 1962*

# 20. చిన్న నవల

కథా సాహిత్య విభాగాలలో చిన్న నవలకు (లేక నవలికకు) ఉండే ప్రాముఖ్యాన్ని రచయితలు గాని, పాఠకులు గాని తగినంతగా గుర్తించుతున్నట్టు కనబడదు విమర్శకులైనా నవలలకు నవలికలకు పెద్ద తేడా పాటిస్తున్నట్టు కనపడదు కాని అలాటి తేడా లేకపోలేదు

చిన్న కథకూ, నవలకూ కల తేడా సర్వత్రా గుర్తించ బడుతూనే ఉంది చిన్న కథలో ఒకే ఒక జీవితఘటన చిత్రించబడుతోంది పాత్ర చిత్రణ ఉంటుంది గాని అదికూడా ఒక్క ఘటనకే పరిమితమై ఉంటుంది చిన్న కథను స్నాప్ షాట్ ఫోటోతో పోల్చారు అందులో జీవితం తాలూకు కదలికలు కనబడవు పాత్రల మనస్తత్వాలలో పరిణామాలుండవు ఒకటి, రెండు సన్నివేశాలూ, పాత్రల మనస్సులలో కలిగే చైతన్యమూ ఉన్నప్పటికీ అవి పైన చెప్పినట్టు ప్రధాన ఘటనను ఆశ్రయించే ఉంటాయి ఆ ఘటన యొక్క ప్రభావం పాత్రల చిత్త వృత్తిపై ఏవిధంగా వుండేదీ చిత్రితమవుతుంది ప్రధానపాత్ర ఆశ్చర్యంతో అలానే చూస్తూ ఉండిపోవటంతోనో, ప్రియురాలు ప్రియుడి ఒడిలోకి ఒరిగి పోవటంతోనో కథ అంతమైపోతుంది .

నవలలో కదిలే జీవితం ప్రతిబింబమవుతుంది దీన్ని సినీమా చిత్రంలో పోల్చుతారు నవలలో అనేక సన్నివేశాలూ, అనేక సంఘటనలూ ఉంటాయి పాత్రల చిత్త ప్రవృత్తులే గాక వాటిలో కలిగే మార్పులూ, పాత్రలపై సంఘటనల ప్రభావంతో బాటు సంఘటనలకు పాత్రలు వహించే బాధ్యతకూడా స్పష్టంగా చిత్రితమవుతాయి జీవితం తాలూకు ''వాతావరణం''కూడా నవలలో ఉంటుంది మానవుల ఆశయాలూ, ఆశయసిద్ధికి వారు చేసే కృషి, ఆ కృషి ఏర్పడే అవాంతరాలూ, జీవిత సంఘర్షణా నవలలో విపులంగా చిత్రించటానికి వీలున్నది

ఆ కారణంచేతనే ఎన్నో కథలు చదివినప్పటికీ తెలియని జీవిత విశేషాలు ఒక్క నవలలో తెలుస్తాయి ఒక కాలానికి చెందిన నవలలన్నీ చదివేస్తే ఆ కాలపు సాంఘిక చరిత్ర చాలావరకు తెలిసి పోతుంది ఈ చరిత్ర ఏ ఒక్క నవలలోనూ సమగ్రంగా ఉండటానికి వీల్లేదు ఎందుచేతనంటే, నవలాకారుడు తనకు పరిచయం అయిన వాతావరణాన్నీ, జీవితాన్ని, పాత్రలనూ మాత్రమే సృష్టించగలడు ఉదాహరణకు నా ''చదువు'' అన్న నవలలో డిప్రెషన్‌కు

ముందు నడిచిన ఇరవై సంవత్సరాల సాంఘిక వాతావరణాన్ని చిత్రించ యత్నించాను అదే కాలాన్ని తీసుకుని మరి ఇరవైమంది ఇరవై నవలలు రాయవచ్చు అదే విధంగా నా ''గడ్డురోజులు'' డిప్రెషను కాలానికి సంబంధించిన నవల ఆ గడ్డురోజులను గురించి ఎన్ని నవలలైనా రాయవచ్చు

సాంఘిక నవలల్లాగే చారిత్రక నవలలూనూ, చారిత్రక నవలల్లో గతకాలపు వాతావరణమూ, జీవితమూ, ఆచారవ్యవహారాలూ, వ్యక్తులూ, పునరుజ్జీవనం పొందుతాయి చరిత్రకే ప్రాణం వస్తుంది ఇటీవలికాలంలో అడవి బాపిరాజుగారూ, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారూ, ఇప్పుడు నోరి నరసింహశాస్త్రిగారూ చారిత్రక నవలలు రాయటం జరిగింది, జరుగుతున్నది

చిన్న కథకూ, నవలకూ గల ఈ తేడాలు మనసులో ఉంచుకుని మనం చిన్న నవలను పరిశీలించవలసి ఉంటుంది చిన్న కథను పెంచినా నవలను కుంచించినా చిన్న నవల అవుతుందన్న భావం ఎవరికైనా ఉంటే అది సరి అయిన భావం కాదు ఇలాంటి అపోహ కలగటానికి కొన్ని కారణాలు లేకపోలేదు శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి ''వడ్లగింజలు'' మొదట చిన్న కథగా రాసి తరవాత అదే కథను చిన్న నవల రూపంలో మళ్ళీ రచించారు కాని రెండిటి స్వభావమూ ఒకటికాదు చిన్న నవలలోకి జమీందారీ సంస్కృతి, ఆనాటి వాతావరణమూ, ఆచారం వ్యవహారాలూ చక్కగా దిగివచ్చాయి వారి చిన్న కథ మనని తీసుకుపోలేని వాతావరణంలోకి చిన్న నవల తీసుకు పోగలిగింది ఇదే కథ పెద్ద నవల అయి ఉండునా అంటే అది సాధ్యం కాదు ఎందుచేతనంటే ఈ చిన్న నవలలో కూడా ప్రధాన ఘటన ఒకటే

ఇదే నవలకూ, చిన్న నవలకూ ఉండే ముఖ్యమైన తేడా అని నా అభిప్రాయం చిన్న నవలలో ప్రధాన సంఘటన ఒకటే ఉన్నప్పటికీ, ఆ సంఘటనకు కారణభూతాలైన పాత్రల చిత్తవృత్తులకూ, వాటి చుట్టూ ఉండిన వాతావరణానికీ తగినంత ప్రాముఖ్యం ఉంటుందనిపించినప్పుడు చిన్న కథ రాయడం కంటె చిన్న నవల రాయడం మంచిది పాత్రలపైన సంఘటనల ప్రభావం కన్న సంఘటనలపై పాత్రల ప్రభావం హెచ్చుగా ఉన్నట్టు చిత్రించటానికైనా చిన్న నవల బాగా ఉపకరిస్తుంది

పైన చెప్పిన ''వడ్ల గింజలు'' కథే తీసుకుందాం ఒక రాజుగారు ఒక చదరంగపు ఆటగాడితో పందెంవేసి ఆడి ఓడిపోతాడు పందెంప్రకారం చదరంగపు బల్లమీద గళ్ళన్నిటికీ రెట్టింపు వడ్లగింజలు ఇస్తూ రావలసి వచ్చేసరికి రాజుగారికి తన ఓటమి ఎలాటిదో అర్థమవుతుంది ఈ కథ చిన్న కథగా రాస్తే రాజు ప్రధాన పాత్ర అవుతాడు ఓటమి యొక్క ప్రభావం అతన్ని ఏం చేసిందో మనకు తెలుస్తుంది కాని చిన్న నవలలో శంకరప్ప ప్రధాన పాత్ర అతను పని బెట్టుకుని ఈ సంఘటనకు బీజంవేస్తాడు

మనిషి శరీరతత్వంపైన అనుక్షణమూ వాతావరణంలోని మార్పుల ప్రభావం ఉంటున్న విధంగా, మనిషి యొక్క మనస్తత్వం మీద సాంఘిక వాతావరణం యొక్క ప్రభావం ఉంటూనే ఉంటుంది ఇది బహుసున్నితమైనది కాలప్రవాహం ఈ వాతావరణాన్ని మార్చేస్తూ ఉంటుంది మనుష్యుల జీవితాలలో ఈ వాతావరణం నిర్వహించే పాత్రకు ఎంతైనా ప్రాముఖ్యం ఉన్నది

అయితే ఈ వాతావరణం చిన్న కథలలో దాదాపు ప్రతిబింబించదు అందుచేత రెండు మూడు దశాబ్దాల క్రితం రచించిన కథలు ఈనాడు చదువుతూంటే అవి మనస్సును 'స్పృశించలేవు' అంతకన్న పాత నవలలే అయినప్పటికీ అవి చదువుతూంటే మనం ఆ

వాతావరణంలోకి వెళ్ళిపోయి ఆయా పాత్రల చిత్తవృత్తులనూ, వారికి కలిగే ప్రేరణలనూ సానుభూతితో చదివి ఆనందించగలుగుతాం ఇలాంటి సౌకర్యం చిన్న నవలలో కూడా ఉంటుంది

''రీడర్స్ డైజెస్ట్'' లాటి పత్రికలలో నవలలను సంగ్రహపరిచి ప్రచురిస్తారు అంత మాత్రం చేత అవి చిన్న నవలలైపోవు నవలకుగాని, చిన్న నవలకు గాని ప్రమాణం ప్రధానం కాదు - విషయ విశ్లేషణా, రచనా విధానమూ ముఖ్యం అంతమాత్రాన రెండు పేజీలలో నవల రాయవచ్చుననీ, నూరు సంవత్సరాల కథను చిన్న నవలగా రాయవచ్చుననీ కాదు

చిన్న కథల్లోలాగే చిన్న నవలలో కాలప్రమాణం పరిమితంగా ఉండటం మంచిదని నా విశ్వాసం జీవితాన్ని వివరంగా చిత్రించే అవకాశం చిన్న నవలలో అట్టే ఉండదు కాని సాంఘిక వాతావరణాన్ని చిత్రించే అవకాశం బాగా ఉంటుంది పాత్రలను ఈ వాతావరణం ఎంతకాలమైనా సజీవంగా ఉంచుతుంది చిన్న కథల్లాగా చిన్న నవలలు పాత బడిపోవు కథలోని సంఘటనలకు పాత్రల బాధ్యత ఏపాటి ఉన్నదీ, పాత్రల చిత్తవృత్తులకు ప్రేరకాలేవైనదీ, ఆయా పరిస్థితులలో ఆయా పాత్రలు చేసిన తప్పులేవో ఒప్పులేవో పాఠకుడికి స్పష్టంగా తెలుస్తూ ఉంటుంది చిన్న నవలల్లోసాంఘిక చరిత్ర చెప్పుకోదగినంతగా ప్రతిబింబితం కాకపోవచ్చుగాక కాని అవి జీవితం తాలూకు డాక్యుమెంటరీ చిత్రాల్లాగా ఉండిపోతాయి వాటికి గల ఈ ప్రాముఖ్యాన్ని రచయితలూ, పాఠకులూ, విమర్శకులూ గ్రహించాలి

మొపాసా ఒక అతి చిన్న నవల రాసినట్టు జ్ఞాపకం అందులో ఒక మనిషి జీవితమంతా చిత్రించాడు చిన్నదే అయినప్పటికీ అది నవలే టాల్‌స్టాయి మొదలైన రష్యన్ రచయితలు అనేక చిన్న నవలలు రచించారు ఇటీవల ఒక తెలుగు పత్రికలో ఒక కథ చదివాను, అది తల్లి పుట్టుకతో ప్రారంభమై కూతురు చావుతో అంతమవుతుంది న్యాయంగా ఇది నవలగా రచించి ఉండవలసింది ఒక పాత్ర యొక్క జీవితంలో అనేక దశలూ, ఆ పాత్ర యొక్క మనస్థితిలో ఎన్నో పరిణామాలూ చిత్రించదలచినప్పుడు దాన్ని నవలగానే రాయడం మంచిది నేను రచించిన ''ఆడజన్మ'' అట్టేపెద్దది కాదు నేను రచించిన ఇతర చిన్న నవలల ప్రమాణంలోనే ఉన్నది అయినా అది నవల ''సవతి తల్లి'' నవలకాదు - పెద్దకథమాత్రమే

పెద్ద కథకూ, చిన్న నవలకూ తేడా చెప్పడం కొంచెం కష్టం నేను రచించిన ''లేచిపోయిన మనిషి'' పెద్ద కథ కాదు, చిన్న నవల నేను ముందే చెప్పినట్టు, ఈ తేడాలు కథాంశాన్ని బట్టీ రచనా విధానాన్ని బట్టీ నిర్ణయించాలి

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ప్రశస్తమైన కథలు చదివినవారు ఒక్క విషయం గమనించి ఉంటారు వాటిలో చాలా భాగం చిన్న నవలలుగా రాయడానికి అనువైనవి చిన్న కథలుగ చూస్తే వాటిలో శిల్ప సౌష్టవం తక్కువ కాని కుదించిన చిన్న కథలుగా చూస్తే పాత్రల వాతావరణం చిత్రించటంలో ఆయనకుగల అసమాన ప్రజ్ఞ స్పష్టమవుతుంది ఆయన వాటిని చిన్న నవలలుగా రాసి ఉండవలసిందని నాకు అనిపిస్తుంది

చిన్న నవలలు రాయడంలో నా అనుభవాన్ని పాఠకుల అనుమతితో కొద్దిగా చెప్పదలిచాను అనేక పర్యాయాలు నేను నవలగా రాయదలచుకున్న కథను చిన్న నవలగా రాయటం జరిగింది

దానికి కారణం నా కథలో సామాజిక జీవితాన్ని విపులంగా ప్రతిబింబించే అవకాశం లేదని తోచటమే

ఒక సందర్భంలో నేను చిన్న నవలగా రాయదలచుకున్న కథలో అనేక సంవత్సరాల మీద జరిగిన సంఘటనను చిత్రించవలసి వచ్చింది ఆ సంఘటనలను మొదటినుంచి చివరదాకా జరిగినక్రమంలో చెప్పుకుపోతే నవలేరాయాలి అలా రాసి రచనకు పటుత్వం చేకూర్చే దక్షత నాలో లేదని స్పష్టమయింది అందుచేత రచనను దాదాపు చివరలోనే ఎత్తుకొని గడచిన సంఘటనలను సినిమా పరిభాషలో ఫ్లాష్ బాక్ అంటారే ఆ పద్ధతిలో, పరస్పర సంబంధం ఆట్టే వాటి మధ్య ఉంచకుండా చిన్న నవల రాశాను ఇందువల్ల పాఠకులకు ఆ రచన బాగా నచ్చిందని చెప్పలేనుగాని, నాకు మాత్రం తృప్తి గలిగింది నవలగా రాసి ఉంటే అది పాఠకులను తప్పక మరింత విసిగించి ఉండును ఆ విషయంలో నాకెలాంటి సందేహమూ లేదు

తెలుగులో కథలు పుష్కలంగానే ఉంటున్నాయి గాని అవి క్షణికమైన తాత్కాలికమైన ఆనందాన్ని చేకూర్చేవి తెలుగు సాహిత్యం పుష్టి పొందాలంటే నవలలూ, చిన్న నవలలూ రావాలి చిన్న కథలు రాసేవారు తావు తీసుకునే ఇతి వృత్తాన్ని కొన్ని ఘట్టాల కింద విభజించి దేనికదిగా వివరించుకుంటూ పోతారు చిన్న నవల రాయదలచినవాడు తాను రాయదలచుకున్నదంతా ఒకేసారి సమగ్రంగా ఆలోచిస్తాడు కాని దాన్ని లోతుగా పరిశీలించి, ఎక్కువ శ్రద్ధతో ఆలోచించి, శిల్పాన్ని నిర్లక్ష్యం చెయ్యకుండా చక్కగా అమర్చుతాడు చిన్న నవలలో చిన్న కథలో ఉండే శిల్పమూ, నవలలో ఉండే విస్తృతీ కలిసి వస్తాయి అదే ఈ సాహిత్య ప్రక్రియలోని విశిష్టత

చిన్న నవలలు ధారావాహికంగా పత్రికలలో ప్రచురించి నప్పటికీ కొద్ది సంచికలలో ముగుస్తాయి కొసరి వచ్చేసరికి మొదలు మరిచిపోయే ప్రమాదం పాఠకుడికి ఉండదు ఇటీవల సాహిత్య స్వరూపం పైన పత్రికల ప్రభావం విశేషంగా ఉంటున్నది కనక మన రచయితలు చిన్న నవలలను విరివిగా రచించి, సాహిత్యంలో చిరస్థాయిగా ఉండదగిన రచనలను సృష్టిస్తారని ఆశించవచ్చు పత్రికలు కూడా చిన్న నవలలను ప్రోత్సహించడం ఎంతైనా అవసరం

*ముద్రణ ఆంధ్రప్రదేశ్, మాసపత్రిక, ఏప్రిల్ 1963*
*పునర్ముద్రణ విశాలాంధ్ర, దినపత్రిక, 21-4-1963*

## 21. చిన్న కథ – దాని శిల్పం

పాశ్చాత్య లాక్షణికులీనాడు చిన్న కథయొక్క శిల్పం ఇలా ఉండాలని చెప్ప నిరాకరిస్తారు దానికి కారణమేమంటే రానురాను చిన్న కథ శిల్పంలో 19వ శతాబ్దంవారు ఊహించనంత వైవిధ్యం పుట్టుకొచ్చింది ప్రతిభావంతులైన పాశ్చాత్య కథకులు చిన్న కథ శిల్పంలో అసంఖ్యాకమైన ప్రయోగాలు చేసి విన్యాసాలు ప్రదర్శించారు అందుచేత ఈనాడు చిన్న కథ శిల్పం యిలా వుండాలి అని ఎవరు చెప్పబూనుకున్నా అది సాహసమే అవుతుంది

అయితే చిన్నకథలు రచించటంలో జరగకూడని పొరపాట్లు అక్కడక్కడా జరుగుతున్నప్పుడు వాటిని ఎత్తి చూపి అవి కథా శిల్పానికి ఎలా అడ్డొస్తాయో చెప్పటం కొంత

అవసరమేనేమోగాని ఈ లోపాలను గురించి చెప్పేముందు చిన్న కథ గురించి కొన్ని ప్రాథమిక విషయాలు మననం చేసుకుందాం

1 నవలలను సినిమా చిత్రాలతోను, చిన్నకథలను విడిఫోటోలతోను పోల్చుతారు ఈ పోల్చటంలో సత్యం లేకపోలేదు నవల జీవితగమనాన్ని చిత్రిస్తుంది చిన్న కథ జీవితంలో ఒక సన్నివేశాన్ని చిత్రిస్తుంది చిన్న కథలో పాత్ర పరివర్తన ఉండదు జీవిత పరిణామం ఉండదు ఒక ప్రముఖ సంఘటన చిత్రితమవుతుంది

2 నవలలో పాత్రలు కనిపిస్తాయి చిన్న కథలో కథకుడు కనిపిస్తాడు అని ఒక ప్రఖ్యాత విమర్శకుడి అంచనా

3 ''జీవితంలో క్రమపరిణామంలేక సాంఘిక వాతావరణంలో ఆందోళనా, సాంఘిక స్వరూపంలో బీటలు జాస్తిగా ఉన్న తరుణంలో ఉత్తమమైన కథా సాహిత్యం వెలువడుతుంది'' అన్నది మరొక విజ్ఞుడి అంచనా

పైన చెప్పిన మూడు అంశాలూ ఉత్తమ పాశ్చాత్య విమర్శకులు ఆమోదించేవే గనుకనూ, మనం ఈనాడు చిన్న కథగా ప్రచారం చేసుకుంటున్నది శిల్పరీత్యా పాశ్చాత్య సాహిత్యంనుంచి దిగుమతి చేసుకున్నది గనుకనూ ఈ అంశాలు మన చిన్న కథలకు కూడా వర్తిస్తాయని అనుకోవచ్చు

ఈ అంశాలను బట్టి మనం తెలుసుకోగలిగిన అంశాలేవి?

చిన్న కథలు చాటభారతంలా ఉండకూడదు దీర్ఘమైన వర్ణనలకు, ఉపన్యాసాలకు, బోధలకూ చిన్న కథల్లో తావుండదు కథనం పొదుపుగానూ సమగ్రంగానూ కూడా ఉండాలి పాత్రల పరిచయమూ, వాతావరణం సృష్టించటమూ, సంఘటనా వివరమూ వేరువేరు ప్రక్రియలుగా గాక ఒకే ప్రక్రియగా జరిగిపోవాలి ఒకదానికోసం ఒకటి ఆపి పెట్టరాదు

చిన్న కథ చదివేవాడు కథకుడికి అత్యంత సన్నిహితుడుగా ఉంటాడు ఆ కారణంచేత పాఠకుణ్ణి తనకేసి ఆకర్షించుకోవటం చిన్న కథ రాసేవాడి ప్రప్రథమ కర్తవ్యం ఇది సక్రమంగా సాగాలంటే తాను సృష్టించే సంఘటనపైనా అందులో పాత్రలు ధరించే వ్యక్తులపైనా కథకుడికి పూర్తి అధికారం ఉండాలి పాత్రలు కథకుడికి అంతుచిక్కనివీ అదుపులో ఉండనివీ అయినా, సంఘటన కథకుడి తలకు మించినదైనా కథ దెబ్బ తింటుంది తన ఊహకు, అనుభవానికి మించిన పాత్రను తీసుకోవడం, తనకు తెలియని పరిస్థితుల్లో జరిగే సంఘటనలను చిత్రించటమూ కథకుడు చేయరానిపని

కథద్వారా ప్రదర్శించటానికి వ్యక్తిత్వం ఒకటి కథకుడికి ఉండాలని, దాన్ని ప్రదర్శించే ప్రతిభ కూడా ఉండాలనీ వేరే చెప్పనవసరం లేదు ఏమంచి కథకుడి రచనలు జ్ఞాపకం చేసుకున్నప్పటికీ ఈ సంగతి స్పష్టమవుతుంది

ఇంక మిగిలినది కథా వస్తువు దీనిని పైన చెప్పిన మూడో అంశం చాలావరకు స్పష్టం చేస్తుంది ప్రతి సంఘటనా కథా వస్తువుగా పనికి రాదు ఉదాహరణకు నేను చదివిన ఒక కథలో నాయికా నాయకులు ఒకచోట కలుసుకుంటారు ఇద్దరి అభిరుచులూ కలుస్తాయి ఇద్దరూ పెళ్ళి చేసుకుంటారు ఇందులో ''కథ'' మేమీలేదు నాన్న మార్కెట్టుకి పోయి కూరలు తెస్తాడు అమ్మ వంట చేస్తుంది అందరూ కూర్చుని తింటారు ఇందులో కథ ఏముంది?

చిన్న కథకు పనికి వచ్చేకథా వస్తువు జీవితపు బీటలనుంచి, ఎగుడుదిగుళ్ళనుంచి, ''అరాచకం'' నుంచీ రావాలి అదే ఇంకొక విధంగా చెప్పాలంటే కథా వస్తువులో ఏదో 'పేచీ'' ఉండాలి ఆ పేచీ పాత్రల ద్వారా ఉత్పన్నం కావచ్చు వాతావరణం నుంచి ఉత్పన్నం కావచ్చు క్రమబద్ధంగా సాఫీగా సాగిపోయే నిత్యసంఘటనలు కథావస్తువుగా పనికిరావు

మంచి కథలు రాయటంకోసం జీవితం అరాజకం గానూ, అస్తవ్యస్తంగానూ కావాలని ఎవరూ కోరరు కాని కథలు రాయదలచినవాళ్ళు జీవితలోని 'పేచీ'' అంశాలలోనే కథావస్తువు ఏరుకోవడం అవసరం

జీవితంతోపాటు కదిలేవాడు జీవితంలోని కదలికను చూడలేడు రైలులో ప్రయాణించేవాడు రైలు కదలికలను కదలికలేని దృశ్యాలలో చూస్తాడు రైలు గమనాన్ని చూడగల వాడు రైలుకు వెలుపల కదలకుండా నిలబడి ఉండేవాడే అదే విధంగా జీవితపు ఒడుదుడుకులలో కథావస్తువును చూడగలవాడు ఆ ఒడుదుడుకులకు అతీతంగా తన బుద్ధిని ఉంచుకోగలగాలి ఒక్కొక్క కథకుడు అనేక కథలు రాయగలగడానికి, మరొక్క కథకుడు ఎప్పుడో తప్ప ఒక కథ రాయలేకపోటానికి ముఖ్యమైన కారణం ఇదే కొందరు తమ బుద్ధిని జీవిత వ్యవహారాలకు అతీతంగా ఉంచుకుని అడుగడుగునా కథావస్తువులు చూడగలుగుతారు మరి కొందరికి ఎప్పుడోగాని కథా వస్తువు లభించదు

జీవితం నుంచి కథా వస్తువులు ఏరుకోవటంలో యువకుల కుండే నేర్పు వృద్ధులకుండదనిపిస్తుంది చిన్నతనంలో విరివిగా కథలు రాసిన వాళ్ళు కూడా ఏళ్ళు పైబడ్డాక విరమించుకుంటారు వారు ఏళ్ళ బిగువున చిన్న కథలు రాసినా అవి రాణించవు అనేక దశాబ్దాల పాటు జగద్విఖ్యాతంగా కథలు రాసిన సోమర్సెట్ మామ్ వార్ధక్యంలో రాసిన కథలను పుస్తకంగా ప్రచురించినప్పుడు పత్రికలు ''మామ్ ఈ కథలను రాయకుండానూ, ప్రచురించకుండానూ ఉంటే బాగుండేది'' అని వ్యాఖ్యానించాయి వయసు ముదిరినకొద్దీ ప్రపంచ జ్ఞానం పెరగవచ్చును గాని జీవితంలో రాజీపడే ధోరణి కూడా జాస్తి అవుతుంది ఉదాసీన భావం ఏర్పడుతుంది అలాంటి స్థితిలో కథా వస్తువులు దొరకవు

అనేకమందికి కథలు రాయాలని ఉంటుంది కాని రాయలేకపోతారు కథాశిల్పం తెలియని కారణం చేతనే తాము రాయలేకపోతున్నామనుకుంటారు నూటికి తొంభై మంది విషయంలో ఇది భ్రమ, వాస్తవమేమంటే, వారికి జీవితంలో కథావస్తువులు కనిపించవు ఎవరో రాసిన కథలు చదివి, అవి నచ్చునప్పుడు వారు ''ఈ కథను మనమైనా రాసి ఉండవచ్చునే'' అనుకుంటారు

కథల్లో ఉన్న సత్యాన్ని ఆమోదించలేని వాడు '' ఏం కథలురా ఇవీ?'' అనటం మనకందరికీ అనుభవంలో వున్న సంగతే అలా అనే వారిలో శిల్పంతో తప్పు పట్టేవాడు నూటికి ఒకడైనా ఉంటాడో ఉండడో! అసలు చిన్న కథలంటేనే ఇష్టం లేని వాళ్ళు వాటిని చదివి ఆనందించలేనివాళ్ళు కూడా ఎక్కడైనా మనకు కనిపిస్తారు

దీనినిబట్టే కథాసాహిత్యపు సామాజిక విలువను మనం అర్థం చేసుకోవచ్చు ప్రపంచంలో నూటికి 99 మంది జీవితంలోని నెర్రెలను, వైరుధ్యాలనూ, అరాజకత్వాన్ని చూడలేనివారే అనుకుందాం వారే కథా వస్తువులు దొరకని వారు కూడా అలాంటి వారిలో అత్యధిక

సంఖ్యాకులు కథ చదివిన మీదటనైనా జీవితం గురించి యథార్థం తెలుసుకోగలుగుతారు దీనితో పాటు పాఠకుడికి, తనకు పరిచయం లేని జీవితపు కోణాలను గురించి అనేక తెలియదగిన విషయాలు కథల ద్వారా తెలుస్తాయి, పిక్చర్ పోస్ట్‌కార్డులు చూస్తే మనం చూడని ప్రదేశాలను గురించి తెలిసినట్లుగా

అందుచేత కథకుడు తాను తీసుకునే కథావస్తువును కథగా రాసేటప్పుడు పాఠకుడికొక ప్రత్యేకమైన అనుభూతి కలిగించే పద్ధతిని అనుసరించాలి ఆ పద్ధతి ఎటువంటిదైనా ఫరవాలేదు, అది తన పనిని నిర్వర్తించగలిగితే మంచి కథా శిల్పమే

*రచనా కాలం 1964*
*ముద్రణ సాహితీ వాల్లభ్యము*
*'సాహితీ వల్లభ', 'ఆంధ్రభోజ' శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారి అభినందన సంపుటి*
*(రెండవ భాగము) 1974*
*శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి తణుకు - ప॥గో॥జిల్లా ప్రచురణ*

# 22. ఇంటర్వ్యూ

1ప్ర మీకు మొట్టమొదటి సారిగా కథలు రాయాలన్న కోరిక ఎప్పుడు కలిగింది? ఈ కోరిక కల్గటానికి మిమ్మల్ని బాగా కదిలించిన బాహ్య సంఘటన యేదన్నా కారణమా? ఆ సంఘటనను గూర్చి వివరిస్తారా?

జ కథలు రాయాలన్న కోరిక అందరికీ కలుగుతుందనే అనుకుంటాను నాకు చిన్నతనంలోనే కలిగింది 'సాహితి'లో మా అన్నగారు (కొడవటిగంటి వెంకటసుబ్బయ్య) రాసిన 'సుకుమారి' 'ఏప్రిల్‌ఫూల్' వగైరా కథలూ, చింతా దీక్షితులు గారి 'సాహితికి కథ' మొదలైన కథలు నా పదో ఏటనే చదివాను అట్లా కథలు రాయాలన్న ఉబలాటం ఉండేది

2 ప్ర రచయితగా మీలో కొంత maturity వచ్చాక మీరు రాసిన ముఖ్య రచన ఏది? ఆ రచన ఏ పత్రికలో అచ్చయింది? ఆ రచనకు పాఠకుల నుండి గాని, విమర్శకుల నుండి గాని ఎలాంటి response వచ్చింది?

జ రచయితగా ఫలాని ఘడియనుంచీ నేను మెచూర్ అయానన్న భావం నాకు ఎప్పుడూ కలగలేదు ఏ కొరకమైన immaturity రచనకు ప్రోత్సాహమిస్తుందని నేననుకుంటున్నాను "Mature అయినాను" అన్న భావం కలిగాక ఎవరూ కథలు రాయలేరేమో!

3 ప్ర మీ Early Stages లో రచయితగా మిమ్మల్ని బాగా ప్రోత్సహించిన వ్యక్తులెవరు? అలాగే మొదట్లో మీ రచనల్ని ప్రచురించి ప్రోత్సహించిన ఆనాటి పత్రికలేవి?

జ నేను అట్టే ఇతరుల ప్రోత్సాహం మీద ఆధారపడలేదు కాని ఆంధ్ర శేషగిరిరావుగారు నా కథల పట్ల ఆదిలో ఆసక్తి చూపకపోతే బహుశా నేను కథలు రాసినా, ప్రచురించి ఉండను

4 ప్ర మొదట్లో మిమ్మల్ని బాగా influence చేసిన తెలుగు రచయితలెవరు? Non-Telugu రచయితలెవరు?

జ Influence మాట చెప్పటం కష్టం కాని నేను ఆసక్తితో చదివిన కధలు చింతా దీక్షితులు గారివి, శ్రీనివాస శిరోమణి గారివీ, ముని మాణిక్యం వారివీనూ చలంగారి కధలు రాయటం మొదలుపెట్టాకనే చదివాను ఆనాటి పత్రికలు చాలా వరకు నన్ను కధల కోసం వేధించాయి దాన్ని encourage చెయ్యటమంటే అనండి నాకు అభ్యంతరం లేదు

5 ప్ర మీ early stages లో మీరు మీక్కిష్టమైన ఏ రచయితనైన్నా conscious గా అనుకరించటానికి ప్రయత్నించారా?

జ నాకు తెలిసి నేను యే రచయితనూ అనుకరించలేదు

6 ప్ర సాధారణంగా మీరు రోజూ యే సమయాల్లో రాస్తుంటారు? వొక నియమిత సమయంలో అయితేనే రాయగలరా? లేకసమయాన్ని గురించి యే పట్టింపులూ లేవా?

జ రచనలు విరివిగా చేసే కాలంలో రాత్రి మేలుకుని రాసేవాణ్ణి ఇప్పుడు రాయటం చాలా తక్కువ యేదన్నా రాయాలంటే ఉదయమూ సాయంకాలమూ రాస్తాను రాత ఇతర పనులకు అడ్డం రాకుండా చూసుకుంటాను

7 ప్ర రచయితకు 'mood' వస్తేనే బాగా రాయగలడని చాలామంది అనుకుంటారు మీరు కూడా 'mood' వస్తేనే బాగా రాయగలరా?

జ 'mood' అంటే యేమిటో నాకు తెలీదు అగత్యం యేర్పడితే రాస్తాను అగత్యం అన్నది యే కారణం చేతనన్నా యేర్పడవచ్చు 'mood' వస్తే నేగాని రాయని వాళ్ళు కళాకారులై ఉంటారు నేను కళాకారుణ్ణని పొరపాటున కూడా అనుకోలేదు

8 ప్ర మీరు ఎన్నో నవలలు, కధలు రాసారు అవన్నీ మీరు serious గానే రాశారా? లేక పత్రికలవాళ్ళ బాధ పడలేకనో, లేక మరే ఇతర కారణాల వల్లనో రాసినవి యేవైనా ఉన్నాయా?

జ పత్రికలవాళ్ల (బాధ అననను) వొత్తిడివల్ల రాసినా సీరియస్ గానే రాశాను ఆషామాషీకి ఎన్నడూ రాయలేదు నేను రాసిన వాటిలో occasion కు (జర్నలిస్టుగా) రాసిన కధలు కూడా ఉన్నాయి

9 ప్ర ''చదువు'' తప్ప మీరు రాసిన నవలలన్నీ సైజును బట్టి చిన్న నవలలే చిన్న నవలలంటే మీకు ప్రత్యేకమైన అభిమానం ఉందనుకుంటాను కాని వివిధ సమస్యల్ని, సంఘర్షణల్ని, వివిధ మానసిక ప్రవృత్తుల్ని విశదంగా విస్తృతంగా (comprehensive) చిత్రించే అవకాశం లేదనుకుంటాను అందువల్ల చిన్న నవల శాశ్వతంగా నిలిచే గొప్ప నవల ఎప్పుడూ కాలేదు అనే అభిప్రాయంతో మీరు ఏకీభవిస్తారా? ప్రపంచ సాహిత్యంలోని యే గొప్ప నవలైనా తీసుకోండి అది పెద్ద నవలై ఉంటుంది

జ నేను చిన్న సైజు రచయితనే Minimum రాయాలనీ, పాఠకుడి టైమ్ వీలయినంత తక్కువగా ఖర్చు చెయ్యాలనీ, నా తెలివితేటలూ ''గొప్పతనమూ'' పాఠకుడి మీద

రుద్ధరాదనీ నా ఉద్దేశం ''చదువు'' పెరిగి పోవటానికి కారణం అదంతా ఒక్కసారిగా రాయకపోవటమే, నెలకు రెండు సెక్షన్లు రాస్తూ పోయాను

ఏ నవలాకారుడూ సమాజంలోని అన్ని సమస్యలను గురించి రాయలేడు రాస్తాననుకుంటే ఆత్మవంచన చేసుకుంటున్నాడన్నమాట ఏ నవలా శాశ్వతంగా నిలవదు ఈజిప్టు రాజుల శవాలల్లే కృత్రిమంగా నిలిపి ఉంచినా వాటివల్ల ప్రయోజనం లేదు నేను ఏది రాసినా పాఠకులు ఒకసారి చదివి ఒవతల పారేస్తారనే నమ్మకంతోనే రాశాను అవన్నీ శాశ్వతంగా నిలవాలనీ, నిలిచి ఎవరినో ఉద్ధరిస్తాయనీ నేను ఈనాడు కూడా అనుకోవటంలేదు ఏరచననుంచి అయినా మెదడు absorb చేసుకోదగినది చాలా కొంచెం ఉంటుంది దాన్ని పదిసార్లు చదివి ఎక్కువ లాభం పొందేదేమీ ఉండదు ప్రపంచ సాహిత్యం లోని 'బండలు' ఊడబొడిచాయని అనుకోవటం లేదు

10 ప్ర మీరు రాసిన నవలల్లో, మీ దృష్టిలో గొప్ప నవల ఏది? ఆ నవలను మీరు గొప్పనవల అనుకోటానికి కారణాలేమిటి?

జ నేను రాసిన నవలలన్నీ ఒకేతరగతివి పరిమిత ప్రయోజనాలు గలవి అందులో ఒకటి గొప్పదీ, ఒకటి తక్కువదీ అనేది ఇతరులను బాధించాలిగాని నన్ను కాదు అడగని వాళ్ళది పాపంగా చెబుతాను - నారచనలు నేను చదవను

11 ప్ర మీరు Marxist అనీ మీరే వొకచోట చెప్పుకున్నారు తెలుగు దేశంలో కూడా మీరు Marxist అనే image ఉంది కాని మీ నవలల్లో ఎక్కడా మీరు Marxism ను చిత్రించినట్టు కన్పించదు శ్రీశ్రీ లోనో, రాచకొండలోనో వాళ్ళ Marxist దృక్పథం కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది అంటే మీరు మీ Marxist దృక్పథాన్ని మీ రచనల్లో ప్రతిబింబించకుండా కావాలనే aviod చేసారా? రచయిత వొక ' ఇజమ్'కు పూర్తిగా commit అయిపోయినప్పుడు, కళాకారుడిగా తను తీసుకున్న వస్తువుకు శిల్పం దృష్ట్యా న్యాయం చేకూర్చ లేక పోతాడని మీరు నమ్ముతారా?

జ నా రచనలు క్రిటికల్‌గా చదివే వాడికి నేను Marxist ను అని అర్థం కావాలి కాకపోతే నాలో Marxism జీర్ణం కాలేదన్నమాట Marxism ను నిరూపించటానికి నేను రాయలేదు జీవితాన్ని గురించే రాశాను Marxism కు commit కావటం అంటే ఏమిటి? ఏ ఇజమునన్నా ప్రచారం చెయ్యటానికే రచనలు చేసేవాడు నేలవిడిచి సాము చెయ్యక తప్పదేమో

12 ప్ర ఇటీవల వొక పత్రిక మీ 'తార' అన్న నవలను సమీక్షిస్తూ ఇట్లా రాసింది ''తెలుగు దేశాన్ని ఏనాడో విడిచిపెట్టి మద్రాసులో స్థిరపడిన శ్రీ కుటుంబరావు ఇటీవలి నవలికలలోని పాత్రలు ప్రధానంగా ఊహాజనితాలుగా ఉంటున్నవి తప్ప సమాజ పరిశీలన ద్వారా ఉద్భూతమైనట్టు కానరావటం లేదు పైగా వితంతు సాహిత్యంగా భాసిస్తోంది బాలవితంతువో, వృద్ధవితంతువో వారి ఇటీవలి నవలల్లో ప్రముఖపాత్ర వహిస్తోంది అందరికీ చిట్టచివరికి ఏదో విధంగా మద్రాసుతోటీ, సినిమా పరిశ్రమతోటీ సంబంధం ఉండక తప్పలేదు ''

ఈవిమర్శను గూర్చి మీరేమైనా చెప్పగలరా?

జ 'తార' విమర్శకుడు రాసినదంతా నిజమే నేను తెలుగు దేశం విడిచిపెట్టి 30 ఏళ్ళు కావస్తున్నది తమిళ జీవితం నాకు తెలీదు నా పాత్రలను మద్రాసు వాతావరణంలోనే ఉంచవలసి వస్తున్నది నాకు తెలీని విషయాలను గురించి రాయనందుకు ఆ విమర్శకుడు తప్పు పట్టితే అందుకు నేనేమీ చెయ్యలేను నాది 'వితంతు' (వెధవ) సాహిత్యం అని అనాలని ఆ విమర్శకుడికి దురదగా ఉంటే నేను అభ్యంతరం చెప్పను నా రచనలలో ఏశాతం వితంతు సాహిత్యమో ఆయన లెక్కలు ఇచ్చివుంటే బాగుండేది అదీగాక 'వితంతు' సాహిత్యం గురించి ఆయన ఈసడింపుగా మాట్లాడటం నా రచనకు ఈసడించటానికైతే పరవాలేదుగాని అది భారతానికే తగులుతుంది ఎందుకంటే, పాపం కౌరవపాండవుల మూలపురుషులే 'వెధవముండా కొడుకులు', 'కన్యాశుల్కం'లో ముగ్గురు వితంతువులు (పూటకూళ్ళమ్మ, బుచ్చమ్మ, మీనాక్షి) ఉన్నారు నేపథ్యంలో ఇంకో అచ్చెమ్మ అనే వితంతువు కూడా ఉన్నది మిగిలిన ఐదు స్త్రీపాత్రలో ఒకతె వేశ్య అయినా 'కన్యాశుల్కం' వితంతు సాహిత్యం అని ఆ అజ్ఞాత విమర్శకుడు అనగలుగుతాడనుకోను, ఆయన గురజాడవారి మీద ఈగవాలితే యమబాధ పడిపోతాడని వినికిడి మద్రాసులో ఉంటూ సినిమాతో సంబంధం లేని ఆంధ్రులు బహుకొద్ది మంది నాకు ఆ పరిశ్రమతో అంతో ఇంతో సంబంధం ఉన్నది దానికూడా తప్పు పడితే నాకు తెలిసినది తప్ప నేనేదైనా రాయవచ్చునన్నమాటా?

13 ప్ర మీరు సృష్టించిన పాత్రల్లో వైవిధ్యం లేదనే విమర్శ కూడా ఉంది మీ పాత్రలు-ముఖ్యంగా పురుషపాత్రలు - మీ గొంతుతోనే మాట్లాడుతాయని కొందరు రాశారు ఈ విమర్శకు మీ జవాబేమిటి?

జ నేను పాత్రలకిచ్చినంత స్వేచ్ఛ కొందరు ప్రసిద్ధ రచయితలే ఇవ్వరని నేననుకుంటాను నా పాత్రలు నా గొంతుతో మాట్లాడేదీ లేనిదీ నా గొంతు ఎరిగిన వాళ్ళు చెప్పటం సబబు పాత్రలలో వైవిధ్యం లేకపోతే అది నా అసమర్ధతే

14 ప్ర మీ నవలలోగాని, కథల్లోగాని వస్తువు మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబాల్లోని ఆర్థిక, సాంఘిక, రాజకీయ వాతావరణం Marxist అయ్యుండి కూడా శ్రమజీవులను గూర్చి మీరు రాసింది చాలా తక్కువ ఇందుకు కారణం మీకు శ్రమజీవులతో ప్రత్యక్షసంబంధం లేకపోవటమేనా? తను రాస్తున్న ప్రజల మధ్య రచయిత స్వయంగా కొంతకాలం జీవించి, వాళ్ళని బాగా అర్థం చేసుకుంటేనే తప్ప వాళ్ళను గూర్చి రాసే అర్హత ఆ రచయిత సంపాదించలేడు అనే భావాన్ని మీరు అంగీకరిస్తారా?

జ శ్రామికులతో నాకు కొంత సంబంధం ఉన్నది నేను Factories లో ఫోర్‌మన్ గా పనిచేసిన వాణ్ణి నాకింద పని చేసిన వాళ్ళు నన్ను చూసి గర్వపడిన సందర్భాలు కూడా ఉన్నాయి వాళ్ళను గురించి చాలా తక్కువే రాశాను దానికి కారణం వాళ్ళ పట్ల నాకున్న అభిమానం వాళ్ళను patronize చేస్తేగాని, వాళ్ళని పునరుద్ధరించటానికి గాని రాయాలంటే చెయ్యి ఆడదు ప్రకృతి అంటే కూడా నాకు చాలా ఇష్టం నా ఇష్టాన్ని మాటల్లో చెప్పాలంటే modesty అడ్డం వస్తుంది అందుచేత ప్రకృతి వర్ణనల

జోలికి పోను నిజమైన కళాకారుడికి ఇలాంటి inhibition ఉండదేమో రచయిత శ్రామికుడుగా జీవిస్తే తప్ప శ్రామికులను గురించి - అదీ తాను గ్రహించిన మటుకే - రాయాలి వారి మధ్య కొంత కాలం ఉండి ఆ అనుభవాలను యథాతథంగా దించి సోమర్‌సెట్ మామ్‌లాగా పుస్తకాలు డబ్బుకోసం రాయటం నా దృష్టిలో చాలా హేయం

15 ప్ర 'తెలుగు నవల' ఒక ఉద్యమంగా ఎన్నడూ సాగలేదు తెలుగు సాహిత్యంలో యే ఉద్యమం వచ్చినా యే నూతన ప్రయోగాలు వచ్చినా అవి కవిత్వంలోనే వచ్చాయి మీ దృష్టిలో ఇందుకు కారణమేమిటి?

జ నూతన ప్రయోగాల ఆశయం ఏమిటో నాకు తెలీదు

16 ప్ర Stream of consciousness Novel గూర్చి మీ అభిప్రాయ మేమిటి? ఇలాంటి నూతన ప్రక్రియలూ, ప్రయోగాలూ (New techniques & experiments) తెలుగులోకి వస్తే తెలుగు నవల ఇంకా అభివృద్ధి చెందుతుందని మీరు భావిస్తారా?

జ Stream of consciousness నవలలు నిరుపయోగం, అభాసం మన మనసు ఎలా నడుస్తున్నదీ తెలుసుకోవటానికి ప్రయత్నించిన క్షణంలో Stream తెగిపోతుంది "You can't observe nature without changing it" అన్నది mental process కు అక్షరాలా వర్తిస్తుంది అందుచేత ఒక పాత్రయొక్క భావ స్రవంతిని మనం ఊహించి కల్పనచెయ్యవలసిందేగాని, అందులో realism నూటికి నూరుపాళ్ళు సాధించటం సాధ్యంకాదు అయినప్పటికీ భావస్రవంతిని పరిమితంగా నవలారచనలో వాడటంలో కొంత సౌలభ్యం తప్పక ఉన్నది

17 ప్ర ఈ రోజుల్లో అసంఖ్యాకంగా వెలువడుతున్న నవలల్ని గూర్చి స్థూలంగా మీ అభిప్రాయం యేమిటి? ఇన్ని నవలలు పుట్టుకురావటం మంచికేనంటారా?

జ పదిమంది చదివే నవలలు ఒకవిధంగా సార్థకమైనవి పదిరాళ్ళు తెచ్చే నవలలు మరోవిధంగా సార్థకమైనవి పది పత్రికలను పోషించే నవలలు ఇంకోవిధంగా సార్థకమైనవి ఎవరూ చదవని నవలలే దండుగ అందరి అభిరుచులూ నావాటిలాగే వుండాలనిగాని, నాకు బాగాలేని రచనలను ఇతరులు చదివి ఆనందించరాదనిగాని అనటానికి నాకేమీ అర్హత ఉన్నది?

18 ప్ర పాశ్చాత్య దేశాల్లో ఈ మధ్య నవల పట్ల ఆదరణ చాలా తగ్గి పోయిందంటున్నారు చాలా మంది పాఠకులు నవలల్ని అసలు చదవటంలేదనీ, non-fiction నే యెక్కువ చదువుతున్నారనీ ముందుముందు ఈ నవల అనేది పూర్తిగా అంతరించిపోవచ్చుననీ ఆమధ్య 'Encounter' లో ఒక విమర్శకుడు రాసాడు ఈ విషయాన్ని గూర్చి మీ అభిప్రాయం ఏమిటి?

జ ఈ మాట నేను ఇంగ్లీషు పత్రికలలో కూడా చదివాను (Encounter లోకాదు) అయితే నవల అంతరించిపోతుందని నేననుకోను జీవితాన్ని విస్తృతంగా చిత్రించటానికి నవలను మించిన సాధనం ఏమున్నది? వాస్తవికతతో కూడిన నవలలు మన స్వీయానుభవాన్ని యెన్నోరెట్లు పెంచుతాయి Non-Fiction ఈ పని చెయ్యలేదు

19 ప్ర నవలాకారులుగా ఈ క్రింది తెలుగు రచయితలను గూర్చిమీ అంచనా ఏమిటి?
(ఎ) ఉన్నవ లక్ష్మీనారాయణ (బి) విశ్వనాధ సత్యనారాయణ
(సి) అడివి బాపిరాజు (డి) గుడిపాటి వెంకటచలం (ఇ) గోపీచంద్ (ఎఫ్) బుచ్చిబాబు (జి) ఆర్ ఎస్ సుదర్శనం (హెచ్) రా వి శాస్త్రి

జ (ఎ) ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి' లో ప్రశంసించదగినది ఎంతైనా ఉంది దాని మీద నేను ఒకసారి రేడియో ప్రసంగం చేస్తే ఆ నవలను ఏడెనిమిదిసార్లు చదివిన ఒక పెద్దమనిషి ''నువు చెప్పిన పాయింట్లలో ఒకటి నేను గమనించలేదు'' అన్నారు చదవటంలో తేడాలుంటాయి

(బి) విశ్వనాధ సత్యనారాయణగారి నవలలు నేను చాలాభాగం చదవలేదు సమకాలీన జీవితాన్ని అర్థం చేసుకోవటానికి అవి పనికిరావని నా అనుమానం కాని ఆయనకు నవలను 'నిర్మించుట'లో ఉన్న శ్రద్ధ చాలామంది నవలాకారులలో కనబడదు

(సి) అడివి బాపిరాజుగారి నవలలు నేను అసలే చదవలేదు ఏ కారణంచేతనో అవి నాకు అందలేదు

(డి) గుడిపాటి వెంకటచలంగారి నవలలు నవలలుగాకన్న వ్యాసాలుగా యెక్కువ ఉపయోగకరం మరొకరైతే వ్యాసాలు రాసి ఉండే విషయాలనుగూర్చి ఆయన నవలలు రాశారు మ్యూజింగ్స్ తరువాత రాసి తప్పు దిద్దుకున్నారనుకోండి ఆయన కథలుమాత్రం సిసింద్రీలు

(ఇ) గోపీచందుగారి నవలలుకూడా నేనంత శ్రద్ధగా చదవలేదు ఒక నవల చదవలేకపోవటంకూడా జరిగింది కాని ఆయన తన అనుభవాన్ని యధాతథంగా నవలలో పెట్టినట్టు కనబడుతుంది కథలు కొన్ని చాలామంచివి

(ఎఫ్) బుచ్చిబాబు దృక్పథం నాకు 'విలాయితీ' గా కనబడుతుంది

(జి) సుదర్శనంగారి ఒక నవలా, ఒక కథలపుస్తకమూ చదివాను కొన్ని కథలూ, నవలలో కొన్ని సన్నివేశాలూచాలా గొప్పగా వున్నాయి ఆయన విమర్శలు చదువుతుంటే చిన్న కామెరాకు మూరెడు లెన్సు తగిలించినట్టుంటుంది

(హెచ్) రా వి శాస్త్రిగారి 'అల్పజీవి' చదివాను అది ఆయన రచనలకు టిపికల్‌గా లేదు ఆయనను Master of Monoloque అంటాను ఆ మాస్టరీ ఆయన కథలలోనూ, నాటకం (నిజం) లోనూ, అల్ప జీవిలోనూ స్పష్టంగా కనబడుతుంది వచనం రాసేవారిలో ఆయన నికరమైన కవి

20 ప్ర నవలాకారులుగా కంటే కథకులుగానే మీరు ఎక్కువ విజయాన్ని సాధించారంటే ఒప్పుకుంటారా?

జ నాకు తెలీదు మీరు చెప్పండి నేను వింటాను

21 ప్ర మీరు రాసిన కథల్లోమీకు నచ్చిన కథల్ని లేదా మీకు సంతృప్తిని కల్గించిన కథల్ని గూర్చి చెబుతారా?

జ చెప్పను అది యెవరికీ ఉపకరించదు చదివేవారి ఆశయాలూ, నావీ ఒకరకంగా ఉండకపోవటం నేను గమనించాను

22 ప్ర మీ దృష్టిలో గొప్ప కథకుడి ముఖ్య లక్షణం ఏమిటి?

జ గొప్ప కథలు రాయటం వొకటే లక్షణం

23 ప్ర మీ దృష్టిలో గొప్ప కథకులెవరు?

జ చాలా మంది వున్నారు ఇప్పుడు రాస్తున్న వారిలో రావిశాస్త్రి, బీనాదేవి పేర్లను కచ్చితంగా చెప్పగలను చాటుచాటుగా దాక్కునే కాళీపట్నం రామారావుగారు గొప్ప కథలు రాస్తున్నారు కథలు రాయటం మానుకున్న చాసో కథలు చాలా బాగుంటాయి పాతవాళ్ళ పేర్లు ఇవ్వటంలేదు

24 ప్ర ఈనాడు అసంఖ్యాకంగా వస్తున్న కథా సాహిత్యాన్ని గూర్చి అభిప్రాయం?

జ నవలా సాహిత్యం గురించి చెప్పినదే దీనికీ వర్తిస్తుంది

25 ప్ర వ్యంగ్య రచనలు చేయటంలో మిమ్మల్ని మించిన వాళ్ళు లేరనే నా అభిప్రాయం (హాకాశంలో హాక్సిడెంట్, పాత్రలు కావాలి మొ॥) ఈ ప్రక్రియ మీరు మీ talent కు తగినంతగా exploit చేసుకోలేదని కూడా నా అభిప్రాయం మీరేమంటారు?

జ మీరు సూచించే వ్యంగ్య రచనలు (కేయాస్) నాదృష్టి తక్కువ రచనలు దిబ్బల రాజ్యం కథలను గురించి నేను తక్కువగా అనుకోవటంలేదుగాని వాటిని రాసినందుకు నన్ను 'క్షమించిన' వారున్నారు

26 ప్ర శ్రీశ్రీ మిమ్మల్ని ఆంధ్రా 'చెఖోవ్' అన్నాడు ఈ compliment ను మీరు స్వీకరిస్తారా?

జ చెఖోవ్ విశ్వసాహిత్యంలో వొకడే ఉన్నాడనుకుంటున్నాను

27 ప్ర నాటకాలు మీరసలే రాయలేదనుకుంటాను అంత ముఖ్యమైన సాహిత్య ప్రక్రియ వైపు మీ దృష్టి మరల్చక పోవటానికి కారణం?

జ రేడియో నాటకాలు వొక వందరాసి ఉంటాను స్టేజినాటకాలు రాద్దామని ఉన్నదిగాని ఆడేట్రూప్ లేకుండా నాటకాలు రాయటం దండగ

28 ప్ర విమర్శ, విమర్శకుడి బాధ్యతలు ఏమిటి?

జ విమర్శయొక్క ఆశయం రచనల మంచి చెడ్డలను సరిగా అంచనా కట్టటమూ రచనలో నిగూఢంగా ఉండే అందచందాలనూ, లోపాలనూ వ్యక్తం చేయటమూ ఎవరన్నా ఇంతకన్నా ఏమనుకుంటారో నాకు తెలీదు ఈ బాధ్యతలు నిర్వర్తించినవాడు సద్విమర్శకుడు

29 ప్ర తెలుగులో విమర్శనా సాహిత్యం తగినంతగా రాలేదు అన్న అభిప్రాయాన్ని మీరు అంగీకరిస్తారా?

జ నిజంగా విమర్శించదగిన సాహిత్యం కూడా అంతగా రాలేదేమో

30 ప్ర ఈ మధ్య 'సంవేదన'లో రాచమల్లు రామచంద్రారెడ్డిగారు రాసిన కొన్ని సమీక్షావ్యాసాల్ని గూర్చి మీ అభిప్రాయం? విమర్శ అంత నిర్దాక్షిణ్యంగా వైయక్తికంగా, క్రూరంగా ఉండటం అవసరమంటారా?

జ విమర్శలో దాక్షిణ్యం ఏమిటిగాని క్రూరంగానూ, వైయక్తికంగానూ ఉండనవసరంలేదు రా రా గారి విమర్శలతో నేను ఏకీభవించక పోవటం చాలా సార్లు జరిగింది

31 ప్ర 'దిగంబర కవుల్ని' గూర్చి మీ అభిప్రాయమేమిటి?

జ కవిత్వం గురించి మాట్లాడే అధికారం నాకు లేదు నాకు తెలిసినదల్లా జీవితం గురించి వారికున్న అభిప్రాయాలే నావీనూ

32 ప్ర సాహిత్యానికి, రాజకీయాలకు గల సంబంధం ఎలాంటిది? రెండూ వేరువేరు రంగాలంటారా? లేక రెండూ ఒకటే నంటారా? రచయిత తనకిష్టమైన రాజకీయ దృక్పధాన్ని తన రచనలో ప్రచారం చెయ్యటం అవసరమంటారా?

జ వేరువేరు రంగాలేగాని ప్రజల దగ్గర కలుస్తాయి ఒక రంగాన్ని ఒక రంగం బలపరచవచ్చు ప్రతిఘటించవచ్చు రచయిత క్ష్టమైన రాజకీయ దృక్పధం రంగం అతని జీవితాన్ని ఎలాగూ ప్రభావితం చేస్తుంది రచయిత పనిపెట్టుకొని ప్రచారం చేయనవసర ఉండదు

33 ప్ర సాహిత్యం సమాజ శ్రేయస్సుకు లేక సంఘ సంస్కారానికి దోహదం చేస్తుందని మీరు నమ్ముతారా?

జ నమ్ముతాను ఏ సమాజం? ఎలాంటి సంఘ సంస్కారం? అన్నవి ఎవరికి వారు తేల్చుకోవాలి

34 ప్ర 'అభ్యుదయ సాహిత్యం' అంటే మీ నిర్వచనం ఏమిటి?
Marxist కానివాడు అభ్యుదయ సాహిత్యాన్ని సృష్టించలేడు అనే వాదనతోమీరు ఏకీభవిస్తారా?

జ 'ముందుచూపు' గలది సాంఘిక పరిణామాన్ని సరి అయిన మార్గాన ముందుకు తీసుకుపోగలది అభ్యుదయ సాహిత్యం ఇది general definition ఈనాడు Marxism అర్థంకానివాడు జీవితాన్నే అర్థం చేసుకోలేడని నేననుకుంటాను అభ్యుదయ సాహిత్యం ఏమి రాస్తాడు?

35 ప్ర ప్రాచీన సాహిత్యానికి, ఆధునిక సాహిత్యానికి ముఖ్యమైన భేదాలేమిటి? తెలుగులో ఆధునిక యుగం ఎవరితో, ఎప్పట్నించి ప్రరంభమైందంటారు?

జ ప్రాచీన సాహిత్యం గతం నుంచి మంచిని గ్రహించటానికి ప్రయత్నించింది జరిగిపోయిన కాలాలనుంచి ప్రజలకు మంచీ చెడూ చెప్పింది ఆధునిక సాహిత్యం వర్తమానాన్ని చూస్తూ, భవిష్యత్తుకు పనికివచ్చే మంచి చెడులను వెతుకుతుంది తెలుగులో ఆధునిక యుగం వీరేశలింగం - గురజాడ ద్వయంతోనే నిస్సందేహంగా ప్రారంభమయింది

36 ప్ర ఫ్రాయిడ్ ప్రభావం వల్ల పాశ్చాత్య సాహిత్యల్లో sex ను గూర్చి unconscious నుగూర్చి అనేక perversions ను గూర్చి విరివిగా నవలలు, కథలు, నాటకాలు వచ్చాయి ఇలాంటి రచనలు తెలుగులో చాలా తక్కువ తెలుగులోకీ ఇలాంటి రచనలు రావటాన్ని మీరు హర్షిస్తారా? లేక ఫ్రాయిడ్ ప్రభావం వల్ల సాహిత్యానికి మేలుకంటే కీడే ఎక్కువ వాటిల్లిందనే వాళ్ళల్లో మీరొకరా?

జ పాశ్చాత్య సాహిత్యాల్లో మానసిక వ్యాధులను కూడా కళావస్తువులుగా స్వీకరించారు ఆ రకం రచనలు నాకు నిరుపయోగంగా కనబడతాయి పాశ్చాత్య రచయితలు 'వృత్తి' రచయితలు వారు తమ బతుకుతెరువు కోసం పడే అగచాట్లన్నిటా సాహిత్య

ప్రయోజనం ఉంటుందనుకో నవసరంలేదు రచనల మీద బతకవలసిన వాళ్ళు తెలుగు రాస్తే ఎవరు మాత్రం ఎట్లా అభ్యంతరం చెప్పగలరు? Market నియమాలను బట్టి సాహిత్యం ప్రచారమైతే దాన్ని ఆపటం ఎవరి తరం? ఫ్రాయిడ్‌ను తప్పుపట్టే పనిలేదు అతని తప్పుడు సిద్ధాంతాలను తప్పుపట్టవచ్చు marxism లాగే Freudism కూడా మనుషులను మరింతబాగా అర్థం చేసుకునేటందుకు తోడ్పడిందని ఒప్పుకు తీరాలి Freudism ను commercialise చేసేవారి సాహిత్యాన్ని serious గా తీసుకోనవసరం లేదు

37 ప్ర కన్యాశుల్కం' యొక్క గొప్పదనాన్ని తెలుగువాళ్ళకు వివరించి చెప్పిన వాళ్ళలో ఒకరిగా మిమ్మల్ని ప్రశ్న అడుగుతున్నాను 'కన్యాశుల్కం' మీద ఒక ముఖ్యమైన విమర్శ ఉంది 'కన్యాశుల్కం' ఇంతవరకూ ఏ నాటక సంస్థ కూడా సంపూర్ణంగా స్టేజిమీద ప్రదర్శించలేకపోయారని, అది స్టేజిమీద ప్రదర్శించటానికి అనువైన నాటకం కాదని స్టేజిమీద ప్రదర్శనా యోగ్యంకాని నాటకం గొప్ప నాటకం కాదని ఆ విమర్శ యొక్క సారాంశం ఈ విమర్శకు మీ సమాధానమేమిటి?

జ కన్యాశుల్కాన్ని మొత్తంగా స్టేజీమీద ఆడటం సాధ్యం కాదన్న మాటకు నా అభిప్రాయం కూడా దేనికి? సాధ్యంకాదంటే ప్రదర్శన యోగ్యంకాదని నా అభిప్రాయం కాదు అందులో ప్రదర్శన యోగ్యంకాని దృశ్యాలేవీ లేవు అది గొప్పనాటకం కాదనే వాళ్ళు భరతుణ్ణీ, మమ్మటుణ్ణీ సాక్ష్యం తెస్తారని నా అనుమానం అది గొప్ప నాటకమేనని నా నమ్మకం

38 ప్ర మీ 60 ఏళ్ళ జీవితంలో రచయితగా మీరు నేర్చుకున్న కొన్ని పాఠాల్ని మా పాఠకులతో పంచుకుంటారా?

జ నా 'షష్టిపూర్తి' అన్న వ్యాసం ఆంధ్రజ్యోతి వారపత్రిక (14-11-69) సంచికలో నేను నేర్చుకున్న ముఖ్య పాఠాలను గురించి రాశాను

*కొడవటిగంటి కుటుంబరావు గారితో నవీన్ ఇంటర్వ్యూ*
*సృజన 13వ సంచిక 1969 నవంబరు నుంచి*
*1970 జనవరి వరకు*

## 23. యువకథకుల సమస్యలు

నాకు కొద్ది మంది యువకథకులతో 'పోస్టు' పరిచయం ఉన్నది అయితే వారు నాతో చర్చించే సమస్యలు చాలా వరకు సమాజానికి సంబంధించినవి, కొద్ది మేరకు శిల్పానికి సంబంధించినవి ఈ సమస్యలు చర్చించిన మాత్రాన యువకథకులు తమ సమస్యలను పరిష్కరించుకోగలరని నాకు తోచదు

స్వాతంత్ర్యం వచ్చిన ఇంతకాలానికి యువకులు చూసే జీవితానికీ యుద్ధానికి పూర్వం రచయితలు చూసిన జీవితానికి చాలా వ్యత్యాసం ఉన్నది

సామాజిక విలువలు మన కళ్ళ ఎదుటే తారుమారు అవుతున్నాయి ఈ నాటి రచయిత ఎలాంటి నైతిక దృక్పథాన్ని అవలంబించాలన్నది అతి ముఖ్యమైన ప్రశ్న నలుగురూ ఆమోదించే ధర్మమూ నీతీ అన్నవి సాధారణంగా దాటిపోయిన జీవితానికి సంబంధించినవై ఉంటాయి - ఉడిగి పోయిన కళాకారులకు ప్రభుత్వం బహూకృతులిచ్చినట్లుగా

భౌతిక కారణాల వల్ల సమాజంలో ఏర్పడే పరిణామాలను బట్టే పాతనీతికి, పాత ధర్మాలకూ కాలదోషం పట్టినప్పుడు కొత్తనీతి, కొత్త ధర్మాలూ పోరాటం ద్వారానే ముందుకు రాగలవు ఈ పోరాటాన్ని బలపరచటం యువ కథకుల విధి

రాజకీయ సమస్యలు ఎత్తుకోకుండా సాధారణ సాంఘిక సమస్యలను తీసుకున్నా ఈ సంగతి స్పష్టమవుతుంది

ఈ తరం ఆడపిల్లలను తీసుకుందాం వాళ్లు కొంత చదువు చదువుకోందే మామూలు మనుషులుగా తిరగలేరు ఉద్యోగాలు చెయ్యకపోయినా, ఇల్లు చూసుకోవటానికైనా చాలా చదువు కావాలి అచ్చగా వంటలక్కలుగానే జీవించ దలిచినా వారికి ఆహారం గురించి, కేలరీలను గురించి, శౌచం గురించి, విటమినులను గురించి కొంతైనా తెలియాలి తల్లులుగా పిల్లల పోషణ గురించి చాలా తెలియాలి నన్నడిగితే సెక్సుగురించి కూడా ఎంతో తెలియాలంటాను అనేక విషయాలను గురించి ఆధునిక విజ్ఞానం లేకుండా ఈ కాలపు ఆడపిల్లలు భార్యలుగానూ, తల్లులుగాను, గృహిణులుగానూ తమ బాధ్యతలు నిర్వర్తించలేరు

చదువు తరువాత ఆడపిల్ల సమస్య పెళ్ళి ఆడపిల్ల తననూ, తన పిల్లలనూ పోషించగలవాణ్ణి పెళ్ళాడాలంటే కొన్ని వేలు కట్నం ఇచ్చుకోవాలి (పెళ్ళికొడుకుల మార్కెట్ రేట్లు నాకు తెలీవు) మధ్యతరగతి కింద చలామణీ అయ్యే కుటుంబాలలోనే హెచ్చుమంది కట్నాలు కక్కలేరు వాళ్ళ పిల్లలు ఏ యమధర్మరాజునైనా చేసుకు తీరాలన్నది ఈ నాడు ఎంత హేయమైన నియమం! ''మాకు పెళ్లి అవసరం లేదు'' - అని అలాటి ఆడపిల్లలు కొందరు అంటే మానవత్వం గలవాడు ఎలా తప్పు పట్టగలడో అర్థంకాదు

అందుకు ఆడపిల్లలూ పెద్దచదువులు చదువలేరు బతికున్నన్నాళ్ళూ తండ్రుల మీద వారు బరువు వెయ్యనూ లేరు చిన్న చిన్న ఉద్యోగాలు సంపాదించుకుంటారు అదృష్టం ఉంటే తమను పెళ్ళాడగోరే వారిని సంపాదించుకుంటారు లేకపోతే నీతిని తిరస్కరించి తమపై అధికారులను తృప్తి పరచి, స్వతంత్రంగా బతుకుతారు దీన్ని ఎవరు గాని ఏమని తప్పు పట్టగలరు? వాళ్ళకు పాతివ్రత్య ప్రమాణాలు అంటగట్టి ఏం లాభం?

పై విషయాలు ఉదాహరణకు చెప్పాను జీవితంలో అమలులో ఉన్నట్టు మడి గట్టుకున్నవాళ్లు చెప్పే నియమాలు ఆచరించటం కొందరికి అసంభవం యువ రచయితలు తమ చుట్టూ ఉన్న జీవితంలోని ధార్మిక, నైతిక అవాస్తవాలను గమనించి తమ రచనలద్వారా విమర్శించాలి

జీవితం సామాజికుణ్ణి మృత్యు ముఖంలోకి తోయటం కన్న హాస్యాస్పదమైనది మరొకటి ఉండదు కాని జీవితానికి చాలా మంది బలి అవుతున్నారు రచయితలు ఇలాటి పరిస్థితి మీద తీవ్రంగా తిరుగుబాటు చేయాలి

యువరచయితకు రాసేటందుకున్న మీదట తన రచనను లోకానికి ఎట్లా అందించాలన్నది ఒకసమస్య

పుస్తక ప్రచురణ అనేది ఈ నాడు విరివిగానే ఉన్నప్పటికీ అది కొంతవరకు పత్రికల చాటున బతుకుతున్నది మనకీనాడు లక్ష చిల్లర అమ్మే పత్రికలున్నాయి గాని, నాలుగు వేల కాపీలు అచ్చువేసే సంస్థలు చాలాతక్కువ అందుచేత పత్రికలే రచనలకు మంచి వాహకాలు

అయితే విస్తృత ప్రచారంగల పత్రికలలో వచ్చే సాహిత్యం అంతా ప్రయోజనకరంగా ఉండదు అంతమాత్రాన యువ రచయితలు బాధపడనవసరంలేదు రచనలో బలం ఉంటే ఏ పత్రిక అయినా వేసుకుంటుంది ''కళ కోసమే కళ'' అని కంకణం కట్టుకుని కూర్చున్న పత్రిక ఏదీలేదు రచనా పాటవం చాలా అవసరం దాన్ని యువరచయితలు సాధన ద్వారా సాధించాలి

రచయితలూ, కొద్దిమంది బెంగాలీ రచయితలూ ఆ పని చేస్తున్నారేమోగాని మిగిలినవారికి అది సాధ్యంకాదు అందుచేత ఎవరూ కథా రచనను ఒక వృత్తిగా భావించనవసరంలేదు కీర్తి మాటకు వస్తే కథకుడు కీర్తి నార్జించడు ఏమన్నా కీర్తి తెస్తే కథలే తేవాలి

ఈనాడు మానవజాతి భవిష్యత్తు పూర్తిగా భౌతిక వాదం మీద ఆధారపడి ఉన్నది మత విశ్వాసాలూ, సనాతన వాదాలూ,మంచి సాహిత్యానికి విషం లాంటివి శాస్త్రపరిజ్ఞానమూ, సాంకేతిక నైపుణ్యమూ- ఇవే మనిషి వివేచననూ, ఆరోగ్యాన్నీ, జీవిత ప్రమాణాన్నీ, సృజన శక్తినీ, ఆయుఃప్రమాణాన్నీ పెంచగలిగి ఉన్నాయి

భౌతికవాదమంటే మనిషికి అందుబాటులో లేని శక్తులు సృష్టిలో లేవని నా అభిప్రాయం కాదు మనిషి తనకు అందుబాటులో లేని శక్తులను గుడ్డిగా నమ్ముకుని పైకి రాలేడు తనకు అందుబాటులో ఉండే శక్తులను సద్వినియోగం చేసుకుని మాత్రమే పురోగమించగలడు

ఉదాహరణకు, యోగం ద్వారా కొన్ని శక్తులు స్వాధీనమయేటట్టు కనబడుతుంది కానీ వీటిద్వారా కొంత గారడీ చేయడానికి వీలయిందే తప్ప, అవి సమాజాన్ని ముందుకు తీసుకుపోయినట్టు రుజువులేదు పైపెచ్చు ఏ అతీతశక్తిలోనూ విశ్వాసం లేని జాతులు మననుజయించి, శాసించి ఈనాటికీ తమ ప్రభావాన్ని మనపైన నిలిపి ఉంచాయి

అందుచేత యువ రచయితలు భౌతికవాదాన్ని ఏ పరిస్థితిలోనూ విడనాడరాదు

కథలు చదవగా చదవగా కథలు రాసేశక్తి దానంతటదే వస్తుందన్నది భ్రమ ఈ భ్రమలో పడి రాస్తున్నవారి రచనలు చెరుకు పిప్పిలాగా తయారవుతున్నాయి ప్రతిమంచి కథా జీవితం నుంచే వస్తుంది అది యువ రచయితలు గుర్తుంచుకోవాలి

పాండిత్యం పునాదిగా పెట్టుకుని సాహిత్యం సృష్టించే కాలం దాటిపోయిందని చెప్పాలి ఈనాడు ప్రతి కథకుడూ తానొక జర్నలిస్టు ననుకుని, జర్నలిజంలో సిద్ధహస్తుడుగా తయారుకావాలి అయితే అక్కడే ఆగిపోనవసరంలేదు చెప్పేది సూటిగానూ, సరళంగానూ, రుచికరంగానూ ఉంటేటట్టు చూసుకోవటం జర్నలిస్టు ప్రథమ కర్తవ్యం కథకుడి ప్రథమ కర్తవ్యం కూడా అదే జర్నలిస్టుకు తెలయదగనిది అంటూ ఏదీ ఉండదు? ప్రతీ దాన్ని గురించీ జర్నలిస్టు వీలయినంత తెలుసుకోవటానికే యత్నిస్తాడు కథకుడు కూడా అంతే

కథకుడు తనకు తెలియని విషయాలు రాయరాదన్న నియమం పెట్టుకుంటే, అన్ని విషయాలను గురించీ తెలుసుకోవటం ఎంత అవసరమో బోధపడుతుంది (లేకపోతే మన

సినిమాలలో నటులు వీణలు వాయించినట్టూ, ఫ్యాక్టరీ పనులు చేసినట్టూ రచనలు చేసి, తెలిసిన వారి దగ్గర నవ్వులపాలు కావటం జరుగుతుంది)

అన్నిటికన్నాముఖ్యంగా యువ రచయితలు పాటించదగినది కీర్తి దాహమూ, ధనదాహమూ వర్జించటం ఈ దేశంలో రచనల మీద బతికేవాళ్ళు దాదాపు లేరు హిందీ వారు ఒక విధంగా తిరుగుబాటు మనస్తత్వం గలవారై ఉండాలి ఉన్న పరిస్థితికన్న రానున్నపరిస్థితి మీద వారి దృష్టి బలంగా ఉండాలి జీవితం ముల్లు కర్రతో తోలుతుంటే అది తోలిన దిక్కు నడవటం విశేషం కాదు జీవితాన్ని నడిపించే శక్తి - కాగితం మీదే అనుకొండి - రచయితకు ఉండాలి

యువకులు తమ రచనలను అభ్యుదయ మార్గంలో ఉంచాలి అంతే గాక ఇతర అభ్యుదయకర ఉద్యమాలలోపనిచేసేవారి కృషితో తమ రచనలను సమన్వయించాలి అప్పుడే వారి రచనలకు సమగ్ర సామాజిక స్వరూపం ఏర్పడుతుంది

*విజయభాను వారపత్రిక, సంక్రాంతి సంచిక 1970*

# 24. కల్పనా సాహిత్యంలో పాత్రల పాత్ర

కొంత కాలంగా సాహిత్య విమర్శ రచయిత్రులను విమర్శించడము, సమర్థించడముగా వుంటున్నది అయితే, కల్పనా సాహిత్యంలో నాకు కొట్టవచ్చినట్టు కనిపిస్తున్న పరిణామం పాత్రలను వినియోగించుకోవడంలో

కాల్పనిక రచనలు చేసే సాహితీపరుడు సాధారణంగా తాను చిత్రించదలచుకున్న జీవిత విశేషాలను, లేదా సమస్యలను, వాస్తవంగానూ, పరితకు విశ్వసనీయంగానూ వుంటేటట్టు ప్రదర్శించడం కోసం ''సజీవ''మైన పాత్రలను, వాటి సామాజిక స్వరూపాన్ని ఆధారం చేసుకుంటాడు ఇది ఆధునిక సాహిత్య దృక్పథం అనుకుంటున్నాను గతంలో నీతికథలు రాసినవారికి ఈ పట్టింపు లేదు వాళ్ళు మానవుల మనస్తత్వానికి ప్రతీకలుగా జంతువులను సైతం ఉపయోగించుకున్నారు

ఆధునిక సాహిత్య పరిణామ దశలన్నిటికీ ''సజీవ''పాత్రలు పునాది అభ్యుదయ సాహిత్యోద్యమం తీసుకొండి పాత్రల వర్గ స్వభావం చిత్రించడం అత్యంత ప్రధానమైన విషయం అయినప్పుడు తోలుబొమ్మలలాంటి పాత్రలు ఎంత మాత్రమూ పనికిరావు చదరంగపు పావులలాంటి పాత్రలను మనం ఏ గడికి దూకమంటే ఆ గడికి దూకే పాత్రలను ఉపయోగించి అభ్యుదయ రచనలు చెయ్యడం అసంభవం

**సజీవమైన పాత్రలు**

అలాంటి రచనలు రాలేదని నేను అనడంలేదు, శ్రామికులను '' ఆదర్శ'' మంచిపాత్రలుగానూ,ధనిక దోపిడీదార్లను ''ఆదర్శ" చెడ్డ పాత్రలుగానూ సృష్టించి, చెడ్డ అభ్యుదయ రచనలుచేసినవారు లేకపోలేదు అలాటి రచనలు ఆమోదకరం కాకపోవడానికి ఒకే ఒక కారణం అందులోని పాత్రలు ''సజీవమైనవి'' కాకపోవడమే, రచయిత ఆశయం దొడ్డదే - సామాజిక దోపిడీని ఖండించాలని అలాగే విప్లవ సాహిత్యంలోకూడా పాత్రలు విప్లవ భావాలకు అనుకూలంగా వుండడమేకాక, జీవితంలోని విప్లవ పరిస్థితులకు అనుగుణంగా

వుండడమే గాక, సజీవంగా ఉండాలి కృత్రిమంగా సృష్టించినవీ, ఎటు కదలమంటే అటు కదిలేచదరంగ ప్పావులూకారాదు

ఇదే ఇంకో విధంగా చెప్పాలంటే, కల్పనా సాహిత్య రచయిత చెప్ప దలచిన జీవిత సత్యానికి ఇయ్యదలచిన సందేశానికి కేవలము వాహికగా ఉంటే చాలదు ఆవాహిక పాత్ర ఏదైతే ఉందో దాన్ని పాత్రలు కూడా నిర్వహించాలి

అలాంటి రచనలు చెయ్యడానికి రచయితకు కావలసిన కనీసపు హంగులు జీవితానుభవము, సమాజ స్వభావ పరిజ్ఞానము, ముఖ్యంగా మనుషుల పర్గ స్వభావము, ఈ అర్హతలు రచయితకు ఏ ప్రమాణంలో ఉండాలన్నది ఎవరూ శాసించలేరు అవి ఏ ప్రమాణంలో ఉంటే రచన నాణ్యం ఆ ప్రమాణంలో ఉంటుంది ఎవరైనా స్పష్టంగా చెప్ప గలిగినది ఏమంటే ఈ హంగులు లేనివాడు ఎంత ఉన్నతాశయాలు గలవాడైనా మంచి కథయా, నవలయా రాయలేడు అలాంటివాడు వ్యాసాలు రాసుకోవడం మంచిది

చిక్కేమిటంటే, ఈరోజులలో చాలా మంది కల్పనా సాహిత్యం రాసేవారు సజీవ పాత్రం మీద ఆధారపడే ఇచ్ఛ లేకనో, శక్తి లేకనో, అవసరం గుర్తించకనో కొన్ని ''స్టీరియో టైప్స్'' మీద ఆధారపడుతున్నారు ఇది సాహితీ సమితి నవ్య సాహిత్యం రాక ముందు ఉండిన సంప్రదాయమే ఆ కాలపు సాహిత్యంలో ఒకేరకం బ్రాహ్మణులు, ఒకేరకం వైశ్యులు, ఒకేరకం ముస్లిములు వగైరాలుండేవారు ఆ కాలపు సాహితీ పరులకు గాంధీలాంటి పాత్రను సృష్టించదలిస్తే ఆ పాత్రను వైశ్యుడు చెయ్యడం ఊహించరానిది

స్టీరియో టైప్స్‌ను పాత్రలుగా ఉపయోగించడానికి జీవితానుభవం అవసరంలేదు సాహిత్య పరిచయం ఉంటే చాలు - ఉర్దూ భాషలో ప్రేమ కవిత్వం రాయడానికి ప్రేమానుభూతి అవసరం లేనట్టు ఈ 20వ శతాబ్ది నాలుగోపాదంలో ఈ ప్రాచీన మృత సంప్రదాయం తిరిగి అమలుకావడం ఆశ్చర్యకరం

ఇందువల్ల కలిగే దుష్పరిణామాలను ఎవరైనా ఊహించవచ్చు ఎనిమిదో తరగతి విద్యార్థి సెక్స్ గురించి, వేశ్యలను గురించి, ''రేప్'' గురించి, హంతకులనుగురించి, కథలు వ్రాయవచ్చు ఆడదాని మొహం ఎరగనివారు ప్రణయ కథలు వ్రాయవచ్చు సామాజిక దోపిడీ స్వభావం తెలియనివాడు ధనికుల దుర్మార్గం గురించి ''అభ్యుదయ'' రచన తెలియవచ్చు (అభ్యుదయ రచన చెయ్యడానికి మార్క్సిజం తెలియనక్కరలేదని వాదించే అభ్యుదయ పండితులు, విప్లవ పండితులు కూడా వున్నారు!)

ఇది చెత్త సాహిత్యానికి మంచి పునాది ఇందుకు కావలసిన పదజాలం ఎండి, వడ్డించి ఉన్నది రచయిత్రులు అప్పుడప్పుడూ రచించే ''గాలిమేడలు'' విమర్శించడానికి ఈ మాట అనడంలేదు అభ్యుదయ విప్లవ సాహిత్యాలలో కూడా ఈ ''స్టీరియో'' టైప్‌లూ, పరిభాషా ఉన్నాయి వాటిని విమర్శించే వాళ్లు తక్కువగా ఉన్నారు - ఉన్నారో లేదో కూడా స్పష్టంగా తెలియడంలేదు

ఈ సందర్భంలో నాకు తోచిన మరొక విషయం చెప్పాలి సాహితీపరులకు గత సాహిత్యంతో గాఢమైన పరిచయం ఉండడం వాంఛనీయమే ఉత్తమ సాహిత్యంతో రచయిత ప్రభావితుడు కావడం కూడామంచిదే కాని అచ్చుగా సాహిత్యం ఇచ్చే ప్రేరణతో సాహిత్యం

రచించేవారు ఆ సాహిత్యంతో నిజమైన పరిచయం ఉన్నట్టు కనబడదు పాతికేళ్ళ క్రితం వచ్చిన ఒక కథకు నకలు రాసి కథల పోటీలో మొదటి బహుమానం పుచ్చుకున్న వారున్నారు రాసినవాణ్ణి తప్పపట్టే పని లేదు జడ్జీలుగా పనిచేసేవారిలో ఒక్కరూ ఆ పాతకథ గురించి ఎరుగరు!

పత్రికలలో కథల పోటీ నిర్వహించి బహుమతులు పొందిన కథలను ప్రచురించినప్పుడల్లా బహుమతి లిచ్చినవారికి కథల బాగోగులు తెలుసునా అన్నసందేహం కలుగుతూనే ఉంటుంది

ఇదీ ఉన్న పరిస్థితి, తెలుగు కథానిక ప్రపంచ కథానికలను ఏనాడో అధిగమించిందనీ ఎవరన్నా అంటే ఎంతో ఆనందం కలుగుతుందిగాని అసలు తెలుగులో కథానిక అంటే ఉన్నదా అనేది తేల్చుకోవడంకూడా అవసరమే మంచికథలు వస్తున్నాయి వాటిని చెత్తనుంచి వేరుచేసేవారు కనబడరు ఏవి గుర్రాలో, ఏవి గాడిదలోస్పష్టంగా చెప్పేవారు లేకపోతే, కొంతకాలం గడిచాక గుర్రాలంటూ ఉండవు అన్నీ గాడిదలే ఉంటాయి

*ముద్రణ ఆంధ్రజ్యోతి దినపత్రిక, 16-11-1978*

# 25. ఇంటర్వ్యూ

1 మీ మొదటి మూడు నవలల వరుస క్రమం చెప్తారా? 'చదువు' మీరు వ్రాసిన ఎన్నో నవల?

నా మొదటి నవల 'నీకేం కావాలి ' ప్రచురణలో 'కులం లేని మనిషి' అను కుంటాను, మూడవది 'అరుణోదయం' ఇది సీరియల్‌గా రాలేదు ఒకేసారి పుస్తక రూపంలో వెలువడింది 'చదువు' నాలుగవది అదీ సీరియల్‌గా చక్రపాణి గారి సంపాదకత్వంలో 1950లో ఆంధ్రజ్యోతి' మాసపత్రికలో సీరియల్‌గా వచ్చింది 1952లో పుస్తక రూపంలో వచ్చింది

2 ఇతి వృత్తకాలం దాదాపు 17 ఏళ్ళు గడిచాక 'చదువు' రాయటంలో మీకు ప్రత్యేకమైన ఉద్దేశ్యం ఏమైనా ఉందా?

ఏమీ లేదు చక్రపాణిగారు కోరటం వలన నేనా నవల రాయవలసి వచ్చింది నెలకు రెండు సెషన్సు చొప్పున రాసిచ్చే వాడిని అలా రాయాల్సి రావటం వలన నాకు తెలిసిన సోషియల్ హిస్టరీ రాయాల్సి వచ్చింది లేకుంటే టోటల్ ఫిక్షన్ ఫామ్‌గా రాసి ఉండేవాడిని

3 ఒక నవల్ని ఆత్మకథా నవల అనటం ఒక "కంప్లైంట్"గా చెప్పాలా? 'కాంప్లిమెంట్ అనుకోవాలా? మీ చదువు నవల్ని కొందరు ఆత్మకథ నవలగా పరిగణిస్తున్నారు మీరేమంటారు?

ఆ నవల్లో రచయిత సొంతడబ్బా కొట్టుకొని ఉంటే అది కంప్లైంట్ దాన్నే ఆబ్జెక్టివ్‌గా రాసి ఉంటే అది కాంప్లిమెంట్ అనుకోవచ్చు చదువు నవల నా ఆత్మకథానవల కాదు ఆ పాత్రసెంటర్ కారెక్టర్‌కి అంత ప్రాధాన్యత లేదు సోషియల్‌హిస్టరీకే ప్రాధాన్యం ఎక్స్‌పీరియన్స్‌లు నావికావు కాని మిగిలిన చిత్రణంతా నేను చూసిందే నా స్నేహితుడు ఒకడు " నీ నవలల్లోకి నేను వచ్చానురా" అని చాలా కాలం కిందటి వరకు అంటుండేవాడు, నిజానికి ఆమేదర పిల్లవాని పాత్ర అతనూ ఒకటికాదు అది నా ఫిక్షన్

4 మీ మిగిలిన రచనలతో పోలిస్తే చదువు నవలా నిడివి ఎక్కువ దానికి కారణం చెప్తూ మీరు 'నెలకు రెండు సెషన్లు చొప్పున రాస్తూ పోవటం వలన'' అన్నారు కాని అది మీ ఆత్మకథానవల కాబట్టి అలవోకగా మీరు రాసి పడెయ్యటం వలన అప్రయత్నంగా లోతుని, సమగ్రతని పొందటం వలన విస్తృత పడిందని కొందరి అభిప్రాయిం మీరు ఏమంటారు

- అదే కారణం అనుకోనియ్యండి

5 మీరు మీ ఆత్మకథని రాసుకోడానికి ఇష్టపడడం లేదని, దాని అవసరం లేదని మీరన్నట్లు కర్ణాకర్ణిగా విన్నాను ఎందుకు అలా అభిప్రాయ పడ్డారు?

- నా అదృష్టం కొద్దీ నా జీవితంలో చిన్నప్పటినుండి పరిచయస్తులంతా బాగా పేరున్నవాళ్ళే అప్పట్లో బాగా పేరున్న స్టేజి యాక్టర్లు, సినిమా నటులు, సాహిత్యకారులు అందరూ నన్ను బాగా ఎరిగి ఉన్న వాళ్ళే నేను ఆటోబయోగ్రఫీ రాస్తే, ఇవన్నీ చెప్పుకుంటూ నేమ్ డ్రాప్ కోసం రాయాలి అది నాకిష్టం లేదు నా జీవితంలో ఏవైనా లోకోత్తర సంఘటనలు జరిగియుంటే రాసి ఉండేవాడిని నా జీవితంలో కనుక్కొన్న సత్యాన్ని నా ఫిక్షన్‌లోకి ఎక్కించినాను అందువలన నా స్వీయ చరిత్ర రాసికోవాల్సిన అవసరం నాకు కన్పించడంలేదు వార్ మెటీరియల్‌ని కలక్టుచేసి స్టడీ చేశాను దాన్ని 'యువ' ద్వారా వెల్లడి చేయాలనుకుంటున్నాను

6 చదువు నవల్ని రాయటంలోని ప్రధాన ప్రేరణలు ఏవి?

నాకు తెలసిన మొదటి ప్రపంచ యుద్ధం మొదలు డిప్రెషన్ వరకు ఉండే సోషియల్ హిస్టరీని రికార్డు చేయడం, చక్రపాణి గారికి నవల్ని రాసివ్వడం

7 మీ చదువు నవల్ని పీరియాడిక్ నవలగా చెప్పవచ్చునా? దాన్ని అథెన్‌టిక్ నవలగా వర్గీకరించవచ్చునా? నవీన్‌గారు వారి వ్యాసంలో దాన్ని మీ నవల్లో ప్రాతినిధ్య నవలగా అభివర్ణించారు దానిపై మీ ఉద్దేశం?

- పీరియడ్ పీస్ గా చెప్పవచ్చు అథెంటిక్ నవలలంటే ఏమిటో నాకు తెలియదు ప్రాతినిధ్య నవల అవునో కాదో నా నవలలు చదివిన వాళ్ళు నిర్ణయించాలి

8 మీ చదువు నవల్ని అర్థం చేసి కోవటంలో అప్పట్లో వెలువడ్డ లెర్నింగ్ థియరీస్ పాఠకుడికి ఉపయోగపడతాయా? మీ ఈ నవలా రచనలో ఆ సిద్ధాంతములు ప్రేరణ ఏమైనా ఉన్నవా?

- ఆ సిద్ధాంతాలను గురించి నే నెరుగను అవి ఈ నవలని అర్థం చేసుకోవడం లో సహకరిస్తాయో లేదో తెలీదు సిద్ధాంతాల కోసం నేను రచన చెయ్యను అలా చెయ్యమని ఎవరికీ సలహా ఇవ్వను నేను ఆ నవలల్లో చెప్పిన విషయాలు ఏవైనా ఆ సిద్ధాంతాలలో ఉంటే ఉండివుండవచ్చు అవి నేను జీవితం ద్వారా గ్రహించినవి కాని పుస్తకాలద్వారా మాత్రం గ్రహించినవి కావు

9 చదువు నవల ద్వారా చదువు గురించి మీరు చెప్పదలచుకున్నది ఏమిటి? చదువు అనేది విద్యా? ఎరుకా? చదువు దేనికోసం? జీవనోపాధికా? జీవన సంస్కారానికా?

- ఈ ప్రశ్న వేగ్‌గా ఉంది చదువు అంటే నేర్చుకోవటం ఇంటా బయటా నేర్చుకోవటం చదివిన చదువు అంతా జీవనోపాధికి ఎప్పుడూ పనికిరాదు అక్షరాలు నేర్చుకొనేటప్పుడు అది జీవనోపాధికి పనికి వస్తుందా రాదా? అని ఎవరైనా ఆలోచిస్తారా? నేర్చుకొన్న భాష

తర్వాత ఎన్ని రకాలుగానైనా ఉపయోగపడవచ్చు అలాగే మెట్రిక్యులేషను ఏ జీవనోపాధి కోసం చదివే వాళ్ళు చదువైనా ఒకటే కదా? తరువాత నుంచే కదా మెడిసన్, ఇంజనీరింగు కోర్సుల్లాంటి వాటి కోసం చదువు అనేది మారేది జీవనోపాధి కోసమే చదువు అనేది అర్థం లేని మాట పూర్తి చదువు ఎవ్వరూ ఆ ఉద్దేశ్యంతో చదవరు డిగ్రీలు తీసికొన్నంత మాత్రాన చదువు పూర్తి అయినట్లు కాదు నేను చదివిన ఎమ్ ఎస్సీ చదువు నా జీవనోపాధికేమి ఉపయోగపడింది

10 ఈ మధ్య విరసం సభల్లో ఎవరో మీ చదువు నవల్లో ''విష్ణుశర్మ'' ఇంగ్లీషు ''చదువు'' నవలా పోలికలు కన్పిస్తున్నాయి అన్నారుట! దానిపై మీ అభిప్రాయం ఏమిటి?

- దాన్ని ఎవరు రాసారో నాకు తెలియదు అది చదువుకు ముందు వచ్చిందో వెనుక వచ్చిందో నాకు తెలియదు అది విశ్వనాధసత్యనారాయణ రాశాడని ''చదువు'' కంటే ముందు వచ్చిందని మీరు అంటున్నారు కాబట్టి ఒక విషయం మాత్రం చెప్పగలను ఇంగ్లీష్ చదువుని ఆయన ''కిండిల్'' చేస్తూ రాసి వుండవచ్చును మరి పోలికలు ఎలా వచ్చి యుంటాయో నాకు అర్థం కావడం లేదు

11 ఒక ఉద్యమ కాలములో వచ్చిన ఉద్యమ నవల వలన సమాజానికి ఎక్కువ ఉపయోగమా? లేక ఆ ఉద్యమం ముగిసాక ఆ ఉద్యమాన్ని ప్రతిబింబిస్తూ వచ్చే సంఘ చారిత్రాత్మక నవలకి ఎక్కువ ఉపయోగమా? ఈ రెండు పద్ధతులలో మీరు దేన్ని ఎందుకు ప్రిఫర్ చేస్తారు?

- ఉద్యమాన్ని గురించే నవల రాయదలచుకుంటే ఉద్యమం ముగిసాక రాయడం దండుగ, హిస్టారికల్ రికార్డు గానే మిగులుతుంది ఉద్యమం అవసరమని, అది జరుగకపోతే సమాజానికి నష్టమని నిరూపిస్తూ రచనలు సాగాలి అభ్యుదయ సాహిత్యానికి సహాయంగా చదువు రాశాను ''చదువు'' వుద్యమ నవల కాదు నేను వుద్యమ నవలలు రాయలేదు

12 బ్రిటీష్ సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా జాతీయోద్యమం ప్రజా ఉద్యమం అయింది ఆ చారిత్రక పరిస్థితులలో అంతకు మించిన బలమైన ప్రజా మార్గం వేరొకటి లేదేమోనని అనిపిస్తుంది అలాంటి పరిస్థితులలో జాతీయోద్యమం పట్ల సానుభూతి చూపటం పోయి స్కెప్టిక్ టరుగా మిగిలిన మీరు దాన్ని తెగడ్డం చూస్తే మీరు మీ సామాజిక బాధ్యతనే విస్మరించినట్లు కొందరు అభిప్రాయం వెలిబుచ్చారు వారికి మీరిచ్చే సమాధానం?

- సామాజిక బాధ్యతని విస్మరించాను అంటే నేను అంగీకరించను అది రాజకీయ బాధ్యత అని అన్న వాళ్ళ ఉద్దేశ్యం అయి వుండవచ్చు నేను రాజకీయాలకు పనికి రాను ఆ ఉద్యమంలోకి నేను దూకి ఉంటే ఈ రోజు నా జీవితం ఇలా ఉండేది కాదు అది ఎలా ఉండేదో చెప్పటం కష్టం నేను రాజకీయాలలో చేరి ఉంటే రెంటికీ పనికి రాకుండా పోయేవాడినేమో!? ఇకపోతే ఆ ఉద్యమం పట్ల నాకు ఎలాంటి సానుభూతీ లేదు ఉండాల్సిన పని లేదు అదంతా ఒక ఫ్రాడ్ దానిని నేను స్వయంగా చూశాను నెహ్రూ కోర్టుల్ని గుర్తించనన్నాడు బాగానే ఉంది మరెందుకు పోలీసులని గుర్తించాడు? నా వెంట కోర్టుకు రమ్మని అంటే వచ్చి ఉండేవాడా! అదొక హంబక్ ఇక ఉప్పుసత్యాగ్రహం మాస్ అరెస్టుల కోసం గాంధీ చేసిన పొలిటికల్ స్టంట్ అది - ఉద్యమం కాదు 1921లో జరిగిన ఉద్యమం

నాకు నచ్చింది అప్పట్లో జైళ్ళకెళ్ళటంలోని ఫార్స్‌ని ఎత్తిచూపిస్తూ కథ రాసి భారతికి పంపితే అది నిజమేనని ఒప్పుకొని చక్రపాణిగారు త్రిప్పి పంపేశారు అటుతర్వాత దాన్ని ప్రబుద్ధాంధ్రలో శ్రీపాద సుబ్రహ్మణ్యం శాస్త్రిగారు ప్రచురించారు

13 సీతమ్మ భర్త శ్రీమన్నారాయణని అర్ధాంతరంగా చంపడంలో మీ ఉద్దేశ్యం ఏమిటి? అప్పట్లో అయినా ఇప్పట్లో అయినా తండ్రి యాజమాన్యంలోని కుటుంబాలే ఎక్కువ కదా? మరి లలా తల్లి పోషణలోకి నవలానాయకున్ని లాగటంలో మీకు ప్రత్యేకమైన ఉద్దేశ్యం ఏమైనా ఉన్నదా?

- నాకొక అలవాటు ఉంది నా రచనలని మళ్ళీ చదవను మీరు చెప్పే పాత్రలు గుర్తు లేవు ఆ తండ్రి చనిపోవడం వలన కథకు నష్టం వచ్చి ఉంటే వచ్చి వుండవచ్చు అంతకంటే బాగా ఉపయోగకరంగా రాయడం నాకు చేతకాకపోయి ఉండవచ్చు

నా తండ్రి నా అయిదవ యేట చనిపోయాడు తల్లి 9వ యేట చనిపోయింది అప్పటినుంచి నేను ఆర్ఫన్‌ని నాకు అనుభవం లేని విషయం అయినా స్టడీ చేయకుండా నేను రాయను

14 ''ప్రకృతి అంటే నాకిష్టం వర్ణనలు చేయటానికి నాకు మాడెస్టీ అడ్డు వస్తుంది!'' అని మీరన్నారు కదా మరి 'చదువు' నవలలో ఒకటి, రెండు చోట్ల కొద్దిపాటి వర్ణనలు చేశారు కారణమేమిటి? అవి అంత అవసరం అని భావిస్తున్నారా?

- పర్టిక్యులర్ స్పాట్‌ని ఇన్‌వోక్ చేయడానికి నేను వర్ణనలు చేస్తాను ఉదాహరణకీ క్రొత్త జీవితంలో చేసినట్లు గుర్తు అందులోని మహారాష్ట్రీయుడైన విఠల్ నాకింద పని చేసిన పాండురంగ విఠల్‌పేరే అది ఆ పేరు టిపికల్‌గా ఉండటం వలన పెట్టాను కాని ఆ కథ అతని జీవితం కాదు, అలాగే 'చదువు'లో కొద్దిపాటి వర్ణనలు చేశానేమో గుర్తు లేదు

15 మీరు పాత్రోచిత భాష కానీ, మాండలిక భాష కానీ మీ రచనలో వాడకపోవడానికి కారణం ఏమిటి?

- నేను పాత్రోచిత భాష వాడాను కాని అది - కొట్టవచ్చినట్లు కన్పించకపోవచ్చు

మాండలీకాలు రాయకూడదని నాకు ఏమీ లేదు నేను రాసినదంతా కృష్ణా, గోదావరి మాండలికాలలోనే నైజాం మాండలికాలతో ఒక కథ రాశాను బూర్జువా రియలిస్టిక్ రచనలలో ఈ పాత్రోచిత భాష చాలా కాంప్లికేటెడ్ నా చిన్నతనంలో నవ్య సాహిత్య పరిషత్తులో, వలీఖాన్ భాష గురించి వాదోపవాదాలు జరిగేవి హిందీ రాయకూడదు రాస్తే ఉర్దూలో రాయాలి ఉర్దూలో మాట్లాడితే ప్రేక్షకులకి అర్థం కాదు మిశ్రమ భాష వాడేటప్పటికి అవి జటాక్ సాహెబ్ భాష అయింది

16 తెలుగు స్వతంత్రలో 'తారాపథం' పేరుతో వచ్చిన కొన్ని సమీక్షలు చూస్తుంటే అవి మీరే రాసినట్లుగా కన్పించింది తారాపథం మొత్తం మీరే రాశారా?

- అశ్విని అనే పేరుతో తారాపథంలోని సినీ ఫీచర్స్ రాశాను కొన్ని రాజకీయ వ్యాసాలు రాశాను

17 మీ కథలు నవలల్లో చిత్రించిన జీవితంలోని చైతన్య స్థాయికి మీ వ్యాసాలలో కానవచ్చే చైతన్య స్థాయికి మధ్య వైరుధ్యం స్పష్టంగా కన్పిస్తున్నది కారణాలు ఏమిటి? అలాగే

మీ వ్యాసాలకి వచ్చిన ప్రచారం, ఇస్తున్న ప్రచారం మీ కథలకు, నవలలకి రాలేదు  బహుశా ఈ వైరుధ్యం వల్లనో ఏమో?

- వ్యాసాలలో ఉండే చైతన్యం, సిద్ధాంత చర్చలు కథలలో ఉండటానికి వీలు లేదు నవలల్లో, కథలలో వుండే మనుషులు మామూలు మనుషులు  వాళ్ళు మాట్లాడుకొనేవి మామూలు మాటలు  నన్ను కథలు మాని వ్యాసాలు మాత్రమే రాయమని సలహాలు యిచ్చిన వారు లేకపోలేదు

18  మీ సాహిత్య ప్రయోజనంలోని వ్యాసాలలో అక్కడక్కడా అప్పటి రచయితల రచనలని గురించిన లోటుపాట్లు చర్చించడం కన్పిస్తుంది  ఇటీవల మీరు వ్రాసిన వ్యాసాలలో ఈ మధ్య వెలువడ్డ వామపక్ష రచనలలోని మంచిచెడ్డలను గురించిన ప్రస్తావన ఎందుకు చేయలేదు?

- నేను హాబిట్యుయల్‌గా అలా అప్పట్లో కూడా రాయలేదు  ఇప్పుడూ రాయటం లేదు ఈ మధ్య నేను సాహిత్య వ్యాసాలు రాయటం లేదు  రాజకీయ వ్యాసాలు రాస్తున్నాను

19  ఈ మధ్య మీరు రచనలు చేయటం ఎందుకు మానేశారు?

- మద్రాసులో తెలుగు జీవితం ఉందని ప్రెటెండు చేస్తూ నేను కొన్ని కథలు వ్రాశాను ఇంకా ప్రెటెండు చేయడం నాకు చేతకాలేదు  నాకు అరవం రాదు  వీళ్ళ జీవితాలలోనికి నేను పెనిట్రేట్ కాలేకపోయాను  అందుకే రచనలు చేయటం మానేశాను

20  చదువు నవల పైన మీకు తెలిసిన ఏ రచనల ప్రభావం ఏమైనా వున్నదా? ఈ నవలని అనుకరిస్తూ ఏదైనా నవలలు మీకు తెలిసి వెలువడ్డాయా?

- లేదు

21  సుందరం ఆలోచనల్లో మేధావి అయినా ఆచరణలో ఘటనలకి బానిస లాంటి వాడు  దానికి కారణం అతను పెరిగిన కుటుంబ వాతావరణం  దాని సంస్కార ప్రభావం ఏమో అనిపిస్తోంది  ఈ కుటుంబ ప్రభావమే ఈనాడు కూడా మిడిల్ క్లాస్ ఇంటలెక్చ్యువల్స్ చాలా మందిని విప్లవాల పట్ల సానుభూతిపరులుగానే మిగులుస్తున్నది  కాని క్రియాశీలురుగా చేయడం లేదని కొందరి అభిప్రాయం  ఈ విషయం పట్ల మీ అభిప్రాయం?

- అది ఒకరి అభిప్రాయం  ఆ అభిప్రాయం అలా వుండనీయండి

22  మారుతూ వస్తున్న సామాజిక చైతన్యంలో ఈ ''చదువు'' నవల విలువ పెరిగిందనుకుంటున్నారా? తరిగిందనుకుంటున్నారా?

- మీరే చెప్పండి  వింటాను

23  టి వి శంకరం అనే పేరుతో మీరు రాసిన కథలు ఎన్ని? వాటిలో ఎన్ని సంపుటాలుగా వెలువడ్డాయి? వాటి పేర్లు జ్ఞాపకం వున్న మేరకు చెప్పగలరా? అలాగే నవలలు ఎన్ని రాశారు?

- టి వి శంకరం అన్న పేరుతో అప్పట్లో కొన్ని కథలు సెటైరికల్‌గా రాశాను  ఎన్ని రాశానో గుర్తు లేదు  500 పైగా కథలు వ్రాశాను  వాటిలో చాలా భాగం పోయాయి కథాసంపుటాలు 10, 12 వెలువడినట్లు గుర్తు  ''నిలువ నీరు'', ''కాలభైరవుడు'', ''వరప్రసాదం'' మిగిలినవాటి పేర్లు గుర్తులేదు  నవలలు ఎన్ని రాశానో జ్ఞాపకం లేదు

24 ఉద్యమాలకి ఊపిరి ఆవేశం మీరు ప్రధానంగా ఆలోచనాశీలియైన మేధావి అందువలన తెలుగుదేశములోని ఏ ఉద్యమాలకి మీరు సాంధ్యం వహించలేదనుకుంటాను లందువలననే వామపక్ష ఉద్యమాలన్నీ ''మీరు వాటిలో వున్నంత సేపే, వుంటున్నంత సేపే మిమ్మల్ని గుర్తించాయని గుర్తిస్తున్నాయని సంపూర్ణముగా మీరు తమ ఉద్యమం తాలూకు రచయితని వారు అనుకోలేదని నా విశ్వాసం ఎందుకంటే శ్రీశ్రీకి ఏమాత్రం తీసిపోని, అంతకంటే ఎక్కువగానే సాహిత్య కృషి చేసిన మీకు శ్రీశ్రీకు మరెవరికో ఇచ్చినంత ప్రచారము ఇవ్వలేదు ఇది ఉద్యమాల లోపమా? తెలుగు జాతికి ఫిక్షన్ మీద వుండే చిన్నచూపా? ఈ జాతికి పట్టిన కవిత్వపు జబ్బా?

- శ్రీశ్రీకి పాపులార్టీ వుంది దానిని వారు వాడుకున్నారు నాకు పాపులార్టీ లేదు నన్ను వాడుకోలేదు

25 ఆధునిక అభ్యుదయ కవిత్వంలో శ్రీశ్రీకి యుగకర్త అనే స్థానం ఇచ్చారు ఈ కాన్సెప్ట్ కేవలం ఒక కవిత్వమునకే పరిమితమని తెలుగు మేధావుల భావమా? దాదాపు నాలుగయిదు సాహిత్య ప్రక్రియల ద్వారా అభ్యుదయంను సాహిత్యవ్యాప్తి చేసి మధ్యతరగతి సంస్కారాన్ని విప్లవాభిముఖముగా చేయడానికి మొదటి నుంచి ప్రయత్నించిన మీరు, శ్రీశ్రీ కంటె ఏమాత్రం తీసిపోని సామాజిక చైతన్యం కలిగించిన మీకు ఆ స్థానం ఇవ్వడానికి తెలుగు మేధావులు ఇంకా మీనమేషాలు ఎందుకు లెక్కిస్తున్నారు?

- యుగకర్త అవునా కాదా అనేది కాలము నిర్ణయిస్తుంది వీరేశలింగము, గురజాడ ఫిక్షన్ రైటర్స్‌కి యుగకర్త స్థానంరాలేదా? ''శ్రీశ్రీని యుగకర్తగా గుర్తించడం లేదు'' అనే నా అభిప్రాయాన్ని నేను విత్‌డ్రా చేసుకోవడం లేదు శ్రీశ్రీ ఒక పర్టిక్యులర్ పాయింటుని ఎనలైజ్ చేసి రాయలేడు జీవితం, చరిత్ర టోటల్‌గా తీసుకొని మంచి కవిత్వం రాయగలడు అయితే ఆ కవిత్వం గద్దర్ పాటలా ప్రజలను కదిలించలేదు అయితే గద్దర్ పాట నిలువదు శ్రీశ్రీ కవిత్వం నిలుస్తుంది ప్రోస్ రైటింగ్స్‌కి అవసరం అయ్యే ఒక్క లక్షణం శ్రీశ్రీలో లేదు క్రిటిక్‌గా కూడా అతని మీద నాకు అంత గొప్ప అభిప్రాయం లేదు

*ఇంటర్వ్యూ చేసిన తేదీ 7-3-1980*

*ముద్రణ ప్రజాసాహితి, మాసపత్రిక, అక్టోబరు 1980*

# 26. ప్రజలభాషా, ప్రజల సాహిత్యమూ

సమాజంలో కలిగే రాజకీయ మార్పులు సహజంగా సాంస్కృతిక రంగాలలో మార్పులను తెస్తాయి ఒక్కొక్కప్పుడు ఇవి సాంఘిక ఆచార వ్యవహారాలలో కన్న కళారంగాలలోనే బాగా ప్రతిబింబిస్తాయి కూడా ఇందుకు అంతు లేని ఉదాహరణలు చూపవచ్చు ఈనాటి రాజకీయ పురోగామి భావాలైన ప్రజా తంత్రవమూ, జాతీయ విమోచనవమూ, పౌరహక్కులూ, ప్రపంచశాంతీ మొదలైనవి వాస్తవ జీవితంలో కన్న సాహిత్యంలోనూ, ఇతర కళారూపాలలోనూ హెచ్చుగా కనబడుతున్నాయి తమదాకా రాకుండా ఉంటే కట్నాల నిషేధాన్నీ, విడాకుల చట్టాన్నీ సిద్ధాంతరీత్యా ఆమోదించే వాళ్ళూ, కథలలోనూ, నాటకాలలోనూ

చూసి హర్షించేవాళ్ళూ చాలామంది ఉంటారు అలాగే విప్లవభావాలు ఇతర దేశాలకు సంబంధించినంతవరకూ గట్టిగా బలపరచబడతాయి (కథలలో కూడా విప్లవ భావాలను చూసి హిస్టీరియా తెచ్చుకునే బెదురుగొడ్లు లేరనికాదు )

ఇది రాజకీయ యుగమని నేను లోగడ ప్రతిపాదించాను అది సరిఅయిన ప్రతిపాదనగానే కనబడుతుంది ఒకప్పుడు మతమూ,ఫ్యూడల్‌సంస్కృతీ నిర్వహించిన 'దుష్టపాత్ర' ఈనాడు రాజకీయాలు వహిస్తున్నాయి ఉదాహరణకు బ్రాహ్మణ మతం మీద (వైదిక మతంమీద కాదు) తిరుగుబాటు చేస్తూ వచ్చిన అనేక ఉద్యమాలు విఫలమయాయి బ్రాహ్మణ మతానికి మూలాధారమైన కుల వ్యవస్థ చెక్కు చెదరలేదు కాని ఉద్యమాల వెంట వచ్చిన గొప్ప సాహిత్యం ఆదరణ పొందింది బ్రాహ్మణులను శాపనార్థాలు పెడుతూ శైవులు రాసిన గ్రంథాలను బ్రాహ్మణులు కూడా నెత్తిన బెట్టుకున్నారు - అయితే ఈనాడు మతపరంగా అభ్యుదయ రచనలు చేసి వాటిని ఉత్తమ సాహిత్యంగా ఆమోదింపజేయటం సాధ్యంకాదు అందుకు నాకు తోచిన కారణం ఇది మత యుగం కాకపోవటమే అదేవిధంగా ఫ్యూడల్ సంస్కృతి తాలూకు శ్లేష రచనలూ, అలంకార ప్రధాన రచనలూ, మాటల గారడీలూ పెట్టి ''వసు చరిత్ర'', ''రాఘవ పాండవీయం'' లాంటి రచనలు అభ్యుదయకరంగా రచించి ఉత్తమ సాహిత్యం అనిపించటం ఈనాడు సాధ్యంకాదు కారణం, జీవితంలో అంతో ఇంతో ఫ్యూడల్ వాసనలున్నా, సాంస్కృతిక రంగం కొంచెం ముందు ఉండటం చేత మాటల చమత్కారం ఈనాడు నిరుపయోగమే శ్రీశ్రీ రచనలలో కూడా మాటల గారడీకి సాంస్కృతిక రంగంలో చోటు ఉండే అవకాశం లేదు

తేలేదేమంటే, జీవితంకన్న కళలు ఒకమెట్టు ముందుండి, భావికి సంకేతాలుగా ఉంటాయి, ఉండాలి! ఇది మన సమాజాల కనీసావసరం అని చెప్పవచ్చు ఎందుకంటే ఈ ఆధారం పాశవిక దశనుంచీ మానవులు అవలంబిస్తూనే వస్తున్నారు వాన రాకముందే వాన నృత్యాలు జరిగేవి, వేటకు పోక ముందే వేట నృత్యాలు చేసేవాళ్ళు - రావణుడు హోమం చేసిగాని యుద్ధానికి వెళ్ళేవాడు కాడుట, హోమం చెడగొట్టితే యుద్ధంలో వాడికి జయం అనుమానాస్పదం! మనం ఈనాడు సామాజికంగా చేసే హోమం కళలలో భవిష్యత్తును ఆవాహన చెయ్యటం

ఇది రాజకీయ యుగమని జ్ఞాపకం ఉంచుకుని, రాజకీయ భవిష్యత్తు ప్రజా సామాన్యమైనదని గుర్తించినాక ఇందుగురించి ఏ రంగుకు చెందిన రాజకీయవాదీ అభ్యంతరం చెప్పడు - కళలు ప్రజలకు సన్నిహితం కావాలనీ, ప్రజల పరం కావాలనీ స్పష్టమవుతుంది

నిజానికి, ఏ కృష్ణదేవరాయల కాలంలోనో ప్రజా సాహిత్యం అన్న మాటకు అర్థం ఉండేదికాదు, ఉంటే జానపద సాహిత్యం అన్న అర్థం ఉండేది, అది సామాజిక పురోగమనానికి పనికి వచ్చే సాహిత్యం అయి ఉండేదికాదు అట్టడుగు ప్రజల '' ఎస్కేపిస్టు'' సాహిత్యమే అయి ఉండేది

కాని ఈనాడు ప్రజా సాహిత్యం అన్నదే సాంస్కృతికంగా ఉత్తమ సాహిత్యం కావాలి కాని అటువంటి సాహిత్యం రావటానికి గల అవాంతరాలు రాజకీయమైనవి, మూఢమైనవీనూ

ప్రజల సాహిత్యానికి ప్రాణం ప్రజల భాష. పాతకాలపు కవులు తమ రచనలను ప్రజల భాషలో చేసి ఉండటం ఎంత అసంభావ్యమో, ఈనాటి ప్రజా జీవితాన్ని నన్నయభట్టు భాషలో చిత్రించటం అంత అసంభవం. చిన్నయసూరి నాటిదాకా శిష్టులవ్యావహారికభాషలోసాగుతూవచ్చిన సాహిత్య సృష్టికీ, గ్రాంధిక భాషావాదం సైంధవుడల్లే అడ్డుపడి సాహిత్యతత్వాన్ని వెయ్యి సంవత్సరాలు వెనక్కు నెట్టజూచింది. ఈ సంధవుడి అడ్డుతొలగించటానికి గిడుగు రామ్మూర్తి గారు విప్లవం చేసినంత పని చేయాల్సి వచ్చింది।

రామ్మూర్తిగారు తమ ఉద్యమాన్ని ఇంకా సాగిస్తూండగానే రాజకీయ రంగంలో తుఫానులు తీవ్రంగా చెలరేగి,రష్యన్ విప్లవమూ, డిప్రెషనూ, రెండో ప్రపంచ యుద్ధంలాంటివి బీభత్సం కలిగించి, ''శిష్టవ్యావహారిక భాష'' అనే దానికి కాలదోషం పట్టించాయి.

సుప్రసిద్ధ సినీ ఆర్టు డైరెక్టరు మాధవపెద్దిగోఖలే మొట్టమొదటిగా తెలుగులో ''అలగావాళ్ళ'' భాషలో, వాళ్ళ జీవితానికి సంబంధించిన కథ1941 లోరాశాడు. దాన్ని నేను ఆంధ్రపత్రిక వారపత్రికలో వేశాను. వెంటనే రెండు రకాల రియాక్షన్లు కనిపించాయి.

ఆంధ్రపత్రిక కార్యాలయంలో ఎక్కువమందికి గోఖలే కథ సాహిత్య మనిపించలేదు. వాళ్ళకు పట్టొచ్చినది అలగా భాష. అందులో కొందరు ఉదారులైన మిత్రులు, ''వాళ్ళ నోటి మాటలు వాళ్ళ భాషలో ఉండవచ్చు కాని కథనం కూడా అదే భాషలో ఏమిటీ?'' అన్నారు. అంటే వాస్తవికత పాత్రోచిత భాష దాకా వస్తే వారికి అభ్యంతరం లేదు. కాని కథకుడే ''అలగా వాళ్ళ'' ప్రతినిధి కావటం ఏమిటీ? వాడు మధ్య తరగతిలోనే ఉండాలి।

రెండో రియాక్షన్ దీనికి పూర్తిగా వ్యతిరేకం। గోఖలే కథ వచ్చిన వారంలోనే నేను రాయిస్టు మిత్రుడు నరహరి అనే అతన్నికలిశాను. ''ఎంత అన్యాయం జరిగిందండీ। నేను రాయాల్సిన కథ మీ బ్రాహ్మణ అబ్బాయి రాసేసాడు। అది చదివిన రాత్రి నేను కన్ను మూయలేదు,'' అన్నాడు.

ప్రజల భాషలో కథ రావటంలో ఉండే ఔచితి ఆనాటి రాయిస్టుకు అందరికన్నా బాగా అర్థమయింది. ఇది గమనార్హం.

గోఖలే కథలోని విషయాన్ని గురించి ఎవరూ అభ్యంతరం చెప్పలేదు. కారణం అందులో రాజకీయ వాసన ఏమీలేదు - కాని అదే పద్ధతిలోగోఖలే దరిమిలా రాసిన కథలు అభ్యుదయోద్యమంలో ఇమడగలిగాయి.

కథనంలోకి కళాకారుడి కుంచెను ఆ 'అలగా' భాషలో అంత ప్రౌఢంగా వాడినవాడు గోఖలే తప్ప మరొకడు ఉన్నట్టు నాకు అనిపించలేదు.

ప్రజల భాషకు సంబంధించిన మరొక అంశం ప్రాంతీయత. గోఖలే కథలలో వాడిన భాష గోఖలే ఊరివాళ్ళకే పట్టొచ్చిందంటే, ఇతర ప్రాంతాల వారికి ఎలా ఉండాలో ఊహించవచ్చు, సాహిత్యం జాతికంతకూ చెందిన దైనప్పుడు ప్రాంతీయ భాషలు వెలిబెట్టినట్టుగా ఉండటమూ,వేరువేరు ప్రాంతాల వారు తమ ప్రాంతీయ నుడికారాలలో ఉండే మాధుర్యాన్ని తామేగుర్తించకపోవటంవల్ల సాహిత్యంలో అనేక ప్రాంతాల నివసించే జనసామాన్యపు భాషా వారిజీవితాలకు సంబంధించిన ఉత్తమ రచనలూ ఇతర ప్రాంతాల వారికి అందవు. సాహిత్యాభిలాషులూ, అభిమానులూ అని చెప్పుకునేవారు వెయ్యేళ్లనాటి భాష అర్థం

చేసుకోగలరుకాని, రెండొందల మైళ్ళ దూరంలో జనం నిత్యమూ వాడుకునే చైతన్యం గల జీవద్భాషను అర్థం చేసుకోలేని స్థితిలో ఉంటే ఏమనాలి? వాళ్ళు ఆ ప్రజల భాషలో వచ్చే ఉత్తమ రచనలను రాజకీయ కారణాలవల్లే సాహిత్యంగా గుర్తించకపోగా,దుమ్మెత్తిపోస్తే ఇంకా ఏమనాలి?

సాహిత్య రూపాలుగాని,ప్రమాణాలుగాని, ఆశయాలుగాని కాలానుగుణంగా మారుతూవచ్చినట్టే సాహిత్యానికి సంబంధించిన సమస్యలు కూడా మారుతూ వస్తాయి ప్రజల భాష ప్రజల సాహిత్యం అనేది ఈ కాలపు సమస్య తన భారత రచన జనానికి మోదం చేకూర్చుతుందని తిక్కన సోమయాజిగారు అనుకున్నది ఆనాటికి నిజమేనేమో! ఆనాటి జనావళికీ, ఈనాటి జనావళికీ చాలా తేడా ఉన్నది ఈనాటి జనావళి రాజకీయ యుగంలో బతుకుతున్నది దీని సమస్యలకు పరిష్కారం భారతంలో దొరకదు వర్తమాన సాహిత్యం ఈ జనావళికి అందుబాటులో లేదు - వాళ్ళు సాహిత్యం దగ్గరికి రారు - వచ్చినా లాభంలేదు వాళ్ళను చైతన్యవంతులను చేసేది వర్తమాన సాహిత్యంలో లేదు - కాళీపట్నం రామారావు, అల్లం రాజయ్య వంటి వాళ్ళ కొన్ని రచనలు మినహాయిస్తే, అవి కూడా దురదృష్టవశాత్తూ రెండు భిన్న ప్రాంతాల ప్రజల భాషా, జీవితాలూ కలవి!

అందుచేత సాహిత్యం, అంటే సాంప్రదాయ సాహిత్యం, ఒకనాడు దేవుళ్ళను నెట్టేసి రాజులనూ, రాజులను నెట్టేసి మధ్య తరగతినీ చేరినట్టే, ఈనాడు మిగిలిన వర్గాలన్నిటినీ నెట్టేసి ప్రజల ధ్గరికి వెళ్ళాలి కనీసం సాహిత్యానికి సంబంధించినంత వరకైనా ప్రజలందరూ ఏకం కావాలంటే అన్ని ప్రాంతాల ప్రజల భాషా ఏకం కావాలి కనీసం ప్రతి ప్రాంతీయ శబ్దజాలమూ, నుడికారమూ అన్ని ప్రాంతాల అందరికీ అర్థం కావాలి అప్పుడే లభ్యుదయకర, పురోగామి సాహిత్యం అన్ని ప్రాంతాల అందరినీ చైతన్యవంతులను చేస్తుంది

ఇది అన్నిటికన్నా రాజకీయమైన అవసరం ఈ యుగధర్మం అటువంటిది ఈ విధమైన సాహిత్య పరిణామాన్ని ప్రతిఘటిస్తూన్నవారు కేవలమూ రాజకీయ దృష్టికలవాళ్ళేగాని, నిజమైన సాహిత్యాభిలాషులుకారు ఈవిధంగా సాహిత్యానికి సంబంధించిన అతిముఖ్యమైన వైరుధ్యం అచ్చుగా రాజకీయ చదరంగంలో ఉన్నదనటం స్పష్టం సాహిత్యం రాజకీయాలకు అతీతంగా ఉండాలని ఈనాడు ఎవరన్నా అంటే వాళ్ళు మోసపుచ్చేవాళ్ళో, మోసపోయినవాళ్ళో కావాలి!

*ముద్రణ సృజన మాసపత్రిక, ఆగస్టు-సెప్టెంబరు, 1980*
*పునర్ముద్రణ 'కళలు - శాస్త్రీయవిజ్ఞానం' సెప్టెంబరు 1980*
*విరసం ప్రచురణ*

# 1. సాహిత్యం ఎందుకు!

రచన ఎందుకు? ఒక వ్యక్తి తన పంచేంద్రియములయొక్క సహాయంతో తనునుసన్ను సంపాదించిన జ్ఞానాన్ని ఇతరులకు సులుపుగా అందచెయ్యడానికి (ఇక్కడ జ్ఞానమనేదాన్ని స్థూలంగా తీసుకోవాలి) మంచి జ్ఞానం వుంది చెడు జ్ఞానం వుంది పనికి వచ్చే జ్ఞానం వుంది పనికిరాని జ్ఞానం ఉంది వేదకాలంలో జ్ఞానాన్ని "కమ్యూనైజ్" చేసేవారు అంటే కొందరు పెద్దలు పనికి వచ్చేదీ మంచిది అనుకున్న జ్ఞానాన్ని ఒక చోట పోగుపెట్టారు ఆ కాలంలో వాఙ్మయమూ, సారస్వతమూ, సాహిత్యమూ అంతా కలిసి ఒక్కవేదమే ఇటువంటి కమ్యూనిజం శాశ్వతంగా సాగటం అసంభవం ఈనాడు మంచిదనిపించిన జ్ఞానం రేపు చెడ్డదిగా పరిణమించుతుంది ఇవాళ పనికి వచ్చిన జ్ఞానం రేపు పనికి రాదు "సూర్యుడు తూర్పు సముద్రంలో పుట్టిభూమి చుట్టూ ప్రదక్షిణం చేసి పడమటి సముద్రంలో అస్తమించుతున్నాడు" అన్నది ఈనాడు నిజంగా కనబడి, రేపు అబద్ధంగా పరిణమించుతుంది ఒక్క పుస్తకంలోనే ఒక్కపేజీలో సూర్యుడు భూమిచుట్టూ తిరుగుతున్నాడనీ, మరోపేజీలో భూమి సూర్యుడి చుట్టూ తిరుగుతున్నదనీ రాయటం ఆ పుస్తకం యొక్క విలువకు హానికరం ఇట్లా మారే జ్ఞానంతో పాటు ఎప్పటికీ మారని జ్ఞానం ఉంది - " ఎనిమిది మూళ్ళు ఇరవైనాలుగు" లాటిది జ్ఞానం చిలవలూ పలవలూ వెయ్యసాగేప్పటికి జ్ఞానాన్ని కమ్యూనైజ్ చెయ్యటం అసంభవమయి, జ్ఞానాన్ని విభజింపవలసి వచ్చింది ఆ విభజనలో సమస్త స్మృతులూ, ప్రబంధములూ, నవలలూ, నాటకములూ, కథలూ, ఖండకావ్యములూ బయలుదేరినై ఇవన్నీ వేదములలోనించే వచ్చినవనటం ఒక విధంగా సత్యమే అంతమాత్రాన వేదముల విలువ కధికం కాలేదు

మానవుడు అనేక ప్రకృతి ప్రేరేపణల (Instincts) కు లోనవుతున్నాడు అటువంటి ప్రేరేపణలలో జ్ఞానాన్వేషణ ఒకటి మాత్రమే దానిని మానవుడు కొంత వరకు తృప్తిపరిచేటప్పటికి మరొక Instinct తల ఎత్తి "నా మాట ఏమిటి? ఇంత జ్ఞానం సంపాదించావు దీన్ని ఏవిధంగా వినియోగించబోతున్నావు? అది నువ్వు నిర్ణయించేవరకూ నేను శాంతి పొందను" అన్నది అప్పుడు మానవుడు తను సంపాదించిన జ్ఞానం వల్ల తనకు చాలా ప్రయోజనం ఉందని తెలుసుకున్నాడు ఈ జ్ఞానం తనలో గుప్తంగా వున్న శక్తులను బయటికి తీసుకురావడమేకాక, ప్రకృతిలో ఉంటూవున్న శక్తులనుకూడా తెచ్చి తనకు కరగతములయ్యేటట్టు చేస్తున్నది "ఇది చాలా బాగుంది ఈ జ్ఞానం మూలంగా నేను శక్తివంతుడినైనాను నేనీ శక్తులను వినియోగించుతాను గొప్పవాడినౌతాను, అందర్నీ శాసిస్తాను, నా మాట విననివాణ్ణి నాకు జ్ఞానంవల్ల లభించిన శక్తులతో రూపుమాపుతాను" అనుకున్నాడు ఇంతలో మరొకInstinct అతన్ని నిలవవేసి "నువ్వీ శక్తులను జాగ్రత్తగా ఉపయోగించు ఈ శక్తులవల్ల నీకు ఎంత ఉపకారం ఉందో అంత అపకారం కూడా ఉంది సుమా నీ శక్తులను ఎట్లా ఉపయోగించుతున్నావో తెలిసి ఉపయోగించు ఇది నీ నెత్తి ఆడించినట్టయితే నువ్వు వీటిని దుర్వినియోగపరిచిన వాడివవుతావు" అని ఉద్బోధించింది దాని వెనక మరొక Instinct తల ఎత్తి "నువ్వు ఒక్కడివీ నీ జ్ఞానం వల్ల బాగుపడి ఏం ప్రయోజనం? నీ సాటి

వాళ్ళంతా ఉన్నారు చూడు వారందరూ నీ వల్ల శక్తి మంతులయినట్టయితే, నీతో పాటు వారుకూడా బాగుపడితే నువ్వు లోక సంగ్రహం చేసినవాడివౌతావు అప్పుడు జ్ఞానాన్వేషణలో నీకు తోడుపడుతారు అప్పుడు ఇంక బోలెడంత శక్తి మీ అందరికీ లభిస్తుంది దానితో ఇతర లోకాలన్నీ జయింతురుగాని మిమ్ముల్నందరినీ పుట్టించిన భగవంతుడితో మీరంతా సమానం అయ్యేవరకూ మీ అభివృద్ధి ఎక్కడా ఆగనవసరంలేదు మీ జాతి యావత్తూ పట్టుబట్టి బ్రహ్మాండంలో ప్రతి అంగమూ జయించవచ్చును,'' అని చెప్పింది

జ్ఞానానికి పిల్ల పుట్టింది ''అసలు జ్ఞానం ఇదీ!'' అన్నాడు మానవుడు భగవంతుడి స్వరూపము అవగాహన చేసుకునేటందుకు ప్రయత్నము చెయ్యటమూ, ఆ తరువాత అతన్ని సమీపించటానికి ప్రయత్నము చెయ్యటం - ఇదీ ప్రతి మానవుడికీ కర్తవ్యం, ఈ నూతన జ్ఞానోదయపు ఉత్సాహంలో మానవుడు చాలా పొరపాట్లు చేశాడు తను భగవత్స్వరూపం అర్థం చేసుకోవటం పూర్తికాకపూర్వమే ఆవేశం కొద్దీ పెద్ద పెద్ద అంగలు వేసి ముందుకు వెళ్ళి తప్పుదారి అని గ్రహించి మళ్ళీ వెనక్కు వచ్చాడు అతను చేసిన మొదటి తప్పేమిటంటే తన Instinct ఆఖరుకు చెప్పిన మాట మరిచిపోయి తాను ఒంటరిగా భగవంతుణ్ణి అర్థం చేసుకుని అతన్ని చేరుకుందామని ఆశించాడు ఈ లోపుగా సాటిమానవులు తను సంపాదించిన జ్ఞానంతో తను ఊహించలేని శక్తులనన్నిటినీ సాధించి ఆ శక్తులను ఎడాపెడా దుర్వినియోగపరుస్తున్నారు ఇందువల్ల జాతికంతకూ ప్రమాదం సంభవించేటట్టున్నది అది కూడని పని తన ఆశయం ఫలించాలంటే - ఈ నూతన జ్ఞానోదయం వల్ల ఏదైనా సాధించాలంటే తన ఒక్కడివల్లా కాదు ఇది ప్రత్యేక వ్యక్తి ఆశయం కాదల్లే కనిపిస్తున్నది జ్ఞాన సంపాదనకూ దాన్ని ఉపయోగించటానికీ ఒక జీవితం ఎట్లాగూ చాలదు ఆ పని తాను అనుకున్న దానికంటే దుర్ఘటంగా ఉంది ఇది జాతికి వదిలి పెట్టవలసిందే ఈ అన్వేషణలో తాను చావటమే తనవల్ల కాగల పని ప్రతి మానవుడూ వాడి సంతానమూ, వారందరి సంతానమే - ఈ విధంగా బ్రహ్మప్రళయం వరకు, ప్రయత్నం ఆగకుండా జరగవలసిందే ముందు తను సంపాదించిన జ్ఞానాన్ని ఇతరులు దుర్వినియోగం చెయ్యకుండా కొన్ని కట్టుబాట్లు చెయ్యాలి జ్ఞానం మీదా, అందువల్ల పొందదగిన శక్తుల మీదా తనకున్న హక్కే అందరికీ ఉన్నది కాని ఈ సహజమైన హక్కుకు వారంతా అర్హత సంపాదించలేదు - వారికి ఆత్మవికాసం లేదు, సంస్కారం లేదు

సృష్టిలో ఉన్న శక్తులనూ తనకు ప్రకృతి ప్రసాదించిన శక్తులనూ దుర్వినియోగపరచకుండా మానవుడి స్వేచ్ఛను అవసరమైనంతవరకు అరికట్టడానికిగాను న్యాయ చట్టమూ, నీతిచట్టమూ పుట్టినై మానవుడి సంస్కారమూ ఆత్మవిశ్వాసమూ పెంపొందినకొద్దీ మానవుడు ఎక్కువ స్వేచ్ఛకు అర్హత పొందుతూ, ఒకచెంపనించి వృద్ధి అవుతున్న జ్ఞానాన్ని జాతియొక్క ఉన్నతికి ఎక్కువగా ఉపయోగించుకో గలుగుతూ, తనను బందించిన చట్టాలను క్రమంగా సంస్కరించుకుంటూ వాటినుంచి ఉపాయంగా విముక్తి పొందుతాడు

కాని మానవజాతి యొక్క చరిత్ర చూస్తే ముందు నడక కంటె వెనక్కూ ముందుకూ ఊగటం జాస్తిగా ఉంది మధ్య మధ్య జాతి యొక్క యోగ క్షేమాలు మూఢుల చేతుల్లో పడటం జరుగుతున్నది అటువంటి మూఢులు ఈ చట్టాలను భగవంతుడు మనకు మన

పొగరు అణచటానికి, మన స్వేచ్ఛ అరికట్టటానికీ శిక్షకింద యిచ్చాడన్న నమ్మకంతో వాటి యందు విశ్వాసం, భయ భక్తులు ఎక్కువ కలిగిన వారై, వాటిని అవసరమైన విధంగా సంస్కరిస్తూ ఉండటానికి మారుగా వాటిని మరింత బిగిస్తూ, సంస్కారానికి బయటినించి అపకారం జరగకుండా ఉండటానికి గాను పెట్టిన గోడలకు మరి నాలుగు గోడలను జతచేసి, మానవజాతిని ఖైదీలను చేసి, ఇంకా తృప్తి పొందలేకుండా ఉన్నారు వేదకాలం నాటినుంచీ మానవజాతి క్రమంగా అధోగతికి వెళ్ళుతున్నదనీ, అట్లా వెళ్ళవలసిందేననీ నిర్వచించే వాళ్లుండటం నాకాశ్చర్యం కలిగించదు కాని వాళ్ళే జాతిని పైకి తీసుకు రావటానికి ప్రయత్నం చేద్దామంటే అటువంటి ప్రయత్నం విఫలమవుతుందని విశ్వసిస్తూకూడా, ఈ సంకెళ్ళను మరింత బిగించాలని చెప్పటం నాకు చాలా ఆశ్చర్యకరంగా ఉంటుంది

మనకు కావలసింది వెలుగు - ఆత్మ వికాసం - సంస్కారం - శాస్త్రాలు మనచేత పెడుతున్న జ్ఞానంద్వారా మన కవగతమవుతున్న శక్తిని సద్వినియోగం చేసి జాతిని పైకి తీసుకురావటానికి స్వేచ్ఛ - ముళ్ళ మీదినించి గుడ్డను ఉపాయంగా లాగినట్టు జాతికి ఈ చట్టాలనించి విముక్తి! భగవంతుడియందు మనకు సరి అయిన నమ్మకమే ఉంటే, అతన్ని చేరుకోవటానికి మనము నడిచే నడకే అభివృద్ధి అని మనం నమ్మితే, భగవంతుడు మనకు అందుబాటులో ఉంచిన ప్రతి శక్తీ వినియోగించితే కాని మన అభివృద్ధి పరిపూర్ణం కాదని గ్రహించ గలిగితే, ఈ శక్తిని దుర్వినియోగం చెయ్యకుండా ఉండగలందులకు మనకు సంస్కారం అవసరమని అంగీకరించితీరాలి వట్టి చట్టాల స్వేచ్ఛను దుర్వినియోగం చేసినందుకు శిక్షించుతవేకాని సద్వినియోగం చేసే యోగ్యత కలిగించలేవు ఈ సంస్కారాన్ని మనము శతకోటిలక్షల విధాల సంపాదించగలగవచ్చును కాని వాటిలో కలం కాగితంమీద పెట్టడంకూడా ఒకటి అయితే, ఆ విధంగా సంస్కారం పెంపొందించగలది సాహిత్యం తప్ప వాఙ్మయంలో మరొకటిలేదు

నీతిచట్టాలూ, న్యాయ చట్టాలూ అవసరంలేదని నేనటంలేదని స్పష్టంగా తెలుసుకోవాలి సాహిత్యం ఎందుకు పుట్టిందో ఆ చట్టాలూ అందుకే పుట్టినై - జాతియొక్క అభ్యుదయానికి ఉపకారం చేసే విధానాలు ఒకదానికొకటి విరుద్ధంగా ఉంటున్నవి సంస్కారము పెరుగుతున్నకొద్దీ చట్టరూపమైన న్యాయమూ, నీతీ తరిగిపోవాలి ఇప్పుడు న్యాయ చట్టంచేసేపని అప్పుడు సంస్కారమే చేస్తుంది (ఈనాడు మనం మన ఆడవాళ్ళను భర్తలతో సహగమనం చేయించకుండా ఉండటానికి ఒక చట్టం అవసరంలేదు!) చట్టంలో నూతనంగా కలిగిన మార్పును సాహిత్యం ప్రచారం చెయ్యవచ్చును కాని చట్టంలో జరగవలసిన మార్పుకు సాహిత్యం ఎప్పుడూ విరుద్ధంగానే ప్రచారం చేస్తుంది మన పూర్వ సారస్వతం ప్రచారం చేసిన ధర్మం అప్పుడేకొత్తగా అమలులోనికి వచ్చినదీ, ఎక్కువ మందికి రుచించినదీ అయివుండాలి, లేదా అప్పటికి గ్రంథకారులకు సాహిత్యంయొక్క ఈ ప్రయోజనం తెలియకపోయి ఉండాలి అదీకాకపోతే, ధర్మశాస్త్రం రాసిన సత్పురుషుడే ఆ సాహిత్యం కూడా రాసి వుండాలి అమలులో ఉంటూవున్న నీతికిగాని, న్యాయానికి, గాని ప్రచారం యివ్వటమే సారస్వతం పని అయితే సారస్వతం నీతి శాస్త్రంగానూ న్యాయశాస్త్రంగానూ మారిపోయి, నిజమైన సాహిత్య లక్షణం పోగొట్టుకుంటుంది

ఇది స్పష్టంగా అర్థం చేసుకోనివారికి నేటి సాహిత్యం అవినీతి ప్రచారం చేస్తున్నదనే అపోహ, వేదాలూ, ఉపనిషత్తులూ తొక్కిన మార్గం తొక్కలేదు కనక ఈ సాహిత్యం చెత్తలాగు పెరుగుతున్నదనే అపోహ కలగటం వింతకాదు ఒక కుర్రవాడికి నేను చదువు చెప్పటానికి కూర్చున్నప్పుడు నేను వాడితో మాట్లాడే విషయమూ అందుకు ఉపయోగించే భాషా వాడి వెనుకటి చదువు మీదా, వాడికి గల భాషాజ్ఞానం మీదా ఆధారపడి ఉంటై నావల్ల వాడికి ఉపకారం కలుగుతున్నంత వరకూ వాడికి నాకంటే పండితునితో పనిలేదు - మీదు మిక్కిలి అపకారం ఉండవచ్చును వెనకటివారు పెద్ద పరుగులు పరిగెత్తి ఉండవచ్చును దానికి ఈ నాటి కవులు బాధ్యులుగారు భగవంతుణ్ణిగురించి వేదాలు చేసిన ఘోష యావత్తూ మనల్ని నాస్తికులను చేసి విడిపెట్టింది (మనం స్వార్థంకోసమో, భయంకొద్దీనో గుళ్ళో బొమ్మరాళ్ళకు దణ్ణాలు పట్టుతున్నామేమో! మన అంతఃకరణలను చీల్చి చూస్తే అక్కడ భగవంతుడి వాసన ఏమీలేదు ) ఆదర్శపురుషుల జీవితాలు మన హృదయాలని తాకలేవు వాళ్ళ చరిత్రలు మనం నాటక రంగంమీద చూడవచ్చుగాక, వాళ్ళలో నిజమైన సానుభూతి మనకులేదు వాళ్ళ గొప్పతనం మనల్ని అంటలేదు వాళ్ళ దౌర్బల్యం మనం అర్థం చేసుకోలేం

ప్రతిరోజూ భార్యను చావగొట్టుతూ ఉండేవాడికీ, సంసారం దుర్భరం అనిపించినవాడికీ చెప్పవలసింది కాంతం కథలు - సీతారాముల దాంపత్యంకాదు తెచ్చిపెట్టుకున్న పాతివ్రత్యం సంసార సుఖాన్ని ఎట్లా ధ్వంసం చేసిందో చూపగల సమర్థుడింకా తెలుగు రచయితల్లో రాలేదు

వేదాలూ, ఉపనిషత్తులూ, రామాయణభారతాలూ ఒకే మార్గాన వెళ్ళినవని పామరుడు అనుకోవాలి పండితుడు ఒక్కనాటికీ అనుకోడు

కావ్యానికి ఉపదేశించుటయే ఉత్తమధర్మం అనటం ఉందే, భగవంతుడి దీపారాధనకు వినియోగించే ఆముదం భేది ముందుగా ఉపయోగించటం పరమ పాపమన్నట్టుంటుంది నేటి సాహిత్యం ఉపదేశం చెయ్యకుండా కూడా సంస్కారం పెంపొందించటానికి చాలా పనిచేస్తున్నది అసలు ఉపదేశమనేది మారిపోయి అనేక రూపాలు పొందింది

శ్రీ శ్రీనివాస శిరోమణిగారి ''ప్రతిఫలం'' అనే కథ చూడండి అందులో ఒక భర్త తన భార్యను, ఆమె తప్పు ఏమీ లేనిదే, వదిలిపెట్టి తిరిగి వివాహం చేసుకుంటాడు అతడు చేసిన ఈ పని అతని జీవితానికి ఆవగింజంత అపకారం చెయ్యలేదు కాని నిర్దోషి అయిన అతని మొదటి భార్య విడాకుల చట్టంలేని కారణంచేత స్త్రీత్వానికీ, మాతృత్వానికీ దూరమయింది ఇది చూచి అమిత సంస్కారీ, నాగరికుడూ అయిన యువకుడొక్కడు భార్యను వదిలిపెట్టినవాణ్ణి చంపి, అతని భార్యకు వైధవ్యం కలిగించుతాడు ఆ విధంగా ఆమె స్త్రీత్వానికీ, మాతృత్వానికీ అర్హత పొందుతుంది ఈ కథలో ఒక అధర్మమైన, అన్యాయమైన, అవినీతికరమైన హత్య సమర్థించబడింది ఇందులో ఉపదేశం ఏమీలేదు - '' ఇటువంటి భయంకరమైన అసంస్కారమూ, అనాగరికతా సమాజంలో ప్రబలి ఉన్నందుకు అందరూ తలలు వంచుకోండి'' అని తప్ప ఇది ఉన్న న్యాయచట్టంమీద దెబ్బతియ్యటమే విడాకుల చట్టం తెచ్చుకోండి అని ప్రబోధం ఇందులో లేదు ఎక్కువమంది స్త్రీలు అసంస్కారులయినప్పుడు భర్తలు తమరిని విడిచేదాకా ఆగకుండా తామే భర్తలను విడిచి పెట్టి ఇష్టం లేనప్పుడల్లా ఒక మొగుణ్ణి మార్చటం ప్రారంభించవచ్చును భర్తకు ఎడంగా ఉన్న ప్రతిభార్యా భర్త చేత

విడవబడిందో, భర్తను విడిచిందో ఎవరు చెప్పగలరు? అసంస్కారి హృదయం స్వేచ్ఛను దుర్వినియోగ పరచటానికి ఉబలాటపడటం సహజం

అదీకాకా శ్రీనివాస శిరోమణిగారి కథ మనలో ఆలోచన రేపుతున్నది - మన న్యాయచట్టం గురించి అందరు స్త్రీలకూ స్త్రీత్త్వమూ, మాతృత్త్వమూ సార్థకం చేసుకునే స్వేచ్ఛ యిస్తూ, కొన్ని పరిస్థితులలో మరొక స్త్రీకి ఆ స్వేచ్ఛ లేకుండా చేసి, ఒక హత్యద్వారా - హత్య ద్వారా మాత్రమే- ఆమెకు తిరిగి ఆ స్వేచ్ఛను ఇవ్వగలుగుతున్నది ''దీనికి ఏమంటారు?'' అని ఆ కథ మనల్ని ప్రశ్నిస్తున్నది

శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ఆలోచన రేపే కథలు కొన్ని అద్భుతంగా రాశారు ఒక కథలో ఒక అంటరానివాడు తురకల్లో కలసి గ్రామ మధ్యానికి వస్తాడు, శాస్త్రిగారు దేశభక్తిని గురించి ఆలోచన రేపే కథ ఒకటి రాశారు అందులో ఒక దేశభక్తుడికి తన దేశం ఏది - ఆంధ్రదేశమా? భారతదేశమా? - అని సంశయం వస్తుంది (ఇటువంటి సంశయాలకు ఆలోచనా పరులు త్వరపడి సమాధానం చెప్పకుండా నోరుమూయగల సత్తా ఉంది శాస్త్రిగారి కలానికి)

ఈ ఆలోచన రేపే గుణంలో ఉపదేశానికి లేని శక్తి ఉంది అస్పృశ్యతా నివారణకు గాను చేసిన ఉపదేశం అంతా చెయ్యలేని పని శాస్త్రిగారి కథ ఒక్కటే చేస్తుంది ఉపదేశం మన వ్యక్తిత్వాన్ని పరాభవిస్తుంది ఆలోచన రేపే గుణం వ్యక్తిత్వాన్ని నిద్రలేపుతుంది అనాగరికుడూ, అసంస్కారీ తన హక్కులను దుర్వినియోగ పరచినట్టే బానిసతనానికి అలవాటు పడ్డవాడూ, భావదాస్యం చేసేడూ తన హక్కులను సులభంగా జార విడుస్తాడు అటువంటి 'బానిసల' ఉపయోగార్థం హక్కులు, అనే శీర్షిక కింద కొన్ని సంఘటనలు రాసి శ్రీ ముద్దుకృష్ణగారు చక్కని సాహిత్యం సృష్టించారు వారికి తగిన ప్రోత్సాహం లేకనో మరే కారణంచేతనో ముద్దుకృష్ణగారు సంక్షేపించుకున్నారు మరొకరు ఆ ఛాయలకు పోలేదు నవ్య సాహిత్య చరిత్రలో ఇది ఒక శోచనీయాంశంగా కనిపిస్తుంది నాకు

శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారూ, శ్రీ విశ్వనాథ కవిరాజుగారూ హాస్యనాటికలు రచించి మన మనస్సుకు శాంతీ, సుఖమూ కలిగిస్తారు సాహిత్యం తాత్కాలికంగా చెయ్యగల ఉపకారాలలో ఇంతకంటె ఉత్తమమయినది కనిపించదు విశ్రాంతి, ఆనందమూ మన ఆరోగ్యానికి ఎంత అవసరమో, మన నాగరికతకూ అంత అవసరం మనల్ని చూసి మనం నవ్వుకోగలగటం మాట చెప్పేదేమిటి?

ఇప్పుడిప్పుడు శ్రీనివాస శిరోమణిగారి లాంటి ప్రముఖుల సహాయంతో ''ఖులాసా కథ'' పైకి వస్తున్నది ఈ కథ ప్రచారంలోకి వచ్చిన తరువాత ఎన్నివేలమంది ఆంధ్రులో పరనంలో ఆనందం కనిపెట్టగలిగారు! భావికవులంతా తమ క్షేమానికి ఇప్పటి ''ఖులాసా కథ'' ఆధార భూతమయిందని గ్రహించవలసి ఉండబోతుంది

ఇదంతా ఇట్లావుండగా సాహిత్య కళయొక్క ప్రాముఖ్యత అట్లాగే ఉంది తెలుగులో తొలి గ్రంథమయిన భారతం నాటినుంచీ మనకు వ్యసనం మోస్తరుగా అయిపోయిన రసానందం ఈనాడు చంపుకోలేం కృష్ణదేవరాయల ఆస్థానంలో తెలుగు కావ్యకన్యను వయసు వచ్చిన భోగినితో పోల్చి ఒక కవీశ్వరుడు రాయలచేత స్వయంగా కాలికి గండపెండేరం

వేయించుకున్నాడు అప్పటి కవులంతా కావ్యకన్యచేత రాయల ఆస్థానంలో గజ్జెకట్టి ఆడించారు వారి పుస్తకాలవల్ల జరిగిన లోకసంగ్రహం చూసినట్టయితే పెద్ద సున్నా! ఉపదేశమే కావ్య ప్రయోజనమైతే ఆ గ్రంథాలన్నీ తగలవెయ్యవలిసిందే కాని మరొకటిలేదు

సాహిత్యకళను ఈనాటి భావకవులు ఈ యుగంలో కవులు ఆరాధించనిరీతిగా ఆరాధిస్తున్నారు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, శ్రీ శివశంకర శాస్త్రిగారు మొదలైన కవుల చేతుల్లో సాహిత్యకళ భరతనాట్యం చేస్తున్నది వచన కావ్యం హృదయాన్ని సంస్కరించలేదు ఈ కవులు హృదయ సౌకుమార్యాన్ని వృద్ధి చెయ్యగలుగుతున్నారు ఎప్పటికైనా మేధస్సుకంటె హృదయమే ముందు భగవంతుడి సాన్నిధ్యం సంపాదించుకుంటుందనిపించుతున్నది, ఈ కవుల కవిత్వంచూస్తే నవ్య సాహిత్యం పుట్టేవరకూ సాహిత్య కళచేత మొదడుకు మెరుగు పెట్టించుతూ వచ్చారు ఈనాడు ఈ సౌందర్యం కవిత్వాన్ని ఆశ్రయించి ఆమెచేత హృదయాన్ని సంస్కరింప జేస్తున్నది

అయినా వచనకావ్యానికి కూడా కళ అవసరమే మంచి గ్రంథం అందంగా కూడా ఉండటం ఎంత యుక్తమో, మంచి రచన అందంగా రచించటం కూడా అంత యుక్తమే అందుకనే నాబోటి రచయితలను భాషనేర్చుకోమని ప్రబోధిస్తున్నారు తెలిసినవారు

ఎట్లాగూ సమర్థించటానికి వీలులేని రచనా, రచయితలూ నవ్య సాహిత్యంలోకి చొరబడుతూండటం నేనెరుగుదును స్కూలు ఫైనల్ చదివే కుర్రాళ్లు ఆవేశంకొద్దీ రాసే పిచ్చి కధలనూ, వాటిని అచ్చువేసే పిచ్చి పత్రికలనూ, ఎక్కడినించో కవితలను ఎత్తుకునివచ్చి వాటిని పాడు చేసి అచ్చువేయించుకునే దొంగలనూ సమర్థించటం ఎవరివల్లాకాదు వాళ్ళెప్పుడూ ఉంటూనే ఉంటారు వారిరచనలు పత్రికలు అచ్చువెయ్యక పోతే స్వంతాన అయినా వారు ముద్రించుకోకుండా చెయ్యలేం వాటిని మనం చదవవలసిన అగత్యంలేదు వాటిని గుర్తించటం కూడా కష్టం కాదు అన్నమంతా పట్టి చూడనక్కర్లేదు

''ఈ రచనలన్నీ ఎందుకు?'' అని అడగటం అమిత అమర్యాద కరమైన పని ఆమాటే మనుష్యులను గురించి అడిగితే మన జీవితాన్ని రూపాయికి భీమా చెయ్యటానికి కూడా ఏ కంపెనీ అంగీకరించదు! అయినా ''ఆర్యులు చూపించిన ఆదర్శాలకు భిన్నంగా నడిచే ఈ మనుష్యులంతా ఎందుకు?'' అని అడగటం మనకు నోటివట్టమేకాని దానివల్ల ప్రయోజనం ఏమిటి?

కొందరు పేరుబడ్డ రచయితలు తమకు ప్రచారం కలగటానికి గాను నవ్య సాహిత్య పరిషత్తును పట్టుకొని వేళ్ళాడుతూ, దానితోనూ అది అభిమానించే నవ్యసాహిత్యంతోనూ సానుభూతి లేకపోగా ప్రయివేటుగా దాన్ని నిరసించి మాట్లాడుతూ ఉంటారు వారిని ఏం చెయ్యగలుగుతున్నాం?

ఒక సుప్రసిద్ధ నవకవి రేపు ఒక పురాణం పద్యరూపంగా కూడా రాయబోతున్నాడట! నవ్యసాహిత్యం తాలూకు ముక్కేదో మొహమేదో తెలియని ఈ కవిశేఖరుణ్ణి రేపు నవ్యసాహిత్య పరిషత్తు ఏమి చెయ్యగలదు? ఏమీలేదు!

*ముద్రణ భారతి, సెప్టెంబరు 1937*
*పునర్ముద్రణ సాహిత్య ప్రయోజనా వ్యాసావళి,*
*విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, అక్టోబరు 1969*

# 2. నవ్య సాహిత్యం - ఒకలేఖ

నవ్యసాహిత్యం ఇంత దుస్థితిలో ఉందని నేను కలలో కూడా భావించి ఉండలేదు

ఒకప్పుడు వాడుకభాషనుంచి కూడా ఇటువంటి కనువిప్పే అయింది గుడిపాటి వెంకటచలం గారి "బిడ్డల శిక్షణ" అనే పుస్తకాన్ని ప్రబుద్ధాంధ్రలో విమర్శిస్తూ వెంకటచలంగారి భాషలో కొన్ని లోపాలు చూపి కామేశ్వరరావుగారు ఆ భాషకు కొన్ని సంస్కారణలు సూచించినప్పుడు నాకు కష్టంవేసి ఆ విమర్శకు నాకుతోచిన విధంగా సమాధానం రాశాను కూడాను కాని నాకు కాదగిన కనువిప్పేమో అయిపోయింది ఇంకా పురుడు వెళ్ళని యీ వాడుక భాషదాని అంతటు అది అభివృద్ధి అవుతుంటే చూడరేనివాళ్ళూ, తమ అభిప్రాయాల్ని ఇంకొకరిమీద పామటానికి సిద్ధంగా ఉన్నవాళ్ళూ, కొందరున్నారని నాకు నమ్మకంగా తేలిపోయింది

నిజానికి వ్యాకరణ దోషాలుంటే - కర్తకూక్రియకూసరిగా సమన్వయిం లేకపోతే, వాక్యం లసంపూర్తి ఉంటే - ఆ తప్పులు చూపటానికి ఎవరికైనా అధికారం ఉందంటేనేను అర్థం చేసుకోగలను కాని "వాక్యం మధ్య అచ్చులను అచ్చులుగా ఉంచవద్దు" "కర్మణి ప్రయోగం మానివెయ్యి" అని సూత్రాలు చెప్పటానికి ఎవరికి అధికారం ఎట్లా వచ్చిందో నాకు బోధపడకుండా ఉంది "అది ఉన్నది" అనటానికి "అదియున్నది" అనేకంటే "అదివున్నది" అనటం వల్ల వ్యాకరణరీత్యా "ఉన్నది" అనేమాటకు జరిగిన అధిక గౌరవం ఏమిటి? మనమంతావాడుకలో 'ఉన్నది' అనటంలేదు, 'వున్నది' అనేఅంటున్నాం అని వాదించేవారు "వున్నది" అనే రాయండి "ఉన్నది" అని అంటున్నామని నమ్మేవాళ్ళు "ఉన్నది" అనే రాస్తారూ! కర్మణి ప్రయోగం వాడుకలో అసహ్యంగా వినబడుతుందనికదా వాదన అచ్చంగా మాట్లాడినట్లే రాస్తామని ఎవరైనా ఘంటాపథంగా చెబుతున్నారా?

అయితే ఒకరు "ఉన్నది" అనీ మరొకరు "వున్నది" అనీ ఇంకొకరు "వుంది" అని రాయటం మొదలు పెడితే వాడుక భాష స్టాండర్డు కావటం ఎట్లా? దానికి సమాధానం - "చుట్టములూ, చుట్టాలూ, చుట్టలూ, పుస్తకమూ, పుస్తకమ్మూ, పుస్తకంబూ, ఒకతె, ఒక్కతె, ఒకరిత, ఒక్కరిత, ఒకరు, ఒక్కరు, ఒర్తు ఇటువంటి రూపాంతరాలన్నిటినీ ఆమోదించిన గ్రాంధికం స్టాండర్డు అయిందని ఎట్లా నిశ్వంచాము?

పైగా భాషను Standardize చెయ్యాలని కంకణం కట్టుకుని కూర్చున్నవాడికి ఇటువంటి ఇక్కట్లున్నవో చూపుతాను సంధులు కలపాలా వద్దా? కలపాలనుకుందాం! "అది ఉన్నది" అనటానికి "అదున్నది" అనవలసివస్తుంది హరహర! పోనీ, సంధులు కలపనేవద్దు ఇంగ్లీషులో మాదిరిగా ఏ మాటకామాటరాసి చదివేటప్పుడు కలిపి చదువుదాం! "వచ్చినప్పుడు" "వచ్చిన అప్పుడు" అయింది, బాగానే ఉంది, "వచ్చినట్టుంది" అనేది "వచ్చి న అట్టు ఉంది" అయింది! శివ శివ!

ఇక స్టాండర్డు వాడుకభాషయే విధంగా ఏర్పాటవుతుంది? స్టాండర్డు గ్రాంధికం యెట్లా ఏర్పాటయిందో అట్లాగే భారత కవులు గ్రాంధికమనబడే భాషలో పద్దెనిమిది పర్వాలు రాసి పడవేశారు అది పండిత పామరులందరికీ అభిమాన పాత్రమయింది ఆ భాషకు భిన్నంగా

ఉన్న భాషను పామరులు ఆమోదించలేదు పండితులు ఆ భారత భాషయందే అభిమానం కలిగి తమరచనలు ఆ భాషలోనే చేశారు ఆ భాషకు వ్యాకరణము, నిఘంటువులూ ఏర్పడినై అది స్టాండర్డు భాష అయిపోయింది ఆ కాలంలో భారతం సంపాదించిన ''పాప్యులారిటీ'' ఈ వాడుక భాషలో ఎవరి రచన అయినా సంపాదించి దాని ఆధారం వల్ల ఒక వ్యాకరణమూనిఘంటువూ బయలుదేరితే మనకు స్టాండర్డు వ్యావహారికం వచ్చేస్తుంది

ఇది కేవలమూ భ్రమ అనుకోనక్కర్లేదు ఈ నాడు పరితలకు గుడిపాటి వెంకటచలం గారి భాష నచ్చినట్లు మరొకరిది నచ్చటంలేదు ఆయన రచనవల్ల Inspire అయి రచన చేస్తున్న వారు నోటివెంట జన్మలో ఎన్నడూ ''వస్తో'' అనకపోయినా రచనలో అంటున్నారు దేవుడే మేలు చేసి వెంకటచలంగారు అంటిపెట్టి మరో పాతిక సంవత్సరాల పాటు ఈ విధంగానే రాయటమూ, ఆయన రచన యందు పాఠకుల ఆదరణ ఇప్పటిలాగే అభివృద్ధి కావటమూ జరిగితే వచ్చే తరం వారికి - Standard వాడుకభాష లభ్యం కావటానికి సందేహంలేదు అప్పుడు ''వస్తున్నది'' అనే స్వరూపాలు తప్పులయి ''వస్తోంది'' ''వస్తోవుంది'' అనే స్వరూపాలు రెండూ సాధువులుగానే పరిగణించబడతై

ప్రస్తుతానికి వాడుకభాషకు వ్యాకరణమూ నిఘంటువూ లేదు కదా అని మన మంతా భాషను అభివృద్ధి చేసుకోకుండా ఊరుకుంటామా? ఊరుకోవటంలేదు ఆనాటి కానాడు పత్రికలలో భాష ఏవిధంగా భావప్రకటనకు యోగ్యంగా పరిణామం పొందుతున్నదీ పత్రికలు చూస్తూ వస్తున్న వారికి తెలుస్తుంది వాడుక భాష అంటే మాట్లాడినట్లు రాయటమేనన్న గట్టి నమ్మకంతో రచనప్రారంభించిన నేను ఈనాడు రాసేదానికీ మాట్లాడే దానికీ ఏమీ సంబంధం లేదు ముఖ్యంగా క్రియా రూపాల విషయమై పెడతోవతొక్కవలసివస్తుంది '' ఉండిందీ'' '' ఉండి ఉండిందీ'' అనే రూపాలు నేను ఎన్నడూ నోట అనలేదు అవి రాయకుండా ఇప్పుడు జరగటంలేదు

భాష మీద అభిమానమూ దాన్ని అభివృద్ధి చేసుకుంటామనే యావా లేని వాడి రచన చూడండి ఒకానొక పండిత కవిగారి రచనలో వరుసగా నాలుగు సొట్ట వాక్యాలు చూసి ఒకప్పుడు ఆశ్చర్యపడ్డాను '' ఇట్లారాశారేమండీ'' అని ఆయనను ఎవరైనా అడిగినట్టయితే '' ఇంకెట్లారాయాలి''? వాడుకభాష, భాష రాయటానికి నియమం ఏమిటీ? 'నేను రాసినట్టే నువూరాయి''! అంటాడు

ఈ విధంగా వాడుక భాషను గ్రామ్యంక్రింద గణించే వారుండగా, ఇంకొక తెగవారు గ్రాంధికం వాడుక భాషాకాని భాష ఒకటి సృష్టించేసి తాము స్టాండర్డు వ్యావహారికం సృష్టించామనే అహంకారంతో ఉన్నారు వారు ''వచ్చితిని'' అనీ రాయరు ''వచ్చాను'' అనీ రాయరు ''వచ్చినాను'' అని రాస్తారు! సాక్షాత్తూ నోటివెంట వచ్చేది స్టాండర్డు భాష అనటానికి వీరి అంతరాత్మలు ఒప్పవు వీరు మధ్యమధ్య ''ఫలానివారి భాష స్టాండర్డు భాషకు చాలా దగ్గిరగా ఉంది'' అనటంకద్దు, స్టాండర్డు భాషతో తమకు పరిచయం ఉన్నట్టు వెల్లడిచేస్తూ! వీరిని ఒకందుకు మెచ్చుకోవచ్చును ఒక శబ్దానికిరెండు రూపాలు వీరు ప్రాణం పోయినా ఉపయోగించరు ప్రాణాలన్నీ బిగపట్టివాడుక భాషనురాయటానికి ఇంగ్లీషు రాయటానికన్నా ఎక్కువ శ్రమ పడుతూ, కనీసం వారి స్టాండర్డు ప్రకారం వారి భాషలోతప్పురాకుండా

ఆత్మసంరక్షణలో నిమగ్నులై ఉంటారు వాడుకలో ''ఉన్నది'' '' ఉంది'' యీవిధంగా ఒకటి కన్న ఎక్కువ రూపాలతో మాటను వాడుతూ రచనలుకూడా అట్లానే రాస్తున్నా నాబోటి వాడికి వారి రచన చూస్తే జాలివేస్తుందే కాని అంతకంటే ఏమీ కలగదూ

వాడుకభాషకు పట్టినగతే నవ్య సాహిత్యానికి కూడా పట్టిందని నేను యిప్పుడు నమ్మకంగా తెలుసుకోగలిగాను నవ్య సాహిత్య రచన గురించి శ్రీ శివశంకర శాస్త్రిగారి అభిప్రాయాలు నాకు చాలా కాలం నుంచీ తెలుసును కాగితం మీద కలం పెట్టగల ప్రతివాడికీ రచన చేసేటందుకు అర్హత ఉందని వారి అభిప్రాయమైనట్లు నేను గ్రహించగలిగాను వారి అభిప్రాయం నాకు చాలా నచ్చింది రచనల్లో తారతమ్యం ఎప్పుడూ ఉంటుంది తాడిచెట్టు ఎక్కేవాడి తలదన్నేవాడు ఎప్పుడూ ఉంటాడు కారణం ఏదైనప్పటికీ ఏయిద్దరి రచననూ లోకం సమానమైన ఆదరణతో గ్రహించదు ఈ తప్పనిసరి తారతమ్యం ఉండనే ఉందిగదా, నవ్య సాహిత్య పరిషత్తు మళ్ళీ కొంత పక్షపాతం చూపటం ఎందుకూ? నవ్య కవులందరికీ సమానమైన స్థానం నవ్య సాహిత్య పరిషత్తులో ఉండటం ధర్మం అనుకున్నాను

నవ్య సాహిత్య పరిషత్సమావేశాల్లో అందరికీ సమానమైన గౌరవం జరగటం లేదనీ ''ప్రతిభ'' చుట్టూ కొందరు అంగరక్షకులు నిలుచున్నారనీ నాస్నేహితులు కొందరునాతో అన్నప్పుడు నేను వారి మాటలు లక్ష్యం చెయ్యలేదు ''ప్రతిభ'' లోపడే వ్యాసాలు అదో మాదిరిగా ఉండటం చూసి కూడా నేను '' ఇంతకంటే మంచివి రాసేవారు లేకపోవటం వల్ల ఇవే వేస్తున్నారు కదా''! అని చింతించి ఊరుకున్నాను క్రిందటి ''ప్రతిభ'' సంచికలో ''కావ్యప్రయోజనం'' అనే వ్యాసం శ్రీ నోరి నరసింహశాస్త్రి విరచితం పడింది ఆ వ్యాసం Suicidal Tendencies తో కూడినది తను ఏ కొమ్మ మీద నిలబడ్డాడో ఆ కొమ్మనే కొట్టేవాడు చేసేపని! ఒకరికి నలుగురు సంపాదకులు గల 'ప్రతిభ'లో ఆ వ్యాసం యెట్లా పడిందో నేను ఊహించలేక పోయాను ముఖ్యంగా శ్రీ శివశంకర శాస్త్రిగారు దాని ప్రచురణకు ఎట్లా అంగీకరించారోనాకు బొత్తిగా అర్థంకాలేదు జనసామాన్యానికి అటువంటి వ్యాసం రుచించటం నేను అర్థం చేసుకోగలను ఎందుకంటే ఎక్కువ మందికి ''మీరు వెధవలు, ఎందుకూ పనికిరారు'' అనిపించు కోవటానికి అభ్యంతరం లేక పోగా అట్లా అనే వాణ్ణే గొప్పవాడని భావించటం సహజం కానీ విశ్వనాధ సత్యనారాయణ గారినీ, తెలికిచర్ల వెంకటరత్నం గారినీ శివ శంకరశాస్త్రిగారినీ ''మూక'' క్రిందకట్టడం ఎట్లాగో నాకు బోధపడటంలేదు ఆ వ్యాసంలో నోరి నరసింహశాస్త్రి గారు కావ్యం దాయటా ికి అర్హత గలవారిని నిర్వచించారు, ఆ నిర్వచనం తమకు సరిపోతుందని సత్యనారాయణగారూ, శాస్త్రిగారూ అనుకు నేటంత ఆత్మవంచనకు లోబడతారా?

''కావ్య ప్రయోజనము'' అనే వ్యాసాన్ని అందులో ఉన్న అభిప్రాయాలనూ ప్రతిఘటించటానికి నాకు హక్కున్నదని నమ్మి మరొక వ్యాసం రాసి ప్రతిభకు పంపాను నవ్య సాహిత్యాన్ని సమర్థించుతూ ''సాహిత్యం ఎందుకు''? అని మరొక వ్యాసం ''భారతి''కి పంపాను, సెప్టెంబరు సంచికలో అచ్చయింది

ఆదర్శాలు శాశ్వతమైన సత్యాన్ని నిరూపన చేస్తవనీ తాత్కాలికోపయోగం గల సత్యంతో ఎవరికీ పనిలేదనీ పామరుల మనస్సులో ఎప్పుడూ ఒక అపోహ ఉంటూ ఉంటుంది అందుచేతనే

ఉదయం లేచింది లగాయతు మనం మోక్షప్రాప్తికి కర్మ చేస్తూ అధోగతికి పోతున్నాం చూసేది నక్షత్రాల వంకా పోయేది పాతాళానికీ! అందుచేత కావ్య ప్రయోజనం అన్న వ్యాసం అక్కడక్కడా పునర్ముద్రితమయింది కాని అందరికీ అర్థమయేటట్టు సాహిత్యం ఎందుకు? అనేది ప్రతివాడూచదవనట్టు నటించుతాడు

నేనీ మాట అనటంలో స్వార్థం ఏమీలేదని మీరు నమ్మాలి అటువంటి స్వార్థం కోరిన వాణ్ణయితే నా స్వంత రచనకి పేరు సంపాదించుకునేందుకే ప్రయత్నించి ఉందును - నవ్యసాహిత్యాన్ని సమర్థించటానికీ కాదు నవ్య సాహిత్యాన్ని సమర్థించటంలో నాకు ఒకరూ తోడు రాలేదు కనక నా సమర్థింపు సమగ్రంగా ఉండటానికి వీలు లేదు ఈ సరికి ఎందరో నా ఉద్దేశాలలో తప్పులు చూసి, నేను సరిగా చెయ్యలేక పోయిన దాన్ని వారు సరిగా చేసి వుండవలసింది అట్లా జరగలేదు

మీరు మిక్కిలి ఒక పెద్దమనిషి "కావ్య ప్రయోజనం అనే వ్యాసంలో కుటుంబరావును గురించి ఏమీ అనలేదే? అతనికింత పట్టుదలదేనికి! అని అడిగాడట! అంటే నన్నెవరైనా అంటేనే నేను తిరిగి ఏమైనా అనాలన్న మాట! నిస్వార్థంగా ఒకడు నవ్యసాహిత్యాన్ని సమర్థించుతూ బయలుదేరటమనేది ఆ పెద్దమనిషి విశ్వసించలేకుండా ఉన్నాడు! ఆ పెద్ద మనిషి ప్రకటించిన ఈ సెంటిమెంటుకూ ప్రతిభలో ఒకరినొకరు కీర్తిచుకుంటూ రాసిన గీతాలకూ ఏమైనా సంబంధం లేదు కదా! నాదురదృష్టమేమో నేను సాహిత్య ప్రపంచంలో మెచ్చుకునే వారిని అనేక మందిని స్వయంగా చూడనైనా చూడలేదు

అన్నిటికన్నా ముఖ్యమైన విషయం 'ప్రతిభ'లో నావ్యాసం పడకుండా ఉండటానికి ఏర్పాట్లు జరిగినవని విన్నాను ఇది వట్టి అపవాదు కాకపోయినట్టయితే ఇటువంటి ప్రయత్నం వల్ల నవ్య సాహిత్య పరిషత్తు వారు పొందే దేమిటో నాకు అర్థం కాకుండా ఉంది

నా వ్యాసం పడటం వల్ల నోరి నరసింహశాస్త్రిగారు సరిగా అలోచించకుండా వ్యాసం రాశారని తేలుతుంది నోరి నరసింహ శాస్త్రిగారు పొరపాటు చేశారనేది "ప్రతిభ" సహించలేదా? ఎవరూ పొరపాట్లు చెయ్యరా? ఒకరి తప్పులొకరు దిద్దకూడదా? నా వ్యాసంలో ఎవరైనా తప్పుపడితేనే నేను ఆత్మహత్య చేసుకోవలసిందేనా?

నవ్య సాహిత్యం ఊరికేపెరిగిపోతుందనీ, నిజమైన కావ్యప్రయోజనం లోకసంగ్రహమేననీ, అది ఎట్లా జరుగుతుందో మన పూర్వులు నిర్ణయించిపెట్టారనీ, దాన్ని అర్థం చేసుకొని లోకానికి ఉపదేశం ఇవ్వతగిన ఆదర్శ ప్రాయుడే కావ్యం రచించతగుననీ, ఈ ఆదర్శానికి భిన్నమైన రచన విపరీతంగా పెరగటం వల్ల మంచి కవులకూ, వారి రచనలకూ పైకి వచ్చే యోగ్యత లేదనీ శ్రీ నరసింహశాస్త్రిగారి "కావ్య ప్రయోజనము" అనే వ్యాసం యొక్క సారాంశం ఇది Suicidal Tendencies తో కూడుకున్న వ్యాసమని చెప్పారు ఈ Tendencies ఈ వ్యాసంలో ఒక విధంగా లేవు! రచన చేసే స్వేచ్ఛ అందరికీ లేదన్నారు నరసింహశాస్త్రిగారు వారి అభిప్రాయంలో ఆ హక్కు ఏమహాపురుషులకున్నదో ఆ మహాపురుషులు సగటున శతాబ్దానికి ఒకడైనా ఉన్నట్టు తోచదు ఒక మహాకవి అంతరించగానే ఇంకొక మహాకవి వచ్చేవరకూ కలం పట్టకపోతే ఆ రానున్న మహాకవి ఎప్పటికీ రాడని నా వాదం

ఒదీకాక ఒకరు గ్రంథం రాసిన తర్వాత కదా మనం ఆరచయితయొక్క యెక్కువ ఎక్కువలు ఆలోచించగలిగేది? ఆ గ్రంథం పుట్టుకలోనే దానికి ఉద్ధత ఉండాలంటే అది రాసేకవి - నరసింహశాస్త్రిగారి అభిప్రాయం ప్రకారం - తను ఆదర్శపురుషుడనని నమ్మితేనే కాని కలం పట్టలేడు అటువంటి స్థితిలో ఆత్మవంచనకు ఎంత అవకాశం ఉంటుందీ!

లోక సంగ్రహం గురించి మనకు మనం ఆలోచించే అధికారం లేదని నమ్ముతున్నారు నరసింహశాస్త్రిగారు అక్కడ మన పూర్వులు చెప్పినదే లక్ష్యమని కూడా వారు నొక్కి చెబుతున్నారు "వితంతువులకు వివాహం చెయ్యాలా వద్దా? మనం సామ్యవాదాన్ని అంగీకరించాలా వద్దా? మనకు స్వాతంత్ర్యం కావాలా వద్దా? ఇటువంటి సమస్యలు ఈనాటి లోక సంగ్రహంతో సంబంధం కలగవని నరసింహశాస్త్రిగారు అనగలరా? వీటిని గురించి వేదాల అభిప్రాయమూ, ఉపనిషత్తుల అభిప్రాయమూ ఏమిటి? ఇటువంటి సమస్యలతో సాహిత్యానికి సంబంధం వుండరాదా? వీటిని గురించి మనకు చాతనయిన నిర్ణయాలు చేసుకునేటందుకు మనకు అధికారం లేదని నరసింహశాస్త్రి గారు ఎట్లా అనగలరు?

అసలు ప్రశ్న వేస్తున్నాను నరసింహ శాస్త్రిగారు, వారు ఆమోదించే రచయితలు కావ్య ప్రయోజనం గుర్తించి రచన చేశారా? వీరు ఆదర్శకవులా? వారి రచన వల్ల జరిగిన (లేక జరగదగిన) లోకసంగ్రహంగాని లోక కళ్యాణంగాని ఏమిటి? నరసింహశాస్త్రి గారి వ్యాసం ప్రతి నవ్య కవికీ సహించరాని అవమానం "ప్రతిభ" కాని శాస్త్రి గారు కాని ఆమాత్రం గుర్తించలేక పోయినట్టయితే దానికి నేను బాధ్యుణ్ణి కాను "నవ్య" అనే మాటకే ఆగ్రహించి నవ్యసాహిత్యాన్ని దూషించినవారున్నారు అటువంటి మూఢుల జోలి నా కనవసరం కాని నవ్యసాహిత్య పరిషత్తులో గౌరవస్థానం కల నరసింహశాస్త్రిగారు ఆ వ్యాసము రాయటమూ, "ప్రతిభ" దాన్ని ప్రకటించడమూ నాకు దుస్సహంగా ఉంది

"నవ్య సాహిత్యం" అనేపేరు కింద గణించబడుతుంది కదా అని ప్రతివాడూ చెత్త రాస్తుండేదాన్ని చదవకుంటే "ప్రతిభ"లో విమర్శించకండి రాస్తానని వాగ్దత్తం చేసిన ప్రతిభావకవినీ పరిషత్తులో చేర్చకండి నవ్య సాహిత్య పరిషత్తు వంటి సంస్థయొక్క విశిష్టతకు భంగం కలగకుండా కొన్ని నియమాలు పెట్టడం అవసరమని నేనూ ఎరుగుదును ఆ నియమాలేవో నలుగురూ కలిసి నిర్ణయించండి కాని నవ కవులను యిలా అవమానించవద్దు

*ముద్రణ వీణ, మాసపత్రిక, నవంబరు 1937*

## 3. నిజమయిన సాహిత్య ప్రయోజనం

అనేకరకాల రచనల్లో ఒకరకాన్ని మాత్రమే సాహిత్యమంటాం పదార్థ శాస్త్రమూ,రసాయనశాస్త్రమూ, వృక్షజంతు శాస్త్రములూ, జ్యోతిషమూ, కళాశాస్త్రాలూ, తర్కశాస్త్రమూ,వేదాంత గ్రంథాలూ, చరిత్రా, ఆఖరుకు వ్యాకరణం, ఆలంకారిక శాస్త్రమూ, నిఘంటువులూ ఇవన్నీ సాహిత్యం కాదని ఎవడికైనా తెలుసు సాహిత్య ప్రయోజనాన్ని గురించి చర్చించేవాడు సాహిత్యంలో చేరని ఈ ఇతర రచనవల్ల సాధించదగ్గ ప్రయోజనానికి భిన్నమై

సాహిత్యానికి ప్రత్యేకమైన ప్రయోజనాన్ని గురించే చర్చించాలి అజ్ఞానులైన పసిపిల్లలవంటుగా దురాశ చూపరాదు సమస్త రచనలవల్లా సాధించదగిందీ, మానవుడు ఆశకొద్దీ నిర్మించుకునే ఆశయాలను సఫలం చేసేదీ అయిన ప్రయోజనం సాహిత్య ప్రయోజనం అనుకోరాదు మనం కలలు కనటం మాని సత్యాన్ని అన్వేషించటం అవసరం కలలుకనటమే అయితే ప్రతివస్తువుయొక్క ప్రయోజనమే చతుర్విధ ఫలప్రాప్తేనని ఒక్కమాటతో తేల్చి వెయ్యవచ్చును

సాహిత్య రచన దేవతాకార్యం కాదు సాహిత్యాన్ని రచించేటందుకు మహర్షులు తత్తుల్యులు దిగిరానక్కరలేదు సాహిత్యంయొక్క ప్రయోజనం ఉపదేశం కాదు - అది మతగురువులకే వదిలిపెట్టండి అందువల్ల ముప్పేమీ లేదు నిజమైన సాహిత్య ప్రయోజనం మనసును రంజింప చెయ్యటంకాదు - అది సాహిత్య కళా ప్రయోజనం! కావ్య ప్రయోజనాలలో ఒకటి సాహిత్యం యొక్క ఉద్దేశం జీవితాన్ని కళాదృష్టితో చిత్రించటం కాదు అప్పుడు సాహిత్యం కళతో కూడుకున్న చరిత్ర మాత్రమే అవుతుంది

జీవితాన్ని విమర్శించటం, అలంకరించటం, సాహిత్యం చెయ్యగల ఉత్తమకార్యాలు ఇదే సాహిత్యం యొక్క ఉత్కృష్ట ప్రయోజనం

ఏకాలపు జీవితాన్ని విమర్శించేది ఆ కాలపు సాహిత్యం నేటి జీవితాన్ని విమర్శించలేనిదీ, నేటి భావాలను సంస్కరించలేనిదీ,నేటి జీవితాన్ని అలంకరించలేనిదీ నేటి సాహిత్యం కాదు - నేడు రాసినవాడైనా సరే! మొన్నమొన్నటి వరకూ మనకు కవిత్వమేకాని ఆటే సాహిత్యం లేదనుకోవలసివస్తున్నది నవ్యకవిత్వమంటూ ఒకటి ఉన్నదనీ, అది ఫలాని రోజునించీ ప్రారంభమైందనీ, దానికీ ప్రాచీన కవిత్వానికీ ఫలాన సూక్ష్మభేదాలున్నావనీ నిరూపించటం సులభం కాదనుకుంటాను స్థూలంగా చూసినట్లయితే కవిత్వం ఏ రెండు శతాబ్దాలలోనూ ఒక్క విధంగా లేదనుకోవటానికి ఆధారాలు దొరక్కపోవు

నిజమైన సాహిత్యలక్షణాన్ని అందరూ గుర్తించితీరాలి దానికి చిరత్వం లేదు ఒక కావ్యానికి చిరత్వం లభించిందంటే, అందుకు కారణం ఆ కావ్యంలో ఉన్న సాహిత్యలక్షణం మటుకు కాదు- మరేకారణమైనా కానివ్వండి ఒక కావ్యం చరిత్రదృష్టిలో కాని, కళాదృష్టిలోకాని ప్రత్యేకత సంపాదించుకుంటే అది నిలిచిపోవటం వింతకాదు సాహిత్యం కేవలమూ సాహిత్యంగా అట్లా నిలిచిపోవటం అసంభవం సాహిత్యం వల్ల తాత్కాలిక ప్రయోజనం విశేషంగా ఉండటమే కాక అది త్వరగా అయిపోతే అంత మంచిది

సాహిత్యం అందరూ రాయవచ్చును - రాయాలి! ఈ విశాలమైన జీవితాన్ని సంపూర్ణంగా సమగ్రంగా విమర్శించే శక్తి ఏ ఒక్కడికీ ఉండటం అసంభవం సాహిత్యపరుడు, తాను జీవితం తాలూకు ఏ భాగాన్ని విమర్శిస్తూన్నాడో, దాన్నిగురించి సరిగా తెలియనివాడైతే వాడి రచన అనర్థమైన విమర్శ అవుతుంది అది చెడు సాహిత్యం దిక్కుమాలిన సాహిత్యం ఎప్పుడూ ఉంటుంది ఆధ్యాత్మిక జీవితాన్ని విమర్శిస్తూ కూడా సాహిత్యం రాయవచ్చును రామాయణంవంటి గ్రంథం ఈనాడు కూడా రాయవచ్చును - వాల్మీకివంటి ఆధునిక రచయితే ఉండాలి కాని! ఈనాడు రామాయణమే రాయవలసిన అవసరం కనిపించదు - వాల్మీకి దృష్టికి భిన్నమైన దృష్టితో రాయటానికి పూనుంటే తప్ప

సాహిత్యానికి ఒక సంప్రదాయం వుండటం అసంభవం సాహిత్యం కొమ్మకు పుట్టే కొమ్మకాదు కొమ్మన పూసే పువ్వు జీవితం ఎన్ని మార్పులు మారితే సాహిత్యం అన్ని మార్పులు మారుతుంది

సాహిత్యానికి స్వేచ్ఛకావాలి - మతాన్ని, నీతిని, ఇంకా మానవుడు అతిపవిత్రంగా ఎంచుకునే ఇతర విషయాలనూ విమర్శించటానికి సాహిత్యానికి ఆ స్వేచ్ఛ లేకపోయినట్టయితే జీవితానికి సంస్కారం అసంభవం న్యాయశాస్త్రం అన్యాయం చేస్తుందని న్యాయశాస్త్రం ఒప్పుకోదు ఆ మాట అనటానికి సాహిత్యానికి స్వేచ్ఛ ఉండాలి నీతికూడా తన్ను విమర్శించుకోలేదు సాహిత్యమే ఆ పని చెయ్యాలి సాహిత్యాన్ని ఏమాత్రం అరికట్టినా అంతవరకు జీవితపు సంస్కారంలో లోపం కలుగుతుంది జీవితంలో సాహిత్యానికి లేని గొప్పతనం తెచ్చిపెట్టవద్దు ఉన్నగొప్పతనాన్ని తక్కువచెయ్యవద్దు మానవుడు సాధించటానికి ప్రయత్నం చేస్తున్న వాటిలో సాహిత్యం సర్వోత్కృష్టమైనది కాదు కాని మానవుడు చేసే సమస్త ప్రయత్నాలకూసాహిత్యం ఎంతో తోడుగా ఉంటుంది నాగరికత పెంపొందించు కోవటానికి సంస్కారం అభివృద్ధి చేసుకోవటానికీ సాహిత్యం అత్యావసరం

జీవిత సముద్రంమీద తేలే బుడగలమైన మనకు చిరత్వమంటే అమితమైన గౌరవం శాశ్వతత్వం సంపాదించిన సారస్వతాన్నీ సాహిత్యకళనీ అరాధించటం నేర్చుకుని సారస్వత సేవలో మునిగిఉన్న మనకు సాహిత్యం చేత సేవ చేయించుకోవటం చేతకాలేదు చిరత్వానికి ఇంకా అర్హత సంపాదించుకోని రచనలవల్ల లాభం పొందటం మనకు చాతకావటంలేదు

ఒక పుస్తకానికి రెండుమూడు శతాబ్దాలు వయస్సు గడిస్తేకాని దానికేసి చూడం మనకు సాహిత్య మంటే ఏమిటో తెలిసేదెట్లా? గుడ్డి జీవితాలకు వెలుగు లేనట్టు మన జీవితాలకు సాహిత్యం లేదు

*ముద్రణ వీణ మాసపత్రిక, మే 1938*

# 4. సాహిత్య జిజ్ఞాస

ఆధునికాంధ్రసాహిత్యం గురించి గర్వంగా చెప్పుకునేటందుకేమీ లేకుండా ఉన్నమాట చాలామంది ఒప్పుకుంటారు, కాని ఈ దుస్థితిని చాలామంది స్పష్టంగా అర్థం చేసుకున్నట్టు కనిపించదు అర్థం చేసుకోక చవుకబారు సాహిత్యం రాస్తున్నందుకు రచయితలనూ, ప్రకటిస్తున్నందులకు పత్రికాధిపతులనూ, పైకి వస్తున్నందుకు సాహిత్యాన్ని తెగనాడుతారు

నాకేం తోస్తుందంటే మన సాహిత్యం కంటె కూడా సాహిత్యం గురించి మన అభిప్రాయాలు చాలా తప్పుడుతోవలో ఉన్నై మనకు సరిఅయిన సాహిత్య జిజ్ఞాస లేదు

సాహిత్యమూ, దానివల్ల ప్రయోజనమూ, దానికి మానవజీవనంలో ఉండదగిన స్థానమూ మొదలైన వాటిని గురించి కొద్దిగా చర్చించి ఆ వెనక నా అభిప్రాయాలు చెబుతాను

దేన్ని గురించి మాట్లాడేటప్పుడు అదే సర్వోత్కృష్టమైనదనే అభిప్రాయం ప్రకటించటం మనకు సంప్రదాయసిద్ధంగా వస్తున్నది ప్రకృతయుగంలో ఈ దురభ్యాసం వల్ల ప్రయోజనం కించిత్తుకూడా లేదు బుద్ధిమంతుడు దేనికికూడా సర్వోత్కృష్టత ఆపాదించడు

మానవజీవితంలో అనేక విషయాలకు అనేకరకాల ప్రాముఖ్యత ఉన్నది అటువంటి వాటిల్లో సాహిత్యం ఒకటి సాహిత్యస్పర్శ ఎరగని జీవితం పరిపూర్ణం కాదని అంటే అనవచ్చును కాని జీవితానికి సాహిత్యం ఒకటి ఉంటే మరేమీ అక్కర్లేదని చెప్పటానికి బుద్ధిమంతుడు పూనుకోడు

సాహిత్యానికి పరిమితమైన ప్రాముఖ్యత ఉందని గుర్తించినమీదట, దానివల్ల సాధించదగిన ప్రయోజనం ఏమిటోతెల్చుకుని, ఆతరువాత సాహిత్యానికి జీవితంలో ఎంత అగ్రస్థానం ఇవ్వవచ్చునో తెలుసుకోవటం అట్టే కష్టం కాదు

సాహిత్యంకోసం జీవితాలు అర్పించిన వారూ, పుస్తకాలకోసం తిండి మానుకున్నవారూ లేరని కాదు కాని వారి ప్రవర్తనలనుబట్టి సాహిత్యం యొక్క విలువ నిర్ణయించటం పొరపాటు ఇతరులకు సాధనాలుగా ఉండేవాటిని కొందరు పరమార్థాలుగా భావించటం ఎప్పుడూ ఉంది ఒకదాన్ని పరమార్థంగా భావించిన తరవాత దాని కోసం మనం ఎంత త్యాగమైనా చేస్తాం స్వేచ్ఛ ఒక సాధనం, దానికోసం తమ స్వేచ్ఛను శాశ్వతంగా కోల్పోయినవారున్నారు వారిని ఆదర్శంగా పెట్టుకుని మానవజాతి యావత్తూ స్వేచ్ఛను కోల్పోవటంకంటే హాస్యాస్పదమైన సంగతి మరొకటి ఉండదు

సాహిత్యం చతుర్విధ ఫలప్రాప్తి నిస్తుందన్నారు కాదు, సాహిత్యం లోక సంగ్రహం చేస్తుందన్నారు ఇటువంటి మాటలను అనటంగాని, విశ్వసించటంగాని అమితసుళువైన విషయం, ఏమంటే వాటిని అనే వారు కాని వినేవారుకాని ఏమాత్రమూ మెదడు ఉపయోగించనవసరంలేదు ఒక ఉదాహరణ ఇమ్మంటే కాని, భవభూతి ''ఉత్తరరామ చరిత్ర'' వల్ల కలగగల లోకసంగ్రహం ఏమిటని అడిగినప్పుడు కాని వస్తుంది చిక్కు! గొప్పవిషయాలను గురించి గంభీరంగా మాట్లాడటానికి విశేషం మెదడు అవసరం లేదనేమాట ఎవరూ మరచిపోకూడదు

మరికొందరు సాహిత్యం ఒక స్త్రీమాదిరిగాకాక మధుర పదార్థమల్లే, ఒక సువాసనలాగా ఒక ప్రత్యేకమైన ఆనందం ఇచ్చి మనస్సుకు ఉత్తేజనం కలిగిస్తుందన్నారు అట్లా అయినట్టయితే ఒక చక్కని స్త్రీకీ, తియ్యని పండుకూ, కమ్మని వాసనకూ ఎంత ప్రాముఖ్యత ఇస్తామో సాహిత్యానికి అంత కంటే ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వవలసిన అగత్యం కనిపించదు

సాహిత్యం ఉపదేశిస్తుంది, మత, ధర్మ, నీతి విషయికమైన ప్రబోధం కలిగిస్తుందన్నారు కొందరు అటువంటి సాహిత్యం అతిపరిమితంగా మాత్రమే ఉండగలదు రామాయణం రాయిటంలో వాల్మీకి ఉద్దేశం రెండు మూడు నీతులు చెప్పటమే అయినట్టయితే వాల్మీకికన్న మూఢుడుండబోడు నాలుగు నీతిశ్లోకాలు చాటువులుమోస్తరుగా రాసి పారవేసేదానికింత చాటభారతం రాయటమెందుకూ?

రహస్యమేమంటే సాహిత్యానికి ఇటువంటి ప్రయోజనాలు ఆపాదించేవారు ముందూ వెనక చూసుకుని మాట్లాడరు, తమమాటలలోనించి ఏయే అర్థాలు వచ్చేదీ ఆలోచించరు మనవాళ్లు చేసే మరొక పొరపాటేమంటే ఈనాడు సాహిత్యంవల్ల ఏమిప్రయోజనం ఉందో నిర్ధారణ చెయ్యటానికి ప్రాచీన సారస్వతాలు తనిఖీ చేస్తారు ఈనాటి జీవితం యొక మూలసూత్రాలు అర్థం అయితే కాని ఈనాడు సాహిత్యంవల్ల మన కెటువంటి ప్రయోజనం ఉండదగినదీ బోధపడదు అవి తెలుసుకునేటంత ఓపిక మనకు లేదు

మరొకవిషయం సాహిత్యంవల్ల ప్రయోజనం ఇదీ అని మనం ఒక నిర్ణయానికి వచ్చినప్పుడు ఆ ప్రయోజనం మరొకదానివల్ల సాధ్యమయేదిగా ఉండరాదు ఒక కథయొక్క ప్రయోజనం ఒక గంటసేపు కాలక్షేపం జరగటమే ననేటట్టయితే అందుకు గుర్రపుపందాలూ, టెన్నిస్ పందాలూ, సినిమాలూ, హరికథలూ మొదలైనవి ఎన్నిలేవు? అందుకుగాను సృష్టి అయేసాహిత్యంలో ప్రత్యేకత ఎట్లా ఉంటుంది?

సాహిత్యం దేనికో తేల్చుకునేలోపల, సాహిత్యం దేనికి కాదో తేల్చుకోవటం మంచిది

సాహిత్యంద్వారా మతాన్నీ, ధర్మాన్నీ ప్రచారం చెయ్యటం నిరర్థకం, ఏమంటే ఇప్పటిమానవ జీవితానికి అవి మూలసూత్రాలు కావు క్రిమినల్ సివిల్ ప్రొసీజరు కోడ్స్‌కు సాహిత్యం ప్రచారం ఇవ్వటంకూడా నిరర్థకమే నీతి సత్ప్రవర్తనా, వీటిని గురించి సాహిత్యం ప్రచారం చెయ్యటంలో అర్థం లేకపోలేదు, కాని ఆ ప్రచారం సఫలమవుతుందనేది చాలా అనుమానాస్పదమైన విషయం వేశ్యాజాతికి ప్రతికూలంగా ప్రచారం ఇవ్వటానికి ఉద్దేశించబడిన చింతామణినాటకం కుర్రకారుకు వేశ్యలయందు అభిరుచి పుట్టించినట్టు కనిపిస్తుంది ఏ సాహిత్యంలోకాని మానవుల ప్రవర్తనను మార్చిన నైతిక గ్రంథం ఒకటికూడా ఉందనుకోను ప్రవర్తన లోపలి సంస్కారాన్ని బట్టి ఉంటుంది ఆ సంస్కారాన్ని కలిగించటానికి వట్టి నీతి ప్రచారం చాలదు విజ్ఞానాన్ని పెంపొందించటం కూడా సాహిత్యం పని కాదు దానికోసం వ్యక్తి ప్రత్యేకించి కృషి చెయ్యాలి సాహిత్యం ద్వారా విజ్ఞానం పెంపొందించటం అసాధ్యం కానప్పటికీ, అట్లా పెంపొందే విజ్ఞానం చెప్పుకోతగినంతగా ఉండదు సాహిత్యం మన అనుభవాన్ని వృద్ధి చెయ్యటానికి కూడా విశేషంగా పాటుపడలేదు మనం స్వయంగా తెలుసుకోలేని విషయాలు పుస్తకాలద్వారా తెలుసుకోవటంలో కొంతప్రయోజనం లేదు కాని నిజమైన అనుభవానికి సాహిత్యం ప్రత్యామ్నాయం కాదు - కాలేదు ఎన్ని ప్రణయ కథలు చదివితే ప్రేమించటం ఏమిటో తెలుస్తుంది?

కాని ఒకటిమాత్రం ఒప్పుకోవాలి ఈ పైన చెప్పిన ఆశయాలతో కూడుకున్న రచనలకు సారస్వతంలో స్థానం లేకపోలేదు ఇప్పటి పాశ్చాత్య సాహిత్యంలో విజ్ఞాన గ్రంథాలూ, రాజకీయ గ్రంథాలూ, వివిధ దేశాలూ, వాటి తాలూకు జాతులూ, వారి ఆచారాలూ మొదలైనవి చిత్రించే గ్రంథాలూ వెలువడుతూ ఉన్నై అయితే సాహిత్యానికి జీవితంలో ఉన్న ఉత్కృష్ట స్థానాన్ని నిర్ణయించే పుస్తకాలు ఇవి కావు

నా అభిప్రాయంలో సాహిత్యంయొక్క ఉత్కృష్టాశయం మన అనుభవాన్ని మానసికంగా జీర్ణింపచేసి అరుగుదలకు తీసుకురావటం

ఆహారంతో శరీరం దార్ఢ్యం పొందినట్టు అనుభవంమీద మనసు దార్ఢ్యం పొందుతుంది మనం పొందే అనుభవమంతా మనం జీర్ణించుకుంటున్నామని చెప్పలేం అనుభవసారం గ్రహించేటందుకు మామూలు తెలివితేటలు చాలవు ఒక్కొక్క రకమైన అనుభవం అర్థం చేసుకునేటందుకు ఒక్కొక్క విధమైన విజ్ఞానమూ బుద్ధిసూక్ష్మతా అవసరం ఇవి అందరికీ అందుబాటులో ఉండవు అవి ఉన్నవాడు జీవితాన్నీ వ్యక్తులనూ సామాన్య మానవులు చూసినట్టు కాక విశేషమైన దృష్టితో చూడగలుగుతాడు ఒక చిన్న ఉదాహరణ మామూలు మనిషి వ్యక్తులలో గాని విషయాలలోగాని మంచోచెడో చూడగలుగుతాడు కాని

సామాన్యసాహిత్యమే అతనికి మంచిలో చెడూ, చెడులో మంచీ చూపిస్తుంది ఈ ధోరణిలో నడిచే సాహిత్యం మానవుడికి తనను గురించీ, తన మనస్తత్వాన్ని గురించీ సూక్ష్మమైన జ్ఞానం కలిగించటమే కాక ప్రతి పరిణామానికి మూల కారణం ఏమిటో తెలుసుకునేటట్టు చేస్తుంది

పైన చెప్పిన విషయాలు ప్రత్యేకించి గద్య రచనకే వర్తించుతవనుకోనవసరం లేదు కవిత్వంకూడా అటువంటిదే జీవితంలో జరిగే అనేక సంఘటనలకు మన హృదయాలు చైతన్యం పొందవు ముఖ్యంగా సూక్ష్మమైన, నాజూకైన చైతన్యం పొందటమనేది చాలామందికి అనుభవంలో ఉండదు అది కవి మనకు సాధించి పెడతాడు అయోమయంగా ఉన్న కీకారణ్యంలో కథకుడు దారులూ, వాటి కలయికలూ చూపిస్తే, కవి అందులో సౌందర్యమూ, వింతరంగులూ చూపిస్తాడు

సాహిత్యంతో పరిచయం ఉన్నవాడికి జీవితం అర్థమయినట్టుగా, నిరక్షరుడికి అర్థం చేసుకునే అవకాశాలు లేవు సరిఅయిన కవిత్వంతో పరిచయం ఉన్నవాడికి జీవతం ఇచ్చే సూక్ష్మానుభం కవిత్వం చెవికి పట్టనివాడికి కలగదు

చారిత్రక కారణాలవల్ల ఈనాడుదాదాపు మానవ జాతికంతటికీ ఒకేవిధమైన జీవిత సూత్రాలు ఏర్పడినై ఒకప్పుడుండినట్లుగా ఈనాడు భావాలను బట్టి సాహిత్యాలను వేరు వేరు మార్గాల పోవలసిన ఆవశ్యకత లేదు సాహిత్యస్వరూపం ప్రపంచమంతటా ఒకటిగా పరిణమించుచున్నది గడిచిన పాతిక సంవత్సరాల కాలంలోనూ తెలుగుసాహిత్యం పాత సాంప్రదాయాలను అతిక్రమించి ఏవిధంగా పాశ్చాత్య పద్ధతులు అవలంబించినదీ అందరికీ తెలుసు

ఈ మార్పు రుచించనివారు కొందరు ఆంధ్రసాహిత్యం అధోగతి పాలయిపోతున్నదని గోలపెడుతున్నారు కాని వారికి భావనా శక్తి చాలటం లేదు రచయితలు పాశ్చాత్య పద్ధతులు మరిగి ఈ మార్పు తెచ్చారని గోలపెడతారు ఆ ముక్క నమ్మదగినట్టుగానే వుంది కాని పాతిక సంవత్సరాల కంటే ఈనాడు ప్రచురణా పత్రికలు కొని చదవటమూ ఎన్నో ఇంతలయిందే, దాని కేమనాలి? ఈ మార్పు కలిగిన తరవాత సాహిత్యానికి ప్రజాసామాన్యం నించి ఎంతో ప్రోత్సాహం వచ్చింది ఆ ప్రజాసామాన్యంలో పాశ్చాత్య పద్ధతులమీద వ్యామోహం కలవారు నూటికొకరు లేరు

అంతమాత్రానికే ప్రజాసామాన్యం యొక్క అభిరుచిని సమర్థించు తున్నాననీ, ఇప్పటి సాహిత్యాన్ని విచక్షణ లేకుండా ఆకాశానికెత్తుతున్నానీ అనుకోవద్దు కావ్యశిల్పంజోలి నేనిక్కడ ఎత్తటమేలేదు, సాహిత్యం యొక్క పోకడను గురించి మాత్రమే చర్చిస్తున్నాను అతి తెలివిగా కథ రాస్తే చదివేవారూ, అర్థం చేసుకునేవారూ లేరు రచన ఇంకా చాలామటుకు చౌకబారుగా ఉన్నది ప్రజల అభిరుచికూడా దానిమీదికే పోతున్నది కాని ప్రస్తుతంలో సాహిత్యం తొక్కుతున్న మార్గం సరి అయినదంటాను ఇది ఖండకావ్యాల యుగం చిన్నకథల యుగం పాండిత్యం పరమార్థం కావటం మానుకున్నది వెనకటి పద్ధతిలో కావ్యాలు ఎంత సులభంగా రాసినా చదివేవారుండరు ఎంత తప్పుడుగానైనా సరే మనస్తత్వం చిత్రించితే చదివి ఆనందిస్తారు తమ రామాయణంలోనించి పద్యాలు చదువుతూ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు విపులంగా వ్యాఖ్యానం చేస్తూ అలంకారాలు విశదపరుస్తూంటే అ పరనాన్ని ప్రేక్షకులు ఏ విధంగా స్వీకరించిందీ నేను స్వయంగా చూశాను శ్రీరంగం శ్రీనివాసరావుగారూ, శ్రీ దేవులపల్లి

కృష్ణశాస్త్రిగారూ ఏ వ్యాఖ్యానమూ లేకుండా పద్యాలు చదువుతుంటే శ్రోతలు వింటూ ఎట్లా కంగారు పడ్డదీ అదీ స్వయంగా చూశాను

ఇప్పటి సాహిత్యం తాలూకు రచనల లోనించి కొన్ని ఏరి ఇవి మంచివి అని కాని చెడ్డవి అని కాని చెప్పటానికింకా ఏవిధమయిన ఆధారమూ ఏర్పడలేదు దానికి కారణం సరిఅయిన సాహిత్యాశయం ఏమిటో మనం ఉమ్మడిగాగాని ఎవరికివారుగాగాని తెల్సుకోలేకపోవటమే - అంటే మనలో ఇంకా సాహిత్య జిజ్ఞాస తలయెత్తక పోవటమే

ఆ జిజ్ఞాస ప్రారంభమయే వరకూ మనకు సరి అయిన సాహిత్యం ఏర్పడదు కొన్ని మంచి రచనలు ఎప్పుడూ ఉంటై ఎన్ని మంచి రచనలు కలిసి కూడా ఒక సాహిత్యం కాకపోవచ్చును - ఆ రచనలు ఒక సూత్రం లోనికి రానప్పుడు మనకు సాహిత్య జిజ్ఞాస ఏర్పడ్డమీదట వచ్చే రచనలు అరడజను చేత పుచ్చుకుని ''ఇది మా ఆధునిక సాహిత్యం!'' అని చెప్పటానికి గర్విస్తాం

*ముద్రిత భారతి, ఆగస్టు 1939*

# 5. ఈనాటి సాహిత్యం

ఒక జాతి ఎంతవరకు సజీవంగా ఉన్నదీ సూచించేటందుకు సాహిత్యం తప్ప మరే ముంది? ఎందుచేతనంటే, జీవితాన్ని సాహిత్యం అంటినట్టు మరేదీ అంటదు శాస్త్ర పరిశోధన తీసుకుంటే - నిజంగా దానివల్ల జీవితం ఎంతో పరిణామం పొందుతుంది ఇన్ని పరిశ్రమలూ, ఇంత నాగరికతా, ఇంత ప్రళయమూ శాస్త్ర పరిశోధనలవల్ల సాధ్యపడినదే అయితే నేం? శాస్త్ర పరిశోధనలో జాతీయత ఏమీ లేదు ఇంగ్లీషువాళ్లు కనిపెట్టిన రేడియోలూ, జర్మనులు కనిపెట్టిన మందులూ, జపానువాళ్లు చేసిన వస్తువులూ, అమెరికావాళ్లు చేసిన కాగితమూ మనం ఉపయోగపరుచుకోవచ్చు మన ఆంధ్రుడో మన భారతీయుడో ఫలాని శాస్త్రవిషయం కనిపెట్టాడనే గర్వం అటే ఘనమైనదీ కాదు, మన జీవితాన్ని అంటేదీకాదు శాస్త్రజ్ఞాన దారిద్ర్యం - విజ్ఞాన దారిద్ర్యం - ఈ రోజుల్లో ఎవరినీ బాధించనవసరంలేదు

పైగా, శాస్త్రజ్ఞానం జీవితాన్ని అంటటానికి వీలులేదు అది ఎంతసేపూ వస్తువులలో ఉన్న సామ్యతనే శోధిస్తుంది లేదా, ప్రపంచంలో ఉన్న అసామ్యతకు సామ్యకారణాలను అన్వేషిస్తుంది శరీరశాస్త్రం తీసుకుంటే, అందరు మనుష్యులకు సమానంగా ఉండే లక్షణాలేవో, మనిషికీ మనిషికీ ఉండే తేడాకు కారణ భూతమయిన సామాన్య కారణాలేవో, అదే ఆ శాస్త్రంలో ఉంటుంది వృక్షశాస్త్రం తీసుకున్నా అంతే, జంతుశాస్త్రం తీసుకున్నా అంతే ఇక జీవితం చూడబోతే, అది మనిషికీ మనిషికీ గల తేడాలవల్లా, కొద్ది తేడాలు గల వ్యక్తుల పరస్పర ఘర్షణలవల్లా ఏర్పడుతున్నది స్త్రీ పురుషులకున్న దైహిక మానసికవ్యత్యాసం వారి సామ్యంతో పోల్చితే ఎంత? అయినప్పటికీ ఈ వ్యత్యాసం ఆధారం చేసుకుని ఎంత ఉత్తమ, మధ్యమ, నీచ సాహిత్యం పెట్టలేదు? ఆ సాహిత్యంతో పోల్చితే, అదే విషయం జరిగిన పరిశోధన ఏమూల?

అందువల్ల శాస్త్రవిజ్ఞానం మన జీవితానికి ఎంతగా, ఎన్ని విధాలగా మనకు ఉపయోగపడిన్నీ, మన జీవితాన్ని నిజంగా అంటలేదు పోనీ మన మతమూ, విశ్వాసాలూ, ఆధ్యాత్మిక విజ్ఞాన

సంపదా చూసుకుని దాన్ని బట్టి మన జాతి ఎంత సజీవంగా ఉందో నిర్ణయింతామంటే, మన మతవిశ్వాసాలూ ఆధ్యాత్మిక సంపదా పుస్తకాలలో చూడటానికి ఘనంగానే ఉన్నప్పటికీ - మన జాతికేకాదు, ఇది అన్ని జాతులకూ ఇంతే - తీరా ఈనాటి జీవితంలో మన మత విశ్వాసాలు గాని, ఆధ్యాత్మిక సంపద గాని ఎంత వరకు ద్యోతకమవుతున్నదో చూడటానికి ఉపక్రమించితే, త్వరలోనే నిస్పృహ పుట్టుకొస్తుంది మతేతరాలయిన ఝంఝామారుతాలు జీవితసముద్రంలో అలలు లేవదీసి, అందులో ఉన్న జీవకోటిని క్షణానికొకచోటికి మార్చుతూ ఉన్న పరిస్థితిలో పుస్తకాలలో ఉన్న మతాన్నిబట్టి జీవితంలో ఏక్షణాన ఎంత మతం ఇమిడి ఉన్నదో ఎట్లా చెబుతాం? రాయడుశాస్త్రులుగారు వెనక ఒనసారి చెప్పనట్లు, ధర్మకర్మలను గురించి తెలుసుకున్నకొద్దీ, నైరాశ్యం కలుగుతుంది ఈ మహాసముద్రంలో తేలిన మనని ఏ అల ఎటు కొట్టుకుపోతున్నదీ చూడగల మనోనేత్రం లేని మూఢుడే మన సనాతన ఆధ్యాత్మిక సంపదను గురించీ మత విశ్వాసాలను గురించీ ఏమైనా గప్పాలు కొట్టగలుగుతాడు

మత వేదాంతాలతో పాటే సంస్కార మున్నూ పోనీ ఒక జాతియొక్క స్థితి ఐహికంగా పరిశ్రమలనుబట్టీ, వాణజ్య వ్యాపారాలను బట్టీ నిర్ణయింతామా అంటే అటువంటివి మనకు ఆట్టే లేనూలేవు, ఉన్న వేమో నూరుమంది తెలుగువారిలో ఒకడికైనా అంటవు

ఇక, మిగిలి ఉన్నవి కళలే వాటి ద్వారానే మన జాతీయత ఎటువంటిదో దానిలో జీవశక్తి ఏమాత్రమున్నదో బయటపడాలి ఏజాతి యొక్క స్థితి అయినప్పటికీ అది ఆదరించే, సృష్టించే కళలను బట్టే తెలియాలి ఎందుచేతనంటే, మానవుడికి నిజమైన స్వేచ్ఛ కళా వీధి లోనే ఉంది అతను మతబోధచేసినా, నీతి ఉపన్యసించినా, రాజకీయాలుమాట్లాడినా, దుస్తులు ధరించినా ఏవో కట్టుబాట్లకు లోనయిగాని చేయలేడు కళా శిల్పం విషయంలో కూడా సంప్రదాయమూ, ఆచారమూ అనే కట్టుబాటు లేకపోలేదు కళా విషయం ఏరుకోవటంలో కళాస్రష్టకు చాలా స్వాతంత్ర్యం ఉంది కళాసృష్టిచెయ్యమని కాని, కళలను ఆదరించమని కాని ఎవరూ మనని నిర్బంధించరు కళల జోలికి పోకుండా మనకు జీవయాత్ర వెళ్ళిపోదు అటువంటి పిరి స్థితుల్లోకూడా మనం కళాసృష్టీ కళారాధనా చేస్తున్నామంటే, అది మన స్వేచ్ఛాభావాల ప్రకటన అనే అనుకోవాలి

అయితే, కళ ద్వారామటుకు అర్థసాధన జరగటం లేదా, అది మాత్రం కళను నిర్బంధపరచదా అని అడగవచ్చును నిజమే కనకనే కళలస్థితినిబట్టి వాటిని ఆదరించేవారి మనస్తత్వం అర్థం చేసుకునే అవకాశం ఉంది రాజకీయాల వంటి విషయంలో నిర్బంధం ఉందంటే, ఆ నిర్బంధం ఏర్పాటు చేసేది అల్పసంఖ్యాకులు దానికి గురి అయేది అధికసంఖ్యాకులు కళల విషయంలో కళాసృష్టిచేసేది అల్పసంఖ్యాకులు, వారిని నిర్బంధించేది అధిక సంఖ్యాకుల సంస్కారం కనుక జాతియొక్క పోకడ కళల యొక్క పోకడనుబట్టి నిర్ణయమయినట్టు, మరో దాన్ని బట్టి నిర్ణయం కాదు

మన తెలుగుదేశంలో ఇతర కళలు దాదాపు పెరగవనే చెప్పవచ్చును కాస్త విరివిగా పెరుగుతున్నది సాహిత్యమే ఈ మన ఈనాటి సాహిత్యం మన జాతీయతమీద ఎటువంటి వ్యాఖ్యానం చేస్తున్నదో చూడటం యుక్తమే

ఆ పని చెయ్యటానికి ముందుగా ఇంకొకటి తెలుసుకోవటం చాలా అవసరం సాహిత్య స్వరూపం, సాహిత్య ప్రయోజనం

కుడిచి కూర్చున్నవాడు ఉట్టి పుణ్యానికి కావ్యం ఎందుకు రాస్తాడు? డబ్బుకోసం, కీర్తి కోసం రాస్తాడనేది సమాధానం కాదు వాటి కోసం ఇంకా ఇతరపనులు చెయ్యవచ్చును, లేదూ వీటిలోనే హెచ్చు కీర్తి, హెచ్చు డబ్బూ ఉందని తోస్తే, అందరూ ఈ పనే చెయ్యటానికి ప్రయత్నించవచ్చును కాని అట్లా జరగటంలేదు కొద్దిమందే సాహిత్యం సృష్టికి పూనుకున్నారు, రాస్తున్నారు ఆ పని చేసినవారందరికీ కీర్తి, డబ్బూ రావటమున్నూ లేదు సాహిత్యసృష్టి చెయ్యాలన్న ప్రేరేపణ కీర్తికాంక్షా, ధనకాంక్షా కాక మరేదో ఉంది ఆ ప్రేరేపణ లేకుండా ఎవరూ సాహిత్యం రాయలేరు

ఆ ప్రేరేపణ ఉండి కూడా రాయలేనివారు చాలామంది ఉన్నారు వారికి రాయాలన్న ఉత్సాహం ఉంటుంది కాని, విషయం ఉండదు సాహిత్య రచనకు వస్తువుకూడా ఉండాలి ఇది జీవితానుభవంవల్ల లభిస్తుంది కావ్యవస్తువుకోసం ప్రతివాడు ముందు తనలో వెతుక్కోవాలి కాని, బయట వెతకడు దాన్ని తనలోనే (తన అనుభవంలోనే) చూసుకోగలవాడు అదృష్టవంతుడు అది చూసుకోలేనివాణ్ణి లోపల్నించివచ్చే ప్రేరేపణ ఊరుకోనివ్వదు అందుచేత వాడు సాహిత్యవీధులన్నీ వెతికి, తనకు అనువైన విషయం తస్కరించి, తెచ్చి, ఎంగిలిసాహిత్యం సృష్టిస్తాడు (ఇక్కడ కావ్యవస్తువంటే, ఒక కథ అనే అనుకోనవసరం లేదు కావ్యంతాలూకు ఆశయాన్ని కూడా తస్కరించరాదు కథనూ దాని పరమార్థాన్ని కూడా దొంగలించేవాడు నికృష్టుడు )

ప్రేరేపణా, విషయమూ ఉండిన్నీ శిల్పం చాతకాక కావ్యనిర్మాణం చెయ్యలేనివాడు కూడా ఎక్కడన్నా ఉండవచ్చును కానీ, ఇది చాలా అరుదుగా జరుగుతుంది కాకపోతే, ఇది బొత్తిగా అసంభవం కాదుకనక కావ్యనిర్మాణానికి శిల్పంకూడా ముఖ్యమనే ఒప్పుకోవాలి కాని, శిల్పం పైరెంటితో పోల్చితే అంటే ఉన్నతమైన స్థానానికి అర్హత లేనిది

కావ్యకారుడు ప్రేరేపణను తన సంస్కారం వల్లా, విషయాన్ని అనుభవంవల్లా, శిల్పాన్ని సాధనవల్లా అలవరచుకుంటాడు ఈ మూడింటిని నిజంగా వేరుచెయ్యటానికి లేదు సంస్కారానికీ, సాధనకూ చాలా సంబంధం ఉంటుంది ఈ సంబంధం కాలానుగుణ్యంగా మార్పు చెందుతూ ఉంటుంది కనుకనే, నిజమైన సాహిత్యం జీవితం అంటిపెట్టుకుని ఉంటుంది, మత, విజ్ఞానాదుల మోస్తరుగా జీవితానికి ఎడంగా వెళ్లలేదు

అయితే, ఈ విధంగా జీవితాన్ని పురస్కరించుకుని పుట్టిన సాహిత్యం జీవితంలో విహితంగా ఉండదు, జీవితంమీద తిరగబడుతుంది, జీవితాన్ని కోసి పరీక్షచేస్తుంది, జీవితాన్ని నిర్దాక్షిణ్యంగా విమర్శిస్తుంది జీవితంలో ఉన్న కుళ్లు కావ్యకారుడి సంస్కారానికి చేసిన అవమానానికి ప్రతిక్రియ కావ్యం నాయకుడు స్పష్టంగా తప్పుదారిని పోతున్న జీవితాశ్వాన్ని అధిరోహించి, సక్రమమైన మార్గాన పెట్టటానికి తన యావచ్ఛక్తి ధారపోసే స్వచ్ఛందసైనికుడు కవి అటువంటి నిజమైన సాహిత్య కారుడితో పోల్చితే, ఆనందం ఇచ్చేవారూ, పొందే వారూ చమత్కారాలు చేసేవారూ, మొగ్గలు వేసేవారూ మంగటి మంత్రులు

"కావ్యకారుడి ప్రేరేపణ ఎంత ఉండాలి? అనుభవం ఎంత ఉండాలి? సాధన ఎంత ఉండాలి?" అంటే, అది ఎవరూ నిర్ణయించలేదు కాని, ఆయా కొలతలను బట్టే ఉంటుంది కావ్యం ప్రమాదవశంచేత అంతకంటే ఎక్కువ ఉండటం జరగదు

ఏక కావ్యం సాహిత్యం కాదు ఏక కావ్యాలు కారణాంతరాలవల్ల సారస్వతంలో నిలిచి పోవటం కద్దు సాహిత్యం మరోతరానికి మిగలదు ఏతరంవారు ఆ తరం సాహిత్యం సృష్టించుకోవలసిందే ఒక కావ్యం జీవితాన్నంతా సమగ్రంగా అంటలేదు ఒక జాతి సమగ్రంగా తన సాహిత్యం సృష్టించుకున్న రోజున ఆ సాహిత్యం ఆ జాతిని పైకెత్తకుండా ఉండలేదు ఏక కావ్యాలు ఆ పని చెయ్యలేవు

అయితే, సరి అయిన కావ్యం విప్లవం తీసుకు రాకుండా ఉండలేదు - ఎంత సూక్ష్మంగానైనా సరే ఒక జాతి సృష్టించే ప్రతి నిజమైన కావ్యమూ ఆ జాతియొక్క చరిత్రలో ఒక ఘట్టం నిజమైన కావ్యం సృష్టించకపూర్వమూ సృష్టించినవెనకా ఆ జాతిలో మార్పు కనిపించి తీరుతుంది దాన్ని చదివి ఎవరూ మారకుండా ఉండలేరు అది ఒక తీవ్రమైన అనుభవం

''ఎవరికి తీవ్రమైన అనుభవం?'' అనేది ముఖ్యమైన ప్రశ్న, ఒకరికి చెత్తగా కనిపించిన రచన, మరొకరికి అద్భుతమైన అనుభవంగా పనిచేస్తుంది రేచుక్క, పగటిచుక్క కథలు చదివి కూడా పెద్ద అనుభవం సంపాదించే కుర్రవాళ్ళుంటారు సాహిత్యం కేవలమూ ఒక కళగానే చూడదలిచినట్లయితే, ఈ ఘట్టంలో మనం, ''ఎవరి కేరచన అనుభవం కింద జమ అయితే, వారి దృష్టిపథంనుంచి అది కళే'' అని నిర్ధారణచేసి ఉందుము కాని ప్రస్తుతం మన ఆశయం సాహిత్యం యొక్క ఉత్కృష్టాశయం నిరూపించటం కనక, కేవలమూ ఒక అనుభంగా పరిణమించటమే సాహిత్యం యొక్క ఆశయమని తృప్తి పడలేం సాహిత్యం కలిగించే తీవ్రమైన అనుభవం పాఠకుడిలో ఒకచైతన్యం తెచ్చిపెట్టి, జీవితంలో కలగదగిన విప్లవాన్ని సాధించటానికి అతను తయారు తినాలి

అయితే, కొందరికి పైన వాడిన ''విప్లవం'' అనే మాట రుచించక పోవచ్చును అస్తమానమూ విప్లవమేనా? సాహిత్యానికీ కమ్యూనిజముకూ ఒకటే ఆశయమూ? సాహిత్యానికీ రాజకీయాలకూ తేడా ఏమిటి? ఇటువంటి అనుమానాలు కలగవచ్చును

నిజానికి సాహిత్యం మొదటినుంచీ పాటుపడింది విప్లవంకోసం కాదు ఒకప్పుడు జ్ఞానార్జనే సాహిత్యం యొక్క ఆశయంగా ఉండింది ఆ రోజుల్లో సాహిత్యం సరస్వతీ దేవి అందరికీ ఆరాధ్య దేవత అది సాహిత్యానికి కృతయుగం ఈ లోపల జీవితంలోమార్పులు వచ్చి, కావ్యకన్య పాలకుల ఉంపుడుగత్తె అయింది ఆమెకు రసికులంతా అలంకారాలు పెట్టారు, ఆమె ద్వారా ఉద్రేకమూ ఉపశాంతీ పొందారు ఆ కాలంకూడా వెళ్ళిపోయింది పెట్టుబడిదారీ రాగానే రాజాశ్రయం పోయి, కావ్య కన్య ఇంటింటా అమ్ముడు పోసాగింది పెట్టుబడిదారీని సమర్థించినదే సాహిత్యం

ఈ పెట్టుబడిదారీ సాహిత్యమే అన్నిటికన్నా తుచ్ఛమైన సాహిత్యంగా పరిణమించింది దీనిలో తొలియుగంనాటి విశిష్టతలేదు, మలియుగంనాటి సౌందర్యం లేదు ఇది నూరు మందిలో ఒకడికి కూడా ఉపకారం చెయ్యలేకపోయింది ఆ కారణంచేత విప్లవం అవసరమయింది జీవితంలో మార్పు రాగానే దీని ఆవశ్యకత పోవచ్చును

కాని, విప్లవం ఎప్పుడూ ఉంటూనే ఉంది వేదోపనిషత్తులే సాహిత్యంగా ఉన్న కాలంలో పురాణ రచన ప్రారంభించినవాడు విప్లవకారుడు అతనిలో కలిగిన ప్రేరణా, అతను రచించిన విషయమూ, దానికోసం చేసిన సాధనా - అన్ని వేరే, పురాణాలు సాహిత్యంగా ఉన్న రోజుల్లో

కావ్యాలు రాసిన వాళ్లూ విప్లవకారులే కాలచక్ర పరిభ్రమణంలో జరిగిన మార్పులే సాహిత్యానికి మళ్లీ జరిగినై భోజరాజును తృప్తి పరచటానికి కాళిదాసాదులు చేసినపనే ఆంధ్రభోజుణ్ణి తనియించటానికి పెద్దనాదులు చేశారు భోజుడి ఆస్థానంలో చాటువులు తయారయినట్టే, రెడ్డిరాజుల కాలంలో అనేక చాటువులు తయారయినై కాని ఇవి తయారుకాక పూర్వమే, ఈ ప్రబంధాలూ చాటువులూ పుట్టక పూర్వమే, తెలుగులో విప్లవం పుట్టింది దానికి దోవతీసినవాడు పోతన, పోతన సోషలిస్టుకాడు అప్పటికి సోషలిజం లేదు ఆర్థిక సమస్య అప్పటికీవిధంగా లేదు ధనిక వర్గం రాజులు వారి నాశ్రయించుకుని, తమ తమ శక్తి సామర్థ్యాలన్నీ ఆ ధనికవర్గాన్ని తృప్తి పరచటానికి ధారపోసి, ఇతరులు బతికేవారు, పోతన ప్రబంధాలు రాయిలేదు, పురాణం రాశాడు దానిలో జనసామాన్యానికి నచ్చే శిల్పమే ఉంచాడు పోతన, దాన్ని ఏ రాజుకూ అంకితమివ్వలేదు, రాముడికంకితమిచ్చాడు రాజరాజు కాలానికి రాజపోషణవల్ల శీలం చెడని కావ్యకన్యక, పోతన కాలంలో రాజుల దుష్టస్పర్శనుంచి రక్షింపబడవలసి వచ్చింది రాముడి కంకితమివ్వటం పోతన ప్రధానాశయం అయి ఉండదు - రాజులకివ్వకుండా ఉండటమే అతను పట్టణాలనూ, వైభోగాలనూ వదిలి కర్షకులతో కలిసి పొలం దున్నుకున్నాడు అతని తోడి కర్షకుల రూపంలో వచ్చి రాముడు పోతన కవిత్వాన్ని ఆస్వాదించి ఉంటాడు ఆ విప్లవం భాగవతానికి ప్రాణం ఇచ్చింది భారతాన్ని చావకుండా పండితులు పట్టుకొస్తే, భాగవతాన్ని పామరులు పట్టుకొచ్చారు

*ముద్రణ ఆంధ్రప్రభ, 3-9-1941*

# 6. అభ్యుదయ సాహిత్యం

సాహిత్యం సాంఘిక చైతన్యంలో ఒక శాఖ జీవుడై ఉన్న ప్రాణికి నాళ్ళు ఆడటమూ, ఊపిరితిత్తులు పనిచేయటమూ ఎంత తప్పనిసరో సజీవమైన సంఘానికి కూడా చైతన్యం అంత తప్పనిసరి తప్పనిసరి అయిన చైతన్యం తప్పనిసరి అయిన మార్పుకు దారి తీస్తుంది మార్పులో కూడా రెండురకాల మార్పులున్నై, ఒకటి స్థలంలోమార్పూ, రెండోది స్వరూపంలో మార్పూ ఈరెంటిలోనూ స్వరూపంలో మార్పే చాలా ముఖ్యమైనది ఎందుచేతనంటే స్థలంలో మార్పు ఎరగని చెట్లూ చామలూ స్వరూపంలో మారి తమలో ఉన్న ప్రాణాన్నిరుజువుచేస్తాయి

స్వరూపంలో మార్పే పరిణామంగా ఎక్కువ పరిగణించబడుతున్నది

ప్రాణుల తాలూకు చైతన్యం రెండంచులా పదును కల కత్తివంటిది సాంఘికపరిణామానికీ సాహిత్యానికీ సంబంధం గమనించినట్లయితే ఒక వంక అది పరిణామానికి తోడ్పడుతున్నట్టుగా కనిపిస్తూ, మరోవంక పరిణామాన్ని ప్రతిఫలిస్తూకూడా ఉంటుంది అది చెట్టుమీది పువ్వులాటిది, చెట్టు తాలూకు చరమ పరిణామాన్ని సూచిస్తుంది కాని చెట్టు తాలూకు బీజం మళ్ళీ అందులోనే ఇమిడి ఉంటుంది

ఈనాటి వృక్షజాతుల్లో బీజరహితమైన పూలూ, అలంకారమాత్రమైన పూలూ ఉన్నట్టే సాహిత్యంలో నిష్ఫలమైనదీ, వినోదాన్ని మాత్రమే కల్పించేదీ చాలా ఉంది అయితే దీన్ని అభ్యుదయ సాహిత్యం అనం

సిగిరెట్లూ, సారాయీ ఆహ్లాదకరమైన వస్తువులు కావచ్చు వాటిని సేవించినవారందర్నీ మనం వెలివెయ్యకపోవచ్చు కాని అవి ఆహారానికి ప్రత్యామ్నాయాలని మనం అనుకోం ఒక వేళ అటువంటి అపోహతో మనం కొంతకాలం బాధపడినా అనుభవం ఆ అపోహను త్వరలోనే సంస్కరిస్తుంది అదీకాక ఏది శరీరానికి సవ్యమైన ఆహారమో శాస్త్రీయంగా తెలుసుకోవటానికి అవకాశాలు కూడా ఉన్నై

కాని సాహిత్య పరులలోనే చాలమందికి అభ్యుదయ సాహిత్యం గురించి అనుభవంలోగాని శాస్త్రరీత్యాగాని స్పష్టమైన అభిప్రాయాలు లేకపోవటం కనిపిస్తుంది అ అయోమయత్వం ఒక్కొక్కసారి జాస్తిగా చదువుకున్నవారిలోనే అధికంగా కనిపిస్తుంది దీనికి గల కారణాలు గమనించినట్లయితే ఇట్లా ఎందుకు జరిగిందీ తెలిసిపోతుంది

సాహిత్యం గురించి అధికసంఖ్యాకులు పెడతోవ తొక్కటానికి ముఖ్యమైన కారణం చదువుకున్నవాళ్ళే సాహిత్యాన్ని ఒక పరమార్థం చేశారు సాంఘిక అభ్యుదయం ప్రతికూలశక్తులనాత పడుతున్నప్పుడీవిధంగా పరమార్థాలేర్పడతై కళ కళకోసమే, చదువు చదువు కోసమే, సాహిత్యం సాహిత్యం కోసమే, జీవితం జీవించటం కోసమే అనే సిద్ధాంతాలు బయల్దేరతై పరమార్థాలకిందికి చేరే వీటన్నిటికీ సాంఘిక ప్రయోజనం ఉన్నప్పటికీ, అవి గురితప్పి, నీటినుండి బయటపడిన చేపలమోస్తరుగా గిజగిజా తన్నుకోసాగుతై ఈ సిద్ధాంతాలను ప్రచారంలోకి తెచ్చేవాళ్లుకూడా దురదృష్టవశాత్తూ వాటి సాంఘికవిలువ గుర్తించదగిన సంస్కారంకలవాళ్ళే అవుతారు జీవితం తాలూకు యధార్థ సమస్యల్లోపడి కొట్టుకుంటున్న పామరులంకేమో వాటి తాలూకు విలువ తెలియనూ తెలియదూ, పరమార్థాలమీద వారి దృష్టి నిలవనూ నిలవదు

ఒక్కచోట దారితప్పినవాడు ఆదారిన ఎంత దూరం పోయినా అసలు దారికి మరింత దూరమే అయిపోయినట్టు ఈ పరమార్థాలు మరికొన్ని అనర్థాలకు కూడా గురికావటం జరుగుతుంది సాహిత్యం పరమార్థం కాగానే అది చైతన్యసూత్రాలను వదిలేసి స్థావర సూత్రాల కనుగుణ్యంగా నూరసాగుతుంది

ఈ రెండు రకాల సూత్రాలకూ ఉండే తేడా గ్రహించటం అవసరం ప్రాణుల శరీరాలు చైతన్యం సూత్రాల ననుసరించి మారినప్పుడు అన్నీ ఒక విధమైన మార్పుకు సరికావు కాని ప్రాణం పోగానే అన్ని శరీరాలూ ఒకేరకంగా కుళ్ళనారంభిస్తాయి పరిణామ సూత్రాలు పరిణామ స్థాయినిబట్టి మార్పుచెందటం ఉంటుంది పసిపిల్లలు తూకంలోనూ ఎత్తులోనూ వేగం పెరగటం ఆరోగ్యమనే సూత్రం క్రమంగా మార్పుచెంది ఒక దశలో యువకులు అతివేగంగా ఎత్తు పెరిగిపోవటం పిట్యూటరీ ధాతువు తాలూకు వక్రతగానూ, లావు పెరిగిపోవటం గుండెకుపాయకరంగానూ పరిణమిస్తుంది

అభ్యుదయ మార్గం వదిలి సాంఘిక వ్యవస్థ నుంచి "పారిపోయిన" సాహిత్యం శాశ్వత లక్షణాలేర్పరుచుకుంటుంది సాహిత్య శిల్పానికీ, సాహిత్య ప్రయోజనానికీ నియమాలేర్పడతై సాహితీపరులు పరిణామతత్వం విసర్జించి భావవాదులౌతారు సాహిత్య వేదికలమీదినుంచి, 'మేం క్షణికమైన జీవిత సమస్యల్ని గురించి వ్రాయం స్థిరమైన జీవిత సత్యాన్ని అన్వేషించి ప్రజల కందజేస్తాం" అంటారు క్షణిక మైనదని శ్వాసపీల్చటం మానం ఏ సత్యమైనా ఒక

యదార్థంలో నుంచే రావాలి యదార్థ జగత్తు ప్రత్యక్షంగా ఆ క్షణమూ మారుతున్నది ఇందులోనుంచి స్థిరమైన సత్యాన్ని గ్రహించటం ఎట్లా? ఒకవేళ గ్రహించినా దాన్ని సంఘంకోసం వినియోగించటం ఎట్లా?

ఈ భావవాదం వెంట మరికొన్ని ఆచారాలు పుట్టుకొస్తాయి అవేమంటే మహాపురుషుల అనుకరణా, ఇతర అభ్యుదయ సాహిత్యాల పొరపాట్లుదిద్దటమూను ఈ ఆచరణలో లియోనార్డ్ వుల్ఫ్ చెప్పిన Dead Hand of the past కు ప్రాముఖ్యత వస్తుంది గత ప్రపంచ యుద్ధాన్ని మిగిలినవాళ్ళంతా ఆధ్యాత్మిక యుద్ధమనీ, ధర్మయుద్ధమనీ, యుద్ధాలను అంతంచేసే యుద్ధమనీ అంటున్నప్పుడు లెనిన్ దాన్ని సామ్రాజ్య యుద్ధమన్నాడు అప్పటి లెనిన్ ముక్కను ఈనాడు మనదేశంలో ఈయుద్ధానికి తగిలిస్తున్నాం కారణమేమంటే ఈ లోపల ప్రపంచ వ్యవస్థలో పెద్ద మార్పుకలిగి ఆ ముక్క గతంలో చేరిపోయింది

గతం మనమీద ఏవిధంగా ఎక్కి సవారీ చేసేదీ చూడాలంటే ఇంకా సామాన్యమైన ఉదాహరణ ఒకటుంది 1942లో గడియారాలు ఒక గంటముందుకు పెట్టారు ఈ టైము అమల్లో ఉంటూన్నంతకాలమూ మనం టైము చూసుకున్నప్పుడల్లా ''వెనకటి'' (అనగా, అమల్లోలేని) టైమును స్మరిస్తూనే ఉన్నాం మళ్ళీ ఇటీవల టైమువెనక్కు పెట్టేశారు, ఇప్పుడు గడియారాలు చూసినప్పుడల్లా మధ్యలోవచ్చిన టైము స్మరిస్తున్నాం గతంతో లంకె తెంచుకోరాదనేది సహజప్రేరణే కావచ్చుగాక, కాని దాన్ని మనం వినియోగించటంలేదు, అదే మనని వినియోగిస్తున్నది అది అభ్యుదయ లక్షణంకాదు

సాహిత్యంలోకూడా గతం చాలా ప్రాముఖ్యమైపోయింది మనకు వెనకచూపు పడిపోయింది నన్నయభట్టూ, తిక్కన సోమయాజీ, పోతనా, శ్రీనాధుడూ మళ్ళీ రారే మన రచనలు ఈ మహనీయుల రచనలకు నానాటికీ తగ్గిపోతున్నాయే అనేది సాహిత్య ప్రియులను కుంగదీస్తున్నది వీరందరూ వారి వారి కాలాల్లో అభ్యుదయ సాహిత్యం రచించినవారే అయినప్పటికీ వారి రచనల్ని వారి సమాజ వ్యవస్థలనుంచి వేరుచేసి చూడటంవల్ల వారి కవమానం చెయ్యటమే గాక, వారి రచనల తాలూకు నిజమైన విలువ గుర్తించకపోవటమే గాక ఈనాడు జరగదగిన సాహిత్యాభ్యుదయం గురించి సక్రమమైన అభిప్రాయాలు లేకుండా పోతున్నై

పై తరగతి సాహిత్య ప్రియులతో ఏకీభవించక తమకు ''అధునాతన'' మైన అభిప్రాయాలున్నట్టు భావించుకునే యువకులుకూడా సాహిత్యం తాలూకు అభ్యుదయం గురించి పైవారు చేసే పొరపాటే చెయ్యటం చాలాసార్లు కనిపిస్తుంది ఈ అధునాతనులు ''పుర్వాచారపరాయణత్వం'' ఒప్పుకోరు వీరికి ''ప్రగతి'' కావాలి అంచేత ఏంచేస్తారంటే సమీపంలో ఉన్న పాశ్చాత్య రచయితలను నమూనాలకింద స్వీకరిస్తారు కవిత్వం రాస్తే టి యస్ ఇలియట్ మోస్తరుగా రాయాలి కథలురాస్తే చెకొవ్ మోస్తరుగా రాయాలి - ఈవిధంగా

క్రియకు రెండూ ఒకటే అయింది సాహిత్యం జీవితవృక్షాన పూసేపువ్వనే ఉపమానంలోశాస్త్రీయమైన లోపం ఏమీలేనట్టయితే సాహిత్యాన్ననుసరించి సాహిత్యం పుట్టటం, పువ్వున పువ్వు పూయటమన్నమాట - అసంభవం శిల్ప సంబంధమైన అనుకరణ సాహిత్యాన్ని బాధించదు ఒక మనిషి కుట్టించిన రకం చొక్కా మరొకడు కుట్టించుకోవచ్చు అది ప్రాణి తాలూకు పరిణామాన్నిఅట్టే శాసించదు (అట్టే శాసించదని

ఎందుకనుకుంటున్నానంటే, గట్టిగాచెప్పలేం మొహానికి కోటావేసుకోగానే దానివెంట మనస్తత్వం మారేనటులున్నారు ఆ కోటా కడిగేసుకునేవరకూ వాళ్ళ మనస్తత్వం మామూలు స్థాయికిరాదు ఎంతమంది తత్వవేత్తలో, శాస్త్ర పరిశోధకులో కూర్చుని ఎంతకాలం చర్చిస్తేనోగాని ప్రాణులకూ నిర్జీవపదార్థాలకు గల బాంధవ్యంగురించి సత్యం బయటికిరాదు మనకదిక్కడ అప్రస్తుతం ) కాని సాహిత్య సృష్టికి కావలసిన ప్రేరణ - inspiration అనండి - జీవితంలో నుంచే రావాలి

ఇంకొక విషయం గమనించండి సాహిత్యం గురించి మన ప్రాజ్ఞుల అభిప్రాయాలు ఈ విధంగా ఎడదారి పట్టబట్టే ఈనాడు అభ్యుదయ సాహిత్యం యొక్క ఆవశ్యకత ఇంత బాగా మనకి తెలిసివచ్చింది ఇది ఒక అసంతృప్తిరూపంగా పైకి వచ్చింది కాని ముందు కార్యక్రమానికి ఈ అసంతృప్తి ఒకటేచాలదు అభ్యుదయ సాహిత్యం వ్యాప్తికావటానికి అంతరాయాలుగా ఉండే తాత్విక భౌతిక విషయాలు మనము పూర్తిగా గ్రహించి వాటిని సక్రమంగా ఎదుర్కోవాలి

అభ్యుదయ సాహిత్యం ఒక ప్రబలమైన సామాజిక శక్తి సామాజిక శక్తులు పెరగటం సమాజాన్ని దోపిడిచేసేవారికి రుచించదు చలంగారు ప్రచండంగా సంఘంలో ఉన్నకుళ్ళనూ,మగవాడు ఆడదాన్ని చేసే శారీరక మానసిక దోపిడీని తమ కథలద్వారా బయటపెట్టినప్పుడు సంఘం ఆయన్ని విమర్శించటానికి బదులు తిట్టింది ఆయన గ్రంథాలు తగలబెట్టింది భార్యల్ని జీతంలేని నౌకర్లుగానూ, విలాసవస్తువులుగానూ, చరాస్తిగానూ వాడుకుంటున్నవాళ్ళు చలంగారి నెట్లా సహిస్తారు? చలంగారిని సంఘం సహృదయంతో మొదటినుంచీ విమర్శిస్తూ వచ్చినట్టయితే ఆయన రచనలు యదార్థ సాంఘిక వ్యవస్థకు ఎడంగా వెళ్ళిపోయి వారికి తర్కంగానూ, శుష్కవేదాంతంగానూ పరిణమించటం జరిగి ఉండేదిగాదు అభ్యుదయ శక్తుల్ని అవగాహన చేసుకున్న విమర్శకులు లేని కారణంచేత ఒక ప్రతిభావంతుడైన కథకుడు అభ్యుదయ సాహిత్యానికి ఎడంగా వెళ్ళటం జరిగింది ఇప్పటికైనా మించిపోయిందిలేదు - అభ్యుదయ రచయితల సంఘం ఆయనచేత ఉత్తమ రచనలు రాయించడానికి ప్రయత్నించవచ్చు

అభ్యుదయ సాహిత్యం సాగాలంటే రచయితకీ సంఘానికీ ఒక సజీవ సంబంధం - ఒక organic connection - ఉండాలి రచయిత తాలూకు భావం సంఘంమీద ఉన్నంతమాత్రాన లాభంలేదు సంఘంయొక్క ప్రభావం రచయిత మీద కూడా ఉండాలి ఇప్పటి కవులలోను, రచయితలలోనూ అనేకమంది ఈ విషయం గుర్తించనట్టయితే, ఉత్తమ అభ్యుదయ రచన చెయ్యగలరు కాని 'నేను సమాజం మీద నా ప్రభావం చూపుతాను, సమాజం మట్టుకు నన్నంటటానికి వీల్లేదు'' అనే వ్యక్తిత్వం - individualism - అవలంబించే రచయిత అభ్యుదయ సాహిత్యం సృష్టించలేడు

అభ్యుదయ రచనలు సాగించదలిచినవారు గుర్తించవలసిన మరో అతిముఖ్య విషయమేమంటే సమాజం గురించి, పరిణామం గురించి, శాస్త్రీయమైన దృష్టి లేకపోతే సత్యస్వరూపమే లేదు సృష్టి ఒక చిత్రమనీ జీవిత మంతా ఒక అర్థంలేని భగవల్లీల అని మనం గట్టిగా అనుకుంటే పశుస్థితిదాటి పైకి వచ్చి ఉండం మానవుడు విజ్ఞానంద్వారానే ప్రకృతిని తనకు సుముఖం చేసుకున్నాడు మానవ సమాజం పరిణామం చెందుతున్నకొద్దీ జ్ఞానం పెరుగుతున్నకొద్దీ మానవ సమస్యలకు శాస్త్రీయమైన పరిష్కార మార్గాలు ఏర్పడుతున్నాయి

ఈనాటి యుద్ధాలూ, కరువులూ, రాజకీయ మార్పులూ, దారిద్ర్యమూ, అనాగరికతా - ఇవన్నీ ఎందుకు కలుగుతున్నాయనిగాని, వీటి తాలూకు మూలకారణాలు కేవలమూ మనుష్యుం మనస్తత్వాల్లోనే ఉన్నాయనిగాని అనుకున్నవ్యక్తి అభ్యుదయ రచన చెయ్యలేడు కిందటి బ్రిటిషు యెలెక్షన్లను గురించి మాట్లాడుతూ, ''యెలెక్షన్లో గెలుపు లాటరీ వంటిది ఆ క్షణాన కొన్నివేలమంది ఇటు మొగ్గి ఉంటే టోరీలు గెలిచేవాళ్ళు'' అని చెప్పేమనిషికి రాజకీయాలు తెలీవు వ్యక్తులకూ వ్యక్తుల సముదాయానికీ ఉండే సంబంధం తెలీదు, Theory of probability తెలీదు ఒక ఎలెక్షనులో వోటుచేసే వారిలో ఒక లక్షమంది అస్పష్టమైన భావాలున్నవారయినప్పటికీ, వారిలో ఎన్నివేలమంది ఎటు ఓటు చేసేది చాలా స్పష్టంగానే అంచనా కట్టవచ్చు

వ్యక్తులనీ, వ్యక్తుల మనస్తత్వాలనీ చిత్రిస్తూ సాంఘిక పరిణామాన్ని వొదిలేసి సాహిత్యం సృష్టించటం చాలా తేలిక ఒక లాటరీలో పాల్గొన్న లక్ష మందినీ విసర్జించి అందులో లక్ష రూపాయలు సంపాదించిన ఒకణ్ణి గురించి రాయటానికి సంఘం గురించి ఏమీ తెలియనక్కర్లేదు ఆ విధంగానే, అబద్ధం ఆడననో, కోటీశ్వరుణ్ణి అవుతాననో పట్టుబట్టి జయించిన వాళ్ళ కథలు రాయవచ్చు ఆ కథల్లో ఏదో నీతి ఉన్నట్టు కూడా నటించవచ్చు కాని ఆ రచనల్లో సాంఘికపరిణామం ప్రతిఫలించదు అవి సాంఘికపరిణామానికి దోహదమూ చెయ్యవు ఎందుచేతనంటే ఈ కథల్ని మనస్ఫూర్తిగా నమ్మి వాటి ప్రభావానికి గురి అయిన వాళ్ళలో అత్యధిక సంఖ్యాకులు గట్టిగా దెబ్బతింటారు అది ప్రజా సాహిత్యం కాదు

ఆ కారణం చేత అభ్యుదయ సాహిత్యం ప్రజల దగ్గరికి పోక తప్పదు ప్రజా సాహిత్యం కాకా తప్పదు ప్రజలందరూ చదివేదే ప్రజా సాహిత్యమైతే మనం ప్రజా సాహిత్యం సృష్టించలేం కాని అధిక సంఖ్యాకులైన ప్రజల జీవితాన్ని శాసించే సాంఘిక శక్తుల ప్రభావాలను అర్థం చేసుకుని చిత్రిస్తూరాయటం సక్రమమైనపని అందుకుగాను జీవితం గురించి సూత్రప్రాయంగా చాలా తెలియాలి ఆ పైన మన అనుభవాలు ఎంత పరిమితంగా ఉన్నా అపరిమితానుభవాన్నే ఆ సూత్రాలద్వారా తరిచి సత్యం నిరూపించవచ్చు

అభ్యుదయ సాహిత్యం జీవితం మాదిరిగానే విస్తరించాలి పరిణామం చెందాలి మడి కట్టుకుని సంకుచితత్వం అవలంబించరాదు ఉన్నగోడల్ని పడదొయ్యాలి కొత్తగోడ లేవదీయరాదు ప్రజలశక్తుల్ని పెంపొందించాలి వాటిని బందిలిదొడ్డికి తోలరాదు ఈ ఉద్యమానికి సంఘంలో ఉన్న అందరు కళా సేవకుల సహకారమూ, అందరు స .స్కారుల సానుభూతి చాలా అవసరం అటువంటి సహకారము సానుభూతి తప్పక లభించి తీరుతుంది ఈ ఉద్యమము అవిచ్ఛిన్నంగా సాగిపోతుంది

*ముద్రణ తెలుగుతల్లి, జనవరి 1946*
*పునర్ముద్రణ 1 ప్రగతివారపత్రిక, 31-10-1969*
*2 సాహిత్య ప్రయోజనం వ్యాసావళి,*
*విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, అక్టోబరు 1969*

# 7. సాహిత్య రచన

సాహిత్యం రాయటం అంటే అట్టే కష్టం కాదని చాలా మందికి తెలీదు సాహిత్య రచనకు కావలసిందల్లా కాగితాలూ, కలమూను కాగితాలు తెల్లవిగా ఉండడం మంచిది రంగు కాగితాలైనా ఫరవాలేదు రంగు కాగితాలుపయోగించేటప్పుడు సిరా రంగూ, కాగితం రంగూ ఒకటిగా ఉండకుండా చూచుకోవడం కొంతవరకు అవసరం తమ విధేయుడు ఎర్ర కాగితాల మీద ఎర్ర సిరాతో రాసిన రచనలు కూడా చదివాడు కాని అర్థై రూపాయలు తీసి సంపాదకత్వ మంత్రసానితనంపైన వేసుకున్న అభాజనుడు అన్నిటికీ సంసిద్ధుడయే ఉండాలి ఒకసారి రాసిన కాగితాలు మరి రాయటానికి పనికిరావనే మూఢ విశ్వాసం చాలా మందికి ఉన్నది ఇది కేవలము అపోహ! పెనసలుతో రాసిన కాగితాల మీద సిరాతోటీ, సిరాతో రాసిన కాగితాల మీద రంగుపెనసలుతోటీ, మహరాజుగా రాయివచ్చు అయితే ఇట్లా రాసినది ఉత్తమ జాతి సాహిత్యం అవుతుందా అని సందేహం కాని ఉత్తమ జాతి సాహిత్యం కింద చేర్చదగిన పద్యాలు సంపాదకుడి లేఖల మార్జినులలో రాయబడి రావటం కూడా తమ విధేయుడి అనుభవంలోదే గనుక ఈ విషయంలో సంకుచితత్వం పెట్టుకోకుండా ఉండటమే మంచిదేమో

ఇటీవల సాహిత్యం మరీ ఎక్కువగా ఉంటున్నదని, పత్రికలు - వీటిని తగలెయ్యా - మరీ జాస్తి అయిపోతున్నాయినీ చాలామంది విసుక్కుంటున్నారు కాని ఇందులో మనం నసుపెట్టవలసిన అంశం ఏమీ లేదు వెనుకటి రోజుల్లో - సాహిత్యం శాశ్వతంగా రాతి పుస్తకాల మీద రాయబడిన రోజుల్లో - సాహిత్య రచన అంటే ఒక విధమైన గృహ పరిశ్రమగా ఉండేది అప్పటి రచయితలు ఈనాటి కూలివాళ్ళల్లే ఉదయమే లేచి కాలకృత్యాలు తీర్చుకుని వసారాలోకి వచ్చి కూర్చుని కుర్రాడిని ఉలికి పదునుపెట్టమని చెప్పి, ఈలోపుగా ఇష్టదేవతా ప్రార్థన ముగించుకుని, సూర్యోదయం వేళకల్లా సాహిత్యం చెక్కటం ప్రారంభిస్తే భోజనాల వేళకు మూడు నాలుగక్షరాలు పూర్తి అయ్యేవి అంతట రచయిత లేచి ఒంటి మీద పడ్డ రాతి నలుసులు దులుపుకొని, స్నానపానాదులు చేసి ఇంటిల్లిపాదికీ తాను ఉదయం చెక్కినంతవరకూ సాహిత్యం వినిపించి ఒక కునుకు కునికి మళ్ళీ లేచి రాతి మీద పనికి కూచుంటే రాత్రి ఒకఝాము గడిచి ఆముదం దీపం కొడిగట్టే లోపుగా ఒక పంక్తి యావత్తూ ఇట్టే పూర్తి అయిపోయేది

సాహిత్యస్రష్టల గతి ఇట్లా ఉంటే పఠితల గతి ఇంకా అన్యాయంగా ఉండేది ఈనాటి రచయితలు నున్నటి కాగితాల మీద ఖరీదైన కలాలతోరాస్తుంటేనే ఒక్కో సమయంలో రచయిత యొక్క అభిప్రాయాలు దురూహ్యంగా ఉంటాయి గదా, ఆ రోజుల్లో రాతికీ ఉలికీ గల సంఘర్షణలో ఉద్భవించిన ఆ లిపి ఏ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి లాంటి కొద్దిమందికో తప్ప అర్థమయేది కాదంటే ఆశ్చర్యం ఏమిటి గనక? ఈనాటి కవులు ''నా రచన విను'' అని అన్యాయత్తచిత్తులైన ప్రజల వెంటపడ్డ విధంగా అప్పట్లో ప్రజలు నీ రచన కాస్త చదివి పెట్టవూ? అని కవిగాడిని వెంబడించే వారు

ఆ రోజుల్లో రాసిన సాహిత్యం శాశ్వతంగానూ, పరిమితంగానూ, పామర జనాతీతంగానూ ఎందుకు ఉండేదో ఇప్పుడు మీరు తెలుసుకున్నారు

ఆ తర్వాత కాలక్రమాన తాటాకులూ గంటాలూ వెలిశాయి కొందరు జిజ్ఞాసాపరులు తాటాకులను నిరసించారు అవి నిలవ్వు, వాటి మీద రాసిన సాహిత్యం ఎండి, పగిలి, నుసి అయి, కాలక్రమాన ఇంత దుమ్ముగా మారిపోతుంది, సాహిత్యం ఏ అయిదారు శతాబ్దాలో మించి ఉండదు, ఇది సరస్వతీదేవికి ద్రోహం అన్నారు కాని అప్పటి అభ్యుదయ రచయితలు నినిపించుకోక, 'మేము ప్రజాబాహుళ్యం కోసం రాయదలిచాం వస్త్రాదులు కాని వాళ్ళు సహితం చంకని పెట్టుకొనే స్వరూపంలో నలుగురికీ అర్థమయే లిపిలో రాసినదే ఈనాడు అభ్యుదయ సాహిత్యం మా కీర్తి వెయ్యేళ్ళు మాత్రమే దక్కితే ఇంతలోపోయేదేముంది?'' అని పూర్వాచారపరాయణుల మీద తిరుగుబాటు చేసి తాటాకుల మీద గంటాలతో రచన సాగించారు అంతటితో, గృహ పరిశ్రమగా ఉంటూ వచ్చిన సాహిత్య రచన విస్తరించింది కాస్త చదువుకొన్న వాళ్ళ ఇళ్ళల్లో రెండు మూడు తాళపత్ర గ్రంథాలు అమ్మవారి మందిరంలో చేరటమూ, అప్పుడప్పుడూ దీపారాధన వాటికి సోకి ప్రమాదం జరగటమూ తటస్థిస్తూ ఉండేది '' ఈ గ్రంథాలన్నీ చదవటానికి నీకు వేళ ఎక్కడిది బాబూ?'' అని లౌకికచింతాపారాయణులు సాహితీ ప్రియులను మందలించే వారు సాహిత్యాన్ని పూజా మందిరంలో దాచని పక్షంలో పిల్లలు ఉద్గ్రంథంతో ఉదయం నాలుక గీసుకొనే ప్రమాదం ఎక్కువగా ఉండేది పిల్లల వాతపడి గాని, దీపారాధనకు నైవేద్యం అయిగాని ఒక గ్రంథమో గ్రంథభాగమో నశించినప్పుడు ఎన్నో రోజుల శ్రమా ఎన్నో కుంచాల ధాన్యమూ ఎంతో అపురూపమైన వస్తువూ వృథా అయిపోయినట్లయేది

మరి ఈనాడు మన ఆడవాళ్లు నిశ్చింతగా పత్రికలతో నెయ్యి కరగబెట్టేస్తున్నారంటే ఇది పరిణామమే అనాలి ఇవాళ కాగితం కరువొచ్చి కొంచెం గిజాటుగా ఉంది గాని పౌను అయిదు కాన్లకి బోలెడంత కాగితం పౌను పావలాకి బోలెడంత టైపు రోజా ఆరణాల వేతనం మీద బోలెడంత మంది కంపోజిటర్లు, ఈ పరిస్థితుల్లో సాహిత్యం విరివిగా రాకేం జేస్తుంది? పైగా, చదివే వాళ్ళ సంఖ్య తరుగుతున్నకొద్దీ సహజంగా అది రాసేవాళ్ళ సంఖ్యగా మారుతుంది అందుచేత ''సాహిత్యం ఎంత?'' అనే సమస్యకి సమాధానం 'వెళ్ళినకొద్దీను''

పోతే ''సాహిత్యం ఎందుకు?'' అనేక్లిష్టసమస్య మనని ఘోరంగా ఎదుర్కొంటుంది

ప్రతిదానికీ, ''ఎందుకు?'' అని అడగటం చాలా మందికి దురలవాటు కర్ణుడు చావటానికి ఏడు కారణాలుట ఒకే కారణం పెట్టుకుని ఎవరూ ఏ పనీ చెయ్యరు అందులోకూడా ఏ ఒక్క కారణమూ స్థాయిగా ఉండక మార్పు చెందుతుంది ముందు విందులు కుడుస్తాం, తర్వాత పథ్యం తింటాం అట్లాగే ముందుకీర్తి కోసం రాస్తాం అది పత్రికలో పడకపోతే ఏ తత్సంపాదకుణ్ణో తిట్టడానికి రాస్తాం తమ విధేయుణ్ణే దుమ్మెత్తి పొయ్యటానికి వెనక ఒక ఉద్యమం లేపటమేకాక ఇందుకుగాను బోలెడంత డబ్బు పోసి ఒక పత్రికారాజము నడపటం కూడా జరిగింది

మన వ్యాసాలు పత్రికలో పడగానే మనకి పేరు వస్తుందా అని కొందరికి అనుమానం, కాని ఈ ఆధునిక యుగంలో ఇంతకంటె మంచి పద్ధతి లేదు ఖ్యాతి అంటే పేరు ప్రచారం

కానటం '(ప్రామిసరీ నోట్లమీద, దస్తావేజుల్లోను, స్కూలు రికార్డుల్లోను, మ్యునిసిపల్ రిజిష్టరులోను, మన పేర్లుండవచ్చు గాని, అవన్నీ చెరగని అచ్చులో చెలామణీ గల పత్రికలో పెద్ద అక్షరాల్లో పడే మన పేరులాగ ప్రచారం కాజాలవు ఒకవేళ రచయిత అమాయకుడై మారుపేరుతో రచనలు సాగించినట్లయితే ఆ రచనలు అచ్చేకావాలి కాని త్వరలోనే ఆ రచయితకు మారుపేరు సార్థక నామమై ఊరుకుంటుంది

సాహిత్యం పదిమందీ చదవటానికనీ, ప్రపంచాన్ని ఉద్ధరించటానికనీ, సంఘాన్ని మార్పు చెయ్యటానికనీ, కొన్ని అభిప్రాయాలు చెలామణిలో ఉన్న మాట నిజమే! కాని ఇవన్నీ వర్రి గొంతెమ్మ కోరికలు కొత్తగా రచనలు చెయ్యటం మొదలు చేసినవాళ్ళు పదిమంది చేత చదవించాలనే సత్సంకల్పంతో తమ రచనలు పడ్డ పత్రికలను పట్టుకుని తిరుగుతారు కాని త్వరలోనే వాళ్ళకి నిజం తెలిసొస్తుంది ఈ నిజం ఏమిటంటే, ఎవరన్నా పత్రికలు చూస్తారు కాని చదవరు కొన్ని సంవత్సరాల క్రితం ఒకానొక పత్రిక ప్రత్యేక సంచికను మరో పత్రిక సింహావలోకనం చేస్తే - అవలోకనం అనే మాట గుర్తుంచుకోండి అందులో ఎన్ని బొమ్మలున్నదీ, అవి ఏయే జాతులకు చెందినదీ విపులంగా చెప్ప అందులో కొన్ని వ్యాసాలు కూడా ఉన్నట్టు టూకీగా చెప్ప ఊరుకుంది అందుచేతనే తమ విధేయుడు తన స్నేహితులను, '' ఈమధ్య నేను రాసిన వ్యాసం చూసారా?'' అని అడుగుతాడు కాని చదివారా అని పొరబాటున కూడా అడగడు

ఇక ప్రపంచం ఉద్ధరించడం మాటా? ప్రపంచాన్ని ఉద్ధరించే వాళ్ళు శాస్త్ర పరిశోధనలు చేస్తారు నూతన సృష్టి చేస్తారు రాజకీయ వేత్తలవుతారు కొత్త పార్టీలు లేవదీస్తారు వైద్యులవుతారు ప్లీడర్లవుతారు, మరేదైనా చేస్తారు కాని సాహిత్యం మటుకు రాయరు మన రాజకీయ నాయకులుగాని సంస్కర్తలు గాని, తదితర గొప్పవాళ్ళు కాని, ఎవరైనా సాహిత్యం రాస్తారేమో చూడండి

సంఘాన్ని మార్పు చెయ్యడం గురించి ఈ పని చాలా కాలం వ్యయం చేసిన చలంగారేం అంటున్నారో వినండి సంఘం దున్నపోతుట మనవంటి మనుషులం రాన్ని ఎంత బాదినా, తొసినా, ఏం చేసినా కదలదుట అది ఎప్పుడో, ఎటో, రాని ఇష్టానుసారం కదులుతుందట ఈ భాగ్యానికి ఈ దున్నపోతుని కదిలించడానికి సాహిత్యం వ్యర్థ పరచడం కూడా దేనికి? ఇతంకన్నా చక్కగా పేరు ప్రచారం కావడానికి రాసుకోవటమే చాలా మంచిది రాయగా రాయగా ఏనుగెక్కే అవకాశం ఉంది

సాహిత్యం ఎవరికీ అనే ప్రశ్నపై సంగతుల్ని బట్టి దానంతట అదే తేలిపోతుంది మనం రాసేది పత్రిక కొనేవాళ్ళంతా చూస్తారనుకోండి వాళ్ళ దగ్గర పట్టికెళ్ళి పత్రికలు పారేసే వాళ్ళు కూడా చేసే అవకాశం ఉంది తీసుకున్న వెంటనే పారెయ్యకపోతే, వీళ్ళు కాక ప్రత్యేకించి చూడవలసిన వాళ్ళు వేరే ఉంటారు మనం ఎవరి మీదనైతే దెబ్బలు తీస్తూ రచన చేశామో వారందరూ పత్రికలో మన వ్యాసం చూడాలి వీలైతే చదవాలి వాళ్ళు పత్రిక కొనిగాని కొన్నవాళ్ళ దగ్గర బదులు తెచ్చిగాని మన వ్యాసం చూడటం చాలా అనుమానాస్పదం ఎందుకంటే, కాస్త తీరకి చిక్కితే ఎవరన్నా సినిమాలకి పోతారు, కాఫీ హోటల్‌కి పోతారు, హస్కు కొడతారు, లేకపోతే క్లబ్బుకి పోయి చీట్ల పేక ఆడతారు కాని పనివేళా పత్రిక లెవరు చూస్తారు? అందుకని

ఈ ప్రత్యేక వ్యక్తులకు మనమే, స్వంతాన పత్రిక కాపీలు కొని పోస్టు చెయ్యాలి, మనం ప్రణయ కథలుగాని కవిత్వంగాని రాసినప్పుడు మనం ప్రేమించే డజను నుంచి ఆడపిల్లలకు తలా ఒక కాపీ పోస్టు చెయ్యాలి బీద రచయితకి ఇది ఖర్చుతో కూడుకున్న వ్యాపకమే మరి అయినా చేతి చిలుము వదలకుండా రచయిత కానేరడనేది మనం మరిచిపోకూడదు ఎవడన్నాస్నేహిత బ్రువుడు కనిపించి, ''ఏమోయ్, మొన్న నువ్వదేదో పత్రికలో ఆదేసిటో రాశావే'' అనగానే మర్యాద కోసం కాఫీ హోటలుకు వాణ్ణి పట్టించుకుపోయి ఇంత కాఫీ పొయ్యటం తప్పదు కదా ! ప్రెస్సు వాళ్ళకి అప్పు పెట్ట గలిగిన పరిస్థితుల్లో మనం అచ్చేయించే మన పుస్తకం తాలూకు కాపీలు నోరు చేసుకుని అడిగిన వాడికల్లా ఆటోగ్రాఫ్‌తో సహా ఇవ్వక తప్పదు రాస్తే వ్యాసాలు పత్రిక్కి పంపించేటప్పుడు పోస్టు బిళ్ళల ఖర్చు తప్పదు కదా, ఏది తప్పుతుంది గనుకా ?

సాహిత్యం ఎప్పుడు రాయాలి అంటే వేరే ఏ పనీ చెయ్యటానికి లేనప్పుడని వేరే చెప్పఖ్ఖర్లేదు సాహిత్య రచనకు చాలా తీరిక ఉండాలి ఇన్‌స్పిరేషను రావాలా ? దానికోసం నలుగురాడవాళ్ళతోటి అంతో ఇంతో పరిచయం సంపాంచటమూ, నలుగురు మగాళ్ళతోటీ అభిప్రాయ భేదాలు తెచ్చుకోవటమూమొదలైనవి చెయ్యాలంటే ఇతర వ్యాపకాలుండరాదు ఇళ్ళూ పొలాలూ, పుత్రా ఉంటే వాటి ఆలోచనలు సాహిత్య ప్రవాహాన్నడ్డుతాయి ఉద్యోగం ఉంటే అదే ఉన్నకాస్త శక్తినీ హరించేస్తుంది ఏ రాజకీయాల్లో గాని, ఏ ఇతర ఉద్యమంలో గాని ఆసక్తి ఉంటే జీవితాన్ని గురించి అంతో ఇంతో నిజం తెలియడం ప్రారంభించి ఇక సాహిత్యం సృష్టించటానికే చెయ్యాడదు అదు వల్ల కాణీ అర్జన లేకుండా, చేసే పని బొత్తిగా లేనివాళ్ళే విరివిగా ఉత్తమ సాహిత్య రచన చెయ్యగలుగుతారు అట్లా స్వేచ్ఛా విహంగంగా ఉన్నరోజుల్లోనే, నేను చాలా ఉత్తమ సాహిత్యం రచించానని నా మిత్రులు చెబుతున్నారు

*ఆంధ్రజ్యోతి, మాసపత్రిక, ఫిబ్రవరి 1946*

## 8. అభ్యుదయ రచయితల బాధ్యతలు

అభ్యుదయ ఉద్యమంతో పాటు కళాసాధన కూడా సాగించటం అభ్యుదయ రచయితల విధి కొందరు అభ్యుదయ రచయితలు అభ్యుదయోద్యమాన్ని మాత్రమే పాటించి కళా నిర్వచనాలను ఉపేక్షిస్తున్నారు మరికొందరు కళా నిర్వచనాల ద్వారా అభ్యుదయోద్యమాన్ని చూడటానికి ప్రయత్నించి రెంటికీ సమన్వయం లేనట్టూ, ఏదో ప్రత్యేక ప్రచారానికి గానూ కళ అభ్యుదయ రచయితల చేత దుర్వినియోగ పరచబడుతున్నట్టూ అపోహపడుతున్నారు

కళా నిర్వచనాలు వేరే ఉన్నాయి ఆ నిర్వచనాలలో అభ్యుదయ బీజాలు దొరుకుతాయని భ్రమపడవద్దు కళలన్నీ అభ్యుదయ కరమైనవి కాకపోవచ్చు కాని, కళలను అభ్యుదయానికి వినియోగపరచటం మన అభ్యుదయ రచయితల ఆశయం అందుచేత రెండు విషయాలు మనం పాటిస్తాం కళ కానిదానికి మనం కళాఖ్యాత ఇవ్వం, కళాఖ్యాత ఉన్నప్పటికీ సాంఘికాభ్యుదయానికి పాటుపడనట్టయితే దాన్ని మనం ఆదరించం

మనకు ముందువారు కొందరు కళా దృష్టితో తృప్తి పడ్డట్టు కనిపించారే? మనం అభ్యుదయదృష్టి, కళలకెందుకు జోడించవలసి వచ్చింది? ఈ ప్రశ్నకు మనం సమాధానం చెప్పగలిగి ఉండాలి కళాసాధన గాలిలో జరగదు అది సాంఘిక వాతావరణంలోనే జరగాలి అభ్యుదయ నిరోధకులీ సత్యాన్ని ఒప్పుకోరు ఇటీవలివరకూ వీరు కళ ఒక పరమార్థమనే నిరర్థక వాదాన్ని తప్పెట వేశారు అది వారి తప్పు కాదు అంతులేని విలవగలది అనటానికి అమూల్యమైనది అంటూ ఉండటం పరిపాటిగా ఉండే సంస్కారంలో వారు పెరిగారు నిరర్థక జీవులైన ధనికవర్గం వారినీ,దిష్టిబొమ్మల్లాంటి ప్రభువుల్నీ సంఘంలో గొప్పవ్యక్తులుగా పరిగణించిన సాంఘిక సంస్కారంలో వారు పెరిగారు కాని, ఇప్పుడిప్పుడు వారీ వాదాన్ని ఉపసంహరించుకొని కొత్త పంథాలు తొక్కుతున్నారు వీరీ విధంగా వాదిస్తారు, కళ యొక్క ప్రయోజనం ఏమిటి? మనసుకు ఆనందాన్నివ్వటం, మనిషి బుర్రలో ఉండే కుళ్ళునీ, నరాల కాలుష్యాన్నీ కడిగి వెయ్యటం, బుద్ధికి అనిర్వచనీయమైన ఆనందం ఇవ్వటం - ఇంతకంటే కళకు ప్రయోజనం లేదు

కళకు ప్రయోజనం వుందని ఇప్పుడువీరామోదిస్తున్నారు కాని ఈ ప్రయోజనం వ్యక్తిగతమైనది, సాంఘికమైనది కాదు కళని సాధించేవాడు వ్యక్తి దాన్ని అనుభవించే వాళ్ళు కూడా వ్యక్తులే అందుచేత వీరు కళాప్రయోజనాన్ని దాటి మాట్లాడరు కాని, కళాసాధకుడూ కళాస్వాదకుడూ కూడా ఒకే సంఘంలోనే ఉన్నారు వీరికున్న పరస్పర సంబంధం కళ ఒక్కటే కాదు, సామాజిక సంబంధం కూడా వారి మధ్య వున్నది అందుచేతనే అభ్యుదయ కళల విలువను మనం గుర్తించుతున్నాం

అభ్యుదయ సాహిత్యం అనగానే అభ్యుదయ నిరోధకులు ప్రచారం అనే సాకు చెబుతారు అందుచేత కేవలమూ గానకళ తీసుకుందాం గాయకుడు కేవలమూ కళాసాధకుడుగా పాటకచ్చేరీలు చేసినంత కాలమూ అతనిలోగాని, అతని పాట వినే శ్రోతలలో గాని సమగ్రమైన కళా సంతృప్తి వుండదు ఇది ఊహాకల్పితమైన విషయం కాదు మంచి గాయకులై వుండి, వ్యక్తిగతంగా శ్రోతలకు ఎంతో సంతృప్తి ఇవ్వగలిగివుండి, గానకళను గురించి సమగ్రమైన ఆసక్తి లేక ఏదో అసంతృప్తితో వుండే గాయకులున్నారు ఈ గాయకులకూ ఈ శ్రోతలకూ సామాజిక సంబంధం ఏమాత్రం వుండినా వీరు ఆరాధించే కళ శ్రోతలలో ఎంతో చైతన్యం తీసుకురాగలిగి వుండును సుబ్బులక్ష్మి వంటి గాయనీమణి సంగీతకళను శ్రోతలకెంత అందించినా రాని చైతన్యం ఒక భారతీయార్ పదం పాడగానే పుట్టుకు రావటం మనలో చాలామంది ప్రత్యక్షంగా చూశాం ఆమాటే అంటే కళావాదులు భారతీయార్ పదానికీ సంగీతకళకూ ఏమిటి సంబంధం అంటారు అప్పుడు మనం త్యాగరాజు కృతికీ గానకళకూ సంబంధమేమిటని తిరిగి అడుగుతాం కాని అసలు విషయమేమిటంటే సంగీతం వెంట సాంఘిక బాంధవ్యం కూడా ఏర్పడగానే కళా సాధకుడికీ, కళాస్వాదకుడికీ కూడా కళారక్తి పెరుగుతున్నది ఈ సంబంధం పాట తాలూకు సాహిత్యం ద్వారా కలగాలని లేదు కేవలమూ నాదం ద్వారానే కలగవచ్చు అభ్యుదయ దృష్టి లేని గాయకుడు తనముందుకూర్చున్నవారిలో జరీమడత ఉత్తరీయాల వాళ్ళను చూస్తాడుగాని, ఎనిమిది గంటలు శ్రమించి వచ్చిన వారిని చూడడు అభ్యుదయ దృష్టి గల గాయకుడైతే ఒకవెయ్యి మందిశ్రామికులు గాని, స్వాతంత్ర్య

నైపుణ్యంగాని తనముందు కూర్చుంటే ఏ విధంగా నాదోపాసన చెయ్యాలసిందీ సులభంగా నిర్ణయించుకోగలడు అటువంటి అభ్యుదయ గాయకుడు ఈ నాటి పాటకచేరీ వాళ్ళ కన్నా కళను ఒక మెట్టు పైకి తీసుకుపోగలడని అభ్యుదయ కళావాదులం గుర్తించుతున్నాం

మనసంఘంలో గాలిసాము చేసే ప్యూర్ ఆర్టిస్ట్సు వున్నారనీ, కేవలమూ కళాసాధనతోటే వారు సమగ్రమైన ఆనందం తాము పొంది ఇతరులకిస్తున్నారనీ అభ్యుదయ విరోధకులు వాదిస్తారు అటువంటి కళా సాధకులలో సాంఘిక చైతన్యం రాలేదని మనం వారికి సమాధానం చెబుతాం ప్రజలను ఉమ్మడి మీద తీసుకుంటే ఇటువంటి ప్యూర్ ఆర్టిస్టులతో వారు ఒక్కనాటికి ఉత్తేజపడరని కూడా మనం చెబుతాం

అభ్యుదయ రచయితలమైన మనకు కళారాధకులకుండే బాధ్యతలన్నీ వున్నాయి

కళారాధకులలో సాంఘిక చైతన్యం కలిగించటం మన విధి జీవితం ప్రమాద భూయిష్ఠం కాదనీ, జీవితానుభవం వెనక కొన్ని సూత్రాలున్నాయనీ, వాటి సహాయంతో జీవితాన్ని అభ్యుదయ మార్గాన నడపించవచ్చుననీ మన రచనల ద్వారా మనం చాటాలి జీవితాన్ని అధోగతికి లాగే శక్తులను అవకాశం దొరికినప్పుడల్లా ప్రతిఘటించి వాటికి సహజంగా నిలవనీడ లేకుండా చెయ్యటానికి మనలోవున్న సర్వకళా శక్తులనూ ధారాళంగా ఉపయోగించటం మనవిధి జీవిత పరిణామంలో ప్రజాహితానికి అనుకూలంగా పాటుపడే అన్ని సాధనాలను గుర్తించి, వాటిని బలపరుస్తూ, వాటికి విజయం చేకూర్చుతూ, మన కళను ముందుకునడపటం మనవిధి సంఘ విద్రోహ శక్తులతో ఈనాడు శ్రామికులూ, శక్తిహీనులూ విజయవంతంగా పోరుతున్నారు వారి శక్తులను ఇందుకుగాను అపూర్వంగా కేంద్రీకరిస్తున్నారు ఈ ప్రజలను ఒకప్పుడు వాడి చూపులతో పాలించిన విద్రోహకులీనాడు మరఫిరంగులను పైకి తీస్తున్నారు ఈ ప్రజాశక్తులను బలపరచటమూ, వీరి అసామాన్య శౌర్య పరాక్రమాలను గుర్తించి కీర్తించటమూ మన విధి

మన హక్కులను కూడా మనం గట్టిగా అనులు పరచాలి మనం సంస్కారరీత్యా సంఘానికి ముందున్నవాళ్ళం జీవితాన్నీ, జీవితంయొక్క అంగాలనూ సూక్ష్మంగా పరిశీలించి విమర్శించటానికి మనకు హక్కున్నది రాజకీయ పక్షాలూ, పెట్టుబడిదారీలూ, అంతర్జాతీయ కుట్రలూ మనకన్న చిన్నవి వీటిని మించి మనం పెరగాలి వ్యక్తిగతంగా కాకపోయినా, మన సంఘంద్వారా మన అభ్యుదయ రచయితలం ప్రతి సామాజిక సంఘటనను గురించీ తీవ్రంగానూ, న్యాయంగానూ విమర్శించ గలిగి వుండాలి మనం పదవీ వ్యామోహితులం కాము రాజకీయాలను విమర్శించటంలో మనకు సంఘక్షేమం తప్ప మనకు వేరే ఆశయాలు లేవు ఈ దృష్టితో రాజకీయ సంఘటనలను గురించి విమర్శించేటందుకు మనకు హక్కున్నది

ప్రస్తుతం మనకు అనేక ప్రతిబంధకాలున్నాయి ఒక బుర్రకథ గాని, ఒక సినిమా చిత్రంగాని ప్రజలలోకి వెళ్ళినట్టుగా మన రచనలు ప్రజలలోకి వెళ్ళే పరిస్థితి ఇంకా ఏర్పడలేదు నాటకాలు తప్పిస్తే మన ఇతర రచనలు ప్రజలకందే అవకాశాలు చాలా తక్కువ దేశంలో వున్న నిరక్షరతే దీనికి ముఖ్యకారణం

అదీకాక ఒక తెలివైనవాడు చెప్పినట్టు, సోషలిస్టు వ్యవస్థలో తప్పమరే ఇతర వ్యవస్థలోనూ కళాసాధకుడికీ, కళాస్వాదకుడికీ కొంత ఎడం ఉండితీరుతుంది ఈ ఎడం కూడా మనని ప్రజా సామాన్యానికి అందకుండా చేస్తుంది

మన ఉద్యమం నేటివరకూ చెప్పుకోతగిన విజయం సాధించలేదు అభ్యుదయ సాహిత్య కళ ఏపాటి విజయం సాధించి ఉండినా గాలిసాము సాహిత్యం వెనుకపడి ఉండేదే కాని అది ఇంకా అంతరించక పోవటం బట్టి మనం విజయం సాధించలేదని తెలుసుకోవచ్చు అయితే మన ప్రయత్నం పూర్తిగా విఫలం కాలేదు దానికి దాఖలా ఏమంటే, మన సంఘంలో లేని రచయితలు ఇతర పత్రికలలో అప్పుడప్పుడూ అభ్యుదయ రచనలు ప్రకటిస్తున్నారు ఈ రచనలనూ, రచయితలనూ మనం గుర్తించాలి సరి అయిన విమర్శనా దృష్టితో పత్రికాసాహిత్యాన్ని అవలోకిస్తున్నట్టయితే మనం అభ్యుదయ రచనల ప్రభావం పెంచగలుగుతాం, అన్ని పత్రికలూ అభ్యుదయ దృష్టి కొంతవరకైనా అలవరుచుకునేటట్టు చెయ్యగలుగుతాం

మనకు విమర్శ తగుమాత్రం లేకపోవటం కూడా ప్రతిబంధకంగానే వుంది ఆత్మ విమర్శ అభ్యుదయ రచయిత యొక్క ఉత్తమోత్తమ సాధనం దాని ద్వారానే మనం మనలోపాలు దిద్దుకోగలుగుతాం ప్రచురణే పరమార్థమనుకోకుండా మనం మనరచనలద్వారా సాంఘికాభ్యుదయం సాధించాలంటే మనరచనలు ప్రజలలోకి ఎంతవరకు వెళ్ళుతున్నదీ, ప్రజలమీద వీటి ప్రభావం ఏవిధంగా వుంటున్నదీ తెలుసుకోక తప్పదు ఇదివిమర్శ ద్వారానే సాధ్యమవుతుంది

ఒక వంక ప్రజల మీద, మరోవంక సాహిత్య స్రష్టల మీదా కూడా అభ్యుదయోద్యమ ప్రభావం క్రమంగా పెరుగుతూరావాలి మన సంఘంలోకి వచ్చిన వారిలోనే కొంత సంస్కారం అభివృద్ధి కావాలి మనకెడంగా వున్న రచయితలకు కొన్ని అపోహలున్నాయి వాటిని పోగొట్టే బాధ్యత మనమీద ఉన్నది

సాహిత్య స్వరూపాల్లో పాటా, గీతమూ, కథా, నవలా, నాటకమూ ఉన్నట్టుగానే అభ్యుదయ రచనకూడా ఒక విశేషమని చాలా మంది అపోహ పడుతున్నారు అభ్యుదయరచన అన్నట్టయితే అందులో కళా దృష్టీ, శిల్పనైపుణ్యమూ అవసరం లేదనీ, శ్రామికవర్గం గురించి రాస్తేనే అది అభ్యుదయ రచన అనీ, శ్రామిక వర్గాన్ని గురించి రాస్తే ఎట్లా రాసినా అభ్యుదయ రచనేననీ రకరకాల అపోహలు రచయితలలో ఉన్నట్టు కనిపిస్తుంది ఈ అపోహలు ఎవరు ఏకారణం చేత కల్పించినవైనా వాటిని పోగొట్టటం మనవిధి

సామాన్య రచయితకు బోలెడంత స్వాతంత్ర్యం వుందనీ, మామూలు రచయిత దేన్నిగురించి అయినా రాయవచ్చుననీ, అభ్యుదయ రచయితకు అటువంటి స్వాతంత్ర్యం లేదనీ అనేక మందికి ఒక అభిప్రాయం ఉంది దీన్ని అపోహ అని మనం కొట్టి వేయవలసిన అవసరం లేదు కాని అటువంటి స్వేచ్ఛా ప్రియత్వాన్ని మనం ప్రతిఘటించాలి తన రచనను గురించి అసమర్థుడైన పత్రికా సంపాదకుడి నిర్ణయాన్ని ఆమోదించే రచయిత తన స్వాతంత్ర్యాన్ని చూసి మురుస్తాడు డబ్బుకోసం పత్రికాధిపతి కోరినటువంటి రచనను సవినయంగా రాసే రచయిత తనకు స్వాతంత్ర్యం లేదని గుర్తించడు ఎవరికీ అక్కర్లేని రచనలూ, తనకే పూర్తి ఉత్సాహం లేకుండా రాసే రచనలూ చేస్తూ రచయిత తాను స్వేచ్ఛాజీవి ననుకుంటాడు కాని ఆ రచయితే జనసామాన్యానికి ఉపకరించే రచనలు, సంఘం మీద ప్రభావాన్ని చూపే రచనలు రాయమని మనం కోరగానే తన స్వేచ్ఛ యావత్తూ అంతరించినట్టుగా బాధ పడతాడు, తన

వేరు కూలీల పాటలూ, కర్షకుల కథలూ రాయిస్తున్నారని బెంగపడతాడు తనను కమ్యూనిస్టులు తమ ప్రచారం కొరకు ఉపయోగించుకో చూస్తున్నారని వాపోతాడు ప్రజలు బాగుపడాలని అన్న ప్రతి వ్యక్తీ కమ్యూనిస్టు ఏజెంటు ఎందుకయిపోవాలో ఎంత ఆలోచించినా నా బోటి వాళ్ళకు అర్థం కావటంలేదు కమ్యూనిస్టులను బలపరచకుండా మనం అభ్యుదయం కోసం పాటుపడలేమనేది నిజంగా రూఢి అయిన నాడు మనం కమ్యూనిస్టులను బలపరచటంవల్ల ప్రమాదమేమిటో అదీ అర్థం కావటంలేదు ఇటువంటి స్వేచ్ఛాప్రియత్వాన్ని ప్రదర్శించటం మన విధి ఇది కేవలమూ బాధ్యతా రాహిత్యంలోనూ, అరాచకవాదంలోనూ ఇమిడిన స్వాతంత్ర్య ప్రియత్వంగాని, నిజమైన స్వేచ్ఛాప్రియత్వంకాదు

జీవితం వేడెక్కింది ప్రజలు మేల్కొన్నారు కాని మన రచయితలూ, కళాకారులూ ఇంకా నిద్రమత్తుతో ఉన్నాం ఈ జడత్వం వదలగొట్టుకునే టందుకు మన అభ్యుదయ రచయితల సంఘమూ, అభ్యుదయోద్యమమూ తప్ప మనకు వేరే మార్గం లేదు వీటిని సమగ్రంగా ఉపయోగించుకుని అభ్యుదయ మార్గంలో మనం మరింత వేగంగా ముందుకు సాగాలి

*మద్రాసు అభ్యుదయ మాసపత్రిక, అక్టోబరు 1947*

# 9. ఏది అభ్యుదయ సాహిత్యం

పై శీర్షికతో అక్టోబరు 14 ''తెలుగు స్వతంత్ర''లో శ్రీ కొత్తపల్లి రంగారావు గారు ఈ కింది సిద్ధాంతాన్ని ఉపపాదించారు

''ప్రజలకొక అడుగు ముందుండి, వారి పరిస్థితులనూ సమస్యలనూ అర్థం చేసుకొని, వారికి సరిఅయిన మార్గాన్ని చూపిస్తూ, ఉద్బోధాన్నీ, ఉత్తేజాన్నీ కలిగించి కర్తవ్యోన్ముఖులజేసి, పాత వ్యవస్థలను ధ్వంసంగావించి వాటి శిథిలాలపై నూతన సమాజం నిర్మాణాన్ని గావించడానికి పురికొల్పేదే అభ్యుదయ సాహిత్యం అదే నిజమైన ప్రజా సాహిత్యం ''

అభ్యుదయ సాహిత్యం యొక్క ఆశయాలకు సంబంధించినంతవరకు నేను శ్రీరంగారావు గారితో ఏకీభవిస్తాను కాని ఎవరన్నా నన్నుగాని శ్రీ రంగారావుగారిని గాని నిలవేసి, '' ఇటువంటి ఆదర్శాలు గలిగిన ఒక గేయంకాని, కథగాని,నాటకంగాని చూపండి,'' అంటే చూపలేకపోవచ్చు దానికి కారణం ప్రధానంగా ఏమంటే పైన చెప్పినది అభ్యుదయ సాహిత్యం యొక్క సమిష్టి ఆశయం ప్రతి అభ్యుదయ రచనలోనూ ఇన్ని ఆశయాలూ గూడుకట్టుకుని ఉండాలంటే అభ్యుదయ రచన దాదాపు అసాధ్య మవుతుంది గోర్కీ రచనలు కూడా పరీక్షకు నిలబడవు

పై నిర్వచనాన్ని కొంచెం వివరంగా పరిశీలించితే ఏమి తేలేదీ చూద్దాం

పై సిద్ధాంతానికి అనుగుణంగా రాజకీయాలకు సంబంధించిన రచనలు రచించటం చాలా సులభం వాటి విషయం నేనిక్కడ ఎత్తుకోను అచ్చగా సాహిత్యం విషయమే తీసుకుందాం

అభ్యుదయ సాహిత్యం ప్రజల సమస్యలనూ, పరిస్థితులనూ అర్థం చేసుకోవాలి ఇది కూడా అభ్యుదయ రచయితలు సులభంగా చేయగలవనే ప్రజాజీవితానికీ, ప్రజల

ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధులకూ అంతరాయంగా ఉన్నది వర్గదోపిడీ విధానమనీ, అది నశిస్తేగాని ప్రజా జీవితం అవరోధంగా సర్వాంగ శోభితంగా అభివృద్ధి కాదనీ, ప్రజా జీవితం ఒక్క అడుగు ముందుకు వేయకుండా ఉండగలందులకు పై వర్గాలవారు తమ యావచ్ఛక్తులనూ - బుద్ధిబలంతో సహా - ఉపయోగిస్తారనీ అభ్యుదయ వాదులుతప్పక గుర్తిస్తారు

కాని ఈ విషయాన్ని సాహిత్యం ద్వారా ప్రజలకు తెలియపరుస్తూ వారికి ''సరియైనమార్గం చూపిస్తూ ఉద్బోధనా ఉత్తేజమూ'' కలిగించటం సులభమైన పనికాదు తుడిచిపెట్టిన పలకమీద ఏదైనా రాయవచ్చు ప్రజల మనస్సులు తుడిచిన పలకలు కావు ''మీ సమస్య ఇది ఈ పని చేస్తే మీరు పైకి వస్తారు '' అని చెప్పినంత మాత్రంచేత ప్రజలు పైకి రాలేరు వారి వర్గ వాసన పూర్తిగా అర్థం చేసుకోకుండా వారి జీవితాలలో పాలు పంచుకోకుండా, వారి అజ్ఞానాన్నీ, మౌఢ్యాన్ని అవగాహన చేసుకోకుండా, వారి మనస్తత్వాన్ని తూచకుండా వారితో పై విషయాలు అనలేము ఇందులో మనస్తత్వ పరిజ్ఞానానికీ, శిల్పానికీకూడా ఎంతో ప్రాముఖ్యం ఉంది ఈ ప్రాముఖ్యాన్ని శ్రీరంగారావుగారు ఖాతరుచెయ్యక, ఇది సులభమైన పని కాదన్న వారందరూ ఎస్కేపిస్టులనీ, ప్రభుత్వానికి వెరిచిన వారనీ అనేటట్టయితే దాని కెవరు బాధ్యులు?

కేవలం తీర్మానం వున్నంత మాత్రంచేత ఏ మధ్యతరగతివాడు గాని ప్రజాసామాన్యాన్ని యదార్థంగా ఉత్తేజపరిచే రచనలు చేయలేడని నేను నొక్కి వక్కాణించగలను వర్గ సంస్కృతి దానికి అడ్డం వస్తుంది వర్గ సంస్కృతి పుట్టుకతో రాదంటే ఒప్పుకుంటాను గాని అది కృషివల్ల మాత్రమే పోతుందంటే నేను ఒప్పుకోను వర్గ సంస్కృతికీ భౌతిక జీవితాధారాలకూగల పారస్పర్యాన్ని శ్రీరంగారావుగారు మరువరాదు

పై నిర్వచనంలో ''పాత వ్యవస్థను ధ్వంసం కావించటం'' అనే అంశమొకటి ఉన్నది ఇది కూడా అభ్యుదయ సాహిత్యం ఆశయాలలో ఒకటి సాంఘికాభ్యుదయం చేకూరే పరిణామంలో ఇప్పుడున్న వర్గాల స్వరూపమూ, వాటి సంబంధాలూ కూడా మారతాయని నేను శ్రీ రంగారావుగారికి వేరే చెప్పనవసరం ఉండదు మధ్యతరగతివిశ్వాసాలలోనూ, మానసికమైన అలవాట్లలోనూ పరిణామం ఫలితంగా ''పుచ్చు'' ఏర్పడుతున్నది ఈ ''పుచ్చు''ను ఎత్తి చూపటం, దానిమీద దెబ్బకొట్టటం అభ్యుదయ లక్షణం ఎందుకు కాదు? అంతమాత్రం చేత అటువంటి రచనలన్నీ ప్రజాసాహిత్యమవుతాయా? అయే పక్షాన నేను రాసిన అనేక కథలు ప్రజాసాహిత్యం అయి ఉండాలి శ్రీ రంగారావు గారు వాటిని ప్రజా సాహిత్యమన్నా నేను అనటానికి సిద్ధంగా లేను కాని అవి అభ్యుదయ రచనలుమాత్రం అవును

ఒక మార్క్సిస్టు ఈ విధంగా అన్నాడు

'' వర్గ వ్యవస్థ ముదురుతున్న కొద్దీ కళాకారుడికీ ప్రజా సామాన్యానికీ మధ్య ఒక అఖాతం ఏర్పడుతుంది సామ్యవాద పద్ధతిపై సాంఘిక వ్యవస్థ నిర్మాణమైన మాత్రంచేత కూడా ఈ అఖాతం పోదు కాని ఇది పోవటానికి సామ్యవ్యవస్థ ఏర్పడటం కనీస షరతు ''

శ్రీ రంగారావుగారు చెప్పే మాటకూ ఈ పై సిద్ధాంతానికీ చాలా వ్యత్యాసం కనిపిస్తున్నది అనుభవాన్ని బట్టి పై సిద్ధాంతంలో కొంత నిజం ఉన్నట్టుగా కూడా కనిపిస్తున్నది ఒకనాడు నన్నయభట్టూ, అంతకన్నా కూడా తిక్కనసోమయాజీ రాసిన భారతమూ, మరొక నాడు

ఆ వర్గాలను అనుసరించకపోటం ఆయా వ్యక్తుల బలహీనత, సమాజంలో విధిగా రావలసిన మార్పులకోసం పాటు పడని వాళ్ళ తప్పు ఇటాంటి కుళ్ళును దైవికంగానూ, అనివార్యంగానూ చిత్రించి హృదయాలను సంచలింప చేస్తే అందువల్ల సమాజం మారుతుందనేది కల్ల దుర్భరమైన జీవిత సమస్యల క్రింద నలిగే వాళ్ళు చాలామంది జీవితంలో ఉన్నారు కథలు చిత్రించవలసినది వాళ్ళను కాదు, ఆ సమస్యలను పరిష్కరించటానికి ప్రయత్నించే వాళ్ళని వాళ్ళ ప్రయత్నాలు శిష్ట సమ్మతం కాకపోవచ్చు, అమలులో ఉన్న సంఘ నియమాలకు విరుద్ధంకావచ్చు కాని అటువంటి చిత్రణ వల్ల కొంత ప్రయోజనం ఉన్నది చలంగారు అచ్చుగా ప్రేమ రహితమైన స్త్రీ జీవితాలను చిత్రించి తృప్తి పడలేదు ప్రేమాన్వేషణతో స్త్రీలను యింటినుంచి బయటకు పంపాడు, వర్తమాన జీవితంలో స్త్రీకి ప్రేమమయ జీవితం ఉండాలనేది ముఖ్య సమస్య అనుకుంటే - చాలామంది ఆరోజుల్లో అనుకున్నారు - చలంగారు రాసింది సరి అయినదే ఎలాగూ బతకలేనివాడు దొంగతనంచేస్తే, లేక చేసినట్లు కథ రాస్తే, ఈనాడు పాఠకుడు వాణ్ణి ఎలా తప్పుపడతాడు? జూదంలో పెళ్ళాన్ని పణంగా పెట్టిన ధర్మరాజుకన్న ఈ దొంగ తక్కువవాడవుతాడా? నిజమే, వాస్తవ జీవతంలో దొంగకు శిక్షపడుతుంది వాస్తవ జీవితంలో ఉన్న అవకతవక చట్టాలను సమర్థించటానికే అయితే కథలు రాయాలా?

వితంతు వివాహాలు అమలులోకివచ్చి,విడాకుల ఏర్పాటుకు ప్రయత్నాలు ఏమీ లేని రోజుల్లో కీ శే శ్రీనివాస శిరోమణి ఒక కథరాశాడు ఒకయువకుడు ఏకారణంచేతనో తన మొదటి భార్యను విడిచిపెట్టి మరొక భార్యను చేసుకుంటాడు మొదటి భార్య పునర్వివాహం చేసుకునే మార్గం లేదు హీరోవెళ్ళి ఆమె భర్తను హత్య చేస్తాడు ఒక్కసారే ఇద్దరు భార్యలూ వితంతువులవుతారు ఇద్దరూ ఇప్పుడ పెళ్లాడవచ్చు ఇది గొప్ప కథ అని చెప్పడంలేదు కాని అది ఒక సాంఘిక పరిస్థితిని నగ్నంగా చూపింది

మన కథలలో మరొక ధోరణికూడా కనబడుతుంది అవి ఆధ్యాత్మిక విలువలు బంకించంద్రుడి నవలల్లో అతీత వ్యక్తులు వచ్చి లౌకిక విషయాలలో పాల్గొంటారు మన కథల్లో హీరోలు లౌకిక విషయాలను తెంచుకుని దేవుడి బిడ్డలైపోయి, హంసల్లాగా ఆకాశానికి ఎగిరి, మనబోటి మానవులకు అందకుండా పోతారు వారికి సత్యం భూమిమీద కనబడదు, ఆకాశంలో కనిపిస్తుంది భగవంతుడు (ఏ వేంకటేశ్వరుడి రూపంలోనో) వాళ్ళకు ప్రత్యేకమైన దాఖలాలూ సదుపాయాలూ ఇచ్చి ఆదరిస్తాడు ఈ కథలూ, నవలలూ చదివి మనం కుళ్ళులో జీవించే పురుగులమనుకోవాలన్నమాట!

ఇలాంటి రచనలు హద్దుమీరిన రచనలు వాస్తవ జీవితాలు ఆధ్యాత్మిక విలువలకు అంకితమైపోయినవాళ్ళు ఎందరైనా ఉండవచ్చు వాళ్ళు ఈ మన జీవితానికి చిన్న మెత్తు ఉపకారంచెయ్యలేరు వారి ఆధ్యాత్మిక విలువలు మన భౌతిక సామాజిక విలువలను మార్చే వర్గం ఉంటే వాటిని గురించి ఆలోచించవచ్చు లేని పక్షంలో భగవద్భక్తినీ, మతవిశ్వాసాలనూ ప్రబోధించే పుస్తకాలు కొల్లలుగా ఉన్నాయి అవి చెయ్యలేనిపని ఆధునిక నవలలు చెయ్యటం చాలా అనుమానాస్పదం

అంతకంటె ముఖ్యమైన విషయమేమంటే, ఈ నవలలు జీవితాన్ని గురించి అబద్ధాలు రాస్తాయి హేతువాదంలో అర్థంకాదగిన వాటికి విపరీతార్థాలు కల్పిస్తాయి హేతువాదంలో

తేలికగా అర్థం కాని విషయాలకు జీవితంలో అనవసర ప్రాముఖ్యం ఇస్తాయి నిత్య జీవితంలో మానవ యత్నాన్ని మంట గలుపుతాయి

ఈనాటి రచయితలు వేరు వేరు తాత్విక దృక్పథాలనూ, సామాజిక శాస్త్రాలనూ అలవరుచుకుంటున్నారు వ్యక్తికీ, సమాజానికీ, భావనకూ సంబంధించిన అనేక సిద్ధాంతాలు ఎలామణీలో ఉన్నాయి శక్తి కొద్దీ దోపిడి (పెట్టుబడి దారీ) వాదమూ, సోషలిజమూ, కమ్యూనిజం, ప్రజాస్వామ్యవాదమూ, ఫ్రాయిడ్ సిద్ధాంతాలూ, యుంగ్ సిద్ధాంతాలూ, అద్వైతమూ, భౌతిక వాదమూ, ఎగ్జిస్టెన్షియలిజమూ, ఇంకా సవాలక్ష వాదాలు రకరకాల వ్యక్తులను వేరువేరు కారణాల వల్ల ఆకర్షిస్తున్నాయి వారిలో రచయితలు కూడా ఉన్నారు వీళ్ళు జీవితాన్నీ, జీవిత గమనాన్నీ తమ తమ దృక్పథాల నుంచి అర్థం చేసుకునేటందుకు ప్రయత్నిస్తారు వారికి ఆ స్వేచ్ఛ ఉన్నదని ఒప్పుకోవచ్చు

కాని ఈ రచయితలు తమ సిద్ధాంతాలకు అనుగుణంగా ఉండేటట్టు జీవితాన్ని కృత్రిమంగా చిత్రించటం హద్దుమీరటమే అనిపించుకుంటుంది పాశ్చాత్య సాహిత్యంలో స్కిజోఫ్రినియా, పారానోయియా, డిప్సోమానియా వగైరా మానసిక రోగచిత్రణను కథలరూపంలో రచించటం పరిపాటిగా ఉంటున్నది అవి కృత్రిమ చిత్రణలు కావు, కాని వాటివల్ల ప్రయోజనం ఏమిటి? కూరలో ఉప్పు ఎక్కువయితే నోట్లో పెట్టుకోలేని వాడు జగత్తు మిధ్య అన్న పరమసత్యాన్ని ప్రచారం చెయ్యటంలో అర్థమేమిటి? బాంకులను జాతీయం చేయటం కమ్యూనిజ మనేవాళ్ళు సోషలిజం తెస్తామన్నట్లు!

మానవ సమాజం దేవుణ్ణీ, విధినీ ఏనాడో నిరాకరించింది మానవుడి చర్యలను శాసించే శాసనాలు చేసి, వాటిని అతిక్రమించిన వాళ్ణే సమాజం శిక్షుస్తున్నది అలాంటప్పుడు ఈశ్వరుడే అన్నీ చేస్తున్నాడు లేక చేయిస్తున్నాడనటంలో అర్థమేమిటి? నేరాలు చేసిన వాళ్ణే సమాజం వాడి ''కర్మ''కు వదలదెందుచేత? కర్మ సిద్ధాంతం ఏమైపోతున్నది?

ఒక కోటీశ్వరుడు ఒక దిక్కులేని పిల్లకోసం అష్టకష్టాలు పడ్డట్టు కథరాస్తే నమ్మి నిజమనుకునే వాళ్ళు ఉంటారా?

ఒక రచయితకు కమ్యూనిజంలో విశ్వాసం ఉండి, మన దేశానికి కమ్యూనిజం వచ్చేసినట్టు రాస్తే ఎవరూ ఆమోదించకపోవటం సబబేగదా!

ఈ విషయాలన్నీచెప్పటంలో నేను రెండు నమ్మకాలకు కట్టుబడ్డాను ఒకటి, సాహిత్యానికి సాంఘిక ప్రయోజనం ఉండాలన్నది, రెండోది, జీవిత చిత్రణ వాస్తవికంగా ఉండాలన్నది

ఈ విశ్వాసాలు కళాకారులందరికీ ఉండవనీ, ప్రచ్ఛన్న కమ్యూనిస్టులై ఉండి, అభ్యుదయ రచయితలమని ముద్రవేసుకునే వాళ్ళకే ఉంటాయని వాదించిన వారున్నారు వాళ్ళ వాదనలు ఆట్టే వినగా నాకు ఒక సంగతి తెలియవచ్చింది అదేమిటంటే వాళ్ళకు సాహిత్యం ద్వారా సాంఘిక ప్రయోజనం కావాలి, అవాస్తవ రచనలను వాళ్ళు సహించరు వాళ్ళ అభ్యంతరమల్లా సాంఘికాభ్యుదయం గురించే

*ముద్రణ సంవేదన త్రైమాసిక పత్రిక- అక్టోబర్ 1969*
*పునర్ముద్రణ సాహిత్యప్రయోజనం (వ్యాసావళి)*
*విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, అక్టోబరు 1969*

# 16. నా షష్టిపూర్తి

ఇవాళ సౌమ్యనామ సంవత్సర అశ్వయుజ పూర్ణిమ సరిగ్గి ఇదేరోజున (తెలుగు పంచాంగం లెక్కన) నేను పుట్టాను అంటే చాంద్రమానం ప్రకారం నాకు 60 ఏళ్ళు నిండి ఇవాళ 61 ప్రవేశిస్తున్నది ఇంగ్లీషు పంచాంగం ప్రకారం ఇంకా మూడురోజులు ఆగాలి

60 ఏళ్ళు నిండటంలో నాకేమీ ప్రత్యేకత కనిపించలేదు ఒకప్పుడు షష్టిపూర్తి అన్నది వ్యక్తి జీవితంలో ఒక గొప్ప విషయం అయి ఉంటుంది మనదేశంలో ఒక గొప్ప విషయం అయి ఉంటుంది మనదేశంలో సగటు ఆయుర్దాయం చాలా తక్కువగా ఉండేది నా చిన్నతనంలో కూడా నలభై దాటినవాళ్ళని ముసలివాళ్ళకింద చూసేవాళ్ళు 60 దాటినవాడు పండు ముసలి అన్నమాట

అదీగాక ఆనాటివ్యక్తుల జీవితం ఏదిక్కునా పదిమైళ్ళుదాటి విస్తరించేదికాదు అందుచేత 60 ఏళ్ళకు జీవితానుభవం సమగ్రం అయి ఉండేది ఇక ఆ మనిషి కొత్తగా సంపాదించే అనుభవం ఏమీ ఉండేది కాదు పెత్తనం పిల్లలకు సంక్రమించేది షష్టిపూర్తి అయిననాడు ఒక మూలకూర్చుని ''రామా, కృష్ణా'' అనుకోవటమూ, 'చిన్న పిల్లలు రానురాను ఇంతనాసిగా తయారవుతున్నారేమిటో' అని ఆశ్చర్య పోవటంతప్ప చేసేది అట్టే ఉండేదికాదు

ఈనాడు ఆ జీవితం లేదు మనిషి ఎక్కడ పుట్టుతాడో, ఎక్కడ చదువుతాడో, పొట్టచేత పట్టుకుని ఎక్కడ ఉద్యోగం చెయ్యబోతాడో, పిల్లలు ఎక్కడ ఉద్యోగాలు చేస్తారో, ఏమీ చెప్పటానికి లేదు డెబ్బై ఏళ్ళువచ్చినా బాధ్యతలు తీరకపోవచ్చు అనుభవం పూర్తికావటమంటూ ఉండనే ఉండదు ఈనాటి జీవితాన్ని పూర్తిగా అర్థం చేసుకోవటానికి ఒక జీవితంచాలదు పుస్తకజ్ఞానం పుష్కలంగా ఉన్నదనుకున్నా కూడాను

అందుచేత ఈనాడు వయోవృద్ధుడైనవాడు, కాళ్ళూ చేతులూ పడిపోయి మంచానపడితే తప్ప రామా, కృష్ణా అంటూ ఒకమూల కూర్చునే అవకాశంలేనివాడై ఉంటున్నాడు నూటికి తొంభైతొమ్మిది కేసుల్లో ఈ వయోవృద్ధునికి, తనకొడుకులూ, కూతుళ్ళూ జీవితం గురించి ఏమనుకుంటున్నారో కూడా తెలీదు తన జీవితానుభవం వాళ్ళకు ఎందుకు పనికిరాకుండా పోతున్నదీకూడా అతడికి అర్థంకాదు నా చిన్నతనంలో అని అతను చెప్పబోతే వినేవారు కూడా ఉండరు కాలవేగం యువకుడు అర్థం చేసుకున్నంతగా వయోవృద్ధుడు అర్థం చేసుకోలేడు జీవితంలో కలిగేమార్పులు తానే ఎక్కువగా గమనించే స్థితిలో ఉన్నప్పటికీ క్షణంలో ఆకాశాన్ని దాటిపోయే విమానాన్ని చూసినవాడు వేగాన్ని అర్థం చేసుకున్నవాడు, ఆ విమానంలో ఎక్కి దానివేగాన్ని తనవేగంగా చేసుకున్నవాడే దాన్ని నిజంగా గ్రహించినవాడు

చిన్న పిల్లలకు పుట్టినరోజు పండుగలు చేసి, నలుగురినీ పిలుస్తారు తల్లిదండ్రుల ఆనందంలో పైవాళ్ళుకూడా భాగం పంచుకుంటారు పిల్లలకు మూడేళ్ళు దాటాక పుట్టినరోజు పండుగలకు పైవాళ్ళ ప్రయోజనం ఉండదు ఇంకా పెద్ద వాళ్లయాక ఎవరి పుట్టినరోజువాళ్ళే 'సెలిబ్రేట్'' చేసుకునే స్థితికూడా రావచ్చు లేదా పుట్టినరోజులు నిశ్శబ్దంగా వచ్చిపోవచ్చు రానురాను పుట్టినరోజులు కనపడని కణువులుగా పరిణమిస్తాయి 61వ పుట్టినరోజు అన్నది భూతద్దంలో చూస్తేగాని కనబడని కణువు దానికి ఊరేగింపులూ,

ఉత్సవాలూ జరపటం చాలా కృత్రిమమైన వేడుక  అది ఎంత కృత్రిమ మంటే దాన్ని జరిపేవారి నిజమైన అభిమానం ''రిచువల్'' మధ్య ఊపిరాడక నలిగిపోతుంది

ఒక వ్యక్తి కీర్తిని మాత్రమే పెంపొందించే ఏ చర్యకైనా నేను పూర్తిగా విముఖుణ్ణి రామాయణం చాలా పవిత్ర గ్రంథమని, కాళిదాసు మహాకవి అనీ, శాకుంతలం మహత్తరమైన నాటకమనీ, షేక్స్పియర్ సాటిలేని నాటక కర్త అనీ మనం నమ్మటానికి వాళ్ళ రచనలు చదవనవసరం లేని పరిస్థితి కీర్తి మూలంగానే ఏర్పడింది  తీరావాల్మీకి రామాయణం చూస్తే మహా గ్రంథాలలో అంతకన్నా తుక్కుపుస్తకం మరొకటి ఉండదనిపించింది  నాటకకర్తగా కాళిదాసు భాసుడి భుజాల దగ్గరకు రాలేడనిపించింది  డికెన్స్ తన నవలల్లోచూపిన హేయమైన పరిస్థితులు అప్పటికి ఇరవయ్యేళ్ళ క్రితమే చక్కబడ్డాయని తెలిసి చాలా బాధ కలిగింది (డికెన్స్ నవలలు చాలా సంస్కరణలకు దారి తీశాయని ముందుగా ఎవరో అని ఉండకపోతే ఈ బాధ కలిగివుండకపోను  జరిగిన కాలాన్నిచిత్రించే అధికారం డికెన్స్‌కూ ఉంటుంది )

నేను సినిక్కుననీ నాకు వాల్మీకి రామాయణంలోనూ, కాళిదాసు నాటకంలోను ఉన్న గొప్పతనం అర్థం కాలేదనీ అనవచ్చు  కాని నా సొంత అభిప్రాయం నాకు ముఖ్యం కాదా  ఒక పుస్తకం చదవకుండానే, దాన్ని ఏమనుకోవాలో తెలుసుకోవటం సాహిత్య ప్రయత్నమవుతుందా? ఆ పుస్తకం మనకు ఏమిచ్చింది అన్నది కదా ముఖ్యం  ఒక సినిమాలో ఒక పదేళ్ళ కుర్రవాడు లావాటి అద్దాల కళ్ళ జోడు పెట్టుకొని ఇంకొ అయిదేళ్ళ కుర్రవాణ్ణి వెంటబెట్టుకుని ఒక పెద్ద లైబ్రరీలోకి వచ్చి  ఒరే చూడు! ఎంతపెద్ద పుస్తకాలో! ఎంతెంతో గొప్పవాళ్ళురాసినవి అంటాడు అదీ నికరమైన కీర్తి  ఆ పుస్తకాలను పెద్ద కుర్రాడు చదవలేదు  చిన్నకుర్రాడు చదవలేడు

నా కథలు చదివిన వాళ్ళంతా అవి గొప్ప కథలే అనుకున్నారా? వాటిని చెత్తక్రింద పరిగణించిన వారున్నారు  వాళ్ళకు నాపైన వ్యక్తిగతమైన కోపం ఉండి కాదు  వారి సంస్కృతిని నా కథలు అందుకోని కారణం చేత లేదా, నా సాంఘిక భావాలు వారి భావాలకు విరుద్ధంగా వుండటం చేత

హర్షధ్వానాల మధ్య విమర్శకుల గొంతులు వినిపించవు  ఉద్రేకం మేధస్సును అణిచివేస్తుంది  ఇది వాంఛనీయంకాదు  ఇవాళ మనం గురజాడకు కొత్త ఖ్యాతిని ఇవ్వలేం కాని గురజాడ రచనలను గురించి కొత్తతరం వాళ్ళకు చెప్పగలం  మల్లినాథసూరి, కాళిదాసుకు శతజయంతులు జరపలేదు  కాళిదాసురచనలకు వ్యాఖ్య రాశాడు నిగూఢార్థాలున్నాయనుకుంటూ వచ్చిన షేక్స్పియర్ సానెట్స్ ఒకటి రెండు పచ్చి బూతులు అని ఇటీవల విమర్శకులు బయట పెట్టారు

చలం, బుచ్చిబాబు, గోపీచంద్ లాంటి ప్రముఖ రచయితలను గురించి అర్థంలేని పొగడ్తలు ఎన్నివచ్చాయి  వారి రచనలను విమర్శించటం ఎంత పెద్ద ద్రోహంగా పరిగణించబడుతున్నది, వారిలో తప్పులు బయటపడిన మాత్రాన వాళ్ళు ప్రముఖ రచయితలు కాకుండా పోతారా  అట్లాపోయే ప్రాముఖ్యం ఉండకపోతేనేం

సాంఘిక వ్యాపకాలలో మునిగితేలిన వయోవృద్ధులకు కావలసింది షష్టిపూర్తి ఉత్సవాలుకాదు  విమర్శ, ప్రచారం, ముఖ్యంగా రచయితలకుజరిగే అపచారం వారికీర్తి మిగిలి, వారి మంచి రచనలు సర్క్యులేషన్‌లో లేకుండా పోవటం  ఓహెన్రీ, జాక్‌లండన్‌లు అసాధారణ

ప్రతిభ గల రచయితలు కాని డబ్బు కోసం చాలా చెత్తరాశారు వారి ఉత్తమ రచనలుమాత్రమే ఈనాడు ప్రచారంలో ఉంటున్నాయి అదే ఏ రచయితకైనా జరగదగిన గౌరవం

అరవై యేళ్ళొచ్చి నేను తెలుసుకున్నదేమిటి

రచయిత సమాజంలో జరిగిన మంచి పరిణామాలను బలపరచటం చాలా తేలిక కాని రావలసిన సత్పరిణామాలకు అతను చేయగల దోహదం చాలా అల్పం దానికి కావలసిన ప్రేరణలు భౌతిక పరిస్థితులలో నుంచే రావాలి విప్లవాల మాట అటుంచి, చిన్న చిన్న సంస్కరణలు తీసుకురావడం కూడా రచయితకు సాధ్యం కాదు

మనం ఉంటున్నది ఒక సమాజమన్న భానం నాలో క్రమంగా పోతున్నది ఈనాడు మనుషుల మధ్య నేను చూస్తున్నది సామాజిక బంధాలు కావు మనమంతా ఒక సమాజమనే భ్రమ కలిగిస్తున్నది డబ్బు - ఇంకో వంక ప్రకృతిసిద్ధమైన మానవత్వమునూ, ఏ సామాజిక నీతి నియమమన్నా తీసుకోండి దాన్ని కాలదన్ని నెగ్గుకు రాగల 'సార్వభౌమరావులు' సమాజంలో ఉన్నారు నా జీవితంలో నేను చిల్లర సామాజిక నియమాలను కొన్నింటిని ఉల్లంఘించాను నన్ను ఎవరూ ఏమీ చేయలేకపోయారు నిజానికి నేనేం చేస్తున్నానో ఎవరికీ అంతగా పట్టలేదు ఈ పరిస్థితి 30, 40 ఏళ్ళ క్రితం కన్నా ఈనాడు మరింతగా క్షీణించింది కమ్యూనిజం వస్తే ఈ అరాచక పరిస్థితి పోయి అందరూ క్రమబద్ధంగా, కొత్త నియమాలకు కట్టుబడి నడుచుకోవలసి వస్తుందన్నది మన మేధావులకు పీడకల అందుకే ఈనాటి సామాజిక వ్యవస్థను వాళ్ళు సహించగలుగుతూండాలి

ఈనాటి భారతదేశం ఒక జాతి కాదు ఇది ఎన్ని ఎందల జాతులు చరిత్ర రుజువు చెయ్యాలి? మానవసంఘాలు విచ్ఛిన్నం కావటానికి తగిన కారణాలు క్రమంగా హెచ్చుతున్నాయి అవి సంఘటితమవటానికీ, ఏకం కావటానికీ తగిన కారణాలు రాను రాను మృగ్యమైపోతున్నాయి ఉపన్యాసాలూ, ఊకదంపుళ్ళూ ఈ పరిస్థితిని మార్చలేవు

మనం కోటి సంవత్సరాల నాటి ఆటవిక లక్షణాలను కూడా ఇంకా పూర్తిగా కడిగేసుకోలేదు మతమౌఢ్యమూ, ఫ్యూడల్ జాడ్యాలూ దీర్ఘ వ్యాధులలాగా మన సమాజాలను పట్టి పీడిస్తున్నాయి ఆధునిక ప్రపంచంలో ప్రతి ఒక్కడికీ శాస్త్ర పరిజ్ఞానం ఉన్నా, లేకపోయినా శాస్త్రీయమైన దృక్పథం అలవడి తీరాలి అది లేకుండా ఎవరు గాని ఒక్క అంగుళం ముందుకు ఎలా జరుగుతారో నాకు బోధపడదు

అన్నిటినీ మించి నన్ను ఆందోళనపరిచేదేమిటంటే రానురాను నేను తెలుసుకోదగిన విషయాలు పెరుగుతున్నాయి జ్ఞానం అనేది తీసిన కొద్దీ పెరిగే పాతరలాటిదిగా పరిణమిస్తున్నది సాహిత్యం ఏనాడూ ఒక ఒరలో ఇమడలేదు నన్నయభట్టూ, తిక్కనసోమయాజి అచ్చంగా కవులు మాత్రమే కారు - వారి కాలంలో ఇంకా ఎన్నో వేలమంది కవులు ఉండి ఉంటారు వారికి బోలెడు లోకానుభవము, వివిధ విషయాలకు సంబంధించిన పరిజ్ఞానమూ కూడా ఉండేవి ఈనాటి సాహితీపరులకు లోకానుభవంతో పాటు ఇంకా సవాలక్ష విషయాలు కూడా తెలియాలి ఈ సంగతి మొదటి నుంచీ స్పష్టంగా గుర్తించిన మన రచయితలలో గోపీచందు ఒకడు కనిపిస్తాడు కాని ఈనాడు లోకానుభవం కూడా లేని వాళ్ళు ''గొప్ప'' రచనలు చేసేస్తున్నారు ఇటీవల మద్రాసు బావుల్లో నీటిమట్టం లాగా నేటి మన సాహిత్యం

ఉత్సవాలూ జరపటం చాలా కృత్రిమమైన వేడుక  అది ఎంత కృత్రిమ మంటే దాన్ని జరిపేవారి నిజమైన అభిమానం ''రిచువల్'' మధ్య ఊపిరాడక నలిగిపోతుంది

ఒక వ్యక్తి కీర్తిని మాత్రమే పెంపొందించే ఏ చర్యకైనా నేను పూర్తిగా విముఖుణ్ణి రామాయణం చాలా పవిత్ర గ్రంథమని, కాళిదాసు మహాకవి అనీ, శాకుంతలం మహత్తరమైన నాటకమనీ, షేక్స్పియర్ సాటిలేని నాటక కర్త అనీ మనం నమ్మటానికి వాళ్ళ రచనలు చదవనవసరం లేని పరిస్థితి కీర్తి మూలంగానే ఏర్పడింది తీరావాల్మీకి రామాయణం చూస్తే మహా గ్రంథాలలో అంతకన్నా తుక్కుపుస్తకం మరొకటి ఉండదనిపించింది నాటకకర్తగా కాళిదాసు భాసుడి భుజాల దగ్గరకు రాలేడనిపించింది డికెన్స్ తన నవలల్లో చూపిన హేయమైన పరిస్థితులు అప్పటికి ఇరవయ్యేళ్ళ క్రితమే చక్కబడ్డాయని తెలిసి చాలా బాధ కలిగింది (డికెన్స్ నవలలు చాలా సంస్కరణలకు దారి తీశాయని ముందుగా ఎవరో అని ఉండకపోతే ఈ బాధ కలిగివుండకపోను జరిగిన కాలాన్నిచిత్రించే అధికారం డికెన్స్‌కూ ఉంటుంది )

నేను సినిక్కుననీ నాకు వాల్మీకి రామాయణంలోనూ, కాళిదాసు నాటకంలోను ఉన్న గొప్పతనం అర్థం కాలేదనీ అనవచ్చు కాని నా సొంత అభిప్రాయం నాకు ముఖ్యం కాదా ఒక పుస్తకం చదవకుండానే, దాన్ని ఏమనుకోవాలో తెలుసుకోవటం సాహిత్య ప్రయత్నమవుతుందా? ఆ పుస్తకం మనకు ఏమిచ్చింది అన్నది కదా ముఖ్యం ఒక సినిమాలో ఒక పదేళ్ళ కుర్రవాడు లావాటి అద్దాల కళ్ళ జోడు పెట్టుకొని ఇంకొ అయిదేళ్ళ కుర్రవాణ్ణి వెంటబెట్టుకుని ఒక పెద్ద లైబ్రరీలోకి వచ్చి ఒరే చూడు! ఎంతపెద్ద పుస్తకాలో! ఎంతెంతో గొప్పవాళ్ళురాసినవి అంటాడు అదీ నికరమైన కీర్తి ఆ పుస్తకాలను పెద్ద కుర్రాడు చదవలేదు చిన్నకుర్రాడు చదవలేడు

నా కథలు చదివిన వాళ్ళంతా అవి గొప్ప కథలే అనుకున్నారా? వాటిని చెత్తక్రింద పరిగణించిన వారున్నారు వాళ్ళకు నాపైన వ్యక్తిగతమైన కోపం ఉండి కాదు వారి సంస్కృతిని నా కథలు అందుకోని కారణం చేత లేదా, నా సాంఘిక భావాలు వారి భావాలకు విరుద్ధంగా వుండటం చేత

హర్షధ్వానాల మధ్య విమర్శకుల గొంతులు వినిపించవు ఉద్రేకం మేధస్సును అణిచివేస్తుంది ఇది వాంఛనీయంకాదు ఇవాళ మనం గురజాడకు కొత్త ఖ్యాతిని ఇవ్వలేం కాని గురజాడ రచనలను గురించి కొత్తతరం వాళ్ళకు చెప్పగలం మల్లినాధసూరి, కాళిదాసుకు శత జయంతులు జరపలేదు కాళిదాసురచనలకు వ్యాఖ్య రాశాడు నిగూఢార్థాలున్నాయనుకుంటూ వచ్చిన షేక్స్పియర్ సానెట్స్ ఒకటి రెండు పచ్చి బూతులు అని ఇటీవల విమర్శకులు బయట పెట్టారు

చలం, బుచ్చిబాబు, గోపీచంద్ లాంటి ప్రముఖ రచయితలను గురించి అర్థంలేని పొగడ్తలు ఎన్నివచ్చాయి వారి రచనలను విమర్శించటం ఎంత పెద్ద ద్రోహంగా పరిగణించబడుతున్నది, వారిలో తప్పులు బయటపడిన మాత్రాన వాళ్ళు ప్రముఖ రచయితలు కాకుండా పోతారా అట్లాపోయే ప్రాముఖ్యం ఉండకపోతేనేం

సాంఘిక వ్యాపకాలలో మునిగితేలిన వయోవృద్ధులకు కావలసింది షష్టిపూర్తి ఉత్సవాలుకాదు విమర్శ, ప్రచారం, ముఖ్యంగా రచయితలకుజరిగే అపచారం వారికీర్తి మిగిలి, వారి మంచి రచనలు సర్క్యులేషన్‌లో లేకుండా పోవటం ఓహెన్రీ, జాక్‌లండన్‌లు అసాధారణ

రానురాను సాంఘిక పరిణామ వేగం అధికమవుతున్నది గడచిన 50 ఏళ్ళలో కలిగిన పరిణామాలతో పోలిస్తే అంతకు పూర్వం 50 ఏళ్ళలో కలిగిన పరిణామాలు చాలా అల్పమైనవి

ఈ మార్పును గురించీ, దాని ఆవశ్యకతను గురించీ మన సాహిత్యం మనకు తగినంతగా జ్ఞాపకం చెయ్యటం లేదు రచనలు చేసే వాళ్ళు ఎప్పటికప్పుడు తామున్న సమాజం శాశ్వత స్వభావం కలదన్నట్టూ, అది ఎప్పుడూ ఇలాగే ఉన్నదన్నట్టూ రాయటం ఆచారంగా ఉన్నది (దేనికీ ఎవరూ బాధ్యులు కారు, అంతా విధికృతం, విధిని ఎవరూ తప్పించుకోలేరు!)

కొందరు సమకాలిక సమస్యలను చిత్రిస్తారు కాని వాటికి పరిష్కారం ఉంటుందనీ, ఉండవచ్చుననీ వారికి తెలీదు అందుచేత దారిద్ర్యం పూర్వజన్మ దుష్కృత ఫలమనీ, దురాశ నాశనానికి దారి తీస్తుందనీ, పాపానికి శిక్ష - ఎప్పుడో! ఎక్కడో! - ఉండకపోదనీ అంటారు సామాజిక నియమాలను ఉల్లంఘించి దారిద్ర్యం నుంచి తప్పించుకున్న వారు, దురాశ ఫలించి కోట్లకు పడగెత్తిన వారు, సమస్తమైన పాపాలు బహిరంగంగా చేసి నెగ్గుకొచ్చిన వాళ్ళూ తమ ఎదుటే ఉన్నా వారి నుంచి ఏమీ గుణపాఠం నేర్చుకోరు సామాజిక వ్యవస్థలో లోపాలు ఏర్పడ్డాయనీ, వాటిని ప్రయత్నపూర్వకంగా సరి చేసుకోవచ్చుననీ వారికి తట్టదు

ఈనాడు పురుషస్వామ్యం అమలులో ఉన్నది ఈ సమాజంలో స్త్రీకి పురుషుడితో సమానత్వం అన్నది అసాధ్యం అది గుర్తించని స్త్రీలు తప్పంతా పురుషుల దృక్పథంలో ఉన్నదనీ, దాన్ని హితోపదేశాల ద్వారా మార్చితే స్త్రీకి జీవితం లోపరహితంగా ఉంటుందనీ భ్రమ పడుతున్నారు వివాహ వ్యవస్థా, కుటుంబ స్వరూపమూ, సమాజ వ్యవస్థా గొప్ప మార్పులకు గురి అయితేనే గాని స్త్రీ పురుషుల సమానత్వంసాధ్యం కాదు ఇప్పుడు వారి మధ్య ఉండే అసమానత కేవలమూ వ్యక్తిగతమైనది కాదు - సామాజికమైనది అలాంటి అసమానతే ధనికుల మధ్యా, దరిద్రుల మధ్యా ఉన్నది ధనికులు గాంధీగారి మాట నమ్మి తమకున్న సంపద యావత్తూ పేదలదేననీ తాము దానికి ధర్మకర్తలమనీ లక్ష సంవత్సరాల పాటు అనుకున్నా ఈ అసమానత పోదు మనం జీవిస్తున్నది ధనస్వామ్యంలో ఈనాటి దారిద్ర్యం ఆ భావం వల్ల ఏర్పడినది కాదు ధనస్వామ్యం వల్ల సృష్టి అయినది పేదలకు కావలసినవన్నీ అంగళ్ళలో వున్నాయి పేదల చేతిలో డబ్బు లేదు - నోట్లో శని ఉన్నది ప్రపంచ జనాభాలో చాలా శాతం ఆకలితో బాధపడుతున్నారు అమెరికా, కెనడాల వంటి దేశాలలో వ్యవసాయ క్షేత్రాలు సంక్షోభిస్తున్నారు అదే ధనస్వామ్యమంటే

ఒక్క తిండే కాదు ఈనాడు నిరుద్యోగమూ, తిండీ, బట్టా, ఇళ్ళూ, రోగాలకు మందులు లేకపోవటమూ, నిరక్షరతా - అన్నీ కృత్రిమంగా ఏర్పడినవే వాటన్నిటికీ ధనస్వామ్యమే కారణమని అతి సులువుగా ఎవరన్నా గ్రహించవచ్చు ఇవన్నీ విధి నిర్ణయం వల్లా, పూర్వజన్మ దుష్కర్మల ఫలితంగానూ ఏర్పడతాయని రాస్తున్న పేరుబడ్డ రచయితలున్నారు వారి అజ్ఞానం ఆశ్చర్యకరం

రచయితల అజ్ఞానం కళారూపంలో ఎంత ప్రచారమవుతున్నదో చూస్తే ఆశ్చర్యం వేస్తుంది ఒకరు పేదవాళ్ళు పడే పాట్లను హృదయవిదారకంగా చిత్రిస్తారు హీరోకు చదువు సాగదు ఉద్యోగం దొరకదు అవమానంపాలవుతాడు అప్పులపాలవుతాడు వాడికి అందరూ శత్రువులే అవుతారు భార్య కూడా చీదరించుకుంటుంది చివరకు ఉరి పోసుకు చావడమో ఏదో చేస్తాడు ఇటువంటి రచన సామాజికులకు ఏ విధంగా ఉపకరిస్తుంది?

ఇలాంటి కథల్లోని హీరో ఎంత అసమర్థుడో, రచయితా అంత అసమర్థుడే ఇదే రచయిత ఈ హీరోకు ఒక ధనికుడి ప్రాపకాన్ని, అపురూప సౌందర్యవతి అయిన భార్యనూ, ఉద్యోగాలలో ప్రమోషన్లనూ, అంతర్జాతీయ ఖ్యాతినీ సంపాదించి కథను సుఖాంతం చేయగలడు! అదీ నిరుపయోగమైన కథే!

కీకారణ్యంలో సిమెంటు రోడ్లూ, విద్యుద్దీపాలూ, కూల్‌డ్రింక్ షాపులూ ఉండవు ఈనాటి సామాజిక వ్యవస్థలో బీదవాళ్ళకు జీవితం ముళ్ళబాటే వాళ్ళకు పసిపసి కోరికలు కూడా తీరే మార్గం లేదు వాళ్ళకు న్యాయం జరగదు వాళ్ళు జీవితంలో పోరాడటమంటే సామాజిక వ్యవస్థతో పోరాడవలసిందే ఉన్న పరిస్థితిలో పోరాటం అవసరం లేని వర్గానికీ, పరిస్థితులతో ఏదో రకంగా సర్దుకుపోయే అవకాశం ఉన్న వర్గానికీ చెందిన రచయితలు దరిద్రులను గురించి అశ్రుతర్పణాలు విడవటం చాలా నిరుపయోగంగా కనబడుతుంది అందులో ద్యోతకమయ్యేదల్లా ఏమిటంటే, అయ్యో! ఈ పేదవాడికి నాలుగెకరాల సుక్షేత్రమైన భూవసతీ, ఒక చిన్నడాబా, ఓ నాలుగు వందల రూపాయల నెలజీతమూ లేకపోయెనే అన్న నిచారం తప్ప మరేమీ కాదు

చాలా మధ్యతరగతి వాళ్ళ రచనలు వాళ్ళ తరగతియొక్క చిత్తవృత్తిని ప్రతిబింబిస్తున్నాయి గాని, పేదల దృష్టిలో సమాజ స్వరూపాన్ని కాదు మనం 'బార్బారిజం' నుంచి బయటపడలేదు అందుకే మనలో నిమ్నజాతులున్నట్టు ఒప్పుకుని వారిని ఉద్ధరించటానికి గర్విస్తున్నాం అస్పృశ్యులున్నారన్నది గుర్తించి వారి కోసం ప్రత్యేక సదుపాయాలు చేస్తున్నాం! నిజమైన నాగరికజాతి ఎక్కువ తక్కువ కులాల విచక్షణను తీవ్రంగా శిక్షిస్తుంది, అస్పృశ్యతను ఏ రూపంలో పాటించినా శిక్షిస్తుంది అతి ధనికుడైన వాడు తన ఔదార్యాన్ని ప్రకటించుకోవటానికి పేదలకు దానధర్మాలు చెయ్యటం ఏలాంటిదో, మన ప్రభుత్వం నిమ్నజాతులనూ, హరిజనులనూ ఉద్ధరించే కార్యక్రమం అచ్చు అలాటిదే

కులాల హెచ్చుతగ్గులూ, అస్పృశ్యతా వాస్తవంగా ఉన్నవేగదా అనవచ్చు ఉండదగనివి లేకుండా చేసుకోవటమే నిజమైన అభ్యుదయం జలుబు చేస్తే ముక్కు చీదుకుంటూ ఉండడం చికిత్స కాదు అలాంటి చికిత్సలు అభ్యుదయమనిపించుకోవు

ధనస్వామ్యం తొలగటానికి ఏమి చెయ్యాలో ఆలోచించలేక దాని దుష్ఫలితాలను గురించి అశ్రువులు రాల్చి పాఠకులచేత అశ్రువులు రాల్పించాలని ప్రయత్నిస్తూ చేసే రచనలు చాలా చిరాకు పుట్టిస్తున్నాయి దరిద్రుల కష్టాలకు దేవుణ్ణే, పూర్వజన్మలో చేసిన పాపాలనూ కారణాలుగా పేర్కొనే రచయితలను ఏం చేసినా పాపం లేదు సామాజిక విషయాలను గురించి వారికి నోరెత్తే అర్హత లేదు

ఇలాటి తుచ్ఛమైన రచనలు చేసేకన్న, బీదవాళ్ళకు స్పష్టంగా చెప్పండి " ఈ సమాజంలో మీరు సుఖపడరు, మీ గొంతెమ్మకోరికలు ఫలించవు, మిమ్మల్ని ధనికులు అజ్ఞానంలోనూ, దారిద్ర్యంలోనూ ఉంచుతారు, మిమ్మల్ని కడుపునిండా తిననివ్వరు, మీ పిల్లలూ, మీ భార్యా మీ కళ్ళెదుటే రోగాలతో కుమిలి చస్తారు, మీకు డబ్బు లేదు సరికదా, అప్పు పుట్టదు, తీర్చలేని వాడికి డబ్బు అప్పివడిస్తాడు? ధనికుల లాభాల కోసం పరిశ్రమలు నడుపుతున్నారు గాని, మీకు ఉద్యోగాలివ్వటం కోసం కాదు, వాళ్ళకు మీ వల్ల లాభం లేనప్పుడు మిమ్మల్ని ఉద్యోగాల

నుంచి లేపేస్తారు, అద్దె రాకపోతే అద్దె ఇంటివాడు మిమ్మల్ని బయటికి గెంటుతాడు, మీ ఏ ఒక్క సమస్యా ధనికుల సమస్యలు కావు, డాక్టర్లు మీ రోగాలను నయం చెయ్యటానికే వైద్యం చేస్తున్నారనీ, ప్లీడర్లు మీకు న్యాయం జరగడం కోసమే ప్రాక్టీసు చేస్తున్నారనీ ఒక్కనాటికి అనుకోవద్దు, వాళ్ళు డబ్బు కోసమే పని చేస్తున్నారు ఇది ధనస్వామ్యం చేతనైతే దీన్ని మార్చండి లేకపోతే దీనికింద పడి నలిగి చావండి ఎవడన్నా మీ పట్ల సానుభూతి ఉన్నట్లు మాట్లాడిన మాత్రాన వాడు వంచిస్తున్నాడు సానుభూతితో కడుపునిండదు రోగాలు నయం కావు సమాజం మారదు అది మిమ్మల్ని ఊబిలోకి తొయ్యటానికే పనికొస్తుంది

ధనస్వామ్యం మారాలి మారుతుంది మీకీనాడు ఈ గుండెలు కరిగించే రచనలు ఏమాత్రమూ తోడ్పడవు

నాలో జాలి లేదనుకోకండి నేనూ జాలి పడుతున్నాను - కాలదోషం పట్టిన వర్గాలను గురించి పాపం వాళ్ళు తమ రాజకీయపు టెత్తులూ, తమకు అండగా ఇంతకాలమూ ఉన్న శాసనాలూ, విచ్చలవిడిగా తాము సాగించే జులుమూ, సమష్టిసమాజం పట్ల వాళ్ళకు గల అలుసూ ఇవన్నీ శాశ్వతమనుకుంటున్నారు ఇవి శాశ్వతం అనిపించడానికి కారణం ఏదన్నా ఉంటే అది అవసాన దశ! ఆరిపోయే దీపం మహా వెలుగుతుంది ఇంత విషం పుచ్చుకునే ముందు హిట్లరు విజయగర్వంతో డాన్సు చేశాడు ఈనాటి మన సాంఘిక వ్యవస్థలకు చావుతెలివి పుట్టుకొస్తున్నది!

*ముద్రణ స్వాతి, మాసపత్రిక, ప్రారంభ సంచిక, జూన్ 1970*
*పునర్ముద్రణ 1 'రచన',*
*యువభారతి సాహిత్య వ్యాసాల సంకలనం, జులై 1970,*
*2 సాహిత్యంలో విప్లవోద్యమం, సృజన ప్రచురణ, అక్టోబరు 1971*

# 18. ఈనాటి సాహిత్య రచన

జీవితంలాగే సాహిత్యం కూడా ఒక వాహిని దాని కదలికా వేగమూ అంతటా ఒక విధంగా ఉండదు ఒడ్డును ఒరుసుకున్న నీటిలో పారుదల తక్కువ ఒడ్డులో జొచ్చినచోట్ల నీరు అసలు కదలనే కదలదు అందులో చెత్తాచెదారమూ చేరి, ప్రవహించే నది లక్షణాలు ఏమాత్రమూ లేకుండా వుంటుంది ఒక్కొక్కసారి ఇలాటి ప్రదేశాలు నది నుంచి వేరుపడి, ఆ మడుగులో నీరు మురికిగుంటగా మిగిలిపోవటం కూడా కద్దు అందులో పందులు చేరతాయి

నదులకు ప్రవాహమే గాక లోతు సమస్య కూడా వుంటుంది ఒడ్డ వెంబడి లోతు తక్కువగా వుంటుంది ఈత రానివాళ్ళు, పిరికివాళ్ళూ ఒడ్డుకు సాధ్యమైనంత సమీపంలో మునకలు వేసి, పవిత్రస్నానం చేశామని తృప్తిపడతారు ఈదగలవాళ్ళు సాహసముతో ప్రవాహం మధ్యకు వెళ్ళి, ప్రవాహానికి ఎదురు ఈదుతారు

నదులలో ఊబి, సుడిగుండాలూ, మొసళ్ళూ మొదలైనవి వుండటం అందరికీ తెలిసినదే

జీవితానికి నదికీ గల సామ్యాలు సులువుగా గ్రహించవచ్చు సాహిత్యానికి నదికీ గల సామ్యాలు గ్రహించటం అంత తేలిక కాదు ఎందుకంటే, సాహిత్యమనే నది సాహితీపరులు సృష్టించేది వారు ఈ నదిని సృష్టించడమే గాక ఇందులో ఈదుతారు

ఇలాంటి కథల్లోని హీరో ఎంత అసమర్థుడో, రచయితా అంత అసమర్థుడే ఇదే రచయిత ఈ హీరోకు ఒక ధనికుడి ప్రాపకాన్ని, అపురూప సౌందర్యవతి అయిన భార్యనూ, ఉద్యోగాలలో ప్రమోషన్లనూ, అంతర్జాతీయ ఖ్యాతినీ సంపాదించి కథను సుఖాంతం చేయగలడు! అదీ నిరుపయోగమైన కథే!

కీకారణ్యంలో సిమెంటు రోడ్లూ, విద్యుద్దీపాలూ, కూల్‌డ్రింక్ షాపులూ ఉండవు ఈనాటి సామాజిక వ్యవస్థలో బీదవాళ్ళకు జీవితం ముళ్ళబాటే వాళ్ళకు పసిపసి కోరికలు కూడా తీరే మార్గం లేదు వాళ్ళకు న్యాయం జరగదు వాళ్ళు జీవితంలో పోరాడటమంటే సామాజిక వ్యవస్థతో పోరాడవలసిందే ఉన్న పరిస్థితిలో పోరాటం అవసరం లేని వర్గానికీ, పరిస్థితులతో ఏదోరకంగా సర్దుకుపోయే అవకాశం ఉన్న వర్గానికీ చెందిన రచయితలు దరిద్రులను గురించి అశ్రుతర్పణాలు విడవటం చాలా నిరుపయోగంగా కనబడుతుంది అందులో ద్యోతకమయ్యేదల్లా ఏమిటంటే, అయ్యో! ఈ పేదవాడికి నాలుగెకరాల సుక్షేత్రమైన భూవసతీ, ఒక చిన్నడాబా, ఓ నాలుగు వందల రూపాయల నెలజీతమూ లేకపోయెనే అన్న నివారం తప్ప మరేమీ కాదు

చాలా మధ్యతరగతి వాళ్ళ రచనలు వాళ్ళ తరగతియొక్క చిత్తవృత్తిని ప్రతిబింబిస్తున్నాయి గాని, పేదల దృష్టిలో సమాజ స్వరూపాన్ని కాదు మనం 'బార్బరిజం' నుంచి బయటపడలేదు అందుకే మనలో నిమ్నజాతులున్నట్టు ఒప్పుకుని వారిని ఉద్ధరించటానికి గర్విస్తున్నాం అస్పృశ్యులున్నారన్నది గుర్తించి వారి కోసం ప్రత్యేక సదుపాయాలు చేస్తున్నాం! నిజమైన నాగరికజాతి ఎక్కువ తక్కువ కులాల విచక్షణను తీవ్రంగా శిక్షిస్తుంది, అస్పృశ్యతను ఏ రూపంలో పాటించినా శిక్షిస్తుంది అతి ధనికుడైన వాడు తన ఔదార్యాన్ని ప్రకటించుకోవటానికి పేదలకు దానధర్మాలు చెయ్యటం ఏలాంటిదో, మన ప్రభుత్వం నిమ్నజాతులనూ, హరిజనులనూ ఉద్ధరించే కార్యక్రమం అచ్చు అలాటిదే

కులాల హెచ్చుతగ్గులూ, అస్పృశ్యతా వాస్తవంగా ఉన్నవేగదా అనవచ్చు ఉండదగనివి లేకుండా చేసుకోవటమే నిజమైన అభ్యుదయం జలుబు చేస్తే ముక్కు చీదుకుంటూ ఉండడం చికిత్స కాదు అలాంటి చికిత్సలు అభ్యుదయమనిపించుకోవు

ధనస్వామ్యం తొలగటానికి ఏమి చెయ్యాలో ఆలోచించలేక దాని దుష్ఫలితాలను గురించి అశ్రువులు రాల్చి పాఠకులచేత అశ్రువులు రాల్పించాలని ప్రయత్నిస్తూ చేసే రచనలు చాలా చిరాకు పుట్టిస్తున్నాయి దరిద్రుల కష్టాలకు దేవుణ్ణీ, పూర్వజన్మలో చేసిన పాపాలనూ కారణాలుగా పేర్కొనే రచయితలను ఏం చేసినా పాపం లేదు సామాజిక విషయాలను గురించి వారికి నోరెత్తే అర్హత లేదు

ఇలాటి తుచ్ఛమైన రచనలు చేసేకన్న, బీదవాళ్ళకు స్పష్టంగా చెప్పండి '' ఈ సమాజంలో మీరు సుఖపడరు, మీ గొంతెమ్మకోరికలు ఫలించవు, మిమ్మల్ని ధనికులు అజ్ఞానంలోనూ, దారిద్ర్యంలోనూ ఉంచుతారు, మిమ్మల్ని కడుపునిండా తిననివ్వరు, మీ పిల్లలూ, మీ భార్యా మీ కళ్ళెదుటే రోగాలతో కుమిలి చస్తారు, మీకు డబ్బు లేదు సరికదా, అప్పు పుట్టదు, తీర్చలేని వాడికి డబ్బు అప్పెవడిస్తాడు? ధనికుల లాభాల కోసం పరిశ్రమలు నడుపుతున్నారు గాని, మీకు ఉద్యోగాలివ్వటం కోసం కాదు, వాళ్ళకు మీ వల్ల లాభం లేనప్పుడు మిమ్మల్ని ఉద్యోగాల

సదుల గొడవ వదిలేసి ప్రస్తుతానికి వస్తే, ఈనాటి జీవితంలో వున్న వైవిధ్యం పూర్వం ఎన్నడూ లేదు శతాబ్దాలమీద, జీవితం మారటమే విస్తరించింది నియోగి బ్రాహ్మణులు రాజులకు అండగా వుండి రాజసం అలవరచుకొని ఒక వర్గంగా కొంత కొత్త సంస్కృతిని సృష్టించారు వాళ్ళీ రాజరికాన్ని గోతిలోకి తోశారేమో కూడాను క్షీణ దశలో 'రాజులు' నిరక్షరులైన వైదిక బ్రాహ్మణులకు అగ్రహారాలిచ్చి ఆ వర్గాన్నిపైకి ఎత్తారు సంస్కారం వెనక్కు నడిచింది ఇంగ్లీషు వారు ఇంగ్లీషు చదువుకు జీవితంలో అగ్రస్థానమూ, చదువులకు ప్రాతిపదికా చేశారు పాఠశాలల్లో తెలుగు పండితులు అధములుగా ఉండటం నాకు తెలుసు

విభజన ద్వారా పురోగమనం స్వభావసిద్ధంగా జరుగుతుంది విభజన ద్వారా సంఖ్యావృద్ధితో బాటు నూతన వర్గ సృష్టి కూడా జరుగుతుంది ఒక జీవకణం నుంచి బహుకణాలు, బహు విధానాలు ఉత్పత్తి అయి మనలాంటి ప్రాణులం తయారవుతున్నాం ఈ విభజన వెనుక వైరుధ్యమూ, ఘర్షణ వుంటుంది అన్ని ఘర్షణలు పురోగమనానికి దోహదం చేయవు నన్నయభట్టూ, తిక్కన సోమయాజిలలో ఎవరు గొప్ప కవి అనితన్నుకు చచ్చేవాళ్ళు ఆధునిక సాహిత్యానికి లాభం చేకూర్చటం అనుమానాస్పదం

ఆధునిక సజీవ సాహిత్యం రచించదలుచుకున్నవాళ్ళు వర్తమాన సాహిత్యంలో సజీవమైన ధోరణులవో, ఏ ధోరణులను ముందుకు తీసుకుపోవాలో స్పష్టంగా తెలుసుకోవాలి అందుకుగాను జీవితం గురించి సమగ్రంగా తెలుసుకోవాలి జీవితంలో నిత్యమూ కనిపించే అసంఖ్యాకమైన సంఘర్షణలలో ముఖ్యమైన వైరుధ్యాలు ఏవి, వాటిలో తీవ్రమైన వైషమ్యాలు ఏవి? జీవిత సమస్యలు కూడా అసంఖ్యాకమైనవే కోటీశ్వరుడు పన్నులు ఎలా ఎగవేయాలా అని బాధపడవచ్చు పేదవాడు తన పెళ్ళాన్నీ పిల్లల్నీ పోషించటం ఎట్లాగా అని బాధపడవచ్చు ఈ రెండి మధ్యలో ఒక కాలేజీ కుర్రవాడు ఏ రెండు జడల సీతను తాళికట్టకుండా పడుకోబెట్టటం ఎట్లాగా అని బాధపడవచ్చు పనులూ, ఉద్యోగాలూ, పదవులూ, పెరిగే ధరలూ, ఎటూ తెగని పెళ్ళి సమస్యలూ, రోగాలూ, పోలీసుల స్వైరవిహారాలు, అధికారుల అవినీతి, పాలకుల పచ్చిఅబద్ధాలూ, మతాలూ, వర్గవైషమ్యాలూ, మతవైశమ్యాలూ, కులవైషమ్యాలూ - జీవితంనిండా ముళ్ళులాగా కోట్లకొద్దీ సమస్యలు అనుక్షణమూ ఎదురవుతూనే ఉన్నాయి జీవితంలో అశాంతి ప్రబలినకొద్దీ వైరుధ్యాలు, వైషమ్యాలూ పెరుగుతాయి అవ్యవస్థత ఏర్పడుతుంది "అనేక కోట్ల ప్రజలు ఇకముందులా జీవించటం తమకు సాధ్యం కాదు అనుకొన్నప్పుడు విప్లవం చేస్తారు" అన్నది స్పష్టం

జీవితంలోని ప్రధాన వైషమ్యాలను అర్థం చేసుకుని జీవితాన్ని సృష్టించిన రచనే ఆధునిక సాహిత్యంలో అగ్రస్థానం వహిస్తుంది వాస్తవికతతో కూడిన పాశ్చాత్య బూర్జువా సినిమాలలోనూ, సాహిత్యంలోనూ, జీవితంలోను సంఘర్షణలను వాస్తవంగా చిత్రించటం మనం గమనించాలి అవి అభ్యుదయ ధోరణిలో లేకపోయినా కూడా వాటిలో ఈ వాస్తవికత వుండటం మనం గమనించాలి

మన రచయితలు పాశ్చాత్య బూర్జువా రచనల నుంచి వాస్తవికత ఇంకా నేర్చుకోవలసి వుంది బూర్జువా సంస్కృతి ద్వారా పురోగమించలేని దశకు చేరుకున్న మన సమాజంలో సృష్టించే కళలో బూర్జువా వాస్తవికత సైతం లోపించటం శోచనీయం

నిజానికి మనకీనాడు సాహిత్యంలో కావలిసింది బూర్జువా సమస్యలూ, బూర్జువా సంస్కృతి యొక్క అందచందాలూ కాదు నేటి జీవితంలో ప్రధాన సంఘర్షణ అట్టడుగున పడి ఉన్న ఉత్పాదక సంఖ్యాకులది వారి సమస్యలను దాటవేసి పై వర్గాల అభ్యుదయం కోసం సాగించే ప్రతి చర్యా జాతిని మరింత నిర్వీర్యం చేసి, ఆ వ్యవస్థను బలపరుస్తున్నది నిష్టనం ఒక పరమార్ధమనుకున్న వాళ్లే అడిగితే, "ఇదే మంచిది మరి కొంతకాలం ఈ పైశాచికం కొనసాగనీ!" అంటాడు అలా అనే వాడి నుంచి పై వర్గాల వాళ్ళు నేర్చుకోవలసింది ఎంతైనా ఉంది కాని వాళ్ళు నేర్చుకోరు

ఈనాటి సాహిత్యంలో ఉన్న వైవిధ్యాల మాట ముందే చెప్పాను సాహిత్య రచన ఇప్పుడిప్పుడే ఆర్జన సాధనం అవుతున్నది కాని ధన ప్రభావం సాహిత్యం మీద ఇంకా బలంగా పడలేదు కొద్దిమంది "సరదా"కు చదువుకొని, మధ్యతరగతి గృహిణుల కాలక్షేపం కోసం గిల్టు నవలలు రాస్తున్నారు "అమ్మకాలు" సాహిత్యానికి గీటురాయిగా భావించే పబ్లిషర్ల సంఖ్య నింపాదిగా పెరుగుతున్నది కాని ఇలాంటి సాహిత్యాన్ని సీరియస్‌గా తీసుకొనే వాళ్ళు విమర్శకులలో దాదాపు లేరనే చెప్పాలి

అభ్యుదయ "ధర్మపన్నాల" సాహిత్యం కొంతలో కొంత మంచిది ఈ సాహిత్యం జీవిత సమస్యలలో ముఖ్యమైనవే తీసుకుంటుంది కాని ఆనాటి సంస్కారం ఎంత ఘర్షణతో కూడుకున్నదో స్పష్టం చెయ్యదు "ఆ కొండ లీసి ఇక్కడ పెట్టు" అన్న ధోరణిలో "నీ హక్కుల కోసం పోరాడు", "ధైర్యంగా ముందుకు అడుగు వెయ్యి" అని హెచ్చరిస్తుంది అందుకు కూడా ఓపిక లేకపోతే, దీనుల జీవితాన్ని కరుణామయంగా చిత్రించి కన్నీరు కార్చుతుంది ఒక్కొక్కసారి పీడితుల, బాధితుల అంధకార జీవితంలో ఒకటి రెండు ఆశాకిరణాలను చూపి, కథను సుఖాంతం చేసి ఊరుకుంటుంది

ఈనాటి నాగరికత ఏ స్థితికి వచ్చిందంటే శ్రామిక వర్గానికి గల శక్తి పాశుపతాస్త్రం లాంటిది వాళ్లు నిజంగా ఏకమై సమ్మె చేస్తే జీవితం స్తంభించిపోవటమే కాదు తలకిందులైపోతుంది "ఎసెన్షియల్‌సర్వీసెస్" అంటారు ఈనాడు అన్నీ ఎసెన్షియల్‌సర్వీసులే ఈ నాగరికతను అమలు చేసే వారు శ్రామిక వర్గం తుపాకులను తక్కువ గురి చేసి తప్పుకోలేరు అంటే కలవారికీ లేనివారికీ మధ్య ఉండే సంఘర్షణ మామూలు వైరుధ్యంగా కాక తీవ్ర వైషమ్యంగా రూపొందుతున్నదన్నమాట ఈ వైషమ్యం స్థాయిని నిర్ణయిస్తున్నవి నక్సలైట్ చర్యలు కావు నక్సలైట్లను నిగ్రహించటానికి ఏర్పాటైన పోలీసు కాంపులు, వారి అమానుష చర్యలు విచారణకు అతీతంగా కాల్పులు, గృహ దహనాలు, స్త్రీ మానభంగాలు, చిత్రహింసలు

జీవిత సమరంలో ఇవేవీ లేనట్లు ఉన్నా కావ్య వస్తువులు కానట్టు, రచించే సాహిత్యం ప్రవాహం కాదు అది ముందుకు పోదు, అందులో చెత్తాచెదారమూ చేరి, పందులను ఆకర్షిస్తుంది ఈనాటి సాహిత్యంలోనూ, వేగాన్నీ, ప్రాణ వాయువును సాధించాలి

*తెలుగువెలుగు, వారపత్రిక, 30-7-1971*

*పునర్ముద్రణ సాహిత్యంలో విప్లవోద్యమం సృజన ప్రచురణ, అక్టోబరు 1971*

# 19. జానపద సాహిత్యం

ప్రపంచ ప్రజల దృష్టి జానపద సాహిత్యం మీదికి ఇప్పుడిప్పుడే మళ్ళుతున్నట్టు కనిపిస్తున్నది దానికి ఒక కారణం ప్రపంచ మానవ సంస్కృతి అన్ని దేశాలలోనూ అట్టడుగున ఒకటేనన్న సంగతి గుర్తింపుకు రావటం కావచ్చు నిజానికి జానపద సాహిత్యానికి సరిహద్దులు లేవు మానవుల మూలప్రేరణలన్నీ ఆ సాహిత్యంలో ఉన్నాయి దానిపైన జాతీయ సంస్కృతి అనేది పైపూతగా ఉన్నప్పుడు కూడా ఆ పూతను తొలగించి మరొక పూత పూయడం ఏమంత కష్టం కాదు అందుకే అనేక జానపద కథలు దాదాపు అన్ని దేశాలలోనూ కొద్ది తేడాతో చలామణి అవుతున్నాయి

అతి ప్రాచీన సాహిత్యం ఉదా వేదాలు ఆనోటా ఈనోటా ప్రచారమయినట్టే జానపద కథలు కూడా ఆనోటా ఆనోటా ప్రచారమయాయి తేడా ఏమిటంటే వేదాలలాంటివి అతి పవిత్రంగా భావించబడటం చేత ఒక్క స్వరం కూడా పొల్లు పోకుండా ప్రచారమైతే జానపద కథలు ప్రచారం అవుతున్నకొద్దీ పెదునెక్కాయి దేశాంతరాలకు వెళ్ళిన కథల పేర్లూ, వాతావరణమూ, ప్రాదేశిక వివరాలూ మారాయి మరొక తేడా ఏమంటే ఇది సామాన్య ప్రజలు సృష్టించిన సాహిత్యం ప్రజా సామాన్యానికి ఆనందం చేకూర్చిన సాహిత్యం

జానపద సాహిత్యంలో ఆనందం ప్రధానాంశం ఒక అస్పష్టమైన సంతృప్తి ద్వారా ఆ ఆనందం వినే వాడికి చేకూరుతుంది

అందుకే జానపద కథలు కేవలమూ పిల్లలనే కాక పెద్దవాళ్ళను కూడా సంతృప్తిపరుస్తాయన్నది ఈనాడు గుర్తించబడుతున్నది మామూలు సాహిత్యంలో లేని సార్వజనీనత జానపద సాహిత్యంలో ఉన్నది

జానపద సాహిత్యానికి వాస్తవికత ప్రధాన లక్షణం కాదు కాని వాస్తవికతకు సంకేతాలు దానిలో మనకు పుష్కలంగా కనిపిస్తాయి జానపద కథలలో రాక్షసులూ, పిశాచాలూ, యక్షులూ, గంధర్వులూ, మాంత్రికులూ ఉంటారు దయ్యాలు, భూతాలూ ఉంటాయి ప్రకృతి విరుద్ధమైన ఘటనలు ఉంటాయి జీవితంలో లాగా కాక జానపద కథలలో చాలా మంచి వాళ్ళూ, చాలా చెడ్డవాళ్ళూ వుంటారు దుర్మార్గం శిక్షించబడుతుంది మంచితనమూ, అమాయకత్వమూ నెగ్గుతాయి ఆ కథలలో వచ్చే పాత్రల సమస్యలు జీవితంలో లాగా కాక అసహజమైన పద్ధతులలో పరిష్కారమవుతాయి

జానపద సాహిత్యానికి సాంఘికమైన బిడియాలు లేవు కట్టెలు కొట్టుకునేవాడు రాజకుమార్తెను పెళ్ళాడేస్తాడు రాజకుమారుడు పేదరాసి పెద్దమ్మ కుమార్తెను పెళ్ళాడి సుఖంగా ఉంటాడు

అనేక జానపద కథలలో ప్రధాన వ్యక్తి (నాయకుడు) పేదవాడుగానో, ఏమీ చేతగాని వాడుగానో ఉంటాడు కాని వాడు మహావీరులు సాధించలేని ఘన కార్యాలు చేస్తాడు ఇందులో వాడి ప్రతిభ ఏమీ లేకుండా కూడా పోవచ్చు ఒక నక్కో, పామో, పక్షో, ఆఖరుకు చీమలో వాడికి విజయం చేకూర్చి పెట్టవచ్చు అందులో న్యూనత ఏమీ లేదు తగిన సహాయం ఉంటే ఎవరన్నా ఘన కార్యాలు చేయవచ్చునన్నది నీతి ( ఈ విషయంలో రాముడు కోతుల సహాయంతో

లంకను జయించటం జానపద కథలాటిదే - రాముడే స్వయంగా అవతార పురుషుడు అనుకోకుండా ఉంటే!)

ఈ అసమర్థుడైన కథానాయకుడికి సమర్థులైన అన్నలు మరి ఇద్దరుంటే వాళ్ళు చెయ్యలేని పని ఈ అసమర్థుడు చేస్తాడు కారణం? వాళ్ళిద్దరు తమ్ముడంత మంచి వాళ్ళు కారు వాళ్ళు అహంకారులు కావచ్చు అల్ప ప్రాణుల ఎడ అనాదరణ గల వాళ్ళు కావచ్చు పచ్చి దుర్మార్గులు కూడా కావచ్చు వాళ్ళ స్వభావానికి విజయం లభించటం జానపద సాహిత్యతత్వానికి విరుద్ధం

సాంఘికమైన బిడియాలు చేసినంతమాత్రాన జానపద కథలలో సాంఘిక విలువలు ఉండవనుకోరాదు నూటికి తొంభై పాళ్ళు జానపద కథలలో మరీ ధనికులూ, మూఢులూ, ఈర్ష్యాళువులూ, ప్రజా పీడకులూ, అన్యాయాలు చేసేవాళ్ళూ శిక్ష పొందుతారు

మరొకటేమిటంటే జానపద కథలలోపశు పక్ష్యాదులూ, క్రిమికీటకాదులూ మన సమాజంలో మానవులతో సమమైన పాత్ర నిర్వహిస్తాయి మనిషి భాష మాట్లాడతాయి అప్పుడప్పుడూ మారు రూపంలో ఉన్న మనుషులే అవుతాయి కొన్ని కథలలో వాటికి వుండే ప్రాముఖ్యం మనుషులకు కూడా ఉండదు

నిత్యమూ న్యాయమూ, దయా, ధైర్యమూ, దీక్షా, సాహసమూ, త్యాగమూ జానపద సాహిత్యం చిత్రించినంత బాగా సాధారణ సాహిత్యం చిత్రించటం సాధ్యపడే సంగతి కాదు

చిన్నతనంలో ఇలాటి కథలను విన్న(చదివిన) పిల్లలకు వాటి ప్రభావం ఉండదనుకోవటం పొరపాటు శివాజీకి తల్లి చిన్నతనంలో వీరగాథలు చెప్పేదట జీవితం యొక్క ప్రభావం సాధారణంగా జానపద కథల ప్రభావానికి విరుద్ధంగా ఉంటుంది అబద్ధమూ, అన్యాయమూ, క్రౌర్యమూ, పిరికితనమూ, కృతఘ్నతా, పిసినారితనమూ, జీవితంలో విరివిగా మనుషులకు తోద్పడతాయి గనక పిల్లలు జానపద కథలు చదవవలసిన అవసరం మరింతగా ఉంటుంది

జానపద కథలలో యుక్తీ, చమత్కారమూ ఉంటాయి మౌఢ్యం చక్కగా చిత్రించబడుతుంది ఇవి కూడా అందరికీ ఆనందం కలిగించే అంశాలే

ఒక ఎల్లయ్యకు ఒక పుల్లయ్య డబ్బు అప్పిస్తాడు ఎల్లయ్య బాకీ ఎగగొట్టి ''నాకు నువ్వు డబ్బు ఇవ్వనే లేదు'' అంటాడు ఎల్లయ్య న్యాయాధికారి దగ్గర ఫిర్యాదు చేస్తాడు ''నువ్వు అప్పు ఇచ్చినట్టు సాక్ష్యం ఉన్నదా?'' అని న్యాయాధికారి అడుగుతాడు ''ఫలానాచోట ఫలానా చెట్టు కింద ఎల్లయ్యకు డబ్బిచ్చాను ఆ చెట్టే సాక్ష్యం'' అంటాడు పుల్లయ్య ''సరే ఆ చెట్టును పట్టుకురండి'' అని న్యాయాధికారి మనుషులను పంపిస్తాడు కాస్సేపుండి ఆయన ''మనుషులింకా రారేం?'' అంటాడు ''ఆ చెట్టు ఇప్పుడెక్కడ ఉంది? ఇంకా చాలా సేపటికి గాని వాళ్ళు రారు'' అంటాడు ఎల్లయ్య వాడి మోసం బయటపడిపోతుంది ఇటువంటి యుక్తి కథలు జానపద సాహిత్యం నిండా ఉన్నాయి రామలింగడూ, బీర్బల్, గోహా నజురుద్దీన్ లాంటి వాళ్ళ కథలు చాలా భాగం యుక్తి కథలే ఇలాంటి కథలు పిల్లల మనసుకు పదును పెడతాయనటానికి సందేహం లేదు

సాహిత్యం నిర్వహించవలసిన సాంఘిక పాత్రను గురించి సరి అయిన అవగాహన లేని జాతి మనది అందుచేత సాహిత్యం సృష్టించే వాళ్ళూ, చదివే వాళ్ళూ కూడా దాని నుంచి తగిన లాభం పొందలేకపోవడం మన దేశంలో మరీ జాస్తిగా ఉంటున్నది

మనిషిలోనూ సమాజంలోనూ కొన్ని దుష్ట లక్షణాలు దుష్టశక్తులూ ఉండరాదన్న విశ్వాసాన్ని బలంగా కలిగించే బాధ్యత సాహిత్యానిది నాటిని నిర్మూలించే బాధ్యత ఇతర సామాజిక శక్తులది సాహిత్యం దానంతట అదే సమస్యను పరిష్కరించదు సమస్యలను పరిష్కరించుకునే వాళ్ళు చీమూ రక్తమూ గల మనుషులు మంచి జానపద సాహిత్యం పిల్లల మనసులను (పెద్దవాళ్ళ మనసులనన్నా కూడా) అభ్యుదయం కేసి తిప్పి జీవితంలోనూ వ్యక్తులలోనూ సహించరానివేవో స్పష్టంగా చెబుతుంది పిల్లల జీవితాలకి ఈ పునాది ఎంతైనా అవసరం

ఈనాడు అంతర్జాతీయంగా వినిపించే శాంతీ, ధర్మమూ, సర్వమానవ సమత్వమూ, పరస్పర సహకారమూ లాంటి నినాదాలన్నీ జానపద సాహిత్యంలో ఉన్నాయి బలంగా కూడా ఉన్నాయి మంచి పాలకులకు ప్రజల అండ ఉంటుంది దుర్మార్గులను ప్రజలు శిక్షిస్తారు

జానపద సాహిత్యంలో దొంగలు తప్పనిసరిగా దుర్మార్గులు కారు వారిలో చాలామంది మహోపకారులూ, ఆడితప్పనివాళ్ళూ, బీదలపట్ల దయగలవాళ్ళూ ఉన్నారు తెలివీ, యుక్తీ గల వాళ్ళూ ఉన్నారు నిజానికి జానపద సాహిత్యంలో ధనరాసులకూ లంకెబిందెలకూ ఎంత విలువ ఉన్నా ఆస్తి హక్కులపట్ల గొప్ప ఆదరణ ఏమీ లేదు అంతకన్నా దారిద్ర్యం పట్ల సానుభూతి చాలా హెచ్చుగా ఉంటుంది

జానపద కథలలో చాలా రకాలున్నాయి కొన్ని ఆటవిక దశలో పుట్టినవి మరికొన్ని జమీందారీ సంస్కృతిలో నుంచి పుట్టినవి కాని అన్నీ గతించిన సాంఘిక వ్యవస్థలకు సంబంధించినవే అన్నీ సామాన్య జనానికి అందుబాటులో ఉండినవే వాళ్ళే వాటిని ఆనోటా ఆనోటా ప్రచారం చేశారు వాటి నుంచి ''బలాన్ని'' పొందారు

ఆటవిక జానపద కథలలో ఉండే రాజుకు ఒంటిమీద చొక్కా వుంటుందని చెప్పలేం ముగ్గురు పెళ్ళాలున్నా వాడు నివసించేది చుట్టుగుడిసెలోనే కావచ్చు అలాగే జమీందారీ సంస్కృతికి చెందిన జానపద కథలలో కనిపించే రాజులు ఒక గ్రామానికో, ఒక చిన్న నగరానికో రాజులు అయివుంటారు నిజమైన జానపద కథలలో ఒకనాటి సాంఘిక వ్యవస్థా, మనుషుల మధ్య సంబంధాలూ, ఒక కాలపు జీవితాన్ని సరిగా చిత్రించేవిగా ఉంటాయి ఆ కాలపు కథలలోకి తుపాకితో వేటాడేవాళ్ళనూ, సిగిరెట్లు కాల్చేవాళ్ళనే, మోటారు కార్లనూ ప్రవేశపెట్టడం సాధ్యంకాదు రాజుగారి ఏడుగురు కొడుకులు వేటకు వెళ్ళి ఏడు చేపలు తెచ్చారంటే వాళ్ళు వలలు పట్టుకుపోయారని కూడా అనుకోలేం గాలాలు పట్టుకుపోయి వుండొచ్చు

గ్రామీణ జానపద కథలలో రాజులు కూడా ఉండరు అందులో గ్రామీణులూ, వారి సమస్యలూ, రైతులూ, కూలి చేసుకునే వాళ్ళూ, వడ్డీ వ్యాపారులూ, గ్రామాధికారులూ, న్యాయనిర్ణయాలూ, అత్తా కోడళ్ళ సమస్యలూ మొదలైనవి ఉంటాయి

అందుకే జానపద కథలు మానవ శాస్త్రవేత్తలకు మంచి ముడిసరుకుగా పనికి వస్తాయి వాటి ద్వారా ఏయే సాంఘిక వ్యవస్థలలో ఎలాంటి ఆచారాలుండేవో, మనుషులను మంచికిగాని, చెడుకిగాని ప్రేరేపించినవి ఎలాంటి విషయాలో, సాంఘిక ధర్మం ఎలా ఉండేదో తెలుసుకోవచ్చు జానపద సాహిత్యం చరిత్ర గాని చరిత్ర

మామూలు సాహిత్యంలో కన్నా జానపద సాహిత్యంలో వైవిధ్యం చాలా హెచ్చు అందులో హాస్య కథలూ, గణిత సమస్యలూ, రాజభక్తికి సంబంధించిన అంశాలూ, దేశభక్తి, విధి నిర్ణయాలూ, గ్రహబలాలూ మొదలైన అసంఖ్యాకమైన విషయాలూ ఉంటాయి

ఈ అన్ని రకాల జానపద కథలనూ మనం గుడ్డిగా స్వీకరించలేం వాటిలో కొన్నిటికి కాలదోషం పట్టింది ప్రజాప్రభుత్వాలు వచ్చాక రాజభక్తికి అర్థంలేకుండా పోయింది దేశమంటే ఈనాడు ఒక నగరంకాదు మనకు యావద్భారతం అలాగే విధి నిర్ణయాలలోనూ జాతకాలలోను విశ్వాసం ఉంచటం మూఢాచారంగా పరిగణించబడుతోంది

జానపద కథలలో పిసినిగొట్టులైన ధనికులనూ, క్రూరులైన పాలకులనూ ఒక పేద యువకుడు అణగార్చడానికి ఏదీ అడ్డం రాదు కాని ఆ దుష్ట పాత్రలు ఈనాటి వాస్తవ జీవితంలో తమ రక్షణకోసం తగిన చట్టాలనూ సాయుధ సిబ్బందినీ కలిగి ఉన్నాయి ఈనాడు దుష్ట శిక్షణ జానపదకథలలో చిత్రించినంత తేలిక కాదు అది రాజకీయ పరిధిలో ఇమిడి పోవడమే గాక, శిక్షలు విధించేవాళ్ళు దుళ్ళు దుష్టులు కావటం కూడా జరుగుతున్నది

అందుచేత జానపద కథలనుంచి ఏది స్వీకరించేదీ వ్యక్తులే తమ తమ మానసిక స్థాయిలను బట్టి స్వభావాన్ని బట్టీ నిర్ణయించుకోవాలి సాహిత్యాన్ని నిషేధించటం ఎంత అర్థంలేనిపనో, జానపద సాహిత్యాన్ని నిషేధించటంకూడా అర్థంలేని పనే

మన దేశంలో ప్రజలు సార్థక జీవులు కారు అనేక సామాజిక దశలకు చెందిన ఆచారాలనూ, సాంప్రదాయాలనూ పట్టుకు వేళ్ళాడుతూ, కలగాపులగపు జీవితం జీవిస్తూ, భౌతిక లక్ష్యాలకు బదులు ఆధ్యాత్మిక లక్ష్యాలపై దృష్టి నిలిపిన మనకు చరిత్ర స్పృహ చాలా తక్కువ మనం నిశ్చయంగా చరిత్ర హీనులం అందుకే నేమో మనం జానపద సాహిత్యాన్ని దక్కించుకునేటందుకు సరిఅయిన ప్రయత్నంచేయలేదు మన దేశంలోని వివిధ ప్రాంతాలకు సంబంధించిన జానపద కథలను సేకరించే ప్రయత్నం ఇటీవలనే ప్రారంభమయింది పుస్తకాలు వెలువడుతున్నాయి వాటిలో తెలుగు జానపద కథలు సంకలనం ఉన్నట్టు లేదు హిందీలో ఒక చిన్న పుస్తకం వెలువడింది గాని అది ఎలా వెలువడినదీ నాకు తెలుసు

జానపద కథలను సేకరించే పని చాలా కష్ట తరమైనది అనేక గ్రామాలు తిరిగి కథలు చెప్పటంలో నేర్పరులైన వారిని కలుసుకుని కథలు చెప్పించుకుని వాటిని చెప్పినవి చెప్పినట్టుగా రాసుకుని ప్రచురించాలి ఇది వ్యయప్రయాసలతో కూడుకున్న పని

ప్రస్తుతం జానపద కథలు పత్రికలలో హెచ్చుగా పిల్లల పత్రికలలో - వెలువడు తున్నాయి ఇందులో కృతక జానపద కథలు కూడ ఉన్నాయి వాటిని సృష్టిస్తున్నవారు జానపదులుకారు అందుచేత జానపద గేయాల విషయంలో జరిగిన పాటి కృషికూడ కథల విషయంలో జరగలేదు ఇది ముందుముందు జరగవలసి వున్నది

*ముద్రణ జయశ్రీ ప్రత్యేక సంచిక 1972*

# 20. ప్రజలు చదివేది

"ప్రజలు కోరేది మనం చూపటమా? మనం చూపేది ప్రజలు చూసి ఆనందించడమా?" అన్న నేపాళమాంత్రికుని తాత్విక సమస్య ఎల్లప్పుడూ కళాకారులముందు వుంటూనే వుంటుంది.

ఈ ప్రశ్నకు కళాకారులిచ్చే జవాబు వారి ఆశయాలను బట్టి వుంటుంది. ప్రజలు కోరేది సృష్టించటం అనేది స్వార్థంతోనూ, అశక్తతతోనూ కూడుకున్నది. వీళ్ళు మధ్యములు. ఉత్తమకళాకారులు తాము సృష్టించేది ప్రజలకు నచ్చేట్లు చేస్తారు. ఇందులో ప్రతిభ ఉండడమేగాక, ప్రయోజనం కూడా ఉన్నది. ఈ ఉత్తమ కళాకారులే ప్రజల అభిరుచులను మార్చగలుగుతారు. తమ కళద్వారా ప్రజలలో చైతన్యం కలిగించగలుగుతారు. అధమకళాకారులు కూడా వున్నారు. వాళ్ళు ప్రజలు కోరేది ఇవ్వలేరు. తాము ఇచ్చేదానితో ప్రజలను రంజింపజేయనూ లేరు. (చూడుము: చెత్త సినిమాలు)

సాహిత్యంలో కూడా ఈ తరగతులున్నాయి. ప్రజల దృక్పథాన్నిమార్చి వారిలో వికాసం కలిగించే రచనలూ, ప్రజలు ఎగబడి చదివే రకానికి చెందిన రచనలూ, ప్రజలు చదవనివీ.

రచనలలో మూడోరకం - అధమాధమం కూడా ఉన్నది. ఈ రచనలు ప్రజలను చదివించగలిగినప్పుడు వారికి చాలా అపాయం కలిగిస్తాయి. వీటి వల్ల ప్రజలు జీవితంగురించీ, జీవిత సత్యాల గురించీ, అయోమయంలో పడిపోతారు, వారికి మృతసంస్కృతి సజీవంగా వున్నట్టు భ్రమ కలుగుతుంది. వారి భావచైతన్యం ముందుకు పోవటానికి బదులు దారి తప్పిన ప్రయాణీకుడులాగా ఆగిపోవటమో, వెనక్కు వెళ్ళటమో జరుగుతుంది.

ఈనాడు రచయితలకు పెద్దగా భాషాజ్ఞానమూ, పాండిత్యమూ, ప్రాచీన సాహిత్య పరిచయమూ అవసరంలేదన్నది ఏనాడో నిర్ణయమయింది. కాని వారికి ప్రపంచ జ్ఞానమూ, జీవితానుభవమూ, సామాజిక దృక్పథమూకూడ అవసరం లేదన్నది రాను రాను బాగా రుజువవుతున్నది. ఇతివృత్తాలలోగాని, పాత్రపోషణలోగాని, సన్నివేశాలలోగాని ఎలాటి వాస్తవికతా అవసరంలేదు.

ఈ బొత్తిగా ప్రతిభాహీనులైనరచయితలు బళ్ళకొద్దీ ఎలా రాయగలుగుతున్నారు? వాళ్ళు అనుసరించడానికి బోలెడంత నాటు సాహిత్యమూ, సమ సాహిత్యమూ ఉన్నాయి.

ఇలాటి సాహిత్యానికి ( సినిమాలకు కూడా) సమర్థింపు లేకపోలేదు.

"ప్రజలు తమ జీవితంలోని కష్టాలను కాస్సేపు మరచిపోయి ఆనందించటానికి ఇలాంటి రచనలు ఉపయోగపడతాయి."

ఈ సమర్థింపు ఎంత భయంకరమైనదో చెప్పే వాళ్ళు గుర్తించినట్టు కనపడదు.

ప్రజల జీవితం దుఃఖభాజనం అన్నది వీళ్ళు ఒప్పుకుంటున్నారు. దాన్ని ఎదుర్కొనటానికి ఈ సాహిత్యం ఉపకరించదనీ వాళ్ళు ఒప్పుకుంటున్నారు. జీవితాన్ని ప్రతిఘటించడానికి ప్రజలకు అవసరమైన మానసిక శక్తి సాహిత్యం ద్వారా లభించవచ్చునన్నది కూడా వీరికి తెలీదు.

పోనీ, ఈ సాహిత్యం ప్రజల విరామ సాహిత్యమా? నాలుగు గంటలు శ్రమించినవాడు పావుగంట విశ్రాంతి తీసుకుని, టీ తాగి, మళ్ళీ పనిచెయ్యటానికి పుంజుకుంటాము. ఈ "వినోద" సాహిత్యం శ్రామికుడి "లంచ్ బ్రేక్" లాంటిదా? కాదు. ఈ వినోదం ప్రజలకు బలం ఇవ్వకపోగా, జీవితపోరాటానికి మరింత పనికి మాలిన వాళ్ళనుగా చెయ్యటం లేదా? ప్రజలు నీరసించటానికి ఈ సాహిత్యం తోడ్పడటం లేదా?

అభ్యుదయ సాహిత్యం రోజుల్లోనే చాలామంది ఒక ప్రశ్న వేసేవాళ్ళు "జీవితంలో ఆకలీ, దారిద్ర్యమూ మొదలైన ఈతిబాధలు ఉండనే ఉన్నాయి. లని కథలలో కూడా దేనికీ?"

నేను గమనించినంతవరకు ఈ ప్రశ్న అడిగినవారెవరూ ఆ ఈతి బాధలకు గురి అయిన వాళ్ళకు వాటిని గురించి చదవటంలో బాధ ఏమీ లేదు. భారతంలో ధర్మరాజు తన తమ్ములతోనూ, పెళ్ళాంతోనూ అరణ్యాలలో అష్టకష్టాలూ పడుతూ, తనకు పూర్వం తనలాగే కష్టాలు అనుభవించిన నలుడూ, ఇంద్రుడూ మొదలైన వారి కథలు చెప్పించుకుని విని ఊరట చెందాడు.

అంతేకాదు. సాహిత్యంలో కష్టాలకూ, జీవితంలో కష్టాలకూ ఒక మౌలికమైన తేడా ఉన్నది. జీవితంలో కష్టాలు ఎలా వచ్చేదీ, ఎటునించి వచ్చేదీ, వాటి మూలకారణాలు ఏవైనదీ స్పష్టంగా తెలియదు. సాహిత్యంలో జీవిత విశ్లేషణ ఉంటుంది. జీవితం స్పష్టం చెయ్యలేని దాన్ని సాహిత్యం స్పష్టం చేస్తుంది.

పై చెప్పిన విషయాలు సర్వసామాన్యంగా అందరికీ తెలిసి ఉండతగినవే. చిత్రం ఏమిటంటే, అది కూడా తెలియని వాళ్ళు సాహిత్య తత్వంగురించి మాట్లాడతారు.

సాహిత్య పరిణామం చూసినా, సాహిత్యం క్రమంగా ప్రజలకు సన్నిహితం కావడం స్పష్టంగా కనిపిస్తుంది. జీవితానుభవం లేని రచయితలు కూడా తమ కాలానికి సంబంధించిన కథలు రాస్తున్నామనే అనుకుంటున్నారు. జీవితంలో తాము చూసే మనుషుల లాంటి పాత్రలనే చిత్రిస్తున్నామనుకుంటున్నారు. ఇందులో వారు విఫలమైతే అది వేరే విషయం.

సాహిత్యంలో వాస్తవికత ఎక్కడిదాకా వచ్చి ఆగిపోవాలన్నది ఎవరూ అడగని ప్రశ్న. ఈ అడగని ప్రశ్నకు సమాధానాలైతే వొస్తున్నాయి. విశ్వనాథ వారిని అడిగితే వాస్తవికత పురాణయుగం దాటి రాకూడదంటారు - వేదకాలం దాటిరావచ్చు ఫరవాలేదా! మరికొందరు పాశ్చాత్యదేశాలపరిధి దాటి రాకూడదని కూడా అంటారు, వీరు ఇంగ్లీషు నవలలు సొంతంగా తెలుగులో రాస్తారు. లేదా, ఇంగ్లీషులోకి అనువదించి, పాశ్చాత్యులు చదివి ఆనందించదగిన రచనలే చేస్తారు.

ఈ పరిస్థితిలో సాహిత్యం అట్టడుగునవారికి అందుబాటులోకి రావాలనీ, రావడంలేదనీ విప్లవ రచయితలు ఆందోళన చెందుతున్నారు. సాహిత్య పరిణామం వీరి ఆందోళనను సమర్థిస్తుంది గాని మధ్యతరగతి వారి దగ్గర సాహిత్యం ఆగిపోవాలనేవారిని సమర్థించదు.

జీవిత పరిణామం ప్రజాపోరాటం మీద ఆధారపడి ఉన్నది. ఆ పోరాటంలో ప్రజల చేతిలో వజ్రాయుధంలా పని చేసేదే నిజమైన సాహిత్యం. అదే విప్లవ సాహిత్యం. ఇందుకు అంగీకరించని వారు, జీవిత పరిణామం, ప్రజా పోరాటం మీద ఆధారపడలేదని రుజువు చెయ్యాలి, చెయ్యలేరు!

*ముద్రణ : ఆంధ్రజ్యోతి వారపత్రిక, 24-11-1972*

# 21. రాయటం దేనికి

ఈ ప్రశ్నకు అనాదిగా సమాధానాలు చెప్ప బడుతూ వస్తున్నాయి ''యశసేర్థకృతే'' అన్న శ్లోకాన్ని చాలామంది స్మరించారు అయినా ఈ ప్రశ్న మళ్ళీ మళ్ళీ పుట్టుకొస్తూనే వుంటుంది బహుశా సాహిత్యం గాడి తప్పిందని అనుమానం కలిగినప్పుడల్లా ఈ ప్రశ్నపైకి వొస్తూంటుందేమో, లేక, ఈ ప్రశ్నకు వేరువేరు కాలాలలో వేరు వేరు సమాధానాలుంటాయో

'రాయటం దేనికి' అన్న ప్రశ్నకు సమాధానం చెబితే అన్ని రచనలకూ వర్తించేదిగా ఉండాలి అలాకాక, ఎవరి సమాధానం వారు చెప్పుకోగలందులకు కొంతకాలం క్రితం విశాఖ రచయితలు ''నేనెందుకు రాస్తున్నాను'' అన్న ప్రశ్నకు ఎవరి సమాధానం వారిచ్చారు అందరూ ఒక్కందుకే రాయకపోవచ్చునన్న సందేహం ఆ ప్రశ్నలో ఇమిడి వున్నది ప్రజాతంత్రంలో వైవిధ్యానికి అవకాశం వున్నది ప్రతి ఒక్కరూ లోకాన్ని ఉద్ధరించే మహదాశయంతోనే రాయనవసరం లేదు పోతనగారి కాలంనాటికే రచనలు ''పురంబులు, వాహనంబులున్, సొమ్ములు కొన్ని'' పుచ్చుకొనే ఆశయంతో జరిగాయి ఆ పద్ధతి బమ్మెర పోతరాజుగారికి నచ్చలేదు అప్పుడే అలా ఉంటే, ఎవరికి మటుకు వారు తాము ఒక్కరే రచయితలన్నట్లు ప్రవర్తించే ఈ కాలంలో వైవిధ్యం ఉండటం అబ్బురమా?

అయితే కొంతకాలంగా, ఈ అనాదిగా వొస్తున్న ప్రశ్న సరికొత్త రూపంలో నన్ను ఎదుర్కొనసాగింది

నేను రాయటం ఎందుకు మానాను? ఈ ప్రశ్న అడిగినవారికి చాలా ఏళ్ళుగా సమధానాలిస్తూ వస్తున్నాను కాని ఇప్పుడు 'జ్యోతి' మాసపత్రిక నానుంచి లిఖితపూర్వకమైన సమాధానం కోరుతున్నది ఈ ప్రశ్నకు సమాధానం చెప్పేముందు రెండు విషయాలు స్పష్టం చెయ్యాలి నేను రాయటం మానింది కల్పనా సాహిత్యం మాత్రమే కట్టుకథలు కాని రచనలు చేస్తూనే వున్నాను ''కుటుంబరావంటే, ప్రతి పత్రికలోనూ ఏదో ఒకటి రాస్తూంటాడు, ఆయనేనా?'' అని ఎవరో అడిగారట ఇది ఒక విషయం

రెండోది, ఈ ప్రశ్న సాధారణంగా ఏ రచయితనూ ఎదుర్కొనేది కాదు ఎవరైనా రాయటం ఎందుకు మానేస్తారు 'మిణక' లేక శక్తి నశించింది ఈ విషయం లోకానికి ముందే తెలిసిపోతుంది సోమర్సెట్ మామ్ చివరి రోజులలో రాసిన కథలు సంపుటంగా వస్తే, ఒక విమర్శకుడు ''మామ్ ఈ కథలు రాయకుండా ఉంటే బాగుండేది'' అని విమర్శించారు సాధారణంగా కవులుగాని, తమ పటుత్వం సన్నగిల్లుతున్నదన్న సంగతి లోకానికి తెలిసిన కొంత కాలానికి గాని తాము తెలుసుకోరు

అందుచేత 'నేను కథలు రాయటం ఎందుకు మానేశాను?' అన్న ప్రశ్నకు అనేకమందికి సమాధానం చెప్పటమేకాకుండా ఒక వ్యాసం కూడా రాయవలసి రావటం కొంచెం అసాధారణంగానూ, అసహజంగానూ కనబడుతున్నది

నాటకాలు, అంతకన్నా వాటికి 'ప్రిఫేస్'లు రాయడంలో జగద్విఖ్యాతి సంపాదించిన జార్జ్ బెర్నార్డ్‌షా ఆరు నవలలు రాసి విరమించాడు పై పెచ్చు 'నేను కాస్తయితే సుప్రసిద్ధ నవలాకారుణ్ని అయివుండేవాణ్నే'' అని కూడా అన్నాడు నేను దానికి విరుద్ధంగా, 'చెత్తకథలు

రాసేవాడ్ని అయిపోయే'' ప్రమాదం శంకించి కథలు రాయటం మానేశాను నేను అనుకొన్నట్లుగానే అందరూ అనుకొంటే ఈ వ్యాసం అవసరం లేకపోను

నేను కథలు రాయటం మానటంలో నేను కథలు ''ఎలా'' రాశాను అన్నది ఇమిడి ఉన్నది అది వివరిస్తే ఎందుకు మానేశానన్నది స్పష్టమవుతుంది

ఇంచుమించు నలభై అయిదేళ్ళ క్రితం సాహిత్యం గురించి నాకు వుండిన విశ్వాసాన్ని ఒక విధంగా వివరించాను సాహిత్యం జీవిత వృక్షానికి పూసే పువ్వు, పువ్వుకు పువ్వులు పూయివు సాహిత్యానికి ''పుట్టే'' సాహిత్యం నాకు ఆనాడే కృత్రిమంగానూ, కాగితం పువ్వులాగానూ కనిపించింది నా కారుకు చెందిన రచయితలకు గుర్తుంటుంది ఈ నాడులాగే 1933 అనంతరం ఊరికొక కథల పత్రిక వచ్చింది పది కథలు చదివితే ఒక కథ రాయవచ్చునసే మనస్తత్వం ఆనాటి యువకులు ప్రదర్శించారు చలంగారి ఒరవడిలో కథలు రాస్తే పేరు వస్తుందన్న నమ్మకం చాలామందికి కుదిరినట్టు కనబడింది అచ్చులో పేరు చూసుకునే అవకాశం చాలా ఎక్కువ మందికి అందుబాటు లోకి వచ్చినట్టు కూడా కనబడింది

ఆధోరణి నాకు చాలా వెగటుగా కనబడింది నాకు వెగటు కలిగించిన మరొక ధోరణి ఏమంటే, ఎవరో ఒకరిమీద కథ రాయటం కథ రాయటానికి ఏ అర్హతాలేనివాళ్ళు సైతం కొంత ''దురద'' తీర్చుకొనటానికి తాము రహస్యంగా కామించిన ఓ పిల్లను పాత్రగా పెట్టి ఒక ప్రేమ కథో, తమకు ఇష్టంలేనివాణ్ణి దుష్టపాత్రగా చేసి ఒక మనోవైజ్ఞానిక కథో రాయటమూ, అందులో సార్వజనీనత బొత్తిగా లోపించి చిన్న చిన్న వివరాలు సాధారణ పాఠకుడికి అంతుబట్టక పోవటమూ అప్పుడప్పుడూ జరిగింది

ఇందులో కొంత మెరుగు యేమిటంటే జీవితాన్ని యధాతథంగా చిత్రించి ''కేస్ హిస్టరీస్'' లాటి కథలు రాయటం అయితే ఇది కూడా నాకు నచ్చిన పద్ధతి కాదు ఎందుకంటే, నూటికి నూరుపాళ్ళు వాస్తవికత పాటిస్తూనే కథకుడు జీవితంమీద ఒక దృక్పథంతో వ్యాఖ్యానాలు చేయవచ్చునని నాకు మొదటినుంచీ నమ్మకం అందుచేత నేను నా రచనకు ప్రయోజనం నిర్ణయించుకొన్న తరువాతనే పాత్రలను సృష్టించుకొన్నాను నాకు తెలిసి ఏనాడూ జీవితంలో నాకు ఎదురైన పాత్రలను, ఉన్నపళంగా కథలలో ఇరికించలేదు జీవితాన్ని సాహిత్యానికీ మధ్య ఏదో పెద్ద తేడా ఉండి ఉండాలనీ, అందుకే నాకు వాస్తవ వ్యక్తులు పనికి రాకపోయి ఉండవచ్చుననీ అనుకొంటున్నాను

నాలో ఉన్న మరొక బలహీనత ఏమంటే నేను ఒక పాత్రను సృష్టిస్తే ఆ పాత్ర యే పరిస్థితులలో ఎలా మాట్లాడేదీ, యేం చేసేదీ నాకు స్పష్టంగా తెలియాలి - ఆ పాత్రను నేను చాలా కొద్దిగా వాడుకొన్నా సరే నాలో ఈ దౌర్బల్యం ఉండబట్టేనేమో తెలుగు సినిమాలలో నన్ను అమితంగా ఆకర్షించిన పాత్ర ''షావుకారు'' చిత్రంలో కనకం నటించిన చాకలిదాని పాత్ర అంత కొద్ది ''ఫుటేజ్''లో ఆ పాత్రను నాకు పుట్టినప్పటి నుంచీ తెలుసునన్న భావం ఎలా కలిగించగలిగాడో స్వర్గాన వున్న చక్రపాణిగారికే తెలియాలి

ఈ పైన చెప్పినవాటికి ఇంకొక్క విషయం జత చేర్చితే నా కన్ఫెషన్ పూర్తవుతుంది నేను 1940లో ఆంధ్రదేశం విడిచిపెట్టి దేశంలో వేరు వేరు ప్రాంతాలలో కొంత కొంత కాలం గడిపి, చివరకు తమిళనాడులో స్థిరపడ్డాను తెలుగు జీవితానికీ, తెలుగువాళ్ళ ఆలోచనలకూ,

ఎమర్జెన్సీ తర్వాత, యాత్మ ప్రేరణలకూ దూరమయ్యాను  ఇప్పటికీ మద్రాసు కేంద్రంగా పెట్టి కథలూ, నవలలూ కొన్ని రాశాను  కాని నాటిలో నాకు సంతృప్తి కలిగించే వాస్తవికత ఉన్నదో లేదో తెలుసుకొనే అవకాశం కూడా నాకు లేదు   పోనీ తమిళ జీవితం గురించి రాద్దామంటే, దాని ఆయుపుపట్లు నాకు తెలీవు  తెలియకపోవటం నా పొరపాటే  కాని కథలు రాయటానికి ఆ పొరపాటే అంతరాయమయింది

ఇప్పటికీ నాకు కల్పనా కథలు రాసే మార్గాలు ఒకటీ అరా లేకపోలేదు  గత జీవితం గురించి రాయవచ్చు నేను రాసిన "చదువు", "గడ్డు రోజులు", "అనుభవం" గతానికి చెందినవే ఇలా కనీసం మూడు, నాలుగు "బండలు" రాసి పారెయ్యటానికి తగిన అనుభవం నాకు లేకపోలేదు  కాని వర్తమాన సాహిత్య ధోరణులు చూస్తూంటే అలాంటి గత జీవిత చిత్రణలు పాఠకులకు రుచియో గుడవేమోనన్న అనుమానం కలిగింది

కళ్ళ ఎదుటే కనిపించే జీవితం గురించి యథాతథంగా రాయటానికి అభ్యంతరం లేక పోయినా, నేను కథలూ, నవలలూ రాయవచ్చు - కాని నాకు అభ్యంతరం ఉన్నది

కొందరికి గాలిలో రమ్యహర్మ్యాలు నిర్మించి, పాఠకులను " ఉర్రూతలు" ఊగించే శక్తి ఉన్నది  నేను అలాటి శక్తికి నోచుకున్నా కథలు మానవలసిన అవసరం లేదు  కాని నోచుకోలేదు ఇంతా చెప్పిన తరవాత నాకు తోచిన మరొక విషయం కూడా చెప్పి ముగిస్తాను  "నేను రాయటం ఎందుకు మానాను?" అన్న ప్రశ్న ఈనాడు చారిత్రక సమస్య కాదు  నేను ఒకప్పుడు కథలూ, నవలలూ రాశానన్న సంగతి ఈనాటి పాఠకులలో చాలామందికి తెలియను కూడా తెలియదు

*జ్యోతి మాసపత్రిక, 1978 దీపావళి సంచిక*
*పునర్ముద్రణ  కళలు-శాస్త్ర విజ్ఞానం, విరసం ప్రచురణ, 1980 అక్టోబరు*

# 22. వివిధ సాహిత్య ధోరణులు

సాహిత్య రచన ఏ ఆశయాలతో జరగాలి అన్న ప్రశ్న వెయ్యిమందికి వేస్తే కనీసం అయిదువందల సమాధానాలు రావచ్చు, యీ వైవిధ్యం సాహిత్యాభిలాషలతో తేడాను బట్టి ఉంటుంది  ఒక్క తెలుగులోనే తీసుకున్నా రచనలు చదివేవారు లక్షల సంఖ్యలో ఉంటారు వారు తాము చదివే దాని నుంచి ఎలాంటి సంతృప్తి ఆశిస్తారో, ఎలాటి అనుభూతి పొందుతారో ఎందుకు ఇష్టపడతారో, ఎందుకు ద్వేషిస్తారో ఆరా తీయటం అసాధ్యం  కాని కొందరు రచయితలకూ, రచయిత్రులకూ పాఠకులలో గల ఆదరణను బట్టీ, కొన్ని రకాల రచనలు ప్రత్యేకంగా అమ్ముడు పోవటాన్ని బట్టి మనం కొన్ని అంచనాలు ఉజ్జాయింపుగా వేసుకోవచ్చు

సాహిత్యం ఎలా వుండాలి అన్న ప్రశ్నకు సమాధానం నా చెవులతో నేను చాలా రకాలుగా విన్నాను - కొన్ని ఉదాహరణలు -

ఊరికే సరదాగా చదువుకోవటానికి కథలు రాయగూడదా? ( ఒక రచయిత్రి)

ఏ ఫ్రాయిడ్ సిద్ధాంతాన్నో, ఏ మార్క్సు సిద్ధాంతాన్నో నిరూపించటానికి కథలు రాయాలా? ( ఒక డాక్టర్)

ఏమిటో చెబుతారు గాని, యీ కథలూ, కాకరకాయలూ, జీవితాన్ని మారుస్తాయా? (అభ్యుదయ వ్యతిరేకి)

ఇలాటి భావాలు ఎన్నో వింటూంటే ఆర్థిక రంగాలలో "ఫ్రీ ఎంటర్‌ప్రైజ్" లాంటిది సాహిత్య రంగంలో కూడా గుర్తించబడుతున్నదా? అన్న అనుమానం కలుగుతుంది

ఆధునిక మానవుడు ప్రాకృత జీవి కాడు అతడి సామాజిక పురోగమనం తన వాతావరణాన్ని మార్చి, తనకు అనుకూలంగా చేసుకోవటముతో ఆరంభమయింది సాహిత్యంలాంటి సామాజిక ప్రక్రియను అభివృద్ధికి వినియోగించుకోవాలన్న ఆవేశం గాని, ఏసీసం అభిప్రాయము గాని లేని వాళ్లు ఏమంత నాగరిక మానవులు కారు

సాహిత్యం శక్తిహీనం కాదు మానవ చరిత్రలో ప్రతి మతమూ అసంఖ్యాక ప్రజలను ప్రభావితులను చేసింది బ్రాహ్మణ మతం ఆదిమ ఆటవిక జాతులను వర్ణవ్యవస్థలోకి తెచ్చి, సమాజ పురోగమనానికి తోడ్పడింది బౌద్ధం రాగానే అర్థశాస్త్రం నాటి రాజకీయాలు ఆకస్మికంగా అంతమై, దేశదేశాల ప్రజలు దాని సహాయంతో నాగరికత పెంచుకున్నారు ఇస్లాము, క్రైస్తవ మతాలు మానవ చరిత్రలో తమ ప్రభావాన్ని స్పష్టంగా రుజువు చేశాయి మతాలకన్న శాస్త్ర జ్ఞానం మానవ సంస్కృతి అన్ని రంగాలలోనూ గొప్ప పరిణామాలకు గురి చేసింది

నేటి రచయితలు మానవ భవిష్యత్తుకు శాస్త్రీయంగా లక్ష్యాలు నిర్ణయించి, వాటికి సుముఖంగా మనుషులను మళ్ళించగల రచనలు చేయవచ్చు సెక్సు కథలతోనే సమాజం బాగుపడుతుందన్నట్టుగా పచ్చిబూతు కథలు రాసేవారుండవచ్చు సరదాగా చదువుకోవటం తప్ప కథలకు మరో గొప్ప ప్రయోజనం అనవసరం అనేవారుండవచ్చు కాని వీరు రచయితల ప్రమాణాలలో ఉన్నతుడనిపించుకోలేదు 'కళలు పూర్తిగా నిరుపయోగం' అన్న ఆస్కార్ వైల్డుకన్న, యువకుల అభిరుచులను అభ్యుదయ వ్యతిరేక మార్గాలలో మళ్ళించే భక్తి సాహిత్యం లాటివి ప్రోత్సహించే సంఘద్రోహులు ఎక్కువ తెలివైన వాళ్లు

ఎంతమంచి సాహిత్యం జీవితాన్ని మార్చలేదన్నప్పటికీ, విప్లవ సాహిత్యం రచించే వారిని 'దేశ రక్షణ' కోసం జైళ్ళలో విచారణ లేకుండా కుక్కే వాళ్ళు ఆ మాటను స్పష్టంగా అబద్ధం చేస్తున్నారు తుపాకి భయం దాన్ని గురిపెట్టి ఉన్నవాడికి తెలుస్తుంది సాహిత్య పరనాన్ని తాగుడు నిషాతోనే, భోగసుఖంతోనూ సినిమాలలో మరీ చెత్తవి చూస్తే వచ్చే వికారంతోనూ జమ కట్టడం బుద్ధిమంతులు ఆమోదించలేరు

ప్రతి సామాజిక చైతన్యానికీ భవిష్యత్తులో సాధించే లక్ష్యం ఉండాలి కొందరు సాహిత్యం పట్ల చూపే వైఖరి తమ పిల్లల పట్ల చూపితే ఆ పిల్లలు బిచ్చమెత్తుకు బతకవలసిందే!

*అవగాహన, మాసపత్రిక, ఏప్రిల్ 1979*

# 23. సాహిత్య ప్రయోజనం లేని రచన గొప్పదిగా ఉండగలదా?

ఈ ప్రశ్నకు సమాధానం రెండు నిర్వచనాల మీద ఆధారపడి ఉన్నది  ఒకటి, సాహిత్య ప్రయోజనం ఏమిటి? రెండు, రచనలో గొప్పదనం ఏమిటి?

రచన భాషతో ముడిపడి ఉన్నది  భాష అన్నది ఒక కృత్రిమ సంప్రదాయం  ఒక జాతి గాని, సమాజం గాని, వంశం గాని తమలో తాము భావాలను పరస్పరం అందించుకునేటందుకు ఏర్పాటు చేసుకున్న సదుపాయం భాష  అది ఒక సమూహంలో చలామణీ అయే నాణెం లాంటిది  ఆ సమూహం సాధించే భావ విపులత భాషను తీర్చిదిద్ది, అందులో ప్రతిబింబిస్తుంది  ఒక వస్తువుకు గాని, ప్రక్రియకు గాని, భావానికి గాని ఒక భాషలో "మాట" లేదు అంటే ఆ భాష వాడే వారి సంస్కృతిలో ఆ వస్తువుకు, లేక ప్రక్రియకు, లేక భావానికి ఇంకా స్థానం లభించలేదన్నమాట

భాషను గురించి ముందుగా సాగదీయటానికి ఇక్కడ అవకాశం లేదు  ప్రస్తుత విషయం రచన, రచన స్వతః ఒక భాషకు చెందిన వారందరి కోసమూ ఉద్దేశించబడాలి  కాని సమాజంలో పరిణామం జరిగి, మనుషులు వర్గాలుగా చీలి, వేరు వేరు భాషల మధ్య సంపర్కం ఏర్పడి జీవన మార్గాలు శాఖోపశాఖలైనప్పుడు భాషలో కొన్ని మార్పులూ, రచనలలో ఇంకా ఎక్కువ మార్పులూ జరుగుతాయి  అపరిణత దశలో రచనలు ఏ భాషలో జరిగితే ఆ భాషమాట్లాడే వారందరి సాహిత్యమూ ఒకటిగానే వుంటుంది  కాని రాను రాను జీవిత విధానాలను బట్టి సాహిత్య ప్రయోజనాలు మారిపోతాయి  వేరువేరు వృత్తులకు పనికి వచ్చే సాహిత్యం తాలూకు ప్రయోజనం ఆయా వృత్తులకే పరిమితమవుతుంది

అలా కాకుండా సమిష్టి జీవితానికి సంబంధించిన రచనలు కూడా ఒకే ప్రయోజనం గలవిగా ఉండవు  కొందరికి రచనలలో ఆనందం కావాలి, అంటే సమాజం ఎలా ఉంటే ఆదర్శప్రాయంగా ఉంటుందని వారి సంస్కారం చెబుతుందో, అలాంటి జీవితం రచనలలో కనబడాలి  సాహిత్యాన్ని ఈ దృష్టితో చూసే వారికి ప్రతినిధులు పిల్లలు  వాళ్ళకు ఆనందం యిచ్చే కథలలో మంచివాడు జయిస్తాడు  చెడ్డవాడు అణగారిపోతాడు  ఆదర్శపాత్రలు ధైర్యం కలిగి, ఎలాటి కష్టాలనైనా ఎదుర్కొవటానికి సిద్ధంగా ఉండాలి  కుట్రలు, కుహకాలూ పనికిరావు  స్వార్థం చాలా చెడ్డది  ఇలా ఉంటుంది పిల్లల అభిరుచి

సుఖంగా జీవిస్తూ, మెత్తని పరుపూ, వడ్డించిన విస్తరీలాంటి జీవితం గల వాళ్ళు దారిద్ర్యం గురించీ, పేదల కష్టాలను గురించీ వాళ్ళకు జరిగే అన్యాయాలను గురించీ వాస్తవ విషయాలు చదివితే బాధపడతారు  అలాంటి జీవితం నుంచి నిముక్తి పొందటానికి ఆ అభాగ్యులు కత్తి పట్టిన రచనలు చదివితే ఆగ్రహావేశులైపోతారు

ఇంకొందరు వాళ్ళు తమకు జీవితంలో లభ్యం కాని రచనలలో వెతుక్కొని ఆనందిస్తారు  కుర్రవాళ్ళకు ప్రేమకథలు ! మధ్యతరగతి డ్రీమర్‌కు ఆనందమయమైన జీవితం ! డబ్బు సమస్యలూ, ఈర్ష్యాసూయలూ ఎరగని పాత్రలు, సంకపెట్టడానికి వీలులేని దాంపత్య జీవితం, లేదా ప్రణయ జీవితం ! గొంతెమ్మ కోరికల సాహిత్యం అన్నమాట

ఒక విధంగా అభ్యుదయ సాహిత్యంలోనూ, విప్లవ సాహిత్యంలోనూ గొంతెమ్మ కోరికల ఛాయలుంటాయి తేడా ఏమిటంటే, మధ్యతరగతి "డ్రీమర్" తనకున్న పై వర్గాల వాస్తవంగా అనుభవిస్తున్న జీవితం అనుకునే దాన్ని (అయినదాన్ని కాదు) గురించి కలలు కంటూంటే అట్టడుగు జనం తమకు ఆనందాన్ని ఇచ్చే రచనల ద్వారా తమ భవిష్యత్తు గురించే కలలు కంటారు ఆటవిక జనాలవారి నృత్యాలలాగా, విప్లవ సాహిత్యం దాన్ని ఆస్వాదించే వారిని మానసికంగా సిద్ధం చేస్తుంది అదే "గొంతెమ్మ కోరికల" సాహిత్యంలో ప్రధానమైన తేడా

సాహిత్యాన్ని వినియోగవస్తువుగా పరిగణించే వారిలో రకాలున్నట్టే సాహిత్య విమర్శకులలో రకాలున్నాయి వైద్యులలో స్పెషలిస్టులలా వీరు తత్త్వశాస్త్రంలోనో, మనో విజ్ఞాన శాస్త్రంలోనో, సామాజిక ఆర్థికాది శాస్త్రాలలోనో, పారంగతులై ఉంటారు ఏ రచనలలో మార్క్సిస్టు మూలసూత్రాలకు న్యాయం జరిగిందీ, ఏ రచనలలో ఏ తాత్త్విక దృక్పథాలు పునాది ఉండినదీ వీరికి చాలా ముఖ్యం వారి దృష్టిలో ఇదే ఉత్తమ సాహిత్య ప్రయోజనంలాగా కనబడుతుంది

ఇంతవరకూ విషయం గురించే మాట్లాడుకున్నాం కొందరికి భాషే పరమార్థం మాటలకుండే రంగూ, రుచీ, వాసనా, వాటి మార్పులో ఇమిడిగల "సౌందర్యమూ", ధ్వనీ, చిత్రబంధ కవిత్వాల కసరత్తులో ద్వ్యర్థి, త్ర్యర్థి కావ్యాల వెనుక ఉన్న అపార భాషా పటిమా వీటికి ఒకప్పుడుండిన పలుకుబడి ఇంతా అంతా కాదు కాని ఇప్పటికీ ప్రాసలూ, యమకాలూ ఒక రకం మనస్తత్వాన్ని అంతోయింతో ఆకర్షిస్తాయి ఉపమానాలూ సంకేతాలూ రచనలలో చూసి అవి గొప్ప రచనలకు లక్షణాలు అనుకునే వాళ్ళు ఉన్నారు

ప్రయోజనాలు ఇన్ని రకాలుగా ఉండే రచనలలో గొప్పదనం కూడా రకరకాలుగా ఉండక తప్పదు మన అభిరుచినిబట్టి రామరాజ భూషణుడూ ఒక గొప్ప కవే దేవులపల్లీ, శ్రీశ్రీ, ఆచార్య ఆత్రేయా కూడా గొప్ప కవులే! ఒక కవి ఎందుకు గొప్పవాడు ఒక రచన ఎందుకు గొప్పదో చెప్పలేని పరిస్థితులలో మాత్రమే ప్రయోజనం లేని సాహిత్యం పుట్టుకొస్తుంది అలాంటి దాన్ని గొప్పదని ఎవరంటారు? ఎందుకు అంటారు? అలాటి సాహిత్యాన్ని ఖండించడానికి గాని, సమర్థించడానికి గాని ఎవరు కత్తులు దూస్తారు?

*రచనాకాలం - 28-1-80 'అవగాహన-3' నుంచి*
*పునర్ముద్రణ కళలు - శాస్త్రీయ విజ్ఞానం*

# 1. సాహిత్యంలో కలగవలసిన మార్పు

సాహిత్యం ద్వారా సాధించదగిన ప్రయోజనం ఏది అనుకున్నప్పటికీ ఏ కాలంలోనయినా సాహిత్యంలో కలగవలిసిన మార్పు జీవితంలో కలుగుతున్న మార్పును అనుసరించే ఉంటుంది ఏ యుగంలో గాని ఏ కవి గాని తన కాలపు జీవితంతో సంబంధం లేని రచన చేశాడనుకోవటానికి ఆధారం లేదు

సాహిత్యం యొక్క ఆశయం నీతిబోధ చెయ్యటమూ, ఆధ్యాత్మిక ప్రబోధం చెయ్యటమూ అనుకున్నప్పటికీ, సాహిత్యం తన కాలంలో ఏ నీతి, ఏ ఆధ్యాత్మికత నిజ్ఞానమూ లోపించినవనుకుంటుందో వాటిని గురించే బోధ చేస్తుంది

సాహిత్యం సృష్టించటమూ చదవటమూ కేవలం సాహిత్య కళారాధనకొరకే ననుకున్నా సాహిత్య శిల్పం కాలక్రమాన అభిరుచులలో కలిగే మార్పును బట్టి మార్పు చెందుతూ ఉండాలి

సాహిత్య ప్రయోజనం జీవితాన్ని విమర్శించటమూ అలంకరించటమూ అనుకున్నట్టయితే సాహిత్యంలో కలగవలిసిన మార్పు జీవితంలోకలుగుతున్న మార్పును బట్టి ఉండటానికి ఏ అభ్యంతరమూ లేదు

సగం జీవితం గ్రంధపఠనంలోనూ మిగిలినది గ్రంధ రచనలోనూ గడిపి జీవితాన్ని తెలుసుకోటం మరిచిన వాడి రచన ఎంత దౌర్భాగ్యంగా ఉంటుందో మనం సులభంగా ఊహించవచ్చును కేవల సదుద్దేశాలెందుకూ పనికిరావు సంఘములో లేని లోపాలను సంస్కరించే సదుద్దేశంతో రచన చేసే వాళ్ళూ, ఉన్న లోపాలను సరిగా అర్థం చేసుకోకుండా, వాటి కుదుళ్ళూ వేళ్ళూ ఎక్కడ ఉన్నవో తెలుసుకోకుండా సంస్కరణాభిలాషులై ఉత్సాహంకొద్దీ రచన చేసే వాళ్ళూ, తమకంటె కూడా అజ్ఞానుల చేత ఎంచి రచయితలనిపించకోగలిగినా కాలక్రమమున బయటపడక మానరు ఆ రచనల వల్ల వ్యక్తులకు గాని సంఘానికి గాని ప్రయోజనమేమీ ఉండదు

స్త్రీలకు స్వేచ్ఛ కోరే వారూ, మగవాడి దౌర్జన్యాన్ని నిరసించే వారూ, విడాకుల చట్టాలను సమర్థించే వారూ, భాగ్యవంతులను నిందించే వారూ తాము కోరిన సంస్కరణలు జీవితంలో ప్రవేశపెట్టితే ఏం జరుగుతుందో స్పష్టంగా అర్థం చేసుకుని రచన సాగిస్తే చాలా బాగుంటుంది అది అర్థం చేసుకోవటానికి వారికి జీవితాన్ని గురించి సంపూర్ణంగా అర్థం చేసుకునే శక్తి ఉండాలి

సంస్కరణలు కోరటం తప్పని నా అభిప్రాయం కాదు నేనూ సంస్కరణలు కోరే వాణ్ణే కాని ఉన్న లోపాలను అర్థం చేసుకోలేని వాడు వాటిని గురించి యే ప్రబోధం చేసినా చిన్నతనపుపనిగా ఉంటుంది జీవితాన్ని సంపూర్ణంగా అర్థం చేసుకోలేని వాడు కలం పట్టకూడదని కూడా నా తాత్పర్యం కాదు జీవితంలో ఉన్న తిరుగుళ్లు ఎవరికో గాని అర్థం కావు అటువంటి సమయంలో రచయిత తను అర్థం చేసుకోగలిగిన కొద్ది జీవితాన్ని గురించి విమర్శించవచ్చును జీవితాన్ని గురించి ఊహించటం ప్రారంభించే కన్న తన అనుభవంలోకి వచ్చిన విషయాలే ఉన్నవి ఉన్నట్టు రాస్తే లోకానికి ఎక్కువ లాభం ఉంది ఆ తరవాత రచనల వల్ల ఎంత ప్రయోజనం ఉందో, దానికి ఏ స్థానం ఇవ్వాలో లోకమే నిర్ణయిస్తుంది

ఏ ఉపదేశం చేసేటప్పుడు కూడా రచయితకు బాధ్యత లేదు - తన ఉపదేశానుసారం నడుచుకుంటే లోకం ఏమవుతుందో అతనికి పట్టదు ఈ స్వేచ్ఛను ఏ రచయితా దుర్వినియోగించరాదు

వేదశాస్త్రాలూ, స్మృతి పురాణాలూ పూర్వం మనకు కల్పించిన సంప్రదాయాలలో సాహిత్యం సృజిస్తే ఏం జరుగుతుంది? మనకు నాలుగు వర్ణాలు లేవు - నలభై వర్ణాలున్నై మనలో క్షత్రియులూ, పూర్వక్షత్రియ ధర్మాన్ని అనుసరించి పాలించే రాజులూ లేరు మనకు ఆశ్రమాలూ లేవు బ్రాహ్మణ ధర్మం లేదు లేవు కనకనే తెచ్చిపెట్టుకోవాలని అనవచ్చును, అది అసంభవం ఆ మాట అయిదు నిమిషాలలో అర్థం చేసుకోలేనివాడు కాగితముమీద కలం పెట్టటానికి అర్హుడు కాడు మనని పాలిస్తున్న ఆర్థికచట్టాన్ని, మన కుర్రవాళ్లు లా కాలేజీలలో చదివే న్యాయచట్టాన్నీ, మనకు కొత్త శాసనం ఇస్తున్న ఎసంబ్లీలనూ, మనని అనుదినమూ బాధిస్తున్న అంతులేని సమస్యలనూ ఎవరు తెచ్చిపెట్టారు? ఇవి ఎట్లా పరిష్కారమవుతై? ఇందులో మన ప్రయత్నం వల్ల గాని ఉత్త కోరిక వల్ల గాని సాధించదగినది ఎంత ఉంది?

ఒక వర్ణస్థుడు గానూ, ఒక మతస్థుడుగానూ, ఒక దేశస్థుడుగానూ ఈ కాలంలో మానవుడు జీవించలేకుండా ఉన్నాడు మన జీవితానికి సరిహద్దులు లేకుండా పోతున్నై ఒకప్పుడు శూద్రులు మాత్రమే చేసిన సేవ ఇవాళ అన్ని కులాల వారూ చేస్తున్నారు వాణిజ్యం ఇవాళ వైశ్యులది మాత్రమే కాదు మనల్ని పరిపాలించటానికి ఎలెక్షనులలోకి మనం క్షత్రియులను ఏరి ఎంపించడం లేదు మన జ్ఞానాన్ని అభివృద్ధి చేస్తున్న ఐన్‌స్టైన్, డార్విన్, మాక్సిలి, బోస్, రే, రామన్ మొదలైన శాస్త్ర శోధకులూ, షా, వెల్స్, టాగూర్, టాల్‌స్టాయ్, లూయీన్ మొదలైన రచయితలూ బ్రాహ్మణులేనని చెప్పటానికి లేదు!

పూర్వపు ధర్మాలేవీ పనికిరావటం లేదు మనువు చెప్పినట్టు శూద్రులకు నూటికి పన్నెండూ, వైశ్యులకు ఇరవై నాలుగూ, క్షత్రియులకు ముప్పై ఆరూ, బ్రాహ్మణులకు నలభై ఎనిమిదీ చొప్పున వడ్డీ ఇవ్వటం తలవరాని విషయం ఇప్పటి ప్రభుత్వాల కర్తవ్యాలలో విదేశాల మీద దండెత్తటం ఒకటి కాదు హాల్డేన్ చెప్పినట్టు అనుదినమూ అభివృద్ధి అవుతున్న శాస్త్ర జ్ఞానం ప్రపంచంలో ఉన్న ప్రతి వ్యక్తి జీవితాన్ని ఒకే విధంగా మార్చటమే గాక ప్రతి వ్యక్తికీ ఇతర వ్యక్తులతో ఎంచరాని సంబంధం ఏర్పాటు చేస్తున్నది అంతర్జాతీయ వాణిజ్యం దేశ సంపదలన్నింటినీ ప్రపంచ సంపద చేస్తున్నది ఈ కారణాల వల్ల విజాతీయత అనేది మన మనుష్యులలో ఉండి మనను వేధించుతున్నా, జీవితంలో అదృశ్యమవుతున్నది ప్రతి దేశస్థుడూ తన నాగరికతకు ప్రతి ఇతర దేశం మీదా ఆధారపడవలిసినప్పుడూ ఏ దేశం వారు ఇతర దేశం మీదికి యుద్ధానికి వచ్చినా కృతఘ్నుడూ, భ్రాతృద్రోహీ అవుతున్నాడు ప్రతి కులం వాడూ తన సౌఖ్యం కోసం తన అభివృద్ధి కోసం ఇతర కులాల మీదా ఆధారపడుతూ కూడా కుల వైషమ్యాలను పెంచటానికి ప్రయత్నం చేసి ఆత్మద్రోహం చేసుకుంటున్నాడు ఎవరి సరిహద్దులలో వారుండి ఎవరి నాగరికతను వారు అభివృద్ధి చేసుకుంటూ, తమ పొలిమేర అవతల ఏమి జరుగుతున్నదో తెలుసుకోలేకుండా జీవించినంత కాలమూ లేని కొత్త ధర్మం ఈనాడు మనకు అవసరమవుతున్నది ఈనాటి సాహిత్యం మనలో కలిగించే విజ్ఞానం ఈ మార్పును అర్థం

చేసుకునేటట్టు చెయ్యగలగాలి లేకపోతే కావ్యం వల్ల లోకసంగ్రహం జరగటానికి బదులు, దాన్ని వినోదార్థం చదవటమో దేవతార్చనలో పెట్టి పూజించటమో జరుగుతుంది

కోర్టుకు త్వరగా వెళ్లటానికి త్వరగా తద్దినం పెట్టే ప్లీడర్ల విజ్ఞానాన్నీ, మహావైభవంగా శ్రీరాము కల్యాణం చేసి ఏనుగఅంబారిలో ఎక్కటం దగ్గిర తగాదా పడే భక్తుల విజ్ఞానాన్నీ, ప్లీడరు గుమస్తాపని చేసి వడ్డీ వ్యాపారం చేసి మంచి మంచి ఆస్తులు సంపాదించి ఆర్యధర్మాన్ని స్థాపించటానికి చేసే సభలలో అగ్రాసనాధిపత్యం వహించే సనాతుల సంస్కారాన్నీ, తమ పాండిత్యం వెల్లడి చేసుకోవటానికి ఎవరికీ అర్థం కాకుండా పద్యాలు రాయటమేకాక రాసేది రాసేదేనని మకురుతనం చేసే కవుల సంస్కారాన్నీ సాహిత్యం ఎందుకు పరిష్కరించకూడదూ? ఆచరణకూ ఆశయాలకూ మాటకూ చేతకూ చదువుకూ ప్రవర్తనకూ ఏమీ సంబంధం లేకుండా జీవించే మనకు ఉండే ద్వంద్వాన్ని నిర్మూలించటానికి సాహిత్యం ఉపకరించదా?

వ్యక్తుల జీవితాలలో కలుగుతున్న ఆ మార్పే మన జ్ఞానానికి కూడా కలుగుతున్నది జ్ఞానమంతా ఒకటేనని చెప్పేటందుకింకా అవకాశం లేకపోయినప్పటికీ వివిధ మార్గాల అభివృద్ధి అవుతున్నజ్ఞానాలకు పరస్పర సంబంధం ఏర్పడుతున్నది న్యాయశాస్త్రమూ, ధర్మశాస్త్రమూ, వస్తువిజ్ఞాన శాస్త్రమూ, రసాయన శాస్త్రమూ వైద్య శాస్త్రమూ మొదలైన అసంఖ్యాకములైన శాస్త్రాలు వెనక ఎన్నడైనా పారస్పర్యం ఎరగకుండా ఉండినవేమోగాని ఈనాడు అట్లా జరగటం అసంభవం ఈ శాస్త్రాలకూ క్రమంగా ప్రత్యేకత లేకుండా పోతున్నది ఒక శాస్త్రాన్ని ధిక్కరించి మరొక శాస్త్రం అభివృద్ధి కాలేదు ఈ వివిధ శాస్త్రాల జ్ఞానం మానవుడికి అందుబాటులో లేక అతను తెలిసిన అజ్ఞానం అమితంగా ప్రకటిస్తున్నాడు అతని మతాన్నీ విశ్వాసాలనూ ఈ జ్ఞానం అవసరమైనంతగా సంస్కరించటం లేదు

జ్ఞానాన్వేషణ చేస్తున్నామనిపించుకుంటూ తెలిసిన అజ్ఞానాన్ని ప్రకటించుతున్న వారిలో అగ్రేసరుడు సాహిత్య రచయిత ఫిజిక్సులో కృషి చేసేవాడు కెమిస్ట్రీ, లెక్కలూ మొదలైనవి నేర్చుకోవాలనే సంగతి తెలుసుకుని ఉంటాడు బయోలజీలో కృషి చేసే వాడికి ఫిజిక్స్, బాటనీ, కెమిస్ట్రీలు కొంతవరకైనా తెలిసి ఉంటై కాని జీవితాన్ని విమర్శించే కవికి ఆర్థిక శాస్త్రమూ, సోషియాలజీ, సైకాలజీ మొదలైన విస్తీర్ణ శాస్త్రాల తాలూకు జ్ఞానం కొంతకొంత అయినా ఉండక తప్పదు భాషతో సంబంధించిన విషయం కనక మరొకవంక అతనికి భాషకూ, వ్యాకరణానికీ సంబంధించిన జ్ఞానం కూడా ఉండాలి కళతో సంబంధించిన విషయం కనక కవి కళాభిజ్ఞుడు కూడా అయి ఉండాలి

ఏ ఉపదేశం చేసే ఆశయంతో, రచన చేసే ఆశయంతో రచన చేసినా, ఇటువంటి విస్తీర్ణ జ్ఞానం లేకుండా రచయిత ఎట్లా ఉపదేశం చెయ్యగలుగుతాడు? కాకపోతే పూర్వులు చేసి ఉండిన ఉపదేశాలనే మళ్లీ తను చెయ్యాలి ఏవైనా కొత్త సమస్యలూ, వాటిని పరిష్కరించుకునే కొత్త సూత్రాలూ ఉండకపోతే స్వతంత్ర రచనకు అవకాశం ఎక్కడ? ఈనాటి జీవితంలో కలిగే సమస్యలను గురించి రాయటానికి ఈనాటి జీవితాన్ని "ఇన్‌ఫ్లూయన్సు" చేస్తున్న రాజకీయాలను గురించీ, ఆర్థిక స్థితిని గురించీ, ప్రపంచ నాగరికతను గురించీ ఏమాత్రమైనా తెలిసి ఉండాలి

మనను వేధించుతున్న సమస్యలలో నూటికి తొంభై తొమ్మిదిపాళ్ళు ఆర్థిక దుస్థితి వల్ల కలిగేవేనని నూటికి తొంభైతొమ్మిదిమంది రచయితలకు తెలియదు అందువల్ల ఇప్పటి సాహిత్యం నిందపాలవుతున్నది అమాయకులూ, అసమర్థులూ అయిన మగవాళ్ళూ, భాగ్యవంతులూ, మూఢులూను ఈనాడు మన జీవితాన్ని బాగు చెయ్యటానికి గాని పాడు చెయ్యటానికి గాని వ్యక్తులు చాలరు (హిట్లరు ముస్సోలినీలు కూడా ఈ సూత్రాన్ని తల్లకిందు చెయ్యలేరు ) ఒకప్పుడు రాజులమీదా మతాధిపతులమీదా అపారమైన బాధ్యత ఉండేదేమో కాని ఈనాడు మనకు ప్రాప్తించే దౌర్భాగ్యానికి కారణభూతాలైనవి అజ్ఞానమూ, అసంస్కారమూను సాహిత్యంగాని మరొకటి గాని సంస్కరించాలిసింది వాటినే

నాకిక్కడ ఉన్న కొద్ది అవకాశంలో పైన చెప్పిన సత్యాన్ని నిరూపించటం సాధ్యం కాదు కాని ఎవరికివారు ఆలోచించేటందుకు కొన్ని సూచనలు చేస్తాను అనేక బాధలకు కారణభూతమైన డబ్బును తీసుకుందాం ఒకప్పుడు డబ్బూ దానితో కొనసాగిన సంపదా ఒక్క క్షత్రియుల స్వాధీనంలోనే ఉండేది దేశ సౌభాగ్యం వారి మీద ఆధారపడి ఉండడం వల్ల దారిద్ర్యం కలిగినప్పుడు వారు దానికి బాధ్యులై ఉండే వారు వారు తమ శక్తిని దుర్వినియోగపరచకుండా ఉద్బోధించటం సాహిత్యానికి సాధ్యమయి ఉండేది

ఈనాడు మనకు కావలిసిన సంపదలు చైనాలో, జపానులో, ఇంగ్లండులో, అమెరికాలో, జర్మనీలో, ఫ్రాన్సులో, స్పెయినులో, ఇటలీలో, నార్వేలో, స్వీడనులో - ప్రపంచమంతాటా ఉన్నవి మన దారిద్ర్యానికి ఎవరిది జవాబుదారీ? భాగ్యవంతు లంటాం! భాగ్యవంతులెవరని? వీధిలో బిచ్చమెత్తుకునే వాడి దగ్గిరనుంచి ''మల్టీమిలీనియరు'' వరకూ అన్ని తెగలవారూ ఉన్నారు ఈ దారిద్ర్యం కొందరు భాగ్యవంతుల మూలకంగా రాలేదు ప్రపంచంలో ఉన్న డబ్బంతా అందరికీ సమంగా పంచేస్తే ప్రపంచ సంపద అభివృద్ధి అవుతుందనే నమ్మకం లేదు ఈ దారిద్ర్యానికి కారణం స్వార్థపరత - ఎవడి జీవితం వాడే జీవించగలడనే అపోహ - సంపదను స్వంతం చేసుకుందామనే ప్రయత్నం ప్రపంచం నిండా నిరుద్యోగులున్నారు సృష్టి నిండా వస్తు సముదాయం ఉంది ఆ వస్తుసముదాయాన్ని ఈ నిరుద్యోగులు సంపదగా మార్చటానికి మానవుడి స్వార్థబుద్ధి అడ్డం వస్తున్నది లోకంలో ఉన్న వస్తు సముదాయాన్నంతా కొందరు వ్యక్తులు స్వంతం చేసుకుని కూర్చున్నారు దాన్ని సంపదగా మార్చటం వల్ల లాభం ఉంటేనే మనకు సంపద సంప్రాప్తమవుతుంది లేకపోతే లేదు ప్రపంచంలో ఉన్నవారందరికి సరిపడ్డ ధాన్యం లేదని స్పష్టమవుతున్నది లేకపోతే కొందరు తిండికి మాడుతున్న వారుండరు ధాన్యమంటూ ఉంటే దాన్ని ఊరికేనైనా ఇచ్చి వెయ్యవలసిందే గాని వృథా చేసిన ప్రయోజనం లేదు ఈ పరిస్థితులలో ఏ భూస్వామి అయినా సరే ధాన్యం మీద వచ్చే లాభం కంటె పొగాకు మీద నమ్మకంగా ఎక్కువ లాభం వచ్చేటట్టయితే భూమిలో ధాన్యం నాటటానికి బదులు పొగాకు నాటేస్తాడు! ధాన్యం మాదిరిగా శీఘ్రకాలంలో ఖర్చు అయ్యే సంపద విషయంలోనే కాక బహుకాలం వాడదగిన సంపద ఉన్న చోట కూడా స్వార్థబుద్ధి దారిద్ర్యహేతువవుతున్నది నా దగ్గిర ఒక మోటారు కారు ఉంటుంది దాన్ని నేను రోజుకు రెండు గంటలు మాత్రమే ఉపయోగిస్తాను మిగతా ఇరవై రెండుగంటలూ ''గరాజు''లో పెట్టి తాళం వేస్తాను కాని మరొకడికి ఇవ్వను! ఆ మోటారు కారును నాబోటి వాళ్ళు ఇంకా పదకొండుగురు వాడటానికి

సానుకాశం ఉంది. ఒక పంక పరిశ్రమలు పని చెయ్యవలసినంత జోరుగా పని చెయ్యటం లేదు, మరొకపంక ఆ పరిశ్రమిల ఫలితాన్ని పొందలేక జనం మాడుతున్నారు. ఎక్కడైనా ఒక మిల్లుగాని, ఫ్యాక్టరీ గాని స్వార్థం కారణంగా మూయటం తటస్థించినప్పుడు అందులో పని చేసేవాళ్ళు దిక్కు లేని వాళ్ళవుతున్నారు.

ఇదంతా స్వార్థ బుద్ధి వల్ల కలిగిన దారిద్ర్యం. కాని స్వార్థబుద్ధి భాగ్యవంతులను మాత్రమే ఆశ్రయించి ఉండలేదు. పరమ దరిద్రుడూ స్వార్థంలోనే జీవిస్తున్నాడు. ప్రపంచ సంపదను అభివృద్ధి చేసే ప్రయత్నములో ఎవడూ పని చెయ్యడం లేదు. గంజాయీ, నల్లమందూ, సారా మొదలైనవి ప్రపంచసంపదను ఎంతవరకు అభివృద్ధి చేస్తున్నవో నిర్ణయించటం కష్టం. ఇంతకంటె కూడా హేయములైన వస్తువులు ప్రపంచములో తయారవుతూనే ఉన్నై. కాని పొలాలు పండించే వాళ్లు ఏ ఉద్దేశంతో పని చేస్తున్నారో ఈ హేయవస్తువులను తయారుచేసే వాళ్లు కూడా ఆ ఉద్దేశంతోనే చేస్తున్నారు - నాలుగుడబ్బుల కోసం.

ప్రపంచములో ఇటువంటి స్వార్థబుద్ధిని నిర్మూలం చెయ్యటం వల్ల ఏమి లాభం కలుగుతుందో ఆలోచించి తెలుసుకోవచ్చును. ఇప్పుడు మారణయంత్రాలు తయారుచెయ్యటానికీ, భాగ్యవంతులను సంరక్షించటానికీ దేశాలను సంరక్షించటానికీ మీదు కట్టి ఉన్న అనేక కోట్ల సైనికులూ, పోలీసులూ, పనివాళ్ళూ విడుదల అవుతారు. వీరంతా ప్రపంచసంపదను అభివృద్ధి చెయ్యటానికి పూనుకుంటే అందరికీ గుడ్డ ఉంది. అందరికి ఇళ్లున్నై, నాగరికతను అనుభవించే సదుపాయం అందరికీ ఉంది. వస్తువులను స్వంతం చేసుకోవలిసిన దుర్గతీ, వాటికి కాపలా కాయవలసిన దుర్గతీ ఎవరికీ లేదు. ప్రపంచ సంపదను వృద్ధి చెయ్యడంలో చెయ్యి చేసుకోవటానికి ఎవరికీ అభ్యంతరం లేదు. దొంగతనాలు చెయ్యవలసిన ఆవశ్యకత ఎవరికీ లేదు. యంత్రాలు స్వేచ్ఛగా అభివృద్ధి కావటానికి ఏ అభ్యంతరమూ ఉండదు. మరీ కష్టసాధ్యమైనపనులన్నీ యంత్రాల చేతనే చేయించుకోవచ్చును. ఈ పరిస్థితులలో ఇప్పటి కోటీశ్వరుడికంటె కూడా రెండింతలు సుఖం ప్రతి మానవుడూ అనుభవించవచ్చును. లోకాన్ని స్వర్గం చెయ్యవచ్చును. ఈ స్వర్గానికీ మన దరిద్రానికి అడ్డంగా ఉన్నది స్వార్థబుద్ధి, అసూయ, అసంస్కారం. వీటిని నిర్మూలించదగినది సాహిత్యం. ఈనాడు ప్రపంచంలో కొద్దిమంది ధనికులు మాత్రమే ఉండి, మిగిలిన వారు దరిద్రులుగా ఉంటూ, ధనికులు తమ సంపదను యథేచ్ఛగా అనుభవించగలగటమూ, దరిద్రుల దారిద్ర్యం ధనికులను అంటకుండా ఉండటమూ అసంభవం. దారిద్ర్యం పండి బద్దలయినప్పుడు విప్లవాలూ, అంటువ్యాధులూ బయలుదేరి దరిద్రులనూ భాగ్యవంతులను కూడా ధ్వంసం చేస్తున్నై. అసంస్కారం పండి బద్దలయినప్పుడు యుద్ధాలు సంప్రాప్తమై ఉన్నవాడనీ లేనివాడనీ విచక్షణ లేకుండా అందరినీ నాశనం చేస్తున్నై.

వ్యక్తులు భాగ్యం అనుభవించగలగటమూ దారిద్ర్యాన్ని జయించటమూ ఈనాడు ఎంత అసాధ్యమో, వ్యక్తులు, కామ, క్రోధ, లోభ, మోహాదులను జయించటం కూడా అంతే సాధ్యం. సామ్యవాదంలో సరికుదిరిన ధనికుడు ఉత్సాహంకొద్దీ తన డబ్బు బీదలకు పంచి ఏం చేస్తాడు? దరిద్రుల సంఖ్యలో తను కూడా కలుస్తాడు! ఈ ప్రపంచంలో ఒక వ్యక్తి స్వార్థ బుద్ధిని జయించి ఏమవుతాడు? తక్షణం అడుగంటుతాడు! అందుచేత ఈనాడు మన

ప్రపంచంలో ఆధ్యాత్మిక చింతనకు కూడా ఆస్కారం లేదు ప్రతి క్షణమూ పరానికి ఇహం అడ్డం వస్తూ ఉంటుంది

మన జీవితాన్ని అనుక్షణమూ ''యిన్‌ఫ్లూయన్స్'' చేస్తున్న ఆర్థికాది చట్టాలను గురించి మన ఇప్పటి రచయితలు రాస్తున్న అర్థం లేని రాతలు చాలా ఉన్నై వ్యక్తులను గురించి వారి పరస్పర సంబంధాలను గురించీ రాసినప్పుడే మనవాళ్ళు సత్యమైన కల్పన చెయ్యలేకుండా ఉన్నారు సంఘం మీద అభిప్రాయాలు ప్రకటించేటప్పుడు మన రచయితలు మరింత పొరపాటుగా రాయటానికి అవకాశం ఉంటున్నది ఒక ఊరి వారంతా బీదలు కావటం చేత వారు ఒకానొక దేవతకు గుడి ఒకటి కట్టించలేకపోయినట్టు మనవారొకరు కథ చెబుతున్నారు!

సాహిత్యంలో ''పేట్రియాటిజం'' బొత్తిగా కుదరదు మన కోసం మన సాహిత్యం సృజించుకునే రోజులు కూడా పోతున్నై భాషలు ఏర్పాటు చేసిన హద్దులూ, ప్రభుత్వాలు ఏర్పరచిన సరిహద్దులూ దాటిపోతున్నది సాహిత్యం కొద్ది కాలంలో ప్రపంచ సాహిత్యం జాస్తి కాబోతున్నది మనమింకా మన పూర్వులను శ్లాఘించటానికీ, మన కులాలను సమర్థించుకోటానికీ, మన మతాన్ని ప్రచారం చెయ్యటానికీ, మన దేశభక్తి ప్రకటించటానికీ రచన చెయ్యటం మానుకోవాలి

సాహిత్యం జీవితాన్ని విమర్శించగలదు, గనుక అది జీవితంకంటె ఒక మెట్టు పైగా ఉంటుంది నిత్యజీవితంలో మనకు ఆంధ్ర రాష్ట్రం కోసం పోరాడటమూ, భారతస్వాతంత్ర్యం కోసం అజిటేట్ చెయ్యటమూ తప్పదు అరవలు తమ స్వార్థాన్ని త్యజించే వరకూ ఆంగ్లేయులు తమ స్వార్థాన్ని త్యజించే వరకూ కాని మన సాహిత్యానికి కూడా ఆ పాట్లు పట్టనవసరం లేదు ప్రయత్నాన్నంతా ఒకటి చెయ్యటానికి ఇంకేదీ ఉపకరించకపోతే కనీసం సాహిత్యమైనా ఉపకరిస్తుంది మనమీద పడి తిని మేస్తున్న అరవలనూ, ఆంగ్లేయులనూ ఇంకొక విధంగా కాకపోతే మన సాహిత్యం ద్వారా నైనా సంస్కరించగలుగుతామేమో!

*ప్రతిభ సంపుటి 3, సంచిక 1, జూలై 1938*

## 2. నిజమైన సాహిత్యం

దేనికైతే అలవాటైపోతామో దాన్ని మనం విమర్శించలేం, దాన్నుంచి మనం రసగ్రహణకూడా చెయ్యలేం అందుచేతే ఆచారాలను మార్చుతూ ఉండకపోతే, జీవితం నిస్సారమైపోతుంది

అన్ని విషయాలనూ అనుసరించి ఉన్నట్టే రచనను అనుసరించికూడా కొన్ని ఆచార సంప్రదాయాలున్నై వాటికి మనం అలవాటుపడి పోయినాం వాటికి భిన్నత్వం వాటిల్లితే మనలో చైతన్యం కలుగుతుందేమోగాని, అవి సక్రమంగా ఉన్నంతకాలమూ వాటిని గురించి మనం నిర్లిప్తంగా ఉంటాం వాటిలో అనుమానాస్పదమైన విలువలేమైనా ఉంటే వాటిని మనం గుర్తించం, అందులో హాస్యాస్పదమైన అంశాలుంటే వాటిని చూసి నవ్వం, శోచనీయాంశాలుంటే చింతించం, వాటిని పూర్తిగా మార్చవలసిన ఆవశ్యకత ఏకారణంవల్లనైనా ఏర్పడితే అది కూడా సులభంగా గ్రహించలేం అందుచేతే ఆచారాలు మార్చటానికెవరైనా ప్రయత్నించినప్పుడల్లా మనం అంతగా ఆందోళన చేస్తాం

రచన పురస్కరించుకుని ఉంటూ ఉన్న ఆచారాలు కాస్సేపు మరిచిపోయి, ఈ పత్రిక చదివేనేనిక్కడ చెప్పే అంశాలను శాస్త్రీయంగా విమర్శించటానికి ఒప్పుకుంటే, కొన్నిపాత విషయాలను కొత్త దృష్టితో చూడటానికి ప్రయత్నిస్తాను ఇందుకుగాను ఒక తెలుగు సాహిత్యంగాని ప్రాద్దేశాల సాహిత్యంగాని తీసుకోవటం నాకిష్టంలేదు, అల్ప సంఖ్యాకులు మాత్రమే ఆమోదించే కొన్ని ''ఇజములు'' మాత్రం వదిలేసి, మిగతా ప్రపంచం యావత్తూ ఏదైతే సాహిత్యంకింద భావిస్తున్నదో అదే తీసుకుంటాను

సాహిత్యం గురించి ప్రప్రథమంలో గమనించవలసిన అంశమేమంటే దాన్ని ఎవరో ఒకరు రాయాలి రాయటం ప్రధానం మాట్లాడితేనూ, సౌంజ్ఞలు చేస్తేనూ సాహిత్యం కాదు, రాయాలి ప్రతిభాషలోనూ పరిమితంగా కొన్ని అక్షరాలున్నై వాటి సహాయంతో రాతగాడు తను చెప్పదలచిందంతా లిఖించాలి నోటపట్టినన్ని శబ్దాలు ఎట్లాగూ ఏ భాషలోనూ లేవు నోటితో ఉచ్చరించే అనేక అచ్చులకూ, హల్లులకూ ప్రయోజనం లేదని ఎవరూ అనలేరు లేకపోతే వాటిని మనం వాడటమే జరగదు పైగా ఉచ్చరించటానికి కాలపరిమాణం ఒకటి ఆధారభూతమవుతుంది దీర్ఘాక్షరాన్ని మనం ఎన్నిమాత్రలుగానైనా ఉచ్చరించటం సాధ్యమవుతుంది రెండు మాటలుగా ఉచ్చరించే దీర్ఘాక్షరాన్ని నాలుగు మాత్రలకాలం తీసుకుని ఉచ్చరించటంలో, మనం ప్రయత్నపూర్వకంగానో అప్రయత్నంగానో ఒక భావాన్నిప్రకటిస్తాం ఇదంతా రచనలో సాధ్యం కాదు అచ్చుల, హల్లులలోనూ దీర్ఘాక్షరాల కాలపరిమితి లోనూ రచన వాక్కుకు వెనుకపడిపోయింది అంటే సాహిత్యం జీవితానికి వెనకపడింది అయితే సాహిత్యాన్ని ఉద్ధరించే పెద్దలు ఈ తేడావల్ల అట్టే ఇబ్బంది లేదన్నట్టు నటించారు సాహిత్యం ఆధారంగానే గణించడింది

రచన సాహిత్యానికి ప్రధానాంశంగా పరిణమించటం వల్ల మాట్లాడటానికి అర్హత లేనివారు సాహిత్య రచన చెయ్యటానికి చాలివచ్చారు రాత మాటకన్న సులభమైనపని అయింది రాతలోనున్న సులువులు (1) ఆలోచన వచ్చి నప్పుడే రాయవచ్చును, (2) రాసింది ఉపసంహరించుకోవచ్చు (3) రాసింది మార్చుకోవచ్చును ఈ కారణాలవల్ల రాత మాటకన్న ఘనమైనదనుకోవటం ఆచారంగా ఉంది ఆచారాలను మరిచిపొమ్మని పరితలను నేను మొదటే వేడుకున్నాను మాట్లాడేవాడు ఆలోచించేటందుకు లేనివ్యవధి రాసేవాడికుంది ఈ వ్యవధి వల్ల రాసేవాడు పొందే ప్రయోజనం ఏమిటి? ఆ ప్రయత్నంగా తన తలలోకివచ్చే ఆలోచనను సంస్కరించుకోవటం ఎందుకోసం సంస్కరించుకుంటాడు? దానివల్ల మరొకడికి తనమీద అగౌరవమూ, ఒక ఇష్టంలేని విషయాన్ని తెలుసుకున్న బాధా, సాంఘిక రాజకీయ నైతిక న్యాయచట్టాలకు తన ఆలోచన వల్ల ఎటువంటి ప్రమాదమూకలగకుండా ఉండగలందులకు!

కాని మనం నిజమైన సాహిత్యంగా భావించేదానిలో ఈ పనులు చెయ్యనిదేదైనా ఉందా - కొంతవరకైనా? తలలోకి అప్రయత్నంగా వచ్చే అలోచనలకున్న ఆలోచించిన మీదట కలిగే అభిప్రాయాలలో ఎక్కువసత్యం ఉందంటే ఎవ్వరైనా నమ్ముతారా? లిఖితపూర్వకమైన సాహిత్యమే ఎంతో ఆరాధ్యమని మనం భావిస్తుంటే, నోటిమాటల సాహిత్యం ఇంకెంత ఆరాధ్యమై ఉండును!

ఆలోచించటంవల్ల ఇంకో ప్రయోజనం ఉన్నదని నమ్మటం ఆచారంగా ఉంది శిల్పం బాగుంటుంది దీన్నికూడా విమర్శించాం సాహిత్య శిల్పంలో ముఖ్యమైనవి వ్యాకరణమూ,

శైలీ (అలంకారాదులకు ఈనాటి సామాన్యసాహిత్యంలో అంతముఖ్యమైన స్థానంలేదు) వ్యాకరణయుక్తమైన వాక్యంలో భావసమగ్రత ఉంటుందని లోకాభిప్రాయం నిజమే సమగ్రమైన భావం వ్యాకరణం తెలియకుండా చెప్పినా వ్యాకరణయుక్తంగానే ఉంటుంది ఆ కారణం వల్లనే సాహిత్యానికి వ్యాకరణం అనవసరం కాదా? అసమగ్రంగా నోటివెంట రాదగినభావాన్ని కాగితంమీద కష్టపడి సమగ్రభావం చెయ్యటంవల్ల ప్రయోజనమేమిటి? తెచ్చి పెట్టిన సమగ్రత అసత్యంకాదా? కాదని ఎవరూ అనలేరు శైలికూడా అటువంటిదే

వ్యాకరణాన్ని విశ్వసించేవారికి చెడిన వ్యాకరణంలో ఉండే భావ ప్రకటన తెలియదు అసమగ్రభావాలలో ఉన్నపదును ఈనాడు మనం గ్రహించటం బహుకష్టం నోరు జారటం అనేది మనకు ఎప్పుడూ నవ్వే తెప్పిస్తుంది నోరుజారి వచ్చిన ఒకమాట ఒక దివ్యవిషాదగీతం కావచ్చును అది మనం గ్రహించలేం!

ఇక అలంకారాలు కూడా ఏదో భావలోపాల్ని కప్పిపుచ్చేవే ఒక భవనం ఆకాశాన్నంటుతున్నదంటే, దాన్ని గురించి రాసినవాడికి గాని, చదివినవాడికిగాని తెలిసేదేమీ లేదు ఉత్ప్రేక్ష అంటే అబద్ధానికి పర్యాయపదమన్నమాట ఉపమ కూడా చెప్పే సత్యంలో నీళ్లు కలుపుతుంది (రొట్టెలు తినటానికి బయలుదేరిన లోభులు ఉపమాలకారం ఆధారం చేసుకుని ఇంటికొచ్చి మంచినీళ్ళు తాగినకథ మన మంతా చదివినదే ) అసలు అలంకారాలను అతిగా ప్రేమించేవాడిలో సత్య ప్రియత్వం బహుతక్కువని కనిపిస్తూనే ఉంటుంది మానవజీవితంలో ఏ ఒక ఉద్యమమూ, ఏక మతమూనోటిమాటలేకుండా ప్రచారం కాలేదు ఆధునిక ఉద్యమాల్లో రాత నోటిమాటకు సహాయభూతంగా ఉండినప్పటికీ, నోటిమాటకు ఎంతో సన్నిహితంగా ఉండి మామూలు సాహిత్యానికి ఏమాత్రమో భిన్నంగానే ఉంటూవచ్చింది అయినప్పటికీ మనం సాహిత్యంగా భావించేది ఆరాధ్యంగానే ఉంటూన్నది

ఇన్ని విధాల సత్యానికీ, జీవితానికీ దూరమైపోయిన రచనకు ఆధారం ఎట్లా లభించిందీ? అది మనం ఊహించవలసిందే నిష్కల్మషమైన మనస్సుతో ఆలోచిస్తే, అసలే చచ్చి ఉన్న రచనని అనేక నిర్బంధాలు పెట్టి మరింత నిర్వీర్యం చెయ్యటానికి ఎన్నో ప్రయత్నాలు జరిగినట్టు అనుమానం తగులుతుంది పద్యాలూ, వాటి లక్షణాలూ, గణాలూ, యతులూ, ప్రాసలూ, మళ్లీ వీట్లల్లో జాతిభేదాలూ - ఈ ప్రతిబంధకాలన్నీ ఏమిటి? ఇట్లా భాషను దిగ్బంధనచేసి సాహిత్యం ద్వారా ఏ ప్రయోజనం సాధింతామని ప్రయత్నించారో ఊహించలేం, ఏదో అపకారం జరగకుండా చూసుకున్నారేమోననే అనుమానం కలుగుతుంది ఎప్పుడన్నా ప్రమాదం కలిగించే మనిషినే జైల్లో తోస్తారు ఇన్ని ఇబ్బందులూ సాహిత్య భాషకే ఏయుగంలోనైనా ఏ జాతిలోనైనా మాట్లాడేభాషకు హద్దులేదు ఎక్కడిదాకానో పోకుండా మన తెలుగుభాషే తీసుకుంటే తాము స్వయంగా మాట్లాడే భాషలోరాయమంటే, ఇప్పటి ఎందరో నిలువునా కంపిస్తారు వాళ్లని భయపెట్టేదేమిటి? ఇందులో కొందరు వాడుకభాష ఉపయోగించక పోవటానికి ఎన్నో కారణాలు చెబుతారు, ఒక్కటీ సాహిత్య పరంగా ఉండదు ఒకటి నిజం నోటితోమాట్లాడిందే సాహిత్యం, రాసినరాతకు విలువలేదనేది ఆచారంగా వచ్చి ఉంటే మనం ''గ్రాంధికం'' కాని తత్తుల్యం మరోటి మాట్లాడుతూ ఉండేవాళ్ళం

మానవుడు సాహిత్యాన్ని పెంచటంలో ప్రదర్శించే బుద్ధే ఆదరించటంలో కూడా ప్రదర్శిస్తున్నాడు ఈ కిందివిషయాలు గమనించండి సాహిత్య ప్రయోజనంకంటే సాహిత్య కళకు ప్రాధాన్యత జాస్తి

ఒక గ్రంథం వల్ల మొదట్లో ఏదైనా ప్రయోజనం ఉండి ఉండినా, ఆ ప్రయోజనం అయిపోయిన తర్వాతగాని దాన్ని శాశ్వత సాహిత్యంగా - సారస్వతంగా - స్వీకరించడు

తాత్కాలిక సాహిత్యమైన పత్రికా సాహిత్యంలోమంచి చెడ్డల నిర్ణయానికి కూడా ఒక విధమైన ''భయమే'' ఆధారభూత మవుతుంది వ్యంగ్యరచనలూ, విమర్శలూ, ఇతర ''తీవ్ర'' రచనలూ మొదలైన వాటిల్లో ఉండే ధైర్యం చూసి భ్రమ పడవచ్చు అది వట్టి మేకపోతు గాంభీర్యం తన ''తీవ్ర'' రచనను ఆమోదించేవాళ్ళు అసంఖ్యాకులున్నారని నమ్మకపోతే, ఎవరూ తీవ్రరచనలు రాయరు పైగా ఈ పత్రికా సాహిత్యం పుండును పైపైన మాత్రమే కెలుకుతుంది సోషలిస్టు సాహిత్యం పెట్టుబడిదారీని తిట్టుతుంది, పెట్టుబడిదారీ వల్ల ప్రపంచానికి లాభమే లేనట్టు పెట్టుబడిదారీ సాహిత్యం సోషలిస్టులను తిట్టుతుంది, నైతికంగా ప్రపంచపు సంపద యావత్తూ ప్రపంచవాసులది కానట్టు! నిజం తరచటం - పాతాళాన దాగి ఉన్న నిజంతాలూకు తల్లివేరు పెకలించటం - పత్రికా సాహిత్యం యొక్క ఆశయం కాదు

నిష్పాక్షికంగా ఆలోచిస్తే గ్రామఫోను రికార్డురాగానే పుస్తకాలన్నీ ఎందుకంతం కాలేదో ఊహించటం అసంభవం సినిమాలూ, టాకీలూ వచ్చిన తరువాత అయినా పుస్తకసాహిత్యం ఎందుకు అవసానదశకు రాలేదూ? అదికూడా ఊహించలేం

సాహిత్యాన్ని మనం పనిపెట్టుకుని నిర్వీర్యంగా ఉంచుతున్నామనేదాన్ని గురించి ఏమైనా అనుమానం ఉంటే, ఒకటి ఆలోచించండి రాసిన సాహిత్యం కాక ఇంకే విధమైనా ఊహించండి అది రాసినసాహిత్యమంతగా నిగ్రహానికి లోనుకాదు మనం అందుచేత ఆ సాహిత్యాన్ని అంతగా ఆరాధించం

సాహిత్యంవల్ల నిజంగా జీవితానికి ఏమన్నా అభివృద్ధి కలుగుతూ వచ్చిందని ఎవరికైనా అనుమానం ఉంటే ఏనాటి సాహిత్యాన్నయినా ఆనాటి వ్యక్తిభావాలతో పోల్చి చూడండి ఎప్పుడూ సాహిత్యం ఒక అరశతాబ్దం వెనకే ఉంటున్నది జీవితం సాహిత్యాన్ని ఈడ్చుకొస్తున్నది గాని సాహిత్యం జీవితాన్ని ఎన్నడూ ముందుకీడ్చుకు పోలేదు జీవితాన్ని ముందుకులాగటానికి ప్రయత్నించిన సాహిత్యాన్ని ఎప్పుడూ అవమానించాడు మానవుడు!

సాహిత్యంలో నవరసాలూ స్థానం సంపాదించుకున్నవి జనాన్ని మభ్యపెట్టటానికి నవ్వొచ్చేదీ, ఏడుపొచ్చే శృంగార సంబంధమైనదీ అయితే మనుష్యులు ఆస్వాదిస్తారు ఈ రసాలు పరితలకు మాదకద్రవ్యాలు అవి పరమార్థాలు వీటివల్ల ప్రయోజనం ఏమిటని ఎవరడుగుతారు? వాటివల్ల అంత మానసికానందం కలుగుతూంటే వాటినెవరు విమర్శిస్తారు?

ఒకటే ప్రశ్న నిజమైన సాహిత్యం ఎప్పటికైనా మనవజీవితంలో వస్తే, ఆకారంలేని మానవభావానికి అంగం లభిస్తే డిక్కురీలకింద పడి నలిగి చచ్చిపోతున్న వాస్తవికతకు విశ్వరూపంలభిస్తే ఆ సాహిత్యం ఈ నాటి సాహిత్యానికి ఎంత సన్నిహితంగా ఉంటుంది?

ఈనాటి సాహిత్య ప్రియులం చెప్పలేం!

*ముద్రణ ఆంధ్రపత్రిక, దినపత్రిక, 22-1-1941*

# 3. ఏది హాస్యం

మునిమాణిక్యం నవ్వుపుట్టించేది ప్రతీదీ హాస్యం కాదు వెక్కిరించి, చక్కిలిగింత పెట్టి నవ్వించవచ్చు అదంతా హాస్యమా? ఏ రచన చదివినపుడు చిత్త వృత్తి ఆనందమయమై వస్తుందో అదే హాస్యరచన

కొడవటిగంటి నేనుమునిమాణిక్యం వారితో ఏకీభవిస్తున్నాను

శ్రీపాద హాస్యరచన అయినంతమాత్రాన అందరికీ నవ్వు పుట్టించక పోవచ్చుననీ, ఆ నవ్వు పుట్టడం పుట్టకపోవడం ఆస్వాదకుల సంస్కారంపై ఆధారపడి వుంటుందనీ అన్నారు అయితే హాస్యంలో తరగతులున్నాయా?

కొడవటిగంటి హాస్యాన్ని ఈ మూడు తరగతులుగా విభజించవచ్చు ననుకుంటాను (1) బుద్ధిని రంజింపజేసేది (2) హృదయాన్ని రంజింపజేసేది, (3) చెవికింపయినవి వీటికి ఉదాహరణలిస్తాను

మొదటి ప్రపంచ సంగ్రామానంతరం జర్మనీవారిమీద ఇతర దేశాల వారు అప్పు విధించారు ఈ బాకీ తీర్చటానికి జర్మనీకి డబ్బులేకపోయింది ఆ సమయంలో ఈ అప్పుతీర్చే నిమిత్తమై అప్పిస్తామన్నారట ఇది బెర్నార్డుషా చెప్పిన ముక్క ఇది మనని నవ్వించటమేగాక అంతర్జాతీయ ఆర్థిక విధానాలుగురించి వైజ్ఞానికంగా మనకొక మంచి అనుభవం కూడానూ

అనటోల్ ఫ్రాంసు మరోవిషయం చెప్పాడు ఫ్రెంచి విప్లవానంతరం ఫ్రాన్సులో బీదలకూ భాగ్యవంతులకూ ఒకే న్యాయచట్టం ఏర్పాటయిందట అదేమంటే ఎవరూ అడుక్కోరాదు ఎవరూ వంతెనలకింద పడుకొని నిద్రపోరాదు ఎవరూ తిండి దొంగిలించరాదు ఈసంగతి మనకు నవ్వు తెప్పించినా, ఈ కృత్రిమ న్యాయంచూస్తే మన హృదయం కదిలిపోతుంది చెవిని కదిలించే ఉదాహరణ మునిమాణిక్యంవారిస్తారు

ఆధునిక వాఙ్మయంలో చమత్కారం తక్కువ స్వారస్యం ఎక్కువా ఉండడానికి మూడు కారణాలున్నట్లు నాకు తోస్తుంది

1 భాషాపాండిత్యానికీనాడు ప్రాముఖ్యం తగ్గడం, 2 పాశ్చాత్య సంస్కృతి మనలో హెచ్చుకావడం, 3 జీవితం గురించిన వైజ్ఞానిక దృష్టి సంఘంలో పెరగటమూనూ

ఒకప్పుడు సమాజంలో భాషాపాండిత్యానికీ, వ్యక్తిగతమైన ఘనతకూ ప్రాముఖ్యం ఉండేది అటువంటి పాండిత్యాన్ని ఆశ్రయించుకుని చమత్కారం పెరిగింది చమత్కారంలో, సాంఘిక ప్రయోజనం తక్కువా చమత్కారం చేసేవాడి చతురత ఎక్కువానూ రానురాను కళలకు సాంఘిక ప్రయోజనం హెచ్చి, చమత్కారానికన్న స్వారస్యానికే విలువ హెచ్చింది జీవితం సర్వజనాశ్రయం అయినకొద్దీ కలిగిన మార్పులలో ఇదొకటి

హాస్య రసంలాగా మిగతా రసాలు శ్రోతను బాహ్య జగత్తునుండి పూర్తిగా వేరు చెయ్యలేవు అందుచేత, శృంగారం గాని, వీరంగాని, భీభత్సంగాని, మరే యితర రసంకాని ఇవ్వలేని పరిపూర్ణమైన ఆనందాన్ని హాస్యరసం ఇవ్వగలుగుతుంది ఈ కారణం చేత, హాస్యంద్వారా సిద్ధించే అనుభూతి సమగ్రమైనది

ఉత్తమమైన ప్రయోజనంలేందే, ఉత్తమమైన ఆనందంరాదు ఉత్తమమైన ఆనందం కలిగితేగాని, ఉత్తమమైన హాస్యంకాదు నవ్వగానే ఆనందం రాదు ఆనందం బుద్ధివికాసం ద్వారా మాత్రమే కలుగుతుంది మనం సాంఘిక జీవులంకనక వ్యక్తుల బుద్ధి వికాసమే కళయొక్క సాంఘిక ప్రయోజనం, హాస్యం కళ విషయంలోనూ ఇంతే

హాస్య రచయితకి తగిన ఆదరణ ఉందా అంటే -

కొంత వరకు ఉన్నదనే నా అభిప్రాయం కన్యాశుల్కాన్ని ఆరాధించని తెలుగు వాళ్ళరుదు హాస్యం తెలీని వాళ్ళు సహితం కన్యాశుల్కంని మెచ్చుకోవటం రివాజయింది ఇవాళ ఇక్కడ చేరిన వారిలోనే తీసుకున్నప్పటికీ, భమిడిపాటివారూ, మల్లాదివారూ, మొక్కపాటివారూ, ఎమునిమాణిక్యంవారూ అమితంగా ప్రజలప్రేమకు గురి అయినారు దేశంలో వున్నగొప్పకవులకూ, నటులకూ, తదితర కళాకారులకూ జరిగినంత ఆరాధన వీరిక్కూడా విధిగా జరుగుతున్నది అయినా హాస్యానికుండదగిన ఆదరంలేదూ అని అంటే, ఈ లోపం ఇతర కళల విషయంలోనూ కనిపిస్తూనే ఉంది

*పండిత చర్చ*

*అధ్యక్షులు శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి*

*సదస్యులు సర్వశ్రీ విశ్వనాధ కవిరాజు, భమిడిపాటి కామేశ్వరరావు, మొక్కపాటి నరసింహశాస్త్రి, మునిమాణిక్యం, నరసింహారావు, కొడవటిగంటి కుటుంబరావు, జలసూత్రం రుక్మిణీనాధ శాస్త్రి*

*రేడియో ప్రసారితం*

*ముద్రణ నవోదయ, వారపత్రిక 13-10-1946,21-10-1946*

*పునర్ముద్రణ సాహిత్య ప్రయోజనం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, అక్టోబరు 1969*

# 4. మన సాహిత్యం

ఆత్మగౌరవం గల జాతి తన కళలను ఎంతో అభిమానంతో చూచుకుంటుంది మన కళలమీద మనకున్న అభిమానం చూస్తే మనకు ఆత్మగౌరవం ఏమీ లేదని స్పష్టమవుతుంది

ఎప్పుడన్నా ఒక కవిని ఏనుగెక్కి ఊరేగిస్తేనూ, ఒక కవికి శాలువలుగప్పి, నూటపదహార్లు సమర్పిస్తేనూ, జాతికి గల సాహిత్యాభిమానత్సృష్ణలు రుజువైపోవు నిజమైన సాహిత్యపరత గల జాతి సాహిత్య ప్రభావాన్ని స్పష్టం చేస్తుంది ఏజాతిమీద ఆజాతి యొక్క సాహిత్య ప్రభావం కనిపించదో ఆ జాతి భ్రష్టమైన జాతి

ఏ ఢిల్లీలోనో, బొంబాయిలోనో, లండనులోనో, వాషింగ్టన్‌లోనో, మాస్కోలోనో జరిగేవే రాజకీయాలనీ, మన రాష్ట్రములో జరిగేవి రాజకీయాలు కావనీ మన ప్రజలకు భ్రమ వున్నట్టే ఇతర చోట్ల సృష్టి అయేదే సాహిత్యమని కూడా ఒక భ్రమ లేకపోలేదు అందుకనే మనం రచయితల కీర్తిని బట్టి వారి రచనలలో గొప్పతనం చూస్తాంగాని రచనల గొప్పతనాన్ని బట్టి రచయితలకు గొప్పతనం ఇచ్చేశక్తి మనకు లేదు మన రచయితలలో ఎవరికైనా పై వాళ్ళు

కీర్తి అంటగట్టితే ఆ తరువాత మనం ఆ రచయితను కొనియాడతామనేది ఈనాడు అందరికీ తెలిసిన సంగతే ఇది కూడా మనకు నిజమైన సాహిత్య ప్రియత్వం లేదనే సంగతి రుజువు చేస్తుంది

ఇన్ని మాటలనుకున్న తరువాత? ''మనకి సాహిత్యం యెందుకు? అదిలేకపోతే జరగదా?'' అనే సందేహం వస్తుంది

సాహిత్యం లేకుండా తప్పక జరుగుతుంది - పశుపక్ష్యాదులకు జరిగినట్టే? మానవులకు జరిగినట్టు జరగదు పశుపక్ష్యాదులు జీవిస్తాయి అనుభవం పొందుతాయి కాని అవి జీవితాన్ని జీర్ణం జేసుకోవు అనుభవం నుంచి విజ్ఞానం సంపాయించలేవు జీవితాన్నీ, అనుభవాన్నీ జీర్ణించుకునే శక్తి అందరు మనుషులకూ వుంటుందనటం అతిశయోక్తి అవుతుంది అదీ కాక అటువంటి శక్తి అందరికీ వుంటే ఇక సాహిత్యమే అవసరం లేదు అందరికీ వుండే శక్తి యేమిటంటే సమర్థులైన వాళ్లు తమ అనుభవసారాన్ని సాహిత్య స్వరూపంలో అందిస్తే దాన్ని జీవితానికి వినియోగపరచుకొని తమ జీవితాలను వికాసవంతం చేసుకొనే శక్తి ఈ శక్తిని కూడా వినియోగించని జాతి భ్రష్టమైన జాతి

ప్రతి మనిషికీ స్వతస్సిద్ధంగా ఒకహృదయం వుంటుందనీ, ప్రేమానురాగాలు, రాగద్వేషాలు, సానుభూతి సమభావాలు సహజంగా పుట్టుకొస్తాయనీ అనుకోవటం వెర్రి భ్రమ, స్వార్థం ప్రేరేపించే కాంక్షలూ, వైముఖ్యాలు ఉచితమైన వ్యక్తులలో పంచుకున్నప్పుడే మానవ జీవితానికి వికాసం కలిగేది భార్యను చూసి ఎప్పుడన్నా కామోద్రేకం ప్రతి భర్తకూ కలుగుతుంది ఈ ఉద్రేకాన్నీ, దాని సంతృప్తి గల ఆనందాన్నీ తన భార్యకు పంచగలిగితేనే - అంటే ఆ భార్యను ప్రేమించగలిగితేనే - ఆ మొగుడి జీవితానికింత వికాసం వుంటుంది భార్యలనూ, పిల్లలనూ, స్నేహితులనూ ప్రేమించటం చాతగాని స్వభావం కలవారు ప్రపంచంలో లక్షోపలక్షలున్నారు సాంఘిక జీవితానికి మనుష్యులను బంధించే సూత్రం ఒకటుండాలి సాంఘిక భావాలను పంచుకొనే శక్తి అందరికీ స్వతస్సిద్ధంగా వస్తుందనేది కేవలమూ భ్రమ

భావసంపర్కంగల జాతిని జీవితం కదిపినప్పుడు గాలివల్ల సముద్రంలో కెరటాలు లేచినట్టుగా జాతి లేస్తుంది భావసంపర్కంలేని జాతిని జీవితం కదిపినప్పుడు సముద్రతీరాన ఇసుకరేణువులు కొట్టుకు పోయినట్టుగా వ్యక్తులు మాత్రమే ఆందోళనకు గురి అవుతారు మనకు మంచి సాహిత్యం ఉందా అనే మరొక ప్రశ్న ఈ సందర్భములో కలుగుతుంది మంచి సాహిత్యం ప్రతి జాతికీ ఉంటుంది దాన్ని ఇతర జాతుల సాహిత్యంతో, లేక ఇతర భాషల సాహిత్యంతో పోల్చి లాభంలేదు మంచో, చెడో, ఎక్కువో తక్కువో యెవరి సాహిత్యం వారికి ఉపయోగిస్తుంది గాని ఒక భాషలో సాహిత్యం మరొక భాష వారికి ఉపకరించదు

అయితే ఈ బాధ వెనక వున్నట్టుగా ఇప్పుడు లేదని ఒప్పుకుతీరాలి అంతర్జాతీయ రాజకీయ ప్రభావం జాతీయ జీవితం మీద ప్రబలంగా ఉంటున్నట్టే అంతర్జాతీయ సాహిత్య ప్రభావం కూడా వుంటున్నది పై భాషల సాహిత్యం సులువుగా తర్జుమా అవుతున్నది ''ఇట్లా జరగరాదు ఇతరుల సాహిత్యాలను మనం విషంతో సమానంగా చూడాలి '' అనే దురభిమానం వల్ల ఏమీ ప్రయోజనం వుండదు అట్లాగే ''ఇంత మంచి అంతర్జాతీయ సాహిత్యం

ఉండగా మనకు వేరే సాహిత్యం దేనికి?'' అనుకున్నాకూడా నష్టమే భాషలోనూ, జీవితంలోనూ, జాతీయత అనేది ప్రత్యేకంగా ఉన్నంతకాలమూ జాతీయ సాహిత్యం విలువ వుంటూనే ఉంటుంది

అయితే మన జాతిలో సాహిత్య పిపాస లోపించడానికి కారణమేమిటి? దేశంలో డబ్బులేకపోవటం ఒక కారణమని ఒక అభిప్రాయం ఉంది ఇది సరియైన అభిప్రాయం కాదు తెలుగు దేశంలో ఎంత హీనంగా చూసినా ప్రతినెలా రెండు లక్షల రూపాయలు విలువగల పత్రికలు అమ్ముడుపోతున్నాయి సినిమాల క్రింద అవుతున్న ఖర్చుకు అంతేలేదు

సాహిత్యం ఒక ఉద్యమం అది కొద్దిమందితో ఆరంభించినా సంఘానికి సంక్రమించాలి సంఘఛాయలు సాహిత్యంలోనూ, సాహిత్యం ఛాయలు సంఘంలోనూ అల్లుకుపోయిన రోజులుండేవి నలుగురు విద్యావంతులు చేరినప్పుడు సాహిత్య గోష్ఠి జరగటమూ, సాహిత్య గోష్ఠి జరిగే చోటకి నలుగురు చదువుకున్న వాళ్ళు చేరటమూ, బతికున్న రచయితలు రచించిన పద్యాలు ఆటవిడుపు పద్యాల కింద పంతుళ్లు పిల్లలకి నేర్పటమూ, బతికున్న కవులు రాసిన ప్రార్థనా పద్యాలు బళ్ళలో పిల్లలు చదవటమూ - ఇవన్నీ నా యెరుకలోనే జరిగాయి

ఆరోజులు అకస్మాత్తుగా అంతరించాయి తిరుపతి వెంకటేశ్వర కవుల శతావధానాలు చరిత్రలో చేరిపోయాయి పద్యాలు రాసేవాడు వింతజంతువైనాడు కథలు రాసేవాడు చవకబారు చవట అయినాడు సాహిత్యోద్యమం పోయింది దాన్ని పునరుద్ధరించడం నవ్యసాహిత్య పరిషత్తుకు సాధ్యం కాలేదు అభ్యుదయ రచయితల సంఘానికీ చాతకాలేదు

సాహిత్యం చూసినా అట్లాగే వుంది పద్యాలలో గల భాషమీదా, భావాలమీదా కూడా విజాతీయ ప్రభావం వచ్చి పడింది కొందరు రాసే పద్యాలు చూస్తే వీళ్లు ఇంటి దగ్గిర తెలుగే మాట్లాడుతారా అనిపిస్తుంది కొందరురాసేకతలు చూస్తే వీళ్లకు అక్కలూ చెల్లెళ్లూ, పెళ్ళాలు, పిల్లలూ ఉన్నారా అనిపిస్తుంది ఇదే సాహిత్యోద్యమమయితే ఈ ఉద్యమాన్ని వెలివేయటం ప్రజల తప్పుకాదు శరత్‌బాబు, ఓహెన్రీ, మోపాసా మన పత్రికలలో ప్రధాన రచయితలైతే ఆశ్చర్యమూలేదు

కాని ఈ సాకు చెప్పి మనలో సాహిత్యాభిలాష అంతరించడాన్ని సమర్థించటం కన్నా పొరపాటుండదు తెలుగు సాహిత్యం ఎన్నోదశలు గడిచింది నన్నయభట్టు మొదలుకొని ఈనాటివరకు ఎంతోమంది ప్రతిభావంతులైన కవులూ రచయితలూ ఉత్తమ తరగతి రచనలు,అనేక అభిరుచులను తనియించగల రచనలు చేశారు వానిమీద ప్రజలు ఏవిధమైన ఆసక్తీ లేకుండా పోవటానికి ఈనాటి తుక్కుకవులూ, చచ్చు కథకులూ కారణమనటం కన్నా హాస్యాస్పదమైన విషయం మరొకటి ఉండదు

చదువుకున్నవాళ్ళు సహితం బుర్రలకు సెలవిచ్చి, పంచేంద్రియాలకు ప్రాధాన్యం యిస్తున్నారు ఈ విషయం అన్నికళలలోనూ రుజువవుతున్నది కంటికింపుగా ఉండే సినిమా తారకు నటనాసామర్థ్యం లేకపోయినా ప్రజారాధన లభిస్తున్నది లోపల తుక్కూ, ధూగరావున్నా అందంగా అచ్చు వేసిన పత్రికకు అమ్మకం బాగుంటున్నది మాక్స్ ఫ్యాక్టరు మేకప్ సామాను, జాన్‌కిడ్స్ అచ్చు సిరాలు, త్రివర్ణచిత్రాలను అచ్చు వేసే యంత్రాలు, అందంగా

ఫొటో తీసే కెమేరాలు, మన కళలకుశాసనకర్తలైపోయాయి ప్రాణ చైతన్యమూ, భావచైతన్యమూ గల మానవుడు మన కళలను నడిపించటం మానేశాడు ఆపని యంత్రాలు పుచ్చుకొన్నాయి ఆ వెంటే మన కళల నుంచి జీవం కూడా నిష్క్రమించింది

సాహిత్యాన్ని గురించి ఇటువంటి వైఖరిగల మనం జీవితాన్ని అవగాహన చేసుకోగలమనేది వట్టిభ్రమ ఈ భ్రమనించి బయటపడ్డ నాడు మనం సాహిత్యాభిలాష తెచ్చుకోగలుగుతాం, తిరిగి సాహిత్యం ఒక ఉద్యమం చేసుకో కలగలుగుతాం అది ఎప్పటికైనా ఉన్నతమైన అభిరుచులు గల వారిద్వారానే సాగాలి కాని తుచ్ఛమైన అభిరుచులకు లొంగిపోయి అలుకు గుడ్డల్లాంటి పత్రికల పరనంతో మైమరచి ఓలలాడే దౌర్భాగ్యుల వల్ల ఒక్కనాటికీ సాధ్యంకాదు

*ముద్రణ అరుణరేఖ మాసపత్రిక, ఫిబ్రవరి, 1949*
*పునర్ముద్రణ సాహిత్య ప్రయోజనం (వ్యాసావళి)*
*విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, అక్టోబరు, 1969*

## 5. ఈనాడు వెలువడుతున్న సాహిత్యం

సంఘంలోని వ్యక్తుల వ్యాపకాలను బట్టి సంఘ స్థితిని అర్థం చేసుకోవచ్చు ఒక మనిషి ఆరోగ్యాన్ని పరీక్షించాలంటే వైద్యుడు నాడీ, ఊపిరితిత్తులూ, హృదయమూ, రక్తోష్ణమూ, రక్తపుపోటూ మొదలైనవి చూస్తాడు ఆవిధంగా వైద్యుడికి శరీరస్థితి తెలుస్తుంది అలాగే సంఘతత్వం తెలిసినవాడు కొన్ని కొన్ని లక్షణాలను బట్టి సంఘస్థితి తెలుసుకోగలుగుతాడు ఏయే రకం సంఘనియమాలకు ఆదరణ ఉండటం లేదు ఏయే సాంఘిక వ్యాపకాలవారికి సంఘంలో పలుకుబడీ, పెత్తనమూ, అధిక్యమూ, కీర్తి లభిస్తున్నాయో, ఏజాతి కళకు ప్రజాదరణ విశేషముగా లభిస్తున్నదో శ్రద్ధగా గమనించేవాడికి సంఘంయొక్క పోకడ అర్థమవుతుంది దీని విషయమై ప్రభుత్వాలు ఆరాటపడటం మనదేశంలో ఎన్నడూ ఆనవాయితీలేదు స్వాతంత్ర్యము వచ్చి కాంగ్రెస్ ప్రభుత్వాలు వచ్చినా ఇందులో మార్పు జరగలేదు ప్రజా ప్రభుత్వాలని చెప్పబడే కాంగ్రెస్ ప్రభుత్వాలు కూడా తమను తాము ప్రజలనుండి రక్షించుకోవడంలోనేనిమగ్నమై ఉన్నాయి అది వేరే విషయం

సంఘ స్థితిని విశదీకరించే విషయాలలో సారస్వతం చెప్పుకోదగినది ముఖ్యంగా సాహిత్యం రెండు విధాలుగా ఈ పని చేస్తుంది అది ప్రత్యక్షంగా సంఘస్థితిని ప్రతిబింబిస్తుంది, కాని ఇదంత ప్రధానమైన విషయంకాదు ఎందుకంటే సాహిత్య స్రష్ట సంఘాన్ని గురించి సమగ్ర పరిజ్ఞానం లేనివాడై ఉండవచ్చు, కొన్ని సాంఘిక విషయాలను గురించి అపోహలు కలవాడై ఉండవచ్చు, లేక, బుద్ధిపూర్వకంగా సాంఘిక పరిస్థితిని చిత్రించవచ్చు కాని సాహిత్యం అప్రత్యక్షముగా సంఘ స్థితిని ప్రతిబింబించగలదు సంఘ స్థితిగురించి సాహిత్యం ఇచ్చే నిజమైన సాక్ష్యం ఇదే ఉదాహరణకు ఈశ్వరుడు సత్యము, జగత్తు మిధ్యా అని రుజువు చేస్తూ ఏ స్వాములారో ఒక గ్రంధం రాసి దాన్ని ఏ శ్రేష్ఠిగారికో అంకితం ఇస్తూ, ఆయన గ్రంధ ప్రచురణకు ధన సహాయం చేశాడని, భక్తాగ్రేసరుడని, ముముక్షువని, జన్మరహితుడని, బొందెతో

కైలాసానికి వెళ్ళగలడని చెపుతాడు ఇటువంటి గ్రంథంనుంచి కన్నా, అంకితం నుంచి నేర్చుకోదగిన విషయం హెచ్చుగా ఉంటుంది

ఈ కారణంచేత ఈనాడు వెలువడుతున్న గ్రంథాలను గురించి సింహావలోకనము చెయ్యటం కొంతవరకు ప్రయోజన కారిగా ఉండగలదు

ఇటీవల వెలువడుతున్న పుస్తకాలలో హెచ్చు పుస్తకాలు మతపరమైనవి భగవద్గీతలమీద వ్యాఖ్యానాలు, విమర్శలు మొదలైనవి హెచ్చుగా ఉంటున్నాయి తాత్విక వేదాంత గ్రంథాలు కూడా లేకపోలేదు రాజకీయంగానూ, ఆర్థికంగానూ, సాంఘికంగానూ వెనుకబడి ఉంటూ వచ్చిన మన దేశంలో ప్రజలు ఆధ్యాత్మిక సంతుష్టికొరకు పాకులాడటంలో వింతలేదు అందుచేత ఎప్పుడూ ఇటువంటి గ్రంథాలు వెలువడటం ఉంటూనే ఉన్నది స్వాతంత్ర్యం వచ్చినాక ఈ ధోరణిలో మార్పు రాకపోగా ఇదే ధోరణి మరింత బలపడటం గమనించదగిన విషయం ఈ గ్రంథాలు రాసేవారిలో కొందరు నిజమైన తత్వవిచారకులుకారు, ఎవరి నోటినో విన్నమాటలను చిలకపలుకులవలే ఏకరువు పెట్టేవారు నిజమైన విజ్ఞానులు రచించిన పుస్తకాలు కూడా ఈ నాటి జీవితానికి ఈ తాత్విక జ్ఞానం ఏవిధంగా పనికివచ్చేదీ చూపటంలేదు

కొద్దివైజ్ఞానిక గ్రంథాలు వెలువడటంమెచ్చుకోదగినదే కాని ఈ గ్రంథాలలో రాజకీయ విజ్ఞానానికి సంబంధించిన పుస్తకాలు ఇప్పుడున్నదానికన్నా చాలా హెచ్చుగా ఉండవలసింది కొత్తగా స్వాతంత్ర్యం వచ్చి స్వతంత్ర రాజకీయ జీవితం ఆరంభించిన జాతి ''డెమొక్రసీ'' అంటే ఏమిటో, ''రాజ్యాంగం'' వల్ల ప్రయోజనాలేమిటో, అందులో మంచి చెడ్డలెట్లా ఉంటాయో, ''స్వాతంత్ర్యం'' ఆర్థికంగానూ, రాజకీయంగానూ, సాంఘికంగానూ ఎట్లా అమలు జరుగుతుందో తెలుసుకోవటానికి ఆత్రపడటం సహజం అటువంటి విజ్ఞానాన్ని ఇచ్చే సాహిత్యం విరివిగా వెలువడక పోవటం కూడా గమనించదగినది

శాస్త్రవిజ్ఞానంకూడా ప్రజలలో వ్యాప్తిచెందవలసిన అవసరం కూడా ఉంది శాస్త్రవిజ్ఞానం భౌతిక జగత్తుతో వ్యక్తుల పరిచయాన్ని పెంపొందిస్తుంది ఆ పరిచయం హెచ్చినకొద్దీ ప్రజలలో మూఢవిశ్వాసాలూ, వ్యర్థమైన ఆధ్యాత్మిక చింతన తొలగిపోయి వారు లౌకిక జీవితంలో మరింత సమర్థమైన పాత్ర వహించ గలుగుతారు దీనిద్వారా సాంఘిక పురోభివృద్ధి లభ్యమవుతుంది విప్లవాలద్వారా సాంఘిక జీవితానికి శీఘ్ర పరిణామం చేకూర్చుకున్న రష్యా మొదలైన దేశాలలో ప్రజలు శాస్త్రవిజ్ఞానగ్రంథాలకొరకు ఎగబడటం జరిగిందంటే అందులో ఆశ్చర్యం ఏమీలేదు ఇటువంటి శాస్త్ర గ్రంథాలుకూడా ఇటీవల తెలుగులో చాలా కొద్దిగానే వచ్చాయి వచ్చినవయినా ప్రజలకు సన్నిహితంగా లేవు పామరుణ్ని అవి భయపెట్టేటట్టుగా ఉన్నాయిగాని ఆకర్షించే ధోరణిలో లేవు

అయినప్పటికీ వచ్చినంతవరకైనా ఈ గ్రంథాలు అభినందించదగినవే ఆంధ్రుల సాంఘిక చరిత్రా, సాహిత్య చరిత్ర సంగ్రహమూ మొదలైన పుస్తకాలు వెలువరించిన హైదరాబాదు ఆంధ్రులు ప్రత్యేకించి ప్రశంసనీయులు ఆంధ్రుల సంస్కృతి అభివృద్ధి కావాలనే ఆసక్తి మన తెలంగాణా సోదరులు చూపిన దానిలో కోస్తా ఆంధ్రుల ఎన్నోవంతో చూపలేదు

ఇటీవల వచ్చిన పుస్తకాలలో నవలలు కూడా చాలాకొద్దే సమకాలీన జీవితాన్ని విపులంగా ప్రతిబింబించడంలో నవలను మించిన సాహిత్య స్వరూపం లేదు ఇటీవల వెలువడిన నవలల్లో

ఆధునిక జీవితాన్ని ప్రతిబింబించే నవలలు ఇంచుమించు లేవనే చెప్పవచ్చు కొన్ని కథల సంపుటులూ, ఖండకావ్యసంపుటులూ వెలువడినాయి వాటిల్లో కూడా ఉత్తమ తరగతి సాహిత్యం క్రింద జమకట్టదగినది బహుకొద్ది

ఈ వెలువడే పుస్తకాలలో క్షుద్ర సారస్వతం చాలా జాస్తిగా ఉంటున్నది కొన్ని అతి చిన్న సైజు పుస్తకాలు అందులో విషయ ప్రాధాన్యం గాని, విధాన సౌష్ఠవం గాని ఉండదు కొన్నింటి మీద వెలగాని, ప్రకాశకుల పేరు గాని ఉండదు అనేక పుస్తకాలు 'చేతిచమురు భాగోతాలు ' వాటినెవరైనా కొంటారన్న ఆశ పుస్తకం వేసిన వారికే లేనట్టు కనిపిస్తుంది

సమర్థులు రాసిన కొన్ని పుస్తకాలు మినహాయిస్తే మిగిలినవి పత్రికల్లో వెలువడే సాహిత్యంతో పోల్చదగినది కాదు ఈ కరువు రోజుల్లో అనేకమంది తాము రాసే 'చెత్తా' తమ నామధేయమూ అచ్చులో చూసే సంతృప్తి కోసం పుస్తకాలు వేసి డబ్బు వృధా చేయటమూ, నిజంగా పనికివచ్చే సాహిత్యం రాయగలవారూ, రాస్తున్న వారూ పత్రికలపై ఆధారపడి ఉండటమూ, స్వంతాన పుస్తకాలు వేసే తాహతు వారికి లేకపోవటమూ, పనికివచ్చే పుస్తకాలను ప్రచురించాలన్న ఆసక్తి గల పుస్తక ప్రచురణదార్లు లేకపోవటమూ ఈనాటి సాంఘిక పరిస్థితి సంఘంలో సాంస్కృతిక చైతన్యం కుంటుపడి ఉండటమూ, నిరుపయోగమైన గ్రంథ ప్రచురణ చేసే వారి చేతిలో డబ్బు బాగా ఆడుతూ ఉండటమూ స్పష్టంగా కనిపిస్తున్నది

*తెలుగు స్వతంత్ర వారపత్రిక, 19-5-1950*

## 6. రష్యన్ సాహిత్యం : 'శ్రమ'

''రష్యనులం పని లేకుండా జీవించలేం అదే మా జీవితాల పరమార్థం పని చెయ్యకుండా జీవితం ఆనందించటమనేది మాకు దురూహ్యం, పనిచెయ్యకపోయినా నా భార్యకు జరుగుతుంది కాని ఆవిడ నిరర్థక జీవితం జీవించటానికి ఒప్పుకోదు'' అని ఇటీవల ఒక రష్యన్ మాతో కొంత మందితో చెప్పాడు

రష్యాలో అందరిచేతా నిర్బంధంగా వెట్టిచాకిరీ చేయిస్తారని అనేకమంది పాశ్చాత్యులు ప్రచారం చెయ్యటం కద్దు దారిద్ర్యమూ, ''పొట్టా'' తప్ప మనిషిని పనికి ప్రేరేపించవని వారి నమ్మకం ఈ మూఢవిశ్వాసానికి ఆధారమేమంటే పెట్టుబడిదారీ దేశాలలోని ఆర్థిక వ్యవస్థా, దానివల్ల పనిని గురించి కలిగే ఏవగింపూనూ పెట్టుబడిదారీ దేశాల్లో శ్రామికుడికీ, శ్రమకు గల సంబంధం స్వేచ్ఛతో కూడుకున్నది కాదు సహజమైనదీ కాదు పైపెచ్చు ''శత్రుత్వం''తో కూడుకున్నది

ఆధునిక సోవియట్ సాహిత్యంలో మొట్టమొదటిసారి పని అనేది ఒక అభ్యుదయ సాంఘిక శక్తిగా, సంఘ నిర్మాతగా మనకు ద్యోతకమవుతుంది మన సాహిత్యంలో తరచు ముఖ్య పాత్రలకు చెప్పుకోదగిన పని ఏమీ ఉండదు, ఆ పాత్రలు ప్రేమను గురించో, సంఘ సంస్కారాన్ని గురించో, ఉన్నత భావాలు వెదజల్లుతూ ఉండటం తప్ప ఇంకేమీ చెయ్యవు కాని సోవియట్ సాహిత్యంలోని పాత్రలు అట్లా కాదు వాటికి నిర్దిష్టమైన పని ఉంటుంది ఈ పని ఎవరూ నిర్దేశించి అంటగట్టినది కాదు అందుచేత పని చేసే వ్యక్తికీ, వ్యక్తి చేసే పనికి మధ్య

ఐచ్ఛికమైన, స్వేచ్ఛాయుతమైన సంబంధం ఉంటుంది ఆ వ్యక్తియొక్క భావాలను, వికాసాన్ని, సమస్యలను, పరిణామాన్ని, సాంఘిక సంబంధాలను ఆ పనే ప్రేరేపిస్తుంది ఈ పనిని ఇంకా బాగా చెయ్యటం ఎట్లా? దానిని ఇతరులు చేసే పనితో సమన్వయించటం ఎట్లా? ఈ సమస్యలు వ్యక్తికి అడుగడుగునా కలుగుతుంటాయి

సోవియట్ సాహిత్యంలో మనకు కనిపించే పని తేనెటీగలు పడే శ్రమలాంటిది కాదు తేనెపట్టులో కూడా సమిష్టికృషి జరుగుతుంది కాని తేనెపట్టులో సాంఘికపరిణామం లేదు అవిచ్ఛిన్నమైన అభివృద్ధి లేదు సోవియట్‌సాహిత్యంలోని పనిలో ఈ అవిచ్ఛిన్నమైన పరిణామం ఉన్నది ఉదాహరణకు యుద్ధానికి పూర్వం ఉక్కు చేసేటప్పుడు, ఇనుము కరిగించడంలో అందరినీ మించిపోయిన పనివాడొకడు యుద్ధంలో చేరి, జర్మనులను తరుముకుంటూ జర్మనీ వెళ్ళి, అక్కడ నాలుగేళ్ళున్న తరువాత సైనిక వృత్తి మానేసి తన పనికి తిరిగి వచ్చి, తనకన్న చాలా చిన్నవాళ్లు తనను మించిపోవటమే గాక, ఉక్కు తయారుచేసే పద్ధతులు కూడా చాలా అభివృద్ధి చెంది ఉండటం గ్రహిస్తాడు ఈ మనిషి ఎంతో శ్రమపడి, మళ్ళీ కొత్త పద్ధతులను పారం చెప్పుకుని యువకులతో పోటీ చేసి - నెగ్గుతాడు ఈ విధంగానే ఇంకో కథలో, కజక్ సోవియట్‌లోని ఒక కోల్ఖోజ్ (సమష్టి వ్యవసాయ క్షేత్రం)లో కొత్త పద్ధతులు ప్రవేశపెట్టి, విద్యుచ్ఛక్తి ఏర్పాటు చేసి, ఉత్పత్తి హెచ్చించి సమష్టి జీవితంలో నూతన వికాసం సాధించటానికి ఒక యువకుడు కృషిచేసి - విజయం పొందుతాడు అట్లాగే సైబీరియాలోని బొగ్గుగనిలో "ప్రొడక్షన్ సైకిల్" ఏర్పాటు చేసి, బొగ్గు ఉత్పత్తి అధికం చెయ్యటానికీ, శ్రమ ఫలితాలు అధికమయేలాగు బొగ్గు తవ్వి చేరవేసే పద్ధతులు మార్చటానికి ఒక ఇంజనీరు ప్రయత్నించి - సఫలుడౌతాడు ఈయీ పాత్రలు సాధించే విజయాలు ఈయీ జీవితాలకు సరికొత్తవి కావటమేకాక సంఘర్షణ మీద కాని లభించనివి

సోవియట్ సాహిత్యంలోని పాత్రలు కూడా కలలు కంటాయి కాని అవి కేవలము ఆత్మసంతృప్తి కోసం కనే పగటికలలు కావు అవి వాస్తవికతతో కూడి ఉన్నవి సరిఅయిన వ్యష్టికృషీ, సమష్టి కృషీ జరిగితే సాధ్యమయేవి

గోర్కీ సాహిత్యంలో విశిష్టత ఏమన్నా ఉంటే అది జీవితాన్నీ, సౌందర్యాన్ని నిర్మించడంలో శ్రమకు గల ఉన్నత పాత్రను గోర్కీ తొలిగా గుర్తించడంలోనే ఉన్నది అని గోర్కీ తనను గురించి తానేచెప్పుకున్నాడు గోర్కీకి పూర్వం రచయితలు శ్రమను తూస్కార భావంతోచూసే వారు లేదా దానిని ఆకాశానికెత్తేవారు గోర్కీ అనంతరం సోవియట్‌సాహిత్యం చాలాదూరం ప్రయాణించింది పని అనేది మానవ జీవితాన్ని ఆమూలాగ్రం నిర్మిస్తుందనీ అదే వ్యక్తుల భావ చైతన్యానికీ, సంఘ నిర్మాణానికీ పునాది అనీ, అదే మానవ జీవితావసర పరమార్థమనీ సోవియట్‌సాహిత్యం అడుగడుగునా రుజువు చేస్తున్నది

యుద్ధం కూడా పనే సైనికుడు తనకు ప్రత్యేకించబడిన పని చేస్తూ, " ఈ పనిని నేను చేయదగినంత బాగా చేస్తున్నానా? దీనికి తగిన ప్రతిఫలం వస్తున్నదా? లేకపోతే తప్పెక్కడ ఉన్నది? దీనిని ఇంతకంటె బాగా చెయ్యాలంటే ఏం చెయ్యాలి? ఈ పని చెయ్యటంలో నేను ఇతరుల కృషివిలవను హెచ్చిస్తున్నానా?" అని ప్రశ్నించుకుంటాడు తన భావాలను ఇతరులతో చర్చిస్తాడు చర్చించే అవకాశం లేనప్పుడు ధైర్యంగా నిర్ణయాలు చేస్తాడు అతనికీ, సంఘానికీ

గల బలమైన సంబంధాలపై అతని విజయం ఆధారపడుతుంది సోవియట్ సమాజం ఏ సిద్ధాంతాలపై ఆధారపడి ఉన్నదో, ఆ సిద్ధాంతాల బలం అతి చిత్రంగా వ్యక్తి జీవితంలో వ్యక్తి చేసే పని ద్వారా పరీక్షకు వచ్చి ఆ పరీక్షలో నెగ్గుతుంది సంఘంలో వ్యక్తీ, సంఘానికి పునాదిగా ఉన్న సాంఘిక సిద్ధాంతాలూ - వీటన్నిటినీ పని అనేది పరీక్షకు పెట్టి అభివృద్ధి మార్గం సూచిస్తూ ఉంటుంది

ఈ విధంగా జీవితాన్ని చిత్రించే సాహిత్యం సోవియట్ సాహిత్యం తప్ప మరొకటి లేదు అందులో పని నిర్మాణపాత్ర వహించటమే అతి ప్రధానమైన విషయం

సోవియట్‌సాహిత్యంలోని వాస్తవికతకు కూడా పనే పునాది సోవియట్ ప్రజలు వాస్తవికతకు ఏమాత్రం లోపం జరిగినా సహించలేరు ఆశయాలకు, కృషికీ మధ్య అవాంతరం ఉన్నప్పుడే ఊహాగానం సాగుతుంది సోవియట్ రచయితలు పని ద్వారా సాధ్యం కాని వాటిని గురించి ఊహాగానాలు చెయ్యరు కృషివల్ల ఏదన్నా సాధ్యమయే మాటుంటే సోవియట్ ప్రజలు దానిని సాధించితీరుతారు అందుచేత సోవియట్ సాహిత్యం నూటికి నూరుపాళ్లు వాస్తవికతతో కూడి ఉంటుంది ఆ వాస్తవికతకూ పనికీ ఈ విధంగా ప్రత్యక్ష సంబంధం ఉంటుంది

ప్రతి జాతియొక్క సాహిత్యమూ, ఆ జాతియొక్క '' ఆత్మ''ను వ్యక్తం చేస్తుందనటంలో సందేహం లేదు సోవియట్ '' ఆత్మ''ను వ్యక్తం చెయ్యటంలో సోవియట్ సాహిత్యం పొందే విజయాన్ని మరే సాహిత్యమూ పొందలేదంటే అతిశయోక్తి కాదు ఇతర జాతులలో వర్గవిభజనా, వర్గపరిణామాలలో ఎగుడుదిగుడులూ, వర్గ సంఘర్షణ వెంట ఉండే భావ సంఘర్షణ, దాని వల్ల కలిగే అయోమయమూ వారి సాహిత్యాలలో ప్రతిబింబిస్తుంది అందుచేత సోవియట్ సాహిత్యం చదవటం ఎంత సులభమో, దాని ద్వారా సోవియట్ జీవితాన్ని, సోవియట్ ప్రజలను అర్థం చేసుకోవటం అంత సులభం వారు శాంతికాముకులు తమ జీవితాన్ని అభివృద్ధి చేసుకోవటానికి తామే కృషి చేస్తూ, తమ కృషిని తమ ప్రభుత్వం బలపరుస్తుందన్న పూర్తి విశ్వాసం కలవారు వారికి స్వజాతిపై అభిమానమున్నది కాని జాత్యహంకారమూ, ఇతర జాతుల పట్ల నిరసనా లేవు ప్రపంచ ప్రజలతో సోవియట్ ఎటువంటి బాంధవ్యాలు కలిగి ఉండే అవకాశం ఉందో సోవియట్ సాహిత్యం వ్యక్తం చేస్తుంది

*ముద్రణ సంధ్య పక్షపత్రిక, 5-10-1950*

# 7. సమాలోచన-ఎ

1953 ఆంధ్ర కళలకు శుభకరంగానే ఆరంభమయింది కిందటినెల హైదరాబాద్ ఆంధ్ర సారస్వత పరిషత్తువారు, అలంపురంలో ఏర్పాటు చేసిన పరిషత్సభలకు విశాలాంధ్ర అన్ని ప్రాంతాల నుంచీ, ఆంధ్రేతర ప్రాంతాల నుంచి కూడా అనేకమంది రచయితలూ, తదితర కళాకారులూ వెళ్ళారు ఈ సభలలో జనవరి 14న మహాకవి శ్రీశ్రీ (శ్రీరంగం శ్రీనివాసరావు) చేసిన ప్రతిపాదనను పురస్కరించుకొని ఆంధ్రకళాపరిషత్తు ఒకటి ఏర్పాటయింది ఇది ఆంధ్రకళా జీవితంలో ఒక పెద్ద ముందడుగు

నిజానికి ఆంధ్రులకు పరిషత్తుల కొదువ లేదు ఆంధ్రసాహిత్య పరిషత్తు ఏనాటి నుంచో ఉన్నది దాన్ని రాజులూ, మహారాజులూ పోషించారు అయితే అది కాలంతో పాటు నడవలేకపోయింది అది నిర్మించిన హద్దులను తోసివేసి ఆంధ్రసాహితి పొంగిపొరలి ముందుకు ఉరకలు వేసుకుంటూపోయింది ఈ సజీవ సాహితీవాహిని వెంట నడవడానికి 1919లో సాహితీసమితి పుట్టింది సాహితీసమితి ప్రభావం కాలక్రమాన యావదాంధ్రను ఆక్రమించినప్పటికీ, సాహితీసమితి ప్రభావం కాలక్రమాన యావదాంధ్రను ఆక్రమించినప్పటికీ, సాహితీ సమితి పరిమితమైన ప్రాంతీయ సంస్థగానే పని చేసి క్రమంగా విచ్ఛిన్నమయింది ఇలాంటి స్థానిక సంస్థలు ఇంకా అనేకం వెలువడి అది చేసిన పనిని కొనసాగించాయి 1935 ప్రాంతాల సాహితీసమితి, నవ్యసాహిత్యపరిషత్తుగా పునరుద్భవించింది ఈసారి ఇది వాస్తవమైన అఖిలాంధ్ర సంస్థగా పని చేసింది ఆనాటి గద్యపద్య రచయితలలో అధిక సంఖ్యాకులు అందులోచేరారు నవ్యసాహిత్య పరిషత్సమావేశాలు, ఉత్తరసర్కారు జిల్లాలలో అనేక చోట్లనూ, 1942 జనవరిలో మద్రాసులోనూ కూడా జరిగాయి

ద్వితీయ ప్రపంచ యుద్ధానికి ముందే మన దేశానికి కళలలో అభ్యుదయ వాదం దిగుమతి అయింది దీనిని ఉత్తర హిందూస్థానంలో ప్రఖ్యాత కథకుడు ప్రేమచంద్, ఆయన నిర్వహించిన ''హంస్'' పత్రికా ప్రచారం చేసి విజయం సాధించటం జరిగింది

ఈ అభ్యుదయవాదం 1937ప్రాంతాల ఆంధ్రకు కూడా వచ్చింది కాని కొన్ని సంవత్సరాలపాటు దీనికి ప్రచారం లేకపోయింది చివరకు 1942 ప్రాంతాల ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ వారు పూనుకుని, కళలో అభ్యుదయ సిద్ధాంతాలకు ప్రచారం ఇవ్వటానికి ఆంధ్రాలో ఉన్న అనేకమంది రచయితల తోడ్పాటు సంపాదించగలిగారు బెజవాడలోనూ ఇతర చోట్లా అభ్యుదయ రచయితల సంఘాలు ఏర్పాటయాయి ఈ సంఘాలకు నవ్యసాహిత్యపరిషత్తు సహకారం కూడా కొంతవరకు లభించింది

రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన మూడేళ్లకల్లా ఆంధ్రలో - కనీసం ఉత్తర సర్కారులలో - ఏ సాహిత్యోద్యమమూ లేకుండాపోయింది సాహిత్య కృషిలో కూడా మాంద్యం ఏర్పడింది

సర్కారు జిల్లాలలో ఈ పరిణామాలు కలుగుతున్న కాలమందు హైదరాబాదులో సారస్వత పరిషత్తు చాలా చురుకుగా పని చేస్తూ వచ్చింది అక్కడ సాహిత్య కృషి కూడా చాలా చురుకుగా సాగింది అందులో ఆశ్చర్యం లేదు సారస్వత పరిషత్తు వెనుక తెలంగాణాలోని హేమాహేమీలు నిలబడటమేకాక ప్రజలకు సారస్వతం ద్వారా కలిగే ప్రయోజనాలను గురించి సర్కారులలోని సాహిత్యోద్యమాల కంటె చాలా వాస్తవిక దృష్టి ప్రకటించారు సారస్వత పరిషత్తు ఏటా పరీక్షలు పెట్టి పట్టాలిచ్చింది సారస్వత పరిషత్తు ప్రోత్సాహంతో కొన్ని అమూల్యమైన గ్రంథాలు కూడా వెలువడ్డాయి సారస్వతపరిషత్తు సభలకు పలుకుబడి గల రాజకీయవేత్తలూ, సంస్కృతీపరులూ హాజరయారు వారి ప్రసంగాలలో వాస్తవిక సమస్యలే చర్చించబడేవి గాని, ఆకాశపోకాశ కబుర్లకు తావుండేది కాదు

ఒకప్పుడీ సారస్వతపరిషత్తు వారు తమకు సర్కారు, రాయలసీమలతో సంబంధాలు అవసరం లేదని కూడా నిర్ణయించారు అప్పట్లో ఈ నిర్ణయం వారికి లాభించింది అయితే వారు కాలప్రభావాన్ని సరిగా గుర్తించి కొన్ని సంవత్సరాలుగా తమ సభలకు సర్కారు,

రాయలసీమల నుంచి రచయితలను ఆహ్వానిస్తున్నారు కిందటి నెల అలంపురంలో జరిగిన సభలే వీరి కృషికి ఉత్తమ నిదర్శనం ఈ సభలకు వెళ్ళివచ్చిన వారు ఈ సభలను చాలా కొనియాడుతున్నారు ఈ సమావేశాలలోనే ఆంధ్ర కళాపరిషత్తు, యావదాంధ్ర కళాకారులకు ప్రతినిధిగా ఉద్భవించింది

అన్ని రకాల కళాకారులకూ ప్రాతినిధ్యం వహించగల పరిషత్తు ఏర్పడడం ఇదే మొదలు ఐతే ఇప్పుడేర్పడిన ఆంధ్ర కళాపరిషత్తు వెనక కొంత స్థానిక కృషి లేకపోలేదు కొద్దిమాసాల క్రితం మద్రాసులో అభ్యుదయ కళాసమితి ఏర్పడి పని చేస్తోంది దీని కార్యకలాపాలతో ప్రోత్సాహం పొంది విజయవాడలోనూ, విశాఖపట్టణంలోనూ ఇలాటి కళా సమితులు ఏర్పడ్డాయి ఇప్పుడు ఆంధ్ర కళాపరిషత్తు ఏర్పాటయింది దీనికి అధ్యక్షుడు మహాకవి శ్రీశ్రీ ఉపాధ్యక్షులూ, కార్యవర్గసభ్యులూ, సలహా సంఘమూ, ప్రణాళికా అన్నీ ఏర్పడ్డాయి దీని సమావేశాలు విశాలాంధ్ర అంతటా - తెలంగాణా, సర్కార్లు, రాయలసీమలలో జరుగుతాయి

ఇది ఇప్పుడే మొలిచిన మొక్క దీని భవితవ్యం అధికంగా ఆంధ్ర కళాకారులపైనా, కళాభిమానం గల ప్రజలపైనా ఉన్నది ఇప్పటిమటుకు మనం చెప్పగలిగినదేమంటే, భావి ఆంధ్ర కళాభ్యున్నతికి ఇటువంటి పరిషత్తు అవశ్యంగా కావాలి

*ముద్రణ ఆంధ్రజ్యోతి మాసపత్రిక, ఫిబ్రవరి 1953*

## 8. సమాలోచన-బి

మద్రాసు ప్రభుత్వం ఆస్థానకవులకు స్వస్తి చెప్పింది అంతకు పూర్వం మోషన్ పిక్చర్ ఎకాడమీకి కూడా స్వస్తి చెప్పింది కళలకు ప్రభుత్వాదరణ ఉంటే అవి పురోగమిస్తాయన్న అపోహను మద్రాసు ప్రభుత్వం భంగపరిచింది

ఆస్థాన కవులకు ఉద్వాసన చెప్పడంలో ప్రభుత్వం ఆర్థికంగా పొదుపు చేసేది కూడా ఏమంత లేదు ఏటా చేసే ఖర్చులో లక్షన్నరకో రూపాయికాబోలు వ్యయం చేసి మద్రాసు ప్రభుత్వం నలుగురు ఆస్థానకవులను నియమించింది ఒక్కొక్క ఆస్థానకవికి వెయ్యిరూపాయలు వార్షికం ఇస్తారని వినగానే, ఒక ప్రఖ్యాత ఆంధ్ర కవి, ''నేనే ఒక ఆస్థానకవిని పెట్టుకోవచ్చు'' అన్నాడు!

చెప్పవచ్చిందేమంటే, గుడ్డికన్ను మూసినా ఒకటే తెరిచినా ఒకటేనన్నట్టు మద్రాసు ప్రభుత్వం సాహిత్యానికిచ్చిన ప్రోత్సాహం ఏనాడూ చెప్పుకోదగిన ప్రమాణంలో లేదు బ్రిటిషువారి హయాంలో అణచివేయబడ్డ గ్రంథాలు కొన్నిటిమీద ఉండిన ఆంక్షను మద్రాసులో ఏర్పడిన కాంగ్రెసు ప్రభుత్వాలేవీ ఎత్తివేయలేదు వాటిని గురించి సరిఅయిన ఆలోచన చెయ్యటంగాని, ప్రసిద్ధ రచయితల అభిప్రాయాలు తెలుసుకోవటంగాని చెయ్యలేదు

ఆస్థానకవి పదవి సంపాదించినవారు తమకేపాటి గౌరవం కలిగిందని భావించారో తెలియదు గాని, చదువుకున్న వారిలో '' ఆస్థానకవి'' అనే మాట వేళాకోళపుమాట అయిన మాట మాత్రం అబద్ధం కాదు ఏమైనా అష్టదిగ్గజాలను ఆస్థానంలో ఉంచుకుని, వారికి స్వయంగా గండపెండేరములు తొడగటమూ, వారెక్కిన పల్లకి స్వయంగా తన చేతపట్టి

ఎత్తటమూ మొదలైనవి చేసి, తన సాహిత్య ప్రియత్వాన్ని వెల్లడించిన శ్రీకృష్ణదేవరాయులులో సగం అంశ మద్రాసు ప్రభుత్వానికున్నదని ఎవరూ అనుకోలేదు, అనుకోరు

మద్రాసు ప్రభుత్వం నలుగురు ఆస్థాన కవులను నియమించినందు వల్ల మనకు కలిగిన ఖ్యాతికన్న, 1951-52లో న్యూయార్క్ హెరాల్డ్‌ట్రిబ్యూన్ పత్రిక నడిపిన అంతర్జాతీయ కథానికల పోటీ మన సాహిత్యానికి ఎక్కువ ఉపకారం చేసింది ఈ పోటీలో ద్వితీయ బహుమానం పొందిన శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారు తెలుగు సాహిత్యం యొక్క విశిష్టతను యావత్ప్రపంచంయెదట ప్రదర్శించిన వారైనారు (తెలుగు అనే భాష ఒకటి వున్నదని గాని, అందులో 9 శతాబ్దాల పాటు అభివృద్ధి అయిన సాహిత్య శాఖోపశాఖలున్నాయని ప్రపంచంలో చాలా మందికి తెలిసికూడా వుండకపోవచ్చు )

ఇటువంటి పోటీ 1953-54లో మరొకసారి జరుగుతోంది ఈ పోటీ మూడు స్థాయిలలో - తెలుగు కథల మధ్యా, భారతీయ కథల మధ్యా, ప్రపంచకథల మధ్యా - జరుగుతుంది తెలుగు కథకులు ఏ ఇతర కథకులకూ తీసిపోరని చెప్పవచ్చు అందుచేత మన కథకులు ఈ అంతర్జాతీయ కథానికల పోటీలో పాల్గొని, తెలుగు సాహిత్య ప్రతిభను అఖిల భారత రంగంలోనూ, అంతర్జాతీయ రంగంలోనూ వికసింపజేస్తారని ఆశిస్తున్నాం

*ముద్రణ ఆంధ్రజ్యోతి మాసపత్రిక, ఏప్రిల్ 1953*

## 9. సమాలోచన-సి

సాధారణంగా సాహిత్యంలో గొప్ప ఆసక్తి లేని వారు కూడా కథానికలను అప్పుడప్పుడూ చదివి ఆనందించడం జరుగుతూ ఉంటుంది అక్షరాస్యుడైనవాణ్ణి ఎవణ్ణి కదిలించినా తాను చదివి ఎక్కువగా ఆనందించిన కథానికలు అయిదారింటిని పేర్కొనగలుగుతాడు

పఠనలోలాగే రచనలో కూడా ఇంకే సాహిత్యస్వరూపం జోలికీ పోకుండా కేవలం కథానికలు మాత్రం రాయడానికి యత్నించిన వారు వందల సంఖ్యలో, వేల సంఖ్యలో ఉండివుంటారు అంటిపెట్టి కథానికారచన చేస్తున్న వారిలో ఒకటి, రెండు చక్కని కథలు రాసిన వారు చాలా మంది వున్నారు

ఈ పరిస్థితులలో ఇంకే సాహిత్యస్వరూపం వెనుకపడినప్పటికీ కథానికకు మాత్రం కరువుండదనిపిస్తుంది కాని వాస్తవం గమనిస్తే దానికీ కరువున్నది ప్రతి పత్రికా వారంవారం, నెలనెలా కథానికలు ప్రకటిస్తున్నప్పటికీ, అచ్చుగా కథలకే అంకితమైన పత్రికలు కూడా అనేకం ఉన్నప్పటికీ ఈనాటి తెలుగు కథానిక నీరసంగా, నిర్వికాసంగా, నిష్ప్రతిభగా వుంటున్నది

ఇది అచ్చుగా తెలుగుసాహిత్యానికి మాత్రమే పట్టిన తెగులని మనం అనుకోనవసరం లేదు అన్ని దేశాలలోని సారస్వతప్రియులూ కథానికయొక్క పతనాన్ని గురించి వాపోతున్నారు కిందటిమారు ప్రపంచ కథానికల పోటీ జరిగినపుడు అఖిల భారత పోటీలో బహుమతులు పొందిన కథల ప్రమాణం చూస్తే మనం వివిధ సాహిత్యాలలో చదివిన ఉత్తమ కథల ప్రమాణంతో ఎంతమాత్రమూ పోల్చదగినదిగా లేదు ఈసారి పోటీ ఏ విధంగా ఉండబోతుందో చూడాలి

యుద్ధానంతర కాలంలో ఇతర దేశాలలోకన్న సోవియట్ రష్యాలో సాహిత్యం విరివిగా ఉత్పత్తి అవుతున్న మాట నిజమే (అమెరికాలో రాష్ట్రపతి ఉద్బోధను కూడా తృణీకరించి నిన్నటి ఉత్తమ సాహిత్యాన్ని నేడు దగ్ధం చేస్తున్నారు!) అయినప్పటికీకూడా సోవియట్ రష్యాలో చిన్నకథ తగినంతగా వెలువడడం లేదని ''సోవియట్ సాహిత్యం'' ఫిబ్రవరి సంచికలో ఎ తారాసెంకోవ్ రాస్తున్నాడు

సంప్రదాయ రష్యన్ సాహిత్యంలో చిన్న కథకు అనుపమైన స్థానం ఉన్నది గోగోల్, వెర్మొన్తోవ్, తుర్గనెవ్, టాల్‌స్టాయ్, వెస్కోవ్, చెఖోవ్, మాక్సింగోర్కీ ప్రభృతులు రత్నాలలాటి కథలు శాశ్వతంగా రాశారు

''అయినా సంప్రదాయ రష్యన్ సాహిత్యంలో కథానికకు గల స్థానంతో ఈనాటి కాల్పనిక సాహిత్యంలో సోవియట్ కథానికకు గల స్థానాన్ని పోలిస్తే ఈనాటి రచయితలు దీర్ఘ రచనల పట్ల పక్షపాతం చూపుతున్నారన్నది గమనించకుండా ఉండలేం నేటి సాహిత్యపత్రికలనిండా ఇవే హెచ్చుగా ఉన్నవి'' అంటాడు తారాసెంకోవ్

ఇటీవలనే రష్యాలో సోవియట్ కథానికల సంపుటాలు మూడు వెలువడ్డాయి సోషలిస్టు విప్లవానంతరం వెలువడిన కథానికలలో ఉత్తమమైనవాటిని సేకరించి ఈ సంపుటాలు వెలువరించారు వీటిని గురించి వ్యాఖ్యానిస్తూ తారాసెంకోవ్ ఇందులో కొన్ని కథలు అంత మంచివిగా లేవనీ, కొన్ని ఇటీవలి కథలలో ఉత్తమమైనవి ఇందులో చేర్చబడకపోవడం శోచనీయమనీ అన్నాడు

మనం పాటించవలసినది సోవియట్ కథానికలలో లోపాలు కాదు, గుణాలు కథానికయొక్క ప్రయోజనం గురించీ, ఉత్తమ సోవియట్ కథకులు అనుసరించిన విధానాలను గురించీ తారాసెంకోవ్ ఈ క్రింది విషయాలు చెప్పాడు!

''చిన్నకథ ప్రధానమా, నవల ప్రధానమా అన్న సమస్య లేదు నవలకున్నంత గొప్ప ప్రయోజనం కథానికకూ ఉన్నది అవి సామాన్యమైన సంఘటనలనూ, సంఘర్షణలనూ చిత్రిస్తాయి వాటి రచనకు చాలా నైపుణ్యం కావాలి వాటిలో విస్తృత జీవితం ప్రతిబింబించజాలదు జీవితం తాలూకు ఒక ఛాయ మాత్రమే ప్రతిబింబితమవుతుంది కథానికయొక్క ఆకర్షణ దాని క్లుప్తతో ఉన్నది సాహిత్య రూపాలన్నిటికీ అవాంతరమైన మాటల ఊకదంపుడుకు కథానికలో స్థానం లేదు

''నవల, నాటకం వగైరాలకు గల ప్రయోజనమే కొద్దిలో కథానికకు కూడా ఉన్నది జీవితంలోనూ, మనుష్యుల భావోద్రేకాలలోనూ గల సత్యాన్ని అది వ్యక్తం చెయ్యాలి ''

ఈ ఆశయాలతో ఏ దేశంవారైనా, ఏ సంఘంవారైనా ఏకీభవించవచ్చు కాని సోవియట్ కళలకొక ప్రత్యేక ప్రాతిపదిక ఉన్నది ఆ ప్రాతిపదికను సోషలిస్టు సాంఘిక వ్యవస్థలను అమలు జరిపిన వారు మాత్రమే అవలంబిస్తున్నారు ఈ ప్రాతిపదిక ఏమంటే ''సోషలిస్టు వాస్తవికత'', ఈ సోషలిస్టు వాస్తవికత సోవియట్ కథానికలలో ఏ విధంగా ద్యోతకమవుతోంది?

తారాసెంకోవ్ ఇలా చెబుతున్నాడు

''గాలీనా నికొలాయెవా రచించిన 'నాయకుని మృతి' అన్న కథ తీసుకుందాం ఉద్వేగపూరితమైన, రసవంతమైన ఈ కథలో సోవియట్ సాహిత్యం ముఖ్య లక్షణాలు కొన్ని

కలవు ఈ కథలో కథానాయకుని మృతి జీవితాన్నీ, ప్రజా విజయంలో గల విశ్వాసాన్నీ బలపరుస్తుంది ఇది ప్రబలమైన ఆశావాదంతో కూడుకున్న కథ ఇదే సోషలిస్టు వాస్తవికతా లక్షణం ఫుర్మానోవ్, ఫదెయెవ్, విష్నెవ్స్కీ, నికొలాయెవాలవంటి కథకులు వ్యక్తి అపజయాన్ని దాటి చూస్తారు, ఫాసిస్టు, అభ్యుదయ నిరోధక శక్తులపై ప్రజలు సాధించే ఘన విజయాన్ని గమనిస్తారు

''ఈ సంపుటాలలోని కథలలో సోవియట్ ప్రతాపం మాటిమాటికీ గోచరిస్తుంది వాసిలీ గ్రోస్మన్ రచించిన 'జీవితం' అన్న కథలో డోన్బాస్ ప్రాంతంలో జరిగిన భయానక విధ్వంసం చిత్రించబడింది డోన్బాస్ పౌరులు శత్రువునెదిరించడంలో చూపిన ప్రతాపం సూచించబడింది కాని ఈ చిత్రణలో విషాదం గాని, నిరాశ గాని లేవు వాలెంటిన్ కటయెవ్ రచించిన ''జెండా'' కథ కూడా అంతే బోరిస్ పోలెవోయ్ రచించిన 'మేము సోవియట్ ప్రజలం'', వి కొఝెవ్నికోవ్ రచించిన ''మార్చ్-ఏప్రిల్'' కథలలో సోవియట్ పరాక్రమం అప్రతిహతంగా చిత్రించబడింది

''ప్రతి రచయితకూ స్వంతశైలి ఉన్నది ఒక కథలో పాత్రలు మరొక కథలో కనిపించవు అయినా అందరి రచనలలోనూ కనిపించేది ప్రజలలో ఒకడైన మానవుని యందు అకుంఠిత విశ్వాసం, కథానాయకుల ఆత్మగౌరవంలోనూ, నైతికవర్తనలోనూ విశ్వాసం

''సోషలిస్టు ప్రజాజీవితం యొక్క పురోగమనం బహిరంగంగా ప్రకటితమవుతున్నది బ్రహ్మాండమైన నిర్మాణ కార్యకలాపాల ద్వారా కాని సోవియట్ పౌరుని పురోగమనాన్ని కథకులు అతి సాధారణ విషయాలలో నిరూపించగలుగుతున్నారు ప్యోతర్ పావ్లెంకో కథలు 'పిలిచే గొంతు', 'మాటకు గల శక్తి' ఇట్టి రచనలకు ఉదాహరణలు పావ్లెంకో రచనలలో నిత్యజీవితం ప్రతిబింబించడమే గాక అతని సందేశం సూటిగా, గంభీరంగా వినిపిస్తుంది కళాన్వితమైన రచనకు అవసరమైన ఈ రెండు ప్రయోజనాలనూ అతను సమన్వయిస్తాడు

''ఇదే సమస్యను సెర్గెయ్ ఆంతొనోవ్ కథ 'వానలు' మరొక విధంగా చిత్రిస్తుంది ఈ కథలో ప్రధాన పాత్ర అతి సాధారణమైన గుమాస్తా ఈమె అకస్మాత్తుగా తన చుట్టూ కలయజూసుకొని అద్భుత సంఘటనలు జరుగుతూవుండటం గమనించి, తాను కూడా వాటిలో పాల్గొనడానికి ఉద్యమిస్తుంది ఈ కథ ఉదాసీనతను తీవ్రంగా నిరసిస్తుంది ఏమంటే సంఘర్షణ లేని ప్రేమా, ఖండన లేని మండనా వుండవు

''ఆంతొనోవ్ తన ఆశయాలను విప్పిచెప్పడు వాటిని ఎంత గుప్తంగా వుంచితే కళ అంత బలంగా వుంటుందని అతని విశ్వాసం సోషలిస్టు వాస్తవికతలో ఇలాంటి కళాదృష్టికి స్థానం లేదని ఏ విమర్శకుడూ అనలేడు ''

ఇది చాలా ముఖ్యమైన అంశం ఎందుచేతనంటే ఈనాటి మన అభ్యుదయవాదులు కొందరు, రచయిత తన ఆశయాన్ని అరటిపండు వొలిచిపెట్టినట్టు చెబితే గాని అది వాస్తవిక కళ కాదనే అపోహలో వున్నారు ఇది సమర్థనీయం కాదు అయితే తారాసెంకోవ్ హెచ్చరించినట్టు, ''చిన్న సంఘటనల ద్వారా జీవిత ప్రవాహాన్ని చిత్రించేటప్పుడు, జీవితపు ప్రధాన విషయాలకు దూరమైపోరాదు లేనిచో రచయిత సాంఘిక పరిణామానికి వెనుకబడి, వక్రదృష్టిపాలై, చారిత్రక సత్యాన్ని తారుమారు చేసుకుంటాడు ''

ఇలాటి పొరపాట్లకు గురిఅయిన కథలను కొన్నిటిని తారాసెంకోవ్ పేర్కొన్నాడు

''సోవియట్ కథానిక కమ్యూనిజముకేసి పరిణమించే సంఘజీవిని చిత్రిస్తుంది ఈ పరిణామాన్ని ఒకరు చిత్రించినట్టు కాకుండా మరొకరు చిత్రించవచ్చు వైవిధ్యానికి అంతులేని అవకాశాలుండడమే సోషలిస్టు వాస్తవికతలోని ప్రత్యేకత

సోవియట్ కళలోని మరొక ప్రధాన లక్షణాన్నికూడా సోవియట్ కథానికలు ప్రతిబింబిస్తున్నవి అదేమిటంటే వాతావరణాన్ని వాస్తవికంగా చిత్రించడం, సంఘంరక్షణను ధైర్యంగా చిత్రించడం ఈ లక్షణం ప్రతి మంచి సోవియట్ కథానికలోనూ కనిపిస్తుంది

''ఈ యుగపు ప్రధాన సంఘర్షణలో ఒక వంక విజయవంతమవుతున్న సామ్యవాదమూ, రెండవవంక పెట్టుబడిదారీ ప్రపంచపు మానవ సంబంధాలూ ఉన్నవి ఈ సంఘర్షణలో కొత్త సంబంధాల విజయాన్ని సోవియట్ సాహిత్యం నిరూపిస్తుంది ఈ విషయం విప్లవ, అంతర్యుద్ధాలకు చెందిన రచనలలోనే గాక, సోవియట్ ప్రజల శాంతియుత జీవితానికి సంభందించిన రచనలలో కూడా చిత్రించబడి ఉన్నది అలెక్సీ టాల్‌స్టాయ్ రచించిన ''పాము'' పోలెవోయ్ రచించిన '' ఇలా జరిగింది'',ఫదెయెవ్ రచించిన ''దారిద్ర్యమూ, సంపదా'', వి గెరాసిమోవా రచించిన ''దూరపు బంధువు'' అనే రచనలలో పాత కొత్తలమధ్య సంఘర్షణ చిత్రించబడింది ''

మనం సాధారణంగా ఇతర దేశాల కథానికలను చదివేటప్పుడు ఆ కథలకు ఆయాకాలాల జీవితంతోనూ, చరిత్రతోనూ సంబంధం లేనట్టు చదువుతాం కళకళ కోసమే అన్న అపోహ పాఠకులకు కలగడానికి ఇదొక కారణం మన జీవిత చరిత్రలతో సంబంధంగల రచనలు చేసిననాడే మనం కూడా ఉత్తమ కథలు రచించగలుగుతాం మరొక దేశపు ఆశయాలు మనకు పనికిరావు కాని ఏ దేశంవారి జీవితం వారి ఉత్తమ రచనలపై ఏ విధంగా తన ప్రభావాన్ని ప్రసరింపజేస్తున్నదీ తెలుసుకుంటే మనకు కావలసిన ఉత్తమ కథానికలు ఎట్టివిగా ఉండాలో మనం నిర్ణయించుకోవచ్చు ఈ ఆశయం నెరవేరగలందులకే ఈసారి సోవియట్ కథానికనుగురించి సమాలోచించాము ఇకముందు ఇతర దేశాల కథానికలను గురించికూడా సమాలోచన చేద్దాము

*ముద్రణ ఆంధ్రజ్యోతి, మాసపత్రిక, ఆగష్టు 1953*

## 10. రచయిత్రులు – సాహిత్యం

సప్తమ రచయిత్రుల మహాసభలు విజయవాడలో అందరికీ సంతృప్తి కలిగించినట్టు వార్తలు వెలువడ్డాయి చాలా సంతోషం ఈ సభలో చర్చకు వచ్చిన రెండు ముఖ్య విషయాలలో ఒకటి రచనల వాస్తవికత రెండోది అభ్యుదయవాదం ఆధునిక తెలుగు సాహిత్యంలో వాస్తవికత ఆరంభమై నాకు తెలిసి దాదాపు అర్వై ఏళ్ళయింది అభ్యుదయవాదం ప్రారంభమై ముప్పై ఏళ్ళు దాటింది ఈ రెంటిని గురించి ఈ 1975లో స్త్రీలు హెచ్చరికలు చెయ్యటం వారు సాహిత్య రంగంలోకి ఆలస్యంగా అడుగు పెట్టటాన్ని సూచిస్తుందేమో అందులో తప్పేమీ లేదు

అసలు ''రచయిత్రులు'' ప్రత్యేక సాహిత్య సదస్సు ఏర్పాటు చేసుకోవటం కూడా ''స్త్రీలకు ప్రత్యేక స్థలం'', ''ఆడ వాళ్ళ క్యూ'' లాంటివి స్ఫురింప జేస్తున్నది ఇది కూడా ఒక విధంగా ప్రారంభదశనే సూచిస్తున్నది నిజానికి అది అవసరం కాదు సాహిత్యంలోకి కొత్త వాళ్ళు ఎప్పుడూ వస్తూనేవుంటారు వాళ్ళు స్త్రీలా, పురుషులా అన్న విచక్షణ సాహిత్యం ద్వారా ఏర్పడదు ఇవాళ కూడా రంగనాయకమ్మ, , బీనాదేవి, ద్వివేదుల విశాలాక్షిగార్ల వంటి మహిళల రచనలు మహిళాతత్వం ముసుగు ధరించవు ఈ కారణంచేత నిజంగా స్త్రీలే రాస్తున్నారా, ఆడపేర్లు పెట్టుకుని మగవాళ్ళు రాస్తున్నారా, మగవాళ్ల పేర్లు పెట్టుకుని ఆడవాళ్ళు రాస్తున్నారా అన్నవి కేవలమూ వేడుక ప్రశ్నలే అవుతాయి సాహిత్యం విలువే ప్రధానాంశంగా ఉంటుంది

నా బుద్ధికి ఈ మహాసభలలో మరొక వెనుకబాటు లక్షణం కానవస్తున్నది ఈనాటి తెలుగు సాహిత్యం సిద్ధాంత సంఘర్షణలకు గురిఅయి ఉన్నది అందులో వర్గదృక్పథాల ప్రభావం బలంగా ఉంటున్నది కొద్ది మంది రచయితలు మాత్రమే ''ప్రభుత్వ'' వేదికలమీద గజ్జెకట్టుతున్నారు మరికొందరు ప్రభుత్వం దమనకాండకు గురి అవుతున్నారు సాహిత్యం నిషేధాజ్ఞలకు గురి అవుతున్నది

ఈనాటి సాహిత్యం విజృంభణ మనసులో ఉంచుకుని రచయిత్రుల మహాసభలనూ, వాటి కార్యక్రమాలను చూస్తే, చాలా పాత కాలపు సాహిత్య సదస్సులు స్ఫురిస్తున్నాయి రచయిత్రులు తమ రచనలకు గల గిరాకీని గురించి, సినిమా రంగం తమకు వడ్డించిన విస్తరిగా ఉండటం చూసి తృప్తి పడే స్థాయి దాటి ఎంతదూరం వచ్చారన్నది ఈ మహా సభలలో వ్యక్తం కావటంలేదు ఇది కేవలమూ ప్రభుత్వ వర్గీయుల ఆశీస్సులతో జరిగిన సదస్సుగా కనబడుతుంది

మహిళలు కొత్తగా సామాజిక చైతన్యం పొందుతున్నారని ఒప్పుకోవాలి ఇంతమంది రచయిత్రులు తెలుగు సాహిత్యరంగంలో ఏనాడూలేరు కాని ఈ జాగృతి సాహిత్యంలో ఏరూపంలో ప్రతిబింబిస్తున్నది? అనాదిగా పురుషులచేత అణగార్చి ఉంచబడిన మహిళ కలం తీసుకొని ఏం రాస్తున్నది? ఈ విషయం మహాసభలో చర్చకు ప్రముఖంగా వచ్చి ఉండవలసింది రంగనాయకమ్మగారు ఒంటరిగా ప్రారంభించిన ''తిరుగుబాటు''కు ఎంతమంది మహిళలు కలాలు అందించారు? ఈనాటి ఆర్థిక, సామాజిక రాజకీయ పరిస్థితులలో రచయిత్రి తన స్థానాన్ని ఎలా అంచనా వేసుకుంటున్నది?

సాహిత్యంలో రచయిత్రుల రచనలు ఒక ప్రత్యేక శాఖ కాదు ఉన్న సాహిత్య శాఖలలో ఏ రచయిత్రి రచనకు చోటుంటే ఆ రచయిత్రిది అదేశాఖ కాని, ఈనాడు ప్రముఖ రచయిత్రులందరూ ఒక వేదిక మీదికి రాగలగటమే వారి వెనుకబాటుకు అన్నిటినీ మించిన ప్రత్యక్ష నిదర్శనంగా కనబడుతుంది సాహిత్య సదస్సులకూ, పేరంటానికీ రవంత తేడా ఉండటం మంచిది

*ముద్రణ ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 14-3-1975*

# 11. అ,ఆ, ఇ, ఈ, విటమినులు

మనం తినే ఆహారంలో విటమినులు చాలా అవసరం ఆ విటమినులు శరీరావసరాలకు సరిపడా మనం ఆహారంలో లేనట్టయితే మనం వెంటనే జబ్బు చేస్తాం (తొందరపడకండి, ఇది ఆరోగ్య వ్యాసంకాదు, నేను డ్యాక్టర్నీ కాను!)

విటమినులను గురించి స్థాలీపులాక న్యాయంగా ( ఇక్కడ వాడవలసిన న్యాయం ఇదేనా?) సాధారణనరమానవులు తెలుసుకోవలసిన రెండు ముక్కలూ అనుకున్నాం కనక ఇక మనం వాటిని వదిలేసి వాటి నామధేయాలు పరిశీలింతాం

ఈ విటమినులను కనిపెట్టినవాళ్ళు ఎందుకో వాటికి ఎ, బి, సి, డి, వగైరా అక్షరాలను తగిలించారు ఇవి ఇంగ్లీషు అక్షరాలు అవే గ్రీక్ అక్షరాలైతే అల్ఫా, బీటా, గామా, డెల్టా అనాలి, ఉర్దూ అక్షరాలైతే అలీఫ్ బే, పే, తే వగైరా అనుకోవాలేమో

ఏమైనప్పటికీ విటమినుల దగ్గిర ఆరోగ్య సూత్రాలూ, సాహిత్యమూ ఒకదాన్ని ఒకటి అంటుకున్నాయని నా దృఢమైన నమ్మకం దీన్ని గురించి ఒక బ్రహ్మాండమైన రీసెర్చి చేసి, థీసిస్ రాసి, డ్యాక్టరేట్ కొట్టేస్తానన్న ఆశ నాకులేకపోలేదు

ఆరోగ్యం - విటమినులు - అక్షరమాల - సాహిత్యం! ఆరోగ్యానికీ సాహిత్యానికీ గల సంబంధం కొట్టవచ్చినట్టు కనిపిస్తూ ఉంది ఎవరూ కాదనటానికి లేదు ఒక్కోరకం సాహిత్యం చదివితే జబ్బు చెయ్యటం మనకందరికీ అనుభవంలో విషయమే!

ఈ విషయాన్ని ప్రభుత్వాలు కూడా గుర్తించాయి అందుకనే అవి అప్పుడప్పుడూ కొంత కొంత సాహిత్యాన్ని నిషేధిస్తూంటాయి ఇలాంటి నిషేధాలకు ముఖ్యకారణం ఒక విధమైన పిరికితనమే అయినప్పటికీ, ప్రజారోగ్యం దృష్ట్యా జరిగినట్టయితే నిషేధాలు లాభిస్తాయి

కాని అది జరగటం లేదు దాదాపు ఏ పుస్తకాన్ని నిషేధించినా భయకంపితత్వం (అటువంటిమాట ఉంటే) కారణంగా ఉంటున్నది దేన్ని చూస్తే మనకు భయం వేస్తుందో దాన్ని మనం చంపటానికి యత్నిస్తాం అది మానసిక దౌర్బల్యం

విటమినులు లేని సాహిత్యాన్ని శాస్త్రీయ పద్ధతిలో అదుపుచేయవచ్చునని తోస్తుంది ఉదాహరణకు సాహిత్యశానిటరీ ఇన్స్పెక్టర్లను ఏర్పాటు చెయ్యటం గురించి మీరేమంటారు? ఆ మాటకు వస్తే మామూలు శానిటరీ ఇన్స్పెక్టర్లు చేతులు తడి చేసుకోవటం లేదా ఏమిటి?

ఇంకో ఐడియా -

సాహిత్య శాస్త్రజ్ఞులు కొందరు ఒక కమిటీగానో, పరిషత్తుగానో ఏర్పడి, ఒక సెమినార్ జరిపి - కావలిస్తే కేంద్ర విద్యాశాఖా మంత్రి చేత ప్రారంభోత్సవం చేయించవచ్చు! - ఏయే రకం సాహిత్యంలో ఏయే ప్రమాణాలలో విటమినులూ, మాంసకృత్తులూ, కొవ్వుపదార్థాలూ, కార్బోహైడ్రేట్‌లూ ఉన్నదీ జాబితా వేయించవచ్చు

ఆ జాబితా ఇంచుమించు ఇలా ఉంటుంది

డిటెక్టివు సాహిత్యం - విటమినులు 0 2, మాంసకృత్తులు 0 1, కొవ్వు పదార్థాలు 0 2, కార్బోహై 5

సెక్సు సాహిత్యం విట 0, మాంస 0, కొవ్వు 1, కార్బో 2
సినిమా సాహిత్యం విట 0, మంస 0, కొవ్వు 0, కార్బో 0

(పై అంకెలు ఉజ్జాయింపుగా వేసినవి ప్రత్యేక గ్రంథాల జనన కాలాన్ని బట్టి ఈ అంకెలు మారవచ్చు గనక వీటిని పరమ ప్రమాణాలుగా ఎంచరాదు)

ఆ తరువాత దేశమంతటా (కావలిస్తే ఉత్తర దేశంలో ఎక్కువ సంఖ్యలో ఉంచుకోనివ్వండి) రీసెర్చి కేంద్రాలు ఏర్పాటు చెయ్యాలి ఈ కేంద్రాలలో ఎలాటి ప్రయోగాలు జరగాలయ్యా (లేక, జరగాలమ్మా) అంటే

గినీ పిగ్గుల్లాగా ప్రతీ కేంద్రంలోనూ కొందరు వ్యక్తులు, వివిధ వయస్సుల వాళ్ళు ఉంటారు అందులో ఒక గినీ పిగ్గుకు - క్షమించాలి - వ్యక్తికి - ఒక నెల రోజులపాటు ఒకే రకం సాహిత్యం - మాట వరసకి డిటెక్టివు సాహిత్యమనుకోండి - ఇవ్వాలి నెలరోజుల అనంతరం ఆ మనిషి జీర్ణశక్తినీ, నరాల స్థితినీ, శ్రవణ శక్తినీ, బ్లడ్ ప్రెషర్‌నూ శ్రద్ధగా పరిశీలించాలి

ఈ విధంగా అన్ని రకాల సాహిత్యాన్నీ ప్రయోగించి చూసిన తరవాత ఏ సాహిత్యాన్నీ నిషేధించవలిసిన అవసరం ఉండదు ఆహారాన్ని బాలెన్స్ చేసినట్టుగా, చదివే పుస్తకాలను కూడా బాలెన్సు చేసుకోవచ్చు

ఉదాహరణకు, రెండు డిటెక్టివు నవలలూ, భగవద్గీతలో ఒక అధ్యాయమూ, ఒక తెలుగు దినపత్రిక ఎడిటోరియల్, సోషలిస్టు దృక్పథంతో రాసిన ఒక రాజకీయ వ్యాసమూ కలసి బాలెన్స్‌డ్ పఠనం కావచ్చు

సాధారణంగా పుస్తకాలను నిషేధించే వాళ్లకి జనం అచ్చుగా ఆ పుస్తకాన్నే చదవరనే జ్ఞానం ఉండదు వాళ్లననవలసిన పనిలేదు శాస్త్రజ్ఞులే ఉత్త పుణ్యానికి తాము కంగారు పడి ప్రపంచాన్ని కంగారు పెడుతుంటారు

ఎవడో శాస్త్రజ్ఞుడు ఏ పాపమూ ఎరుగని ఎలుకల్ని తీసుకొచ్చి వాటిని రోజుల తరబడి ఏమారువా నెయ్యి మీదనో బతికిస్తాడు వాటి బొచ్చు కాస్తా రాలిపోతుంది లేదా కళ్లు పోతాయి (అబ్బురమా?) ఆ మారువా నెయ్య తినవద్దనీ, తింటే జుట్టూడుతందనీ, కళ్ళు పోతాయనీ అంటాడు

అంతమాత్రానికి శాస్త్రపరిశోధన కూడదని కాదు అచ్చుగా మారువానెయ్యి మాత్రమే తింటే ఎలుకలకుగాని మనుషులకుగాని ఏం జరిగేదీ తెలుసుకోవలసిందే అస్తమానం ఒకటే పదార్థం తింటే జబ్బు చెయ్యక తప్పదు - అది ఎంత మొనగాడు ఆహారమైనా సరే

ఈ ప్రమాదం ఆహారం విషయంలో కంటె పుస్తక పఠనం విషయంలో హెచ్చు అమెరికాలో అచ్చుగా కామిక్ స్ట్రిప్స్ మాత్రమే చదివే పిల్లలు-వాళ్ళ తల్లులనూ, ఇతరులనూ, గుండేసికొట్టి చంపి చాలా గొప్పపని చేశామనుకున్నారు

ఈనాడు మన దేశంలో డిటెక్టివు సాహిత్యముతప్ప చూడనివాళ్లున్నారు రెండు దశాబ్దాల క్రితం గాంధీజీ రచనలుతప్ప చదవని వాళ్లుండేవాళ్ళు వాళ్ల మానసిక ఆరోగ్యం క్రమంగా క్షీణించటం గమనించబడింది తప్పు గాంధీజీ రచనలది కాకపోవచ్చు, అది తప్ప ఇంకేమీ చదవకపోవటం తప్పే

కాని అక్కడక్కడా కొందరు దృఢమైన తత్వాలు గల వాళ్ళు కనిపిస్తారు వాళ్లు అన్ని రకాల సాహిత్యమూ చదివికూడా ఆరోగ్యంకాపాడుకుంటారు కొందరు అచ్చుగా శాస్త్రగ్రంథాలే చదువుతూ కూడా చెక్కు చెదరకుండా ఆరోగ్యాన్ని కాపాడుకుంటారు

ఇందులో వ్యక్తిగతమైన అభిరుచులు కొన్ని చిక్కులు తెచ్చిపెడుతున్నాయి కొందరికి డిటెక్టివు సాహిత్యం పేరు చెబితేనే పడదు మరి కొందరికి మార్క్సిస్టు సాహిత్యం జ్ఞాపకం వస్తేనే కడుపులో తిప్పుతుంది అనేకమందికి వైజ్ఞానిక సాహిత్యమంటే విముఖత్వం

ఇటువంటివాళ్లు సామాన్యంగా తప్పుడు ప్రచారం విని చెడిపోయినవాళ్లయి ఉంటారు అనుమానమూ, భయమూ వాళ్లని ఆవేశించి ఉంటాయి కొందరు కొందరు తత్వాలకు కొన్ని కొన్ని రకాల సాహిత్యం పడకపోవటం కూడా కద్దు చీకట్లో బయటికి వెళ్లలేనివాళ్లు ''అయిదు శవాలు'' అన్న డిటెక్టివు రచన చదవటం అంత మంచిది కాదు కార్మికులు చేసిపెట్టే లాభాలతో కొత్త పరిశ్రమలను నెలకొల్పుతూ, 'నేను ఇన్నివేలమందికి బతుకు తెరువు చూపిస్తున్నాను'' అనే పెట్టుబడిదారు మార్క్సు చెప్పిన ఆర్థిక సిద్ధాంతాలు చదవటం వృథా జంతుజాలమంతా పనిపెట్టుకుని భగవంతుడు సృష్టించినదేనని నమ్మదలచిన వాడు పరిణామవాదం చదివి బాగుపడడు చదవదగిన సాహిత్యమంతా వేదకాలంలోనే రాయబడిందనే వాణ్ణి మన ప్రపంచంలో ఉన్నట్టుకూడా భావించలేం!

ఇంతకూ అసలు విషయమేమంటే - అ ఆ ఇ ఈ వగైరా విటమినులు సాహిత్యంలో కూడా ఉన్నాయి రచనలు చేసేవాళ్లు అని లేని రచనలు చెయ్యగూడదు చదివేవాళ్లు వీలయినంత వరకు రకరకాల రచనలు చదవాలి తప్ప నిష్కారణంగా కొన్ని రకాల రచనలు చూసి బెదిరిపోగూడదు ఈ రెండూ కూడివచ్చిననాడు ప్రజల యొక్క మానసిక ఆరోగ్యం బాగుంటుంది

*తెలుగు స్వతంత్ర వారపత్రిక, 1-3-1957*

# 12. మన వడ్డించేవాళ్లు

''డిటెక్టివు అంతక హద్భుతరచనా ప్రవీణ శ్రీయుత టి వి శంకరంగారికి, మీ అభిమాన రచయిత ఫలానా ఫలానా నమస్కరించి వ్రాయడమేమనగా, నిన్నరాత్రి నిద్రపట్టక ఒక పత్రిక తిరగవేస్తూండగా అందులో నేటి తెలుగు వాఙ్మయకర్తలు అనే వ్యాసం కనబడినది దానిని సహాశిహపరియంతము సమీక్షించి చూచినాను అందులో ప్రఖ్యాత అభిమాన రచకులైన మీ పేరు ఎక్కడా కనిపించలేదు ఇది పక్షపాతము కాదా?

మిగిలిన ఉత్తరం అచ్చులోకివచ్చి తెలుగు ''వాఙ్మయం''లో శాశ్వతంగా నిలిచిపోవటం అంత వాంఛనీయం కాదు మన అభిమాన రచయితలకు ఏమాత్రం అవమానం కలిగిందనిపించినా మనకు ఆగ్రహం రావటం సహజం వాళ్లకు పబ్లిషర్లుగాని, పత్రికలాళ్లుగాని డబ్బు ఎగగొట్టారంటే మనం అంత బాధ పడం, కాని దొడ్డి సంభావనల్లాటి విమర్శక వ్యాసాల్లో మన అభిమాన రచయిత పేరు కనిపించకపోతే చచ్చే కోపం వస్తుంది

ఈ ఉత్తరం రాసిన ''నా అభిమాన రచయిత''ను నేనెరుగను కాని పేరు అచ్చులోకి ఎక్కాక అభిమానించేవాళ్ళుండక పోతారా? అతను చెప్పే వ్యాసం కూడా నేను చూడలేదు ఆ వ్యాసంలో నన్ను గురించి ఏమీ లేనందుకు అతనికి కోపం రావటమే నన్ను కొంచెం ఆశ్చర్య పరిచింది తరుచు ఈ సాహిత్య సమీక్షలు రాసేవాళ్ల ఎటువంటివాళ్ళో, వాళ్ళు ఎటువంటి పరిస్థితులలో వాటిని రాస్తారో ఆ అబ్బికి తెలీదు

నేనొక రచయతను ఎరుగుదును అతను అమాంబాపతు విషయాలను గురించి పత్రికలలో రాస్తూండేవాడు అయితే వాటిని ఎవరూ చదివేవారుకారు, తలిచేవారుకారు, చెప్పుకునేవారుకారు అతను ఏ బుద్ధినో ఉండి ''మనకథకులు'' అని ఒక వ్యాసం రాశాడు వెంటనే ''గోల్'' చేసి ఊరుకున్నాడు!

అది అచ్చయిన రోజునే నలుగురు అతనితో, ''కథలమీద ఏదో రాశావే?'' అని ప్రశంస ధ్వనించేటట్టూ, నిలవదీసి అడిగితే 'నేను ఆ వ్యాసాన్ని మెచ్చుకోలేదే?'' అనటానికి వీలుగానూ అన్నారు

ఆ వ్యాసంలో మెచ్చుకోబడ్డ ఒక కథకుడు, తనను మెచ్చుకున్నందుకు థాంక్స్ చెప్పలేదు గాని, ''మీరు రాశారుచూడండి? ఆ ధోరణిలో విమర్శక వ్యాసాలు విరివిగా రావటం ఎంతైనా వసరం మీరు నిజంగా తెలుగు సాహిత్యానికి మంచి సేవ చేశారు,'' అన్నాడు

ఇది యుద్ధానికి పూర్వసంగతి ఆ తరవాత సమీక్షలు రాయటంలోగల సౌకర్యం అందరూ తెలుసుకున్నారు అటువంటి వ్యాసాలను పాఠకులేగాక రచయితలుకూడా చదువుతారు (కొందరు చదివినట్టు మొహం పెడతారు కొందరు బిడియం విడిచేసి చదివామని ఒప్పుకుంటారు )

సమీక్షలు రాయటంలో చిక్కులు లేవని కాదు రాతగాళ్లు ఉన్మాదులతో సమానం ముఖ్యంగా వాళ్ళ కీర్తివిషయంలో సమీక్షకులు వాళ్ళను విమర్శించినా, తక్కువ చేసినా తుఫాను రేపేస్తారు వాళ్ళను తృణీకరించి అసలు వాళ్ల ప్రశంసే మానేస్తే చంపేస్తారు

ఇందుకు సమీక్షకుడు ఒడిగట్టాలి నన్నడిగితే, ఇది పెద్ద ప్రమాదంకూడా కాదు ఎందుకంటే మనిషియొక్క అహంకారానికి తగిలే గాయాలు అతి సులువుగా మానిపోతాయి (నన్నే ఉదాహరణగా తీసుకొండి నాకు ఉత్తరం రాసిన మనిషి నా పేరు ఫలానా సమీక్షలో లేదనేసరికి చాలాబాధ కలిగింది ఆ మనిషేసమీక్షకుణ్ణి తిట్టేసరికి అంత బాధా పోయింది '' ఈ సమీక్షకుడు నా గొప్పతనం తెలుసుకోలేని బడుద్దాయి అని తెలుసుకున్న వాళ్లున్నారు గదా! ఇక భయం లేదు!'' అని నాలోనేను అనుకున్నానన్నమాట )

సమీక్షకుడు గొప్ప సమీక్షకుల లిస్టులో చేరటానికి కావలసింది మరింత విమర్శనా దక్షత కాదు - ధైర్యం అందరినీ నిశితంగా విమర్శించేవాడు ఎప్పుడన్నా దారి తప్పి ఎవణ్ణయినా కాస్త మంచిమాట అంటే వాడు ''యావజ్జీవం హోష్యామి అయిపోతాడు ఈ విధంగా ప్రశంసను గరళంలాగా వాడుతూ కాలక్రమాన గొప్ప వైద్యుడు - కాదు, విమర్శకుడు అయి పోవచ్చు, కావలిసింది ధైర్యం

ఈ మధ్య ఒక మిత్రుడు '' ఏమయ్యా, ఇప్పుడు డిటెక్టివు సాహిత్యం ముమ్మరంగా ఉంది గదా, ఈ సాహిత్యాన్ని సమీక్షిస్తూ ఒక వ్యాసం రాయగూడదూ?'' అని అడిగాడు

నాకొక సిద్ధాంతం ఉంది మొద్దులాగా తిరిగే వాడికి మందులూ, బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూషన్లూ ఎంత అనవసరమో, నలుగురూ ఎగబడి చదివే సాహిత్యానికి సమీక్ష అంత అనవసరం ఏబాపతు సాహిత్యంగాని దిగజారి పోతున్నదనో ఎక్కిరావటం లేదనో తోచినప్పుడే ''జై''లు కొట్టాలి '' ఇక దక్కడు'' అని తోస్తేనేగాని సన్మానాలు చెయ్యగూడదు భమిడిపాటివారి '' ఎప్పుడూ ఇంతే'' గాళ్లు చెప్పినట్టు, బతికుండగా మెచ్చుకోవటం ఆయుక్షీణం!

అయితే ఇదంతా నా మిత్రుడితో నే ననలేదు ''డిటెక్టివు సాహిత్యం మహా సముద్రం మీద ఉప్పెనలాగా వస్తున్నది గదా, దీన్ని సమీక్షించే అర్హత నా కెక్కడిది?'' అన్నాను

నా స్నేహితుడు నాకేసి వింతగా చూసి, ''ఏం? నీకు జుట్టు నెరిసిందే? ఒకటో, అరో పళ్లు కూడా ఊడాయనుకుంటాను?'' అన్నాడు

నేను ఆశ్చర్యపోయి, ''దానికి సమీక్షకూ ఏమిటి సంబంధం?'' అని అడిగాను

''నీకింకా తెలీదా?'' అన్నట్టు నవ్వి, నా స్నేహితుడు, ''చాలా సంబంధం ఉంది అసలు ఆ రెంటినీ వేరు చెయ్యటానికి వీల్లేదు అన్నాడు

అతని ద్వారా నేను అనేక కొత్త విషయాలు తెలుసుకున్నాను వాటిని కాపీరైటు హక్కులు లేకుండా ప్రపంచానికి ఇచ్చేస్తున్నాను

దేశం స్వతంత్రమై మనకు ఇంపీరియలిస్టుల మైత్రీ, జమీందారు-పెట్టుబడిదారు సోషలిజం ప్రపంచవర్ష ప్రణాళికలూ, మొదలైనవాటితో బాటు సంస్కృతిక వికాసం హైడ్రోజెన్ బాంబ్ ఫాలౌట్ లాగా దేశమంతటా పడటంవల్ల కళలు ఉద్ధరింపు జోరుగా సాగటానికి రకరకాల అకాడమీలూ, సంఘాలూ, సెమినార్లూ పుస్తకాల పోటీలూ, బహుమతులూ, ప్రభుత్వ సన్మానాలూ, బిరుదు ప్రదానాలూ విచ్చలవిడిగా సాగుతున్నాయి

ఈ అమోఘమైన చైతన్యం వెంట అనేక మంది వ్యక్తులు కీలక స్థానాలలో ఉంచబడ్డారు వారి పని ఏమిటంటే, బిరుదించవలసిన, సన్మానించవలసిన, బహూకరించవలసిన వారి జాబితాలు వెయ్యటం

ఈ కీలకస్థానాల్లో ఉండే వారికి జుట్టు నెరవటమూ, పళ్ళూడటమూ ముఖ్యమైన అర్హతలు కించుత్తు అంధత్వమూ, బధిరత్వమూ ఉంటే ఇంకా మంచిది

వీరు ముందుగా కొన్ని జాబితాలు తయారుచేస్తారు ఈ జాబితాలలో అర్ధ శతాబ్దం క్రితం అంటే 1907కు పూర్వం అనుకుందాం - సుప్రసిద్ధ కళాకారులుగా, రచయితలుగా, వగైరా వగైరాగా ఉండిన వారి పేర్లుంటాయి వీరిలో ఎవరెవరు పరమపదించారో వారి పేర్లను ఎర్ర పెనసలుతో కొట్టేస్తారు ( ఇందులో కమ్యూనిస్టు ప్రచారం ఉందనుకునేరు నీలం పెనసలైనా పనికొస్తుంది కాని రెండు రంగుల పెనసళ్ళతోనూ పని ఉంది అందుచేత మనం ఎర్ర పెనసలును వదిలించుకోలేం )

ఆ తరువాత, ఎర్రపెనసలుతో కొట్టివెయ్యగా మిగిలినవాళ్లలో ఇప్పటికీ ఉధృతంగా జనాదరణ పొందుతున్న వాళ్లెవరైనా ఉన్నారేమో విచారించాలి యాభై ఏళ్ల తరవాత ఇంకా బతికుండటమేగాక, కళాజీవిగా కూడా బతికి ఉన్న ఆ వాడెవడైనా ఉంటే వాడిపేరు నీలం పెనసలుతో కొట్టెయ్యాలి (దీనితో పని ఉంటుందని నేను ముందు చెప్పాను )

ఆ తరవాత మిగిలినవాళ్లందరికీ బిరుదు ప్రదానాలూ, శాలువలూ, ఫోటోలూ, బహుమానాలూ ఇచ్చెయ్యొచ్చు కళోద్ధరణ చెయ్యటానికిదే సంప్రదాయసిద్ధమైన పద్ధతి

ఇంత దేశంలో, ఇన్ని భాషలలో కళలను ఉద్ధరించటం సామాన్యమైన విషయం కాదు ఆ కార్యక్రమం కింద ఉత్తమ రచయితల రచనలన్నిటినీ ఏర్చికూర్చి, ఆటే మార్చకుండా తర్జుమాలు కూడా చేయించి, ప్రచురించాలి సింహావలోకనాలు రాయించాలి వీటికి జుట్టు నెరిసి, పళ్లూడిన నాలాటివాళ్లను మంచి జీతాల మీద నియమించాలి

వీళ్లు చేసేపని చరిత్ర ప్రసిద్ధమే ఆయినా చెయ్యటం చాలా సులువైనది ఉత్తమ రచనలను ఏరటానికి నన్నే నియమిస్తే నేనేం చేస్తానంటే ఎుందు నా బంధు మిత్రుల్లో రచయితలనిపించుకున్న వాళ్ల పేర్లన్నీ రాసుకుంటాను అప్పటికే పని ముగిసిపోవచ్చు ఒకవేళ ముగవకపోతే నాకు అభిమానులైన వాళ్లను పిలిచి, ''తమ్ముడూ, నీకు నచ్చే ముగ్గురు (లేక, నలుగురు) రచయితల పేర్లు కోరుకో, వాళ్ల రచనలు సాహిత్య వేదంలోకి ఎక్కేట్టు నేను నీకు వరమిస్తున్నాను!'' అంటాను

కాని నా బంధుమిత్రుల్లోనే కొందరి పేర్లు తగ్గించవలసి వచ్చిందో, చచ్చానే! నా పాట్లు ఆ ఈశ్వరుడికెరుక!

సమీక్షలు కూడా చాలా సులువుగా రాయవచ్చు నా చిన్నతనంలో నేనెరిగిన రచయిత లందరికీ తలా ఒక పేరా పారేస్తాను మిగిలిన చోటులో కొద్దిమంది ఆధునికులకు స్థానం ఇవ్వవచ్చు వీళ్ళలో మనకు నచ్చనివాళ్లు చాలా మంది ఉంటారు వాళ్ళను వొలేసి చరిత్రలో వాళ్ల పేర్లు ఒక అర్ధశతాబ్దంపాటు లేకుండా తుడిపెయ్యవచ్చు ఇది మంచి అవకాశం మిగిలినవాళ్ళలో నేను ఎరిగిన వాళ్లను గురించీ, వాళ్ళు రాసినట్టు నాకు తెలిసిన ఒకటి రెండు రచనలను గురించీ రాయవచ్చు

ఇందుకుగాను ఆటే శ్రమపడటం వృథా ఇదే మామూలు పత్రికకు రాయటమైతే చాలా బాధ్యతతో కూడుకున్న పని నెల తిరిగేసరికల్లా ఫెడీలుమని ఆ పత్రికలోనే సమాధానం లేక విమర్శ వచ్చేస్తుంది అకాడమీలవాళ్లు పుస్తకాలు అర్ధ శతాబ్దందాకా మళ్ళీ రావు అవి అన్ని లైబ్రరీల్లోనూ పెడతారు వాటికి ఎవరైతే రాస్తారో వారే క్రియకు సంపాదకులు కూడానూ అంటే రాసినది అచ్చుపడకుండా చూసే నాధుడుండడు ఇంకో సౌకర్యమేమిటంటే, వాటిని ఎక్కువమంది చదవనుకూడా చదవరు

ఇటువంటి సమీక్షకులు తమను మెచ్చుకోందుకు రచయితలు బాధపడనవసరంలేదని నా నమ్మకం ఎందుచేతనంటే, నాకు ఉత్తరం రాసిన పెద్దమనిషి (లేక, చాలా చిన్నమనిషేనో!) మెచ్చుకుంటే ఎంత? మెచ్చుకోకపోతే ఎంత?

అతనికి ఈ విధంగా ఉత్తరం రాశాను

''అయ్యా, తమ ఉత్తరం అందింది తమరు తెలిపిన సమీక్ష గురించి వాకబుచేశాను అది రాసిన పెద్దమనిషి గురించి నాకు కూడా ఏమంత ఘనమైన అభిప్రాయం లేదు ఇట్లు టి వి శంకరం

*తెలుగు స్వతంత్ర దినపత్రిక, 22-3-1957*

# 13. సాహిత్యాభిలాష

ఈనాడు ఆంధ్రలో సాహిత్యాభిలాష చాలా హెచ్చుగా ఉన్నదనటానికి సందేహంలేదు సినిమా చిత్రాలు జనాన్ని ఎంతగా ఆకర్షిస్తున్నాయో, పుస్తకాలూ, పత్రికలూ మొదలైనవికూడా అంతగానూ ఆకర్షిస్తున్నాయి (అక్షరాస్యులతో పోలిస్తే నిరక్షరులు ఆరేడింతలుంటారన్నది జ్ఞాపకం ఉంచుకోవాలి ) చిత్ర నిర్మాతల సంఖ్యకన్నా దేశంలో పుస్తక ప్రకాశకుల సంఖ్యే హెచ్చుగా ఉన్నది పెట్టుబడిపైన చిత్రనిర్మాతలు తీసే రేటున పుస్తక ప్రకాశకులుకూడా లాభాలు పొందుతూనే ఉన్నారు

కాని ఈ సాహిత్యాభిలాష భవిష్యత్తుకు ఏవిధంగా ఉపకరిస్తుంది? నానాటికి హెచ్చే పుస్తక పఠనంవల్ల పాఠకులు జీవితాన్ని ఎంతవరకు కరతలామలకం చేసుకోగలుగుతున్నారు? ఇవి తేలవలసిన విషయాలు ఎందుచేతనంటే ప్రకృతి రహస్యాలను బట్టబయలు చెయ్యలేనిది శాస్త్రవిజ్ఞానం కాదు, జీవిత శ్రమను తేలిక చెయ్యలేనిది '' ఇన్వెన్షన్'' కాదు, జీవితపు మారు మూలలోకి వెలుగు తీసుకురాలేనిది సాహిత్యం కాదు

నా అనుభవంలో ప్రస్తుతం ఆంధ్రలో ఉండే సాహిత్యాభిలాష అధికంగా రెండు నిర్దిష్టమైన పొరలను అంటిపెట్టుకుని ఉన్నట్టు కనిపిస్తుంది ఒక పొరకు చెందిన సాహిత్యాభిలాషుల పాత కారుకు చెందినవాళ్ళు రచయితగా దేశంలో గణన పొందిన ప్రతివాళ్లీ వాళ్ల ఎంతో ఆదరంతో చూస్తారు రచనా సామర్థ్యం పూర్వ పుణ్యం చేతగాని లభించదనీ, అది లభించాక ఆ రచయిత ఏమి రాస్తున్నాడనేది అట్టే పరిగణించదగిన విషయం కాదనీ ఈ తరగతి సాహిత్యాభిలాషుల అభిప్రాయంగా కనబడుతుంది

వీరిది నిర్దిష్టమైన సాహిత్యాభిలాష అనటానికి సందేహం ఎంత మాత్రమూ లేదు ఎందుచేతనంటే సమకాలిక రచయితను సమకాలిక జీవితపు కొలబద్దలో కొలవని వాళ్లు ప్రాచీన రచయితలను వారి కాలపు జీవితపు కొలబద్దలలో గాని, నేటి కాలపు జీవితపు కొలబద్దలతో గాని కొలుస్తారని నమ్మకం ఏమీలేదు వారికి సాహిత్యం వేరే ప్రపంచం

ఇక రెండో పొరలో అత్యధిక సంఖ్యాకులైన ఆధునిక యువతీ యువకులున్నారు వీరికి సాహిత్యం ఒక వినోదకళ సినిమాలాగే, సినిమా పాటలలాగే, వీరు పుస్తకాల నుంచి అట్టే ఆశించరు, రెండుగంటల కాలక్షేపం తప్ప ఆ పుస్తకాలలో నుంచి ఒక్క జీవితసత్యాన్ని కూడా వారు సంగ్రహించగోరరు, అవి తమ నిత్య జీవితానికి ఏమాత్రమూ ఉపకరించకపోతే వారికి చింతలేదు నూరు పుస్తకాలు చదివిన అనంతరం కూడా వారికి జీవితం ఎప్పుడే ఉండినంత అయోమయంగా ఉంటే కూడా వారికి '' ఇదేమిటి?'' అనిపించదు వీరిలో చాలామంది అట్టమీది బొమ్మను చూచి పుస్తకాన్ని కొంటారు వినోదం గ్యారంటీ వున్నప్పుడు రచయిత పేరు చూసి కూడా కొంటారు అటువంటి రచయితలు ''స్టార్ వాల్యూ'' కలవాళ్ళన్న మాట

వ్యక్తిత్వం, సంఘతత్వం, లౌకిక జ్ఞానం మొదలైనవి ఏమీ లేకుండానే కొందరు రచయితలు ''స్టార్ వాల్యూ'' సంపాదించుకునే అవకాశం లేకపోలేదు - వారు తమ రచనల ద్వారా పాఠకులకు వినోదం ఇవ్వగలిగితే

ఈనాడు ప్రచురితమయ్యే సాహిత్యంలో హెచ్చు భాగం - చాలా హెచ్చు భాగం - వినోదం ఇచ్చే సాహిత్యం డిటెక్టివు నవలలన్నీ ఇదే తరగతికి వస్తాయి వీటిని చదివే వాళ్ళనూ, చదివి నిజంగా ఆనందం పొందే వాళ్ళనూ చూసి తప్పుపట్టడం అనవసరం కళల ద్వారా వినోదం సంపాదించాలనే కాంక్ష ఒక విధమైన బాల్య దశనుసూచిస్తుంది ఈ దశలో వున్న వాళ్ళకు నచ్చని సినిమా చిత్రాలు విమర్శకుల ప్రశంసలను అందుకున్నప్పటికీ ఆర్థికంగా దెబ్బతినటం మనం చూస్తున్నాం

కాని ఈ ''బాల్యదశ''నుంచి ప్రతి పాఠకుడూ ఎప్పుడో ఒకప్పుడు బయట పడతాడు ఆ తరువాత అతను అసలు పుస్తకాల మొహమే చూడకుండా పోతాడో, నిజమైన సాహిత్యాభిలాష అలవరచుకుంటాడో నిర్ణయించే అంశాలు అనేకం ఉంటాయి

అయితే నిజమైన అనర్థం సాహిత్యాభిలాషల బాల్య దశ కానేకాదు - తీయకుండా ఎల్లప్పుడూ ఆ దశలో కొన్ని వేలమంది ఉంటూనే ఉంటారు, నిజమైన అనర్థం సాహిత్య కృషి చేయగలవాళ్ళు కూడా ''స్టార్‌వాల్యూ'' కోసమో, ఆర్థిక లాభం కోసమో వినోద సాహిత్యం సృష్టించటం, దేశంలో ఉన్న పత్రికలు ఒకొక్కటే ఈరకం సాహిత్యాన్ని ''గుర్తించి'' ఆదరించటం, వినోద సాహిత్య ధాటికి తట్టుకోలేక నిజమైన సాహిత్యం తోకముడవటం

ఇవి నిజమైన అనర్థాలు, వీటివల్ల సాహిత్యం భవిష్యత్తుకు ప్రమాదం ఉంది ''ప్రజలకు అక్కర్లేని సాహిత్యం సృష్టించి ఏం లాభం?'' అని వాదించవచ్చు రాజకీయరంగంలో ఇదే వైఖరి అవలంబించటాన్ని Trailing behind the masses అంటారు అటువంటి వైఖరివల్ల రాజకీయ నాయకత్వం ఎలా రాణించకుండా పోతుందో సాహిత్య రచనకూడా అలాగే రాణించకుండా పోతుంది అత్యధిక సంఖ్యలో అమ్ముడుపోయే పుస్తకం అత్యుత్తమ ప్రజాసాహిత్యం అవుతుందనుకోవటం భయంకరమైన పొరపాటు

ఇంతకు ముందు చెప్పిన రెండు పొరల సందున సాహిత్యాభిలాష పేరిట చాలా కల్మషం ఉన్నది దాన్ని గురించి తెలుసుకోవటం అవసరం ఈ కల్మషాన్ని భద్రంగా రక్షించే వారిలో ఒక తెగ ''కళ కోసమే కళ'' అని వాదించే వాళ్ళు వీళ్ళు మూగవాళ్లు మటుకు కారు కాలికీ, వేలికీవేసి కొంత హేతువాదమూ, కొంత కృతక అభ్యుదయమూ, కొంత ఆదర్శ వాదమూ ఒకదాని కొకటి మాటు పెట్టి, కల్లిబొల్లి మాటలతో సాహిత్యం ''ఉత్తేజపరచాలి'' అనీ దాని ఆశయం ''అనిర్వచనీయానందం'' అనీ అది (ఎవరిని ఎలాగో) ''క్షాళనం'' చేస్తుందని చెప్పినట్లు చెప్పకుండా చెప్పి చిట్టచివరకు ''కళ నిష్ప్రయోజనం'' అని తేల్చి మొండిచెయ్యి ప్రదర్శిస్తారు చదవటానికి ఆనందకరంగా ఉన్నదల్లా ''కళకోసమే కళ'' అన్నవాదాన్ని బలపరుస్తుందనీ వీళ్ళ మూఢవిశ్వాసంలాగా కనబడుతుంది - ఆకర్షవంతంగా ఉండటానికి ఆడది ఏంచేసినా తప్పే అని మా అమ్మమ్మలకాలంలో వాళ్లు అనుకున్నట్టుగా

సాహిత్యాభిలాషను కల్మషంగా మార్చిన మరొక తరగతి వాళ్ళున్నారు వాళ్లు ప్రత్యేక రాజకీయ వాదాలకు సాహిత్యాన్ని వాహనంగా ఉపయోగించాలని అభిలషించేవారు వీరిలో కమ్యూనిస్టు అభిమానులూ ఉన్నారు కమ్యూనిస్టు వ్యతిరేకులూ ఉన్నారు

ఒక రాజకీయ పక్షానికి చెందినవాళ్లు జీవితరంగంలో తాము సాధించదలచిన పరిణామాలను సాహిత్యంగాని, ఇతర కళలుగాని బలపరచినప్పుడు ఆనందం కలగటంలో తప్పేమీ లేదు

అటువంటి దౌర్బల్యం నాకే ఉన్నది మార్క్సిస్టు సిద్ధాంతాలలో సంపూర్ణమైన విశ్వాసం గల నాకు ఆ సిద్ధాంతాన్ని నిరూపించే, బలపరిచే, ఉదహరించే రచన ఎక్కడ తగిలినా ఎంతో ఆనందంగా ఉంటుంది అదే విధంగా, అహింస ద్వారా సాంఘిక పరిణామాలన్నిటినీ సాధించ వచ్చుననే విశ్వాసం కల వాడికి అహింస యొక్క విజయాన్ని చిత్రించే ప్రతి రచనా అపారమైన సంతృప్తినిస్తుంది కాని నా విశ్వాసాలను బలపరిస్తే చాలు అది ఉత్తమ రచనే అని నేను అనలేను సాహిత్య కారుడుగా నాకు ప్రమాణం జీవితం సిద్ధాంతం కోసం జీవితాన్ని వక్రంగా చిత్రిస్తే ఆ రచన ఉత్తమ రచన ఎట్లా అనిపించుకుంటుందో నాకు ఏనాడూ అర్థం కాలేదు

నిజం చెప్పాలంటే కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారార్థం సృష్టి అయిన సాహిత్యంలో కూడా ఈ విధంగా జీవితాన్ని వికారంగా చెయ్యటం నాకు కనిపించింది

ఈ వక్రించిన జీవితాలను చిత్రించే రచనలను ఎవరు చదువుతారు? అవి ఎవరి హృదయాలను మార్చుతాయి? తమ రాజకీయ విశ్వాసాలను పురస్కరించుకొని మెచ్చుకునే వారిపైన కూడా అటువంటి రచనల ప్రభావం ఉండదు

మనం నమ్మే సిద్ధాంతాలు సరి అయినవి అయితే, అవి సరిగా వున్నంత మేరకు, వాస్తవ జీవితం వాటిని గట్టిగా బలపరుస్తూనేవుంటుంది, అందుచేత రచయిత జీవితాన్ని ఆ సిద్ధాంతాల ఆధారంతో అర్థం చేసుకుంటేచాలు, జీవిత సత్యాలు అవలీలగా వ్యక్తం చేయగలుగుతాడు

దేశంలో సరిఅయిన సాహిత్యాభిలాష పెంపొందించటం ఉత్తమ సాహిత్యకారుల ప్రధాన కర్తవ్యం ప్రత్యేకించి అభ్యుదయ రచయితలు ఇందుకోసం సర్వతోముఖ కృషిచెయ్యాలి

ఒక చిన్న ఉదాహరణ తీసుకుంటాను ''కన్యాశుల్కం'' ఆబాలగోపాలం చదివి ఆనందించటానికి వీలయిన నాటకం (నేను దాన్ని మొదటిసారి ఆరో ఏటో, ఏడో ఏటో చదివినట్టు గుర్తు ) కాని అది చదివి ఆనందించగల వాళ్లలో దాని సారం పూర్తిగా గ్రహించగలవాళ్లూ దాని ద్వారా రచయిత వ్యక్తం చేయదలచిన సాంఘిక సత్యాలనూ, ఆ నాటకం యొక్క సాంఘిక ప్రయోజనాన్నీ పూర్తిగా గ్రహించగలవాళ్లూ ఎందరుంటారు?

ఏ పుస్తకాన్ని గాని పూర్తిగా జీర్ణించుకోవటం చాలా కష్టమైన పని మంచి పుస్తకాలన్నీ ''కన్యాశుల్కం'' నడిచినంత సరదాగా నడవలేవు పుస్తకం ద్వారా రచయిత హృదయాన్నీ, సంస్కారాన్నీ, ఆశయాలనూ అవగాహన చేసుకోవటానికి చదివే పద్ధతి వేరు ఆ పద్ధతి అలవరుచుకోవటమే నిజమైన సాహిత్యాభిలాష

మాతరం వాళ్ళం అదృష్టవంతుల మనుకుంటాను మాకు సాహిత్య గోష్టిలో ప్రాచీన కవుల పద్యాలూ శ్లోకాలూ మాత్రమే తరచటం జరిగేది అయినప్పటికీ ఒక విధమైన రసపిపాస తల ఎత్తినాక మాకు రచయిత హృదయపు లోతులు అన్వేషించటం ఒక మానసిక వ్యాపకం అయిపోయింది ఇటువంటి వ్యాపకం లేనిదే అభ్యుదయ సాహిత్యం చదవనవసరం లేదు ఉండటం లేకపోవటం మధ్య గల తారతమ్యం, ఉన్న వాళ్ళను ఎట్లా మార్చుతున్నదీ లేని వాళ్ళను ఎట్లా మార్చుతున్నదీ, చూపితేనే గాని జీవిత సత్యం వ్యక్తం కాదు అందుకే నినాదాలు సాహిత్య సృష్టికి ఆధారభూతాలుగా పని చెయ్యలేవని నేను గట్టిగా నమ్ముతూ వస్తున్నాను

సాహిత్యాభిలాష పెరగాలంటే సాహిత్య గోష్ఠుల సంప్రదాయం కూడా ఏర్పడాలి (చవుకబారు సాహిత్యం చదివే వాళ్ళు చదివినవెంటనే పుస్తకాన్ని మరచిపోవటానికి యత్నిస్తారు )

మంచి పుస్తకాలు కొందరి మనస్సులకైనా జిడ్డులాగా పట్టుకోకతప్పదు వారే ఇతరులలో సాహిత్యాభిలాష పెంపొందించాలి

విమర్శనాశక్తి పెరిగితేనే గాని సాహిత్యాభిలాష పెరగదు (నేను మొట్టమొదట పేర్కొన్న సాహిత్యాభిలాషులలో విమర్శనాశక్తి దాదాపు ఏమీ లేనట్టు కనబడింది ) విమర్శనాశక్తి లేకుండానే పుస్తకాలను మెచ్చుకునే వాడు ఆ పుస్తకం వల్ల తాను ప్రయోజనం సాధించలేడు సరికదా ఇంకొకరు లాభం పొందేటట్లు కూడా చెయ్యలేడు

చదవటానికి మాత్రమే పనికివచ్చి నలుగురిలో చర్చించటానికి పనికిరాని పుస్తకం ఏమంత చెప్పుకోదగిన పుస్తకం కాదు

సామాన్యంగా సాహిత్యాభిలాషులు - కనీసం సాహిత్యాభిమానులనుకునే వారు - వాళ్ళ ఊళ్లో ఒక సంఘం ఏర్పాటు చెయ్యటం, వీలయినప్పుడల్లా ఒక పేరు మోసిన రచయితను పట్టుకొచ్చి మాట్లాడించటం, లేకపోతే ఏ కవిచేతనో కొన్ని పద్యాలు, గేయాలూ చదివించటం, ఉత్సాహం పుట్టినప్పుడు ఎవరినో పట్టుకొచ్చి సన్మానం జరపటం, చాలా గొప్ప పని చేశామని ఎవరిదారిన వారు వెళ్ళిపోతుండటం పరిపాటిగా వుంటున్నది ఇది సాహిత్యాభిలాషను పెంపొందించే కార్యక్రమంలో ప్రధానాంశం ఎంతమాత్రం కాదు నిజమైన సాహిత్యాభిలాష ఇంకో పరిమితమైన వలయంలో నలుగురైదుగురి మధ్య గోష్ఠిరూపంలో ప్రారంభమవుతుంది పుస్తకాల మంచి చెడ్డలూ, మంచి పుస్తకాలలో వుండే సారమూ, ఒక్కొక్క రచయితలో జరిగే పరిణామమూ, వేరువేరు రచయితల దృక్పథాలలో, కావ్య వస్తువులలో వుండే తేడాలూ - ఇటువంటి వాటిని గురించి చర్చించటంతో సాహిత్యాభిలాషకు సరిఅయిన పునాది పడుతుంది సాహిత్యాభిలాష పెంపొందించుకోగోరే వారు నన్నయ మొదలు దాశరథి దాకా అందరు కవుల రచనలనూ చదవవచ్చు ఆధునిక సమస్యల వెంట వుండే సంకుచిత భావాలూ, వైషమ్యాలూ బాధించవు గనుక సాహిత్యాభిలాష తెలుగు భారతంతోనే ప్రారంభించటం ఉత్తమోత్తమం ఇటువంటి సాహిత్యాభిలాష జనసామాన్యానికంతటికీ అందుబాటులోకి వస్తుందా అని కొందరికి శంక కలుగవచ్చు సాహిత్యం చదివే విరామం ఉన్న ప్రతి వాడికి సాహిత్యం గురించి తెలుసుకునే అవకాశం ఉంది ఎన్ని పుస్తకాలు చదివామన్నది ముఖ్యంగాదు, చదివిన పుస్తకాలు ఎంత బాగా చదివామన్నదే ప్రశ్న లేనిపక్షంలో సాహిత్యాభిలాషకు ప్రయోజనమే వుండదు

*ముద్రణ అభ్యుదయ మాసపత్రిక, ఏప్రిల్ 1957*

*పునర్ముద్రణ సాహిత్య ప్రయోజనం, విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, అక్టోబరు 1969*

# 14. కళాకారుడి స్వాతంత్ర్యం

కళలు ప్రజల కోసం సృష్టి అవుతాయి, వాటిని సృష్టించే వారికి స్వేచ్ఛ ఉండాలి

ఈ విషయాలను గురించి అందరూ ఒప్పుకుంటారు

ఎవడైనా యువకుడు, ''కోయిల ఎందుకు పాడుతుంది,? నా ఆత్మానందం కోసమే నేను పాడుకుంటున్నాను'' అంటే సహృదయులు ''బాగుంది'' అన్నప్పటికీ, కళలన్నీ కళాకారుల

ఆనందం కోసమే సృష్టి అవుతున్నాయనీ, ప్రజలు కాకతాళీయంగా వాటిని చదువుతున్నారనీ ఒక్కరు కూడా అనుకోరు

ఆ మాటకు వస్తే కోకిల కేవలం తన ఆనందం లోకానికి వెలిబుచ్చటానికే పాడుతున్నదనుకోవటమూ పొరపాటే జుట్టు పీక్కుని పద్యాలు రాసి, కొట్టేసి, మళ్ళీ రాసి, పది మందికీ వినిపించి, వాళ్ళు భేషన్నాక ఏ పత్రికలోనో అచ్చు వేయించుకోవటాన్ని ''పాడుకోవటం'' అనటం కూడా ఏమంత సబబు కాదు

కళాకారుడికి ఉండవలసిన స్వేచ్ఛను గురించి కూడా ఎవరికీ రెండో అభిప్రాయమంటూ ఉండే అవకాశం లేదు ఎందుకంటే, ప్రభుత్వం సినిమా చిత్రాల నిడివిని అరికట్టే ఆలోచన చేసినప్పుడు కూడా పెద్ద ప్రొడ్యూసర్లు, '' ఇందువల్ల కళా సృష్టిలో కూడా మాకు స్వేచ్ఛ లేకుండా పోతున్నది!'' అని గట్టిగా వాదించారు

కాని ప్రజల కోసం కళలను సృష్టించే సమస్యా, కళాకారుడి స్వేచ్ఛ సమస్యా కూడా, లోతుగా ఆలోచించి చూస్తే, చాలా క్లిష్టమైనవని బోధపడుతుంది

ముందు ప్రజల కళలను తీసుకుందాం

దేశంలో ఎంతమంది మనుషులయితే ఉన్నారో, అందరి కళావసరాలూ తీరవలసిందే అది కూడా ఒక ప్రాథమిక హక్కు లాంటిది కాని ఈ హక్కు అమలు జరగటంలో అనేక రకాల సమస్యలు ఏర్పడతాయి

అందులో ఒకటి సాధనాలకు సంబంధించినది చదువురాని వారికి పుస్తకాలు పనికిరావు బీదవాళ్ళు కళానుభూతి కోసం డబ్బు ఖర్చు చేయలేరు నాటకాలు గాని, స్టేజి ప్రదర్శనలు గాని విరివిగా ఇవ్వటానికి తగినన్ని థియేటర్లు లేవు సినిమా అందరికీ పనికివచ్చే సాధనం అది బీదలకు సయితం అందుబాటులో ఉంటుంది అందులో సాహిత్య, శిల్ప, సంగీత, నాట్య, నృత్యాది కళలు చేరి ఉన్నాయి కనుక సినిమాల ద్వారా ప్రజలకు సమగ్రమైన కళానుభూతి లభించే అవకాశం కూడా ఉన్నది కాని సినిమాల విషయంలో కూడా సాధన సమస్య ఉండనే ఉన్నది దేశంలో అత్యధిక సంఖ్యాకులకు సినిమా థియేటర్లు అందుబాటులో లేవు

అయితే ప్రజల కళల విషయంలో ఈ సాధనల సమస్య నిజంగా అంత తీవ్రమైనది గాదు ప్రభుత్వం పూనుకుని పల్లెపల్లెకూ ఒక లైబ్రరీ, ఒక రేడియోసెట్టు ఒక చిన్న సినిమా థియేటరూ, ఒక స్టేజి ఏర్పాటు చేసినట్టయితే ఈ సమస్య తీరిపోతుంది

అంత సులువుగా పరిష్కారంగాని సమస్య ఏదంటే, ప్రజల కోసం ఉత్పత్తి అయ్యే కళలస్వరూప స్వభావాలు లోపభూయిష్టంగా ఉండకుండా చూడటం ఒక రేడియో ప్రోగ్రాం తీసుకున్నా, ఒక సినిమా చిత్రం తీసుకున్నా దాని స్వరూప స్వభావాలను నిర్ణయించే వ్యక్తులు కొందరుంటారు వారి నిర్ణయాలను శాసించే అంశాలు అనేకం ఉంటాయి వారానికి ఇన్ని నాటకాలు, ఇన్ని ప్రసంగాలు ఏర్పాటు చెయ్యాలన్న సమస్య రేడియో కార్యక్రమాలను నిర్ణయించే వారిని ఎదుర్కొంటుంది ఆ సమస్యను వారు తమ శక్త్యనుసారం పరిష్కరించుకోక తప్పదు పత్రికా సంపాదకులది కూడా ఇంచుమించు ఇదే సమస్య - పేజీలను నలుపు చెయ్యటం

ఈ బాధ్యతలను నిర్వహించే వారు సాధారణంగా సంపూర్ణమైన సంతృప్తిని ఏనాడూ పొందలేరు రేడియో కార్యక్రమాలు నిర్ణయించే వారు కొత్త శీర్షికల కోసం తడువుకోవటమూ,

గత్యంతరం లేక ఏదో ఒక చెత్త విషయం ఎన్నుకోవటమూ జరగవచ్చు అలాగే పత్రికా సంపాదకుడు తనకు అంతగా నచ్చని వ్యాసాలను కూడా ప్రచురించవలసి రావచ్చు

సినిమా చిత్రాలు నిర్మించే విషయంలో చిత్రనిర్మాతల నిర్ణయాలను శాసించే అంశాలు పూర్తిగా వేరు సినిమా చిత్రం ప్రధానంగా అమ్మకపు సరుకు అది ప్రజల కళావసరాలను తీరుస్తుందా లేదా అన్న సమస్య నిర్మాతకు కలగదు అన్ని అమ్మకపు సరుకుల్లాగే అది డబ్బిచ్చే వాడికి తృప్తినివ్వాలి - వినోదం దాని ప్రధాన ఆకర్షణ, లాభాలు తీసుకురావటం దాని ప్రప్రథమ విధి

చిత్ర నిర్మాత ప్రజల కళావసరాలకి శత్రువూ కాడు పోషకుడూ కాడు డబ్బు వచ్చిన చిత్రాన్ని కళ నెపంగా విమర్శిస్తే ఆయన సహించడు తన చిత్రంలో ఎవరికైనా కళ కనిపిస్తే ఆయనకు అభ్యంతరం ఉండదు కళ కోసం తన రాబడికి భంగం కలిగేలాగ కనబడే పనులు చెయ్యమంటే ససేమిరా ఒప్పుకోడు

ఇంకొక సమస్య, ప్రజల కళలను నిర్ణయించే ఈ రేడియో కార్యక్రమ నిర్ణాయకుడూ ఈ పత్రికాధిపతీ మొదలైనవారు తమ పనులను విజయవంతంగా సాగించటానికి గాను కలిగి వున్న అర్హతలేవి? వీళ్ళు తమ ఆత్మసంతృప్తి గీటురాయిగా పెట్టుకుంటారా? లేక ప్రజల కళావసరాలను గురించి వీరి వద్ద కొలత బద్దలేవైనా ఉంటాయా? (తమకు "చెత్త" అని తోచినా ప్రజలు ఆప్యాయంగా స్వీకరిస్తారనే అంచనా మీద అనేక విషయాలను చిత్రనిర్మాతలు తమ చిత్రాలలో ప్రవేశపెట్టటంకద్దు తమకు తృప్తినిచ్చేవి మాత్రమే సినిమా చిత్రాలలో ప్రవేశపెట్టి కొంతకాలం గొప్పగా రాణించిన వ్యక్తి ఈనాడు వెనుకబడిపోయాడు కాని ఇతర రంగాలలో తరచుగా కీలక స్థానాలలో ఉండే వ్యక్తుల అభిరుచి, ఆత్మ సంతృప్తి వారు ప్రజలకందించే కళల స్వరూప స్వభావాలను నిర్ణయిస్తాయి )

ఇది చాలా ముఖ్యమైన సమస్య ప్రజల కోసం కళలను ఉత్పత్తి చేసే వాళ్ళకు సాధ్యమైన దృక్పథాలు రెండే ఉన్నాయి ఒకటి చిత్ర నిర్మాతలది - ప్రజల కళలను కొనుగోలు వస్తువుగా చేసి, బిస్కట్టులూ, బట్టలూ, రేడియోలూ, మందులూ అమ్మినట్టుగా, దానికి తగ్గ పబ్లిసిటీ ఆర్భాటాలతో, ప్రజలకు విక్రయించటం

రెండవది కీలక స్థానంలో ఉన్నవాడు తన అభిరుచులకి అనుగుణంగా కళల స్వరూప స్వభావాలను నిర్ణయించి, అవి ప్రజావసరాలకు ఎంతవరకు అనుకూలిస్తాయో చూడటం ఈ మార్గం అవలంబిస్తే ఒకరు అపజయం పొందిన చోట ఇంకొకరు విజయం పొందుతారు దేశంలో బుర్రకథ ప్రజాకళాసాధనంగా నీరసించి పోతున్న దశలో నాజరు దళమూ, ఇతర ప్రజా నాట్యమండలి దళాలూ ఆ బుర్ర కథకు జీవం పోయటం మనం కళ్ళారా చూశాం

ఇక మూడో పద్ధతి - ప్రజల కళావసరాలకూ, అభిరుచులకూ ఏవో ప్రమాణాలు కృత్రిమంగా ఏర్పాటుచేసి వాటి ప్రకారం దర్జీపని చెయ్యటం - చాలా హేయమైనది ఒకప్పుడు అభ్యుదయ సాహిత్య రంగంలో పనిచేసిన ఒక మిత్రుడు అప్పుడే రిఫరెండమ్ తీసుకువచ్చిన వాడిలాగా "ప్రజలు ఇది కావాలంటున్నారు! ప్రజలు అది కావాలంటున్నారు," అనే వాడు ఇది ఆత్మ వంచనా, పరవంచనాకూడా అవుతుంది 'వేలిముద్రల వాళ్ళకు' ఇది కావాలి,

అదికావాలి అని చెబుతూ, ఆ ప్రకారమే చిత్రాలు తీసి, పాతికేసి వారాలు నడిపే చిత్రనిర్మాత ఇంతకన్నా చాలాగట్టివాడు, ఆయనలో కనీసం వ్యాపార దక్షత అయినా ఉన్నది

ఈ విషయం స్పష్టంగా గుర్తించవలసినఅవసరం ఎంతైనా ఉంది ఎందుకంటే, ప్రజలు తమ ఆహారావసరాలను గురించి చెప్పగలిగినంత తమ కళావసరాలను గురించి చెప్పలేరు రిఫరెండమ్ తీసుకుని గూడా ప్రయోజనంలేదు కళలను వారిముందు పెడితే అవి తమకు కావాలో, అవసరం లేదో చాలా స్పష్టంగానే నిర్ణయించకోగలరు కళల ద్వారా వారు ఉత్తేజం పొందగలరుకూడా, కాని ఉత్తేజం కలిగించలేని కళలను బహిష్కరించే విమర్శా దృష్టి వారిలో ఉండదు ఉత్తేజానికీ, ఉల్లాసానికీ తేడా తెలుసుకోవడానికీ, ఉల్లాసానికి తక్కువ విలువ కట్టడానికీ చాలా సంస్కృతి ఉండాలి

ఆ కారణం చేత ప్రజల కళలుగా ఉత్పత్తి అయ్యే వాటిలో ప్రజలను నిజంగా ఉత్తేజపరిచేవేవో, తాత్కాలికంగా కొంత ఉల్లాసం కలిగించి కాలక్రమాన నీరసపరిచేవేవో నిర్ణయించడానికి యోగ్యులైన వారు వేరే ఏర్పాటు కావాలి లేని పక్షాన కీలక స్థానాలలో ఉండి ఈ కళల స్వరూప స్వభావాలను నిర్ణయించే వారి ధనలోభమూ, దురభిరుచులూ, ప్రజలకు కాలక్రమాన చాలా హాని చెయ్యవచ్చును

ఇది అరికట్టడానికి సినిమా చిత్రాల విషయంలో ప్రభుత్వం వారు సెన్సారు బోర్డులు ఏర్పాటు చేశారు ఈ సెన్సారు బోర్డులు తమ కర్తవ్యాన్ని నిర్వహించే ధోరణి అప్పుడప్పుడూ ఆక్షేపణీయంగా ఉన్నట్టు భావించ బడుతున్నప్పటికీ, మొత్తం మీద వాటివల్ల కొంత ప్రయోజనం ఉన్నదనే అనుకోవాలి ఎందుకంటే లాభకాంక్షను మించిన సంఘ విద్రోహక శక్తి లేదు సెన్సారు భయం లేకపోతే ప్రజలను మభ్యపెట్టడానికి ఎటువంటి హేయమైన పనులకైనా సిద్ధపడే చిత్ర నిర్మాతలు - ముఖ్యంగా పరువు ప్రతిష్ఠలు లేనివారు - లేకపోలేదు

మిగిలిన కళల విషయంలో అవసరమైన అదుపు చేయగల వారెవరైనా ఉంటే విమర్శనాధికారాన్ని పెట్టుబడీదారి దేశాల్లో వ్యక్తులు అధికారరీత్యా అమలు జరుపుతున్నారు కాని సామ్యవాదం అవలంబించిన దేశాలలో ఈ పనిని రచయితల సంఘాలూ, పరిపాలన నిర్వహించే పార్టీలు సయితం నిర్వహిస్తున్నాయి

ఇందువల్ల కళాకారుడి స్వాతంత్ర్యం అరికడుతున్నదని కొందరు స్వేచ్ఛావాదులు ఆక్షేపిస్తున్నారు ఈ ఆక్షేపణ లోసివేయ వలసినది కూడా కాదు

కాని మొట్టమొదటగా నిర్ణయించవలసినదేమిటంటే, కళాకారుడి స్వేచ్ఛ ఎక్కడ ఆరంభమవుతుంది? ఎక్కడ అంత మవుతుంది?

ఆరంభంలోనే కళాకారుడి స్వేచ్ఛను అరికట్టేది కళయొక్క స్వరూపమూ, శిల్పమూను కవిత్వం రాయబూనిన వాడు ఛందోనియమాలను పాటించక తప్పదు అలాటి నియమాలు లేని వచనం - కథగాని , నాటకం గాని - రాసేవాడు ఎక్కువ స్వేచ్ఛగల కళాకారుడవాలని ఎవరికీ తట్టదు కనక కళాకారుడిపై శిల్పం చేసే అజమాయిషీవల్ల కళాకారుడి స్వేచ్ఛకు భంగం కలిగిందనుకోనవసరంలేదు చిత్రకారుడూ, సినిమా డైరక్టరూ, నటుడూ, గాయకుడూ తాము సృష్టించే కళల తాలుకు శిల్పాలు ఆపాదించే నియమాలను సంతోషంతో స్వీకరిస్తారు

ఆతరువాత కళాకారుడి స్వేచ్ఛను అరికట్టే వాళ్ళు కీలక స్థానాలలో ఉండి కళలను ప్రజలకు అందజేసేవాళ్ళు ఉదాహరణకు, చిత్ర నిర్మాత, పత్రికాధిపతీ, రేడియో ప్రోగ్రాములు ఏర్పాటు చేసేవాడు ఇత్యాదులు

ముఖ్యంగా సినిమా రంగాన్ని తీసుకున్నట్టయితే, అందులో కథకులూ, కవులూ, నాటకకర్తలూ, వాగ్గేయకారులూ, గాయకులూ చిత్రలేఖకులూ, నటులూ, నర్తకులూ, పనిచేస్తున్నప్పటికీ, వారెవ్వరికీ దాదాపు ఏపాటి స్వాతంత్ర్యమూ లేదనే చెప్పాలి వారందరికీ ఒకే రకం స్వేచ్ఛ లేనందుకు ఎవరూ ఆక్షేపించరాదు అదేమిటంటే, సినిమా చిత్రాల శిల్పంవల్ల ఏర్పడేది ఉదాహరణకు, పాటకచేరీ చేసే గాయకుడికి ఉండే స్వేచ్ఛ సినిమా గాయకుడికి ఎన్నడూ ఉండదు ఉండ కూడదు కూడా అదే విధంగా సినిమారచయితలకూ, చిత్రకారులకూ, తదితరులకూ, తమతమ కళలను స్వంతాన సృష్టించుకున్నప్పుడుండే స్వేచ్ఛ ఉండదు ఉండకపోవటం తప్పుగూడా కాదు

కాని కళాకారుడికి ఇంకొక రకమైన స్వేచ్ఛ - అది ముఖ్యమైనది - అది లోపిస్తే వాడు కళాకారుడేకాదు అదేమిటంటే తన కళను ఉత్తమ సాంఘిక ప్రయోజనానికి అంకితం చేసే స్వేచ్ఛ ఈ స్వేచ్ఛ సినిమా రంగంలో ఉత్తమృగ్యం అందుచేతనే సినిమారంగంలోకృషి చేసే కళాకారుడు, పారిశ్రామిక కార్మికుడిలాగా, తన శ్రమశక్తిని ఇతరుల లాభాల కోసం అమ్ముకుంటున్నవాడవుతున్నాడు

ప్రజల కళల దృష్ట్యా ఇది చాలా ఘోరమైన పరిస్థితి కాని స్వేచ్ఛావాదులెవరూ ఈ పరిస్థితిని గురించి - సినిమా కళాకారులు కళలో కూడా ఎరగని స్వేచ్ఛను గురించి - వాపోయినట్టు కనబడదు ఈ స్వేచ్ఛావాదులు అజ్ఞానంచేతనో, బుద్ధిపూర్వకంగానో, అరాజకాన్ని స్వేచ్ఛ అనుకుంటున్నారు

కళాకారులకి 'స్వేచ్ఛ'' ఉన్న దేశాలలో '' ఇది ప్రజలకు పనికి వచ్చే కళేనా?'' అని ఆలోచించే నాధుడేలేడు చిత్ర నిర్మాతల అంతరాత్మలలాగే విమర్శకుల నోళ్ళుకూడా డబ్బుతో మూతబడతాయి ప్రజల డబ్బును దోచుకోగలిగినదే ప్రజల కళ - అది సినిమా చిత్రమైనాసరే, డిటెక్టివు అభూత కల్పన అయినా సరే

సినిమా చిత్రాలపై ప్రభుత్వ సెన్సారు లేని దేశాలను చూసి మన నిర్మాతలు ''ఆహా! ఆ దేశాలలో కళాకారుడికి అంతులేని స్వాతంత్ర్యం ఉంది '' అనవచ్చు కాని ప్రాజ్ఞులెవరూ ఆమాట నమ్మరు

సామ్యవాదం అవలంబించిన దేశాలలోరచయిత మీద సయితం ప్రభుత్వ నిఘా ఉంటున్నదని ఆక్షేపించే వారికి ఒకటే సమాధానం, ఆ నిఘా పెట్టేవారు తమ పెట్టుబడుల మీద లాభాల కోసం మొసళ్ళులాగా నోళ్లు తెరుచుకుని కూచున్నవారు కారు, ప్రజల కళలు నిజంగా ప్రజల కళావసరాలను తీర్చాలనే దృఢ విశ్వాసం కలవారు ఆ విశ్వాసాన్ని అమలు జరపడంలో వారు తాత్కాలికంగా తప్పులు చేయవచ్చు కాని అట్టి తప్పులు ఎప్పటికైనా బయటపడి తీరుతాయి ఒక పత్రికా సంపాదకుడి నిర్ణయాన్ని, చిత్ర నిర్మాత అయిన బ్లాక్ మార్కెటీర్ శాసనాలనూ శిరసావహించే కన్న కళాకారులు, సాంస్కృతిక వికాసం గల సంఘాలు చేసే నిర్ణయాలను శిరసావహించటం చాలా రెట్లు వాంఛనీయం

రేపు ఏర్పడే సాహిత్య పరిషత్తు తెలుగులో ప్రచురణ కాదగిన పుస్తకాలేవో నిర్ణయించే అధికారాన్ని కోరేపక్షంలో నామటుకు నేను అభ్యంతరం చెప్పబోను అందువల్ల క్రియకు మేలు జరుగుతుంది కాని కీడుజరిగదు

*ముద్రణ అభ్యుదయ మాసపత్రిక, ఆగష్టు, 1957*
*పునర్ముద్రణ సాహిత్య ప్రయోజనం, విశాలాంధ్ర పబ్లిషింగు హౌస్, అక్టోబరు 1969*

# 15. డిటెక్టివు నవలలు

గడచిన రెండు మూడేళ్ళ కాలంలో తెలుగులో పుస్తక ప్రచురణ బాగా విజృంభించింది ఇరవై రెండు, ఇరవై మూడేళ్ళ క్రితం ఊరుకొక పత్రిక వెలిసినట్టే, ఇప్పుడు పుస్తక ప్రచురణ సంస్థలు రోజుకొకటిచొప్పున పుట్టుకొస్తున్నాయి అయితే ఈ సంస్థలు వెలువరించే పుస్తకాలలో చాలా హెచ్చు భాగం డిటెక్టివ్ రచనలు ఈ కాలపు కాలేజీ అబ్బాయిలూ, కొంతవరకు కాలేజీ అమ్మాయిలూ చదివే తెలుగు సాహిత్యం నూటికి తొంభైవంతులు డిటెక్టివ్ సాహిత్యమే

తెలుగులో డిటెక్టివ్ సాహిత్యం కొత్తకాదు యాభై ఏళ్ళ క్రితమే ఆ కాలపు పుస్తక ప్రచురణ సంస్థలు బెంగాలీ డిటెక్టివ్ పుస్తకాలను తెలుగులోకి అనువదించి ప్రచురించాయి 'కాలూరాయి', 'వాడేవీడు', 'యయాతి' 'మనోరమ' 'పేటికాంతరశవము' మొదలైన(Crime Thrillers) నేనూ నా చిన్నతనంలోనే చదివాను మా దగ్గిర బంధువొకాయన ''మయసభ, పగటిచుక్క, కన్నపుదొంగ'' అనే పుస్తకాలు రాశాడు సాహితీ సమితి సభాపతి అయిన శ్రీ తల్లావఝుల శివశంకరశాస్త్రి (ఇప్పుడు శివశంకరస్వామి) గారు బెంగాలీ నుంచి ''పాంచకడీదేవ్'' రచించిన డిటెక్టివ్ నవలలు తెలుగులో అనువదించారు

అందుచేత తెలుగులో డిటెక్టివు సాహిత్యం రావడం ఇదే కొత్తమటుకు కాదు అయితే ఈసారి డిటెక్టివ్ సాహిత్యం రావటంలో గల విశేషమేమిటంటే, ఇది ఆధునిక పాశ్చాత్య దేశాలలోలాగా ఒక ప్రత్యేక సాహిత్య శాఖగా వ్యక్తిత్వం సంపాదించుకున్నది అంతేగాక ఈ సాహిత్యం జనసామాన్యం మీద వ్యాప్తి చెందింది

ఈ డిటెక్టివ్ సాహిత్యం ఇంకా విశిష్టత సంపాదించుకోలేదు గాని, సంపాదించుకొనే మార్గంలో ఉన్నదని చెప్పితీరాలి సమర్థులైన రచయితలు ఈ సాహిత్యం సృష్టించటానికి ముందుకువస్తున్నారు ఇప్పుడు డిటెక్టివ్ రచనలు చేస్తున్నవారిలో ఫలాని వారికన్నా ఫలానివారు గొప్ప'' అన్న తారతమ్యం గుర్తింపబడుచున్నది

ఈ సాహిత్యానికి విశిష్టత ఇంకా పూర్తిగా యేర్పడలేదనడానికి చాలా కారణాలు చూపవచ్చు అందులో ముఖ్యమైనది డిటెక్టివ్ రచయితలు ఇంగ్లీషు డిటెక్టివ్ సాహిత్యాన్ని అనువదిస్తున్నారు కథనమూ, పాత్రపోషణ, వాస్తవికతా స్ఫురణ, భీభత్స భయానక రసాల పోషణ (ఈ రకం సాహిత్యంలో ఇవే ప్రధానరసాలు) సరియైన వాతావరణం సృష్టించటమూ మొదలైన విషయాలలో ఈ రచనలు చాలావరకు వెలితిగానే ఉంటున్నాయి చదివేవారు విమర్శనా దక్షులు కాని కారణం చేతనే ఈ రచనలకు వ్యాప్తి బాగా ఉంటున్నదనుకోవాలి

ఈ లోపాలు కాలక్రమేణా సరియవుతాయనటానికి సందేహంలేదు ఏ సాహిత్య శాఖలోనైనా తొలి రచనలు పేలవంగా ఉండటము సహజమే

కాని ఇప్పుడు వెలువడే డిటెక్టివు సాహిత్యాన్నిసాంఘిక దృష్టితో విమర్శించవలసిన అవసరం ఎంతైనా ఉంది చాలా మంది రచయితలు తమకు గల సాంఘిక బాధ్యతలను కొంచెమైనా పరిగణిస్తున్నట్టు కనబడదు

వారు చేస్తున్న పెద్దపొరపాటు హత్యలూ, కత్తిపోట్లు, తుపాకీ కాల్పులూ సాధారణ విషయంలాగా చిత్రించటం, ఎవరో వచ్చి కొత్త డిటెక్టివ్ నవల వెలువడిందని చెప్పగానే నా మిత్రుడొకాయన '' ఎన్నిశవాలు'' అని వెటకారానికి అడిగాడు

''శవాలను సృష్టించడం హంతకుడి పనీ, హంతకుణ్ణి కనుక్కోవడం డిటెక్టివ్ పనీ'', అన్న భావం కొందరు డిటెక్టివ్ రచయితలకు వున్నట్టు కనిపిస్తుంది చంపటమే జీవితాశయంగా పెట్టుకున్న వ్యక్తులు సంఘంలో సాధారణంగా వుండరు అది వృత్తిగా పెట్టుకొని ఇతరులకోసం హత్యలు చేసేవారు కోటికి ఒకడుంటే వాడికి సమాజంలో స్థానం ఉండదు మన పురాణాలలో రాక్షసులను ఈ విధంగానే సృష్టించారు కాని ఆ చిత్రణను ఆమోదించటానికి కూడా ఈనాడు మనలో చాలామంది సిద్ధం లేరు

సంఘమంటూ ఉన్నతరువాత నేరాలు జరుగుతాయి, కాని ప్రతీనేరం వెనకా ప్రబలమైన కారణం వుంటుంది ఆ కారణము లేకుండా నేరం చేసేవారిని వైద్యపరీక్ష చేస్తారు నాల్గురూపాయలు దొంగిలించటానికి హత్య చేసేవాడు తన జీవితమంతా సంఘానికి పెడగా జీవిస్తున్నవాడే అయివుంటాడు ఇలా సంఘానికి పెడగా సంఘపు చీకటి కోణంలో జీవిస్తున్నవారు ఏ న్యూయార్కులోనో, చికాగోలోనో, లండన్‌లోనో యెక్కువగా ఉంటారు బొంబాయి, మద్రాసు, కలకత్తా నగరాలలో కూడా వుండవచ్చు కాని ఈ నగరాలలో జరిగే హత్యల సంఘటనలు చూసినట్టయితే అటువంటి ''చీకటిజీవులు'' కూడా హత్యాపరంపరకు ఒడిగట్టరని స్పష్టమవుతుంది వరసమత్యాలు జరగటమూ చిట్టచివరకు ఆ హత్యలన్నీ చేసినవాడు ఒక ఘరానా మనిషి అని రుజువు కావటమూ అభూత కల్పన అని మనం భావించవచ్చు

వాస్తవజీవితం మాట ఎలావున్నా పని పెట్టుకుని రాసే డిటెక్టివు నవలలో హంతకులను రచయిత తన ఇష్టం వచ్చిన వర్గంలో నిరూపించటం సంఘవిద్రోహ చర్యగా పరిగణించాలి

పరిస్థితి ప్రోద్బలంవల్ల ఎవరైనా హత్య చేయవచ్చుననే అనుకుందాం కాని అప్పుడు కూడా పరిస్థితి ప్రోద్బలమన్నది హతకుడి సాంఘిక స్థాయిని బట్టే వుంటుంది ఒకడు హత్య చేసే పరిస్థితిలో మరొకడు అంతకన్న సంస్కారం కలవాడు హత్య చెయ్యడు

అందుచేత నేరానికి గల కారణం ప్రబలంగా ఉండాలి జీవితంలో కన్నా రచనలో మరింత ప్రబలంగా ఉండాలి అప్పుడే రచన సంఘానికి కొంచెం ముందుండ గలుగుతుంది

డిటెక్టివు సాహిత్యానికి పితామహుడిలాటివాడు - సర్ ఆర్థర్ కూనన్ డాయిల్ ఈయన సృష్టించిన షర్లాక్స్ హోమ్స్ పాత్ర ఇప్పటికీ ప్రసిద్ధంగానే ఉన్నది నేర నిరూపణము ఈయన ఒక శాస్త్రంగా తన రచనలలో భాసింపచేశాడు ఆ కారణం చేత ఆయన రచనలను వివిధదేశాల పోలీసు శాఖలవారు పాఠ్య గ్రంథాలుగా చదివినట్టు చెబుతారు

కోనన్ డాయిల్ రచనలలో గల అన్ని గొప్పతనాలను ప్రచారం చేశారుగాని యీ గొప్పతనాన్ని ఒక్కరూకూడా ఎత్తి చూపలేదు ఆయన కథలలో నేరకారణంతో పోల్చితే నేరం చాలా బలహీనంగా ఉంటుంది - కథ అంతా చదివాక పాఠకుడు, 'నేనే జెఫర్సన్ హోప్ అయితే ఆ దుర్మార్గులను చిత్రహింస చేసేవాణ్ణి!'' అనుకునితీరుతాడు - కోనన్ డాయిల్ రచించిన ప్రతి డిటెక్టివ్ కథలోనూ ఈ విషయం మనం గమనించవచ్చు - అయినప్పటికీ కోనన్‌డాయిల్ తన కథలలోని నేరస్తుల పట్ల పాఠకుడి కన్నచాలా కర్కశంగావున్నట్లు కనబడతాడు

మన డిటెక్టివ్ రచయితలు అనుకరించే పాశ్చాత్య డిటెక్టివ్ రచయితనే నేరకారణాన్ని బలంగా నిరూపించటం గురించి నిర్లక్ష్యం ప్రదర్శిస్తున్నారు వారు శిల్పం మీద హంతకుణ్ణి మరుగు చెయ్యటమూ, సస్పెన్సు పట్టుకురాటమూ, డిటెక్టివ్ ప్రాభల్యం నిరూపించటమూమొదలైన వాటిమీద తమ దృష్టి కేంద్రీకరిస్తున్నారు కాని ఇది అంతగా హర్షించదగిన విషయం కాదు డిటెక్టివు రచనలలో సంఘదృష్టిపాటించటం అసాధ్యం కాదు - అదిపాటించిననాడు డిటెక్టివు రచనకు కూడా సాహిత్యంలో ఒకమంచి స్థానము లభిస్తుంది

*ముద్రణ తెలుగు విద్యార్థి, మాసపత్రిక, అక్టోబరు 1957*

# 16. అనువాద సాహిత్యం

రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ప్రపంచమంతటా పుస్తక ప్రచురణ విరివిగా సాగుతునున్నట్టు కనిపిస్తుంది దీనికి ప్రధాన కారణం ఆ ప్రపంచ యుద్ధం ప్రపంచ ప్రజలలో తెచ్చిపెట్టిన చైతన్యమేననటానికి ఎటువంటి సందేహమూలేదు పరిసర జీవితంనుంచి కలిగే అనుభవంతో తృప్తి పడని వారికీ, ప్రపంచ జ్ఞానం సంపాదించాలనే ఆసక్తి కలవారికీ, ఇతర దేశాలలోనూ, సమాజాలలోనూ కలిగే మార్పులు మన జీవిత విధానాలను మారుస్తాయని గుర్తించిన వారికీ పుస్తకాల విలువ తెలుస్తుంది వాళ్ళు దేశ దేశాల పుస్తకాలు చదవగోరుతారు

అందుకనే ప్రతిభాషలోనూ పెరిగేటంత సాహిత్యం వెలువడ్డమే గాక అనువాద సాహిత్యంకూడా దిగుతున్నది అనువాద సాహిత్యం చదవటమూ, దాన్ని ఆదరించటమూ బానిస బుద్ధిని సూచిస్తుందనుకునేవారు ఈనాడు తగ్గిపోతున్నారు ఏమైనా ఇది సరిఅయిన భావం కాదు మంచి అనువాద సాహిత్యం పాఠకుల దృక్పథాన్నేగాక, రచయితల దృక్పథాన్నికూడా విశాలం చేస్తుంది

సోషలిస్టు దేశాలలో పుస్తకాల విజృంభణ గమనించ దగిన విషయం రష్యాలో అనువాద సాహిత్యం చాలా విరివిగా వెలువడుతున్నది ఇప్పుడు తూర్పు జర్మనీ రచయితల ప్రతినిధులు మనదేశం పర్యటించి, వివిధ భారతీయ భాషలలోవెలువడే ఉత్తమ సాహిత్యాన్ని తూర్పుజర్మనీలో ప్రచురించటానికీ, తూర్పు జర్మనీలో వెలువడే పుస్తకాలలో సాధ్యమైనన్ని మన దేశ భాషలలో అనువాదం అయేటట్టు చూడటానికీ ప్రయత్నాలు చేస్తున్నారు

కాని శోచనీయమైన విషయమేమిటంటే ప్రస్తుతం మనదేశభాషలలో ముఖ్యంగా తెలుగులో - వివిధ దేశాల సాహిత్యం అనువదించి ప్రచురించటానికి సరి అయిన పరిస్థితులు లేవు

మొదటి చిక్కు భాషకు సంబంధించినది అనువాదం చేసే వాడికి రెండు సొంత భాషలలో బాగా రచించే సామర్ధ్యం కూడా ఉండాలి తెలుగులోకి బెంగాలీ సాహిత్యం చాలా కాలం క్రితమే అనువదించబడినది బంకిమ్, టాగూర్, శరత్ మొదలైన వారి రచనలు తెలుగులో వెలువడ్డాయి వీటిలో కొన్ని బెంగాలీ భాషనుంచి ఆ భాష తెలిసినవారు నేరుగా అనువదించినవే అయినా ఆ అనువాదకులు తెలుగు భాషలో చక్కగా రాయలేకపోయినప్పుడు అనువాదాలు రాణించలేదు మరికొందరు బెంగాలీ సాహిత్యాన్ని హిందీ తర్జుమాల ద్వారానో, ఇంగ్లీషు తర్జుమాల ద్వారానో తెలుగులోకి అనువదించారు ఇది కూడా అట్టే విజయవంతం కాలేదు సాహిత్యం అచ్చుగా భాషేకాదు అందులో జాతీయాలు, సాంప్రదాయాలూ కూడా ఉంటాయి అనువాదకుడు వాటిని కూడా శ్రమపడి అనువదిస్తేనే అనువాదం ఫలప్రదమవుతుంది

ఇతర దేశాల సాహిత్యం అనువదించటానికి ప్రస్తుతం ఇంగ్లీషు ప్రధాన సాధనంగా వున్నది ఇంగ్లీషు ధర్మమా అంటూ మన భాషలోకి కొన్ని ఇతర దేశాల పుస్తకాలు దిగాయి అయితే ఇవి నిర్దుష్టమైన తర్జుమాలనీ, ఈపుస్తకాలను మళ్ళీ తర్జుమా చేయనవసరం లేదనీ అనువాదకులు సయితం అనుకునే అవకాశం లేదు విదేశీయులపేర్లుకూడా ఎలా ఉచ్చరించాలో మనకు తెలీదు కొన్ని రష్యన్, జర్మన్, చైనీయుల పేర్లు తెలిసినా తెలుగు భాషలో రాయటం బహుకష్టం పేర్లతో పేచీ కన్న జాతీయ సాంప్రదాయాలను చిత్రించటంలో అనువాదకుడు చేసే తప్పులు అనువాదాన్నిచాలా పాడు చేస్తాయి

ప్రసిద్ధ రష్యన్ రచయితా, విమర్శకుడూ అయిన ఇల్యా ఎహ్రెన్ బర్గ్ మనదేశం వచ్చినప్పుడు అనువాదాలు మూల భాషనుంచే జరగటం వాంఛనీయమన్న అభిప్రాయం వెలిబుచ్చాడు ప్రస్తుతం మన విశ్వవిద్యాలయాలలో విదేశ భాషలు నేర్చుకునే విద్యార్థులు చాలామంది ఉంటున్నారు వీరిలోనుంచే భావి అనువాదకులు రావటం ఎంతైనా వాంఛనీయం

అనువాద సాహిత్యం కేవలం అనువాదకులపైననే ఆధారపడిలేదు ప్రచురకులపైన కూడా ఆధారపడి వున్నది అనువదించ దగిన పుస్తకాలు మంచివిగా ఏరుకుని వాటిని సమర్థులైన అనువాదకులచేత తర్జుమా చేయించుకోవటం పుస్తకప్రచురణ సంస్థలపని వీరి దక్షతపై మనకు లభ్యమయే అనువాద సాహిత్యం ప్రచురించబడుతుంది

ప్రస్తుతం అనువాద సాహిత్యం ప్రచురించడంలో ఏర్పడుతున్న సమస్యలు చాలా క్లిష్టమైనవి అందులో కొన్ని ఒకంతట పరిష్కారమయేవికావు

మొదటి సంగతి, అనువాదాలు చెయ్యటంలో నిజమైన సమర్థులు బహుతక్కువ నిజానికి అనువాదాలు చేసేవాడు సొంతాన సాహిత్యం సృష్టించేవాడు కానవరంలేదు మాతృ భాషలో ఎటువంటి భావాలనైనా సులువుగా చెప్పగల సామర్థ్యం ఉన్నవాడైతేచాలు కాని ఆపాటి సామర్థ్యం ఉన్నవాళ్ళు సొంతాన రాస్తూనే ఉండటంచేత అనువాదకులందరూ స్వభాషలో సాహిత్యం సృష్టించేవారే అవుతున్నారు

ఇటువంటి రచయితలయినా అనువాదాలు చెయ్యబూనుకోవటానికి తగిన ప్రోత్సాహం లేకపోవటానికి కారణమేమంటే, ప్రచురణాలయాలు అనువాదాలకు చాలా తక్కువ ముట్టచెబుతాయి సొంత రచనలకన్నా అనువాదాలకు తక్కువసొమ్ము ఇవ్వటంలో అర్థం ఉన్నట్టు కనపడదు నేను సొంతంగా రాశాను, అనువాదాలు చేశాను నా అనుభవంలో సొంత

రచనకన్న అనువాదాలు నాటుగింతలుకష్టం మరొక భాషలో నేను చదివిన పుస్తకంపైన నాకెంతో ఆదరం ఏర్పడితేనేగాని నేనుదాన్ని అనువదించడానికి పూనుకోను మిగిలిన అనువాదకులైనా అంతేకావచ్చు

ఈ విధంగా ఒకవంక అనువాదకులు అభిమానంకొద్దీ అనువాద సాహిత్యం తయారు చేస్తుంటే వారి ఫలితానికి సరి అయిన ప్రతిఫలం ఇవ్వక ప్రచురణ సంస్థలు అనువాద సాహిత్యం పట్ల అనాదర భావం చూపిస్తున్నాయి

అనువాదకులకు తగినంతసొమ్మిచ్చినట్లయితే కొందరు సిద్ధహస్తులైన అనువాదకులు అనువాదసాహిత్యం తయారుచెయ్యటం తమవృత్తిగా పెట్టుకుని దానిపై సుఖంగా బ్రతకవచ్చు అలాటి అనువాదకులను పోషించే ప్రచురణ సంస్థలు బోలెడంత అనువాద సాహిత్యాన్నిగూడా దింపవచ్చు

కొన్ని విదేశీ గ్రంథాలు - ముఖ్యంగా పాశ్చాత్య గ్రంథాలు - చాలా పెద్దవిగా ఉంటాయి ఉదాహరణకు లెవ్‌టాల్‌స్టాయ్ రాసిన ''వార్ అండ్ పీస్'', ఇటువంటి గ్రంథాలను యధాతథంగా తెలుగులోకి దించాలంటే అనువాదకుడికీ, ప్రచురణకర్తలకు కూడా నీరసం వచ్చేస్తుంది మన పాఠకులు అంతేసి పుస్తకాలు చదవటానికి అలవాటు పడిలేరు ఉన్నది ఉన్నట్టు దించితే గ్రంథం పెరుగుతుంది దానితో బాటు ఖరీదూ హెచ్చుతుంది ఈ కారణాలన్నిటినీబట్టి మనవాళ్ళు సంక్షిప్త అనువాదాలు ప్రజాదరణ పొందాయి కూడా

ఈవిధంగా సంక్షిప్త అనువాదాలు ప్రచురించటం నా బుద్ధికి ప్రస్తుతం సమర్థనీయంగానే కనపడుతున్నది ఇవి ప్రమాణమైన అనువాదాలు కాకపోవచ్చు, ప్రమాణమైన అనువాదాలు వచ్చాయనిపించుకోవటం కన్న వర్తమాన విదేశీ సాహిత్యాన్ని సంగ్రహానువాదరూపంలో ప్రజల కందించటం ఎక్కువ ముఖ్యంగా కనిపిస్తుంది

అయితే పూర్వ గ్రంథాల (క్లాసిక్స్) అనువాదాలు సాధ్యమైనంతవరకు ప్రమాణంగా వుండేటట్టు చూడటం శ్రేయస్కరం ఈ పనికి వ్యాపార సంస్థలు పూనుకోవటం కంటె సాహిత్య పరిషత్తులు పూనుకోవటం మంచిది

కొందరు కొందరు విదేశీ సాహిత్యాన్ని తర్జుమా చేస్తూ పాత్రల పేర్లూ, కథయొక్క వాతావరణమూ, మనదేశానికి అనుగుణంగా పరివర్తింప చేస్తున్నారు ఇలా సృష్టించిన అనువాద సాహిత్యం స్త్రీలకూ, పిల్లలకూ బాగుండవచ్చు - నేను నా చిన్నతనంలో ఇలాటి అనువాదాలు చదివి ఎంతో తృప్తిపడ్డాను కాని ఈ పద్ధతి ప్రోత్సహించదగినది కాదు పేరు ప్రతిష్టలుగల ప్రచురణకర్తలు అనుసరించదగినదికూడా కాదు

అనువాద సాహిత్యం సృష్టించే వారూ, ప్రచురించే వారూ కూడా కేవలం అభిరుచులను మాత్రమే అనుసరించక మాతృకకు సాహిత్యంలో లభించిన ఉన్నత స్థానాన్ని కూడా పాటించటం మంచిది

*ముద్రణ అభ్యుదయ మాసపత్రిక, మార్చి 1959*
*పునర్ముద్రణ సాహిత్య ప్రయోజనం విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,*
*అక్టోబరు 1969*

# 17. చిత్ర జగత్తు (ఎ)

మాటలు అరిగిపోతాయనీ, నిరుపయోగంగా పరిణమిస్తాయనీ చాలామందికి తెలిసిన సంగతే అట్లా అరిగిపోయిన సామాజిక ప్రయోజనాన్ని పోగొట్టుకున్న మాటలలో "పుణ్యం""పాపం" అనేవి కూడా ఉన్నాయి కొన్ని శతాబ్దాలపాటు సాంఘికంగా ఆమాటలను దుర్వినియోగపరిచారు ఏదిపుణ్యమో ఏది పాపమో నిర్ణయించే అధికారాన్ని కొద్ది ధర్మశాస్త్ర గ్రంధాలకు మాత్రమే ఇచ్చి, వాటికి భాష్య చెప్పే హక్కును కొద్దిమంది "సన్నాసులు" గుత్తకు తీసుకున్నారు

చివరకు పుణ్యం కొనుగోలు వస్తువుల జాబితాలో చేరిపోయింది డబ్బున్నవాడు దానధర్మాలు చేసి, యతీశ్వరులకు భిక్షపెట్టి,గుళ్ళు కట్టించి, చెరువులూ, బావులూ త్రవ్వించి రకరకాలుగా పుణ్యం కొనుక్కోవచ్చు పాపాలకు పరిహారం కూడా చేసుకోవచ్చు లేని వాడికి ఈ అవకాశం లేదు పెట్టుబడిదారులు డబ్బు కొద్దిమంది చేతుల్లో కేంద్రీకృతమయ్యే పద్ధతిలోనే పుణ్యం కూడా కొద్దిమంది చేతుల్లోనే కేంద్రీకరించుకున్నది పుణ్యం చేసిన వాడు ధనికుడై పుడతాడు ధనంతో మరింత పుణ్యం సంపాయించుకుంటాడు అందుచేతనేమో రానురాను పుణ్యాత్ముల సంఖ్య తరిగి పాపాత్ముల సంఖ్య పెరిగింది

సంఘంలో పాపాత్ముల సంఖ్య కణుపు దాటి పెరిగినప్పుడల్లా శ్రీ మహావిష్ణువు విప్లవ రూపంలో అవతరించి పరిస్థితులు చక్కబరిచి పుణ్యాత్ముల పెరుగుదలకు దోహదం చేస్తూ ఉంటాడు

అది అట్లా వుంచి అసలు విషయానికి వద్దాం అదేమిటంటే పుణ్యమూ, పాపమూ అనే మాటలకు చలామణి తగ్గిపోవటం మనుషులు నియమంగా బతకాలంటే వారికి పాపభీతో, రాజభీతో, ప్రజాభీతో ఉండాలి ఈ మూడు భీతులు ఈనాడు మృగ్యంగా ఉన్నాయి ముఖ్యంగా సంఘద్రోహం చేసే అవకాశాలు గల వారికి పాపంలో నమ్మకం లేదు రాజభీతి అనవసరం, ప్రజాభీతి అన్నది ఇంకా దేశంలో పుట్టలేదు

ఈ పరిస్థితిలో పుణ్యపాపాలనేవి చలామణిలో ఉండటం కొంతలోకొంత లాభిస్తుందని నాకొక నమ్మకం ఉన్నది ముఖ్యంగా కళా సంస్కృతీ రంగంలో యీ మాటలను ప్రవేశపెట్టాలని నాకు చాలా ఉబలాటం ఉన్నది ఉదాహరణకు పుస్తకాలు తీసుకోండి డిటెక్టివ్ నవలను గురించి ఎవరన్నా తెలుసుకోవాలంటే అందులో సస్పెన్స్ ఎట్లా ఉందని అడుగుతారు హంతకుణ్ణి పాఠకుడు పసికట్టకలుగుతున్నాడా లేదా అని అడుగుతారు సాంఘిక నవల అయితే సెక్సున్నదా, లేదా అని అడుగుతారు రచయిత ధనికుల్ని వెనకేసుకొచ్చాడా, దరిద్రుల్ని వెనకేసుకొచ్చాడా అని అడుగుతారు అంతేగానీ, " ఇది చదివితే పుణ్యమా, పాపమా"! అని అడగరు ఒక సినిమా గురించి కూడా " ఇది చూస్తే పుణ్యమా, పాపమా" అని అడిగే సంప్రదాయం వుండటం మంచిది

పుణ్యపాపాలు అనిర్వచనీయాలు అని కొందరు అభ్యంతరం చెప్పవచ్చును మనం అనిర్వచనీయమైన మాటలు చాలా వాడుతున్నాం - తెలుసుననుకొనీ మరీ వాడుతున్నాం కళ, ప్రేమ అనే మాటలు సులువుగా నిర్వచించేవి కావు దేశాభిమానమూ, ప్రజాతంత్రమూ,

పురోగమనమూ, స్వేచ్ఛ, కమ్యూనిజమూ అనేవి కేవలం మంత్రశాస్త్రంలోని పరిభాష కిందికి వచ్చేశాయి (ఐసెన్ హోవర్ కమ్యూనిస్టు అని ఇటీవల ఎక్కడో చదివాను ఎవరో అన్నారు వెర్రిముండా కొడుకులు అన్నమాట అయితే పత్రికల్లో పడదు గదా! లేక పడుతుందా?)

పుణ్యం పాపం అన్న మాటలు ఈపైన చెప్పిన మాటల కన్న గొప్ప మాటలు కావు రాచకొండ విశ్వనాథశాస్త్రి రచించిన సారాకథలు చదివిన వాడితో ''అయ్యా మీరా కథలు చదవండి పుణ్యం వస్తుంది'' అన్నట్లయితే పుణ్యమంటే ఏమిటో చదివాక ఆ మనిషికి దానంతటఅదే తెలుస్తుంది ఏమీ కష్టం లేదు పైగా చెప్పేవాడికెంత సులువు! సారా కథల్లో ఉన్నది ఇంకో విధంగా చెప్పటానికి యత్నించటం ఎంత కష్టం! రాచకొండ విశ్వనాథశాస్త్రి, రాచమల్లు రామచంద్రారెడ్డి వంటి కథకులను గొప్ప కథకులు, కథక చక్రవర్తులు అనే దానికన్నా ''పుణ్యాత్ములు'' అనటం ఎంత తేలిక! సత్యానికి ఎంత దగ్గిర!

*విశాలాంధ్ర దినపత్రిక, 21-5-1961*

# 18. చిత్ర జగత్తు (బి)

సాహిత్యం నిశ్చయంగా మెదడుకు మేత దురదృష్టవశాత్తూ శరీరానికి కావలసిన ఆహారం గురించి పరిశోధనలు జరిగినట్టు, ఆరోగ్యకరమైన మెదడు ఎటువంటి సాహిత్యం మెయ్యాలో నిర్ణయించటానికి శాస్త్రీయమైన ప్రయోగాల ద్వారా పరిశోధనలు జరగలేదు ఎప్పటికైనా అటువంటి పరిశోధనలు జరగటం వల్ల చాలా లాభం ఉంటుంది

స్థూలంగా మనం కొన్ని రకాల మనుషులను చూసి వాళ్ళు సాహిత్యం చదవని వాళ్ళని తెలుసుకోవచ్చు అచ్చుగా మత విషయికమైన పుస్తకాలే చదివేవాళ్ళూ, ప్రాచీన సాహిత్యాన్ని భక్తితో చదివేవాళ్ళూ- ఒక మోస్తరుగా ఉంటారు అచ్చుగా వైజ్ఞానిక గ్రంథాలే చదివేవారు మరొకరకంగా ఉంటారు డిటెక్టివ్ సాహిత్యంకన్నా మంచి సాహిత్యం చదివితే జీర్ణించుకోలేని వాళ్ళు మరొకరకంగా ఉంటారు

ఈనాడు కాఫీ హోటళ్ళలో ఎన్ని రకాల తినుబండారాలు దొరుకుతాయో పుస్తకాల షాపుల్లో అన్ని రకాల పుస్తకాలు దొరుకుతాయి వాటిలో కూడా 'ఆహారపు విలువ' ఉన్నవీ, లేనివీ, ఆరోగ్యాన్ని పెంపొందించేవీ, చెడగొట్టేవీ ఉంటాయి కాని ఆ విషయం నమ్మదగినట్టుగా చెప్పేవాళ్ళు లేరు కొనేవాళ్ళు తమ జిహ్వాచాపల్యాన్ని, అభిరుచులనూ బట్టి పుస్తకాలు కొని చదువుతారు

సాహిత్యానికి నిషేధాలు లేవని కాదు తిండికి ఉన్నట్టే కొందరు ఉల్లి తినరు, కొందరు ఉర్లగడ్డలు తినరు కొందరు టొమాటోలు తినరు ఈ నిషేధాల వెనక మూఢవిశ్వాసాలూ, కులవిద్వేషాలూ, ఆచారభీతీ ఉన్నాయి

అట్లాగే పుస్తకాల విషయంలోనూ కొన్ని పుస్తకాలను ప్రభుత్వం బహిష్కరిస్తుంది కొన్నిటిని ఇంట్లో అమ్మమ్మలు బహిష్కరిస్తారు కొన్ని పుస్తకాలు వర్గవాసన అయితే యీ రకం బహిష్కరణలకు పుస్తకాలు మెదడును ఆరోగ్యంగానూ, బలంగానూ ఉంచే శక్తికి ఏమీ సంబంధం లేదు

"సోవియట్ నవలలను చదవటం అపాయం కాదా?" అని అడిగిన వ్యక్తి నాకు తెలుసు

న్యాయానికి సాహిత్యం సృష్టించే వాళ్ళను కూడా తాము ప్రజల మెదడుకు మేత తయారుచేస్తున్నామన్న భావం సాధారణంగా ఉండదు అటువంటి దృక్పథంతో సాహిత్యం సృష్టించిన వారు నాలుగైదు శతాబ్దాల క్రితం అంతరించిపోయినట్లు కనిపిస్తుంది

ఈనాడు సాహిత్య స్రష్టలను ప్రేరేపించేవి -

1 సరదా

2 కీర్తికాంక్ష

3 నీరసమైన ధనకాంక్ష

రచనార్హత సమస్య లేదు రచనా సామర్థ్యం నిర్ణయించే మొదటి వాడు రచనను అచ్చువేసే పత్రిక యొక్క సంపాదకుడు, లేదా పుస్తకంగా అచ్చు వేసుకునే వాడు తరువాత రచయిత స్థాయిని చదువరులూ, పుస్తకాలు కొనేవాళ్ళూ, పోటీలలో పాల్గొన్నపుడు జడ్జీలు నిర్ణయిస్తారు

రచన చెయ్యటం అందరికీ సమంగా ఉండే హక్కు రాజ్యాంగం కింద పౌరులందరికీ ఉండే పౌర హక్కులలో ఒకటి

సాహిత్యరంగంలో ఉండే వాళ్ళు రచనను ప్రధానంగా ఒక కళగా తీసుకుంటారు కళ అంటే పనితనం, శిల్ప విధానం - రచనా విధానం

ఆహారం విషయం తీసుకున్నట్టయితే వైద్యులు పాకకళను బొత్తిగా కొట్టెయ్యరు ఎందుకంటే రుచిగా తయారుచేసిన ఆహారం మరింత బాగా వంటబట్టుతుంది కాని వాళ్ళు పాకకళనే ప్రధానంగా భావించి పదార్థాన్ని తోసివెయ్యరు

సాహిత్యం విషయంలో కూడా అటువంటి విచక్షణ ఉండడం అవసరం

సాహిత్యరంగం దాటితే, సాహిత్యానికి కొంత ప్రాముఖ్యం రాజకీయ రంగంలో కూడా ఉన్నది సాహిత్యం యొక్క ప్రభావం రాజకీయ చైతన్యానికి కూడా దారి తీయగలది అది మంచికీ, చెడుకూ కూడా బలమైన ప్రచార సాధనం

సోషలిస్టు వ్యవస్థలో సాహిత్యాన్ని రాజకీయవాదులు విమర్శిస్తారని ఒక విమర్శ ఉన్నది ఇందులో తప్పేమీ లేదు రచన యొక్క సాంఘిక విలువ నిర్ణయించే అధికారం జీవితాన్ని నడిపే వారికి లేకపోతే మరెవరికి ఉంటుంది? అందులోనూ ప్రజాస్వామ్యంలో ప్రతి వ్యక్తికీ రాజకీయ జీవితంలో పాలుంటుంది ప్రజలను రాజకీయంగా నడిపించే పార్టీలకు ప్రజల సాహిత్యం గురించి అభిప్రాయం తెలిపే హక్కు తప్పకుండా ఉంటుంది మన దేశాన్ని ఇంతకాలంగా పరిపాలిస్తున్న కాంగ్రెసు పార్టీ వారు దేశంలో సృష్టి అయ్యే సాహిత్యం గురించి ఏ విధమైన జిజ్ఞాసా ప్రకటించకపోవడం ఆశ్చర్యం

కనీసం పరిషత్తులైనా చైతన్యవంతమైన సాహిత్యాన్ని ప్రోత్సహించటానికీ, నిరర్థకమైన సాహిత్యాన్ని నిగ్రహించటానికీ ప్రయత్నించటం లేదు సాంప్రదాయకంగా గొప్ప పుస్తకాల కింద చలామణి అయిన పాత పుస్తకాలను బూజు దులిపి బయటికి తీస్తున్నారు ఇందువల్ల ఆట్టే ప్రయోజనం ఉండదు

ఇప్పుడు సాహిత్యరంగాన్ని శాసించే కొత్త అంశం ఒకటి వచ్చి పడింది అది వ్యాపారం జనంలో పఠనాసక్తి తల ఎత్తేసరికి వారికి తక్కువ అభిరుచులు మప్పటానికీ, రచయితలను

మభ్యపెట్టి డబ్బులు చేసుకోవటానికీ రకరకాల పుస్తక ప్రకాశకులు పుట్టుకొచ్చారు వీరిలో కొందరు రచయితల పేర్లు మాత్రమే పరిగణిస్తారు రచన ఏదైనా సరే మరికొందరు అది కూడా పరిగణించరు వాళ్ళు అట్టమీది బొమ్మలతోనే పుస్తకాలు అమ్మేస్తారు

సాహిత్యాన్ని కళా వస్తువుగా పరిగణించే వారూ, ప్రచార సాధనంగా పరిగణించే వారూ, వ్యాపార సరుకుగా పరిగణించే వారూ - ఈ ముగ్గురిలోనూ మూడో వాళ్ళూ సాహిత్యానికి ఎక్కువ అపకారం చేస్తున్నారని నా అనుమానం కాని వారి భవిష్యత్తే గట్టిగా వున్నట్టు కనిపిస్తుంది

*విశాలాంధ్ర దినపత్రిక, 16-7-1961*

# 19. చిత్ర జగత్తు (సి)

సాహిత్యం ఆహారం వంటిదైతే సంస్కారం సేద్యంలాంటిది సంస్కృతిని కృషినుంచి వేరు చేయటం సాధ్యం కాని విషయం

అయినా కొందరు సంస్కారం గురించి మాట్లాడేటప్పుడు అది సంచితమనీ, అలవరుచుకునేది అనీ నమ్మినట్టు కనబడతారు సంచితమైన సంస్కారమూ, అలవరచుకునే సంస్కారమూ ఉండదని కాదు కర్షకుడు కూడా నిరుటి పంట నుంచి మేలైన విత్తనాలను చేర్చి ఉంచుతాడు, కొత్త గింజలు రాగానే పాతవి ఏట్లో పారబొయ్యడు

కొన్ని కుటుంబాలలోనూ, కొన్ని ప్రాంతాలలోనూ మాట్లాడే పద్ధతిలో మార్దవమూ, వినయమూ ఉట్టిపడుతూంటాయి వారు ''అండి'', ''చిత్తం'', ''తమరు'' అనే మాటలను ప్రతి వాక్యంలోను వాడతారు ముఖ్యంగా జమిందారీ కుటుంబాలకు చెందిన వారు మాట్లాడుతూ ఉంటే ''మనం ఎంత మొరటు మనుషులం!'' అనిపిస్తుంది

ఇలాంటి సంప్రదాయ సంస్కారం వ్యక్తి యొక్క సంస్కారాన్ని గాని, వర్గ సంస్కారాన్ని గాని కొంచెం కూడా సూచించదు వ్యక్తియొక్క సంస్కారం వ్యక్తియొక్క సాంఘిక ప్రవర్తనలోనే బయటపడుతుంది సమష్టిసంస్కారం సంఘంలో అమలులో ఉండే ఆచార వ్యవహారాలలో బయటపడుతుంది

తనకు సహాయం చేయగలిగిన స్థితిలో ఉన్నవారి పట్ల మర్యాదా, సానుభూతీ, ఆర్ద్రతా, విశాల హృదయమూ, సహనమూ ప్రదర్శించి, తననుంచి సహాయం లపేక్షించే వాళ్ళ పట్ల చిరాకూ, కాఠిన్యమ, అలక్ష్యమూ ప్రదర్శించేవాడు సంస్కారం కోసం కృషి చేసేవాడు కాడు అలాగే గెలిచే పక్షాన నిలబడిన వాడు, అది ఓడినా నిలబడటానికి సిద్ధపడినవాడైతే తప్ప, సంస్కారి కాడు

జాతియొక్క సంస్కారం కోసం కృషిచేసే వారు ఎప్పుడూ అల్ప సంఖ్యలోనే ఉంటారు ఆ సంస్కారాన్ని ఆచరణలో పెట్టేవారి సంఖ్య అంతకంటే హెచ్చుగా ఉంటుంది ఒక్కొక్క అపూర్వ వ్యక్తి నాటిన సంస్కార బీజాలు చాలాకాలం పుష్పించి ఫలిస్తాయి ఆ మనిషి ముద్ర ఆ జాతి మీద చాలా కాలం ఉంటుంది

ఏ జాతి యొక్క సంస్కారమైనా ఆ జాతి యొక్క విశిష్ట కళలలో వ్యక్తమవుతుంది కళలో ఉండే ఈ సంస్కారాన్ని చూడటం చాతకావాలి

''ఆధునిక సాహిత్యమంటారే గాని పానుగంటి వారి సాక్షిలాటి పుస్తకం ఈ నలభై ఏళ్ళలోనూ ఒక్కటి వచ్చిందా?'' అని కొందరు అడుగుతారు ప్రత్యేక రచనలలో ఉండే గుణదోషాలూ, విశిష్టతలూ ఎంచటం విమర్శకుల పని సంస్కారాన్వేషులు స్థూలంగా ఆధునిక సాహిత్యాన్ని తీసుకున్నట్టయితే అందులో ఆధునిక సంస్కృతి లేకపోలేదు ఈ విషయం నిరూపించటానికి స్థూలంగా కొన్ని ఉదాహరణలిస్తాను

ఈ కాలపు సాహిత్యంలో భగవంతుడిపై ఆధారపడి జీవితాలు గడిపి ఆదర్శజీవులనిపించుకునే పాత్రలు కనబడవు అట్లాగే కర్మసిద్ధాంతం అవలంబించిన పాత్రలను నైకెత్తి చూపే కథలు లేవు

ఈనాటి సాహిత్యంలో మానవయత్నానికి విలువ ఇవ్వబడుతున్నదనవచ్చు దైవికంగా వచ్చిన కష్టాలతోనాయకీ నాయకులు సతమతమవుతున్నట్టు చిత్రించి పాఠకుల సానుభూతి సంపాదించటానికి ప్రయత్నించే గొప్ప రచయిత ఈనాడు లేడనే చెప్పవచ్చు

పెళ్ళి విషయం తీసుకున్నట్టయితే ప్రేమకు ప్రాధాన్యం యివ్వటం జరుగుతున్నది ప్రేమ సులభసాధ్యమైనదిగా చిత్రించే మంచి కథలు బహుకొద్ది చెప్పుకోదగిన కథలన్నిటిలోనూ ప్రేమ పరిణామంక్లిష్టంగానూ, ఒక్కొక్కసారి విషాదాంతంగానూ కూడా చూపబడుతున్నది నిత్య జీవితంలో ప్రేమ వివాహాలకు స్థానం లేనంత వరకూ ఈ విధమైన చిత్రణం సమర్థనీయమనే నా నమ్మకం

ఈనాటి సాహిత్యంలో వర్గ సంఘర్షణ అనేది అధికంగా చిత్రించి ఉండని మాట నిజమే గాని, వర్గాల మధ్య వల్లమానిక సౌహార్ద్రం ఉన్నట్టు కూడా ఎవరూ రాయటం లేదు సాంఘిక పరిణామాలన్నిటికీ కీలకం వర్గ సంబంధాలలో కలిగే మార్పు ఈ మార్పును చిత్రించటం ఉత్తమ సంస్కారమయిన పక్షంలో ఈ సంస్కారం మన సాహిత్య కళలో అంతగా వ్యక్తం కావటం లేదని ఒప్పుకోవాలి కానీ అసలు వ్యక్తం కాకుండా మటుకు లేదు

సినిమాసాహిత్యం సాహిత్యంలో ఒక భాగమే అనుకున్నట్టయితే మనం చాలా నిరాశ చెందవలసి వస్తుంది ఎందుకంటే సినిమా సాహిత్యంలో వ్యక్తమయ్యే కృతక సంస్కృతి సంఘంలో లేనిదీ, ఉండనవసరం లేనిదీ, ఉండదగనిదీ కూడాను

చిన్నవాళ్ళు చీటికీ మాటికీ పెద్దవాళ్ళ కాళ్ళపైన పడతూండటమూ, చచ్చిపోయిన వాళ్ళ పటాలకు దణ్ణాలు పెట్టుకుని పూజలు చేస్తూండటమూ, మధ్యతరగతి వాళ్ళు కూడా పెద్దపెద్ద దేవుడి మందిరాలు పెట్టుకుని ఏ కష్టం వచ్చినా ఆ దేవుడి విగ్రహం ముందు పడి భోరున ఏడుస్తూ పాటలు పాడటమూ, యువతీ యువకులు స్టార్ వాల్యూని బట్టి చూసుకోగానే ప్రేమించటమూ, ప్రేమించగానే యుగళ గీతాలు పాడటమూ, ఆర్థికంగా వాళ్ళ స్థాయి ఏదైనా సరే నైలాన్‌లో, షిఫాన్‌లో ధరించటమూ, పాత్రల మధ్య వర్గవ్యత్యాసాలు కామెడి కోసం తప్ప ఇతర సంబంధాలలో నామమాత్రంగా ఉండిపోవటమూ, డాక్టర్లూ, ప్లీడర్లూ, పోలీసులూ, జడ్జీలూ, టాక్సీ డ్రయివర్లూ కూడా నాయకీ నాయకుల కష్టసుఖాలలో భాగస్వాములై సందర్భోచితంగా ఏడుస్తూ, నవ్వుతూ ఉండటమూ - ఈ చెత్త మనం దాదాపు ప్రతి సినిమాలోనూ చూస్తున్నప్పటికీ ఏ సంస్కారాన్ని ప్రతిబింబించదు

నిజానికి సినిమా సాహిత్యస్రష్టలు మామూలు సాహిత్యాన్ని సృష్టిస్తున్న వారే అనిసెట్టి, శ్రీశ్రీ, ఆరుద్ర, ఆత్రేయా, పినిశెట్టి, పాలగుమ్మి పద్మరాజు మొదలైన హేమాహేమీలు సినిమా సాహిత్యం సృష్టించటానికి నియోగితులై ఉండి కూడా అందులో తమ సంస్కారాన్ని చెప్పుకోదగినంత ప్రతిబింబించలేకపోయినా రనుకోనాలి సినిమా రంగంలోసంస్కృతిని ప్రదర్శించటానికి కృషి జరగనే లేదని నా అభిప్రాయం కాదు అటువంటి ప్రయత్నాలు అంతో ఇంతో విజయవంతమై కూడా వాటికి ఆనవాయితీ ఏర్పడలేదు మొత్తంమీద తెలుగు సంస్కృతీ బీజాలకు సినిమారంగం చవిటి భూమి అయింది

*విశాలాంధ్ర దినపత్రిక, 23-7-1961*

# 20. చిత్ర జగత్తు (డి)

చిన్న కథలూ, నవలలూ, ఇతర వ్యాసాలు రాసే వారికి ఆర్థికంగా జరుగుబాటు ఉండే దేశాలలో రచయితలను తయారుచేయటానికి బోధనా సంస్థలున్నాయి తెలుగు రచయితలు తయారుకావటానికి అటువంటి అవకాశం లేదు మంచి కథకులూ, నవలా రచయితలూ రావటానికి ప్రత్యేక శిక్షణ ఉండాలన్న నియమం ఏమీ లేదు కాని యువ రచయితలు ఎంతో శ్రద్ధాసక్తులతో కథలూ, నవలలూ రాయటమూ, వాటిలో ఉండే లోపాలు వారికే తెలియకపోవటమూ జరుగుతున్నది వాటిని ఏ పత్రికవాళ్ళో అచ్చు వేస్తే రచయితకు తన లోపాలను తెలుసుకోవాలని ఉండదు పత్రిక వాళ్ళు తిరిగి పంపేసినా ఎందుకు తిరిగి పంపారో రచయిత తెలుసుకోలేడు

నా చేతి మీదిగా రచనలు చాలా తిప్పి పంపటం జరిగింది కొద్దిమంది రచయితలే కారణం చెప్పమని రాశారు కాని రోజూ డజన్ల లెక్కన కథలు తిరగగొట్టేవాడు ప్రతి కథలోనూ ఏమేమి లోపం ఉన్నదీ తెలపటం సాధ్యం కాదు అందుచేత పత్రికలు నిర్వహించే వాళ్ళు కొత్త కథకులకు ఏమంత తోడ్పడలేదు

దీనికితోడు ఈనాడు పత్రికా నిర్వహణలో చాలా విచిత్రమైన పరిణామాలు కనిపిస్తున్నాయి ఇప్పుడు కొన్ని పత్రికల దృష్టి కేవలం సర్క్యులేషన్ మీదనే ఉన్నది వీటిని ఎడిట్ చేసే వాళ్ళకు కామందుగారు 'పాలసీ' సూచనలు చేస్తారు "ఏ రచయిత కథ అయినా మరీ బాగున్నట్టు నలుగురూ చెబితే అతని కథలు కొన్ని మాసాల దాకా వెయ్యకండి" అని పెట్టుబడిదారు ఎడిటరుతో చెప్పవచ్చు ఎందుకంటే వ్యాపారరీత్యా పత్రిక కాంతి రచయిత కాంతి పత్రికపై పడి అది ప్రకాశించటం జరగరాదు

అదేవిధంగా పత్రిక ప్రొప్రయిటరు తన పత్రికలో 'అబ్బాయి-అమ్మాయి' కథలే వెయ్యమనీ, ఆనందమయంగా ఉండే కథలే వెయ్యమనీ ఎడిటర్‌ను ఆదేశించవచ్చు మాస్ సర్క్యులేషన్‌కు ఇటువంటి నియమాలు అవసరం వాటిలో జర్నలిస్టు సాహిత్యానికి మాత్రమే స్థానం ఉంటుంది

కథకులూ, నవలాకారులూ కాదలచిన వారి కోసం కొందరు ఔత్సాహికులు వ్యాసాలు రాశారు, పుస్తకాలు కూడా ప్రచురించారు ఇవి అంత ఉపయోగంగా ఉంటాయని తోచదు

వాటిలో ఎక్కువగా, '' ఒకే సైజుకు కత్తిరించిన కాగితాలు తీసుకోండి అవసరమైతే రూళ్ళకాగితాలు తీసుకోండి పంక్తులు ఎడమెడంగా ఉండాలి కథ రాయటానికి కాగితాలే కాక కలం కూడా అవసరం రాయబోయే ముందు పాళీ శుభ్రం చేసుకోవాలి '' ఈ ధోరణి ఉంటుంది పాత్ర గురించీ, సన్నివేశ కల్పన గురించీ స్థూలంగా అందరికీ తెలిసిన విషయాలే చెబుతారు ఈ రకం సలహాదార్లు నియమాలు తెలుసుకోవటం కన్నా వాటిని ఎంతవరకు పాటించారో తెలుసుకోవటమే కొత్త రచయితలకు ఎక్కువ కష్టం

పత్రికలలో వెలువడే విమర్శలు కూడా రచయితలకు కొంతవరకు లాభిస్తాయి అయితే విమర్శలు అచ్చయిన పుస్తకాలకు సంబంధించి ఉంటాయి కొత్త రచయితలు విమర్శ మాత్రమే చదివి పుస్తకం చదవకపోవచ్చు రెండు పత్రికలలోను రెండు విమర్శలు రెండు రకాలుగా ఉండవచ్చు అందుచేత గ్రంథ విమర్శల శీర్షికలు కూడా కొత్త రచయితలకు ఆటే తోడ్పడే అవకాశం లేదు

యువ రచయితలకు ఆరంభ దశలో కావలసినవి ఈ రకం సహాయం కాదు వాళ్ళ తొలి రచనలను విపులంగా విమర్శించే దక్షత గల వాళ్ళు వాళ్ళకి అవసరం ఆ దశలో ప్రధానమయిన లోపాలు సరిదిద్దుకుంటే రచయిత తన రెక్కలమీద ఎగరగలుగుతాడు రచనలు పత్రికలలో అచ్చుపడటంగాని, పుస్తక రూపంలో వెలువడటం గాని రచనకు ప్రమాణం కాదు ఆ దశ వచ్చేసరికి రచయితకు కొన్ని లోపాలు క్రానిక్ అయిపోయే ఉంటాయి అవి మారవు ఈనాడు ఇన్ని వేల కథలూ, వందల పుస్తకాలూ అచ్చవుతున్నప్పటికీ చెయ్యి తిరిగిన రచయితల సంఖ్య తక్కువగానే ఉన్నది ఇది అనివార్యం కాదు గొప్ప రచనలు వచ్చేటట్టు చెయ్యటం ఎవరి తరమూ కాదు గాని నిర్దుష్టంగా, ప్రతిభతో రాణించే శక్తి చాలామందికి లభ్యమయేదే దానికి మార్గాలే లేకుండా ఉన్నాయి

ఈనాడు వెలువడే రచనలలో భాషా, భావప్రకటనా కూడా సరిగా ఉండటం లేదు ఈ లోపాన్ని ఎవరూ సరిదిద్దలేరు అవి కలమూ, కాగితములాగా రచయిత అదివరకే సంపాదించుకుని ఉండాలి చాలామంది యువకులు బరువుగా ఉంటాయనో, అలంకారంగా ఉంటాయనో చిన్నమాటలు సరిపోయే చోట పెద్దమాటలు వాడతారు ఇటువంటి లోపాన్ని సరిదిద్దవచ్చు కొందరు ఇంగ్లీషు భావప్రకటనను మక్కీకి మక్కీగా తర్జుమా చేస్తారు 'మొసలి కన్నీళ్ళు'', ''పగటికలలు' లాంటివి కొన్ని తెలుగు జాతీయత సంపాదించుకున్నాయి గాని, మరికొన్ని అన్నంలో రాళ్ళలాగా చాలా బాధపెడతాయి

పాత్రలను సృష్టించి పోషించటంలోనూ, సన్నివేశాలు కల్పించటంలోనూ కొత్త రచయితలు 'అరాజకా'నికి గురి అయ్యే అవకాశం ఉంది ఈ ''అరాజకాన్ని'' సరిదిద్దవచ్చు

అన్నిటికన్నా ఈనాడు కథా సాహిత్యంలో అత్యవసరంగా కావలసినది వస్తువైవిధ్యం అందరూ ఒకే రకం కథా వస్తువు తీసుకుని రాసేటట్టయితే కొద్దిమంది కథకులు చాలు ఒకప్పుడు రచయితలు తమ ఇంటి వాతావరణం దాటి వెళ్ళకుండానే అందరూ చదవదగిన కథాసాహిత్యం సృష్టించారు ఈనాడు జీవితం విస్తరించుతున్నది ఈనాటి పరితలు జీవితం అన్ని పొరలను గురించీ తెలుసుకోగోరుతారు ఈనాటి కథాసాహిత్యం జీవితమంతటినీ ప్రతిబింబించాలి

కాని అలాటి ధోరణి అంతగా కనిపించటం లేదు యువ రచయితలు తమకు పరిచయం ఉన్న జీవితాన్ని వదిలేసి తమకు ముందు వారు రాసిన కథలలో తమను ఆకర్షించిన వాటిని రచిస్తున్నారు ఈ ధోరణిని ఏమాత్రమూ ప్రోత్సహించరాదు రచయిత అయినా తాను చదవగోరేవే రచించటం అస్వాభావికం నామటుకు నేను రాస్తాను, చదువుతాను నేను చదివి ఆనందించేవీ, నేను రాసేవీ ఒక రకంగా ఉండవు, ఉండటానికి వీల్లేదు అటువంటప్పుడు ఏ శరత్ మీదనో మనస్సు పెట్టుకుని స్త్రీ పునర్వివాహాలను గురించీ, వర్ణాంతర వివాహాలను గురించీ శరత్ రోజుల్లో ఉన్న పరిస్థితులే ఇంకా ఉన్నట్టు రచనలు చెయ్యటం పొరపాటు ఈనాడు వితంతువులంతా స్వేచ్ఛగా పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారని కాదు, వర్ణాంతర వివాహాలను ప్రతిఘటించే వారు లేరనీ కాదు, కాని ఈనాడు ఈ సమస్యల మూలంగా ట్రాజెడీలు జరగనవసరం లేదు - కనీసం సాహిత్యంలో స్త్రీ పునర్వివాహాలను ప్రతిఘటించే వాళ్ళను పశుప్రాయులుగా చర్చించే సాంఘిక హక్కు రచయితకు ఈనాడు ఉన్నదంటాను సంఘంలో మనకు కనిపించే వ్యక్తులలో ఏయే భావాలు కలవాళ్ళకు ఎంతెంత విలువ ఇవ్వాలో సాహితీపరులు నిర్ణయించుకోలేకపోతే సాహిత్యం జీవితానికి పురోగామిగా ఉండే అవకాశం ఏమున్నది?

ఇంతకూ కొత్త రచయితలకు ఆరంభ దశలో సహాయం లభించే సమస్యకు పరిష్కారం ఏమీ మనం అనుకొనే లేదు ఈ పని రచయితల సంఘాలూ, పరిషత్తులూ చేస్తే చాలా బాగుంటుందని నాకు అనిపిస్తున్నది వందమంది ప్రఖ్యాత రచయితలకు సన్మానాలు జరపటంకన్న ఇద్దరు కొత్త రచయితలను సరిఅయిన మార్గంలో పెట్టటం వల్ల 'సరస్వతి'కి ఎక్కువ సేవ జరుగుతుందేమో!

*విశాలాంధ్ర దినపత్రిక, 20-8-1961*

# 21. ఏది మంచిరచన? దానిలో మంచి ఏమిటి?

మానవుడు నాగరికతలోకి అడుగుపెట్టిన నాటినుంచీ రచనలు ఉంటూ వస్తున్నవి వేదాలు మనదేశంలో అత్యంత ప్రాచీనమైన రచనలు వాటితోబాటు ఉపనిషత్తులు, అష్టాదశపురాణాలు ఈనాటికి కూడా నిలిచి ఉన్నవి ఇదే విధంగా ప్రాచీన నాగరికతలు గల గ్రీకులూ, చీనావారూ, యూదులూ ఇదితరులూ తమ పవిత్ర గ్రంథాలను, పురాతన రచనలను ఈనాటికి కూడా స్మరించుకుంటున్నారు

ఇవన్నీ మంచి రచనలే కాని వీటిలో చాలాభాగం సజీవమైన రనలు అనిపించుకోవు వేదాలస్థానం ఆక్రమించడానికి పంచమవేదంగా భారతం అవతరించింది ఉపనిషత్తుల సారం అంటూ భగవద్గీత వచ్చింది ఏ కారణం చేతనైతేనేం వేదోపనిషత్తులు ఆనాటికే నీరసం అయిపోయి వుండాలి

అయితే ప్రజలు ఆ నీరస రచనలను ఎందుకు నిలిచి ఉండనిచ్చారు? కొన్ని వందల తరాలవాళ్ళు ఆ వేదాలను ఎందుకు 'భట్టీయం' చేశారు? దీనికి కారణం లేకపోలేదు సాంఘిక జీవి అయిన మానవుడు గతంలోని మంచిని మరిచిపోలేదు అందుకే వేదాలలో కూడా శ్రుతులూ, స్మృతులూ ఉన్నవి ఒక యుగంనాటి నిత్యకర్మలు ఆచారంలో మరొక యుగంనాటి

నైమిత్తిక కర్మలుగా మార్చినై పెళ్ళికొడుకులు కాశీకి బయలుదేరటమూ, పెళ్ళికూతురు ఇంటికి వెళ్ళి పెళ్ళిచేసుకుని అక్కడే కొద్ది రోజులుండటమూ సమిధలతో అగ్నిహోత్రం చేసి హోమం చెయ్యటమూ, లేకపోతే దీపారాధన చెయ్యటమూ - ఇటువంటి లాంఛనాలు ఒకనాటి ఆచారాలే ఈజిప్ట్ దేశపు రాజుల కళేబరాలను చెక్కుచెదరకుండా భద్రం చేసి ఉంచారు అదే మనస్తత్వంతో అనేక తరాలపాటు, వేదార్థం పాటించకుండా నిరక్షరులైన బ్రాహ్మణులు సయితం, వేదాధ్యయనం చేశారు

అత్యంత ప్రాచీనమైన ఈ రచనలు ఈనాడు సజీవమైనవి కావంటే కొందరికి ఆగ్రహం రావచ్చుగాని, అందులో అబద్ధం ఏమీ లేదు చివరకు మన పురాణాలు కూడా సమాజ శాస్త్ర పరిశోధనలకు తప్ప పనికిరావు వీటి వల్ల మనకు ప్రయోజనం లేదు వాటిలోని ధర్మాలను అనుసరించిన వాళ్ళు జైళ్ళకు పోతారు సంఘద్రోహులు కూడా అవుతారు ఈనాటి సమాజానికి నాయకత్వం వహించేవాడు గాని, మహోపకారం చేసేవాడుగాని, సమగ్ర జీవితం గడపదలచిన వాడు గాని ఈ ప్రాచీన గ్రంథాలు చదవవలసిన అవసరం ఏమీ లేదు

ఈ మాట నమ్మని వారు అల్పసంఖ్యాకులుంటారని నాకు తెలుసు వారి దృష్టిలో వేదాలు సర్వోత్తమమైనవి పురాణాలు కూడా వేదాలకు తీసికట్టే అటువంటి వారికి ఏది మంచి రచన అన్న ప్రశ్న రాదు అందులోని మంచి ఏమిటి అన్న ప్రశ్నకు సమాధానం లేనే లేదు అందుచేత వారిని వదిలిపెడదాం

ఈ వేదాలూ, ఉపనిషత్తులూ, పురాణేతిహాసాలూ ఒకప్పుడు మంచి రచనలు అన్న విషయంలో ఎటువంటి సందేహమూ అవసరం లేదు ఆ కాలంలో వెలువడిన ఎన్ని రచనలు మంచితనం లోపించి కాలగర్భంలో కలిసిపోయినవో మనకు తెలియను కూడా తెలియదు అయితే ఈ మంచి రచనలు నిర్జీవం అయినాక, వాటిలోని మంచికి కాలదోషం పడుతుంది ప్రాచీన రచనలకు కాలదోషం పట్టింది

మంచి రచన సజీవంగా ఉండి తీరాలి అప్పుడే దాని మంచిని మనం అంచనా కట్టగలుగుతాం శాశ్వతత్వం అనే దానికి కొందరు విలువ కడతారు ఎక్కాల పుస్తకంకన్న శాశ్వత రచన ఉండదు కాని అది నిర్జీవ రచన అని మనం ఒప్పుకుంటాం ఈనాడు సజీవంగా ఉండే మంచి రచనలు కొంత కాలానికి నిర్జీవమై పోవచ్చు అప్పుడు వాటిలోని మంచి నిరుపయోగమవుతుంది అంతకంటె నిర్జీవమైన నిఘంటువులూ, వ్యాకరణాలూ ఎక్కువ ప్రయోజనకారిగా ఉండటం జరుగుతుంది

ఇంతకూ నేను స్పష్టం చెయ్యదలచిన అంశమేమంటే, రచన యొక్క మంచి కాలంపై ఆధారపడి ఉండి కాలంతో పాటు మారుతుంది అందుకే ఇంత ప్రాచీన సాహిత్యం ఉండి కూడా మనం కొత్త రచనలు చెయ్యటం మానలేదు కొత్త రచనలతో పని లేని రోజంటూ ఎన్నటికీ రాదు ప్రతి రచనా ఎప్పటికైనా నిర్జీవం కాక తప్పదు

అందుచేత మనం ఇవాళ ఏది మంచి రచన అని ప్రశ్నించుకుంటే ఈ కాలానికి మంచి రచన ఏదనే దాని అర్థం

ఇప్పుడు మనం ఆధునిక యుగంలో ఉన్నాం ఈ యుగం యొక్క పోకడ వేరు దీని తత్వం వేరు ఈ యుగం పారిశ్రామిక విప్లవ యుగం, శాస్త్రజ్ఞానాభివృద్ధి యుగం, ప్రజాతంత్ర

యుగం సామ్రాజ్యవాదుల పీడనకు గురి అవుతూ కూడా వారి సంస్కృతిలోని ఉత్తమ లక్షణాలనూ, మన భవిష్యత్తుకు అనుకూలించే గుణాలనూ స్వీకరించాలి అన్ని యుగాలలో లాగే ఈ యుగంలో కూడా లభ్యుదయ శక్తులకు, ప్రతీపశక్తులకూ మధ్య సంఘర్షణ తీవ్రంగా సాగించినప్పటికీ ఏ శక్తులు బలపరచదగినవో, ఏవి విసర్జించదగినవో మనలో మేధావులైన వారు గ్రహించారు ఉదాహరణకు గాంధీజీ 'సామ్రాజ్యవాదం'పై ధ్వజమెత్తి కూడా దేశాల మధ్య స్నేహసౌహార్దాలకు గల భవిష్యత్తును గ్రహించగల్గాడు బ్రిటిషువారిపట్ల ద్వేషాన్ని ఆయన గర్హించటానికి అదే కారణం

మానవులందరికీ సమాన హక్కులూ, భౌతిక సౌఖ్యాలను సమంగా అనుభవించే అవకాశాలూ ఊహించటానికైనా అవకాశం లేని యుగంలో మనిషి యొక్క ఆధ్యాత్మికాభివృద్ధికి ఎక్కువ ప్రాధాన్యం యిచ్చారు మన పూర్వులు శాస్త్ర జ్ఞానాభివృద్ధితో భౌతికసౌఖ్యాలు అందరికీ లభించే అవకాశాలు ఈనాడు ఏర్పడ్డాయి యంత్రోత్పత్తికి పరిమితి అంటూ ఉండనవసరం లేదు మనుషుల మధ్య గల సాంఘిక వ్యత్యాసాలకు భవిష్యత్తులో తావు లేదు దారిద్ర్యమూ, నిరక్షరతా, అనారోగ్యమూ, అసహాయతా నిర్మూలించటానికి సాధనాలు ఏర్పడ్డాయి వర్గవ్యవస్థ కూడా అనివార్యం కాదు ఆర్థిక ప్రణాళికల ద్వారా సామాజిక జీవితాన్ని పెంపొందించవచ్చు భౌతిక సౌఖ్యాలకూ, ఆధ్యాత్మిక పురోభివృద్ధికీ పూర్వం ఉండిన శత్రుత్వం పోవటమే కాక, అవి పరస్పరాధారం కలవిగా కూడా పరిణమించాయి ఆర్థికంగా ప్రవర్ధమానమై ఉజ్వల భవిష్యత్తు కోసం కృషి చేసే దేశాలే ఉత్తమమైన ఆధ్యాత్మిక జీవితం గడపగలవు వాటికి యుద్ధోన్మాదం ఉండదు అవి సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని ఆకాంక్షిస్తవి రాజకీయ కుట్రలూ, కూటాలూ, క్రౌర్యాలూ వాటికి అవసరం ఉండవు ఒకప్పుడు మానవులందరూ ఒక్క ఈశ్వరుడి దృష్టిలోనూ, మహాజ్ఞానుల దృష్టిలోనూ మాత్రమే సమానులు కాని ఈనాడు మానవులంతా మానవులందరి దృష్టిలోనూ సమానులుగా ఉండటానికి కృషి చేస్తున్నారు భవిష్యత్తులో ఈ కృషి ఫలిస్తుంది

ఇది ఈ యుగపు ధర్మం పూర్వం ఎన్నడూ ఇటువంటి పరిస్థితి లేదు ఏ పూర్వ రచన కూడా ఈ కాలపు ధర్మాన్ని ప్రతిబింబించదు ప్రతిబింబించలేదు ఈ ధర్మాన్ని అధర్మం ఎదిరించి పోరాడుతున్నది

ఈ సంఘర్షణలో అభ్యుదయశక్తుల పక్షాన నిలబడినదే మంచి రచన రచన మానవ సాంఘిక వ్యాపకాలలో ఒకటి చాలా ఉత్తమమైన వ్యాపకం కూడాను నిత్య సమస్యలూ, వ్యక్తి సమస్యలూ మనుషుల మనస్సులనూ, ఆలోచనలనూ, బహుముఖం చేస్తవి వాటిని ఏకముఖం చేసే శక్తి రచనలకున్నది చీకటిలో నడిచే వారికి వెలుగెంత అవసరమో సమాజానికి మంచి రచనలు అంత అవసరం

రచనల మంచి చెడ్డలను చాలా మంది వ్యక్తుల అభిరుచులను బట్టి నిర్ణయించటానికి ప్రయత్నిస్తారు నిజానికి అభిరుచులను అరికట్టలేం అవి వ్యక్తిగతమైనవి వారి వారి మనోవికాసాన్ని బట్టి, అది లోపించటాన్ని బట్టి రచనలు బాగుంటాయి డిటెక్టివు సాహిత్యం తప్ప చదివి ఆనందించలేని వారుంటారు ప్రణయ కథలు చదివితే గాని తృప్తిలేని వారుంటారు కొందరికి కరుణ రస ప్రధానమైన రచనలే తలకెక్కుతవి ఈ అభిరుచి జిహ్వాచాపల్యం

వంటిది. కొందరికి తీపి ఇష్టం, కొందరికి పులుపు ఇష్టం, కొందరికి కారం ఇష్టం. దీన్ని బట్టి ఆహారం యొక్క మంచిచెడ్డలను నిర్ణయించటం ఎంత కష్టమో, అభిరుచులను బట్టి రచనల మంచిచెడ్డలను నిర్ణయించటం కూడా అంత కష్టం.

కాని వ్యాపార దృష్టితో నడిపే పత్రికలూ, అచ్చయే పుస్తకాలూ రచనల మంచిని అంతగా పరిగణించవు. అధిక సంఖ్యాకుల అభిరుచులనే పరిగణించటం జరుగుతుంది. అందుచేత ఒక రకం రచనలకు బహుళ ప్రచారం జరుగుతుంది. రానురాను మంచి రచనల పరపతి తగ్గిపోవటం కూడా జరగవచ్చు. కాని ఇది శాశ్వతంగా కొనసాగదు. ఎప్పటికైనా సాంఘిక శక్తులు ఈ పరిస్థితులపై తిరుగుబాటు చేసి తీరుతాయి. ఒక కొత్త సాహిత్యోద్యమం బయలుదేరుతుంది. ఇటువంటి తిరుగుబాటొకటి గిడుగు రామమూర్తి పంతులుగారు సాగించి అద్భుత విజయం సాధించారు. ఆయన ఉద్యమం లచ్చంగా భాషకే సంబంధించినది కాదు. రచనలు ప్రజాస్వామ్యానికి సన్నిహితంగా ఉండి, అభ్యుదయకర భావాలు ప్రజంలో వ్యాప్తి చెంది సంఘానికి సర్వతోముఖ వికాసం కలగటమే పంతులుగారి ప్రధాన లక్ష్యం. ఆ ఉద్యమం చూసి అర్థం చేసుకున్న వాళ్ళకు మంచి రచన వ్యావహారిక భాషలోనే తప్ప గ్రాంధిక భాషలో జరగటానికి వీల్లేదన్న గురి పడిపోయినది. ఇది ఎంత ప్రబలమైన విశ్వాసంగా పరిణమించిందంటే దీని ప్రభావం దాదాపు రచయితలందరినీ వ్యావహారిక భాషకేసి మళ్ళించింది. క్రమంలోనే గ్రాంధిక భాషారచనలు అడుగుకు దిగజారిపోయినై.

అటువంటి మరొక ఉద్యమం రచనలో వాస్తవికత కోసం బయలుదేరింది. రచనలో ఉండే భాష జన సామాన్యానికి సన్నిహితం కావటం ఎంత ముఖ్యమో, రచనలు జీవితానికి దగ్గరగా ఉండటం కూడా అంత ముఖ్యమే. వాస్తవికవాదం ఆశించినది అదే. ఇది భావవాదానికి, ఆదర్శవాదానికి వ్యతిరేకమైనది. ఏనాడో పెద్దలు చెప్పిన ధర్మాలనూ, నీతులనూ ఆదర్శంగా నమ్మి వాటికి అనుగుణంగా జీవితాన్ని తీర్చిదిద్దాలని ప్రయత్నించే వాళ్ళు ఏమీ సాధించలేరు. జీవిత పరిణామ సూత్రాలను అవగాహన చేసుకుని, జీవితం సరిఅయిన దారిలో పురోగమించాలంటే పాత సంప్రదాయాల నీతిలోనూ, ధర్మంలోనూ రావాల్సిన మార్పులేవో తెలుసుకున్న వాళ్ళే ఏదైనా సాధించగలుగుతారు. అట్లా రాదగిన మార్పులను బలపరుస్తూ ప్రజలను వాటికి సుముఖులను చేసేవే మంచి రచనలు.

గత కాలాలలో మానవజాతి పురోగమనానికి తోడ్పడిన రచనలనన్నిటినీ మనం ఇంకా ఆరాధిస్తూనే ఉన్నాం. ఆరాధించవలసిందే కూడా. అవే ఈనాటికి కూడా మంచి రచనలుగా ఉపకరిస్తాయనుకున్నప్పుడు మటుకు మనం పెడమార్గం పడతాం. పురాతన రచనలను ఆరాధించటం వలన ఆత్మవిశ్వాసం వృద్ధి కావటం నిజమే గాని ఆ ఆరాధన మరింత దూరం వెళ్ళితే పురోగమనానికి పెద్ద అంతరాయం ఏర్పడుతుంది.

ఏది మంచి రచన? ప్రజాబాహుళ్యానికి సన్నిహితమైనదీ, జీవితాన్ని వాస్తవ దృష్టిలో చూచేదీ, ముందుచూపు గలిగి భవిష్యత్తు ఎటున్నదీ నిర్దేశించేదీ, ఒక కుటుంబంలో ఉండే నలుగురి మధ్యా, ఒక దేశంలో పది మంది మధ్యా, ప్రపంచంలో వున్న దేశాలన్నిటి మధ్యా సత్సంబంధాలను ప్రేరేపించేదీ మంచి రచన. పురోగమనం సంఘర్షణతో కూడినది. కనువూడవకుండా కళ్ళాపి చల్లుకోము. పునాదులు తవ్వకుండా గోడలు కట్టం. ఎప్పటికప్పుడు

సంఘ శరీరంలో బయటికి పోవల్సిన మాలిన్యం బోలెడంత ఉంటుంది పురోగమనానికి అంతరాయంగా ఉండే అవినీతీ, అధర్మమూ నశించితేగానీ అవసరమైన ధర్మం సుప్రతిష్ఠితం కాదు శివాజీ వంటి యోధులు చిన్నతనంలోనే వీరగాథలు విన్నారట మంచి రచన ప్రజల మనస్సులలో అభ్యుదయానికి అనుకూలమైన బీజాలు చల్లాలి

ఈ దేశంలో ఈనాడు మనం అదృష్టవంతులం మన దేశం విశ్వశాంతినీ, విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని, అన్ని దేశాల మధ్య సౌహార్దాన్ని వాంఛిస్తున్నది మన నాయకులు ప్రణాళికాబద్ధమైన ఆర్థిక పురోభివృద్ధినీ, మత సామరస్యాన్ని, దారిద్ర్య నిర్మూలనాన్నీ, వర్గరాహిత్యాన్ని అవలంబించారు సర్వమానవ సంక్షేమ కార్యక్రమం ఆధ్యాత్మిక శక్తులను పెంచుకుంటే గాని తగ్గించదు మానవులందరి మధ్యా సమానత్వమూ, దేశాలన్నిటి మధ్యా సౌభ్రాతృత్వమూ ఏర్పడటం కన్న ఉత్తమ ఆధ్యాత్మిక స్థితి ఏముంటుంది?

ఏది మంచి రచనో చెప్పటంలోనే దానిలోని మంచిని కూడా స్పష్టం చెయ్య ప్రయత్నించాను మంచి రచనలు ఈనాడు వెలువడుతున్నాయి సామాజిక స్వభావాన్ని అర్థం చేసుకున్న రచయితలు చాలా మంది రచనలు చేస్తున్నారు సంఘంలోని చెడును నిర్మూలించటానికి, మంచిని పెంపొందించటానికి జీవితంలో జరిగే సంఘర్షణ ఈనాటి సాహిత్యంలో ప్రతిబింబితమవుతూనే ఉన్నది భవిష్యత్తు ఈనాడు స్పష్టంగా రచయితల ఎదుట కనిపిస్తూనే వుంది ఈ భవిష్యత్తును చేరుకునే మార్గాలను గురించి కొద్దిగా అభిప్రాయభేదాలున్నాయి కాని అవి కూడా తొలగిపోతై సందేహం లేదు

*ముద్రణ విశాలాంధ్ర దినపత్రిక, 17-9-1961*

## 22. అభ్యుదయ రచయితలూ, కళాకారులూ, రాజకీయాలు

అభ్యుదయ కళాకారులు కమ్యూనిస్టుల ఏజెంట్లనే ఆరోపణ ఒకప్పుడు రచయితలను కలవరపెట్టి ఉండవచ్చు గాని రానురాను అది కమ్యూనిస్టు పార్టీకి ఒక ''కాంప్లిమెంటు''గా పరిణమిస్తున్నదనుకొంటాను

అభ్యుదయ రచయితలకూ, మామూలు రచయితలకు గల నిజమైన తేడా ఏమిటి? కృతక సమస్యలనూ, అవాస్తవిక జీవితాన్నీ, అవిశ్వసనీయమైన మనస్తత్వాన్నీ, అస్వాభావిక సన్నివేశాలనూ, పరిణామాలనూ చిత్రించే వాణ్ణి ఎవరూ ఒక రచయితగా చెప్పుకోరు ఈ ''అడబ్బికి మనుషులూ తెలీదు జీవితమూ తెలీదల్లే ఉంది''! అంటారు ఈనాటి కథలలోనూ, నవలలోనూ పాత్ర చిత్రణ గాని, సన్నివేశ కల్పన గానీ ఏమాత్రమైనా అస్వాభావికంగా ఉంటే విమర్శకులు ''అభూతకల్పన'' అనేస్తున్నారు కనుక జీవితాన్నీ, పాత్రలనూ, వారి స్వభావాలనూ, ప్రవర్తననూ వాస్తవంగా చిత్రించటం రచయిత యొక్క కనీస కర్తవ్యం అభ్యుదయ రచయిత అంతటితో తృప్తి చెందడు, ఇంకొక్క అడుగు ముందుకు పోతాడు - పాత్రల వర్గ ప్రవర్తన కూడా వాస్తవంగా చిత్రించటానికి కృషిచేస్తాడు

ఈ ఒక్క అంశమూ మామూలు రచనను అభ్యుదయ రచన చేస్తుంది మానవ మనస్తత్వము అందరికీ ఒకటిగానే వుంటుందనీ, అందరిలోనూ మంచి చెడ్డలున్నాయనీ,

వర్గాలు కేవలం రాబడిని బట్టి ఏర్పడ్డవనీ, అందరు మనుషులకూ నైతిక, ధార్మిక, సాంఘిక ప్రమాణాలు ఒకటిగానే వుంటాయనీ నమ్మేవాళ్ళు జీవితాన్ని అర్థం చేసుకోలేరు అభ్యుదయ రచనలు చేయలేరు శాసనాలలోనూ, చట్టాలలోనూ, వర్గ విచక్షణ లేకపోతే ఏం జరుగుతుందో మనకందరికీ తెలుసు ఒక దరిద్రగొట్టు మనిషి బతకలేక పిల్లలను బావిలోకి తోసి తాను కూడా పడబోతే చట్టం ఆమె మీద నేరం మోపి శిక్షిస్తుంది ఇంకో దరిద్రుడు బతకలేక దొంగతనాలు చేస్తే వాణ్ణి కూడా చట్టం నేరస్థుడిగా పరిగణించి శిక్షిస్తుంది "ఈ బతకలేని దరిద్రులు ఏం చేస్తే సహిస్తావు"? అని పీనల్‌కోడ్‌ను అడిగి చూడండి!

దారిద్ర్యం వ్యక్తి నేరమా? సంఘ నేరమా? డబ్బు తీసుకుని హత్యలు చేసే వారిని వ్యక్తి నేరమంటే మనం అర్థం చేసుకోగలం పిండిలో ఫాలిడాల్ కలవనిచ్చి అజాగ్రత్త వల్ల అనేకమంది చావులకు కారణభూతులైన వారు నేరస్థులని ఒప్పుకోవచ్చు తమ డ్యూటీ సరిగా చెయ్యని రైల్వే అధికార్ల బుద్ధితక్కువ వల్ల రైలు ప్రమాదాలు జరిగి జన నష్టం జరిగితే అది వ్యక్తి నేరం ప్రజల సొత్తు కైంకర్యం చేసే వాళ్ళు, ఆశ్రితులను అందలాలెక్కించే వాళ్ళూ, వోట్ల కోసం పేద ప్రజలకు ఉత్తుత్త కాల్వలు తవ్విస్తామనీ, నదులు లేని చోట డాములు కడతామనీ వాగ్దానాలు చేసే వాళ్ళు నేరస్తులు

వ్యక్తివాదమూ, వ్యక్తి వికాసమూ అత్యంత వాంఛనీయం కాని వ్యక్తి అంటే తన మనస్తత్వమూ, ఆర్థిక స్తోమతా, తన భ్రమలూ, తన అపోహలూ, తనకుండే పరిమిత జ్ఞానమూ, తనకుండే భయాలూ మాత్రమే గల వాడని భావించే మధ్యతరగతి "మేధావి" వ్యక్తి వాదాన్ని గురించి చెప్పే మాటలకు నిలవ కాళ్ళుండవు

స్వేచ్ఛ అన్ని వర్గాలకూ ఒకటి కాదు దేశంలోని అత్యధిక సంఖ్యాకులైన శ్రామికులకూ, పేదలకు స్వేచ్ఛ అంటే పని చేసుకొనే హక్కు, కడుపుకింత తిండీ, ఒంటికింత బట్టా, ఉండటానికింత ఇల్లూనూ మధ్యతరగతి వాడికి మోటారు కారూ, తన ఆర్థిక క్షేమాన్ని పెంపొందించుకొనే అవకాశమూ, సాటివారి మధ్య తల ఎత్తుకు తిరిగే అవకాశమూ మరింత స్వేచ్ఛనిస్తాయి ఇంకా పోయిన కొద్దీ స్వేచ్ఛ అంటే ఇతర వర్గాలను దోచుకొనే సదవకాశమూ, రాజకీయ యంత్రాన్నీ తమ ఆధీనంలో ఉంచుకునే అవకాశమూ వగైరా

సంస్కృతిలో కూడా వర్గ లక్షణాలున్నాయి అట్టడుగున పడి ఉన్న వర్గానికి మధ్య తరగతి వాళ్ళు "సంస్కృతి" అనుకునేది హాస్యాస్పదంగా వుంటుంది మధ్యతరగతి వాళ్ళు దేశం కోసం మాటలనూ, కొద్దిగా డబ్బునూ "త్యాగం" చెయ్యగలరు నిరుపేదలు తమ ప్రాణాలను తప్ప ఏమీ త్యాగం చెయ్యలేరు. భూదానోద్యమం (ఇది ఏమయిందో తెలీయటం లేదు) చాలా మంది భూస్వాములు తమకు లేని పొలాలను సాహసంతో దానం చేసేశారు పేదవాళ్ళు తమ ఆధ్యాత్మిక పురోభివృద్ధి కోసం తాత్విక చింతనలో మునిగి తేలమంటే తేలరు అంతమాత్రాన వాళ్ళను సంస్కారహీనులనటానికి లేదు వాళ్ళకు సంస్కారమంటూ లేదు, కుసంస్కారం కూడా ఉన్నది! ఇప్పుడు వెలువడే కొన్ని సినిమాలు ఎగబడి చూసి పేద ప్రజానీకం చాలా కుసంస్కారాన్ని సంపాదించుకుంటున్నది వాళ్ళలో వర్గ చైతన్యాన్నీ ఏకీభావాన్నీ పెంపొందించేదంతా ఆ వర్గానికి మంచి సంస్కారమే

ధార్మికంగా కూడా వర్గ వ్యత్యాసాలున్నాయి ఈ విషయంలో మధ్యతరగతి పరిస్థితి అత్యంత హాస్యాస్పదమైనది ఈ మధ్యతరగతికి ప్రతి విషయంలోనూ రెండేసి విరుద్ధ ప్రమాణాలున్న సంగిలి తెలియని అభ్యుదయ రచయిత ఉండడనుకుంటాను తాము ద్వేషించే, ఉసూయపడే సాటివాళ్ళకు కాఫీలూ, టీలూ పోసి, ఫలహారాలూ, విందులూ కుడుపుతారు గానీ పనిమనిషికి పట్టెడన్నం హెచ్చు వెయ్యరు వేస్తే దెప్పి నెలల తరబడి జ్ఞాపకం చేస్తారు వ్యాపారస్తులూ, దుకాణాల వాళ్ళూ రూపాయిలు లెక్కన మోసం చేస్తే లక్ష్య పెట్టరు తమకు లేని స్వేచ్ఛను గురించి పీడకలలు కంటారు "కళలు రాజకీయాలకు అతీతంగా ఉండాలంటే కమ్యూనిస్టులను బహిష్కరించండి", అని వారి వర్గతత్వం పలుకుతుంది అసలు రాజకీయాల విషయంలోనే ద్వంద్వాభిప్రాయాలున్నాయి రాజకీయ హక్కులు అందరికీ కావాలని వారు ఒప్పుకుంటారు, కాని రాజకీయాలకు వారే అస్పృశ్యత తగిలిస్తారు ఏ రంగంలో రాజకీయాల వాసన కొట్టినా వారు భరించలేరు కళలు రాజకీయాలకు అతీతంగా ఉండాలి సంస్కృతి లోకి రాజకీయాలు రారాదు విద్యార్థులు రాజకీయాల జోలికి రారాదు ప్రభుత్వోద్యోగులకూ, సైనికులకూ, ఆడవాళ్ళకూ, కార్మికులకూ రాజకీయ విశ్వాసాలుండకూడదు ఉపాధ్యాయులకు ఎటువంటి రాజకీయ సిద్ధాంతాల మీదా అభిమానం ఉండరాదు వాళ్ళ అభిరుచులూ, ఆశయాలూ పైకి చూస్తాయి జీవితం మటుకు కిందికి దిగజారిపోతుంది అంతెందుకు? భవిష్యత్తు గురించి శ్రామికులు ఆశించేది మధ్యతరగతి వాళ్ళు ఆశించలేరు ఒక శ్రామికుడు తన నలుగురు కొడుకులూ శ్రామికులుగా బతకాలని కోరుకోవటంలో విడ్డూరం ఉండదు కాని పదెకరాలూ, ఇల్లూ గల ఆసామీ తన నలుగురు కొడుకులూ, పదెకరాలూ, ఇళ్ళూ గల ఆసాములు కావాలని కోరుకుంటే ఆ కోరిక అవాస్తవమైనదైపోతుంది

కొందరు 'మేధావులు' తమ వర్గతత్వాన్ని విడిచిపెట్టలేకపోతే అంటిపెట్టుకుని ఉండమనండి కాని ఆ వర్గతత్వం విడనాడకుండా వారు జీవిత వాస్తవికతను కాచి వడబోసినట్టు మాట్లాడితే పర్యవసానం పచ్చిఅబద్ధాలే అవుతాయి గజ్జల మల్లారెడ్డి తన గేయాలలో మధ్యతరగతి భద్రంగా రక్షించుకునే మర్మస్థానాలను ద్వంద్వ మనస్తత్వం తప్ప నాకింకేమీ కనిపించలేదు

అభ్యుదయ కళాకారులను ఒక్క కమ్యూనిస్టులే ఆదరించవలసిన అవసరం ఏమీ లేదు ఏ రాజకీయ పక్షం వారు ఆరాధించినా అభ్యుదయ వాదులు హర్షిస్తారు రాజకీయ పక్షాలు ముందుకు చూస్తున్నాయా, వెనక్కు చూస్తున్నాయా, కళ్ళు తెరచుకుని ఉన్నాయా, మూసుకుని ఉన్నాయా అన్నదానికి అభ్యుదయ కళలు గీటురాయి అంటాను అభ్యుదయ కళలను విమర్శించదలచిన వారు జీవితం వాస్తవంగా చిత్రించబడిందా లేదా, వర్గతత్వాలు సరిగా చిత్రించబడ్డాయా లేదా అన్న విషయాలను పరిగణించాలి గాని, అందులో ఏ రాజకీయాలున్నాయన్నది తడవవద్దు రాజకీయాలు అస్పృశ్యమైనవి కావు బ్రిటీషు వారి ఉక్కుపాదం కింద దేశం నలిగే రోజుల్లో అభ్యుదయమైన రాజకీయ చైతన్యం ప్రదర్శించిన కళాకారులను ఆదరించి నెత్తిన పెట్టుకున్నాం ఈనాడైనా రాజకీయాలు పవిత్రమైనవే రేపైనా అంతే

*విశాలాంధ్ర దినపత్రిక, 1-1-1962*

# 23. వేడుక సాహిత్యం

ఒక విధంగా ఈనాటి తెలుగు కథాసాహిత్యం చాలా ముందుకు వచ్చింది ముప్పై, నలభై ఏళ్ళ క్రితం ఆధునిక కథకులనూ, కథలనూ, నవలలనూ చేతివేళ్ళపై లెక్కించటానికి వీలుగా ఉండేది ఇంత కొద్ది కాలంలోనే కథా సాహిత్యం ప్రమాణావాణ్యాలు రెంటిలోనూ ఎంతగానో అభివృద్ధి చెందింది భాషా, భావ ప్రకటనల విషయంలో వేరే చెప్పనసరమే లేదు

ఈనాడు వెలువడే కథా సాహిత్యంలో ఉత్తమమైన దాన్ని గురించి పదిమందితోబాటు నేనూ గర్విస్తూనే ఉన్నాను అటువంటి సాహిత్యాన్ని ఏ దేశభాషలోకి అనువదించినా, ఖ్యాతి సంపాదించుకుంటుంది సందేహం లేదు అట్లా అనేక కథలూ, కొన్ని నవలలూ ఇతర భాషలలోకి అనువాదం పొందుతున్నాయి కూడా

ఈ ఉత్తమ సాహిత్యంతో బాటు కొంత వేడుక సాహిత్యం కూడా వెలువడుతూండటం శోచనీయమనిపిస్తుంది పారిశ్రామిక యుగంలో, వ్యాపారధర్మం విజృంభణలో ఉండగా సాహిత్యపు విలువలను నిలబెట్టి ఉంచటం సాధ్యం కాదని నాకు తెలియకపోలేదు కాని మన దేశంలో సాహిత్యపు విలువలను తుడిచిపెట్టగలిగినంత పారిశ్రామికం కాలేదు, సాహిత్య వ్యాపారం పోటీలు పడి సాహితీపరులకు వందలూ, వేలూ చేకూర్చటమూ లేదు ఇంకా రచయితలురచనలు ద్వారా బతికే పరిస్థితి లేదు సినిమాలకు రాసేవాళ్ళనూ, డిటెక్టివు నవలలు అచ్చే వేసే వారిలో బహు కొద్ది మందినీ తప్పిస్తే సరస్వతికి చెప్పుకోదగినంత లక్ష్మీ ప్రసన్నం కనబడదు రచన వృత్తిగా పెట్టుకోదలచిన వాడు ఈనాడు రిక్షా లాగే వాడితో పోటీ చెయ్యలేడని చెప్పవచ్చు

ఈ భాగ్యానికి మనపత్రికలు గాని, రచయితలు గాని అమెరికను పద్ధతులనూ, పాశ్చాత్య ఇతివృత్తాలను పుణికి పుచ్చుకోవాలా? విడ్డూరమైన పరిస్థితులనూ, మనోరుగ్మతలనూ, సాంఘిక సన్నివేశాలూ, వాతావరణాన్ని సృష్టించి, పాశ్చాత్య సంప్రదాయాలు తెలిసిన వారిని మాత్రమే మెప్పించ గల రచనలు చెయ్యటం అవసరమా?

ఆధునిక తెలుగు సాహిత్యం ఇవాళే పుట్టుకురాలేదు దానికి యాభై ఏళ్ళ చరిత్ర ఈసరికే ఉన్నది అన్ని దేశాలలోనూ, అన్నిరంగాలలోనూ తెలుగువాళ్ళున్నారు తెలుగు జీవితం ఉన్నది తెలుగువాళ్ళకు సమస్యలున్నాయి తెలుగు వాతావరణం ఉన్నది తెలుగు కథలకు, నవలలకు కావలసిన హంగులు తెలుగుదేశంలో ఉన్నాయి రచయితలకు ఉండవలసిందల్లా ఈ తెలుగు జీవితం గురించి నిజమైన ''తాపత్రయం'' దీన్ని పైకి తీసుకురావాలన్న ఆవేదన ఒక విధమైన ప్రేమబంధం - దాన్ని వెన్నంటి ఉండే ఆవేదనా, ఆందోళనా - ఏదో ఒక మోతాదులో లేని వాడు ఎంత నైపుణ్యం గల వాడైనా తన జాతిని గురించి ఉత్తమ సాహిత్యం సృష్టించలేడు

తెలుగు భాషను గురించిన ఆందోళన గిడుగు రామమూర్తిగారినీ, తెలుగు వాళ్ళ మూఢాచార విశ్వాసాలు కందుకూరివారినీ, ఆంధ్ర రాష్ట్ర వాంఛ అనేకమంది తెలుగు రాజకీయవేత్తలనూ ఎలా చైతన్యవంతులను చేసిందో తెలుగు జీవితం తెలుగు కథకులను

లగా చైతన్యవంతులను చెయ్యాలి అటువంటి కథకులే కథారచననూ, నవలారచననూ ఒక ఉద్యమంగా పరిగణిస్తారు

కేవలం రచయితలే గాక పత్రికలు నడిపే వారూ, పుస్తకాలు ప్రచురించే వారూ, వాటిని విమర్శించే వారు 'కూడా మానసికంగా ఇతర దేశాలకు వేంచేయక తెలుగు గడ్డ మీదనే కొంతకాలం నిలబడి ' ఉద్యమం' అన్న భావాన్ని మనసులో ఉంచుకున్నట్టయితే సాహిత్యం ద్వారా తెలుగుజాతి మరింత చైతన్యం పొందే అవకాశం ఉంటుంది

మన దేశం కూడా పారిశ్రామికంగా పాశ్చాత్య దేశాల ప్రమాణానికి పెరిగి, పుస్తకాలు వేలలో అచ్చయి, లక్షల సంఖ్యలో అమ్ముతూ, రచయితలు వేలకువేలు సంపాదించి, ఇతర దేశాలకు వెళ్ళి అక్కడి జీవితం గురించి కూడా కథలూ, నవలలూ రాసే పరిస్థితి ఏర్పడినప్పుడు ప్రజలను వేడుక సాహిత్యంతో మభ్యపెట్టేందుకు బోలెడంత అవకాశం ఉంటుంది ఇప్పుడిప్పుడే దేశంలో అక్షరాస్యత పెరుగుతున్నది రాబడిని మించి జీవనవ్యయం పెరుగుతున్నది ఈ దశలో పఠనాసక్తిని పావలా డబ్బుల కోసం దుర్వినియోగపరచటం జాతిపరంగా చూస్తే మహా పాతకం

*విశాలాంధ్ర దినపత్రిక, 16-9-1962*

## 24. తెలుగులో నవలలు

గత వారం శ్రీ రమణారెడ్డి గారు తెలుగు నవల గురించి రాసిందాంతో చాలా మంది ఏకీభవిస్తారు - చాలా మంది ఏకీభవించరు నేను ఏకీభవిస్తాను, కనక ఏకీభవించని వారిని నేను వెనక వేసుకొస్తున్నానన్న అపోహ ఎవరికి కలగనవసరం లేదు ఏకీభవించని వారు ఎందుకు ఏకీభవించరో తెలుసుకోవడం ముఖ్యం

''ఏది గొప్ప నవల?'' అన్న ప్రశ్నకు వచ్చే సమాధానం అచ్చుగా జవాబు చెప్పే వ్యక్తుల పైన ఆధారపడుతుంది అంతేకాదు, జవాబు చెప్పే కాలం పైన కూడా ఆధారపడుతుంది తాత్కాలిక విమర్శలు చేసే సమీక్షకులు ఈ కాలం అన్న దాన్ని పాటించకపోవచ్చు సమీక్షలలో నెలకొక అత్యుత్తమ నవల అవతరించవచ్చు కాని రమణారెడ్డి గారి లాగా సింహావలోకనం చేసే వారు కాలాన్ని కూడా గణనలోకి తీసుకోవాలి

ఈ విషయం మరింత విపులీకరిస్తాను వీరేశలింగం గారి ''రాజశేఖరచరిత్ర'' గోల్డ్‌స్మిత్ నవలకు కొద్దిగా ప్రతిరూపమే అయినప్పటికీ తెలుగు సాహిత్యంలో అత్యుత్తమ రచనగా - గొప్ప నవలగా - నిలబడి కొంతకాలం ఉండగలిగింది కారణం? వీరేశలింగంగారు ఆ కాలపు జీవితాన్ని సాధ్యమైనంత సమగ్రంగా ''కడగటానికీ'' ఆ నవలను ఉపయోగించుకున్నారు

''రాజశేఖర చరిత్ర'' యొక్క ప్రాముఖ్యం తగ్గితే అందుకు కారణం అంతకన్న సమర్థంగా జీవితాన్ని సింహావలోకనం చేసిన రచనలు వచ్చి పడడం కాదు, కాలప్రభావం! - దేశీయ, జాతీయోద్యమాలు రావటమూ, ప్రజలలో కొత్త రకం చైతన్యం రావటమూనూ

అదే విధంగా ''మాలపల్లి'' ఈ కొత్త భావాల మధ్య ఉద్భవించి ''గొప్ప నవల'' అయింది ప్రభుత్వం నిషేధించటంలో దానికి పవిత్రత కూడా లభించింది

'20'లలో నవలా రచన అంత చురుకుగా సాగలేదు వివిధ గ్రంథమాలల వారు హెచ్చుగా నవలానువాదాలు ప్రచురించారు వీటిలో టాగూరు రచనలతో బాటు డిటెక్టివ్ రచనలు కూడా వుండేవి అన్నీ ''మంచి'' నవలలే కారణం? నవలా రచన అన్నది దాదాపు లేనే లేదు

'30'లలో ఈ భావాన్ని తొలిగించటానికి కాబోలు ఆంధ్ర యూనివర్సిటీ వారు నవలల పోటీ పెట్టి విశ్వనాథ వారి 'వెయ్యిపడగలు''కూ, అడివి బాపిరాజు గారి ''నారాయణరావు''కూ బహుమతులు పంచారు రెండు ''మహత్తరమైన'' నవలలు తెలుగులో అవతరించాయి

ఈ దశాబ్దంలోనే చలంగారు అనేక ''అద్భుత'' నవలలు రాశారు అయితే వీటిని అద్భుతమన్న వారు వేరే మనుషులు - వేరు కాలం వాళ్ళు కారు 'మైదానం'' కూడా 'వెయ్యిపడగలు'', ''నారాయణరావు''లతోపోటీ చేసిందని వినికిడి

రెండవ ప్రపంచ యుద్ధ కాలం నుంచి ఒక గొప్ప పరివర్తన దేశంలోనే ఏర్పడింది ఉన్నట్టుండి పాఠకలోకం సంఖ్య పదింతలూ, నూరింతలూ పెరిగింది ఇందువల్ల ప్రజలసాహిత్యంలోకి ఒక కొత్త ''క్వాలిటీ'' రాక తప్పలేదు విమానంలోంచి కిందికి దూకే వాడి వేగం గాలి గొడుగు తెరుచుకోగానే తప్పున తగ్గిపోయినట్టుగా, పది పన్నెండు మంది 'చేరి ఇది మహత్తరమైన నవల'' అని లోకాన్ని నమ్మించే రోజులు పోయాయి అనే వాళ్ళు పోలేదు వారి కోసం వెలువడే ''మహత్తర'' నవలలు వెలువడుతూనే ఉన్నాయి నోరి వారు పది దశాబ్దాలు వెనక్కి వెళ్ళి ముందుకొస్తుంటే, విశ్వనాథ వారు ఇంకా ప్రాచీన కాలానికే వల వేసి లాగుతున్నారు

అయితే ఈనాటి పాఠకలోకంలో నవలలు చదివే వారి సంఖ్య చాలా తక్కువ ఈనాటి నవలలు చదివేవాళ్ళు తమ నవలలను తరుచు పత్రికలలో సీరియల్స్‌గా చదువుతున్నారు ఈ నవలలలో పత్రికా వాతావరణ ప్రభావమూ, అసంఖ్యాకులైన పాఠకుల అభిరుచుల ప్రభావమూ ఉంటాయి శారద రచించిన ''మంచిచెడు'' ఇటీవల ముప్పాళ్ళ రంగనాయకమ్మగారు, కోడూరి కౌసల్యాదేవిగారు రచించిన నవలలూ, ప్రత్యేకించి రెండోతరం రచించిన ''చక్రభ్రమణం'' అద్భుతమయిన కీర్తి గడించాయి ఇవి మహత్తరమైన రచనలు అన్న వారు బుచ్చిబాబు ''చివరకు మిగిలేది''నీ, శ్రీదేవి ''కాలాతీత వ్యక్తులు''నూ గొప్ప రచనలన్న వారు లేకపోవచ్చును మహీధర రామమోహనరావుగారి నవలలు చదివి ఆనందించని వాళ్ళు ముందు చెప్పిన వాటిని లక్ష్యపెట్టక పోవచ్చు ప్రస్తుత పరిస్థితి దృష్ట్యా ఈ అభిప్రాయాలకు చేయగలిగిందేమీ లేదు విమర్శకు కొత్త ప్రమాణాలు ఏర్పడాలి

అన్ని తరగతుల వారూ, అన్ని రకాల అభిరుచుల వారూ మెచ్చినప్పుడే మహత్తరమయిన నవల అయితే అటువంటిది రాలేదని నిస్సంకోచంగా చెప్పవచ్చు అందుకే నేను శ్రీ రమణారెడ్డితో ఏకీభవిస్తాను

నవలకూ, నవలికకూ తేడా సైజులోనే ఉన్నదని రమణారెడ్డిగారనుకుంటే నేనాయనతో ఏకీభవించను నవలలూ, నవలికలూ, పెద్ద కథలూ, చిన్న కథలూ, గల్పికలూ, ''అల్పికలూ'' కూడా నేను రాశాను వాటన్నిటివైనాలూ, శిల్పమూ నాకు స్పష్టంగా తెలుసును ఒక మహత్తరమైన నవల రాసే ఆశ శ్రీ రమణారెడ్డి పెట్టుకున్న వారిలో నేను కూడా ఉన్నట్టయితే, ఆయన నన్ను ఆ జాబితాలోనుంచి తొలగించడం మంచిది ''బండలు'' రాయమని నన్ను ప్రోత్సహించిన

మాత్రులు లేకపోలేదు జీవితాన్ని సమగ్రంగా చిత్రించటానికి నాకు గల అవకాశాలూ, శక్తిసామర్థ్యాలూ, అవతల పారేసే లోకం యొక్క పదునార్థ్యమూ, కాలపరిస్థితి బేరీజు వేసుకొని నేను నవలలో కూడా "సంగ్రహ"రచన చేస్తున్నాను శిల్పం చెడిపోయిందన్న "ఎందుమూళ్లు" 250 పేజీల గ్రంథంగా పెరగకుండా ఉండటానికి నా శిల్పశక్తినంతా వినియోగించవలసి వచ్చింది దాదాపు కథను చివర ఆరంభిస్తే గాని నాకది సాధ్యం కాదు దీన్ని జర్నలైజు చెయ్యటం అని అంటారని శ్రీ రమణారెడ్డిగారి ద్వారా ఇప్పుడు నాకు తెలుస్తుంది

అక్షరాస్యత పెరిగిన కొద్దీ ఇంకా కొత్త పరిణామాలూ వస్తాయి ఇంకా కొత్త రకం పత్రికలు వస్తాయి పత్రికలకు కథలూ, నవలలూ రాసుకొని బతకటం సాధ్యమయ్యే కాలం వస్తుంది పేరుకు సోషలిస్టు వ్యవస్థే అయినా రేపటి సాహిత్యంపై ధనిక వర్గ ప్రభావమే హెచ్చుగా ఉండబోతుందని నా మనసుకు తోస్తుంది ఈ ప్రభావం సాహిత్యంలో ఎలాంటి మార్పులు తెస్తుందో ఎవరు చెప్పగలరు? పత్రికలు నవలలు పోటీలు పెడుతుంటే వందల సంఖ్యలో నవలలు వచ్చి పడుతున్నాయట హెచ్చు భాగం "చెత్తే" కావచ్చు కాని వందల సంఖ్యలోనూ, వేల సంఖ్యలోనూ నవలా రచయితలు కలం పట్టాక ఏ విధమైన అనుభవం గల మనిషి, ఏ అసాధారణ రచనా ప్రజ్ఞ కనబరిచి ఒక మహత్తరమైన నవల బయటపెడతాడో చెప్పలేం

నవలా రచన రాజశేఖర చరిత్రలో ఆరంభమయిందనుకునే దృష్టి విడిచిపెట్టి ప్రపంచ యుద్ధానంతరం - కాకపోతే స్వాతంత్ర్య ప్రాప్త్యనంతరం - జరిగిన మార్పుల ప్రభావం యింకా చాలా కాలానికి గాని ఒక దరికి రాదని తెలుసుకోవడం అవసరం

ఈ మాట నాటకాల విషయంలో ఎన్నడూ అవి ఉండలేదు ఆధునిక నాటకాలు "కన్యాశుల్కం"తో ఆరంభమైనట్టు నేనూ భావిస్తున్నాను కారణం సుగమం స్వాతంత్ర్యం తరువాత కలిగిన మార్పులు నాటక సాహిత్యం జోలికి అంతగా వెళ్ళలేదు ధనికులు సినిమాలవైపే దృష్టి మరల్చారు రేపు నాటకాల ప్రొడ్యూసర్లూ, డైరెక్టర్లూ, వ్యాపార నాటక పరిశ్రమా రావచ్చు అప్పుడు నాటక సాహిత్యం యొక్క స్వరూపంలో కూడా వింత పరిణామాలు ఏర్పడతాయి

*విశాలాంధ్ర దినపత్రిక నుండి 31-3-1963 సంచికలో*

## 25. ఈనాటి తెలుగు సాహిత్యం : దాని దుస్థితి

ఏ దేశంలోనైనా, ఏ కాలంలోనైనా మంచి సాహిత్యమూ, మంది సాహిత్యమూ అంటూ వేరువేరుగా ఉంటూనే ఉన్నది ఊసుపోకరూ, ఉల్లాసానికీ చదివి అవతల పారేసేది మంది సాహిత్యం అటువంటి సాహిత్యానికి అవసరం వున్నది కాని అది మంచి సాహిత్యమనిపించుకోదు

మంచి సాహిత్యానికి ఒక సంస్కృతీ సంప్రదాయమూ, పరిణామ లక్షణాలూ, సాంఘిక దృక్పథమూ ఉంటాయి బుద్ధిజీవుల మెదడుకు అది బలమైన మేత అందులో సాంఘిక జీవితపు ఎక్స్-రే దృశ్యాలు కనిపించటంతో పాటు, రచయిత యొక్క ప్రతిభా, ప్రభావమూ, శిల్పమూ కూడా ఉంటాయి అటువంటి రచనలు చదవటం పూర్తి చేసిన మరుక్షణం

పైనుడు నుంచి ఇగిరిపోవు! ఆసక్తి కలవాడికి వాటిలో అధ్యయనం చేయదగినది అంతో ఇంతో ఉంటుంది

'మంది' సాహిత్యం 'గాలికి' పుట్టుతుంది దానికొక పరంపర ఉండదు దానిలో ప్రధాన ఆకర్షణ కొత్తదనం మంచి సాహిత్యానికొక పరంపర ఉన్నది అది పాత సాహిత్యం నుంచి ప్రభవించి, రాగల సాహిత్యానికి బీజాలు వేస్తుంది

ఇవి ఎవరికీ తెలియని విషయాలని కాదు వాటిని మళ్ళీమళ్ళీ జ్ఞాపకం చేసుకోవటం వల్ల లాభం ఉంటుంది

ఎంబై ఏళ్ళ క్రితం తెలుగులో మంది సాహిత్యమూ, మంచి సాహిత్యమూ దేనిపటిగా ఉండటం నాకు తెలుసు మంది సాహిత్యాన్ని రైల్వే సాహిత్యం అని కూడా అనే వారు ఆ సాహిత్యం సృష్టించటంలో కూడా సిద్ధహస్తులు, ప్రఖ్యాతులు ఉండేవారు కాని ఒరోజుల్లో దాన్ని మంచి సాహిత్యంతో పోటీ పెట్టిన వారూ, రెంటికీ మధ్య తేడా తెలియని వారూ ఉండేవారు కాదు

ఇన్ని దశాబ్దాల అనంతరం తెలుగు సాహిత్యం పొందిన పరిణామం ఏమిటంటేనంటే మంది సాహిత్యం మంచి సాహిత్యాన్ని - గ్రెషమ్ ఆర్థిక సూత్రం ప్రకారం - కొట్టి అవతల పారెయ్యటం జరిగింది

ఇందుకు కారణాలు లేకపోలేదు ఒకటి చదివే 'మంది' సంఖ్య అపారంగా పెరిగింది, రెండు, మంచి సాహిత్యంకన్న మంది సాహిత్యం రచించటంలో అభివృద్ధి చాలా హెచ్చుగా జరిగింది, మూడు మంది సాహిత్యం యొక్క ప్రచురణా, బట్వాడా, కొనుగోలు సౌకర్యాలూ విస్తరించాయి, నాలుగు మంది సాహిత్య ప్రచురణ లాభసాటి వ్యాపారమయింది

ఇలాంటి కారణాల చేత మంది సాహిత్యం పైకి రావటం ప్రశంసించదగ్గదే అందులో ఆక్షేపించటానికేమీ లేదు మంచి సాహిత్యాన్ని మాత్రమే సహించగలవారు కొందరు మంది సాహిత్యాన్ని చిన్నచూపు చూడటం కద్దు కాని అది సరయిన దృక్పథం కాదు, వారి చిన్న చూపుతో మంది సాహిత్యం అంతరించిపోయేదీ లేదు దాన్నీ, దానిలో మార్పులనూ శాసించటానికి దాన్ని చదివే 'మందే' ఉన్నారు

పోతే మంచి సాహిత్యం మాట ఏమైనట్టు? అదీ అసలు దుస్థితి! అది చాలా కొంచమే ఉందనుకున్నప్పటికీ ఉన్న కాస్తా కూడా అరణ్యవాసంలోనూ, అజ్ఞాతవాసంలోనూ ఉంటున్నది ఇతర దేశాల్లోలాగే మన దేశంలో మంచి సాహిత్యం ప్రచురించేటందుకు కొన్ని ప్రత్యేక ప్రచురణ సంస్థలు లేవు '' ఈ ఫలానా ప్రచురణ సంస్థ ప్రచురిస్తే దాని మంచి సాహిత్యంగా పరిగణించవచ్చు'' అనీ, ''మంచి సాహిత్యం కొత్తగా ఏమి వస్తున్నదీ తెలుసుకోవాలంటే ఫలాని ఫలాని సంస్థలకు రాయాలి!'' అనీ అనుకునేటందుకు లేదు

మంచి సాహిత్యానికి మాత్రమే అంకితమైన పత్రికలు వెనక ఉన్నట్టుగా ఈనాడు లేవు అన్నీ మంది సాహిత్యానికే చోటివ్వటానికి యత్నిస్తున్నట్టు కనిపిస్తుంది

ఇందుకు ఏకైక కారణం ఆర్థికమైనదని ఒప్పుకుతీరాలి పత్రికలు సాధ్యమైనంత తక్కువ ఆకర్షణలతో పత్రికను ఇవ్వగలగటం ప్రకటనలపైన ఆధారపడుతుంది ప్రకటనలు పత్రికల

ప్రచార ప్రమాణంపైన ఆధారపడతాయి ప్రచారం మంచి సాహిత్యంపైన ఆధారపడుతుంది అందుచేత అన్ని పత్రికలూ సర్క్యులేషన్ కోసమే శ్రమించటం జరుగుతున్నది

ఈ విషయంలో మంచి సాహిత్యం మంది సాహిత్యం మీద ఎక్కి రావటానికి ఒకే మార్గం ప్రకటనలపైనా, సర్క్యులేషన్ పైనా ఆధారపడని మంచి సాహిత్య పత్రికను నిజమైన సాహిత్యాభిమానులు పోషించగలరా? పావలాకు విక్రయించే పత్రికలాటిదే మంచి సాహిత్యాన్ని అందిస్తూ రూపాయికమ్మితే కొనేవాళ్లు దేశంలో ఎంతమంది ఉంటారు? తగినంతమంది లేరని ఆగిపోయిన కొన్ని పత్రికలు రుజువు చేశాయి! ఇదే సాహిత్యానికి పట్టిన అసలైన దౌర్భాగ్యం

దీనికి చికిత్స ఏమిటో సరిగా తెలీదు మంచి సాహిత్యం ప్రచురించటానికి పూనుకున్న పత్రికలు కూడా కొంత ఆదర్శవాదం అవలంబించి తప్పుదారి తొక్కాయి అవి రచయితల త్యాగం మీదా, కొనేవారి ఆదర్శాభిమానం మీదా ఆధారపడి నడిచాయి

ఈ విషయంలో నాకు తోచిన వాస్తవ వైఖరి ఏమంటే, మంచి సాహిత్యం రాసేవారికి బాగా ముట్టాలి, మంచి సాహిత్య పుస్తకాలు హెచ్చు ధరలకే అమ్మాలి ఈ డబ్బు ఎక్కడి నుంచి వచ్చేటట్టు? మంచి సాహిత్యం కావాలనుకునే కొనుగోలుదార్ల నుంచి, ఏ డబ్బయినా వారి వద్ద నుంచే గదా వచ్చేది!

మంచి సాహిత్యం కావాలనుకునే వాళ్ళు దేశంలో తగినంత మంది లేకనో, ఉన్నవారికి కొనేశక్తి లేకనో ''త్యాగం'' పద్ధతి అమలులోకి రావలసి వచ్చింది మంచికీ, చెడుకూ సంఘర్షణ ఏర్పడిన స్థితిలో తప్ప మిగతా సందర్భాలలో త్యాగమంటే ఆత్మహత్య తప్ప మరొకటి కాదు

యుద్ధానికి ముందు రోజుల్లో కూడా రచయితలు లైబ్రరీల మీద కత్తులు నూరే వారు వాటి మూలంగా ఒక్కొక్క పుస్తకాన్ని వందల కొద్దీ జనం చదువుతారనీ, అసలే పుస్తకాల అమ్మకం అంతంత మాత్రంగా ఉంటే, లైబ్రరీలు అమ్మకాలపైన దెబ్బతీస్తున్నాయనీ వారు ఆక్షేపించేవారు అటువంటిది ఈనాడు నూటికి తొంభైపుస్తకాలు కేవలము లైబ్రరీ అమ్మకాలపైన ఆశ పెట్టుకునే ప్రచురణ అవుతున్నాయి

ఇదంతా చూస్తుంటే ఒక్కటి స్పష్టమవుతుంది, ఎప్పటికైనా ఇంకో పదేళ్లకో, ఇరవై ఏళ్లకో మంచి సాహిత్యం విషయమై ఏదైనా కృషి ప్రారంభమైతే అది ఓనమాలతో ఆరంభం కావలసి ఉంటుంది

ప్రస్తుత పరిస్థితి ఏమంటే, మంచి సాహిత్యం రాయగలవాళ్ళున్న మేరకు దాన్ని పోషించగలవాళ్ళూ ఉన్నారు మంది సాహిత్యమూ, మంచి సాహిత్యమూ ఈనాటిలాగా ఒకదాని మీద ఒకటి అల్లుకుపోని రోజుల్లో ఒక మంచి పుస్తకం వస్తే దాన్ని గురించి ఆనోటా ఆనోటా ప్రచారం జరిగి అవసరమైన వారందరికీ తెలిసిపోయేది ఈనాడది అసాధ్యమనే చెప్పాలి ఇందుకొక్క ఉదాహరణ ఇస్తాను ఇటీవల రెండు మూడేళ్ల మధ్యలో వచ్చిన ఒక మంచి నవలను గురించి సాహిత్యాభిలాషులైన మిత్రులు కొందరికి చెబితే, వారిలో కొందరు దాని పేరు కూడా వినలేదు మరికొందరు పేరు విన్నారుగాని అది ఎక్కడ దొరికేదీ వారికి తెలియలేదు

ఈనాడు మంచి సాహిత్యం యొక్క ప్రచారం పుస్తక సమీక్షల ద్వారా జరగాలి ఆ సమీక్షలు ప్రామాణికంగా ఉండాలి ఆధునిక సాహిత్య చర్చ అచ్చుగా సమీక్షలతో ఆగదు

ఒక్కొక్క రచయిత యొక్క సాహిత్య ధోరణిని గురించీ నిమర్శక వ్యాసాలు వెలువడాలి

ఒక్క ముక్కలో చెప్పాలంటే మంచి సాహిత్యం దేశంలో ఎక్కి రావాలంటే దానికి సంబంధించిన సర్వాంగాలూ - ప్రచురణా, పత్రికలూ, నిమర్శలూ, పుస్తక విక్రయశాలలూ, రచయితల సంస్థలూ - ఉద్యమ ప్రమాణంలో సరికొత్తగా ఏర్పడాలి ఇలాటి పని తలపెట్టినా ''అకాడమీ''లంటూ ఊరేగే సంస్థలు సాహిత్యానికి నిజమైన సేవ చేసినట్టవుతుంది

*తెలుగు మహాజన సమాజం, మద్రాసు ద్వితీయ వార్షిక సంచిక, 1964*

*పునర్ముద్రణ సాహిత్యంలో విప్లవోద్యమం, సృజన ప్రచురణ, అక్టోబరు 1971*

# 26. విమర్శలకు ప్రమాణాలు

ఈనాడు విమర్శలకు (సినిమా విమర్శలకు సైతం) ప్రమాణాలు లేకపోవటం అందరికీ తెలిసిన సంగతే ఈనాడే అనుకోనవసరం లేదు మనకు ఏనాడూ ఉత్కృష్టమైన విమర్శలుండినట్టు కనపడదు ఒకప్పుడు విమర్శకులంటూ ఒక జాతే ఉండేది గాదు ఒకకవి ఇంకో కవినీ, ఒక పండితుడింకోపండితుణ్ణీ విమర్శించుకునే వారు - అంటే పడక లిట్టుకునే వారు సక్రమమో, అక్రమమో, ధర్మమో, అధర్మమో అవతలివాళ్లే పడగొట్టి, పరువు తీసి, అందరూ హేళన చేసి హీనంగా చూసేట్టు చేయటంలో విమర్శకులకు స్వార్థం ఉండేది ఇది రాజ్యసభల్లో పండితులు కుస్తీపట్టు పట్టి, కంచుఢక్కాలు పగలగొట్టించిన సంప్రదాయం తాలూకు అవశేషం ఈ విధమైన విమర్శలతో ఈనాడు పని లేదు ఈనాడు రాజసభలూ, రాజాశ్రయాలూ లేవు! విమర్శకుడు రచయిత స్థానం కాజెయ్యటానికి ప్రయత్నిస్తాడన్న సమస్యే లేదు

ఈ ప్రజాయుగంలో సర్వుల కోసం కళలు ఉత్పత్తి అయి, ప్రజలే కళలను ఆదరించి కళాకారులను పోషించే వాతావరణంలో విమర్శ అన్నది ఒక విశిష్ట సాహిత్య ప్రక్రియగా (పాశ్చాత్య దేశాలలో) రూపొందింది ఇందుకు కారణం ఉన్నది పూర్వం కళాపోషణ చేసిన రాజులకూ, ధనికులకూ పండితులు ''అంగరక్షకులు''గా ఉండి ఎవడు గొప్ప పండితుడో తమలోనే తేలేటట్టు ఏర్పాటు చేసుకున్నారు ''వాడు గొప్ప పండితుడు'' అని పండితులు ఏకగ్రీవంగా తేల్చినవాడికి రాజపోషణ లభించేది ఈ తేల్చటంలో కుతంత్రాలుండేవనటానికి ''సహస్ర ఘంటకవి'' కథా, ధూర్జటిని తెనాలి రామలింగడు కృష్ణదేవరాయల ఆస్థానం నుంచి వెళ్ళగొట్టిన కథల్లాంటి పుక్కిటి పురాణాలున్నాయి

నేటి కళలను పోషించే జన సామాన్యానికి అలాటి అంగరక్షులు లేవు నిత్యమూ వెలువడే ''కళాఖండాలను'' పరీక్షించి విలువ కట్టడం విమర్శకుడి పని

అయితే విమర్శ యొక్క ప్రయోజనం ఇది ఒక్కటే అయినట్టయితే అది నెరవేరగలదా? నెరవేరలేదు ఎందుకంటే, కళాభిరుచి గల వ్యక్తుల సంస్కృతీ, అభిరుచీ అనే అంశాలు విమర్శ యొక్క ప్రయోజనాన్ని సంస్కరిస్తాయి అందరిలోనూ కళాభిరుచి ఒకే పరిణామ స్థాయిని అందుకోదు (నేను ఏడో ఏట వనజాక్షిని మించిన పాటగత్తె లేదనుకున్నాను పదహారో ఏట బాలగంధర్వకన్న బాగా పాడేవాళ్ళున్నారన్న వాళ్ళని చవటల కింద కట్టేశాను!)

కొందరు అతి చచ్చు డిటెక్టివు నవలలను కూడా ఆప్యాయంగా చదువుతారు వారికి ఆనందం చేకూర్చే అంశాలందులో వుంటాయి మరికొందరు, ఎంత అసమర్థంగా రాసినవైనా, ప్రేమ కథలైతే చదివి ఆనందిస్తారు వయసును బట్టీ, పరిసర వాతావరణాన్ని బట్టీ, జీవిత విధానాన్ని బట్టీ ప్రజల కళాభిరుచులలో వైవిధ్యం వుంటుంది ఒక డిటెక్టివ్ నవల గాని, ఒక ప్రేమకథ కాని, ఒక మాటల గారడీ పద్యం గాని లోపభూయిష్టంగా ఉన్నదని విమర్శకుడు ఎంత నచ్చజెప్పినా వాటిని ఆదరించే వారు లక్ష్య పెట్టరు అందుచేత ఈ యుగంలో విమర్శకులు కళాఖండాలను అంచనా కట్టి, ప్రజలకు ఆ విధంగా తోడ్పడటంలో సంపూర్ణమైన ఆశయసిద్ధి పొందటమనేది దురూహ్యం

అందుకే విమర్శలు ఇంకొక ప్రయోజనాన్ని కూడా విధిగా సాధించాలి అవి పాఠకుడి విమర్శనాశక్తిని పెంపొందించగలగాలి సంగీతం తరుచు వినేవాడికి సంగీత జ్ఞానమూ సాహిత్యం తరుచు చదివేవాడికి సాహిత్య జ్ఞానమూ ఏర్పడిన విధంగా, విమర్శలు తరుచు చదివే వాడిలోని విమర్శనా జ్ఞానం కూడా పెరగాలి ఈ అదనపు లక్ష్యాన్ని మనసులో వుంచుకుని రాసిన విమర్శలు ఉత్తమ సాహిత్యం కింద ఈనాడు జమ అవుతాయి ''న్యూస్టేట్స్‌మన్'' అనే ఆంగ్ల వారపత్రిక ప్రారంభించిన కొత్తలో చాలా మంది ఆ పత్రికను రాజకీయ వ్యాసాల కొరకు కాక, విమర్శల కోసం కొని చదివేవారట

ఇంకొకందుకు కూడా నేను పైన చెప్పిన రెండో ఆశయం విమర్శకుండటం అవసరం ఒక పుస్తకం గాని, సినిమా గాని ఇంకా ప్రజల ఎదటికి రాకపూర్వమే దానిపై విమర్శ వెలువడుతుంది నూటికి తొంభై తొమ్మిది మంది ముందు విమర్శ చదివి తరువాత పుస్తకం చదువుతారు అందుచేత విమర్శ పొగడటంలోనూ, తెగడటంతోనూ సరిపెట్టుకునేటట్టుంటే అది పుస్తకం మరింత బాగా అమ్మటానికో, (వ్యాపారప్రకటనలతో!) కొనదలచిన వాళ్ళు కూడా మానటానికో ఉపకరిస్తుంది కాని విమర్శనాశక్తిని పెంచే విమర్శ ఆ ప్రత్యేకగ్రంథాన్ని గురించి పాఠకుడికి తెలియజేయటంతో పాటు పాఠకుడికి ఇతర గ్రంథాలను అంచనా కట్టే శక్తిని కూడా కలిగిస్తుంది (నేను సినిమా విమర్శలు రాస్తూ వుండిన రోజుల్లో కొంతమంది నా విమర్శలు సినిమా శిల్పాన్ని అర్థం చేసుకోవటానికి కూడా తోడ్పడుతున్నాయన్నారు దాన్ని గొప్ప ప్రశంస కింద నేను భావించాను ఇప్పుడా రోజులు లేవు ఈనాడు సినిమా విమర్శలంటే అవి ప్రచ్ఛన్న వ్యాపార ప్రకటనలే)

ఇంకొక విషయం కూడా మనం మరిచిపోరాదు ఏ పరిస్థితిలోనూ విమర్శకుడు స్వార్థపరుడై విమర్శించటం జరుగదు (విమర్శలు రాసినందుకు దేశంలో డబ్బిచ్చేవారు లేరు - నాకు తెలిసినంతవరకు) అంతమాత్రాన విమర్శలన్నీ నిర్దుష్టంగా ఉంటాయని చెప్పలేం రచయిత యొక్క లక్ష్యం గురించి విమర్శకుడు పొరబడి ఉండవచ్చు రచనలోని అంతరార్థం విమర్శకుడికి అంతు చిక్కకపోవచ్చు అటువంటి పరిస్థితిలో విమర్శ విధిగా తప్పుతోవ పట్టుతుంది! విమర్శ చేయబడిన గ్రంథం యొక్క గుణదోషాలు పాఠకుడికి సరిగా అందవు అటువంటి విమర్శ కూడా పాఠకుడికి విమర్శనాశక్తిని పెంచేదిగా ఉండే అవకాశం వున్నది ఎందుకంటే, విమర్శకుడి నైశిత్యం ఈ సందర్భంలో నిరుపయోగమైపోయినా, అది పాఠకుడి బుద్ధికి పదును పెట్టగలుగుతుంది

ఒక్కొక్క రచయిత యొక్క సాహిత్య ధోరణిని గురించీ విమర్శక వ్యాసాలు వెలువడాలి

ఒక్క ముక్కలో చెప్పాలంటే మంచి సాహిత్యం దేశంలో ఎక్కి రావాలంటే దానికి సంబంధించిన సర్వాంగాలూ - ప్రచురణా, పత్రికలూ, విమర్శలూ, పుస్తక విక్రయశాలలూ, రచయితల సంస్థలూ - ఉద్యమ ప్రమాణంలో సరికొత్తగా ఏర్పడాలి ఇలాటి పని తలపెట్టినా "అకాడమీ"లంటూ ఊరేగే సంస్థలు సాహిత్యానికి నిజమైన సేవ చేసినట్లవుతుంది

*తెలుగు మహాజన సమాజం, మద్రాసు వికాస వార్షిక సంచిక, 1964*
*పునర్ముద్రణ సాహిత్యంలో విప్లవోద్యమం, సృజన ప్రచురణ, అక్టోబరు 1971*

# 26. విమర్శలకు ప్రమాణాలు

ఈనాడు విమర్శలకు (సినిమా విమర్శలకు సైతం) ప్రమాణాలు లేకపోవటం అందరికీ తెలిసిన సంగతే ఈనాడే అనుకోనవసరం లేదు మనకు ఏనాడూ ఉత్కృష్టమైన విమర్శలుండినట్టు కనపడదు ఒకప్పుడు విమర్శకులంటూ ఒక జాతే ఉండేది గాదు ఒకకవి ఇంకో కవినీ, ఒక పండితుడింకోపండితుణ్ణీ విమర్శించుకునే వారు - అంటే పడక లిట్టుకునే వారు సక్రమమో, అక్రమమో, ధర్మమో, అధర్మమో అవతలివాళ్లే పడగొట్టి, పరువు తీసి, అందరూ హేళన చేసి హీనంగా చూసేట్టు చేయటంలో విమర్శకులకు స్వార్థం ఉండేది ఇది రాజ్యసభల్లో పండితులు కుస్తీపట్టు పట్టి, కంచుఢక్కాలు పగలగొట్టించిన సంప్రదాయం తాలూకు అవశేషం ఈ విధమైన విమర్శలతో ఈనాడు పని లేదు ఈనాడు రాజసభలూ, రాజాశ్రయాలూ లేవు! విమర్శకుడు రచయిత స్థానం కాజెయ్యటానికి ప్రయత్నిస్తాడన్న సమస్యే లేదు

ఈ ప్రజాయుగంలో సర్వుల కోసం కళలు ఉత్పత్తి అయి, ప్రజలే కళలను ఆదరించి కళాకారులను పోషించే వాతావరణంలో విమర్శ అన్నది ఒక విశిష్ట సాహిత్య ప్రక్రియగా (పాశ్చాత్య దేశాలలో) రూపొందింది ఇందుకు కారణం ఉన్నది పూర్వం కళాపోషణ చేసిన రాజులకూ, ధనికులకూ పండితులు "అంగరక్షకులు"గా ఉండి ఎవడు గొప్ప పండితుడో తమలోనే తేలేటట్టు ఏర్పాటు చేసుకున్నారు "వాడు గొప్ప పండితుడు" అని పండితులు ఏకగ్రీవంగా తేల్చినవాడికి రాజపోషణ లభించేది ఈ తేల్చటంలో కుతంత్రాలుండేవనటానికి "సహస్ర ఘంటకవి" కథా, ధూర్జటిని తెనాలి రామలింగడు కృష్ణదేవరాయల ఆస్థానం నుంచి వెళ్ళగొట్టిన కథల్లాంటి పుక్కిటి పురాణాలున్నాయి

నేటి కళలను పోషించే జన సామాన్యానికి అలాటి అంగరక్షలు లేవు నిత్యమూ వెలువడే "కళాఖండాలను" పరీక్షించి విలువ కట్టడం విమర్శకుడి పని

అయితే విమర్శ యొక్క ప్రయోజనం ఇది ఒక్కటే అయినట్టయితే అది నెరవేరగలదా? నెరవేరలేదు ఎందుకంటే, కళాభిరుచి గల వ్యక్తుల సంస్కృతీ, అభిరుచీ అనే అంశాలు విమర్శ యొక్క ప్రయోజనాన్ని సంస్కరిస్తాయి అందరిలోనూ కళాభిరుచి ఒకే పరిణామ స్థాయిని అందుకోదు (నేను ఏడో ఏట వనజాక్షిని మించిన పాటగత్తె లేదనుకున్నాను పదహారో ఏట బాలగంధర్వకన్న బాగా పాడేవాళ్ళున్నారన్న వాళ్ళని చవటల కింద కట్టేశాను!)

# 27. ఆదరపూర్వకం కాని సాహిత్య సంభావన

ఏటా సాహిత్య సమారాధన జరుగుతున్నది పుస్తకాలకు బహుమతులివ్వటానికి అకాడమీల వారు యత్నిస్తున్నారు యత్నిస్తున్నారనటం దేనికంటే అప్పుడప్పుడూ ఇవ్వలేకపోతున్నారు, ధారకు ఏ శుక్రాచార్లో అడ్డు పడటం జరుగుతున్నది!

మంచి సాహిత్య గ్రంధాలనెన్నుకుని వాటికి బహుమానాలివ్వటమన్నది ఎంత మంచి ఆలోచనో ఆ పని ఆచరణలో అంత అపసవ్యంగానూ, హాస్యాస్పదంగానూ ఉంటున్నది

ఉదాహరణకు కథల పుస్తకాలకు బహుమానాలివ్వటం తీసుకుందాం బహుమానానికి పరిగణించే పుస్తకాలు ఈ యీ సంవత్సరాల మధ్య ప్రచురణ అయినాయని ఒకనియమం ఉంటుంది అందులో తప్పేమీ లేదు కాని అది ఇన్ని పేజీల ప్రమాణంలో ఉండాలి ఇన్ని కథలు అందులోండాలి అనటం దేనికో తెలీదు 100 - 120 పేజీల పుస్తకమైతేనే అర్హమనీ, 200-250 పేజీల పుస్తకమైతే బహుమానానికి అర్హం కాదనీ, 8 - 10 కథలున్నదే అర్హమనీ, 6 లేక 12 కథలుండేది కాదనీ ఎలా నిర్ణయించటం? ఏకాడమీ వారు బహుమతి ఇవ్వదలచిన కాలంలో అత్యుత్తమ కథల సంపుటి 300 పేజీల గ్రంధమైతే దాని పని ఖాళీయేనా? కొన్ని ఉద్యోగాలకు దరఖాస్తులను ఆహ్వానిస్తూ నిబంధనాలు ఎంత క్లిష్టంగా పెడతారంటే ఆ అన్నిటికి సరిపోయేవాడు ఎవడో ఒక్కడే ఉంటాడు అలాగే ఈ బహుమానార్హతలను కూడా మరి కొంచెం పెంచి, పుస్తకం ధరా, కథకుడి ఎత్తూ, అచ్చు వేసే ప్రెస్సు వైశాల్యమూ కూడా ముందుగానే నిర్ణయిస్తే అందరి కష్టాలూ గట్టెక్కుతాయి

పురస్కృతి పొందవలసిన పుస్తకాల అర్హతల ఫార్సు ఇలా ఉంటే వాటిని నిర్ణయించే పద్ధతి ఇంకా ఫార్సుగా ఉంటుంది సాహిత్యరంగంలో ఉండే వృద్ధులను కొందరిని ఎన్నుకుని వారిని పుస్తకాలు మూడో, అయిదో సిఫార్సు చెయ్యమంటారు వీరిలో ఏ ఒక్కడూ బహుమానార్హతలు గల పుస్తకాలన్నిటినీ చదివి ఉండడని రూఢిగా చెప్పవచ్చు కొందరికి మంచి కథకుల పేర్లయినా తెలిసి వుండవు చాలామంది కథాప్రియులు కూడా కాకపోవచ్చు ఈ వృద్ధజంబుకాలను - కించపరటానికి మాటలాడటం లేదు, సాహిత్యరంగంలో నేనూ ఒక వృద్ధజంబుకాన్నే - పక్కవాళ్లను అడిగో, తాము ఎరిగిన రచయితలను జ్ఞప్తికి తెచ్చుకునో, ఏదో ఒక విధంగా ఒక జాబితా తయారుచేస్తారు ఈ జాబితాలన్నీ అడంగుకు చేరాక, ఏయే పుస్తకాన్ని ఎంతెంత మంది సిఫార్సు చేశారో గుణించి, జాబితాలు మొదటి అయిదో ఆరో పుస్తకాల పేర్లను జడ్జీల ముందుంచుతారు సాధారణంగా ముగ్గురు జడ్జీలుంటారు ఆ ముగ్గురిలో ఏ ఇద్దరన్నా ఒకే పుస్తకాన్ని అభిమానిస్తే దానికి బహుమతి వస్తుంది ముగ్గురూ మూడు పుస్తకాలు చెప్పారో ఆ యేటికి బహుమానం రద్దు! అంటే ఏమిటన్నమాట? బహుమానం ఇద్దామనుకున్న పీరియడ్‌లో అర్హత గల పుస్తకం ఏదీ లేదని తేలిందన్న మాట!

సాహిత్యం పట్ల నిజమైన ఆదరం గల అకాడమీ ఇలాంటి విధానం ఎలా అవలంబిస్తుందో ఎంత ఆలోచించినా బోధపడదు కథలు ఆసక్తితోచదివే తెలివైన కాలేజీ కుర్రాళ్లను పిలిచి, ''అబ్బాయిలూ, ఈ మధ్యకాలంలో గొప్పగా కథలు రాస్తున్న వాళ్ల పేర్లు మూడు చెప్పండి''

అంటే వాళ్ళు చెప్పే పేర్లు అయిదుదాటవు అయిదుగురికీ అయిదేళ్లపాటు సునాయాసంగా బహుమతులివ్వవచ్చు (అయిదేళ్లలోపుగా ఒకే మనిషికి రెండు బహుమానాలివ్వరు)

ఈనాడు కథకుల సంఖ్య వందల సంఖ్యలో ఉన్నమాట నిజమే ఒకటి రెండు మంచి కథలు రాసిన వాళ్ల సంఖ్య డజనులలో ఉన్నమాట నిజమే కథలలోనూ, వాటినే చదివే వాళ్ల అభిరుచులలోనూ వైవిధ్యం ఉన్న సంగతి కూడా వాస్తవమే అయినప్పటికీ ఎప్పటికప్పుడు ఉత్తమ కథకుల జాబితాలో చేర్చదగిన వారు, అకాడమీ నిర్దేశించినట్టు చెప్పుకోదగిన సాహిత్యసేవ చేసిన వారు అరడజనువుంది కన్న ఉండరు కాని వారి జాబితా సేకరించి వరసలో బహుమానాలిచ్చుకుపోయే పద్ధతి అకాడమీకి తెలీదు అందుకే ఈ గందరగోళపు గుణింపు

ఈ మాటలు చెప్పటంలో నా స్వార్థం ఏమీ లేదు నేను ముప్ఫై ఏళ్ల పాటు కథలు రాసి, డజను మంది కథకుల జాబితా తయారయినప్పుడల్లా అందులో ఒక మూల నా పేరు కూడా ఉండేటట్టుగా చూసుకొంటూ వచ్చి, చల్లగా చిన్న కథలు రాయటం మానేసుకున్నాను నేను రాసిన పాత కథలు కొన్ని ఇంకా తోకలాడిస్తున్నట్టు కన్పిస్తుంది కాలక్రమాన అవి కూడా విరమించుకుంటాయి గడచిన పదేళ్లలో అనేకమంది ఆడ, మగ కథకులు పైకి వచ్చారు కథల కింద మట్టు దిగజారిన మాట నిజమే గానీ, పై మట్టు పైకి లేచిన మాట కూడా నిజం

మిగిలిన సాహిత్య శాఖల మాట ఎలా ఉన్నా చిన్న కథ యువకుల సొమ్ము, జీవితపు అక్రమాలతో రాజీ పడలేని వాళ్లే పదునైన కథలు రాస్తారు మంచి రచనా శిల్పం ఉంటే గానీ చిన్నకథ ప్రకాశించదు ఈనాడు పదునైన కథలూ, ప్రకాశవంతమైన కథలు రాసే వారున్నారు వారి మూసతో డజన్లకొద్దీ యువ కథకులు తయారవుతున్నారు అలాటి కథకులకు అర్థంటుగా బహుమానాలిచ్చేసి ఆ తరవాత వచ్చే వాళ్ల కోసం చత్వారపు జోళ్లు పెట్టుకుని వెతికినా అర్థం ఉంటుంది అంతేగాని రేషను బియ్యం చేటలో పోసుకుని, ''స్టాటిస్టికల్''గా చూస్తే ఈ బియ్యంలో రాళ్లే లేవు అంటే -

*కృష్ణా పత్రిక, వారపత్రిక, 17-7-1965*

# 28. అనాథ సాహిత్యం

ఈనాటి సాహిత్యం ఒక అనాథగా, దిక్కూమొక్కూ లేని దీనురాలుగా నా మనసుకు తోస్తుంది

వెనక్కు తిరిగి చూస్తే గురజాడ అప్పారావూ, వీరేశలింగం పంతులూ, చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులూ, పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులూ, ఉన్నవ లక్ష్మీనారాయణపంతులూ, తిరుపతి వెంకటకవులూ, భమిడిపాటి కామేశ్వరరావూ, కృష్ణశాస్త్రీ, శ్రీశ్రీ మొదలైన వాళ్ళు ఆధునిక తెలుగు సాహిత్యానికి బలమైన స్తంభాలలాగా నిలబడినట్టు స్పష్టంగా కానవస్తుంది వాళ్ళ సాహిత్యాన్ని అలంకరించి కూర్చోబెట్టలేదు వారిలో కొందరు సరస్వతి చేతికి చీపురుకట్టలిచ్చి, కశ్మలం కడిగించారు తాము ఎందుకు రాస్తున్నదీ వారందరికీ

తెలుసు తాము రాసేది విప్లవాత్మకమనీ, అది సమాజంలో కొన్ని వర్గాల వారితోనైనా గిల్లికజ్జాలు తెస్తుందనీ వారికి తెలుసు సగం ఆ గిల్లికజ్జాలు పుట్టించడానికే వారు రాశారు కూడా

ఆ సాహిత్యమేనా ఈనాడు సృష్టి అవుతున్నది? నమ్మశక్యం కాదు ఆనాటి సాహిత్యం అందరి కోసమూ పుట్టినది ఈనాటి సాహిత్యం అందరి కోసమూ పుట్టినదనే భావం కలగదు

అందుకొక కారణం జీవితంలో కలిగిన మార్పు కావచ్చు ఆనాడు జాతి కంతటికీ ఉమ్మడి లక్ష్యాలు కొన్ని ఉండేవి - సామాజిక సంస్కరణలు కానివ్వండి, దేశ స్వాతంత్ర్యం కానివ్వండి ఈనాడవి లేవు సమాజంలో వర్గస్వభావాలు మరింత ప్రస్ఫుటంగా ఈనాడు కనిపిస్తున్నాయి శ్రామికులకూ, పారిశ్రామికులకూ, ధనికులకూ, దరిద్రులకూ, ఓట్లు పుచ్చుకునే వారికీ, ఇచ్చేవారికీ లక్ష్యసామ్యం ఏమున్నది? ఏమీ లేదు

అలాటి పరిస్థితిలో "సాహిత్యం" అనగానే "ఎవరి సాహిత్యం?" అన్న ప్రశ్న దానంతట అదే బయలుదేరటం సహజం ఏటికెదురీదుతూ "బ్రాహ్మణ" సాహిత్యం బయలుదేరింది "సనాతన హిందూధర్మ" సాహిత్యం వచ్చింది నైలాన్ దుస్తులతో నగ్నంగా కనిపిస్తూ, రంగురంగుల ప్లాస్టిక్ అలంకరణలతో, మేధస్సు లేని వాళ్ళకు మతులు పోగొట్టుతూ ఒక రకమైన మధ్యతరగతి సాహిత్యం వరదలా వస్తున్నది ఈ అల్లకల్లోలంలో తెలుగు వేషం వేసుకుని కొంత పాశ్చాత్య సాహిత్యమూ, కొంత కృతక బెంగాలీ సాహిత్యమూ కూడా అమెరికను గూఢచారుల్లాగా జొరబడుతున్నది

బళ్ళకొద్దీ వెలువడే ఈ సాహిత్యానికి ఒక "ఎడ్రసు" లేదు స్తంభాలలాటి సాహితీపరుల ఊత లేదు కిందటేడు విడుదలైన సినిమా చిత్రానికైనా మరొక విడుదల గాని ఉండవచ్చుగాని, ఈ సాహిత్యానికి ఒకటే రిలీజు

సాహిత్య ఎకాడమీలుండగా సాహిత్యాన్ని అనాధ అనటం ఒక విధంగా సాహసమే కాని ఈ ఎకాడమీలు సాహిత్యానికి ఒక ప్రతిష్ఠ తేజాలినట్టుగా కనబడవు అవి చాలావరకు "వెనకచూపు" గల సాహిత్యాన్నే అభిమానించేటట్టు కనిపిస్తాయి - లేదా, పదవులలో ఉండేవారూ, కాకా పట్టే వారూ రచించే సాహిత్యాన్ని ప్రోత్సహించేలాగా కనబడతాయి

ఈ వైఖరి అవలంబించటంలో కొన్ని సౌకర్యాలు లేకపోలేదు పాత వాసన గల సాహిత్యాన్ని అభిమానిస్తే వయోవృద్ధులు హర్షిస్తారు పదవులలో ఉన్న వాళ్ళ రచనలకు భజన చెయ్యడం ఆత్మక్షేమకారి ఈ వైఖరి లవలంబించదలచిన వాడు ఏ సాహిత్యాన్నీ చదవనవసరం లేదు అన్నిటికన్న పెద్ద సౌకర్యమేమంటే, సాహిత్యంలోకి వర్గతత్వం ప్రవేశిస్తున్నదన్న విషయాన్ని ఎదుర్కొనవసరం లేదు వర్గ స్వభావాన్ని ఘాటుగా చిత్రించే శ్రీశ్రీనీ, రాచకొండ విశ్వనాథశాస్త్రినీ, అలాటి అత్యల్ప సంఖ్యాకులను మరి కొందరిని ఎరగనట్టు మొహం పెట్టేస్తే పని తీరిపోతుంది ఒక విధమైన అనాథత్వం ఎకాడమీలకే సంక్రమించినప్పుడు వాళ్ళ సాహిత్యానికి నాథులుగా పని చేసే అవకాశం ఎక్కడ?

ముప్ఫై ఏళ్ళ క్రితం కూడా "ఫలాని వారి కథలు ఆలోచనను రేపేవిగా ఉన్నవి" అంటే ఒక పెద్ద ప్రశంసగా ఉండేది ఈనాడు ఆలోచనలను జోకొట్టేదీ, తప్పుడు తోవల పట్టించేదీ లయిన సాహిత్యం జాస్తిగా వెలువడుతున్నట్టు కనిపిస్తుంది

విప్లవ బీజాలు లేని సాహిత్యం ఆలోచనలు రేకెత్తించదు. అది సాహిత్యమే కాదు. జీవితంలో రావలసిన పరిణామాలను సాహిత్యం ద్వారా దబాయించి అడుగరేసి జాలి, ఆచరణలో సాధిస్తుందనేది కలలో మాట. అన్ని రకాల చైతన్యాలకు పునాది భావ చైతన్యం. అలాంటి చైతన్యం కలిగించే రచనలు అసలు రావటం లేదనను. కాని వాటిని పెంపొందించే వాళ్ళు కరువయ్యారు.

అవును, సాహిత్యాన్ని పెంపొందించటమనే ప్రక్రియ ఒకటి ఉన్నది. విశ్వసాహిత్యంలో గొప్పవనిపించుకున్న రచనలన్నీ సహృదయుల చేత పెంపొందించబడినవే. మన దేశంలో కూడా కాళిదాసు రచనలను మల్లినాథ సూరి పెంపొందించాడు.

రచన యొక్క జీవితం రచనానంతరమే ఆరంభమవుతుంది. అది పది మందిలో పడి కలిగించే చైతన్యమే దాని వాస్తవ జీవితం.

ఒక శ్రీశ్రీ రచనలను గాని, ఒక భమిడిపాటి కామేశ్వరరావు రచనలను గాని, అయిదేళ్ళకొకసారి సమగ్రంగా సమీక్షించవచ్చు. మంచి సాహిత్యానికి ప్రయోజనం ఉన్నంత కాలమూ సమీక్షలు జరుగుతూ ఉండవలసిందే. తరాలు మారినకొద్దీ సాహిత్యం కొత్త దృష్టిలో కనిపించవచ్చు. షేక్స్పియర్ రచనలు గురించి ఇప్పటికింకా కొత్త అంచనాలు వస్తూనే ఉన్నాయి. అలాటి సమీక్షలు లోపించటం కూడా నేటి సాహిత్యం యొక్క అనాథత్వానికొక కారణం.

సమీక్షలలో కూడా వర్గస్వభావం కనిపిస్తుంది. గురజాడనూ, శ్రీశ్రీని దుమ్మెత్తి పోయటానికి కొంత కాలం క్రితం ఒక క్షుద్ర ఉద్యమం సాగింది. అలాగే నాచనసోముడి రచనలలో ఉండే గొప్పతనం గురించీ, నన్నెచోడుడి కవిత్వ పటిమ గురించీ మళ్ళీమళ్ళీ పాత విషయాలే చెప్పటానికి ఆసక్తి గల వారున్నారు. ఆధునిక సాహిత్యం గురించి చెప్పేవాళ్ళే కరువయ్యారు.

*జనశక్తి, వీక్లీ, 29-6-1966*

# 29. తెలుగు కథా సాహిత్యం

సాహిత్యం జీవితాన్ని ప్రతిబింబించాలని పెద్దవాళ్లు చెబుతారు. అయితే ఎవరూ చెప్పకుండానే సాహిత్యం తనని సృష్టించే వర్గం యొక్క సాంఘిక భావాలను ప్రతిబింబిస్తుంది. ఆ భావాలు కావాలన్నా దాగవు. పాశ్చాత్య నాగరికతా వ్యామోహం గల వాడు డ్రాయింగ్‌రూమ్ కల్చరునూ, క్లబ్ లైఫునూ, పెద్ద పెద్ద కార్లలో తిరుగుళ్ళనూ, సులభ ప్రణయాన్నీ, బాంక్ చెక్కుల రొమాన్సునూ, నైట్ క్లబ్ విలాసాలనూ, రాకన్‌రోల్, ట్విస్ట్ వగైరా డాన్సులనూ, కాక్‌టేల్ పార్టీలనూ తన రచనల్లో ఇరికిస్తాడు. సనాతనిష్ఠ అయిన రచయిత ధర్మాన్ని ఉద్ధరించే నాయకుణ్ణీ, ఆధునికజీవితంలోని ధర్మచ్యుతినీ చిత్రిస్తాడు. మధ్యతరగతి కుటుంబీకుడు పెరిగిపోయే ధరలనూ, ఆడపిల్లల పెళ్లి విషయంలోనూ, ఉద్యోగాన్వేషణలోనూ కలిగే శ్రమదమాలనూ వర్ణిస్తాడు. ఈ విధంగా స్వయం సార్థక్యం సాధించే పని లేనివాడు బహుశా రాయడు.

అంటే, కేవలమూ సంఘాన్ని మరమ్మతు చెయ్యటానికి రాయటం సాధ్యం కాదని కాదు సంఘాన్ని ఎట్లా మరమ్మతు చెయ్యాలనేదాన్ని గురించి కూడా రచయితకు ఏవో అభిప్రాయాలుంటాయి మన దేశం ఏ అమెరికానో, రష్యానో, చీనానో పోలి పరిణతి చెందితేనే గాని మన సమాజానికి ముక్తి లేదనుకునే వాళ్లు ఉండవచ్చు కాని ప్రస్తుతం మన దేశానికీ, ఆ దేశాలకూ మధ్య గల వ్యత్యాసాన్నీ ఏ విధంగా సరి చేయాలో చెప్పగలిగితే తప్ప, అలాటి వాళ్లు రాసే సాహిత్యం జనానికి పట్టదు

జీవితంలో ఒడుదుడుకులు జాస్తిగా ఉన్నప్పుడే మంచి కథాసాహిత్యం వస్తుందన్న సిద్ధాంతం ఒకటి ఉన్నది నిజం కూడా కావచ్చు మన దేశంలో జాతీయోద్యమం నడిచిన కాలంలో ఆ ఉద్యమాన్ని ప్రతిబింబించే కథలు ఆట్టే రాలేదు కాని ఆ కాలపు అశాంతి నుంచి మనకు కొంత మంచి కథాసాహిత్యం వచ్చిన మాట నిజం అంతదాకా జీవితంతో సమాధానపడిన ప్రజలు, జాతీయోద్యమం కారణంగా ఒక విధమైన అసంతృప్తి చెంది, జీవితం తాలూకు వివిధ విషయాలను పరిశీలిస్తూ, విమర్శిస్తూ కథలు రాశారు అందులో ప్రచారం అంటూ ప్రత్యేకించి ఏమీ లేదు కాని అనేక జీవితసత్యాలు నడివీధిలోకి వచ్చాయి

జాతీయోద్యమం వెనకపడింది జాతీయ నాయకులు రాలిపోయారు దేశం స్వతంత్రమయింది బ్రిటిషువలసదార్లు నిలబెట్టిన అడ్డుగోడలు కూలిపోగానే, భారతీయులు ప్రపంచాన్ని సూటిగా చూడగలిగారు

పాశ్చాత్యుల వెంబడి ఇంగ్లీషు చదువులూ, పాశ్చాత్య సంప్రదాయాలూ, సంస్కారమూ, ఒక విధమైన ఆధునికత్వమూ దేశంలో వేరు తన్నినట్టుగానే, రెండవ ప్రపంచ యుద్ధం ముగిసి, దేశం స్వతంత్రం కాగానే, సోషలిజమూ, కమ్యూనిజమూ, వెల్ఫేర్ స్టేటిజమూ లాటి సిద్ధాంతాలే గాక, వివిధ దేశాలలో పుట్టే అనేక రకాల ఫాషనులూ, ఉద్యమాలూ ఇక్కడికి ధారాళంగా వచ్చేశాయి బీట్నిక్కులూ, ఆంగ్రీ యంగ్‌మెన్ మొదలైన వాళ్లు ఇతర దేశాలలో వెలసిన మర్నాడు మన దేశంలోనూ వెలిశారు ఈ నవీన ధోరణులకు ప్రతిగా సనాతనత్వమూ, ''భౌతిక'' దృక్పథానికి ప్రతిగా ''దేవుడి'' ఉద్యమమూ, ప్రజాతంత్రానికి విరుద్ధంగా ఫాసిస్టు భావాలూ దేశంలో చురుకెక్కాయి ఈనాటి ప్రపంచంలో ఏయే మూలల ఏయే భావ సంఘర్షణలైతే ఉన్నాయో, అన్నీ అంతో ఇంతో మన దేశంలో కూడా ఉన్నాయంటే అతిశయోక్తి కాదు

కాని ఇదంతా మన సాహిత్యంలో - ప్రత్యేకించి కథా సాహిత్యంలో - ప్రతిబింబించటం లేదు వేంకటేశ్వరుడికి ప్రచారం చేసే కథలూ, ఆ దేవుడికి అంకితమైన కొద్ది పుస్తకాలూ మినహాయిస్తే, దేశంలో దేవుడి లంచగొండితనం ఎంతగా అభివృద్ధి అయినదీ మన సాహిత్యం చిత్రించటం లేదనే చెప్పాలి మీదుమిక్కిలి మనుషుల లంచగొండితనాన్ని దుయ్యబట్టుతూ వచ్చే కథలే జాస్తి వాస్తవ జీవితంలో ప్రజలు అవలంబించే మూఢ విశ్వాసాలు కథలలోని పాత్రలు అంతగా అవలంబించటం కానరాదు

రాజకీయ రంగంలో వచ్చే సవాలక్ష సమస్యలు - కాంగ్రెసు పాలన లేకపోతే దేశం మట్టి కొట్టుకుపోదా? కాంగ్రెసు పాలనలో నిజంగా సామ్యవాదం అమలు జరుగుతుందా? రష్యా పంథా రైటా, చీనా పంథా రైటా? అమెరికా అనుసరిస్తున్న ''నయావలస విధానం'' అవునా, కాదా? - ఇటువంటివి కథాసాహిత్యంలోకి ఎక్కటం లేదు

చివరకు భర్తలు భార్యల పట్ల ప్రవర్తించే తీరు కూడా, జీవితంలో కన్న కథా సాహిత్యంలో చాలా వరకు మెరుగుగానే ఉంటున్నది దబాయించి కట్నాలు పుచ్చుకునే వాళ్ళను జీవితం క్షమించినంతగా కథాసాహిత్యం క్షమించటం లేదు

ఈ కారణాల వల్ల ఈనాటి కథాసాహిత్యం జీవితం కన్న ఒక్క అడుగు ముందున్నదనే అనుకోవాలి యుద్ధానంతర కాలంలో కొత్త తరం కథకులు - స్త్రీలూ, పురుషులూ కూడా - అనేకమంది వచ్చారు వీరందరూ చదువూ, సంస్కారమూ కలవారు, పాతకాలపు కథకుల కన్న అంతర్జాతీయ వాసనలు బాగా ఆకళింపు చేసుకున్న వారు, జీవితంతో అంతో ఇంతో అసంతృప్తి చెంది, అభ్యుదయకరమైన మార్పు కోరే వారు వీరిలో జీవితాన్ని ఆటవస్తువుగా చూసి, విలాసాలలో విహరించటమే జీవితానందమనుకునేవారూ, జీవితంలో మార్పులు రాకూడదనుకునే వారూ కొద్దిమంది లేకపోలేదు గాని, హెచ్చుమందికి దారిద్ర్యమంటే ఏమిటో తెలుసు పాత ఆచారాలకు కట్టుబడటంలో గల మనోవేదన ఏమిటో తెలుసు వీరిలో చాలా మందిలో అభ్యుదయ భావాలున్నాయి అవి కొంతవరకు జీవితం నుంచి నేర్చుకున్నవి ధనాశా, పదవీ వ్యామోహమూ, లంచగొండితనమూ, మితిమీరిన సాంఘిక హక్కులూ జీవితాన్ని ఎంత కశ్మలం చేస్తున్నదీ వీరు స్వయంగానే చూస్తున్నారు పేదవాళ్లను న్యూనంగానూ, ధనికులను ఘనంగానూ చిత్రించే రచనలు చాలా అరుదనే చెప్పాలి

కథలు రాసే స్త్రీలు ఈనాడు ఒక విశిష్ట పాత్ర నిర్వహిస్తున్నారనటానికి సందేహం లేదు వెనకటి తరాల వాళ్ళు కొందరు స్త్రీలను వెనక వేసుకుని కథలు రాసిన మాట నిజమే కాని, వారు స్త్రీ హృదయాన్ని నిజంగా చిత్రించగలిగారా అన్నది చాలా అనుమానాస్పదం ఈనాటి కథాసాహిత్యంలో ఈ లోటు లేదు

నిజానికి ఈ కాలంలో స్త్రీలు చాలా ముందుకు వచ్చారు సినిమాతారలు మొదలుకొని ప్రభుత్వ శాఖలలో ఎల్ డి సీ ల దాకా అనేక రంగాలలో స్త్రీలు పని చేస్తున్నారు, ఆర్జిస్తున్నారు కీర్తిప్రతిష్టలు కూడా సంపాదిస్తున్నారు వారిలో డాక్టర్లూ, రచయిత్రులూ, గాయనులూ, చిత్రకారిణులూ, రాజకీయవాదినులూ, లెక్చరర్లూ, పరిశోధినులూ ఉన్నారు

కాని సమాజంలో స్త్రీ పట్ల గల వైఖరిలో మార్పు రాలేదు రావలిసిన మార్పు ఇదీ అని చెప్పేవాళ్లు కూడా లేనట్టుగా కనబడుతుంది లక్షలమందీ, కోట్లుమంద చూసే సినిమా చిత్రాలలో కూడా స్త్రీ సీతా సావిత్రుల అడుగుజాడలలోనే నడవాలన్నది బలంగా చెప్పబడుతున్నది ఒక చిత్రంలో నటించినందుకు లక్ష రూపాయలు వసూలు చేసి, డైరెక్టర్లనూ, ఆర్టు డైరెక్టర్లనూ, దర్జీలనూ, మేకప్ వాళ్లనూ తన చుట్టూ గిరగిరా తిప్పుకోగల తార చిత్రంలో భర్త కాళ్లు పట్టుకొని ఏడుస్తూ ''మీ పాదాల దగ్గిర నాకు చోటివ్వండి, నేనింకేదీ కోరను,'' అని డయలాగ్ చెబుతుంటే ఆలోచించగలవాడికి, జీవితపు విలువలలో గల తారుమారు కొట్టవచ్చినట్టు కనబడుతుంది

ఇటువంటి లోపాన్ని రానివ్వకుండా సాహిత్యాన్ని సృష్టించగల రచయిత్రులు మనకీనాడున్నారు వారి రచనల ప్రభావం వచ్చే తరం యువతీయువకులపైన బలంగా ఉంటుందనటానికి సందేహం లేదు

కథా సాహిత్యంలో కలిగిన విస్తృతీ వైవిధ్యాలను గురించి ప్రత్యేకంగా చెప్పవలిసిన పని లేదనుకుంటాను పత్రికల సంఖ్యా, ప్రచారమూ కూడా గడచిన 20 ఏళ్ళ కాలంలో అపారంగా పెరిగాయి వాటి వెంబడి కథల సంఖ్య పెరిగింది కథలకిచ్చే పారితోషికం పెరిగింది చదివే వారి సంఖ్య పెరిగింది ఈ పరిస్థితిలో కథకుడికీ పాఠకుడికీ మధ్య పూర్వం లేని వ్యాపారబంధం ఒకటి ఏర్పడింది కథకుడు పూర్వంలాగా, ''నా రచన సాహిత్యానికి ఏ విధమైన అలంకారమవుతుంది?'' అని ప్రశ్నించుకోవటానికి బదులు, ''అసంఖ్యాకులైన పాఠకులను నా కథ రంజింపచేస్తుందా?'' అని ప్రశ్నించుకునే పరిస్థితి ఏర్పడింది జీవితంలో డబ్బుకు ప్రాధాన్యం హెచ్చుతున్నదేమో, కథకులకు నాలుగు రాళ్ళు చేసుకుందామనే దృక్పథం ఏర్పడటం కూడా సహజమే పత్రికలలో కథలు ప్రచురించటంలో ఈనాడు కీర్తి కూడా ఉన్నది ఒకప్పుడు ఏ పత్రికా వెయ్యి కాపీలు మించి అమ్మేది కాదు ఈనాడు లక్షకాపీలకు పైగా అమ్మి, అంతకు కనీసం నాలుగింతల మంది చదివే పత్రికలుంటున్నాయి కనక అసంఖ్యాకులలో కథలు రాయాలనే ఉబలాటం పెరిగటం కూడా సహజమే తమకు వచ్చే కథలలో సాహిత్యపు విలువలు ఉన్నా, లేకున్నా తమ పాఠకులకు తృప్తినిస్తాయనిపిస్తే ఎడిటర్లు వేసెయ్యటం కూడా సహజమే

ఈ విధంగా కథా సాహిత్యానికి కొంత ''వాపు'' ఏర్పడిన మాట అబద్ధం కాదు పత్రికలలో వచ్చే కథలలో చదివి మరిచి పొయ్యేవే జాస్తి, నాలుగు రోజులపాటు చెప్పుకునేవి చాలా కొద్ది

అయినప్పటికీ పత్రికలు కథాసాహిత్యానికి అన్యాయం చేస్తున్నాయనటం సబబు కాదేమో ఎందుచేతనంటే ప్రజలలో పఠనాసక్తి పెంచే ఈ పత్రికలు, కాలక్రమాన అప్రత్యక్షంగా సాహిత్యాభిలాష పెరిగటానికి కూడా దోహదం చేస్తున్నాయి

మరొకందుకు కూడా పత్రికలను మనం మెచ్చుకోవలసి ఉన్నది ఈ మధ్యకాలంలో రచయిత్రులు పైకి రావటానికి పత్రికలు చేసిన కృషి యింతా అంతా కాదు ఈనాడు కూడా కథలు రాసే స్త్రీలను ప్రతి పత్రికా ప్రోత్సహిస్తున్నది

కొన్ని పత్రికలు కథల పోటీలు పెట్టి అచ్చుగా స్త్రీలకే బహుమానాలివ్వటం కూడా జరిగింది ఇందువల్ల కథాసాహిత్యానికి ఉపకారం జరుగుతున్న మాట నిజం

పత్రికలు ప్రారంభించిన ఈ కృషి రచయిత్రులను నవలలు రాయటానికీ, సినిమా కథలు రాయటానికీ ప్రోత్సహించింది స్త్రీల పుస్తకాలకు కూడా మంచి గిరాకీ వచ్చింది ఇదంతా సాహిత్యానికి ఉద్ధరింపు కాదనుకున్నప్పటికీ, ఇందులో కొంతైనా సాహిత్యం యొక్క అభివృద్ధికి తోడ్పడుతున్నదని ఒప్పుకోక తప్పదు

తెలుగులో కథాసాహిత్యానికి ఎటువంటి భవిష్యత్తున్నది? దీన్ని గురించి అనుమానాలకు కొంత అవకాశం కనిపిస్తున్నది కథా సంకలనాలు బాగా అమ్మటం లేదని పుస్తకాలు ప్రచురించే వారు అంటున్నారు అనేకంగా మంచి కథలు రాసిన స్త్రీలు అచ్చుగా నవలలే రాయటానికి పూనుకుంటున్నారు ఈ నవలలు ఒక్కొసారి ఆ కథలంత బాగా ఉండటం లేదు పత్రికలు కూడా సీరియల్ నవలలనే హెచ్చుగా ప్రచురించటం కనబడుతున్నది ఇదంతా చూస్తుంటే, సహజంగా, కథాసాహిత్యానికి అంత మంచి భవిష్యత్తు లేదేమోననిపిస్తున్నది

ఈ పరిణామానికి కారణం ఊహించటం అంత తేలికగా కనబడటం లేదు ఒకవేళ ఈ యుగపు ప్రజల సాహిత్యావసరాలను తీర్చటానికి చిన్నకథ చాలదేమో జీవితాన్ని మరింత విశాల దృష్టితో, మరింత లోతుగా తెలుసుకోవాలన్న కోరిక చదివేవారిలో పెరుగుతున్నదేమో ఇదే నిజమైతే చిన్నకథకు ఇక పత్రికలలో తాత్కాలిక స్థానం మాత్రమే ఉండవచ్చు ఇది కేవలమూ మన దేశంలో మాత్రమే జరుగుతున్న పరిణామం కాదు బ్రిటను, రష్యాల వంటి పరస్పరం వ్యతిరేక సామాజిక వ్యవస్థలు గల దేశాలలో కూడా చిన్న కథను వెనక్కునెట్టి నవల ముందుకు రావటం జరుగుతున్నట్టు కనబడుతుంది

*సారస్వత సంచిక, మద్రాసు, ఆగస్టు 1967*

# 30. నవల – కథానిక

వర్తమాన తెలుగు సాహిత్యంలో నవలలూ, కథానికలూ విరివిగా వెలువడుతూ ఉన్నవి ఈ రెండు సాహిత్య రూపాల రచననూ మరింతగా ప్రోత్సహించడానికని కొన్ని పత్రికలు పోటీలు ఏర్పాటు చేసి, పెద్ద పెద్ద మొత్తాలు బహుమతులుగా ఇస్తున్నవి ఇలాటి పోటీల ఫలితంగా వెలువడిన ప్రసిద్ధ నవలలు విశ్వనాథవారి ''వెయ్యిపడగలు'', బాపిరాజు గారి ''నారాయణరావు'' మాత్రమే అవైనా విశ్వవిద్యాలయం ఏర్పాటు చేసిన పోటీలో పాల్గొన్నటువంటివి పత్రికలు ఏర్పాటు చేసే పోటీలలో బహుమతులందుకొంటున్న కథానికలు గాని, నవలలుగాని ఈనాటి తెలుగు సాహిత్యంలో ఏ పాటి ఉన్నతిని సాధించుకోగలవన్నది విమర్శకులు తేల్చాలి

మన దేశం స్వతంత్రమైనాక సాహిత్యంలో కలిగిన కొన్ని మార్పులు గమనించదగినవి పాఠకుల సంఖ్య హెచ్చింది వారి అభిరుచుల సగటు ప్రమాణం చాలావరకు పడిపోయింది సినిమాలలాగే కథానికలూ, నవలలూ గూడా కాలక్షేపానికి పనికివచ్చే వస్తువులుగా తయారయినవి తాత్కాలిక వినోదాన్నీ, మనోల్లాసాన్నీ కలిగించే రచనలు బహుకొద్దికాలం పదిమంది ప్రశంసలనూ పొంది, అటు తరువాత ఊరూపేరూ లేకుండా పోతున్నవి నాకు తెలిసినంతవరకు సాహిత్యరంగంలో ఇటువంటి పరిస్థితి పూర్వం ఎన్నడూ లేదు ఈనాడు సాహిత్యం బురఖా తగిలించుకుని వెలువడే రచనలు కూడా త్వరగా మరవదగినవిగానే ఉన్నాయంటే నేను అభ్యంతరం చెప్పను పరితలకు పట్టిన జాడ్యమే రచయితలకు కూడా పట్టిందన్నమాట!

ఈనాటి కథానికలూ, నవలలూ మరొక విధంగా కూడా సినిమాలను జ్ఞాపకం చేస్తున్నవి అదెలాగంటే ఇవి సినిమా చిత్రాల ప్రభావానికి బలంగా గురి అవుతున్నవి వీటిలో కూడా సినిమాలలోలాగే కృత్రిమమైన వ్యక్తి సమస్యలూ, సంఘ సమస్యలూ, వాటి తాలూకు 'ఊక్వేషనులూ' తయారవుతున్నవి ప్రేమ అనేది ఎటువంటి సంస్కృతిలో స్త్రీ పురుషుల సాంఘికసంబంధాలు ఏ విధంగా వుండే పరిస్థితిలో ఎటువంటి మనస్తత్వాలను ఆశ్రయించుకుని పుట్టి పెరుగుతుందో సూచించిన రచనలు ఈనాడు మచ్చుకైనా కానరావు కాని ప్రేమికుల బాధ్యతలేమిటో, వాళ్ళు చెయ్యవలసిన త్యాగాలేవో వైనవైనాలుగా చిత్రిస్తూ అనేక వందల

రచనలు వెలువడ్డాయి ఇదంతా ఎలాంటి సమాజంలో? ఆడపిల్లల తలిదండ్రులు తమ కుమార్తెలను వదిలించుకోవటానికి ఉన్నదంతా పోగొట్టుకుంటున్న సమాజంలో!

ఈనాటి సాహిత్యంలో అత్యధిక భాగం జీవితాన్ని ప్రతిఫలించదు సరిగదా జీవితానికి సాధ్యమైనంత దూరంగా కూడా ఉంటుంది వాస్తవ జీవితం ఈనాటి సాహిత్యాన్ని చూసి నవ్వుకుంటుందంటే అతిశయోక్తి కాదు

అయితే ఈనాడు వచ్చే నవలలూ, కథానికలూ పూర్తిగా అవాస్తవంగా వున్నాయని నా అభిప్రాయం కాదు సాహిత్యధర్మాన్ని పాటిస్తూ, సాహిత్య ప్రయోజనాన్ని గుర్తిస్తూ చేసే రచనలు ఎప్పుడూ ఉంటూనే వున్నాయి పరితలలో కూడా రచనలను మథించి, వాటి సారాన్ని పిండగలవారున్నారు అదొక అల్పసంఖ్యాక వర్గంగా ఉంటున్నది వాళ్ళు నిన్న చదివినదాన్ని ఇవాళ మరిచిపోరు 'అసమర్థుని జీవయాత్ర', 'చివరకు మిగిలేది', 'అల్పజీవి', 'కాలాతీత వ్యక్తులు' మొదలైన నవలలను గురించి అప్పుడప్పుడూ కొత్తకొత్త అంచనాలు వెలువడుతూ ఉండటం మనం చూస్తూనే ఉన్నాం

సాహిత్య రచన చరితార్థమయేది పఠనం ద్వారానే అయినప్పటికీ సాహిత్య ప్రభావం అచ్చంగా చదివేవారిపైన మాత్రమే ఉంటుందనుకోవటం పొరపాటు సాహిత్య ప్రభావం సాహిత్యంపైన కూడా ఉంటుంది విరివిగా కథలు గాని, నవలలు గాని రాసేవారు సాహిత్యరంగంలో కొత్తకొత్త ధోరణులు సృష్టిస్తారు

డా॥ శ్రీదేవి, బుచ్చిబాబు లాటి కొద్దిమంది ఒక్కొక్క విశిష్ట రచన మాత్రమే చేసి, ఆ రచన ద్వారా కీర్తి గడించారు కాని చలం, విశ్వనాథసత్యనారాయణ, అడవి బాపిరాజు, గోపీచందు, ముప్పాళ రంగనాయకమ్మ, ద్వివేదుల విశాలాక్షి మొదలైన అనేకులు అనేక నవలలు రచించి ఆధునిక నవలా సాహిత్యంలో కొత్తకొత్త బాటలు వేశారు వీరి రచనల ప్రభావం పాఠకుల మీదనే గాక సాహిత్యం మీద కూడా విధిగా ఉంటుంది

స్వాతంత్ర్యానికి పూర్వం నవలలు లేకపోలేదు పైన చెప్పిన రచయితలలో మొదటి ముగ్గురూ యుద్ధానికి పూర్వమే అనేక నవలలు రచించారు అయితే ఏ కారణంచేతనో ఆ కాలంలో నవలల ప్రభావం సాహిత్యం మీద చాలా తక్కువగా ఉండేది అది నిజానికి కథానికాయుగం అందుచేతనే చలంగారి నవలలు కన్న కథలే ఎక్కువగా పాఠకులను ఆకర్షించినవి కాని ఇటీవలి కాలంలో ఈ పద్ధతి తారుమారయింది ఈనాడు కథల పుస్తకాలకు గిరాకీ లేదు పత్రికలలో ప్రచురణ అయే కథలు కొంతవరకు పాఠకులను తాత్కాలికంగా ఆకర్షిస్తవి అంటే నవలలు పత్రికలలో ధారావాహికంగా ప్రచురణ అయి, వెంటనే గ్రంథ రూపంలో వెలువడటమే గాక, కొన్నికొన్ని సందర్భాలలో అనేకసార్లు పునర్ముద్రణ కూడా అవుతున్నవి కథాసంకలనాలకన్న నవలలే బాగా అమ్ముడవుతున్నవి

విమర్శకులు కూడా కథల పట్ల ఏమీ శ్రద్ధ చూపడం లేదు నవలలను గురించీ, నవలాకారులను గురించీ ఎక్కువగా విమర్శనలు వెలువడుతున్నవి

ఇంతకన్న కూడా విచిత్రమైన పరిణామమేమంటే ఈనాడు వెలువడే కథలు కూడా చిన్న చిన్న నవలలలాగా ఉంటున్నవి వీటిని కథానికలు అనటం కూడా తప్పే చిన్న కథయొక్క రూపాన్ని, శిల్పాన్ని మనం పాశ్చాత్యులనుంచి అరువు తెచ్చుకున్నాం కథకు జీవంగా ఒకే

ముఖ్య సంఘటన ఉంటుంది పాత్ర చిత్రణ సంగ్రహంగా ఉంటుంది గాని పాత్ర పరిణామం ఉండదు చివరలో 'క్లయిమాక్స్' ఉంటుంది మొపాసా, ఓహెన్రీ, సాకీ, చెకోవ్, గోర్కీ లాంటి సుప్రసిద్ధ కథాకారులందరూ ఇటువంటి కథలే రాశారు యుద్ధానికి పూర్వం తెనుగులో కూడా ఇటువంటి కథలే వెలువడేవి వీటికి 'కథానిక' అన్న పేరు తగి ఉంటుందని ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారనుకుంటాను చెప్పారు అది మొదలు కథానిక అనే పేరు అమలులోకి వచ్చింది

కాని ఈనాటి కథలు కథానికలు కావు ఇవి పెద్ద కథలో, చిన్న నవలలో అనిపించుకోదగి ఉంటున్నవి వీటిలో పాత్రల తత్వాలలో అనేక మార్పులు కలగవచ్చు అనేక సంఘటనలుండవచ్చు యుద్ధానికి పూర్వం వెలువడిన కథా సాహిత్యంలో ఇలాంటి కథలు రాసిన వారు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు వారి కథ ఒకటి ''భారతి''లో 29 పేజీలు రావటం నాకుజ్ఞాపకం ''మీరు రాసినంత క్లుప్తంగా నాకు కథ కుదరదు ఎంచేత?'' అని ఆయన ఒకసారి నన్నడిగితే ''మీరు కథలో శిల్పాన్ని పాటించరు'' అన్నాను శిల్పాన్ని పాటించకుండానే శాస్త్రి గారు గొప్ప కథలు కొన్ని రాశారు

ఈనాడు దాదాపు అందరూ - ముఖ్యంగా రచయిత్రులు - చాలా దీర్ఘమైన కథలు రాస్తున్నారు వాటిలో చాలా మంచి కథలు కూడా ఉంటున్నవి

ఈ పరిణామాన్ని మనం తేలికగా అర్థం చేసుకోవచ్చుననుకుంటాను ఈనాటి కథకులకు జీవితాన్ని వివరంగా చిత్రించాలన్న కాంక్ష ఉంటున్నది పాఠకులలో కూడా అటువంటి కాంక్షే ఉంటున్నది అందుచేత కథల పరిమాణం పెరిగిపోతున్నది ఇందువల్ల కథలలో శిల్పం లోపించినప్పటికీ, కథాసాహిత్యం ఈనాడు అంత ముఖ్యమైనది కాదు కనక దాని వల్ల ఆట్టే నష్టం కలగటం లేదు

కాని శిల్పం లేకపోవటం అన్నది నవలలలోకూడా ఉంటున్నది ఇది శోచనీయం ఎందుకంటే ఈనాటి కల్పనా సాహిత్యంలో నవలకు అగ్ర స్థానం ఉంటున్నది

నవలకు శిల్పమంటూ ఉండదనే తప్పుడు అభిప్రాయం కొందరికి వున్నట్టు కనిపిస్తుంది కాని ఇది నిజం కాదు నవల రచించే వ్యక్తి అపారమైన తన జీవితానుభవమే కాక, మానవ మనస్తత్వం గురించీ సామాజికశక్తుల ప్రభావం గురించీ తనకు గల విజ్ఞానాన్ని నవలలో పుష్కలంగా ప్రవేశపెట్టగలడు (ఫ్రాయిడ్ సిద్ధాంతాలనూ మార్క్స్ సిద్ధాంతాలను రుజువు చెయ్యటానికి నవలలు రచించాలని నా ఉద్దేశం కాదు కాని ఆ సిద్ధాంతాలలోని సత్యం వాస్తవ జీవితంలో ఏ విధంగా వ్యక్తమయేదీ నవలలో నిరూపితం కావచ్చు )

అంతేకాదు, రచనాశిల్పం అనంతమైనది అందులో ధ్వనులూ, ప్రతిధ్వనులూ, బింబాలూ, ప్రతిబింబాలూ సృష్టించవచ్చు రచనా శిల్పం తాలూకు అసంఖ్యాకమైన యుక్తులను గురించి ఇక్కడ వివరించటం అనవసరం ఈనాటి సాహిత్యం సృష్టించే వారు రామరాజ భూషణుడిలాగా అడుగడుగునా 'నా శిల్పం చూడండి' అన్నట్టుగా రచన చేయనవసరం లేదు శిల్పం ఎంత గోప్యంగా ఉంటే అంత మంచిది పైపైన చదువుకు పోయేవాణ్ణి అది ఏమాత్రమూ బాధించరాదు తరిచి చూసేవాడికి మాత్రమే అది దర్శనమిచ్చి, అదనపు ఆనందాన్ని చేకూర్చాలి

కాని నవలలో ఏ విధమైన శిల్పమూ లేనప్పుడు దాన్ని విమర్శకుడు తరచిచూసేటందుకు ఏమీ ఉండదు ఈ కాలపు విమర్శకులు తరిచి చూడటానికి ప్రయత్నం చేస్తున్న రచనలన్నిటా రచయిత యొక్క ప్రతిభ అంతర్గతంగా ఉన్నదనే భావించవచ్చు

*జనపథం వారపత్రిక, మే 1968*
*వరంగల్లు జిల్లా రచయితల మహాసభలో చదివిన వ్యాసం*

# 31. విమర్శలూ, విమర్శకులూ

సాహిత్యాన్ని ఇతర కళలనూ విమర్శించి వాటిలోని మంచిచెడ్డను లోకానికి చాటటం ఆనవాయితీగా ఉంటున్నది ఈ పని చేసేవాళ్ళు విమర్శకులు కళలను సృష్టించేవాళ్ళకన్నా, వాటిని ఆస్వాదించే వాళ్ళకన్నా విమర్శకుడు ఒక మెట్టుపైన ఉండాలి లేనిపక్షంలో కళా సృష్టిలో జరిగే లోపాలను, కళాస్వాదకుడి అజ్ఞానాన్ని విమర్శకుడు ఛేదించే అవకాశం ఉండదు

విమర్శకుడికి గల ఈ ఆధిక్యతను ఎవరూ కాదనటానికి లేదు అయితే ఇది ప్రత్యక్షానుభవంలో అంత తేలికగా ఋజువు కావటం లేదు ఒక ఎల్లయ్య రాసిన పుస్తకాన్ని ఒక పుల్లయ్య విమర్శించటమూ, ఆ పుల్లయ్యే రాసిన మరో పుస్తకాన్ని ఆ ఎల్లయ్యే విమర్శించటమూ సాధారణంగా జరుగుతూ వుంటుంది అప్పుడు, పుల్లయ్య మీద ఎల్లయ్య ఎక్కువా, ఎల్లయ్య మీద పుల్లయ్య ఎక్కువా అనే సమస్య తప్పక ఏర్పడుతుంది

దానికి సమాధానమేమిటంటే ఎల్లయ్య అయినా పుల్లయ్య అయినా, కళాసృష్టిలో కొన్ని కళావిమర్శలు మరింత గట్టి అని, తప్పులు చెయ్యకుండా వుండటం కన్నా, ఇతరులు చేసిన తప్పులు పట్టటం తేలిక అని

కళాస్వాదన విషయంలో ఇటువంటి ధర్మసందేహాలకు తావు లేదు ఎందుచేతనంటే, కళాస్వాదన చేసేవాళ్ళు, కళాస్రష్టకూ, కళావిమర్శకుడికి కూడా తీసికట్టే

ఈ అభిప్రాయాన్ని తారుమారు చేసిన ఒకే ఒక కళ సినిమా కళ దేవుడిలాంటి సినిమా చిత్రానికీ, భక్తులాంటి సినిమా ప్రేక్షక సమూహానికీ మధ్య విమర్శకుడనే పూజారికి స్థానం లేదని, పూజార్లమని చెప్పుకోదలచిన వాళ్ళు వంధిమాగధుల పాత్ర మాత్రమే నిర్వహించవలసి వుంటుందని చిత్ర నిర్మాతలు యేనాడో నిర్ణయించేశారు

అదీ ఒక విధంగా నిజమే మరి ఎందుచేతంటే, సినిమా కళ రానురానూ ఎలా పరిణమించిందంటే విమర్శకుడనే వాడు చిత్ర నిర్మాత కంటే ఎక్కువ తెలిసినవాడై వుంటాడనుకోవడం అనూహ్యం సినిమా చిత్రాన్ని చూసే వేలిముద్రలగాళ్ళకన్నా తెలివైనవాడు కావటం పూర్తిగా అవాంఛనీయం

అందుచేత సినిమా కళకు ఒక నమస్కారం పెట్టి ఇతర కళలను గురించే మాట్లాడుకుందాం వాటికి విమర్శకులంటూ ఇంకా వున్నారు వాళ్ళ విమర్శలు కొందరినన్నా ఇంకా ఆకర్షిస్తూనే వున్నాయి (కావలిస్తే డిటెక్టివ్ సాహిత్యాన్ని, సెక్స్ సాహిత్యాన్ని మినహాయించండి మిల్టన్ షేక్స్పియర్‌తో అన్నట్టు ''తమకు ఎవరి అజమాయిషీ లేదు'')

మనం పత్రికల్లో చూసేవన్నీ విమర్శలు కావు వీటిల్లో భేదాలున్నాయి పాఠకుల లేఖలు,

రివ్యూలు లేక సమీక్షలు, విమర్శలు అంటే అసలైన విమర్శలు పాఠకుల లేఖలు పాఠకులు పత్రికలకు రాసే లేఖలు ఫలానా సంచికలో ఫలానా వారు రాసిన ఫలానా రచన అమోఘంగా వుంది ఇటువంటి రచనలు తప్ప మీ(మా) పత్రికలో వెయ్యొద్దు ఇది సాధారణ పాఠక విమర్శ కొంచెం తెలివైన పాఠకులు కాస్త విషయ చర్చలోకి దిగుతారు "హీరోయిన్, నా మాట నమ్మరూ? అని భర్తను అడిగేసరికి మేం ఇంటిల్లిపాదిమీ బావురుమని ఏడ్చేశాం కాకపోయినా ఆ హీరోను అంత కర్కోటకుడుగా ఎలా చిత్రించారండీ?" ఇందులో విషయమూ, విమర్శ కూడా వుంది

కాని పై రెండింటిలోనూ కూడా అసలైన విమర్శకు వుండదగిన ఒక్క లక్షణమూ లేదు ఈ పాఠక విమర్శలు రచయిత కన్నా పైమెట్టున నిలబడరు ఇలా నిలబడటం అసలైన విమర్శకుడి ప్రథమ కర్తవ్యం ఈ కర్తవ్యాన్ని నిర్వహించ యత్నించే పాఠక విమర్శకులు లేకపోలేదు వాళ్ళు పత్రికలకు "ఫలానా వారి ఫలానా రచన యేమీ బాగా లేదు ఇటువంటి రచనలను ప్రచురించారంటే (మీ)మా పత్రిక సర్క్యులేషన్ పూర్తిగా దెబ్బ తింటుంది" అని రాస్తారు

అయితే, పత్రికాధిపతులు ఇటువంటి లేఖలను సాధారణంగా బుట్టదాఖలు చేస్తారు చెయ్యమని నిరూపించేందుకు ఒకటీ అరా వేసిన ఆ పాఠకుడు బ్లాక్‌లిస్టులోనే చేరిపోతాడు అందుకు మనం ఆక్షేపించటానికి వీల్లేదు ఏమంటే ఈ అచ్చు నిజమైన విమర్శలు రాసే వాడి ఫోజుపెట్టి, పాఠక విమర్శలు రాస్తున్నాడు ఇది క్షమించరానిది, ప్రోత్సహించరానిది పోతే సమీక్షలు, రివ్యూలు ఇవి నిజమైన విమర్శలు కావు ఒక పుస్తకంలో ఏముందో చెప్పడం వీటి ఉద్దేశం ఆ చెప్పటంలోనే టూకీగా అది చదవతగిందో, కాదో సూచన చేసి వదిలెయ్యవచ్చు సమీక్షకుడికి సామర్ధ్యం వుంటే ఈ రివ్యూలు పఠనాంశంగా వుండి, వాటిని చదవటమే ఒక పరమార్థమనే భావం పాఠకుడికి కలిగించవచ్చు

అప్పుడది మంచి జర్నలిజం కిందికి వస్తుంది రివ్యూలు జర్నలిస్టుల కోసం పుట్టాయనే నా దృఢవిశ్వాసం అవి సిసలైన విమర్శలంత విజ్ఞానాత్మకంగా కాని, చదవటానికి బరువు కాని వుండనవసరం లేదు రివ్యూలను జర్నలిజం మోతాదులో తీసుకోకపోతే ఇంకో చిక్కు కూడా వున్నది " ఆవకాయలో రకాలు" మొదలుకొని " ఆధ్యాత్మికవాదనలు" దాకా అనేకానేక విషయాల మీద పుస్తకాలు వందల సంఖ్యలో వెలువడతాయి ("రివ్యూకు రెండు కాపీలు పంపవలెను ")

వీటిని రివ్యూ చెయ్యటానికి ప్రతి పత్రికకూ ఇద్దరో ముగ్గురో నలుగురో అయిదుగురో పరిమితంగా వుంటారు అల్పసంఖ్యాకులు సమస్త విషయాలపైన 'అథారిటీలు'గా వుండటం అసంభవం అందుకని ప్రతి పుస్తకాన్నీ ఒక ప్రవీణుడి చేత రివ్యూ చేయించటం ఎలాగూ జరిగే పని కాదు అటువంటప్పుడు జర్నలిజం యెంతో సహాయకారి ఎందుకంటే, ప్రపంచంలోని ఏ విషయంపైనైనా తెలిసినట్టు నటించగలవాడు జర్నలిస్టు ఒక్కడే!

ఇక అసలైన విమర్శలను తీసుకుందాం జనసామాన్యానికి అతీతంగా జరిగే కళా సృష్టిని గురించీ, ఆ కళలను సృష్టించే అతీతులైన కళాకారులను గురించీ అందరికీ అర్థమయ్యేట్టు చేసేవి ఈ విమర్శలు అత్యుత్తమమైన కళలను అందరికీ అర్థమయేట్టు చేసి, జాతి కళాస్వాదన శక్తినే పెంపొందిస్తాయి గనుక వీటి సాంస్కృతిక విలువ అపారమైనదని వేరే చెప్పనక్కర్లేదు

ఉదాహరణకు మన బోటి వాళ్ళం వసుచరిత్ర చదివితే అందులో ఏం కనపడుతుంది? అదే వసుచరిత్రను విమర్శతో చదివితే మన కళ్ళు విచ్చుకుంటాయి మనస్సు కూడా విచ్చుకున్నట్టు అవుతుంది రామరాజ భూషణుడు ఎంత కవో, ఎంత పండితుడో తెలిసేందుకు ఒక గొప్ప విమర్శకుడు కూడా అవసరం

పాత కాలపు రచనలను తీసుకొన్నంతసేపూ మనకూ విమర్శకుల విలువ స్పష్టంగానే బోధపడుతుంది ఎటొచ్చీ ఈ కాలపు కళలు దగ్గరికి వచ్చేటప్పటికి కొంత అయోమయం ఏర్పడుతుంది వసు చరిత్ర కాలం పోయింది పిల్ల వసుచరిత్రలకు కూడా కాలదోషం పట్టింది వెధవది, వసుచరిత్ర ఒకటుందని తెలియని వాళ్ళు కూడా మంత్రులు కావచ్చు, లేదా మహత్తరమైన చిత్రాలను తీసి పారెయ్యొచ్చు

మాటవరుసకు చలంగారిని తీసుకొందాం గత యాభై ఏళ్ళుగా ఆయన ప్రస్తావించని విషయం మీద ఎవరూ కథ రాసినట్టు కనిపించదు అందుచేత ఆయనను ఆధునిక సాహిత్య యుగపురుషులలో ఒకరుగా నిశ్చయంగా భావించవచ్చు అయితే, ఆయన అందరికీ అర్థమయేట్టుగానే రాశాడు అటువంటి వాడికి విమర్శలు దేనికి అనుకుంటాం సృజన చలం సంచిక చదివితే ఈ సందేహం తీరిపోతుంది

మనవంటి పామరులకళ్ళకు కనిపించనిది చూపించడమే గదా అసలైన విమర్శకుడి పని ఆ పనిని చలం విమర్శకులు చాలా వరకూ సాధించారు చలం రచనల్లో మనకు కనిపించనిదే గాక లేనిది కూడా వారు కొంత చూపించగలిగారు ( ఈ ప్రక్రియనే గిరీశం ''కుప్పుస్వామయ్యర్ కమేడ్ డిఫికల్ట్ అన్నాడు )

ఇటువంటి సందర్భాల్లో విమర్శకుడు కళాకారుడి కన్నా కొన్ని మెట్లు పైగా వుంటాడని మనం ఒప్పేసుకోవచ్చు అయితే, ఇందువల్ల ఒక చిక్కు ఏర్పడుతుంది కళాకారుడికన్న అనేక మెట్లు పైన వుండే విమర్శకుడు సామాన్య కళాపిపాసి కన్నా ఎన్ని అంతస్తులు ఎక్కువలో వుంటాడో అన్న భయానుమానాలకు అవకాశం వుంటున్నది ఇది నిరాధారమైన భయం కాదు

కాలంతో పాటు కళలూ, కళాకారులూ మారినా విమర్శకులు అనే జాతిలో మార్పు రాలేదు వాళ్ళు కళాశస్త్ర చికిత్సకు కావలసిన ఆధునిక పరికరాలు, ఫ్రాయిడ్, యాంగ్, స్ట్రీమాప్ కాన్షస్‌నెస్, ఎడ్జిస్టెన్షియాలిజం, హెగెల్, కాంట్‌బెర్గ్‌సన్, అయ్యర్(తమిళుడు కాదు), శంకరాచార్యులూ, భరతుడూ, మమ్మటుడూ, బాలయోగి వగైరాలను పదునుపెట్టుకొని ఆపరేషన్‌కు సిద్ధంగా వున్నారు ఏ లభాగ్యుడైనా పదిమంది నోట పడితే చాలు, వాణ్ణి పట్టుకొని ఘనంగా విమర్శించడమే కాక, అసలు కళాకారుణ్ణి గురించి మనకు కొత్తగా యేమీ తెలీకపోయినా తమ వైదుష్యాన్ని ప్రదర్శించి, రోగి చచ్చినా ఆపరేషన్ మోతగా జరిగిందనిపిస్తారు

ఫలానా సర్జన్ చేత బుడ్డకోయించుకున్నానని చెప్పుకోవడానికి కొందరు గర్వపడ్డట్టు, ఈ ఉద్దండ విమర్శకుల దృష్టిలోకి రావడమే జన్మకు చరితార్థమనుకునే కళాకారులూ, వాళ్ళు తమ కళలో చూపించిన మహోన్నత విషయాలు నిజంగానే వున్నాయి కాబోలని నమ్మటం మొదలుపెట్టేవాళ్ళూ వుండరని నేననను

నేను బెంగపడుతున్నది ప్రత్యేకించి కళాకారులను గురించి కాదు మామూలు సాదా నాటక కళాభిలాషులను గురించి ఈ ఉద్దండ విమర్శకుల మూలంగా వాళ్ళు తమ అభిమాన కళాకారులను చూసి బెదరిపోవటం జరగవచ్చు ఇది వాంఛనీయ మార్పు

ఇందులో ఇంకా ఎన్ని ప్రమాదాలు ఇమిడి వున్నాయో చిత్తగించండి గొప్ప విమర్శకుడి దృష్టి ఏ ఎవరెస్టు శిఖరం మీదనో వుంటుంది విమర్శకుడు ఆ ఎత్తు నుంచి మనను కూడా చూడమంటాడు మనకేమో కళ్ళు తిరిగి బైర్లు కమ్ముకొస్తుంది ఆ మీదట మన దృష్టిలో మనకు నమ్మకం వుండదు ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్‌లో పడిపోయి మనని మనం నమ్మలేకపోతాం

ఇంకో ప్రమాదం మనలో ఉద్దండ విమర్శకులు ఎందరో ఉంటారు డాక్టర్లలాగా ఏకీభవించకపోవచ్చు శంకరాచార్యులువారు చెప్పినట్టు (లేదా విశ్వనాథవారు చెప్పినట్టు) ప్రతివాదానికీ ప్రతివాదం వుండనే వుంటుంది శ్రీశ్రీ మహాకవి అని ఒకరు నిరూపిస్తే, అసలా శ్రీశ్రీకి కవిత్వమే రాదని మరొకరు నిరూపించవచ్చు ఏది సత్యం? ఏదసత్యం?

అసలీ శషభిషలన్నీ ఏమిటి? కళలు సృష్టించే వాళ్ళు ఎవరి కోసం సృష్టిస్తున్నారో, వాళ్ళకు జీర్ణమయేట్టు కళలను సృష్టించరాదా? అవి అరగని పరిస్థితి ఎందుకు? విమర్శకాభిషగ్వరులు మన అజీర్ణానికి మందు వెయ్యటం దేనికి? కళాప్రపంచం వెంకట సుబ్బారావు మేడీజ్‌గా వుంటే పోలా!

*ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 30-8-1968*

# 32. అశ్లీల నిషేధం

అశ్లీల సాహిత్యాన్ని, బొమ్మలనూ సినిమాలను చట్టరీత్యా నిషేధించటం అసంగతమని ఇటీవల ఇంగ్లండులో తేల్చారు చట్టం చెయ్యటమైతే సాధ్యమేకాని దాన్ని సమర్థించటంలో చాలా చిక్కు వస్తున్నది

మొదటి సంగతి, ఏది బూతు అన్నది న్యాయశాస్త్ర రీత్యా నిర్వచించటం సాధ్యంకాదు ఏది అవాచ్యమో, అలేఖ్యమో నిర్ణయించేది సమాజం సమాజం అంతాకూడా కాదు "శిష్టులు" అనిపించుకునే వర్గాలవారు వాళ్ళు ఏది నోటంట అనరో, వినరో, చదవరో, చూడరో - కనీసం నలుగురి మధ్య అననట్టూ, విననట్టూ, చదవనట్టూ, చూడనట్టూ నటిస్తారో - అది బూతు, అశ్లీలం

నిజానికి నగ్న శరీరాలు అందరికీ తెలిసినవే జననేంద్రియాల పేర్లు ఎవరికీ కొత్తకాదు కాని పదిమంది మధ్య ఒక నగ్న శరీరం కనిపించినా ఒక జననేంద్రియం పేరు వినిపించినా "శిష్టులు" కంపించి పోతారు "బూతు" మాటలను ఊత మాటలుగా రోజుకు ఎంద సార్లు వాడే వాళ్ళకు ఏ వికారమూ ఉండదు

శిష్టులనబడే వారిలోకూడా అందరూ స్త్రీలే ఉన్నప్పుడు నగ్నంగా కనిపించటానికి ఏ స్త్రీకీ సాధారణంగా అభ్యంతరం ఉండదు ఎంత మడిగట్టుకున్న దంపతులైనా ఏకాంతంలో "బూతు" మాట్లాడకుండా ఉండరు

అందుచేత ''బూతు'', ''అశ్లీలం'' అన్నది స్ఫురించటం ఒక ''కండిషన్డ్ రిఫ్లెక్స్'' అది కొందరికి కొన్ని పరిస్థితులలో కలుగుతుంది అందరికీ అన్ని పరిస్థితులలోనూ కలగదు అది సూచించటానికే ''అసభ్యం'' అనే మాట పుట్టింది

అజంతా చిత్తరువులు చూస్తుంటే ఏ వికారమూ కలగకపోవచ్చు కాని అజంతా సుందరి దుస్తులు ధరించిన స్త్రీ వీధిలో కనబడితే నానారకాల వికారాలు కలగవచ్చు నూటికి పదిమంది స్త్రీలు అదే విధంగా తయారైతే క్రమంగా వికారాలు సమసిపోవచ్చు మనలెక్కన అసభ్యంగా వస్త్రధారణ చేసే పాశ్చాత్య దేశాలలోనే ''మినిస్కర్ట్స్'' కొత్తగా వచ్చినప్పుడు సంచలనం కలిగింది ఇప్పుడా సంచలనం సన్నగిల్లిపోయింది

ఆ కారణంచేత ''జుగుప్స'' అనేది ఒక సుస్థిర భావంకాదు మొదట అసభ్యం అనిపించినది కాలక్రమమున నిర్వికారమైపోయి, మరికొంత కాలానికి సభ్యంగాకూడా పరిణమించవచ్చు అలాంటి సంచలనమైన విలువలను చట్టరీత్యా నిషేధించటం సాధ్యంకాదు

అసభ్య-అశ్లీల శృంగారంవల్ల కలిగే ''హాని'' నిరూపించటం అసాధ్యమని వాదిస్తున్నారు అలాంటి రచనలూ! చిత్రాలూ, సినిమాలూ కామోద్రేకాన్ని రెచ్చగొడతాయి నిజమే కాని కామోద్రేకం కలగటం అన్నది ఒక నేరంకాదు అది ప్రతిమనిషికి సహజంగా కలగదగినదే దాన్ని పెంపొందించే ఆహారాలూ, ఔషధాలూ, ప్రక్రియలూ నిషిద్ధాలు కావు అందుకుగాను ఉపయోగించే కొన్ని డ్రగ్గులు ఆరోగ్య కారణాలదృష్ట్యా అదివరకే నిషేధించబడి ఉన్నాయి

సెక్సు పుస్తకాలూ, బొమ్మలూ, సినిమాలూ వ్యభిచారాన్ని పెంపొందిస్తాయన్న ఆరోపణ ఉన్నది వ్యభిచారం అంతో ఇంతో అదుపులో వుంటున్నదంటే దానికి కారణం సంఘ నిషేధమే గాని చట్ట నిషేధం కాదు రంకులనాలు జరుగుతూనే ఉన్నాయి కాని కేవలమూ రంకు పోయినందుకెవరూ జైళ్ళకు పోనటంలేదు వ్యభిచార వ్యాపారం నిషేధించబడింది ఆ సందర్భంలో చట్టాన్ని ఉల్లంఘించినవారికి శిక్షపడుతున్నది

నిజానికి అశ్లీలం ఒక వ్యాపారం సెక్సు పుస్తకాలూ, పత్రికలూ, ఫోటోలూ, సినిమాలూ విజృంభించటంలో సాంఘిక పరిణామం ఏమీలేదు కేవలమూ డబ్బుకోసమే ఇవి సృష్టి అవుతున్నాయి వీటిని చట్టంద్వారా నిషేధిస్తే ఈ వ్యాపారం చీకటి బజార్లను ఆశ్రయించి మరింత లాభదాయకం అవుతుంది

నిషేధం లేకపోతే అయిదు రూపాయిలకు దొరికే బూతు పుస్తకం నిషేధం మూలంగా 25 రూపాయలు పెడితేగాని దొరకదు మామూలు ఫోటోలకన్న బూతు ఫోటోలధర జాస్తి

ఈ సందర్భంలో డెన్మార్క్ లో జరిగిన ఒక సంఘటన తెలుసుకోదగినది అక్కడ బూతు పుస్తకాలమీద, బొమ్మలమీతా నిషేధం ఉండేది 1967 జూనులో కాబోలు బూతు పుస్తకాలపై నిషేధం తీసేశారు వెంటనే వాటి అమ్మకాలు తగ్గిపోయాయి బూతు బొమ్మల అమ్మకాలు పెరిగాయి వాటిపై నిషేధాన్ని అక్కడి ప్రభుత్వం ఎత్తి వెయ్యలేదు

సాంఘిక పరిణామం వల్ల కలిగే మార్పులు మరో విధంగా వుంటాయి ప్రబంధాల నిండా పచ్చి శృంగారమూ, రతి వర్ణనలూ ఉన్నాయి కాని వాటిని గురించి ఎవరూ పెద్దగా ఆందోళనా చెయ్యలేదు ఎందుచేత వాటిలో ఉండే భాషమనం ''బూతు''గా భావించే భాష లాంటిదికాదు ప్రబంధాలలో కూడా స్త్రీల అంగాగ వర్ణనవున్నది కాని అది ఒక ఆనవాయితీ

ప్రకారం జరిగింది ఆ ప్రబంధ భాషతో కామోద్దీపన కలిగించటం దాదాపు సాధ్యంకాని పరిస్థితి ఏర్పడింది

అందుకే సెక్సుకు సంబంధించిన '' ఇన్హిబిషన్స్'' తొలగించటానికి కంకణం కట్టుకున్న చలంగారు కూడా ఒకరకమైన ''సభ్యతను'' పాటించటం జరిగింది ఆయన ''పస్నులు'' అనేమాట ఎక్కడా వాడినట్టు లేదు, 'మెడకింది వాపులు'' అన్నారు ప్రబంధాలతో పోల్చితే చలంగారి సెక్సు వర్ణనలు ఎంతో సభ్యమైనవని ఒప్పుకు తీరాలి ఆయన సెక్సును అమ్మలేదు ఈనాటి కొందరు సినిమా ప్రొడ్యూసర్లలాగా, సెక్సు పత్రికల వాళ్ళలాగ ఆయన తన రచనలను వ్యాపార సరుకు చెయ్యలేదు అయినా మడిగట్టుకున్నవాళ్ళు ఆయన రచనలుచూసి అల్లాడిపోయారు సెక్సును బజారులో పెట్టి అమ్ముకునే వాళ్ళతో మడిగట్టుకున్నవాళ్లకు పేచి లేదు, దాని సంకెళ్ళను విడగొట్టటానికి పూనుకున్న వాళ్ళంటేనే భయమూ, కంపరమూనూ!

మనజాతికి సెక్సు విక్రయం గురించి ఏమైనా అభ్యంతరం ఉన్నదా ? ఏంత మాత్రమూ లేదు ఇమ్మోరల్ ట్రాఫిక్ చట్టం ద్వారా ఆడదాన్ని అదుపులో పెట్టిందిగాని, దాదాపు ప్రతి మగవాడూ తన సెక్సును కట్నానికి అమ్ముకుంటున్నాడు ఇది ఘనంగా భావించబడుతున్నది సినిమా తెరమీద స్త్రీ పాత్రలు ఆ కాసిన గుడ్డలూ విప్పుదీసుకుని డాన్సులు చేసినా నోరు మెదపటానికి మనం అర్హులంకాము

నిషేధాలు ఉండరాదని నేను అనటంలేదు సాంఘిక నిషేధాలు చాలా అవసరం సభ్యత విడిచిపెట్టిన తరవాత సమాజమే ఉండదు కాని ఈ నిషేధాలు సెన్సారు ద్వారానూ, చట్టాల ద్వారానూ అమలుజరగవు సినిమాలలో ఎంత అశ్లీలం సహించాలో ప్రేక్షకులు నిర్ణయిస్తారు నిర్ణయిస్తున్నారనే నానమ్మకం విజయవంతంగా నడిచేవన్నీ ''క్లీన్''గా ఉన్న చిత్రాలేనని తెలుస్తున్నది అలాగే పుస్తకాలలో కూడా సభ్యతకు విరుద్ధమైన సెక్సు ఎక్కరాదు

పదిమంది సిగరెట్లు కాల్చేవాళ్ల మధ్య పొగ సరిపడని పెద్దమనిషి ఒక్కడున్నా పదిమందీ ఆత్మ నిగ్రహం ప్రదర్శించటం మర్యాద ఈ విషయంలో మెజారిటీ, మైనారిటీ విచక్షణలేదు ఏ నాగరిక సమాజంలోనైనా అల్పసంఖ్యాకులపట్ల హెచ్చు ఆదరం ఉంటుంది సినిమాలు తీసేవాళ్ళూ, పుస్తకాలు అచ్చువేసేవాళ్ళూ నిజమైన నాగరికతగలవాళ్ళయితే ఈ నిషేధాల ప్రసక్తే అవసరం లేకపోను, కాని ఈనాటి ప్రపంచంలో డబ్బుకున్న విలువ నాగరికతకు ఉండటంలేదు

*ప్రగతి వారపత్రిక, 5-12-1969*

# 33. ఈనాటి కాల్పనిక సాహిత్యం

ఇప్పుడు వచ్చే నవలలను సమర్థించే వారూ, విమర్శించేవారూ ఒక విషయం గుర్తిస్తున్నట్టు కనబడదు ఇటీవల తెలుగు కాల్పనిక సాహిత్యంలో విచిత్రమైన పరిణామాలు కానవస్తున్నాయి కాల్పనిక సాహిత్యం - నవలలుకానియ్యండి, కథలు కానియ్యండి - జీవితం నుంచి ప్రేరణ పొందుతున్నట్టు కనబడదు కొన్ని ఒరవళ్లు - Styles - పడికట్లు - ఆధారంగా, ఇతర కాల్పనిక సాహిత్యం మీదReach - అయి, పేరణపొంది, వెలువడుతున్నట్టు కనిపిస్తుంది ఇది అన్ని కథలకూ, అన్ని నవలలకూ వర్తిస్తుందని చెప్పగల స్థితిలో లేను ఎందుకంటే అన్నీ చదివే

స్థితిలోనూ లేను కాని హెచ్చు భాగం రచనలు బలమైన సామాజిక సాహిత్య ఆశయాలతో కూడుకుని ఉన్నట్టు కనబడవు ప్రయోజనం ఉన్న సందర్భాలలోకూడా అది కేవలం సంప్రదాయబద్ధంగా, లాంఛన ప్రాయంగా కనబడుతుంది

ఇందుకు బాహ్య చిహ్నంగా ఒక్క సంగతి చెప్పుకోవచ్చు ఇటీవలిదాకా సిద్ధహస్తులనిపించుకున్న కథకులు - రాచకొండ, రంగనాయకమ్మ, కాళీపట్నం, బీనాదేవిలాటి వారు కథలు రాయటంలేదు జీవితం నుంచి ప్రేరణపొంది కథలు రాసిన వీరు ఎందుకు మానేశారో అర్థం చేసుకోవాలి

నవలల విషయంలో కూడా ఇలాటి పరిణామమే వచ్చినట్టు కనబడుతుంది అయితే ఇక్కడ రచయిత్రుల పాత్ర హెచ్చు వాళ్ళు జీవితం నుంచి ప్రేరణపొంది నవలలు రాయటం అనేదాన్ని చాలా కాలం క్రితమే భూశయనం చేసేశారు

కథ రాసేవాళ్ళకన్న నవలలు రాసేవాళ్లు జీవితాన్ని యెక్కువ జీర్ణించుకోవాలి వారికి విస్తృతమైన జీవితానుభవం కావాలి ఇవేవీ అవసరం లేకుండా ''మంచి'' నవలలు వస్తున్న పక్షంలో ఎకాడమీ వారు వాటికి బహుమానాలిచ్చినా తప్పులేదు, ఆ నవలలకు ఉండే సాహిత్యపు విలువే ఆ బహుమానానికీ ఉంటుంది ఏనాడో నా ''తార'' అన్న నవలకు బహుమానం ఇచ్చిన ఎకాడమీ గురించి ఇప్పుడు కొత్తగా కనిపెట్టవలసినదేముంటుంది?

*ముద్రణ ఆంధ్రజ్యోతి వారపత్రిక, 31-12-1976*

# 34. సమష్టిగా సాహిత్య పఠనం

పుస్తకాల విలువ రాయటంలోనే గాక, చదవటంలో కూడా వున్నది రాయటంలోకన్న చదవటంలోనే ఎక్కువ ఉన్నది ఇప్పుడుఅంతగా వినిపించటంలేదుగాని, బూర్జువాకళల ఏకప్రయోజనం 'కెథార్సిస్' అని చెప్పేవారు జీవితం వ్యక్తిలో పెంచే కాలుష్యాన్ని మంచి రచనలు క్షాళనం చేస్తాయి ఇది వ్యక్తికీ, కళకూ ఉండే సంబంధం, సమాజానికి కళ ఏం చేస్తుందో తెలీదు

కాని సాహిత్యం సమిష్టిగా మానవులను ప్రభావితులను చెయ్యడం మన సంప్రదాయంలో ప్రాచీనకాలం నుంచీ ఉన్నది మునుల ఆశ్రమాలలో వేదపఠనం సమష్టిగా జరిగేది సామవేదం బృందగానం, యజ్ఞాలప్పుడు చిన్నచిన్న నాటకాలు, ఊర్వశీపురూరవలాటివి ఆడేవారట గ్రీకులు తమ సంస్కృతిని నాటకాల రూపంలో భారీ ఎత్తున వేలాది ప్రజలముందు ప్రదర్శించేవారు

ఈ సంప్రదాయం మనదేశంలో పోలేదు పురాణ పఠనాలూ, హరికథా కాలక్షేపాలూ, అప్పుడప్పుడూ సన్యాసుల ప్రవచనాలు మన సనాతన సంస్కృతిని ఆధునిక సంస్కృతికన్న ప్రజలలో ఎక్కువ సజీవంగా వుంచాయి బుర్రకథలూ, జముకుల కథలూ పురాణాలను ప్రచారం చెయ్యకపోయినా, మధ్యకాలపు వీరగాథలను ప్రజలముందు కొంత వరకు సజీవంగా ఉంచాయి

ఆధునిక కాలానికి వస్తే, ఉప్పు సత్యాగ్రహాలూ, శాసనోల్లంఘనాలూ ఆమయి జరిగిన రోజుల్లో అతి చిన్న గ్రామాలలో కూడా, ఉదయం పత్రిక (ఆంధ్రపత్రిక) రాగానే ఒక ఖద్దరు కట్టిన మేధావి ఏ గుడి ఆవరణలోనో కూర్చొని, పత్రికా సంపాదకీయమూ, రాజకీయ వార్తలూ చదవడమూ, పదిమందీ విని వ్యాఖ్యానాలు చేస్తూ రాజకీయ భావాలు దిమ్మిసా సేసుకోవటమూ నాకు తెలుసు ఈ సమిష్టిపత్రికా పఠనంవల్ల కాదా రాజకీయ పరిజ్ఞానం లేని కోట్లాది భారతీయులు తప్పనిసరిగా కాంగ్రెసు అభిమానులయింది? ఉచ్ఛ దశలో ఇండియాయే కాంగ్రెసు (క్షీణదశలో ఇండియా ఇందిర ప్రమాణానికి కుంచించుకుపోయిందనుకోండి )

చెప్పొచ్చిందేమంటే, మందిని సాహిత్యం ప్రభావితం చేయవలసిన అవసరం వెనకబడిపోలేదు కాని ఆధునిక అభ్యుదయ రచనలకు ఇలాటి ప్రచారంలేదు

కాలచోషం పట్టిన పురాణాలు, భగవద్గీతలూ, భాగవతార్ల ద్వారా, రేడియోలోనూ, దూరదర్శనిలో సైతం ప్రచారం అవుతూనే ఉన్నాయి, ఏ పార్కుల్లోనైనా జనం చేరి రేడియో వార్తలు వినవచ్చును కాని వార్తలు చదివేవాడు వినే వారిలో ఒకడు కాడు ఏ వార్తలను ఎవరు ఎంత నిర్లిప్తతతో ఆలకించేదీ అంచనా కట్టానికి కూడా లేదు ఆ వార్తలైనా ప్రజలకు సంబంధించినవిగా ఉండవు ఇరవై వాక్యాలలో 19 'చెప్పారు''తో ఆఖరవుతాయి ఏ మంత్రి లేక ఏ మరొకడు ఏ సందర్భంలో ఏం చెప్పాడో అదీ వార్త కోట్లాది ప్రజలకు ఏం జరుగుతున్నదో,వాళ్ళు ఏం చేస్తున్నారో వార్తలలో వుండదు ప్రజలకు అలాంటి వార్తా సాహిత్యంతో తాదాత్మ్యం ఎందుకు ఉండాలి ?

ఈనాడు సాహిత్యం పేరుతో వచ్చే మాటల వరద నూరేళ్ళ కొకసారి వచ్చేది కాదు వారంవారం, నెలనెలా వచ్చేది - సామూహిక పఠనానికి పనికిరాకపోవచ్చు కాని పాలకులకూ, పాలితులకూ మధ్య ఉన్న వైరుధ్యాలూ, మళ్ళీ మాట్లాడితే వైషమ్యాలూ, బ్రిటిషు వారినాటి కన్నా ఈనాడు ఏమీ తక్కువకావు ఎక్కువేమోకూడానూ! ప్రజలమీద అతి క్రూరమైన చట్టాలు ప్రయోగించటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి ప్రజల డబ్బు కోట్ల కొద్దీ దుర్వినియోగం అవుతున్నది మనది బ్రిటిషు వారి వలసగా ఉన్నప్పుడు కూడా జరగని ఆర్థిక దోపిడీ స్వాతంత్ర్యం తరువాత యధేచ్ఛగా సాగింది రాజకీయ రంగంలోనే కులాల దురన్యాయం ఎన్నడూ లేనంతగా పుంజుకున్నది

ఇలాంటి దారుణాలు ప్రజలకు తెలియకుండా తగు జాగ్రత్తలు శ్రీమతి గాంధీ తీసుకున్నది ఎమర్జెన్సీ పెట్టింది కాని జనతా పార్టీ వచ్చి ఎమర్జెన్సీ ద్వారం మూసి చిన్న చిన్న కలుగులు ఏర్పాటు చేస్తున్నది బీహారులో ఎమర్జెన్సీ విలయతాండవం చేస్తున్నట్టు వార్తలు వస్తున్నాయి

నిజం దాచటం సాధ్యంకాదు ప్రజలు కొందరు అనుకున్నంత రాజకీయ పిజ్ఞులు గాని, రాజకీయమూర్ఖులుకాని కాకపోవచ్చు కాని వారంవారం దేశపురాజకీయ జీవితాన్ని విమర్శిస్తూ వెలువడే వ్యాసాలను సమిష్టిగా చదివి, జీర్ణించుకునేపరిస్థితి ఉన్నట్టయితే, రెండు నెలలకాలంలో ప్రజలు తమ రాజకీయాలను తాము శాసించగల రాజకీయ విజ్ఞత సంపాదించగలుగుతారు

ఏనాటి ఉత్తమ సాహిత్యమైనా ప్రజలను ఒక సంస్కృతీ పథంలో ఉంచి ఒక జాతిగా రూపొందించాలంటే అది సమిష్టి పఠనం ద్వారా మాత్రమే సాధ్యం విప్లవ సాహిత్యం

లయినప్పటికీ ఎవరికెట్టుకువారు చదువుకుని, కాసేపు ఆవేశించెంది, అవితల పెట్టేస్తే అదిచివటి నేలలోపడిన విత్తనమే

ఫిలిం సొసైటీలలాగా ప్రతి గ్రామంలోనూ రాజకీయ సాహిత్య పఠనానికి సంఘాలు ఏర్పడి "నిజం" చెప్పే పత్రికలూ, పుస్తకాలు తెప్పించి, సమిష్టిగా చదవడం మొదలు పెడితే, దాని ప్రభావం ఎంతైనా ఉండవచ్చు ఇది ప్రత్యేక రాజకీయ పార్టీల విభజనను అనుసరించి ఉండనవసరంలేదు ఏక రాజకీయ లక్ష్యంగల వారి మధ్య వారికి కావలసిన సమిష్టి భావ బు ఉంటూ ఉన్నాయి రాజకీయ పరిజ్ఞానంలేక, నిర్లిప్తంగానూ, అయోమయంలోనూ వున్నవారికే ఇది ఎక్కువ లాభిస్తుంది

*ముద్రణ ఆంధ్రజ్యోతి దినపత్రిక, 28-1-1979*

# 35. ఉత్త కథలను, ఉత్తమ కథలను వేరుచేయగల విమర్శకులు కావాలి

ఉత్తమ సాహిత్యాన్ని అనేక విధాల నిర్వచించవచ్చు కాని అలాటి సాహిత్యానికి - ఈ సందర్భంలో కథలకు - సాంస్కృతిక చరిత్రలో శాశ్వతమైన స్థానం ఉండితీరాలి ఇది లేనిది "కాలక్షేప" సాహిత్యం ఈనాడు కథా కాలక్షేపానికి ఎక్కువ ఆదరణ ఉండటానికి కారణం సంస్కృతి గురించి చింతలేని పాఠకులు అపారంగా పెరిగిపోవడం

అయితే, కాలక్షేపానికి గాను పనికివచ్చే సాహిత్యం ఏనాడూ ఉన్నది అయిదారుశాతం అక్షరాస్యులు ఉన్నప్పుడు కూడా హరికథా కాలక్షేపాలతోపాటు, ప్రాచీన సాహిత్యపు రూపాలు-నాటకాలూ, పురాణపఠనాలు, వీధి భాగవతాలు, బుర్రకథలు వగైరా- అనేకంగా ఉండేవి ఇవి ఎప్పటి సంస్కృతినో ప్రతిబింబించాయిగాని, వర్తమాన-శ్రోతల-ప్రేక్షకుల సంస్కృతిని ఏమాత్రమూ ప్రతిబింబించలేదు ఈనాడు పత్రికలలోనే "మంచి" సాహిత్యం పుట్టిందనుకోవడం పొరపాటు అక్షరాస్యత పెరిగిన కొద్దీ "కాలక్షేపం" కోసం ఇతరుల మీద - అంటే హరిదాసులు, పౌరాణికులు, బుర్రకథలవాళ్ళు వగైరాలమీద - ఆధారపడకుండా అధిక సంఖ్యాకులకు పత్రికలు తోడ్పడుతున్నాయి నిరక్షరులకు సినిమాలు తోడ్పడుతున్నాయి

సుమారు నూరేళ్ళ క్రితం ఆధునిక సాహిత్యయుగం ఆరంభమైందనుకుంటే, వర్తమాన సంస్కృతిని ఆనాటి రచయితలు ప్రతిబింబించిన దానికన్న ఈనాటి రచయితలే ఇంకా సమర్థతలో ప్రతిబింబించగలుగుతున్నారని నా నమ్మకం తొలి "ఆధునిక" సాహితీపరులకు సరైన "సంచితం" లేదు నమూనాలు లేవు వాళ్ళు చాలావరకు పాశ్చాత్య సాహిత్యం నుంచి "ఆధునికత" అనేది ఎలావుండాలో గ్రహించారు ఈనాటి కథలలో ఉత్తమ సాహిత్యంఅని ఎంచుకోగలిగినవి కిందటి తరాల కథకులు రాయగలిగి వుండేవారని నేను అనుకోను

ఉత్తమ కథలు అధిక సంఖ్యలో రావాలనుకోవడం దురాశ నన్నడిగితే తగినన్ని మంచి కథలు రాకపోవడం లేదు ఈనాటి సమస్య, ఉత్తమ కథలు కావలసిన వారికి అవి ఎక్కడ ఎప్పుడు వెలువడుతున్నదీ తెలియకపోవటం పరమ చెత్తకథలు పదింటి మధ్య ఒక

రిన్నేమూణ్యేంలాంటి కథ ఉండటం నేను ఎరుగుదును నీటినివేరు చెయ్యటానికి విమర్శకులు, విమర్శవేయగల పాఠకులు పూనుకోవాలి పాఠకుల లేఖలు ఇందుకు ఉపయోగించవచ్చు కాని, ఉపయోగించడంలేదు

సమకాలీన సమస్యలమీద మంచి కథలు రావాలంటే చాలా ఒనగూడాలి సమస్య గురించి రచయితకు పరిజ్ఞానం వుండాలి దాన్ని గురించి ఒక సాంస్కృతిక దృక్పథం (కమిట్‌మెంట్ లాటిది) ఉండాలి ఆపైన చెయ్యి తిరిగిన రచయిత అయివుండాలి కథలు రాసే వారంతా రావిశాస్త్రులూ, కాళీపట్నం రామారావులూ కాలేరు

ప్రతి పత్రికా ఏడాదికి ఒకసారిగాని, రెండు, మూడు, నాలుగుసార్లుగాని గట్టి విమర్శకుల సహాయంతో తాను ప్రచురించిన కథలలో ఉత్తమ రచనలను ఏరి, వాటికి బహుమానాలివ్వకపోయినా, పబ్లిసిటీ ఇస్తే అలాంటి కథలను పబ్లిషర్లు ధైర్యంగా పుస్తకాలుగా తీసుకురాగలుగుతారేమో!

*ముద్రణ ఆంధ్రజ్యోతి దినపత్రిక, 6-5-79*

# 36. సరైన విమర్శ రానిదే సరైన సాహిత్యం రాదు

ఈనాటి సాహిత్యంలో ఆయోమయం చాలా వున్నదనడానికి సందేహంలేదు రచనలలో వర్గీకరణలేదు ఒకే పత్రికలోని ఒకే సంచికలో అనేక దిక్కులు చూస్తున్న రచనలు వుండవచ్చు అదేవిధంగా పుస్తక సమీక్షలు - సాహిత్య సముద్రంలో కాకిరెట్టలు - రకరకాల సామాజిక దృక్పథం గల రచనలను ఒకే జాతివని భ్రమకలిగే లాగుండవచ్చు

సాధారణంగా విమర్శలని చెప్పుకోదగినవి కాకతాళీయంగా ఏ సంపాదక లేఖలోనో దృగ్గోచరమై సాహిత్య పిపాసగలవాడికి దాని విలువ తెలిసివొస్తుంది

ఒక్కొక్కప్పుడు పుస్తకాలకు గ్రంథకర్తేతరుడు రాసే ''ముందు మాటలు'' విచిత్రంగా ఆ పుస్తకం మీద విమర్శగా తయారవుతాయి, పుస్తకాన్ని మరెవరైనా చేత కాకుండా విమర్శించి పోతారేమోనని భయ పడేటట్టుగా ''ముందుమాట''తో విమర్శకుడి ముందుకాళ్ళకు బంధాలు వేసే రసజ్ఞులున్నారు మనలో

ఇవిగాక సింహావలోకనాలు అప్పుడప్పుడూ వెలువడుతూ వుంటాయి ఇవి సాహిత్య చరిత్రను చిత్రించినంత సమర్థంగా విమర్శల ప్రయోజనాన్ని సాధించవు

ఇవాళ ఎంత సాహిత్య ప్రియత్వం గలవాడు కూడా వచ్చే పుస్తకాలన్నీ, పత్రికలనీ కొనలేడు కొన్నా సాంతం చదవలేడు అలా చదవాలని పూనుకుంటే వాడికి ఆహార నిద్రలకూ, ఇతర వ్యాపకాలకూ సమయం చిక్కదు బెర్నార్డ్‌షా ఏనాడో అన్నట్టు, ఏదయినా చదవగలవాళ్ళు కొందరు వుండవచ్చు, ఏదైనా తాగేవాళ్ళూ, ఏదైనా తినేవాళ్ళూ ఎవరితోనైనా పోయేవాళ్ళలాగ అలాటివాళ్ళ అభిరుచి గురించీ, విచక్షణా జ్ఞానం గురించీ చెప్పుకోలేం

## మంచి అభిరుచి

అలాటి పరిస్థితిలో మంచి అభిరుచీ, విచక్షణా కలవాడికి తనకు కావలసిన సాహిత్యం ఎక్కడ వున్నదో తెలుసుకునే మార్గం ఏమిటి? నేడిక్కడ ఉన్నతాభిరుచులను గురించి

మాత్రమే చెప్పడంలేదు ఏరకం అభిరుచిగలవాళ్ళకైనా ఈ సమస్య వుండనే వుంటుంది డిటెక్టివు సాహిత్యం మాత్రమే కావాలనుకునేవాణ్ణి తీసుకుందాం అలాటివాడుకూడా నాలుగు చెత్తడిటెక్టివ్ నవలలు చదివి తనకున్న అభిరుచికూడా పోగొట్టుకుంటాడు సెక్స్ సాహిత్యానికి కూడా ఇదే గతి పట్టుతున్నదని విన్నాను అదే విధంగా " అత్యుత్తమ" కథ చదివి ఆనందించగలవాడు వరసగా యాభై చెత్త కథలు చదివి తెనాలి రామలింగడి పిల్లి పాలు చూసి బెదిరినట్టుగా కథలంటే బెదిరిపోతాడు

మంచి సాహిత్యాభిరుచి గల వాళ్ళలో సాహిత్యం వల్ల నిస్పృహ, ఏదైనా చదవగలవాళ్ళ కోసం పత్రికలలో సాహిత్యం బళ్ళకొద్దీ తయారవుతూ, అదే పుస్తకాల లోకి సినిమాలలోకి ఒలుకుతూండడమూ ప్రత్యక్షంగా కనిపిస్తుంది

ఈ విధంగా సమాజంలో సాహిత్యాభిలాష - లేక మరో కళాభిలాష - క్షీణించడం వల్ల సమాజస్వరూపం అనారోగ్యం కావటమూ, క్షీణసంస్కృతులు విజృంభించటమూలాంటి దుష్ఫలితాలకు దారితీస్తుంది సాంస్కృతికంగా శిథిలమవుతున్న సమాజం రాజకీయంగాగాని, ఆర్థికంగాగాని పురోగమించగలదనడానికి చరిత్రలో ఆధారం కనపడదు మీదు మిక్కిలి అలాటి సమాజాలు దారుణమైన పరిణామాలు పొందాయి యాదవకులంలో ముసలం పుట్టినట్టు ఈనాటి కుళ్ళిపోయి, పరిపాలనలో విడాకులు పుచ్చుకుని, పదవీ వ్యామోహంతో చావు దశలో ఉన్న రాజకీయాలు, దేశనుంటటా పెచ్చుపెరిగిపోతున్న హత్యలూ, అధికార దుర్వినియోగాలు, నివారించ దగిన ఘోర ప్రమాదాలూ చూస్తూంటే సంస్కృతి ద్వారా పుష్టి పొందదగిన సామాజిక దార్ఢ్యం ఎంతగా దెబ్బతిన్నదో తెలుస్తుంది

## వర్గన్యాయం

ఆటవిక జాతులు సైతం తమ సమాజానికి చెందినవాణ్ణి దోచుకోవడమూ చంపటమూ ఘోరనేరాలుగా భావించేవాళ్ళు అది వర్గ సమాజంలో కనీసం వర్గ న్యాయంగానైనా నిలిచి వుండవలసింది కాని ఈనాడు వ్యక్తి స్వార్థం కోసం ఎవరిని ఎవరైనా చంపుకోవచ్చు ఇది వర్గ సంస్కృతీ దానిద్వారా వర్గ స్పృహలేని పరిస్థితి

మళ్ళీ సాహిత్యానికి వద్దాం మనది వర్గ సమాజం అయినప్పుడు సాహిత్యంలో కనీసం వర్గ దృక్పథమైనా బలంగా కనిపిస్తున్నదా అని ప్రశ్నించుకోవాలి అంటే ఇన్ని వేలమంది రచయితలకూ వర్గచైతన్యం వున్నదా అన్నది ప్రశ్న లేనట్టు స్పష్టంగా కనబడుతుంది

ఉద్యమ ప్రేరితంకాని సాహిత్యంలో రచయిత ఊహాలోకాలలో విహరించుతూ, కొన్ని కృత్రిమాదర్శాలను ఆశ్రయించి ఆ ఆదర్శాలను వైకెత్తే విధంగా జీవితాన్ని చిత్రించవచ్చు అది ఏ వర్గానికి చెందిన జీవితముకాదు అందులో ఒక గొప్ప "నీతి"కూడా వుంటుంది ఉదాహరణకు గొప్ప భూస్వామి తనపాలేరు కొడుకును చదివించి, ఐ ఎ ఎస్ పాస్ చేయిస్తాడు లేకపోతే ఒక గొప్ప ఫ్యాక్టరీ యజమాని తనకూతుర్ని కార్మికుడికిచ్చి పెళ్ళి చేస్తాడు ఆ మధ్యమ సాహిత్యం జీవితాన్ని అవాస్తవంగా చిత్రించడమే గాక, జీవితం నుంచి రావలసిన వర్గ చైతన్యాన్ని సైతం జోకొట్టుతుంది రోజూ వెయ్యిమంది శ్రమను దోచి లక్షలు సంపాదించి, ఏడాదికొకసారి వెయ్యి మందికి దానధర్మాలు చేసే పారిశ్రామికుడి కథ దోపిడికి మేలి ముసుగులా పని చేస్తుంది

దేశ జానాభాలో ఒక శాతం కూడాలేని మేధావి వర్గానికి తమ సంస్కృతిని, తమ సాహిత్యాన్ని అంటగట్టి, మొత్తం దేశ ప్రజలనందరిని బ్రిటీషువారు బానిస కూపంలోకి తోయగలిగారు ఆ సంస్కృతి ఆర్థికంగా కూడా కలిసివస్తే ఇక చెప్పే దేమిటి? ఏ సంస్కృతిని పెంపొందించని రచనలూ, సినిమాలూ ఆర్థికంగా గిట్టుబాటు అవుతూవుండడం మన జాతికి పట్టిన రోగం తాలూకు లక్షణంకాదా?

ఏదైనా చదవగలవారికి ఏ అభిప్రాయమూ లేకపోవచ్చుగాని, సాహిత్యాన్ని, ఇతర కళలను సంస్కృతీ సాధనాలుగా పరిగణించే వారందరూ ఈనాడు ''వాస్తవికత'' కావాలని కోరుకుంటారు వాస్తవికమో అందరూ తెలుసుకోగలరా? వ్యవసాయరంగం గురించి ఏమీ తెలియని వాళ్ళు గ్రామీణ జీవితం గురించిన రచన వాస్తవికంగా వున్నదో, అభూతకల్పనో తెలుసుకోగలడా? అలాగే ఒకదానికొకటి సంబంధించకుండా జీవితంలో అనేక రంగాలున్నాయి వాటిని గురించి, ''ఇంటిమేట్''గా రాయగల వాళ్ళున్నారు అలాగే బొంబాయి ఫోటోగ్రఫీ జీవతమూ వగైరాను గురించి అబద్దాలు రాస్తే తెలుసుకోలేని పాఠకులు కోట్ల కొద్దీ ఉంటారు ఇతర దేశాలకు సంబంధించిన సాహిత్యం మాట చెప్పనే అక్కర్లేదు

ఇలాంటి సమస్యలన్నిటికీ ఒకే ఒక పరిష్కారం సరి అయిన విమర్శ

## సరైన విమర్శ

మనం అచ్చుగా మన ప్రాంతానికి చెందిన రచనలే చదువం మనదేశంలో ఇతర ప్రాంతాలకు, భాషలకు చెందిన రచనలనూ, ఇతర దేశాలకు చెందిన రచనలనూ అనువదించుకుంటాం లేదా వాటి అనువాదాలను మనకు తెలిసిన భాషలో చదువుతాం కాని ఆ మాతృకలను గురించి మంచి విమర్శలు చదవకుండా వాటిలోని వాస్తవికతను మనం ఎలా తెలుసుకోగలం తెలుగు జీవితంగురించి అభూతకల్పనలు రాస్తే తీసి అవతలపారేసే పాఠకుడు అలాటి అభూత కల్పనలు ఏ బెంగాలీ సాహిత్యానికో ఇతర దేశాల సాహిత్యానికో సంబంధించినవైతే అప్యాయంగా చదివేస్తాడు ! ఈ పరిస్థితిని ఏమనాలి, మనం ప్రపంచంలో ఎక్కడెక్కడి ప్రజలజీవితాన్ని గురించి తెలుసుకోవలసిన అవసరం ఉన్నది కాని సరి అయన విమర్శతో పడగట్టిన సాహిత్యం మాత్రమే మనకు ఉపకరిస్తుంది అది లేని చోట అరాజకమే

రచనలలో వర్గస్వభావం వుంటుందని అభ్యుదయ సాహిత్యవాదం గుర్తించింది కాని ఇందులో కూడా కొంత అతిశయోక్తి ఉన్నది ఉత్పత్తి అయే సాహిత్యమంతా వర్గ స్వభావం కలదే అనుకొనే పక్షంలో రచయితలందరికీ వర్గచైతన్యం వున్నదని నమ్మవలసి వస్తుంది కాని ఇది నిజంకాదు కాఫీకి రికాణాలేనివాడు ధనికుల జీవితమాధుర్యం గురించి పగటి కలలు చిత్రించవచ్చు కొత్తగా కలం పట్టిన రచయిత్రీమణులు ఇంపాలా కార్లలో తిరిగే యువ పారిశ్రామికులు అనాథ హీరోయిన్లను ప్రేమించడం గురించి హిస్టీరియా తెల్పుకోవచ్చు ఏదీ లేకుండా ఏదో ఇంగ్లీషులో చదివి దాన్ని తెలుగులోకి దించెయ్యవచ్చు

## అవతలి బొమ్మ

దీనికి అవతలి బొమ్మ కూడా ఉంటుంది కీర్తికోసం ఒక రచయిత పేదల కష్టాలను గురించి హృదయ విదారకంగా రాసి గొప్ప అభ్యుదయ రచయిత అనిపించుకోవచ్చు అదే

ఎధంగా జీవితంలో విప్లవ సూత్రాలు పాటించనివాడు కలంలో విప్లవించవచ్చు నమూనా తెలియాలేగాని జైల్లో పెట్టరన్న గ్యారంటీ చూసుకొని ఎవరు ఏరకం రచన అయినా చెయ్యవచ్చు

ఇటువంటి దిగుల్బాజీ వ్యాపారాలను సరి అయిన విమర్శ తప్ప మరి ఏదీ బయట పెట్టలేదు విమర్శ కూడా దగుల్బాజీది కావచ్చు అందుచేత విమర్శకూడా విమర్శకు గురికావాలి

సాహిత్య సాంస్కృతిక విమర్శ కావాలి కుక్కలాగ పని చెయ్యందే సాహిత్యానికి వర్తమానంగాని, భవిష్యత్తుగాని లేదు ఆ మాటకువొస్తే సాహిత్యం తాలూకు గతం కూడా విమర్శమీదనే ఆధారపడి వున్నది ఎందుకంటే, మల్లినాధసూరి సంజీవనీ వ్యాఖ్యలాగా, గల సాహిత్యంలో ఉత్తమమైన దాన్ని విమర్శ సజీవంగా ఉంచకపోతే ఎన్నో ఉత్తమ రచనలు, కిందటేటి సినిమాలలాగా కాలగర్భంలో కలసిపోయే ప్రమాదం ఉన్నది

విమర్శకుడు తప్పనిసరిగా రచయిత కన్నా రెండాకులు ఎక్కువ చదివినవాడై వుండాలి విమర్శకుడికి అలాటి ఉన్నతస్థితి రాకపోతే భట్రాజు పొగడ్తలో, విద్వేషపూరితంగా విషం కక్కటాలో విమర్శ స్థానం ఆక్రమిస్తాయి

*ముద్రణ ఆంధ్రజ్యోతి దినపత్రిక, 17-11-1979*

## 37. రెండురకాల సాహిత్యం

శ్రీశ్రీ చాలా ఏళ్ళుగా తెలుగు వాళ్ళకు ఇతరులకు కూడా రెండు రకాల సాహిత్యం వున్నదని జ్ఞాపకం చేస్తే వస్తున్నాడు ఘరానావాళ్ళమనుకునే వాళ్ళు తమ సాహిత్యాన్ని సృష్టించుకుంటూవుంటే శ్రామికులు తమ పాటలు, పదాలు, కథలు తాము సృష్టించు కుంటున్నారు ఒకటి శిష్టుల సాహిత్యం అయితే, రెండోది జానపద సాహిత్యం

అలాగే వెల్చేరు నారాయణరావు ఆశుసాహిత్యం, లిఖిత సాహిత్యం అనేరెండు రకాల సాహిత్యం గురించి విపులంగా చర్చించాడు ఆశుసాహిత్యాన్ని మౌలిక సాహిత్యం అనవచ్చునన్న ఊహ వినవచ్చింది

ఇలా సాహిత్యాన్ని రకరకాలుగా విశ్లేషించుకుంటూ పోవచ్చు కాని, సాహిత్య ప్రయోజనం దృష్ట్యా వర్గీకరణ జరగాలి మౌలిక సాహిత్యం మార్పులు చేర్పులూ చెందవచ్చు నూతన పరిస్థితులను ప్రతిబింబించవచ్చు కాని, మౌఖికంగా వుండిన వేదవేదాంగాలు 14వ శతాబ్దిలో లిఖిత సాహిత్యంగా రూపొందాయి అవి ఎన్నడూ ఎలాటి మార్పు చెందలేదంటున్నారు

నేనిప్పుడు చెప్పబోయే రెండు రకాల సాహిత్యంపైన చెప్పినలాంటిదికాదు

ఒక రకం సాహిత్యం మనమందరమూ సాహిత్యంగా గుర్తించేది అది అఖండమైనది అది ఏ భాషకు చెందివుంటుందో ఆ భాష మాట్లాడేవారి సంస్కృతినీ, ఆ సంస్కృతిలో కలగే మార్పులనూ ప్రతిబింబిస్తూపోతుంది అది ఆ జాతి తాలూకు సాంస్కృతిక చరిత్ర అని చెప్పవచ్చు దానికి ఒక చరిత్ర వుంటుంది

ఈ సాహిత్యం అచ్చుగా పై వర్గాల జీవితాన్నే ప్రతిబింబించాలని ఏమీలేదు ఇందులో అట్టడుగునారి జీవితం కూడా చిత్రించబడవచ్చు సంస్కృత చాటువులలో దారిద్ర్యాన్ని గురించి ఘాటైన శ్లోకాలున్నాయి కాని, ఇది అట్టడుగు వాళ్ళు సృష్టించే సాహిత్యం

మటుకు కాదు. రెండో రకం సాహిత్యం కూడా ఒక సంస్కృతిని ప్రతిబింబిస్తుంది. అది ఎప్పుగా అట్టడుగు వారిదే కానవసరంలేదు. కాని అది ప్రతిబింబించేది ప్రాంతీయ సంస్కృతి. అందుకు ఉపయోగపడే భాషను మాండలిక భాష అంటాము.

మాండలిక భాషలో సాహిత్యం రచించకూడదన్నది కృత్రిమమైన నియమం. ఒక భాష మాట్లాడేవారు అనేక ప్రాంతాలలో వున్నప్పుడు ఏ రచన అయినా ప్రాంతీయమైనదే అవుతుంది. అలాంటపుడు మాండలికం కాని భాష అంటూ ఎక్కడ వుంటుంది? అది సాధ్యం కాదు.

కాని ఇవాళ మనం మాండలిక భాష గురించి మాట్లాడ గలుగుతున్నామంటే దానికి కారణం కొన్ని ప్రాంతాలలో వాడుకలో వున్న భాషలో చాలాకాలంగా సాహిత్యం వెలువడలేదు.

నిజానికి సాహిత్యంలో అన్ని ప్రాంతాలవాడుకలో వున్న పదజాలానికి, నుడికారాలకు చోటున్నది. నేను అఖండ సాహిత్యం అంటున్నది అన్ని ప్రాంతాల వాళ్ళను సాంస్కృతికంగా ఏకం చేసేది.

గాలెటీ తెలుగు వ్యావహారిక భాషకు నిఘంటువు రాసినపుడు కృష్ణా, గుంటూరు జిల్లాల భాషను ప్రమాణంగా తీసుకున్నట్టు జ్ఞాపకం. కాని గోదావరి, విశాఖ జిల్లాల నుంచి ఆధునిక సాహిత్యం బోలెడంత వచ్చింది. అందులోని భాష ప్రాంతీయ మనిపించదు ఈనాడు.

అలాగే సురవరం ప్రతాపరెడ్డి తెలంగాణా ప్రాంతపు భాషలో కొన్ని కథలు రాశారు. ఇటీవల ఆ భాషలో నవలలూ, కథలూ, పాటలూ పుష్కలంగా వస్తున్నాయి. ఇలాంటి రచనలు తెలుగువారందరి సొత్తు అయిననాడు మాండలిక భాష అనే సమస్య ఉండదు.

అక్కడ సాహిత్యం ప్రధాన కర్తవ్యం. ఒక భాషకు చెందిన వారి మధ్య ఐక్యత సాధించడం. ఆ సాహిత్యం ఆ ఆశయం ఒకవొంక నింపాదిగా - దశాబ్దాల మీదట సాధిస్తూంటే ఇంకొక పక్క ప్రాంతీయ ప్రజలను చైతన్యవంతులను చేయటానికి వారి జీవితాన్ని, చైతన్యాన్ని ప్రయత్నించడానికి ప్రాంతీయ రచన.

ఇలా సృష్టి అయ్యే సాహిత్యం అఖండం కాదు. జీవితంలో ఆకస్మిక పరివర్తనలు కలిగి వాటిని బలపరచడానికి తగిన పరిణతి అఖండ సాహిత్యంలో లేనప్పుడు నూతన పరిణామాన్ని సూచించేటందుకు సృష్టి అయ్యే సాహిత్యం వేరు వేరు ప్రాంతాలలో వేరు వేరుగా వుండడం జరుగుతుంది.

జాతీయోద్యమం సాగినప్పుడు తెలుగుదేశం ఇతర ప్రాంతాలలో సృష్టి అయిన పాటలూ, పదాలు తెలంగాణాలో పనికిరాలేదు. "మా కొద్దీ తెల్ల దొరతనమూ" "స్వదేశము లోనే సదానిందాముల్" "తరిగాంధీయుగమే లాండెలె రండో భారతీయ ప్రజల్" లాంటిభావాలు నిజాము పరిపాలనలో సతమతమవుతున్న వారిని స్పృశించి వుండడం సాధ్యంకాదు.

"మీరు ప్రజాకవేనా?" అని మీటింగుల్లో శ్రీశ్రీని ఎవరన్నా అడిగితే శ్రీశ్రీ తాను ప్రజాకవికానని ఒప్పుకుంటూ అందుకు కారణం తెలుగువారిలో 70 శాతం నిరక్షరులు కావడం అని చెప్పాడు.

కాని, నా ఉద్దేశంలో తెలుగు వాళ్ళు నూటికి నూరుపాళ్ళూ అక్షరాస్యులే అయినా అన్ని ప్రాంతాలకు చెందిన ప్రజా సాహిత్యం అఖండ సాహిత్యంలోకి చేరిపోయి, ప్రత్యేక ప్రాంతీయ సాహిత్యమంటూ లేకుండా పోయేదాకా శ్రీశ్రీ రచనలు పూర్తిగా అన్ని ప్రాంతాల అందరు

ప్రజలను చైతన్యవంతులను చేయలేదని నా అనుమానం. అక్షరాస్యత వినడానికి అడ్డంరాదు గదా! శ్రీశ్రీ కవిత్వం చదివి వినిపిస్తే అన్ని ప్రాంతాలకు చెందిన అందరూ ఉత్తేజితులు కాగలరా? నాకు అలా తోచదు.

అదేవిధంగా గద్దర్, వంగపండు రాసిన పాటలు తీసుకుంటే అవి ప్రాంతీయ భాషలతో పరిచయం ఉన్న వారినందరినీ ఉత్తేజపరుస్తాయి. కాని అవి తెలంగాణా ప్రాంతంలో అట్టడుగు వారిని కదిలించినట్టు తెలుగుదేశం అన్ని ప్రాంతాలలో వుండే అట్టడుగు వారినీ కదిలించగలవా? ఇదీ అనుమానమే.

అన్ని ప్రాంతాలను ఏకం చేసేది ఒక విధంగా సాహిత్యమైతే, అంతకన్న జీవితం మరింత బలంగా ఏకం చెయ్యగలదు. ఒక జాతికంతటికీ ఒక తీవ్రసమస్య వచ్చిపడినప్పుడు దాన్ని సమిష్టిగా ఎదుర్కొనడానికి అన్ని ప్రాంతాల వారూ ఒకే సాంస్కృతికవైఖరినీ, ప్రమాణాలనూ అవలంబించి, ఆమోదించాలి.

ఇందుకు రంగం అప్పటికప్పుడు సిద్ధం చేసుకునే కన్న అఖండ సాహిత్యాన్ని ప్రాంతీయ రచనలతో పరిపుష్టం చేసుకుంటూ పోతే జాతీయ సమైక్యత సమకూరుతుంది.

దేశం ఏకంగా వలస విధానాన్ని ప్రతిఘటించవలసిన సమయం ఎదురైనప్పుడు జాతీయ సమైక్యతకు దోహదం చేసినది హిందీకాదు, ఇంగ్లీషు. అలాంటి పరిస్థితిలో ప్రాంతీయ ఆధిక్యతల కోసం హిందీని వాడాలని ఉత్తర దేశపు రాజకీయవాదులు ప్రయత్నిస్తుంటే జాతీయ విచ్ఛిన్నతకు మార్గం ఏర్పడుతుంది. హిందీ భాషా సాహిత్యాలు స్వాతంత్ర్యానికి ముందే దేశ ప్రజలను ఏకం చేసి ఉంటే ఇవాళ జాతీయ సమైక్యత ఒక సమస్యగా మిగిలి వుండకపోను.

అదేవిధంగా తెలుగు దేశంలో వున్న అన్ని ప్రాంతాల తెలుగులోను ఉత్తమ సాహిత్యం వచ్చి అఖండ సాహిత్యంలో చేరడం భవిష్యత్తుకు ఎంతో ఉపయోగం. ఇవాళ ఆంధ్రదేశం అన్ని ప్రాంతాలలో గొప్ప రచయితలున్నారు. కాని అందరూ ఒకే సాహిత్య భాష రాస్తున్నారు. రాచకొండ విశాఖపట్నం జిల్లా భాషలో రాసినట్టుగా, కాళీపట్నం శ్రీకాకుళం భాషలో రాసినట్టుగా విరసం రచయితలు తెలంగాణా భాషలో రాస్తున్నట్టుగా సాహిత్యం విరివిగా వచ్చి అఖండ సాహిత్యాన్ని పరిపుష్టం చెయ్యాలి. ఈ ఒక్క విషయంలోనైనా విప్లవ సాహిత్యోద్యమం ఇతర పాత సాహిత్యోద్యమాలకన్న ముందుకు పోయిందని ఒప్పుకోవాలి.

విరసం బొత్తిగా రాజకీయ స్వభావంగలది అనుకుని అపోహపడేవాళ్ళు ఒక్క సంగతి గమనించడంలేదు. ఉత్తమమైన విరసం గేయాలు - తెలంగాణా అట్టడుగువాళ్ళ భాషలో - గద్దర్ లాటివాళ్ళు పాడితే శరీరాలు పులకరిస్తున్నవి విప్లవకారులకు మాత్రమేకాదు సాహిత్యాభిమానులైన విప్లవ వ్యతిరేకులకు కూడాను. ఇది కొత్త విషయం కాదు. 35 ఏళ్ళ క్రితం గూడవల్లి రామబ్రహ్మం గారిని ఆహ్వానించి "మాభూమి" నాటకం చూపిస్తే, ఆయన పరవశంచెంది పోయాడు - కావడానికి కమ్యూనిస్టు వ్యతిరేకే! అసలు రహస్యం ఏమిటంటే కళలలో నిజమైన ఆకర్షణ అది ప్రతిబింబించే సంస్కృతినుంచి ఏర్పడుతుంది, అది ఒక రకం రాజకీయవాదాన్ని బలపరిచే పక్షంలో ఆ రాజకీయవాదం సజీవం అనుకోవాలి. అలా అనుకోవడం ఇష్టం లేని వాళ్ళు కళల సమస్యలను కాపు చేస్తున్నారు.

*ముద్రణ ఆంధ్రజ్యోతి, 4-5-1980*

# 38. విమర్శకు జవాబు

''ఆంధ్రజ్యోతి'' మే 4వ తేదీ సంచికలో వెలువడిన సాహిత్య వ్యాసానికి మిత్రులు ''జ్యేష్ఠ''గారు 19వ తేదీ పత్రికలో విమర్శ రాశారు కాని నేను వ్రాసిన వ్యాసానికి, వారు విమర్శించిన వ్యాసానికి ఏమంత సంబంధం ఉన్నట్టు కనబడదు ''జ్యేష్ఠ''గారికి సాహిత్యం గురించి కొన్ని ఘాటైన సిద్ధాంతాలున్నాయి వాటిని '' ఆంధ్రజ్యోతి'' పాఠకులు ఎరుగుదురు నాకుగూడా సాహిత్యం గురించి సిద్ధాంతాలు లేకపోలేదు కాని యాదృచ్ఛికంగా ఈ సారి నా రెండు రకాల సాహిత్య వ్యాసం సిద్ధాంతాలకు సంబంధించినది కాదు కేవలం అన్వేషణతో కూడుకున్నది అయినా, దాన్ని ''జ్యేష్ఠ'' గారు సిద్ధాంతపరమైన వ్యాసంగానే ఉపయోగించుకోగలిగారు

ఆయన విమర్శ ''రెండు రకాల సాహిత్యం ఎందుకు?'' అని అడుగుతున్నది సాహిత్యంలో ఒకరకమైన ద్వంద్వంకాదు, చాలా రకాలున్నాయి నా వ్యాసంలో రెండు రకాల ద్వంద్వాలను ప్రస్తావించి మూడోదాన్ని గురించి వ్యాసం రాశాను ' ఎందుకు!' అన్న ప్రశ్నకు సమాధానం ''వున్నాయిగనక!'

''జ్యేష్ఠ'' గారు సనాతన సంప్రదాయం చెడకుండా తమ విమర్శ బొత్తిగా శాస్త్రీయవిమర్శ అయిపోకుండా, రెండు పేరాలలో సూర్యచంద్రులను, వాటి గ్రహణాలను, గ్రహణస్నానాలను ఉపోద్ఘాతించి, అసలు విషయానికి వొస్తూనే

'రెండు రకాల సాహిత్యం ఏ రెండురకాలో, వాటి లక్షణాలు ఏమిటో ప్రయోజనం ఏమిటో ఏమాత్రమూ చర్చించలేదు'' అని నన్ను దిగ్భ్రాంతుణ్ణి చేశారు ఎందుకంటే నావ్యాసమంతా అదే చర్చించాననుకున్నాను కాని ''జ్యేష్ఠ''గారు ఈ మాట నామీద వారికిగల స్నేహభావంతో అన్నారుగాని వారికి అర్థంగాక కాదని మరుక్షణమే తెలిసిపోయింది ''కారణం అది నిజానికి ఒకరకం సాహిత్యానికి వకాల్తా పట్టడమే'' ఏరెండు రకాల సాహిత్యం గురించి రాశానో ''జ్యేష్ఠ'' గారికి తెలుసు అటువంటి మరోగమ్మత్తు గూడా ఆ మూడో పేరాలో వుంది ' ఈ ఒక్క విషయంలోనయినా విప్లవ సాహిత్యోద్యమం ఇతర సాహిత్యోద్యమాలకన్నా ముందుకు పోయిందని ఒప్పుకోవాలి'' ఎందుకు ఒప్పుకోవాలో ఆయనవివరించలేదు' అన్నారు ఏమీ చెప్పకుండానే నేను '' ఈ ఒక్క విషయంలోనైనా'' అన్నానా? '' ఎందుకు ఒప్పుకోవో నేను చెబుతాను అన్నది జ్యేష్ఠగారి వ్యాసానికి ఆయువుపట్టు అది చెప్పడం కోసం నా అన్వేషణ (రిసెర్చి మరీ పెద్దమాటకదా) ఆయన ఉపయోగించుకున్నారు

విప్లవ సాహిత్యం పేరు చెబితే జబ్బుచేసేవారిని మార్చడానికి నేను రెండు సాహిత్యాల వ్యాసం రాయలేదు 'జ్యేష్ఠ' గారు రూఢిగా నమ్మవచ్చు నేను జానపద సాహిత్యం గురించి గూడా రాయలేదు జ్యేష్ఠగారి కోసం కాకపోయినా, ఆయన వ్యాసం చదివి నా అసలు అభిప్రాయాలు తెలుసుకునే అవకాశం లేకుండాపోయిన వారికోసం ఇప్పుడు కొంచెం చర్విత చర్వణం చేస్తాను

నేను ప్రస్తావించిన రెండు రకాల సాహిత్యం, ఒకటి సంప్రదాయ సాహిత్యం ఇది అవిచ్ఛిన్నంగా వ్రాస్తూ జాతి సాంస్కృతిక చరిత్రను ప్రతి బింబిస్తున్నది రెండోది ఇందులో చోటుచేసుకోలేకుండా, ఎక్కడికక్కడ తెగి పోతూ వస్తున్న ''ప్రజల'' సాహిత్యం ఇందువల్ల

పైకి కొట్టవచ్చినట్టు కనబడినా ఫలితం ఏమిటంటే సాహిత్య భాష, మాండలిక భాష అన్న ద్వంద్వం నిజానికి సాహిత్య భాష కూడా మాండలికమైనది కాని ఉత్తమ సాహిత్య రచనలు దానికి సంప్రదాయ సాహిత్యంలో చోటువుండేటట్టు చేశాయి గ్రాంధికభాషా వాదం తెలుగు సాహిత్యానికి అపకారం చేసిందని ఈనాడు సాహితీ పరులు అందరూ ఒప్పుకుంటారు కాని ఒకప్పుడు కవిరాజుగారి లాటి అభ్యుదయవాదులు కూడా ఆ మాట ఒప్పుకోలేదు ఇవాళ 'మాండలిక' (ప్రజల ప్రాంతీయ) భాషలలో మంచి సాహిత్యం వెలువడుతున్నది రావిశాస్త్రిగారి విశాఖ జిల్లా భాషా, కాళీపట్నం రామారావుగారి శ్రీకాకుళంజిల్లా భాషా, చాలాకాలం క్రితమే సురవరపు ప్రతాపరెడ్డిగారి తెలంగాణాభాషా, ఇటీవల అల్లరాజయ్య తెలంగాణా అధోగతివాళ్ళ భాషా మంచి రచనల ద్వారా సంప్రదాయ సాహిత్యంలో ప్రవేశించవలసి ఉన్నాయి

అభ్యుదయ సాహిత్యోద్యమం ప్రారంభమైనప్పుడు దాన్ని ప్రోత్సహించినది కమ్యూనిస్టుపార్టీ కావడంతో సాహిత్యంగా గౌరవించదగిన రచనలను కమ్యూనిస్టు విద్వేషంతో వెలిపెట్టారు కొందరు కాని నిజమైన కళాత్మష్టగల వారుసాహిత్యానికి రాజకీయరంగు పూయకుండా గూడవల్లి రామబ్రహ్మంగారి లాగా 'మాభూమి' లాటి నాటకాన్ని మెచ్చుకున్నారు దాన్ని మెచ్చుకోగానే రామబ్రహ్మంగారు కమ్యూనిస్టు వ్యతిరేకతను పక్కనపెట్టలేదు ఈ చిన్న విషయాన్ని 'జ్యేష్ఠ' గారికి అర్థమయ్యేటట్టు నేనురాయలేకపోతే నాలోపం అయివుండాలి మరి!

సిద్ధాంత సాహిత్యాన్ని మాత్రమే పార్టీ సాహిత్యం అంటారు అల్లం రాజయ్య నవల "కొలిమి అంటుకున్నది", భూషణం కథ "అడివంటుకున్నది" లాంటివి, విప్లవ సాహిత్యోద్యమం అభినందించగానే, అవి రాజకీయ పార్టీ రచనలు అయిపోవు బ్రిటీషువాళ్ళు "మాలపల్లి"ని రాజకీయ నవల అనుకున్నారు మనకు జ్ఞాపకశక్తి చాలదు గతం నుంచి నేర్చుకోలేం శాస్త్రీయంగా ఆలోచించవలసినదాన్ని గురించి ఆవేశపడిపోయి కిందికి తోయదలచిన వాళ్ళను బలవంతాన పైకెత్తి, కొక్కిరింపులూ, వెక్కిరింపులు ఉంటేగాని విమర్శకాదనుకునే దుస్థితిలో ఉన్నాం

ప్రస్తుతం నేను విప్లవ సాహిత్యం కాపుకాసే అర్హతగలవాణ్ణి కాదు నేను విప్లవ సాహిత్యం రచించనూలేదు ప్రస్తుతంలో సాహిత్య గౌరవంగల విప్లవ సాహిత్యం ధారాళంగా వస్తున్నట్టు కూడా నేను భావించడంలేదు నా రెండురకాల సాహిత్యం వ్యాసం ప్రధానంగా సంప్రదాయ సాహిత్యం గురించే! అందులో అన్ని ప్రాంతాల భాషా ఏనాడో చేరిపోయి, అది పరిపుష్టం అయి ఉండవలసింది అది జరిగి ఉన్నట్టయితే రెండు రకాల సాహిత్యం ఉండే పనిలేదు రాబర్టు బర్న్ తన 'విప్లవ' కవిత్వాన్ని తన ప్రాంతీయ భాషలో రాశారు దానికి సంప్రదాయ ఇంగ్లీషు సాహిత్యంలో ఉన్నత స్థానం లభించడానికి "రాజకీయాలు" అడ్డురాలేదు మనం ఈనాడు కూడా 'ప్రాంతీయ' భాష, 'మాండలిక' పదజాలమూ అంటూ ఒకపక్క రాజకీయ విద్వేషంతో మరొకపక్క, సంప్రదాయ సాహిత్యానికి సంకెళ్ళు వేస్తున్నామా లేదా ?

నా మొదటి వ్యాసం స్పష్టంగా లేని వారికి ఇది అయినా బోధపడుతుందని ఆశిస్తున్నాను ఇది కూడా అర్థంకాక ఎవరికైనా ' ఎలర్జీ' కలిగితే నా భావాలు స్పష్టం చేయడానికి ఇంకో వ్యాసం రాయడానికి కూడా నేను సిద్ధమే

*ముద్రణ ఆంధ్రజ్యోతి దినపత్రిక, 25-5-1980*
*పునర్ముద్రణ కళలూ - శాస్త్రీయ విజ్ఞానం,*
*విరసం ప్రచురణ, సెప్టెంబరు 1980*

# 1. 'అభ్యుదయ'కి

ఆర్యా,

అభ్యుదయ చదివాను కిందటి సంచిక కంటె బాగున్నది అనిశెట్టిపీ, తెన్నేటి సూరిపీ, శ్రీశ్రీపీ గేయాలు ప్రత్యేకించి బాగున్నాయి కుందుర్తీ, గిడుతూరి వారి రచనలు ఆశాశూన్యంగా, నిరాశాజనకంగా ఉన్నాయి అవి అభ్యుదయ రచనలు కావని నా అభిప్రాయం జాస్తి సీతారాందాసు రచనలో కవిత్వం లోపించిందని నాకు తోచింది 'రచయితల కర్తవ్యం'లో హెచ్చరిక అభ్యుదయ రచయిత సాటి అభ్యుదయ రచయితలకు చెయ్యవలసినది కాదు గాంధీజీ హత్య గురించీ, దాని వెనక వున్న వాతావరణం గురించీ అభ్యుదయ రచయితలకు తెలియదని 'అభ్యుదయ' ద్వారా స్ఫురింపజేయటం ఉచితంకాదేమో! గిడుగు వారి వర్ధంతి గురించీ, నాట్యకళా పరిషత్తు గురించీ వార్తలు ప్రచురించటం నా బుద్ధికి సరిగా తోచలేదు ఆ సందర్భాల్లో చేసిన ఉపన్యాసాలను పురస్కరించుకుని అభ్యుదయ సంపాదకీయాలు రాయటం ఉచితంగా ఉండేది 'ప్రగతి' కోసం అన్ని పేజీలు వ్యయపరచటం వృథాయేమో!

*ముద్రణ అభ్యుదయ, మాసపత్రిక, మార్చి 1948*

# 2. 'సృజన'కి

చలం సంచిక చదివాను చలం రచనలు చదవటం మేలనిపించింది చలం విమర్శకులు మనస్సుకు జబ్బు తెప్పించారు

*సృజన 8వ సంచిక, ఆగస్టు-అక్టోబరు, 1968*

# 3. సీతారాం గారికి

మద్రాసు
1-2-69

శ్రీ గరిమెళ్ల వెంకట సీతారాం గారికి,

నమస్కారాలు మీ జనవరి 28 ఉత్తరం అందింది ఆంధ్ర వారపత్రిక నేను చూడటం లేదు ప్రభ వారపత్రికయినా పుస్తక సమీక్ష ఉంటే కాపీ వస్తుంది కాని సామాన్యంగా చదువను నాకు తీరిక ఉండదు జ్యోతి వారపత్రికలో మీ కథ చదివాను అందులోని విషయాలు వ్యాసంలో ఇమడవనుకొంటాను ఆ కథ గురించి నేనేమైనా తప్పుబట్టదలిస్తే అది కథకు పనికిరాని విషయమని మటుకు కాదు

Management లో human relations సరిగా లేకపోవటం నేనూ గమనించాను కాని అందువల్ల నష్టపోయిన కేసు ఒక్కటీ చూడలేదు బహుశా కారణం, exploited class పై వాళ్లు humour చేస్తే మోసపోని దశకు రావటమేనేమో Management తన naked స్వరూపాన్ని చూపి కూడా It can get away with it అది కథలోనే ఉన్నది మీ Hero లాగ

పైనాణ్ణి ఏమన్నా చెయ్యగలిగాడా? Business relations కు సంబంధించిన classical conception ప్రకారం employer and employed ఇద్దరూ Free persons, వాస్తవంగా కాదు అది వాళ్లకూ తెలుసు, నీళ్లకూ తెలుసు అందుచేత employer employee ని fool చెయ్యటానికి శ్రమించనవసరం లేదు మనం domestic servants ను ఇంకా fool చెయ్యగల స్థితిలోనే ఉన్నాం Domestics కు class consciousness లేకపోవడంచేత వాళ్ళింకా feudal relations పాటిస్తున్నారు అందుచేత రెండు రకాల employment కూ parallel అంతగా లేదనుకొంటున్నాను

నాకు తోచిన ఈ విషయాలు మీరు మరో కథ రాయటానికి అంతగా ఉపయోగించే అవకాశం లేదు ఎవరి అభిప్రాయాలూ అంతగా పాటించకుండా జీవితం నుంచి ప్రేరణ లభించినమేరకు కథలు రాస్తూ వెళ్లండి ఈనాడు ప్రత్యేక కథలకున్న ఆదరణకన్న కథకులకు హెచ్చు ఆదరణ ఉన్నది నా మిత్రులొకరు చెప్పినట్టు ఆధునిక తెలుగు సాహిత్యంలో ఒకటి రెండు మంచి కథలు రాసిన వారు అనేక డజన్ల మంది ఉన్నారు అనేక కథలు రాసిన మీదటగాని కథకుడి సామాజిక సాహిత్య స్వరూపం రూపుపట్టదు

*ఈ లేఖ (1-2-1969)ని గరిమెళ్ళ వెంకట సీతారాం గారు*
*తన 'హ్యాట్సాఫ్ టు కాంతం' అనే కథల సంపుటి పుస్తకం*
*(సెప్టెంబరు 1981)లో అచ్చు వేశారు*

## 4. చలం 'లేఖ' గురించి

అయ్యా,

జయశ్రీ సెప్టెంబరు సంచికలో పుష్కరం దాటిన చలంగారి ఉత్తరం ఏ మహదాశయంతో ప్రచురించారో బోధపడదు అది సాహిత్య ప్రపంచంలో కొందరికైనా బాధ కలిగిస్తుందని మీరు గ్రహించకపోవటం శోచనీయం

బాస్వెల్ మనస్తత్వం గల వారుంటారని నాకు తెలుసు కాని అంతమాత్రం చేత వాళ్ళు "పంపు" చేసేవాళ్ళంతా జాన్సన్‌లని కాని, వాళ్ళకి వాళ్ళు జగద్విఖ్యాతి చేకూర్చుతారని గాని అనుకోనవసరం లేదు అవతలివాళ్ళ కీర్తిచంద్రికలలో తాము కూడా ప్రవేశించాలన్న దురాశ తప్ప మన నాటు "బాస్వెల్"లకు మరో ఆలోచన ఉన్నట్టు కనబడదు

19-2-57న చలంగారు ఏమిటి రాశారు? " ఏ పుస్తకాలు చదవడానికి తీరిక" లేని చలం గారు "పందిరి మల్లికార్జునరావుగారిని ఓసారి కలుసుకున్నాను ఆయనను గురించి నా అనుభవంలోకి మంచి ఏమీ రాలేదు" అంటున్నారు పోనీ చెడు ఏమన్నా అనుభవంలోకి వచ్చిందేమో అదీ చెప్పిన వారు కాలేదు ఆయనను గురించి తనకేమీ తెలీదని చెబితే సరిపోయేదానికి ఈ తేలుకొండి వాక్యం దేనికి?

పందిరి మల్లికార్జునరావుగారు సాహిత్యరంగానికి అంతో ఇంతో సేవ చేసిన వారు సాహిత్యరంగంలో చాలా పెద్దమెట్లు మీద ఉన్న చలంగారికి ఆకాస్త మంచి కూడా తెలియలేదంటే దానికి ఆయన సాహిత్య ప్రపంచానికి కూడా ఉద్వాసన చెప్పి ఉండాలి అందులో తప్పేమీ లేదు కాని అలాంటి మనిషికి సాహితీప్రియులను గురించిన అభిప్రాయాలుంటే వాటిని పత్రిక ద్వారా ప్రచారం చెయ్యటం సబబా?

"విద్వాన్ విశ్వాన్ని, ఎరుగనని చెప్పడానికి సంతోషంగా ఉంది " ఈ మాటను బట్టి విద్వాన్ విశ్వంగారిని గురించి ఏమీ తెలియడం లేదు కాని చలంగారిని గురించి కొంత తెలుస్తున్నది!

ఈ తేలుకొండి విదిలింపులు చలం గారిచ్చిన "Sermon" తో అతక్కపోవటం మాట దేవుడెరుగు ఈ ఉత్తరం ప్రచురణకు పంపిన వారు నిజంగా చలం గారికి కీర్తి తేవాలనే పంపారా? జయశ్రీ వారు ఎందుకు వేశారు? ఇది తెలియటం లేదు

ఇక్ష్వాకుల కాలంలో రాయటం ప్రారంభించిన మాబోటివాళ్ళకు అడపాదడపా "భక్తులు" ఏవేవో రాస్తుంటారు వారిని రంజింపజెయ్యటానికీ, మా అసలుతత్వం దాచుకునే అవసరం కనబడక ఏవేవో జవాబులిస్తుంటాం వాటిని పత్రికల వారు జాగ్రత్తగా పరిశీలించి, అందులో పది మందికీ పనికివచ్చేది ఏమన్నా ఉంటేనే వెయ్యాలి బాలగంగాధర్‌తిలక్ లేఖలు పుస్తకంగా రావటం తిలక్‌కు చాలా అపచారం చేసినట్టు రివ్యూలు చదివితే తెలిసింది ఇకనైనా "జీనియస్"లు మేలుకుని తమ "బాస్వెల్"లను గురించి జాగ్రత్తపడుదురుగాక

*జయశ్రీ, మాసపత్రిక, అక్టోబరు 1969*

# 5. ఆగ్రహం

వాంతి చేసుకునే వాణ్ణి చూసి ఇతరులు వాంతి చేసుకోరు దిగంబరకవులు ద్వేషించేదంతా నేను ద్వేషించేదే కాని దిగంబరకవులు ఈ ద్వేషాన్ని ప్రజల్లో పుట్టించడం అనవసరం

*ముద్రణ తరుణ, మాసపత్రిక, డిశెంబరు 1969*

# 6. 'మరో జలియన్ వాలాబాగ్' కథ మీద

మరువాడ రాజేశ్వర్రావు రాసిన మరో జలియన్‌వాలాబాగ్ సంఘటన దిబ్బలో నిజంగానే జరిగింది అంతమాత్రం చేత దిబ్బలోడెమో స్వామ్యం(లేక ప్రజాస్వామ్యం) లేదని ఎవరూ కలలో కూడా అపోహపడరాదు దిబ్బలో నిత్యమూ ప్రజలకూ, పోలీసులకూ జరిగే సంఘర్షణ ఈ విషయాన్ని ఘట్టిగా రుజువు చేస్తుంది దిబ్బ ప్రపంచంలోకెల్లా అతి చిన్న డెమోక్రసీ అంటారు కాని అక్కడి ప్రజలు తమ హక్కుల కోసం ధారపోసే క్వింటాళ్ళ రక్తమే అందుకు నిదర్శనం

అయితే, పోలీసులను అధికారులు అదుపులో ఉంచరాదా అని అడగవచ్చు (గిట్టనివాళ్లు, అధికారులేపోలీసులను ప్రజలపైకి ఉసికొల్పుతున్నారని కూడా అనటంకద్దు ఇది అన్యాయం!) అధికార్లు మాత్రం ఏం చెయ్యగిలరు? పోలీసులు ఎసెన్షల్ సర్వీసెస్ గదా! వాళ్ళు ఎన్నడూ సమ్మెలూ, చట్టబండలూ చెయ్యరు, తమ పనిని అత్యంత ఉత్సాహంతో నెరవేరుస్తూ ఉంటారు వాళ్ళ క్రమశిక్షణ అద్భుతం వాళ్ళకు రాజకీయాలు లేవు ఇంత ఆదర్శప్రాయమైన సర్వీసు దిబ్బలో మరేదీ లేదంటే అతిశయోక్తి కాదు వారిలో లోపించిందల్లా అహింసాత్మక గాంధేయ దృక్పథం

అందుచేత పోలీసుల నిమిత్తం అహింసాయుత గాంధీ భజన స్తోత్రరత్నావళి అన్న రికార్డుల పరంపర ప్రత్యేకంగా దిబ్బ రేడియోలో ప్రసారం చేస్తున్నారు అయితే అది ప్రారంభం కాగానే కరెంటు పోయింది ఇది హింసావాదులైన నక్సలైటు బందిపోటుల చర్య అని శంకించబడుతున్నది దిబ్బలో నక్సలైటు హింసావాదులు సర్వవ్యాప్తంగా ఉన్నట్టు ఈ మూలంగా రుజువు కావటం చేతను పోలీసుల ఆవశ్యకత మరింతగా వెల్లడి అయినందున పంచవర్ష ప్రణాళికతో బాటు ఈ ప్రసారాలను అధికారులు వాయిదా వేశారు

దిబ్బ ప్రజలను దిబ్బ ప్రఖ్యాతి ఉన్నతాధికారుల పట్ల గల అవ్యాజానురాగాలను గురించి ఇక్కడ ఒక్క ముక్క చెప్పటం అనవసరం కాకుండా ఉండకపోవటానికి ఎలాటి సందేహమూ లేదనటానికి వీల్లేకపోలేదు - అంటే ఎంతైనా అవసరమని నా తాత్పర్యం

ఉదాహరణకు, పైన పేర్కొన్న మ రా "మరో" సంఘటన జరిగిన వారం రోజులకు అదే యొక్క మైదానంలో దిబ్బ ప్రఖ్యులంగారు తమ మృదుమధుర కంఠంతో ప్రజాబాధ్యతను గురించి ఉపన్యాసం ఇచ్చినప్పుడు ఇసకవేస్తే రాలకుండా మూడు లక్షలమంది జనం వచ్చి అత్యంత శ్రద్ధాభక్తులతో ఆలకించి ప్రభువుగారు ఏం చెబుతున్నదీ రిపోర్టర్లు రాసుకొనటానికి వీలు లేకుండా అదే పనిగా కరతాళ ధ్వనులు చేశారు (దరిమిలా "దిబ్బవార్త"లో నేను ప్రచురించినది ప్రభువుగారిని అడిగి రాసుకున్నదే గాని నేను విన్నది కాదు )

"దిబ్బ హింసకు పుట్టినిల్లు" అన్న నినాదం లేవదీసిన వాళ్ల విప్లవ రచయితలు ఉడిగిపోయిన రచయితలూ, ఏ విధంగానూ రచయితలనిపించుకోలేని పామరకవులూ కొందరు కలిసి తీవ్రవాదుల కోపు కాస్తూండటం దిబ్బలో ఆరంభమయింది అయితే వాళ్ళ రచనను దిబ్బలో ఉండే తొమ్మిది కమ్యూనిస్టు పార్టీలలో ఎనిమిది అడపాదడపా తూర్పారబట్టుతూ ఉంటాయి దిబ్బ సంస్కృతి ప్రధానంగా అహింసాత్మకమైనదనీ, అది "రక్తం" అనే మాట వింటేనే మూర్ఛిల్లుతుందని, నిత్యమూ ప్రజలు తమ హక్కుల కోసం ధారపోసే రక్తాన్ని ప్రజాస్వామ్య దృష్ట్యా అది అర్థం చేసుకోగలదు గనక ఆవేశం చెందదని మనవి చేస్తున్నాను

*ముద్రణ ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 14-6-1974*
*మ రా అంటే మరువాడ రాజేశ్వరరావు*
*ఎన్నెస్ ప్రకాశరావు, బి టి రామానుజంలతో పాటు కథలు రాస్తుండేవాడు మొదట్లో విరసం సభ్యుడు ఇప్పుడు అమెరికాలో వుంటున్నాడు*

# 7. సాహిత్యమూ - పత్రికలూ

గత శతాబ్దిలో ఇంగ్లండులో రాబర్ట్ బ్రౌనింగ్ అనే సుప్రసిద్ధ కవి వుండేవాడు అతని భార్య ఎలిజిబెత్ బారెట్-బ్రౌనింగ్ కూడా కవిత్వం రాసేది ఇద్దరూ గొప్ప కవిత్వం రాసిన ప్రసిద్ధులే అయినప్పటికీ, రాబర్ట్ బ్రౌనింగ్ తన ''పద్యం'' ఒక్కటి కూడా పత్రికకు పంపి ఎరగడు

ఒకసారి ఒక పత్రికవాళ్ళు అతనికి పది పౌన్లకు కాబోలు ''చెక్'' పంపుతూ తమ పత్రికలో ప్రచురణకు ఒక్క పద్యం రాసి పంపమన్నారు బ్రౌనింగ్ తాను పత్రికలకు రాయనని చెబుతూ ఆ చెక్ తిప్పి పంపాడు ఈసారి పత్రికవాళ్ళు తమ ''గుమాస్తా'' పొరపాటుకు క్షమాపణ చెప్పుకుంటూ, నూరు పౌనులు పంపటం జరిగిందనీ, తప్పక ఒక కవిత పంపవలసిందనీ కోరారు బ్రౌనింగ్ దాన్ని కూడా తిప్పి పంపేస్తూ, 'నేను పత్రికలకు పద్యాలు రాయను నన్నెందుకు వేధిస్తారు? నా భార్య పత్రికలలో పద్యాలు ప్రచురిస్తుంది ఆమెను కోరండి'' అని రాశాడు

ఈ సంఘటన నుంచి మనం తెలుసుకోదగిన విషయాలు చాలా వున్నాయి నూరుపై చిల్లర ఏళ్ళ క్రితం బ్రిటనులో పత్రికలు ''సాహిత్యం'' ప్రచురించటానికి ఆత్రపడేవి ''సాహితీపరులు'' పత్రికల మీద ఆధారపడకుండా, వారి వర్తక ఔదార్యం లక్ష్యపెట్టకుండా తమ రచనలను పుస్తకాలుగా వెలువరించుకోగలిగేవారు కొందరు సాహితీపరులు ( ఉదా చార్ల్స్ డికెన్స్) తమ రచనలను పత్రికలలో ప్రచురించటానికి సంకోచించలేదు అందుచేత పత్రికలలో మంచి సాహిత్యం రాదన్నమాట బ్రిటన్‌లో ఏనాడూ లేదు

మన దేశంలో పరిస్థితి ఏమిటి? నిన్నమొన్నటి దాకా మన ''ప్రకాశకులు'' ప్రాచీన సాహిత్యాన్నీ పాఠ్యపుస్తకాలనూ ప్రచురించిన వారు ఆధునిక సాహిత్యం అర్భకపుదశలో వున్నప్పుడు కూడా దాన్ని ప్రోత్సహించటానికి పుట్టిన పుస్తక ప్రచురణ సంస్థలు చాలా కొద్ది ప్రజలలో పఠనాసక్తి పెరిగిన తీరుగా సాహిత్యగ్రంథాల ప్రచురణ విస్తరించని మాట నిజం

అలాటి పరిస్థితిలో లక్షలాది పాఠకుల కోసం వందల సంఖ్యలో బయలుదేరిన పత్రికలు సాహిత్యానికి తప్పనిసరిగా వాహకాలయాయి కాకపోతే ఈ పత్రికలు వ్యాపార కారణాల వల్ల అచ్చుగా ఉత్తమ సాహిత్యమే వేస్తాయని కంకణం కట్టుకోలేదు రాశి మీద లఘు సాహిత్యం అధికంగా వుండిన కారణంచేత పత్రికలు అచ్చుగా అదే ప్రచురిస్తున్నట్టు భ్రమ కలిగి వుండవచ్చు కాని అది భ్రమే

ఈ కాలంలో వచ్చే మంచి సాహిత్యం - ముఖ్యంగా కల్పనాసాహిత్యం - ఒక్క శాతమే అనుకున్నా, దాదాపు అది అంతా పత్రికల ద్వారానే వచ్చింది చిత్రం ఏమిటంటే ఈనాడు విరివిగా వున్న పుస్తక ప్రకాశకులు ఉత్తమ సాహిత్యం జోలికి పోవటానికి భయపడుతున్నారు

ఒకటి రెండు ఉదాహరణలు చెబుతాను 1937లో నేను తొలిగా ''యువ ప్రచురణలు'' ప్రారంభించి, చలంగారిని కొన్ని కథలు అడిగితే ఆయన బోలెడన్ని వ్రాతప్రతులు నా ముందుపడేసి, కావలసినవి తీసుకోమన్నారు ఆ రోజుల్లో చలంగారి రచనలు అచ్చువెయ్యటానికి అప్పుడు కొద్ది పత్రికలు భయపడేవి పుస్తకాలు వేసేవాళ్లు లేరు అప్పుడు నేను ''పాపం!!!'' అని ప్రచురించాను పత్రికలు చెయ్యనిపని పుస్తక ప్రచురణకర్తలూ చేయలేదు

నేను నలభై ఏళ్ళ పాటు రాసిన కథలూ, పెద్దకథలూ ఇవాళ ప్రచురించే వాళ్ళు లేరు కాని సాహిత్యంగా ఆ రచనలను ఆదరించే వారు కొద్ది యింకా వున్నారు ఆ మాటకు వస్తే నా రచనల ఆధారంతో డాక్టరేట్ సంపాదించుకున్న వారూ, సంపాదించటానికి ప్రయత్నించిన వారూ వున్నారు ఆ రచనలన్నీ పత్రికలలో వచ్చినవే

మళ్ళా ఒకసారి ఇంగ్లండుకు పోదాం ఒక పుస్తక ప్రచురణకర్త చార్ల్స్ డికెన్స్‌కు ఒక కంట్రాక్టు రాసి ఇస్తూ, ఆయన రాగల నాలుగేళ్ళలోపల చేసే రచనలను తాను పుస్తకాలుగా వేసుకునేటందుకు అడ్వాన్సుగా - పరిష్కారంగా కాదు - 28,000 పౌన్లు ఇచ్చాడు

తెలుగులో ఇటువంటి గౌరవం ''హాట్‌వేవ్'' రచయిత్రులకు కూడా జరిగి వుండదు

ఇవాళ కూడా మంచి సాహిత్యం కావలసిన వారికి అది, సముద్రంలో కాకిరెట్టలాగే అనుకోండి, పత్రికలలోనే దొరకాలి పుస్తకాలలో లభించటం కష్టం ఎప్పటికప్పుడు సృష్టి అయ్యే సాహిత్యం మాట చెబుతున్నాను

*జ్యోతి, మాసపత్రిక, జూన్ 1979*

## 8. కనక్ ప్రవాసిగారికి...

నమస్కారాలు

మీరు నాకు రాసిన లేఖను 'ఆంధ్రజ్యోతి' వారపత్రిక వారు నాకు పంపారు హృదయపూర్వకంగా రాసిన ప్రతి వాక్యమూ నా మనస్సుకు సూటిగా తగిలింది

మా అన్న super genius అని యిప్పటికీ నా నమ్మకం ఆయనకు భయం తెలీదు త్రాచుపాములను తోక పట్టుకుని యెత్తి గిరగిరా తిప్పాడు

నేను స్వీయ చరిత్ర రాయటం జరగదు ఎవరైనా ఆసక్తి కనబరితే కొన్నికొన్ని రంగాలలోనా అనుభవాలు రాయగలను బహుశా 'యువ'లో అలా రాయటానికి ప్రయత్నిస్తాను ఉంటాను

*ముద్రణ ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 3-10-1980*

# 1. విన్నపం

గుడిపాటి వెంకటచలంగారి ''బ్రాహ్మణీకం'' వెలువడిన తరువాత ఎంతో కాలానికి ఈ యువ కధావళి వెలువరించగలిగాము దానికి కారణం సుమారైన కథలు కూడా మాకు అందుబాటులో లేకపోవటమే ఎన్నదగిన కథకులు బహుకొద్దిమంది ఉండటం మూలానే ఇట్లా జరుగుతున్నది అప్పటికే రచయితలూ కథకులూ మాకు చూపుతున్న ఆదరాభిమానాలు లపారంగానే ఉన్నై ఇందుకు మేమెంతో కృతజ్ఞులం

ఎన్నదగిన కథకుల విషయం వచ్చింది కనుక సౌరీస్‌ను గురించి ఒక ముక్క చెప్పితీరాలి ఈమె సుప్రసిద్ధ కథకులు ''చలం''గారి కుమార్తె చాలా పిన్నవయసు కథలు రాసి ప్రకటించుతున్న వారిలో ఇంతకంటె చిన్నవాళ్లెవరూ ఉన్నారనుకోము ఈమె శైలిలో చలంగారి శైలియొక్క పోకడలు కనిపిస్తవి ఈమె రచనా నైపుణ్యాన్ని పరితలే నిర్ణయిస్తారు గాక సౌరీస్ ఉత్తమ కథా రచయితల శ్రేణిలో తప్పక స్థానం సంపాదించుకుంటుందని మా నమ్మకం

*'యువ కధావళి'కి ముందుమాట*

*కథకులు సౌరీస్, మల్లాది రామకృష్ణశాస్త్రి, కొడవటిగంటి కృష్ణమూర్తి,*
*పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రి, కొడవటిగంటి కుటుంబరావు,*
*మొచలి వెంకట సుబ్రహ్మణ్యశర్మ*
*ప్రచురణ యువ ప్రచురణలు, తెనాలి, ఆగస్టు 1936*

# 2. ప్రస్తావన

ఈనాటి తెలుగు సాహిత్యంలో మిగిలిన అన్ని రూపాల కన్నా ప్రశస్తంగా అభివృద్ధిలోకి వచ్చినటువంటివి చిన్న కథా, ఖండ కావ్యమూ, గేయమూనూ ఇది ప్రమాదవశాన గాని, అకారణంగా గాని జరిగిన పరిణామం కాదు ఈనాటి వాతావరణంలో నవలా రచన కన్నా, నాటక రచన కన్నా, వ్యాస రచన కన్నా, పద్య కావ్య రచనకన్నా కథా రచనకూ ఖండకావ్య రచనకూ, గేయ రచనకూ ఎక్కువ ప్రోత్సాహం లభించింది రచయితలలో ఎక్కువమంది ఈ రూపాల సాహిత్యంలో కృషిచేశారు

ఏ యుగంలోనైనప్పటికీ ఏ సాహిత్య స్వరూపంలో ఎక్కువ మంది కృషి చేస్తారో అదే ఉన్నత స్థితికి వచ్చి రాణించగలుగుతుంది నేటి తెలుగు కథ-లేక కథానిక - ఏ ఇతర భాషలలో గల కథకూ తీసిపోదు తెలుగు కథలు రాసే వారి సంఖ్య కూడా చాలా హెచ్చుగా ఉంటున్నది

మన భాషలో చిన్న కథ పైకి రావటానికి తోడ్పడిన భౌతిక శక్తులలో పత్రికలకు అగ్ర స్థానం ఇచ్చి తీరాలి ఈనాడు ఈ పత్రికల సంఖ్య హెచ్చు వీటిలో ఇతర సాహిత్య రూపాలకన్నా చిన్న కథలే హెచ్చుగా ప్రకటితమవుతున్నాయి దేశంలో పరిమిత సంఖ్యాకులైన ప్రజలకు సాహిత్యమనేది అచ్చుగా పత్రికల ద్వారా మాత్రమే లభ్యమవుతోంది ప్రకటనలు వగైరా ఆర్థిక

ఎదుపాయాలుండటం చేతా, విషయ వైవిధ్యాన్ని పురస్కరించుకునీ, ఈ పత్రికలు పుస్తకాల కంటె చౌకగా ఉంటూ, ప్రజాదరణను హెచ్చుగా సంపాదించుకోగలుగుతున్నాయి

రచయితల దృష్టి నుంచి కూడా చిన్న కథలో ఉన్న ఆకర్షణ ఇతర సాహిత్య రూపాలలో - ముఖ్యంగా, దీర్ఘతరమైన నవల, నాటకం, పద్యకావ్యం మొదలైన వాటిలో - లేదు ఈనాడు తెలుగుజాతికి సాహిత్య సృష్టి జీవనోపాధికమైనది కాదు సాహిత్యాభిలాషా, సాహిత్య దక్షతా కల వారు సయితం ఉదర నిమిత్తం మరొక వృత్తి ఏదైనా చూసుకుంటూ తీరిక సమయాలలో సాహిత్య కృషి చేయాలి ఇలాటి స్థితిలో ఉన్న రచయితలు దీర్ఘ రచనలు చేయటం అంతగా సాధ్యం కాదు కవితాశక్తి ఉన్నవాడు ఖండకావ్యమో, గేయమో రచించవచ్చు కాల్పనిక శక్తి కల వాడు కథ రాయవచ్చు ఈ కృషి బొత్తిగా వృథా కావలసిన అవసరం కూడా లేదు ఇలాటి కథలనూ, గేయాలనూ ప్రచురించటానికి సిద్ధంగా ఉన్న పత్రికలనేకం ఉన్నాయి వీటిలో కొన్ని తృణమో పణమో ఇస్తాయి కూడాను

చిన్న కథ యొక్క వ్యాప్తికీ, అభివృద్ధికీ ఇవి సన్నిహిత కారణాలు ఇక, దూర కారణాలు కూడా కొన్ని లేకపోలేదు చిన్న కథ యొక్క స్వరూపంలోనే కొన్ని ఆధునిక జీవిత లక్షణాలున్నాయి

ఈనాటి జీవితం క్లిష్టమైనది దాని అంతరార్థం ఏ ఒక్కరికీ సులభగ్రాహ్యం కాదు సాహిత్య కళ ద్వారా ఈ క్లిష్ట జీవితాన్ని ప్రతిబింబించి, జీవిత సత్యాలను వ్యక్తం చేయాలంటే అసాధారణ ప్రపంచ జ్ఞానం కల వాడికి మాత్రమే సాధ్యమవుతుంది ఈ పరిస్థితిలో చిన్న కథ ఒక మహోపకారం చేస్తోంది చిన్న కథలో ప్రతిబింబితమయే జీవిత శకలం చాలా చిన్నది పరిశ్రమల అభివృద్ధితో ఉత్పత్తి విధానాలలో కార్యవిభజన ఏర్పడిన విధంగా ఈనాటి చిన్న కథల ద్వారా వందమంది వంద జీవిత శకలాలను వంద కథలలో ప్రతిబింబింపజేసి పూర్వపు మహాకవులు ఏకాంతంగా నిర్వహించిన భారాన్ని తమ మధ్య తాము విభజించుకుని పని సులువు చేసుకుంటున్నారు నేటి కథకుడు తనకు పరిచితమైన జీవితాన్నీ, పాత్రలనూ, వాటి అనుభవాలనూ, ఆ అనుభవాల వెనక ఉండే జీవితసత్యాన్నీ మాత్రమే ఆధారంగా చేసుకుని రచన సాగిస్తాడు సాహిత్య కళ సమాజం మొత్తం మీద సాధించదగిన ప్రయోజనానికి తన ''చందా'' తాను ఇచ్చుకుంటాడు ఇందువల్ల ప్రజలకు జీవితపు వివిధ కోణాల అనుభవం అందే అవకాశమూ, జీవితం గురించి విస్తృతమైన జ్ఞానం సంపాదించే అవకాశమూ చిక్కుతున్నాయి మహానగరాలలో వాళ్లు పల్లెటూళ్లను గురించీ, పల్లెటూళ్ల వాళ్లు మహానగరాలను గురించీ తెలుసుకోగలుగుతున్నారు, సంపన్నులు శ్రామికులను గురించీ, శ్రామికులు సంపన్నులను గురించీ తెలుసుకోగలుగుతున్నారు

చిన్నకథలో ఈనాటి ప్రజాస్వామ్యం కూడా ప్రతిబింబితమవుతున్నది సంఘంలో నుంచి ఏ క్షుద్రపాత్రను తీసుకొని అయినా సరే చిన్న కథ రచించవచ్చు పూర్వపు ఆలంకారికులు నిర్వచించినట్టుగా నాయకుడు కొద్ది రకాలకు మాత్రమే చెందాలన్న నియమం ఈనాటి చిన్న కథకు లేదు దాని శిల్పంలో కూడా అంతులేని వైవిధ్యానికి అవకాశాలున్నాయి సౌలభ్యం కూడా ఉంది కథకుడు కథనం తన స్వీయానుభవంగా చెప్పవచ్చు, తన కళ్ల ఎదుట జరిగిన సంఘటనగా చిత్రించవచ్చు లేదా సర్వాంతర్యామి అయిపోయి వేరు వేరు చోట్ల జరిగిన

సంఘటనలనూ, సంభాషణలనూ, వివిధ వ్యక్తుల తమ హృదయాలలో అనుకున్న భావాలనూ ఎంతో సూక్ష్మంగా వర్ణించవచ్చు ఆఖరుకు తాను తన అనుభవంగా వర్ణించి చెప్పే కథలోని సత్యాన్ని తాను అర్థం చేసుకోలేకపోయిన వాడుగా నటిస్తూ కూడా కథనం చేయవచ్చు ఇలాంటి అవకాశాలు నవలలూ నాటకాలూ రాసే వారికి లేవు

పఠిత దృష్ట్యా కూడా చిన్న కథ ఈనాడు అనుకూలమైన సాహిత్య రూపం పెద్ద గ్రంథాలలాగా కాకుండా చిన్న కథలు ఒక్క గుక్కలో, కొద్ది విరామంలో చదవవచ్చు కథ అయిపోయే సమయానికి మొదలు మరిచిపోవలసిన అవసరం లేదు

పైన చెప్పిన విషయాలన్నీ చిన్న కథ యొక్క స్వభావాన్నీ, దానితో రచయితకూ పాఠకుడికీ గల సంబంధాన్నీ సూచిస్తాయి

ఇక చిన్న కథకు గల సామాజిక ప్రయోజనం గురించి ఆలోచింతాం ఇది అన్ని సాహిత్య రూపాలకూ, ఆ మాటకు వస్తే అన్ని కళలకూ, ఒకటిగానే ఉండాలి, ఉంటుంది కూడా జీవితానికి అనేక దృక్కోణాలున్నాయి ఒక కోణం నుంచి చూసేవాడికి ఒక విధంగానూ, ఇంకో కోణం నుంచి చూసే వాడికి ఇంకో విధంగానూ కనిపిస్తుంది జీవితం ఒక ఊరికి రాత్రి పది గంటల బండి మరొక ఊరికి ఉదయం పది గంటల బండి అవుతుంది ఒక స్టేషను విడిచిన బండి పక్క స్టేషనుకు రానున్న బండి అవుతుంది కాని ఈ ''ఉదయం బండి'' ''రాత్రి బండి'', ''పోయిన బండి'' ''వచ్చే బండి'' అన్నవి పాక్షిక సత్యాలు ఆ బండిని గురించి సంఘ ప్రయోజనం ఆలోచించటానికి ఈ పాక్షిక సత్యాలు పనికిరావు కళల విషయంలో కూడా అంతే

సంఘంలో వ్యక్తులు కూడా ఒక కంటికి కనబడినట్టు ఒక కంటికి కనబడదు ధనికులూ, అధికారులూ అర్ధ జిజ్ఞాసువులకు ఆశ్రయించదగిన వారుగా మెప్పించదగిన వారుగా కనబడతారు వారే తమ సేవకులకు కర్కోటకులుగా, రాక్షసులుగా, కోపం వస్తే ప్రమాదం కలిగించగలవారుగా కనిపిస్తారు అదే విధంగా శ్రామికులు ధనికులకు సంస్కారహీనులుగా, అవకాశం దొరికితే ప్రమాదం చెయ్యగలవారుగా కనిపిస్తారు, వారే తమ భార్యలకు తోటి శ్రామికులుగా, శ్రమలో భాగస్వాములుగా తమ పిల్లలకు అన్నదాతలుగా కనిపిస్తారు

కళాకారుడు జీవితంలో తాను చూసే వివిధ వ్యక్తులకూ, వివిధ సంఘటనలకూ సంఘపరంగా విలువ కట్టగలిగినప్పుడే తన కళ ద్వారా సాంఘిక ప్రయోజనాన్ని సాధించగలుగుతాడు

సంఘ జీవి అయిన మానవుడు ఏదో ఒక విధమైన వర్గీకరణకు గురిఅయి దానికి అనుగుణమైన జీవిత దృక్పథాలను అలవరచుకుంటాడు ''నాది ఫలానా కులం'', ''నాది ఫలానా మతం'', ''నాది ఫలానా తరగతి'' అనే భావాల మీద సాంఘిక చైతన్యాన్ని పెంచుకున్న వాడు ఆయా కులాల, మతాల, తరగతుల దృక్కోణం నుంచి జీవితాన్ని అర్థం చేసుకుంటాడు 'నేను అన్ని వర్గాలకూ అతీతుణ్ణి'' అనుకునే వాడు కేవలం ఆత్మవంచన చేసుకుంటాడు ఎందుచేతనంటే సంఘంలో ఇన్ని రకాల వర్గీకరణలకు తావున్న సమయంలో అన్నిటికీ అతీతంగా మెలగాలంటే జీవితానికే దూరం వెళ్ళిపోవాలి ఇది పలాయనతత్వం అవుతుంది అందుచేత కళాకారుడు జీవిత సత్యం ఏ విధమైన వర్గీకరణపై ఆధారపడి ఉన్నదీ ముందుగా,

బుద్ధిపూర్వకంగా నిశ్చయించుకోవాలి అప్పుడే అతని కళ సంఘ ప్రయోజనాన్ని సాధించగలుగుతుంది

నేటి ప్రపంచమంతటా అభ్యుదయవాదులు ఆర్థిక కారణాల వల్ల ఏర్పడే తరగతుల విభజనలో జీవిత వాస్తవం ఉన్నదని విశ్వసిస్తారు ఈ విభజనను పురస్కరించుకుని జరిగే జీవిత సంఘర్షణ ద్వారానే సాంఘిక పరిణామం ముందుకు పోతుందని విశ్వసిస్తారు ఇందులో స్వార్థ ప్రేరణ వుండనవసరం లేదు ఏమంటే అభ్యుదయవాదులు స్వయంగా ఏ వర్గానికి చెందిన వారైనా పీడిత వర్గాల పోరాటాన్ని బలపరుస్తారు, దాన్నే వాస్తవమైన జీవిత పోరాటంగా గుర్తిస్తారు జీవిత సత్యం ఇటే ఉంది

ఇదంతా కమ్యూనిజముకు ప్రచ్ఛన్నరూపమనే క్షుద్రవాదం లేకపోలేదు కమ్యూనిజం క్షుద్రమైనదని కాదు ఈ వాదం ద్వారా కళా ప్రయోజనానికి సంకుచితత్వం ఆపాదించటం క్షుద్ర ప్రక్రియ కమ్యూనిజం అనే మాట పుట్టని కాలంలో బానిసత్వాన్ని అణచటానికీ, సజీవ భార్యలను మృతభర్తల చితుల మీద నుంచి రక్షించటానికీ, నిరంకుశుల దుష్పరిపాలన నుంచి అనాథ ప్రజలను రక్షించటానికీ, దాస్య శృంఖలాల నుండీ సామ్రాజ్యవాదుల నుండీ పీడిత ప్రజాకోటిని రక్షించటానికీ మహోజ్వలమైన ఉద్యమాలు నడిచాయి విప్లవాలు జరిగాయి వాటి ఫలితంగా మానవ చరిత్ర ముందుకు నడిచింది మన కాలంలోనే పీడకుల నుండి పీడిత వర్గాలను రక్షించటానికి కందుకూరి వీరేశలింగం గారు తమ కలాన్ని కత్తిలాగా వినియోగించారు సాంఘిక ప్రయోజనం కొరకు యత్నించే అభ్యుదయ కళలు ఈ మార్గం తొక్కక తప్పదు

ఈ పుస్తకంలోని కథలు రచించిన కథకుడు అభ్యుదయ వాది తన రచనల ద్వారా వాస్తవ జీవితాన్ని చిత్రించి సంఘ ప్రయోజనం సాధించే ఆశయం గల వాడు ఇందులోని పాత్రలన్నీ సజీవంగా వాస్తవంగా ఉంటాయి వాటి చిత్త వృత్తులు కూడా సహజంగా ఉంటాయి జీవితానికీ వివిధ పాత్రలకూ గల సంబంధం రకరకాలుగా చిత్రింపబడింది

'' ఊరేగింపు'' కథలో పోలీసు సాంబయ్య సమ్మె చేసి ప్రదర్శనలిచ్చే కుర్రాళ్ల మీది కాల్పులలో పాల్గొని, వాళ్లు సమ్మె చేస్తున్నది జీతాల హెచ్చింపుకు నిరసనగానన్నది తెలుసుకొంటాడు జీతాల హెచ్చింపునూ తనూ నిరసించిన వాడే! అయినా బారకాసు నుంచి బిగిల్ వినిపించగానే డ్యూటీకి బయలుదేరుతాడు వెనకనుంచి పెళ్లాం '' ఎవర్నీ కాల్చకు నీ పుణ్యముంటుంది'' అంటుంది

''అన్నయ్య వెళ్లిన దారి'' అనే కథలో ఒక మధ్యతరగతి పిల్ల తనకిష్టం లేని పెళ్లికి గురికాబోతూ ''అన్నయ్య వెళ్లిన దారి''కేసి చూస్తుంది అన్నయ్యకూడా పెళ్లి నిశ్చయించారు ''కడిగిన ముత్యం'' లాంటి వావిలాల వారి ఇందిరతో పెళ్లి కాని ఆ పెళ్లి ఇష్టం లేక అన్నయ్య ''మానవజాతి భవిష్యత్తు గురించి'' రాత్రికి రాత్రే ఇల్లు వదిలి ''సిద్దార్థుడు బుద్ధుడు కావడానికి'' వెళ్లినట్టు వెళ్లిపోయాడు ''మాల మట్టేళ్లా మొహం'' నర్సమ్మ కొడుకును పెళ్లి చేసుకోకుండా తప్పించుకోవాలంటే అమ్మాయికి అన్నయ్య వెళ్లినదే దారి

''షష్టిపూర్తి''లో ముత్యాలు సమస్య జమీందారుగారి షష్టిపూర్తికి పది రూపాయలిచ్చుకోడం ఇంకో సమస్య కూతురు వెంకిముండకు పూలు తెచ్చిపెట్టడం వెంకి

ప్రాణన్నా ఆగుతుంది గాని షష్టిపూర్తి ఆగదు ఈ కథలో ముత్యాలుది ఒక ప్రత్యేక పాత్రగాదు, ముత్యాలు సమస్య ఒక ప్రత్యేక సమస్యగాదు దివాణం దుష్పరిపాలనలో నలిగి హతమవుతుండే అశేష జనానికి ముత్యాలు ప్రతినిధి

''పాలికాపు'' రాముడు గాడు పల్లె జీవితం దుర్భరమై బస్తీకి పోయి బావుకుందామని గంపెడాశతో వెళ్లి, తీరా పని దొరికితే తాను సమ్మె చేసే పాకీవాళ్ల పొట్టలు కొడితేనే గాని రెండు రూపాయలు చేతిలో పడవనీ, దేశాన్ని నడిపించిన గాంధీ టోపీలవాళ్లూ ఈ పనే చేస్తున్నారనీ తెలుసుకుంటాడు

''కొత్త పుంతలు'' అనే కథలో పైడితల్లి చుట్టలు కట్టేవాళ్ల చేత సంఘం పెట్టించి సమ్మె చేయిస్తాడు కూలీల జీతం వంద చుట్టలకు అర్ధణా పెంచమంటే షాహుకారు ససేమిరా అంటాడు సమ్మెను పైవాళ్లెవరూ బలపరచరు షావుకారు ఏజెంట్లు భగ్నం చేయడానికి ఎన్ని ఎత్తులైనా వేస్తారు కూలీలు జారిపోయే సమయానికి పైడితల్లి తానే స్వయంగా చుట్టల వ్యాపారం నడపటానికి నిశ్చయించి, వ్యాపారంలో కూలీలకి వాటాలిచ్చేస్తాడు లేబరు చుట్టలు కారుచౌక, ఘాటుగా కాల్తాయి షాహుకారే లేబరు చుట్టలకు ఏజెంటవుతాడు

''అన్నదమ్ముల పంపిళ్లు'', కథలో ఇద్దరన్నదమ్ములు తమతమ సంసారాల సమస్యలు భగ్నం కాగా వాటిని పరిష్కరించుకునేటందుకు వేర్లు పడతారు

కథలన్నిటిలోనూ చిక్కదనం, పట్టుకుంటే చివరిదాకా పాఠకుణ్ణి లాగేసే శిల్పం ఉంది కథనంలో రమ్యత్వం, చదివే దానియందు పాఠకుడికి ఆసక్తి కలిగించే గుణం ఉంది

ఈ రచయిత శైలిలో వేగమూ, ఉత్సాహమూ, ఒక్కొక్క చోట అతి చిత్రమైన ధ్వనీ ఉన్నాయి కథ చదువుతుంటే విరగబూచిన చెట్టును చూస్తున్నట్టుంటుంది అక్కడక్కడా పూలగుత్తుల్లాటి మాటలు కనిపిస్తాయి '' ఊరేగింపు చాలా దగ్గరసా జరిగింది ఉత్సవం లాంటి ఊరేగింపు! దేవతల ఊరేగింపు!'' ''అన్నయ్యలాంటి అన్నయ్యలంతా చేతులూ చేతులూ కలిపి గొలుసు కడతారట ఆ గొలుసే మానవజాతి భవిష్యత్తును రక్షిస్తుందట!'' 'చెరువంటే చెరువా! వొజారవా చెరువు! గోదావరి కాలవ విడిచిపెట్టేసరికి నీరు గలగలమని మువ్వల మోతలు చేసుకుంటూ చెరువంతా నింపుతుంది తొలిచూలు ఆడమహాలక్ష్మిలా వుంటుంది చెరువు మన్నుమేట వేసి అయిదారేళ్లయి బోర్లించిన కడవలాగయి పోయింది కానీ ప్రతి ఏటా చంటిపిల్లలా మన్ను తింటేచెరువు గర్భంలో బల్లపెరుగకమానుతుందా!'' ''సీత గుండె బాదుకుని ఏడిచింది! పెద్ద చెరువంత ఏడుపు! దివాణం చెరువంత ఏడుపు!'' ''చీపుళ్లు పుచ్చుకుని గాంధీ టోపీలు తుడుచుకుపోతున్నాయి, వెనకటి తమ ఉజ్వల పాత్రను భారతదేశ చరిత్రలోంచి తామే తుడిచి పారవేసుకుంటున్నట్టు!'' ఇలాటి వాక్యాలు ఈ కథలలో అసంఖ్యాకాలుగా ఉండి, పుస్తకం మూసివేసినాక కూడా పాఠకుడి చెవుల్లో గింగురుమంటూ ఉంటాయి ఈ కథలలోని భాషలో ప్రాంతీయ నుడికారమూ జాతీయ నుడికారమూ పాత్ర నుడికారమూ కుప్పతెప్పలుగా గోచరిస్తుంది

ఈనాటి కథకులలో అభ్యుదయ భావాలూ వాస్తవిక దృక్పథమూ బాగానే విస్తరించి ఉన్నప్పటికీ, జీవిత పోరాటానికి సన్నిహితంగా ఉండి, ఆ పోరాటంలో ప్రముఖ పాత్ర నిర్వహించే ప్రజల మనస్తత్వాలనూ పరిసరాలనూ జీర్ణం చేసుకొని కథలు రచిస్తున్న కథకులు

బహుకొద్దిమంది ఆ కొద్దిమందిలో ఈ రచయితకు మంచి స్థానమున్నదని నిస్సంకోచంగా చెప్పవచ్చు ఈ కథలను చదివిన యువ రచయితలు తాము కథారచన చెయ్యటానికి కొత్త ఉత్సాహాన్ని ఈ కథలు ద్వారా పొందగలుగుతారని నా నమ్మకం

*అవసరాల సూర్యారావు కథల సంపుటి*
*'ఆకాశదీపాలు'కి ముందుమాట, 1954*

# 3. గ్రంథ పరిచయం

ఈ పుస్తకం కథకులుకాగారే వారికి ఉపయుక్తంగా ఉండటానికి రచించినది గ్రంథకర్త అనుభవం గల కథకుడు ఆయన సేకరించిన అభిప్రాయా లలో పాశ్చాత్యుల అభిప్రాయాలు కూడా ఉన్నాయి నిజానికి ఈనాటి కథాస్వరూపం మనం పాశ్చాత్యులనుంచి అరువు తెచ్చుకున్నదే కాని ఈనాడు దానిని మనం స్వంతం చేసుకుని కథల ద్వారా మన జాతీయ జీవితాన్ని ప్రతిబింబించగలుగుతున్నాం

నేటి తెలుగు సాహిత్యంలో అన్నిటికన్న ముందుకు వచ్చిన స్వరూపమూ, కొత్త రచయితలను బలంగా ఆకర్షించేదీ కథ అందుచేత ఈ పుస్తకంలో చెప్పబడిన విషయాలు చాలా మందికి ఉపయుక్తంగా ఉండగలవనటానికి సందేహం లేదు

ఎవరు గాని కథకులు కావటానికి కొన్ని దశలున్నాయి లందులో మొట్టమొదటిది కథల మీది లక్ష్యం ఈ లక్ష్యం వ్యామోహం కంటె హెచ్చు విమర్శనాదృష్టితో కూడుకున్నది కథలపై వ్యామోహం ఉండేవారు చాలా మంది ఉన్నారు కాని వారెన్నటికీ కథలు రాయలేరు వందలాది కథలు చదవటమే గాక కథకుడు కథనంలో ఏమి నైపుణ్యం వినియోగపరిచాడో శ్రద్ధగా చాలా కాలం ఆలోచించిన మీదట భావి కథకుడికి పునాది ఏర్పడుతుంది (కవిత్వమైనా, సంగీతమైనా, చిత్రలేఖనమైనా,నటన అయినా అంతే )

రెండవ దశ శిల్పంలో సాధన ఈ దశలో కథకుడు ఇతివృత్తం గురించి కన్న రచనా విధానం మీద అధికారం సంపాదించుకొనటానికి యత్నించాలి సామాన్య సంఘటనలు తీసుకొని వాటిని రక్తిగా కథలల్లటం అభ్యసించాలి ఏదైనా కథ చదివినప్పుడు ''దాన్ని అంత కన్న బాగా రాసే అవకాశం ఉందా?'' అని ఆలోచించాలి ఇది తపస్సులాంటిది ఈ దశలో బుర్ర అస్తమానం పాత్రలను సృష్టించటంలోనూ, సన్నివేశాలు కల్పించటంలోనూ, సంఘటనలను కథాక్రమంలో అమర్చటంలోనూ నిమగ్నమై ఉండాలి ఈ దశలో చేసే రచనలను సరదాకు ప్రచురించితే ప్రచురించవచ్చు కాని వాటి ద్వారా గొప్ప కీర్తి వస్తుంది గాని, సాంఘిక ప్రయోజనం సాధ్యమవుతుందని గాని అనుకోరాదు

అలాంటి ప్రయోజనాన్ని కాక్షించి కథలు రాయటం మొదలుపెట్టటానికి కథకుడికి కథన శిల్పం కరతలామలకమై ఉండాలి పాటకచేరీ చేసే గాయకుడు, రాగం తాలూకు ఆరోహణావరోహణలను మననం చేసుకోకుండానే రాగప్రస్తారం చేసిన రీతిగా కథకుడు ఇతివృత్తము మీద దృష్టి నిలిపి సులువుగా కథ అల్లుకుపోగలగాలి ఇది కథకుడి మూడవ దశ ఈ దశలోనే కథకుడికి గల సామాజిక స్థాయి నిర్ణమయేది

ఇక్కడి నుండి కథకుడు నాల్గవ దశలోకి అడుగుపెడతాడు. సమాజంలో కలిగే మార్పుతో తనకు గల సంబంధాలను స్పష్టం చేసుకుంటాడు సామాజిక సంఘర్షణలలో తాను అభ్యుదయ పక్షాన నిలబడి తన రచనలను సమాజానికి పూర్తిగా అంకితం చేస్తాడు

అన్ని దశలలోను కథకుడు తనకు తాను నిర్మొగమాటంగా విమర్శించుకోగలవాడై ఉండాలి, ఇతరులిచ్చే విమర్శలను ఓర్పుతో వినగలవాడై ఉండాలి, విమర్శ లేక ఏ కళా లేదు ఇతరుల విమర్శలను విమర్శించుకోగల కథకుడు చాలా దూరం పోగలుగుతాడు

ఉత్తమ కథకుడు కాగోరేవాడు ఏ దశలోనూ సాహిత్య చౌర్యం చేయరాదు ఏ పాత ఇంగ్లీషు కథనో తీసుకొని కథకుడు తన స్వంతంలాగా రాసి అచ్చువేసి అందరినీ మోసం చెయ్యవచ్చు కాని అందువల్ల నష్టపడేది కథకుడు పాఠకులకు కథ బాగున్నదైతే దాన్ని రాసిన వాడు గోవిందరావైనా ఒకటే మొపాసా అయినా ఒకటే కాని ''చేతివాటు''కు అలవాటుపడ్డ కథకుడు తన రచనాశక్తిని అభివృద్ధి చేసుకోలేడు

సాధ్యమైనంత వరకు కథకుడు మొదటి రెండు దశలలోను అనువాదాలు చెయ్యకుండా వుండటం మంచిది మంచి అనువాదాలు చెయ్యితిరిగిన రచయితలే చెయ్యాలన్నది ఒకటి, అనువాదం కూడా కథనశక్తిని చంపేస్తుందన్నది మరొకటి

ఏ దశలోనూ కథకుడు తనకు తెలియని పాత్రలను, పరిస్థితులను అంటుకోకుండా ఉండటం మంచిది హైస్కూలు చదువు కూడా పూర్తి చేయని కుర్రవాళ్లు తమకు పరిచయం కాని '' ఉన్నత'' పాత్రలను సృష్టించి వాటికి తమ విద్యార్థి మనస్తత్వం అంటగట్టి కథలు రాయటం కద్దు ఇటువంటి రచనలు విధిగా అపహాస్యం పాలవుతాయి

కథా శిల్పం ఎంత మధించినప్పటికీ కథలో చెప్పే ఇతివృత్తం జీవిత పరంగా ఉంటుంది జీవితాన్ని ఎంత బాగా మధించి దాని నిగ్గు తీయగలిగితే కథకుడు అంత మంచి కథలు రాయగలుగుతాడు

ఉత్తమమైన కథా సాహిత్యం సృష్టించటానికి జీవితం నుంచి ఏదో ప్రేరణ ఉండాలి కథలు రాసి గొప్పగా డబ్బు సంపాదించే అవకాశాలు గల పాశ్చాత్య దేశాలలో కథకులు అనేక దేశాలు పోతారు అనేక రకాల వృత్తులుగల వారితో భుజాలు రాచుకు తిరుగుతారు అనేక రకాల మనస్తత్వాలను పరిశీలిస్తారు చిత్ర విచిత్రమైన వాతావరణాలుగల కథలు రాస్తారు

అటువంటి ఆర్థిక ప్రేరణ లేని మనదేశంలో చాలామంది కథకులు యవ్వనోత్సాహంలో కథలు రాయటమూ నడి వయస్సులో విరమించటమూ మనకు కనిపిస్తుంది జీవితపు లోతు పాతులు ఆకళించుకొని మంచి చెడ్డలు అర్థం చేసుకోగల దశలో కథకుడు కథలు రాయటం మానేస్తున్నాడంటే ఉత్తమ కథా సాహిత్యం సృష్టించే ప్రేరణను అతను జీవితం నుంచి పొందటం లేదన్నమాట ఇది జీవితం తప్పుకాదు కథకుడి తప్పు

పైనచెప్పిన దశలలో మొదటి రెండు దశలు గడవటానికి ఈ పుస్తకం బాగా తోడ్పడుతుంది ఇందులో చాలా అమూల్యమైన సలహాలు కొన్ని ఉన్నాయి ముఖ్యంగా ఒక్కొక్క కథను ఇరవైయ్యేసిసార్లు రాసే పద్ధతితో నేను కూడా ఏకీభవించను తాము రాయబోయే కథను గురించి ముందుగా సొంతం ఆలోచించలేని వాళ్ళు రాసిందే మళ్లీ మళ్ళీ తిరగతోడుతారు

అది ఒక విధమైన దురభ్యాసమనటానికి సందేహంలేదు చక్కగా ఆలోచించిన మీదట రాసిన కథను పదేపదే మార్చి దిద్దవలసిన అవసరం ఉండదు

కథకులు కాబోయేవారు తమ బాధ్యతను తెలుసుకొనటానికీ, అయోమయస్థితిలో కథా రచన సాగించుతున్నవారు ఒకదారికి రావటానికీ ఈ పుస్తకం ఉపయోగపడగలదని ఆశిస్తున్నాను

*కథలు రాయడమెలా? రచన శొంఠి కృష్ణమూర్తి*
*కథాసాహితీస్రవంతి - 1, యశోధర ప్రచురణలు , హనుమకొండ*
*తొలి ముద్రణ ఫిబ్రవరి 1955*

# 4. పరిచయం

రెండేళ్ళ క్రితం ''అభ్యుదయ''లో ప్రచురణార్థం వచ్చిన కథలు చూస్తుండగా ''ఎదురు తిరిగిన కథానాయకుడు'' అన్న కథ తగిలింది రచయిత పేరు కొత్తది, కాని ఒక్కొక వాక్యమే చదువుతుంటే '' ఇతనికి రాయటం బాగా చాతనవును'' అన్న భావం ఏర్పడి, చివరకు గట్టిగా బలపడింది తరువాత అతని రచన ఏదీ నాకు తగలలేదు కారణం ఈ కథల సంపుటి నా చేతికి అందినాక గాని తెలియలేదు ఇవి నేను చూడని పత్రికలలో ప్రచురితమైనాయి

ఇందులో ఉండే కథలు చదవటం నాకు రెండు విధాల తృప్తినిచ్చింది - ఒక్క కథ మాత్రమే చదివి మెచ్చుకున్న శ్రీ రాచమల్లు రామ చంద్రారెడ్డి రచనలు ఒక్కసారిగా పన్నెండు చదివే అవకాశం లభించటం ఒకటీ, ఈ కథకుడి శైలిలోని పటుత్వమూ, కథనంలో గల సామర్థ్యమూ జీవితం పట్ల గల వైఖరీ మరింత స్పష్టంగా గ్రహించటం మరొకటీనూ

కథకుడికి ఉండవలసిన శక్తులన్నీ ఈ కథకుడిలో నాకు బలంగా కనిపించాయి సూటీ, రచయితకు సహజమూ అయిన భాష, ఒక్క వ్యర్థ పదంలేదు ఈ రచయితకు ఒక్కవాక్యంతో పాత్రను రూపకల్పన చేసే అరుదైన శక్తి ఉన్నది

సాధారణంగా మనకు బాగున్నాయినిపించే కథలు మనని ఉల్లాస పెడతాయి జీవితంలో లభించని సంతృప్తి కలిగిస్తాయి అయితే ఈ కథలు ''షాక్'' ఇస్తాయి జీవితంలో చూసి ఉపేక్షించే విషయాలనే ఈ కథలలో చదివి ''షాక్'' తింటాం వీటిని చదివి మానసిక చైతన్యం పొందకుండా ఉండటం సాధ్యం కాదు

పరిస్థితులకూ వ్యక్తులకూ మధ్య ఉండే సంఘర్షణ ఈ కథలలో చాలా చక్కగా చూపబడింది ఈ కథలలో మనకు విప్లవ వీరులుగాని, ఉన్న పరిస్థితులు అనుగ్రహం వల్ల సుఖ సౌఖ్యాలలో ఓలలాడేవారు గాని కనిపించరు అడుగడుగునా సంఘం పై నిశిత విమర్శ ఎదురవుతుంది

తననూ, తన కథలనూ పరిచయం చేసే అవకాశం నాకు కల్పించిన రచయితకు ఎంతో కృతజ్ఞుణ్ని నేటి కథకులలో శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డికి విశిష్టస్థానం ఉన్నదని నా విశ్వాసం

*మద్రాసు*

*11-8-1960* *రారా (అలసిన గుండెలు) కథల సంపుటికి రాసింది*

# 5. ప్రస్తావన

స్వాతంత్ర్యం వచ్చిన పదిహేనేళ్ళ అనంతరం మన దేశంని అధిక సంఖ్యాకుల జీవితం అయోమయయంగానూ, హాస్యాస్పదంగానూ ఉన్నది యుక్త ఎయస్కుడైన ప్రతి పౌరుడికీ అధ్యక్షుడయే హక్కు ఉన్నది గాని, తన చదువుకూ, సామర్థ్యానికీ అనుగుణంగా ఉండే ఉద్యోగం సంపాదించుకునే హక్కు లేదు అదృష్టవశాన ఉద్యోగం దొరికినా, దాన్నినిర్వహించటంలో అతనికి కనీస గౌరవమూ, కనీస వేతనం కూడా దక్కవు

ఎన్ జి వో లు ఈ రకం ఉద్యోగాలు చేస్తున్నారు వారిది చిత్రమైన పరిస్థితి వాస్తవానికి వారే ప్రభుత్వ యంత్రం మంత్రులు మారుతారు ఒక్కొక్కసారి ప్రభుత్వం సాగించే పార్టీలే మారుతాయి, కాని యన్ జీ వో లు ప్రభుత్వ యంత్రాన్ని నడిపించుకు పోతారు వారి సర్వీసు నిబంధనలు విడ్డూరంగా ఉన్నా, వారి పరువు మర్యాదలకు లోపలినుంచిగాని, పైనించి గాని విఘాతం కలిగినా ఆ దెబ్బ ప్రభుత్వ యంత్రానికే తగులుతుంది కాని ఈ అవలక్షణాలన్నీ ఈ ప్రభుత్వ యంత్రంలో ఉన్నాయి వాటిని ఈ నవల విశదీకరిస్తున్నది

''ఫిబ్రవరి 27'' చరిత్రలో చేరిపోయింది కాలగర్భంలో కలిసిపోయింది కూడా కాని ఆనందరావు ఈ నవలలో అన్న మాటలు పాఠకుల హృదయాలలో చిరకాలం నిలిచేపోతాయి '' ఎన్ జి వో అంటే ఎలా వినవడుతూంది? గంజికి లేనివాడన్న ధ్వని స్ఫురించడం లేదూ ? కాస్తా కూస్తో వుంటే అమ్ముకుని చదువుకునే ఎవడూ గుమాస్తాగిరి చేద్దామని చదవడు కాలేజీల్లో గుమాస్తా కోర్సు పెట్టమను, ఎంతమంది చేరతారో చూద్దాం ! హక్కును గుర్తించిన వాడే పోరాడగలడు ప్రజాస్వామ్య రాజ్యంలో కనీస వేతనం మన జన్మహక్కు శ్రమకు తగ్గ ఫలితం మనం పొందగలిగిననాడే బాధ్యతల్నికూడా సంతృప్తికరంగా నిర్వర్తించగలం ఎన్నుకొనేవాడికీ ఎన్నుకొనబడే వాడికీ మధ్యన ఉన్న గొలుసులోని లింకులే ఈ ఉద్యోగులందరూను వీళ్ళ ద్వారానే అధికారంలోకి వచ్చిన పార్టీ ప్రణాళికల్ను, ప్రజలకిచ్చిన వాగ్దానాలను అమలు పరచవలసింది సోషలిజం అంటే ఏమిటో తెలియకుండనే ''సోషలిస్టు పాటరన్ ఆఫ్ సొసైటీ''ని స్థాపించడానికి ప్రభుత్వోద్యోగుల్ని కృషి చేయమనడం, ఏడుగురు గుడ్డివాళ్ళు ఏనుగును తడివినట్టే అవుతుంది!''

ప్రభుత్వ యంత్రం అనదగిన ఈ ఎన్ జి వో లెవరు? కలలు పండించుకోలేక పోయినవాళ్ళు దారిద్ర్యానికి వారసులు ఉద్యోగ లక్ష్మి స్వయంవరంలో అనేక పర్యాయాలు అపజయాలు పొందిన వాళ్లు, తల్లిదండ్రులకు తమ ఋణాన్ని, తోబుట్టువుల పట్ల తమ సహజ ప్రేమను తీర్చుకోలేకపోయిన అభాగ్యులు

ఈ సత్యాన్ని కళ్లకు కట్టినట్టూ, హృదయానికి హత్తుకునేట్టు చిత్రించిన గౌరవం మిత్రుడు ''వనశ్రీ''కి దక్కింది ఈనాడు తెలుగులో చాలా నవలలు వస్తున్నాయి, కొన్నింటిలో మహోన్నతమైన నైతిక, ఆధ్యాత్మిక సమస్యలూ, వాటి తాలూకు సంఘర్షణలూ చిత్రింపబడుతున్నాయి, అవన్నీ భూమికి ఎంతో కొంత ఎత్తున గగన విహారాలు చేస్తున్నాయి ఈ ''కురుక్షేత్రం'' ఎక్కడా భూమిని విడిచిపెట్టదు

దీనిలోని నాయకుడు ఒక్క అమ్మాయినీ ప్రేమించడు కనీసం ప్రేమను గురించి ఆలోచించడు - కలనైనా కనడు లతనికి కావలసింది స్వార్జితమైన డబ్బు అందుకోసం ఒక చిన్న లోయర్ డివిజన్ క్లర్కు ఉద్యోగం అది లభించటమే యజ్ఞం చేసినంత పని అవుతుంది తీరా దొరికినాక ఆ ఉద్యోగం తన మానాన్ని కాపాడుకొనటానికి కూడా చాలనంత చిన్న గుడ్డ పీలిక అని గ్రహిస్తాడు దానితోనే సరిపెట్టుకుందామంటే అది కూడా చెయ్యి జారిపోతుంది

ఎన్ జి వో లలో కూడ విశ్వనాథం చాలా నాసిరకంగా పరిణమిస్తాడు అతని దోషం ఏమైనా ఉందేమో పుస్తకం చదివి చూడండి నా మట్టుకు నాకేమీ కనిపించలేదు కాని తప్పు ఇంకెక్కడో ఉండే ఉండాలి! దానిని గ్రహించటం మన వంతు

విశ్వనాథం ఎటో వెళ్ళిపోయాడు అతన్ని మనం తప్పు పట్టలేం కురుక్షేత్రంలో పద్మవ్యూహం ప్రవేశించిన అభిమన్యుడు తిరిగి వచ్చాడు గనుకనా? ఎన్ జి వో ఉద్యోగం కూడా దక్కించుకోలేనివాడు, చెల్లెలి ఆఖరు నగ తాకట్టు విడిపించుకునే అవకాశం కన్ను పొడుచుకున్నా కనిపించనివాడు ఎటు పోతేనేం? రైళ్ళ కింద తలకాయలు పెట్టుతున్న యువకుల కన్నా, హుస్సేన్ సాగర్లోనూ, బావుల్లోనూ దూకి ప్రాణాలు వదిలిన వాళ్ళకన్న విశ్వనాథం సమర్థుడేమీ కాడు కాని ఒక్క ఆలోచన మన ప్రాణాలు తోడేస్తుంది - ఆ చచ్చే వాళ్ళూ విశ్వనాథమంత నిర్దోషులేనేమో!

ఈ నవల ఈ కాలపు నవలా సాహిత్యంలో విశిష్ట స్థానం సంపాదించు కుంటుందని నాకు గట్టి నమ్మకం ఇందుకు ప్రబలమైన కారణాలు రెండున్నాయి

ఒకటి ఇందులో వాస్తవికత నూటికి నూరుపాళ్ళు ఉట్టిపడుతున్నది ప్రశ్నార్థకపు గుర్తును స్ఫురింపజేసే ఒక్క సన్నివేశం గాని, ఆఖరుకు ఒక్క వాక్యం గాని ఈ నవలలో మచ్చుకైనా లేదు రెండు ఇందులో చిత్రించిన వ్యక్తి ఈ నాటి సమాజంలో ఒక విస్తృత వర్గానికి ప్రతినిధి

ఈ రెండు విషయాలలోనూ ఈ నవల నేను చదివిన అన్నినవలల కన్నా ముందున్నది భవిష్యత్తులో రాబోయే అనేక నవలలకు ఇది వరవడిగా ఉంటుందని మనస్ఫూర్తిగా నమ్ముతున్నాను

*ప్రస్తావన, వనశ్రీ , కురుక్షేతం,*
*ముద్రణ 25-5-1962*

## 6. ప్రస్తావన

గత ప్రపంచయుద్ధ కాలంలో వెనకబడి ఉన్న దేశాలకు ఎంతో జ్ఞానోదయ మయింది జీవితానికి సంకెళ్లు వేసే శక్తుల నగ్నస్వరూపమూ, అభ్యుదయ శక్తుల నీడలూ, అందరి కళ్ళముందూ కదుల్లాడాయి అభ్యుదయ భావాలు ప్రచారంలోకి వచ్చాయి సాహిత్యంలో అభ్యుదయోద్యమం చురుకుగా సాగింది అభ్యుదయ వాదం దేశమంతటా అలుముకుపోయింది

సాహిత్యం - ముఖ్యంగా కథా సాహిత్యం - కుప్ప తెప్పలుగా వస్తున్నప్పటికీ, ఏది ముందుచూపుగల సాహిత్యమో ఏది జీవితాన్ని లోతుగా విమర్శించే సాహిత్యమో, ఏది

వాస్తవికతతో కూడినదో చదివేవారికి సులువుగా తెలుస్తూనే ఉంటుంది అటువంటి సాహిత్యం విషయ ప్రధానమై ఉంటుంది అందులో ఆత్మవంచన గాని, పరవంచనగాని ఉండదు, భాషలో గారడీలూ, భావప్రకటనలో గిలిగింతలూ, పాఠకులను రంజింప జెయ్యటానికి శిల్పచమత్కృతీ మొదలైనవి ప్రాముఖ్యం వహించవు అలాటి సాహిత్యం నూటికి నూరుపాళ్లు భౌతికవాదాన్ని ఆశ్రయించి ఉంటుంది

ఈ లక్షణాలన్నీ కథ సంపుటిలో మనకు కనిపిస్తాయి కథారచయిత్రుల సంఖ్య ఇప్పుడిప్పుడే పెరుగుతున్నది అయితే వారిలో అభ్యుదయ వాదాన్ని అర్థం చేసుకున్నవారి సంఖ్య తక్కువ ఉన్న కొద్దిమందిలో సీతాదేవికి పెద్దస్థానం ఉన్నది ఆమె రాసిన కథలు ఎక్కువ లేనప్పటికీ, జీవిత సమస్యలను గురించి ఆమెకు గల దృక్పథాన్ని అవి స్పష్టం చేస్తాయి

ఈ సంపుటిలోని కథలు అన్నీ స్త్రీ దృష్టిలో జీవితాన్ని చిత్రించినవేనని చెప్పవచ్చు ఈ స్త్రీ పాత్రలలో అప్పుడే ఈడొచ్చిన ముగ్ధల దగ్గరనుంచి సంసార భారాన్ని తను మీదికి లాక్కున్న ముదిస్త్రీ వరకూ ఉన్నారు, ధనిక స్త్రీలున్నారు, దరిద్రస్త్రీలున్నారు, సంకెళ్ళతో పుట్టి వాటితోనే చనిపోయినవారున్నారు, సంకెళ్ళను తెంచేసిన వారున్నారు అన్నీ వాస్తవ పాత్రలే, వాస్తవ మనస్తత్వాలు కలిగి, వాస్తవ జీవితం జీవిస్తాయి

''ఆమె-లోకం'' అన్న కథమటుకు మిగతా కథలకు పెడగా కనిపిస్తుంది ఇది ఒక తార్కాణంలాటి కథ జానకి పుట్టుకతో ఆరంభమై ఆమె కూతురు పార్వతి చావుతో అంతమయే ఈ కథను శిల్పరీత్యా చిన్న కథ అని గాని పెద్ద కథ అనిగాని అనటానికి వీల్లేదు, నవల రాయటానికి రాసుకున్న స్కెచ్‌లాగా కనిపించే ఈ కథ ఈనాటి స్త్రీ యొక్క విషాద జీవితానికి చెందిన కథలన్నిటికీ మాతృక అనవచ్చు జానకి పుట్టిన పరిస్థితులను జ్ఞాపకం ఉంచుకుంటే ఆమె అసహాయత్వానికీ, ఆమెకూతురి అసహాయ త్వానికీ కూడా వారి స్త్రీత్వమే కారణమని స్పష్టమవుతుంది

సదాశయాలతో నిరాడంబరంగా రచించిన ఈ కథలు పాఠకులకు - స్త్రీ పాఠక లోకానికి కూడా - ఆనందాన్ని చేకూర్చి వారిలో అభ్యుదయ భావాలను రేకెత్తించగలవని నా నమ్మకం

*ముద్రణ 21-9-1962*

# 7. మంచికథ

ఎనిమిది వందల ఏళ్ళక్రితం హేమచంద్రుడనే జైన ఆచార్యుడు ''సవిరావళీ చరితం'' అనే గ్రంథంలో కథలపై వ్యాఖ్యానం లాంటి గల్పిక ఒకటి రచించాడు ఆ గల్పిక ఈ విధంగా ఉన్నది

రమణీయ అనే దేశానికి ఒక రాజుండేవాడు ఆ రాజు కథలంటే చెవికోసుకునేవాడు ఆయన ప్రతిరోజు తన పౌరులలో ఒకణ్ణి పిలిపించి అతడిచేత కథలు చెప్పించుకుని వింటూండేవాడు ఇలా ఉండగా ఒకనాడు ఒక నిరక్షరుడైన పూజారి వంతు వచ్చింది ఆయన పేరు నాగశర్మ ఆయన భార్యపేరు సోమశ్రీ వారి కొక యీడు వచ్చిన కుమార్తె ఉన్నది ఆమెపేరు నాగశ్రీ

రాజుగారు తనను కథలు చెప్పటానికి పిలిచారనగానే నాగశర్మ కంగారుపడి కంపించిపోయాడు ఎందుకంటే అతను బిడియస్తుడు పరాయి వాళ్ళ దగ్గర నోరు తెరిచి మాట్లాడలేడు అదీకాక అతనికి కథలేమీ రావు నాగశ్రీ తన తండ్రి కంగారు చూసి కారణమడిగి తెలుసుకుని, '' ఇంతేకదా! నీకు మారుగా నేను రాజుగారి వద్దకు వెళ్ళి కథలు చెప్పి వస్తాలే!'' అన్నది

నాగశ్రీ ధైర్యంగా రాజు సన్నిధికి వెళ్ళింది ఆమె ఎవరో ఎందుకు వచ్చిందో తెలియక రాజుగారు '' ఎవరమ్మానీవు?'' అని అడిగాడు

ఆమె రాజుగారితో ఇలా చెప్పింది

''నాపేరు నాగశ్రీ మా తండ్రి నాగశర్మ తల్లి సోమశ్రీ, నా తల్లిదండ్రులు నన్ను చట్టుడు అనేవాడికి ప్రధానం చేసి పెళ్ళి నిశ్చయించారు ఒకనాడు నా తల్లిదండ్రులిద్దరూ గ్రామాంతరం వెళ్ళి ఉన్న సమయంలో చట్టడు మా ఇంటికి వచ్చాడు ఇంట్లో పెద్దవాళ్ళు లేనందున అతనికి అతిథి మర్యాదలన్నీ నేనే శక్తి వంచన లేకుండా జరిపాను ఆ రాత్రి అతను పడుకోవటానికి ఇంటవున్న ఒక్క మంచమూ ఇచ్చాను నాకు ఒట్టి నేలపై పడుకోవటానికి కొంచెం కూడా మనస్కరించలేదు అందుచే అతనికి నిద్రపట్టేసిదాకా వేచి ఉండి, చల్లగా ఆ మంచం మీదికి చేరాను కాని అతను మేలుకొని నేను తన పక్కలో ఉన్న సంగతి తెలుసుకున్నాడు అతనికి ఉద్రేకం వచ్చేసింది దాన్ని నిగ్రహిచుకోవటానికి ప్రయత్నించటంలో అతను కాస్తా ప్రాణాలు వదిలాడు

''అతను చచ్చిపోయాడని తెలియగానే నాకు భయం పట్టుకుంది అతన్ని నేనే చంపానని అందరూ అనకమానరు, నాకు శిక్ష తప్పదు అందుకని ఏం చేశానంటే, అతని శరీరాన్ని చిన్న చిన్న ముక్కలుగా కోసి వాటిని రహస్యంగా పాతేశాను నేను చేసిన పనితాలూకు జాడలన్నీ తుడిచేశానో లేదో, నా తల్లి దండ్రులు తిరిగి వచ్చారు''

ఇంతవరకు విని రాజు ఆశ్చర్యంతో ''ఇది నిజమా?'' అన్నాడు

నాగశ్రీ నవ్వి ''మీరు రోజూ వినేకథలు ఎంత నిజమో ఇదీ అంతే నిజం!'' అన్నది

ఈ కాస్తంత కథలోనాకు చాల గడుసుదనం కనిపిస్తున్నది హేమచంద్రుడు ఈ గల్పిక ద్వారా కథలో వాస్తవికత వుంటే వినే వాడిలో - రోజూ కథలు వినేవాడిలో సహితం - ఎలాంటి చైతన్యం కలుగుతుందో చూపాడు అంతే కాదు, వాస్తవానికి, వాస్తవికతకు తేడా చూపాడు నాగశ్రీ చెప్పిన కథ వాస్తవికతతో కూడినదేగాని వాస్తవం కాదు వాస్తవికత కోసం ఎవరో నటుడు ఈ ఇరవైయ్యో శతాబ్దిలో ప్రేక్షకుల మధ్య నుంచి రంగస్థలం మీదికి వస్తే గొప్ప ''ఐడియా'' అన్నాం కాని ఎనిమిది శతాబ్దాల క్రితం హేమచంద్రుడు సృష్టించిన నాగశ్రీ పాత్ర రాజుతో మాట్లాడుతూ, తనస్వవిషయాన్ని ఏ వాక్యంతో కథగా మార్చిందీ మనం ఊహించలేని స్థితిలో ఉన్నాం! శిల్పమంటే అలా వుండాలి

ఈ కథా సంపుటికి ప్రస్తావన'' రాయటానికి ఉపక్రమించగానే నాకీ పాత కథ జ్ఞాపకం రావటానికి కారణం ఉన్నది ఈ సంపుటిలో చిట్ట చివరి కథ ''ముగింపు'' అన్నది కూడా కథనూ జీవితాన్ని విడిరాకుండా కలియగట్టింది

ఈకాలానికి నాగశ్రీలాటి కథకులు కావాలి కథలో ఎంత వాస్తవికత ఉంటే అంత రాణిస్తుంది హేమచంద్రుడి కథలోని రాజుకూడా రోజూ కథలు వినేటప్పుడు కథకుణ్ణి ''ఇది నిజమా?'' అని ఆశ్చర్యంతో అడిగి ఉండడు ఆయన చేత అలా అడిగించినది నాగశ్రీ శిల్పం! వాస్తవికత! కథలన్నీ అబద్ధాలేనని అందరికీ తెలుసు ఆనాడు రమణీయ రాజుకూ తెలుసు, ఈనాడు మనకూ తెలుసు కాని చదువుతున్నంతసేపూ కథ వాస్తవమన్న భ్రమ ఉన్నప్పుడే కథ నిజంగా రక్తి కడుతుంది

హేమచంద్రుడు రాసిన కథనుంచీ నేర్చుకోదగిన ఒకటి రెండు ఇతర విషయాలున్నట్టు నాకు తోస్తుంది నాగశ్రీ చెప్పిన కథ తాలూకు విధానం గురించి తెలుస్తూనే వుంది విషయం గురించి అలోచిద్దాం ఆమె చెప్పిన కథ జీవితానికి సంబంధించినది గాని ఆకాశపోకాశ విషయం కాదు అందులో ఉన్నవే రెండు పాత్రలు రెంటి అంతస్సంఘర్షణా మనం గ్రహించాం తన తప్పు ఏమీ లేకుండా కామోద్రేకాని గురిఅయి నీకోసం దాన్ని బలాత్కారంగా అణచిపెట్టిన చట్టుడు ప్రాణాలనే విడిచేశాడు తలవని తలంపుగా అతని చావుకు కారకురాలైన నాగశ్రీ (మనిషి కాదు పాత్ర) తన మీద అకారణంగా హత్యానేరం వచ్చి పడకుండా ఉండగలందుకు అతిదారుణమైన పనిచేసింది ఈ విధంగా ఈ చిన్న కథలో హేమచంద్రుడు పాత్రల అంతస్సంఘర్షణా, నైతిక దృష్టీ, ఆత్మ రక్షణా సక్తీ చిత్రించాడు

ఇంకొక్క అంశం కూడా మనం గమనించాలి, నాగశ్రీ చెప్పిన కథ రాజుగారు కాక మరొకరు విన్నీ ఆశ్చర్యపడి వుండేవారేగాని '' ఇది నిజమా'' అని అడిగి తెలుసుకోవలసిన అవసరం రాజుకున్నంతగా ఇతరులకుండదు అది నిజమైనట్లయితే విచారణ చేయవలసిన బాధ్యత రాజుగారి పైన ఉన్నది చట్టుడి చావుకు నాగశ్రీ ఎంతవరకు బాధ్యురాలన్నది రాజు నిర్ణయించి ఆమెను శిక్షించాలి నేలమీద పడుకోవటం అసహ్యం కావటంచేత చట్టుడి పక్కలోకి దూరటం నాగశ్రీ తప్పే ఆమె నేలమీద పడుకుంటే అతను చావడు కాని అతని తప్పు కొంత లేకపోలేదు నాగశ్రీ ఒంటరిగా ఉన్నదని తెలసి తను ఆ రాత్రి ఆ ఇంట్లో పడుకోకుండా ఉండవలసింది తన ఆవేశాన్ని బలాత్కారంగా అణచుకోకపోయినా అతను చచ్చి ఉండడు అతను నీతికోసం ఆత్మహత్య చేసుకున్నడని అన్నప్పటికీ అందులో అతిశయోక్తి లేదు

కథలో ధార్మికసమస్య వుండాలి ఈ నాటి కథలు చదివిన న్యాయమూర్తులూ, సమాజాన్ని పాలించే వారూ, సంఘ క్షేమం కోసం కృషిచేసేవారూ కూడా '' ఇది నిజమా?'' అని ధర్మాన్ని నిలబెట్టాలన్న చైతన్యం పొందాలి అప్పుడే అది మంచి కథ

(తాళ్ళూరి నాగేశ్వరరావు రచించిన '' ఏడుకొండలవాడా! వెంకటరమణా!'' అనే కథా సంపుటికి రాసింది)

*ముద్రణ విశాలాంధ్ర, దినపత్రిక, 9-6-1963*

# 8. ''పేకముక్కలు''

శాస్త్రీయ విజ్ఞానాన్నీ, సాంకేతిక నైపుణ్యాన్నీ ఆశ్రయించి పాశ్చాత్య దేశాలు పెంపొందించుకున్న నాగరికత మన దేశంలాంటి బడుగుదేశాలకు అనేక విధాల సంక్రమించింది ఈ నాగరికత మనకు అనేక కళా సాధనాలను ప్రసాదించింది అచ్చు వేసే యంత్రాలూ, గ్రామఫోను రికార్డులూ, రేడియోలూ, సినిమాలూ మనకు కళా సాధనాలయాలు

ఈ సాధనాలు మన కళలపై తమ ప్రభావాన్ని రెండు విధాలుగా వ్యక్తపరిచాయి ఒకటేమంటే, కళల స్వరూపం మారింది అచ్చుయంత్రాలు రాకపూర్వం వచన రచనలో పేరాలూ, పంక్చుయేషన్ గుర్తులూ మొదలైనవి ఉండేవి కావు వాక్యం రాస్తే అందరికీ ఒకేలాగు అర్థమయేటట్టుగా వాక్య నిర్మాణం సాగించవలసి ఉండేది ఈనాడు ఆ శ్రమ అనవసరం ఉత్త ''కొటేషన్ మార్కు''లతో ఇద్దరి సంభాషణ, సంభాషించే వారి పేర్లు చెప్పకుండా రాసుకుపోవచ్చు ప్రశ్నార్థకాలూ, ఆశ్చర్యార్థకాలూ, వాక్యంలోని భావాన్నిమరింత స్పష్టం చేస్తాయి ఇటువంటి మార్పు అన్ని కళలలోనూ వచ్చింది పూర్వం గాయకుడంటే గళమెత్తి అయిదారు వందల మందికైనా వినపడేలాగా పాడగలవాడే గాయకుడు ఈ నాడు మైకులూ, లౌడ్ స్పీకర్లూ ఉన్నాయి గనక చిన్న గొంతుతో ఎంత కోమలంగా పాడినా, వేలాది జనానికి వినిపిస్తుంది

రెండవరకం మార్పు కళలు ప్రజలకు సన్నిహితం కావటం పాశ్చాత్య నాగరికత రాకపూర్వం ప్రజల జీవితంలో సాహిత్యమూ, సంగీతమూ, చిత్రకళా, నృత్యకళా, నాట్యకళా మొదలైన వాటికి అతి కొద్ది అవకాశం ఉండేది ఏమూలనన్నా ఒక కవి చక్కని కావ్యం రాస్తే, అది దేశానికంతకూ తెలియటానికి శతాబ్దాలు పట్టేది అప్పటికీ అది అందరికీ అందేదికాదు - అంతకన్నా ప్రధానం, అందే అవకాశం ఉండేది కాదు

ఈనాడా బాధలేదు ప్రజలకు కావలసిన సాహిత్యం బళ్ల కొద్దీ రోజురోజూ, వారం వారమూ, నెలనెలా తయారవుతున్నది, ఒకటి రెండు రోజుల లోపల మారుమూల గ్రామాలకు కూడా చేరుతున్నది రేడియోలో ఒకనాటకమాడితే, లేక ఒక గాయకుడు పాడితే ఆ క్షణం లోనే దేశమంతటా ప్రజలు వింటున్నారు - కనీసం వినే అవకాశం కలిగివున్నారు

పూర్వం కూడా పేరు మోసిన నటులుండేవారు కాని వారి పేరు విన్నవారిలో వెయ్యికి ఒక్కడైనా వారి నటనా కౌశలాన్ని కళ్ళారా చూసివుంటారన్న నమ్మకం ఉండేదిగాదు ఏ హరిప్రసాదరావుగారి హరిశ్చంద్ర పాత్రనో ఒక్కసారి చూసినవారు కలకాలం చెప్పుకునేవారు ఈనాటి మన సినీతారలు ఏడాదికి నాలుగైదు చిత్రాలలో అనేక లక్షలమందికి కనిపిస్తూంటారు

ఇదే మన కళలపై యంత్రనాగరికత పరపిన ప్రభావం

అయితే ఇన్ని రకాల కళాసాధనలలోకి అద్వితీయమైనది సినిమా ఇది సమస్త కళలకూ, అనేక సాంకేతిక విద్యలకూ ఆటపట్టు అచ్చుయంత్రాలూ, రేడియోలూ మొదలైన ఇతర కళా సాధనాలు ఈ సినిమాకు ఒకవిధంగా ఊడిగం చేసి, దాని ధర్మామా అంటూ బతుకుతున్నాయి ఉదాహరణకు, పత్రికలలో సినిమా తారల బొమ్మలూ, వార్తలూ, ప్రకటనలూ, రేడియోలో సినిమా పాటల రికార్డులూ, సంక్షిప్త చలన చిత్ర ప్రసారాలూ, అప్పుడప్పుడూ సినిమాతారలు పాల్గొనే ప్రత్యేక నాటక ప్రసారాలూను

ఇదంతా అందరికీ ప్రత్యక్షంగా తెలిసిన సంగతి ఇంకొకటికూడా అందరికీ ప్రత్యక్షంగా తెలుసు సినిమాలు కళా ప్రమాణాలను - సంప్రదాయంగా వస్తున్న వాటిని - తారుమారు చేశాయి గొప్పకవీ, గొప్ప సినిమాకవీ ఒకడు కాకపోవచ్చు అలాగే గొప్ప కథకుడూ, సినిమా కథకుడూ, గొప్పగాయకుడూ, గొప్ప ప్లేబాక్ గాయకుడూ, గొప్పనటుడూ, గొప్ప సినిమా నటుడూ వగైరా వగైరా

కనుకనే ప్రతి కళాకారుడూ ఈనాడు సినిమా కళాకారుడుకాగోరుతాడు అది వరకు సంఘంలో అమలులో ఉండిన కళలు వ్యాపార రీత్యా ఆర్గనైజు కానందున, కళారాధన అంటే కడుపు మాడ్చుకోవడంగా ఉండేది కాని సినిమా అలాకాదు ఆది నుంచి తుది దాకా వ్యాపారం భారీ పరిశ్రమ పెద్ద లాభాలకు వేసే గాలం లెనకు లక్షలు సంపాదించిపెట్టగల కళాకారులకు వేలు పారేస్తుంది ఈ సినిమాలే లేకపోతే మనకళాకారులకు వందలిచ్చేవారుకూడా లేరు సినిమా చాన్సు దొరకని కళాకారులు ఇప్పటికీ రెండుపూటలా తిండి తినకుండానే ఉంటున్నారు అది సాధించినవాళ్ళు కార్లెక్కి తిరుగుతూ సుఖజీవనం గడపగలుగుతున్నారు ఈ విధంగా మన దేశంలో సినిమా ప్రపంచానికీ సినిమా యేతర ప్రపంచానికీ మధ్య పెద్ద లగాధం ఉన్నది

మొదటినుంచీ యంత్రనాగరికతను కనిపెంచిన దేశాల్లో ఈ వ్యత్యాసం ఇంతగా ఉండక పోవచ్చు కాని సినిమా మనం అరువు తెచ్చుకున్న కళా సాధనం అందుచేత ఈ లగాధం మనకు తప్పదు

ఇదే అగాధం సినిమా కారుల అభ్యంతర జీవితాలకూ, మామూలు మనుషుల నిత్యజీవితాలకూ మధ్య కనిపిస్తుంది సినిమా కారుల జీవితాలు మనకు తెలియవు అప్పుడప్పుడూ మనం వాటిని గురించి కొన్ని విడ్డూరమైన వార్తలు వింటామేకాని, వారి జీవితాల లోతు పాతులూ, ఆ జీవితాలను కదిలించే శక్తులూ, వాటివెంట ఉండే మనస్తత్వాలూ మనకు తెలియవు ఈ తెలియని వాటినన్నిటినీ చిత్రిస్తుందీ నవల

ఈ నవలలోని వివరాలు చదివి మనం ఆశ్చర్య పడనవసరంలేదు ఈ విధంగా జీవించే హక్కు అనాదిగా జమిందారీ వర్గానికి ఉంటూ వచ్చింది అటువంటి సాంఘిక పరిస్థితులే సినిమా కారుల జీవితంలో ఏర్పడినప్పుడు అదేమాదిరి ప్రవర్తనా, మనస్తత్వమూ, నైతిక విశృంఖలత్వమూ వారిలో తలెత్తుతాయి మన సాంఘిక మనః ప్రవృత్తి మన జీవిత విధానాన్ని బట్టి ఏర్పడుతుందనే పరమ సత్యాన్ని ఈ నవల చిత్రిస్తుంది మనః ప్రవృత్తిని మార్చుకోలేనివాడు అడుగున పడిపోతాడు తప్ప, వాతావరణాన్ని మార్చలేడు దాన్ని మార్చగలిగినది ప్రజాశక్తి ఒక్కటే

అయితే, ఈ సినిమాకారులకూ పాతకాలపు జమీందారీ వర్గానికీ ఒక తేడా ఉంది జమీందారీ వర్గం బొత్తిగా క్షణభంగురమైనది కాదు అంతేగాక దానికి తగిన సంస్కృతి ఒకటి ఆ వర్గం వెంట ఉండేది ఆ సౌకర్యం ఈ నకిలీ జమీందార్లకు లేదు ఒకేవ్యక్తి డైరెక్టర్ల జాబితాలోనూ, ఫుట్‌పాత్ మీద కూడా ఉండటం జరగవచ్చు అదే విధంగా నిన్నటిదాకా అనేక వేలమంది జీవితాలను పణం పెట్టి జూదమాడినవాడు ఇవాళ దివాళా ఎత్తవచ్చు ఇలాటి ఒడుదుడుకులను జమీందారీ వర్గం ఎరుగదు చరిత్ర దాన్ని చెత్తకుప్ప మీదికి లాగేసినదాకా జమీందారీ వర్గానికి చలనం లేదు

ఈ నవలలో ఒకచోట అభ్యుదయ చిత్రాలను గురించిన చర్చ ఉన్నది నా బుద్ధికి ఆ చర్చ ఒక నిర్ధారణకు వచ్చినట్టుగా తోచలేదు అభ్యుదయ దృక్పథంతో తీసిన చిత్రాలు డబ్బు తెచ్చుకోలేక పోయినమాట నిజం దానికి కారణమేమిటి? అభ్యుదయ వాదుల దృక్పథంలో లోపమా? లేక చిత్రాన్ని విజయవంతం చేయవలసిన సాధారణ ప్రేక్షకులకు తమ జీవిత సత్యాలను చిత్రంలో చూడటం ఇష్టంలేకనా? నా అభిప్రాయంలో ఈ రెండూ కారణాలుకావు ఫాల్కేగారు పురాణకధలూ, భక్తుల కధలూ మూకీచిత్రాలుగా తీసిన కాలంలో, ఎవడైనా సాంఘిక చిత్రం తీయ యత్నించి ఉంటే దాని నెవరూ చూసి వుండేవారు కారు అది ఈనాటి కృత్రిమ సాంఘిక చిత్రమైనా సరే ప్రజల కళాభిరుచిలో కూడా ఒక క్రమ పరిణామం ఉంటుంది దేశంలో కోట్లాది జనానికి ''వాస్తవికత'' అర్థంకాదు సినిమాకు ఆయువుపట్టు వాస్తవికతే అయినప్పటికీ, జనసామాన్యం యొక్క అభిరుచులు వాస్తవికతకు కూతవేటు దూరంలోకింకా రాలేదు ఇలాటి పరిణామ సూత్రం ఒకటి ఉండటం చేతనే ''కన్యాశుల్కం'' పుట్టిన అర్థశతాబ్దం అనంతరం కూడా గయోపాఖ్యానమూ, సత్యహరిశ్చంద్రీయమూలాంటి నాటకాలు అపరిమితంగా ప్రజాదరణపొందుతూ వచ్చాయి '' ఈనాటి కింకా పద్యాలు లేని నాటకాలను ఊహించలేని'' ప్రేక్షక జనం ఉన్నారు

అందుచేతనే పచ్చి వ్యాపార దృష్టిగల హాలీవుడ్ నుంచి అతి అల్ప సంఖ్యలోనైనా కొన్ని అభ్యుదయ చిత్రాలు వెలువడ్డాయి అభ్యుదయ భావాలమాట ఎలా వున్నా, వాస్తవికతకు బాగా అలవాటు పడివున్నారు సాంఘిక ప్రయోజన రహితమైన వాస్తవికతవారి పుస్తకాలలోనూ, నాటకాలలోనూ, సినిమాలలోనూ కొల్లలుగా వున్నది అక్కడినుంచి అభ్యుదయ కళలు ఒకమెట్టే మన ప్రేక్షకులు ప్రేమంటే డ్యూయెట్లు పాడటమనే దృక్పథంలో వున్నారు ఈ ప్రేక్షక జనకోటిని ఒక్కడుగు ముందుకు వేయించి అభ్యుదయ చిత్రాలను ఆదరించేటట్టు చేయాలనుకోవడం అభ్యుదయ వాదాన్ని అవమాన పరచటమే

ఇతర కళా రూపాలను కొంతవరకైనా అభ్యుదయ మార్గం పట్టించటం సాధ్యమయిందంటే, అవి వ్యాపార కళలుకాక పోవటమే కారణం వాటినే వ్యాపార కళలుగా మార్చినట్టయితే, వాటి విజయం నిజంగా సామాన్య ప్రజల యొక్క కొనుగోలుశక్తి మీద ఆధారపడినట్టయితే, అభ్యుదయ దృక్పధానికి స్వస్తి చెప్పవలసిందే

ఈ నవలకు పెట్టిన ''పేకముక్కలు'' అన్నపేరు చాలా విధాలా సార్థకనామం ఇందులో వున్న పాత్రలు పేకముక్కలు ఇందులో రాజులూ,రాణీలూ, జాకీలూ, జోకర్లూ, పాడిముక్కలూ అందరూ ఉన్నారు సినిమా ఒక కళా కాదు ఒక వ్యాపారమూ కాదు - పేకాట, జూదం! కాని అది కొద్దిమందికే జూదం మిగిలిన వారిలో సుఖజీవనం కోసం వచ్చినవాళ్ళుంటారు తమ ఆదర్శాలు సఫలంచేసుకోవటానికి వచ్చిన వారుంటారు బ్రతుకు తెరువులలో ఇది ఒకటనుకుని, పెద్ద ఆశలేమీ లేకుండా వచ్చినవారుంటారు ఈ రకాలన్నీ ఈ నవలలో ఉన్నాయి

సినిమా జీవితం ఒక విలక్షణమైన జీవితం మామూలు జీవితపు విలువలకి ఇక్కడ చలామణీలేదు ఈ సంగతి తెలియగానే మామూలు జీవితపు విలువలను సునాయాసంగా విసర్జించే జీవితాన్ని వాస్తవంగా చిత్రించటమే ఒక విశేషంకాదు డిటెక్టివ్ నవలల్లో కూడా వాస్తవ జీవితమే ఉన్నది ఈనవలలో సినిమాకారుల జీవితాన్ని ఉన్నదున్నట్టు చిత్రించటంతో సరిపుచ్చుకోక,

రచయిత ఆ జీవితంలోని సత్యాలన్నిటినీ నగ్నంగా ప్రదర్శించాడు ఆ కారణంచేత ఇది ఉత్తమ రచన అనిపించుకుంటుంది ఎప్పటికైనా సినిమాకళ ఉన్నతికి రావాలంటే అందుకు జరగదగినది క్రిష్ణలోయానవల ఒకభాగమవుతుందా అంటే, అవుతుందనినేను నమ్మకంగా చెప్పగలను

ఇది అనువాదం సంఘంలోని విద్యావంతుల దృక్పథం విస్తృతమవుతున్న కొద్దీ అనువాదాల ఆవశ్యకత హెచ్చుతున్నది ఈ విషయం పబ్లిషర్లు గుర్తించి మంచి అనువాదాలకోసం తహతహలాడుతుండడం నాకు తెలుసును పదిమంది చదవదగిన పుస్తకాలు అనువాదంలో చెడిపోతే, ఒకమంచి పుస్తకం యొక్క ప్రయోజనం పాడుగావటమే గాక, ఎప్పటికైనా దాన్ని తిరిగి అనువదించవలసిన అవసరం అట్టే ఉండిపోతుంది ఈ అనువాదం బాగా నడించిందనటం కంటే, బాగా పరిగెత్తిందనటం సరిగా ఉంటుందేమో! భావప్రకటనలోనూ, శైలిలోనూ స్వతంత్ర రచన సాగించినంత సౌలభ్యం కనబరిచారు శ్రీ పిచ్చేశ్వరరావుగారు ఇందుకు వారెంతైనా అభినందనీయులు

పేకముక్కలు
రచయిత కిషన్‌చందర్
అనువాదం ఎ పిచ్చేశ్వరరావు

*ముద్రణ విశాలాంధ్ర, దినపత్రిక, 22-3-1964*

# 9. పీఠిక

శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మగారి నవల ''బలిపీఠం'' కొద్ది పేజీలు చదవగానే నాకు వీరేశలింగం పంతులుగారి ''రాజశేఖర చరిత్రా, ఉన్నవ లక్ష్మీ నారాయణ పంతులుగారి ''మాలపల్లి'' గుర్తుకువచ్చాయి ఈ నవలకు ఆ నవలలతో గల సామ్యం ఎంతవరకు నిలబడుతుందో చూదామనుకున్నాను ఎందుకంటే నా దృష్టిలో ఆ నవలలు రెండూ తెలుగు నవలా సాహిత్యంలో మైలురాళ్ళే సాంతం చదివా ''బలిపీఠం'' కూడా అలాంటిమైలురాయేనన్న నమ్మకం నాకు కుదిరింది

సాధారణంగా ఈనాడు జాస్తిగా వెలువడే నవలలలో పాత్రలకు మాత్రమే సంబంధించిన సమస్యల చిత్రణ ఉంటుంది ఆ సమస్యలు పరిష్కారం కాకపోతే సమాజం వట్టిపోదు అవి పరిష్కారమైతే సమాజం వికసించదు కూడా ఇలాంటి నవలలలో చిత్రించే జీవితం, ఎండు కొబ్బరికాయలో కురిడీలాగా, పెంకునుంచి వేరు పడి, అటూ ఇటూ కొట్టుకుంటూ అసహాయంగా తిరుగుతుంది

''బలిపీఠం''లోని పాత్రల సమస్యలకు సమాజం యొక్క వర్తమానంతోనూ, భవిష్యత్తుతోనూ అతి సన్నిహితమైన సంబంధం ఉన్నది సమాజంలో ఎల్లప్పుడూ గతానికీ భవిష్యత్తుకూ వర్తమానంలో సంఘర్షణ జరుగుతూనే ఉంటుంది ఈ గతం విజయం సాధించినప్పుడల్లా సాంఘికాభ్యుదయం ఒక అడుగు వెనక్కు వేస్తుంది భవిష్యత్తుకు ఒక విజయం లభించినప్పుడల్లా ఒక అడుగు ముందుకు వేస్తుంది ఇది సుస్పష్టమైన సంగతి

ఈ నవలలో అరుణా భాస్కర్‌ల మధ్య జరిగే సంఘర్షణ భూత భవిష్యత్తు మధ్య జరిగే సంఘర్షణే అరుణ చెడ్డమనిషి కాదు మంచి ఇల్లాలుగా ఉండి భర్తను సంతోషపెట్టి,

తన గృహజీవితాన్ని నందనవనంగా చేసుకోగల మనస్తత్వం ఆమెలో ఉన్నది కాని ఆమె అంతరాత్మ గతాన్నీ, గత కాలపు అపోహలనూ ఆలింగనం చేసుకున్నది ఈ ఒక్క కారణంగా అరుణ మనస్తత్వమూ ప్రవర్తన ఎలా చెదలు తినిపోయిందీ ఈ నవలలో అత్యద్భుతంగా చిత్రించబడింది రచయిత్రికి గల రచనా దక్షతకు అరుణ పాత్ర నిర్వహణకన్న మంచి నిదర్శనం అవసరం లేదనిపిస్తుంది

వర్ణాంతర వివాహాలు జరుగుతున్నాయి ఇంకా జరుగుతాయి కాని అలాటి వివాహం చేసుకున్న మనిషి అమలలాంటిదైతే వర్ణాంతర వివాహాలకు ఖ్యాతి వస్తుంది అరుణ లాంటిదైతే సంఘ సంస్కరణ అపహాస్యంపాలు కాక తప్పదు

''బలిపీఠం'' ద్వితీయ ముద్రణలో రచయిత్రి, నేటి సాంఘిక పరిస్థితులను మంచి చెడులను యథాతథంగా చిత్రించి సంఘం ఎదుట పెట్టడమే నా ఉద్దేశ్యం అని చెప్పుకున్నారు ఇది వినయం కావచ్చు గాని నిజం కాదు ఈ నవలలోకి దాదాపు ప్రతి వాక్యంలోనూ రచయిత్రి యొక్క సాంస్కృతిక విశ్వాసాలూ సంస్కరణాభిలాషా కానవస్తాయి ఆమెకు సమాజాభివృద్ధిపట్ల పక్షపాతం - పార్టీజాన్‌వైఖరి - ఉన్నదనటానికి సందేహమేమీలేదు

అయితే రచయితలో ఇలాటి పక్షపాతం ఉండటం చేత రచన ఒకవిధంగా దెబ్బతింటుంది, పాత్ర చిత్రణలో పక్షపాతబుద్ధి గోచరిస్తుంది చవుకబారు సినిమాలలో హీరోను ఎగదోసి, విలన్ గాణ్ణి అసహ్యంగాచిత్రించిన విధంగా అయితే, ఇలాంటి లోపం నాకీ నవలలో ఎక్కడా కనిపించలేదు ఉదాహరణకు, అరుణ పతనానికి శాయశక్తులా దోహదం చేసిన ''కుళ్ళు'' పాత్రలు జగదాంబా, ఆమె భర్త జీతారామ శాస్త్రీ ఎంతో సమర్థతతో ఎప్పటికప్పుడు ఆత్మసమర్థన చేసుకుంటారు అంతేకాదు వారి దృక్పథం నుంచి వారు చేసేదంతా మంచిదే - మంచికేకూడా

దీన్ని పాక్షిక పాత్ర చిత్రణమని ఎలాగనగలం?

ఈ రచయిత్రిలో నాకు కనిపించిన మరొక గొప్ప శక్తి ఏమిటంటే, తనకు గల బలమైన విశ్వాసాలను పిడివాదం కింద అమలుజరపకపోవటం పిడివాదులు మంచి విశ్వాసాలనే అవలంబించినప్పుడు కూడా పరిస్థితుల ప్రభావాలను పరిగణించకుండా ''గుడ్డెద్దు చేలోపడ్డ చందం''గా తమకడ్డు వచ్చే దాన్ని చీల్చి చెండాడేస్తారు అలాంటి మనస్తత్వంతో రచించిన రచన వాస్తవికతను పూర్తిగా కోల్పోతుంది

ఈ నవలలోని ప్రధాన కథాంశం ఎలా నిర్మాణమైనదీ చూస్తే ముఖ్య సంఘటనలకూ, మౌలిక సన్నివేశాలకూ పరిస్థితులు ఎలా అనుకూలించినదీ స్పష్టమవుతుంది

మామూలు పరిస్థితులలో ఒక బ్రాహ్మణ వితంతువు( అరుణలాటిది) ఒక హరిజనుణ్ణి పెళ్ళాడటానికి ఒప్పుకోదు ఆమె తీవ్రమైన గుండెజబ్బుతో బాధపడుతూండటమూ, అతను (భాస్కర్) హరిజనులలో, అసాధారణుడు కావటమూ వారి వివాహానికి తోడ్పడ్డాయి

భాస్కర్ అంతకుపూర్వమే తారను ప్రేమించి ఉన్నాడు తార అతన్ని పెళ్ళాడటానికి ఒప్పుకుంటుంది కూడాను అరుణను పెళ్ళాడటంలో భాస్కర్ ప్రేమ త్యాగం చేశాడు అరుణ ఏ నెల రోజులకన్న బతకదన్న అనుమానంతోబాటు, తనని పెళ్ళాడి తార పొందే మేలు కన్న అరుణ హెచ్చు మేలు పొందవచ్చునన్నది కూడా అతన్ని ఈ వివాహానికి

: స్మరింపజేసింది అరుణను పెళ్ళాడటంలో చేసిన "త్యాగం" పూర్తిగా సమర్థన అయింది అరుణకు వ్యాధి నిర్మూలించటమే కాక, ఇద్దరు పిల్లల తల్లికూడా అయింది

రచయిత్రి వాస్తవికతను విడిచిపుచ్చక పోగా దాన్నే కథాసరణానికి ఉపయోగించుకున్నారు భాస్కర్ అక్కను సంస్కారంగల దాన్నిగా చెయ్యటం ఆమె చేతిలో ఉన్నపనే - కాని అలా చెయ్యలేదు అరుణ గుండెజబ్బును తీసేసినట్టు పోగొట్టి, ఆమెకు "అత్తయ్యా, మామయ్యా"ల ఆధారం అవసరం లేకుండా చేసి ఉండవచ్చు ఆ పని చెయ్యలేదు అసలు సమస్య సంస్కారానికి సంబంధించినదే అయినా దానివెంట ఆరోగ్య సమస్యా, ఆర్థిక సమస్యా, స్త్రీ సహజమైన అసూయా, అనుమానాలూ వేటకుక్కల్లాగా ఉండనే ఉన్నాయి (అరుణ తన భర్త విషయంలో పడే అసూయ ఏ స్త్రీ అయినా అర్థం చేసుకోగలదనుకుంటాను )

ఈ రచయిత్రి సంభాషణలు అదివరకే చాలా ప్రసిద్ధి సంపాదించుకున్నాయి వాటిలో మాట్లాడేవారి మనస్తత్వమే గాక కొన్ని జీవిత సత్యాలు కూడా మెరుపుల్లాగా మెరుస్తాయి ఉదాహరణలు ఈ నవల నిండా కొల్లలుగా దొరుకుతాయి మచ్చుకు ఒక్కటి మాత్రం చెబుతాను

"మనస్ఫూర్తిగా ప్రేమించిన వ్యక్తిని విడిచి, నీకోసం, ప్రాణాలు ఏ క్షణంలో ఎగిరిపోతాయో తెలీని నీకోసం సుమంగళిగా, సౌభాగ్యవతిగా మరణించాలనే నీ చివరి కోరిక కోసం నేను ఎంతో తాపత్రయపడ్డాను, నమ్ముతావా?" అని అరుణతో భాస్కర్ అంటాడు

నిజానికి ఇది అనగూడని మాట ఒక చవుకబారు కథల్లోనే నాయకుడిచేత ఉద్ధరించబడిన నాయిక చివరిదాకా తాను మురుగులోంచి రాణివాసానికి ఎగబాకానన్న విషయం జ్ఞాపకం ఉంచుకొని కృతజ్ఞతాభివందనా అర్పిస్తూ ఉంటుంది ఒక వ్యక్తిని మురికికూపంలోనుంచి ఉద్ధరించినవాడు ఆ వ్యక్తికి ఆ మురికికూపం మరుపు వచ్చేలాగా చెయ్యాలని చూడాలిగాని, దాన్ని జ్ఞప్తి చెయ్యరాదు

భాస్కర్‌ను చెప్పుతో కొట్టినట్టుగా అరుణ జవాబు చెబుతుంది " ఆ పరిస్థితిలో పెళ్ళి చేసుకొని నా చివరికోరిక తీర్చగలిగానని వెల్లడించుకుంటే ఎంతపేరూ, ఎంత ప్రతిష్ఠా!"

ఈ సంభాషణ జరిగేది పాఠకుడు భాస్కర్ పట్ల సానుభూతి చూపే ఘట్టంలోనన్న సంగతి గుర్తుంచుకుంటే ఈ రచయిత్రి సామర్థ్యం మరింత బాగా బోధపడుతుంది

ఈ పీఠికను ఇంక పొడిగించను ఇదొక నవల మాత్రమే గాక డాక్యుమెంటరీ కూడానూ (రాజశేఖర చరిత్రా, మాలపల్లీ కూడా అప్పటికాలానికి సంబంధించిన డాక్యుమెంటరీలే) ఇందులో, యుద్ధకాలంలో బర్మాలో జరిగిన సంఘటనలూ, అక్కడి నుంచి స్వదేశానికి తిరిగి రావటంలో మన భారతీయులు పడినపాట్లూ సాధారణ పరిస్థితుల్లో అసాధారణమైన సంఘటనలు ఏ విధంగా పరిపాటి అయిపోయేదీ చాలా వివరంగా చిత్రించబడ్డాయి ఈ నవల తయారుచేయడానికి అవసరమైన "పిండి"ని రచయిత్రి ఎన్నిచోట్ల నుంచి, ఎంత శ్రమపడి సేకరించిందీ మనం సులువుగా ఊహించవచ్చు

ఇది నిస్సందేహంగా తెలుగు నవలా చరిత్రలో ఒక సరికొత్త మైలురాయే దీన్ని గురించి ఆంధ్రులంతా గర్వించదగును

*ముప్పాళ రంగనాయకమ్మగారి నవల బలిపీఠం, 1966*

# 10. కథకుడుగా పిచ్చేశ్వరరావు

''అతను చనిపోయాడంటే నేను నమ్మలేను అతను యింకా నా కళ్ళకు కట్టినట్టు కనబడుతూనేవున్నాడు''!

ఈ మాటలు 'బ్రతకటం తెలియనివాడు' అన్న కథలో పిచ్చేశ్వరరావు రాసినవి నేను పిచ్చేశ్వరరావు గురించి ఇప్పటికీ ఈ మాటే అంటున్నాను

కొందరి చావులు మరికొందరికి అవాస్తవంగా వుంటాయి ఇది అనేకమందికి కలిగే అనుభవమే ఒక మనిషిచావు అవాస్తవం అనిపించటానికి కారణం ఏమిటని నేను ఆలోచించాను ఆ మనిషిమీది ప్రేమాభిమానాలు మాత్రమే అందుకు కారణం కావు, మనిషితోపాటు పోకుండా సజీవంగా మిగిలిపోయేదేదో వుంటుంది అదే మనిషిచావును నమ్మశక్యం కాకుండా చేస్తుంది

కొందరు చిరంజీవులున్నారని అందరమూ గుర్తిస్తాం కాళిదాసు చిరంజీవి, షేక్స్పియర్ చిరంజీవి, గురజాడ చిరంజీవి, టాల్స్టాయ్ చిరంజీవి, కార్ల్‌మార్క్స్ చిరంజీవి, ఈల్యిచ్ లెనిన్ చిరంజీవి - మానవ చరిత్రలో ఎందరో చిరంజీవులున్నారు వారిని ప్రపంచం గుర్తిస్తుంది

అయితే పిచ్చేశ్వరరావు ఈ తరగతికి చెందిన చిరంజీవి కాదేమో అటువంటి వాళ్ళు కొందరికి మాత్రమే చిరంజీవులౌతారు పిచ్చేశ్వరరావు విషయంలో అట్లా అనుకునే కొద్ది మందిలో నేనూ ఒకణ్ణి

నిజానికి పిచ్చేశ్వరరావును బాగా ఎరిగినాక అతని సజీవమైన భావచైతన్యాన్ని గుర్తించకుండా వుండటం సాధ్యం కాదు అతను చాలా సామర్థ్యాలూ కలవాడు? కాని వాటిని సాధ్యమైనంత గోప్యంగా దాచుకున్నాడు వాటిని దుకాణంలో పెట్టలేదు, ప్రదర్శించి కీర్తి తెచ్చుకోవటానికి మొదలే ప్రయత్నించలేదు హిందీ, ఇంగ్లీషూ, తెలుగూ బాగా వచ్చు బెంగాలీ కూడా వచ్చుననుకుంటాను శాస్త్రీయమైన దృక్పథం వున్నది కథలు రాశాడు, విమర్శలు రాశాడు, అనువాదాలు చేశాడు, సినిమా చిత్రాల సంభాషణలు రాశాడు ఏది రాసినా విశిష్టంగా, తన వ్యక్తిత్వం ఉట్టిపడేట్టు రాశాడు రాసేటప్పుడు అతను ఆత్మసంతృప్తి చూసుకున్నాడు గాని కీర్తిప్రతిష్ఠలు చూసుకున్నట్టు కనబడలేదు తనను గురించి తాను మాట్లాడుకునే అలవాటు అతనికి వుండేది కాదు అవతలివాడు తనను పొగిడినప్పుడు కూడా మృదువుగా విషయం మార్చేవాడు అందులో నమ్రత ఏమీ లేదు ఒక పుస్తకం అనువాదం చేస్తూ తాను మూలంలోకన్న అనువాదంలోని భాగాలను రసవంతంగా చేసినప్పుడు చెప్పేవాడు ఆ చెప్పటంలో గర్వంగాని, రొమ్ముచరుచుకోవటం గాని వుండేది కాదు

పిచ్చేశ్వరరావు చాలా రకాల అనుభవం గడించినవాడు, అనేక రకాల ప్రభావాలకు గురి అయినవాడు, అనుభవాలనూ, ప్రభావాలనూ అతను వ్యర్థం కానివ్వనూ లేదు వాటిలో కొట్టుకుపోయి ఆత్మవిస్మృతి చెందనూ లేదు అతనికేదో జీవిత లక్ష్యం ఉన్నట్టే కనిపించేది గాని, అది కథా రచనలో గాని, ఇతర రచనలతో గాని ముడిపడి వున్నట్టు కనబడేది కాదు తాను వీలైనంతగా పెరగటమే అతని ఏక లక్ష్యమని నాకు తోచేది అతను మితభాషి అన్న సంగతి అందరికీ తెలిసినదే మితభాషిత్వంతో పాటు మితశ్రవణం కూడా అతనికుండేది 'నాన్సెన్స్' మాటలు వినే ఓర్పు అతనిలో లవలేశం కూడా ఉండేది కాదు కాని తన మెదడుకు

మేతగా ఉపయోగిస్తాయనిపించే మాటలు గంటలతరబడి వినేవాడు, తన భావాలను మరొకరి బుర్రమీద సానపట్టే అవకాశం దొరికినప్పుడు గంటల తరబడి మాట్లాడేవాడు ఆత్మాభిమానం కలవాడు మహాసముద్రంలాంటి సినిమా రంగంలో కూడా తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకున్నవాడు

పిచ్చేశ్వరరావు మూడు, నాలుగు దశాబ్దాలలో జరిగిన జాతీయ, అంతర్జాతీయ సంఘటనలతో ప్రభావితుడై కథలు రాశాడు నేవీలో పని చేసిన నాటి అనుభవాల నుంచి 'జీవచ్ఛవాలు', 'చిరంజీవి' వచ్చాయి

'జీవచ్ఛవాలు'లో డిక్ అనే అమెరికన్ నావికుడి పాత్ర చిత్రించబడి ఉన్నది ''భూలోక స్వర్గం - స్వేచ్ఛకు పుట్టినిల్లు' అయిన అమెరికా గురించి పిచ్చేశ్వరరావు ఈ కథలో మనకు చెప్పినది చాలా కొద్ది, దేశాంతరాల నుంచి అమెరికా వెళ్ళేవారికి మొట్టమొదటగా న్యూయార్క్ రేవులో కనిపించేది స్వేచ్ఛా దేవత యొక్క బృహత్శిలా విగ్రహం దాన్ని సృష్టించిన వాడు అమెరికా దేశస్థుడు కాడు, అమెరికా గురించి భ్రమలు కల ఫ్రెంచివాడు ఆ స్వేచ్ఛాదేవత అమెరికాకు వీపుపెట్టి నిలబడి వుంటుంది భూలోక స్వర్గంలో ఒక పౌరుడైన డిక్ మరే విధంగానూ బతకలేక - అంటే తాగటానికీ, ఆడవాళ్ళలో తిరగటానికీ మరో మార్గం లేక - యంత్రంలో బోలుగా జీవించటం ఇష్టం లేక, చావు కాగితం మీద సంతకం పెట్టి నేవీలో చేరాడు చాలు! మనకు అమెరికా గురించి చాలా తెలిసింది

'చిరంజీవి'లో ఒక ప్రజానాయకుడి పాత్ర సృష్టించబడింది దేశాలు చూడటానికీ, అమ్మాయిలను అనుభవించటానికీ నేవీలో చేరినవాడికీ, జపానువాళ్ళను ఓడించాలనే పట్టుదలతో చేరినవాడికీ అధికారులు తేడా ఏమైనా చూపారా? చూపారు! ఆదర్శాలు గల వాణ్ణి పాకీ డ్యూటీకి వేశారు అతను న్యాయం కోసం పోరాడితే శిక్షించారు రేటింగులకు రాళ్ళ బియ్యమూ, పురుగుల భోజనమూ తినబెట్టారు ఆదర్శాలు గల వాడు ఎట్లా సహిస్తాడు? తిరగబడ్డాడు ఆ తిరగబాటుతోనే అతను రేటింగులకు నాయకుడయాడు చిల్లర ఆఫీసర్లు అతని దగ్గర తమ అశక్తత ఒప్పుకున్నారు కొంచెం పెద్దవాళ్ళకు అతను సింహస్వప్నంగా తయారయాడు చివరకు అతనికి దక్కినది తలలో ఒక తుపాకీగుండు అతని పేరు చిరంజీవి కాకుండా ఎందుకుంటుంది?

కళాకారుడికి శిల్పంలో పొదుపు అత్యవసరం ఈ పొదుపుకు ఆదర్శ ప్రాయమనదగినది 'నెత్తురుకథ' అయిదు పేజీలు పూర్తిగా లేని ఈ కథలో ఒక జీవితమే కాదు, ఎంతో చరిత్ర లిఖించి వున్నది ఆ రక్తం ఒక ఆడమనిషిది అందులో తెల్లకణాలు ఈదాయి, ఎర్రకణాలు ప్రవహించాయి అవును గాంధీజీ పటాన్ని పూజించి, ఖద్దరు కట్టి, రాట్నంజెండా చేతికిచ్చి భర్తను, దొంగలూ హంతకులూ వెళ్ళే జైలుకు హారతిచ్చి సాగనంపి తెల్లజెండాకు వందనం చేసింది, తరవాత నావికులు తిరగబాటు చేసినప్పుడు ఎర్రజెండాకు దణ్ణం పెట్టి, 'సమ్మె' చేసిన నావికులు తిండికి మాడకుండా రొట్టెలు కాల్చి అందించింది తెల్లవాళ్ళు పోయి ప్రజా ప్రభువులు వచ్చాక కూలిజనానికి బతుకు మరింత దుర్భరమయింది బొంబాయి పాకీవాళ్ళు సమ్మె చేశారు అహింసా తుపాకులుకాల్పులు చేశాయి ఇంటి వరండాలో ఎత్తున కూర్చున్న ఓ ముసలిది చచ్చింది ఆ ఫొటో మనలో కొందరం చూశాం వరండాలో అయిన రక్తం మడుగు మీద పిచ్చేశ్వరరావు కాల్షియం ఇంజెక్షన్ లాటి కథ రాశాడు

ప్రపంచం ముందుకు పోతున్నది మనం ఇంకా 'నిన్న'లోనే ఉన్నాం చీనాలో ఉదయించిన సూర్యుడు కొద్ది గంటలయాక మన దేశంలోనూ ఉదయిస్తాడు ఒక దేశానికి 'నేడు' వచ్చినాక ఇతర దేశాల వాళ్ళు ఎంతోసేపు 'నిన్న'లో ఉండరు కాని యుద్ధం అయిపోయింది మిగిలిన దేశాలు 'ఇవాళ' అందుకున్నాయి కాని 'విన్నీ' ఎవరినీ ప్రేమించకుండా అందరి ప్రేమకూ అమ్ముడవుతూ ఇంకా 'నిన్న'లోనే జీవిస్తూ 'నిన్న' ఎప్పుడు పోతుందా, తాను ఎప్పుడు లంతరిస్తుందా అని మాస్తున్నది 'విన్నీ' మారిపోయింది, కాని అంతరించలేదు మిగితా ప్రపంచానికి 'రేపు' కూడా వచ్చేసింది మనంమటుకు 'మొన్న'లోకి దిగజారాం పిచ్చేశ్వరరావు యుద్ధానంతరం రాసిన 'గడవని నిన్న' మనకిప్పుడు 'గడవని మొన్న'గా పరిణమించినట్టు కనబడుతుంది

సెటైర్ ప్రధానంగా పెట్టుకుని పిచ్చేశ్వరరావు కొన్ని కథలు రాశాడు 'కోరిన వరం' అన్న కథ ఒక ప్రార్థన, ప్రార్థనలు ఎంత నిరుపయోగమైనవో ఆ ప్రార్థనే చెబుతుంది 'వెర్రికాదు వేదాంతం' అన్న కథనిండా అభ్యుదయ నిరోధకమైన వేదాంతం ఉన్నది దాన్ని చదివితే మనకనిపించేది, 'వేదాంతం కాదు వెర్రి' అని స్వాతంత్ర్యం రావటంతో కొమ్మెక్కి కూర్చున్న స్వార్థపరుల మనస్తత్వం 'డొంకల వంకల మనసులు' అన్న కథలో చిత్రించబడింది 'శాస్త్రి' ఒక అప్రతిభుడైన కవి, తన చేతకానితనాన్ని నవీనత్వం చాటున మాయజూస్తాడు 'కళకళ కోసమే'నంటాడు తన కవిత్వాన్ని ఎవరూ అర్థం చేసుకోలేరని వాపోతాడు '' ఐతే ఇంకెందుకు? చాలులే తగలెయ్యి'' అంటాడు మిత్రుడు (సత్యం)

'సబద్ధం' మరొక రకం వ్యంగ్య రచన అబద్ధాలాడే వాళ్ళకు మాత్రమే సభ్యులయే అర్హత గల క్లబ్బొకటి ఉన్నది అందులో రాజకీయవేత్తలు చాలా మంది సభ్యులుగా చేరవచ్చు!

' ఒక అనుభవం' అన్న కథ ఒక రైలుపెట్టెలో జరుగుతుంది ఒక కోరమీసాలవాడు ఒక అర్భకుణ్ణి పట్టుకుని యుద్ధం ఎందుకు వచ్చిందో చెప్పమని కవ్విస్తాడు ఇంకో పొట్టివాడు పెద్ద హోల్డాలుతో వచ్చి అందర్నీ భయపెడతాడు వాడి మూలంగా పెట్టెలో వున్న పిల్లలకూ, యితరులకూ ప్రమాదం జరుగుతుందేమోనని హెచ్చరించిన వాళ్ళని, ' ఆ హోల్డాలాయన మీద పడిందా, నీ మీద పడిందా, ఆ అబ్బాయి వాళ్ళబ్బాయా, నీ అబ్బాయా?'' అని అడుగుతాడు అంటే ఎవరి గొడవ వాళ్ళు చూచుకోవాలి! ఇంకొకరి సంగతి విచారించవద్దని! చివరకు అందరూ కలిసి అర్భకుణ్ణే గోడకేసి నొక్కేస్తారు

'విముక్తి' తెలంగాణా పోరాటంలో ప్రజా విజయంలో (ఒక గ్రామంలో) చిత్రించే కథ 'బ్రతకటం తెలియనివాడు'లో ప్రధాన పాత్ర కమ్యూనిస్టు 48-50 మధ్య కలిగిన ఉద్రిక్తతలో అతను తుపాకులకెదురుగా, తుపాకి పట్టి చనిపోతాడు ఈ రెండూ కూడా పిచ్చేశ్వరరావు రాసిన ఉత్తమ కథలలో చేర్చదగినవే

'గడచిన దినాలు'-ఒకప్పుడు భర్తలు భార్యల పట్ల ఎంత పశువుల్లాగా ప్రవర్తించే వారో తెలుపుతుంది

'ఆగస్టు 15' ఒక అధివాస్తవిక రచన ఇదొక ప్రయోగంగా కనబడుతుంది నిజమైన స్వాతంత్ర్యం ఏమిటో, దానికోసం భవిష్యత్తులో ఎలా పోరాటం సాగాలో ఈ కథ చిత్రిస్తుంది

కాటూరు-యలమర్రు సంఘటనల ప్రేరణతో పిచ్చేశ్వరరావు ఈ కథ రాశాడని నేను ఊహిస్తున్నాను

కథకుడుగా పిచ్చేశ్వరరావును గురించి ఒక్క ముక్క చెప్పవచ్చు అతను గొప్ప కథలు రాయాలని కనిపెట్టుకుని ఏ కథా రాయలేదు, సద్యఃప్రయోజనాన్ని మటుకే మనసులో పెట్టుకుని కథలు రాశాడు ఏ కారణంచేతనో అతనికి కథలు రాయాలన్న అభిలాష క్రమంగా తగ్గిపోయింది నేనెరిగినంతలో అతని కథలు కనీసం నాలుగైదు ఉత్తమ తెలుగు కథానికా సాహిత్యంలో శాశ్వతంగా నిలవగలిగినవిగా ఉన్నాయి

*పిచ్చేశ్వరరావు కథలు, 26-9-1967*
*పునర్ముద్రణ విశాలాంధ్ర, దినపత్రిక, 1-10-1967*

# 11. ప్రస్తావన

మన దేశంలో, అందులోను ప్రత్యేకించి ఆంధ్రలో, ఏనాడూ పుస్తక ప్రచురణ తృప్తికరంగా లేదు ఇందుకు ముఖ్య కారణాలు చెప్పాలంటే

1 మన వారిలో పఠనాభిలాష తక్కువ కాఫీహోటళ్ళ అవసరం కన్నా, సినిమాల అవసరం కన్నా పుస్తకాల అవసరం ఏ విధంగానూ తక్కువయినది కాదు హోటలు కాఫీ, సినిమా చిత్రమూ తాత్కాలికమైన ఆనందమే ఇస్తాయి మంచి పుస్తకం ఒకసారి కొంటే ఎప్పటికీ మన దగ్గరే ఉంటుంది దాన్ని ఎన్నిసార్లయినా చదువుకోవచ్చు ఎంతమందికైనా ఇవ్వవచ్చు జనాభాలో మనకన్నా తక్కువైనప్పటికీ, మన సోదరులైన తమిళులు మనకంటె బాగా పత్రికలను, పుస్తకాలను ప్రోత్సహిస్తారు

2 మనలో మంచి పుస్తకాలకు తగినంత ప్రచారం లేదు పుస్తకాలకు పబ్లిసిటీ లేదు పుస్తక ప్రచురణకు 'న్యూస్‌వాల్యూ' లేదు రివ్యూలు అప్పుడప్పుడూ పత్రికలలో వస్తాయి కాని ఆ రివ్యూలను బట్టి పుస్తకాల తారతమ్యం తెలియదు ఇతర దేశాలలో ముఖ్యమైన పుస్తకం వెలువడిందంటే, అది అచ్చుకాక మునుపునుంచీ పబ్లిసిటీ ప్రారంభమవుతుంది ఒక్కొక్కసారి ఈ పబ్లిసిటీ ఎంతదాకా వెళుతుందంటే పుస్తకం అచ్చయి బయటకు వచ్చేలోపుగా కాపీలన్నీ ముందుగానే అమ్ముడయిపోతాయి

నిజానికి ఈ పబ్లిసిటీ బాధ్యత పబ్లిషర్లది మన దేశంలో నిజమైన పబ్లిషర్లు దాదాపు లేరనాలి ఉన్నవారిలో ఒకరిద్దరిని మినహాయిస్తే మిగిలిన వాళ్ళు చేసేది వ్యాపారమనిపించుకోదు అదొక రకం గృహ పరిశ్రమ దీనికి వ్యాపారహంగులు లేవు కొందరు పబ్లిషర్లు తాము అచ్చువేసే పుస్తకాల కాపీలను రివ్యూ నిమిత్తం కూడా పంపరు అచ్చయిన పుస్తకం ఏదోవిధంగా చేతినుంచి వదిలి, నాలుగు డబ్బులు మిగలటమే వారికి కావలసింది

పుస్తకాలు ప్రచురించి లక్షలు గడించటం సాధ్యమైనదేనని రుజువుచేసిన పబ్లిషర్లు ఇద్దరు ముగ్గురు లేకపోలేదు కాని వీరి కృషి కూడా సమగ్రమైనదీ శ్లాఘనీయమైనదీ కాదు ఎందుచేతనంటే ఈ పబ్లిషర్లలో రచయితలనూ, లోకాన్ని కూడా వంచించిన వాళ్ళున్నారు సాహిత్యగౌరవానికి అర్థం కాని పుస్తకాలను బళ్ళతో సరఫరా చేసిన వాళ్ళున్నారు

పుస్తక ప్రచురణ మహోద్యమాలలో ఒకటి దానికి చాలా హంగులు కావాలి దేశంలో అంతకంతకూ పెరిగే సంఖ్యలో పుస్తక ప్రియులుండాలి, పుస్తకాల విలువను సరిగా అంచనా కట్టగల సద్విమర్శకులుండాలి, రచయితలకూ, పుస్తకాలకూ తగినంత పబ్లిసిటీ ఉండాలి - సినిమా తారలకూ, మంత్రులకూ ఉన్నంత పబ్లిసిటీ ఉండితీరాలి, వారు వీరికన్న ఏ విధంగానూ తీసిపోరు

ప్రస్తుతం మంచి రచయితలకు కొంత ప్రచారం జరుగుతున్న మాట నిజమే కాని ఇది హెచ్చుగా పత్రికల ఉత్సాహం (స్వార్థం?) కొద్దీ జరుగుతున్నది రచయిత్రులకు ఆర్థికంగా లభించే కొద్దిపాటి పబ్లిసిటీ కూడా జరుగుతూనే ఉన్నది అందువల్ల స్త్రీలు రచించిన పుస్తకాలకూ, నవలలకూ కొంత గిరాకీ కలిగిన మాట నిజం అయితే ఇది కూడా పుస్తక ప్రచురణోద్యమం అని గట్టిగా చెప్పలేం - పాక్షిక ఉద్యమం

ఇటీవలి కాలంలో పుస్తక ప్రచురణా, పంపకమూ మొదలైన వాటిలో కొన్ని విపరీత పరిణామాలు కలిగాయి ఒకప్పుడు - పుస్తకాలు చాలా అరుదుగా ప్రచురితమయే కాలంలో - పుస్తకాల అమ్మకాలకు లైబ్రరీలు పెద్ద ప్రతిబంధకంగా ఉన్నట్టు భావించటం జరిగింది లైబ్రరీలో పెట్టిన పుస్తకాన్ని ఎందరో చదువుతారు దాన్ని వారు కొనరు ఆ విధంగా ప్రచురణకర్త - సాధారణంగా రచయితే - దెబ్బతింటాడు

ఈ వాదానికి కాలదోషం పట్టింది లైబ్రరీల సంఖ్య పెరిగింది బ్లాకులు వెలిశాయి పూర్వం వెయ్యి కాపీలు చెల్లాలంటే ఏళ్ళు పట్టేది ఇప్పుడు ఒక సీజనులో వెయ్యా, పదిహేనువందల కాపీలు లైబ్రరీల కిందనే చెల్లిపోతాయి విడికాపీలు అమ్మకపోయినా తొందరలేదు ఈ పరిస్థితే పుస్తక ప్రచురణకు ఎంతో ప్రోత్సాహమిచ్చి, ప్రచురణ సంస్థల సంఖ్య వెర్రిగా పెరిగిపోవడానికి దోహదం చేసింది

అయితే ఈ పరిస్థితి కూడా మళ్ళీ మరిచిపోయే సూచనలు కానవస్తున్నాయి ప్రభుత్వ గ్రాంటులు సన్నగిల్లిపోతున్నాయి దేశంలో ఆర్థిక ప్రతిష్ఠంభన సన్నగా ప్రారంభమయింది లైబ్రరీల మీద ఆధారపడే అవకాశం బాగా దెబ్బతినే పక్షంలో చాలా మంది పుస్తక ప్రచురణ విరమించుకుంటారు తిరిగి పుస్తకపరనాసక్తి గల ప్రజలే పుస్తకాలను ఆదరించవలసిన అవసరం ఏర్పడుతుంది

అయితే అందుకొక అవాంతరం అదివరకే ఏర్పడి ఉన్నది లైబ్రరీల కొనుగోళ్ళపై ఆధారపడి పుస్తక ప్రచురణ సాగించిన వారు పోటీలు పడి లంచాలు కుమ్మరించి, కమీషనులిచ్చి, ఆ బరువంతా పుస్తకం ధరలో చేర్చేశారు పుస్తకం అచ్చు వెయ్యటానికయే ఖర్చుకు ఆరింతలూ, ఎనిమిదింతలూ దాని మూల్యమై కూర్చున్నది అందుచేత ఎంత పరనాసక్తి గలవాడు కూడా పుస్తకం కొనాలంటే భయపడ్డాడు ఈ విధంగా ప్రచురణకర్తలు ప్రజల నుండే పుస్తకాలను కొనే అలవాటును చేజేతులా నిర్మూలించుకున్నారు ఆ పొరపాటుకు ముందు ముందు అనుభవించవలసి ఉన్నది

రచయితలు ప్రజలు చదివి ఆనందించగలందులకు పుస్తకాలు రాస్తారు అందరు శ్రామికులలాగే వారు కూడా తమ తెలివితేటలకూ, శ్రమకూ తగిన ప్రతిఫలం ఆశిస్తారు అన్ని పుస్తకాలూ ప్రజలలో ఉండే అన్ని అభిరుచులకూ అనుగుణంగా ఉండకపోవచ్చు

పుస్తక ప్రచురణ అన్ని రకాల అభిరుచులకూ అనుగుణంగా కొనసాగవలసిందే కాని ప్రచురితమైన పుస్తకానికీ, దాన్ని చదువగోరే వారికీ మధ్య విశాలమైన రహదార్లుండటం అవసరం - ప్రతిబంధకాలు ఏ రూపంలో ఉన్నా అవాంఛనీయమే ఈ రహదారిని ఏర్పరచుకునే బాధ్యత కొంతవరకు ప్రజలపైన కూడా ఉన్నది ప్రజలు తమ అభిమాన రచయితలనూ, వారి రచనలనూ ప్రోత్సహించినట్టయితే పుస్తక ప్రచురణలో ఏర్పడిన అవకతవకలు చాలా మటుకు సర్దుబాటు అయి తీరుతాయి ప్రజలు పుస్తకాలను కొని చదివే అలవాటు చేసుకోవటం ఎంతైనా అవసరం

*దాసరి సుబ్రహ్మణ్యం 'ఇంద్రాణి' కథల సంపుటి, 14-10-1967*

# 12. అభిప్రాయం

*"What distinguishes journalism from literature? One difference, ofcourse, is the requirement of immediate and complete readability which is imposed on the journalist whereas a book does not have to be intelligiblefar less readable - to rank as great literature, an article which is unreadable forfeits any claim to journalism "*

*– R H S Crossman*

తెలుగులో నిజమైన సాహిత్యం చాలా తక్కువగానే ఉంటున్నదని దిగులుపడే వాళ్ళున్నారు కాని మంచి జర్నలిజం ఇంకా తక్కువగా ఉన్న సంగతి చాలా మంది గుర్తించినట్టు కనబడదు దానికి కారణం ఆధునిక యుగంలో జర్నలిజంకు గల విలువ జనసామాన్యానికి తెలియకపోవటమే సాహిత్యంలో ఉండే భేషజం కూడా జర్నలిజంలో లేదు అది వర్తమాన సామాజికుడితో వర్తమాన జీవితం గురించి నిత్య వ్యావహారికంలో మాట్లాడుతుంది

సాహిత్యం శాశ్వతమైన విలువలు గలదనీ, జర్నలిజం తాత్కాలికమైన విలువ గలదనీ అధిక సంఖ్యాకుల అభిప్రాయం దీనికి పూర్తిగా విరుద్ధమైన అభిప్రాయం గల పాశ్చాత్య విమర్శకుడు కనీసం ఒక్కడున్నట్టు నాకు తెలుసు

జర్నలిజంలో గట్టి వాళ్ళ కింద లెక్కించదగిన వారు తెలుగులో బహుకొద్దిమందని అంచనా నాకు మంచి సాహిత్యమంటే ఎంత ఇష్టమో, మంచి జర్నలిజం అన్నా అంత ఇష్టమూ ఉంది అందుకే నేను ' ఇల్లాలి ముచ్చట్లు' విడవకుండా చదువుతూ వస్తున్నాను తెలుగులో జర్నలిజంకు గొప్ప సేవ చేసి, అందులో ఒక కొత్త శకం ప్రారంభించిన నార్ల వారి వారపత్రికలో వెలువడుతున్న ' ఇల్లాలి ముచ్చట్లు' శీర్షిక తెలుగు జర్నలిజంలో ఒక సరికొత్త ప్రయోగం కావటమే గాక, చాలా విజయవంతమైన ప్రయోగం

ఈ మాట అనటానికి నాకున్న ఆధారాలేవి?

అది ములుకుతాళ్ళ చరణాకోల దాన్ని ఒక్కసారి ఝుళిపిస్తే అనేక చోట్ల గాయాలవుతాయి గ్రాండ్ కాన్యాన్‌లో లాగా ఒక్క ధ్వనికి అనేక ప్రతిధ్వనులు వినిపిస్తాయి ఇట్లా రాయటం తేలిక అని ఎవరన్నా భ్రమపడినట్టయితే ప్రయత్నించి చూడవచ్చు

ఇంకొక సంగతి 'ఇల్లాలి ముచ్చట్లు' సోషల్ ఇన్హిబిషన్స్ అనే వాటికి గొడ్డలిపెట్టు మంచి జర్నలిజంకు ఉండదగిన ఉన్నతాశయాలలో ఇది కూడా ఒకటి సంప్రదాయసిద్ధంగా కొన్ని

మానసిక జాడ్యాలు గుణాలుగా ప్రచారమవుతాయి వాటి మాడుపెంకు ఎవరో ఒకరు ఎప్పుడో ఒకప్పుడు పగలగొట్టాలి దానికి జర్నలిస్టు కన్న తగిన వాడెవడు? ఉదాత్తత పేరుతో వెధవమాటలూ, వెధవ భాషా రాసి, గొప్ప నటన పేరుతో వెధవ ఫోజులు పెట్టి, లోకోద్ధరణ పేరుతో జనాన్ని వంచించే వాళ్ళు సమాజం నిండా కుప్పతెప్పలుగా కుక్కగొడుగుల్లా పుట్టుకొస్తుంటే మంచి జర్నలిస్టు చూస్తూ వూరుకుంటాడా?

మరొక సంగతి మరువరాని పాత్రలు సాహిత్యంలోనే పుట్టుకొస్తాయనే అభిప్రాయం చాలామందికున్నది చచ్చి స్వర్గాన వున్న మహంకాళి శ్రీరామ్మూర్తి 'శేషయ్య', 'ప్రభా'లను చిరస్మరణీయంగా సృష్టించి, జర్నలిజంలో కూడా నాలుగు కాలాల పాటు నిలిచే పాత్రలు పుడతాయని చూపించాడు ఈనాడు 'పురాణంసీత' ఒక విచిత్రమైన పాత్ర రేపో ఎల్లుండో సీత ప్రభావం సినిమా హీరోయిన్‌ల పైన కూడా పడబోతుంది వాళ్ళు కూడా ' ఆల్‌రైట్ ఐడోంట్ కేర్' అనటం మొదలుపెడితే నామటుకు నేను ఆశ్చర్యపడను

' ఇల్లాలి ముచ్చట్లు' పుస్తకంగా వెలువడితే 'హాట్ కేక్స్'లా అమ్ముడవుతుందన్న అభిప్రాయం అదివరకే జనం మధ్య పడింది ఇప్పుడా పుస్తకం వెలువడుతున్నది తెలుగు వాళ్ళకు 'హాట్‌కేక్స్' ఏపాటి ఇష్టమో త్వరలోనే రుజువవుతుంది

*ముద్రణ పురాణం సుబ్రహ్మణ్యశర్మ*
*'ఇల్లాలి ముచ్చట్లు'కి పరిచయం - 1968*

# 13. ప్రస్తావన

కథలు కూడా మనుషుల్లాటివే వాటికి బీజం కథకుడి మేధస్సులో పుడుతుంది అదే కథలకు గర్భకోశం అక్కడ వాటికి ప్రాణమూ, ఆకారమూ ఏర్పడతాయి రచనతో వాటికి జన్మ లభిస్తుంది అప్పుడే వాటి జీవితం కూడా ఆరంభమవుతుంది

మనుషులకున్నట్టే కథలకు కూడా జాతి లక్షణాలున్నాయి పైపై దుస్తులు మభ్యపెట్టలేవు మనిషిని చూడగానే ''వీడు తెల్లవాడు వీడిది మంగోలియా జాతి ముఖం వీడిలో నీగ్రో రక్తం వుంది'' అని చెప్పినట్టుగానే, కథ చదవగానే, '' ఇది పాశ్చాత్య కథ, ఇది దేశవాళీ సరుకు, ఇది తెలుగు కథ మటుకు కాదు'' అని చెప్పవచ్చు

కాకపోతే మనుషులలో జాతి సాంకర్యం ఉంటుందేమో గాని, కృత్రిమ కల్పనలుండవు- రోబట్‌లను మినహాయిస్తే కాని కథల్లో వుంటాయి

ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, కథలు చదివే వాళ్ళకు కథల పట్ల కలిగే భావాలు, మనుషుల పట్ల కలిగే భావాలకు యేమంత భిన్నంగా ఉండవు

ఈ చిన్న పుస్తకంలో ఉన్న కథలు అచ్చమైన తెలుగు కథలు జీవితానికి అత్యంత సన్నిహితమైనవి ఈ యువ కథకుడు రెక్కలు కట్టుకొని గాలిలో ఎగరటానికి గాని, ఎత్తు నుంచి మనుషులను పాకే పురుగుల్లాగా చూడటానికి గాని ఎలాటి ప్రయత్నమూ చెయ్యలేదు తాను సృష్టించిన పాత్రలలో తాను కూడా ఒకడుగానే మసలుతున్నాడు

ఈ పుస్తకంలో బ్రహ్మరాక్షసి, వాడిన మల్లెలు, త్రిశంకుస్వర్గం, చెదపురుగు, నీటి మీద తేట, కథకుడి కథ, గానుగెద్దు జీవితాలు, హంపీ అనుభవం, అనుబంధాలూ - అవరోధాలూ, వ్యక్తావ్యక్తాలు, ప్రణయమూ - పరిధి, ఆచరణ, ఆపదమొక్కు అన్న పదమూడు కథలున్నాయి

ఏ ఒక్క కథలోనూ రచయిత కథను సాగదీయటం గానీ, జీవితం గురించి తనకు గల భ్రమలు తెలిసో తెలియకో బయటపెట్టుకోవటం గానీ మనకు కనబడదు రాయవలిసిన దానికన్న తక్కువే రాయటమూ, అసలు సారాంశాన్ని పాఠకుడికే వదలటమూ కూడా మనకు కనిపిస్తుంది ఆ విధంగా ఈ కథలు పాఠకుడి ఆలోచనను రెచ్చగొట్టుతాయి

కొన్ని కథల్లో అసమగ్ర కథనం కూడా మనకు కనబడుతుంది ఇది ఒక విధంగా శిల్పలోపమే కాని ఈ కథకుడు శిల్పం కోసం ప్రత్యేకంగా శ్రమించేటట్టు కనబడదు ''బ్రహ్మరాక్షసి''లో సుభద్ర మొగుడి ఉద్యోగం ఎందుకు పోయింది? ''వాడిన మల్లెలు''లో కథకుడు ఆ హోటలు గదిలో ఏం చేస్తున్నాడు? ''త్రిశంకుస్వర్గం''లో తన కూతుర్ని సుందరానికి ఇవ్వటానికి బాలాంబ తండ్రి ఎందుకు నిరాకరించాడు? ఇలాటి ప్రశ్నలు పాఠకులు అడగటానికి ఆస్కారం ఉండేలాగా కథారచన చేసిన ఈ రచయిత బుద్ధిపూర్వకంగానే ఈ పని చేసినట్టు కనబడుతుంది నిజానికి ఉద్యోగం పోవటానికి కారణం యేదైతేనేం? రోజూ వేలాది ఉద్యోగులు నిరుద్యోగులవుతూనే వున్నారు అలాగే ఒక పిల్లను ఒక పిల్లవాడికిచ్చి చెయ్యకపోవటమనేది నిత్యమూ జరుగుతూనే ఉన్నది అలాగే కథలు వ్రాసే వాళ్లు ఏ పని మీద ఏయే వూళ్ళో వెళ్ళి, హోటలు గదులలో దిగుతూంటారు అలాటి వివరణలు ఇస్తూ కూర్చునే మనస్తత్వం ఈ కథకుడిలో లేదు ఇతను పాఠకుడి ఊహాశక్తినీ, కాలాన్నీ కూడా గౌరవిస్తాడు

ఇతని రచనా విధానానికి మచ్చుతునక కింద 'చెదపురుగు'' అనే కథను తీసుకుందాం ఇందులో మూడే పాత్రలు - ఒక కథకుడూ, ఒక పత్రికాధిపతీ, ఒక వీటి మనిషీనూ పత్రికాధిపతి ఘరానా మనిషి కార్లలో తిరుగుతాడు, తాగుతాడు, పత్రిక్కి సెక్సు కథలు కావాలంటాడు ప్రభుత్వం చేసే తప్పుడు పనులను సమర్థిస్తాడు - తానే ప్రభుత్వం అయినట్టు, ప్రభుత్వోద్యోగుల మీద ఏమీ సానుభూతి లేదు అతని పేరు గోపాలరావు

వీటిమనిషి శేషమాంబ జట్కాబండితోలే ఖాసిం ''నీకేదో బేరం తగిలింది చూడు'' అంటే ఆగ్రహించదు వచ్చినవాడు తనతో రాత్రి గడపటానికి రాలేదని తెలియగానే అతనికి పడక ఏర్పాటు చేసి వెళ్ళిపోతుంది తనను నాటకంలో వేషం వెయ్యమని బయానాడబ్బు చేతపెడితే, ''నా గోత్రము వినకుండానే అడ్వాన్సు ఇస్తున్నారు తీరా నాటకము రోజున విని బాధపడవలసి వస్తే నా బాధ్యత లేదు,'' అనటమే గాక, తన పాట పాడి కూడా వినిపిస్తుంది అతనిలో తాను రేపెట్టిన అనుమానాన్ని తానే రద్దు చేస్తుంది

ఇప్పటికేమనం ''ఘరానా'' గోపాలరావులో మానవత్వం లోపించిదనీ,''వీటి'' శేషమాంబలో అది పుష్కలంగా ఉందనీ తెలుసుకుంటాం కాని దీనిపైన కొసరు సంగతి ఒకటుంది శేషమాంబ ఇంట గోపాలరావు ఫోటో ఉండటం చూసి - కథకుడు, స్త్రీలంపటుడైన గోపాలరావుకు ఈమెతో కూడా స్నేహం ఉంది కాబోలనుకుంటాడు అలా అనుకున్నందుకు తరవాత కథకుడెంత బాధపడ్డాడో మనం ఊహించవలసిందేగాని కథ చెప్పదు ఏమంటే

''గోపాలరావు నాకు స్వయానా అన్నయ్య అప్పుడప్పుడు ఇక్కడికి వస్తూనే ఉంటాడు నా మీది అభిమానం తోటి కాదనుకోండి, నా డబ్బు కోసం!'' అని శేషమాంబ కథకుడితో చెబుతుంది ఆ ముక్కతో పాత్రలన్నీ మొనతేలిపోతాయి

ఈ కథకుడికి శిల్పం లేదనీ, రాదనీ ఎవరికైనా అపోహ ఉన్నట్లయితే ఈ కథ చదివి, ఎనలైజు చేసినట్లయితే ఆ అపోహ పూర్తిగా తొలగి పోతుంది

ఆధునిక తెలుగు సాహిత్యంలో నన్ను ముగ్ధుణ్ణి చేసిన కథలు చాలా ఉన్నాయి వాటిలో ఇది ఒకటి

ఈ కథలు చాలా వాటిలో డబ్బు ప్రధాన ఇతివృత్తం అది వివిధ రంగాలలో మనుషుల చేత ఎలా ఆడిస్తుందో ఈ కథలు వ్యక్తం చేస్తాయి పెళ్ళి సమస్యలూ, ప్రేమ సమస్యలూ కూడా ఇతివృత్తాలుగా ఉన్న కథలిందులో వున్నాయి వాటి పరిష్కారానికి డబ్బు అడ్డురానప్పుడు పాత భావాలు అడ్డు తగులుతాయి

''బ్రహ్మరాక్షసి''లో తన భర్త కమ్యూనిష్టు కాకపోయినా అతని ఉద్యోగం పోవటాన్ని సుభద్ర అర్థం చేసుకోలేకపోతుంది

''వాడినమల్లెలు''లో ఒక అభాగ్యురాలు (కథలోకి రాదు) ఒక వంచకుడికి తన శరీరం తాకట్టుపెట్టి, తన తమ్ముడికి ఉద్యోగం సంపాదించ యత్నించి రెండు విధాలా వంచిత అవుతుంది

''త్రిశంకుస్వర్గం''లో ఉన్న బాలాంబ, తన పెళ్ళి విషయంలో చేసిన అవకతవక పనే తన కూతురి విషయంలో చేసినంత పనీ చేస్తుంది ''జీర్ణించుకుపోయిన సాంప్రదాయం అంతకన్నా ఏమీలేదు '' నిజమే కాని కొత్త సాంప్రదాయం రాని కారణం చేత త్రిశంకుస్వర్గం ''కథకుడి'' కథలో కూడా జీర్ణించుకుపోయిన సంప్రదాయమే కనబడుతుంది

''గానుగెద్దు జీవితాలు''లో ఒకటిగాని సమస్య ప్రేమరహిత దాంపత్యం భర్త పేదవాడు భార్యకు ''ఉన్నత'' జీవితం కావాలి ''దీనికే పరిష్కార మార్గం లేదు ఇష్టమున్నా లేకపోయినా కాపురం సాగించి తీరవలిసిందే '' ఇద్దరి హృదయాలలోని అశాంతీ, అలజడీ పక్కలో కాస్సేపు మాయమవుతాయి

''హంపీ అనుభవం''లో గంపెడు పిల్లలు గల అన్నా, వదినా సావిత్రి సంపాదన మీద అధారపడ్డవాళ్ళు కావటం చేత ఆమెకు పెళ్ళి పడకుండా ఏళ్ల తరబడి చేస్తారు వాళ్ళు చేసినది హేయమైనపనే కాని రచయిత వాళ్ళ పేదరికం చూసి వాళ్ళపైన కూడా సానుభూతి ప్రకటిస్తాడు

''అనుబంధాలూ - అవరోధాలూ''లో డబ్బు సంప్రదాయాన్ని తన్నేస్తుందేగాని, హృదయాలను మార్చదు పెద్దకూతురు సంప్రదాయ విరుద్ధంగా మళ్ళీ పెళ్ళి చేసుకున్నందుకు వెలిగా చూసిన తండ్రి తన రెండో కూతురి పెళ్ళికి పదివేలు పెద్దల్లుడి దగ్గిరే తీసుకుంటాడు - కాని పెద్దకూతుర్ని పెళ్ళికి పిలవడు పుట్టింటి మీద మమకారం పెట్టుకొని ఉన్న పార్వతి కుప్పకూలిపోతుంది

''వ్యక్తావ్యక్తాలు'' కామాక్షి సంసారపక్షమైన టాపం గలది భర్త చాలా అందగాడు భార్యని ఎంతో ప్రేమతో చూస్తాడు కాని కామాక్షికి వైవాహిక జీవితం అంపశయ్య భర్తని నిశితంగా పరీక్షించింది అతని ప్రేమ దక్కుతుందన్న నమ్మకం కుదరలేదు ''తను ఆయనకు తగగనే భయం గుండెల మీద గుద్దుతూంటుంది '' మొట్టమొదట ఆమెకొక సంబంధం

వచ్చింది వరుడు నిరక్షణుడు కాయకష్టం చేసేవాడు జబ్బుపుష్టికలవాడు తనకేసి మెరిసే కళ్ళతోచూశాడు అతణ్ణి చేసుకుంటే కామాక్షి సుఖపడేది! అదే ఈ కథలోఉన్న ఐరనీ

''ఆచరణ''లో మేరీ తన ఐహిక భారాలన్నీ దేవుడిపైన వేసి, దేవుడు పంపించగా, సుబ్బారావుకు శరీరం ఇచ్చి ఉద్యోగం సంపాదించుకుంటుంది 'మేరీకి ఉద్యోగం చూపించిన 'తండ్రి' సుబ్బారావు!''

''ఆపదమొక్కు'' లో బాదరాయణ బంధువైన పిన్నిగారు రామం మీద ''అవాజ్యం''గా కనకవర్షం కురిపిస్తుంది కాని ఆ ''వాజ్యం'' చివరకు బయట పడుతుంది దేవుడికైనా ఆపదలోనే గదా మీదుగడతారు?

ఇవి చాలా నిరాడంబరమైన కథలు నిరాడంబరుడు రాసినవి పదునైనవి ప్రతి కథా సంఘం మీద ఒక బలమైన గాటు పెట్టింది చదవండి వీటిని మళ్ళీ మళ్ళీ చదవొచ్చు ఏ మాత్రం విసుగెత్తదు

*సొదుం జయరాం, 'వాడిన మల్లెలు'కి పీఠిక, 13-11-1968*

# 14. ఉపోద్ఘాతం

మనుషుల్లో ఉన్నన్ని రకాలు కథల్లోనూ ఉన్నాయి పురుషులందు పుణ్యపురుషులు వేరయా అన్నట్టు కథల్లో గొప్ప కథలు వేరు గొప్ప కథకులు అన్నపుడ్పుడల్లా రారు గొప్ప కథకులు వస్తేగాని గొప్పకథలురావు ఏ చెడు ఆ కాయే కాయటం తప్పనిసరిగద

ఎవరు గొప్ప కథకులు? ఏవి గొప్ప కథలు? ఆ మాట చెప్పేవారెవరు? ఈ ప్రశ్నలను అడ్డం పెట్టుకొని, అన్ని కథలు ఒకటే, అందరు కథకులూ ఒకటే అని వాదించవచ్చు కాని ఎవరూ చూడకుండా జరిగినపనికి అంతరాత్మసాక్షి అన్నట్టుగా ఏది గొప్ప కథ అన్నదానికి కథలు చదవటంలో సమర్థులే సాక్షి కథలు అందరూ రాయలేనట్టే అందరూ చదవలేరు ఏ కథనైనా, చదవవలసిన విధంగా చదివేవారు బహు తక్కువ అందులోని సారం ఆఖరుబొట్టుదాకా గ్రహించేవారు ఇంకా తక్కువ

ఈనాడు వెలువడే అసంఖ్యాకమైన కథలు పిప్పరమెంటు బిళ్ళలల్లే చప్పరించి మింగేవి, నమిలేవి కావు సాధారణంగా ఆహారాన్ని నమిలే అలవాటులేనివాళ్ళకు త్వరలోనే పళ్ళూడిపోతాయి ఆ తరువాత దేన్నీ వాళ్ళు కొరకలేరు నమల్లేరు

అంచేత ఈ నాటి కథకుల్లో పురుషులెవరో, పుణ్య పురుషులెవరో విచక్షణగా తెలుసుకునే వారు బహు కొద్దిమంది ఉంటున్నారు ఇవాళ గొప్ప కథలు రాసేవాళ్ళను లెక్కించటానికి ఒక చేతివేళ్ళే తక్కువ వారిలో ఒకడైన కాళీపట్నం రామారావుగారి రచనలు ఇదివరకు పుస్తకరూపంలో రాకపోవటం ఎంత వింత మంచి కథలు రాసేవాళ్ళు చాలా మంది ఉన్నారు గొప్ప కథకు గొప్ప లక్ష్యం ఉండాలి మంచి కథలు కాకతాళీయంగా రావచ్చు గొప్ప కథలు గొప్ప కథకులు రాస్తే తప్ప రావు గొప్ప కథలు రాసే ఘనత ఒక రాచకొండ విశ్వనాథశాస్త్రికి, ఒక బీనాదేవికి, ఒక కాళీపట్నం రామారావుకి దక్కింది ఈ జాబితా ఇంతటితో ఆగదు కుర్రకారు కథకులలో రత్నాల్లాంటివాళ్ళు తయారవుతున్నారు ఇది నిజానికి ఒక ఉద్యమం

ఈ ఉద్యమం గురజాడతోనే ఆరంభమైనా కొంత కాలం గుంటపూలు పూసినమాట నిజం గురజాడకథలు రాసేదాకా కథ అంటే ''నిన్న'' జరిగినదిగానే ఉండేది కథలూ, ఇతిహాసాలూ, ఉపాఖ్యానాలూ దేనికి చెప్పేవారంటే గతం నుంచి ఏదో గుణపాఠం నేర్చుకొనేటందుకు గురజాడతో ఆరంభమైనా ఆధునిక కథ వర్తమానాన్ని విమర్శించటానికి పూనుకున్నది

వర్తమానాన్ని విమర్శించటానికి పూనుకున్న కథ మధ్య తరగతి లోతులు మధించటం ఆరంభించింది లోతుకు పోవటం ఎంత కష్టమో ప్రయత్నించిన వాడికి తెలుస్తుంది పది అడుగుల లోతుకు వెళ్ళటం కన్నా పదకొండు అడుగుల లోతుకు వెళ్ళటం రెట్టింపు కష్టం ఆ తరువాత అంగుళం అంగుళానికి కష్టం పెరిగిపోతుంది (రెస్ట్‌మాస్ గల అణుకణాలు కాంతివేగాన్ని సమీపించేటపుడు వాటి భారం ఏ రేటున పెరిగేది శాస్త్రజ్ఞులనడగండి)

అందుచేతనే అనేక దశాబ్దాల పాటు కథకుల మధ్య తరగతి జీవితాన్ని మధించి, దాని అడుగున దాగి ఉన్న సత్యాలను పూర్తిగా పీకి తేలేకపోయినారు ఈ లోగా కాలస్వభావం మారి, మధ్య తరగతి జీవిత సత్యాలు చరిత్ర గలికి పెడ అయిపోవటం చేత కాబోలు సినిమా కథలను పోలిన సాహిత్యం బయలుదేరింది ఈ పిప్పరమెంటు సాహిత్యం చాటున కొత్తరకం సాహిత్యం అట్టడుగు ప్రజల జీవితాలకు సంబంధించినది పుట్టుకొచ్చింది

ఏ తరగతిలో విప్లవం నిక్షిప్తమై ఉన్నదో ఆ తరగతి జీవితాన్ని మధించి కొద్దిమంది కథకులు కథా రచనలో క్రొత్త శకాన్ని సృష్టించారు వీళ్ళు మధ్య తరగతి రచయితలే, కాని అధమ తరగతి జీవితాన్ని ఎరిగినవాళ్ళు, అర్థం చేసుకున్నవాళ్ళు ఆ తరగతి మీద అభిమానమూ, ఆపేక్షాగలవారు ఇవన్నీ లేనివాళ్ళు ''సారాకథలూ'' హంగ్‌మీ క్విక్'' ''యజ్ఞం'' రాయలేరు పిప్పరమెంటు బిళ్ళ ల్లాంటి కథలు రాసేవారికిది రాయటం అసాధ్యం

''యజ్ఞం'' మొదటిసారి చదవగానేనాకు చప్పున గురజాడ రాసిన ''మీ పేరేమిటి?'' జ్ఞాపకం వచ్చింది ఈ రెండి మధ్యా ఎన్నో పుష్కరాల ఎడం ఉన్నది కాని, ఇలాటి కథ మరొకటి అడ్డం ఉన్నట్టు నాకు తెలియదు గురజాడ ఒక గ్రామానికి సంబంధించిన మౌఢ్యాన్ని గురించి రాస్తే కాళీపట్నం ఒక గ్రామానికి సంబంధించిన రాక్షసాన్ని గురించి రాసాడు

కథా పరిమాణం గురించి నాకున్న పరిజ్ఞానం సరి అయినదయితే ''యజ్ఞం'' ''ఆర్తి'' లాటి కథలు ప్రపంచ యుద్ధానికి పూర్వం వచ్చి ఉండటం సాధ్యం కాదు ఈ కథలలో విశేషమేమంటే, అట్టడుగు జీవితంలోని అంతస్సంఘర్షణ కూడా, దాని వెనుక ఉన్న భౌతిక కారణాలతో సహా స్పష్టంగా కన్పిస్తుంది ''యజ్ఞం'' శ్రీకాకుళం పోరాటాలకు ముందు నడిచిన కథ అనాలి ''ఆర్తి'' వాటికి యింకా కొంచెం ముందేమో అందుచేతనే అందులో అంతస్సంఘర్షణ మరింత స్ఫుటంగా ఉన్నది అంతస్సంఘర్షణలు జరిగిపోయినాక విప్లవం తల ఎత్తాలి ' ఈ రెండు కథలకూ ఈ నాటి విప్లవోద్యమాలతో రక్త సంబంధం ఉన్నది

''తీర్పు'' వీటిలో కలిసే కథ కాదు కాని నాలుగు ఒకేరకం అట్టలమధ్య అయిదో అట్ట కాస్తమేలు రకంది చేరితే ఎలాటి ఆర్థిక - రాజకీయ సమస్య ఏర్పడేది ఈ కథ చిత్రిస్తున్నది జీవిత సత్యాలు ఎంత చిన్న వాటిలోనైనా కన్పిస్తాయన్న నా నమ్మకాన్ని ఈ కథ బలపరుస్తున్నది

*ముద్రణ 20-1-1971*

# 15. ప్రస్తావన

అన్నిరకాల చైతన్యమూ జీవితంనుంచే పుట్టాలి అనేక మతాలూ, తాత్విక భావాలూ, సాహిత్యమూ జీవితమే పునాదిగా గలవి జీవితం దేశకాల ప్రభావాలు అనుగుణంగా మారుతుంది జీవితంలో కలిగే మార్పుల ప్రభావం సాంఘిక చైతన్యంమీదా, సాంఘిక చైతన్య ప్రభావం జీవితం మీదా ప్రబలంగా ఉన్నప్పుడే జీవితం ముందుకు పోతుంది మనిషి నడిచేటప్పుడు వెనక ఉండిన కాలు ముందుకు వచ్చి ముందు వేసిన కాలు వెనక్కు వెళ్ళి నట్టే ఇది కూడా ఒక విధంగా ''రెండు కాళ్లమీద నడవటం ''

సాహిత్యరంగంలో అనేక రకాల చైతన్యం చూసి అమాయకులు ''ఇందులో ఏది నిజం? ఏది సరిఅయినది?'' అని అనుమానాలలో పడవచ్చు కాని ఈ రెండు కాళ్ళ నడకను మనసులో పెట్టుకుంటే ఏది సరియైనచైతన్యం అన్నది సులువుగానే తేలుతుంది పురాణాలూ, పాతకాలపు ప్రబంధాలూ మన జీవితానికి రెండో కాలుగా ఎంత మాత్రమూ ఉపయోగించవు అవి చంక కర్రలుగా కూడా పనికిరావు వాటిని మనం ఎన్ని ఏళ్ళు దీక్షగా చదివినా ఈనాటి జీవితాన్ని ఒక్క అరంగుళం ముందుకు తీసుకుపోయే భావచైతన్యం మనలో కలగదు అవి జీవితం నుంచి ఎడంగా పోయి, ఊహా లోకాల్లో విహరించటానికి పనికివస్తాయి

అలా జీవితానికి ఎడంగా తీసుకుపోయే సాహిత్యం ఈనాడు సృష్టి ఆవటం లేదని కాదు, టన్నులకొద్దీ తయారవుతున్నది అదే సరి అయిన సాహిత్యమని ప్రచారం చేసేవారు కూడా ఉన్నారు కాని సాహిత్యం యొక్క ఉత్కృష్ట ప్రయోజనం తెలిసిన వారెవరూ అలాటి సాహిత్యంతో తృప్తి పడరు

జీవితాన్ని ముందుకు నడిపించే చైతన్యం సాహిత్యంలో సృష్టికావాలంటే దాన్ని సృష్టించే వారికి దాని తత్వం తెలియాలి దాని కీలకాలు అర్థం కావాలి ఈ వర్గసమాజంలో, మత కుల వర్గ భేదాలతో చిన్నభిన్నమై ఉన్న ఈనాటి జీవితంలో, ఒక్కొక్కమూల జీవితం ఒక్కొక్క అవతారంలో కనిపిస్తుంది ప్రపంచంలోవేలు గడించేవారూ, లక్షలు గడించేవారూ, కోట్లు గడించేవారూ, కడుపులో చల్ల కదలకుండా ఏ కొండమీది కోతినైనా తెప్పించగల వాళ్ళూ వున్నారు

కోట్లకొద్దీ ప్రజలు తిండీ, గుడ్డా, ఇల్లూ, వాకిలీ, మందూ మాకూ లేకుండా దుర్భరజీవితాలు గడుపుతూ ఉండగా ఈ కొద్దిమందికి జీవితం వడ్డించిన విస్తరి ఎలా అయింది? వీళ్ళది పూర్వజన్మ సుకృతం అని కర్మసిద్ధాంతం చెబుతుంది పూర్వజన్మ సుకృతం వీరికి ఐశ్వర్యం కలిగించిందే అనుకున్న దీన్ని కాపాడుకోవటానికి బ్రహ్మాండమైన రాజ్యాంగయంత్రాంగాన్ని, రక్షక బలాలనూ, శాసనచట్టాలనూ ఉపయోగించటం ప్రత్యక్షంగా కనబడుతుంది ఇవన్నీ వర్తమానానికీ, భౌతిక జీవితానికీ సంబంధించినవి పీడితవర్గం వీటిని తమ ఆధీనం చేసుకోవచ్చుననీ, చేసుకున్నదాకా జీవితం ముందడుగు వెయ్యదనీ మార్క్సిజం చెబుతున్నది మార్క్సిజం శుష్కసిద్ధాంతం కాదు మాటల గారడీ తత్వంకాదు, అది అమలు జరిగింది పీడితవర్గం అమలు జరిపిన రాజకీయ, ఆర్థిక, సాంఘిక వ్యవస్థగల దేశాలు అభివృద్ధిలోకి వచ్చి, సామ్రాజ్యాలు ఏలిన దేశాలతో పోటీ చేస్తున్నాయి మార్క్సిస్టు సిద్ధాంతాలు అమలు కాని దేశాలు వెనుకబడి ఉండటమేగాక, తీవ్ర సమస్యలను ఎదుర్కొంటున్నాయి

1917లో విప్లవం చేసిన రష్యా అమెరికా తరవాత బలవత్తర దేశంగా పరిణమించింది (అమెరికా సంపన్నం కావటానికి 200 ఏళ్ళు పట్టింది ) నిన్నగాక మొన్న- 1949లో - అంతర్యుద్ధం పూర్తి చేసిన చీనా ప్రపంచ రాజ్యాలలో మూడోస్థానం సంపాదించుకున్నది అతి చిన్న దేశమైన తూర్పు జర్మనీని ధనస్వామ్య దేశాలు శ్లాఘించలేకుండా ఉన్నాయి

మన దేశంలో కూడా శాంతియుత పరిణామాల ద్వారా, పెట్టుబడిదార్ల చేతిమీదుగా, సమసమాజ నిర్మాణం శాంతియుతంగా సాగుతుందని నమ్మే అంధ విశ్వాసం కొందరు 'మేధావులు'' ప్రదర్శించటం ఆశ్చర్యకరం సమసమాజ నిర్మాణానికి అంకితమైనవన్న పార్టీలు ప్రాంతీయ ప్రభుత్వాలు నిర్వహించటం జరిగితే జాతీయ పాలక వర్గం వాటిని దించినదాకా నిద్ర పోలేదు ఏళ్ళు గడిచినకొద్దీ దారిద్ర్యం విజృంభిస్తున్నది, అసమత పెచ్చుమీరుతున్నది ఏమాత్రం బుద్ధి గలవాడైనా మన సమాజం పురోగమించడానికి విప్లవ చైతన్యం అవసరమని తేలికగా గ్రహించగలుగుతాడు సాహిత్య రంగంలో విప్లవ రచయితలు ఎందుకు పుట్టుకొచ్చారో వివరించి చెప్పవలసిన పని లేదు

సాంఘిక విప్లవవాదాన్ని నిజానికి అభ్యుదయ రచయితలే చేపట్టి ఉండవచ్చు అలా జరగకపోవటానికి కొన్ని చారిత్రక కారణాలున్నాయి అభ్యుదయ రచయితలు ఉద్యమం ప్రారంభించిన నాటికి భవిష్యత్తు ఆశాజనకంగా కనిపించింది జాతీయోద్యమాలు నడిపిన కాంగ్రెసు పార్టీ వెనక దేశ ప్రజలు నిలబడ్డారు దాని మహానాయకుడు నెహ్రూ సామ్యవాది, రష్యా అభిమాని రష్యా ప్రపంచయుద్ధంలో ప్రపంచ కీర్తి గడించింది భారతదేశంలో సామ్యవాదం దానంతట అదే ఏర్పడుతుందన్న భ్రమ కలిగింది అందరికీ కాంగ్రెసు నుంచి కమ్యూనిస్టు పార్టీ తరిమి వేయబడిన మాట నిజమే గాని, కమ్యూనిస్టులు తమ మీటింగులలో తమ జెండాలతోబాటు కాంగ్రెసు జెండాను కూడా ప్రదర్శించి కాంగ్రెసులో విశ్వాసం ప్రదర్శించారు అతి త్వరలోనే కాంగ్రెసు మాజీ పాలకులకూ, గుత్త పెట్టుబడిదార్లకూ, ధనికభూస్వాములకూ సొంతమై పోతుందని ఎవరూ ఊహించలేదు

అందుచేత అభ్యుదయ రచయితలు విప్లవవాదాన్ని అంత దీక్షగా చేపట్టలేదు వాళ్ళు జీవితాన్ని వర్గదృక్పథంతో చూసి, జీవితాన్ని మార్క్సిస్టు దృక్పథంలో విశ్లేషించి తృప్తిపడ్డారు ఆ కాలంలో వచ్చిన ''తీవ్ర'' రచనలు కూడా ఏ నిజాములాంటి వాళ్ళ మీదికో గురి చేయబడ్డాయి గాని, ఏ ''తుపాకీ గొట్టమూ కాంగ్రెసు''కేసి తిరగలేదు ''కాంగ్రెసు శత్రువులే మా శత్రువులు'' అన్న వైఖరి అవ్యక్తంగా రచయితలలో ఉంటూ వచ్చిందనిపిస్తుంది

మానసిక ధోరణులు త్వరగా మాసిపోవు 1950లో కాంగ్రెసు ప్రభుత్వం వేటాడిన కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసుతో రాజీ పడింది ఆనాటి అభ్యుదయ రచయితలు ఈనాడు మంత్రుల ఆధ్వర్యాన మేజువాణీలు చెయ్యటం వింత కాదు అభ్యుదయ సాహిత్యోద్యమం గుంటపూలు పూయగా, విప్లవ కవులు ప్రజలలో భావచైతన్యం కలిగించటానికి ముందుకు వచ్చారు వారితోబాటే విప్లవ సాహిత్యోద్యమం ప్రారంభమయింది విప్లవ కవితా సంకలనాలు వెలువడ్డాయి వాటికి లభించిన ప్రజాదరణ అనన్యం ''ఝంఝు'' వెయ్యేసి కాపీల చొప్పున రెండు మూడు నెలల కాలంలో అమ్ముడయింది బహిరంగ సభలలో విప్లవ గేయాలను ప్రజలు అమితోత్సాహంతో స్వీకరించారు ''ఝంఝు''ను చూసి ఆంధ్ర ప్రభుత్వం

అదురుకున్నది - దాన్ని బహిష్కరించటానికి ఇంకే ఒక్క కారణమూ కనబడదు తుమ్మితే ఊడే ముక్కులాంటి ఈ ప్రభుత్వాలు విప్లవ రచనలకే తట్టుకోలేకపోతే విప్లవాల ఝంఝ ముందు ఎండుటాకులల్లే ఎగిరిపోవా?

''విరసం'' తరఫున ఈ మొదటి కథా సంకలనం వెలువడుతున్నది వీటిలో శిల్పం కోసమూ, శైలి కోసమూ చూడవద్దు పరమానందయ్య శిష్యుడు గురువుగారి ఇల్లు తగలబడుతున్నదని రాగం తానం పల్లవి పాడిన మనస్తత్వం విప్లవ కథకులకు లేదు వాస్తవ జీవితం తమ కళ్ళకు ఎలా కనిపిస్తున్నదీ వారు చెప్పారు ఈ కథలు చదివి ఆలోచించకుండా ఉండటమూ, చైతన్యం పొందకుండా ఉండటమూ సాధ్యం కాదు ఇవి తొలి నమూనాలు మాత్రమే వీటి వరవడిలో ముందు ముందు అణువుబాంబుల్లాంటి కథలు వస్తాయని నేను గట్టిగా చెప్పగలను విప్లవ కథకులు ముందుముందు ఇంకా బలంగా పెడబొబ్బలు పెడతారు, సింహగర్జనలు చేస్తారు విప్లవశంఖాలు మోగిస్తారు అందుకేమాత్రమూ సందేహం లేదు

*ఇప్పుడు వీస్తున్న గాలి, విరసం కథల సంపుటి, ఆగస్టు 1971*

# 16. పీఠిక

కట్టమంచి రామలింగారెడ్డి లాంటి మహామనిషి ఆయనను ''ఆధునిక కాలంలో అగ్రగణ్యుడైన ఆంధ్రుడు''గా భావించారు ''ప్రముఖ భారతీయులలో ఒకడు, లోతైన వివేచనా, అంతులేని సాహసమూ, అపారమైన శక్తి గల వాడు అసత్యాన్ని చెండాడి, ప్రగతి మార్గాల కోసం పోరాడాడు,'' అని రాజాజీ ఆయనను గురించి అన్నారు వీరేశలింగం వ్యక్తిత్వమూ, ఆయన సాగించిన సంఘర్షణలూ, సాధించిన విజయాలూ, నిరాక్షేపణీయమైన ఆయన ప్రజా సేవా, దేశ సేవా ఈ సంగ్రహ స్వీయ చరిత్రలో వ్యక్తమవుతున్నది

శ్రీ నార్ల వీరేశలింగం గారిని గురించి లోగడ రచించిన ప్రశస్తమైన పుస్తకం (సాహిత్య అకాడమీ ప్రచురణ) చదివిన వారికి నార్లవారి ఉద్ఘాటనలకు ఈ గ్రంథంలో ఆధారాలు పుష్కలంగా లభించగలవు

ఈ గ్రంథం చివరలో వీరేశలింగం గారు, ఆంధ్రుల జీవితంలోనూ, సామాజిక దృక్పథంలోనూ మూడు, నాలుగు దశాబ్దాలు మీదట కలిగిన మార్పులను వర్ణించారు కాని ఆ మార్పులకు తాను ఎంతగా దోహదం చేసినదీ ఆయన చెప్పుకోలేదు రామలింగారెడ్డిగారు చెప్పినట్టు, ''వీరేశలింగం ప్రముఖ నవశక నిర్మాతలలో ఒకడు కావడం వల్లనే దానిని ప్రతిబింబించ గలిగినాడు ఆయన దాని ముద్దుబిడ్డ కనుకనే స్రష్ట కూడా కాగలిగినాడు ఏమంటే, కాల ప్రభావాన్ని జీర్ణించుకున్నవారే స్రష్టలు కాగలరు ''

నిజానికి వీరేశలింగం, కుళ్ళిపోయిన సమాజం మీదా,కుళ్ళు సంస్కారం మీదా ధ్వజమెత్తటానికి పూర్వం ఆ సంఘానికీ, సంస్కృతికీ చెందిన కుళ్ళులోనే జీవించాడు ఆయన వాయువేగంతో జన సామాన్యాన్ని తోసుకొని ముందుకు వెళ్ళి, వారి పీడనలకు గురి అయి, చిట్టచివరకు వివిధ జీవిత రంగాలలో పురోగమనానికి మార్గాలేవో నిరూపించగలిగాడు సాహిత్యరంగంలో సహితం ఆయన తన కృషిని కొన్ని శతాబ్దాల క్రితం ఉండిన ప్రక్రియలతో

ప్రారంభించి కాలక్రమాన ఆధునిక తెలుగు సాహిత్యానికి అగ్రగామిగా నిలబడ్డాడు ఆయన ఇతరులను ఒకవంక సంస్కరిస్తూనే మరొక వంక తనను తాను సంస్కరించుకొన్నాడు

శ్రీ నార్ల అన్నట్టు వీరేశలింగం ''ఆదర్శ దృక్పథం గల కార్యవాది '' ఆయన తనకు ఎదురైన ప్రతి సాంఘిక దురన్యాయాన్నీ ఎదుర్కోవటమే గాక, దీక్షగా అలాంటి లోపాలను కనిపెట్టుకొని వెతకటమే గాక, తన అనుచరుల వర్తన నిర్దుష్టంగా ఉండాలని పట్టుబట్టి, వారి స్ఖాలిత్యాలను తీవ్రంగా విమర్శించేవాడు ఈ విషయంలో ఆయనకు, గాంధీజీకి కొంత పోలిక ఉన్నది

వెనుకకు తిరిగి చూసుకొంటే, ఇంత గొప్పవాడికి రాజకీయ పరిజ్ఞానం లేకపోవడం ఒక కళంకమేమోననిపిస్తుంది కాని ఆయన కాలంలో రాజకీయాలు చాలా వరకు దౌర్జన్యవాదంతోనో, నినాదాలతోనో కూడి ఉండేవి నైతిక, ఆధ్యాత్మిక దృక్పథంతో కూడిన గాంధీయ రాజకీయాలు దేశంలో ఇంకా అవతరించలేదు దేశాభ్యున్నతి అస్తవ్యస్తంగా జరగరాదని వీరేశలింగం చెప్పిన మాట వాస్తవం ఈనాడు మన దేశంలో స్వాతంత్ర్య సమస్య పరిష్కారమైనప్పటికీ, వీరేశలింగం ప్రతిఘటించిన సంఘ పీడనలన్నీ - మూఢ విశ్వాసాలూ, మతహంకారమూ, కులతత్వమూ, మత విభేదాలూ, అధికారుల అవినీతీ, కలవారు లేని వారిని పీడించటమూ, వాస్తవ సామాజిక పురోభివృద్ధి పట్ల అలక్ష్యమూ, సంస్కృతీ శూన్యమై ప్రజలకు మేలు చేయలేని చౌకబారు సాహిత్యమూ మొదలైనవి - ఇంకా మన జాతిని పీడిస్తూనే వున్నవి

వీరేశలింగాన్నీ, ఆయన ఉద్యమాలనూ పక్కకు నెట్టినది జాతీయోద్యమం కావచ్చు ఏమంటే, ఆంధ్రులు రెండవ ప్రపంచ యుద్ధం అనంతరం దాకా వీరేశలింగాన్ని మరిచిపోయారు దీక్షగా వీరేశలింగాన్ని స్మరించటం ప్రారంభించిన వారు ఆంధ్రదేశంలోని అభ్యుదయ రచయితలు ఇప్పుడిప్పుడే ఆయన గొంతుకు తిరిగి బలం చేకూరుతున్నది దేశం ముందుకు రావాలంటే ఆయన దృక్పథాలు మళ్లీ అమలులోకి రావాలి

అసంఖ్యాకమైన వీరేశలింగం రచనలలో ఆయన స్వీయ చరిత్రకు ఒక విశిష్టస్థానం ఉన్నది ఈ గ్రంథమే లేకపోతే, సంఘ సముద్ధరణ కొరకు ఆయన చేసిన కృషి స్థానిక స్మరణలోనే ఉండిపోయేది అందుకనే ఈ గ్రంథాన్ని ''ఒక విధంగా ఆంధ్రుల సాంఘిక చరిత్ర'' అన్నారు

స్వీయ చరిత్ర ప్రథమ భాగం 1910 డిసెంబరులోనూ, ద్వితీయ భాగం 1915 ఏప్రిల్‌లోనూ వెలువడ్డవి తదుపరి వీరేశలింగం గారు నాలుగు సంవత్సరాలపాటు, 1919 మే 27 దాకా జీవించారు ఆఖరు క్షణందాకా ఆయన కృషిసాగుతూనే వచ్చింది ఉదాహరణకు, గిడుగు రామమూర్తి పంతులుగారు ప్రారంభించిన వ్యావహారిక భాషావాదాన్ని వీరేశలింగం గారు పూర్తిగా బలపరచి, వర్తమాన ఆంధ్ర భాషా ప్రవర్త సమాజానికి మొదటి అధ్యక్షుడయినారు నిజానికి ఆయన ఆంధ్రలోని అనేక సామాజిక, సాంస్కృతిక ఉద్యమాలకు 'మొదటి''వాడు అందుకే ఆయనను గురించి కె ఈశ్వరదత్తు అన్నారు '' ఆంధ్రలో జీవిత ప్రవాహాన్ని వీరేశలింగం కొత్తదారి పట్టించాడు ఈ కృషిలో ఆయనకు మార్గదర్శకులు లేరు ఆయనతో పోల్చదగిన అనుయాయులూ లేరు ''

*స్వీయ చరిత్ర సంగ్రహము కందుకూరి వీరేశలింగము*
*సంక్షిప్తము కొడవటిగంటి కుటుంబరావు,*
*నేషనల్ బుక్‌ట్రస్ట్, ఇండియా, న్యూఢిల్లీ, 1972*

# 17. ముందుమాట

సాహిత్యం జీవితాన్ని ప్రతిబింబించాలంటాం కాని వాస్తవంగా జరిగేదేమంటే, సాహిత్యం రచయితకు జీవితాన్ని గురించి ఉండే అభిప్రాయంలను ప్రతిబింబిస్తుంది అంతమాత్రాన సాహిత్యం ఆత్మాశ్రయంగా ఉండనక్కర్లేదు ప్రత్యక్షంగా ఉన్న జీవితమే పదిమందికి పదిరకాలుగా కనిపిస్తుంది

మహాభవనాలలో జీవిస్తూ, సమస్తసుఖాలూ అందుబాటులో ఉండి, ఏ విధమైన రాజకీయ, సామాజిక నిర్బంధమూ తమని బాధించే అవకాశం లేని జీవితాలు గలిగిన వారికి జీవితం పూలపాన్పు వడ్డించిన విస్తరి భూలోకస్వర్గం వీరు అత్యల్ప సంఖ్యాకులు నిచ్చెనకు పైమెట్టు మీద ఉన్నవాళ్ళు వీరికి ఒకటే సమస్య - పడకుండా, నిచ్చెన దిగిరాకుండా చూసుకోవటం ఆ విద్య వారికి తెలుసు అందుకు కావలసిన ఏర్పాట్లన్నీ సమాజం వారికి అందుబాటులో ఉంచింది

ఈ అల్ప సంఖ్యాకులకు ప్రతిగా అధిక సంఖ్యాకులున్నారు వాళ్ళు నిచ్చెనఅడుగున ఉన్నవాళ్ళు, మొదటిమెట్టుకూడా ఎక్కటందుకు అవకాశాలు లేనివాళ్ళు, ఏదీలేనివాళ్ళు వాళ్లకు జీవితం ప్రత్యక్షనరకం జీవితపు నిచ్చెనను అడ్డంగా పడుకోబెట్టటం తప్ప వాళ్ళు తమ బాగుకోసం చెయ్యగలది ఏదీలేదు

నిచ్చెన మధ్య మెట్ల మీద ఉన్న వాళ్ళున్నారు వీరి జీవితాశయం ఈ నిచ్చెనమీద ఒక్కోమెట్టు పైకి పోవటం వాళ్ళ జీవిత తత్వమంతా ఒక మెట్టు పైకి ఎక్కటంలోనే ఉన్నది నిచ్చెన దిగువన ఉన్నవాళ్ళకు మధ్య మెట్ల మీది వాళ్ళు చెప్పేది కూడా అదే '' మీరు పైకి ఎక్కవచ్చు ఎక్కలేక పోతే అది మీతప్పే మాలో అనేకమెట్లు ఎక్కినవాళ్ళున్నారు చూసుకోండి మెట్లెక్కటం గురించి మేమే ఎంతో సాహిత్యం సృష్టించాం పై మెట్లు మీద జీవితం ఎంత బాగుంటుందో మా సాహిత్యం చదివితే తెలుస్తుంది '' అంటారు

నిజానికి ఇది భేతాళ సాహిత్యం ''శ్రమ తెలియకుండా విను'' అంటూ భేతాళుడు విక్రమార్కుడికి కతలు చెబుతాడు ప్రస్తుతం నిచ్చెన అక్కర్లేని వాళ్ళకు అందుతున్న సాహిత్యం ''శ్రమ తెలియకుండా'' వినేదే తప్ప, శ్రమకు సఫలం చేసేదికాదు

ఇది మధ్యతరగతి సాహిత్యం ''ఇవాళ మనదేశం స్వతంత్రం అందులోనూ ప్రజాతంత్రం కనక నిచ్చెన ఎక్కే హక్కు అందరికీ ఉన్నది మీరు అకారణంగా అల్లరి పెట్టకండి'' అంటుంది ఈ సాహిత్యం

కాని కిందివాళ్ళు మొదటి మెట్టు మీద అడుగుపెట్టేలోపల ఈ సాహిత్యాన్ని సృష్టించే పై మెట్టువాళ్ళు వాళ్ళ నెత్తిమీద కాళ్ళు పెట్టి గద్దల్లాగా తన్నుతారు తీరా ఎక్కితే కిందికి తోసేస్తారు అదేమంటే ''సాంప్రదాయం సంస్కృతి'' అంటారు

పై వాళ్ళు సాహిత్యం రాయరు అనవసరం తమకు ఉపకరించే సాహిత్యంగాళ్ళు కింది మెట్లమీద కోకొల్లలు! వారిలో ఎవరైనా, ఏ కారణం చేతనైనా, '' ఈ నిచ్చెన ఇలా నిలువుగా ఉండుట సమాజానికి ఆరోగ్యం కాదు దీన్ని వాల్చండి! పై పీనుగులు గట్టిగా పట్టుకుంటే దాన్ని విరిచి పోగులుపెట్టండి!'' అన్నాడో- గోముఖ వ్యాఘ్రాలుకోరలు బయట పెట్టి, గాండ్రిస్తాయి ప్రజాతంత్రం ఎటో అదృశ్యమవుతుంది ఆ రచయితను జైల్లోకితోసి, తరవాత సెక్షన్లూ క్లాజులూ వెతుకుతారు

సమాజాన్ని గురించి నిస్వార్థంగా ఆలోచించే వాడికీ, ఆచరించే వాడికీ ''ఆటోమాటిక్‌గా'' నిచ్చెన దిగువవాళ్ళ స్థాయి వచ్చేస్తుంది భూలోక స్వర్గంలో వాళ్ళకు చోటుండదు వాళ్ళ ఉద్యోగాలు పోతాయి సి ఐ డీ లు వాళ్ళను కుక్కల్లాగా వెంటాడుతారు వాళ్ళకు ''సభ్య'' సమాజంలో ఒక అనిర్వచనీయమైన న్యూనత ఏర్పడుతుంది

ఈ ఒక్క కారణం చేతనే, సమాజాభివృద్ధిని కోరే సాహిత్యం నూటికి నూరుపాళ్ళు ఈ అట్టడుగు అత్యధిక సంఖ్యాకులకు చెందేదిగా ఉండాలి అటువంటి సాహిత్యం ఈనాడు ఆరంభదశలోనే ఉన్నది

ఆ మాటంటే అభ్యుదయ సాహితీపరులకు కోపం రావచ్చు, నిజమే అట్టడుగువాళ్ళ కోసం కొంత సాహిత్యం అదివరకే వచ్చింది నిచ్చెన మెట్లమీద ఆశ వదులుకోకుండానే చాలామంది కిందివాళ్ళను గురించి అశ్రువులురాల్చారు, వాళ్ళు కూడా మెట్లెక్కిరావాలన్న ఆశ వెలిబుచ్చారు, భూలోకస్వర్గపు వాసనలను తాము దూరంనుంచి అఘ్రాణించటం మానలేదు అస్తమానమూ దరిద్రపు కుళ్ళు గురించే ఎక్కడ ఆలోచిస్తామని మధ్య మధ్య ప్రేమాయణాలలో విశ్రాంతి తీసుకున్నారు కాని ''మీరు తిరగబడకపోతే మీ జన్మలకు మోక్షంలేదు'' అని తెగేసి చెప్పలేదు దానికి కారణం ఉంది ప్రపంచయుద్ధం మగిసినాక స్వాతంత్ర్యంతోబాటు సోషలిజం దానంతటదే వచ్చేస్తున్నదనుకున్నారు తాతా బిర్లాలు తమంతతామే తప్పుకుంటారనుకున్నారు

అందుకు వాళ్ళను తప్పుబట్టనవసరంలేదు అది మధ్యతరగతి మనస్తత్వం, మెట్లెక్కే మనస్తత్వం పైనుంచి లాగే వాళ్ళు లేకుండా మధ్యతరగతి పైకి రాలేదు కాలేజీల్లో సీట్లు ఇప్పించేవాళ్ళు, తరవాత ఉద్యోగాలిప్పించేవాళ్ళు, ఆతరవాత ప్రమోషన్లు ఇప్పించేవాళ్ళు, ఉద్యోగంలో కాలుజారితే కమ్ముకునేవాళ్ళు అడుగడుగునా వాళ్ళకు సపోర్టు కావాలి నిచ్చెన మెట్లమీది జీవితమే అటువంటిది నిచ్చెనను అడ్డంగా పడుకోబెట్టటమనేది వాళ్లకు తట్టనే తట్టదు (మనం అడుగున ఉన్నవారిని మనస్థాయికి రప్పించాలిగాని వాళ్ళ స్థాయికి మనం దిగజారితే దానికి అర్ధమేమిటి?)

అందుచేత టన్నులకొద్దీ ఈ పాలికేళ్ళూ తయారయిన సాహిత్యంలో అట్టడుగు వాళ్ళకు నిజంగా వర్తించే సాహిత్యం (వాళ్ళకు పనికి వచ్చే సాహిత్యం మాట దేముడెరుగు!) అతి స్వల్పంగా మాత్రమే వచ్చింది క్యూరీ దంపతులకు అనేక టన్నుల ముడిపదార్థంలో ఆవగింజంత రేడియం దొరికినట్టు! కాని అదే విలువైనది నిచ్చెన మెట్ల విషాదం వదలగొట్టేది ఆ కాస్త సాహిత్యమే

ఒక విద్యాధికుడికి ఉద్యోగం దొరకక పోవటం అంటే ఏమిటో, ఒక శ్రామికుడి సంసారభారం దుస్సహం కావటమంటే ఏమిటో, ఒక భార్యను భర్త రాచి రంపాన పెట్టటమంటే ఏమిటో మధ్యతరగతిలా చాలా మంది సానుభూతితో ఆలోచించగలరు సందేహంలేదు కాని ఆ పరిస్థితులను అంతం చేయటానికి ఏయే చర్యలు జరగాలి, సమాజం ఎలా మారాలి అన్న సమస్య వచ్చే సరికి మధ్యతరగతివాళ్ళు చికిత్సకన్న రోగమేనయమన్న మనస్తత్వం ప్రదర్శిస్తారు ''శాంతియుత విప్లవం, పెట్టుబడి దారీ ద్వారా సోషలిజం, అహింసద్వారా అభ్యుదయం'' లాంటి బోకు నినాదాలు లేవదీస్తారు

జీవితంలో ధర్మమూ, శాంతీ, నీతీ, న్యాయమూ, అహింసా ఎందుకు లేవో అట్టడుగువాళ్ళ జీవితాలు చూస్తేగాని తెలియదు నిచ్చెన మెట్లమీది నుంచి కనిపించే జీవిత సత్యం కాదది

నిజమైన సాహిత్యం మన సమాజంలో ఉండే బర్బరత్వాన్నీ, క్రూరత్వాన్నీ పైశాచికత్వాన్నీ బయటపెట్టాలి అప్పుడే అది ప్రజలకు సంబంధించిన సాహిత్యమవుతుంది విప్లవ సాహిత్యమవుతుంది నిజమైన సామాజిక విప్లవం హరిత విప్లవం కాదు - సామాజిక అవినీతి మీదా, దురన్యాయం మీదా, హింస మీదా జరిగేదే నిజమైన విప్లవం అసందర్భంగా విప్లవం గురించి మాట్లాడటం కంటే వంచన మరి ఉండదు

నిచ్చెన మెట్లకు నోచుకోని వాళ్ళకూ, కింది మెట్ల మీద ఉండి పైవాళ్ళ పాదప్రహారాలకు గురి అయే వాళ్ళకూ సంబంధించిన జీవితాన్ని వాస్తవంగా చిత్రించటానికి ఈ నవలలో ప్రయత్నం జరిగింది ఈ రచయిత కవి ప్రజాకవిగా గొప్ప స్థాయి గల వాడు ప్రజల మనిషి మధ్యతరగతి మర్మాలు తెలిసినవాడు అతనికి వాస్తవ జీవితం గురించి లేనిపోని భ్రమలు లేవు పాఠకులకు కలిగించడు మధ్యతరగతికి ఉండే భ్రమలను చాలా వరకు వదలగొట్టగలడు కూడా

దొంగలూ, దోపిడీగాళ్ళూ, అవినీతిపరులూ అందలాలెక్కి తిరిగే సమాజంలో గోపాల్ వంటి వ్యక్తికి అవమానాలూ, పరాభవాలూ ఎదురు కావటం సహజం అవమానాలూ, పరాభవాలూ నిరాశలూ ఎదుర్కొలేని వాళ్ళే నిచ్చెనమెట్లను చివరకు ఆశ్రయిస్తారు తాత్కాలికంగా మాయ తొలగిన క్షణంలో వాళ్ళు ''విప్లవం'' అంటే అనవచ్చుగాని తిరిగి మాయ కమ్మగానే వాళ్ళు వాస్తవ ప్రజా జీవితానికి సాధ్యమైనంత దూరంగా తప్పుకుని, ఆత్మ సమర్థన కోసం అవాకులూ చవాకులూ మాట్లాడతారు

జీవితం - కుళ్ళు జీవితం - దుర్భరజీవితం ఒక మహత్తర కార్యాన్ని సాధిస్తుంది అది తనను ఆశ్రయించిన వాళ్ళను సానపట్టుతుంది ఆ ప్రక్రియలో తునకా తుప్పూ చెదిరిపోగా అసలు వాళ్ళు పదునెక్కుతారు జీవితం కన్న పోరాటంలో చావు లక్ష రెట్లు విలువైనది అనే పరమసత్యం వారి ఎదుట ప్రత్యక్షమవుతుంది విప్లవం కదులుతుంది ఉదయసూర్యుడి కిరణాలలాగా దాని ప్రభావం అన్ని వైపులా ప్రసరిస్తుంది నిచ్చెనలు ఊగిసలాడతాయి అట్టడుగు వాళ్ళ అశ్రువులు అగ్నికణాలగానూ, వాళ్ళు ''నిప్పురాళ్ళు''గానూ మారే దశ వచ్చేసరికి వాళ్ళతో ఢీకొన్న దుష్టశక్తులు నల్లుల్లాగా మాడిపోతాయి

*చెరబండ రాజు నవల ''నిప్పురాళ్ళు'', ఫిబ్రవరి 1983*

# 18. 'గందరగోళం' నవలకు పీఠిక

మనుషుల్లో ఉన్నంత వైవిధ్యం రచనల్లో కూడా ఉంటుంది నవలలు చదివే వాళ్ళంతా వాటితో గాఢమైన పరిచయం చేసుకోరు అందుచేత అవి స్థూలంగా ఒకే రకంగా ఉన్నట్టు కనిపిస్తాయి - మేకలన్నీ ఒకే రకంగా కనిపించినట్టు కాని నవలలను చదివేటప్పుడు వాటిని లోతుగా అర్థం చేసుకునేవారికి వాటి వ్యక్తిత్వం స్పుటంగా తెలియవస్తుంది మనుషుల్లోలాగే నవలల్లో కూడా మనని ఆకర్షించగలవీ, మన మనస్సులో కలకాలం మెదిలేవీ, మన ఆలోచనలను రెచ్చ గొట్టి, కెలికి, కొత్త దారులు పట్టించేవీ, ఇందుకు వ్యతిరేకమైనవీ ఉన్నాయి

నవలలతో పూర్తి పరిచయం గలవాళ్ళకు విధిగా రచయితతో కూడా పరిచయం అవుతుంది నవలలు రాసేవారిలో వైవిధ్య ఉంటుందని వేరే చెప్పనవసరంలేదు అది నవలల్లో ఎలా ప్రతిఫలిస్తుందన్నది మనం గుర్తించాలి కొందరు రచయితలు తమ భావ ప్రపంచంనుండి

పాత్రలనూ, సన్నివేశాలనూ, అవతరింపజేసి, పాఠకులకు ఒక రకమైన సానుభూతి కలిగించి, దానిద్వారా ఆనందం చేకూర్చటానికి ప్రయత్నిస్తారు ఆ నవలలు ఈనాటికీ, ఈ దేశానికీ, ఈ ప్రపంచానికీ కూడా చెందకపోవచ్చు మరికొందరి రచనలు జీవితానికి అద్దం పడతాయి, అలాటి నవలల్లో రచయిత కనిపించటం కేవలం యాదృచ్ఛికం

కాని ఉత్తమ తరగతికి చెందిన నవలల్లో రచయితది ప్రముఖపాత్ర నవలల్లో ఇతర పాత్రలకున్నంత నిమగ్నతా రచయితకు కూడా ఉంటుంది ఇంకా ఎక్కువే వుంటుంది సినిమాల పరిభాషలో అతను స్క్రిప్ట్ రైటరూ, డైరెక్టరూ కూడానూ, పాత్రలన్నీ మృణ్మయపాత్రలే అవుగాక, సన్నివేశాలన్నీ చచ్చువే అవుగాక, అతను నవలకు జీవం పొయ్యగలడు, రక్తి కట్టించగలడు, అందులో నుంచి అపారమైన వెలుగును సృష్టించగలడు ఇందులోనే ఉన్నది నవలాకారుడి ప్రతిభ

మనం సాధారణంగా గొప్పగాచెప్పుకొనే నవలలో ''చిరస్మరణీయమైన పాత్రలూ,'' ''అద్భుత సన్నివేశాలూ,'' ''కల్పనా చాతురీ'' లాటివి రచయిత నిర్వహించవలసిన పాత్రను కించపరుస్తాయి, ఆ సంగతి మనం గమనించం రామాయణం గొప్పతనం రాముడిదే అయితే వాల్మీకిది కావటానికి వీల్లేదు ఇది సనాతన దృక్పథం కాదు ఈ నాటిదని ఒప్పుకుంటాను మనం చతుర్విధ నాయకులను విడిచి చాలాదూరం వచ్చేశాం

ఈనాటి అవసరం సామాజిక వాస్తవికత రచనల లక్ష్యం సామాజిక చైతన్యం దీనికి బలమైన కారణం లేకపోలేదు సామాజిక జీవితంలో యుగాలు ఉంటాయి యుగాంతాలలో సమాజపు పునాదులు సడలిపోయి, సమాజం శిధిలావస్థను చేరుకుంటుంది ఇక ఆ పాత పునాదులు భవిష్యత్తుకు పనికిరావు వాటిని మరమ్మతుచేసే ప్రయత్నంలో సంస్కరణ సాహిత్యం వస్తుంది వాటిని పునర్నిర్మించే ప్రయత్నంలో విప్లవ సాహిత్యం వస్తుంది

ఈ ''గందరగోళం'' నవల విప్లవ సాహిత్యం అనిపించుకుంటుంది ఇందులో విప్లవ నినాదాలు ఉన్నాయనికాదు పెద్ద ఎత్తున వర్గపోరాటం చిత్రించి ఉన్నదనీకాదు, సామాజిక పునాదులు ఎంత భయంకరమైన స్థితిలో ఉన్నదీ ఈ నవల స్పష్టంగా చూపుతున్నది దీన్ని మరమ్మత్తులతోనూ, మాసికలతోనూ బాగుచెయ్యవచ్చుననే భ్రమ ఏ ఒక్క పాఠకుడికీ కలగదు

రచయిత చిత్రకారుడూ, కవీ కూడానూ ఇందులో కవిత్వం ఉన్నది కవిత్వాన్ని సాధారణంగా సౌందర్యాన్ని స్ఫురింపజేయటానికీ, ఆహ్లాదాన్ని కలిగించటానికీ వినియోగిస్తారు ఈ నవల అంతటా కవిత్వం ఆవేదనకూ, బాధకూ, దుర న్యాయానికి అంకితమయింది

ఇందులో మనం చూసే పాత్రలలో రంగుపూతలు లేవు సన్నివేశాలలో ''వంపుసొంపులు'' లేవు కథనంలో పులుముడు లేదు, రచయితలో కాపట్యంలేదు మొహమాటం లేదు ''మినహాయింపు'' మనస్తత్వం లేదు ఇందులోని ప్రతి మాటా సంపూర్ణమైన చిత్తశుద్ధితోనూ, సమగ్ర విశ్వాసంతోనూ వాడినట్టు పాఠకుడికి స్పష్టమవుతుంది నా దృష్టిలో ఇది విశిష్టమైన రచన కలువకొలను సదానంద నేను ఆశించే గొప్పరచయితలలో నిస్సందేహంగా ఒకడు

*కలువకొలను సదానందం గారి గందరగోళం నవలకి పీఠిక,*

*రచనకాలం 29-1-1975*

*పునర్ముద్రణ కళలు - శాస్త్రీయ విజ్ఞానం, విరసంప్రచురణ, సెప్టెంబరు 1980*

## 19. రంగస్థల – చలనచిత్ర నటనా శిల్పం

సామాజిక కళలు రెండు రకాలు, జానపద కళలూ, నాగరిక కళలూనూ జానపద కళలకు సాంప్రదాయాలు తప్ప ''లక్షణం'' ఉండదు తోలుబొమ్మలూ, హరికథలూ, వీధిభాగోతాలూ వగైరా జానపద కళలు నాగరిక కళలకు లక్షణాలు ఏర్పడతాయి అవి గ్రంథస్థమై, రసపిపాసువులకు ప్రమాణాలను సూచిస్తాయి అలాటి కళలను ఆస్వాదించగోరే రసికులు ఆ ప్రమాణాలను గురించి తెలుసుకుంటారు

సామాజిక కళల మాట అటుంచి, ''బోటనీ తెలిసిన వాడికి పూల అందం మరింత బాగా అవగాహన అవుతుంది'' అని మహామేధావులు చెప్పరు అలాటప్పుడు జానపద కళల స్థాయి ఏమంత గొప్పది కాదనీ, వాటిని ప్రదర్శించే వాళ్ళు గొప్ప నాగరికతా సంస్కృతులను అలవరచుకోనవసరం లేదనీ, పరంపరగా వాటి సాంప్రదాయంలో శిక్షణ ఉంటే చాలుననీ స్పష్టమవుతుంది

ఈ సోదంతా యిప్పుడు దేనికని ఎవరన్నా అడగవచ్చు ఈనాటి సినిమా కళలు తొంభైశాతమూ, నాటకకళలు డెబ్భై శాతమూ, జానపద కళల స్థాయికి దిగజారిపోయింది ఈ సంగతి చాలా మంది స్పష్టంగా గ్రహించినట్టు కనబడదు ఈ పుస్తకం తప్పక ఆ సంగతి తెలుసుకుని నాగరిక కళల స్థాయికి పెంచటానికి కృషిచేస్తున్నది దీని సహాయంతో ప్రేక్షకులు సినిమా, నాటక కళల ప్రమాణాలు తెలుసుకుని, గుడ్డిగా సినిమా తారల భజన చెయ్యక, నటుడి ప్రతిభకు అవకాశాలూ, పరిమితులూ, అలాగే దర్శకుడు వగైరాల కర్తవ్యాలూ గ్రహించి సినిమాలనూ, నాటకాలనూ సరిగా ఆనందించటం నేర్చుకుంటే వెర్రితలలు వేస్తున్న సినిమా ప్రపంచంలోకి కొంత క్రమం ప్రవేశించి, యితర దేశాలలోలాగ మనదేశంలోకూడా యి కళలు నాగరిక కళలుగా రూపొందే అవకాశం వున్నది శ్రీ వెంకటేశ్వరరావు రాసిన యీ పుస్తకం కళాభిమానులందరి ఆదరణను చూరగొంటుందని ఆశిస్తున్నాను

*ముందుమాట, నటనా శిల్పం (రంగస్థలం - చలన చిత్రం)*<br>
*రచన ఎస్ వెంకటేశ్వరరావు*<br>
*ప్రచురణ జూలై, 1976*

## 20. కథకుని కథనం

ఆధునిక తెలుగు సారస్వతంలో కథానిక చాలా దశలు గడిచింది గురజాడతో ప్రారంభమైన కథకులు నాలుగైదు తరాల వాళ్ళున్నారు ఈ తెలుగు కథానికా సాహిత్యాన్ని పరిశీలించేవాళ్ళు ఏ కథ ఏ తరంవాళ్ళు రాసినదీ తేలికగా చెప్పగలుగుతారు

కథల ఇతివృత్తాలలోనూ, శిల్పంలోనూ తేడాలు రావటం కేవలమూ కాల ప్రభావాన్ని బట్టే నని చెప్పటానికికూడా లేదు కథకులు వట్టిపోతారు ఆ సంగతి తెలుసుకోలేని కథకులు తాము పాత పద్ధతిలో నీరసంగా కథలు రాసుకుంటూపోయి, ప్రజల అనాదరణకు పాత్రులవుతారు

కథకుడి ప్రతిభ దీపం కాంతిలాగా కొంతమేర మాత్రమే ప్రసరిస్తుంది ప్రతిభలలో తేడాలు ఉండవచ్చు అంతే ఏ కథకుడూ అనంతంగా ఉత్తమ రచనలు చెయ్యలేడు

సాహిత్య చరిత్రలో ఒక దశలో కథానిక ఉచ్చలో ఉండవచ్చు మరొక దశలో క్షీణత ఏర్పడవచ్చు అది పాఠకుల ప్రాప్తం ఏకాలంలో జీవించేవాళ్ళు ఆ కాలంలో వెలువడే ఉత్తమ రచనలతో తృప్తి పడాలి అయితే మొత్తంమీద సాహిత్యం ముందుకే పోతుంది ఎందుకంటే ఒకతరం రచయితలు వదిలేసినచోట మరో తరం రచయితలు అందుకుంటారు

ఈ కథల సంపుటి ఒక కథకుడి సరికొత్త రచన రచయిత పేరు నాకుముందే పరిచయం అయినా సరికొత్త కథకుడి రచనలను మాజీ కథకుడు పరిచయం చేయటంలో కొంత ఔచిత్యం ఉన్నదనుకుంటాను

ఈ రచయితమీద పూర్వ, వర్తమాన కథకుల ప్రభావం ఏ మాత్రమూ ఉన్నట్టు నాకు తోచలేదు కథల ఇతివృత్తాలూ, కథనమూ కూడా రచయిత సొంతంగా కనిపిస్తాయి

కొన్ని ఇతివృత్తాలు స్పష్టంగా జానపదాలు ఉదాహరణకు ''పొద్దు పొడిచింది'', ''విడిపోయిన మంచుతెరలు'', ''సంత'', ''వరలక్ష్మి పెళ్ళి'', ''కవిగారి కళ్యాణం''

అయితే ఇవి జానపద శైలిలో రాసినవి కావు

మరికొన్ని కథలు సెంటిమెంటును ఆశ్రయించినవి ఉదాహరణకు ''కరి కొకరు'', '' ఆకలి''

కొన్ని కథలలో జీవిత విమర్శ వున్నది - ''జంతు ప్రదర్శనశాల'', ''విజయవాడ ఇంజినీరు'', ''విలేకరులు''

''ప్రమాదం'', ''సులోచన'', ''ఘటనాఘటనలు'' లాటి కథలను వర్గీకరించటం నాకు సాధ్యం కాలేదు

ఒక్కటి దాదాపు అన్ని కథలలోనూ కనిపిస్తుంది ఈ కథకుడు కేవల వాస్తవికతకూ, కథలలోని భావాలు విశ్వసనీయంగా వుండేటట్టు చూడటానికీ శ్రమ పడలేదు దాదాపు ప్రతి కథలోనూ నమ్మశక్యం కాని మలుపు ఒకటి కనిపిస్తుంది

రచనా విధానం రేఖా చిత్రాలను స్ఫురింపజేస్తుంది ఈ కథలను భావ చిత్రణలుగా రచయిత ఉద్దేశించినట్టు నాకు తోస్తుంది

కథకుడుగా ఈ రచయిత పురోగతి పాఠకుల రియాక్షన్ పైన హెచ్చుగా ఆధారపడి ఉంటుంది

*ముందుమాట 'పొద్దు పొడిచింది' కథల సంపుటి*<br>*రచన అడుసుమిల్లి పూర్ణచంద్రరావు*<br>*అపూర్వ ప్రచురణ, విజయవాడ, జూన్, 1979*

# 1. జేబు రుమాలు

పెద్ద టయిపులో సుమారు 120 పేజీలు గల గ్రంథంలో నాలుగు కథలు

ఈ కథకుడు సంస్కారీ, ప్రతిభావంతుడూ అనే విషయం కథలలో అడుగడుగునా కనిపిస్తుంది చెప్పే విషయంలో తనకు సానుభూతులు ఉండిన్నీ నిర్లిప్తుడై ఉండుట ఈ రచయితకు బాగా చాతనవును

కథకుడి శైలి సున్నితంగానూ, సూటిగాను ఉన్నట్టు కనిపిస్తూ, చెప్పే విషయంను కాక అనేక ఇతర విషయాలను చెప్పకుండా స్ఫురింపజేస్తుంది

ఈ కథలన్నీ శిల్ప ప్రధానమైన కథలనే చెప్పాలి ఒక్క ''వంశవృక్షం'' అనే కథలో మటుకు శిల్పచ్యుతి కనిపిస్తుంది వీరన్న తన కొడుకును ఏడేళ్ళు పెరగనిచ్చి చంపటం తృప్తి కరంగా లేదు తన కొడుకు మరొకరికి పుట్టాడనే అనుమానం ఏడేళ్ళు భరించిన వాడు అకస్మాత్తుగా వివశుడైపోడు

ఈ విషయాన్ని బట్టి ఈ కథలకు ఒకరిచ్చే విలువ మరొకరివ్వక పోవచ్చు కాని ఈ నాడు కథలు చదివే తెలుగు వారికీ కథలు నాలుగూ నాలుగనుభవాలుగా ఉంటాయనటం అతిశయోక్తి కాదు

''జేబురుమాలు'', ''పరామర్శ'' అనే కథల్లో ఆడదాని మానసిక ప్రపంచానికీ మగవాడి మానసిక ప్రపంచానికీ మధ్య ఉండే గోడలూ, అగాధాలూ లీలగా కనిపిస్తాయి ''వంశవృక్షం'' అనే కథలో సంఘ వ్యవస్థకీ మానవ ప్రకృతికీ నిత్యమూ జరిగే సంఘర్షణల్లో ఒకదాని తాలూకూ దారుణ ఫలితం చిత్రించ బడింది ''స్వేచ్ఛ'' అనే కథ చాలా గడుసుగా రాసిన కథ ఈ కథను చాలా మంది పఠితలు గ్రహించలేరేమో ఈ కథలో మర్మమంతా ఆఖరి వాక్యంలో ఉండి, చివరిదాకా చదివినాక మళ్ళీ కథయావత్తూ తిరగజూస్తే కాని కథకుడు చెప్పకుండా వొదిలేసిన విషయాలూ, పాత్ర చిత్రణలో చేసిన తారుమారూ పఠిత కర్థం కాదు ఈ కథకుడి శిల్ప చాతుర్యానికింత కంటె మంచి ఉదాహరణ అవసరం లేదు

ఈ గడ్డు రోజుల్లో ఈ పుస్తకం వెల కొంచెం జాస్తి చేశారేమో అనిపిస్తుంది చిన్న టైపులో గ్రంథాన్ని అచ్చువేస్తూ మరి కొన్ని కథలు చేర్చి గాని పేజీలూ ధరా తగ్గించిగాని ఉంటే ఈ గ్రంథం అధిక సంఖ్యాకులకందుబాటులో ఉండేది ఖరీదైనా కొని చదువదగిన పుస్తకం అవును

*బుర్రా వెంకటసుబ్రహ్మణ్యం గారి కథల సంపుటి, జేబురుమాలు*
*ప్రచురణ నవరచనావళి ప్రచురణ, 3-11-1946*
*నవోదయ, వార పత్రిక, 27-3-1953*

# 2. 'పరివర్తన' సమీక్ష

నాలుగవ ఆంధ్ర అభ్యుదయ రచయితల వార్షిక సమావేశ సందర్భంలో జనవరి 19వ తేదీన మద్రాసు వాణీ మహాలులో ఆంధ్ర ప్రజానాట్యమండలి రాష్ట్రదళం వారిచే ''పరివర్తన'' అనే అభ్యుదయ దృష్టితో రచింపబడ్డ నాటకం ప్రదర్శితమైంది ఈ నాటకం ఇంతకు పూర్వం ఎక్కడా ఆడలేదు ఇంచుమించు రెండువేల మంది ప్రేక్షకులు దీన్ని చూసి తన్మయులై పోయినారు ప్రదర్శనానంతరం దీన్ని గురించి మాట్లాడడానికి ప్రయత్నించిన పెద్దలు మాట్లాడే శక్తి లేనంత వివశులైపోయినట్టుగా కనిపించారు అనేకమంది ఈ నాటకం ''ముందడుగు''ను మించిపోయిందన్నారు

సాహిత్య పరమార్థం గుర్తించకుండా ఆత్మానందం కోసం కవిత్వం వ్రాసుకుంటూన్న కవి జీవిత యదార్థ్యాలకు తట్టుకోలేక ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయినవాడై, సంఘ విద్రోహశక్తులకు తల ఒగ్గి చివరకు ప్రపంచానుభవంవల్ల తన అజ్ఞాన శృంఖలాలనూ, దాస్య శృంఖలాలనూ కూడా తెంచుకుని, అభ్యుదయ పథం అందుకోవడం ఈ కథలోని ఇతివృత్తం

ప్రపంచంతో నిమిత్తం లేకుండా తన ఆనందం కోసం పాడుకుంటూ వుండిన కవి దారిద్ర్యం వాతబడి భార్యనూ ముగ్గురు బిడ్డలనూ కోల్పోయి ప్రపంచంలో కవిత్వానికి స్థానం లేదనీ, సంఘం కవులనాదరించదనీ నిశ్చయించుకుని ఒక పెట్టుబడిదారు వద్ద చేరి అతడి పోషకత్వం కింద వుంటూ అతనికి ఉపన్యాసాలూ, లేఖలూ రాసి పెడుతూవుంటాడు పెట్టుబడిదారు చెల్లెలు శోభ సంపన్నుల బిడ్డ అయినప్పటికీ అభ్యుదయ దృక్పథం కలదై, తన నౌకరు కుర్రాడు రంగడిచేత అభ్యుదయ గీతాలు పాడించి కవిని గుచ్చుతూ వుంటుంది కవి రచించిన భావగీతాలు పాడి హేళన చేస్తూ వుంటుంది పెట్టుబడిదారు దగ్గర గుమాస్తాగా ఉంటూన్న దాసు అనే వృద్ధుడు కవిని హేళన చేయకపోయినా, అతనికి ప్రపంచజ్ఞానం లేదనే విషయం సూచిస్తాడు వీరి పలుకులు కవిని కలతబెడతాయి గాని కదిలించవు

ఇంతలో ఒకనాడు పెట్టుబడిదారు ఫ్యాక్టరీలో పనిచేసే రంగడి తండ్రి కుడిచెయ్యి యంత్రంలో పడి నలిగిపోతుంది ఈ వార్త వినగానే పెట్టుబడిదారు ఆత్మరక్షణార్థం తప్పు తన పక్షంలేదని రుజువు చేసే ప్రయత్నం చేస్తాడు దెబ్బతిన్న పనివాడికి నష్టపరిహారం మాట ఆలోచించడు కార్మిక నాయకుడైన చౌదరి రాయబారం వచ్చి భంగపడతాడు అక్కడ అతను కవిని పరిచయం చేసుకుని, కవి దౌర్బల్యాన్ని కూడా గుర్తిస్తాడు

తన యజమాని అయినపెట్టుబడిదారుదే తప్పని నమ్మలేక, కాదని సరిపెట్టుకోలేక, సందిగ్ధంలో పడిన కవి, రంగడి తండ్రి దగ్గరకి వచ్చి, చూసి యదార్థం తెలుసుకుంటాడు

పత్రికలకు దొంగ రిపోర్టులు పంపి పోలీసుల సహకారంతో పనివాళ్ళ ఒత్తిడి నెదుర్కొనటానికి సంసిద్ధుడైన అన్నను శోభ భంగపరుస్తుంది కవి రచించిన పుస్తకాలు తన అన్న అతని సొంత పేరుతో అచ్చు వేసుకున్న సంగతి శోభ బయట పెడుతుంది దానితో పెట్టుబడిదారు బండారం బయటపడి అతని ఆటకట్టవుతుంది కవి విప్లవకవిగా మారిపోతాడు

ఈ ఇతివృత్తం అమిత ఉద్రేక పూరితంగానూ, ఎంతో సెంటిమెంటల్‌గానూ చిత్రించబడింది ఈ రెండు కారణాలూ నాటకం రక్తి కట్టటానికి ఎంతో తోడ్పడ్డాయి దానికి

తోడు సంభాషణల్లోనూ, నాటకం నడకలోనూ చక్కని ప్రతిభా శిల్పాలున్నాయి పాత్రల పోషణకూడా చాలా తెలివిగా ఉంది ఈ కారణాల మూలంగా నాటకంలో ఉన్న అనేక లోపాలు కప్పబడిపోయినై

ఇతివృత్తంలోనే చాలా లోపం వుంది శోభ తన అన్న ఆట కట్టించే ఘట్టానికి అర్థంలేదు ఒక పుస్తకం మరొకరి పేరుతో అచ్చయినాక దాన్ని బయటపెట్టడంలో పెట్టుబడిదారుకు జరిగే పెద్ద అపజయం ఉండబోదు పెట్టుబడిదార్ల నిరంకుశత అంత సులభంగా లొంగిపోదు వాళ్ళని జయించేది ఎప్పటికైనా పనివాళ్ళ ఐక్య ప్రతిఘటనే ఆ విషయం నాటకం నిరూపించదు

పెట్టుబడిదారు చెల్లెలు శోభ పుస్తకాలు చదివి పెట్టుబడిదారీ సంస్కారం మీద కత్తి కట్టిందని ఎస్టాబ్లిష్‌చెయ్యటం నమ్మశక్యంగా లేదు అంతకంటే బలవత్తరమైన కారణం ఉండాలి

పట్టుపురుగులాగ తనచుట్టూ గూడు కట్టుకుని అందులోనే మగ్గిపోతున్న ఒకానొక కవిలో పరివర్తన తీసుకురావటానికి గాను నాటకంలో వచ్చే పాత్రలన్నీ అంతగా కృషిచెయ్యటం దేనికో ఊహించటం కష్టం ఈ నాటకంలో చిత్రించబడింది ఆధునిక అభ్యుదయ కవి పుట్టుక అయినాకాదు, నాటక నేపథ్యంలో ఒక అభ్యుదయ కవి ఉండనే ఉన్నాడు మన కవి తన గూడు దాటి బయటికి రాకపూర్వమే - నాటకారంభంలోనే - శోభా, రంగడూ కలిసి మరో అభ్యుదయ కవి రాసిన పాటలు పాడనే పాడతారు దీనికి తోడుగా ఈ కవిలో ఒక విశిష్టత అయినా రుజువు చెయ్యబడలేదు పాండిత్యమో, శిల్పమో, ప్రాచీన సంస్కారమో ఉండి, జీవిత యాదార్థ్యం తెలియని కారణం చేత వెనకబడి ఉండిన కవి కొరకు ఇన్ని పాత్రలూ శ్రమపడినట్టుంటే ఈ ఇతివృత్తానికి అర్థం ఉండును ఈ నాడు అభ్యుదయ దృష్టిలేని కవులంతా ఎట్లా ఉన్నారో, అదే స్థితిలో వున్న ఒకానొక కవిలో పరివర్తనం కలిగించటానికింత నాటకం రాయటం వింతగా కనిపిస్తుంది

శోభా, రంగడూ, దాసూ, చౌదరీ – వీరంతా కవికన్న ముందుకు వెళ్ళినవాళ్ళే పరివర్తనం పొంది కవి వారిని చేరుకుంటాడు - అంతే! ఈ కారణం చేత నాటకంలో ఉండదగిన ఉదాత్తతకు గట్టిదెబ్బ తగిలింది

ఈ నాటకం కాల పరీక్షకు నిలబడలేదని విమర్శకుడైన వాడు సులభంగా చెప్పవచ్చు కాని అంతమాత్రం చేత ఇది తాత్కాలికంగా కొంత ప్రయోజనం సాధించిందనటానికి వీల్లేదు తాత్కాలికంగా, ఈ నాటకం ప్రజలను ఊపుతుంది కవులను బాగా రెచ్చగొట్టుతుంది ఈనాటకం తమకు చేసే కొద్దిపాటి అవమానాన్ని అభ్యుదయ కాంక్షగల కవులు వన్నిస్తారు కవి సమాజాన్ని నడిపించగలందులకై సమాజం కవిని నడిపించే కథగల ఈ వింత నాటకాన్ని అభ్యుదయ పిపాసువులు కొంతకాలం ప్రేమించగలుగుతారు ఎందుచేతనంటే నాటకం యొక్క ఆశయం ప్రేక్షకలోకం నుంచి అప్రయత్నంగా సానుభూతి తెచ్చుకుంటుంది

దీన్ని ప్రదర్శించిన వైజ్ఞానికదళం వారు పాత్రధారణలోనూ, ప్రదర్శనంలోనూ ఎంతో సమర్థతా, సహృదయతా ప్రకటించారు

దేశమంతటా ''పరివర్తన'' ప్రదర్శితం కావటమూ, తెలుగువారంతా ఈనాటకాన్ని అధమం ఒకసారయిన చూడటమూ ఎంతయినా అవసరం

*అభ్యుదయ, మాసపత్రిక, మార్చి 1947*

# 3. తెలంగాణా స్వేచ్ఛా సంగ్రామ చరిత్ర
# (నాటకం –నవల – కథ)

## మా భూమి సమీక్ష

సామాన్యంగా ఈనాడు మధ్యతరగతివాళ్ళు ఆనందించే కళలను గురించి విమర్శక దృష్టి ఎట్లా ఉందంటే,

ఇందులో కళాకారుడి ప్రతిభ బాగా వ్యక్తమవుతున్నదా? దీన్ని బట్టి అతను గొప్పవాడని మనం భావించుకోవచ్చా? - ఇది శిల్పం గురించి

ఇందులో చిత్రించిన విషయాలు నమ్మదగినవేనా? ఇదంతా ప్రచారంకాదుగద? - ఇది విషయం గురించి

మధ్యతరగతికి ఇటువంటి మనస్తత్వం ఉండటానికి ప్రబలమైన కారణాలున్నాయి వాటి చర్చ మనకిక్కడ అనవసరం ఈ మనస్తత్వం కళావిమర్శను ఏధోరణిలో నడిపిస్తుందో గమనించటమే మనకు కావలసినది ఈ ధోరణి వల్లనే కళాకారుడి ప్రతిభకూ, దానివల్ల ప్రజలకు కలగగల ప్రయోజనానికీ మధ్య ఒక అగాధం ఏర్పడింది ఒక నాటకకర్తగాని, రచయితగాని, నటుడుగాని, చిత్రకారుడుగాని ప్రతిభావంతుడు కావటమే ఒక పరమ ప్రయోజనం అయిపోయింది ఈ విధంగానే కళావస్తువుకూ దానికి గల సాంఘిక ప్రాముఖ్యానికీ మధ్య ఇంకో అగాధం ఏర్పడింది అది కలకాలం - దాని సాంఘిక ప్రాముఖ్యత చెల్లిపోయినాకకూడా - నిలబడి ఉంటుదా, ఉండదా అనేది ప్రధానమయింది

దీని ఫలితంగా కళ అనేది జీవితాన్ని మరవటానికీ, జీవితం అపహరించే జీవశక్తుల్ని కూడగట్టుకొనడానికి టానిక్కుకింద వినియోగ పరుచుకొనటానికి సాధనంగా పరిణమించింది

ఇటువంటి మనస్తత్వమూ, విమర్శనాదృష్టిసంస్కరించటం అభ్యుదయోద్యమం యొక్క కర్తవ్యం కళలు టానిక్కులు కావు సంఘ జీవులకు నిత్యాహారం అవి ప్రజలలో కలిగించే ఉత్తేజాన్ని బట్టే, ప్రత్యక్షయదార్ధ సమస్యలనెదుర్కొనేశక్తినిచ్చే సామర్ధ్యాన్నిబట్టే అవి సక్రమ ఆహారం అవునోకావో అభ్యుదయ విమర్శకుడు నిర్ణయిస్తాడు

దేశంలో పెచ్చు పెరిగిన ఆర్థిక కాటకంగాని, రాజకీయ సమస్యలుగాని అందరికీ సమంగా ప్రత్యక్ష యదార్ధాలుకాకపోవచ్చు ప్రేయసికోసం ఊహాగానం చేయటమే తారక మార్గమనే దృఢ విశ్వాసంగల వ్యక్తులూ, అల్పసంఖ్యాక వర్గాలూ దేశంలో ఉన్నారు కాని ప్రజా సామాన్యం తీసుకున్నట్టయితే నిజాము రాష్ట్రంలో జరుగుతున్న ప్రజా పోరాటం ప్రత్యక్ష యదార్ధ సమస్య తెలంగాణా ప్రజలు మన ప్రజలకు భావ బంధువులు కారు, ప్రత్యక్ష సోదరులు వారి బాగూ మనబాగూ వేరుకాదు అందుచేత ''మాభూమి'' నాటకం చూసి బయటికి వచ్చిన మరుక్షణం దాని గురించి మరిచి మామూలు ప్రపంచం లోకి పడటం అసంభవం ఒకవేళ ఈ నాటకం చూడక మునుపు నిజాము పోరాటాన్ని గురించి తగినంత ఆలోచించని వాళ్లెవరైనా ఉంటే వాళ్ళనీ నాటకం యదార్ధ ప్రపంచంలోకి తీసుకు వచ్చి అక్కడే ఉంచుతుంది ఈ

కారణం చేత ఈ నాటకం చేసే ప్రచారం అత్యవసర ప్రచారం ఈనాటకంలో వున్న పాత్రలు స్థూలంగా రెండు పక్షాలకు చెందినవే అయినా స్పష్టమైన వ్యక్తిత్వాలు కలవి ఏ పాత్ర ''భాష'' ఆ పాత్ర మాట్లాడుతుంది వీరారెడ్డి ప్రబోధకుడు రామిరెడ్డి అనుమానం మనిషి దాదా ఆత్మవిశ్వాసం తగినంత లేని పాత కాలపు సాధువు సుభాన్ తొందరమనిషి యిలమంద ఆలోచించే బాపతుకాదు రెండోపక్షంలోకూడా జగన్నాథరెడ్డి గర్వాంధుడు పట్వారీ తెలిసిన మూర్ఖుడు మస్తాను దేశముఖు చేతికర్ర ఆఖరుకు సీతమ్మా, కమలాకూడా ఒకే పద్ధతికాదు

ఇంత విస్పష్టమైన పాత్రలతోటి అభ్యుదయశక్తుల స్వరూపాన్ని అభ్యుదయ నిరోధశక్తుల స్వరూపాన్ని చక్కగా చిత్రించారు నాటకకర్తలు రైతువర్గపు సంభాషణలన్నీ నినాదాలుగానూ, రాజకీయ ఉపన్యాసాలుగానూ కనిపిస్తాయి కాని ఆ నినాదాలూ, ఉపన్యాసాలూ వారిజీవితానికి ఎంతో ముఖ్యమైనవి తమజీవితాలను స్పష్టంగా అవగాహన చేసుకోవడం మీదే వారి ప్రాణాలూ విజయమూ ఆధారపడి ఉన్నాయి

ఈ నాటకంలోని వ్యక్తుల కష్టసుఖాలకన్న ఉమ్మడి సమస్యకి ఎక్కువ ప్రాముఖ్యత వుండక పోవడం గుణమేగాని, లోపంకాదు అయితే ఈ నాటకానికి వాస్తవికత్వం రావాలంటే ఈ పాత్రలు చాలవు, నాటకం మొదటినుంచి చివరవరకూ నలుగురే రైతులూ, ఒక్కరే దేశముఖురౌడీ, ఒకడే పోలీసు ఉద్యోగి రావటం నాటకానికి చాలా బలహీనం ఏవీరారెడ్డి జీవితమో నాటకానికి ప్రధానాంశమైతే ఇది పట్టివ్వకపోను

సంభాషణల్లోనూ పాత్రల సంబంధాల్లోనూ నాటక రచయితలకు అక్కడి వాతావరణంతో గల పరిచయం చక్కగా వ్యక్తమవుతుంది ఇంత గంభీరమైన నాటకంలోకూడా చక్కని సున్నితమైన హాస్యం ఉంది

స్వరూపంలో ఈ నాటకానికి ఆధునిక నాటకలక్షణాలు అట్టేలేవు ఏ దృశ్యానికా దృశ్యం రక్తికడుతుంది గాని ముందు నడిచిన దృశ్యం వెనక నడచిన దృశ్యంతోటి చక్కగా అతకదు మధ్య ఏ ఒకసీను ఎత్తివేసినా నాటకం అట్టే దెబ్బతినదేమో అనికూడా అనిపిస్తుంది అదీగాక ఈ నాటకం ''ముందడుగు'' వొరవడిలోనే నడిచింది కూచిపూడి భాగోతులకూ హరికథా కాలక్షేపాలకూ నప్పినంతగా ఇటువంటి వొరవళ్లు ఆధునిక నాటకానికి నప్పవు నాటకంలో ఎన్ని రంగాలుండవలసిందీ, ఏరంగంలో కథ ఏ పాకానికి రావలసిందీ కథను బట్టే నిర్ణయించాలి గాని ఒకే మూసలో వేసి అన్ని కథలనూ తయారుచేయరాదు ఈ నాటకం రాసిన సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావు గార్లీ విషయం గమనించాలి

*అభ్యుదయ మాసపత్రిక, జనవరి, 1948*

# 4. సింహ సేనాపతి

వైభవోపేతమైన ప్రియ మాతృభూమి గత జీవితాన్ని గురించి ఎప్పుడో ఒకప్పుడు ఊహించుకోకుండా ఉండే భావుకుడు ఉండడు తక్షశిలా నలందాల్లో, అమరావతీ, నాగార్జున కొండల్లో, అజంతా ఎల్లోరాల్లో ఛాయామాత్రంగా కనబడే ఆనాటి జీవన సమగ్ర స్వరూపం ఎటువంటిదై ఉంటుంది అనే ఊహాతరంగాల్లో కొట్టుకుపోకుండా ఉండలేడు

ఈ జిజ్ఞాసను వట్టి ఊహాపథంలో నుంచి మళ్ళించి, దానికొక నిర్దిష్ట స్వరూపాన్ని ఇవ్వటానికి జరిగిన ప్రయత్నాల్లో ఒకటి ఈ 'సింహ సేనాపతి' నవలారచన నవలలో ఒక భాగంగానే రచించిన 'ప్రవేశిక'లో రచయిత చిత్రించినట్లు, చరిత్ర లోతుల్లో మరుగున పడిపోయిన విషయాలను తవ్వితీసి, ఏర్చికూర్చి ఒక రూపకల్పనకు జరిగిన ప్రయత్నమిది 2500 సంవత్సరాలకు పూర్వం, బుద్ధ భగవానుడు ఇంకా స్వయంగానే తన సందేశాన్ని వినిపిస్తూన్న నాటి సామాజిక, రాజకీయ జీవితాన్ని చిత్రించటానికి రచయిత ప్రయత్నించాడు ఆనాడు మన దేశంలో ఉత్తరాదిని వెలిసిన గణతంత్రాలనే ఒకలాంటి పంచాయతీ రాజ్యాల వ్యవహారాలను, అక్కడి ప్రజాజీవితాన్ని మన కళ్ళ ముందుంచటానికి రచయిత ప్రయత్నించారు

ఇందుకు పూనుకున్న మహాపండిత, త్రిపిటకాచార్య, రాహుల్‌సాంకృత్యాయన్ దీనికెంతైనా తగిన వారు వారు బహుభాషా కోవిదులు ముఖ్యంగా ప్రాచీన లిపులన్నింటినీ సునాయాసంగా చదువగలదిట్ట చరిత్ర పరిశోధకులు

ప్రాచీన భారతదేశంలో లిచ్ఛవీగణతంత్రం ఉండేది అది పాటలీపుత్ర (పాట్నా) ప్రాంతాలను ఆనుకొని ఉండినట్లు ఈ నవలలో పేర్కొన్నారు సింహుడనే ఆ గణతంత్ర యువకుడొకడు, పడమట సింధునదీ తీరంలోని తక్షశిల గణతంత్రానికి వెళ్ళి అక్కడ యుద్ధతంత్రాన్నీ, ఇతర విద్యలనూ అభ్యసిస్తాడు పర్షియా (ఇరాన్) చక్రవర్తి డరయస్ తక్షశిలపై దండెత్తి వచ్చినప్పుడు సింహుడు తక్షశిల పక్షాన పోరాడి విజయ సాధనకు తోడ్పడతాడు గురుపుత్రిక, వీరవనిత అయిన రోహిణిని వివాహమాడి తన స్వదేశానికి మరలుతాడు అక్కడ, లిచ్ఛవీగణతంత్రాన్ని కబళించేందుకు ప్రయత్నించిన మగధరాజు బింబిసారుని ఓడించడంలో ప్రధాన పాత్రను నిర్వహించి, సర్వసేనాపతిగా ఎన్నికవుతాడు

ఇదీ ఈ నవల క్లుప్తంగా ఇతివృత్తం కథను నడపడంలో ఆనాటి వ్యవసాయ, వర్తకాది విశేషాలూ, గణతంత్ర సమావేశాల్లో నిర్ణయాలు జరిగే పద్ధతీ, ఓటింగు పద్ధతులూ, సమాజంలో స్త్రీల పాత్ర, బానిసల స్థితి మొదలయిన వాటి ప్రసక్తి వస్తుంది అంతేకాకుండా, ఇప్పుడు ఆఫ్ఘనిస్తాన్ దేశాన్ని ఆనుకొని, ఆయూదార్యా నదికి ఆవలి వైపున ఉన్న నేటి సోవియట్ తాజకిస్తాన్‌లోని ఆనాటి పరిస్థితుల చిత్రణ కూడా ఉంది బౌద్ధ, జైనమతాల ఘర్షణ చూచాయగా చిత్రితమయింది బుద్ధ, సంఘ, ధర్మ అనే బౌద్ధ త్రిరత్నాల నిర్వచనమూ, బుద్ధుడు ఆస్తికుడా, నాస్తికుడా అనే ప్రశ్నకు సమాధానం 'బుద్ధుని శిష్యరికం' అనే అధ్యాయంలో ఉన్నాయి

2500 సంవత్సరాల నాటి సామాజిక జీవనాన్ని నవలా రూపంలో చిత్రించడానికి జరిగిన తొలి ప్రయత్నం ఇదేనేమో ఇందుకు రాహుల్జీకి భారత ప్రజలెంతైనా ఋణపడి ఉంటారు

అయితే ఆనాటి జీవిత విశేషాలుగా రాహుల్జీ చిత్రించిన కొన్ని అంశాలు నిజమేనా అనే అనుమానం కలుగుతుంది ఉదాహరణకు స్వ, పర భేదం లేకుండా, వావీవరుసా లేకుండా ఎవరి ఇష్టం వచ్చినట్లు, ఎవర్ని పడితే వారిని కౌగిలించుకొని ముద్దులు పెట్టుకునే సంప్రదాయం ఆనాడు ఉండేదా? ఎప్పుడు పడితే అప్పుడు, కొన్ని సందర్భాలలో సామూహికంగా కూడా, ఈ చుంబన కార్యక్రమం సాగింది ఇది వాస్తవిక చిత్రణయేనా అని అనుమానం కలుగుతుంది

అదే విధంగా ఆధునిక యుద్ధ రంగాల్లో గాయపడిన వారి చికిత్సకై జరిగే ఏర్పాట్లు లాంటివే, ఇంత కట్టుదిట్టంగానూ ఆనాడు కూడా జరిగినట్లు రచయిత చిత్రించారు ఇది

కూడా నిజమేనా అనే సందేహం కలుగుతుంది ఇక ఆనాటి గణతంత్రాలు ఒక గణం, ఒక ప్రత్యేక తెగయొక్క వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవటానికి ఏర్పడినవే రక్తసంకరం గానీ, వర్ణసంకరంగానీ జరగకుండా మడి కట్టుకు కూర్చున్నవే ఆ గణతంత్రాలు అందువల్లనే శాంతి ఒడంబడిక ప్రకరణంలో నేటి అభివృద్ధి కాముక దృక్పథంతో చూస్తే చాలా దారుణంగా కనబడే సింహ సేనాపతి వాదనలే నెగ్గుతాయి అలాంటి సందర్భాల్లో మసిపూసి మారేడుపండుని చేయడానికి రాహుల్జీ ఏమాత్రమూ ప్రయత్నించలేదు

అయితే విషయ పరిపుష్టికి తగిన శిల్ప సౌందర్యాన్ని రాహుల్జీ ఈ నవలకు ప్రసాదించలేదు ఈ నవలను అనువదించటంలో భాష విషయంలో కాలౌచిత్యానికి కొంత భంగం కలిగింది ఆనాటి పరిస్థితులకు చెల్లనటువంటి 'ప్రజాస్వామ్యము, ప్రజా పరిషత్తు' అనే ప్రయోగాలూ, జరూర్, లుచ్చా, గ్లాసు, సఫా మొదలగు ప్రయోగాలూ జరిగాయి

ఇటువంటి చిన్నలోపాలూ, అనుమానాస్పదమైన స్వల్ప విషయాలూ ఉన్నప్పటికీ భారత వాఙ్మయానికి ఇదొక అపూర్వమయిన కానుక కాగలదనేది నిర్వివాదం ఇటువంటి ఉత్తమ గ్రంథాన్ని తెలుగు పాఠక లోకానికి అందజేసిన ప్రచురణ కర్తలు అభినందనీయులు

*విశాలాంధ్ర, దినపత్రిక, 30-9-1956*

## 5. జాతి రత్నాలు
## (స్త్రీల పాటలు – కథా వైచిత్రి)

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారి మరొక సాహిత్యకృషిఫలితం ఈ పుస్తకం ఇందులో ''లక్ష్మణదేవర నవ్వు'', ''సత్యభామ సరసము'', ''ధర్మాంగద చారిత్రము'', ''ధర్మరాజు జూదము'', '' ఊర్మిలాదేవి నిద్ర'' అనే అయిదు స్త్రీల పాటల తాలూకు కథాంశాలు, పాటలలోని నమూనా భాగాలతో సహా రచించబడ్డాయి ఇవి జానపద గేయాలు సాధారణంగా జానపద సాహిత్యంలో ప్రతిబింబించే సంస్కృతిలో ఆధునికుల సంస్కృతిని పెంపొందించగలదేమీ ఉండనప్పటికీ, జానపద కళల పరిచయం కూడా మనం మన సంస్కృతిని ముందుకు తీసుకుపోలేం

ఈ గ్రంథాన్ని శ్రీ సురవరము ప్రతాపరెడ్డి గారు రచించిన అమూల్యమైన పీఠికలో చెప్పినట్లు ''ప్రతి జాతియొక్క జానపదములు ఆ జాతి యొక్క శాసనముల కన్న మిన్నయైనట్టివి '' మనకు మన చరిత్రను గురించిన పరిజ్ఞానం ఎంత అవసరమో, జానపద పరిజ్ఞానం కూడా అంత అవసరం

ఈ కాలపు స్త్రీలకు ఇలాటి జానపద గేయాలతో పరిచయం లేకుండా పోతున్నది ఇటువంటి పుస్తకాలు ఈ లోటును తీర్చగలవు ప్రతాపరెడ్డిగారన్నట్టుగా శ్రీమతి సరస్వతీదేవి గారు ఇంకా అనేక ''జాతిరత్నాలు'' సేకరించి ప్రకటిస్తారని ఆశిద్దాం

*ముద్రణ పుస్తక ప్రపంచం, ఏప్రిల్ 1962*

# 6. అక్కరకు వచ్చిన చుట్టం, ముత్యాల మనసు

ఈనాటి తెలుగుకథా వాఙ్మయం చాలా ఉన్నత స్థాయినందుకున్నట్టు సర్వత్రా గుర్తింపబడుతున్నది దీనికి ప్రత్యక్ష నిదర్శనాలు విరివిగా వెలువడుతున్న కథాసంపుటాలే ఇంకొక ప్రత్యేక విషయమేమంటే మహిళామణులు రచించే కథలు మగవాళ్ళ రచనలకు ఎందులోనూ తీసిపోవటం లేదు దేశమంతా బానిసత్వంలోనే ఉండినప్పటికీ స్త్రీలు మరింత బానిసత్వంలో ఉండిన తరుణంలో వీరేశలింగం పంతులుగారు వంటి సంస్కర్తలు చేసిన ప్రభావమూ, అంతకన్న మరింతగా గాంధీజీ లేవదీసిన జాతీయోద్యమమూ స్త్రీ పురుషుల సంస్కృతిని కలిపి కరగబెట్టి వారిలో భవిష్యత్తుకు అత్యవసరమైన సంస్కార బీజాలు నాటాయి అందుచేత, జీవితపు ఇతర రంగాలమాట ఎలా ఉన్నా, సాంస్కృతిక రంగంలో స్త్రీలు పురుషులతో సమంగా నిలబడ్డారు

ఇప్పుడు సమీక్షించే ఈ రెండు కథాసంపుటాలను రచించిన శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి ఆంధ్ర పాఠక లోకానికి చిరపరిచితులు ఆమె అనేక పత్రికలలో తమ కథలు ప్రచురించటమే గాక స్త్రీల సమస్యలను గురించి ఎన్నో విషయాలు రాస్తున్నారు రాజకీయరంగంలోనూ సాంఘిక కార్యకలాపాలలోనూ పాత్ర వహిస్తున్నారు రేడియో ప్రసంగాలు చేస్తున్నారు

రచయిత్రిగా సరస్వతీదేవిగారిది విశాల దృక్పథం కొందరు కథకులు తమ పాత్రల సుఖదుఃఖాల ''లెవెల్'' నుంచే జీవితాన్ని చూస్తున్నట్టు కనబడతారు, వారు కనీసం తమ అభిమాన పాత్రల కంటె ఒక అంగుళం పెరగటానికి ప్రయత్నించరు సరస్వతీదేవిగారికి జీవితం గురించి గల విశాల భావాలు కథలలో వ్యక్తమవుతూనే ఉంటాయి ఈ కథలలో దొరలు మొదలుకుని రిషాలాగి దారిద్ర్యంతో కుమిలే అతి పేదల దాకా రకరకాల తరగతుల ప్రజల మనస్తత్వాలూ, జీవితమూ ఆ జీవితంలోని హాస్యమూ, భయంకరత్వమూ, తియ్యదనమూ, చేదు - అన్నీ నిష్పక్షపాతంగా చిత్రించబడ్డాయి

ఈ సంపుటాలకు పీఠిక వ్రాసిన శ్రీ శివశంకరస్వామిగారన్నట్టు ఈ రచనలలో 'వైవిధ్యము'' ఉన్నది సాధారణంగా మనం చూసే తెలుగుకథల్లో ఏడింట ఏడెనిమిది ''పెళ్ళి'' కథలుంటాయి కాని ఈ సంపుటాలలో గల 29 కథలలో పెళ్ళికి సంబంధించినవి గట్టిగా మూడైనా లేవు పాత్రల మధ్య రాగమూ ద్వేషమూ కూడా స్వాభావికంగా చిత్రించబడ్డాయి భార్యాభర్తల మధ్య అన్యోన్యత చూపించిన కథలలో కూడా ''ప్రేమ'' ప్రసక్తి లేదు ఈ కథలలో మనకు కనిపించే ప్రేమ అంతా మానవత్వానికి మూలకందమైనది ఎలాటి పాత్రల మధ్య ఈ విధమైన ప్రేమ సాధ్యమో చూపటమే గాక ఈ రచయిత్రి తనకు ఎలాటి పాత్రలపై ఈ విధమైన ప్రేమ ఉన్నదీ కూడా స్పష్టం చేస్తున్నారు బాధాసర్పదష్టులపై ఈమెకు దేవుడికుండదగినంత సానుభూతి, అదే విధంగా ఇతరులను పీడించే వారి పట్ల నిరసన రచయిత్రిలో నిర్లిప్తంగా ఉండి సృష్టించిన పాత్రలు కూడా లేకపోలేదు ''మాయముత్యాలు'', ''దొరలు'', ''మగువమాయ'', ''స్వాతంత్ర్యసిద్ధి'', ''శుభాలు'', 'వేమూరివారి కోడలు'' లాటి కథలు ఈ తరగతి కిందకి వస్తాయి వీటిలో చివరి కథ నిజంగా దారుణమైన కథ, ఎందుకంటే, కాపరానికి వచ్చినప్పుడు ''శిరీష కుసుమకోమలమైన'' హృదయం గల కామాక్షమ్మ పరిసరాల

ప్రభావం చేత క్రమంగా ''రాటుదేరి'' చివరకు ఒక పసివాణ్ణి హత్య చెయ్యటానికి కూడా సాహసించి తానే ఆ ప్రయత్నానికి బలి అయిపోతుంది ఈ పాత్ర పట్ల రచయిత్రి నిర్లిప్తంగా ఉన్నట్టు కనిపించినా, కామాక్షమ్మను అలా తయారుచేసిన పరిస్థితుల పట్ల ఆమెకు గల అసహనాన్ని మనం ఊహించుకోవచ్చు పైన చెప్పిన ఇతర కథలు కూడా ఇదే విధంగా రచయిత్రి తన అసమ్మతిని పాత్రల మీద చూపక పరిస్థితులపై చూపుతున్నారు

ఈ సంపుటాలలో ''కత్తి మీద సాము'' ''సాహిత్యోద్యానం'' అన్నవి సాహిత్య రంగానికి సంబంధించినవి వీటిలో రెండవది ''సింబాలిజం''తో కూడుకున్నది ఒక్క సాహిత్యరంగమే కాక ఇంకా అనేక జీవితరంగాలు - రాజకీయ, విద్యా, శ్రామిక, గృహాది రంగాలు - ఈ కథలలో చిత్రించబడ్డాయి

నవలలోలాగ చిన్నకథలో విస్తృతంగా పాత్ర చిత్రణ చేసే అవకాశం లేదు అందుచేత పాత్రలుచాలా వరకు సులభగ్రాహ్యంగా చిత్రించబడ్డాయి కథా శిల్పం నిర్దుష్టం భాష పిల్లలు సహితం సులువుగా అర్థం చేసుకునేలాగున్నది ఈ కథాసంపుటాలు ఆధునిక తెలుగు కథాసాహిత్యంలో విశిష్ట స్థానం సంపాదించుకుంటాయనటానికి సందేహమేమీ లేదు

అక్కరకు వచ్చిన చుట్టం ముత్యాల మనసు (కథలు గల్పికులు, రచన ఇల్లిందల సరస్వతి దేవి)

*ముద్రణ పుస్తక ప్రపంచం, మాస పత్రిక, ఏప్రిల్ 1962*

# 7. మహోన్నత మానవుడు రాహుల్ సాంకృత్యాయన్

జిజ్ఞాస - అందులోనూ అనంతమైన జిజ్ఞాస ఉండటం ఒక సుకృతం ఆ జిజ్ఞాస కొద్దీ, సకల సౌఖ్యాలూ విడనాడి, ఎలాంటి కష్టనష్టాలనయినా లెక్క చేయక, చివరకు సన్యాసి జీవితానికి కూడా వెనుదీయక, దేశ దేశాలూ తిరిగి చూడాలనేది ఒక దీక్షగా పెట్టుకోగలగటం ఒక విశేషం తాను తెలుసుకున్న అపూర్వ విషయాలను ఎప్పటికప్పుడు గ్రంథస్థం చేసి తోటి మానవులకు అందజేయాలనే నిస్వార్ధ సంకల్పం ఒక వ్యసనం అనిపించేటంతగా ఉండటం మరొక విశేషం విజ్ఞాన సముపార్జనతో పాటు తానూ క్రమపరిణామం చెందుతూ, చైతన్య స్థాయిలో ఎప్పటికప్పుడు పైమెట్టు అందుకుంటూ రాగలగటం మరొక గొప్ప లక్షణం

వీటిలో ఏ ఒక్కటీ ఉన్నా ఆ వ్యక్తి విశిష్టవ్యక్తి అనిపించుకుంటాడు ఈ విశేషలక్షణాలన్నీ కలిసి ఒకే వ్యక్తిలో గూడు కట్టుకుంటే - అటువంటి వారు ఉన్నారా అనుకుంటాము అలాంటి వారు నూటికి కోటికి ఒకరంటాము అచ్చంగా అటువంటి మహోన్నత మానవుడే - మహాపండిత, త్రిపిటకాచార్య రాహుల్ సాంకృత్యాయన్

వీరి జీవిత చరిత్ర ఒక వ్యక్తి జీవిత చరిత్రగా కనబడదు అది మన దేశములోని అభ్యుదయ కాముక వర్గాల పరిణామ చరిత్రగానే గోచరిస్తుంది వీరి జీవిత చరిత్ర మన దేశంలోని వివిధ, విభిన్న ప్రాంతాల ప్రజల స్థితిగతులకు, ఆచార వ్యవహారాలకు ఒక ప్రతిబింబం వంటిది అంతేకాదు, ఆయన జీవిత కథ చదువరులను హిమాలయ శిఖరాలు మొదలుకొని కన్యాకుమారి వరకు, తూర్పుతీరం మొదలుకొని పడమటి కనుమలు వరకు నడిపిస్తుంది

ఆయా ప్రాంతాల జీవన విశేషాలనూ ఆచార వ్యవహారాలనూ కళ్ళముందు ఉంచుతుంది అంతేకాదు, సింహళం, టిబెట్, జపాన్, సోవియట్, ఇరాక్, ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్, ఫ్రాన్సు, ఇంగ్లాండు దేశాలకూ తీసుకువెళ్తుంది అక్కడి ప్రజల ఆచార వ్యవహారాలనూ, వారి మనోభావాలనూ మనకు తెలియజేస్తుంది ఒకసారి కాదు ఎన్నోసార్లు హిమాలయాల మీదుగా ప్రయాణం చేయిస్తుంది టిబెట్‌లోని ప్రాచీన బౌద్ధ సంఘారామాలకు తీసుకువెళ్తుంది

మన దేశంలో ఏనాడో కోల్పోయి, ఇంచుమించు మరచిపోయిన నాగార్జునాచార్యుడు మొదలయిన ప్రసిద్ధ బౌద్ధాచార్యుల రచనలను మనకు చూపిస్తుంది వాటిని చూచి రాహుల్జీ పొందిన ఆనందంలో మనల్నీ భాగస్వాములను చేస్తుంది కొన్ని అమూల్యమైన తాళపత్ర గ్రంధాలు, మూఢనమ్మకాల ఫలితంగా మంత్ర తంత్రాలకు సాధనాలయిన శిధిలమయి పోవటం చూచి ఆయనతో పాటు మనకు ఆవేదన కలిగిస్తుంది

తన జీవిత కధను ఇంతగా ప్రపంచ వ్యాపితం చేసుకున్న మహనీయులు బహు అరుదు

రాహుల్జీ పుట్టింది ఒక కుగ్రామంలోని ఓనమాలు తెలియని ఒక బీదబ్రాహ్మణ కుటుంబంలో తల్లిదండ్రులు పెట్టిన పేరు కేదారనాథ్ మొదటినుండీ బడిలో తక్కిన వారు ఏడాది పొడుగునా నేర్చుకునే పాఠాలను మూడు నాలుగు మాసాల్లోనే పూర్తి చేసేవారు ఆదిలో హిందూ మతాచారాలపై గాఢమైన అభిమానం ఆ కారణంచేత చిన్నతనం నుండీ సంస్కృతం నేర్చుకోవాలని ఎక్కడలేని పట్టుదల

దానికితోడు - '' ఓ మూర్ఖుడా మళ్ళీ జీవితం దుర్లభం కాబట్టి ప్రపంచ పర్యటన చెయ్యి'' అని మూడో తరగతి పాఠ్యగ్రంధంలోని ఒక వాక్యం, లేప్రాయంలోనే ఆయన ఆలోచనల్లో తిష్టవేసింది

ఈ రెండింటి ప్రభావం వల్ల, దూర ప్రాంతాలకు వెళ్ళి విజ్ఞానాన్ని సముపార్జించాలనే ఆకాంక్ష ఆయనలో ప్రబలమయింది ఒకనాడు నెయ్యి ఒలికిపోవడమూ, తాతగారు తంతారనే భయం పుట్టడమూ, తొలిసారిగా ఈ కాంక్షకు క్రియారూపం యిచ్చింది అది మొదలుగా అభ్యాసానికా అన్నట్టు ఎక్కడెక్కడికో పారిపోవడమూ, కొన్నాళ్ళుండి తిరిగి రావడమూ సాగింది చివరకు ఒకనాడు శాశ్వతంగా యిల్లు వదిలి వెళ్ళారు

ఎక్కడకు వెళ్ళినా విజ్ఞానాన్ని సేకరించటమూ దానిని ఇతరులకు పంచిపెట్టడమే ధ్యేయంగా పెట్టుకున్నారు ఓనమాలు తెలియని కుటుంబంలో పుట్టిన ఆయన మహాపండితులయ్యారు భారతదేశంలోని భాషలన్నీ నేర్చుకున్నారు కాలగర్భంలో కలిసిపోయిన భాషలలో కూడా పాండిత్యం సంపాదించారు దేశ దేశాల భాషలను సునాయాసంగా అలవరచుకున్నారు ఈ విజ్ఞాన సముపార్జనలో భారతదేశ గత చరిత్ర పట్ల ఆసక్తి, బౌద్ధం పట్ల అనురక్తి ఆయనలో పెంపొందాయి దానితో ఆయన ప్రసిద్ధ చారిత్రక పరిశోధకులయారు బౌద్ధమతంపై ప్రపంచమంతటిలోనూ ప్రముఖ ప్రామాణికులయ్యారు సింహళంలో ఆయనను బౌద్ధ భిక్షు సంఘంలో చేర్చుకున్నారు అక్కడే ఆయన పేరు రాహుల్ సాంకృత్యాయన్‌గా మారింది ఆయన త్రిపిటకాచార్య బిరుదునందినది కూడా అక్కడే అక్కడ నుండే ఆయన ఇంగ్లాండు మొదలయిన దేశాలకు బౌద్ధమతం గురించి బోధలు జరిపేందుకు వెళ్ళారు

గాఢమైన హిందూ మతాభిమానం చిరుతప్రాయంలోనే ఆయనలో ఇంగ్లీషు పాలకుల పట్ల విముఖత కలిగించింది ఆర్య సమాజంలోకి ఆకర్షించింది గాంధీజీ నాయకత్వాన కాంగ్రెసు సంస్థ సాగిస్తూన్న స్వాతంత్ర్యోద్యమం చూచి అందులో చేరారు ప్రముఖ కార్యకర్త అయ్యారు

కాని, ఆ సంస్థ నాయకులు రైతులు, కార్మికులు మొదలైయిన బీదప్రజల సమస్యల పట్ల కనబరిచిన వైఖరి ఆయనలో అసంతృప్తి కలిగించింది వామపక్ష భావాల వైపు ఆయనలో మొగ్గు కనబడింది రైతు ఉద్యమాల్లో ప్రముఖ పాత్ర వహించసాగారు చివరకు కమ్యూనిస్టు పార్టీలో చేరారు ''బుద్ధుడే బతికి ఉంటే ఆయన తప్పకుండా కమ్యూనిస్టు అయి వుండే వార''న్నారు

రాహుల్జీ జీవితచరిత్ర పఠనంలో మనకు ఆనాటి ప్రసిద్ధ రాజకీయవేత్తలతో పాటు జయస్వాల్ లాంటి ప్రసిద్ధ చరిత్ర పరిశోధకులతోనూ, సోవియట్‌లోని డాక్టర్ స్చేర్బాట్స్కీ లాంటి భారతీయ సంస్కృతీ పరిశోధకులతోనూ పరిచయం ఏర్పడుతుంది రాహుల్జీకి విజ్ఞాన శాస్త్రం అంటే ఏమిటో వివరించ ప్రయత్నించిన కృపలానీ లాంటి వారి మనస్తత్వమూ తెలుస్తుంది అంత మహనీయునికి కూడా సంకెళ్ళు తొడిగి జైలుకి నడిపించిన స్థానిక కాంగ్రెసు పాలకుల ధోరణి అవగతమవుతుంది

1944 మార్చిలో విజయవాడలో జరిగిన అఖిల భారత రైతు మహాసభలకు రాహుల్జీ వచ్చారు అప్పుడే నాగార్జునకొండ మొదలయిన ప్రసిద్ధ క్షేత్రాలను చూచి ''ప్రపంచంలో ఈ అద్భుత కళను సృష్టించినందుకు ఆంధ్రులు గర్వించకుండా ఎందుకుంటారు'' అని ప్రశంసించారు

చరిత్ర పరిశోధన, తత్వశాస్త్రం, విజ్ఞానశాస్త్రం, రాజకీయాల విప్లవకారుల జీవితాలు ప్రాచీన బౌద్ధగ్రంథాలు అనువాదాలు మొదలైనవి రాహుల్జీ రెండువందలకు పైగా గ్రంథాలు రచించారు ఇంకా ఎన్నో రచనలను తలపెట్టారు

కాని, భారతదేశ దౌర్భాగ్యం కొద్దీ అటువంటి మహాపండితునికి ఇటీవల మెదడుకు సంబంధించిన జబ్బు వచ్చి అక్షరాలనే మరచిపోయిన స్థితికి వచ్చారు సోవియట్‌లో చికిత్స పొంది, కొంతవరకు స్వస్థత చేకూర్చుకుని మొన్నమొన్ననే తిరిగి వచ్చారు

ఈ గ్రంథం ప్రచురణకర్త అన్నట్లు ''నూటికి కోటికి ఏ ఒక్కరి జీవిత చరిత్రో మానవ సమాజానికి వెలుగుబాటగా విశ్వమానవ కళ్యాణానికి దోహదకారిగా పరిణమిస్తుంది'' అటువంటిదే రాహుల్జీ జీవిత చరిత్ర ఇటువంటి మహనీయుని జీవిత చరిత్రను రచించి మనకు అందజేసిన శ్రీ బండ్లపల్లె ఓబులరెడ్డిగారికి తెలుగు పాఠకలోకం ఋణపడి ఉంటుంది దీనిని ప్రచురించిన ''జయంతి పబ్లికేషన్స్'' వారు కూడా ఒక మహోపకారం చేశారు

రాహుల్జీ జీవిత చరిత్ర ప్రతి ఒక్కరూ తప్పకుండా చదవవలసిన గ్రంథం అని అనడంలో అతిశయోక్తి లేదు

*విశాలాంధ్ర దినపత్రిక, 31-3-1963*

# 8. 'నీవన్నది నిజం'

'నీ వన్నది నిజం' నిజం మనం ఆడవాళ్ళను భోగ్యవస్తువులుగా మాత్రమే చూస్తున్నాం వాళ్ళు కూడా భోగ్యవస్తువులుగా కనిపించటానికే తాపత్రయ పడుతున్నారు వారి తాపత్రయం ఈడేరటానికి గాను అంతులేని సాధనాలు - క్రీములూ, పౌడర్లూ, సబ్బులూ, లోషనులూ, సెంట్లూ, నైలాన్ చీరలూ, జుట్టుముళ్ళూ, ఫాల్సీలూ, బెల్టులూ అనేకంగా ఎడ్వర్టయి అవుతున్నాయి ఆడవాళ్ళు అప్సరసలల్లే ఉండేలాగు చెయ్యటానికి ఆధునిక శాస్త్ర విజ్ఞానమూ, టెక్నిక్కులూ, చిట్కాలు, పరిశ్రమలూ ఏకోన్ముఖంగా పని చేస్తున్నాయి గోళ్ళరంగులూ, పెదవుల పూతలూ, బ్లీచ్‌లూ, ఓ జడరెంట్లూ(బి ఓ విరుగుళ్ళు), డెపిలేటరీలూ ఒక్కందుకే కృషి చేస్తున్నాయి ఆడదాన్ని అత్యంత ఆకర్షణీయమైన భోగ్యవస్తువుగా ప్రదర్శించటానికి ఈ పరిస్థితిని నేనాక్షేపించడం లేదు దాని ఫలితాలనుభవించలేక తప్పదనే నా నమ్మకం

భోగ్యవస్తువులతో ఉన్న చిక్కేమిటో మనందరికి తెలుసు అవి వికటిస్తాయి రుచిగా ఉందని జిహ్వాచాపల్యంకొద్దీ అదే పనిగా ఆవకాయో, మామిడిపళ్ళో, గోంగూరపులుసో, మరేటో తినేవాడికి అది వికటించక తప్పదు కత్తి పట్టినవాడు కత్తితోనే చస్తాడన్నారు దేన్ని ప్రేమించే వాడు దానితోనే తీసుకుంటాడంటే అందులో అబద్ధం ఏమీ లేదు ''నాకు నిజంగా ఇష్టమైనవన్నీ అనారోగ్యకరంగానో, అవినీతిగానో, చట్ట విరుద్ధంగానో ఉంటాయి'' అన్నదొక బ్రిటిష్ విదుషీమణి అందుచేత శాంతంగా చేతకాదని చిన్నవాళ్లు మరీ ఇష్టమైనవాటిని మరీ జాస్తిగా - ఆస్వాదించకుండా ఉండటం మంచిది ఆడవాళ్ళను ''వన్ సైడెడ్‌గా ప్రేమించే వాళ్ళకి కేన్సర్ ఆఫ్ ది మైండ్'' వస్తుంది దానికి చికిత్స లేదు ఔను నిజం, ఔను నిజం! ''నీ వన్నది నిజం'' నిజం!

*ముద్రణ జ్యోతి, మాసపత్రిక, సెప్టెంబరు 1964*
*పునర్ముద్రణ జ్యోతి, మాసపత్రిక రజతోత్సవ సంచిక, 1988*

# 9. సమగ్ర ఆంధ్ర సాహిత్యం (1, 2, 3 సంపుటాలు)

ఈనాడు భాషా సమస్య పెద్ద బెడద అయి కూర్చున్నది పౌరసత్వాలు నిలుపుకోగోరే ప్రతి భారతీయుడూ హిందీ నేర్చుకోవాలి అనేక విజ్ఞాన శాఖలలో పరిజ్ఞానం పొందటానికి ఇంగ్లీషు నేర్చుకోవాలి మాతృభాష తప్పదు గదా మాతృ దేశం ఎటువంటిదో, మాతృభాష కూడా అటువంటిదే ఒకదాన్ని ప్రేమించనివాడు రెండో దాన్ని ప్రేమించలేడు

మనని దీర్ఘకాలం పరిపాలించిన బ్రిటిషు వారు మన దేశాభిమానాన్ని దెబ్బకొట్టటానికి దేశ భాషల మీద దెబ్బకొట్టారు, అనేక తరాల భారతీయులు తమ మాతృభాషలకన్న ఇంగ్లీషు తియ్యగా ఉంటుందనిగాని, అది నేర్చుకోవటం తేలిక అని గాని ఇంగ్లీషు చదువుకోలేదు ఇంగ్లీషు కూడుబెట్టింది పదవులిచ్చింది పైకి తెచ్చింది ఈ సంగతి కరటక శాస్త్రులూ శిష్యుడూ ఏనాడో గ్రహించారు ఇంగ్లీషు అచ్చగా ఉద్యోగాలతో ఆగిపోలేదు అది మన సంస్కృతిలోకి చొచ్చుకుపోయింది, మనలో నిరక్షరులు సైతం నిత్యమూ వాడుకొనటానికి

కొన్ని వందల మాటలను సరఫరా చేసింది మన విద్యాలయాలలో తెలుగు మేష్టరును డ్రిల్లు మేష్టరు హోదాకు తెచ్చింది మనం అయిదో ఏట ఓనమాలూ, ఆరో ఏట ఏబీసీడీలూ నేర్చుకున్నాం అటుతరువాత ఓనమాలు గుంటపూలు పూశాయి ఏబీసీడీలు నసాళానికెక్కి కూర్చున్నాయి మాతృభాషలో ఎటువంటి సాహిత్యం ఉన్నదీ మనకు తెలియలేదు ఇంగ్లీషులో నర్సరీ రైమ్సు లగాయితు చాసర్, షేక్స్పియర్ల దాకా ప్రతీదీ చదివి మన సాహిత్యపిపాస తీర్చుకున్నాం ఇంగ్లీషులోనే ఆలోచించటమూ, భావప్రకటన చెయ్యటమూ, ఇంగ్లీషు చదువుకొని గ్రామీణులతోనూ, స్త్రీలతోనూ పట్టుమని పావుగంట సేపు ఏ విషయం గురించీ మాట్లాడలేకపోవటమూ మొదలైన ఘనతలు అలవరచుకున్నాం

విద్యాలయాలలో తెలుగు మాత్రంచెప్పలేదా? చెప్పారు అది కృతక భాష అనేక వందల ఏళ్ళనాటి భాష ఇంగ్లీషు కుర్రాళ్ళని ఏ చాసర్ భాషలోనో విద్యా బోధ చెయ్యమని ఎవరన్నా అంటే వాణ్ణి తక్షణం పెర్రాసుపత్రికి పంపుతారు చాసర్ కన్న కూడా పూర్వం ఉండిన తెలుగులో మాకు విద్యా బోధ జరిగింది ఈ పరిస్థితులలో చదువుకున్న వాళ్ళకు మాతృ భాషాభిమానమూ, తమ సాహిత్యంలో ఆసక్తీ ఎంతవరకు నిలుస్తుంది?

ఇదంతా మాతరంనాటి మాట గడచిన అర్ధశతాబ్ద కాలంలో ఎన్నో సంగతులు జరిగాయి రెండు ప్రపంచ యుద్ధాలూ, భారత జాతీయోద్యమమూ, సోషలిస్టు విప్లవాలూ, దాదాపు రెండు దశకాల భారతీయ స్వాతంత్ర్యమూ వగైరా ఇన్ని జరిగాక మన మాతృభాష పరిస్థితి మారకుండా ఉందా? మారింది - మరింత అధ్వాన్నమయింది బాధా, భేదమూ అనే మాటలు కూడా సరిగా రాయలేని వాళ్ళ సంఖ్య అపారంగా పెరిగింది గిడుగు రామమూర్తిగారి కాలంలో కృతక గ్రాంధికమే ఉండేది ఈనాడు కృతక వ్యావహారికం కూడా బయలుదేరింది

ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, ఏది మాతృభాషగా గలవాడికి ఆ భాషలోని సాహిత్యమే సంస్కృతికి మూలకుదురు ఇతర సంస్కృతుల శాఖలు ఎన్నయినా తెచ్చి దానికి అంటుకట్టుకోవచ్చు పెరుగుదల కోసం అలా అంటుకట్టుకోవాలి కూడా మిల్టన్ రచనలను ఇంగ్లీషు వాళ్ళ సంస్కృతి దృష్ట్యా అవగాహన చేసుకున్నవాడికి ఇంగ్లీషు సంస్కృతి మాత్రమే దక్కుతుంది మన నన్నయభట్టునూ, మన తిక్కన సోమయాజినీ, మన పోతననూ, మన సోమనాధుణ్ణీ, శ్రీనాధుణ్ణీ చదివి ఆ మీదట ప్రపంచ వాఙ్మయం చదివితే ఆ ప్రపంచ వాఙ్మయం ద్వారా మన మూల సంస్కృతి బలపడే అవకాశం వుంది లేకపోతే ఇతర సంస్కృతులు అరువు తెచ్చుకోవటమూ, వాటిపైన మన కాలు నిలవకపోవటమూ జరుగుతుంది ఎందుకంటే సంస్కృతి అన్నది ఒక్క భావాలపైనే గాక, అనేక ఆచారవ్యవహారాల మీదా, నైసర్గిక వాతావరణంపైనా ఉంటుంది అందుచేత భారతీయుడు గాని పూర్తిగా విదేశీ సంస్కృతినే అవలంబించి జీవించదలిస్తే నవ్వులపాలవుతాడు

పరిపాలకులు మన దేశీయ భాషలకు పోసిన విషం పూర్తిగా పని చెయ్యలేదు నా చిన్నతనంలో కూడా నా చుట్టూ తెలుగు భారత భాగవతాలపైన సాహితీపరమైన మమత ఉన్న వాళ్ళుండే వాళ్ళు నన్నయభట్టు గద్యలో గల సరళతా, పద్యంలో గల సౌరభమూ, తిక్కన భాషలో గల జిగీ మొదలైనవి పెద్దవాళ్ళు వివరిస్తూంటే మాతరం వాళ్ళం ఎంతో ఆనందంతో వినే వాళ్ళం ఆంధ్రలో కొన్ని ప్రాంతాలలో ఇంకా భారత భాగవతాల నుంచి పద్యాలు

గ్రాహిగా చదివే వాళ్ళున్నారని విన్నాను వాళ్ళు ప్రతి సందర్భానికీ తగ్గట్టుగా పూర్వ సాహిత్యం నుంచి పద్యాలు చదవగలరట కాని ఇది అన్ని ప్రాంతాలా లేదు మనం మన పూర్వ సాహిత్యాన్ని గురించి విరివిగా స్మరించుకోవటం ఎంతైనా అవసరం ఇందుకు గాను అదివరకే పరిశోధకులు చాలా పుస్తకాలు రాశారు కాని అవి పార్య పుస్తకాలను బోలి వుంటాయి ప్రత్యేక కవులయందు, వారి రచనల యందు ఆసక్తి కలిగేటట్టుగా ఆంధ్ర సాహిత్యాన్ని సమగ్రంగా సింహావలోకనం చెయ్యటానికి జరిగిన తొలి ప్రయత్నం ఆరుద్రదే ఆరుద్ర పరిశోధకుడు కాడని ఆక్షేపించవచ్చు జనబాహుళ్యం కోసం శాస్త్ర గ్రంథాలు చక్కగా రాయగలవాడు శాస్త్ర పరిశోధకుడే కావాలన్నది పాత దృక్పథం ఇక్కడ శ్రమ విభజన జరిగింది శాస్త్ర జ్ఞాన సేకరణ చేసే వాళ్ళు వేరూ, దాన్ని ప్రజలకు అందించే వారు వేరూనూ ఆరుద్ర చేసే ఈ ప్రయత్నంలో కొన్ని తప్పులుండవచ్చు, ఆయా కవుల కాల నిర్ణయం విషయంలోనూ, ఇతర చారిత్రకాంశాలలోనూ పొరపాట్లు జరిగి ఉండవచ్చు కాని ఈ రచన యొక్క అతి ముఖ్యమైన ఆశయం - సామాన్య పాఠకుడిలో సాహిత్యాభిలాష పెంపొందించటం - చాలా చక్కగా కొనసాగుతున్నది

ఇటువంటి గ్రంథాలను అనేక రకాలుగా రచించవచ్చు ఒక్కొక్క కవిని గురించీ తీసుకుని, అతను జీవించిన కాలమూ, అప్పటి చరిత్రా, కవి జీవిత వివరాలూ, అతని రచనల (లభ్యమవుతున్నవీ, కానివీ) జాబితా వగైరా విషయాలు చెప్పుకుంటూ పోవచ్చు అలాటి పుస్తకాలు పాఠకుడికి కవి చరిత్ర తెలుపుతాయి గాని, పాఠకుడిలో అతనియొక్క రచనల యందు ఆసక్తి కలిగించవు మరొక విధంగా కూడా గ్రంథ రచన చేయవచ్చు ఒక్కొక్క కవి రచననూ తీసుకుని అతని కవితా వైచిత్రీ, అలంకార ప్రయోగాలూ, ఇతర సొంపులూ వివరించవచ్చు ఇలాటి రచనలు చదివిన వాళ్ళు మూలం చదవకుండానే నోట్స్ చదివి పరీక్షలకు కూర్చునే విద్యార్థుల్లాగా ఆ కవి గురించి చాలా సేపు ప్రసంగించగలుగుతారు

కాని ఆరుద్ర ఈ రెండు పద్ధతులనూ కలగలిపి ఎంతో పఠనీయంగా ఆ గ్రంథాన్ని రచిస్తూండటం ప్రశంసనీయం విశ్వావసు ఉగాది లగాయతు ఇప్పటికి మూడు సంపుటాలు వెలువడ్డాయి మొదటిది చాళుక్య యుగం గురించీ, రెండోది కాకతీయ యుగం గురించీ, మూడోది పద్మనాయక యుగం గురించీ మనకు చెబుతాయి ఈ సంపుటాలలో మనకు నన్నయభట్టూ, నన్నెచోడుడూ, పండితారాధ్యులూ, తిక్కనసోమయాజీ, పాల్కురికి సోమనాథుడూ, ఎఱ్ఱాప్రగడా, నాచనసోముడూ మొదలైన ప్రసిద్ధ కవులూ, వారి రచనలూ పరిచయం కావటం జరిగింది

మూడో సంపుటంలో మొదటిసారిగా చిత్రకవిత్వ, బంధకవిత్వరీతుల ప్రస్తావన మరింత హెచ్చుగా ఉండవచ్చు ఆరుద్ర రచనలో మనం కవుల రచనలతో బాటే కవిత్వంతో రీతులను గురించి కూడా అనేక విషయాలను తెలుసుకుంటాం ఇది కూడా అవసరమే మనకు తెలిసినంతవరకూ తెలుగు కవిత్వ మంత నియమబద్ధమైన కవిత్వం ప్రపంచంలో మరెక్కడా లేదు మన పూర్వకవులు (ఇటీవలి కవులు కూడా) కవిత్వంలో గారడీలు చేశారు వీటిలో సాహిత్య ప్రయోజనం మృగ్యం కావచ్చుగాక, శిల్పప్రావీణ్యం అమోఘం నిరోష్ఠ్యాలూ, ద్వ్యర్థిరచనలూ, బంధకవిత్వాలూ, అష్టావధాన శతావధానాలూ మొదలైనవి చెయ్యటానికి ఎంతో భాషాపాటవం కావాలి కాని ఈనాడు తెలుగు భాష అతి దుర్బలంగా ఉన్నది మన

నిఘంటువులలో ఉండే మాటలలో ముప్పాతికవంతు మనం వాడటం లేదు మనం వాడే మాటలలో సగానికి పైగా నిఘంటువులలో ఉండటం లేదు ఈనాడు తెలుగుభాషకు పుష్టి చేకూర్చటానికి ఎందరో పూనుకుని, ఎన్నో రకాల కృషి సాగించవలసి ఉన్నది ఆ కృషికి ప్రాతిపదికగా ఆంధ్ర సాహిత్య సమగ్రవీక్షణ ఒకటి అవసరం అందువల్ల సాహిత్య పరిణామమూ భాషాపరిణామమూ కూడా మన కళ్ళ ఎదుట ఉంటాయి అందుకు ఈ సమగ్ర ఆంధ్ర సాహిత్యం కొంతవరకైనా పనికివస్తే ఆరుద్ర ప్రయత్నం విజయం పొందినట్టే

ఈ సమగ్ర ఆంధ్ర సాహిత్యం మిగిలిన అన్ని రకాల వాళ్ళకన్నా హైస్కూలులో పెద్ద తరగతుల విద్యార్థులకూ, కాలేజీ విద్యార్థులకూ ఎక్కువ ఉపయుక్తంగా ఉంటుంది అలాటివాళ్ళే సాహిత్యాభిలాష అలవరచుకోదగిన వయసులోనూ, మనస్థితిలోనూ ఉంటారన్నది నా అనుభవం

*విశాలాంధ్ర, దినపత్రిక, 27-6-1965*

## 10. సమగ్ర ఆంధ్ర సాహిత్యం (4వ సంపుటం)

సమగ్ర ఆంధ్ర సాహిత్యం నాలుగో సంపుటం మిగిలిన వాటిలాగే సకాలంలో వెలువడుతున్నది ఆరుద్రగారు చేసిన యుగ విభజనలో రెడ్డి రాజులకు చెందిన కవులను గురించి మనం ఈ సంపుటంలో తెలుసుకుంటాం ఈ కవులలో దొనయామాత్యుడూ, కవిభల్లటుడూ, పశుపతినాగనాథకవీ, ప్రకాశ భారతీయోగీ, కందనామాత్యుడూ, మడికిసింగనా, మడికి అనంతయ్యా, కొరాతి సత్యనారాయణ, విన్నకోట పెద్దనా, కవిరాక్షసుడూ, కవిసార్వభౌముడు శ్రీనాథుడూ ఉన్నారు

మన ప్రాచీన కవులలో అచ్చగా ''సాహిత్యం'' రచించిన వారితో పాటు ఇతర శాస్త్ర గ్రంథాలు రచించిన వారుండటం సహజమే సాహిత్య రచనలతోబాటు వైద్యశాస్త్రమూ, వాతావరణశాస్త్రమూ మొదలైనవి కూడా కవులే రాసే వారు వాళ్ళు ఆ కాలపు పరిశోధకులైనా కాకపోయినా, జర్నలిస్టుల్లాటి వాళ్ళు సాహిత్యానికి ప్రయోజనం ఉండాలా వద్దా అని తలలు పగలగొట్టుకునే వాళ్ళు జర్నలిజంకు ప్రయోజనం ఉండాలా కూడదా అన్న విషయం ఏనాడూ సంశయించరు

దొనయామాత్యుడు కవి - జర్నలిస్టు సస్యానందం రచించాడు అది వర్షశాస్త్రం వాతావరణ శాస్త్రం జ్యోతిష్కులసొత్తు దొనయ్య వర్షశాస్త్రం లోక గ్రహాలను కూడా తెచ్చాడు ఆయన గ్రంథస్థం చేసిన విజ్ఞానాన్ని కవులు తమ రచనలలో ఉపయోగపరచుకున్నారట ఈనాటి కథకులు ఫ్రాయిడ్ మొదలైన వాళ్ళను వాడుకున్నట్టు సస్యానందంలోని పద్యాలు ఇంకా కొన్ని పల్లెలలో వ్యాప్తిలో ఉన్నాయట దొనయ్యగారిది 'మెటియరాలజీ'' శాస్త్రమేనా అని ఎవరైనా అనవచ్చు కాని ఈనాటి మెటియరాలజీ కూడా అంతంత మాత్రంగానే ఉంది 'ఫోర్కాస్ట్' పేరుతో నిన్నటి వాతావరణం రేపటికి చెబుతున్నారు ఈనాటి శాస్త్రజ్ఞులు అందుచేత మన దొనయ్యను చిన్నచూపు చూడనవసరం లేదు ఆయన చాలా కష్టపడి అనేక అంశాలు సేకరించి రైతులకు ఆదరణీయమైన ప్రమాణ గ్రంథాన్ని రచించాడు అంతకంటె కూడా ముఖ్యమేమిటంటే ఎన్నదగిన కవి

మడికి సింగన్న మరొక ఉద్దండుడు ఈయన కూడా ఒక సూపర్ జర్నలిస్టులాగా కనబడతాడు అతను చేసిన అపూర్వ రచన ఒక సంకలనం దానిపేరు సకల నీతి సమ్మతం పాతిక మంది పూర్వ కవుల రచనల నుంచి పద్యాలు ఏరి, వాటికి తన పద్యాలు జత చేసి 48 వివిధ విషయాలపైన వివరణలు తెలిపే ఈ సంకలనాన్ని సింగన్న తయారుచేశాడు ఈ పుస్తకం సాంతం దొరకకపోవటం దురదృష్టమే

ఈ కవి తెలుగులో పద్మపురాణం కూడా రచించాడు మనం రచనల ప్రాశస్త్యం గురించి వితర్కించేటప్పుడు '' ఈ రచన ఎంతకాలం మన్నుతుంది?'' అని ప్రశ్నిస్తాం ఇదే పూర్వకవులకూ ఒక విధంగా వర్తిస్తుంది ఎంతోమంది కవులు తమ సమకాలికుల చేత కవిబ్రహ్మలుగా కీర్తించబడినప్పటికీ, వారి రచనలు నష్టమైపోయాయి మన్నటం మాటకు వస్తే సింగన్నగారి పద్మపురాణం బాగా మన్నుతుందనాలి 14వ శతాబ్ది మధ్యకాలంలో జీవించిన ఈ కవి రచన అయిన పద్మపురాణం ప్రతులు 19వ శతాబ్దంలో ''విరివిగా'' దొరికినట్టు బ్రౌన్‌దొరగారు చెప్పారట 1882లో జూలూరి అప్పయ్యపంతులుగారు అయిదు ప్రతులు సంపాదించి గ్రంథం ఆమూలాగ్రం ''తీర్పు'' చేశారు

దేవకీనందనంశతకం చెప్పినకవి(జన్న మంత్రి? కవిరాక్షసుడు?) మొదటి వ్యావహారిక భాషా కవి అని ఆరుద్రగారు అంటున్నారు కాని తిక్కనాది కవులందరూ నిత్య వ్యవహారికంలోని నుడికారపు సొంపులను వాడారన్నది నిర్వివాదం కాదనిపిస్తుంది ప్రతి కవిలోనూ అంతో ఇంతో కొత్త పదజాలమూ, కొత్త ప్రయోగాలూ కానవస్తాయి ఇవి వ్యావహారికంలో నుంచి కాకపోతే ఎక్కడి నుంచి వచ్చినట్లు?

ఇది ఇలా వుంటే దక్షపాటి కవి రాక్షసుడనే వాడు చిన్నయసూరి పూర్వజన్మవాడొకడు నన్నయభట్టు వాడని మాట ఇతర కవులు వాడరాదని నియమం చేసి కవిత్రయాన్ని కూడా కాదని భారతం మొదటి మూడు పర్వాలే తెలుగు భాషకు ప్రమాణం చేశాడట! ఈ కవి రాక్షసుడు నన్నయకు తరువాత వాడూ తిక్కనకు ముందువాడూ అనుకున్నప్పటికీ, తిక్కనగారు మొదలైన వారు ఈయన నియమాన్ని పాటించలేదన్నది స్పష్టం నన్నయగారికీ తిక్కనగారికీ విభక్తి ప్రత్యయాలు సైతం మారినట్లు పండితులు చెబుతున్నారు

రెడ్డి రాజుల యుగానికి ఇంద్రధనస్సు లాంటివాడు శ్రీనాథుడు ఆరుద్రగారీ మహాకవికి సంపుటంలో సగంకన్నా ఎక్కువే కేటాయించారు అది సముచితమే పుస్తకాలకు పుస్తకాలే తన మీద రాయించుకున్న కవి శ్రీనాథుడు

శ్రీనాథుడు ఒకటో రకం కవా, రెండో రకం కవా? అన్న ప్రశ్న కవిత్వాన్ని బంగారుత్రాసులో చూచేవారిని బాధించవచ్చు కాని సామాన్య పాఠకుడికి శ్రీనాథుడు పంచరంగుల కవి అన్ని ''లెవెల్స్'' లోనూ కవిత్వం చెప్పాడు అన్నిరకాల అనుభవాలు గడించాడు ఆ అనుభవాలను గురించి తన భావాలను పద్యరూపంలో చెప్పాడు ఆనాటి రాజకీయ సాంఘికపరిణామాలన్నటి ప్రభావం శ్రీనాథుడిపైనా, ఆయన కవిత్వం పైనా ఉన్నట్టు కనిపిస్తుంది మంచీచెడూ, కష్టాలూ, సుఖాలూ, జయాలూ, అపజయాలూ, పురాణాలూ, వీధినాటకాలూ అన్నీ ఆయనకు కవితావస్తువులుగా ఉపకరించాయి అనుభవాన్ని వెతుక్కుంటూ పోయి, అన్ని రకాల అనుభవాలనూ స్వీకరించిన వాడే కవి అయితే శ్రీనాథుడు మహాకవి రేపటి మాటేమిటని

శ్రీనాథుడెన్నడూ విచారించినట్టు కనబడదు ఈ విషయంలో ఈయన ఉమర్‌ఖయామ్ లాటి వాడనుకోవచ్చు ఆఖరునిమిషంలో కూడా ''దివిజ కవివరుగుండియల్ దిగ్గురనగ అరుగుచున్నాడు శ్రీనాథుడమరపురికి'' అనగలిగిన వాడు జీవిత సమరంలో మహా యోధుడూ, గొప్ప ఆశావాదీ అయి వుండాలి ఆయన రచనలలో గొప్ప పండితులు స్మరించదగిన క్లిష్ట రచనలు మొదలుకొని పామరులు ఎల్లకాలమూ చెప్పుకునే చాటువుల దాకా అన్ని రకాల పద్యాలు ఉన్నాయి రెడ్డి రాజుల యుగానికి చెందిన మిగిలిన కవులందరూ మాసిపోయినా, శ్రీనాథుడు శాశ్వతంగా నిల్చి ఉంటాడనటానికి సందేహం లేదు

*విశాలాంధ్ర, దినపత్రిక, 4-7-1965*

# 11. సమగ్ర ఆంధ్ర సాహిత్యం (5వ సంపుటం)

ఈ అయిదవ సంపుటంలో మనం బమ్మెర పోతరాజు గారితో సహా పదిమంది కవులను గురించి, వారి రచనల గురించీ తెలుసుకుంటాం కవిత్వం విద్యగా తీసుకున్నట్టయితే వీరిలో గొప్పగా చెప్పుకోదగిన కవులున్నారు

వీరిలో కొందరిని గురించి ఆరుద్ర చెప్పిన ఈ వాక్యాలు పై విషయాన్ని రుజువు చేస్తాయి

''(నిశ్శంక) కొమ్మన తెలుగు కవిత్వంలో ఆజాను బాహుడే''

''ఇతని (గౌరన) పేరు కలకాలం చెప్పుకొని ఇతని కావ్యాలను చదవటం ఆంధ్రుల విధి''

''జక్కన్న కవిత్వం నిజానికి చక్కనే''

''కవులలో వెన్నెలకంటి అన్నయ్య ఎవరికీ తమ్ముడు కాడు''

''దగ్గుపల్లి దుగ్గన్న శ్రీనాథుని బావమరిది కాకపోయినా చదువ తగిన కవే''

''తెలుగు సాహిత్యం బ్రతికి ఉన్నంతకాలం ఆయన (పోతన్న) బ్రతికే ఉంటాడు''

పోతన్న బ్రతికే ఉన్నాడన్నది అందరూ ఆమోదించే విషయమే నా చిన్నతనంలో నేనెరుగుదును మా బంధువుల ఇళ్ళన్నిటిలోనూ భాగవతం ఉండేది ముగ్గురాడవాళ్ళు చేరితే దశమస్కంధం చదివేవారు రుక్మిణీ కళ్యాణమూ, ప్రహ్లాద చరిత్ర, కుచేలోపాఖ్యానమూ, గజేంద్ర మోక్షమూ మొదలైన ఘట్టాలలో కొన్ని పద్యాలు కంఠస్థం చెయ్యక పోతే మాయీడు వాళ్ళకు కొందరికి చాలా చిన్నతనంగా వుండేది

కాని మిగిలిన వాళ్ళ రచనల మాటేమిటి? కావటానికి వాళ్ళు ఘనమైన కవులే కానీ ఈనాటి దృష్టితో చూస్తే వాళ్ళు మరీ చిన్న మడుగులో చేపలు పట్టారు వీరశైవమూ, కాకపోతే వీరవైష్ణవమూ, అదీ కాకపోతే ఏదో ఒక మారుమూల పురాణం వస్తువుగా పెట్టుకొని దానిమీద తమ శక్తులు ధారపోసేశారు

''గౌరన హరిశ్చంద్ర కావ్యాన్ని ఆనాటికి ఎంతో దక్షతతోనే రచించి ఉండవచ్చు కాని ఈనాడు బలిజేపల్లి లక్ష్మీకాంతం కవిగారి సత్య హరిశ్చంద్రీయ నాటకం పూర్వ హరిశ్చంద్రుడిని రూపు మాపేసింది విజయం హరిశ్చంద్రుడి కథది అయినా కాదు, నాటకంలోని పద్యాలది ఆ పద్యాలు లేకపోతే ఎంతబాగా రాసినా అది హరిశ్చంద్రే కాదు''।

జన బాహుళ్యాన్ని సాహిత్యం ఏ శక్తులతో లాగి పట్టుకునేదీ శాస్త్రీయంగా పరిశోధించవలసి ఉన్నది ఒకప్పుడు ప్రజా సామాన్యం కోసం వృత్తాలుమాని ద్విపదలో రచనలు చేశారు అప్పటికి వారి కోరిక సిద్ధించింది కాని ప్రజల అభిరుచిలో ఏదో మార్పు వచ్చింది ప్రజలు ద్విపదను స్మరించటం మానేసి మామూలు పద్యాలకెగబడ్డారు ప్రజలను బాగా ఆకర్షించిన శతకవులు కందాలూ ఆటవెలదులూ సీసాలూ మత్తేభాలు మొదలైనవి వాడి జనాన్నిరంజింపజేశారు

నా అనుమానమేమంటే వస్తువును బట్టి ఒక రచనా రూపానికి ప్రజాదరణ లభించాక ఆ రూపం చాలా కాలం పాటు ప్రజాదరణ పొందుతూనే ఉంటుందని శ్రీశ్రీ మహాప్రస్థానం వచ్చాక అదిఅపరిమితంగా జనానికి పట్టడం చూసి అదే ధోరణిలో అనేకమంది కవిత్వం రాశారు వారిలో శ్రీశ్రీ తీసుకున్న విషయాన్ని అనుకరించిన వారికన్నా విధానాన్ని అనుకరించిన వారే చాలా హెచ్చు ఈనాడు ఛందోబద్ధంగా కవిత్వం వస్తున్నది ఈ ధోరణిలో ఒక అపూర్వ రచన వచ్చి ప్రజలను బలంగా ఆకర్షించిననాడు అలాటి రచనలే పూర్తిగా అమలులోకి రావచ్చు విషయానికీ విధానానికీ గల సంబంధం అంత సులువుగా అర్థమయేది కాదు దానికి జీవితపు నాడులతో ఎంతో లావాదేవీ ఉన్నది

కొంత సాహిత్యం ఒకందుకు పుట్టి మరొకందుకు బతుకుతుంది ఇందుకు సాక్ష్యం విక్రమార్కుడి కథలు అసలు విక్రమార్కుడు చరిత్ర ప్రసిద్ధుడు శకారి, శకకర్త అందుచేత అతనికి పూర్వం ఉన్న పుక్కిటి పురాణాలన్నీ అతనికి ఆపాదించబడ్డయి భేతాళపంచవింశత కథలలో నాయకుడు బృహత్కథలో ఉజ్జయిని విక్రమార్కుడు కాడు ప్రతిష్ఠానపురానికి చెందిన త్రివిక్రమసేనుడు కాని విక్రమార్కుడు అతని స్థానం కాజేశాడు ఈనాడు మనకు విక్రమార్కుడి చరిత్రతో పనిలేదు వీరజానపద గాథల క్రింద వాటిని మనం చదివి ఆనందిస్తున్నాం జక్కన కవిత్వంతో మనకు పనిలేదు ఏ కాశీ మజిలీలోనో, అంతకన్నా కూడా ఇటీవల ఎవరో రచించిన పుస్తకంలోనో - వ్యావహారికంలో రాస్తే మరీ మంచిది - నిక్షేపంగా చదువుకుంటాం

భాషమాట వచ్చింది గనక ఒక్క విషయం స్పష్టం చెయ్యటం అవసరం పద్యాల మాట అటుంచి ఈనాడు ప్రజలను ఆకర్షించే వచన రచనచేయాలంటే వ్యావహారికం కంటె మంచి పద్ధతిలేదు ఆరుద్ర ఈ సమగ్ర ఆంధ్ర సాహిత్యాన్ని గ్రాంధిక భాషలో రాసివుంటే బాగుండేదని ఒక విమర్శకుడు అన్నారు కాని వ్యావహారికంలో రాసినందున ఈ పుస్తకాలను మూడింతలమంది హెచ్చుగా చదువుతారని నా దృఢ విశ్వాసం లోగడ ఈ విషయం గురించిన రచనలన్నీ గ్రాంధికంలో ఉండబట్టే మన వాళ్ళకు ప్రాచీన సాహిత్యం గురించి దాదాపు ఏమీ తెలియని పరిస్థితి ఏర్పడింది

ఈ అంధకారం మీద ఆరుద్ర సెర్చిలైటు వెయ్యటంతో అక్కడక్కడా వజ్రపు తునకల్లాటి వాటిని చూసేందుకు కూడా మనం కృతజ్ఞులమై ఉండాలి అనంతామాత్యుడు చేసిన ఎలుకపిల్లి వర్ణన నిజంగా వజ్రపుతునకే అందులో మనకు అనంతుడి ప్రకృతి ప్రేమ కనిపించటమేగాక మనలో కూడా అలాటి ప్రేమ మొలకెత్తిస్తుంది చూడని దేవతలను వైనవైనాలుగా వర్ణించే కవుల కన్నా వాస్తవ చిత్రాలను ఇంతబాగా చేసిన అనంతుడు ఎక్కువ

ప్రశంసాపాత్రుడనటానికి సందేహం లేదు అతనీరోజులలో ఉంటే ప్రకృతి శాస్త్రంలో డ్యాక్టరేటు అవలీలగా సాధించుకుని ఉండును గ్రంధాలను ఈ దృష్టితో చూస్తే రెల్లునుంచీ కొండలనుంచీ మనుషులు పుట్టినట్లు రాసినవాళ్లు - ఎంత గొప్ప గ్రంధాలు రాస్తేనేంగాక పరమ అజ్ఞానులనా ?

కాంతాసమ్మితమైన కావ్యాల మాటకు వస్తే చాలా పురాణాలు లేచిపోతాయి బూతు పురాణం కాని పురాణం దాదాపు లేదనే చెప్పాలి ఏ కారణం చేతనో వాటికి తగలని 'దృష్టి' ప్రబంధాలకు తగిలింది సెక్సు తడవకుండా రాసిన సాహిత్యం ఏనాడూ లేదు ఏ సాహిత్యమూ వదవని వాళ్ళు ఊహల్లో మాత్రమే అటువంటి సాహిత్యం ఉన్నది కొద్దిమందికైనా ఈ భ్రమ ఉండటానికి కారణం పాశ్చాత్య సాహిత్యం కొన్ని శతాబ్దాల పాటు పాశ్చాత్యులు స్త్రీకి కామమే ఉండదని గట్టిగా నమ్మి సాహిత్యం సృష్టించారు ఈ 'అంధత్వం' మనని వాత్స్యాయనుడికి ముందు, అనంతరమూ కూడా బాధించలేదు

మన 'బ్లయిండ్ స్పాట్' సెక్సు కాదు నరకభయమూ, ముముక్షత్వమూనూ అదే బమ్మెర పోతయ్యగారి భాగవతాన్ని కాపాడింది లౌకిక ధర్మాలను హెచ్చుగా తరచిన భారతం కంటే పారలౌకిక చింతతోబాటు భక్త్యావేశాన్ని హెచ్చుగా వెదజల్లిన భాగవతం ఆంధ్రులకు ఎక్కువగా ఆదరణీయిం కావటానికి కూడా అదే కారణం భోగినీదండకాన్ని ఆ పోతన్నగారే రచించినప్పటికీ దాన్నెవరూ లక్ష్యపెట్టలేదు నామటుకు నేను దాన్ని ఎవరి ఇంటా చూడలేదు

*విశాలాంధ్ర దినపత్రిక, 8-8-1965*

# 12. సమగ్ర ఆంధ్ర సాహిత్యం (6వ సంపుటం) తొలి రాయలయుగం

ఈ సంపుటంలో ఆంధ్ర సాహిత్యం 15వ శతాబ్దం అంతాన్ని చేరుకుంటున్నది ఇది సాహిత్యం విశ్రాంతి తీసుకున్న యుగం లాగా కనిపిస్తుంది శ్రీనాధుడు, పోతన్నల లాటి హేమాహేమీలు దాటిపోయారు కృష్ణదేవరాయల ఆస్థానదిగ్గజాలింకా రాలేదు మహత్తరమైన సాహిత్యకృషి అన్నదేమీ లేదు కవులు తమ పూర్వుల ఉన్నతాశయాలనూ, జీవితాన్నీ కూడా విస్మరించి కవిత్వంతో ఆటలాడుకున్నారు

తొలి రాయలయుగం సాహిత్యం విషయంలో ఈనాటి పరిస్థితిని స్ఫురింపజేస్తున్నది శృంగారరసం ప్రాముఖ్యానికి వచ్చింది కొక్కోకం తెలుగులోకి తర్జుమా అయి రసపిపాసువులను ఊరించింది అమ్మవారిని కన్నుకొట్టే ధోరణిలో కవులు తయారయారు వాళ్ళ మాట, వీళ్ళ మాట దేనికి? వెంకటేశ్వరస్వామికి కింకరుడులాంటి తాళ్ళపాక అన్నమయ్యే వెంకటేశ్వరుడికి అలిమేలుమంగను గురించి చెబుతూ ''చెక్కులు మించుటద్దములు, చేతులు క్రొత్తమెరుంగు దీగలా క్రిక్కిరి గుబ్బలే పసిడి కిన్నెరకాయలు'' అని తెలిపాడు బ్రహ్మాదులచేత ఆవిడని ' ఓ లలితాంగి! ఓ కలికి! ఓ ఎలజవ్వని!, ఓ వధూటీ! ఓగోల!'' అని సంబోధింపచేశాడు

అయినా తాళ్ళపాక అన్నమయ్య పదహారణాల కవి మిగిలిన వారిలో కొందరు ఆ మాటకు కూడా అర్హులు కారు వారిలో చిత్రబంధ కవిత్వాలు చెప్పిన గారడీవాళ్ళున్నారు

కొందరు సర్వలఘువృత్తాలు చెప్పారు కొందరు రెండక్షరాలతో పద్యాలు నడిపారు అచ్చగా ఒకే అక్షరంతో పద్యం చెప్పిన వాళ్ళు కూడా ఉన్నారు అదొక వేలంవెర్రి

జీవితంలో సంస్కృతికి హీనస్థానం ఉన్నప్పుడే ఇటువంటి పరిణామాలు కలుగుతాయి అలాటి జీవితంలో నుంచి కొంత ''సినిసిజం'' బయలుదేరటం కూడా సహజమే నూతన కవి సూరన ''ధనాభిరామం'' రాశాడు డబ్బే ప్రధానం స్త్రీల ప్రేమ కూడా డబ్బుకు లభిస్తుంది వారాంగనను వలపించటంలో సాక్షాత్తూ మన్మధుడే ధనాధిపతికి ఓడిపోయి ఇంటినుంచి గెంటబడతాడు!

పంచతంత్రం కూడా ఈ కాలంలోనే అనువాదం కావటం అప్పటి పరిస్థితులపైని మరొకరకం తిరుగుబాటేమో ఏరికోరి పంచతంత్రం అనువదింపించిన బసవరాజు గురించీ దాన్ని అనువదించిన దూబగుంట నారాయణకవిని గురించి విపులంగా తెలిస్తే ఎంత బాగుండును! నారాయణకవి కవిత్రయాన్ని మాత్రమే స్తుతించి ఊరుకున్నాట్ట తనను గురించి కూడా ఏమంతగా చెప్పుకోలేదుట అతను గొప్ప పండితుడుగాని, గొప్ప కవిగాని కాదని తెలుస్తూ ఉంది అతని గొప్పతనమంతా కొక్కోకాన్ని నెమరువెయ్యకుండా, పంచతంత్రాన్ని తెనిగించటంలోనే ఉందేమో అయితే పంచతంత్ర కధలను ప్రబంధ పక్కీలో నడిపించాలని నారాయణకవికి తెలియిలేదు ఆ లోటు వెంకటనాధ కవి లాటి వాళ్ళు భర్తీ చేశారు ఒకతె తండ్రీకొడుకులిద్దరితోనూ వ్యభిచరించిందని నారాయణకవి టూకీగా చెబితే, అదే కధను అష్టాదశ వర్ణనలతో ప్రబంధంగా నడిపి వెంకటనాధ కవి రక్తి కట్టించాట్ట!

ఈ కవుల వరసలో తాళ్ళపాక అన్నమయ్య విశిష్టంగా కనిపిస్తాడు అతను నిస్సందేహంగా పుట్టుకవి కవిత్వం అల్లటం అతనికి మంచినీళ్ళప్రాయం అతని కవిత్వం నిండా ''పచ్చి తలంపులు'' కొల్లలుగా ఉన్నా అతనిది సజీవమైనగొంతు అతని పాటలు క్షేత్రయ్యకూ, త్యాగయ్యకూ కూడా బాట వేసినట్లు కనబడతాయి అలాటి సజీవమైన నుడికారం అంతకు పూర్వపు కవులలో ఉన్నట్లు కనబడదు

అన్నమయ్య జీవితం చూశాడు చూసినదాన్నీ, భావించినదాన్నీ, సొంపుగానూ, పదిమంది నోటా పలికేలాగానూ చెప్పే నేర్పున్నది ''తాళ్ళపాకవారిని చదవందే తెలుగు రాదు'' అని వేటూరి ప్రభాకరశాస్త్రి గారన్నారంటే ఆశ్చర్యం లేదు అన్నమయ్యను చూసి ఎన్నివేల మంది పిల్ల అన్నమయ్యలు బయలుదేరారో ఈనాడు మనకెలా తెలుస్తుంది? అతని భార్య తిమ్మక్క చక్కని రచయిత్రి అయిందంటే అందుకు ఆమె భర్త ప్రముఖ కారణం అయినా కావచ్చు

ఈ సంపుటంలో చేరిన మరొక ప్రసిద్ధ కవి పిల్లలమర్రి పినవీరభద్రుడు కవిత్వంలో ఘటికుడే గాని, కావ్య రచనకు గాను అతను ఎన్నుకున్న ఇతివృత్తాలలో అతని వ్యక్తిత్వం ఏమీ ఉన్నట్టు కనబడదు రాసే నేర్పున్నది ఆ నేర్పును ఒక శృంగార శాకుంతలానికి, జైమినీ భారతానికీ అంకితం చేశాడు ఆరుద్రగారు చెప్పినట్టు, జైమినీ భారతం కాకుండా మరొక గ్రంధం రచించినా పిన వీరభద్రుడు అంత బాగానూ రాసి ఉండేవాడే అతను సంప్రదాయకవి సమర్థత గల కవి సాహిత్య పరిణామ ప్రభావం అతనిపైన గాని, అతని ప్రభావం సాహిత్య పరిణామంపైన గాని ఉన్నట్టు కనబడదు

*విశాలాంధ్ర, దినపత్రిక, 12-9-1965*

# 13. సమగ్ర ఆంధ్ర సాహిత్యం (7వ సంపుటం)
## మలిరాయల యుగం

తొలి రాయల యుగం ఆంధ్ర సాహిత్యానికి విరామ కాలం లాటిదైతే, మలిరాయల యుగం కవులకు పుట్ట కవిత్వానికి మెట్టు పూర్వ సాహిత్య వస్తువుతో పోలిస్తే ఈ కాలపు వస్తువు దిగనాసిల్లిపోయిన మాట నిజమే ఈ కాలపు కవులు కావ్యాలల్లటానికి మరింత మారుమూల పురాణాలూ, మారుమూల కథలూ వెతికారు అయితే రచనలలో ఒక గుణాత్మకమైన మార్పు వస్తున్నది తెలుగు మహాభారతం సంస్కృత భారతానికి అనువాదమన్న పద్ధతిలో, నంది తిమ్మన్నగారి పారిజాతాపహరణం ఏ హరి వంశంలోని ఒక భాగానికో అనువాదమని గాని, పెద్దన్నగారి మనుచరిత్ర ఏ మార్కండేయ పురాణగాథకో అనువాదమనిగాని అనలేం తెలుగు సాహితి ముళ్ళ మీద నుంచి బట్టను తీసే చందంగా సంస్కృత సారస్వతం నుంచి విడివడి తన వ్యక్తిత్వాన్ని ప్రకటించుకుంటున్నది

ఈనాడు భాషాజ్ఞానమూ, రచనానైపుణ్యమూ మాత్రమే వుండి మనస్తత్వానికీ, సంఘతత్వానికీ, ఆర్థిక నియమాలకూ, రాజకీయ ధోరణులకూ సంబంధించిన పరిజ్ఞానం లేని వాడి రచనలను గొప్ప సాహిత్యంగా పరిగణించలేం అటువంటి రచయిత ఆధునిక జీవితం గురించి రాస్తే మూఢుడిలాగా కనబడతాడు - కనీసం విమర్శకుల దృష్టిలో ఇలాగే రచయితకుండవలసిన కనీస అర్హతలు ప్రతి యుగంలోనూ ఉంటూనే వస్తున్నాయి సర్వజ్ఞుడు కానివాడు సత్కవే కాడన్నాట్ట కొరవి గోపరాజు సర్వజ్ఞత్వమన్నది సాపేక్షమని గుర్తుంచుకుంటే గోపరాజు మాట గొప్ప మాటే

అనుభవం కోసం ఆనాటి కవులు తమ సాంఘిక జీవితాల పరిధులనూ, నియమాలను కూడా దాటి వెళ్ళారనటానికి సందేహం లేదు శ్రీనాథుడికి రకరకాల మాంసాలు వండటం తెలిస్తే, వాటి రుచులు కూడా తెలుసుననుకోవచ్చు అదే విధంగా తిమ్మన్న, పెద్దన్న మొదలుగా గల వారు రాజుల వెంట యుద్ధాలకూ, వేటలకూ కూడా వెళ్ళారు రాజవర్గం కవి పోషణ చేసే కాలంలో కవులు రాజుల జీవితానుభవాలు పంచుకోవటం తప్పనిసరి దివాలా తీసే జమీందారు దగ్గర ఉండే కాసావాడికి కూడా జమీందారీ అలవాట్లూ, మర్యాదలూ, అమర్యాదలూ వంటబట్టుతాయి కదా

ఇలాంటి అమర్యాదలు కృష్ణదేవరాయలకు ముందుకాలంలో వుండి వుండాలి అందుకే మైరావణ చరిత్ర రచించిన మాడయ్యగారు శ్రీనాథుడిలాగా దేశ సంచారం చెయ్యటమేగాక, ధూర్తులు "సభాస్థలి ప్రౌఢులన్నట్లు నిశ్శబ్జారిణనుచున్ సుకవి సంఘము పల్కల మెచ్చకూర చేయంకము సేయవచ్చు, నీయయ్యల మున్నుగ ప్రస్తుతించెదన్" అన్నాడు "దుర్జనం ప్రథమం వందే, సజ్జనం తదనంతరం" అని సూక్తి

కాని ఈ దుర్దశ కృష్ణదేవరాయల కాలంలో కనిపించదు కృష్ణదేవరాయల పోషణలో కవులు రాజులాగా బతికారు వారు పొట్ట చేతబట్టుకుని ఊళ్ళూళ్ళూ తిరగలేదు కృష్ణదేవరాయలు రాజకీయరంగంలో తొలిసారిగా అప్పాజీ కళ్ళు పీకిస్తే పీకించాడేమో - దీన్ని గురించి చరిత్ర సాక్ష్యం నికరంగా లేదన్నట్లు గుర్తు - కాని ఆయన కవికి అన్యాయం ఏనాడూ చెయ్యలేదు

అయితే ఒక మహాకవి మాతృభాష తెలుగు కాదేమో ఆముక్తమాల్యదను ఇనపగుగ్గిళ్ళ పాకంలో తయారుచేసి, నేర్చుకున్న భాషపైన చూపదగిన సాములన్నీ చూపాడు అటువంటి వాడు సాధారణంగా సమానార్థకాలను సందర్భోచితంగా వాడటం గురించి అంత శ్రద్ధ తీసుకోడు కృష్ణదేవరాయల కవిత్వంలో ఇలాటి లోపం ఏదైనా ఉందేమో పండితులు చెప్పాలి అల్లసానివారే ఆముక్తమాల్యద రాశాడన్నది అర్థం లేని వాదమనటానికి సందేహం లేదు పెద్దన్నగారికి మాటల సౌరభం తెలుసుకొనటానికి ఒక సందర్భంలో నిడదవోలు వారొక ఉదాహరణ ఇచ్చారు ''మగువ పొలపు తెలుపునొక్క మారుత మొలసెన్'' అన్నాడు - పెద్దన్న మగువ అంటే మంచి వాసనగలదని అని అర్థం! చచ్చు కవులు తొంభై ఏళ్ల తొక్కును కూడ ''అమ్ముద్దియ'' అనటం మనం చూడవచ్చు

కృష్ణదేవరాయల కావ్యరచనలో గల అసలు గొప్పతనాన్ని ఆరుద్ర సూచించారు ఆయనే రాజాధిరాజై ఉండి అత్యల్పుల జీవితాల్నీ, బాధలనూ ఎంతో సానుభూతితోనూ, వాస్తవికంగానూ చిత్రించాడు కవికి ఉండవలసిన సర్వజ్ఞత్వం కృష్ణదేవరాయలలో ఈ రూపంలో కనబడుతుంది ఈనాటి రచయితలు తమకుజానెడు దిగువగా ఉన్న వర్గంతాలూకు జీవితాన్ని సానుభూతితో గాని, యదార్థంగా గాని చిత్రించటం ఎంతో అరుదుగా వుంటున్నది అందుచేత కృష్ణదేవరాయలను మనం ఘనంగా చెప్పుకోవాలి ఎవరికీ తలవంచని కృష్ణదేవరాయలు కవులనూ, కవిత్వాన్నీ నెత్తినపెట్టుకోబట్టే మరి రాయల యుగం ఆంధ్రసాహిత్యానికి స్వర్ణయుగమయింది

ఆయన అనంతరం మళ్ళీ సాహిత్యానికి గడ్డు రోజులు వచ్చాయనడానికి నిదర్శనం అష్టదిగ్గజాలలో ఒకడైన ధూర్జటి రాజులను పడదిట్టటమే!

నంది తిమ్మన్నగారు సత్యభామకిచ్చిన పాత్ర ఈనాటి వరకూ చెక్కుచెదరకుండా ఉండటం గొప్ప సంగతి ''పారిజాతాపహరణం''లో మొదటి ఆశ్వాసంలాగా మిగిలినవి లేవంటారు ఆరుద్ర గారు సమర్థనీయమో కాదో గాని ఇలాటి ఆక్షేపణే మనుచరిత్రకు కూడా ఉన్నది ఒక ప్రసిద్ధి సినిమా కవి సినిమా పాటకు బాగుండవలసింది పల్లవేనన్నారు చరణాలు ఎలాగున్నా ఫర్వాలేదుట ఆ కాలపు మహాకవులు రాజులకు అంకితాలిచ్చే వుద్దేశ్యంతో ప్రబంధ రచన చేసినప్పుడు తొలి ఆశ్వాసాలలోనే తమ దర్పమంతా చూపి సభికులకు మంచి '' ఇంప్రెషన్'' కలిగించయత్నించడం సహజం తరువాత కథలో పడిపోతారు గ్రంథం ఎంత పూర్తిగా చేస్తామా అన్న ఆందోళన ఒకటి ఉంటుంది దేవుడికి అంకితమైన పుస్తకాలలోనూ జీవితం ధారపోసి ఒక ప్రయోజనం కోసం రచించిన పుస్తకాలలోనూ ఈ లోపం కనబడదు

అల్లసాని వారికి మనుచరిత్ర గురించి అభిప్రాయభేదాలను ఆరుద్ర ప్రస్తావించారు ఎవరేమన్నప్పటికీ మనుచరిత్ర కంటే అల్లసాని పెద్దన గొప్పవాడేమోననిపిస్తుంది ఆరుద్ర గారు చెప్పినట్టు అల్లసానివారిలో అనేకమంది పూర్వకవుల గొప్ప లక్షణాలనేకంగా ఉన్నాయి అందుకు మనుచరిత్ర సాక్ష్యమిస్తుందే తప్ప, మరొక విధంగా సార్థకత పొందలేదు అధ్యయన గ్రంథంగా అది వసుచరిత్రను పోలదంటారు

మరి రాయల యుగం నాటి చిన్న పెద్ద కవులందరిని గురించి ఆరుద్ర గారు చక్కని పరిచయం కలిగించారు ఈ కాలపు కవులు కూడా కవితాకన్యను విటుల దృష్టితోనే చూశారు

అయితే ఈ విటులు తొలి రాయల యుగంలో వాళ్ళకన్న మంచి రసికులు అంతకంటే ఘనంగా చెప్పలేం అల్లసాని పెద్దన కవిత్వం నుంచి సురత సౌఖ్యాలన్నీ ఆశించాడు కావ్యం వారస్త్రీలాగా ఉండాలన్నాడు ప్రౌఢకవి మల్లన్న! యుగ ప్రభావం

*విశాలాంధ్ర, దినపత్రిక, 10-10-1965*

# 14. సమగ్ర ఆంధ్ర సాహిత్యం (8వ సంపుటం) నవాబుల యుగం

15, 16 శతాబ్దాలలో వెలిసిన తెలుగు రచయితలనేక మందిని ఈ సంపుటంలో మనం పరిచయం చేసుకుంటాం వారిలో తెనాలి రామకృష్ణుడూ, శంకరకవీ, మొల్లా, సారంగు తమ్మయ్య, పింగళి సూరన్నా, రామరాజభూషణుడు లాటి హేమాహేమీలున్నారు గ్రంథం పెరగటానికి వీళ్ళే చాలు అయినా వీళ్ళను గురించి రాసేటప్పుడు ఆరుద్ర గారు ఇంకా కొంత నిగ్రహం చూపవలసిందేమోననిపిస్తుంది ఎందుకంటే వీరిలో కొందర్నిపైన పుస్తకాలకు పుస్తకాలే వెలువడ్డాయి ఇంకా వెలువడతాయి కూడానూ పోయినకొద్దీ ఈ విస్తరణ జాస్తి అవుతుంది, గాని తగ్గదు గడిచిన సంపుటాలలో ఆరుద్ర గారు పాఠకులకు ఆయా కవుల రచనలు చదివిన ఫలితాన్ని కొంతవరకైనా ఇవ్వగలిగారు ఇకమీదట రచయితల రచనలను చదవాలనే ఆసక్తి రేకెత్తించి వదిలిపెట్టటంతో తృప్తిపడాలేమోననిపిస్తుంది

ఈసారి జాబితాలో యావద్భారతఖ్యాతి సంపాదించుకుని అనేక కట్టుకథలకు నాయకుడైనవాడు తెనాలి రాముడొక్కడే దురదృష్టవశాత్తూ ఆ తెనాలి రాముడికి పాండురంగ మహాత్మ్యం రాసినవాడికీ ఆట్టే సంబంధం లేదు అయినా తెలుగుదేశంలో కూడా హెచ్చుమందికి ''తుసాభుసా'' రామలింగడే తెలుసు అసలు తెనాలి రాముడి పరిచయం ఈ సంపుటంలో లభిస్తుంది తాను సృష్టించే పాత్రల మనస్తత్వమూ, జీవితమూ వాస్తవికంగా ఉండేటట్టు రామకృష్ణుడు రచన సాగించాడు కవిగా అతడు అనేక శక్తులు గల వాడు, గడుసువాడు కూడా

శంకరకవి పేరు చెబితే హరిశ్చంద్రుడి కథ జ్ఞాపకం వస్తుంది మంచి ధార గల సహజ కవి కవిత్వంలో కుస్తీలు పట్టాడు

వెలగపూడి వెంగన్నా, అంగడ బాపనయ్యా, వాసిరాజు రాజయ్యా, చెందలూరి చిక్కయ్యా, కానుకొలను అన్నమరాజూ చేసిన రచనలు తెలియకపోయినా ఆటే నష్టం లేదు కాని బైచరాజు వెంకటనాథుడి పరిచయం ఒక విచిత్రమైన ఆనందాన్ని చేకూర్చుతుంది కొందరిని రెండు నిమిషాలు చూడగానే, '' ఇతను తెలుసుకోదగినవాడు'' అనిపిస్తుంది ఆ మనిషి పరిచయం ద్వారా మనకేదో ఒరిగినట్టే ఉంటుంది నా ప్రాణానికి వెంకటనాథుడు అలా అనిపించాడు నాలుగు శతాబ్దాల నాటి ఈ కవిని ఆరున్నర పేజీల పరిచయంలో ఆరుద్రగారు నాకెంతో దగ్గిరవాడనిపింపజేశారు చచ్చు రచనలను గురించీ, వారిని మెచ్చుకునే వారిని గురించి, సాహిత్య సంబంధమైన అభిరుచుల అరాజకత్వం గురించీ రచయితలు కొందరు పెట్టే ఫోజులను గురించీ ఈ మహాకవికున్న భావాలు నాకున్నవి లాటివే కావటమే ఇందుకు కారణమేమో! ''

ఆంధ్ర వధూటి వాక్కృపుంజనుగవబోలి గూఢమును జాటుదనంబును గాకయుండ జెప్పనయదిపో కవిత్వమనిపించు''నన్నాడు వెంకటనాధుడు కానిస్తనాలను కృత్రిమంగానూ, దాదాపు నగ్నంగానూ ప్రదర్శించినట్టుగా కవిత్వం చెప్పి గొప్ప కవులనిపించుకొన్న వారూ ఆ కాలంలోనే ఉన్నారు 'మేమెంత తెలివిగా రాస్తామో చూడండి'' అన్న ధోరణిలో రాసేవారికి ''హృదయ బ్రహ్మరథం బతిప్రియతమంబు'' అన్నది స్ఫురిస్తుందా?

'' ఏమి తెలియకయుండునే దాని విద్యమెరయ ఘనమగు సంస్కృతము'' చెప్పే వారిని ఆక్షేపించే మొల్ల కూడా ''వలితపు పయ్యెదను గొలదిగ గానవచ్చు వలిగుబ్బచనుంగవరీవి''నే బలపరిచింది ఆమె రచించిన రామాయణం మాట ఎలా వున్నా - అది యిప్పటికీ సజీవంగా వున్న గ్రంధమే - సాహిత్యం పట్ల ఆమెకు గల విశ్వాసాలు ఆరోగ్యకరమైనవే

అయ్యలరాజు రామభద్రుడు ''రామాభ్యుదయం''లో చూపిన చమత్కారాలు రచ్చబండ జీనియసులను స్ఫురింపజేస్తాయి గొప్ప భావన ఏమీ ఉండదు స్వయంపాకపు శ్లేష, కానీ ప్రబంధంలాగా ఉంది! రాముణ్ణిమోస్తూ నిండుచూలాలైనా కౌసల్య హరి మధ్యే! పుత్రశోకంతో చస్తానని శపించుకున్న దశరధుడు తనకు పిల్లలు కలుగుతారు గదా అని మహా సంతోషించాట్ట చేతిలో దమ్మిడీ లేని వాడు తనకు విస్తార ధన నష్టం జాతకంలో ఉన్నదంటే సంతోషించినట్టు! ఇవి పెద్దగా హర్షించదగిన తెలివితేటలేమీ కావు అయినా వీటి పట్ల ఔదార్యం వహించిన ఆరుద్ర గారు రామభద్రుణ్ణి మరొకందుకు అనవసరంగా తప్పుబట్టారు రామభద్రుడు రామాయణ కధను మార్చాడు కాని వాల్మీకికి మార్పులు చెయ్యకుండా ఏ ఒక్కరైనా రామాయణం రాశారా? భాసుడు తన రామాయణ నాటకాలలో తెచ్చిపెట్టినన్ని మార్పులు మరెవరూ తెచ్చిపెట్టి వుండరేమో అందుచేత '' ఏ రామాయణాన్ని అనుసరించి రామభద్రుడు ఇలా మార్పు చేశాడోతెలియదు'' అన్న ప్రశ్న లేనే లేదు ఈ మార్పులను అనౌచిత్యాలుగా భావించనవసరం లేదేమో శూర్పణఖ ముక్కు కొయ్యటం లక్ష్మణుడి చేత చేయించటం ఉచితమూ, రాముడు తానే చేయటం అనుచితమూ అవుతుందా?

సాహిత్యానికి భాష ఆధారం గాని, భాషకు సాహిత్యం ఆధారం కాదు వెయ్యి ఏళ్ల భాషా చరిత్రలో గాని, అరవై ఏళ్ళ సాహిత్య చరిత్రలో గానీ లేని అచ్చ తెలుగులో తెలగన్న యయాతి చరిత్ర రాశాడు దాన్ని అంకితం పుచ్చుకున్న మల్కిభరాముడికి అచ్చ తెలుగు ఇష్టంట! చిన్నయసూరి అనంతరం మడిగట్టుకున్న వాళ్ళు వాడిన గ్రాంధికం కృతకం అయినట్టే, పదహారో శతాబ్దిలో వెలువడిన తెలగన్న పుస్తకంలోని భాష కూడా కృతకమే తెలగన్న లేని మాటలను సృష్టించాడని కాదు ఆరుద్రగారన్నట్టు ''పక్కిడాల్పేలుపు పొక్కిలి పసిబిడ్డ'' అంటే బ్రహ్మ స్ఫురించడు గనక, పద్యస్ఫురణ కలిగించని రచన నిగూఢం కానప్పుడు సాహిత్యానికి వెలికాక తప్పదు

16వ శతాబ్ద ఉత్తరార్ధంలో అకస్మాత్తుగా తొండండిప్పొడి ఆళ్వారు కధకు గిరాకీ హెచ్చి నలుగురు కవులు రచించారట ఈ పోటీలో నెగ్గినది సారంగు తమ్మయ్య రచించిన 'వైజయంతీ విలాసం '' తమ్మయ్యది పాఠకుడితో ఆప్యాయంగా మాట్లాడే శైలి యువకులు శృంగార రసం కోసం చదివినా, వైజయంతీ విలాసంలో '' ఆ విప్రోత్తము'' అనే పద్యాలలాటివి కొన్ని పద్యాలు ఇప్పటికీ తెలిసినవాళ్ళు సందర్భం వస్తే అంటూండడం వింటాం దేవదేవికి

ఆశ్రయమివ్వటానికి విప్రనారాయణుడు కాస్త జంకటంలోనే అతని పతనానికి బీజాన్ని వేశాడు తమ్మయ్య మనస్తత్వం బాగా తెలిసిన కవి ఆయన

రుద్రకవి రచించిన నిరంకుశోపాఖ్యానికీ, రామకృష్ణుడి నిగమశర్మ కథకూ కొంత పోలికలున్నా రెండు పాత్రలలోనూ ఒక పెద్ద తేడా ఉన్నది నిరంకుశుడు సత్త్వవంతుడు నిగమశర్మ కేవలమూ నీచుడు మాత్రమే నిరంకుశుడు లాంటి సత్త్వవంతుల కథలు మనకు సరిత్సాగరంలో కనిపిస్తాయి వాళ్ళు ఆ కాలపు ఆంటీహీరోలు అలాంటి పాత్రలను సృష్టించటం అప్పటి కవుల తిరుగుబాటేమో

''పింగళి సూరన్న కవిత్రా? కాదు, అపర సరస్వతి'' అనే వారు మా ములుకుట్ల శాస్త్రులు గారు ఆయన ఆ మాట అనటానికి కారణం రాఘవ పాండవీయమనే ద్వ్యర్థికావ్యం ''సోఫా కమ్ బెడ్'' లాగా ఉండే ఈ రాఘవ పాండవీయాన్ని పింగళి సూరన్నగారి మాటల విరుపుల - ధ్వనుల గారడీగా చదివి ఆనందం పొందాలే తప్ప, రాఘవీయం కోసంగానీ, పాండవీయం కోసం గానీ దాన్ని చదవనవసరం లేదు

''కళాపూర్ణోదయం'' దారి వేరు దాన్ని నవల అని అందరూ ఒప్పుకున్నారు నవలల్లో కూడా ''రొమాన్స్'' అనే జాతికి చెందింది అందులోనూ ''ఫోక్‌లోర్'' శాఖ పింగళి సూరన్న బహుముఖప్రజ్ఞ గల వాడు ఆ ప్రజ్ఞలన్నీ కళాపూర్ణోదయంలో కనబడతాయి - చక్కని కవిత్వమూ, సస్పెన్స్, పాత్రపోషణా, అతి విచిత్రమైన ట్విస్టులూ, కల్పనా చమత్కృతీ వగైరాలు సూరన్నగారి ''తడాఖా'' బొత్తిగా తెలియని వారికి ఆరుద్ర గారు మంచి స్టార్టే ఇచ్చారు ఆపైన పాఠకుడు ఇతర విమర్శకుల సహాయంతో కళాపూర్ణోదయాన్ని పూర్తిగా అధ్యయనం చేసుకోవచ్చు

భట్టుమూర్తి రచించిన వసుచరిత్ర కూడా విమర్శకుల సహాయంతో పఠించదగినది దీనిపైన కూడా పుస్తకాలకు పుస్తకాలే వెలువడ్డాయి పింగళి సూరన్నగారి విషయంలో పాఠకులకిచ్చినంత మంచి ''స్టార్టు'' భట్టుమూర్తి విషయంలో ఆరుద్రగారివ్వలేదనిపిస్తుంది భట్టుమూర్తిది రచ్చబండ తెలివికాదు అతని రచన కొంతవరకు ''స్తనావిష్కరణ'' ధోరణికి చెందినదే అయినా అవి కృత్రిమ స్తనాలు మాత్రం కావు వసుచరిత్రలోని మర్మాలు తెలుసుకుంటూంటే మనకెంత ఆనందం కలుగుతుందో, వాటిని సృష్టించటంలో భట్టుమూర్తికూ్కడా అంత ఆనందమూ ఉండి ఉండాలి అతను అనంతర కవులనేకమందిని ప్రభావితులను చేసి ''పిల్లవసుచరిత్రలు'' రాయించినవాడు, పండితుడు, గొప్ప ప్రతిభ కలవాడు

ఆరుద్రగారీ సంపుటంలో పన్నెండు మంది ''వేదాంతు''లను గురించి చెప్పారు వీరిలో యతిప్రాసల గొడవ అక్కర్లేని వారున్నారు పుస్తకాలు చదవటమే వృథా అన్నవారున్నారు ఏమైనా వేదాంతం సాహిత్యంలో అంతర్భాగం కాదు అందులో వుండే అయోమయం విమర్శకులు విడదీసేది కాదు మతం జనాన్ని సాంఘికంగా ఏకం చేసింది బహుమతాల తాకిడి వల్ల సంఘం గొడవలోపడ్డప్పుడు వేదాంతం వచ్చి ఎవడి మోక్షం వాడు చూసుకోవాలని ప్రబోధిస్తుంది ఈ నవాబుల యుగంలో అదే జరిగి వుంటుంది

*విశాలాంధ్ర, దినపత్రిక, 19-12-1965*

# 15. సమగ్ర ఆంధ్ర సాహిత్యం (9వ సంపుటం)
## ఆరవీటి రాజుల యుగం

1543 నుంచి 1642 దాకా నడచిన ఈ యుగం తాలూకు రచయితలను అనేకమందిని ఆరుద్రగారు ఈ సంపుటిలో మనకు పరిచయం చేశారు వీరిలో విఖ్యాతులైన కవులు చాలా కొద్దిమంది ఈనాటికి ప్రఖ్యాతంగా నిలిచిన గ్రంథాలు కూడా చాలా తక్కువే అయినా ఇది బొత్తిగా బీడు కాదు ఈ యుగానికి చెందిన సాహిత్య ధోరణులు కొన్ని తెలుసుకోదగినవి, ఈ యుగంలో రచనా వైవిధ్యంతో బాటు కొన్ని కొత్త సాహిత్య ప్రక్రియలు కూడా జరిగాయి చిత్రకవిత్వము, ద్వ్యర్థిరచనలూ, ప్రబంధాలూ,యక్షగానాలూ, వీధినాటకాలూ, శతకాలూ, లక్షణగ్రంథాలూ, వివిధ కవుల పద్యాల క్రోడీకరణలూ, స్థలపురాణాలూ, సంస్కృత రచనలకు అనువాదాలూ మొదలైన సాహిత్య రూపాలన్నీ ఈ యుగంలో వెల్లివిరియటమే గాక నాటకాలూ, పాత సాహిత్యం మీద వ్యాఖ్యాన గ్రంథాలూ, చరిత్ర రచనలూ లాటి కొత్త రూపాలు అవతరించాయి

ఈ యుగంలో పోతనగారి భాగవతం బాగా ప్రచారమై వుండాలి అందుకే చాలా భాగవతాలు అవతరించాయి ఇటువంటి '' ఉప సాహిత్యం'' ఇంతకు పూర్వం లేదేమో, అయితే ఉప సాహిత్యం అసలు సాహిత్యానికి తీసికట్టుగానే ఉంటుంది ఐనా అసలు సాహిత్యాన్ని ''అందుకో''లేని వాళ్ళు దీన్ని ఆదరిస్తారు - విద్యార్థులు ''నోట్సు'' చదివి ప్యాసు మార్కులు తెచ్చుకున్నట్టు ఒక చేతి మీదుగా రెండు బాల భాగవతాలు రాసిన కోనేరు నాథుడు చాలా సాధారణమైన కవి

హిందూ ముసల్మాను రాజ్యాల మధ్య ఘర్షణలు సాహిత్యంలో కొన్ని ప్రభావాలను కలిగించాయి ''సాంబోపాఖ్యానం''లో ముస్లిముల ఆచార ప్రసక్తి ఉన్నది జక్కరాజు వెంకటకవి చేసిన ''కారుండ కాబోనాదంతో'' ''మోసపుపోరి చేరి పులమూక నవశ్యమొంచగా నగున్'' వంటి భావం శివాజీ అవలంబించినదే ఈ నీతి భారత యుద్ధంలో అమలు జరిగినదేనని వెంకటకవి అన్నప్పటికీ, భారతయుద్ధంలో అశ్వత్థామ ఉపపాండవులను చంపిన విధానం అధర్మమైనదిగానే కనబడింది అదే మొగలు సామ్రాజ్య కాలం నాటి యుద్ధనీతిగా మారి పుస్తకాలకెక్కింది

ఏకామ్రనాథుడు ''ప్రతాప చరిత్ర'' రాశాడు వాస్తవ చరిత్ర రాయటానికి కూడా సంప్రదాయం అవసరం అటువంటి సంప్రదాయం మన దేశంలో లేదు కొందరు అతి చిన్న సంఘటనను కూడా ఉన్నదున్నట్టు చెప్పలేరు ఏకామ్రనాథుడి ''ప్రతాపచరిత్ర''లో కూడా కల్పన జాస్తిగా ఉండవచ్చు అందులోని కొన్ని అబద్ధాలను ఆరుద్రగారు బయటపెట్టారు సిరియాలదేవిని కడకవల్లభుడు తరుముకురావటమూ, ఆమె వడ్డించిన అన్నాన్ని బ్రాహ్మలు తిన్న మీదట అతను ఆమె బ్రాహ్మణస్త్రీ అని నమ్మటమూ అనుమానాస్పదంగా కనిపిస్తున్నది వెనక కోసలరాజు శాక్యకన్నెను పెళ్ళాడతాననటమూ, శాక్యులు తమ దాసీని ఇవ్వబోవటమూ, శాక్యరాజునూ, ఆ కన్యనూ కలిసిభోంచెయ్యమనటమూ మొదలైన సంఘటనలకు ఇది

ప్రతిధ్వనిగా వినిపిస్తున్నది ఇంతకన్నా ''రాయవాచకం'' చాలా మెరుగు కావచ్చును ''రాయవాచకం''లో గల విశేషం అందులోని వ్యావహారిక వచనం రాయవాచకంలోని భాష - మూడు శతాబ్దాల పైచిల్లరకాలం నాటిది - చూసినట్టయితే, దానికి ఈనాటి వారు రాసిన వ్యాఖ్యానం తాలూకు భాషకన్న మనకు సన్నిహితంగా కనబడుతుంది ఉదాహరణ

''పార్సీ భాష నుండి రాజకీయ పారిభాషిక పదములనేకములిందుజొచ్చినవి తార్కాణమనునది సులభగ్రాహ్యము గాక పాఠకులకుక్లేశము గలిగించుచున్నది'' డా॥నేలటూరి వారు '' నూటికి వక బంటును, వెయ్యింటికి వక పండితుడున్ను, లక్షకు ఒకడు శక్తుండై సభాస్థలిని మాట పలుకులాడును శీమలో ఒకడు దాత అనేది కలండో లేడో అన్నట్టు నౌకరుగాక అందరికిన్ని - ఆ గుణములు ఏలవచ్చెను అని అయ్యమరీసు విన్నపం జేసి - '' ''రాయవాచకం ''

గిడుగువారు వ్యావహారిక వాదశంఖం పూరించిన అనంతరం అర్ధశతాబ్దం కాలంలో వాడుక భాష ఎంత పుష్టి చెందిందీ మనం కళ్ళారా చూస్తున్నాం ఒక నూరేళ్ళపాటు దాన్ని అణిచిపెట్టకుండా ఉన్నట్టయితే అది అవిచ్ఛిన్నంగా అభివృద్ధి చెంది ఈ పాటికి ఎంత పుష్కలమై ఉండునో!

కవి చౌడప్ప పేరు తెలియని వారుండరు అతని బూతుకవిత్వమే అందుకు ప్రధాన కారణం అయితే చౌడప్పా బూతు కోసమే బూతు రాశాడనిపించదు అతని బూతులో నీతి ఉంది శషభిషలు లేకుండా సత్యాన్ని సూటిగా చెప్పే గుణం వుంది చౌడప్ప వాస్తవ దృక్పథం గలవాడు ఇష్టపడి చదివితే రామాయణభారతాలు చదవమంటాడు డబ్బు కోసం ఎవడి పేరన్నా చెప్పి పద్యం చదవమంటాడు ఏమీ ఇయ్యనివాడి మీద పద్యం చదవడం నాలుక తీటేనంటాడు అయినవాళ్ళతో కలిసి రోజూ భోంచెయ్యటమే ఘన విభవమంటాడు అతని వాస్తవ దృష్టిలో గగన సౌధ నిర్మాణం కనబడదు

బద్దరాజు పెదరామన్న వ్యావహారిక భాషలో రాసిన రాఘవపాండవీయ వ్యాఖ్య ఈ యుగానికి చెందిన గొప్ప గ్రంథం తెలుగు సాహిత్యంలో కొత్తరకం రచన కూడాను దీన్ని ఈ కాలపు కసాయి పండితులు కృతక భాషలోకి మార్చి ప్రచురించటం మహాదారుణం పెదరామన్న బాటలోనే హరిశ్చంద్ర నియోపాఖ్యానియోపాఖ్యానికి వ్యావహారికంలో వ్యాఖ్య రాసిన చిత్రకవి అనంతయ్య కూడా ప్రశంసార్హుడు దీన్ని కూడా పండితులు ఖరాబు చేసి పెట్టారుట

రామన్న, అనంతయ్యలు తెలుగు సాహిత్యంపైన చేసిన వ్యాఖ్యల వంటివి రచనలకు కొత్త జీవం పోస్తాయి కాళిదాసంతటి వాడికే సంజీవనీ వ్యాఖ్య కొత్త ప్రాణం పోసింది గదా!

మాదన వెంకయ్య లాంటి శతకకర్తలను గురించి ఆరుద్ర గారన్న మాటలలో కొంత సత్యం ఉన్నది శతకకర్తలు ''తమ వ్యక్తిగతమైన భావాలూ, బాధలూ ప్రకటించుకొనడానికి ఆలంబనం కావటమేగాక, వాళ్ళు ప్రజాబాహుళ్యానికి మరింత సన్నిహితులుగా రచనలు చేయగలిగారు ప్రబంధకవులు ఎంత గొప్పకవిత్వం రాసినా శతక కవులంతగా ప్రజా ప్రతినిధులు కాలేరు అంతేగాక శతకకవులు సమాజ క్షేమాన్ని చాలా హెచ్చుగా పాటించి రచనలు చేశారు వారు చెప్పిన సత్యాలు ఈనాటికి కూడా వర్తిస్తాయి ఉదాహరణకు భాస్కరశతకంలోని

''దక్షత లేని ఇంటికి పదార్థము వేరొక చోటి నుండి వేలక్షలు వచ్చుచుండిన బలాయనమ్మైచను, కల్లగాదు'' అన్న మాట ఈనాడు మనదేశానికి అక్షరాలా వర్తించదా? ఏనాటికైనా నీతులు చెప్పుకోదలిస్తే సాహిత్యం నుంచి ఉదహరించటానికి శతకవాఙ్మయం పనికివచ్చినట్టు ఇతర రచనలు పనికిరావు

ఈ యుగంలో పుట్టిన స్థల పురాణాలు కుంపురాణాలు తెలుగు సాహిత్యం విస్తృతి చెందుతూ ఉండిందనటానికి మంచి ఉదాహరణలు

*విశాలాంధ్ర, దినపత్రిక, 27-2-1966*

# 16. సమగ్ర ఆంధ్ర సాహిత్యం ( 10వ సంపుటం ) నాయక రాజుల యుగం - 1

''రెడ్డొచ్చె మొదలాడు'' అని సామెత తెలుగులో సాహిత్యం పుట్టిన నాటి నుంచీ ఈనాటి దాకా ఏ 'రెడ్డో'' రావటమూ సాహిత్యం మొదలాడటమూ జరుగుతూనేవుంది

గడిచిన ఇరవై ముప్పై ఏళ్ళ తీసుకోండి తెలుగు సాహిత్యానికి కుదుళ్ళుగా పని చేసిన పురాణాలతో మనకింత వరకూ పనిదీరలేదు వాటికింకా కాలదోషం పట్టలేదు

నాటకాలు కొత్తగా వచ్చినప్పుడు మళ్ళీ పురాణాలను ముందుకు తెచ్చాం సినిమాలొచ్చాయి మరొకసారి పురాణాలను పైకి తెచ్చాం చవకపత్రికలొచ్చాయి, బొమ్మల కథలొచ్చాయి, పిల్లల సాహిత్యం వచ్చింది రేడియోలొచ్చాయి టెలివిజన్ వస్తున్నదీ మళ్ళీ వీటిలోనే కొత్త కొత్త దశలు వొస్తున్నాయి ఇప్పుడే కొత్త కళా ప్రయోగం జరిగినా పురాణాలను ముందుకు తెస్తున్నాం యాభై ఏళ్ళ క్రితం ఫాల్కే గారు మూకీలను పురాణకథలతో ప్రారంభించడం వింత కాదు ఈనాడు భారత, రామాయణ కథల చిత్ర నిర్మాణం పోటీల మీద జరుగుతూ వుండటం నిశ్చయంగా వింతే కాని మన సంస్కృతి దాదాపు వెయ్యేళ్ళుగా ఒకే సుడిగుండంలో పడి తిరుగుతున్నది దాన్ని గురించి చెయ్యగలిగిన దేమిటో తెలిసిన్నాడు తప్పక చేస్తాం

అందుకే సమగ్ర ఆంధ్ర సాహిత్యం తాలూకు ఈ పదో సంపుటం ద్విపద భారత రచనతో ప్రారంభమై కృష్ణలీలా విలాసంతో అంతమవుతుంది ఒక్క భారతమే కాదు భాగవతమూ, రామాయణమూ కూడా ద్విపదలో రావడం మనం ఈ సంపుటంలో చూస్తాం శ్రీ పింగళి లక్ష్మీకాంతం గారన్నట్టు యీ ద్విపద పురాణాలు మరో రకం ప్రయోజనం కోసం పుట్టి పాత పురాణాల కన్నా ప్రజలకు మరింత సన్నిహితమైనవి ఇలా ప్రజలకు సన్నిహితంగా వచ్చే కృషి సాహిత్య చరిత్రలో అడపాదడపా జరుగుతూ ఉంటుంది కాని అది ఎన్నడూ ప్రజాసాహిత్యమై పోదు పైపెచ్చు, కాలమయాక సాహిత్య ఉయ్యాలలాగా వెనక్కి నడిచి పండితులకు సైతం కొరుకుడు పడని చిత్ర బంధ శ్లేష ద్వర్థి వగైరా రూపాలలోకి పోతుంది అనుప్రాసలతోనూ, యమకాలతోనూ నృత్యాలు చేస్తుంది ఉదాహరణకు, కృష్ణాధ్వరి రచించిన 'నైషధ పారిజాతం'' లోని శబ్దార్థ శ్లేషాలంకారాలు వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వంటి

పండితోత్తముడికి పూర్తిగా అర్థం కాలేదట! ''కవి లానే దీనిని వ్యాఖ్యానించిన బాగుండెడిది'' అన్నారాయన నిస్పృహతో

తెలుగు సాహిత్య చరిత్రలో రెండర్థాల కావ్యాలను పన్నెండింటినీ, మూడర్థాల కావ్యాలను నాలుగింటినీ, నాలుగర్థాల కావ్యాలను రెంటినీ ఆరుద్రగారీ సంపుటంలో (పేజీ 221) జాబితా ఇచ్చారు అవన్నీ ప్రజలకెంత సన్నిహితంగా ఉండినది మనం చదవకుండానే తెలుసుకోవచ్చును తిట్టుకవిత్వం మరొక రకం వెర్రితల కవి అయిన వాడు తిట్టకూడదని కాదు ''కుట్టని తేలు కుమ్మరి పురుగుతో సమానం'' అన్నదీ నిజమే కాని ఈ తిట్లు తగులుతాయాని, కవిత్వానికి మంత్రశక్తి ఉన్నదనీ, అది కొన్ని అక్షరాలు కొన్ని స్థానాలలో ఉంటే దానంతట అదే ఏర్పడుతుందనీ, కొన్ని కొన్ని పరిస్థితులలో దీవెన సైతం తిట్టుగా తగులుతుందనీ, మరికొన్ని పరిస్థితులలో తిట్టయినా దీవెనగా పరిణమిస్తుందనీ కొందరు నమ్మారు ఇతరులను నమ్మించారు వాళ్ళు సామాన్య ప్రజలలో కవిత్వం అంటే ఎలాటి బెదురు పుట్టించి వుంటారో ఊహించవచ్చు సాహిత్యానికి ఎంతో సేవ చేసిన అప్పకవే యిలాంటి పని కూడా చేసి వుండటం చిత్రం తిట్టుకవిత్వంలో శపించిన పది మంది పూర్వకవులను అప్పకవి పేర్కొన్నాడు వాళ్ళ జాబితా ఈ సంపుటంలోని 128వ పేజీలో వుంది

ఈ సంగతులు ఇలా వుంచినట్టయితే, ఈ సంపుటంలో మనం కొందరు అఖండులను పరిచయం చేసుకుంటాం వారిలో మొదటి వాడు రఘునాథ నాయకుడు ''ప్రాడిజీ'' అనదగినవాడు ఒక్క రాత్రిలో పారిజాతాపహరణ ప్రబంధాన్ని ఆశువుగా చెప్పి తన తండ్రి చేతనే నిండు సభలో కనకాభిషేకం చేయించుకున్నవాడు సాహిత్యాన్ని ప్రజలకు దగ్గరిగా తెచ్చినవారిలో ఒకడు ఆయన ద్విపదలో నలచరిత్ర రాస్తూ ''శిలలలోపల వెన్న చిలికిన కరణి అలము సంస్కృతముల యరంబులెల - తెలుగు మాటల తేట తెల్లంబుగాగ చెలువొంద'' పల్కిన కవిత్రయాన్ని మెచ్చుకున్నాడు ప్రజల అంతుబట్టని సంస్కృతాన్ని శిలతోనూ తెలుగు మాటల తేటను వెన్నతోను పోల్చడం గమనించదగ్గది శ్రీనాథుడి నైషధానికి రఘునాథుడు మెరుగులు దిద్దటం కూడా జరిగిందని ఆరుద్రగారంటున్నారు

రఘునాథుడు ద్విపద కావ్యాలే గాక సంస్కృతంలో మూడు పుస్తకాలు రాశాడు తెలుగులో ప్రబంధాలూ యక్షగానాలూ కూడా రాశాడు అతను స్వయంగా కవేగాక ఎందరో ఇతర కవులకు గురువూ, పోషకుడూ కూడా అయాడు

''విజయవిలాసం'' రచించిన చేమకూర వెంకట కవి మరొక ఉద్దండుడు కవిత్వాన్ని రసాయన ప్రక్రియలకు సమం చేసిన వాడు విజయ విలాసం గురించి తాపీ వారి ప్రసంగం విన్న వారెవరూ దాన్ని జన్మలో మరువలేరు ఇదే మరోదేశంలో అయితే, తాపీవారిచేత ఊరూరా విజయ విలాసం మీద ఉపన్యాసాలిప్పించి టిక్కెట్లుపెట్టి విని ఉందురు ఆ తరువాత పుస్తకం వేసి లక్షల కొద్దీ కాపీలు అమ్మి ఉందురు

'చేమకూరవాడు'' గొప్ప కవేగాక చాలా గడుసు పిండం మాటల గారడీల మాట అటుంచి మనస్తత్వాన్ని మంచి నవలా కారుడిలాగా చిత్రించగలవాడు ఆరుద్ర గారిచ్చిన (పేజీ 117) ఒక ఉదాహరణే తీసుకొండి మునిరూపంలో ఉన్న అర్జునుణ్ణి సుభద్ర యధాలాపంగా అడిగినట్టు ''మీకెక్కడైనా అర్జునుడు తగిలాడా?'' అని అడగాలి లోపల

తహతహ ఉన్నది కాని సుభద్ర దాన్ని ఎవడో మునికి ఎలా తెలియనిస్తుంది? మాటవరసగా అడిగినట్టు ధ్వనించటానికి కవి ఆమె చేత ''మీరందందు నరుగనరు గానరుగా'' అనిపిస్తాడు

''ఏగతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరేకదా'' అని వెంకటకవి అన్నదానిమీద ఆరుద్రగారు ''కీర్తిరాక ముందు ప్రతి ప్రధమ శ్రేణి రచయితా ఇలా కుమిలిపోక తప్పదు కాబోలు'' అంటున్నారు ఆనవాయితీకి భిన్నంగా వెళ్లటం ప్రధమ శ్రేణి రచయిత లక్షణం అందుచేత అతడికి కీర్తి వెంటనే రాదు చిరకాలం దక్కివుండే కీర్తి కాస్త ఆలస్యంగా రావటమే మంచిదేమో విజయవిలాసాన్ని అంకితంగా పుచ్చుకున్న రఘునాధుడంతటివాడే వెంకట కవిని '' ఒకటగావన్నిటను ప్రయోజకుడవీవు'' అన్నాడు మంచి సర్టిఫికెటు

చిత్రమేమంటే ఈ చేమకూర కవి రాజాదరణ పొందినా, రాజభక్తి గలవాడే అయినా రాజుల మనస్తత్వాన్ని అర్థం చేసుకొని, అవసరం కలిగినప్పుడు వాళ్ళను తూర్పార బట్టినవాడే

పుష్పగిరి తిమ్మన్న మరొక తెలుగుకోదగిన వ్యక్తి ఆయన స్వయం ప్రతిభ గలవాడేగాక, కొందరు ప్రసిద్ధులైనవారి పైన తన ప్రభావాన్ని పరపాడుకూడా అంటె తన కాలపు కవులకు అనేక మందికి గురుపీఠం లాంటివాడు ఇటువంటి వాళ్ళకు సాహిత్య చరిత్రలో ఎప్పుడూ పెద్దపీఠం వెయ్యాలి ఈ విషయంలో ఆరుద్రగారు ఏమీలోపం చెయ్యలేదు ఈ సంపుటంలో అయిదోవంతు పుష్పగిరి తిమ్మన్నకూ, ఆయన మిత్రబృందానికి కేటాయించబడింది

చక్కని శైలీ, రచనా శిల్పమూ, నిగూఢమైన సమన్వయమూ కరతలా మలకమైన ఈ కవి ఆంజనేయభక్తుడు ''సమీర కుమార విజయం'' అనే ఆంజనేయ చరిత్రరాస్తూ, పోతన్నగారి లాగే ''రామ నరేంద్రుడట్టి ప్రభురత్నము శాశ్వత కీర్తికల్లగ నేమిటికీ నరాధముల కిత్తురో కావ్యముల్ కవుల్?'' అని ప్రశ్నించు కున్నాడు ప్రశ్నించుకోవటమేకాదు తన జీవితాంతం దాకా రాజాదరణను తోసిరాజని దుర్భరమైన దారిద్ర్యానికి కూడా గురి అయి అప్పుల పాలై వాటి బాధ పడలేక ఇతర కవులకు ''ఘోస్టు''గా పని చేశాడా అన్న సంశయానికి కూడా ఆస్కారం కలిగించాడు ఉత్తర రామాయణం రాసి ప్రసిద్ధిలోకి వచ్చిన కంకటి పాపరాజునే పండితులు శంకించారు ఈ శంక నిరాధారమైనదే కావచ్చు కాని ఆరుద్రగారు చూపినట్టు (157-8 పేజీలు) కంకంటి పాపరాజు పద్యాలు పుష్పగిరివారి వాసనలు కొట్టుతున్న మాట నిజం

ఈ సంపుటంలో మనకు తగిలే మిగతా కవులలో రామరాజీయం రచించిన అందుగల వెంకయ్య ఒకడు రామ రాజీయం చరిత్ర గ్రంథం మన సాహిత్యం తిరిగిన సుడిగుండంలో వాస్తవ చరిత్రలకు స్థానం లేకపోయిందనుకొవాలి మనని ఏలిన ముసల్మాను పాదుషాలు చరిత్రలు రాయించారు బాబరు డైరీ కూడా రాసుకున్నాడు కాని మనవాళ్ళు ముసల్మానులను చూచి చరిత్రలు రాయించుకోవటం జరిగింది అయితే రామ రాజీయం వ్రాసిన వెంకయ్యగారు తాను రాస్తున్నది అరవీటి రాజుల వంశ చరిత్రే అయినా, సంప్రదాయం చెడకుండా వారి మూల పురుషుడు చంద్రుడితో కధ ఎత్తుకున్నాడు! అయితే ఇందులో కొన్ని తెలియదగిన చారిత్రాక విషయాలున్నాయట! చరిత్ర కదా అని మరీ నీరసంగా రాయకుండా వెంకయ్యగారిందులో బంధకవిత్యమూ, చిత్రకవిత్వమూ, ఎవరూ వాడని కొన్న మారుమూల వృత్తాలూ అవీ ప్రయోగించాడు

అందుగల వెంకయ్య అడుగుజాడలలో కుమార ధూర్జటీ అనే ''ప్రాడిజీ'' కృష్ణరాయ విజయం రాశాడు ధూర్జటి వంశంలో పుట్టిన ఈ కవి కుమారుడి అసలు పేరు వెంకటయ్య అయితే కృష్ణరాయ విజయం చరిత్ర గ్రంధంగా చెప్పుకోదగినది కాదట ఈ కుమార ధూర్జటే '' ఇందుమతీ పరిణయం'' ఇంకా రసవత్తరంగా రాశాడట ఇతని కొడుకూ, మనుమడూ కూడా కవులే

ఈ సంపుటంలో మరొక గట్టివాడు ఏనుగు లక్ష్మణకవి భర్తృహరి సుభాషితాలకు ఈయన రాసిన అనువాద పద్యాలను తెలుగువాళ్ళు ఈనాటికీ ఆదరిస్తారు భర్తృహరి శ్లోకాలను ఉదహరించనివాళ్ళు లక్ష్మణకవి పద్యాలను ఉదహరిస్తారు

ఇప్పటికి సమగ్ర ఆంధ్ర సాహిత్యం 16వ శతాబ్ది చివరికి చేరుకున్నది వచ్చే సంపుటంలో ఇది మరొక ముక్కాలు శతాబ్దం ముందుకు జరుగుతుంది అది శీఘ్రంగానే బయట పడుతుందని ఆశించుదాం

*విశాలాంధ్ర , దిన పత్రిక, 11-12-1966*

# 17. సమగ్ర ఆంధ్ర సాహిత్యం ( 11వ సంపుటం)
# నాయకరాజుల యుగం – 2

ఈ సంపుటంలో మనకు విజయ రాఘవ నాయకుడూ, క్షేత్రయ్యా, ''కాకమాని రాయడు'' కాకమాని మూర్తికవీ, నారాయణ తీర్థులూ, సిద్ధేంద్రయోగీ, ''రామదాసు'' గోపన్నా మొదలైన ప్రఖ్యాతులు పరిచయం అవుతారు తొలి తెలుగు నాటకాలూ, కూచిపూడి వారి భామాకలాపమూ మొదలైనవి కూడా మనకు పరిచయం అవుతాయి

తెలుగులో నాటక సాహిత్యానికి వైతాళికుడైన విజయ రాఘవుడు రాసిననాటకాలే ఉండటానికి ఆరున్నాయి కాని ఇవన్నీ నాటకం పంపిణిలో రాసినవి కావు ఎక్కువగా యక్షగానాల రూపంలో ఉన్నాయి

తెలుగు నాటక సాహిత్యంలో నాటక ప్రక్రియ ఇంతగా లోపించటానికి కారణమేమిటో తెలిసినవాళ్ళు చెపితే బాగుండును

మన కవులకూ, రచయితలకూ ఆదినుంచీ సంస్కృ సాహిత్యంతో ఎంతో సన్నిహిత సంబంధం ఉండేది అనేక సంస్కృత మూలాల అనువాదాలు ఆంధ్ర సాహిత్యంలో ఉద్గ్రంధాలుగా నేటికీ నిలబడి ఉన్నాయి సంస్కృత సాహిత్యం తీసుకున్నట్టయితే అందులో నాటకం ఏనాడో వెలువడింది భాసుడు కౌటిల్యుడికి సమకాలికుడనుకున్నట్టయితే - ఒక భాస శ్లోకంఅర్థశాస్త్రంలో ఉదహరించ బడిందట - నన్నయ భట్టుకు పూర్వం దాదాపు ఒకటిన్నర సాహస్రాబ్ది పాటు సంస్కృతంలో నాటకాలున్నాయనుకోవాలి అలాంటప్పుడు నన్నయ భట్టారకుడి అనంతరం ఆరు శతాబ్దాల కింకా తెలుగు నాటకం యక్షగాన ఫక్కీలో ఎందుకు నడిచింది?

ఈ ప్రశ్నకు సమాధానం దక్షిణదేశంలో నాటకాలాడటానికి అనువైన రంగస్థలం లేకపోవటమే అయితే ఇందులో మనం నేర్చుకోదగిన నీతి ఉన్నట్టే

ప్రదర్శన యోగ్యమైన నాటకం అంటూపుట్టాక అందులోకి వాడుక భాషా, ప్రవేశించడం స్వాభావికం కళారూపానికీ, అది సాధించగల వాస్తవికతకూ అత్యంత సన్నిహితత్వం ఉన్నది గేయనాటకాల్లో శృంగారం ప్రదర్శితమైనంతగా వీరం ప్రదర్శితంకాదు అన్ని సాహిత్య ప్రక్రియలలోకీ హెచ్చు వాస్తవికత ప్రదర్శించగలది నాటకమే ఈనాడు నాటకాన్నిమించిన వాస్తవికతను మనం సినిమాలో చూస్తున్నాం

వాస్తవికత అన్నది కళకు మౌలికమైనది కావటం చేత దాని ప్రభావం బహుముఖంగా ఉంటుంది ''పూతనాహరణం''లో ఇతివృత్తం కృష్ణుడి బాల్యం నాటిదే అయినా అందులో వచ్చే గొల్లలూ, పురోహితులూ, రంగావధాన్లూ, సింగావధాన్లూ పదిహేడో శతాబ్దికి చెందినవాళ్ళే వాళ్ళ భాషా భావాలూ కూడా అంతే

ఇలాంటి వాస్తవికత ఈ యుగపు ప్రబంధాలలో కూడా కానవస్తున్నది దామెరల వెంగళరాజు రచించిన ''బాహుళాశ్వ చరిత్రం''లో కృష్ణుడికాలంలోనే వేశ్యలూ, వైశ్యులూ ఉన్నట్టు చిత్రించి ఉండటమేకాక వాళ్ళ సమకాలికులకు ప్రతిరూపాలుగా ఉన్నారు అంతేకాదు రత్నాకరుడనే వైశ్యశ్రేష్ఠుడు వ్యాపారంలో చేసే దగాలు, తప్పుడు తూకాలూ, కల్తీ నేతులూ, తవుడు కలిపి కొత్త బియ్యం అమ్మటం వగైరా చూస్తే ఈనాటి జీవిత చిత్రణం లాగే కనిపిస్తాయి

అదే విధంగా సవరం చిననారాయణ రచించిన ''కువలయాశ్వ చరిత్ర''లో తుపాకులతోనూ, ఫిరంగులతోనూ యుద్ధం జరుగుతుంది!

నిజానికి మనం ఈనాడు కళలో వాస్తవికత అనేది ఇలాంటి దాన్ని కాదు ఇలాంటి కల్పనలనుanachronisms అంటారు కృష్ణదేవరాయలకాలంలో రైలు ప్రయాణాలున్నట్టూ, కుంపిణీరోజుల్లో రేడియోలున్నట్టూ రాయటం ఇలాటిదే అవుతుంది ఇవి పొరపాట్లు, రచయితకు తెలియకుండా పమాదవశాత్తూ దొర్లుతాయి కాని ఈ నాయక రాజుల కాలపు కవులు ప్రమాదివశాన ఇలాటి ''వాస్తవికత'' ప్రవేశపెట్టలేదు, బుద్ధి పూర్వకంగానే ప్రవేశపెట్టి తమరచనలలో సమకాలికులకు ఆసక్తి కలిగించయత్నించారు అంతే గాని జీవిత వాస్తవికత వారికి పట్టనేలేదు

నిజానికి ఈ కాలానికి మన రాజకీయాలలోకి విదేశీ పురుగు ప్రవేశించి లోదొలవటం ప్రారంభించింది రాజులమధ్య స్నేహ సంబంధాలేమీలేవు వ్యాపారం కోసం పడమట్నించి వచ్చి ఫ్యాక్టరీలు కట్టుకున్న తెల్లవాళ్ళు అక్కడక్కడా రాజకీయ సలహాదార్లుగా చేరి పాశ్చాత్య సామ్రాజ్యాలకు విత్తనాలు చల్లసాగారు కాని ఈ గొడవలేవీ కవులు పట్టించుకోలేదు పైపెచ్చు జీవితం తాలూకు కుళ్ళును తమ రచనల్లో వెటకారం చేస్తూ శృంగార రచనలలో మునిగి తేలుతూ జీవితాన్నిమరిచిపోవ యత్నించారు ఈ యుగంలో ''పచ్చి'' శృంగారం విజృంభించటానికిదే కారణం కావచ్చు ఇలాటి వాతావరణానికి దోహదం చేసినవాడు యుగకర్త అయిన విజయ రాఘవనాయకుడే ననిపిస్తుంది అతడు రాజకీయంగా ఎంత హీనమైన పాత్ర నిర్వహించాడో, తన కాలపు సాహిత్యరంగంలో అంత ఘనమైన పాత్ర నిర్వహించాడు

ఆ వాతావరణంలో క్షేత్రయ్య మువ్వగోపాల పదాలు రాశాడు ఇంకా అనేక మంది కవులు అనేక కావ్యాలు, శృంగార ప్రధానమైన రచనలు చేశారు ''సత్యభామా సాంత్వనం''లో తిరుకామయ్య, నరకాసురుడి పైకి యుద్ధానికి వెళ్ళిన కృష్ణుడు సత్యభామా విరహంతో

కుమిలిపోయి తన స్నేహితుల చేత చివాట్లు పడటం చిత్రించాడు ''శ్రీకృష్ణునివంటి ఉదాత్తనాయకుడు తిరుకామయ్య దృష్టిలో ఇంత దిగజారిపోయాడు'' అని ఆరుద్రగారు ఆక్షేపిస్తున్నారు కాని నిజానికి తిరుకామయ్య వాల్మీకి అడుగుజాడలలోనే నడిచాడు (రాముడు సీతను తలుచుకొని మదనతాపం చెంది కుమిలిపోవటమూ, లక్ష్మణుడిచేత చివాట్లు తినటమూ రామాయణంలోనే ఉన్నది)

శుకసప్తతీ, హంసవింశతీ కూడా ''బూతు'' రచనల కిందికే వస్తాయి విందువర్ణనలూ, శృంగారవర్ణనలూ జాస్తిగా ఉండటం కూడదనే అభిప్రాయం ఈ కాలపు ప్రజలలో బాగా నాటుకపోయింది అదొక విధమైన డిప్రెషన్ లాగా కనబడుతుంది అసందర్భంగానూ, అమితంగానూ దేన్ని చిత్రించినా పాఠకులకు విసుగెత్తించవచ్చు క్షేత్రయ్యకు జీవితమంతా ఒక దీర్ఘ వసంతంలాగా గడిచిపోయి ఉండవచ్చు! కాని క్షేత్రయ్య కవిత్వమంటే ''పడి చచ్చే'' వాళ్ళుకూడా క్షేత్రయ్య పదాలనే నెమరువేస్తూ జీవితం గడపలేరు కళా దృష్టి, ఔచితీ పాటించినట్లయితే శృంగార రచనలకు సాహిత్యంలో తప్పక స్థానం ఉన్నదనేచెప్పాలి

సాహిత్యంలో ''సెక్స్'' అన్నది జాతి యొక్క సంస్కారాన్ని రెండు విధాలుగా నిరూపిస్తుంది ఉదాహరణకు కిందటి శతాబ్దంలో కూడా బ్రిటిషువాళ్ళు ఆడదానికి కామేచ్ఛ ఉండదన్నట్లు నటించేవారు ఇది సెక్స్ పట్ల వారి అవాస్తవిక దృష్టిని తెలుపుతుంది ప్రాచ్య దేశాలవారు ఈ విధంగా ఏనాడూ ఆత్మవంచనతో జీవించలేదని చెప్పాలి మన దేశంలో కూడా పాశ్చాత్యులద్వారా ఇలాంటి అపోహలు వ్యాపించిన మాట నిజం భోజనేచ్ఛా, కామేచ్ఛా పశు సహజమైనవే గాని మానవ సహజమైనవి కావనుకున్నందువల్లా సెక్స్ గురించి వాస్తవమైన దృక్పథం పోగొట్టుకున్నందువల్లా ఏ జాతిగాని సంస్కృతిని పెంపొందించు కుంటుందనుకోవటం భ్రమే

మరొకటి కూడా ఉంది మానవుడు సాగించే సాంఘిక కృషిలో సెక్స్‌కే అగ్ర తాంబూలం ఇవ్వటం కూడా ఒక దుర్లక్షణమే ఆ దుర్లక్షణం ఒక్క రచయితకే పరిమితమైతే అంత ఇబ్బంది లేదు కాని సమాజమంతా సెక్స్‌లోనే ఓలలాడినట్టయితే ఆ జాతి నిర్వీర్యమై పోవటానికి ఎంతో కాలం పట్టదు ఇప్పుడు మనముందున్న కాలంలో ఇదే జరిగినట్టు కనబడుతోంది

శృంగారకవులను మినహాయిస్తే ఈ యుగంలో ఉన్నవారెవరు? కవిత్వంతో గరిడీసాములు చేసినవారిలో జారత్వాన్ని సాధించిన గణపవరపు వెంకటకవి, కలకాలం నిలిచే తరంగాల ద్వారా కృష్ణుణ్ణి ఆరాధించిన నారాయణ తీర్థులు, కూచిపూడి భాగవతాలకు పునాది వేసిన సిద్ధేంద్రయోగి, ''అప్పకవీయం'' రాసిన కాకునూరి అప్పకవి, సర్కారు సొమ్ముతో భద్రాద్రి రామాలయం కట్టి, పన్నెండేళ్ళ జైలుశిక్ష అనుభవించిన ''రామదాసు'' కంచెర్ల గోపన్న మొదలైనవారు

కవితాపాటవమూ, ప్రతిభా ప్రభావాలూ బట్టి చూసినట్టయితే ఇప్పటికింకా దృఢంగా నిలిచిన కవులీయుగంలో ఉన్నప్పటికీ, సాహిత్యం దృష్ట్యా చూసినట్టయితే ఇది క్షీణయుగమనే చెప్పాలనిపిస్తుంది

*విశాలాంధ్ర దినపత్రిక, 23-4-1967*

# 18. సమగ్ర ఆంధ్ర సాహిత్యం (12వ సంపుటం)
## కడపటి రాజుల యుగం

ఈ సంపుటం ఆలస్యంగానైనా తృప్తికరంగా వెలువడింది 1670 నుంచి 18వ శతాబ్ది మధ్య దాకా జీవించి రచించిన సుమారు నూట యాభై మంది కవులను గురించి మనం ఈ సంపుటంలో తెలుసుకుంటాం ఈ యుగంలో చాలా మార్పులు వచ్చాయి ముందు యుగాలలో ఆరంభమైన మార్పులు మరింత స్ఫుటమైనట్లు కనబడతాయి ఉదాహరణకు పచన గ్రంథాల రచన ఈ యుగంలో బలంగా కనబడుతుంది రచనలను ఆదరించే వారున్న చోట్ల కూడా దేవుళ్ళకు అంకితాలివ్వటం కనబడుతుంది

ఇంకొక లక్షణం అభినవ తిక్కనలూ, తిక్కయజ్వలూ, అభినవ కాళిదాసులూ వగైరాలు బయలుదేరటం ఇది కూడా ఒక క్షీణదశకు లక్షణమే సంప్రదాయం క్షీణదశకు వచ్చేటప్పుడు నవచైతన్యం జానపద సాహిత్యంలో కలిగినా దాని ప్రభావం సాహిత్యంపైన అంతగా ఉండకపోవచ్చు అటువంటి ప్రభావంతో కవిత్వం చెప్పినవాడు వేమన 'వేద విద్య తెలవేశ్యల వంటివి గుప్త విద్యయొకటి కులకాంత వంటిది'' అన్న వేమన పైకి కనిపించే దానికన్న పెద్ద విప్లవ మార్గమే తొక్కాడేమో చరిత్రలో అనేకరకాల మతాలు ప్రచారమయాయి అవి బలహీనపడినపుడల్లా లోకాయత దృక్పథం ప్రజలలో వ్యాప్తి చెందేటట్లు కనిపిస్తుంది దీనివెంట తాంత్రిక విద్యలూ, ప్రచారాలూ, పూజలూ విజృంభిస్తాయి అటువంటి ధోరణిని వేమన తన పద్యాలలో స్ఫుటంగానే బలపరిచాడు అతను కుల వ్యవస్థనూ, వైదిక ధర్మాన్ని తృణీకరించి యోగవిద్య అభ్యసించాడు అందుకనే ఆయన జీవితాన్ని చాలా వరకు భౌతికవాద దృష్టితో చూడగలిగాడు పుణ్యపాపాలను ఒక్కముక్కలో ''వలసిన పుణ్యంబు, వలదన్న పాపంబు'' అని తేల్చి చెప్పేశాడు

సంధియుగం - సంప్రదాయ సంస్కృతి సన్నగిల్లుతున్నది - సంస్కృతిని ఇచ్చిపుచ్చుకున్న ముసల్మానుల ప్రతిభ కూడా క్షీణించి పాశ్చాత్యుల ప్రభావం పెరుగుతున్నది ఈ మార్పుల ఫలితంగా ''పంచమకారాలు'' - ముఖ్యంగా మద్య, మైథునాలు పెచ్చుమీరి ఉండాలి అందుకే కూచిమంచి తిమ్మయ్య ''రుక్మిణి పరిణయం''లో రుక్మిణి సఖీజనంచేత తప్పతాగించి, మదోద్రేకం ప్రదర్శింపజేశాడు సత్యావోలు భగవంతం కూడా అదే పని చేశాడు

ఈ రకం ''బూతు''కూ, ముద్దుపళని ''రాధికా సాంత్వనం''లో ఉండే పచ్చి శృంగారానికీ మౌలికమైన తేడా ఉన్నదేమోననుకుంటాను ''రాధికా సాంత్వనం''లో సమిష్టి విశృంఖలత్వం లేదేమో

''చంద్రరేఖా విలాపం'' శృంగార ప్రబంధాలకు విరుగుడు కూచిమంచి జగ్గన్న ఈ రచనను ఏ పరిస్థితిలో చేశాడో తెలుసుకునే అవకాశం నాకు ఆరుద్రగారి ద్వారానే కలిగింది ఇది తెలియకపోయినా కూడా ''చంద్రరేఖా విలాసం'' నీచమైన రచనగానే నేను భావిస్తూ వచ్చాను అందులో హాస్యం మచ్చుకైనా లేదు తిట్టుకవిగా జగ్గన్నకూ, తురగా రామకవికీ పోలిక లేదు రామకవి తిట్టినా తన తిట్లను ఉపసంహరించుకున్నాడు ఈ సందర్భంలో ఆరుద్ర గారు ''అద్దిరశ్రీ భూశీలలు'' అన్న పద్యం తిట్టు కింద వుదహరించారు నేను

వినటం ఇది ఉపసంహార పద్యమని మొదట రామకవి 'పెద్దమ్మ నాట్యమాడును దిద్దిమ్మని వత్సవాయి తిమ్మని ఇంటన్'' అని మాత్రమే శపించాడట ''పల్కు దారుణాఖండలమైన మనంబు నవ్యనవనీత సమానం'' కావటం వల్లనో ఏమో తన శాపాన్ని ఉపసంహరించుకుంటూ, ''అద్దిర శ్రీ భూశీలలు ముద్దియలాహరికి గలరు, ముగ్గురందరిలో పెద్దమ్మ'' అంటే శ్రీదేవి నాట్యమాడును దిద్దిమ్మని'' అని పద్యం పూర్తి చేసి వత్సవాయి తిమ్మడికి మనశ్శాంతి చేకూర్చాడట ఇలాటి ఉపసంహరణే ''కాటికిబో నీకేటికి? కేతవరపు పోతరాజ లేమ్మా! రమ్మా!'' అనటంలో కూడా కనిపిస్తుంది

ముద్దుపళని రచించిన ''రాధికా సాంత్వనం'' గురించి ఆరుద్రగారి ఎస్టిమేటు సబబుగా కనబడుతోంది ఆ పుస్తకం యొక్క గొప్పదనాన్ని కొంచెం అధికంగా అంచనా కట్టటం జరిగిందనే చెప్పాలి ముద్దుపళనికి జరిగిన అన్యాయాన్ని కూడా ఆరుద్ర గారు బాగా బయటపెట్టారు

ఈ యుగంలో వచ్చిన అచ్చతెలుగు రచనలను కూడా వెర్రితలలు గానే భావించాలి అచ్చతెలుగు ఏనాడూ ఎవరి వ్యావహారికమూ కాదు పచ్చికృతక భాష దాన్ని అవలంబించటం సాహిత్యప్రియత్వాన్ని గాని, భాషాభిమానాన్ని గాని సూచిస్తుందనుకోవటానికి కారణం కనబడదు అచ్చతెలుగు ఎంత వికారంగా ఉంటుందో చూపటానికి ఆరుద్రగారిచ్చిన ఉదాహరణలు భేషుగ్గా ఉన్నాయి అచ్చతెలుగు రచనలు కేవలం భేషజమేననుకోవటానికి కూచిమంచి తిమ్మయ్యే మంచి ఉదాహరణ ఆయన చేసిన రచనలలో మానవభాషలో రాసినవి కూడా ఉన్నాయి సాహిత్యం విషయంలోలాగే ఆదర్శాల విషయంలో కూడా ఆయనకు ఒక నిలకడ ఉన్నట్టు లేదు భాగవత కథలు రాశాడు, రామాయణం రాశాడు, శైవ కథలు రాశాడు, ఇంకేవో కూడా రాశాడు ఎన్ని రాసినా, అసంపూర్తిగా ఉన్న కుక్కుటేశ్వర శతకం ఒకటే ఆయనకు పేరు తీసుకురాగలదుట!

ఆరుద్ర గారు అనలేదు గాని, ఈ యుగంలో కవుల ''గ్రూపు''లు కనబడతాయి ఒకరి వీపులొకరు గోక్కోవటమూ, ఒకరికొకరు కితాబులివ్వటమూ కనబడుతోంది అదీ ఒక విధంగా మంచిదే - ఒకరినొకరు తూర్పారపట్టటం కన్న ''తిమ్మయ్య అంటే చినలచ్చన్నకు గౌరవం తిమ్మయ్యకు కూడా లచ్చన్న అంటే అభిమానం '' ''సమకాలిక కవులకు తలలో నాలుకలాగ మెలుగుతూ సత్కావ్యాలు వ్రాసిన లచ్చన్న ''

ఈ యుగపు కవులలో ప్రసిద్ధుడు ఆడిదం సూరకవి ఒకరు '' ఆంధ్ర శర్మంబు తెలియంగ ననువుపడునె ప్రకట సంస్కృతించిత సూత్రముల చేత? అవని పాణిని ఘటిత సూత్రార్థసరణి తెలుగు టీకలచేత సాధింపదగునె?'' అని ఎందరో ఛాందసులను మొట్టినందుకు ఈయన అభినందనీయుడు ఇతని గ్రంథాలన్నీ ఒక ఎత్తునీ, రామలింగేశ శతకం ఒక ఎత్తునీ ఆరుద్రగారి అంచనా బాలకవి కొట్రా వెంకటేశ్వర్లూ సూరకవీ కడూ ఒకరినొకరు మెచ్చుకోవటం గమనించదగ్గది

ఈ యుగంలో వచ్చిన రచనలలో ఒక తరగతి కిందికి చేరేది శతకాలు తురకలు పెట్టే ఇక్కట్లను గురించీ, ప్రజల కష్టాలను గురించీ చెప్పుకున్నవి గోగులపాటి కూర్మనాథం రచించిన నారసింహ శతకం ఇటువంటిదే ''శత్రుసంహారవేంకటాచల విహార'' అనే మకుటంతో

ఎవరో రాసిన శతకం కూడా ఇటువంటిదే నిమ్మల లక్ష్మన్నా, బృహత్తటాకం నాగశాస్త్రీ కూడా మ్లేచ్ఛులను నిగ్రహించలేనందుకు దేవుళ్ళను ఆడిపోస్తూ శతకాలు చెప్పారు ఇవి ఆ కాలం నాటి వాస్తవిక రచనలు

అన్ని యుగాలలోలాగే ఈ యుగంలో కూడా రకరకాల రామాయణాలు వచ్చాయి వాల్మీకి రామాయణాన్ని యథాతథంగా అనువదించటం దాదాపు అసాధ్యమైన పని అని నా విశ్వాసం ఇటీవలి కాలంలో శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యుల వారు ఇలాంటి ప్రయత్నం చేసి మానేశారంటే నాకేమీ ఆశ్చర్యం కలగలేదు అయితే ఈ యుగంలో ఘనగిరి (పెనుగొండకు వచ్చిన తిప్పలు) రామయ్య ''యథా వాల్మీకం'' అనే నిర్వచన రచన చేశాడట కిష్కింధాకాండ దాకా లభ్యమవుతున్న ఈ రచన ఎట్లా ఉన్నదీ ఆరుద్రగారు చెప్పలేదు ఇది ఎంతవరకు యథా వాల్మీకమో తెలిస్తే బాగుండును!

*విశాలాంధ్ర, 29-3-1968*

# 19. మనమూ, మన దేహ స్థితి – 3
# ఔషధకాండ (మొదటి భాగం)

పద్దెనిమిదేళ్ళ క్రితం మా అమ్మాయి నెలలపిల్ల అయి వుండగా చిన్న జబ్బు చేసింది పిల్లల వైద్యంలో నిపుణుడైన ఒక డాక్టరుకు చూపించాం ఆయన పిల్లను పరీక్షించి ఏదో మందులు రాసి ఇచ్చాడు బయలుదేరబోతూ నేను డాక్టరుగారితో '' ఈ జబ్బు శరీరానికి సంబంధించినదా, లేక శరీరధర్మానికి సంబంధించినదాండీ?'' అని అడిగాను వెంటనే డాక్టరుగారు, '' ఈ విషయాలు నీకు కొంత తెలుసల్లే ఉందే'' అని పిల్ల శరీరపరీక్ష మళ్ళీ చేసి చిన్న ఆపరేషను చేసేశాడు దాంతో చిక్కు విడిపోయింది ఆయన రాసి ఇచ్చిన మందులు అవసరం లేకపోయింది

ఈ సంగతి ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, చికిత్స చేయించుకునే వాళ్ళ సహకారం వైద్యానికి అవసరం అవుతుందన్నది చాలామంది గుర్తించారు డాక్టరుగా పేరున్నవాడు రోజూ అనేకమంది రోగులను చూస్తాడు(ఖ్యాతి లేని డాక్టరు దగ్గిరకి ఎవరూ వెళ్ళరుగదా!) అలాటి పరిస్థితిలో రోగి డాక్టరుకు తన వ్యాధి స్థితిని గురించి ఎంతకొద్దిలో ఎంత వివరంగా చెప్పగలిగితే డాక్టరుకు అంత ఉపయోగం, రోగికి అంత లాభం అనేకమంది రోగులు డాక్టరుకు సహాయం చెయ్యకపోగా, తప్పుదారి పట్టించిన సందర్భాలు కూడా నాకు తెలుసు

ప్రజారోగ్యానికి వనరులు పుష్కలంగా ఏర్పడి అనేక మరణవ్యాధులకు మందులు పుట్టుకొస్తున్న ఈ కాలంలో శరీర సంబంధమైన వ్యాధి సంబంధమైన ప్రాథమిక విజ్ఞానం ప్రజలలో లేకపోవటం శోచనీయం చట్టం తెలియదన్నంత మాత్రాన నేరస్తుడు తప్పించుకోలేడంటారు కాని నేరాలు చేసి తప్పించుకోవటం సాధ్యమే తెలివైన లాయర్లు రోజూ అనేకమంది నేరస్తులకు శిక్ష పడకుండా దాటిస్తూనే ఉన్నారు కాని ''అజ్ఞానం'' ఏ వ్యక్తినీ అనారోగ్యం నుంచి కాపాడలేదు ఎంతటి డాక్టరైనా రోగానికి చికిత్స చేయగలడేగాని

రోగం రాకుండా చెయ్యలేడు, ఎందుచేతనంటే మనం తెలియక శరీరధర్మాలకు ద్రోహం చేసినప్పుడు వ్యాధి కలగకముందే వైద్యుడి దగ్గిరకి వెళ్ళాలని తట్టదు నేరానికీ, శిక్షకూ మధ్యలో లాయరు చక్రం అడ్డెయ్యవచ్చు కాని వ్యాధి కారణాలకూ, వ్యాధికీ మధ్య వైద్యుడు చక్రం అడ్డెయ్యటం సామాన్యంగా జరగదు

అందుచేత జనబాహుళ్యంలో ఆరోగ్యానికి సంబంధించిన విజ్ఞానం వ్యాపించినట్టయితే ప్రజల ''ప్రవర్తన''లోనే ఆరోగ్యకరమైన మార్పు వస్తుంది అసమగ్రమైన ఆహారం తినటమూ, రోగక్రిముల నుంచి తమను తాము రక్షించుకోలేక పోవటమూ, టీకాలు, ఇనాక్యులేషనులూ మొదలైన వ్యాధి నిరోధకాలను గురించి అలక్ష్యంగా ఉండటమూ, ఇలాంటివి అజ్ఞానం వల్లనే జరుగుతాయి

ఆరోగ్యం అవసరం లేని వాడుండడు శరీర మాద్యం ఖలు ధర్మసాధనం శరీరం సరి అయిన స్థితిలో ఉంటేనే మనిషికి సంపూర్ణమైన దైహిక, మానసిక జీవితం సాధ్యమవుతుంది కాని శరీరానికి సంబంధించిన విజ్ఞానం ''విదేశీ'' సరుకుగానే ఉంటూ వస్తున్నది అది ఇంగ్లీషు రాని వారికీ, వందలకొద్దీ రూపాయలు ఖర్చు చెయ్యలేనివారికీ అందుబాటులో ఉండటం లేదు ఒక్క హోమియోపతి వైద్యానికి సంబంధించిన విజ్ఞానమే పుష్కలంగా తెలుగులోకి వచ్చింది దాని మూలంగా అనేకమంది ఆడవాళ్ళు సైతం తమకూ, తమవారికీ హోమియోమందులతో చికిత్సలు చేసుకోగలుగుతున్నారు

అయితే హోమియో వైద్యానికి కూడా శరీర నిర్మాణం గురించీ, శరీర ధర్మాలను గురించీ, వ్యాధి కారణాలను గురించీ తెలిసితీరాలి ఈ విజ్ఞానం అన్ని రకాల వైద్యశాస్త్రాలకూ ఒకటే అందుచేతనే రష్యాలో హోమియో వైద్య సిద్ధాంతాన్ని మామూలు వైద్య కళాశాలలోనే బోధిస్తున్నారు ఒకప్పుడు హోమియో వైద్యులు వ్యాధి లక్షణాలు తెలిస్తే చాలుననీ, రోగాలకు ఎలోపతి వైద్యులు పెట్టే పేర్లకు అర్థమే లేదనీ వాదించే వారు, కాని ఈనాడు ఈ విశ్వాసం అంతగా లేదు, రోగికి జ్వరంగా ఉంటే అది మామూలు జ్వరమైనదీ, న్యుమోనియా జ్వరమైనదీ స్పష్టంగా తెలుసుకోవటం హోమియో వైద్యుడికైనా అవసరమే అదీగాక ఈనాడు కొన్ని వ్యాధులకు స్పెసిఫిక్‌గా కొన్ని ఆంటీ బయోటిక్కులున్నాయి వీటి వాడకాన్ని హోమియో వైద్యులామోదిస్తున్నారు అలాటి పరిస్థితిలో రోగస్వభావం సూక్ష్మంగా తెలియటం చాలా అవసరం

వైద్య సంబంధమైన విజ్ఞానాన్ని తెలుగులోకి అనువదించి, చౌకగా అందరికీ లభ్యం చెయ్యటానికి గాను డాక్టర్ గాలి బాలసుందరరావుగారు ప్రారంభించిన కృషి అపూర్వమూ, అద్భుతమూ అయినది ప్రభుత్వమూ, అకాడమీలు, మేధావులూ, సాధారణ ప్రజలూ శాయశక్తులా సహకరించదగినది ఆయన కృషి చచ్చు డిటెక్టివ్ పుస్తకాలు అచ్చు వేసే పుస్తక ప్రచురణకర్త స్థితిలో డాక్టరు బాలసుందరరావుగారు ఉండిపోవలసి వచ్చే పక్షంలో అది తెలుగుదేశానికే తీరని అవమానం అవుతుంది

డాక్టరుగారిప్పటికి మూడు పుస్తకాలు ప్రచురించారు శరీర ధర్మకాండ, రోగకాండ, ఇప్పుడు బయటకు వచ్చిన ఔషధకాండ ప్రథమ భాగమూనూ, ఔషధకాండ రెండవ భాగం రాబోతున్నది

ఈనాడివి అక్షరాస్యులందరికి మంచి రిఫరెన్సు పుస్తకాలు వీటిని బుర్రకు పట్టించుకోవటానికి చాలాసార్లు చదవాలి అందరూ అలా వీటిని అధ్యయనం చెయ్యనవసరం ఉండదు సంవత్సరానికొకసారి చదివినా విషయం స్థూలంగా బోధపడుతుంది ఆ తరువాత ఏ వివరాలన్నా తెలుసుకోవాలంటే పుస్తకం తిరగేసి చూసుకోవచ్చు దీర్ఘవ్యాధులతో తీసుకుని చికిత్సలు చేయించుకున్న వారే సగం వైద్యులవుతారు అలాటప్పుడు ఈ పుస్తకాలు చదివిన వారు సొంతంగా వైద్యం చేసుకోలేకపోయినా డాక్టర్లకు తమ రోగం గురించి చెప్పటంలో నిపుణులవుతారు

అంతకన్న కూడా హెచ్చుగా ఈ పుస్తకాల వల్ల మరొక ప్రయోజనం ఉన్నది పరిస్థితులు ఇలాగే ఉండవు వైద్య విద్య తెలుగు తెలిసినవారందరికీ అందుబాటులోకి వచ్చే రోజు వస్తుంది కాంపోజిట్ మాథమెటిక్స్‌లో నూటికి 90 మార్కులు వచ్చాయా, షేక్స్పియర్ నాటకాలు కంఠస్థం చేశాడా లేడా అనేది చూడకుండానే విద్యార్థులకు వైద్య కళాశాలల్లో సీట్లిస్తారు అప్పుడు ఈ పుస్తకాలు పాఠ్య గ్రంథాలుగా పనికివస్తాయి ఈ పుస్తకాలు పాఠ్య పుస్తకాలుగా చదివినంతమాత్రంచేత విద్యార్థి పదజాలం విషయంలో దెబ్బ తినడు ఎందుకంటే ఇందులో అంతర్జాతీయ వైద్య పారిభాషిక పదాలన్నీ వున్నాయి ఇది డాక్టరుగారు చేసిన గొప్ప పనులలో ఒకటి

డాక్టరు గాలి బాలసుందరరావుగారీ పుస్తకాలను రాయటం యాదృచ్ఛికం కాదు నాకు తెలిసిన డాక్టర్లలో రెండు రకాల వాళ్ళున్నారు ఒక రకం వాళ్ళు రోగిని పరీక్షించి ఒక స్లిప్ మీద ఏవో సంకేతాలు రాసి, తమ కాంపౌండరు దగ్గిరకి పంపేవాళ్ళు రెండోరకం వాళ్ళు అత్యల్ప సంఖ్యాకులు రోగితో అతని వ్యాధి గురించీ, దాని లక్షణాలను గురించీ, కారణాలను గురించీ, చికిత్సను గురించీ చర్చించి, వాళ్ళకు వీలయినంత విజ్ఞానం కలిగిస్తారు ఆ రోగి తిరిగి అదే రోగంతో తమ వద్దకు రాకుండా ఉండటానికి వీలయిన మార్గాలన్నీ చెబుతారు వీళ్ళు డబ్బు గడించరు గాని వీళ్ళ పేషెంట్లు ఇంకో డాక్టరు దగ్గిరకు వెళ్ళలేరు డాక్టరు బాలసుందరరావుగారు ఈ రెండో రకానికి చెందిన వైద్యుడు అచ్చుగా తన పేషెంట్లకే వైద్య విజ్ఞానం అందించటంతో తృప్తి కలగక ఆయన తెలుగు వారందరికీ ఈ విజ్ఞానం అందించపూనుకున్నట్టు నా బుద్ధికి తోస్తుంది దాన్ని అందుకునే భారం తెలుగువాళ్ళది

*విశాలాంధ్ర, దినపత్రిక, 6-3-1966*

# 20. జీవశాస్త్ర విజ్ఞానం

మన ప్రాచీనులకు - కనీసం మన పురాణాలు రాసిన వారికి - జీవశాస్త్రం గురించి గాని, దానికి సంబంధించిన జననశాస్త్రం(జెనెటిక్స్) మొదలైన శాస్త్రాలను గురించిగాని ఏమీ తెలిసినట్టు కనబడదు మానవవీర్యాన్ని రెల్లులోనో, కుండలోనో, అగ్నిలోనో పెట్టటమూ, లేక ఏ చేపో మింగటమూ, ఆ విధంగా మనుషులు పుట్టటమూ పురాణాలలో చెప్పి ఉన్నది అలాగే బైబిలులో సృష్టిని గురించి చెప్పినది పరిణామవాదదృష్ట్యా పచ్చి అబద్ధం కాని దాన్ని నమ్మేవాళ్లు

ప్రపంచంలో ఇంకా ఉన్నారు అదేవిధంగా యేసుక్రీస్తు కన్యకు జన్మించాడని కూడా నమ్మేవారున్నారు మన పురాణాలలో గల దశావతారాలలో పరిణామవాదం ఉన్నదని ''అన్నా వసంతమ్మ'' గారు చూపారే గాని, మన పూర్వీకులకు పరిణామవాదం తెలుసుకొనటానికి ఇతర ఆధారాలున్నట్టు కనబడదు

అనుభవాన్ని బట్టి మానవుడు అనేక విషయాలు నేర్చుకున్నాడు రక్తసాన్నిహిత్యం గల వారు సంతానం కనటం వల్ల జాతి క్షీణిస్తుందని మన పూర్వులు ఏనాడో కనిపెట్టి గోత్రాలు ఏర్పాటు చేసి, సగోత్ర వివాహాలు నిషేధించారు కాని జననశాస్త్రం తెలిసి చేసిన ఏర్పాటు కానందున మనకు మేనరికాలు వచ్చిపడ్డాయి ఆడపిల్లలను బావలకూ, మామలకూ ఇవ్వటం ఈనాడు కూడా ఆచారంగా ఉన్నది ముస్లిములు అన్నదమ్ముల బిడ్డలకు పెళ్లిళ్లు చేస్తారని ఆక్షేపించే అధికారం మనకు లేదు జననశాస్త్రంబట్టి రెండూ అవాంఛనీయమైన ఆచారాలే!

ఒక్కొక్క మిథునానికి ఆడపిల్లలు తప్ప మగపిల్లలు పుట్టరు మరికొందరికి మగపిల్లలే పుడతారు ఈ పుస్తకం చదివితే అందుకు కారణం తెలుస్తుంది మగపిల్లల కోసం పూజలూ, మొక్కులూ చేసేవారు వృథాశ్రమ పడుతూ ఉండవచ్చు

మనిషియొక్క సుఖజీవనానికి జనన సంబంధమైన అంశాలు ఎంత ముఖ్యమో, వాతావరణం కూడా అంత ముఖ్యమే వాతావరణంలో కాలక్రమాన ఏర్పడిన మార్పులకు తట్టుకోలేక అసంఖ్యాకమైన జీవరాసులు కాలప్రవాహంలో అంతరించి, ఫాసిల్ రూపాలలో భూగర్భంలో మనకీనాడు ప్రత్యక్షమవుతున్నాయి వాటిలో ట్రైలొబైట్లూ, రాక్షసిబల్లులూ, కోరపులులూ, జూలు ఏనుగులూ మొదలైనవి ఎన్నో ఉన్నాయి

జీవి పరిణామం మానవుడి వద్ద నిలిచిపోయిందనీ, మానవుడు సాంఘిక పరిణామం ప్రారంభించాడనీ శాస్త్రవేత్తలు చెబుతున్నారు నిజానికి తన వాతావరణాన్ని మార్చుకునే సామర్థ్యం మనిషికి ఒక్కడికే ఉన్నది మరి ఏ జంతువుకూ లేదు అయినా మానవుడు తన వాతావరణంలో అనుకూలమైన మార్పులు జరగనిస్తున్నాడు నగరాలలో ఫ్యాక్టరీపొగ ఇందుకొక ఉదాహరణ, అన్ని ఫ్యాక్టరీలూ విద్యుచ్ఛక్తితో నడిచిన నాడు నగర వాతావరణం బాగుపడుతుంది కలపకోసం అరణ్యాలు ధ్వంసం చేసి ఎడారులను పెంచటం మరొక తెలివితక్కువ పని ఇది కూడా అడవుల పెంపకంతో చక్కబడగలదు

పోతే, అన్నిటికన్న బుద్ధితక్కువ పని పరమాణుశక్తిని దురుపయోగపరచటం రేడియేషన్ వల్ల మానవ రేతస్సులోని జీన్‌లలో మ్యుటేషన్ జరిగి, కళ్లులేని బిడ్డలూ, ఇతరమైన భయంకరాకారాలు గల బిడ్డలూ పుడుతున్నారు ప్రపంచం ''అణు'' యుద్ధానికి గురి అయిననాడు పది పదిహేనువేల ఏళ్ల సాంఘిక పరిణామం కాస్తా అంతమై, మనిషి కూడా ట్రైలొబైట్‌లు వెళ్లినదారిన వెళ్లగల అవకాశం ఏర్పడవచ్చు

ఈ పుస్తకంలో జీవశాస్త్ర సంబంధమైన అనేక వైజ్ఞానిక విషయాలు అందరికీ అర్థమయేలాగా చర్చించబడ్డాయి సంప్రాప్తగుణాలు(అక్వయర్డ్ కారెక్టర్) సంక్రమిస్తాయన్న వాదాన్ని ఈ పుస్తకం ఖండిస్తుంది మ్యుటేషన్ ద్వారా మాత్రమే ప్రాణిపరిణామం జరుగుతుందని ఈ పుస్తకం చెబుతుంది ఇది నిజమైనా కాకపోయినా సంచిత (ఇన్‌హెరిటెడ్) లక్షణాలలో

మార్పు కలగటం ద్వారా మాత్రమే పరిణామం సాధ్యమవుతుందనటానికి అభ్యంతరం ఉండదు మ్యుటేషన్‌లు(జీన్‌లలో కలిగే భౌతికమైన మార్పులు) ఎందుకు కలుగుతాయో స్పష్టంగా తెలిసేదాకా ఎటూ చెప్పటానికి వీలుండదు

అనువాదంలో వాడిన కొన్ని పారిభాషికపదాలు వాడుకలో ఉన్నవాటికి కాస్త భిన్నంగా ఉన్నాయి పరభృతం అన్నదానికి పరాన్నభుక్కు అనీ, సస్తన జంతువు అనటానికి స్తనజంతువు అనీ, జననేంద్రియాలను సంతానావయవాలనీ(కొన్ని చోట్ల మాత్రమే) ఉన్నది అయితే ప్రామాణికమైన పరిభాష ఏర్పడిన దాకా ఎవరికి సరిగా తోచిన పదజాలాన్ని వారు వాడకతప్పదు ''క్రోమోజోమ్'', ''జీన్'', ''మ్యుటేషన్'' లాటి మాటలను తెలుగులో కూడా వాడుకోవచ్చుననుకుంటాను

ఈ రచన వాడుకభాషలోసాగి ఉంటే చదవటానికి ఇంకా తేలికగా ఉండేదేమో అయినప్పటికీ అనువాదం చాలా సమర్థతో కూడి ఉన్నది దక్షిణ భాషా పుస్తక సంస్థ వారి ఆధ్వర్యాన వెలువడిన మంచి వైజ్ఞానిక గ్రంధాలలో ఒకటి ఇందులో సవరణ చేసి తీరవలిసిన తప్పులు కొన్ని ఉన్నాయి ''వంశవృక్షమును ఆరోహించును'' అనటానికి '' ఆరోపించును'' అన్నది పెద్ద తప్పే అవుతుంది

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 13-9-1967*

# 21. ప్రాచీన దాంపత్య సుఖము

ఇందులోని విషయమూ, దీన్ని రచించిన విధానమూ కూడా(భాషతోపాటు) ప్రాచీనంగానే ఉన్నాయి ప్రాచీన గ్రంధకర్తలు తమకు కలలో ఏ దేవుడో కనపడి పుస్తక రచన చేయమని ప్రోత్సహించినట్టు చెప్పుకునే వారు ఈ పుస్తకమంతా కలే ఇందులో గాంధీజీ, శ్రీరామచంద్రుడూ, ఆయనకాలపు మహామునులూ, శ్రీజ్యోతి రామలింగస్వాముల వారూ కనిపిస్తారు విషయం ఏమిటంటే మంచి బిడ్డలూ, మగబిడ్డలూ, ఆడబిడ్డలూ, వికలాంగులు కాని బిడ్డలూ కలగటానికి స్త్రీ పురుషులు ఎలా, ఎప్పుడు సంభోగించాలన్నది! ఇదే రామరాజ్యానికి పునాది!

దాంపత్యసుఖం గురించి గర్భోపనిషత్తు ఏం చెప్పిందో, మనువు ఏం చెప్పాడో, శాండిల్యుడూ, వసిష్ఠుడూ మొదలైన మహర్షులు ఏం చెప్పారో శ్లోకాలతో సహా ఈ పుస్తకంలో ఉన్నది

ప్రాచీనులు చెప్పినదంతా తప్పని కొట్టెయ్యటం ఈ రోజుల్లో ఫాషను కాదు కాని ప్రాచీనులు చెప్పినదంతా పరమసత్యం అనేవారు ఒకటి రెండు విషయాలు గమనించటం అవసరంగా కనబడుతుంది

ముఖ్యమైన సంగతేమంటే, సమాజం కేవలమూ జ్ఞానంతోనే నడవటం లేదు విజ్ఞానం కన్నా బలవత్తరమైన ఆచారాలూ, పరిస్థితులూ సమాజాన్ని నడిపిస్తున్నాయి ఈ సంగతి మన పూర్వీకులే గుర్తించారు ఉదాహరణకు, సపిండ వివాహాలను మనుస్మృతి, ఆడదాని వైపున

ఏడు తరాలదాకానూ, మగవాడి తరఫున అయిదు తరాల దాకానూ నిషేధించింది కాని ఆంధ్రదేశంలో ఆనవాయితీగా వచ్చే మేనరికాలను ఆపగలిగారా? ఎవరితరమూ కాలేదు మహామునులే తమ వల్ల కాదని ఒప్పుకుని దణ్ణం పెట్టేశారు శ్రీమాన్ పద్మనాభమ్ గారు మేనరికాలను గురించి మనుస్మృతి ఏమన్నదీ చెప్పారుకారు, కాని మేనగోడళ్లను పెళ్లాడటాన్ని ఖండించారు మేనమామలు మేనగోడళ్లను చేసుకోకుండా ఈ పుస్తకం ఆపగలుగుతుందా? ఆపలేదు

ఇందులో కుటుంబ నియంత్రణ గురించి కూడా ఉన్నట్టు పుస్తకం పేరులో ఉన్నది కాని ఆ మాట పూర్తిగా నిజంకాదు ప్రభుత్వం తాపత్రయపడుతున్న కుటుంబ నియంత్రణం గురించి ఈ పుస్తకంలో ఉన్న మాటలు ''డాక్టర్లకు డబ్బిచ్చి నిర్బంధపరచి మన ప్రభుత్వము దంపతులను భర్తు కంట్రోలు(గర్భనిరోధము) చేయించుచున్నది ఇట్లొనర్చు కొన్నవారు కొందరు బిడ్డలను కనుచున్నారు కొందరు నపుంసకత్వమొందుచున్నారు కొందరికి పుట్టిన బిడ్డలు గతించిన పిదప మరల బిడ్డలు కావలెనన్న ప్రసవించుకొనుటకు వీలులేకయున్నారు '' (శకటరేఫలను వదిలేసిన పాపం నాదే )

పిల్లలు కలగకుండా ఉండటానికి ఈ పుస్తకంలో చేసిన ప్రధాన సూచన సేఫ్ పీరియడ్‌కు సంబంధించినది - స్త్రీ ముట్టయిన ''పదునేడవ రోజు మొదలు ముప్పది రోజులు వరకుండు కాలము''లో సంభోగించడం

''యదిహిస్త్రీ న రోచేత పుమాంసం ప్రమోదయేత్, అప్రమోదాత్పువః పుంసః ప్రజనం న ప్రవర్తతే'' అన్నారు గనక, భార్యాభర్తల మధ్య విముఖత్వం కూడా కుటుంబ నియంత్రణ సాధానాలలో ఒకటి అనుకోవచ్చునేమో

మిగిలిన విషయాలన్నీ అటుంచి, ఈ పుస్తకం చదువుతుంటే జుగుప్స కలుగుతుంది

''చాలుననినయపుడు బిడ్డలను గనక రతి సుఖమును లోటు లేక యనుభవించుచు వచ్చు విజ్ఞానమును బోధించెదము'' అని ఋశ్యశృంగుడు రాముడితో అంటాడు

వసిష్ఠుడు దశరథుడితో, ''రాజా ముట్టయిన దినమునుండి పంద్రెండువ, పదునాల్గవ, పదునారవదిన రాత్రులయందు ఏ రాత్రి శుభదాయకమో ఆ రాతి యందు ఆమెతో (కౌసల్యాదేవితో) సంభోగింపుము'' అంటాడు

''దశరథ చక్రవర్తి నాటక ప్రదర్శనము వలన మనకు సంభోగ విజ్ఞానము చక్కగా గోచరించెను'' అని జ్యోతి రామలింగస్వామి మహాత్మాగాంధీతో అంటాడు

'' ఇట్టి భర్తు కంట్రోలు చేసికొనుట కంటె ఈ రామరాజ్య సంభోగ నియమముల నమ్మి వానిని ఆచారమునకుకొని వచ్చినచో అత్యధిక సుఖము కలుగును'' అని గ్రంథకర్త పాఠకుడితో అంటున్నారు

ఇదంతా చాలా అసహ్యంగా ఉంది

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 27-12-1967*

# 22. సోవియట్ శాస్త్ర పరిశోధనలు

ప్రపంచంలో అన్ని దేశాలూ ఈనాడు శాస్త్ర విజ్ఞానం ఆధారంతోనే పురోగమిస్తున్నప్పటికీ, ఈ విజ్ఞానం జనసామాన్యానికి దగ్గిరగా రావటం సోషలిస్టు దేశాలలో జరిగినట్టుగా పెట్టుబడిదారీ వ్యవస్థ గల దేశాలలో జరగలేదు ''సోవియెట్ నవలల్లో ఉండే సాంకేతిక విషయాలలోపదోవంతు ఇంగ్లీషు నవలల్లో ఉంటేవే వాటినెవరూ చదవరు'' అని ఒక ఇంగ్లీషు విమర్శకుడన్నాడు పెట్టుబడిదారి అమలులో ఉండే దేశాలలో శాస్త్ర విజ్ఞానం జీవితానికి ఎడంగా ఉన్నట్టు చూడబడుతుంది కళలకూ, శాస్త్రాలకూ ఏదో వైషమ్యం ఉన్నట్టు ప్రచారం జరుగుతుంది వ్యక్తియొక్క ఆరోగ్యానందాలకూ, సంస్కృతి నాగరికతలకూ శాస్త్ర జ్ఞానం చేసే దోహదం గోప్యంగా ఉంచబడుతుంది సాంకేతిక పరిజ్ఞానం ప్రజలలో చాలా హెచ్చుగా ఉండే అమెరికాలో సైతం శాస్త్ర విజ్ఞానానికి గొప్పగా ఆదరం ఉన్నట్టు కనబడదు

మన దేశంలో సోవియట్ వార్తాసంస్థ వారు నిత్యమూ ప్రచురించే బులెటిన్లలో వైజ్ఞానిక విషయాలు అసంఖ్యాకంగా ఉంటాయి అచ్చుగా ఆ బులెటిన్లు మాత్రమే చదివి మామూలు మనుషులు అనేక వైజ్ఞానిక విషయాలు తెలుసుకోవచ్చు ఈ పుస్తకంలో అలాంటి బులెటిన్లు 74 వివిధ శీర్షికల కింద సంకలనం చేయబడి ఉన్నాయి

అయితే ఇవి శాస్త్ర గ్రంథాల స్థానాన్ని ఆక్రమించలేవు వీటిలో కొన్ని వైజ్ఞానిక వార్తలలాగుంటాయి ఉదాహరణకు ''తోకచుక్కలు పరిశీలన దేనికి ఉపయోగపడుతుంది?'' అన్న వ్యాసంలో ఇలా ఉంది ''1965 చివరిభాగంలో 'యెకియా-సాకీ' తోకచుక్క సూర్యునికి దగ్గిరగా ప్రయాణించినప్పుడు చాలా ఆసక్తిదాయకమైన విషయాలు తెలిశాయి వాటి నుంచి శాస్త్రజ్ఞులు కొన్ని ముఖ్యమైన నిర్ణయాలకు వచ్చారు '' ఆ ఆసక్తిదాయకమైన విషయాలేవో, ముఖ్యమైన నిర్ణయాలేవో మనకు తెలియదు

ముఖ్యంగా వైజ్ఞానిక వార్తలలో కొన్ని సరికొత్త సిద్ధాంతాలు మనకు తెలియవస్తాయి ఆ సిద్ధాంతాలు నిలవచ్చు, నిలవకపోవచ్చు ఉదాహరణకు, తోకచుక్కలను గురించే బరీస్ కన్స్టాంటినోవ్ అనే శాస్త్రవేత్త ఒక సరికొత్త సిద్ధాంతం ప్రతిపాదిస్తున్నాడు - అనేక తోకచుక్కలలో ''ఆంటీమేటర్'' ఉన్నదని ఇది నిజమో, కాదో తేల్చుకోవటానికి ప్రయోగాలు జరుగుతున్నాయి వార్తగా దీనికుండే ప్రాముఖ్యం విజ్ఞానంగా ఉండదు

''మండే తారల రహస్యం'' కూడా ఇలాటిదే కావచ్చు

అయినప్పటికీ ఇటువంటి పుస్తకానికి విలువ ఉండనే ఉన్నది ఎందుచేతనంటే ఈ వ్యాసాలలో వార్తలతో బాటు నికరమైన జ్ఞానం కూడా ఉన్నది

ఈ పుస్తకంలో వున్న ఒక పెద్ద లోపం, తెలుగులో ఈనాడు వెలువడే వైజ్ఞానిక గ్రంథాలన్నింటిలోనూ ఉంటున్నదే తప్పులు ఒక్క పేజీలోనే గ్రానైట్ అనే మాట ''గ్రానేటైట్'', ''గ్రాన్టైట్'' అన్న రూపాంతరాలలో అచ్చయింది భూగోళపు అంతర్భాగానికి చెందిన వ్యాసం (74వ పేజీలో) గట్టి పార అనటానికి ''గడ్డిపార'' అని ఉన్నది గలాక్సీ అన్న పదం ''నక్షత్రవీధి''గా అనువదించబడింది

ఇతర దేశాల నుంచి మనం వైజ్ఞానిక ప్రచురణలను తీసుకురావటమన్నది నేర్చుకోవటం బాగానే ఉన్నది గాని, వారిలాగా ఈ ప్రచురణలను నిర్దుష్టంగా తీసుకురావటం ఇంకా నేర్చుకోవలసి ఉన్నది

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 3-1-1968*

# 23. ఒకే ఇతివృత్తం – నాలుగు రచనలు

కథ పేరు వాడిన మల్లెలు

ఇతివృత్తం మూర్తి అనే అతను ఒక హోటలుగదిలో దిగి అందులో ఎవరో వదిలిపెట్టిన మల్లెపూలు చూస్తాడు క్రితం రాత్రి ఎవరో స్త్రీ ఆ గదిలో ఉండిన పెద్దమనిషితో గడిపిందనీ, ఆ పెద్దమనిషి ఆ తమ్ముడికి ఉద్యోగం ఇస్తానని మాట ఇచ్చి మాట నిలబెట్టుకోకుండానే వెళ్ళిపోయాడని తెలుసుకుంటాడు

ఈ ఇతివృత్తం ఆధారంగా రచించిన తొలి కథలో పొదుపు చాలా ఉన్నది ఇందులో మూర్తి అన్నవాడు కథలు రాసేవాడు అతను క్రితం రాత్రి రైల్లో ప్రయాణం చేసి వచ్చాడన్న సంగతి కూడా మనకు సందర్భవశాన మాత్రమే తెలుస్తుంది

సరళ వంచితురాలైంది కానీ దాన్ని గురించి కూడా మూర్తి పట్టించుకోడు అతనికి కథ కావలసిన పాయింటు దొరికింది రామగోపాల్(సరళ తమ్ముడు) వచ్చినప్పుడు మూర్తి మల్లెపూల ఇన్స్పిరేషన్‌తో మంచి శృంగార రసపూరితమైన కథ రాసే మూడ్‌లో ఉన్నాడు రామగోపాల్ ఆ మూడ్ కాస్తా చెడగొట్టాడు వాస్తవ జీవితం అతనికి కటువైన కథకు ఇతివృత్తాన్ని అందించింది ఇందులో చక్కని పాయింటు ఉన్నదనుకుంటాను

కాని రచనలో శిల్పసంబంధమైన లోపాలున్నాయి మూర్తి రాత్రి ప్రయాణం చేసి హోటల్ గదికి ఎందుకు వచ్చాడు? అతను డ్రెస్ చేసుకుని ఏం పని మీద బయటికి హోటల్ గదికి ఎందుకు వచ్చాడు? అతను డ్రెస్ చేసుకుని ఏం పని మీద బయటికి పోబోతుంటే వర్షం ఆటంకపరిచింది? రాంగోపాల్ వచ్చినప్పుడు, కథకుడుగా తనను చూడటాని ఎవరో వచ్చి ఉంటారని మూర్తి ఏ ఆధారంతో అనుకున్నాడు? ఈ ప్రశ్నలకు సమాధానాలేవీ మనకు తెలియవు

★ ★ ★

రెండో కథకు మూర్తి కథకుడు కాదు ప్రేమికుడు అతనిది రైలు ప్రేమే కావచ్చు గాక, కాని అది అతని నరనరానా ఎక్కిపోయింది ఆ ప్రేమావేశంలో అతను టాక్సీవాడికి పది రూపాయలు పారేసి చిల్లర( ఆరు రూపాయలు) ఉంచేసుకుంటాడు అతని కళ్ళకి హోటలూ, హోటలు గది, ప్రకృతీ - సమస్తంలోనూ సౌందర్యం కనిపిస్తుంది ఊరే అందంగా కనిపిస్తుంది హోటల్ యజమానే గొప్ప సౌందర్య పిపాసి అనిపిస్తాడు ప్రేమికుడికీ ఉన్మాదికీ అట్టే తేడా లేదని కాబోలు మూర్తి హోటలు బాయికి అయిదు రూపాయలు నోటిచ్చి, అందులోనే ఆ కుర్రాణ్ణి కూడా టిఫిను తినమంటాడు హోటలు కుర్రాళ్ళు హోటళ్ళు డబ్బులిచ్చి టిఫిన్ తినేట్టు!

మల్లెపూలు అతని వెర్రిని మరింత చేస్తాయి వాటిని మూర్తి తెగవాసన చూస్తాడు స్నానం చేస్తున్నంతసేపూ - తన రైలు ప్రేయసి నీలిమను గురించే ఆలోచిస్తాడు చివరకు నీలిమ తలాతోకా లేని టెలిగ్రాం ఇవ్వటానికి కూడా తయారవుతాడు

మొదటి కథలో చాలా టూకీగా ప్రస్తావించబడిన మూర్తి యొక్క ''మూడ్'' ఇందులో చాలా ప్రాముఖ్యం వహించింది సగం కథ ఈ మూడ్ చుట్టూ అల్లబడటం గమనించింది

ఈ మూడ్ సరళ ఉదంతం భగ్నం చేసేస్తుంది

తీరా బోయ్ టెలిగ్రాం ఫాం తెచ్చినప్పుడు మూర్తి తనకది అవసరం లేదని గ్రహిస్తాడు ఎందుచేతనంటే, తాను మొదట మళ్ళీమళ్ళీ వాసన చూసి తన్మయత్వం చెందిన మల్లెపూల దండ ఇప్పుడతనికేసి ''బాధగా, చేదుగా, కసిగా'' చూస్తున్నది

సరళకు జరిగిన అన్యాయం గురించి ఈ మూర్తి నిర్లప్తుడు కాడు



రెండో కథలో మూర్తిలాగే ఇందులోని మూర్తి కూడా ఫస్ట్‌క్లాసులో ప్రయాణం చేసి వచ్చాడు అయినా దుమ్ముకొట్టుకొని నీరసపడి హోటల్‌కు వచ్చాడు ఇతనికి కూడా ఒక ప్రణయం ఉంది, కాని అది సన్నిహిత ప్రణయం కాదు దూరపు ప్రణయం - కనీసం మధురస్వప్నం లాంటి పరిచయం - లలిత

అతనికి సిగరెట్టు మూలంగా లలిత జ్ఞాపకం వస్తుంది లలిత సిగరెట్టు వాసన భరించలేదు ఇతనికి సిగరెట్లు చాలా తృప్తి అందుచేత అతను లలితను గురించి ఎంత తియ్యని ఆలోచనలు చేసినా, ఆ ఆలోచనలు సిగరెట్టు పొగలాగా చేతికి అందకుండా పోయేవే అందుచేత అతని మూడ్ అంత బలమైనది కావటానికి అవకాశం లేదు

అందుచేతనేనేమో కథకుడు మల్లెపూల ద్వారా లలితకు కొత్త అనుబంధం సృష్టించవలసి వచ్చింది లలిత మల్లెపూలలాగ వుండేది లలితా వాళ్ళ దొడ్లో మల్లి విరగపూసేది, వగైరా

మొత్తంమీద ఈ కథలో మూర్తి రొమాంటిక్ మూడ్‌ను కావాలని తెచ్చుకుంటున్నాడనిపిస్తుంది చివరకు అతను 'లలిత వంటి' భార్యను చేసుకుని, కాంపుల మీద తిరుగుతూ ఇటువంటి హోటలు గదులలో రొమాన్సు ఊహించుకుంటాడు చివరకు భగ్నమయేది కూడా ఈ ''మూడే''



నాలుగో కథ మిగిలిన వాటికి కొంచెం భిన్నంగా ఉన్నది దాని పేరే మారిపోయి ''నవ్విన మల్లెలు'' అయింది మూర్తిపేరు శ్రీధర్‌గా మారిపోయింది అతను కూడా రైలు ప్రయాణంతో నీరసించి వస్తాడు అతను గదిలోకి అడుగుపెడుతుండగానే మల్లెపూలవాసన కొడుతుంది హోటలు కుర్రాడు మంచం మీది దుప్పటి దులిపేసరికి మల్లెపూలు కిందపడతాయి నూతన వధూవరులు కిందటి రాత్రి ఆ గదిలో గడిపి ఉంటారని అతను ఊహిస్తాడు

అతనిక్కూడా మల్లెపూల వాసనతో గతం జ్ఞాపకం వస్తుంది ఆ వాసన అతను ఒక అమ్మాయిని చూసినప్పుడు కొట్టింది ఆ అమ్మాయిని అతను మళ్ళీ చూడలేదు అందుచేత ఇతని మూడ్ మరీ కృత్రిమం అనిపిస్తుంది

అతను వచ్చిన పని సినిమాటల్లో వేషాలు వెయ్యటం అతని దగ్గరికి అప్లికేషన్ తెచ్చిన కుర్రాడు కూడా సినిమా వేషం కోసమే వచ్చాడు అతని అక్క క్రితం రాత్రి హోటల్లోనే పదో నెంబర్ గదిలో ఉన్నది శ్రీధరున్న గదిలో ఎవరో సినిమా డైరెక్టరున్నాడు ఇద్దరూ రాత్రి ఆ గదిలో గడిపారు అంతమాత్రంచేత శ్రీధర్ మూడ్ యావత్తూ పాడు కావలసిన అవసరం ఏమిటో తెలియటం లేదు అప్లికేషన్ తెచ్చిన కుర్రవాడు ఏ నెంబరు గదిలో ఉన్నాడో తెలీదు

ఈ కథలో భొత్తిగా శిల్పం ఉన్నట్టు కనపడదు

*ముద్రణ సంవేదన, త్రైమాసిక సంచిక 1, ఏప్రిల్ 1968*

## 24. కనుపించని కాంతి

సృష్టిలో విద్యుదయస్కాంత తరంగాలున్నాయి తరంగప్రమాణం మనం ఊహించలేనంత సూక్ష్మం మొదలుకుని అరకిలోమీటరు పై చిల్లరదాకా విస్తరించి ఉంటున్నది ఈ తరంగాలలో ఒక చిన్న భాగం మాత్రమే మన కన్ను కాంతిరూపంలో చూడగలుగుతుంది నిశాచర మృగాలు కొన్ని మన కంటికి కనిపించని ''ఉష్ణ'' తరంగాలను కూడా చూడగలుగుతాయి ఈ విద్యుదయస్కాంత తరంగాలు కూడా ఒక విధంగా పరమాణుశక్తే అయితే ఈ శక్తి కేంద్రకం నుంచి గాక, దానిచుట్టూ పరిభ్రమించే ఎలెక్ట్రాన్ల నుంచి ఉత్పత్తి అవుతుంది అందుచేత కేంద్రక శక్తితో పోల్చితే దీని శక్తి చాలా తక్కువ అయితే అతి శక్తివంతమైన ఎక్స్-రే, గామా, కాస్మిక్ కిరణాలకు కేంద్రకంతో సంబంధం లేకపోలేదు

శాస్త్రవేత్తలు ఈ తరంగాలనూ, వీటి ఉపయోగాలనూ, వీటివల్ల జరిగే అపకారాన్నీ ఎలా కనిపెట్టారో ఈ చిన్న పుస్తకం చాలా టూకీగా చెబుతున్నది ఇందులోని విషయాలు స్థూలంగా అనేక ఇతర పుస్తకాలలో వచ్చినవే కావటం చేత ఈ గ్రంథాన్ని ఇంకా విపులంగా రాసి ఉంటే బాగుండేదనిపిస్తుంది

ఇందులో పేర్కొన్న ఒక విషయం నాకు వింతగా ఉన్నది రేడారుతో నక్షత్రాల దూరాన్ని కొలవటం ఇది ఎట్లా సాధ్యమో ఊహించసాధ్యం కాకుండా ఉన్నది మనకు అత్యంత సన్నిహితమైన నక్షత్రం - సూర్యుణ్ణి తప్పించి - నాలుగు కాంతి సంవత్సరాల చిల్లర దూరంలో ఉన్నది రేడార్ సిగ్నల్ దానికి ప్రతిఫలించి తిరిగి రావటానికి ఎనిమిదిన్నర ఏళ్లు పడుతుంది! మిగతా నక్షత్రాల మాట చెప్పనే అవసరం లేదు కాని చంద్రుడూ, సమీపగ్రహాలూ ఎంత దూరంలో ఉన్నదీ తెలుసుకునేటందుకు రేడారు ఉపయోగపడిన మాట నిజం

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 24-4-1968*

## 25. కుటుంబ నియంత్రణ : సందేహాలు, సమాధానాలు

''గర్భనిరోధం'' మొదలైన అనేక పుస్తకాలను రచించిన వాస్తవికానందస్వామి (డాక్టరు జి వీరభద్రరావు) ఈ పుస్తకాన్ని ప్రశ్నలకు సమాధానాల రూపంలో రచించారు ఈ గ్రంథంలో కొత్తగా చెప్పిన విషయాలు అంతగా లేవు

నాగరిక మానవులు తమ జీవితాన్ని తమ అదుపులో ఉంచుకునే మార్గాలను వేటినీ వదులుకోవటం లేదు పిల్లలను కనటం ఒక్కటే దేవుడికీ, ప్రకృతికీ వదలటం జరగదు పిల్లలను ఐచ్ఛికంగా కనటానికి ఆరోగ్య, ఆర్థిక, సాంఘిక, రాజకీయ కారణాలు ఎన్నయినా ఉండవచ్చు కొందరు స్త్రీలు కాన్పు కాన్పుకూ చచ్చినంత పని చేస్తారు కొందరు పెద్ద సంసారాలను పోషించలేరు కొందరు తొలిచూలి పిల్లలను అందలాలలో తిప్పి, వరసగా పిల్లలు పుట్టుకొస్తూ ఉంటే రానురాను గాలికి వదిలేస్తారు నిస్సహాయంగా పిల్లలను కనటంలో ఎన్ని చిక్కులైనా ఉన్నాయి

సంతాన నిగ్రహానికి సాధనాలూ, మార్గాలూ కూడా ఈనాడు ఎన్నో ఉన్నాయి వాటన్నిటి మంచిచెడులనూ ఈ పుస్తకంలో చర్చించారు ఈ పుస్తకం చదివి అందరూ సంతాన నియంత్రణా నిరోధాలను తేలికగా అమలు చేస్తారని కాదు వైద్యుడి సలహా అడుగడుగునా కావాలన్నది ఈ పుస్తకంలో పదేపదే చెప్పి ఉన్నది అదే ఈ పుస్తకం నుంచి తెలుసుకోదగిన ఉత్తమ విషయం కూడానూ

ఏ కారణంచేతనో ఈ పుస్తకంలో ''పిల్''ను గురించి ప్రత్యేకంగా ప్రస్తావించలేదు క్రమంగా బహిష్టు కావడానికి(గర్భధారణావకాశం కలగకుండా ఉండడానికి) మన దేశంలో కూడా చాలామంది స్త్రీలు ''పిల్''(మాత్రలు) ఉపయోగిస్తున్నారు సంతాన నిరోధ చర్యలన్నిటి వెంటా ఏదో ఒక చిక్కు ఉంటూనే ఉన్నది ''పిల్'' వాడితే రక్తనాళాలలోరక్తం కుదపగట్టుతున్నదని ఒక ప్రవాదు బయలుదేరింది కాని ఇది శాస్త్రీయంగా రుజువు అయినట్ట కనబడదు మన దేశంలోని వైద్యులు ఈ ప్రవాదం గురించి ఆరాలు తీయటం మంచిదేమో

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 26-6-1968*

## 26. రసెల్‌కంకితమైన రెండు కథలు

''అతి వేదాంతములోకి దిగని వేదాంతీ, మనస్సుతో ఆలోచించే మేధావీ, అతీంద్రియ జ్ఞానంతో తర్కించే తాత్త్వికుడూ అయిన బెర్ట్రండ్ రసెల్‌కు అంకితం'' అయిన ఈ రెండు కథలూ ''మరమేకులు, చీరమడతలు'', ''కొత్తొంతెన-పాతనీరు'' అనేవి

''ఒక ఇంజనీరు చురుకైనవాడు ఎన్నెన్నో కట్టడాలు నిర్మాణాలు చేసి, సంఘానికి ప్రయోజనాలు సమకూరుస్తాడు ఎటొచ్చీ వయస్సులో వొంటిగా వుంటూ, ఒక స్త్రీతో సంపర్కం పెట్టుకుంటాడు అతన్ని నలుగురూ దుయ్యబడతారు మరొక 60 యేళ్ళ వృద్ధుడు - ఏకపత్నీవ్రతుడు ఏటేటా సంతానం కంటూ వుంటాడు - భార్య ఆరోగ్యం గమనించక ఇతనిద్వారా సమాజానికి ఏ లాభమూ లేదు అయినా, ఇతన్నే గౌరవిస్తోంది

సంఘం ఆ ఇంజనీర్ని ఇబ్బంది పెడుతోంది ఈ దృక్పథం తొలగాలి'' అని రసెల్ అన్నాడట ''సరిగా నేననుకుంటున్న భావమే'' అని దానికి కళాస్వరూపం ఇస్తూ బుచ్చిబాబు ఈ రెండు కథలూ రాశాడు

కాని మనకు నిత్యజీవితంలో, సంఘం కొందరి సెక్సునీతిని పట్టించుకోకపోవటమే కనిపిస్తుంది కవులుగానో, నటులుగానో, చిత్రకారులుగానో ప్రఖ్యాతులైనవారూ, ధనికులూ, పెద్ద పదవులలో ఉన్న వారయా ''రంకుబోతే'' ఎవరయా పట్టించుకోరు - ఆహ్లాదిస్తారేమోకూడానూ, ''మనం చెయ్యలేని పని వాళ్లు చేస్తున్నారు గదా'' అని

ఏమైనా, ''మరమేకులు, చీరమడతలు'' కథలో సంఘం ఎవరినీ దుయ్యబట్టదు ఇందులో రవిప్రకాశం అనే అతను సంఘానికి ఉపకారం చేసేవాడూ, గంగాధరం సంఘం మెప్పు ఉట్టుడియంగా పొందుతున్నవాడూ అని మనం అనుకోవాలి ఇద్దరూ వ్యాపారంలో ఉన్నవాళ్లే అయితే కథనుబట్టి రవిప్రకాశం పారిశ్రామికుడుగా అసమర్థుడల్లే కనబడతాడు పనివాళ్లకు సౌకర్యాలు కలిగించటం గురించి కలలు కనటం జాస్తి కొన్ని సౌకర్యాలు కలిగిస్తాడు కూడా అయితే అవి పనివాళ్లను ''మభ్యపెట్టే'' ధోరణికి చెందినట్టు కనబడతాయి

రవిప్రకాశంలో ఉండే అసలు నైజం కళోపాసన బుచ్చిబాబు సృష్టించే కథానాయకుల ధోరణిలో ఇతను కూడా చిత్రలేఖనమూ, శిల్పమూ మొదలైనవాటిలోనూ, ప్రకృతి సౌందర్యంలోనూ అమిత ఆసక్తి కనబరిచే కళాపిపాసువు కథలో ఒక్కసారే కాలుజారుతాడు అందుకు పాఠకులెవరూ అతన్ని తప్పుపడతారనిపించదు బలవా నింద్రియగ్రామో విద్వాంసమసికరతి

పోతే తనను కొనుగోలులో మోసం చేసి, తన లైసెన్సు తీసుకుపోయి ఎవరికో అమ్మిన దుష్టుడు గంగాధరాన్ని రవిప్రకాశం ముందు హత్య చేస్తామనుకోవటం చాలా అస్వాభావికంగా ఉంది కాని తరవాత హామ్లెట్‌లాగా, ''చంపి మరో స్వర్గానికి పంపనా అనుకోవటం కృతకంగా ఉంది ''అతనూ సృష్టిస్తాడు - మరమేకుల్ని'' అని సమాధానపడటం అతని ''బూర్జువా'' సంస్కృతికి సరిగా ఉన్నది

ఈ కథలో జమ్మూ, కాశ్మీరు వర్ణనలు విపులంగా ఉన్నాయి మామ్ కథలోలాగా పర్వతాలు కుచాలతో పోల్చబడ్డాయి ప్రకృతి మైథునం చేసి అలసిన స్త్రీతో పోల్చబడింది ఇంకా రంజయిన వర్ణనలు చాలా ఉన్నాయి

''కొత్తాంతెన - పాతనీరు'' అన్న కథ రసెల్ ప్రవచనానికి మరింత సూటిగా ఉంది అచ్చగా రసెల్ అన్న మాటలను మేస్త్రీ గనిరెడ్డి చేత అనిపిస్తాడు కథకుడు లోకానికి చిన్నమెత్తు ఉపకారం చెయ్యని భరతరాజుకు షష్టిపూర్తి, అట్టహాసంగా సన్మానమూ, ఊరికి రకరకాలుగా ఉపకారం చేసిన ఇంజనీరు ప్రభాకరానికి బదలాయింపూనూ అతను చేసిన మహాపరాధం వితంతువైన అలిమేలుతో సంబంధం పెట్టుకోవటం

ఈ సమీక్ష ముగించే ముందు కథలు ఎలా, ఎందుకు రాస్తారన్న విషయమై బుచ్చిబాబుకు గల భావాలను పరామర్శించాలి ఈ మాటలు ఉపోద్ఘాతంలోవి

''విచిత్రమైన వ్యక్తి గాని, అసాధారణ వ్యక్తి గాని మనకి తటస్థపడినప్పుడు, అల్లాంటి వ్యక్తిని గురించి కథ వ్రాయాలనిపించవచ్చు లేక రచయిత నిజమైన ప్రకృతి, బయటికి కనబడే

ప్రకృతి - యీ రెంటికి పొత్తు కుదరక మనస్తత్వం వింత ప్రవర్తనగా బైటపడినప్పుడు, తన అంతరంగం పట్ల తనే ఆశ్చర్యపడి, దాన్ని కథగా అల్లి పాఠకుడితో పంచుకుని, తన అంతరంగం ఒత్తిడి నుంచి విముక్తుడు కావచ్చు కేవలం కొత్త ప్రాంతాలను, కొత్త దృశ్యాలను చూసి (ఉదా జమ్మూ, కాశ్మీరు) కవితావేశం నిలదొక్కుకోలేక, వాటిని వర్ణిస్తూ, అనువైన కథను అల్లి వ్రాయవచ్చు మరో ప్రేరణ కూడా ఉంటుంది ఒక చక్కటి భావం, చమత్కారమైన ఛలోక్తి, తాత్త్విక చింతనని రేకెత్తించే సూక్తి - ఇట్లాంటివి మనకు తట్టినప్పుడు గాని, ఇతరులని చదివినప్పుడు గాని (ఉదా రసెల్) వాటిలో నిజానిజాలను పరామర్శిస్తూ, కథ కూర్చాలనిపించవచ్చు ''

ఈ అభిప్రాయాలతో ఎంతమంది కథకులు ఏకీభవిస్తారో తెలీదు ఇందులో సామాజిక ప్రేరణలకు స్థానం ఇవ్వకపోవటం గమనార్హం ప్రతి రచనా సామాజిక జీవితంపై వ్యాఖ్యగా ఉండాలనీ, మిగిలిన అంశాలన్నీ రచనకు ఉపాంగాలనీ నామటుకు నేను నమ్ముతున్నాను

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 20-11-1968*

## 27. నా అంతరంగ కథనం

కథకుడు, కళాకారుడు, కొంతలో కొంత కవి, భావుకుడు, స్నేహపాత్రుడు, పాశ్చాత్య సంస్కృతిని వంటబట్టించుకున్నవాడు బుచ్చిబాబు మాకిద్దరికీ ప్రథమ పరిచయం 1941లో అడుగులోనే హంసపాదులాగా నేనతనికి ''అన్యాయం'' చేశాను ఆంధ్ర వారపత్రికలో వెయ్యమని అతను నాకిచ్చిన కథలలో ఒక్కటీవేశాను కాను తిరిగి ఇంతకాలానికి మళ్లీ బుచ్చిబాబుకు మరో ''అన్యాయం'' చెయ్యబోతున్నాను - ఈ పుస్తకం నాకు నచ్చలేదు

స్వీయచరిత్రలు రాయటం తేలిక కాదు తెలుగులో అలాంటి రచనలు చాలా కొద్ది అవైనా ఆధునిక పాశ్చాత్య ప్రమాణాలకు చాలవు స్వీయ చరిత్రకారులు తమ ''రహస్యాలను'' బయటపెట్టటం పాశ్చాత్యులకు రివాజు బుచ్చిబాబు రచన ఈ విషయంలో ఇతర తెలుగు స్వీయ చరిత్రలకన్న పాశ్చాత్య ప్రమాణాలకు అనుకూలంగా ఉన్నది ఇందులో లిబిడో, మార్జినల్ సెక్స్, హోమోసెగ్జువల్ ధోరణులూ ప్రస్తావించబడ్డాయి వాస్తవమైన సెక్స్ జీవితంలోకి అడుగుపెట్టేచోట రచన నిలిచిపోయింది ''పదిహేనేండ్ల బాల్యజీవితానికి సంబంధించిన అంతరంగ కథనం మాత్రం తలపెట్టి పూర్తి చేశాను'' అని చివరిలో అన్నాడు యాభై నిండకముందే అకాల మరణంవాత పడకుండా ఉంటే బుచ్చిబాబు తన ఆత్మకథ రాసుకుపోయేవాడేననుకోవచ్చు

బుచ్చిబాబు తన పదిహేనేళ్ల జీవితంలోపొందిన అనుభవాలు - అందులో మొదటి అయిదేళ్లవి అతనికి జ్ఞాపకం లేవు - సర్వసాధారణమైనవే గొట్టికాయలూ, తొక్కుడుబిళ్లా, ఈతలూ, షికార్లూ, బడిపంతుళ్లు కొట్టటమూ, బంధువుల సమావేశాలూ, జబ్బులూ, కాలవలాకుల్లో పడవల కదలికా వగైరా, వగైరా కాని బుచ్చిబాబులో ప్రత్యేకత ఏమంటే, వాటన్నిటినీ తన పరంగానే - తన అనుభవాలు కావటంలో వాటికొక ప్రత్యేకత వచ్చినట్టు చిత్రిస్తాడు తనకు లెక్కలురాకపోవటం కూడా ఒక విశిష్టతగానే కనపడేలాగూ ఆ విషయాన్ని

ఒకటికి పదిసార్లు చెబుతాడు ఇందులో ఉండే నార్సిసస్ కాంప్లెక్స్ తన అందం గురించి చెప్పుకునే దగ్గిరా, తనకోసం కొందరు మేష్టర్లు ప్రత్యేకమైన ఆసక్తితో పాఠాలు చెప్పటం దగ్గిరా బయటపెట్టుకుంటాడు

బుచ్చిబాబు ఒక విధంగా అంతర్ముఖుడు, ఆత్మప్రభావితుడు అతను పనిపెట్టుకుని ప్రకృతి సౌందర్యారాధన పెంచుకున్నాడు చిత్ర కళలో అభిరుచులు పెంపొందించుకున్నాడు మనస్తత్త్వశాస్త్రాలు చదవటమే కాకుండా, వాటి సహాయంతో తనను తాను అర్థం చేసుకోకుండా, వాటికి అనుగుణంగా తన మనస్తత్త్వాన్ని మార్చుకున్నాడు అందుచేతనేమో అతని కథల్లో తెలుగు పాత్రలూ, తెలుగు జీవితమూకన్న పాశ్చాత్య మనస్తత్త్వ శాస్త్రోదాహరణలు జాస్తిగా కనబడతాయి ఉదాహరణకు ''చివరకు మిగిలేది'' తీసుకోవచ్చునేమో తన కథలన్నింటిలోకీ చాలా ఇష్టమని బుచ్చిబాబు చెప్పుకునే ''పొగలేని నిప్పు'' కథ తెలుగుదేశంలోని ఏ పల్లెటూరులోనూ జరగదు అందులోని 'సెక్సు లేని ప్రేమికులు'' ఏ ఫ్రెంచివాళ్లో అనిపిస్తుంది

అంతరంగకథనంలో ఆత్మవిమర్శ కూడా లోపించినట్టు కనబడుతుంది ''సహజంగా, విచ్చలవిడిగా పెరిగిపోయిన అడవులు, కొండలు, నదీజలాలు, లోయలు, సెలయేళ్లు నాకిష్టం అందులో వంతెనలుండకూడదు రోడ్లుండకూడదు'' అంటాడు రస్కిన్‌లాగా కాని అతన్ని రైలు ఇంజను ఎంతో ఆకర్షిస్తుంది ''యుద్ధం అన్నా, తుపాకులన్నా, కత్తులమర్చిన దుస్తులన్నా రోత, భయం, పోలీసులంటే తన్నేవాళ్లనీ, పొడిచేవాళ్లనీ వారంటే కూడా భయమే బుద్ధుడు, అశోకుడు, గాంధీ ప్రచారం చేసిన అహింసా సూత్రం పూర్తిగా అంగీకరిస్తాను ఈ సూత్రాన్ని నిత్యజీవితంలో ఆచరణలో పెట్టడానికి ప్రయత్నిస్తాను'' అంటాడు కాని కోడిపుంజులాట చూసి సంతోషిస్తాడు కోడిపుంజులు పోట్లాడే బొమ్మ దగ్గిరపెట్టుకుంటాడు కప్పల్నీ, పిట్టల్నీ కొట్టటం అహింసా?

రచయితగా బుచ్చిబాబును ఆరాధించేవారికి ఈ పుస్తకంలో అమిత ఆసక్తికరమైనదేమంటే, తన ఏయే అనుభూతులు తన రచనల్లో ఏయే రూపంలో ప్రవేశించినదీ అతను ఈ పుస్తకంలో వివరించాడు కాని, సామాజిక జీవితం తన రచనలను ఎలా ప్రభావితం చేసినదీ అతను చెప్పకపోవటం కొందరికి ఆశాభంగం కలిగించవచ్చు మేధావులశ్రేణికి చెందిన వాడై ఉండి మతాలపట్లా, రాజకీయాలపట్లా తన నిశ్చిత వైఖరిని అతను వ్యక్తం చెయ్యకపోవటం నాకు ఆశ్చర్యం కలిగించింది

''1962లో (అప్పటికి అతనికి 46 ఏళ్లు) చైనా వారు మన దేశపు ఉత్తర సరిహద్దులపై జరిపిన దాడులు - వాటి పరిణామం గమనించిన తర్వాతననే నీ అభిప్రాయం మార్చుకోక తప్పింది కాదు'' - అంటే ''మిలిటరీ యూనిఫారమ్‌ల బ్యాండులు, డ్రిల్లులు, పెరేడ్‌లు, వైమానిక విన్యాసాలూ, మందుగుండుసామగ్రి కర్మాగారాలు - ఇవేవీ ఉండకూడదు అన్న అభిప్రాయమన్నమాట

ఆ సమయంలో ఇండియాకూ చైనాకూ జరిగిన సంఘర్షణ యుద్ధమనిపించుకోదు కాని పాకిస్తాన్‌తో మనం చేసినది పూర్తిగా యుద్ధమే ఈ యుద్ధం ఫలితంగా కొంత భారత భూభాగాన్ని పాకిస్తాను శాశ్వతంగా ఆక్రమించుకున్నది అయితే ఈ పాకిస్తాను ప్రభావం బుచ్చిబాబు మీదా ఏమీ వున్నట్టు కనబడదు దీనినిబట్టి మనం బుచ్చిబాబు రాజకీయాలను ఊహించుకోవాలి

''శరీరం నాలుగో పరిణామంలో విప్పుకుని తెచ్చుకున్న ఒడుగు'',''లయసంబంధమైన ఒక క్రమబద్ధమైన శక్తి నాలో నిల్చిపోయిందేమో చెప్పలేను సెలయేటికి చెవి ఆనించి, నిత్యమూ వింటూ, చూస్తూ గడిపిన కన్య శరీరంలోకి, ఆ సెలయేటి తాలూకు సౌందర్యం, బలం ప్రవేశిస్తాయంటాడు వర్డ్స్‌వర్త్ కవి ఇది గతంలోని అంతరంగానికే సాధ్యపడుతుందనుకుంటా'' - ఇలాటి వాక్యాలు సరిగా అర్థం కావటం లేదు

''ఆ నాటకంలో (కృష్ణలీలలు) జీవితమే యథార్థం గానూ, బయట నేనెరిగున్న లోకం మాయగానూ కనబడసాగింది'' అంటాడు బుచ్చిబాబు ఒకచోట ఈ సూత్రం మీదనే అతను తన రచనలను సాగించాడా అని నాకు అనిపిస్తుంది

*ఆంధ్రప్రభ, వారపత్రిక 4-12-1968*

# 28. చాసో కథలు

ఇటీవలి కాలంలో చాగంటి సోమయాజులు పేరు చాలామందికి తెలియకపోవచ్చు కాని ఒకపావు శతాబ్దం క్రితం అభ్యుదయ కథకులలో ఆయనది పెద్దపేరు పీరికలో సుశర్మగారన్నట్టు, ఆయన ఆధునిక కథకులు ఇద్దరుముగ్గురిలో చేర్చదగినవారు కావటంచేతనేమో ఆయన కథలు ఇంత కాలానికి పుస్తకరూపంలో వెలువడ్డాయి సోమయాజులు రాసిన మరికొన్ని కథలు ఇందులో చేరలేదు ఉదాహరణకు, బూర్జువా కుక్క కథ ఇందులో లేదు అలాగే ఇంకా ఒకటి అరా దిగబడిపోయి ఉండొచ్చు

సోమయాజులు అభ్యుదయ రచయితా, జీవిత విమర్శకుడా, కళా ప్రయోజనాన్ని గుర్తించినవాడూ కావటం మాత్రమే కాదు ఈ అన్ని లక్ష్యాలనూ సాధించాలని ప్రయత్నించి కూడా అపజయం పొందినవాళ్లున్నారు అభ్యుదయం పేరిట నినాదాలిచ్చారు, జీవిత విమర్శ సాకుతో ప్రచారం చేశారు సాహిత్య ప్రయోజనాన్ని సాధించే ప్రయత్నంలో సమస్యలను (కాగితం మీద) పరిష్కరించేశారు నేల విడిచి సాము చేశారు

సోమయాజులు జీవితానికి జీడిలాగా అతుక్కుపోయి కథలు అల్లాడు వాస్తవికత-సన్నివేశాలలోనూ, పాత్ర రచనలోనూ కూడా - నూటికి నూరుపాళ్లు సాధించాడు ఈ కథలలో ఎన్నయితే జీవిత సత్యాలున్నాయో అన్నీ జీవితం నుంచీ మథించినవేగాని, బలవంతాన జీవితంలో మిశ్రణం చేసినవికావు

ఈ సంపుటంలో 23 కథలున్నాయి అన్నీ అన్ని రకాలు దారిద్ర్యమూ, దోపిడీ, రాజకీయాలూ, పరమపదసోపానపటంలో పెద్ద నిచ్చెనలు ఎక్కే ఆధునిక నీతిమార్గాలూ, మతిమతిలో ఉన్నంతకాలమూ ఆనందానికి నోచుకోని వాళ్లూ, కడుపుకక్కుర్తికి చట్టాలను చిన్న విషయాలలో ఉల్లంఘించి శిక్ష పొందేవాళ్లూ, ఆర్థిక కారణాలచేత హేయమైన సంసారజీవితంలో శ్లేష్మంలోని ఈగల్లాగా చిక్కుకుపోయిన వాళ్లూ, భారతదేశంలో సామ్యవాదం అవతరించిందని పీడ కల గని, అది కాలేదని తెలిసి హాయిగా నిట్టూర్చినవాళ్లూ, ప్రభుత్వం అండనచేరి ప్రజల సొమ్ము తినేవాళ్లూ, మెట్టవేదాంతులూ, అనేక రకాలవాళ్లు ఉన్నారు

ఇందులోని మిగిలిన కథలన్నీ వాస్తవికమైనవైతే ''చిన్నాజీ'' వాస్తవ కథ

ఈ కథలో పాఠకుడి హృదయాన్ని మథించాలన్న ప్రయత్నం బుద్ధిపూర్వకంగా లేదు కాని ఒక్కో పరిస్థితిలో చదివేవాడి గుండె కలుక్కుమనటం జరుగుతుంది

''వాయులీనం''లో రాజ్యం సంగీతమంటే ఇష్టం గలది భర్తకి 'చెవి' లేదు రాజ్యం జబ్బుపడి ఉంటే ఆమెకు వైద్యం చేయించటానికని ఆమె వయొలిన్ అమ్మేస్తాడు అందువల్ల పెద్ద నష్టమేమీ లేదు 'మొగుడు ఒక్కనాడు పాడమనలేదు తాను పాడనూ లేదు!'' కాని భర్త వయొలిన్ అమ్మేశాక రాజ్యం, ''నా నోరు ఏనాడో నొక్కుకుపోయింది ఇహ నా ఫిడేలు ఉండి నన్ను రక్షిస్తుందా? తల్లి వెళ్ళిపోయింది వెళ్ళిపోతూ నాకు ప్రాణం పోసింది'' అని గుడ్లనీరు కక్కుకుంటుంది

అలాగే ''కుక్కుటేశ్వరము''లో ముసిలిది, తనను రైలు అధికారులు టిక్కెట్టు లేకుండానూ, బియ్యం మూటతోనూ పట్టుకుంటే, మొదట బతిమాలి, చివరకు ఆగ్రహంతో, ''పదండి భడవల్లారా! నేనే దొంగమార్కెట్టులో అమ్ముకొని మేడలు కడుతున్నాను నాకు ఉరిశిక్షకు తక్కువెయ్యకండి నా పాగ కుక్కుటేశ్వరుడికి ధూపం వెయ్యండి'' అంటుంది

ఈ ఉన్న కథల్లో సంఘానికి రెండు చివర్లా రెండు కథలున్నాయి ఒకచివరకు సంబంధించిన కథ ''లేడీ కరుణాకరం'', రెండో చివరకు చెందిన కథ ''ఎంపు'' మొదటిదానిలో పైకి వచ్చేవాళ్ళు పాటించే నీతి ఉన్నది రెండో దానిలో ముష్టివాళ్ళు పాటించదగిన నీతి ఉన్నది

కరుణాకరం భార్య శారద ''మహా పతివ్రత'' పెళ్ళయి ఇంకా కాపరానికి రాకముందే తమ ఊళ్ళో నాయుడిదగ్గిర పడుకుని డబ్బు సంపాదించి, భర్త చదువుకు తోడ్పడింది కాపరానికి వెళ్ళాక ''వ్యాపారం'' విస్తరింపజేసి, పెద్ద చదువు చదివించి, కారు కొని పెట్టి, గొప్ప బాంకీ ఉద్యోగం ఇప్పించి, చివరకు నైట్‌హుడ్ కూడా ఇప్పించేస్తుంది ''కరుణాకరం తెలివైనవాడు అతను అనుకుంటాడు ''కుంతి పతివ్రతైతే శారద పతివ్రతే '' అనేక విషయాలలో సమాధానాలు పడుతూ ఉంటేనే జీవితం ఎవర్కైనా గడుస్తుంది ''శారద వెయ్యిమందిని వరిస్తుంది దానికి దోషం లేదు '' కుంతి కొడుకులు పాండవులైతే, శారద పిల్లలు కూడా తన సంతానమే ననుకుంటాడు కరుణాకరం

ఇక ''ఎంపు''లో ఇంకో రకం నీతి ఉన్నది ఇందులో అందరూ ముష్టివాళ్ళే ముసలాడి కూతురు ఎర్రి పొట్టాణ్ణి పెళ్ళి చేసుకుందామనుకుంటుంది కాని ముసలాడు ఒప్పుకోడు, దానికి మొగుడుగా ఒక గుడ్డివాణ్ణి తెచ్చి, వాణ్ణే చేసుకోమంటాడు ఎందుకో చెబుతాడు ''గుడ్డోడు మారాజు కళ్ళులేని కబోది ఆడి జనమకదొక్కటే శాన అణ్ణి చూస్తే జాలి పుడతాది ఏయమ్మైనా మనసు కరిగి ఇన్ని గింజలేస్తాది అణ్ణి సెయ్యేట్టుకుని తీసికెళ్ళి నాలుగు రోడ్ల మధ్యనో వార కూకోయెట్టి, ఆడి ముందల గుడ్డ పరిచి నువ్వెళ్ళిపో! ఆడు సితారట్టుకుని సిరతలు వోయిస్తూ పాడినాడంటే రూపాయి డబ్బులికి నాగారాదు నీమీద ఆధారపడి నీ సెప్పుసేతల్లో ఉంటాడు నువ్వెక్కడికి యెళ్ళినా అడిగినోడు కాడు సూడరాదు నీకు మనసయిందీ? ఇష్టమొచ్చినట్టు తిరుగు తఖరలేదు ''

''ముసిలాడి ఉపన్యాసం ముష్టిలోకానికి ఉపనిషత్తు'' అంటాడు కథకుడు అందులో అబద్ధం లేదు

చిత్రమేమిటంటే సంఘం రెండు చివర్లా ఇంచుమించు ఒకే నీతీ, డబ్బే ప్రధాన లక్ష్యమూ కావటం! అతి సాధారణమైన జీవితాంశాలను ఇతివృత్తంగా తీసుకుని గొప్ప కథలు రాసే శక్తి చాలా అరుదైనది సోమయాజులుకు అలాంటి శక్తి ఉన్నది అందులో ఒక వంతు శక్తి లేని వాళ్లు కూడా గొప్ప కథకులుగా చలామణీ కావటం చూస్తున్నాం

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 1-1-1969*

# 29. విరమించిన కథకుడు 'చాసో'

రచయితకూ, సాహిత్యరంగానికీ ఉండే సంబంధం బీజానికీ, క్షేత్రానికీ ఉండే సంబంధం లాంటిది, సైన్సులో practice కూ, field కూ ఉండే సంబంధం లాంటిది హెచ్చుమంది కవులూ, కథకులూ మొదట రచనా వ్యాసాంగానికి దిగి, ఆ తరువాత ఆ అర్హతతో సాహిత్యరంగంలోకి అడుగుపెడతారు కొద్దిమంది సాహిత్యరంగంలో ఏ కారణంచేతనో ప్రవేశించి, అందులో మాగి, ఆ రంగంయొక్క ప్రభావప్రేరణలతో రచనలు చేస్తారు అలాటి వారి రచనా వ్యాపకం వారి సాహిత్యజీవితంలో ఒక ఉపాంగంగా మాత్రమే ఉండిపోతుంది వారు రాసే దానికన్నా చాలా హెచ్చుగా చదువుతారు సాహితీపరులతో చర్చలు చేస్తారు ఈ రకానికి చెందిన రచయిత చాగంటి సోమయాజులు - చాసో అతను కథలు రాశాడు అతన్ని కథారచనకు ప్రేరేపించింది కీర్తికాంక్ష కాదు, ధనకాంక్ష కాదు రచయితలైన తన మిత్రుల ప్రభావమూ ఉప్పెనలాగ జీవితాన్ని ఊపివేస్తున్న యుద్ధకాల జీవితమూ, విరివిగా ప్రచారంలోకి వస్తున్న ఆర్థిక - సాంఘిక రాజకీయ సిద్ధాంతాలూ అతన్ని రచనకు పురికొల్పాయి కొత్తగా వికాసం చెందుతున్న తెలుగు అభ్యుదయోద్యమం అతనిలో మరింత చైతన్యాన్ని కలిగించింది

చాగంటి సోమయాజులు ఆనాడు రాసిన కథలు ఈనాటికి పుస్తకరూపంలో వెలువడ్డవి ఈ కథలు ఇంతకాలం మరుగునపడి ఉండటానికి కారణం చెబుతూ పుస్తకపీఠికలో సుశర్మగారు, ''చాసోకి కీర్తి కాంక్ష లేదు! తనని, తన కథలని (నలుగురూ) పొగడాలనే కోరిక లేదు అనేక పత్రికలలో ప్రచురించిన ఆయా పత్రికలలో విడిచిపెట్టి పుస్తక రూపంలో ప్రజల ముందు పెట్టక ఉదాసీనతతో విడిచిపెట్టేశారు వారి దగ్గర వ్రాతప్రతులు లేవు ఏ కథ ఏ పత్రికలో ఏనాడు అచ్చు అయిందీ ఆయనకే తెలీదు! అందుకు వారు క్షంతవ్యులు కారు అదీగాక పుష్కరమై రచన ఆపు చేశారు అది కూడా క్షమింపదగ్గ పని కాదు '' అంటున్నారు

ఈ మాట నేను ఒప్పుకోను గ్రహాంగ్రీన్ మన దేశానికి ఇటీవల వచ్చినప్పుడు రేడియో ఇంటర్వ్యూలో, ''రచన ముగించాక నేను దాన్ని గురించి పట్టించుకోను'', అన్నాడు ఒక రకం రచయితకు అటువంటి వైఖరి స్వాభావికమే నాకూ అటువంటి మనస్తత్వం ఉన్నదిగనక నేను చాసోను అర్థం చేసుకోగలను రాయాలన్న ప్రేరణ పోయాక రచయితను తప్పుపట్టటం కూడా సరికాదు కొన్ని సంవత్సరాలుగా ఇతరుల ప్రోద్బలం మీదనే కథలు రాస్తున్న నాకు ఆ బాధ తెలుసు

మంచి రచనలు వచ్చాక వాటిని గురించి శ్రద్ధ తీసుకోవలసిన వర్గాలు రెండే ఉన్నాయి ఒక వర్గం రచనలను అభిమానించే పాఠకులూ, మిత్రులూనూ, రెండో వర్గం లాభాపేక్షతో

పుస్తక వ్యాపారం చేస్తున్న పబ్లిషర్లూ అంతేగాని, రచయిత తన రచనలకు తానే మూర్ఛబోయి, తన రచనలను అభిమానించే పాఠకులకు ప్రతినిధి అయిపోయి, దస్తరం చంకన పెట్టుకుని పబ్లిషర్ల చుట్టూ తిరగటం -! అలా చేసేవారు చాలా మంది ఉంటారేమో, కాని ఆ పని చెయ్యనందుకు ఏ రచయితనూ తప్పుపట్టరాదు "ఈ కథల విశిష్టతా, సాంఘిక ప్రయోజనము గుర్తించిన వారి(చాసో) మిత్రులు, సాహితీపరులు అత్యుత్తమమైనవి కొన్ని సేకరించి ఈ పుస్తక ప్రచురణకు కారణభూతులైనారు వారు అభినందనీయులు"

ఇంతకాలం తాత్సారం చేసినందుకు వారిని తప్పుపట్టవచ్చును - కాని పట్టను ఈనాడు మన దేశంలో ఉన్న సాహిత్య వాతావరణం దృష్ట్యా చూస్తే, నిజంగా వారు అభినందనీయులే

ఇంతకూ చాసో కథలు రాయటం ఎందుకు మానుకున్నట్టు? అతని ఉదాసీనతకు కారణం ఏమిటి?

ఈ ప్రశ్నలకు సమాధానం కొంతవరకైనా ఈ కథల్లోనే మనకు దొరుకుతున్నది "చిన్నాజీ" అన్న కథగాని కథలో ఈ వాక్యాలు చూడండి

"కథకేముంది? కథ తలుచుకున్నప్పుడు తాత పెళ్ళిలాంటిది మామూలుగా రాసే కథలకీ, చిరినాటకాలకీ "మూడ్సు" అవసరం లేదు" 'చాసో రాసిన చాలా కథలు "మూడి" అవసరం లేకుండా రాసినవే)

"కాని సూది బెజ్జంలోంచి విశ్వాసాన్ని చూడగలిగే సూక్ష్మ జ్ఞానేంద్రియంతో మానవ లోకాన్నవలోకించి అనుభవాలనీ, ఆదర్శాలనీ, ఆత్మనీ, ప్రకృతినీ సమన్వయిస్తూ మహాకావ్యం సృష్టిచేస్తున్నప్పుడు (సైతం) అడ్డంగా చిన్నాజీ వొస్తే దాన్ని పొమ్మంటానా? ఉహుఁ మహాకావ్యమే ఆగిపోవాలి!"

జీవిత చిత్రణ కంటె జీవితమూ, మహాకావ్యంకన్న కూతురు చిన్నాజీ రమ్యమనిపించింది చాసోకి

దీని అనంతరం ఉన్న వాక్యాలు ఇంకా స్పష్టంగా ఉన్నాయి

" ఆ రకం కళాసృష్టి నిజంగా ప్రపంచాని క్కావాలా? కవిగారి అవకతవక వ్యవహారం పెళ్ళానికి అసహ్యం, పిల్లలకి నవ్వుతాలు, మిత్రులకి డబ్బా, తోటి రచయితలకి అసూయత చదివే వాడులేడు ప్రచురించేవాడు లేడు ప్రచురిస్తే కొనేవాడు లేడు అర్థం చేసుకోగలిగిన వాడసలే లేడు!"

చాసోకి ఈ విరక్తి తన అనుభవం ద్వారా కలిగినదేనని మనం అనుకోనవసరం లేదు ఈ అతను అంత సంకుచితంగా ఆలోచించే మనిషి కాడు తన మిత్రులైన ఇతర సాహితీపరుల అనుభవాలు అతనిలో ఇలాంటి విరక్తి రేపి ఉండవచ్చు ఇంకా దూరంగా ఉన్నవారి సాహిత్య ప్రవర్తన కూడా చాసోలో ఒక రకమైన వైముఖ్యాన్ని రేపిన మాట స్పష్టం చూడండి

"విప్లవ బీజాలంటూ మనుషుల్లో ఉంటే కవులు వీరగేయాలు పాడాలా, వెర్రికేక లెయ్యాలా? కోళ్ళు, కోయిలలూ, కవులూ, కాకులూ లేకపోతే ప్రపంచం ఆగిపోదు"

నిజమే, కొందరు అభ్యుదయం సాధిస్తున్నామని వెర్రి కేకలు వేశారు నినాదాలు కూడా సాహిత్యమేనని వాదించారు చాసో అలాటి సాహిత్య వ్యాసంగంలో నమ్మకం ఉన్నవాడు కాదు, అలాంటి రచనలు చేసినవాడు కాడు ఇంకెవరో ఆ పని చేశారని చాసో కలం కింద

పెట్టెయ్యటం సమర్ధనీయం కాకపోవచ్చు - అతను రచనా వ్యాసంగంనుంచి విరమించటానికి ఇదే కారణమైతే మాట

కానీ చాసో క్షేత్రం నుండి చైతన్యం పొందిన బీజం క్షేత్రంలో కలిగే మార్పుల ప్రభావం బీజం పైన ఉండక తప్పదు

అయినా ప్రజలలో విప్లవ బీజాలు నాటటంలో సాహిత్యానికి గల పాత్రను చాసో కొట్టి పారెయ్యవలసింది మటుకు కాదు అది అక్షరాలా తిరోగమనమే

''రాక రాక చిన్నాజీ వొచ్చింది కథావొద్దు కావ్యం వొద్దు చిన్నాజీతో ఐదునిమిషాలు షేక్సిపియరు కామిడీలో రసవత్తరమైన ఐదంకాల పాటి చెయ్యవూ?''

ఎలా చెప్పటం? చాసో కథ చదువుతుండగా కూతురు దగ్గరకొస్తే తరిమి కొట్టే సారకులుండరాదా?

ఈ సంపుటిలో 23 గాథలున్నాయి ఈనాడు వెలువడుతున్న కథలలాగా, ప్రత్యేకించి రచయిత్రులు రాసే ''చిన్న'' కథలలాగా సుదీర్ఘమైన కథలుకావు సగటున కథ ప్రమాణం అచ్చులో ఎనిమిది పేజీలకు లోపు కథనంలో ఎక్కడా చాంద్రాయణాలుండవు

కథావస్తువు అతి సామాన్యమైనవి పాత్రలు కూడా సామాన్యమైనవే ''ఉదాత్త'' మైన కథ రాయాలన్న తాపత్రయం కథకుడిలో ఎక్కడా కనబడదు చదివేదంతా కళ్ల ఎదుట జరిగినట్టే ఉంటుంది గాని, ఎవరో చెబితే విన్నట్టుండదు

ఈ కథను స్థూలంగా అయిదు విభాగాలు చెయ్యవచ్చు

(1) ప్రేమకూ కుటుంబ జీవితానికీ సంబంధించినవి (2) దారిద్ర్యము, దోపిడీ, రాజకీయాలూ, (3) వేదాంతమూ, దేవుడూ (4) పిల్లలు (5) ప్రకృతి చిత్రాలు ఇవి కథకుడి హృదయం తెలుసుకునేందుకు చేసిన విభజన మాత్రమే కొన్ని కథలు ఒకటికి రెండు విభాగాలలో చేర్చదగి ఉండవచ్చు

పైన చేసిన విభజన ప్రకారం కుటుంబ జీవితానికీ, ప్రేమకూ సంబంధించిన కథలు ఏడున్నాయి వాయులీనం, లేడి కారుణాకరం, ఏకరువు, బదిలీ, ఊహా ఊర్వశి, బొమ్మలపెళ్ళి, ఏలూరెళ్ళాలి

''వాయులీనం'' అన్న కథలో వెంకటప్పయ్య తన భార్య సుఖం కోసం ఎన్ని పాట్లయినా పడతాడు ఆమెకు జబ్బుచేస్తే విలవిల్లాడిపోతాడు డబ్బుచిక్కుల్లో ఉండి ఆమె ఫిడేలు అమ్మేసి, మహాద్రోహం చేసినట్టు బాధపడతాడు రాజ్యానికి సంగీతమంటే ప్రాణం కాని కాపురానికి వచ్చాక ఆమె ఏనాడూ పాడలేదు ''(మీరు) ఏతప్పూ చెయ్యలేదు ఏ సంసారైనా అదే చేస్తాడు'', అంటుంది ఆమె భర్తను అనునయిస్తూ కాని ఆమె ఫిడేలు పోయినందుకు ఏడుస్తుంది తన భర్త తన కోసం తెచ్చిన చీరకేసి చూడనైనా చూడదు

''లేడి కరుణాకరం'' కొంచెం అసాధారణమైన కథే అయినా, నీతి సూత్రాలను తారుమారు చేసిన కథ నిజానికి నీతి నియమాలు ఆర్థిక నియమాలకు అడ్డంగా నడుస్తాయి - కులతత్వానికి వర్గతత్వం అడ్డంగా నడిచినట్టుగా ఈ కథలో శారద తన శరీరాన్ని ధనికులైన విటులకు తాకట్టు పెట్టి వాళ్ళకు పిల్లల్ని కని, తన భర్తను పెద్ద చదువు చదివించి భర్తయిల్లు సంపన్నం చేసి,

అతనికి నైట్ హుడ్ కూడా యిప్పించి, తాను లేడీ కరుణాకరం అవుతుంది తన భార్య నాయుడితో పోతున్నందుకు కరుణాకరం ఆక్షేపణ చెబితే, ''నాయుడు డబ్బుపెట్టి చదువుకున్నావు అతనన్నమే తిని అతని బట్టే కడుతున్నావు నేనేం ద్రోహం చేశాను నీకు (?) వాణ్ణి దోచి పెడుతున్నాను నాకే ద్రోహబుద్ధి ఉంటే వాడితో లేచిపోనూ?'' అని అడుగుతుంది దానికేం జవాబు? ''శారద మహాపతివ్రత!'' అని కథకుడు తేల్చేస్తాడు - ఆ పాతివ్రత్యాన్ని అతడు హర్షిస్తున్నాడని కాదు

''ఏకరువు''లో కథానాయకుడు ఇల్లూ, వాకిలీ, తల్లీ, తండ్రీ లేనివాడు వారాలు చేసుకొని స్కూల్ ఫైనల్ పాస్ అయ్యాడు వెయ్యి రూపాయల కట్నానికి ఆశపడి పరమ వికారమైన పిల్లను చేసుకొని నరక కూపంలో పడిపోతాడు ''అదృష్టవంతుడు'' అంటారందరూ ఎనిమిది మంది బిడ్డల తండ్రి ఇల్లూ ఆఫీసూ, కోమటికొట్టూ, కూరల మార్కెట్టూ తప్ప ఇంకే ప్రపంచమూ ఎరగడు ''దరిద్రుణ్ణి, దగాపడిపోయాను సంచీ రూపాయలకీ, ముప్పయి రూపాయల సైకిల్‌కీ నీకు నువ్వే ముప్పు తెచ్చుకున్నావంటారు కాబోలు నా స్థితిలో ఉన్న ఎవడూ స్థిమితంగా ఆలోచించుకోలేడు అంటాడతను ఎంత నిజం! అసలైన చెరబండ దారిద్ర్యం

''బదిలీ'' ఒక ప్రణయ వంచితురాలి కథ ముండలను మరిగిన భర్తచేత ఉపేక్షించబడిన స్త్రీని ఒక రసికుడు రెచ్చగొట్టి ప్రణయం జరుపుతాడు ఆ ప్రియుడితో లేచిపోవడానికి కూడా ఆ స్త్రీ సిద్ధపడుతుంది కాని వాడు పిరికివాడనీ, వంచకుడనీ తెలుసుకుని, చెప్పుతో కొట్టినట్టు చేస్తుంది తన భర్తను ఏదో విధంగా సుముఖుణ్ణి చేసుకుంటుది ఉత్తరాల రూపంలో ఉన్న ఈ కథలో స్త్రీ సహజ కాంక్షా, అవినీతీ, ఆత్మగౌరవమూ, విచక్షణా జ్ఞానమూ చాలా చిత్రంగా బాలెన్స్ చేయబడ్డవి

''ఊహా ఊర్వశి''లో చిన్నతనంలోనే పెళ్ళయి, పాతికేళ్ళు నిండకమునుపే పిల్లలు తండ్రి అయాడు ''చిట్టి''ని అపరిమితంగా ప్రేమిస్తాడు కాని ఉన్న పెళ్ళాం చస్తేగాని చిట్టిని పెళ్ళాడలేడు పెళ్ళాం చావదు ''పురుడు దానికి గండం కాదు '' చిట్టికి ఆమె తండ్రి పెళ్ళి చేయలేడు ''చిట్టికింకా పెళ్ళికాక పోవడం తెనుగు యువకుల రసజ్ఞతా దారిద్ర్యాన్ని వెల్లడిస్తున్నది '' అని తిట్టుకుంటాడు తన మాటేమిటి? ''పెళ్ళాన్నే ఊర్వశి అనుకో మనస్సులో చూడు మసిబొగ్గు మాణిక్యమైపోతుంది'', అని తనకుతానే హితవు చెప్పుకుంటాడు ప్రేమ గురించి కలలు కననేర్చిన మన యువతీ యువకుల పరిస్థితి అదీ!

''ఏలూరెళ్ళాలి'' అన్న కథలో కూడా నీతీ, ఆర్థికమూ, నిలువేగీట్లు, అడ్డగీట్లు అవుతాయి పురుషోత్తం పద్దెనిమిదేళ్ళ కాలేజీ విద్యార్థిగా ఉండగా, ఆతనికి రెట్టింపు వయసుగల మాణిక్యమ్మ అరవై ఏళ్ళ ఆడిటరుగారి ద్వితీయ కళత్రమూ, కామాతురతకొద్దీ అతనితో వ్యభిచరించి గర్భవతి అయి కొడుకును కంటుంది భర్త పోతాడు తరువాత తొమ్మిదేళ్ళకు పురుషోత్తాన్ని రైల్లో కలుసుకొని ''నీ వరప్రసాదం ఉండబట్టి ఆయన గడించిన డబ్బు, పిత్రార్జితం దఖలు పడ్డాయి లేకపోతే నా మరుదులు ముండను చేసి మూలను కూచోబెడుదురు'' అంటుంది

''బొమ్మలపెళ్ళి'' ముత్తవ్వ మునిమనుమలకు చెప్పిన కథ బొమ్మలపెళ్ళికీ, మామూలు పెళ్ళికీ తేడా ఏమీలేదు! బొమ్మల పెళ్ళి అసలు పెళ్ళిలాగ చేసినట్టు కథ అసలు పెళ్ళిళ్ళు బొమ్మల పెళ్ళిళ్ళు లాగా ఉంటాయని ధ్వని

దారిద్ర్యమూ, దోపిడీ, రాజకీయాలూ, వీటిగురించి ఏడు కథలున్నాయి కుంకుడాకు, పరబ్రహ్మము, కుక్కుటేశ్వరము, కొండగెడ్డ, బొండు మల్లెలు, ఎంపు, భల్లూక స్వప్నము

''కుంకుడాకు''లో పారమ్మ తండ్రిమోతుబరి రైతు గవిరి తండ్రి దరిద్రుడు పారమ్మకు బుగతగారు ఊరగాయ పెడతారు అది నిర్భయంగా పొలాల్లో పెసరకాయలు పీకి తింటుంది కూలివాడి కూతురు గవిరికి ధైర్యం చాలదు ''నాదారులు చిన్న దొంగతనాలు చేస్తే పెద్ద నేరాలు అవుతాయి'' ఎనిమిదేళ్ళ గవిరి 'నెత్తిమీద కొండంత సంసారభారం ఉన్నది తల్లీ తండ్రీ పొయ్యిమీదికి తేగలిగినా తేలేకపోయినా గవిరి పొయ్యిలోకి తెచ్చుకు తీరాలి'' గవిరి తట్టనిండా కుంకుడాకు ఏరుతుంది పారమ్మ ప్రోత్సాహంతో గవిరి చింతచెట్టుమీదికి రాయి విసిరితే, కాయపడదుగానీ పెద్ద ఎండుకొమ్మ పడుతుంది గవిరి దాన్ని ఆత్రంగా తన తట్టలో పెట్టుకొగానే '' ఎవరది?'' అంటూ భుక్తవచ్చి, దానికి దొంగతనం అంటగట్టి,తట్టనూ, గవిరినీ తంతాడు గవిరికి అభిమానం తక్కువ లేదు తట్టలోకి ఆకును మళ్ళీ ఏరుకుని చింతకంపను మాత్రం తీసుకోదు గవిరి తిన్న తన్నులకు దారిద్ర్యం తప్ప మరే కారణమూ లేదు

''పరబ్రహ్మము''లో ప్రధానపాత్ర పిచ్చివాడు పిచ్చి ఎత్తక వయుందు దారిద్ర్యంతోబాధపడ్డాడు పిచ్చితో అన్ని బాధలు తీరాయి ''అదే వాడి జీవితంలో అదృష్టానికి ప్రారంభం ఊరు ఊరందరికీ వీడిమీద ఎక్కడలేని అభిమానం పుట్టుకొచ్చింది' ' మిలిటరీ హోటలు వాళ్ళు మధ్యాహ్నం పారేసే ఎంగిలి విస్తళ్ళు వాడికి ఆధారం చలి పుట్టినప్పుడు వాడు నిర్భయంగా వెళ్ళి ప్లీడరుగారి లాంకోటు తీసుకొని వేసుకుంటాడు ''చలీ! కోటైనా లేకపోతే ఎలాగనుకున్నావు?'' అని ప్లీడరును అడుగుతాడు కోటులో పెన్నూ, పర్సూ ఉన్నాయి 'వెధవ పెన్ను! వెధవ పర్సు!'' అని వాటిని గిరవాటేస్తాడు కోటు తీసుకున్నందుకు ముసలమ్మ, ''ప్రాణికి ఎంత చలేసిందో బాబూ, ఇంత చద్దనం పెడతాను తింటావా?'' అని అడుగుతుంది పిచ్చివాణ్ణి వాడు సాంఘిక, ఆర్థిక సూత్రాలకు అతీతుడిప్పుడు!

''కుక్కుటేశ్వరము''లో టిక్కెట్టు లేకుండా, బియ్యం మూటతో ప్రయాణం చేస్తున్న ముసలిదాన్ని టీటీఈలు పట్టుకుంటారు ''నన్ను పట్టుకుంటే నీకేం కలిసి వస్తుంది?'' అని ముసలమ్మ ఒకణ్ణి అడుగుతుంది ప్రభుత్వం దగ్గర జీతం పుచ్చుకుంటున్నందుకు తనధర్మం తాను నెరవేరుస్తున్నట్టు వాడు మాట్లాడతాడు 'కేప్స్టన్ సిగరెట్లు అలాగా ఉదేస్తున్నావు! నీవు నీ జీతంమీదే బతుకు తున్నావా?'' అని అతన్ని ఒక ప్రయాణీకుడు అడుగుతాడు చేతనైనవాడు చేతినిండా పుచ్చుకోవలసిందే నన్నదే రైలు అధికారి సిద్ధాంతం కానీ ముసలమ్మ దగ్గర డబ్బు చేపదు ''లక్షలకి లక్షలు వేలకివేలు డబ్బు పోగు చేసుకున్న వాళ్ళంతా ఈ మధ్య కొండ ఎక్కుతరుచు వ్రతాలు చేస్తున్నారు సత్యన్నారాయన మూర్తి వాళ్ళందరికీ బాగా దాఖలా ఇస్తున్నాడు '' తనవంటి వాళ్ళ మీద, భగవంతుడికి దయ, నరుడికి దయ లేదు, అంటుంది ముసలమ్మ తనను రైలు ఉద్యోగులు వదలరని ఖాయమయాక ఆవిడ 'పదండి' భడవల్లారా!

నేనేదొంగ మార్కెట్టులో అమ్ముకొని మేడలు కడుతున్నాను నాకు ఉరిశిక్షకు తక్కువ వేయకండి నా పొగ కుక్కుటేశ్వరుడికి ధూపం వెయ్యండి', అంటుంది దొంగమార్కెట్టులో కొన్నవాళ్ళను ఉరి తీయాలన్నది నెహ్రూగారు ఒకనాడన్నమాటే కుక్కుటేశ్వరుడికి ధూపం వేస్తున్నది ముసలమ్మ లాంటి వాళ్ళ పొగే కూడాను

'కొండగెడ్డ'లో ప్రాజెక్టులు నిర్మాణమయే పద్ధతి చిత్రించబడినది 'వేశారు ఇంజనీర్లని, చేస్తున్నారు పని, ముందు వారి మఖాములకి బంగళాలు మాత్రము అతి శీఘ్రంగా వెలిశాయి జీతాలు ముడుతున్నాయి ముడుపులు చెల్లుతున్నాయి ప్రభుత్వ సంబంధమైన పని వారొక్కటీ చెయ్యడంలేదు చెయ్యనక్కరలేదు వారందరికీ ప్రభుత్వమే జీతాలిస్తున్నది ప్రభుత్వమేమిటే? నువ్వూ, నేనూ''!

''బొండుమల్లెలు'' జాలికీ, దోపిడికీ మధ్య సరిహద్దులేని చిత్రణ పెరట్లో మల్లెలు పెంచి అమ్మితే డబ్బు వస్తుంది పొదులు తవ్వుతానని ఒక తాత వస్తాడు చాలా తక్కువే అడుగుతాడు చవగ్గా కుదిరాడు కదా అని పారబోసే గంజీ, మిగిలిపోయిన అన్నమూ తాతకు పెడతారు మొక్కలకు నీళ్ళు పోసే పనికి కూడా తాతే ఉంటానంటాడు తాతకో కూతురున్నది తన నెలజీతం తీసుకుపోయి దాని చేతిలో పెట్టిన దాకా పట్టెడన్నము కూడా పెట్టలేదు తాతను చూసి ఇంటిల్లిపాదీ జాలి పడ్డారు మల్లెమొగ్గలు కోసి తాతే అమ్ముకొచ్చేవాడు ఖర్చులు పోగా ఇంటి వాళ్లకు లాభం మూడువందలు మిగిలింది తొలకరికి తాత పనిలోకి రాలేదు ''అన్నాళ్ళు పనిచేశాడు కానీ, అతని ఇల్లెక్కడో మేము కనుక్కోలేదు తాత తాత అంటామే తప్ప మా ఇంట్లో యెవరికీ అతని పేరు తెలీదు '' ఇంతకూ ఆ తాత దిక్కులేని చావు చచ్చాడు ''కూతురు సూసింది కాదు,'' అని కబురు తెలుస్తుంది తాత కష్టార్జితం చల్లగా జేబులో వేసుకున్న పెద్దమనిషి ''కూతురిని అనవలసిన పనిలేదు దానికోటిఉందోలేదో ఆలోచించిన కొద్దీ నేనే ద్రోహం చేసినట్లు బాధడ్డాను తాతను పెద్ద దోపిడీ నేనే చేశాను'', అంటాడు చాలా మంది అలాటి మాట అనరు అనుకోరు

''ఎంపు'' లో ముష్టి వాళ్ళ ఆర్థికాలకు మూల సూత్రం ఉన్నది ముష్టివాళ్ళ ఆర్థిక రహస్యం - మూడు పిడికిళ్ళు దొరికితే చావకుండా బతకొచ్చు ముసలాడి కూతురు ఎర్రి కుంటి ముష్టివాణ్ణి పెళ్ళాడుదామనుకుంది వాడి దగ్గిర మూటెడు బియ్యం ఉంది సొట్టాడు తక్కువేం కాదు ''కాపోళ్ళ కుర్రాడు '' కాని ముసలాడు ఆ సంబంధం కొట్టేసి, ఎర్రికో గుడ్డివాణ్ణి తెస్తాడు ''సొట్టాడితో వెళ్ళినావా నీకు కూడు నేదు గుడ్డోడు మారాజు కళ్ళు లేని కబోది ఆణ్ణి చూస్తే జాలి పుడతాది నీ మీద ఆధారపడి నీ చెప్పుచేతల్లో ఉంటాడు నువ్వెక్కడికి వెళ్ళినా సూడరాడు,'' అని కూతురికి బోధిస్తాడు

''భల్లూక స్వప్నం''లో ప్లీడరు గుమాస్తా గవరయ్య ఒక పీడకల కంటాడు యుద్ధం మూలాన అందరికీ ప్రపంచ రాజకీయాలు తెలిసిపోతున్న రోజులు ''అందలమెక్కేవాడూ, మోసేవాడూ, ఆడా, మొగా, పెద్దంతరం చిన్నంతరం లేకుండా - మనుష్యులందర్నీ ఏకం చేసి, 'సర్వమంగళం' కానున్నదని గవరయ్య భయం ఈ భయంతో అతడికి కల వస్తుంది ఇండియా ప్రభుత్వం ప్రజలదయింది సోషలిస్ట్ రాజ్యం రాబోతోంది అన్ని దావాలు బుట్టదాఖలవుతావు

తాను దాచుకున్న డబ్బూ, పెళ్ళాం నగలూ లాక్కుంటారని భయపడి ఇంటికి పరుగెడుతూంటే, రష్యా తెల్లని భల్లూకం రూపంలో వచ్చి పీక పట్టుకుంటుంది పెద్ద కేక పెట్టి నిద్ర లేచిన గవరయ్య, '' ఇండియాలో పొరపాట్లేమీ జరగలేదని గుర్తించి'' సంతోషిస్తాడు

''కర్మ సిద్ధాంతం'' మెట్ట వేదాంతం మీద ఒక విసురు జీవితంలోని ఒడుదుడుకులకు లొంగిపోయి, ఒడ్డున పడ్డ చేపలాగా జీవి కొట్టుకోకుండా ఉండటానికి వేదాంతం అవసరమవుతుంది కానీ ఈ కథలో నిశ్చింతగా బతుకుతున్న పుల్లమ్మకి పేరక్క వేదాంతం చెప్పి, మతి పోగొట్టినంత పని చేస్తుంది ఇంత వేదాంతీ అయిన పేరక్క నోరు చెడ్డకంపు, మాట మార్దవం ఏమీ లేదు పేరక్కకీ ఉర్లాం పండితుడికీ తగాదా ఉందని తెలిశాక గానీ పుల్లమ్మ ఆరాటం దిగిపోదు పుల్లమ్మకు అసలైన వేదాంతం కోడలు చెబుతుంది '' ఈ ప్రపంచంలో పాపం చేసిన వాడికి భగవంతుడు శిక్ష వేయటం లేదు ఖూనీ చేసిన వాళ్ళూ, కొంపలు కూల్చిన వాళ్ళు బాగానే ఉన్నారు, దేముడు శిక్ష వేస్తున్నది అమాయకత్వాన్నీ, తెలివితక్కువతనాన్ని ''

'మొక్కుబడి''లో తాపీమేస్త్రీ పైడితల్లి పెళ్ళాం అంకి, తన కొడుకు రెండు తుమ్ములు తుమ్మితే దేవుడికి మొక్కుతుంది పైడితల్లికి పదిహేను రూపాయలు చేతికి వచ్చేసరికి మొక్కు తీరుద్దామనకుంటుంది అంకికి డబ్బు విలువ తెలీదనడానికి లేదు పొయ్యిలో అగ్గి ఉండగా చుట్ట కాల్చుకునేందుకు అగ్గిపుల్ల వెలిగించనివ్వదు, '' ఊరకొచ్చిందిరా అగ్గిపెట్టె? కొంపలినాగె కూలిపోవడం?'' అంటుంది మొగుడితో దేవుణ్ణి ఎక్కడ ఉంచాలో అంకికి తెలిసినట్టు చాలా మంది మధ్యతరగతి వాళ్ళకు తెలీదు - స్త్రీకి భర్తను మించిన దేవుడు లేడని చెప్పేది మళ్ళా వాళ్ళే!

''బబ్బబ్బా'', 'వెలం వెంకడు'', ''ఎందుకు పారేస్తాను నాన్నా'', ''రథయాత్ర'', ''చిన్నాజీ'' అన్నవి పిల్లలకు సంబంధించిన కథలు వీటిలో పిల్లలకూ, పెద్దవాళ్ళకూ ఉండే సంబంధం కూడా చిత్రితమై ఉన్నది

''దుమ్ములగొండె'', ''మాతృధర్మం'' అన్నవి ప్రకృతి చిత్రణలు

చాసో ఈ కథల ద్వారా ఆధునిక జీవితాన్ని వాస్తవ దృష్టితో చూసి, చూపించాడు ఈనాటి జీవితంలో కల కశ్మలాన్ని కడగటానికి అవసరమైన అభ్యుదయ భావాలను పుష్కలంగా అందించాడు ఎక్కడా తిరోగమన వాదంతో రాజీ పడలేదు, కళాస్రష్టగా అభూతకల్పనలు చేయలేదు, తాను విద్వేషించే అంశాలపై హద్దు మీరిన ఆవేశం చూపలేదు, తనకు సానుభూతి ఉన్న విషయాలను అందలాలెక్కించి ఊరేగించలేదు

కళలు హృదయ స్పందన ద్వారా బుద్ధిని చైతన్యవంతం చెయ్యాలనే సిద్ధాంతం ఒకటి ఉన్నది ఈ కథల్లో హృదయ స్పందనపాలు చాలా తక్కువ అయినా నేను తప్పుపట్టను ఇది బుద్ధిజీవుల యుగం ఈనాటి జీవితం ముందుకు సాగటానికి హృదయ స్పందనలుచాలా కొద్దిగా మాత్రమే సహకరిస్తున్నాయి హిరోషిమాలను గురించి, వియత్నాంలను గురించీ పరిపాలనలో అవినీతిని గురించీ, మింగమెతుకు లేని వాళ్ళు గంపెడేసి పిల్లల్ని కనటం గురించీ, రైతులను భూస్వాములు తుపాకులతో వేటాడటం గురించీ, రేషన్ బియ్యం గురించీ,

రోజురోజుకీ పెరిగిపోయే ధరలను గురించీ హృదయం ఎలా రియాక్ట్ కావాలో ఎవరూ చెప్పనవసరం లేదు ఈ జీవితాన్ని విశ్లేషణ చేసుకునే శక్తి జనసామాన్యానికి అవసరం చాసో కథలు చక్కగా విశ్లేషణ చేశాయి చాసోరచనలలోసూటిదనంతో బాటు వ్యంగ్యమూ, ధ్వనీ కూడా పుష్కలంగా ఉన్నది ఈనాటి కథా సాహిత్యంలో ఈ పుస్తకానికి చాలా ఉన్నతమైన స్థానం ఉన్నదనటానికి ఏమీ సందేహం లేదు

*సంవేదన, త్రైమాసిక, జనవరి 1969*

# 30. పరివృతం

ఈ చిన్న పుస్తకం (124 పేజీలు)లో ఒక గొలుసు కథా, మూడు చిన్న కథలూ ఉన్నాయి గొలుసు కథ('పరివృతం') ముగ్గురూ కలిసి రాసినది 'జెలసీ', 'నీలిమ', 'ఆషాఢస్య ప్రథమ దివసే' అన్న కథలు ముగ్గురూ విడివిడిగా వ్రాసినవి

మొత్తం కథలు నాలుగూ అట్టే బరువైనవి కావు తేలికగా, సరదాగా చదువుకోదగినవి

'పరివృతం' అన్న పెద్ద కథలో బసవరాజు అండ్ బ్రదర్స్ అనే వ్యాపార సంస్థ తాలూకు బ్రాంచిని రాంప్రసాద్ అనే విలన్‌మేనేజి చేస్తూ, ఉద్యోగాల కోసం వచ్చిన ఆడపిల్లల్ని అనుభవిస్తూ ఉంటాడు చివరకు రాంప్రసాద్ పాపం పండి బసవరాజు చెల్లెలే వచ్చి ఉద్యోగంలో చేరి, రాంప్రసాద్ వెంట అతను కోరిన ప్రకారమే కారుషికార్లు తిరిగి, సరిగా క్లైమాక్స్ వచ్చేసరికి పిస్టలు తీసి, రసవత్తరమైన నాటకం ఆడి, మర్నాడు ఆఫీసులో రివల్యూషన్ ప్రదర్శన జరిపి, చిట్టచివరికీ విలన్‌లో హృదయ పరివర్తన తెచ్చి, తన ఫ్రెండ్ అయిన సరళ కోరగా, ఆమె భర్త అయిన రాంప్రసాద్‌ను వార్నింగ్‌తో పోనిస్తుంది

బసవరాజు కంపెనీకి బసవరాజు అండ్ సిస్టర్ అని పేరుంటే సరిపోయేది బసవరాజు బ్రదర్స్ ఈ కథలో అగస్త్య భ్రాతలు

గొలుసు కథలతో కొన్ని చిక్కులున్నాయి భాషా, భావ ప్రకటనా, ఒక్కొక్కసారి పాత్ర పోషణా మొదలైనవి రచయితకూ, రచయితకూ మార్పు చెందుతాయి ఈ కథలో అదనంగా మరొక అంశం చేరింది సాయికుమారి రాసిన రెండో భాగం ఇందిర అనే పాత్ర స్వయంగా చెప్పినట్లున్నది

మరొక చిక్కేమిటంటే ప్లాట్‌లో కూడా కొంత ఎగుడూ దిగుడూ రావచ్చు ముగ్గురూ కలిసి ముందుగానే ప్లాట్ అనుకున్నప్పటికీ - ఈ సందర్భంలో అనుకున్నట్టే కనబడుతుంది - శిల్పంలో కొంత స్ఖాలిత్యానికి అవకాశం ఉంది ఉదాహరణకి ఆదివిష్ణు రాసిన మొదటి భాగం లిల్లీ అనే ఆమెతో ప్రారంభమవుతుంది రాంప్రసాదుకు బసవరాజంటే భయం ఉందని నిరూపించటానికి మాత్రమే ఈ పాత్ర ఉపయోగపడింది ఈమె రాంప్రసాద్‌ను ''ఊటీ'' హోటల్లో తన గది నుంచి వెళ్ళిపోకుండా ఎందుకు ఆపింది? అతను తనకోసం వదిలేసిన పర్సును ఆఫీసుకు తెచ్చి తిరిగి ఎందుకిచ్చింది? ఈ పాత్రను కథకు ఇంకా వినియోగించుకునే అభిప్రాయం ఆదివిష్ణుకుండి ఉండాలి కాని మిగిలిన ఇద్దరూ ఆ పాత్రను గాలికి వదిలేశారు

సాయికుమారి వ్రాసిన ఇందిర స్వయంకథనం బాగంలో ఇందిర రాంప్రసాద్ తనను ఎప్పుడేమి చేసిపోతాడోనన్నట్టు భయపడటం - భయపడ్డానని చెప్పటం - టెక్నిక్ దోషం తాను ఏమి చేస్తున్నదో, ఎందుకు చేస్తున్నదో తెలిసిన మనిషి ఈ కథలో ఇందిర పాత్ర ఒకటే

రెగ్యులేషన్ అచ్చుతప్పులతో బాటు ఈ కథలో మరో ఘోరమైన తప్పున్నది పాఠకులు 48వ పేజీ తరవాత 50వ పేజీ చదువుకొని, ఆ తరవాత 49వ పేజీ చదువుకుని మరీ 51వ పేజీకి వెళ్లాలి

'జెలసీ' అన్న ఆదివిష్ణు కథకు సరయిన పేరు 'ప్రైడ్' ఈ కథలో ప్రధాన పాత్రధారి తాను కాలేజీలో ప్రేమించిన శకుంతల భర్త సహాయం పొందాలంటే, తాను చచ్చు ఉద్యోగం చేస్తున్నానని శకుంతలకు తెలియనివ్వాలి అది ఇష్టం లేక అతను తాను చాలా ఉన్నత స్థితిలో ఉన్నట్టు కోతలు కోసి శకుంతలను నమ్మించి, ఆమె భర్త సహాయంతో తన వూరికి ట్రాన్స్‌ఫర్ వేయించుకోకుండా వచ్చేస్తాడు ఇతివృత్తం జువెనైల్‌గా ఉన్నా కథనం బాగుంది

'నీలిమ' జి వి సాయికుమారి కథ కృష్ణుడితో నీల అనే అమ్మాయి ప్రణయం ఒక్క ముక్కలో చెప్పాలంటే పురాణాల నాన్సెన్సు ఆధారంతో రాసిన రొమాంటిక్ నాన్సెన్స్

కృష్ణుడు వ్రేపల్లెలో గడిపినది వ్రాత్య జీవనం అతను ఆ జీవితం వదలి మధురకు పోయి, నాగరిక జీవితంలో పడి, అందులో ఇముడలేక, ద్వారకలో ఒక విధమైన గణజీవితం ఏర్పాటు చేసుకున్నాడు గణజీవితంలో ఒక నాయకుడూ, ఒక రణ నాయకుడూ ఉంటారు రాజులుండరు ఉగ్రసేనుడు యాదవుల సభా నాయకుడూ, కృష్ణుడు రణనాయకుడూ అని తోస్తుంది ఏ నిర్ణయం జరిగినా గణ ప్రముఖుల అనుమతితో జరగాలి రాజులయుగంలో వెలువడిన పురాణాలలో కృష్ణుణ్ణి రాజు చేసేశారు భక్తివాదులు భగవంతుణ్ణి చేసేశారు అతనికి అతిలోక శక్తులన్నీ అంటగట్టారు పురాణాలలో ఉన్న ఎరలన్నీ మింగి సాయికుమారి 'నీలిమ' కథను రాసి, అందులో ప్రేమకూ, భక్తికీ, మానవధర్మాలకూ, ఆధ్యాత్మిక శక్తులకూ ముడిపెట్టి ఈ కథ తయారుచేసింది ఇది ఆధునికమూ కాదు, పౌరాణికమూ కాదు - కృతకం

కృష్ణుడి అష్ట భార్యలలో నీల ఒకతె ఆమె కృష్ణుడికి పరాయిది కాదు

'ఆషాఢస్య ప్రథమ దివసె' సింగరాజు రామచంద్రమూర్తి కథ పేరు సార్థకంగానే ఉంది ఆషాఢస్య ప్రథమ దివసాన శిక్షితుడైన యక్షుడు మేఘాన్ని చూసి తన విరహబాధ చెప్పుకుంటే, ఈ కథలో రమణ మూర్తి పెళ్లాన్ని వెంటబెట్టుకొని ఒక రాత్రల్లా విరహం అనుభవిస్తాడు కాళిదాసుగారి యక్షుడికి కుబేరుడు శిక్ష ఇస్తే, రమణమూర్తికి ఆషాఢమాసంలో అత్తా అల్లుడూ ఒక ఇంట ఉండరాదన్నది శాపమై కూర్చుంటుంది ఇక్కడ ఒక చిన్న భేతాళ సందేహం - ఆషాఢ మాసంలో అత్తా కోడళ్లు ఒక ఇంట ఉండరాదన్న నియమం ఉన్నది అత్తా అల్లుళ్లకు అలాటి నియమం ఉందా?

కథకుడు కొంచెం శ్రద్ధ తీసుకుంటే ఈ కథలో ఎంత సస్పెన్సుకైనా అవకాశం ఉంది రమణమూర్తీ, వసుంధరా భార్యభర్తలన్నమాట చివరిదాకా పాఠకుడికి అంతుబట్టనివ్వకపోవటం ఒక పద్ధతి సినిమాహాల్లోనూ, హోటల్లోనూకూడా రమణమూర్తి మామగారి బెస్ట్ ఫ్రండ్సే ఉండటం అంత బాగాలేదు ఏమీ చెయ్యకపోయినా వసుంధర పాత్ర ఆకర్షవంతంగా ఉంది ఆమె దుర్గ గుడి హుండీలో డబ్బు వెయ్యడం నాకు చాలా తెలివైన ''టచ్''గా కనబడింది

ఆధునిక భావాలు గలవాళ్లు అది మూఢాచారంకింద కొట్టేస్తారు కాని ఈమె రమణమూర్తితో ''మన పెళ్లయినందుకు అమ్మవారికి ఇస్తానన్న లంచం'' అనగానే ఎంత నాస్తికుడికీ ఎంతో సానుభూతి కలుగుతుంది అంతేకాదు వసుంధరకు తెరవెనుక జరుగుతున్న మోసమంతా తెలుసు ఆ సంగతి తెలిసినాక రమణ మూర్తికి ఎంత కోపమైనా రావచ్చు కాని తనను పెళ్లాడటానికి అమ్మవారికి లంచం పెట్టినదానిమీద ఎలా కోప్పడతాడు?

చాలా క్లెవర్ టచ్!

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 29-1-1969*

# 31. అందం, మయసభ

శ్రీ సుభాగారు కథలు ప్రచురించటం ప్రారంభించి ఎంతోకాలం కాలేదనుకుంటాను ఆయనకు కొంత కీర్తికూడా వచ్చినట్టు కనబడుతుంది దాని ఫలితమే ఈ రెండు కథానికా సంపుటాలు వీటిని కోకానికి అందించిన ''ప్రచురణోపాసకులు'' (1) అట్టచివర ''బహిరంగలేఖ'', 'వెనక మాటలు'' ద్వారా, ''యీ పుస్తకం మీ స్వంతం అవటం - అంటే అందుకు ప్రతిగా మీ స్వంతంలో ఎన్నొ వంతో (??) మాకు - ఇంకా చెప్పలా, సారి భలేవారేనే!'' అని ''అవాక్కు'' అయిపోయారు కాని నిజానికి వారు నోటమాట రానంతగా గందరగోళం పడవలిసినంత గొప్పతనం కథలలో కనిపించదు

రెండు సంపుటాల్లోనూ రెండు తొమ్మిదులు పద్దెనిమిది కథలున్నాయి ఇతివృత్తాలు సామాన్య జీవితానికి సంబంధించినవే కథకుడికి జీవితం సమస్యల పట్ల పాఠకులకి చెప్పుకోదగిన సెంటిమెంట్స్ కొన్ని ఉన్నాయనటానికి సందేహంకూడా లేదు

కాని కథనం సాఫీగా ఉండదు గతుకుల దారిమీద బండినడకలాగుంటుంది కథకు సంబంధించని పాత్రల ప్రస్తావన ఉంటుంది 'అందం' అన్న కథ తీసుకొండి లలిత అందంగురించిన కథ అది ఎవరో విశాల అనే ఆమె లలిత అందాన్ని పొగిడిందట ఒకరోజు లలిత శారద అనే ఆమెకోసం వెళ్ళిందట రాజేశ్వరరావు అనే వాడు లలితమీద దాడిచేశాట్ట ఈ విశాల, శారదా, రాజేశ్వరరావూ ఎవరో మనకు తెలీదు ఇటువంటి పేర్లు అనేక కథల్లో మనకు తగులుతాయి అలా పేర్లు జార్చటం వాస్తవికతకు దోహదం చేస్తుందని రచయిత అభిప్రాయం అయి ఉండాలి

ఒక్కొక్కసారి రచయిత చూపే ఆవేశం కథ యొక్క పరిధిలో నిలవక, తారాజువ్వలాగా ఎక్కడికో వెళ్లిపోతుంది పైన చెప్పిన కథలో లలితను ఎమ్మే చదువుకోనివ్వక పెద్దవాళ్లు పెళ్లిచేసేస్తారు ఇది పెద్ద ట్రాజెడీ అని పాఠకుడికి తట్టదు కాని కథకుడికి ''దుఃఖంచేత కన్నీళ్లు తిరిగాయి సౌందర్యాన్ని గుర్తుపట్టి హారతులివ్వలేని మనుష్యులు రాళ్లుగా మారిపోతారు దేవుడా! నా దేశాన్ని రక్షించు మేం గుర్తించలేదని నువ్వు సృష్టించిన సౌందర్యాన్ని నువ్వే కబళించకు అదే నా కోరిక'' అని ఆవేశపడిపోతాడు

ఈనా కథకులు సంభాషణలు సహజంగానూ, స్వాభావికంగానూ రాయటం ఒక గొప్పవిద్య కింద పాటించరు ఈ కథల్లో అక్కడక్కడా ఆ విద్య కూడా లోపిస్తుంది

''నీవన్నది నిజం'' అన్న కథలో ప్రసాదరావు వెళ్లిపోతూ, ''అరుంధతిని ప్రేమిస్తున్నాను నిజం కానీ యివాళ రోజు మీ యింటినుంచి వెళ్ళిపోతున్నా జీవితంలో నేను వెనక్కి తిరిగిన ప్రతి క్షణం మీరు కనిపిస్తారు మౌనంగా నేను నమస్కరించడం, మీరు కాదనడం జరగొచ్చు మీరు రమ్మనకపోయినా వచ్చి, మీ తలుపు వెనకనుంచి విడిచిన నిట్టూర్పులో భాష కందని ఆక్రందన - తలుపు తట్టలేని వేళ్ల మొనల స్పర్శానాదే అయ్యుంటుంది'' అని సినిమా హీరోకుకూడా మహా బరువనిపించే మాటలంటాడు

ఈ కథలలో అన్నిటికన్న దారుణంగా పట్టి ఇచ్చేది భాష, కొన్ని మాటలకు అర్థంకూడా రచయితకు తెలసినట్టు కనబడదు ఉదాహరణలు

''కనీ కనిపించని వూలు దారాలు ''

''అందరూ తమ - తన్ని - నచ్చుకుండానే ప్రభావం సంపాదించారు ''

''యెదుర్కోవలసిన సమస్యలు కొండలన్ని వుండగా యీ గతితార్కికమేమిటి?''

''అలాగేనండీ'' అన్నాను, ఆయన్ని పరోక్షంగా చూస్తూ

''అర్థవిహీనమయిన విషయాలకు ప్రాధాన్యం ఇస్తాం ప్రాధాన్యం తీసుకోవలసిన సంఘటనలు బూడిదలో కరిగిపోతూంటే అర్థవిహీనతతో నిలబడిపోతాం ఇది ఈ దేశంలో మనుష్యుల - ముఖ్యంగా యువకుల మనోబలం కాబోలు అందుకే మన దేశం ఎంతో అభ్యుదయానికి వెనకపడింది ''

''ఎలా ఉందయ్యా ఉద్యోగం? ఏం రుచిగా లేదా?''

''మీకు ఆంతర్యం లేకపోతే లోపలికి రావచ్చు ''

''ఎర్రాబొట్టు స్వచ్ఛందమూన నుదుటిమీద ''

''మునిపంటితో నవ్వుతూ మతాబా కాలుస్తున్నది రాజ్యం''

''రాజ్యాన్ని చాలా గురిగా చూసేవాణ్ణి ఎప్పుడూ ఆమెలో అది కన్పించలేదు మనిషికి దగ్గర కావాలనే 'వెర్రి' శరీరంలో ఏ మూలా తొణకదు

''వెనుదిరిగి చూసుకుంటే నా అనే శబ్దము నేను లేననీ, మేం అనే శబ్దార్థంకోసం మనసు గిలిగింతలు పెడుతున్నదనీ తెలిసివచ్చింది ''

''నువ్వు వట్టి ఆవేశపు మనిషివి'' అన్నది మనసు వ్యంగ్యంగా నవ్వుతూ

''నిజజీవితంలో మనిషే అయితే'' (వాస్తవ జీవితం అనే అర్థంలో)

''పోయేవాడిపైపు నిరాశాజనకంగా చూస్తూ'' (నిరాశగా అనటానికి)

''వాడి తరహా మాకు ఆశ్చర్యజనితంతోబాటు ఆలోచన్లు రేకెత్తించేదిగానే వుండేది ''

''గ్లామర్ ధ్వెప్టింగ్''

''మనుష్యులు జీభూతాల్లా కనిపించారు '' ('జీ' దేనికి?)

''అంతులేని అనంతాలు ''

''అందం విజృంభించి, విశృంఖలాల్ని పెంచుకుని ''

ఇలా ఉదహరించటానికి వీలులేని అయోమయం చాలా ఉంది

నేను కొంతకాలంగా ఒక చిత్రం గమనిస్తున్నాను పత్రికల్లో మనం చదివే విడికథలు రచయితలో ఉండే శక్తులన్నిటినీ ప్రదర్శించలేవు కథలు సంపుటాలుగా వచ్చినప్పుడు

రచయితలోని బలమూ, దౌర్బల్యమూ కూడా కొట్టవచ్చినట్టు కనిపిస్తాయి ''నాల్గో మజిలీ'' లాటి కథను పత్రికలో చదివినప్పుడు ''శ్రీ సుభా'' పైన కొంత ఆశ పుట్టుకొచ్చిన మాట నిజం కాని ఈ రెండు సంకలనాలూ చాలా నిరాశ కలిగిస్తున్నాయి

*ఆంధ్రప్రభ వారపత్రిక, 12-2-1969*

# 32. గరిక పోచలు

88 పేజీల ఈ పుస్తకంలో 9 రచనలున్నాయి ఈ రచయిత భాషతను, భావ ప్రకటనతను, కొంత మార్దవమూ, నమ్రతా కనిపిస్తుంది అదే నమ్రత పుస్తకము పేరులో కూడా వ్యక్తమవుతుంది ఇందులోని కొన్ని కథల ఇతివృత్తాలు చూస్తే ఇది కృత్రిమమైన నమ్రత కాదేమోననిపిస్తుంది కథా వస్తువులలో బరువు తక్కువే ఇందులో మొదటి కథపేరు 'పాత కథ' రచయిత చేసిన హెచ్చరికను బట్టి ఇది ఒక్కటే వాస్తవ సంఘటన అని తెలుస్తున్నది కాని చదువుతుంటే అలా అనిపించటం లేదు కథగా ఇది పాతదే కూడానూ చక్రపాణిని అనూరాధ ప్రేమించింది ఎగబడి మరీ ప్రేమించింది చక్రపాణి తమ వివాహం పొసగదని నిరుత్సాహపరిచినమీదట ఆమె తండ్రి కుదిర్చిన వాణ్ణి పెళ్ళాడి బిడ్డతల్లి అయింది చక్రపాణి సరస్వతిని పెళ్ళాడాడు కాని అతనింకా అనూరాధ గురించే తియ్యటి కలలు కేటాయించుకున్నాడు ఈ సంగతి సరస్వతికి తెలుస్తుంది ఆమెకు తెలిసిందని చక్రపాణికీ తెలిసింది ఆమె అతన్ని ఏమీ అనదు అంతదాకా సరస్వతికన్న అనూరాధనే ఎక్కువ అంచనా వేస్తున్న చక్రపాణీ, కథకుడూ కూడా సరస్వతి గొప్పదని తేల్చుకుంటారు ప్రేమించటంకన్న అసూయ పడకపోవటం గొప్ప అనుకోవాలిలాగుంది

''ముందడుగు''లో కథ ఏమీ లేదు నారాయణ బాబు అనే అభ్యుదయవాది తన జీవితంలో స్త్రీలపట్ల దారుణంగా ప్రవర్తించి, ముందడుగు అనే నవలలో స్త్రీలపట్ల ఆదర్శంగా ఉండాలని ఉద్బోధించి, కనీసం ఒక మనిషిని ఇన్‌స్పైర్ చేస్తాడు రచయితలు ''నిత్యజీవితం నుండి పారిపోయి లాభంలే''దని వాదించే నారాయణబాబు నిత్యజీవితంనుంచి పారిపోయి ''ముందడుగు''రాశాడు! అభ్యుదయ రచయితలపైన ఇందులో విసురున్నది

'కుడి ఎడమలు'లో రాజకీయాలమీద విసురుంది ఈ కథ బొత్తిగా నీతికథలాగుంది కానీ వాస్తవికత - నీతిలో - ఏమున్నదో బోధపడటంలేదు కుడి, ఎడమల వాళ్ళు మధ్యస్థంగా (తటస్థంగా) ఉన్న ఆడకూతుర్ని గోదావరిలోకి తోసెయ్యాలని చూస్తారు! కొందరికి రాజకీయాలు అలాగే కనిపిస్తే ఆ తప్పు రాజకీయాలదే

''తెలివి'' లోకూడా రాజకీయాలున్నాయి అందులో పేదలను ఆదుకునేవాళ్లు పరమ దుర్మార్గులు

''తగూ'' కథలో ఒకడు అర్ధణాకు దగా పడతాడు పట్టపగలు ఒక గడుసు ఆడది అతని అర్ధణా తనదే నంటుంది చివరకు మరో అర్ధణా చెల్లించుకుని బయటపడ్డ పెద్దమనిషి తన 'మోసాన్ని'' నిరూపించుకున్నాడనిపించుకుంటాడు!

''జీవచ్ఛవాలు'' ఒక ఫాంటసీ అందులో వనజమ్మ అనేది నరరూప పిశాచి ఆడవాళ్లలోకూడా దుర్మార్గులుండవచ్చు గాని, ఈ వనజమ్మకు సూర్యకాంతం కూడా చాలదేమో!

''సిగరెట్టు'లో అతిశయానికీ, సిగరెట్లు కాల్చటానికీ ముడిపెట్టబడింది సిగరెట్టుతో అప్పారావు దివాలా తీయటమేకాక, కేన్సరుతో చస్తాడు సిగరెట్టును ఇలా పరాకాష్ఠపట్టించటం బహుశా మరే కథకుడికీ సాధ్యం కాదేమో

''తెలిసీ తెలియనివాడు''లో పున్నయ్య ప్రమోషనుతో మిడిసిపడి, రిట్రెంచిమెంటుతో పతనమవుతాడు అతని పతనానికీ, మిడిసిపాటుకూ ఎలాటి సంబంధమూలేదు గనక ఈ కథలో శిల్పంగాని నీతిగాని దొరక్కుండా ఉంది

'బాలకాండ'లో మరొక స్త్రీ వికార మనస్తత్వం చిత్రించి ఉన్నది తన పొరుగు ఆవిడ పిల్లల తగలాటం లేకుండా ఉన్నంతకాలమూ సుఖంగా తిరిగే ఆవిడ స్వేచ్ఛను చూసి ఈర్ష్య పడుతుంది ఆమె కడుపుతో ఉన్నదని తెలియగానే, తనలాగే ఆమెస్వేచ్ఛకూడా పోతున్నందుకు తృప్తి పడుతుంది

మొత్తం మీద ఈ రచయితకు స్త్రీలపట్లా, అభాగ్యులపట్లా అంతగా సానుభూతి ఉన్నట్లు కనపడదు

జీవితంలోని ఉసర క్షేత్రాలలో గడ్డి పరకలు కనపడే మాట నిజం గడ్డిపరకైనా ఫరవాలేదు వాటి మధ్యగా కాస్త గట్టి గాలి కొడితే అవికూడా చైతన్యం ప్రదర్శిస్తాయని రాచకొండవారు పదేపదే రుజువు చేశారు ఈ పుస్తకంలోవి ఇంచుమించు నిశ్చలంగా ఉన్న గడ్డిపరకలు

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 12-3 1969*

# 33. బార్రిస్టరుగారి బాతాఖానీ

ముందుగానే ఒక్కమాట చెప్పాలి సాహిత్యంలో మాత్రం ప్రసిద్ధమైన పాత్రలను మార్చటం నేనెంత మాత్రమూ ఒప్పుకోను మునిమాణిక్యంవారు కాంతాన్నితల నెరిసిన ముసివాయినం ముత్తయిదు చేసి, కాంతం భర్త వెంకట్రావును ''ముసిలాయన'' అనటం నాకు బొత్తిగా సమ్మతం కాదు 1897కు యువకుడుగా ఉండిన గిరీశానికి ఈ సరికి నూరేళ్లు నిండబోతూ ఉండాలి అందుకని గిరీశాన్ని వృద్ధుడుగా చిత్రిస్తే ఎవరన్నా సహించగలరా? ఇలాటి పాత్రలు అజరామరంగా ఉండాలి

నరసింహశాస్త్రిగారు 1925 ప్రాంతాల్లో సృష్టించిన పార్వతీశం బార్రిస్టరై వచ్చి, మనం గుర్తించరాకుండా మారిపోయి, అయిదో దశకానికల్లా యాభై ఏళ్ల వాడయాడు ఈ బార్రిస్టరు పార్వతీశాన్నినేను గుర్తించాను ఈయన బార్రిస్టరు సోమసుందరమైనా, బార్రిస్టరు రామనాథ మయినా కూడా నాకేమీ అభ్యంతరం లేదు

ఈ బార్రిస్టరుగారి బాతాఖానీకి వస్తే, గ్రంధకర్త చెప్పినట్టు, దీనికి కొద్దిపాటి కాలదోషం పట్టిందనటానికి సందేహం లేదు ఈనాడు పదహారణాల ఆంధ్రులు లేరు - వాళ్లు అణాలతోనే పోయారు సంక్రాంతీ, ఉగాదీ వగైరా పండగలు ఎలా జరుపుకోవాలన్నది ఈనాడు పెద్ద ప్రశ్న

కాదు ప్రతివాడూ డైరెక్టరయిపోతున్నాడే అన్న దుగ్ధగాని, దీర్ఘోపన్యాసాలిచ్చి జనాన్ని అదరగొట్టాలన్న కాంక్షగాని ఆనవాయితీలో లేదు కోతలు కొయ్యటానికి చాలా సూక్ష్మమైన మార్గాలీనాడు ఉన్నాయి

ఈనాడు సమస్తమైన అవలక్షణాలూ రాజకీయ బురఖా చాటున ప్రచారమవుతున్నాయి డబ్బొకటి బాగా ఏలుతున్నది ప్రజలలో వాస్తవిక దృష్టిపూర్తిగా వచ్చిందనలేం గాని, క్రమంగా పెరుగుతున్నది కవులు - మిగిలిన రచయితలందరికన్నా కూడా - ప్రజలకు చాలా దగ్గిరవుతూండటం చాలా విచిత్రమైన పరిణామం మొన్న సౌమ్య ఉగాదినాడు విజయవాడ నుంచి ఆకాశవాణి ప్రసారం చేసిన కవి సమ్మేళనం ఇందుకు ప్రత్యక్ష తార్కాణం వారానాడు చదివిన గేయాలతో పోల్చితే ఈ బారిస్టరుగారి ''బాతాఖానీలు'' ప్రజలకు మైళ్లు ఎడంలో ఉన్నాయనిపిస్తుంది

అది తప్పనిసరా? 1953, 54లలోనూ, అంతకు ముందూ రాసిన వ్యాసాలకు ఈనాడు గిరాకీ ఉండరాదా? ఉండవచ్చు ఉండేదే కూడాను కాని మొక్కపాటివారు వీటిని హాస్యధోరణిలోనే సాగిపోనివ్వాలో, మర్మస్థానాలను ఛేదించేటట్టు రాయాలో పనిపెట్టుకుని నిర్ణయించుకోలేదని నా అనుమానం

పదహారణాల ఆంధ్రుడు చచ్చినా పంచె కట్టడు అతని దృష్టిలో హోటళ్లూ, శాస్త్రీయ సంగీతమూ అరవవాళ్ల సొమ్ము ఉత్తమ చిత్రాలు హిందీవాళ్లే తియ్యాలంటాడు నాటకాలకూ నవలలకూ బెంగాలీలనే ఒప్పుకుంటాడు ఒక్క ముక్కలో చెప్పాలంటే, పదహారణాల ఆంధ్రులకు '' ఆంధ్రుల చరిత్ర కాని, ఆంధ్రుల వేషభాషలుగాని, వారి శిల్పం, సాహిత్యం, సంగీతం, సంస్కృతీ వగైరా ఏమీ అవసరం లేదు '' ఆంధ్రులమీద ఇది హాస్యపూరితమైన విసురే కాని ఈ విసురు ఆంధ్రత్వానికి సూటిగా తగలదు ఉదాహరణకు చెప్పాను ఆంధ్రులను వేధించే ఇతర అవలక్షణాలు - ఆరంభశూరత్వం, అతితెలివీ, ఎంటర్ ప్రైజ్ లేకపోవటమూ, లిటిగేషను మనస్తత్వమూ లాటివి చాలా ఉన్నాయి మనం అడుగున పడిపోతున్నది పైవాళ్ళను మెచ్చుకొని కాదు మన బాగు మనం చూసుకోలేక

అయినా కొన్ని విషయాలు జీవితానికి సూటిగా తగులుతున్నాయి ''పోనిద్దురూ! మనకెందుకు?'' అన్న రామప్పపంతులు మనస్తత్త్వం ఒక ఆంధ్రులలోకాదు, భారతీయులందరిలోనూ ఉన్నది అది క్షమించరానిది ఈ మనస్తత్త్వం మనలో ఉండబట్టే జైళ్ళలో ఉండవలసిన వాళ్ళు గద్దెలెక్కికూర్చున్నారు ఈ మనస్తత్త్వం లేనివాళ్ళు ఒకరో ఇద్దరో, ఫిరోజ్ గాంధీ, చంద్రశేఖర్ లాటివాళ్ళు పార్లమెంటులో ఉంటే ఎంత సంచలనం కలగాలో అంతా కలుగుతున్నది అలాటి సంచలనం ఎంతో లేనిదే ఈ దేశం బాగుపడుతుందా?

''అన్నీ మనకే వావాలి మనకు కావలిసినది మనం తెచ్చుకోకపోతే, మనకు తెలియనిది తెలుసుకోవటానికి ప్రయత్నించకపోతే, మన్మై పడుతున్న ప్రమాదాన్ని తప్పించుకోడానికి ముందు మన ప్రయత్నం యత్కించితేనైనా లేకపోతే మనకు మానవుడుకాని, దేవుడుకాని సహాయం చెయ్యలేడు, చెయ్యలేడు'' అని బారిస్టరుగారన్నది వేదవాక్కే ''మనకెందుకనే మతం మార్చుకుని, మనకు కాకపోతే ఇంకెవరికనే తత్త్వంలోపడండి'' అని ఆయన ఇచ్చిన సలహా అవశ్యాచరణీయం

బార్రిస్టరుగారి భావాలన్నిటితోనూ మనందరమూ ఏకీభవించకపోవచ్చు గత కాలంగురించి ఆయనకు కొన్ని 'నోస్టాల్జియాలు'' ఉండటం సహజం కాని ఆయన చెప్పే అనేక విషయాలు ఆక్షేపించటానికి ఏమాత్రమూ వీలులేనివి చూడండి

''ఒకరి అనుభవాలు ఇంకొకరికి అక్కరకు రావు ''

''ప్రజానీకం ఎవరు ఏమాట చెపుతే ఆ మాట వింటారు ''

''మనకంటే తెలిసినవాళ్లు మరొకరుండరని మాన అహంభావం''

''ప్రతి నిత్యము మనకు ప్రత్యక్షమయ్యే సమస్యలను సజావుగా సమర్థించుకొని, సవ్యంగా జీవయాత్ర సాగించుకోడానికీ విద్య ఎందుకుపకరిస్తుంది చెప్పండి ''

''అలా (డబ్బు) సంపాదించినవాళ్లనే మనం గౌరవిస్తాం అధికారం ఇస్తాం సభాపూజ్యత ఇస్తాం అతను చేసే అవినీతులను చూచీచూడనట్టు ఊరుకుంటాం అతను పేలే అవాకులూ చవాకులూవిని సంతోషించినట్టు నటిస్తాం ''

''కాఫీహోటల్లో అందరితోనూ తిని, వాళ్లు తిన్న ప్లేట్లూ, కప్పులూ మనం వాడుకున్న తరువాత ఇంటికొచ్చి, నేను సనాతనుడను, నా పంక్తిని ఇంకొకడు కూర్చోడానికి వీల్లేదు అనడంలో సబబు ఏముంది?''

'' ఈరోజుల్లో వాళ్లు (ఆడవాళ్లు) చదువుకుని, వాళ్ల పొట్ట వాళ్లు పోసుకోడం చాలా అవసరం లాగనే కనబడుతోంది ''

''కష్టము అనుభవిస్తూ ఊరుకోడం ధర్మమూను, మన చేతనైనంతవరకూ కష్టములను తొలగించుకోడం అధర్మమూ అవుతుందా ఎక్కడేనాను?''

''ఏనాడో ఎవరో చెప్పారు కనుక ఈనాడు, ఎంత అవకతవకగా ఉన్నా అలాగే చేసితీరుతా వనడములో నాకు సబబు కనపడటంలేదు ''

'' ఈ రోజుల్లో మనిషికీ మనిషికీ ఈ భేదం (అస్పృశ్యత) ఉండకూడదు''

''ఏకాలానికి ఏది ధర్మమో అది తెలుసుకుని అది వ్యవహరించక తప్పదు ''

''కుర్రాళ్లను స్వేచ్ఛగా బ్రతకనివ్వాలి వాళ్ల స్వేచ్ఛ నరికట్టడానికి మన వెవళ్ళం?''

బార్రిస్టరుగారు సంకల్పబలాన్ని నమ్ముతారు పది మంది విద్యార్థులు బలంగా కోరుకుంటే వాళ్ల ప్రొఫెసరు గొంతు కోసుకు చచ్చాట్ట! అచ్చ సంకల్ప బలాన్ని భౌతికవాదులు ఒప్పుకోరు సంకల్పానికి భౌతికమైన పునాది ఉండాలంటారు ఇలాటి విషయాలలో మనం బార్రిస్టరుగారిని కావలిస్తే ఆక్షేపించవచ్చు కాని ఆయన బాతాఖానీనుంచి మనం నేర్చుకోవలిసిన విషయాలు ఉన్నాయని కూడా ఒప్పుకోవాలి

*ఆంధ్రప్రభ, వారపత్రిక 30-4-1969*

# 34. విన్నవి - కన్నవి

వివిధ జీవిత రంగాలమీద వ్యాఖ్యానిస్తూ, విమర్శలు చేస్తూ తెలుగులో చాలా సాహిత్యం వచ్చింది అయితే మన బుక్‌పబ్లిషర్లు ఇలాంటి సాహిత్యాన్ని పుస్తక రూపంలో వెలువరించటానికి అంతగా ఆసక్తి చూపటంలేదు దానికి మార్కెట్ లేదని వారి ఉద్దేశం కావచ్చు అలా అయితే అది అపోహ కిందటి నెల విడుదలయిన చిత్రాలు చాలా భాగం ఈనెలలో నామరూపాలు లేకుండా పోయినట్టే, కిందటేడు విడుదల అయిన కల్పనా సాహిత్యం కొంత ఈ ఏటికి కనుచూపుమేరలో లేకుండా పోతున్నది కాని పుస్తకరూపంలో వెలువడిన వ్యాసావళి - ప్రత్యేకించి 'కన్నవీ - విన్నవీ' లాటిది ఎంతకాలమేనా బతికి ఉంటుంది

అందుకు వేరే నిరద్శనం అవసరం లేదు ఈ చిన్న పుస్తకంలో తరిచిన అనేక విషయాలు విస్మృత చరిత్రా, విస్మృత సంఘటనలూను అయినా వాటి మీద పిచ్చేశ్వరరావు వ్యాఖ్యానాలు అశోకుడి శిలాశాసనాల్లాగా ఎంతకాలమైనా నిలిచేవిగా ఉన్నాయి

ఈ పుస్తకంలో ప్రస్తావించిన కొన్ని విషయాలు

ఈనాడు రచయితకీ, పరితలకీ ఉండవలసిన సంబంధం

మనిషికీ, జంతువులకూ ఉన్న(లేక, లేని) తేడా

అభ్యుదయ నిరోధకులకు మంచి సాహిత్యం పట్ల ఉండే ద్వేషం

ఈనాడు వెలువడే చౌకబారు సాహిత్యం

విద్యార్థులూ, రాజకీయాలూ (!)

చార్లీచాప్లిన్ పట్ల అమెరికా వైఖరి

పుస్తకంలో ఉన్నవి 11 వ్యాసాలే అయినా అందులో ఇన్ని విషయాలు చర్చించబడ్డాయి ఆ చర్చలో ఈ నాటికీ మనం గ్రహించవలసిన విషయాలు ఎన్నయినా ఉన్నాయి

''ముక్కుపచ్చలారని నవ్యాంధ్ర రాష్ట్ర శిశువు మూలుగుతూ మూలనున్న ముసలాడి వధువు అవుతూంటే, చూస్తూ ఊరుకుని కీటక సన్యాసుల్లాగా గోళ్లు గిల్లుకుంటూ కూర్చున్న కొంతమంది '' ఈనాడు లేరా?

''భడవల దారిన పోయేందుకే బ్రహ్మాండ శక్తులూ అవసరం లేదు'' అన్నది మనం నిత్యమూ స్మరించదగిన విషయం కాదా?

'' ఇండియా ఇంకా (1954 జనవరి 26 నాటికి) కామన్వెల్తులోనే ఉంది హెల్త్ గూడ కొద్ది మంది అనే కామన్ మనుష్యుల గుప్పెట్లోనే ఉంది!'' అన్నదానికి ఈ 15 సంవత్సరాలలో మార్పేమన్నా వచ్చిందా?

''ప్రజలతో ప్రత్యక్ష సంబంధం లేని రచయిత, వాళ్ళ సమస్యల్నీ, వాళ్ల పోరాటాల్నీ, అనుభవాల్నీ పత్రికల్లో చదివి, ఎంతో సానుభూతితో ఆలోచించుతున్నాను అనుకునే రచయిత ఎంతవరకు ప్రజాసాహిత్యాన్ని సృష్టించగలుగుతాడు? అనేది ఒకపెద్ద ప్రశ్న''-ఇప్పటికీ,ఎప్పటికీని

''పోరాటం లేనిదే పురోగమనం లేదు - ఇంటా, బయటా కూడా '' అయినా మనం పురోగమనాన్ని ఇంకా శాంతిలోనే వెతుకుతున్నాం!

''ఫ్రాంకో, హిట్లర్, గోబెల్స్, ముసోలినీలూ ఈ డాలరుమార్కు ప్రజాస్వామ్యం కంటె ముందే ఈ ఘనకార్యాన్ని ( ఉత్తమ సాహిత్యాన్ని నిషేధించటాన్ని) కొనసాగించాలని చూశారు '' డాలరు మార్కు ప్రజాస్వామ్యం ఈనాడు ఇంకా వెర్రితలలు వేస్తున్నది

''చాప్లిన్ అమెరికాలో అడుగుపెట్టేందుకు అర్హుడౌనా? కాదా? అనేది సమస్య కానేకాదు చాప్లిన్ లాంటి ఉత్కృష్టకళాకారులు ఉండదగిన దేశమేనా అమెరికా?'' చాప్లిన్ అనంతరం మరికొందరు ప్రముఖులకు అమెరికాలో చోటు లేకుండా పోయింది

''విద్యార్థి ఉద్యమాలు ప్రజాచైతన్యానికి చూపుడు వ్రేలు లాంటివి ప్రభుత్వదమన నీతికి ధర్మామీటర్లు'' - ఇవాళ కూడాను

''ప్రభుత్వం ఎవరిదైనా - 1857 లో గద్దె మీద ఉన్నవారికి పట్టిన గతే, 1953 లో గద్దెమీద కూర్చున్న వారికి కూడా తప్పదని గడచిన చరిత్రతో బాటు, నడిచే చరిత్రగూడ సూచిస్తూంది '' ఈనాడు నడిచే చరిత్ర ఈ మాటను మరింత బాగా రుజువు చేస్తున్నది

'' అమెరికానుంచి ఎగుమతై, వందలకొద్దీ థియేటర్లలో ప్రదర్శితమయ్యే తుక్కు చిత్రాల మాటేమిటి? ఈ చిత్రాలన్నీ తుక్కు అనీ, బూతుల పుట్టలనీ ఈ మంత్రులే అన్నారే '' ''తుక్కు - బూతు'' చిత్రాలు దేశవాళీ పరిశ్రమగా రూపొందటం కళ్లారా చూసి ఆనందించటానికి పిచ్చేశ్వర్రావు బ్రతికి ఉండవలిసింది

అతను 40 ఏళ్లకే అకాలమరణం పాలుకాకుండా ఉన్నట్టయితే ఈనాటి జీవితాన్ని ఎలా విమర్శించి, తూర్పారబట్టి ఉండేవాడో! దేశంలో అభ్యుదయ భావాలూ, అభ్యుదయ దృక్పధమూ గలవారు చాలా మంది ఉన్నారు కాని ''కన్‌సిస్టెంటుగా''తాను తరిచే ప్రతి విషయంలోనూ ఒక తప్పటడుగు లేకుండా నిజాన్ని అందరికీ అవగాహన అయేటట్టు చూపటం గొప్ప ప్రతిభ అంతేకాదు పిచ్చేశ్వర్రావు ప్రతి ప్రత్యక్ష సమస్యలోనూ శాశ్వతత్వం కూడిన నిజాన్ని ఇట్టే పట్టెయ్యగల శక్తిని ప్రదర్శించాడు అది చాలా అరుదైన శక్తి తాను ప్రకటించే నిజాన్ని పదిమంది నోటా విని ఆమోదించటంతో తృప్తిపడక, తనకు తానుగా చాలా దీర్ఘంగా ఆలోచించేవాడు, ఇతరులతో చర్చించేవాడు అదే అతనిలో బలం

ముందు చెప్పిన 11 వ్యాసాలు గాక ఈ పుస్తకంలో రెండు కథానువాదాలూ, బెర్టోల్ బ్రెష్ట్ నాటక సిద్ధాంతం మీద ఒక వ్యాసమూ ఉన్నాయి కథానువాదాలనుగురించి ప్రత్యేకంగా చెప్పుకోవలిసిందేమీ లేదు గాని, బ్రెష్ట్ గురించి పిచ్చేశ్వరరావు ఏనాడో రాసి ఉండటం గమనార్హం ఎందుచేతంటే బ్రెష్ట్‌నాటక తత్వమూ, నాట్యకళా విప్లవ పూరితమైనవి అతని సిద్ధాంతాలు అన్ని దేశాలవారినీ ఆకర్షించాయి మన దేశంలో కూడా కొందరు మేధావులు బ్రెష్ట్ నాటకాలను హిందీలోకి అనువదించి ప్రదర్శిస్తున్నారు బ్రెష్ట్ విషయం తెలుగు పాఠకులకోసం పిచ్చేశ్వర్రావు వేసిన బాటను ఇతరులు నడవకపోవటం శోచనీయమే

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 18-6-1969*

# 35. అవీ - ఇవీ

గడచిన కొద్ది సంవత్సరాల కాలంలో డ్యాక్టర్ గాలి బాలసుందరరావు రచించిన వైద్య శాస్త్ర గ్రంధ పరంపర తెలుగు భాషలో అపూర్వంగా ఉండటమేగాక, ప్రామాణికంగానూ, సమగ్రంగానూ ఉండి, ప్రవీణుల ప్రశంసలనూ, పామరుల ప్రశంసలనూ కూడా అందుకున్నది అయితే ఈ రచయిత సాహిత్యంలో కూడా సిద్ధహస్తుడన్న సంగతి విస్తృతంగా అందరికీ తెలియక పోవచ్చు ఇతను రచించిన ''అపోహ'' నాటకం ముప్పై ఏళ్ల క్రితమే మద్రాసులో చిన్న సంచలనాన్ని కలిగించింది ఆ తరువాత ఇతను అప్పుడప్పుడూ కథలూ, కవిత్వమూ, వ్యాసాలూ, నాటికలూ అనేకంగా రచించినా అవి పుస్తక రూపం పొందలేదు ఇప్పుడు వాటిలో కొన్ని ఈ సంకలనం రూపంలో వెలువడ్డాయి

ఇందులో 8 కథలూ, 8 కవితలూ, 3 వ్యాసాలూ, 1 నాటికా ఉన్నాయి

''నా రచనలేవో లోకోద్ధరణ చేయగల మహా రచనలనే దురభిప్రాయం నాకు ఏమాత్రమూ లేదు '' అని రచయితే 'తొలిమాట'లో చెప్పుకున్నాడు కాని ఇంతకన్నా కూడా చప్పగా రాసినవారిలో చాలా మందిలో ఈ నమ్రత కనిపించదు

నిజానికి ఇందులోని ఆఖరు కథ 'ముసలంతోనే మోక్షం' తప్పిస్తే మిగతావి అంతగా చెప్పుకోదగినవి కావు 'మాలి' అన్న కథలో సింబాలిజం ఉన్నదిగాని, అందులోనూ విశిష్టతలేదు మాలి ఉన్నతాశయాలు గలవాడల్లే ప్రవర్తిస్తాడేగాని మూఢుడిలా కనబడతాడు 'ధనపిశాచము' అన్న కథలో కల్పన అస్వాభావికంగా ఉన్నది మాణిక్యమ్మ పాత్ర తన కథను కథకుడికి చెప్పటంకోసమే కాచుకుని ఉన్నదానిలాగా, అతన్ని చూసిన రాత్రే ఆత్మహత్య చేసుకుంటుంది అతను ఒక రోజు ఆలస్యంగా ఆ ఊరు వెళితే ఈ కథ అలిఖితంగా ఉండి పోయేదే। 'లాకెట్' అన్న కథలో వాసు ముక్తను ప్రేమించాడన్నది స్పష్టంగానే ఉన్నది కాని ముక్త కున్నది ''కేవలం ప్రేమకాదు , సుందర గుణ శోభితమైన వస్తువు మీద రసికురాలికి ఉండే అభిమానం '' కాని తీరా అతనికి పెళ్లి అయాక, '' ఏ పరిస్థితులను లెక్కచెయ్యని ప్రేమతో'' అని కుట్టి రుమాలు పంపుతుంది అతనికి ''సర్వాంగ పక్షవాతం వచ్చి నట్టయింది'' అంటే కదా? 'పిలపిచ్చి' 'మొగపెళ్లి కూతురు' అన్నకథలు కాల్పనికమే అయినా వ్యక్తి దూషణల్లాటివి 'ప్రాణ ప్రియుడా మానవ సేవా?' అన్న కథ ఆదర్శదృష్టితో రాసినది ప్రధానంగా ప్రణయి కథ, ఆదర్శం నిమిత్తమాత్రం 'పెళ్లిని మించిన ప్రేమ' కథ విశ్వసనీయంగా లేదు అందులో గోపాలరావు పాత్ర వహించిన పాత్ర బొత్తిగా నమ్మరానిదిగా ఉన్నది

'ముసలంతోనే మోక్షం' అన్న కథ ఒక విధంగా అపురూపమైనది ఒక వర్తమాన సమస్యను తీసుకుని దాన్ని గురించి క్షుణ్ణంగానూ, సమర్థతతోనూ కథ అల్లటం ఎంతమంది రచయితలకు సాధ్యమో నాకు తెలీదు ఈనాటి తెలంగాణా సమస్య పరిష్కారమయాక 'వెనుక చూపు'తో ఎన్ని కథలైనా రావచ్చు కాని అవి ఈ కథకన్న బాగుంటాయిని నమ్మటం నాకు సాధ్యంకాలేదు

కవిత్వం విభాగం గురించి నేనేమీ చెప్పను ఈ కవితలు వెలువడిన కాలంలో ఇలాటి గేయాలూ, ఖండికలూ అనేకమంది రాశారు ' ఏం జేస్తారూ? మీరేం జేస్తారూ?' అన్నది

మాత్రం చాలా సరదాగా ఉన్నది ఇంతమాత్రంకూడా లేని సినిమా పాటలు అనేకం ప్రసిద్ధిలోకి వచ్చాయి

రచయిత మేధావీ, తాత్త్వికపరిశోధకుడూ అన్నది కూడా ఈ వ్యాసాలలో తెలుస్తుంది ఇతను శాస్త్రదృష్టితో చెప్పే విషయాలను గురించి ఆక్షేపణకు అవకాశం ఉండదు శాస్త్ర ధోరణిలోనే ఊహించే విషయాలను గురించి భిన్నాభిప్రాయాలకు అవకాశం ఉంది ఈ సంగతి రచయితకు కూడా తెలుసును ''ప్రయోగ నిర్ధారితమైన ప్రతి సత్యమూ పారిభాషికమూ, వైజ్ఞానికమూ అవుతుంది ఈ మంత్రం ఇన్నిసార్లు పునశ్చరణ చేస్తే ఈ రోగం నయమవుతుందని అనేకసార్లు ఎవరైనా రుజువుచేస్తే మంత్రశాస్త్రమూ, మత విశ్వాసములూ కూడా వైజ్ఞానికములే అవుతాయి కాకపోతే విజ్ఞానధాటికి నిలబడలేక అంతరించిపోతవి '' మంత్రశాస్త్రం చాలావరకు నశించిపోవటానికి కారణం అదే

'తెలుగులో పారిభాషిక పదములు' అన్న వ్యాసంలో ఎంతో నిజమున్నది ఈ రచయిత చెప్పిన ధోరణిలో ఆలోచిస్తే తప్ప మనకు పారిభాషకు సంబంధించిన పదజాలం ఏర్పడదు అయితే ఈ విషయంలో నేను ఒక్కమాట చెప్పాలి వైజ్ఞానిక సాహిత్యంలో పరిభాషే గాక సాంకేతికపదజాలం కూడా ఉన్నది ఆల్ఫా, బీటా, గామా, లాంబ్డా, వైమొదలైనవి సంకేతాలు రసాయన శాస్త్రం నిండా సంకేతాలున్నాయి ( ఉదా Nalı = ఉప్పు )

మరొకటేమిటంటే, శాస్త్రాలకు పరిభాష ఉంటుంది గాని, పరిభాష ఉన్నది గదా అని శాస్త్రాన్ని పారిభాషికం అనాలా? 'పారిభాషిక విద్యలు' అనేకన్న 'సాంకేతిక విద్యలు' అనటమే సరిగా ఉంటుందేమో

తిరుపతిని గురించిన వ్యాసంలో ''ఊహ'' చాలా ఉన్నది ఆ ఊహకు ఆధారమైన విషయాలు హెచ్చుగా తాంత్రికమైనవి తంత్ర శాస్త్రంలో మొదట్లో ఈశ్వరుడికి చోటుండేదికానీ, క్రమంగా అందులోకి ఈశ్వరవాదాన్ని - సాంఖ్యంలోకి చొప్పించినట్టే - చొప్పించారని విజ్ఞులు చెబుతున్నారు

రేడియో ధార్మిక శక్తిగల మూలకాలను ''కృణు'' లోహాలనవచ్చుననీ, మన ప్రాచీనులైన అణువాదులు పరమాణువులన్నది పరమాణువు (Atom) కన్న చిన్న వాటినేననీ ఈ రచయిత చెప్పేది శాస్త్రజ్ఞులు తరిచి చూడదగిన విషయమే ఈనాడు Atom కన్న చిన్నవి 30 కి పైగా ఉన్నాయి అయితే వీటిలో కొన్ని అవిభాజ్యాలు కావు వాటిని గురించి మన ప్రాచీన పరమాణువాదం ఏమంటుందో?

చివరది ' ఆజ్ఞ' అనే నాటిక సమస్య ఊహాజనితమే అయినా సంభాషణలు చాలా చక్కగా ఉన్నాయి ఆ మాటకు వస్తే ఈ నాటక కర్త రాసిన 'అపోహ', 'సత్యాగ్రహి' నాటకాలలోని సంభాషణలుకూడా చాలా పదునుగా ఉంటాయి

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 13-8-1969*

# 36. మధురాంతకం రాజారాం కథలు

ఈనాటి కథకులుగా గౌరవించబడుతున్నవారిలో మధురాంతకం రాజారాం ఒకరు ''తెలుగు దేశంలో కథా వ్యాసంగాన్నొక మహాయజ్ఞంగా భావించి నిర్వహిస్తున్న కథక చక్రవర్తి - శ్రీ రాజారాం'' అని ఎవరో అన్నట్టుగా ''కథా ప్రశంస'' లో విహార్ని, శాలివాహన పేర్కొంటున్నారు కవుల్లో మాట ఏమోగాని, కథకుల్లో డెమొక్రసీ ఉన్నది అందుచేత ఏ కథకుడూ చక్రవర్తిత్వాన్ని ఆమోదించడనుకుంటాను కాని, రాజారాం ప్రశంసకు తగిఉన్న మాట నిజం కథా రచనను మహయజ్ఞంగా పాటిస్తున్నవారు చాలా చాలా కొద్ది మంది ఈ క్షణంలో నాకు కాళీపట్నం రామారావుగారూ, రాచకొండ విశ్వనాథశాస్త్రిగారూ గుర్తుకొస్తున్నారు

''గొప్ప కథల్ని సృజించాలంటే కథకుడికి తాను చేసే రచనలో నిజాయితీ, జీవితంపట్ల గౌరవం, ఒకింత అమాయికత్వం ఉండాలి'' (''కథా ప్రశంస'') అన్నది కూడా నిజమే, '' అమాయకత్వం'' అన్న మాటను సార్థం చేసుకోకుండా ఉంటే

''శ్రీ రాజారాం గారికి తనదైన ఒక ప్రత్యేకశైలి ఉంది'' అన్నమాట కూడా నిజమే అది కాస్త బరువని పించేశైలి అని నా ఉద్దేశం

ఈ చిన్న పుస్తకంలో అయిదు పెద్ద కథలు ఉన్నాయి (కథయొక్క సగటు నిడివి 27 అచ్చు పేజీలు )

'వ్యవస్థ' అనే కథలో శకుంతల అనే ఉపాధ్యాయిని తన ఉద్యోగంలో ఎదుర్కొనే అగచాట్లూ, జీవితంలో ఎదుర్కొనే అపవాదులూ, వాటి విష ఫలితాలూ చిత్రిస్తుంది శకుంతల తన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి వెళ్లి పోవటంతో ఈ ఇతివృత్తం ముగిసింది కాని, ఆ తరవాత ఇంకొక పది పేజీలపాటు కథ నడిచింది ముందు ఏడు పేజీలలోనూ శకుంతల కథ ఆరంభంకాదు 34 పేజీల కథలో సగం భాగం అసలు కథకు ప్రస్తావనా, ఉపసంహారమూ అయిందన్నమాట ఇందు వల్ల శిల్పం దెబ్బతినక తప్పదు

చిత్రమేమిటంటే, ఈ కథలో లుప్తమైన కథలు రెండున్నాయి రంగసముద్రం నుంచి వెళ్లిపోయిన శకుంతల సచ్చిదానందాన్ని పెళ్లాడింది రంగసముద్రంలో శకుంతల ఎదుర్కొన్న కష్టాలు ఆమెకు ఎక్కడున్నా సంప్రాప్తమయ్యేవే అందుచేత సచ్చిదానందం ఆమెకు ఎలా తారసిల్లాడు, ఎలా ఆమె సహజ స్వభావాన్ని పసిగట్టాడు, వారిద్దరికీ ఎలా సంధానం కుదిరింది అన్నది ఒక చక్కని కథ అవుతుంది అలాగే డబ్బుగల ''చీంబోతు'' నరసింహులు చెక్కల కొట్టు పెట్టుకునే స్థితికి ఎలా వచ్చాడు, శకుంతల వేలువిడిచిన మేనత్తకొడుకు రిక్షావాడు కావటం ఎలా జరిగింది అన్నది కూడా ఆసక్తి కలిగించే కథే అవుతుంది

కథ ఆరంభంలో ఒక ఊరు వర్ణించబడింది ''ఆ ఊళ్లో అదొక రకం ముళ్లచెట్టు వినా మరొక భూమిజం మొలవదు '' అలాటి ఊరు ఒక వ్యాపార కేంద్రమయింది దానికి తోడు ఆ ప్రాంతంలో కొన్ని గనులు బయటపడ్డాయట ''సందుల్లో గొందుల్లో రచ్చల్లో - రాజవీధుల్లో క్రిక్కిరిసిన మనుషులు ఉన్న అసౌకర్యాలకన్నింటికీ తట్టుకుని'' కాలం వెళ్ల

దీస్తున్నారు ఎంతో వాస్తవ చిత్రణ కాని అసలు కథకు ఈ ఊరు ఏ విధంగానూ ప్రతీక కావటం లేదు ఇలాటి కారణాలచేత కథలో ఒక స్ట్రక్చర్ లేకుండా పోయింది

'కాటుక కంటి నీరు' లో ప్రధాన పాత్ర సుమిత్ర ఇతివృత్తం ఆమె అంతరాత్మకు సంబంధించినది ''కథా ప్రశంస'' లో ఈ కథను గురించి ప్రస్తావిస్తూ ఇలా చెప్పబడింది

''కథ కరుణారస ప్రధానమైనది కథానాయకి (నాయిక) సుమిత్ర కలవారి కోడలు ఆమె కాటుక కంటి నీర్లమ్మటానికి కారణం సంతానం లేకపోవటం మామగారి అన్యాయానికి బలియైన నురో అబల కన్నీరే తన పాలిట శాపమై పీడిస్తూందని సుమిత్ర భావిస్తుంది ఆ శాపం నుంచి విముక్తి పొందటానికి ఆమె ఒక నాటకమాడటానికి నిశ్చయించుకుంటుంది తద్వారా ఆమెకు తన ఆశయ సిద్ధి కలిగిందనే సూచనతో ముగుస్తుంది కథ పాపపుణ్యాల ప్రసక్తి, ఆ నమ్మకం ఆధారంగా నడిచిన కథ కావటంతో, ఆ భావాన్ని అంగీకరించగలిగితేగాని పాఠకుడు కథని మెచ్చుకోలేడు ''

ఈ అభిప్రాయంతో నేను ఏకీభవించలేకుండా ఉన్నాను ''కాటుక కంటి నీరు రుక్మిణిది తనకు పిల్లలున్నట్టయితే సుమిత్ర రుక్మిణికి జరిగిన అన్యాయాన్ని గురించి విచారించేది కాదనుకోవటానికి ఆధారం కనపడదు సుమిత్రకు పాపపుణ్యాలలోనూ, ఉసురు తగులుతుందన్న మాటలోనూ విశ్వాసం ఉన్నంత మాత్రాన ఆమె ఎత్తుగడకు నిలవలేకపోదు ఆమె ప్రయత్నం ఫలించిందో లేదో కూడా కథకుడు మనకు చెప్పలేదు సుమిత్ర బిడ్డల తల్లి కావటం మాట దేవుడెరుగు, ఆమె రుక్మిణి తండ్రికి ఆ అయిదెకరాలూ ఇప్పించగలిగినదీ లేనిదీ కూడా కథకుడు బుద్ధిపూర్వకంగానే చెప్పలేదు అన్ని మూఢ విశ్వాసాల వెనక సుమిత్రలో బంగారంలాంటి అంతరాత్మ ఒకటున్నది

'బ్రతుకుబాట' రెండు రకాల స్త్రీ మనస్తత్వాలను చిత్రిస్తుంది ఒకతె వర్తమాన పరిస్థితులను అర్థంచేసుకుని భవిష్యత్తులోకి అడుగుపెట్టిన స్త్రీ, రెండవది ఆమెను కొంచెం కూడా అర్థంచేసుకోలేని స్త్రీ ఈమెకు వర్తమానం ఉందిగాని భవిష్యత్తు లేదు రెండు పాత్రల మధ్యా తేడా స్ఫుటంగా చూపబడింది

'మిథ్య'లో చలమయ్య పాత్ర పైకి కనిపించే వ్యక్తి వేరూ, అసలు వ్యక్తి వేరూనూ ఆయన మిథ్యావాదిలాగా మాట్లాడతాడని మనకు పరిచయం అవుతాడు కాని అతని సంభాషణలో ఆమాటే ఎక్కడా రాదు ఆయన లోకాన్ని వంచించి రకరకాల ధనం ఆర్జించి వడ్డీ వ్యాపారి అయాడు ఆలాటివాణ్ణి ఎంత వెనకబడిన సమాజంగాని వేదాంతిగా ఆమోదిస్తుందంటే నమ్మటం కష్టం ఆయనను లోకవంచనా వృత్తిలోకి దింపినవాడు గోపాలం తండ్రి జగన్నాథమేనన్న మాట బయటపడ్డాక చలమయ్య పట్ల పాఠకుడికి సానుభూతి ఏర్పడుతుందని రచయిత ఉద్దేశమైతే నా విషయంలో అది జరగలేదు జగన్నాథం పట్ల ఉండదగిన సానుభూతికూడా పోయింది రాధ గోపాలాన్ని మంచాన పడేటంతగా ప్రేమించటం అసహజంగా ఉన్నది తన కూతురికి ప్రేమ అంత విలువ గలదని తోచే వాతావరణాన్ని చలమయ్య తన ఇంట సృష్టించాడా? ఆమెలో అంత ''సాఫిస్టికేషన్'' ఎలా వచ్చింది?

''మనిషి స్వభావానికీ వారు చేస్తున్న పనికీ సామరస్యం లేకపోతే బ్రతుకు బ్రతుకంతా ఒక తీవ్ర సంఘర్షణగా పరిణమిస్తుంది'' అనే మాట నిజమే కాని 'హాలికులు కుశలమా!' అన్న

కథలో సాహిత్యాన్ని ఆరాధించే నరసప్పగారు, తాటిచెట్లలో భారతాన్ని, కాకరకాయల్లో వేమన పద్యాలనీ చూడటం వల్ల ఈ సంఘర్షణ ఉపశమిస్తుందా? నరసప్పగారి దగ్గర ఉత్తమ గ్రంథాలున్నాయి, హాలికుడై కూడా బమ్మెరపోతన భాగవతం రచించాడు నరసప్పగారు పొలం పనులు చూసుకుంటూ సాహిత్య పిపాస తీర్చుకోవచ్చునే పొలాల్లో ఉత్తమ సాహిత్యాన్ని చూడటంలో గల అంతరార్థం బోధపడదు

చివరగా ఒక్క మాట గోదా గ్రంథమాల వారు సాహిత్యంమీద అభిమానంకొద్దీ పుస్తకాలు వేస్తున్నారు ఖరీదైన కాగితం ఎద్దు, అట్టమీద త్రివర్ణ చిత్రాలూ వద్దు - అచ్చుతప్పులు బళ్ళకొద్దీ ఉండటం సమర్థనీయం కాదు అవి లేకుండా చూడడం వారి కనీస ధర్మం

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 20-8-1969*

## 37. హృదయం చిగిర్చింది

తరాలమీద జీవితం ఏ విధంగా మార్పు చెందినదీ సాహిత్యంలో చిత్రంగా కనబడుతుంది స్త్రీల జీవితం గడచిన రెండు తరాలలో ఎంతోమారిపోయింది సుమారు 40 ఏళ్ల క్రితం కాలేజీ చదువు విరమించిన నాతో ఆ ఆరేళ్లలోనూ ఒక్క విద్యార్థిని కూడా చదవ లేదు బాల్య వివాహాలు సర్వసామాన్యంగా ఉండేవి (అతిబాల్య వివాహాలు నేనెరగను ) పదేళ్ల ఆడపిల్లలకు పెళ్లి చేస్తూ, లాంఛనప్రాయంగా వరుణ్ణి చూపిస్తూ, ''బాగానే ఉన్నాడు కదూ? ఏం?'' అనే వాళ్లు పెద్దలు పెళ్లి కూతురు బుర్ర ఆడించేసేది పెళ్లి లయిపోయేది రజస్వల కాగానే ఆడపిల్ల అత్తవారింటికి వెళ్లిపోయేది అక్కడ అది సుఖపడటమూ, కష్టపడటమూ దాని ప్రారబ్ధంగా ఉండేది

ఇంకో సమస్య-విధవా వివాహాల సమస్య వీరేశలింగం గారి ధర్మమా అంటే విధవా వివాహాలు జరగటానికి దారి అయితే ఏర్పడిందిగాని, బహు కొద్దిమంది వితంతువులు పెళ్లాడే సాహసానికి ఒడిగట్టేవారు వారిని వారి సన్నిహితులు సాధారణంగా వెలిపెట్టేవారు పిల్ల తలిదండ్రులు కూడా లోలోపల సంతోషించినా, పైకి కోపాన్నీ, దుఃఖాన్ని ప్రకటించి లోకాన్ని మభ్యపెట్టేవారు వితంతువివాహాలు ప్రేమ ప్రాతిపదికపైన జరిగే సమస్యే లేదు అందుచేత వితంతువుల జీవితాలు చిగిర్చినా,వారి హృదయాలు చిగిర్చటం ఇంచుమించు గగనకుసుమంగా ఉండేది

ఇదంతా మారిపోవటం ఈ నవలలో మనకు కనిపిస్తుంది రమ వితంతువు పిల్లతల్లి ఆమె ముసుగు వేసుకుని మూల కూచోదు తిరిగి వైవాహిక జీవితం ప్రసాదించమంటూ విడోస్ హోమ్స్‌కు దరఖాస్తులు పెట్టుకోదు పెళ్ళికి ముందు తాను నిలిపివేసిన చదువు కొనసాగించటానికి కాలేజీలో చేరుతుంది ప్రేమా, పెళ్లీ కూడా ఆమెను వెతుక్కుంటూ లెక్చరరు రామారావు రూపంలో వచ్చి అమె పాదాల చెంత వాల్తాయి ఇద్దరికీ నిక్షేంగా పెళ్లి అయిపోతుంది

ఇది ఈ తరం నవలలో ఇతివృత్తం ఇదే నవల యాభై ఏళ్ల క్రితం వెలువడితే పచ్చి అబద్ధమనిపించుకునేది పాతికేళ్ల క్రితం గొంతెమ్మ కోరిక అని పించేటట్టు ఉండేది అంతమాత్రంచేత పాతతరాల ప్రభావం ఈనాటి జీవితంపైన ఏమీ లేనట్టు ఈ రచన చెప్పదు

రామారావు తనను ప్రేమిస్తున్నట్టు స్పష్టమైనాక రమ సంతోషించకపోగా బాధపడుతుంది, తాను వితంతువనీ, పిల్ల తల్లి అనీ తెలిస్తే అతను తనకు విముఖుడవుతాడేమోనని ఆమె భయం పూర్తిగా నిరాధారం కాదు రామారావు ఈ మాట తెలిసినాక, రెండు రోజులు తీవ్రంగా ఆత్మ సంఘర్షణకు గురి అయిన మీదటగాని ఈమెను పెళ్ళాడాలన్న తన నిశ్చయాన్ని ప్రకటించడు కాపరానికి వచ్చాక రమ మనసు తన పాపకోసం పీకుతుంది ఆ పాపను తెచ్చుకుంటానని చెప్పటానికి రమ మళ్లీ సంకోచంతో బాధపడుతుంది కాని, రామారావు అందుకు అనుమతిస్తాడు అయితే తీరా పాప వచ్చినాక తనను ఎరిగినవాళ్లు, '' ఎవరి పాప?'' అని అడిగితే మహా తీవ్రంగా బాధపడతాడు ఈ పాప మూలంగా భార్యాభర్తల మధ్య ఎడబాటు కలిగినంత పని జరిగి, వాళ్లు ఉన్న చోటినుంచి దూరంగా పారిపోయాక సమస్య పరిష్కారానికి వస్తుంది

ఇంకో తరం గడిచాక రమా, రామారావుల వివాహం లాంటి దానికీ, ఇతర వివాహాలకీ ఏమీ తేడా ఉండదు - అని ఆశిద్దాం

రచయిత్రి శైలీ, కథనమూ చాలా సరళంగా ఉండి, రచన హాయిగా సాగిపోయింది పాత్ర చిత్రణా, సన్నివేశాలూ ఎంతో వాస్తవంగా ఉన్నాయి ఇందులో కొరుకుడుపడని అంశం ఒకటే - రమ తల్లి పెళ్ళి అయిదో ఏట జరిగిందట అప్పటికి రమ తండ్రి పద్నాలుగేళ్లవాడట నా అర్వై ఏళ్ల జీవితంలో నేను అయిదేళ్ల పెళ్లికూతురు గురించి విన్నట్టు జ్ఞాపకం లేదు రమ తలిదండ్రుల పెళ్లి ఎప్పుడు జరిగి ఉంటుంది? రమ ఈ కాలం మనిషి అయిండినట్టయితే ఆమె తలిదండ్రులకు అంత చిన్నతనంలో పెళ్లికావటానికేదో ప్రబల కారణం ఉండి ఉండాలి అది ఈ నవలలో లేదు ఇది కల్పనలో దోషమే అయినా, తరాలమధ్య వ్యత్యాసాన్ని ఎత్తిచూపటానికి బాగా ఉపకరించింది రమ తలిదండ్రుల దాంపత్య జీవితం భ్రష్టయిపోయింది భ్రష్టయిపోవలిసిన రమ వైవాహిక జీవితం చిగిర్చింది అదీ రెండు తరాలకు తేడా

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 10-9-1969*

# 38. పుణ్యస్థలి, వాన వెలిసింది

నాటకకర్తగా ఖ్యాతినార్జించుకున్న ఎన్ ఆర్ నంది రచించిన ఈ నాటికలు విజయవంతంగా ప్రదర్శించిన వనటానికి వీటికి పోటీ ప్రదర్శనలలో లభించిన బహుమతులే సాక్ష్యం నాటకాలు విజయవంతం కావటానికి అవి పేలవంగానూ, శిల్పరహితంగానూ ఉండవనటానికి ఈ నాటికలే సాక్ష్యం

నిజానికి తెలుగు దేశంలో ఘనంగా ప్రదర్శించిన నాటకాలలో తొంభై శాతం చెత్త నాటకాలే హరిశ్చంద్రీయం లాంటివి పద్యాలతో విజయవంతమయాయి సక్కుబాయి లాంటివి పాటలతో కొట్టుకొచ్చాయి చింతామణిలాంటివి వెకిలితనంతో జనాన్ని ఆకర్షించాయి సినిమాల విజయం లాంటిదే నాటకాల విజయమూను అందుకే కన్యాశుల్కం లాంటి నాటకం తెలుగులో రావటం లేదనుకోవాలి

'పుణ్యస్థలి' అనేది పుణ్యక్షేత్రాలలో జరిగే అక్రమాలూ, అత్యాచారాలూ బయటపెట్టటానికి ఉద్దేశించినది ఇక్కడి పూజారీ, ధర్మకర్తా కలిసి నాటకం ముగిసే లోపల ఇద్దరిని హత్య కూడా చేస్తారు వీరిద్దరూ అదివరకే ఈ పెద్దల అత్యాచారాలకు గురి అయి, ''పిచ్చివాళ్లు''గా తిరుగుతున్న వాళ్లు వీళ్ల అవినీతి ధర్మసత్రం గదులకు రూపాయిన్నర చొప్పున వసూలు చేసి రశీదులివ్వకపోవటం దగ్గిరనుంచి, కంట్రాక్టుదార్ల దగ్గిర 30 శాతం కమిషను పుచ్చుకోవటం దాకా ఉంటుంది

జనంలో మితిమీరిపోతున్న దైవభక్తి అవినీతికి కొత్త మార్గాలను సృష్టించింది గనక దేవుళ్లకు సంబంధించిన సంస్థల నగ్నరూపాల్ని బయటపెట్టటం ఎంతైనా వాంఛనీయమే కాని 'పుణ్యస్థలి' గుడికి ఆమడగా పోయింది ప్రేక్షకులు నమ్మజాలని హత్యలు పూజారి, ధర్మకర్తల చేత చేయించటం ఒకటి ఆ హంతకులలో ఒకడైన పూజారి చేత బఫూన్‌లాగా మాట్లాడించటం మరొకటి (ఉదా బిరుదుల మీద సెటైరు '' తమ కోసం ధూమశకట విరామ ధామానికి తైలభక్షక శకటాన్ని పంపామే!'' వగైరా) విద్యార్థులకు అయ్యవారూ, పూజారీ తమ కండువానూ, గావంచానూ పూలమాలలకు బదులు వెయ్యడం హాస్యమో, అపహాస్యమో!

అసలు ఈ నాటకంలో ఎప్పుడు హాస్యం వస్తుందో, ఎప్పుడు బీభత్సం వస్తుందో, ఎక్కడ వ్యంగ్యమో ఊహించటం కష్టం పుణ్యస్థలిలో అధికారులు రక్తం తాగి, మనుషుల మాంసాలు తింటారనీ, మనుషులను చిత్రహింస చేసి చంపుతారనీ చాలాచోట్ల ఉన్నది ''డ్రామా'' కోసం ఇద్దరు పిచ్చివాళ్లను పెట్టడం చాలా పాత స్టంటు వాళ్లు శ్రీశ్రీని ''కోట్'' చెయ్యటం బాగానే ఉంది గానీ, తప్పుగా చెయ్యటం (పతితులార - భ్రష్టులార అనటానికి ''దుష్టులార - భ్రష్టులార!'') బాగాలేదు

'వాన వెలిసింది' లో ఒక నాటకీయమైన సన్నివేశం అయితే ఉంది దాని నిర్వహణలో చాలా లోముడు ఉన్నది వాసుదేవరావు అనే ఆయన కూతురు చిన్నతనలో తప్పిపోయి, కూలినాలి చేసుకునే కుటుంబంలో పెరిగి తిరిగి దొరుకుతుంది వాసుదేవరావు భార్యను పోగొట్టుకుని, కూతురిని కోల్పోయి మనసు బొత్తిగా చెడిపోయిన శాల్తీ ఈ పాత్రను నాటకకర్త హాస్యానికి ఉపయోగించుకున్న తీరు చాలా దారుణంగా ఉన్నది వాసుదేవరావు హాస్యానికి మచ్చులు

రాంబాబు తానేమీ చదువుకోలేదంటే, ''నీకు ముఖ్యమంత్రి అయేంత క్వాలిఫికేషన్ ఉంది ''

డాక్టరు మందిస్తే జ్వరం వెంటనే పోయిందంటే, ''అయితే అతను డాక్టరయి ఉండడు ''

రాంబాబు పట్నంలోనే స్థిరపడ్డామంటే, ''దేశద్రోహీ! ఇంకా పారిశ్రామికంగా ఈ రాష్ట్రం అభివృద్ధి కాకముందే దేశానికి వెన్నెముకైన పల్లెపట్టుల్ని విడిచి పెట్టేస్తున్నారంటే ''

''నీ పేరేమిటి?''

''రాంబాబు, సార్ ''

''ఏమిటి? రాముడికి బాబువా?''

''ఇరవై ఏళ్ల ముసలిది - ట్వెంటీ ఇయర్స్ ఓల్డ్ ''

''నా 'లా'లో కొడుకువి - ఐ మీన్ సన్-ఇన్-లా ''

ఈ సిద్ధమైన హాస్యం ఒలకబోసే వాసుదేవరావును ఇన్‌స్పెక్టరు, ''మీరు హాస్యబ్రహ్మలండి'' అనీ, ''మీరు బహుచతురులండి'' అని మెచ్చుకుంటాడు

సాక్షాత్తూ హాస్యబ్రహ్మ అయిన భమిడిపాటి కామేశ్వరరావుగారు, ''హాస్యం సీరియస్‌గానే ఉండాలి'' అన్న ముక్క నేటి మన నాటకకర్తలు అర్థం చేసుకుంటే ఎంత బాగుండును!

నాటకాల పోటీల్లో పాల్గొన్న ఈ నాటకంలో జడ్జీలను కితకితలు పెట్టే ఒక వాక్యం ఉన్నది వాసుదేవరావు ''మా కావయ్య ఏ పరిషత్తులోనూ నటించడుగాని, నటిస్తే ఉత్తమ హాస్య నటశేఖర బిరుదు తగిలించవచ్చయ్యా ''

ఈ నాటకంలో కూడా ఒక చిన్న స్టంటున్నది - రాంబాబు పాత్రధారి ప్రేక్షకుల మధ్య నుంచి లేచి వెళ్ళిస్టేజి ఎక్కుతాడు అందులోని ''కవి హృదయం'' సరిగా బోధపడటం లేదు

*- ఆంధ్రప్రభ, వారపత్రిక, 17-9-1969*

# 39. శ్రీ చరణాలు

పద్మావతీ చరణ చారణ చక్రవర్తినని చెప్పుకుంటూ పచ్చిశృంగారాన్ని రసగుళికల్లాంటి అష్టపదులలో నింపి, ఆచంద్రార్కమయిన కీర్తి గడించిన జయదేవుడి జీవిత కథ ఇది దీనిని మరొకరైతే జయదేవుడి కవిత్వమంత తియ్యగానూ, రసస్ఫూర్తితోనూ రాసి ఉండేవారు కాని అది లత పద్ధతి కాదు ఈ కథ పారకుణ్ణి ఆమూలాగ్రం కురుపుసలిపినట్టు సలుపుతుంది కలితీలేని గచ్చకాయపాకం ఇంత బాధాకరంగా ఈ రచన తయారుకావటానికి గల కొన్ని కారణాలనైనా చెప్పటం సమీక్షకుడి విధి అనుకుంటాను

మొట్టమొదటి కారణం, జయదేవుడు కేవల కవితాశక్తితో గాక ఎవరూ అర్థం చేసుకోని తాత్త్విక సమస్యలతో తన్నుకున్నట్టు చిత్రించబడ్డాడు పాపం, అతనికి ఎపిలెప్సీ లాంటి మూర్ఛరోగం ఉన్నది అష్టపదులు పాడుతూనే కొయ్యబారిపోతాడు, పిలిస్తే వినపడదు ఆ మీద నల్లమందు రెండేసి కుంకుడుగింజలంతేసి మింగుతూంటాడు (అదైనా చీనా నుంచి దిగుమతి అయినది నల్లమందు చీనాలోనే గాక మన దేశంలో కూడా తయారయేదే ఇంగ్లీషు వాళ్ళు నల్లమందును బలాత్కారంగా చీనాకు అమ్మినట్టు చరిత్ర ఉన్నదిగాని, ఇండియా చీనా నుంచి చీనాంబరాలతోబాటు నల్లమందు దిగుమతి చేసుకున్నట్టు తెలియరాదు ) తాగుతాడు, చెలంగారి కథలు చదివినట్టుగా ప్రేమకూ పెళ్ళికీ తూగదంటాడు అని పద్మావతిని పెళ్ళాడనిరాకరిస్తాడు చీటికీ మాటికీ ఏడుస్తాడు

ఇది ఇలా ఉండగా ఈ అభూతకల్పన (కల్పిత కథ)లో మనం వ్యాస వాల్మీకి కాళిదాస భట్ట బాణభాస భారవీత్యాది మహా కవులను గురించి రచయిత్రికి గల పరిచయాన్ని గురించి తెలుసుకోవాలి ఆమె ఏనాడోజయదేవుడి ఆశీర్వచనం పొందడం కూడా మనం ఈ విధంగా తెలుసుకుంటాం

''మీ కవిత్వాన్ని ప్రేమించే సహృదయులైన చరిత్రకారులెవరైనా మీ మనసు గ్రహించి మీ చరిత్రను కాదంబరిగా తీర్చవచ్చుననే విషయం మీరు విస్మరించారు'' అంటుంది కృష్ణ అనే

రాజుగారి ఉంపుడుగత్తె జయదేవుడితో (ఆమె జయదేవుడి ప్రేయసి కూడాను ఆ సంగతి రాజుకు తెలిసి కూడా ఆమోదిస్తాడు )

అంటే జయదేవుడు, ''అసంభవం కాదు అతను లేదా ఆమె ఎవరైనా కానీ ఆ భావి చరిత్రకారులు నన్ను నిందించరనీ, అర్థం చేసుకుంటారనీ ఆశిస్తున్నాను ( ఆ) చరిత్రకారుల హృదయాల్లో శ్రీ చరణాలు - ఈనాడు నా ఆంతర్యపీఠంపై అధివసించిన శ్రీ చరణాలలాటివే అయి ఉండాలని ఆశిస్తున్నాను'' అంటాడు

''ఆ మాటకి కృష్ణ పరాశరులిద్దరూ చప్పట్లు'' కొట్టి చిన్న అప్లాజు కూడా పారేస్తారు అందుచేత ఈ పుస్తకానికి పేరు కూడా ఓ విధంగా ఆనాడే పెట్టబడింది దానికి హర్షధ్వానాలు కూడా వచ్చాయి, నేనేమో నస పెడుతున్నాను

నస పెడుతున్నానంటే నా కారణాలు నాకున్నాయి రచయిత - లేక రచయిత్రి - తన హీరోను, ఇతర పాత్రల దృష్ట్యా కాకుండా, తనే ''శ్రీ జయదేవులు వచ్చారు కూర్చున్నారు'' అని భట్రాజు భాష వాడుతూ, ''వారి'' పట్ల చదువరినైన నాకేర్పడే భావం - నాలో తాను రేకెత్తించే భావం - గ్రహించకపోతే నాకు చెడ్డ చిరాకు

జయదేవుడి అష్టపదులు రిఫరెన్సుకు దొరుకుతాయి కదా అని వాటికి అతికీ అతకని సన్నివేశాలు కల్పిస్తే నేను చిరాకు పడతాను ఉదాహరణకు 135వ పేజీలో ఒక తాచుపాము, తనెవెరో ఒక దెబ్బ వేసినట్టు తోకమీద లేచి నిలబడి, ''అనిల తరళకువలయ నయనేప'' వగైరా ఏడు పంక్తులు విని నృత్యం చేసి, తల ఆడించి, వెళ్లిపోతుంది పాముకు పున్నాగవరాళి ఇష్టమని మనందరికీ తెలుసుననుకోండి కాని అనిల తరళ వగైరాలలో పాముకు కావలసిందేమిటో తెలియటం లేదు

చక్కని బూతు నవలగా తయారుకావలసిన ఈ పుస్తకం అపస్వరాల పాటకచేరీ లాగా, తాత్త్విక ఆపరేషన్ థియేటర్‌లో గంటలతరబడి జరిగే ఆపరేషన్‌లాగా తయారయితే తప్పు లతదిగాక మరెవ్వరిది? ఇందులో బూతు లేదని కాదు, చక్కదనం లేదు

ఇది నిజానికి రెండు పుస్తకాలు మొదటి పుస్తకం 'జయదేవుని కవిత్వం - మతం' (సుమారు 40 పేజీలు) ఇందులో కొన్ని భయంకరమైన వాక్యాలున్నాయి ''జీవితం అంటే ఏమిటి? ఎందుకొరకు? ఎవరికోసం? ప్రయోజనం ఏమిటి?'', ''నిజం చెప్పాలంటే జీవితం ఒక పెద్ద అసత్య రచన'', '' ఈశ్వరీయత మీద నా నమ్మకం ఇంకా సడలకముందే '', ''అనేక అయోమయాలు మీకు కనిపిస్తాయి ఇందులో'' (నిజం, నిజం!), ''మానవుడు అతీత మానవుడు కావాలని అనుక్షణం ప్రయత్నిస్తూనే ఉంటాడు ఈ ధ్యేయమే అతని జీవితం '' ''నా భాషలో చెప్పాలంటే, ఈ సత్యమే ఈశ్వరుడు '' (ఈ మాట ఇతరుల భాషలో కూడా విన్నట్టు గుర్తు ) ''నా ఈ ఆత్మరహిత ఈశ్వరతత్త్వంతో అందరూ ఏకీభవించకపోవచ్చును అయినా ఉమర్‌ఖయాం ఏకీభవిస్తాడు, జయదేవుడు ఏకీభవిస్తాడు '' (ఎంత సంతోషకర వార్త!)

అదిన్నీ ఇందులో పెద్దపెద్ద మొనగాళ్లలాటి వాళ్లు, ఉమర్‌ఖయాం, సార్త్రే, ప్లేటో, ఆదిశంకరుడు, శ్రీకృష్ణుడు (భగవద్గీత చేతివాటు వేసినవాడు), సోక్రటీస్, కన్ఫ్యూసియస్, కార్ల్‌మార్క్స్, రాహుల్ సాంకృత్యాయన్, వివేకానందుడు మొదలైన భయంకర మేధావుల

ప్రవచనాలున్నాయి వైతరణిలా భయపెట్టే ఈ మొదటి పుస్తకం జోలికి నేను పోవటం లేదు పోతే, పెంగ్విన్ ఆర్టు పరిశోధించయత్నించిన అనటోల్ ఫ్రాన్‌లాగా అందులో మునిగిపోయి మరి లేవను అందుచేత ఒడ్డునే నిలబడి ఇంత పాండిత్య ప్రకర్ష గల రచయిత, లేక రచయిత్రి తెలుగు గడ్డ మీద మరి లేరని ఈ రచయిత్రికి ఒక కితాబిచ్చుకుంటున్నాను

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 24-9-1969*

# 40. పంజరం

ఇది ప్రధానంగా మురికిపేటల జీవితం ఇతివృత్తంగా గల నవల కథానాయకుడు - వెంకటేశ్వర్లు - పంజరంలాంటి ఆ దుర్భరజీవితం నుంచి బయటపడినవాడు ఆ పంజరంలో ఉన్న వాళ్లను గురించి చెబుతూ రచయిత (లేక కథానాయకుడు) ఇలా అంటాడు

''వీళ్ల జేబులు కొడతారు ఫ్యాక్టరీల్లో మిషన్లతోబాటుగా కండలు కరిగించి పని చేస్తారు జీవితం అంటే చేదుమందు మింగినట్టు మొహం పెడతారు దొంగ వ్యాపారాలు చేస్తారు సారా తాగుతారు ఒళ్లు మరిచిపోయే ప్రయత్నం చేస్తారు వాళ్ల కళ్లు కాంతిని కోల్పోయి ప్రక్కవాళ్లను అసూయితోనే చూస్తుంటాయి ''

వీళ్ల దుర్భర దరిద్రంలో తాగుడూ, వ్యభిచారమూ, దొంగతనాలూ, అంతః కలహాలూ ఉంటాయి కాని ఇవన్నీ ఉన్నత వర్గీయులుగా చలామణీ అయే వారి జీవితాలలోని కుళ్లుకు తలకిందులు ప్రతిబింబమే అందుకే ''అన్ని రంగాలలోనూ విలువలు పడిపోతాయి '' '' ఈ పద్మవ్యూహంలో, ఈ అవ్యవస్థలో అసలైన మానవుడు తప్పిపోయాడు అతని జాడ లేదు అతని హృదయస్పందన వినిపించడం లేదు అతను కనబడటం లేదు !''

ఒక్కటి నిజం సాంఘిక విలువలూ, జీవితపు విలువలూ నూటికి ఒకరు కూడా లేని అగ్ర నాయకులు తామై నిలబెట్టలేరు - కాని వాటిని పతనం చెయ్యగలరు, అలా చేసే అధికారం వారి చేతిలో ఉన్నది వాళ్లు ధ్వంసం చేసే విలువల నుంచే కొత్త విలువలు పుట్టుకొస్తాయి వాటికి దోహదం చేసేవి పంజరలో ఉత్పన్నమయే విప్లవ శక్తులు

అలాంటి శక్తులు అండరూపంలోనో, ఇంకా సూక్ష్మంగానో ఉండి, ప్రాణం పోసుకునేటందుకు స్ట్రగుల్ అవుతాయి వాటి జాడ ఈ నవలలో మనకు లీలగానైనా కనబడి ఉంటే బాగుండేది 'పంజరం' జీవితాన్ని ప్రత్యక్షంగా చవిచూచిన, చూసిన నాయకుడు ఏ అయ్యధర్మానో బయటపడి, ఈ పంజరాలను పరిరక్షించే యంత్రంలో చిక్కుకుపోయి, తన తండ్రిని ఉరితీస్తుంటే ఎదట నిలబడి చూసినవాడు తాము ''బాగు'' పడ్డాక వెళ్లి ఆ పంజరాన్ని మళ్లీ చూస్తే ''గుడిసెల సంఖ్య పెరిగింది నీరసంగా, నిస్తేజంగా అటూ ఇటూ మసలే ఆ జనమూ వారి ముఖాలలో అలసట ఆయాసమూ అన్నీ ఇప్పుడూ అలాగే ఉన్నాయి ''

ఈ నవలలోని కథ ప్రారంభమయేనాటికి రెండో ప్రపంచ యుద్ధం ముగిసినట్టు కనబడుతుంది ఇందులో కనీసం పదిహేనేళ్ల కాలం గడిచినట్టు తోస్తుంది ఈ కాలంలో మురికిపేటలలోని రాజకీయ పార్టీల ప్రభావం చాలా ప్రవేశించింది సిద్ధాంత చర్చలలో పడి

జనం సంగతి కొంత ఏమారినా కమ్యూనిస్టులు 'పంజరం' మనుషులలో చాలా చైతన్యం తెచ్చిపెట్టారు మురికిపేటల మీద పోలీసుల దాష్టీ చాలా జరిగాయి పూరిగుడిసెల మీద ఎర్రజెండాలు లేచాయి ఇవేవీ ఈ నవలలో మనకు కనబడవు ''అసలైన మానవుడు'' జీవితపు ఊబిలోనుంచి పైకి రావటానికి చేసిన ప్రయత్నాలు ఇందులో లేవు ''అతని హృదయస్పందనం వినిపించటం లేదు'' అన్న మాట వాస్తవం కాదు కథానాయకుడు చూడలేదన్నది నిజం అతను జైలు అధికారిగా వెళ్లినప్పుడు కూడా ఒక పంజరం నుంచి ఇంకో పంజరం(జైలు)కు మారిన దౌర్భాగ్య జీవులను చూశాడేగాని, పంజరాన్ని పగలగొట్టే ప్రయత్నాలు చేసిన రాజకీయ ఖైదీలను చూడలేదు

ఏమైనా హీనజీవితాలు జీవించే వారిని గురించి ఈపాటి నవల వచ్చినందుకు మనం సంతోషించాలి కాకపోతే ఇలాంటి జీవిత చిత్రణ చెయ్యటానికి రచయితకు ఆ జీవితంలో హెచ్చయిన పరిచయం అవసరం లేదు

ఇంకొక లోపం కూడా ఈ నవలలో కనిపిస్తుంది వెంకటేశ్వర్లు ఆఫీసు బోయ్‌గా చేరి పట్టభద్రుడయేదాకా ఎలా జీవితం గడిపాడన్నది మన ఊహకు వదిలివేయబడింది అక్షరాలు రాయటం దగ్గిర ఆరంభించిన వాడు బియ్యే పాసైనవాడు కావటానికి ఏ పదిహేనేళ్లు పట్టదా? అంతకాలమూ మన హీరో ఆఫీసు బోయిగా పని చేశాడా? లేక ఆఫీసరు వెంకటేశ్వర్లు గారు తన ఇంటి నౌకరుగా పోషించాడా? బియ్యే పాసయిన వాడికి ఆ ఆఫీసులోనే ఎందుకు ఉద్యోగం ఇవ్వలేదు? డిగ్రీ చేతబట్టుకుని హీరో వెంకటేశ్వర్లు ఇతర ఆఫీసుల చుట్టూ ఎందుకు తిరిగాడు? వెంకటేశ్వర్లు బాస్‌గా ఉన్న ఆఫీసులో బియ్యేలు పని చేసినట్టు మనకు తెలుసునే

ఇలాటి అనుమానాలు కొన్ని తప్పిస్తే రచన ఆసాంతం చక్కగా, సూటిగా, ''రుద్దుడూ, తోముడూ'' లేకుండా, చాలా సాఫీగా నడిచింది చదివేవాడికి కొంచెం ఊహాశక్తి ఉంటుందనుకుని రచన సాగించే కొద్దిమంది రచయితలలో సుబ్బరామయ్యగారొకరన్నది నిజంగా గర్వించదగిన విషయమే ఆయన జీవిత దృక్పథం పురోగమనాన్నే సూచిస్తుంది

*- ఆంధ్రప్రభ, వారపత్రిక, 1-10-1969*

# 41. ఆహుతి

ఈనాడు నవలలు రాస్తున్న అనేకమంది పురుషుల కన్న ముప్పాళ రంగనాయకమ్మ, యద్దనపూడి సులోచనారాణి లాంటి రచయిత్రుల రచనా విధానం నిండుగానూ, నిర్దుష్టంగానూ ఉంటుందంటే కొందరికి ఆగ్రహం రావచ్చు కాని ఆ మాట నిజం రచన వెనక ఉండే ఆశయాలు ఎవరివి వారివే

ఈ రచయిత్రి ఏమాత్రమూ పట్టి యివ్వని భాషలో రచన సాగించటమే గాక, యథాలాపంగా రాయక, ముందు వెనకలను సమన్వయించుకుంటూ కథ నడపగలదు

నవలలకు ''ప్లాట్'' ఉండటం అవసరమని నేను భావించను పాత్రలూ, సన్నివేశాలూ ఎంత సహజంగా ఉన్నా ''ప్లాట్'' అన్నది ఇతివృత్తానికి కొంత కృత్రిమత్వాన్ని ఆపాదిస్తుంది

ఇది ''ప్లాట్'' ఉన్న నవల ప్రధాన వ్యూహం కథానాయకుడైన శ్రీధరు అనే యువకుడి చుట్టూ అల్లబడింది అందులోనించి అతను చావుతప్పి, కన్ను లొట్టబోయి బయటపడతాడు

దారిద్ర్యం నరకం అమితమైన సంపద కూడా ఒక విధమైన నరకమే దాని వాత పడిన వారికి ఈ సర్వతోముఖ నరకంలో నైతిక విలువల కోసం పాకులాడి, యాతనపడి, ఆహుతి అయిపోయే వాళ్లు నిజమైన సంపన్నులు కారు వారి ఉచ్చులలో చిక్కుకున్న వాళ్లు ఈ నవలలో ఈ విషయాలు ప్రస్ఫుటంగా చిత్రించబడ్డాయి

వ్యాధి పీడితురాలు పద్మ బంగారుపంజరంలో చిక్కుకున్న పక్షి రేణు స్వేచ్ఛా విహంగిని ఆమె జీవితం మురుగు కాలవలో అంతమవుతుంది నవల ముగిసే లోపల క్షయవ్యాధి నుంచి కోలుకుని బయటపడుతుంది మిగిలిన ఇద్దరూ ఆత్మహత్య చేసుకుంటారు

ఈ పరిణామాలకు మూలకారణం నవలకు ''ప్లాట్'' ఉండటమే ఇద్దరు స్త్రీలు ఒక పురుషుణ్ణే ప్రేమించాక అందులో ఒకతె ఏదో నెపంతో చావకపోతే అలంకారశాస్త్రం ఒప్పదనే అనుకోవాలి చచ్చిన మనిషే నాయికుడి ప్రేమనుచూరగొన్నదైనాసరే ఈ నవల పూర్తి చేసినాక శ్రీధరు ఉమతో ఎలా సుఖంగా కాపరం చేస్తాడో నా ఊహకు అందలేదు

ధనిక ప్రపంచమూ, పేద ప్రపంచమూ '' ఓవర్‌లాప్'' కావటంతో పోక రెండు ప్రపంచాలూ పెనవేసుకుపోవటం కూడా ''ప్లాట్'' అవసరాన్ని బట్టే జరిగింది రెంటి మధ్యా సంఘర్షణ కూడా ఉన్నది కాని అది సామాజిక సంఘర్షణ కాదు, వ్యక్తుల మధ్య సంఘర్షణ మాత్రమే గంగాధరంగారి తప్పుడు లెక్కలు రాసిన శ్రీధరు తన చేతిమీదుగా దురన్యాయం జరుగుతున్నదని బాధపడతాడు తప్ప ఆ దురన్యాయాన్ని బట్టబయలు చెయ్యాలని ఆలోచించనైనా ఆలోచించడు

''ప్లాట్'' ఫలితంగా శ్రీధరు కోటీశ్వరుల గుమాస్తాగిరీ తప్ప ఇంకేమీ సంపాదించలేకపోయాడు ఆ ఉద్యోగావశ్యకత కూడా అచ్చగా ఉమకు శానిటోరియం చికిత్స కొరకే లాగా కనబడుతుంది ఎందుకంటే ఉమకు వ్యాధి నయం కాగానే అంతలో వాళ్లు పల్లెటూరికి తిరిగి వెళ్లిపోతారు శ్రీధరు ఉద్యోగం ప్రసక్తి లేదు

పద్మ పరిస్థితి, ఆమె ప్రేమా, ఆలోచనా విధానమూ, ఆత్మాహుతీ కూడా ఎవరోకల్పించినట్టు కనబడతాయి గాని ఆమె ఇచ్ఛికంగా ఏమీ చేసినట్టుగా అనిపించటం లేదు ఆమెతో పోల్చితే ఉమ చాలా వాస్తవ పాత్ర తిలాపాపం తలా పిడికెడు అన్నట్టు, సాంఘిక దురన్యాయాల వెనక అచ్చగా ఏ ఒక వ్యక్తో మాత్రమే ఉండడు రేఖా విషం (ఉల్లిపాషాణం?) తిని చావటానికి ఎవరు కారణం? పద్మ ఆత్మహత్యకు ఎవరు బాధ్యులు? ఏ ఒక్కరూ కాదు ఆ పాపాన్ని అందరూ తలాకాస్తా పంచుకుని, మంచితనం కొద్దీ నేనంటే నేనని వాదించుకుంటారు సంఘ దురన్యాయం అందరికీ అంతో ఇంతో చెందుతుందని నిరూపించటం రచయిత్రి ఉద్దేశమో, కాదో తెలీదుగాని, అలాటి నీతి ఈ నవలలో లేకపోలేదు

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 15-10-1969*

# 42. వసుంధర

డాక్టరు నీలం సంజీవరెడ్డిగారికి జన్మదిన కానుకగా 19-5-1969 నాడు అంకితమైన ఈ కథా సంకలనం పుట్టు పేరు వసుంధర కాదు, కుమారసంభవం కొందరు కన్యలలాగే ఈ కథానికా కన్య ఒక అయ్య చేతిలోకి పోతూ పేరు మార్చుకున్నట్టు కనిపిస్తుంది ఈ రచయితది కొంచెం ఊర్ధ్వ దృష్టి ఆయన తన సాదా కథలనే ''వాసు చరిత్ర'' లాంటి ఉదాత్తమైన పేర్లు పెట్టే మనిషి అందుచేత కుమారసంభవమనగానే మనం కాళిదాసుగారినీ, నన్నెచోడుణ్ణీ జ్ఞాపకం చేసుకోనవసరం లేదు

గాంధారదేశంలోహరిదత్తుడైన బ్రాహ్మడూ లేడు, అతని కథను నన్నయభట్టారకుడి సమకాలికుడు తాళపత్రాల మీద రాయనూ లేదు వాటిలో చివరి ఆకు శిథిలమయిసందున ''కుమారసంభవం'' కథ అసంపూర్ణంగా ఉండిపోనూ లేదు ఇదొక ''గీమిక్'' - భరద్వాజ సరి భాషలో ''ట్రిక్ ''

ట్రిక్ పారకపోవటమే ఈ కథలో ప్రధాన లోపం హరిదత్తుడు తన తాళపత్రాల కోసం రాత్రివేళ శివాలయంలో ప్రవేశించి, పార్వతీపరమేశ్వరుల శృంగారక్రీడలకు విఘ్నం కలిగించి, కుష్ఠ వ్యాధితోబాధపడేటట్టు శాపమూ, వంశోద్ధారకుడైన పుత్రుడు కలగటంతో శాపవిమోచనమూ పొందాడు అటుతరవాత హరిదత్తుడు తాళపత్రాల ఊసేలేదు

శాపం పొందిన హరిదత్తుడికి తన భార్యకు గర్భాదానం కలిగించటానికి తెల్లవారిన దాకా అవకాశమిచ్చాడు పరమేశ్వరుడు కాని హరిదత్తుడా అవకాశాన్ని వినియోగించుకోలేదు ఇందుముఖి పర పురుషుడి ద్వారా తన భర్త వంశాన్ని నిలబెట్టాలని రాసి పెట్టి ఉన్నది తప్పు లేదు మరో మహా ఇల్లాలు పెళ్లి కాకపూర్వమూ, భర్త అనుమతితోనూ కూడా పర పురుషులకు పిల్లలను కని తన భర్త వంశం నిలబెట్టింది ఆమె అత్తలు అంతకుపూర్వం అదేపని చేశారు కనుక అలా చెయ్యటం వల్ల తాను ''నైతిక పతనం'' చెందుతానని ఎందుకనుకున్నదీ, తన ''పతనం'' వల్ల అనేక ఉపయోగాలుంటాయని ఎందుకు సమాధానపడిందీ స్పష్టం కావటం లేదు తాను క్రీ శ 20వ శతాబ్దపు నీతిని ముందుగా ఊహించినట్టుంది

ఆమెకు గర్భం కలిగించనున్న వ్యక్తి తన ప్రాణాలను కాపాడినప్పుడు ఆమె మొట్టమొదట తన కృతజ్ఞత తెలుపుకుంటూ, 'నేనేమయి ఉండేదాన్ని? ఒక నిండుప్రాణం నిలబెట్టటం సామాన్యం కాదు కదా!'' అని, ఒక పేజీ దాటనిచ్చి, ''నన్ను రక్షించి మీరు అపకారమే చేశారంటున్నాను బ్రతికించి కొసకు నన్ను కష్టాల పాలు చేశారు'' అని ప్లేటు ఫిరాయిస్తుంది

ఈమె వర్తన ఆమూలాగ్రం అనుమానాస్పదంగానే ఉన్నది తన కొత్త భర్తకు పిల్లవాణ్ణి కన్న మనిషి తన మొదటి భర్తను వెదుక్కుంటూపోక, మూడేళ్లు కొత్త భర్త దగ్గిరే ఉన్నది కథకుడి ధర్మమా అంటూ ఆమె మరి రెండుసార్లు గర్భవతి అయింది కాదు - చాలా కాంప్లికేషన్స్ ఏర్పడి ఉండును

జరిగిది జరిగిపోగా పిల్లవాడి కోసం వాడి అసలు తల్లిదండ్రులు కోర్టులెక్కి, బాల్జాక్ సాహిత్యం చదివిన వారిలాగా రాజుగారి ఎదట తమతమ వాదనలు మర్మంగానూ, చాలా తెలివిగానూ ప్రతిపాదించారు

పిల్లవాడు ఎవరికి చెందినట్టు తేలదని రచయిత ఎత్తు వాడు కచ్చితంగా హరిదత్తుడి కొడుకే వాడు పుట్టుట యేమిటి, హరిదత్తుడు అకుష్ఠుడు కావటమేమిటి ఒక్కసారే జరిగాయి క్షేత్ర బీజ మీమాంస అనవసరం

''లక్క బొమ్మలు'' అన్నది నిష్పాక్షికంగానూ, నిజాయితీతోనూ రాసిన కేస్ హిస్టరీ లాంటి కథ రాధ రాష్ట్రేతరుణ్ణి ప్రేమించి, తన వాళ్లను ధిక్కరించి లేచిపోయి అతని భార్య కావటంలో సాహసం చూపిన మాట నిజమే, కాని అంతమాత్రాన ఆమె సాధారణ గృహిణిగా జీవితంలో స్థిరపడిపోవటంలో ఆశ్చర్యం ఏమీ లేదు రచయిత రాధ సాహసాన్ని విప్లవచర్యగా భావించి, ఆమె జీవితమంతా విప్లవయుతంగానే ఉంటుందనుకుని నిరాశపడినట్టు కనబడుతుంది మహా మహా విప్లవ నాయకులే బొజ్జలు పెంచారు

''ఊర్మిక''లో ఒక గృహస్థు అద్దె పెరిగే అవకాశం ఉన్నప్పుడల్లా ఉన్నవాడికీ తన భార్యకూ రంకులుకట్టి వాణ్ణి సాగనంపుతూంటాడు ఈ నాటకంలో ఇల్లాలు కూడా వేషం కట్టుతుంది ఈ కథకు నకళ్లు వచ్చాయి

''గోడల్లేని జైలు'' ఈనాటి గ్రామం పార్టీలూ, పంచాయతీ ఎన్నికలూ, లంచాలూ, ఒక పక్షానికి విజయమూ, ఓడిన వాళ్లు గెలిచిన వాళ్ల వాములు తగలబెట్టడమూ, ఉరుము ఉరిమి మంగలం మీద పడ్డట్టు ఏ గూడెంలోని అభాగ్యుడో జైలుకు పోవటమూ, వాడికి గ్రామం కన్న జైలే నయమనిపించటమూ - ఇదంతా ఎంత సర్వ సాధారణమయిందంటే ఈ కథ చదివి చలించే శక్తి కూడా పోతున్నది

''వంశోద్ధారకుడు'' చదువంటక, బస్తీ లక్షణాలు అలవరచుకుని, పేకాటా, తాగుడూ మరుగుతాడు చాలా సాదా కథ

''ఈడొచ్చిన కథ''లో ఉద్యోగం చేసుకునే ఆడదానికి ఎదురయ్యే కష్టం కాపుకాచే హీరో పక్కనే ఉండటం చేత గ్లిసరిన్‌కు అవకాశం లేదు కథా రచన తాలూకు ఎనాటమీ జోడింపు ఉన్నది (పద్యాలు) రంగనాథరావు మెచ్చిన కథ

''అన్యథా చింతితంకార్యం'' అన్న కథల్లో టెక్నాలజీలో కూడా దయ్యాల ప్రమేయం ఉన్నదా అనిపించే సంఘటన ఉన్నది ఏ కారణమూ చెప్పటానికి లేకుండా ఇనపదూలం సిమెంటు స్తంభాల మీద కెక్కలేకపోతుంది ఇది ఇండియా గనుక ''నరబలి'' కోరుతుందంటారు ఎవరో ఒకరు నరబలి జరిగిపోతుంది ఇక వంతెన సాగిపోతుందని ఆశిద్దాం ఒకే క్షణంలో జననమరణాలు జరగటం చూపటం ఒక ప్రక్రియ ఆ ప్రక్రియ ఈ కథలో కూడా ఉన్నది

''మెరుపుల మడతల నుండి'' అన్న కథ ఒక పోలీసాఫీసరు గారి కూతురికి కట్నం లేనిదే పెళ్లి కాదన్న సమస్య నుంచి వెనక్కు పోతుంది కొన్నేళ్ల క్రితం అతను మామూలు పోలీసుగా ఉండి తన డ్యూటీ నిర్వర్తించి, ఒక పిల్ల ప్రాణాన్ని బలిపెట్టి, ఆ పిల్ల పేరే తన కూతురికి పెట్టుకున్నాడు

''అపుత్రస్య'' అన్న కథలో ఒక ఇల్లాలు సంతానం కోసం వాసెక్టమీ చేయించుకున్న వాడితో రంకుపోయి ఆ సంగతి చివరకు తెలుసుకుంటుంది

''యవనికాభ్యంతరమున''లో కథే లేదు

రావూరి భరద్వాజ కథలలో రెండు లక్షణాలు స్పష్టంగా కనిపిస్తాయి ఆయనకు మనుషుల(పాత్రల) బాహ్య ప్రవర్తనల పట్ల ఉన్న శ్రద్ధాసక్తులు అంతస్సంఘర్షణ పట్ల ఉండవు కథలలో చురుకు, లేక వేగం ఉండదు

*ముద్రణ 19-5-1969*

# 43. విందు భోజనం

ఇది పిల్లల కథల పుస్తకం ఇందులో 13 కథలున్నాయి రచయిత, చిత్రకారుడూ అయిన కలువకొలను సదానంద బాల సాహిత్యానికి చిరపరిచితుడే

పెద్దవాళ్ల కథలు చిన్నపిల్లలకు పనికిరాకపోవచ్చుగాని, చిన్నపిల్లలు చదివే కథలను పెద్దవాళ్లూ చదివి ఆనందిస్తారన్నది ఏనాడో రుజువయింది అందుకే, 'ఎ' సర్టిఫికేటు తగిలించని చిత్రాలకు 'యు' సర్టిఫికేట్ ఇస్తారు కొన్ని పెద్దలు మాత్రమే చూడదగిన చిత్రాలు, మిగిలినవి అందరూ చూడదగిన చిత్రాలు అందుచేత బాల సాహిత్యం అందరూ చదవదగి ఉంటుంది, ఉండాలి

అయితే, ఈ సంగతి బాల సాహిత్యం రచించిన వారు పూర్తిగా విస్మరించటం జరుగుతుంది విష్ణుశర్మ రాజకుమారులకు రాజనీతిని పిల్లల కథల రూపంలో రంగరించిపోస్తే, చిన్నయసూరిగారు ఆ కథలను గులకరాళ్ల పాకంలో తెలుగులోకి దించి స్కూలు పిల్లల్ని చావగొట్టారు దరిమిలా వీరేశలింగం పంతులుగారు ఒక్క మెట్టు పైకి వెళ్లి ఇనప గుగ్గిళ్ల పాకంలో మిగతా పని పూర్తి చేసి, తెలుగు పిల్లలకు తెలుగు పేపర్లో సున్నాలు రావటానికి శాయశక్తులా కృషిచేశారు

చెప్పొచ్చాల్సిందేమిటంటే, ''ఇది బాలసాహిత్యమూ, ఇది కాదు'' అనటానికి విషయం కన్న, చెప్పే విధానమే ముఖ్యమైన గీటురాయి

అందుచేతనే నిన్నటి ప్రౌఢ సాహిత్యం నేటి బాల సాహిత్యంగా పరివర్తన చెందుతూ వస్తున్నది అన్ని పురాణాలూ, ఇతిహాసాలూ సులభ రచనలతో బాల సాహిత్యంగా రూపొందాయి - బాల సాహిత్యంగా పుట్టిన పంచతంత్ర కథలు చిన్నయసూరిగారి రచనతో విద్వత్సాహిత్యం అనిపించుకున్నట్టే! అంటే, బాల సాహిత్యం 'వెంకట సుబ్బారావు మేడ్ జీ' కావచ్చు, ''కుప్పుసామయ్యర్ మేడ్ డిఫికల్ట్'' కూడా కావచ్చు

ఈ 'విందు భోజనం' కొన్ని విషయాలలో రెండో తరగతి కిందికే వస్తుంది ''మాల్యవంతంబుసొంత సంతత పరిణత ఫలకాంత తరుష్కుషమండితం బగువనం బొండుగలదు,'' లాంటి కంకరరాళ్లు ఇందులో లేవుగాని, ''పిపాపోశమనార్థం'', 'వెన్నెలదొర'', ''అలలకురులు'', ''మృత్యుభయంకరారుణ నేత్రాలు'', ''ప్రశాంత గంభీరుడైన హిమవంతుడు'' లాంటి రేషన్ బియ్యం రాళ్లు పంటి కింద కొస్తూనే ఉంటాయి

కథనం మాట అటుంచి కథలే తృప్తికరంగా లేవు పెద్దవాళ్లు వీటిని చదివి ఆనందించలేరంటే, పిల్లల కథలకు అదొక ప్రమాణం కాదని ఎవరైనా అభ్యంతరం చెప్పొచ్చు కాని, ఈ కథలలో పిల్లల ఊహలను పరిగెత్తించేదీ, ఆసక్తిని నిలిపిపట్టేదీ, వాళ్ల భావనలో చాలా

కాలం గూడుకట్టుకునేదీ బహుస్వల్పం ఈ అంశాలకన్న ''నీతి''కి రచయిత ఇచ్చిన ప్రాముఖ్యం హెచ్చుగా కనబడుతుంది బాగా తిని ఒళ్లు పెంచుకున్న వాళ్లకూ్కడా చావు ఉంటుందన్నది ఒక నీతి దీని తాలూకు కథ('విందు భోజనం') చదివి, పిల్లలు అందులోని పాత్రలను ద్వేషించేటట్లు చెయ్యటం రచయిత లక్ష్యం చాలా కథలలో పిల్లలకు ఏదో విషయంపైన ద్వేషం కలిగించటానికీ కృషి జరిగింది 'విడిచి వచ్చిన వస్తువు' అన్న కథలో పిచ్చయ్యను చూస్తే అసహ్యం వేస్తుంది 'రాచబిడ్డ'లో రాజు చర్యను చూస్తే అసహ్యం వేస్తుంది 'మేడిపండు'లో రాజూ మనకు అసహ్యం తెప్పిస్తాడు 'వాసన'లో బైరాగీ అంతే

చిత్రమేమిటంటే, మనం ద్వేషించదగిన వాటికి శిక్ష జరగటం దాదాపు ఏ కథలోనూ లేదు చిన్నపిల్లల కథలలో హాస్యానికి మంచి స్థానం ఉంటుంది ఈ కథలలో అది 'వాసన'లో లీలగా ఉన్నది

'చెలికాడు' చాలా కరుణతో కూడిన కథగా ఉద్దేశించబడింది కాని, అందులో దుర్మరణంపాలైన రామిగాడుగాని, వాడికోసం ఏడ్చే స్నేహితుడు గాని మంచి వాళ్లు కారు! పిల్లలకు ఇది చాలా పెద్ద కథ

'దాగుడుమూతలు' కవిత్వం దీన్ని పిల్లలు ఏం అర్థం చేసుకుంటారో తెలీదు ఇందులోని భావాలన్నీ పెద్దవాళ్లకు అందేవి పెద్దవాళ్లు దీన్ని కవిత్వంగా ఆమోదిస్తారనుకోను

చిన్నపిల్లల కోసం ఇంతకన్న మంచి సాహిత్యం ఈనాడు వెలువడుతున్నది ఈ రచయిత బాల సాహిత్యంలో ఇంకా మంచి కృషి చేయాలి

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 22-10-1969*

# 44. కమ్మ తెమ్మెర

మధురాంతకం రాజారాం నేటి అగ్రశ్రేణి కథకులలో ఒకరన్నది అందరెరిగిన విషయమే ఆయనను గురించి ప్రచురణకర్తలు అన్న మాటలు - ''లోకానికి శ్రేయస్సును సాధించడమే సాహిత్యానికి పరమార్థమన్న పెద్దల సిద్ధాంతంలో వీరికి అచంచలమైన విశ్వాసం ఉంది'' - బహుశా కథానికా సాహిత్యానికి అంతగా వర్తించవేమో చిన్న కథలతో లోకశ్రేయస్సు సాధించటం ఇంచుమించు అసంభవమే కథలు పాఠకులను రంజింపజేయవచ్చు, ఆలోచింపజేయవచ్చు, చిన్న చిన్న చురకలు కూడా వేయవచ్చు ఈ అన్ని రకాల కృషీ మనకు ఈ కథలలో కానవస్తుంది

కాని, కథకుడి దృక్పథం బహుశా 'రామారావు చతుర్శ్లోకాలు' అన్న కథలో రామారావు దృక్పథానికి దగ్గరగా ఉండవచ్చు ''తాను చేస్తున్న పని మూలంగా లోకానికి ఉద్ధరింపుకలుగుతున్నదన్న అత్యాశ రామారావుకు లేదు జీవయాత్రా పథంలో మనకు తగిలిన బాధలను, హృదయాన్ని తాకిన ఆవేదనను వ్రాతలో బహిర్గతం చేసి, ఆ రీతిగా ఆలోచనల బరువు నుంచి విముక్తి పొందగలిగితే, కాస్త తేలిగ్గా ఊపిరి పీల్చుకుంటూ బ్రతకడానికి వీలుంటుందని రామారావు నమ్మకం ''

ఇదే అనేకమంది కథకుల దృక్పథం అని నాకు తోస్తుంది ఈ కథకుడి దృక్పథం కూడా ఇదేననుకోవటానికి ఆధారం - పైన ఉదహరించిన వాక్యాలలో ''మనకు'' అన్న మాట

రామారావు పక్షాన చెప్పిన ఆ మాటలలో దీనికి సరి అయిన స్థానం లేదు - రచయిత తనను కూడా కలుపుకుంటే తప్పు

'ఘన సన్మానం'లో కూడా ఈ వాక్యాలు చూడండి "కేవలం మాటల వల్లనే లోకోద్ధరణ జరగదు సభల్లోనూ, సమావేశాల్లోనూ ఎక్కువగా ఖర్చయేవి మాటలే" ఇది ఉపన్యాసాలను గురించి అన్న మాటలే అయినా, హెచ్చుభాగం కాల్పనిక సాహిత్యానికి వర్తిస్తాయి ఆడిన మాట లోకాన్ని ఉద్ధరించకపోతే, రాసిన మాట ఆ పని చెయ్యగలుగుతుందా? లోకోద్ధరణ జరిగే కార్యక్రమానికి మాటలు హంగు చేస్తే అదే పదివేలు

ఆయన కథలన్నిటిలోనూ "మధురాంతకం రాజారాం" ముద్ర ఉంటుంది ఆ ముద్ర తాలూకు కొన్ని లక్షణాలేవంటే కథనం మందగమనంతో సాగటం, కథలలోని సమస్యలు విప్లవయుతంగానూ, మరీ వివాదాస్పదంగానూ ఉండిక పోవటం, వాక్యాలలో కాస్తంత పండిత లక్షణాలు తొంగిచూస్తూ ఉండటం, ఇతివృత్తాలు సామాన్య కుటుంబాలకే అంటిపెట్టుకుని ఉండటం

కథనంలో మాంద్యం ఈనాడు ప్రశంసాపాత్రం కాదు 'తలుపులు - తాళాలు' అన్న కథలో "నేమ్ ప్లేట్" గురించి రెండు పేరాలున్నాయి(పేజీ 175 దిగువ) తరువాత పేజీలో టెలిఫోన్, కాలింగ్‌బెల్ గురించి ఒక పెద్ద పేరా ఉంది ఇదే కథలో ఒక స్నేహితుడు ముక్తసరిగా పలకరిస్తే, కథ చెప్పే వ్యక్తి తనకు రియాక్షన్ కలగలేదని చెప్పటానికి పది, పదకొండు పంక్తులున్నాయి 'ఖాళీఘటా' అన్నచివరి కథలో అసలు కథ జలదబాల దగ్గిరనుంచి కమలారాణికి ఉత్తరం రావటంతో ప్రారంభమవుతుంది దీనికిముందు పదిన్నర పేజీల కథనం ఉన్నది! ఇంతకన్న చిన్న ఉదాహరణలు అన్ని కథలలోనూ దొరుకుతాయి కథకుడు "పొదుపు" పాటించటం లేదనిపిస్తుంది రచనలో పొదుపు లోపించటం శిల్పానికి దెబ్బ

కథలలోని సమస్యలు హెచ్చుభాగం చాలా కాలంగా ఉంటున్నవే భార్యలు కాపరాలకు రావటం, ఉద్యోగాలలో చిక్కులు, సమిష్టి కుటుంబాల రొష్టు, బదిలీల బెడద, అందులో ప్రామోషన్ల సంతృప్తి - ఇవే హెచ్చు కథలలో ముఖ్య సమస్యలు ఇందులో ఉన్న పధ్నాలుగు కథలలోనూ అయిదారింట ఒకే పాత్రలను మనం ఊహించుకోవచ్చు అన్ని పాత్రలూ మధ్యతరగతి జీవిత విధానాన్నీ, విలువలనూ ఆమోదించేవే చెప్పుకోదగిన తిరుగుబాటు కానరాదు "మానవ జీవితాన్ని ఎదుర్కొంటున్న సాంసారిక, సామాజిక సమస్యలు ఒక స్థలానికీ, ఒక సమయానికీ పరిమితమైనవిగా కనిపించడం లేదు అవెప్పుడూ ఉన్నాయి ఎక్కడా ఉన్నాయి" ('బెరామీటరు') - అన్న మాటలు పూర్తిగా నిజం కాదు జీవితం అనేక కొత్త సమస్యలను తెచ్చి మన నెత్తిన రుద్దుతున్నది జీవితం మారటమే గాక, కొన్ని విషయాలలో అతి వేగంగా కూడా మారుతున్నది

కథకుడుగా రాజారాం సమర్థత రకరకాలుగా మనకు ఈ కథలలో కనబడుతుంది 'బెరామీటరు' అన్న కథలో గుమాస్తాగిరీలో అగచాట్లు పడి, అవమానం పాలైన సుందరం, అభిమానంకొద్దీ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి, చివరకు పరువుగానే తిరిగి దాన్ని సంపాదించుకుంటాడు అయితే ఈ మధ్యలో అతను నిరుద్యోగి పడే వేదనంతా అనుభవిస్తాడు వేసిన గొంగళి వేసిన చోటనే ఉన్నా, దానికి ఎంతో గండం తప్పిందన్న తృప్తి పాఠకుడికి కలుగుతుంది

'ఘన సన్మానం' అన్నది సన్మానాల మీద ఒక విధమైన సెటైర్ ఈ కథలో పండితోత్తముణ్ణి అధ్యక్షుడుగా పెట్టి, ఆయన భార్యకు సన్మానం జరపటం ఒక నావెల్టీ అయితే, తన భార్య సన్మానానికి అధ్యక్షులవారిచ్చిన ఉపన్యాసం కథలో లేకపోవటం చాలా పెద్ద లోపం

'మెత్తనిపులి'లో అన్నను ఎదిరించి తన భాగం తీసుకునే దురుసుతనం లేని తమ్ముడు, తన వాటాను అమ్మి, ఆ డబ్బుతో తన అన్న అద్దెకుంటున్న ఇల్లు కొని, అతనిచేత ఇల్లు ఖాళీ చేయించి,తాను అందులో ప్రవేశిస్తాడు తిక్కనసోమయాజి గారు ధర్మరాజును మెత్తని పులి అనిపించారు గోపాలానికీ, ధర్మరాజుకూ అట్టే పోలిక లేకపోయినా, ఇద్దరూ ఒకటే సాధించారు

'కార్టూన్' అన్నది ఒక చిన్నరొమాన్స్ ఇదే ఇతివృత్తాన్ని చేతగానివాడు రాస్తే వెకిలిగా తయారై ఉండేది

'రంగయ్య తమ్ముడు' వాస్తవిక దృష్టి గల కథ ఊళ్ళోకి ఒక బైరాగి వచ్చాడు అతను ఏనాడో దేశాలు పట్టిపోయిన రంగయ్య తమ్ముడు అవునా, కాదా అన్నది ప్రశ్న బైరాగిని నిలదీసి అడిగితే, ''నేనునిజంగా కేశవులినే అయితే, రంగయ్యగారు నాకాస్తిలో వాటా ఇవ్వగలరంటారా, బాబూ? ఆ రంగనాథంగారు నా కూతుర్ని తన కొడుక్కు కట్టబెట్టుకోగలరంటారా?'' అని అడుగుతాడు వ్యక్తిత్వం చెరిగిపోయిన మనుషులకు హక్కులూ, ఆనవాయితీలూ ఉండవు

ఒకరి సమస్యలను ఇంకొకరి మేధ పరిష్కరించలేదన్న నిజం 'సహజీవనం' అన్న కథలో నిరూపితమయింది

'ఖాళీఘటా' అన్న కథలో పెన్ ఫ్రెండ్షిప్ మీద విసుర్లూ, వాళ్ళ ఉత్తరాలలో కృత్రిమత్వమూ ఉన్నాయి తన ఉత్తరాలతో జలదబాలతో స్నేహం పెంచిన కమలారాణి తీరా చూస్తే ఖాళీకుండ - ఓటికుండ కూడానూ అంతకన్న పేద కుటుంబానికి చెందిన రాజి నిండుకుండ!

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 29-10-1969*

# 45. వినడానికో కథ

సాహిత్య సేవకు అంకితమై ఉన్న ''సృజన'' తరఫున పుస్తక ప్రచురణ ప్రారంభం కావటం అభినందించదగిన విషయం రచయిత సాహిత్య రంగానికి పాతకాపు కాకపోయినా ఈ కథా సంపుటి వెనక వరవరరావు, కాళోజీ, శ్రీపతిలాంటి వారుండం దీనికి గట్టి సిఫార్సుగానే భావించాలి

ఈ కథలను ఏ దృష్టిలో చదవాలో సూచిస్తూ శ్రీపతిగారు రాసిన ముందుమాటలున్నాయి ''జీవిత అవసరాలని భౌతిక సత్యాల అవగాహనతో ఆర్థిక రాజకీయ సామాజిక శక్తుల పరిణామాన్ని చూడనిదే ఎంత గొప్ప రచయితన్నా అవనీగాకవెరసి మొత్తం మీద ఏ ప్రయోజనాన్నీ సాధించలేడు పరిసరాలూ, పాత్రలు సంఘటనలు, సంఘర్షణ వాటి పరస్పర సంబంధాల సమగ్ర పరిశీలన, వాస్తవికమైన వస్తుగత దృష్టి వీటితో రచయిత కథని కళాత్మకం చేయగలడు సాహిత్యాన్ని ఆయుధం చేసుకోగలడు ''

స్థూలంగా ఇదే అభ్యుదయ సాహిత్య దృష్టి

ఈ సంపుటిలోని ఏడు కథలూ సాధారణంగా మంచి కథలుగా చలామణి అయే వాటి ప్రమాణాలను ప్రదర్శిస్తున్నాయి కాని ప్రశస్తమైన కథల స్థాయిని అందుకోవటం లేదు అందుకు కారణం ఇతివృత్తంలోనో, కథనంలోనో, శిల్పంలోనో సమర్థత లోపించటం

''నిరాహారదీక్ష చేయబడును'' అన్న కథ హాస్య వ్యంగ్య రచన, వైట్ సెటైర్ హాస్యం వ్యంగ్యం యొక్క పదునును తినేసింది నిరాహారదీక్షలు సాగించటం ఒక బిజినెస్ అయినాక దాని నీతి దానిదేగాని అది నిత్య జీవితానికి అనువర్తించదు మొగుడు వ్యాపార రీత్యా బహుభార్యత్వాన్ని సమర్థిస్తే, ఆ వ్యాపారంలో భాగస్వామిని అయిన భార్య అందువల్ల తనకేం కొంప మునుగుతుందోనని వ్యాపారాన్ని పాడుకానిస్తుందా? ఒక హిందువూ, ఒక ముస్లిమూ కలిసి భాగస్వాములుగా వ్యాపారం చేసినప్పుడు ముస్లిం భాగస్వామి ముస్లింకూ, హిందూ భాగస్వామి హిందూ మహాసభకూ, ఒకరి అనుమతితో ఒకరు విరాళాలిచ్చారు గదా! (హిందూ ముస్లిముల పరస్పర హత్యాకాండ జరిగేసమయంలోనే )

''పోస్టు మార్టెమ్'' లో అసలు శవమే ఉన్నట్టు కనబడదు క్రిష్ణప్రియ ఆత్మహత్య చేసుకున్న దన్న మాటే అనుమానంలో పడింది కాని ఈ సంగతి మనకు చివరకుగానీ తెలీదు ఈ సంగతి చివరిదాకా దాచి రచయిత తన బరువు చాలా దించేసుకున్నాడు జరిగినది ఆత్మహత్యే అయితే రోకులు చేసిన హంగామా కొంత అసహజంగా ఉన్నా దాన్ని అసంభవమని కొట్టి పారెయ్యటానికి లేదు ఆత్మహత్య ఆయితే దానికి కారణం బయటపెట్టే బాధ్యత రచయిత మీద ఉన్నది కృష్ణప్రియది సహజమరణం అని సూచన చెయ్యటంతో రచయితకు ఆ బాధ తప్పింది - కాని కథ తుస్సుమన్నది ఆత్మహత్య అని నిర్ధారణ కాకుండానే, ఉత్త ఊహమీద లోకం ఇంత అసహ్యంగా ప్రవర్తిస్తుందా? ఒకవేళ ప్రవర్తించిందే అనుకున్నా, జరిగిన పోస్ట్‌మార్టమ్ ఏమిటి? శ్రీపతిగారు ఈ పేరును చాలా మెచ్చుకున్నారు

'వేళ్లు'' అన్న కథలో పెద్ద లోతులేదు గాని, చక్కని కథనం ఉన్నది మధ్యతరగతివాడి సెల్ఫ్ పిటీ అచ్చుగుద్దినట్టు కనిపిస్తుంది కార్ఖానాలలో తరచు పనిచేసేవాళ్లు ఇలాటి ప్రమాదాలకు గురి అవుతూనే ఉంటారు కాని ఈ కథలో వ్యక్తి తన కష్టానికి చెందే అనుతాపం వర్ణనాతీతం ఈ పాత్ర చిత్రణ నాకు సరిగా ఉన్నట్టే తోస్తున్నది

''వినడానికో కథ'' గందరగోళంగా ఉంది నమ్మశక్యంగా లేదు సారధి చెప్పే శాంత గురించి ఆ ఊళ్లో వాళ్లే, కథకుడి ఆప్తస్నేహితులే ఎరగరా? ఆమె కొడుకు తమకు సోడాలందించే కుర్రాడని తెలిసి వాళ్లీ హాహాకారాలు చేస్తారా? ఆ కథకు బ్రాందీ అనుపాతంగా ఉండటంలో ప్రత్యేకత ఏమిటి? ప్రతి ఊళ్లోనూ డజన్లకొద్దీ శాంతలు లేరా? సారధులు లేకపోవచ్చు కాని ఆ సారధియొక్క దీర్ఘకాల మిత్రులే అతని విచిత్రానుభవాన్ని ఎరగరా? ఈ కథను ఎటు నుంచి కొరుకుదామన్నా కొరుకుడు పడకుండా ఉన్నది

''దుఃఖంలేనోడు''లో గొప్పజీవి తాపత్యం లేక పోయినా చదవటానికి సరదాగా ఉన్నది ఈ కథకుడిలో గల సున్నిత హాస్యం ఇందులో చక్కగా వ్యక్తమవుతుంది ''వినడానికో కథ'' కు అనేక విధాల ఇది విరుద్ధం ఇందులో డొంకతిరుగుళ్ళు లేనేలేవు

''సావిత్రి'' కథకూడా నాకు తేలిక కథగానే కనబడుతుంది అందులో ఉన్నత విలువలు సాధించే అవకాశం నాకు కొంచెం కూడా కనబడటంలేదు సావిత్రిలాటి భార్యలూ, జగన్నాధంలాటి భర్తలూ (పురాణం వారి భాషలో) ఉన్నారున్నారు

''అదిగో బస్సు'' అన్న కథలో బస్సు సామాజిక జీవితానికి ప్రతీక అనవచ్చు కాని బస్సు అందుకోలేక పోయినవాడు అందుకున్నవాళ్ళకన్నా గొప్ప అర్జంటు పనిమీద వెళుతున్నవాడ కాడు

సృజన ప్రచురణల నుంచి ఇంకా మంచి పుస్తకాలు వెలువడతాయిని ఆశింతాం

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 12-11-1969*

# 46. ప్రేమించు ప్రేమకై

ఇది ఒక విదేశీ కథ ఏ పాశ్చాత్య నవలకో ఇది అనువాదమనిగాని, లనుసరణ అనిగాని నేను ఆరోపించటం లేదు ఇందులోని పాత్రల పేర్లు మార్చి, వాళ్ళ చీరలూ, కుంకం బొట్లూ తీసేసి, కొద్దిగా సంస్కరించి ఇంగ్లీషులోకి తర్జుమాచేస్తే ఇది ఇంగ్లీషు నవలగా చలామణీ కావటానికి అభ్యంతరం ఏమీలేదు

అయిదు గజాల చీర కట్టిన అమెరికన్ వనితను భారత మహిళగా భావించటానికి పట్టేచ్చినట్టే, ఈ కథలోని పాత్రలు మన జాతికి చెందినవేనని మన పాఠకులు అనుకోవటం చాలా కష్టమవుతుంది పాత్రలే కాదు, వాటి ప్రవర్తనా, అలవాట్లూ, స్థాయీ వాటి మధ్య సంబంధాలూ ''షిల్లింగు'' నవలలో కనబడవలిసిందేగాని, మన నాటు వాతావరణంలో కనబడవు

హీరోయిన్ లలిత ఒక ''వారసురాలు'' (heiress) హీరో ఎస్టేటుదారు (country squire) హీరోయిన్‌కు ఒక స్పూన్సిక్ లాంటి '' అత్త'' ఉంటుంది (స్పూన్సిక్ ఎందుకంటే ఆమె జీవితంలో ఒంటరిగా తేలుతూ ఉంటుంది ) ఆ అత్తకు కట్టుకుపోయినంత ఆస్తి ఉంది ఆమె వ్యవహారాలు చూసేటందుకో లాయరున్నాడు ఏం చేస్తుందో తెలీదుగాని, ఈ అత్త వెంట ఒక ''అవ్వగారు'' ఉన్నది ఈవిడ బహుశా హౌస్ కీపర్ అయి ఉంటుంది

ఆంటీ ఆస్తిఅంతా తనది అయి, మరో అంకుల్ ఆస్తికూడా వచ్చేసరికి లలిత ''కంట్రీసైడ్'' వెళ్లి తన గార్డియన్ దగ్గిర పడుతుంది

లలిత దిగిన స్టేషను చిన్నదిలా కనబడుతుంది అయినా స్టేషను మాస్టరు, ఆమె వెళ్లవలిసినచోటికి ''టాక్సీ'' లో పంపిస్తాడు అటువంటి చిన్నస్టేషన్లుగాని,స్టేషనునుంచి ఎస్టేటుకు వెళ్లే దారి వర్ణనగాని ఈ దేశంలో మనకింకా లభ్యం కావటం లేదు

లలిత గార్డియన్ బలరామశాస్త్రి ఏమంత వైదీకిగా గాని, బ్రాహ్మడుగా గాని బతుకుతున్న లక్షణాలు కానరావు అతని ఇంట్లో కూడా ఒక ట్రోయికా ఉన్నది బలరామ్ అతని ఆంటీ, ఆమెకూతురూ ఇక్కడ ఉన్న కాలంలో లలిత ఇంకో -''అమ్మమ్మ'' పరిచయం సంపాదించుకుంటుంది ఈ అమ్మమ్మగారు బ్రహ్మాండమైన పార్టీలు పారేస్తూ ఉంటుంది

ఈ పార్టీలలో మనకు ''మందు'' వాసన ఏమాత్రమూ తగలదు కాని, బలరామ్ ఒక సందర్భంలో సరళను (తన ఇంట ఉన్న ఆంటీ కూతుర్ని) నోరుజారి (లేదా రామలక్ష్మి కలం జారి), అప్పుడే ఓ రెండు కొట్టేసి వచ్చావా?'' అని నవ్వుతూ అడుగుతాడు శేషం ఊహ్యం

మన వాతావరణంలో ఒక ఆడదానికి ఒక ''ముదనష్టం'' కలిసివస్తే ఘరానా మనుషులు కూడా ''అలగా జనం'' అయిపోయి, దానిచుట్టూచేరి భజనలు చేస్తూ, దాని లొసుగులన్నీ ఘనతలు చేసేస్తారు లలితకు రెండు ముదనష్టాలు కలిసివచ్చినా ఆమెచుట్టూ చేరేది అసలైన ''అలగా''వాళ్లే గాని ''హల్కా'' అయిపోయిన గొప్పవాళ్లెవరూ లేరు ఆమె ఆస్తిని ఎవరూ ఖాతరు చెయ్యరు ఆమె అందం, హుందాతనం ,అమాయకత్వం వగైరాలు మాత్రం బలరామ్‌నూ, అమ్మమ్మగార్నీ, తదితర మంచివాళ్లనూ ఆకర్షిస్తాయి సరళా, వాళ్లమ్మలాంటి పెద్దవాళ్లు లలిత ఆస్తిని కొంచెంకూడా కేర్ చెయ్యరు ఆమెను అణగదొక్కటానికి ప్రయత్నిస్తారు ''వారసురాలిని'' అణగదొక్కటం మాటలా!

అసలు లలితే తన ఆస్తిని కేర్ చెయ్యదు ఆమె సమస్య ప్రేమ పేదగా మోహన్‌ను మోహించింది వారసురాలుగా బలరామ్‌ను ప్రేమించింది మోహన్ ఎడ్వెంచరర్ బలరామ్ ''స్ట్రాంగ్, సైలెంట్‌మాన్'' వారిద్దరి మధ్య గల వ్యత్యాసమే లలిత స్థాయిలో కలిగిన మార్పుకు తార్కాణం

నవల తెలుగువాళ్ళ జీవితానికి ప్రతిబింబం ఎంతమాత్రమూ కాదు అంతమాత్రాన ఇది తెలుగు సినిమా చిత్రాలకు పనికిరాదనుకోనవసరంలేదు యింత కన్న కూడా నాన్ తెలుగు కథలు సినిమా తెరను అలంకరిస్తున్నాయి

కొన్ని కొన్ని రచనలకులాగే ప్రేమకు కూడా ఒక నిర్దిష్టమైన ప్రయోజనం లేనప్పుడు 'ప్రేమించు ప్రేమకై' అన్నది సహజమే అవుతుంది

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 3-12-69*

# 47. పసిడి బొమ్మ

ఈ చిన్న పుస్తకంలో చిన్నవీ, పెద్దవీ కలిసి 14 కథలున్నాయి 30 ఏళ్ళకు పైగా రచనానుభవంగల రచయిత వయసు మాత్రం 45కు లోపే చిన్నతనం నుంచీ రచనయందు ఆసక్తి ఉండటమూ, దీర్ఘ కాలంగా రాస్తూ ఉండటమూ రచయితకు కొంత వ్యక్తిత్వాన్నీ, పుష్టినీ ఇస్తాయి ఈ గుణాలు ఈ కథలలో కనబడతాయి

'పసిడిబొమ్మ'కు తిలకం పెడుతూ పోతుకూచి వారు, ''కథకు ఉండవలసిన లక్షణాలన్నీ శాస్త్రరీత్యా ఏకరువు పెడితే, బహుశా కొన్ని కథలు ఆ పరీక్షకు ఎదురు నిలబడకపోవచ్చు'' అన్నారు శిల్పం మాట అటుంచి చాలా కథలలో విషయ వైశిష్ట్యం కూడా లోపించింది రాజారావు అనే ఆర్టిస్టు తెచ్చి ఉంచుకున్న రాధ అనే ఒకస్త్రీ, రాజారావు పారిపోతే అతని స్నేహితుడు శంకరం దగ్గిర చేరి, అతని ఆదరణ పొందలేక, అక్కడినుంచి కూడా ఎటో వెళ్లిపోతుంది ఆ రాధే 'పసిడిబొమ్మ'

'అలవాటు' అన్న కథలో ఒక కార్మిక నాయకుడు విశ్రాంతికోసం వచ్చి అక్కడే ఒక సమ్మె లేపుతాడు

'అక్కయ్య పెళ్లి' అన్నకథలో అక్కయ్య చేసుకోక చేసుకోక ఒక నడివయస్సు మామయ్యను చేసుకుంటుంది

'పరీక్ష' అన్న కథలో ''రామాంజణం'' అనేవాడు దౌరా వెళుతూ తాగనని భార్య దగ్గిర శపథం చేసి, తాగుడుకోసం నానాతిప్పలూ పడతాడు

'అతిథి' అన్న కథలో ఒక పట్నవాసి అతిథిని వదిలించుకునేటందుకు పడ్డపాట్లు చిత్రించబడ్డాయి

కాని కథలన్నీ జీవితానికి చాలా సన్నిహితమైనవి మధ్యతరగతి పాఠకుడు కథలో ప్రతి వివరాన్నీ సూటిగా అర్థంచేసుకోగలడు అదే ఈ కథలలో ప్రత్యేకత ఇతర కథకులు సాధారణంగా ఎత్తుకోని వాతావరణమూ, ఘటనలూ కూడా ఇందులో లేకపోలేదు

'చోటా లీడర్', 'కవి సమ్మేళనం', 'ప్రతిష్ఠాపరుడు' అల్ప రచనలు 'రాజర్షి' అన్నది చిన్న రచనే అయిన అందులో ప్రతి వాక్యంలోనూ నిండుగా వ్యంగ్యం ఉన్నది అది పదునైనరచన అలాగే 'రాజును గురించిన కథ'లో కూడా ఒక బలమైన భావం ఉన్నది కళాకారులే విప్లవకారులన్నది ఆ భావం అయితే రచనా విధానంలో లోపంవల్ల ఇది పేలవంగా ఉన్నది

మధ్యతరగతి వారికన్న ''నోరులేని పశువులు నయం'' అని నిరూపించే కథ 'నిట్టూర్పు' కూడా చిన్న కథే

'అభిమానం' అన్న కథ అంత విశ్వసనీయంగా ఉండకపోయినా, కుల వివక్షను బాగానే తూర్పారబట్టింది మంచి ప్రయోజనం గల కథ ఈ కథలో కథకుడు ''హరిజనుడు'' అన్న మాట వాడకపోవటం గమనార్హం అది చాలా దొంగమాట అనే నా నమ్మకం కూడా

ప్రజలకూ, మంత్రికీ మధ్య నలిగేవాడు ఉద్యోగి అనినిరూపించేకథ 'ప్రజ, ఉద్యోగి, మంత్రి' అన్న కథ

'పాల పొంగు' 1942 ఆగస్టు కథ ఆనాటి ఉద్యమం పాలపొంగు అన్నది నిజమే కావచ్చు కాని ఇందులో పాలపొంగు ఆనాటి స్కూలు విద్యార్థులది వాళ్లు స్కూలు అధికారుల మధ్యా, ఇంటిదగ్గర తండ్రుల మధ్యా కూడా నలుగుతారు

ఈ రచయితకు అనుభవం ఉంది రాసే శక్తి సామర్థ్యాలున్నాయి ఈయన నుంచి ఇంకా మంచి కథలు ఆశించవలసి ఉన్నది

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 10-12-1969*

## 48. కాకులు

ఈ కథల సంపుటిలో ఆరు కథలున్నాయి మొదటి కథ 'మూడువేల ఐదు వందలు' ఇది ఒక యువకుడు పుచ్చుకున్న పెళ్లి కట్నం యువకుడు ఉన్నతాదర్శాలు కలవాడు మనం ఆశక్త దుర్జనులను గురించి వింటాం ఇతను ఆశక్త సజ్జనుడు అందం చూడగూడదు, కట్నం తీసుకోరాదు, భార్యను పోషించదగిన స్థితిలోనే పెళ్లాడాలి - ఇవి అతని ఆశయాలు ఈ ఆశయాలు పరిస్థితుల వేడికి ఇగిరిపోతాయి తల్లికి ఆడతోడు కావాలి తండ్రికి కట్నంకావాలి అందమైన పిల్లే దొరుకుతుంది పెళ్లితో పిల్లలు పుడతారు ఖర్చు పెరుగుతుంది రాబడి పెరగనందున అప్పు పెరుగుతుంది మామగారు దివాలా ఎత్తేసి దిక్కుమాలిన చావు చస్తాడు మామగారికి ఆ మూడు వేల ఐదువందలూ తిరిగి ఎప్పటికైనా ఇచ్చెయ్యాలన్నది

గొంతెమ్మ కోరిక లాగే నిలిచిపోయింది చూస్తూండగానే కూతురికి కట్నంతో సహా పెళ్లి చెయ్యవలసిన రోజు ప్రతిధ్వనిలాగా వచ్చి పడుతుంది

'తాత', 'తాతయ్య మరిపెం' అన్న కథలు స్కెచెస్ చిన్నతరం వాళ్లని ''పాడు'' చెయ్యడం, పైతరం వాళ్లు తమకు తగిన మర్యాదలు చూపటం లేదని ఆ గ్రహించటం వార్ధక్య లక్షణాలు వార్ధక్య లక్షణాలు రెండు కథలలోని తాతయ్యలలోనూ ఉన్నాయి ఇద్దరూ సుబ్బయ్యతాతలే కాని ఇద్దరూ ఒకరుకారు ఒకరు కాకపోయినా అన్నదమ్ములనిపించుకోదగిన వాళ్లే

రెండో కథలో ఉన్న సుబ్బయ్య తాత కథకుడికి ఏ విధంగా తాతో తెలియటం లేదు ఆయన కున్నదే ఒక్క కొడుకు వాడికింకా పెళ్ళీ అదే లేదు ఈ సుబ్బయ్యతాత తన కొడుకును ఎంతగా పాడు చేశాడంటే,తనకన్న చిన్నవాళ్ళు ఉద్యోగాలు చేస్తున్నా వాడికి వీధిబడి చదువు రాలేదు పిల్లల్ని అచ్చగా మురిపెంతో ఇంత శుంఠలుగా చెయ్యటం సాధ్యం కాదు చాలా చిన్నతనంలోనే చదువంటే భయమూ, అసహ్యమూ అలవరచుకున్నవాళ్లు అలా తయురుకావచ్చు కొంతమందికి జన్మతః చదువంటకపోవటం కూడా ఉండవచ్చు సూర్యానికి చదువుకోవాలని ఉన్నది అలాటి వాడు తండ్రి గారాంతో పూర్తిగా శుంఠ అయిపోవటం అనుమానాస్పదం

''వీడ్కోలు'' చిన్న కథ చక్కని కథ గంభీరమైన కథ ఒక యుక్త వయస్కురాలు చనిపోయింది ఆమెను మోసేసినాక, పొరుగింటి యువకుడికి, ఆమె తనను ప్రేమించినట్టు ఒకటి రెండు దాఖలాలు కనబడతాయి ఇనపతెరలకోసం కమ్యూనిస్టు దేశాల పొలిమేరలు వెతకక్కరలేదు అవి మన మధ్యనే ఉన్నాయి మనది మూగ జీవితం అనటానికి సందేహం లేదు

'పట్టు తెరలు' అయ్యవారి నట్టింటికి పట్టుతెరలు ఇది కూడా పాత్ర చిత్రణ ప్రధానంగా గల కథే స్కెచ్ లాటిది ఇందులో ఒక వితంతువు గంజినీళ్లకు కూడా ఉండీ లేని స్థితిలో తన దారిద్ర్యాన్ని ఒకరికి తెలియనివ్వకుండా, ఒకరి మీద ఆధారపడకుండా, అయినవాళ్లను కూడా ఆమడదూరంలో ఉంచి తన జీవితాన్ని కొనసాగించుకొస్తుంది మధ్యతరగతి మనస్తత్వానికి కటిక దారిద్ర్యం అడ్డు రాదు ఆ మనస్తత్త్వం అర్థం లేని వ్యక్తివాదం మీదా, సంఘానికి వెలిగా బతకటంలోనూ ఉంటుంది ఈ పాత్ర పట్ల రచయితకు సానుభూతి ఉన్నట్లు కనిపిస్తుంది ఆ సానుభూతి సమర్థనీయం కాదు ఏ సంఘ వ్యతిరేకి పట్లా సానుభూతి తగదు

'కాకులు' అన్న కథలో కాకులైతే ఉన్నాయి గాని, అసలైన కాకులు లోకులు, భర్త పోయి బతుకు శూన్యమైపోయిన ఒక అనాథకు కాస్త ఆధారం దొరికేటట్టు కనబడితే దాన్ని ఆమెకు అందకుండా తన్నేస్తారు అసలు కాకులు మంచివి అవి ఒకరి చేతినించి తన్నేసినదాన్ని తామైనా అనుభవిస్తాయి మనిషికాకులు ఒకరిని తిననివ్వవు, తాము తినవు

మనిషికాకుల మనస్తత్త్వం ''మూడువేల ఐదువందలు' అన్న కథలోనే మనకు కొంత తెలుస్తుంది మనిషికాకి మితవాది అయితే మూడువేల అయిదు వందల కట్నం తీసుకునేటందుకు అభ్యంతరం చెప్పదుగాని, ''అంతకంటే ఎక్కువ కట్నాపేక్ష మనకుండకూడదు'' అంటుంది ఈ మనిషికాకులు ''బొత్తిగా మూర్ఖులు ప్రపంచాన్నంతా తమ దృష్టితోనే కొలుస్తారు అంతా తమలాంటి అభిప్రాయాలే కలిగి ఉంటారని భావిస్తారు అదే అభిప్రాయాన్ని ఎదుటివాళ్లకు నీతులు చెప్పటానికి ప్రయత్నిస్తారు వాళ్లు చేసే పన్లన్నీ వాళ్ల దృష్టిలోఘన కార్యాల్లాగానే కనిపిస్తాయి ''

ఈ కథకుడి కథనంలో గాని, శైలిలోగాని ఎలాటి వికారాలూ లేవు ఇవి పరితను చొక్కా పట్టి నిలపవు డొక్కల్లో పొడవవు పాఠకుడి లెవెల్‌లో మాట్లాడతాయి సామాన్య జీవితాన్ని సమగ్రతతో చిత్రించే నేర్పు ఈ కథలలో కనిపిస్తుంది జీవితాన్ని ఇంకా కొంచెం లోతుగా మథించినట్టయితే ఈ కథలను అగ్రస్థానంలో ఉంచటానికి ఎలాటి అభ్యంతరమూ ఉండకపోను

*- ఆంధ్రప్రభ, వారపత్రిక, 17-12-1969*

# 49. సీతజడ (కథ)

'సీతజడ' అన్న కథ (దీపావళి సంచిక)లో, ఏ విధమైన నాన్సెన్స్ పట్లనైనా అసహనం గల పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు, ఏసుక్రీస్తు లాంటి జీవకారుణ్యమూ, జీవితం ఎటు పోతున్నదన్న సంజ్ఞానమూ చక్కగా ప్రదర్శించారు మంచి కథ

*- జ్యోతి మాసపత్రిక, జనవరి 1970*

# 50. రచయితగా గోపీచంద్

గోపీచంద్ అన్వేషి, మేధావి, పైపై మెరుగులతో పాఠకులను మభ్యపెట్టి, రంజింపజేసే ప్రయత్నాలకు పాల్పడినవాడు కాడు, ఇతరులు ఈ మార్గాన శిఖరాలెక్కారు గదా, మనమూ ఆ దారే అవలంబింతాం అన్న దృక్పథం కలవాడు కాడు అతనిది సొంతదోవ ఆఖరుకు తన తండ్రిగారైన విఖ్యాతుడు కవిరాజుగారి దోవ నుంచి కూడా అతను తొలి దశలోనే తప్పుకున్నాడు అతను ఏదో ఒక సిద్ధాంతాన్ని దృఢంగా ఆలంబన చేసుకుని దానికే అంటిపెట్టుకున్నవాడు కూడా కాడు అన్ని రకాల భావాలకూ తనను తాను గురి చేసుకుని తన మేధ స్వీకరించిన ప్రతి భావానికీ, సిద్ధాంతానికీ చోటిచ్చి చూశాడు ఈ విధంగా అతను చాలా రకాల పరిణామాలకు గురిఅయి, తనలో కలిగిన భావ పరిణామాలన్నిటికీ సాహిత్యరూపం ఇచ్చి తెలుగువారికి అందించాడు

చలంగారు కూడా తన మనోగత భావాలకూ, విశ్వాసాలకూ సాహిత్యరూపం ఇచ్చి తెలుగు వారికి అందించినవాడే కాని ఆయన పరిణామంలో రెండే దశలు కనిపిస్తాయి కాని గోపీచంద్‌లో జరిగిన పరివర్తనలు అనేకం

అదే గోపీచంద్‌లోని బలమూ, దౌర్బల్యమూ అని నాకు తోస్తుంది హేతువాదిగా, భౌతికవాదిగా ఉన్నప్పుడు అదే తనకు పరాకాష్ఠ అన్న ధోరణిలో రచనలు చేశాడు ఒక దశలో కమ్యూనిజం, రాయిజం, ట్రాట్స్కీయిజం కూడా అతన్ని అంతో ఇంతో ఆకర్షించాయి తరవాత తాత్త్విక చింతన ఆరంభమయింది "భగవద్గీతలో ఫాసిజం ఉంది" అన్న గోపీచంద్ దాన్ని ఒక ఉద్గ్రంథంగా ఆమోదించాడు కవిరాజుగారు భగవద్గీత ప్రక్షిప్తమని రుజువు చెయ్యటమే గాక దానిమీద పారడీ కూడా రాశారు కాని అదేదీ గోపీచంద్‌కు అడ్డంరాలేదు

గోపీచంద్ తాను పక్కా ఆధ్యాత్మికవాదినని చెప్పుకోనట్టూ, అతని కృషి అంతా భౌతిక ఆధ్యాత్మిక వాదాలను సమన్వయించటానికి జరిగినట్టూ ఈ గ్రంథం చెబుతున్నది కాని అలాటి సుస్థిర మనస్థితి గోపీచంద్‌లో చివరి రోజులలో ఉన్నట్టు నిరూపించటం సాధ్యం కాదనుకుంటాను

అదీకాక కళలో ఆధ్యాత్మిక వాదమన్నది పలాయనం తప్ప మరేమీ లేదు జడత్వానికీ, చైతన్యానికీ మధ్య ఒక సంఘర్షణ ఉన్నట్టు ఊహించటం లోతైన పరిశీలనతో కూడుకున్నది కాదు క్వాన్టమ్, న్యూక్లియర్ శాస్త్ర పరిజ్ఞానం కలవారెవరూ ప్రకృతిని ''జడం''గా భావించలేరు వేడికి ఇనుము కూడా కరిగే మాటా, మరింత వేడికి ఆవిరి కూడా అయే మాటా నిజమే కాని కరిగే గుణమూ, ఆవిరి అయే గుణమూ ఇనుములో స్వభావసిద్ధంగా ఉన్నదేగాని ఘర్షణ ఫలితంగా కొత్తగా వచ్చినది కాదు ఆ ఆవిరిని చల్లబరిస్తే తిరిగి ద్రవమై, తరవాత ఇనుముగా మళ్ళీ మారుతుంది

ఆధ్యాత్మికవాదాన్నీ, భౌతికవాదాన్నీ సమన్వయించటమనేది కేవలం వాగాడంబరం సాంఘిక పరిధులు దాటిన కళలు మరేదన్నా అవుతాయి గాని కళలు కావు ఈ విషయమై కొందరికి అభిప్రాయభేదం ఉన్నదని నాకు తెలుసును కాని ఈ విషయం చర్చించటానికి ఇది చోటు కాదు

''రచయితకూ, రచనకూ అభిప్రాయభేదం ఉంటుందా?'' అని రాజారావుగారు అడిగితే గోపీచందు ''ఏమాత్రం ఉండదు'' అన్నాడు ''గురించి'' రాసిన సంజీవదేవ్‌గారు ఒప్పుకోవటం లేదు ''చాలామంది రచయితల జీవితాలకూ, వారి రచనలకూ పోలికలే ఉండవు'' అంటున్నారు ఇంత సాధారణ సత్యం గోపీచందుకు తెలీదా? అందరూ తనలాగే చిత్తశుద్ధితో రాస్తారన్న నమ్మకం గోపీచందుకు ఉండి ఉండాలి లేదా తనకూ, తన రచనకూ అత్యంత సన్నిహిత సంబంధం ఉన్నదని రాజారావుగారికి తెలియచెప్పటానికైనా అలా అని ఉండాలి

గోపీచందు రచలను ద్వేషించేవారున్నట్టు మనికీ పుస్తకం చెబుతున్నది వ్యక్తిగతంగా గోపీచందును ద్వేషించిన వారిని నేనెరుగుదును ఈ రెండు రకాల వాళ్లూ ఒకే వర్గీయులైతే గోపీచందు జీవితానికీ, రచనలకూ విడని లంకె ఉన్నదనుకోవచ్చును దీని విషయం ఓపిక గల వాళ్లు పరిశోధించవలసి ఉంటుంది

ఒక దశలో గోపీచందుకు భజనపార్టీగా తయారైన వాళ్లు తరవాత అతన్ని దూషించటం కూడా నాకు తెలుసు కాని అందుకు కారణం గోపీచందులో కలిగిన పరివర్తన కావచ్చు ''గోపీచందు రాసిన ప్రతి రచనకూ నేను మూలం చూపగలను'' అని ఒక మిత్రుడు నాకన్న గోపీచందుకు చాలా సన్నిహితుడుగా మెసలిన వాడు అన్నారు ''గోపీచందు వాళ్ల మీదా వీళ్లమీదా రాస్తాడు'' అన్న ఆరోపణా ఉన్నది ఈ రెండూ పూర్తిగా నిజం కావటానికి వీల్లేదన్నది స్పష్టం గోపీచంద్ అనేక రకాల రచయితల ప్రభావాలకు తనను తాను గురి చేసుకున్న కారణంచేతనూ, వాస్తవ వ్యక్తుల పట్ల అతనికి ఆసక్తి జాస్తి గనకను రెండూ, అర్ధసత్యాలు అవుతాయేమో

రాజారావుగారికి గోపీచందుగారికి పట్ల గల మమతా, విశ్వాసమూ అరుదైనవి వాటి ఉత్సాహంలో ఆయనకు గోపీచంద్ బాక్‌గ్రౌండులో శ్రీశ్రీ, జాషువా లాటి దేశీయులూ

బెర్ట్రాంట్ రసెల్, మామ్, షా, ఫ్రాయిడ్ లాంటి విదేశీయులూ తప్ప కనిపించలేదు కరుణకుమార గ్రామీణ జీవిత చిత్రణం తీసిపారెయ్యదగినది కాదు పాశ్చాత్యుల నుంచి అందిపుచ్చుకోవటంలో బుచ్చిబాబు ఎవరికీ తీసిపోలేదు రచనలో చిత్తశుద్ధి ఉండటం మాటకు వస్తే చలంగారు ఎవరికీ తీసిపోడు ఆయన కూడా ఆధ్యాత్మిక చింతనలో జీవన్ముక్తి చూసుకున్నవాడే

గోపీచందు పక్కా ఆధ్యాత్మిక జీవి అని ఒక వ్యాసంలోనూ, అతను పూర్తిగా ఆధ్యాత్మిక జీవి కాదని మరొక వ్యాసంలోనూ చదువుతాం మారేది కాలమూ, దేశమూ కాదని, మారేదీ మనమేనని ఒక చోట చదువుతాం, ఇంకోచోట యుగప్రభావం గురించి చదువుతాం - ఒకే వ్యాసంలో

గోపీచందు నెహ్రూ, గాంధీలను గురించి చెప్పిన విషయాలతో ఏకీభవించలేని మేధావులు చాలా మంది ఉండవచ్చు

వర్గ సంఘర్షణ కాదు, వర్గ సామరస్యం కావాలి అని గోపీచందు అని ఉంటే అతనికి వర్గ స్వభావాలు తెలీవనుకోవచ్చు రోడ్డు రోలరు కింద కంకరరాళ్లు నలగటం వర్గసామరస్యమూ, వర్గ సంఘర్షణా? లేక పీడకులమీద పీడితులు తిరగబడకపోవటం వర్గ సామరస్యమా?

ధర్మయుద్ధంలో శత్రువుమీద కించిత్తు కూడా ద్వేషం ఉండదని గోపీచందు నమ్మకం వియత్నాంలో వియత్కాంగుది అధర్మ యుద్ధం కావాలి, లేదా వాళ్లు ప్రేమగా అమెరికనుల మీద శతఘ్నులు పేలుస్తూ ఉండాలి

ఈ పుస్తకం చదువుతుంటే గ్రామీణ జీవితం గురించీ, ఉత్తమ మనస్తత్త్వం గల వేశ్యలను గురించీ గోపీచందుకు పూర్వం ఎవరూ రాయనట్లూ, చదవనట్లూ మనకు అనిపిస్తుంది

అతీంద్రియశక్తులూ, హిప్నాటిజంలాటివి శాస్త్ర పరిశోధనకు అందవని రాజారావుగారి అభిప్రాయమైతే ఆయన చాలా పొరపడ్డారు వాటిని గురించి బోలెడంత శాస్త్ర పరిశోధన జరుగుతున్నది మానవుడిలో అనేక రకాల శక్తులున్నమాట నిజం వాటిని కాదనేవారు ఛాందస శాస్త్రవేత్తలు అంతమాత్రంచేత ఆ శక్తులు భౌతికాధారం లేనివనుకోనవసరం లేదు యోగం ద్వారా అనేక శక్తులు లభ్యమవుతాయని మన పూర్వులు చెప్పారు యోగానికి ఆధ్యాత్మికంతో సంబంధం లేదు యోగతంత్రశాస్త్రాలు మొదట్లో నిరీశ్వరవాదులు ప్రవచించినవి భావ (ఆదర్శ) వాదులు అందులోకి భగవంతుణ్ణి ప్రవేశపెట్టారు

గోపీచందు ఆధ్యాత్మికవాది కాకపోయినా కూడా రచయితగా అతను పరిగణించదగినవాడే అతని రచనలన్నీ సంపుటాలుగా వెలువడితే, మంచి విమర్శకులు సాహిత్యానికి అతను చేసిన బహుముఖ సేవను ఇంతకన్న సరిగా అంచనా కట్టడానికి వీలుంటుంది

*రచన దోనేపూడి రాజారావు,*
*ఆంధ్రప్రభ, వారపత్రిక, 21-1-1970*

# 51. పాతాళగంగ

ఇది 10 కథల సంపుటి

మొదటి కథ 'అంతరంగం'లో ఆనందరావు అనే ''నవనీత హృదయం'' గల కనీశ్వరుడు, తన రొట్టెను తింటున్న పందికొక్కును వేటాడి, కాలు విరగగొట్టి, దానికి కరుణామయమైన ఒక పేద కుటుంబం కథ చెబుతాడు దెబ్బతిని రక్తం స్రవించే పందికొక్కు సందర్భానుసారంగా దుఃఖాశ్రువులూ, ఆనందాశ్రువులూ కూడా కార్చుతుంది కరువుకాలంలో ఒక పేదరైతు తన పిల్లల కోసం ఒక ధనికుడి గుడారం నుంచి తిండి దొంగిలించి, జమీందారు నౌకరు వెంట తరమగా వెదురు పొదల్లో పడి చనిపోయి, తాను దొంగిలించిన తిండిని, ఆ జమీందారు నౌకరు ద్వారానే తన పిల్లలకు పంపుతాడు కరుణ రసాభాస కాకుండా ఉండగలందులకు ఆ పిల్లలిద్దరూ చచ్చిపోతారు కాని అసలు నీతి అది కాదు పందికొక్కు అంటుంది ''అనాది నుండి(మానవుడు) తానేం చేస్తున్నాడో లోకానికి చెప్పడు ఇతరులేం చెయ్యాలో అది మాత్రమే చెబుతూంటాడు '' గురిగా తగిలే దెబ్బ!

'కృతజ్ఞత' అనేది బొత్తిగా అవిశ్వసనీయమైన కథ జగదీశం అనేవాడు చనిపోయిన తన అన్నావదినెల బిడ్డకు తానే తల్లీ, తండ్రీ అయి పెంచ యత్నిస్తూ తన సొంత కూతుర్ని, అదే ఈడుదాన్ని గురించి పట్టించుకోక, తన భార్యను నమ్మక, ఆమెకు ఆగ్రహం తెప్పించి, చివరకు తన భార్య తన అన్న కుమార్తె ప్రాణం తీస్తుందని భయపడి, ఎవరికీ చెప్పకుండా ఆ బిడ్డతో సహా హంతకుడిలా దూరం పారిపోయి, తనకున్న కొద్ది చదువుతో ఉద్యోగం సంపాదించి, పిల్లను పెంచి పెద్దదాన్ని చేసి, పెళ్లి చేసి, కట్నం కింద తన యావదాస్తీ రాసేసి, కథా గమన సౌలభ్యం కోసం తాను చచ్చిపోతూ, తన పెంపుడు కుమార్తెకు నిజం తెలిసే ఉత్తరం ఒకటి ఉంచి మరీ పోతాడు ఈ లోపల ఈమెగారి భర్త ఆస్తి స్వాధీనం చేసుకుని, జగదీశం భార్యను, అసలు కూతురినీ బయటికి తరిమేస్తాడు కథకు వీలుగా జగదీశం భార్య చచ్చిపోతుంది ఆమె కుమార్తె తన సోదరి దగ్గిరే దాసిగా చేరుతుంది ఈ సంగతి బయటపడగానే జగదీశం పెంచిన పిల్ల జగదీశం అసలు పిల్లకు తన పేర ఉన్న ఆస్తంతా రాసి ఇచ్చి, తాను అయిపూ ఆజా లేకుండా పోతుంది పొయెటిక్ జస్టిస్ ఎందులో ఉందంటే జగదీశం ఆస్తి జగదీశం కూతురికే దక్కింది! కాని కథ మాత్రం నభూతో నభవిష్యతి

'కొత్త కథ'లో ఉంగరం చోరీ, పోలీసు అధికారి వింత పరిశోధన, పనిమనిషి డిటెక్షన్ హాస్య కథ

''పతనం'' అయిన వాడు బంగారునాయుడు ఏ వీరేశలింగం వర్ధంతిలోనో, తాను వితంతువును తప్ప పెళ్లాడనని శపథం చేసి, తనను పెళ్లాడగోరిన సూర్యకాంతాన్ని ప్రేమించి కూడా నిరాకరిస్తాడు తరవాత ఆమె వితంతువవుతుంది అతను పెళ్లాడసిద్ధపడితే ఆమె అతన్ని ''పిరికిపంద'' అని తిట్టుతుంది అతను ఎందుకు పిరికిపంద అయాడో పాఠకుడికి అంతు చిక్కదు ప్రేమా, సంస్కరణల మధ్య సంస్కరణకేసి మొగ్గినందుకా?

'పాతాళగంగ' ఈ కథకుడి రచనా సామర్థ్యానికి గల పదును చూపే పాత్రలూ, ఇతివృత్తమూ, వాతావరణమూ గల కథ రైతు జీవిత వాస్తవికతకు మచ్చుతునకల్లాటి వాక్యాలు

ఇంటిలో కొల్లలు "చేదలో నీళ్లు పడితే సిరెత్తుకొన్నట్టే", కోడెలు "మాపురాలు కదిలిస్తే గోపురాలు ఊగుతున్నట్టుండేవి", మలబారోళ్లు (బావి తీసే వాళ్లు) "రాతిని తినేమాట దేవుడెరుగు కాని రైతును తినడాన్ని మాత్రం జగమెరుగును!", "కొండ్రమండి ఉంటే కోటి రూపాయలున్నట్టే గదా! కన్న తల్లిని పోగొట్టుకున్నవాడు, నేలతల్లిని అమ్ముకొన్నవాడు కడతేరింది కద్దా!" పాతాళగంగను పైకి తీకురావటానికి రైతు భగీరథుడు పడే పాట్లు రాయలసీమ వారికే తెలుసు అయినా ఈ కథను విషాదాంతం చెయ్యటంలో ప్రత్యేక ప్రయోజనం కనిపించలేదు బేటప్ప కృషికి నిరాశావాదం న్యాయం చేకూర్చదు

'పిచ్చిదంపతులు' అక్షరాలా పిచ్చి కథ త్యాగం గురించీ, లోకోపకారం గురించీ మూఢవిశ్వాసాలుండగలవనటానికి ఈ కథే చాలు ఈ కథలో వెంకయ్యా, రుద్రమ్మా తనకున్నదంతా ఖర్చు పెట్టి బడి భవనం కట్టించి, తాము కూలినాలి చేసుకుంటూ గూడు లేని పక్షులవుతారు వార్ధక్యంలో బడి అంటే భవంతి అనీ, భవంతి కట్టించినవాడు, దానికి ప్రహరీ కూడా కట్టించిన వాడు, ఆ భవంతిలోని ఒక గదిలో తాను తలదాచుకోరాదనీ అపోహలు ఈ చాదస్తపు కథకు ఆధారంగా కనబడతాయి శాంతినికేతనంలో విద్యార్థులు చెట్ల నీడల్లో చదువుతారట "అలాంటి పిచ్చి అందరికీ ఉంటే సంఘం ఇలాగా పుచ్చిపోతుందా?" అని కథకుడి ప్రశ్న సంఘం వెర్రాసుపత్రిగా తయారై ఉండేదని నా సందేహం ప్రతివాడూ ఒక పబ్లిక్ వర్క్స్ డిపార్టుమెంటైతే?

'పునర్జన్మ'లో కాకులు కలిస్తే, చూసిన వారు చచ్చిపోయినట్టు ఉత్తరాలు రావటం సమర్థించే ప్రయత్నం జరిగింది అయినవాళ్లు మన కోసం ఏడిస్తే అది మనకు శుభమన్న సిద్ధాంతం కొంచెం విడ్డూరంగా ఉన్నది

'పుట్టగొడుగు'లో జాగీర్దారు తన భార్యకొక కొడుకునూ, పనిదానికి మరో కొడుకునూ కని, ఇరవై రెండేళ్లకు అకస్మాత్తుగా "అంతరాత్మ"కు గురి అవుతాడు ఇద్దరూ చాలా తేడాగా జీవిస్తున్నారు! అందుచేత విల్లులో తన సగం ఆస్తికి పనిదాని కొడుకును వారసుణ్ణి చేస్తాడు అయితే, వాడికా ఆస్తి దక్కదు వాడు పోతాడు అసలు భార్య కొడుకు ఆస్తి హక్కుకు భంగం రాదు అయితే 'పుట్టగొడుగు' ఎవరు? అసలు భార్యకు పుట్టినవాడా? దాసీదానికి పుట్టినవాడా? రెండోవాడేలాగుంది

'మగపురుగు' కోసం అన్ని దేవుళ్లకూ మొక్కుకున్న తల్లిదండ్రులు, ఆ మగపురుగుచేత కుక్కల కన్న హీనంగా చూడబడి, కూతుళ్లగూళ్లను ఆశ్రయిస్తారు ఆడపిల్ల పుట్టిందనగానే, "నాలుగు వడ్లగింజలు గొంతులో వెయ్యండి! గొంతుమీద కాలేసి తొక్కేద్దురూ!" అన్న అమ్మలక్కలు కాలక్రమాన, " ఏమైనా ఆడపుట్టకే పుట్టక" అంటారు

'వేదాంతి' యౌవనంలో సన్యసించి, అరవయ్యో ఏట గృహస్థు అవుతాడు! సన్యాసమనేది వ్యక్తి యొక్క ఆత్మపరిపాకం వల్ల కలుగుతుందనుకొంటాం కాని, సమాజమే మనిషిని సన్యాసిని చెయ్యటం ఈ కథలో చిత్రం

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 28-1-1970*

# 52. మొగిలి

మొగిలి రాయలసీమలో ఒక గ్రామం మొగిలి ఒక యువకుడు రత్నాలసీమ దుర్భర క్షామానికి అయినప్పుడు మొగిలి గ్రామం నుంచి మొగిలి అనే యువకుడు కాలినడకన సర్కారు జిల్లాలకు వచ్చి, అక్కడ కాలు నిలదొక్కుకుని, తిరిగి తన ప్రాంతాంలో వర్షం పడగానే తిరిగి వెళ్ళి, పెళ్లి చేసుకుని, ఇల్లు నిలబెట్టుకుని, దారిద్ర్యం నుంచి విముక్తుడవటం ఈ నవలలోని ఇతివృత్తం

అయితే ఇది ఆధునిక నవల అనేకన్న ఆధునిక పురాణం అనో, ఆధునిక మహా భక్త చరిత్రో అనటం మంచిది ఇందులో ప్రధాన పాత్రలు దేవుళ్లు మొగిలి గ్రామాధిదేవత మొగిలీశ్వరుడూ, తిరుపతి ఏడుకొండలవాడూ, కాళహస్తీశ్వరుడూ, నెల్లూరులో మరొక దేవుడూ మొగిలి జీవితాన్ని తీర్చిదిద్దుతారు ఆధునిక పురాణం గనక దీని నిండా ''మిరకిల్స్'' ఉండటం సహజం నవల ఆరంభమే ఒక ''మిరకిల్''తో

'' 'అంబా' అంటూ అరచింది ఆవు అంబా అంటూ మొగిరీశ్వరుని ధ్యానించగానే పాతాళగంగ పైకి పొంగినది కోనేరు చూస్తుండగానే నిండిపోయినది ''

అసలు మొగిలి పుట్టుకే ఒక ''మిరకిల్'' '' ఒక శివరాత్రి నాడు కాంతమ్మ ఆ కోనేటిలో మునిగి తడిబట్టలతో వరపడిందట మగత నిద్రలో బసవేశ్వరుడొక ఉయ్యాలను నోట కరచుకొని వచ్చి తన ముందు ఉంచాడట అందులో ఉన్న పురిటిబిడ్డనెత్తుకొన్నట్టు స్వప్నం వచ్చిందట ఆ స్వప్నం వచ్చిన నాలుగో వారమే కాంతమ్మకు నెల తప్పిందట అందుకే అతనికి మొగిలి అని పేరు పెట్టారట ''

పుట్టినది మొలు పంధొమ్మిదేళ్ల దాకా మొగిలి ఎలాగన్నా పెరిగి ఉండనివ్వండి అటుతరవాత అతనికి అడుగడుగునా ''మిరకిల్స్'' జరిగాయి

మొగిలి అమ్మయ్యచౌదరి ఇంట చేరటం, ఆయన మొగిలికి అడిగినదానికన్న ఎక్కువగా సహాయం చెయ్యటం, ఎనిమిదో క్లాసు చదివిన మొగిలిని రంభలాటి సులోచన ఎమ్ బి బి ఎస్ ప్రేమించటం, ఆమె తండ్రి పారేసుకున్న యాభైవేలు మొగిలికే దొరకటం, అతను సరిగా పెళ్లిపీటల మీద అందించటం, సులోచన తనకు నిర్ణయించిన వరుణ్ణి తోసిపుచ్చి మొగిలినే పెళ్లాడటం - ఇలాటివి సినిమాలలో రోజూ చూస్తున్నా, మిరకిల్స్ కావని అనలేం

మొగిలికి మనుషుల్లో నమ్మకం లేదుగాని, మిరకిల్స్‌లో నమ్మకం ఉన్నది తన వెంటబడి పెళ్లి చేసుకోమన్న లలితతో పెళ్లిళ్లు దేవుడే చెయ్యాలంటాడు

ఈ మిరకిల్స్ గురించి కొంత స్పష్టం చెయ్యటం అవసరం ఆవు అంబా అని అరవగానే నంది నోట జల వస్తే శాస్త్రీయ దృక్పథం గల వాళ్లు అంతర్వాహిని కోసం అన్వేషిస్తారు అంతేగాని దుర్భరమైన క్షామంతో ఆ వెంటనే బాధపడిపోరు ఈ రకం మిరకిల్స్ మూఢవిశ్వాసాలను బలపరుస్తాయేగాని వారికేవిధంగానూ ఉపయోగపడవు ఇవి ఒక విధమైన సమిష్టి మిరకిల్స్

వ్యష్టి మిరకిల్స్ గురించి చెప్పేదేమీ లేవు ఒక నిరుపేదవాడికి యాభైవేలు డబ్బు దొరకటంలాటి మిరకిల్స్ ఇప్పుడు నెలనెలా లాటరీలలోనూ, వారం వారం రేస్ కోర్సులలోనూ జరుగుతూనే ఉన్నాయి మనిషి వీటిని చెప్పి సృష్టిస్తున్నాడు

మనుషులు తమ అనుభవాలకు పురాణ కథలలో తార్కాణాలు చూసుకోవటమూ, రామాయణంలో సగం భాగం రాయలసీమ ప్రాంతాలలోనే జరిగినట్టు చెప్పుకోవటమూ, ఉన్న రామాయణాలు చాలక కల్పిత రామాయణ సంఘటనలు సృష్టించటమూ రాయలసీమలో ఉన్న మాట నిజమేగాని, ఒక ఆధునికుడు రచించిన ఆధునిక నవలలో ఇవన్నీ చదువుతుంటే రాయలసీమ ప్రజల పట్ల జాలి కలుగుతున్నది

మూఢ విశ్వాసాల మాట అటుంచి మొగిలి నైతిక వర్తన చూద్దాం ఇది చాలా ఆదర్శవంతంగా ఉద్దేశించి చిత్రించినట్టుగా కనబడుతుందిగాని పేరడీగా కనబడదు

మొగిలి పాత్రను కొంచెం వివరంగా పరిశీలించుదాం అతను 19 ఏళ్ల వాడు పెద్దగా చదువుకున్నవాడు కాడు కరువు నుంచి పారిపోతున్నవాడు ఎందుకు కొన్నాడో తెనాలికి టిక్కెట్టు కొన్నాడు రైల్లో అమ్మయ్యను మంచివాడుగా ఆకర్షించాడు అమ్మయ్య అతని సమస్యను క్షణంలో తీర్చాడు తన బట్టల కొట్లో ఉద్యోగం ఇచ్చాడు తన డబ్బు అతనికి అప్పజెప్పాడు పెళ్లి కావలసిన అతని కూతుర్ని ఒంటిగా మొగిలి వెంట వదిలాడు అందుకోసమే కాచుకున్నట్టు లలిత అతన్ని చెరిచినంత పని చేసింది ఆనాటి శుకమహర్షి లాగా మొగిలి చలించలేదు లలిత తనను నిజంగా ప్రేమిస్తున్నట్టు తెలిశాక, మొగిలి ఆమె తల్లిదండ్రుల అనుమతితో ఆమెను పెళ్లాడతానన్నాడు తన ప్రేమ ప్రసక్తి ఏమీ లేదు అయినా అతను ''మానవుల భవిష్యత్తు మానవుల చేతుల్లో లేదు'' అని లలితకు బోధించాడు

మొగిలి సత్యకాలపు మనిషల్లే చూడగానే తెలిసిపోవటంతోబాటు అతను స్త్రీలను - డబ్బు బాగా ఉన్న వాళ్లనూ, చదువు హెచ్చుగా ఉన్నవాళ్లనూ కూడా - ఆకర్షించగలుగుతాడు అందమూ, బుద్ధిమంతనమూ అతని ప్రధాన గుణాలనుకోవాలి '' ఆంధ్రా పారిస్''లో ఒక చివర ఇంటి ఆడమనిషి తనమీద ''దండయాత్ర'' చేస్తే మొగిలి ప్రవర్తన శీలవతి అయిన ఆడదాన్ని స్ఫురింపజేస్తుంది '' ఈ రాత్రికి తనపై దండయాత్ర చేసే శక్తులు ఈ పరిసరాల్లో ఇంకా ఏవైనా ఉంటే!'' అనుకుంటాడు మగవాడికి శీలం ఉండొచ్చు కాని దాన్ని చెడగొట్టటానికి ఎవరెవరు పొంచి ఉన్నారో అన్న భయం ఆడదానికి కలగటం స్వాభావికమనిపిస్తుంది

కిటకిటలాడుతున్న రైలుపెట్టెలోకి ఎక్కిన సులోచన మూడువందల రూపాయలు గల పర్సు జారవిడిస్తే దాన్ని మొగిలి ఆమెకివ్వటం వల్లమాలిన మంచితనంగా నిరూపించబడింది దీని ప్రస్తావన ఒకటికి రెండుసార్లు మళ్లీ వస్తుంది ''వీడెవడో శుద్ధ పల్లెటూరి బైతులా ఉన్నాడనుకొన్నాడు'' మరో ప్రయాణీకుడు ఈ వాక్యం ఆ ప్రయాణీకుడి మనస్తత్త్వం నిరూపిస్తున్నదిగాని మొగిలిలో ఉన్న ప్రత్యేకమైన నీతిని నిరూపించటం లేదు నూటికి కనీసం 90 మంది అదే పని చేస్తారన్న విశ్వాసం రచయితకు లేదా? లేకపోతే చాలా ఘోరమే!

మొగిలి మనస్తత్త్వంలో మరొక సొంపు రైలులో తనకెదురుగా కూర్చున్న డాక్టర్ సులోచనను చూసి అతను ''ఈ ఎదట కూర్చున్న అమ్మాయి రంభే అయినా నన్నేం చేయగలదు?'' అనుకుంటాడు! తన నీతిలో ఎంతో విశ్వాసం గల మొగిలికి ఇతరుల నీతిలో విశ్వాసం లేకపోవటం చిత్రం

అతనికి శకునాలలో నమ్మకం ఉన్నది లలిత ఇచ్చిన చలవజోడు పోయి దాని స్థానంలో సులోచన ఇచ్చినది ప్రత్యక్షమవుతుంది ఇదేదో అపశకునమని భావిస్తాడు తరవాత లలిత

పెళ్లాడదామని వస్తే, అతను చాలా అసహ్యంగా ప్రవర్తించి, ఆమెను తిప్పిపంపేసి, ఆమె చచ్చినంత పని కావటానికి తానే కారణమవుతాడు! అయితే ఇది వేరే సినిమా కథ, వేరే మిరకిల్

ధర్మమే కవచంగా బతుకుతున్న మొగిలికి ఆస్తి హక్కుల్లో విశ్వాసం ఉన్నది అమ్మయ్యా, రామిరెడ్డిలు కొత్తగా ధనవంతులైనవారు కారు వారి ధనమంటే మొగిలికి చాలా భక్తి కొత్తగా ధనం సంపాదించిన వారు తనకు సహాయం చెయ్యరు అది అన్యాయార్జిత విత్తం! 'వెంకటేశ్వరా! ఈ సొమ్మును సొమ్ము గల వారికి అప్పగించే భారం నీది'' అని దణ్ణాలు పెట్టుకుంటాడు ''అందరిలోనూ సూట్‌కేస్ తీస్తే ఇంకేముంది, కొంపలంటుకుపోవూ!'' అనుకుంటాడు అందరూ తన మీద పడి హత్య చేసి ఆ డబ్బు అసలు వారికి చెందకుండా చేస్తారన్నట్టు!

మొగిలి అన్ని విధాలా దేవుడిలాటి మనిషేననుకున్నా అతను సులోచనను పెళ్ళి చేసుకున్న పద్ధతిలో ఆధునిక మానవత లోపించింది సులోచనకు వరుడు స్థిరపడ్డాడు కట్నం సొమ్ము పోయింది సులోచన ఆ వరుడి కాళ్ల మీద పడి ఏడ్చింది కాని ఆ వరుడు కట్నం లేనిదే పెళ్లాడనన్నాడు డబ్బు దొరికింది వరుడు పెళ్లికి సిద్ధపడ్డాడు కాని అభిమానవతి అయిన సులోచన అతన్ని నిరాకరించింది క్షణం క్రితం ఇంకొకటి కాళ్ల మీద పడి పెళ్లాడమని వేడుకున్న సులోచనను పెళ్లాడటానికి మొగిలికి అభిమానం ఏమీ అడ్డు రాలేదు దీన్ని ఎంతమంది పాఠకులు(సినిమాలో చూసినా) సహించగలరో అర్థం కాకుండా ఉన్నది

ప్రధాన పాత్ర సృష్టి ఇట్లా ఉంటే మిగిలిన పాత్రలూ, సన్నివేశాలూ మరింత కృత్రిమంగా ఉన్నాయి లలితా, సులోచనా, వాళ్ల తల్లిదండ్రులూ, వాళ్ల ప్రవర్తనా, వాళ్లతో మొగిలికి కలిగే సన్నివేశాలూ మొదలైన కల్పనలలో ఉపజ్ఞ ఏమీ కానరాదు

ఈ నవలలో నాకు అత్యుత్తమంగా కనిపించినది స్థలాభిమానం మొదటి 50 పేజీలలోనూ మనకు రాయలసీమ గడ్డా, జీవితమూ ఎంతో ప్రేమతో చిత్రించటం కనబడుతుంది ఇది నవలలలో చాలా అరుదు క్షామ పరిస్థితి వర్ణన ప్రశంసనీయంగా ఉన్నది ఆవునూ, దూడనూ ఇతర పాత్రలతో సమాన స్థాయిలో ఉంచటం కూడా నాకు ముచ్చటగా తోచింది ఇవి మినహాయిస్తే ఇది చాలా పేలవమైన రచన

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 4-2-1970*

# 53. జీవన జ్యోతి

రచయిత '' ఆంధ్రపాఠక లోకానికి చిరపరిచితులే'' కావచ్చు - కాని ఈ నవ ు ''అతి ప్రతిభావంతులైన వర్తమాన యువ రచయితలలో అగ్రశ్రేణికి చెందిన'' రచయిత అన్న కితాబు దక్కించగలదిగా లేదు

'జీవన జ్యోతి' అనే అమ్మాయి పేరు నిర్మల ఆమె తండ్రి జూదరి, తల్లి అబద్ధాలకోరు పెద్దన్న తాగుబోతు, రెండో అన్న దొంగ, మూడో అన్న విజయవాడ కంతటికీ పేరుమోసిన రౌడీ, అక్కయ్య అచ్చుపోసిన (ఆడ) ఆబోతు గంజాయి వనంలో తులసి మొక్కలాగా ఈ అందరి మధ్యా నిర్మల ''జీవన జ్యోతి''గా ఎలా రూపొందగలిగిందని మనకి నవల చెప్పగలదు కాని నిర్మల వీరందరికీ అడుగడుగునా ఉపన్యాసాలిచ్చి, వారిలో పరివర్తన కలిగించి, అందరి జీవితాలనూ ఒక దారికి తెస్తుంది తల్లి చేత అబాద్ధాలు కూడా మాన్పిస్తుంది

ఈ మాట కూడా మనం గట్టిగా అనటానికి లేదు ఎందుచేతనంటే వాళ్లు తీరా మారే సమయానికి నిర్మల చేసిన కృషి కన్న ఇతర కారణాలే బలంగా ఉంటాయి నిర్మల ఇచ్చే లెక్చర్లే పాఠకుడికి దక్కుడు ఒకటి నిజం, ఆమెకన్న అందరూ పెద్దవాళ్లే అయినా ఆమెను చూసి అందరూ భయపడతారు అందరూ నైతిక భీతి గలవాళ్లే అందుకే ఆమెను చూసి దడుస్తారు నైతిక భీతి ఉన్నవాళ్లు బాగుపడకేం చేస్తారు?

నిర్మల పాత్రలో ప్రత్యేకంగా చెప్పుకోదగినవి, ఆమె అవకాశం దొరికినప్పుడల్లా ఇచ్చే లెక్చర్లు అయితే నవల చదువుకుపోతూంటే ఏదో ఒక దశలో మనకొక సంగతి స్పష్టమవుతుంది ఈ లెక్చర్లు కొటేషన్లలో ఉన్నప్పటికీ ఇవి ఏ మనిషి నోటిమాటలుకావు రచయిత పాఠకుడి పైన ప్రయోగించే నైతికోపన్యాసాలే!

వీటిలోని నీతి ఆటే అధునాతనమైనది కాదు కొన్ని నీతులు మన మహర్షులూ, ఏసుక్రీస్తూ, బుద్ధభగవానుడూ చెబుతూ వచ్చినవే మొగుడు దుర్వ్యసనపరుడైతే భార్య వాణ్ణి చక్కదిద్దుకోవాలి తాగుడు చాలా చెడ్డది జూదం తప్పు హింసాచర్యలు కూడనివి - ఇత్యాది ఈ నీతులకూ,భగవంతుడికీ ఏదో సంబంధం ఉన్నట్టు రచయిత ఉద్దేశమని నాకొక అనుమానం అది నిజమైతే రచయిత పొరపడ్డాడని రూఢిగా చెప్పవచ్చు జూదరులూ, తాగుబోతులూ, వ్యభిచారులూ, హంతకులూ కూడా ఏడుకొండలవాణ్ణి నమ్ముకోవటం కద్దు ( ఈ నవల మొత్తంగా ఆ దేవుడికే అంకితం)

నవలలో కొత్తదనం అంత లేకపోయినా కొన్ని భాషా ప్రయోగాలు చాలా కొత్తగా ఉన్నాయి

''విజ(య) వాడ పట్టణ వీధులన్నీ జన సమ్మర్దంలో కొత్త దుస్తులు ధరించి అంతులేని హడావుడితో కలకలలాడుతూండడంలో వింతలేదు'' అన్న వాక్యం మొదటి పేజీలోనే మనకు తగులుతుంది విజయవాడ వీధులు కొత్త దుస్తులు ధరించడం కొంచెం దురూహ్యామే

నిర్మల ''నిమ్మకు నీరెత్తినట్టు నిబ్బరంగా నడవసాగింది ''

''ఆమె సౌందర్య విశేషాన్ని హృదయంలో శిలా శాశ్వతంగా భద్రపరచుకునేందుకు తహతహలాడేవాళ్లు ''

ప్రిన్సిపాల్'' ఏ విద్యార్థి కనబడ్డా నిప్పుల్లో నిలబెట్టి మొహం కమిలిపోయేలా చీవాట్లు పెట్టేవాడు''

''నిర్మల మనస్సు చివుక్కు మన్నది, నూనె చుక్క పడ్డట్టు '' (పూర్తివాక్యం )

'' నేను పచ్చకామెర్ల రోగిని కాదు అంటే చింత బరికెతో అక్కయ్యకు ఓ చురక తగిలించి '' ( ఇక్కడ చింత బరికె అనేది లేనేలేదు )

''సిగ్గు దొంతరలు ఆమె చెక్కిళ్లపై మయూరనృత్యం చేశాయి '' ఇటువంటి ప్రయోగాలు కొల్లలు

ఏ పుస్తకమైనా చదివేటప్పుడు, '' ఇది నాకోసం రాసిన పుస్తకం కాదు'' అనిపిస్తే, ఎవరికోసం, ఎలాటి దృక్పధాలూ, తెలివితేటలూ గలవారికోసం రాసినవై ఉంటుంది అని ఆలోచిస్తాం ఈ 'జీవన జ్యోతి' వెంకటేశ్వరస్వామి భక్తులకోసం రాసినదని తెలుస్తున్నా, వాళ్ల తెలివితేటలు ఏ లెవెల్‌లో ఉండాలో అంతుచిక్కలేదు నిర్మల పరీక్షకు కట్టే డబ్బు పోయింది

గదా, ''రేపే'' డబ్బుకట్టాలిగదా , తన సొంత అన్నే డబ్బిచ్చినా అది దొంగసొత్తని తీసుకోనన్నది గదా,తన తెల్లోపువ్వు లాగిన విద్యార్థి అపాలజీతో సహా తాను పందెం గెలుచుకున్న నూరు రూపాయలూ ఇవ్వబోతే నిరాకరించింది గదా (అప్పటికి పరీక్షకు కట్టే రోజు దాటే పోయింది ఆమె ఎట్లా పరీక్షకు కూర్చున్నది) సెకండు క్లాసులో ఎట్లా పాసయింది లని ఏ పాఠకుడూ అడగడా? అడగని వాళ్లు ఈ నవల చదివి ఆనందించవచ్చు ఇలా చచ్చు ప్రశ్నలు లేవదీసే వారికోసం కాదు ఈ నవల

*- ఆంధ్రప్రభ, వారపత్రిక,25-2-1970*

# 54. విజయతోరణం

చరిత్ర పరిశోధనలో అసమాన ఖ్యాతి గడించిన మల్లంపల్లివారు కొన్ని చరిత్రాంశాలను రేడియో ప్రసారానికి అనుకూలంగా నాటకాలుగా రచించారు ఈ సంపుటిలో అలాంటి నాటికలు ఏడున్నాయి

వీటిలో నాటక లక్షణాలు చాలా తక్కువ కొన్ని నాటికలు కేవలమూ సంభాషణలే వాటిలో సంఘటనలు లేవు 'రాణీ సారంధా' అన్నవి అపజయం గనక, దానికి ఈ ''విజయ తోరణం''లో స్థానం లేదేమో ''పీష్వా నారాయణరావు'' రఘునాథుడి విజయం అనవచ్చుగాని, ఆ విజయంకోసం అతను కృషిచేయలేదు

ఈ నాటికలలో మొట్టమొదటిది 'విజయతోరణం' ఇందులో తొలిరంగం గౌతమీపుత్ర శాతకర్ణి యవన, శక, పహ్లవులను ఓడించిన ఘట్టం రెండో రంగం కాకతీయ గణపతిదేవుడి కాంచీపుర విజయం మూడోది ప్రోలయ, కాపయ నాయకులు ముస్లిములపై సాధించిన విజయం నాలుగోది కొండవీటి కుమారగిరి రెడ్డి జరిపిన మదనోత్సవం అయిదవది శ్రీ కృష్ణ దేవరాయల భువన విజయ సదస్సు ఆరోది తంజాపూరులో రఘునాథాభ్యుదయ నాటక ప్రదర్శన

'అమరావతి' రెండో నాటిక ఇందులో బుద్ధుడి అస్థికల పంపకం గురించీ, అమరావతీ స్తూపనిర్మాణం గురించీ, హీనయానంకన్న మహాయానం సాధారణ ప్రజలకెలా సన్నిహితమైనదీ మనకు తెలుస్తుంది మూడో నాటకం శంకరాచార్య - బౌద్ధాన్ని ప్రతిఘటించిన శంకరుడికి సంబంధించినది ఇందులో శంకరుడు పరకాయ ప్రవేశం ద్వారా నిగూఢ కామ శాస్త్ర విషయాలు గ్రహించి ఉభయ భారతిని ఓడించటం కూడా శంభన్న అనే పాత్రద్వారా చెప్పబడింది శంకరుడి పరకాయ ప్రవేశమూ, బసవడి మహిమలూ లాంటి వాటికి చరిత్రలో స్థానం ఉండదు అందుచేత వాటికి సాహిత్యంలో స్థానం ఇవ్వవచ్చుననుకున్నారేమో శర్మగారు!

నాలుగో నాటకం 'నందరాజ్యం పతనం', చాణక్యుడు నందవంశంపై పగపట్టి, గాంధారదేశంవాడూ, కుటల గోత్రజుడూ అయిన చాణక్యుడు చంద్ర గుప్తుడిచేత నందవంశ నిర్మూలనచేయిస్తాడు అయిదవది పీష్వా నారాయణరావును సుమేర్‌సింగ్‌హత్య చేయటమూ, అతని స్థానంలో రఘునాథరాయలు పీష్వా (పేష్వా) కావటమూనే ఈ నాటికలో రఘునాథరాయలు షేక్స్పియర్ నాటకంలోని మాక్‌బెత్‌లాగా కనబడతాడు అతని భార్య ఆనందిబాయి లేడీ మాక్ బెత్!

'రాణీ సారంధా' అనే నాటకంలో బుందేల్ వీరుడైన చుపత్‌రాయ్ కన్న అతని భార్య సారంధా హెచ్చు పరాక్రమవంతురాలుగా చిత్రించబడింది మొగలులచేత చిక్కే సమయంలో ఆమె తన భర్తను చంపి, తాను ఆత్మహత్య చేసుకుంటుంది

చివరి నాటకం 'బసవేశ్వర' వీరశైవులకు బసవేశ్వరుడు పరమేశ్వరావతారమే ఈ హిందూ సమాజంలో వర్ణవిభేదాలను మతం ద్వారా రూపుమాపటానికి జరిగిన అసంఖ్యాకమైన ప్రయత్నాలలో బసవేశ్వరుడిదీ ఒకటి అయితే అతను బిజ్జలుడి మంత్రిగా ఉంటూ ఈ పని చేయాలంటే రాజకీయ వ్యవస్థకూ, మతానికీ వైరుద్ధ్యం తల ఎత్తక తప్పదు అందుకే బిజ్జలరాజు తల ఎగిరిపోతుంది అయితేనేం? మనకింకా వర్ణ వ్యవస్థ పోలేదు బసవేశ్వరుడిది కూడా అపజయమే ననుకోవాలి!

*- ఆంధ్రప్రభ, వారపత్రిక, 18-3-1970*

# 55. లలిత విస్తరం

'లలిత విస్తరం' అన్నది మహాయాన బౌద్ధ గ్రంథం అన్ని మతాలూ సాంఘిక పరిస్థితులలో కలిగే మార్పును బట్టి తాము కూడా మారుతూ, విభజన ద్వారా ఎదుగుతూ వచ్చాయి బౌద్ధానికీ ఈ గతి తప్పలేదు హీనయానమూ, మహాయానమూ, వజ్రయానమూ మొదలైన పరిణామాలు ఏర్పడ్డాయి బౌద్ధంలోకి విగ్రహారాధనా, తాంత్రిక వామాచార పద్ధతులూ మొదలైనవి ప్రవేశించాయి బుద్ధుడు జన్మించేనాటికి సంఘ వ్యవస్థ రాజకీయ వ్యవస్థగా మారుతున్నదనీ, శిథిలమౌతున్న సంఘ వ్యవస్థల పంపిణీ మీద బుద్ధుడు తన బౌద్ధ సంఘాలను నిర్మించి వాటికి బలం చేకూర్చాడనీ విజ్ఞులు చెబుతారు

లలిత విస్తరం పుట్టేనాటికి - ఆ మాటకు వస్తే బుద్ధుడు జీవించి ఉండగానే - సామ్రాజ్యాల విస్తరణా, అతి భయంకరమైన రక్తపాతమూ, గణసంఘాల మారణహోమమూ జరిగాయి చక్రవర్తిత్వం ఆమోదయోగ్యమయింది అశోకుడు కూడా మగధ సామ్రాజ్యాన్ని స్థాపించాక దాన్ని దక్కించుకునేటందుకు ''బుద్ధం శరణం గచ్ఛామీ'' అనవలసి వచ్చింది అంటే, గణ సంఘాలపై ఆదరణ ప్రజలలో (సామ్రాజ్యానికి బానిసలు చేయబడిన వారిలో) అంత ప్రగాఢంగా ఉన్నదన్నమాట

మూర్ధాభిషిక్తుడైన రాజు ''చక్రరత్న సమన్వితుడు'' అంటే చక్రవర్తి ఎలా అవుతాడో చరిత్ర నుంచి మనం తెలుసుకోగలుగుతున్నాం అజాతశత్రువు వజ్జియను గణాలను ధ్వంసం చేసిన విధానం ఈనాడు వియత్నాంలో అమెరికన్లు అనుసరించే విధానానికి భిన్నంగా ఉన్నట్టు కనబడదు అశోకుడి కళింగ విజయం అందరూ ఎరిగినదే కాని 'లలిత విస్తరం' చక్రవర్తి ఎలా అవుతాడో చెబుతున్నది, వినండి

''మూర్ధాభిషిక్తుడైన, క్షత్రియుడైన రాజు ప్రాతఃకాలంలో లేచి శిరఃస్నానం చేసి ఉపవాసంతో ప్రాసాదోపరిభాగానికి వెళ్ళినప్పుడు పూర్వదిక్కున దివ్యమైన చక్ర రత్నం ప్రాదుర్భవిస్తుంది మూర్ధాభిషిక్తుడైన రాజు కుడిచేయి ఎత్తి, ' ఓ భట్టారకా, దివ్య చక్రరత్నాన్ని ధర్మంతో ప్రవర్తింపజెయ్యి ' అని ప్రార్థిస్తూ నివేదించాలి అపుడు ఆ చక్రరత్నం

మూర్ధాభిషిక్తుడైన రాజుతో ఉత్తమ బుద్ధి మార్గంలో పూర్వాకాశంలో వెళ్లుతుంది చక్రవర్తి అయిన రాజు చతురంగ బలాలతో దానికిని అనుసరిస్తాడు తరువాత పూర్వదిక్కున ఉన్న మండలేశ్వరులైన రాజులు ఆ చక్రవర్తి అయిన రాజుకు ఎదురేగి 'దేవా! దయచేయి ఈ రాజ్యం మీకు జయం వల్ల ప్రాప్తించింది దీనిలో మీరు వసించండి!' అని విన్నవిస్తున్నారు త్రాత అయిన ఆ మూర్ధాభిషిక్తుడు ఆ మండలేశ్వరులైన రాజులతో ఇలా అన్నాడు "మీరంతా మీ మీ రాజ్యాలను ధర్మంతో పాలించండి అయ్యా! మీరు ప్రాణివధ చెయ్యకండి ఈ విధంగా మూర్ధాభిషిక్తుడైన రాజు పూర్వదిక్కును జయిస్తాడు " ఇదే విధంగా (!) దక్షిణ, పశ్చిమ, ఉత్తర దిక్కులను జయించి కొంప చేరుకుంటాడు!

ఎక్కడా యుద్ధ ప్రసక్తి లేదు, రక్తపాతం లేదు బౌద్ధ సంఘాలలో వర్ణ వివక్షలు లేవుకాని ఈ చక్రవర్తి క్షత్రియుడే అవుతున్నాడు!

బుద్ధుడు పుట్టినప్పుడు చక్రవర్తి అయ్యే లక్షణాలున్నాయన్నారట లలిత విస్తరంనాటికి సామ్రాజ్యాలుండటమే అందుకు కారణం కావచ్చు అమెరికాలోని ఆదిమ వాసులను జయించిన స్పానియర్డ్‌లు రాజకీయం ఎరిగినవారు, గణజీవితం అర్థంచేసుకోలేనివారు ఆ కారణంగా అమెరికను ఆదిమజాతులలో రాజులూ, చక్రవర్తులూ ఉండినట్టు రాశారు గణజీవితంలో రాజులకూ, చక్రవర్తులకూ ఆస్కారం లేదనీ మోర్గన్ రుజువుచేశాడు బుద్ధుని కాలంనాటికి రాజకీయ జీవితం లేదన్న అభిప్రాయమూ, రాజ్యాలింకా ఏర్పడలేదన్న అభిప్రాయమూ సరి అయినవైతే, లలిత విస్తరంలోకూడా ఇలాంటి పొరపాటే జరిగింది

సాంఘిక పరిణామ ప్రభావం మరో విధంగా కూడా కనిపిస్తుంది " ప్రత్యంత జనపదాలు" అనాదరణకు గురి అయ్యాయి అవి అంధులకూ, జడులకూ, మూఢులకూ ఆకరాలయాయి అందుచేత "బోధిసత్త్వులు ప్రత్యంత జనపదాలలో జన్మించారు మధ్యమ జనపదాలలోనే జన్మిస్తారు "

మరికొంత కాలం గడిచాక రచించివుంటే, బోధిసత్త్వులు మహానగరాలలోనే జన్మిస్తారని లలిత విస్తరం చెప్పి ఉండేదా?

ఇంతే కాదు, బోధిసత్త్వులు బ్రాహ్మణ క్షత్రియ కులాలతో తప్ప "హీనకులాలలో" జన్మించరా బ్రాహ్మణులు గురువులుగా ఉన్నప్పుడు బ్రాహ్మణ కులంలోనూ, క్షత్రియులు గురువులుగా ఉన్నప్పుడు - ఈ పరిస్థితి ఛాందోగ్యోపనిషత్తులో కనబడుతుంది - క్షత్రియ కులంలోనూ జన్మిస్తారు! బుద్ధుడు పుట్టినప్పటికి క్షత్రియులు గురువులు అందుకే బుద్ధుడు ఆ కులంలో జన్మించాడన్నమాట మరి జాతక కథలలో బోధిసత్త్వుడు కాకిగానూ, కుక్కగానూ జన్మించాడే! దాని మాటేమిటి?

ఇలా శంకలు లేవదీస్తూ పోతే ఎంత గ్రంథమైనా అవుతుంది బుద్ధుడి వాస్తవ జీవిత కథగా లలిత విస్తరానికి ఏమీ విలువనివ్వనవసరం లేదు దీని ఆధారం మీద "లైటాఫ్ ఏషియా" రాసిన ఆర్నాల్డ్ కూడా బుద్ధుడనేవాడు పుట్టాడన్నది, కొంతకాలం జీవించి చనిపోయాడన్నదీ తప్ప మిగిలిన ఏ అంశానికీ చారిత్రక ప్రాముఖ్యం లేదనేశాడు ఇది మహాయాన బౌద్ధ పురాణం అన్ని పురాణాలూ ఎంత విశ్వసనీయమైనవో, ఇదీ అంతే కాకపోతే అనువాదకులు అన్నట్టు, ఇందులో అనేక ఇతర విషయాలున్నాయి పరిశోధకులకు అవి ఎంతగానో ఉపకరిస్తాయి

ఇందులో చక్కని ప్రవేశిక ఉన్నది బౌద్ధం ఎలాటి పరిణామాలు చెందినదీ ఇందులో చక్కగా వివరించబడింది మతాలన్నీ భౌతిక, సామాజిక వ్యవస్థనుంచే పుట్టాయంటే పోట్లాడేవారున్నారు అలాటివాళ్లు కూడా సామాజిక పరిణామం మతాలమీద ఎలా పనిచేసినదీ అంగీకరించక తప్పదు అన్నిమతాలు సుఖాన్నే ఎరగా చూపాయి బౌద్ధం దీనికి భిన్నం కాదు బుద్ధుడు జీవితం దుఃఖమయమని తెలుసుకుని ఆ దుఃఖం నుంచి మనుషుల మనసును విముక్తి పొందించడానికి ఒక మతాన్ని సృష్టించాడు ఈ లోకంలో సుఖాలు చూపించలేని సాంఘిక పరిస్థితిలో స్వర్గమూ, ఉత్తమ లోకాలూ సృష్టి అయి జనాన్ని వంచించాయి కాని తిరిగి ప్రజల దృష్టి ఇహ సుఖాలకేసి మళ్లుతున్నది ఈనాడు ఐహిక సుఖాలిచ్చే దేవుళ్ళకూ, బాబాలకూ, గిరాకీ హెచ్చింది మోక్షం ఇచ్చే దేవుళ్లు మరుగైనారు ఇదీ సాంఘిక పరిణామ ఫలితమే మరి

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 25-3-1970*

# 56. నాయకురాలు

ఆంధ్రలో జరిగిన జాతీయోద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన ఉన్నవ లక్ష్మీనారాయణగారు 'మాలపల్లి' అన్న ప్రశస్తమైన నవలతోబాటు ఈ ప్రశస్తమైన నాటకం కూడా రచించారు జాతీయోద్యమ సంస్కృతిని ప్రతిబింబించే రచనలు తెలుగులో చాలా పరిమితంగానే వచ్చాయి వాటిలో ఉన్నవ వారి రచనలకు గొప్ప స్థానం ఉన్నదనటానికి సందేహం ఏమాత్రమూ లేదు

అందులోనూ 'నాయకురాలు' నాటకానికికొక ప్రత్యేకత కూడా ఉన్నది పల్నాటి గాథ ఆంధ్ర చరిత్రలో ఒక ప్రత్యేక స్థానం గలది దాయాదుల మధ్య అంతఃకలహం కావటం చేత ఈ గాథకూ, భారతానికీ ఏనాడో సామ్యం పుట్టింది పాత్రలు కూడా ఒనగూడాయి బ్రహ్మనాయుడు కొంతవరకు ధర్మరాజునూ, కొంతవరకు కృష్ణుణ్ణీ పోలుతాడు నలగామరాజు దుర్యోధనుడు, కేతిరెడ్డి శకుని, నరసింగరాజు దుశ్శాసనుడు, నాగమ్మ కర్ణుడు, బాలచంద్రుడు అభిమన్యుడు - ఇలా సామ్యాలు కనబడతాయి, అవి పూర్తిగా అతకకపోయినా

ఈ నాటకం ద్వారా ఉన్నవ వారు గత చరిత్రను పునరుజ్జీవింపజెయ్యటంతో బాటు గాంధీ సిద్ధాంతాలనూ, గాంధీ శకానంతరం వచ్చిన సిద్ధాంతాలనూ కూడా వివిధ పాత్రలచేత పలికించారు

పల్నాడు రెండు కావటం పొదిలె పాపన్న సహించలేడు ''రెండు రాజ్యాలకూ (గురజాల, మాచెర్ల రాజ్యాలు) విరోధాలు బలమయినవా అంటే, మధ్య సన్నవాండ్లం నలుగుతాం'' అంటాడు ఎంత నిజం! కాని బ్రహ్మనాయుడు ''పది చీలికలుకాదు, పదివేల చీలికలయినా నాక్లిష్టమే పల్నాడంతా హరిజనుల కందరికి పదిలక్షల చెక్కలుచేసి, పంచిపెట్టి, ఏ బాధలూ లేకుండా వ్యవసాయం చేసుకొని జీవించమని చెప్పడమే నా క్లిష్టం ఎన్ని భాగాలు చేసినా పల్నాడు పల్నాటి ప్రజలకే ఉంటుంది'' అన్నది తిరుగులేని మాటే గద

పల్నాటి యుద్ధానికి మూలకారణాలుగా చెప్పబడే వాటిలో చాపకూడు ఒకటి నాయకురాలు చతుర్వర్ణంకోసం నిలబడిన శివభక్తురాలయితే, బ్రహ్మనాయుడు వర్ణవ్యవస్థనూ, అస్పృశ్యతనూ నిర్మూలించి అందరిచేతా చాపకూడు తినిపించటానికి కంకణం కట్టుకున్న

పేరు వైష్ణవుడు ఈ విధంగా బ్రహ్మనాయుడి పాత్ర గాంధీ సిద్ధాంతాలు పలకటానికి అనువైన పాత్ర అయింది చూడండి

''దుష్టులతోను, శిష్టులతోను చేర్పదగని దీనజనులను పరిపాలించటం రాజుయొక్క ధర్మం భూమి ఏ భారమయినా మోయగలదు గాని ధనికుడి భారము మోయలేదు ఇహము ఆముష్మికానికి మెట్టుగా ఉండాలి సైనికులకోసం సనాతన ధర్మవాదులం కాజాలము చెప్పేది ఒకటి, చేసేది మరొకటిగా ఉన్నంతకాలం మన ధర్మము నెవరూ పాటించరు అగ్రవర్ణముల వారికంటె పంచములెక్కువ దుర్మార్గులు కారు వారిని బాగుచేయవలసిన భారము అగ్రవర్ణములమీదనే నిలచి ఉన్నది'' - ''ఇలాంటి భావాలు బ్రహ్మనాయుడు వెలిబుచ్చాడు ''పారిపోవడం కంటె హింసించడమేమేలు'' అంటాడు

బ్రహ్మనాయుడు కేవలమూ గాంధీయిజముకే ప్రతినిధి అనుకోనవసరములేదు ఆయనది చాలా సూక్ష్మ దృష్టి బ్రహ్మనాయుడి పోరాటం పంచమ - పంచమేతర తగాదాలోకి దిగుతుందని కన్నమనీడు అంటే, ''అంతకంటె బీదల - భాగ్యవంతుల తగాదాలోకి దిగుతుందంటే సరిపోతుంది'' అంటాడు బ్రహ్మనాయుడు 'గెలువగలమను ఆశ లేనిది ఎవడూ ఏ పనీ తలపెట్టడు వెనుకకకులాగడం శంకితుని పని ముందడుగు వేసేవాడే సాహసుడు'' అనే కార్యదక్షుడు

మరొక నాటకకర్త అయితే బ్రహ్మనాయుడి ప్రతిపక్షం వారిని హీనంగా చిత్రించి ఉండవచ్చును కాని ఉన్నవ వారు అలా చెయ్యలేదు నాగమ్మ పాత్ర పట్ల కూడా మనకు ద్వేషం కలగదు దృక్పథాల మధ్య తేడా కిచ్చిన ప్రాధాన్యం వ్యక్తులకు ఇవ్వబడలేదు ఈ నాటకంలో ప్రేక్షకులను జుగుప్సపరిచేది ఒకే ఒక సంఘటన - అలరాజు శవాన్ని నరసింగరాజు లాగిపారెయ్యటం

అంతేకాదు, బ్రహ్మనాయుడి ప్రతిపక్షంలో చేరిన వాళ్ల నోటకూడా అనేక సత్యాలు మనం వింటాం

''లోకములో రాముడికీ రావణుడికీ కూడా స్వస్తి చెప్పి కాలం గడుపుకోనే వాండ్లు చాలామంది ఉంటారు కాలు ..దిరినతరవాత వారి పలుకుబడి ఎక్కువకూడా కావచ్చు'' అంటారు కేతిరెడ్డి స్వాతంత్ర్యం అనంతరం గద్దెలెక్కిన సంస్థానాధీశులు జ్ఞాపకం వచ్చేటట్టు అతనే ''యుద్ధాలు చేయకుండా రాజ్యాలు రావు'' అంటాడు ''ప్రజభావాలు పరికించి పాలించ గలవాడే ప్రభు రోటిపాటలే మేటి వీరులను తయారుచేసేది'' అని కూడా అంటాడు

''కత్తి అన్ని హక్కులను కలుగజేస్తుంది'' అని నాగమ్మకూడా మరోసూక్తి వల్లిస్తుంది ''పాపము దానంతట అది శమించదు'' అంటుంది

''పురుష ప్రయత్నము ఫలించడమూ, ఫలించక పోవడమూగలదుగానీ, ఇప్పుడో, ఎప్పుడో చేసిన కర్మలకు ఫలమియ్యడం తప్ప, పరమశివుడుగాని వరకేశవుడు గాని ఏమీ ఊరక ప్రసాదించినట్టు నే వినలేదు'' అంటాడు నరసింగరాజు

''తిరిచి భోగించడం దీనుల పని'' అంటాడు బాలచంద్రుడు

ఒక్క ముక్కలో చెప్పలంటే పాత్రలన్నీ సజీవమైనవి స్ఫుటమైన దృక్పథాలూ, ఆశయాలుగలవి సందర్భశుద్ధిగానూ,లౌక్యంగానూ, వ్యంగ్యంగానూ మాట్లాడగలవి

''నాటకీయత'' అనుకుని వెకిలి సంభాషణలతో కూడుకున్నచెత్త నాటకాలు వెలువడే ఈ కాలంలో, దాదాపు అర్ధశతాబ్దం క్రితం రచించిన ఈ నాటకం చదువుతుంటే ప్రాణం లేచివచ్చినట్లుంటుంది

ప్రతి అంకం ముందూ ప్రలాపుడి పాత్ర నాటకానికి అట్టే ఉపకరించేదిగా లేదు నాటకం ఆరంభంలోనే హామ్లెట్ జ్ఞాపకం వస్తుంది నాగమ్మపురుషవేషంలో వచ్చినప్పుడు నలగామరాజు మాటలలో శృంగారం ధ్వనిస్తుంది ఇంతకన్న వారిద్దరిమధ్య ఉన్న సంబంధం గురించిన ప్రస్తావన ఏమీ నాటకంలో లేదు కోళ్ల పందెం అప్పుడు కొమ్మరాజు బ్రహ్మనాయుడి కన్న బాగా జరగనున్నది గ్రహిస్తాడు

ఎన్నివిధాల చూసినా ఇది మరుగున పడిపోవలసిన నాటకం కాదు మన పాఠకులు శ్రద్ధతో చదువదగిన నాటకం గ్రాంధికంలో రాసినా పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు ఈ నాటకానికి చక్కని పీఠిక రాశారు అట్టమీద గోఖలే బ్రహ్మనాయుడి చిత్రానికి అనుకరణ ఉన్నది

*- ఆంధ్రప్రభ, వారపత్రిక, 25-4-1970*

## 57. కళాస్రవంతి

చరిత్ర ఆధారంగానూ, పుక్కిటి పురాణాల ఆధారంతోనూ మల్లంపల్లివారు రచించిన మరికొన్ని రేడియో నాటికలు ఇందులో ఉన్నాయి 'విజయ తోరణం' అన్న సంపుటిలోని నాటికలవంటివే ఇవీనూ జీవితమంతా చరిత్రను పరిశోధించటంలో గడిపిన సోమశేఖర శర్మగారు వీటిని రచించటంలో చరిత్ర సత్యాలను నాటక రూపంలో అందించటానికిగాని, తమ నాటక శిల్పాన్ని ప్రదర్శించటానికిగాని కృషిచేయలేదు కేవలమూ జాతీయాభిమానావేశమే ఆయనను ఈ రచనలకు పురికొల్పింది ఆ ఆవేశం కూడా మతం వేపు మొగ్గినది

ఈ సంపుటంలో ఆరు నాటికలున్నాయి మొదటిది 'కళాస్రవంతి' ధనకటకంలో ఆచార్య నాగార్జునుడు మహాచైత్యం చుట్టూ ప్రాకారం నిర్మింప జేశాడు - ''తలచుకుంటే తన మంత్రశక్తివల్లే ఈ ప్రాకారం లేపగలిగేవాడు!'' - ప్రాకార స్తంభాల మీదా, సూచులమీదా, ఉష్ణీష ఊర్ధ్వపటాలమీదా గొప్ప శిల్పాలు చెక్కించాడు కొండవీడులో 'కుమారగిరి వసంతరాజీయం' అనే నాట్య శాస్త్రం రచించాడు విజయనగరంలో 'రామప్పయ్య స్వరమేళ కలావిధి' అను సంగీత శాస్త్రం రచించాడు - ఇవే 'కళాస్రవంతి'

రెండవది 'స్వాతంత్ర్య సంస్థాపనము' వేంగి దేశంలో చాళుక్య దుష్పరిపాలన అంతం చెయ్యటానికి గొంకరాజూ, అతని తండ్రీ పోరాడటం ఇతివృత్తం విరోచితంగా చాళుక్యులను ఓడించిన గొంకరాజు, తన తండ్రి బలికాగా తాను సంపాదించిన విజయాన్ని విక్రమ చోళుడికి కానుకపెట్టి, ''మేము స్వతంత్రుల మనిపించుకొనుటలో కంటె మీకు సేవకుల మనిపించుకొనుటలోనే మాకు ఆనందమూ, గౌరవమూ ఉన్నది'' అంటాడు మన స్వాతంత్ర్య పిపాస అప్పటికీ ఇప్పటికీ ఒకే తీరుగా ఉన్నట్టున్నది

మూడో నాటిక 'హంపీక్షేత్రం' ఇది కొంతభాగం టూరిస్ట్‌గైడ్ గానూ, కొంత భాగం చరిత్ర చిత్రణ గానూ నడుస్తుంది చరిత్ర అంశాలు, విద్యారణ్యులవారు హరిహర బుక్కరాయల్ల చేత హిందూ రాజ్యస్థాపనకు కంకణం కట్టిస్తాడు ప్రౌఢ దేవరాయలు శ్రీనాధ కవిని

సువర్ణాభిషేకంతోనూ, కవిసార్వభౌమ బిరుదంతోనూ సత్కరిస్తాడు శ్రీ కృష్ణ దేవరాయలు యుద్ధాలలో విజయం కోసం విరూపాక్షాలయంలో రంగమంటపమూ, గోపురమూ కట్టిస్తాడు ఈ నాటకంలో ''ఫోక్ లోర్'' కూడా ఉన్నది విరూపాక్షరాయలు సింహాసన మెక్కాక అతనిచేత హతులైన వారందరూ దయ్యాలై కోలాహలం చేస్తూంటే నరసింహాచార్లూ, రంగాచార్లూ అనే అన్నదమ్ములు రామాయణ పారాయణం చేసి వాటిని పోగొట్టారట తరవాతది 'విప్లవ జ్వాల' 1857 నాటి స్వాతంత్ర్య సమర కథ ''కుంఫిణీ'' పరిపాలనలో మన దేశంలో మనమే పరాయివాళ్ల మైనాం, వర్తకమంతా సంస్థానాధీశుల భవిష్యత్తంతా వారి చేతిలోకి పోయింది విప్లవ జ్వాలలు లేచాయి నానాసాహెబ్, తాంతియా తోపే, ఝాన్సీ లక్ష్మీబాయి మదలైనవాళ్లు ఈ జ్వాలలను రేపారు అయితే ఒక ఝాన్సీ లక్ష్మీబాయి ఉంటే అందుకు విరుద్ధంగా ఒక అహిది లక్ష్మీబాయి ఉండటం సహజమే లాగుంది

'తెలంగాణా' సుదీర్ఘమైన నాటిక మౌర్యచంద్రగుప్తుడి నాటికే ఆంధ్ర రాజ్యం ఉండేది కాలక్రమాన శాతవాహనుల కింద, చాళుక్యులకింద, కాకతీయుల కింద, ముస్లిము ప్రభువుల కింది ఉండి ఈనాడు యావదాంధ్రలో కలసి ఉండటమా, మానటమా అన్న సందేహ స్థితిలో పడింది ఈ నాటికలో మాంటేజ్ ఎఫెక్టు బాగా ఉన్నట్టు నబడుతుంది

'శాలివాహనుడు' బొత్తిగా పుక్కిటి పురాణం

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 6-5-1970*

# 58. గెజిటెడ్ ఆఫీసరు భార్య

ఈకథల సంపుటిలో 16 కథలున్నాయి వాటిలో సంకలనం పేరు గల కథ మొట్టమొదటిది భర్త అక్రమంగా, అవినీతిగా సంపాదించిన ధనంతో అతని భార్య ఒక వెలుగువెలుగుతుంది ఆమె భర్త గుమాస్తా యూడీసీ అయినా కానట్టు కనబడతాడు అతను పట్టుబడేదాకా, పక్కనున్న గెజెటెడ్ ఆఫీసరు భార్యకు ఈ ఎన్జీవో భార్య సమస్య అవుతుంది ఈ కథలో నగల కేటలాగూ, చీరల కేటలాగూ లాంటి వర్ణనలున్నాయి స్టేటస్ సింబల్స్ వివరించటం ఈ కథకుడికి చాలా ఇష్టం

''మళ్ళీ మీరు పెళ్లి చేసుకోకండి'' అన్నది కృత్రిమమైన ట్రాజెడీ వాసెక్టమీ చేయించుకుని పిల్లల్ని కన్నానాడు తనకు జరిగిన ఆపరేషను విఫలమయిందా అని తెలుసుకోవటానికి ఆఫీసుకు సెలవు పెట్టి విజయవాడ వెళ్లి, తనకు ఆపరేషన్ చేసిన డాక్టరు దగ్గరికి పోతాడు ఆ డాక్టరు తన ఆపరేషన్ ఫైలయిందని ఒప్పుకోడానికి నామోషి అయి బొంకుతాడు తనకు పుట్టిన బిడ్డ కాదని ఆ దౌర్భాగ్యుడా బిడ్డను చంపుతాడు నోటితో అనటానికి నామోషి అనిపించిన మాటను డాక్టరు లేఖ ద్వారా తెలియజేస్తాడు ఇంతకన్న కృత్రిమమైన కల్పన ఉండదు వాసెక్టమీ సరిగా అయిందీ లేనిదీ ఏ డాక్టరయినా చెబుతాడు తాను చేసిన ఆపరేషన్ ఫెయిలైతే ఆ మాట చెప్పని సర్జన్ ఉంటాడా? డాక్టరు కేశవమూర్తి అనేవాడి ప్రవర్తన కంటె కూడా అతని లేఖ మరింత అసహజంగా ఉన్నది ఈ కథలో భార్య సుజాత తాటస్థ్యం అసలు ఊహించరానిదిగా ఉన్నది తన భర్త ఆపరేషను చేయించుకున్నట్టు ఆమెకు తెలిసి ఉండాలి

తనకు గర్భం అయినప్పుడు ఆత్మరక్షణ కోసమైనా ఆందోళనపడాలి - పడదు! అతను సుజాతకు చెప్పకుండా దాచాడట దేనికి దాచాడో తెలీదు ఆమెకు పిల్లలు కావాలని ఉండే పక్షంలో ఆపరేషన్ రివర్స్ చేయించవచ్చు లోతుగా ఆలోచించిన కొద్దీ ఇది సినిమా ట్రాజెడీ అనే భావం జాస్తి అవుతుంది

''మమత-భద్రత'' అన్న కథ గ్రామీణ వాతావరణాన్నీ గ్రామీణుల మనస్తత్వాలనూ బాగా చిత్రిస్తుంది 20 ఏళ్ల పాటు కమతం చేసి షావుకారు ఇంట్లో ఒకడుగా అయిపోయిన కోటేశు, కాలం మారుతున్నదనీ, ఎడ్ల స్థానంలో ట్రాక్టరు రాబోతున్నదనీ, తన ఉద్యోగం బర్తరఫ్ అయిందనీ తెలుసుకుని పడే బాధ చాలా సున్నితంగానూ, వాడి మనస్తత్వం సూక్ష్మంగానూ చిత్రించబడ్డాయి

''కలలో జరిగిన నిజం'' మరొక కృత్రిమమైన ట్రాజెడీ రవిప్రసాద్ కలలో తన భార్య ఎవడితోనో రంకుతనం చేసినట్టు చూసి, తను ఆత్మహత్య చేసుకున్నప్పుడు చాలా మండిపోయి, తనకు కలలో కనుపించినటువంటి వ్యక్తి వాస్తవంగా కనిపించగానే, ఆమె చావుకు తాను కారణం కాదని తృప్తిపడతాడు!

ఈ కథకుడికి పుణ్య పాపాలలోనూ, విధిలోనూ, పూర్వజన్మ కర్మలోనూ చాలా విశ్వాసం ఉన్నది ''పరిస్థితులూ - ప్రభావాలూ'' అన్న కథలో చెంగయ్యనాయుడు శంకరశాస్త్రికి ఆర్థిక సహాయం చెయ్యడు ఆ కారణంగా శంకరశాస్త్రి భార్య వైద్య సహాయం లేక మరణిస్తుంది కట్నం బాకీ తీరలేదని ఆయన రెండో కూతుర్ని భర్త వదిలేస్తాడు పెద్దకొడుకు చదువు మధ్యలో ఆగిపోతుంది శంకరశాస్త్రికి ఇంత ''అన్యాయం'' చేసిన చెంగయ్యనాయుడు శాస్త్రి చిన్నకొడుకు మీదుగా కారు పోనిచ్చి, తన మీద కేసు పెట్టవద్దని శంకరశాస్త్రిని బతిమాలుతాడు డబ్బు తన భార్యను బతికించి ఉండేదనీ, తన రెండో కూతురు కాపరం నిలబెట్టి ఉండేదనీ, పెద్దకొడుకు చదువు కొనసాగించి ఉండేదనీ మరిచిపోయి, 'నేరం నేరమే నేరాన్ని తుడిచి వేయగల శక్తి డబ్బుకు లేదు'' అంటాడు నాయుడు ఇస్తానన్న డబ్బును నిరాకరిస్తూ ఈ కథలోని నీతి ఏమిటో తెలీదు నాయుడి ప్రవర్తన చివరంటా ఒకటిగానే ఉన్నది శాస్త్రి అవసరాలకు నాయుడు డబ్బు ఇవ్వవలసిన అవసరం ఏమీ లేదు ఆత్మరక్షణావసరానికి మాత్రమే నాయుడు డబ్బు ఇవ్వ జూపాడు శంకరశాస్త్రి నాయుణ్ణి రక్షించాలని కూడా ఏమీ లేదు డబ్బును గురించి నిరసనగా మాట్లాడటం దేనికి?

అబద్ధం చెప్పటానికి అంతరాత్మ ఒప్పక ఆత్మహత్య చేసుకున్న వాడి కథ ''మూగ వేదన'' రంగన్న జమీందారి సంస్కృతికి ప్రతీక కల్పన కృత్రిమం

పాపకృత్యాలు చేసి పైకి ఎచ్చిన వాడి కథ ''ఆది శేషయ్య '' ఆదిశేషయ్య ఉన్నచోటే ఉండిపోయాడు చంద్రిగాడు ''మూడు తరాల వాళ్లకు సరిపడ్డంత ఆస్తి సంపాదించాడు ''పాపమో, పుణ్యమో - ఎవరు చూశారు? చచ్చిన వాళ్లు చావగా ఈ లోకంలో విడిచిపెట్టి వెళ్లిన ఆస్తిని గురించేగా తర్వాత చెప్పుకునేది!'' అంటుంది ఆదిశేషయ్య కోడలు, వాస్తవిక దృష్టితో

''మర్యాద కోసం'' శంకరం నానా గడ్డీ తింటాడు మధ్యతరగతి మనస్తత్వం వాస్తవంగా చిత్రించబడింది

''ఉద్యోగ విరమణ'' అన్న కథలో భాషనారాయణకు బయట సన్మానం జరిగితే, ఆయన భార్యకు ఇంట్లో సన్మానం జరుగుతుంది ఇలాటి కథే మధురాంతకం వారి కథ ఒకటున్నది

''వలపు వెన్నెల'' ఒక మూగ ప్రణయ కథ అమాయకమైన పగటి కల లాంటిది

''చిరంజీవి'' మరొక కృత్రిమ కల్పన భార్యయొక్క అవినీతి వర్తనపట్ల రియాక్షన్ ఇందులో దేవుడి హస్తం కూడా ఉంది

''పాపం పండలేదు'' అన్న కథలో ఒక స్త్రీ తన కూతురి రంకును కోడలి మీదికి తోస్తుంది కొడుకు తల్లిని నమ్మి తన భార్యను కత్తితో పొడిచి చంపేస్తాడు ఒక సన్నివేశాన్ని సృష్టించటం తప్ప కథకుడికి మరే ఆశయమూ ఉన్నట్టు కనబడదు

''ద్వితీయ కళత్రం''లో ఒక విధురుడు తనది రెండో పెళ్లి అని చెప్పకుండా ఒక స్త్రీని పెళ్లాడి ఆమె ఒక వితంతువని తెలుసుకుంటాడు వంచితుడి వంచన ఉభయత్రా నిరపాయమైన వంచనే

''మనిషి - మానవత్వమూ'' అన్న చిన్న కథ కొరడా దెబ్బ లాంటిదే చక్కని ఈ కథకు రెండు కొసమెరుపులున్నాయి!

''ఎదగని నవ్వు'' చాలా దీర్ఘమైన - అతి దీర్ఘం అనిపించే - కథ చెయ్యి విరిగిన మనిషికి కూడా మనసు కూడా ఎలా విరుగుతుందో ఈ కథ వివరంగా చిత్రిస్తుంది కల్పన భాగం అంత తృప్తికరంగా లేదు ఆమె మనసు ఎంతదాకా విరిగిపోయిందో చిట్టచివర గాని బయటపడదు

''ఆ సాయంత్రం'' చమత్కారంతో కూడిన స్కెచ్ ఆధునిక నగరారణ్యంలో మానవ మృగాలు ఒకదాన్ని చూసి ఒకరు ఎలా భయపడి పారిపోతాయో ఈ కథ చెబుతుంది

ఈ రచయిత కథలు అన్నీ ఒక లెవెల్‌లో ఉండవు ఇతనికి మామూలు మాటల స్థానంలో అమామూలు మాటలు వాడటం ఇష్టం కొన్ని నుడికారాలు అచ్చుగా సొంతం కొన్ని ఉపమానాలు ఊహకు అందవు ఉదాహరణలు అనవసరం విరివిగా వెలువడే ఇతని కథలు చదివే వారందరికీ అవి పరిచయం అయే ఉంటాయి

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 8-7-1970*

# 59. గదా యుద్ధము

తెలుగులో ''కవిత్రయం'' ఉన్నట్టే కన్నడానికి ''రత్నత్రయం'' ఉన్నారు వారిలో ఒకడైన పంప వ్యాస భారతాన్ని కన్నడంలో రచించాడు - కొన్ని మార్పులతోనూ, చేర్పులతోనూ పంప భారతంలోని గదాయుద్ధ ఘట్టాన్ని రన్న ప్రత్యేక చంపూ కావ్యంగా రచించాడు రన్న కూడా రత్నత్రయంలో ఒకడు ఆ గదాయుద్ధాన్ని బి ఎమ్ శ్రీ కంఠయ్యగారు నాటక రూపంలో రచించగా, గడియారము రామకృష్ణ శర్మగారు ఆంధ్రీకరించారు

రన్న రచించిన గదాయుద్ధ కావ్యంలో నాటక లక్షణాలుండటంలో వింత ఏమీ లేదు తిక్కన భారతం నిండా ''నాటకం'' ఉన్నది రాచకొండ విశ్వనాథశాస్త్రి కథలలో ''నాటకం'' ఉంటున్నది నాటకమనేది కేవలమూ రంగ విభజనలోనూ, టెన్నిస్ ఆడినట్టు పాత్రలు

సంభాషణలు విసురుకోవటంలో మాత్రమే ఉండదు - పాత్రల భావ చైతన్య ప్రదర్శనలోనే జాస్తిగా ఉంటుంది

ఈ గదా యుద్ధ నాటకంలో మనం చూసే దుర్యోధన పాత్రను ఈ రూపంలో సృష్టించిన వాడు రన్నే అయితే, ఆయన ఉద్దండుడై ఉండాలి అన్నిటినీ మించి రాణించేది దుర్యోధన పాత్రే మిగిలిన పాత్రలలో భీముడికే కొంత ప్రాముఖ్యం ఉన్నది అయినా, అన్ని పాత్రలూ చైతన్యవంతమైనవే

దుర్యోధన పాత్ర రెండో రంగంలో ప్రవేశిస్తుంది దుర్యోధనుడి సద్యః మనస్థితీ, అతని సహజ స్వభావమూ ఈ ఒక్క రంగంలోనే ఎంతో చక్కగా చిత్రించబడ్డాయి

అతను అందరినీ కోల్పోయాడు, యుద్ధాన్ని కోల్పోయాడు 'పాయింట్ ఆఫ్ నో రిటర్న్' ఎప్పుడో వచ్చేసింది ఈ స్థితిలో రంగంమీదికి వచ్చే దుర్యోధనుడు ''భుజించెడితరి ఓహోయన, ఆపదలం దయ్యో అనగా గాక చంపనోపుదురె ద్విజుల్?'', '' ఉపకరించునే పంద పతికి కదనము వేళన్?'' అంటూ ద్రోణుణ్ణీ, అశ్వత్థామనూ నిందిస్తాడు ధర్మరాజు ధర్మబుద్ధినీ, భీమార్జునుల పరాక్రమాన్నీ తీవ్రంగా ఖండిస్తాడు తన ఈ స్థితికి వారి ప్రతాపమే కారణమని ఒప్పుకోడు ''సమర జయము దైవాయత్తమగున్'' అని ఆమోదించి కూడా ''సమరంబు శూర ధర్మము కాదే?'' అంటాడు

దుర్యోధనుడు కృష్ణుణ్ణీ భగవంతుడి అవతారంగా ఆమోదించక, ''కుంతీ తనూజాత కింకరుడేలయ్యె? తేరు దోలు పదునొండనదగు సూతావతారమూ ఇది?'' అని ఆక్షేపిస్తాడు

తనకిక జీవితం లేదని దుర్యోధనుడు గుర్తించాడు సంజయుడూ, గాంధారీ ధృతరాష్ట్రులూ, ఆఖరుకు భీష్ముడూ కూడా అతనికింకేదో భవిష్యత్తు ఉన్నట్టు భ్రమ పడతారుగాని, అతను భ్రమపడడు ''నా యువరాజున్, నా కర్ణుడు లేనపుడిక నా కేటికి బ్రతుకు? రణమెనను గడతేర్చున్'', ''మనసిటు శూన్యము నాకున్, మన వీడున్ శూన్య, మాజీ మహియున్, సకలావని శూన్యమయ్యె, దుశ్శాలువ కర్ణులు లేక బ్రతుకు సాగించెదనే?'' అని తన బతుకు ఎంత అవాస్తవమైపోయినదీ చాలా బాగా వివరించి, 'డెత్ విష్' బయట పెట్టుకుంటాడు ''నేను జీవింతునంచును మిధ్యాశలు వీడుడు'' అని తల్లిదండ్రులకు చెబుతాడు

ధృతరాష్ట్రుడు హితం చెబుతూ, '' ఒసంగు మర్ధరాజ్యము 'మనవారి' కన్న!'' అన్నందుకు దుర్యోధనుడు ఆ మాట అప్పజెబుతూ, ''తమకు నేను సుతుండనె! ధర్మరాజు సుతుడు గాడొకొ? మీరును నతడుగూడి సుఖముగా పూర్వమట్లు బ్రతుకుడిక నన్ను దయచేసి వదలరయ్య!'' అంటాడు

మూడవ రంగం మిగిలిన రంగాలన్నిటికన్నా రసవత్తమమైనది రణరంగం కూడా సంజయుణ్ణీ వెంటబెట్టుకుని వెళ్ళే దుర్యోధనుణ్ణి చుట్టుముట్టి మాటలతో హింసిస్తాయి కాని అతను, ''ఛీ, పిశాచి మాటలు సత్యము కాదు'' అని దులిపేసుకుంటాడు గద ఎత్తి పిశాచాలను పారదోలుతాడు తన దుస్థితి చూసి సంజయుడు విలపిస్తే, అతన్ని కన్నీరు తుడుచుకోమంటాడు, తన ధైర్యాన్ని కలచవద్దంటాడు

ఆ వెంటనే అతనికి మృతవీరుల శవాలు ఒకటొకటే కనబడనారంభిస్తాయి వాటిని చూసి అతనిలో రేగే భావాలు అద్భుతంగా చూపబడ్డాయి ద్రోణుణ్ణి దూషించినందుకు

నొచ్చుకుని, ఆయిన పరాక్రమాన్ని కీర్తిస్తాడు అభిమన్యుడి శవాన్ని చూసి, ''మాకొసగుము, కుమార, నీ సాహసైక దేశాత్తమరణము'' అంటూ చేతులు మోడ్చుతాడు ఆ తరవాత అతను దుశ్శాసన కర్ణుల శవాలను చూసి పొందే విచారం వర్ణనాతీతం అతని మాటలలో భ్రాతృ వాత్సల్యమూ, స్నేహభావమూ ఉట్టిపడతాయి అతని విషాదస్థితి చూసి సంజయుడు, ''కర్ణు నింక మరువుడు'' అంటాడు ఒకప్పుడు సంధి చేసుకోమన్నవాడై ఉండి కూడా, దుర్యోధనుడి నిస్పృహను తొలగించటానికి, ''పగను తీర్చు గురి మరచెదనే?'' అని రెచ్చగొడతాడు

దుర్యోధనుడు భీష్ముడితో స్పష్టంగా చెబుతాడు ''మిము గాంచి జోత లిడిపోవచ్చినాడ, సంధిపరులతో సమకూర్పగోరి రాను నాడై దూళులు వారలు వేడిన నీకుండ, నేడు నే సగబాలున్ వేడి మన దూతనంపిన కాడింపరె? పవనసుతుడు గర్హింపడొకో! ఇక నొనే సహజీవనం బరులతో? ఏరికయి ఈ క్ష్మామండలం బేలుదున్'' ''అఖండితమైన అభిమానమొక్కటే మిగిలినది'' అంటాడు

ఈ నాటకంలో ధర్మాధర్మ ప్రసక్తి లేదు భీముడి చిత్తవృత్తీ, దుర్యోధనుడిదీ కూడా సమర్థించబడతాయి దుర్యోధనుడిపై గల అభిమానంకొద్దీ భీముణ్ణి ప్రేక్షకులు దుర్మార్గుడుగా చూడరు కాకపోతే రచయితకు దుర్యోధన పక్షపాతం ఉన్నట్టు చివరలో బయటపడుతుంది మూర్ఛిల్లిన భీముణ్ణి దుర్యోధనుడు కొట్టడు మూర్ఛిల్లిన దుర్యోధనుణ్ణి భీముడు తొడలు విరగగొట్టి కిరీటం తన్నుతాడు

కృష్ణుడి పాత్ర చిన్నదే అయినా చిత్రంగా ఉన్నది అతను ద్రౌపదిని ప్రశంసాపూర్వకంగా సంబోధిస్తూ, ''డామరడాకినీ'' అంటాడు కురుకులాన్ని మింగిన అపరా హిడింబి అని శ్లాఘిస్తాడు

ఈ నాటకంలో ద్రౌపది ప్రాముఖ్యం పరోక్షంగా చాలా ఉన్నది భీముడు ధర్మరాజుతో బాటు దుర్యోధనుణ్ణి వెతుక్కుంటూ వస్తూ, '' ఆ ద్రౌపదీ ద్రోహి'' ఎక్కడ అంటాడు గదా యుద్ధంలో మూర్ఛపోయి తేరుకుంటూ, ''పాంచాలీ, పాంచాలీ!'' అని కేక పెడతాడు

తెలుగులో పౌరాణిక నాటకాలు చాలా ఉన్నాయి గాని, ఇంత విశిష్టమైన పాత్ర పోషణ గల నాటకం కనబడదు ఇందులో 'డ్రమెటిక్ ఐరనీ' చాలాచోట్ల ఉన్నది మూర్ఛపోయిన దుర్యోధనుణ్ణి చూసి చనిపోయాడనుకుని గాంధారీ ధృతరాష్ట్రులు విలపించేటప్పుడు భీముడి చేతిలో అతని చావు సూచితమవుతున్నది

ఇది ప్రతి రసజ్ఞుడూ చదివి ఆనందించదగిన రచన అనువాదం చాలా చక్కగా నడిచింది

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 15-7-1970*

# 60. మొట్టమొదటి కన్యాశుల్కం

ఈ పుస్తకంలో ఎన్ని లోపాలున్నా దీన్ని నేను ప్రశంసనీయమైన ప్రచురణగా భావిస్తున్నాను మహనీయుడు గురజాడ అప్పారావు రచించిన అపూర్వ నాటకం అనేక కారణాల వల్ల ఈ కాలపు విద్యావంతుల స్మృతిపథంలోకి రాకుండా పోయినంత పని జరిగింది దాన్ని అమూల్యమైన రత్నంగా పరిగణించే వారి సంఖ్య రానురాను తగ్గిపోతూ వచ్చింది అందులోనూ కన్యాశుల్కం తొలి ముద్రణ బొత్తిగా మందిలోకి రాకుండా పోయింది కిందటి శతాబ్దంలో అచ్చయిన ఆ రచనను సంపాదించి ప్రచురించిన ఘనత బంగోరె(బండి గోపాలరెడ్డి) గారికీ, ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రికకూ దక్కింది బంగోరె కృషి చే విపుల వ్యాఖ్యాన వివరణ సహితమైన గ్రంథంగా వెలువడటం మరింత ప్రశంసనీయం ఈ కృషికి ప్రేరేపకులు కె వి రమణారెడ్డి, పర్యవేక్షకులు ఆరుద్ర

న్యాయానికి ఈ కృషి అంతా కన్యాశుల్కం రెండవ ముద్రణపైన జరగవలసింది ఎమెస్కో వారి దయ వల్ల రెండవ కన్యాశుల్కం - ప్రపంచానికి ఇదే అసలైన కన్యాశుల్కం- అందరికీ లభ్యంగా ఉన్నది గనకనూ ఈ కృషితో మొదటి కన్యాశుల్కం పునరుజ్జీవితమవుతున్నది గనకనూ ఇందులో రెండు కన్యాశుల్కాలకు సంబంధించిన అనేక విషయాలు విశదపరిచి ఉన్నాయి గనకనూ ఈ పుస్తకం అమూల్యమనిపించుకోదగి ఉన్నది

ఇందులో గురజాడ రెండు కన్యాశుల్కాలకూ రాసిన ఇంగ్లీషు ఉపోద్ఘాతాలున్నాయి ఈ ఉపోద్ఘాతాల వల్ల మనకు రచయిత ఆశయాలూ, దృక్పథమూ తెలుస్తున్నాయి

విజయనగరం మహారాజా ( ఆనందగజపతి ) గారు విశాఖ జిల్లాలో లెక్కలు తీయించగా, (1890కి పూర్వంకావాలి) మూడేళ్ల కాలంలో బ్రాహ్మణులలో 1,034 శుల్క వివాహాలు - సుమారు రోజుకొకటి చొప్పున - జరిగినట్టు తేలింది ఇవి లెక్కకు వచ్చినవి, రానివి ఎన్ని ఉన్నాయో మరి వీటిలో 188 వివాహాలు అతి బాల్య వివాహాలు అంటే వధువులు 1 సంవత్సరం నుంచి 5 సంవత్సరాల వయసు గల వాళ్లు వధువు ధర 350-400 నుంచి ఉన్నది కడుపులో ఉన్న పిల్లలకు కూడా బేరాలు కుదిరినట్టు తెలుస్తుంది ఈ పరిస్థితులను దుయ్యబట్టటానికే మొదటి కన్యాశుల్కం పుట్టింది

ఇది గురజాడవారి సామాజిక ఆశయం ఆయనను కన్యాశుల్క రచనకు ప్రేరేపించిన సాహిత్యపరమైన ఆశయం కూడా లేకపోలేదు రెండవ కన్యాశుల్క పీఠికలో ఆయన ఇలా చెప్పాడు 'తెలుగులో కొత్త సాహిత్యభాషను పెంపొందించడం చర్చల ద్వారానే జరిగేది కాదని నేనెరుగుదును ఒక గొప్ప రచయిత ఆ భాషను రచించి సృష్టించాలి నేను అతనికి రంగం సిద్ధం చేస్తాను '

కాని అప్పారావే ఆ గొప్ప రచయిత కావటం జరిగింది కన్యాశుల్కమే కొత్త సాహిత్యభాషకు ప్రమాణగ్రంథం కూడా అయికూర్చుంది దానిని ఆరుద్ర, ' ఆధునిక కావ్యాలలో అనన్యం అనితరసాధ్యం' అన్నాడు

ఈ పుస్తకానికి ఆరుద్ర 'అభిఘారము', 'మధురవాణిపాత్ర ఒక పరిశీలన-ఒక పరిశోధన', 'పునఃపరిశీలన పునఃపరిశోధన' చేర్చారు కె వి రమణారెడ్డి ' ఒకటి రెండు మాటలు' జతపరిచారు తరువాత బంగోరె 'ముందుమాటలు' ఉన్నాయి

ఈ వ్యాసాలలో అనేక విషయాలు క్షుణ్ణంగా చర్చించబడ్డాయి రెండు కన్యాశుల్కాలకూ గల తేడాలు తొలి కూర్పు రచనా కాలం, మొదటి కన్యాశుల్కం మొదటిసారి ప్రచురించిన తేదీ, కన్యాశుల్కానికీ వీరేశలింగం పంతులుగారి బ్రాహ్మ వివాహానికి గల పోలికలు, ఇత్యాది

ఆరుద్ర చేసిన మధురవాణి పాత్ర పరిశీలన చాలా సమర్థవంతంగా వున్నది ఇది 1956 జనవరిలో 'పరిశోధన'లో ప్రచురితమైన వ్యాసం మధురవాణి పాత్ర అంటే రెండో కన్యాశుల్కంలోని పాత్రేనని వేరే చెప్పనవసరం లేదు మొదటి మధురవాణిని గురించి అప్పారావే 'వర్ణించలేని హేయమైన నడవడిక గలది ఆ పాత్రకు ఎట్టి వన్నెలూ చిన్నెలూ లేవు నాటకం రచిస్తున్నకొద్దీ మధురవాణి పాత్ర పట్ల నా కున్న దృక్పథం మారుతూ వచ్చిందని చెప్పక తప్పదు ' రెండో మధురవాణి గురించి ఆరుద్ర అభిప్రాయం 'అనన్యసాధ్యమైన అతి సజీవ, అద్భుత పాత్ర ఆంధ్ర సాహిత్యంలో ఆచంద్రార్కం నిలవగలది

మొదటి కన్యాశుల్కం రచించిన అనంతరం అప్పారావు మరి రెండు వేశ్యపాత్రలను సృష్టించాడు - 'కొండుభట్టీయం'లో మంజువాణీ, 'స్టూపింగ్ టు రేజ్' అనే ఇంగ్లీషు కథలో సరళా ఈ పాత్రలు మధురవాణియొక్క పరిణామ దశలనీ, రెండో కన్యాశుల్కం నాటికి ఈ పరిణతి పరిపూర్ణమయిందనీ ఆరుద్ర అంటారు సరళకూ మధురవాణికీ, రంగనాధయ్యరుకూ, సౌజన్యారావు పంతులుకూ గల సామ్యాలను ఆరుద్ర వివరించారు

(ఒక్క చిన్న విషయంలో మాత్రం నేను ఆరుద్రగారితో ఏకిభవించలేకుండా ఉన్నాను మధురవాణి రామప్పంతుల్నీ, గిరీశాన్నీ ముట్టుకోనివ్వకపోవటంలో ఆరుద్ర 'నీతి' చూశారు నాకది కనిపించటం లేదు మధురవాణిలో లేకితనం లేదు రామప్పంతులు సొమ్మిచ్చినదాక అతన్ని తాకనివ్వదు, గిరీశంతో తెగతెంపులు చేసుకున్నదాకా తాను పరాధీనురాలనేనని ఎత్తు వేస్తుంది రామప్పంతులు మంచంకింద ఉండగా గిరీశాన్ని తాకనివ్వకపోవటం సహజమే గదా తనకు డబ్బు ముట్టి, గిరీశం ఉడాయించాక ఆ మధురవాణే రామప్పంతుల్ను కావిలించుకుని, తల ముద్దు పెట్టుకుంటుంది గిరీశంతో తెగతెంపులూ లేవు ఏమీ లేదు )

పునఃపరిశీలన వ్యాసంలో ఆరుద్ర, అప్పారావు జీవితంలో మధురవాణి పాత్ర సృష్టికి గల బీజాలు వివరించారు ఆనందగజపతి ఉంచుకున్న రామస్వామి (రామతిలకం) అన్న వేశ్య యోగక్షేమాలు అప్పారావే చూసేవాడు ఆమెను గురించి తన డైరీలలో కూడా రాసుకున్నాడు తాను మూడు నాలుగుసార్లు ఇద్దరు సానివాళ్ల ఇళ్ళకు వెళ్లాననీ, వారితో చర్చించాననీ, అందులో ఒకతె తనను వాదంలో ఓడించయత్నించిందనీ (మధురవాణి సౌజన్యారావునులాగ) అప్పారావు అన్నాడట

రెండవ మధురవాణి పాత్ర సృష్టిగురించి నేనొక వైల్డ్ గెస్ చేశాను ' రెండవ మధురావాణి పాత్ర అప్పారావు మెదడులో మొదటినుంచీ వున్నదనే నా అనుమానం మొదటి మధురవాణి ఆ పాత్ర కానేకాదు 1897 జనవరిలో మొదటి కన్యాశుల్కం అచ్చయింది దాన్ని 1892లోనే ఆ రూపంలో ఆడారు ఆ అయిదేళ్ళ కాలంలోనూ నాటకం మారినట్టులేదు 1897 మే నెలలో ఆనందగజపతి పరమపదించాడు అప్పారావు తలలోవున్న అసలు మధరవాణి మంజువాణిగానూ, సరళగానూ రిహార్స్ చేసుకుని 1909 నాటికి రెండో కన్యాశుల్కంలో అవతరించింది మంజువాణి, సరళపాత్రలు రెండూ ఆనందగజపతి నిర్యాణం తరువాత సృష్టి అయినవే ఇందులో ఏదన్నా రహస్యం ఉందా? పరిశోధకులు చూడవచ్చు)

కె వి రమణారెడ్డి, మొదటి కన్యాశుల్కం ప్రతికోసం బంగోరె నాలుగైదు సంవత్సరాలు పడిన పాట్లనుగురించి చెప్పి, ఈ పుస్తకాన్ని తొందరపడి, అసమగ్రంగా అచ్చువేసారంటున్నారు బంగోరె కృషి అసమగ్రమేకాదు అక్కడక్కడా దోషాలతో కూడుకునికూడా ఉన్నది కాని బంగోరెను నేను అధిక్షేంచలేను నాలుగైదేళ్లు శ్రమించినవాడు తన శ్రమ సఫలంకావాలని తొందరపడటం అస్వాభావికం కాదు అదీ గాక ఈయన కృషితో కన్యాశుల్కం గురించినపని ముగుస్తుందని ఎన్నడూ అనుకోలేదు అనంతంగా జరగవలసిన కృషిలోని మొదటి మెట్లల్లో ఇది ఒకటి అనే అతని నమ్మకం బంగోరె ఫిబ్రవరిలో కాబోలు నాదగ్గరికి వచ్చి తనకు తెలియని పది పన్నెండు అంశాలకు నన్ను వివరాలు అడిగాడు నేను ఒక్కదానికీ సమాధానం యివ్వలేక పోయినాను అందులో కొన్నిటికి వివరాలు ఇతరులనుంచి సంపాదించి నెలతిరగకుండా ఈ పుస్తకాన్ని వెలువరించాడు దీన్నిబట్టే బంగోరె యెంత చురుకుగా పనిచేసినదీ తెలుసుకోవచ్చు ఈ పుస్తకంలో వెయ్యి అవకతవకలున్నా నేను బంగోరె కృషినిగురించి తేలికగా మాట్లాడ లేను కన్యాశుల్కం తరిగేదీ, అరిగేదీ కాదు ఇలాటి పుస్తకాలు యింకా వంద రానివ్వండి బంగోరె చేసిన పొరపాట్లను యితరులు సరిచేయవచ్చు, ఇతరులు చూసినట్టయితే బంగోరెయే సవరించుకుంటాడేమో

'ముందుమాటలు' లో బంగోరె తాను పడిన శ్రమ వివరిస్తూ అనేక విషయాలు ప్రస్తావించాడు

గురజాడ అనేమాటను కొందరు 'గురుజాడ' చేశారు - ఈ పుస్తకాన్ని 'పుస్తుకం', అవసరాన్ని 'అవుసరం', కొడవటిగంటిని 'కొడువటింగంటి' చేసినట్టు

గురజాడ 21-9-1862న పుట్టినట్టు రుజువు చేయడానికే చాలా శ్రమపడవలసి వచ్చింది

మొదటి కన్యాశుల్కం ఏరోజు వెలువడింది? దానికి పీఠిక రాసినతేది 1-1-1897 31-1-1897న దాని కాపీ ఒకటి ఎవరికో బహూకరించబడింది ఆ మధ్య రెండు మూడు రోజులలో అది వెలువడి ఉండాలి 21న అది 'పీపుల్స్ ఫ్రండ్' అనే పత్రికలో సమీక్షించబడింది 'తెలుగు హార్ప్' అనే మరొక పత్రిక 26-8-1892న దాని ప్రదర్శనను సమీక్షించింది

కన్యాశుల్కాన్ని సమకాలిక ప్రపంచ నాటక సాహిత్యంతో పోల్చటానికి బంగోరె ప్రయత్నించాడు ప్రపంచ సాహిత్యంమాట ఎట్లావున్నా భారతీయ నాటక సాహిత్యంలో కన్యాశుల్కానికి సరితూగగల నాటకం రాలేదన్నది నిర్వివాదాంశం

కన్యాశులంకు విమర్శలకూ, సద్విమర్శలకు కూడా గురి అయింది అది నాటకం కాదు, ప్రహసనం అన్నారు అందులో లేని తప్పులు పట్టారు ఈ నాటకం మీద శ్రీపాద కామేశ్వరరావుగారు భారతిలో సుదీర్ఘమైన వ్యాసం రాస్తూ, ఎలా చూసినా ఇది గొప్పనాటకమని నిరూపించటమేగాక, ఈ నాటకాన్ని ఆమోదించనివారిలో మూడు రకాలను సూచించారు వాడుక భాష గిట్టనివాళ్లూ, గిరీశం బుచ్చమ్మను లేవదీసుకు పోవడాన్ని సహించలేని వాళ్ళూ, హాస్యమంటే సరిపడనివాళ్లూను దీనికి నాలుగో రకాన్ని నేను చేర్చదలిచాను - ఇందులో గొప్పతనం ఉన్నట్టు పదిమదీ చెప్పకున్నా, తేళ్లూ జెర్రులూ పాకినట్టు బాధపడేవాళ్లు

సోమయాజుల వెంకట రామమూర్తిగారు కన్యాశుల్కం జరిగిన కాలాన్ని నిర్ణయించటానికి చిత్రమైన కృషిచేశారు కోర్టులో సాక్ష్యం ప్రకారం బుచ్చమ్మ పుట్టినది భావ నామ సంవత్సరంలో

- అంటే 1874-75లో బుచ్చమ్మకు పదహారేళ్లంటే కన్యాశుల్కం సంఘటనలు 1890లో జరిగాయి 1890 డిసెంబరు (క్రిస్మస్ సెలవుల్లో) నాటకం ఆరంభమవుతున్నది నాటక సంఘటనలన్నీ జరగటానికి 15 రోజులు పట్టింది సరిగా మధ్యలో గిరీశం బుచ్చమ్మను లేదీసుకుపోతాడు

బంగోరె ముందుమాటలలో ఈ విషయాలేగాక ఇంకా అనేక విషయాలు తెలిపాడు శ్రీపాద సుబ్రహమణ్యశాస్త్రిగారిలా అన్నారుట 'కన్యాశుల్కంలో ప్రతి వాక్యానికీ కొన్ని పేజీల వ్యాఖ్యానం చెయ్యగల మనీషి శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు కన్యాశుల్కం తలంపుకివస్తే - అధవా - ఆ పేరు చెబితే వారి శరీరం అపాదమస్తకమూ పులకరిస్తుంది' భమిడిపాటి కామేశరావుగారు గిరీశం స్వగతం ఏనాడో రికార్డు యిచ్చిన సంగతి ఈనాడు చాలామందికి తెలియకపోవచ్చు కాని ఈనాడు కూడా కన్యాశుల్కం పేరువింటే పులకించేవాళ్లు కొంతమంది ఉన్నారు, విజయ విలాసానికి తాపీవారు రాసినట్టుగా కన్యాశుల్కానికి కూడా సమర్థుడొకడు వచ్చి వ్యాఖ్యానం రాసిననాడు మనమందరము 'తెలియనివాడనై మెలగితిన్' అనుకోక తప్పదు

వేలూరి శివరామశాస్త్రిగారు అన్నిటికన్నా వింత విషయం ఒకటి బయట పెట్టారట అముద్రితగ్రంథ చింతామణిలో వారికి కన్యాశుల్కంలోని ఒక సీసపద్యం కనుపడిందట ఇదేమిటని వారు అప్పారావుగారిని అడిగితే, అప్పారావుగారు తాను కన్యాశుల్కాన్ని మొట్టమొదట గ్రాంధికభాషలోనే రాసి, అసంతృప్తి చెంది వాడుకభాషలో మళ్లా రాసినట్టు చెప్పాడట

1892 ఆగస్టులో కన్యాశుల్కం ఆడినప్పుడు ఆ నాటకానికి ఆ స్థాన విద్వాంసుడు ముడుంబై వరాహ నరసింహస్వామి సంస్కృతంలో నాందీ ప్రస్తావనలు రాసి చదివించాడు ఎవరికోసం ఈ అర్థంగాని, నిస్సారమైన, అతిశయోక్తులతో కూడిన నాందీప్రస్తావనలు రాయటమూ, చదవటమూ జరిగిందో ఊహించటం కష్టం

ఈ వ్యాసాలన్నీ అయిన తరువాత మొదటి కన్యాశుల్కం నాటకం ఉన్నది నాటకంతోబాటే వివరణలూ, వ్యాఖ్యానాలూ, అక్కడక్కడా విమర్శలూ ఉన్నాయి వీటిలో రెండు కన్యాశుల్కాల మధ్య ఉండే తేడాలు - ఉదా గిరీశం డాన్సింగ్ గర్ల్‌కింద ఖర్చుపెట్టినది 10 రూపాయలనుంచి 20కి పెరిగింది - ఉన్నాయి పూర్ రిచర్డు యెవరన్నటువంటి సమస్యలున్నాయి ఇండియాలో కరెన్సీ నోట్ల జారీ ఎప్పటినుంచి జరిగిందన్న లాంటి సామాన్య విషయాలుకూడా ఉన్నాయి

19వ పేజీలో బంగోరె ఉదహరించిన కె వి రమణారెడ్డి మాటలు దాదాపు ప్రతి ఒక్కరినీ దిగ్భ్రమలో ముంచజాలి ఉన్నాయి 'వీరేశలింగంగారు లేవనెత్తిన సంఘ సంస్కరణ బావుటాకు ఒక సమగ్ర సుందరమైన కళారూపమైన జోహారే కన్యాశుల్కమని తోస్తుంది ఇందువల్లనేమో - నన్నడిగితే కన్యాశుల్క నాటక నాయకుడు కందుకూరి వీరేశలింగం పంతులంటాను'

రమణారెడ్డి ఇలా అనటానికి ఏమాత్రమూ ఆధారం కనబడదు వీరేశలింగం గారు సంస్కరణోద్యమాలు నడిపాడు అప్పారావు సంఘ సంస్కరణను గాఢంగా వాంఛించాడు ఆపైన యిద్దరికీ పోలిక ఏమీలేదు సంఘ సంస్కరణ విషయంలో వీరేశలింగం యోధుడు ఆయనకు సాధ్యమైనన్ని విధవా వివాహాలు చెయ్యటం పరమార్థం అప్పారావు కళాకారుడు, తన

కళద్వారా సంఘంలోని కుళ్ళును గురించి ప్రజల కళ్ళు తెరవటమే ఆయన పరమార్థం వీరేశలింగంగారు జీవితంలో మూఢాచారాలన్నిటితోనూ పోరాడాడు, మూఢ విశ్వాసాలన్నిటినీ దుమ్మెత్తి పోశాడు, అధికారుల లంచగొండితనాన్ని తీవ్రంగా ఖండించటమేగాక ఒకరిని ఆత్మహత్య చేసుకునే దాకా తోశాడు, భూతవైద్యులను హడలగొట్టేశాడు, ఛాందస బ్రాహ్మల జీవితంలోని కుళ్ళును చించి చెండాడాడు వీరేశలింగం గారు సంఘంలోచూసిన అన్నిరకాల కుళ్ళూ కన్యాశుల్కంలో ఉన్నది కాని గురజాడ వీటి నగ్నస్వరూపాన్ని మనకు చూపి మనలో వాటిపై రోతపుట్టించాడు కన్యాశుల్కంలో ఇద్దరు వితంతువులు - బుచ్చమ్మా, మీనాక్షీ ఉన్నారు ఇద్దరిలో ఏ ఒక్కరికీ అప్పారావు పెళ్లి చెయ్యలేదు వీరేశలింగంగారైతే గిరీశానికీ, బుచ్చమ్మకూ పెళ్లి చెయ్యకుండా విడిచిపెడతారా? ఒక్కనాటికి విడవరు అక్కడే అప్పారావుకూ, వీరేశలింగానికీ ఉన్నతేడా ఒక విధవా వివాహం చెయగలందులకు అప్పారావు తనకు వివాహం పట్ల గల పవిత్ర భావాలను నదులుకోలేడు వేశ్యావృత్తిలో ఉన్న మధురవాణి సౌజన్యారావుతో మాట్లాడుతూ, 'పెళ్లిచేసుకోగోరిన వేశ్యలకు కోరదగిన వరులు దొరకడం ఎలాగండీ? లేక యెట్టివారైనా సరే అని తమ అభిప్రాయమా అండి?' అని అడుగుతుంది వివాహం గురించి ఆమెకున్న ఘనమైన అభిప్రాయంలో వెయ్యోవంతు అగ్నిహోత్రావధాన్లుకూ, లుబ్ధావధాన్లుకూ లేకపోయిందన్నమాట అటుంచి వీరేశలింగం గారి వెంట సంఘ సంస్కరణోద్యమంలో తిరిగిన అనేక మంది యువకులకు గూడా లేకపోయిందన్న చేదునిజాన్ని మనం గుర్తించాలి అలాంటి యువకుడే గిరీశం అతనికి 'విడోమారియేజి' ఒకపరమార్థం అటువంటివాడినోట సంస్కరణభావాలు పలికించి సంఘసంస్కరణోద్యమాన్ని అప్పారావు అపహాస్యం పాలు చేశాడంటే ఆందుకు అప్పారావును ఎలా తప్పు పట్టటం ఉద్యమాలలో తిరిగినవారికీ, ఊకదంపుడు సంస్కరణభావాలు ప్రకటించేవాళ్లకూ తాము సంస్కరించే సమస్యయొక్క స్వరూపమే తెలీదు గిరీశం 'లఫూట్' అనుకుందాం ఆంటీనాచ్ వ్రత నిష్ఠాపరుడైన సౌజన్యారావు చాలా పెద్దమనిషి కాని పైన మధురవాణి అడిగిన ప్రశ్నకు ఆయన 'యీ సంగతి యింకా నేను బాగా ఆలోచించలేదు వేశ్యలు విద్యలు చేర్చి, ఇతర వృత్తులవల్ల సత్కాలక్షేపం చెయ్యరాదా,' అంటాడు వాళ్ల పెళ్ళి సమస్య - తాను తెచ్చినదే - గాలికి వదిలేసి దాంపత్య జీవితానికి వృత్తి - పాటా, ఆటా మినహాగా - ప్రత్యామ్నాయమైనట్టు

ప్రతి సూక్ష్మ విషయాన్నియెంతో సునిశితంగా చూసిన మనిషి అప్పారావు పూజారి గవరయ్య ఉత్తుత్త ఆడదాని దయ్యాన్ని, దాని ఊహా భర్త దయ్యాన్ని సీసాలో పట్టటంతో వీరేశలింగంగారు భూతవైద్యులమీద పెట్టిన రంకెలు చూస్తే నిజమైన కళాకారుడెవరు తక్షణం తెలిసిపోతుంది అటువంటి అప్పారావు రచించిన నాటకానికి వీరేశలింగంగారు నాయకుడనటం, మృదువుగా చెప్పాలంటే హాస్యాస్పదం

నేనీమాటలంటున్నది వీరేశలింగంగారిని హీనపరచటానికీ, అప్పారావుగారిని గొప్ప చెయ్యటానికీ కాదు, సంఘ సంస్కర్తలుగా ఎవరిది మంచి పద్ధతో తేల్చుకొవటానికి కూడా కాదు వీరేశలింగంగారు కార్యవాది, అప్పారావుగారు కళాకారుడు కన్యాశుల్కాన్ని గురించి ముచ్చటించుకునేటప్పుడు అప్పారావును కళకారుడుగానే అంచనా కట్టాలిగాని, ఉద్యమాలకు నాయకుడైనవాడితో ముడిపెట్టరాదు కన్యాశుల్కం లోని బుచ్చమ్మనూ, మీనాక్షినీ గురించి

తెలుసుకున్న ఫలితంగా ఒక్క విధవా వివాహము జరిగి ఉండకపోవచ్చును దానికి దోహదం చేసినది నిజానికి వీరేశలింగం ఉద్యమమే అలాగే వీరేశలింగంగారు ఎన్ని విధవా వివాహాలు చేసినా అలాటి వివాహాలవల్ల ఏర్పడే సమస్యలు జనానికి పట్టకపోవచ్చును కొన్నివిధవా వివాహాల పరిణామం చూసి, 'విధవలు పెళ్లాడితే ఇంతే,' అనేవారున్నారు విధవా వివాహాలతో సమ్మిళితమై వివాహ సమస్య ఒకటికూడా ఉన్నది దాన్ని కన్యాశుల్కం స్పష్టం చేసినట్టుగా రిచువల్ విధవా వివాహాలు స్పష్టం చేయలేవు సంస్కరణోద్యమంద్వారా జరిగే విధవా వివాహాలకన్న కొన్నివందల రెట్లు హేయమైనవి శుల్క వివాహాలు దాన్ని యితివృత్తంగా తీసుకున్న అప్పారావు శుల్కవివాహాలతోబాటు విధవా వివాహాలను గురించీ, వేశ్యా వివాహాలను గురించికూడా మనను ప్రశాంతంగా ఆలోచించేట్టు చేశాడు

వ్యాఖ్యానాలలో బంగోరె చేసిన అవకతవకలు కొన్ని ఎత్తి చూసి ఈ సమీక్ష ముగిస్తాను

లుబ్ధావధాన్లు పోలీసులతో చెప్పి పన్ను వేయించటం అన్న మాటలు అంటాడు 'పోలీసులతో చెప్పి పన్ను వేయించడమేమిటి? అని బంగోరె ప్రశ్న 'జుల్మానా', ఫైన్' అన్నమాటలు లుబ్ధావధాన్లుకు తెలీవు పన్నులన్నీ అక్రమ వసూళ్లే అని ఆ లుబ్ధుడి నమ్మకం (పేజీ 33)

శిష్యుడు మీనాక్షితో, 'తలవెంచుకుని తాంబూలం వేసుకుని సరసాలు చేసే వెధవ ముండకంటె నయం గద,' అన్నమాట మీనాక్షికే తగులుతుందని బంగోరెకు తట్టకపోవటం వింతగా ఉంది మీనాక్షివెంటనే 'చూశావురా, నాన్నా - దీనమ్మకడుపుకాలా యెలాగంటుందో,' అని కూడా అంటుందిగద, (పేజి 60)

దుకాణదారు, 'యీవేళే చెన్నపట్నం నుంచి ఫస్టురకం బ్రాందీ వచ్చింది ' అనటాన్ని బట్టి బంగోరె ఆరోజుల్లో స్మగ్లింగ్ ఉన్నదని భావించటం అనవసరం, ఫస్టురకం బ్రాందీ విదేశాలనుంచి దిగుమతి కావలిసిందే, ఆనాటి మద్రాసురాష్ట్రానికి మద్రాసు నుంచి దిగవలసిందే (పేజి 68)

రామ 'ప్రతివాడికీ సలహా చెప్పడానికి చాతవుతుందండీ? అందులో యీ యింగ్లీషు చదువుకున్న అయ్యవార్లని సలహా అడిగితే దొంగ సాక్షాలు కూడవంటారు ' ఇది స్పష్టంగా గిరీశాన్ని గురించి అన్నముక్కే అగ్నిహోత్రావధాన్లకు సలహాదారుగా ఉండటానికి రామప్పంతులు గిరీశంతో పోటీపడుతున్నాడు (పేజీ 78)

100 పేజీలో సౌజన్యారావు అనటానికి సంజీవరావు అని ఉన్నది ఇటువంటి తప్పులు కన్యాశుల్కంలో దొరక్కపోవు రెండవ కన్యాశుల్కంలో లుబ్ధావధాన్లు పెళ్లి జరిగినగుడి కోదండరామస్వామిది రామప్పంతులు కొండిభొట్లును 'పట్టాభిరామస్వామి' మీద ప్రమాణం చెయ్యమంటాడు

అయితే రామప్పంతులు మధురవాణిని 'లక్ష్మీ! లక్ష్మీ!' అని పిలవటం యిలాటి తప్పులలో చేరుతుందో చేరదో స్పష్టంగా తెలియటంలేదు మొదటి కన్యాశుల్కంలోనైనా మహాలక్ష్మి గిరీశం ఉంచుకున్న వేశ్య, రామప్పంతులుంచుకున్నది కాదు 'మధురం! మధురం!' అని పిలవటానికి రామప్పంతులుకు సంకోచం ఉండొచ్చు - వీధిలో వాళ్లంతా వింటారు, తాను ఉంచుకున్న మనిషి పేరు పదిమందికీ తెలియటం యిష్టంలేకపోయి ఉండొచ్చు మరేకారణమైనా కావచ్చు

గ్రంధం చివరను అనుబంధంలో అనేక విషయాలు వివరించబడ్డాయి ఇవన్నీ కన్యాశుల్కం పారాయణలో రసస్ఫూర్తికి దోహదం చేస్తాయనికూడా చెప్పలేం కాని ఒక్క విషయం ఎలాటి సందేహంలేదు, ఎన్ని లోపాలున్నా బంగోరె ఎంతో ప్రేమానురాగాలతో తయారుచేసిన పుస్తకమిది ఇది కన్యాశుల్కానికి తొలి వ్యాఖ్యగా ఉద్దేశించబడిందిగాని, తుదివ్యాఖ్యమాత్రంకాదు దీనిలోని లోపాలను సవరించటంతో బాటు బంగోరె కృషిని ముందుకు తీసుకుపోవటం సద్విమర్శకుల కర్తవ్యం

*సృజన, త్రైమాసిక పత్రిక, ఆగస్టు - అక్టోబరు 1969*

# 61. కందుకూరి వీరేశలింగం డైరీలు – లేఖలు

పశుపక్ష్యాదులు తమ భవిష్యత్తుకు సరి అయిన పునాదులు వేసుకోలేవు, గతం నుంచి నేర్చుకోలేవు ఈ రెండు విషయాలలోనూ ప్రకృతితోడ్పాటు తప్పమరేదీ వాటికి లేవు మేధస్సుగల మానవుడికి ఈ రెండు శక్తులూ ఉన్నాయి వీటితోబాటు సమాజ శక్తులు కూడా ఉన్నాయి కాని వాటిని మనం ఉపయోగించు కోవటంలేదు అసలు ఉపయోగించుకోక మనం పశుపక్ష్యాదుల లాగైనా బతకటం లేదు గతం నుంచీ పనికిమాలిన విశ్వాసాలను ఉపయోగించుకుంటున్నాం, సామాజిక శక్తులను వ్యష్టిలాభానికి వాడుకుంటున్నాం సామాజిక జీవితం శిథిలం కావటానికీ, వ్యక్తులు పశుప్రాయులై పోవటానికీ ఈ పరిస్థితి చక్కగా ఉపకరిస్తుంది

తన కాలపు జీవితాన్నిచూసి ఆందోళనపడి, దాన్నిమార్చటానికి తన జీవితాన్ని ధారపోసిన మొదటి ఆంధ్రుడు కందుకూరి వీరేశలింగం ఆయన సంఘసేవా కృషి బహుముఖమే కాదు, సర్వతోముఖమైనది ఆ కృషిని ఆయన విప్లవ దీక్షతోనే చేసినప్పటికీ అది సంస్కారంగానే నిలిచిపోంది ఆయన సమాజంలోని వర్గతత్వాన్ని గమనించలేదనటానికి లేదు అధికారమూ ధనమూ ఎలా దుర్వినియోగ మవుతున్నదీ ఆయనకు తెలుసు కాని ఆ రెంటితోనూ ఆయన రాజీపడుతూ తన కృషిని కొనసాగించాడు

అందుకు ఆయనను తప్పుపట్టనవసరం లేదేమో ఎందుచేతనంటే, విప్లవ పరిణామాలకు సంస్కరణోద్యమాల ద్వారానే దోహదం కలుగుతుంది విప్లవానంతరం కూడా అంతులేని సంస్కరణలు అవసరమవుతాయి

వీరేశలింగంగారు జాతీయోద్యమాన్ని చిన్న చూపు చూసిన మాట నిజమే దానికి కూడా అనేక కారణాలున్నాయి జాతీయోద్యమం కార్యచరణతోగాక నినాదప్రధానంగా సాగింది, వీరేశలింగంగారికి మాటలలో విశ్వాసం లేదు పనిజరగాలి, ఆయనదృష్టిలో శీలం లేనివారంతా జాతీయోద్యమం చాటున నాయకులుగా పైకి వచ్చారు, ఆయన వ్యక్తుల శీలానికి ఇచ్చిన ప్రాముఖ్యం మరి దేనికీ ఇయ్యలేదు అదీగాక, మనజాతి ఎంతో సంస్కరించ బడితేనేగాని స్వపరిపాలనకు అర్హంకాదని ఆయన నమ్మాడు మరొక సంగతి ఏమంటే జాతీయోద్యమం బ్రిటిషు పరిపాలనను తుదముట్టించటానికి సాగింది, కాని వీరేశలింగం గారికి, బ్రిటిషు పాలనవల్ల మన సమాజంలోని కుళ్ళు క్షాళన కావటానికి మార్గం ఏర్పడిందన్న విశ్వాసం

ఉండేది ("It is admitted by one and all that western lore has worked wonders among the natives of India that English education has rendered natives more refined in their manners, has dispelled the mist of superstition and has considerably developed their moral calibre whenever it is properly imported " — వివేకవర్ధని, 1875 అక్టోబరు ) అంతేగాక, వీరేశలింగంగారి సంస్కరణోద్యమాన్ని, దానివల్ల లాభం పొందదగినవారు సైతం ప్రతిఘటిస్తూ ఉంటే, అధికారులు ఆయనను సాయపడ్డారు ఇంగ్లీషు చదువు మూఢాచారాలను వ్యతిరేకించిందని దాన్ని ఖండించినవారు ''దేశభక్తులు'' ఆయారు।

నాగరిక జాతులవారు మధ్యమరకం కీర్తిగలవారిని గురించి కూడా బోలెడంతగా వివరాలు సేకరిస్తారు, సాహిత్యం సృష్టిస్తారు '' ఆయన మహాపురుషుడు చనిపోయి అర్ధశతమయింది ఇంకొక దేశంలోనైతే, ఇంకోక జాతివారైతే ఈ విధంగా ఎప్పటికీ ప్రవర్తించి ఉండేవారు కాదు'', అంటున్నారు సంకలనకర్త

వీరేశలింగంగారు సంస్కరణలు సాగించినంతకాలమూ సనాతనులు ఆయనమీద కత్తికట్టారు కొంతకాలం గడిచాక ఆయనను అనుసరించినవారే ఆయన్పై కత్తికట్టారు ఆయిన చనిపోగానే ఆయనను మరిచిపోవటానికి జాతీయోద్యమం సహాయడింది ఆయన పోయిన పాతికేళ్లకి అభ్యుదయ రచయితలు తిరిగి ఆయనస్మృతిని పునరుద్ధరించేసరికి, అతితెలివిగాళ్లు ఆయనకు 'కామ్రేడ్ వీరేశలింగం'' చేశారు।

వీరేశలింగంగారు స్థాపించిన సంస్థలు బూజుపట్టి ఉన్నాయి ఆయన తలపెట్టిన సంస్కరణలన్నీ మొదటికి వచ్చాయి ఆయన ప్రతిఘటించిన దురాచారాలు కొన్ని మరింత తీవ్రరూపంలో మనకళ్ల ఎదట ఉన్నాయి సంఘంలో విప్లవకరమైన మార్పులు వస్తేనేగాని ఇవి పోవు సామ్యావాదమూ, మార్క్సిస్టు తాత్వికదృష్టి, విప్లవ వాదమూ ఈనాడు జీవితానికి అవసరం ఇవి వీరేశలింగం గారిని స్పృశించనివే అయినా ఈనాడు కూడా మనకు వీరేశలింగం గారి భావాలతోనూ, కృషి తోనూ అవసరం ఉన్నది విప్లవ పరిణామాలకు కూడా ఆయన ఆదర్శాలూ, కృషీ ప్రాతిపదిక కాగలవు

ఎటా వీరేశలింగం స్మారక సభలు కొద్ది పరిధిలో జరుగుతున్నాయి కాని వాటి ప్రభావం మన జాతి మీద ఎంతగా ఉంటున్నదీ చెప్పలేం సాహిత్య అకాడమీవారు వీరేశలింగం గారిని పూర్తిగా విస్మరించలేదు నార్లవారు వీరేశలింగం గారిపైన రచించిన మంచి పుస్తకాన్ని అకాడమీ ప్రచురించింది వీరేశలింగంగారు సృష్టించిన సాహిత్యంకన్నా ఆయనమీద విరివిగా సాహిత్యం వెలువడటం ఎంతైనా అవసరం ఆ కృషి దాదాపు ఏమీలేని సమయంలో ఈ పుస్తకం రావటం కూడా గొప్ప విషయమే

అయితే ఈ పుస్తకం విలువ చాలా పరిమితమైనది ఆయన డైరీలలో కొన్ని సంఘటనలు తేదీలే, ఆకాలపు ధరలూతప్ప పనికి వచ్చేదేమీ లేదు ఉదాహరణకు, నెయ్యి వీశె రూపాయిన్నర అమ్మినరోజుల్లో వీరేశలింగంగారు 45 వేల రూపాయలు ఆస్తిని తెలుగువారి అభివృద్ధికి దానం చేశాడంటే అది ఈనాడు ఎంత పెద్ద మొత్తమో మనం ఊహించవచ్చు

ఉత్తరాలలో వీరేశలింగంగారి మనస్తత్వం చాలా చక్కగా వ్యక్తమవుతుంది నాకాయన ఆలోచనా విధానం పక్షపాతం ఉన్న సంగతి దాచాను ఆయన అను క్షణమూ తనను భగవంతుడే

కనిపెట్టి ఉన్నాడన్నప్రగాఢ నమ్మకంతో నేనేకీభవిస్తున్నాను గాని, ఆయన కార్యదీక్షా, నిరాడంబరతా మొదలైన గుణాలు ఎవరినన్నా ఆకర్షిస్తాయి ఆయనలో ఆత్మభిమానం ఉన్నది గాని స్వాతిశయం లేదు తనకు అంతులేని సహాయం చేసిన వారిని సైతం తప్పుచేస్తే నిర్మొహమాటంగా విమర్శించినవాడు పాశ్చాత్యులలో మంచిని అభినందించినా, చెడ్డను స్పష్టంగా ఖండించినవాడు

''నాకు తప్పులు లేవనను ఆక్షేపణలు సయుక్తికములైనచో వందన పూర్వకముగా నందుకొని సంస్కరించుకొనియెదను ''

'నేను చేసిన యర్ధమే సరియైనదనియు రెండవ వారు చేసిన యర్ధము సరియైనది కాదనియు దురభిమానముచేతనో ఏమో కాని నాకిప్పుడు తోచుచున్నది''

''తప్పులు పట్టుటలోను పరిహసించుటలోను నాకును కొంత సామర్ధ్యము కలదు''

నీటినిబట్టి వీరేశలింగంగారి మనతత్త్వాన్ని 3-D లో చూడవచ్చు

ఆయన ప్రతిగుణంలోనూ ఇలాగే ఎంనకు ''లోతు'' కనబడుతుంది సంఘసంస్కరణోద్యమంలో ఇంచుమించు యావద్భారత ఖ్యాతి సంపాదించిన వీరేశలింగం గారు ఉత్తరాలలో ఇలా రాయగలిగారు

''సంస్కరణ మహాసభాధ్యక్షక పదవి వలదని మొదటచెప్పి స్నేహితులు పట్టుపట్టుటచేత తుదకెటులో సమ్మతించితిని ఇప్పుడైనను ఈ గౌరవమునకు నేనర్హుడను కాననియె తలంచుచున్నాను'' ''సహాయకుల కొరతయె నన్ను బాధించుచున్నది, నా తదనంతరము వితంతు శరణాలయ మెట్లు జరుగునాయని విచారించుచున్నాను'' ''నాకాతిధ్యమొసగు మిత్రుడు నా పంక్తిని భోజనము చేయనక్కరలేదు,'' '' ఈ ప్రపంచమున నే నేకాకిగా నుంటిననియు, ప్రాపంచిక ధోరణికల్గిన మన స్నేహితులు నన్ను వదలివేసిరనియు నేనప్పుడప్పుడు అనుకొనుచుందును'', ''మన యుద్యమము ధర్మముపైనను సత్యముపైనను ఆధారపడియున్నది''

వీరేశలింగంగారి స్వభావాన్ని సూచించటానికి ఈ కొద్ది ఉత్తరాలనుంచి ఎన్ని ఉదాహరణలైనా చూపవచ్చును

''నా పుస్తకములోని గుణములను శ్లాఘింపవలసిన పనిలేదనియు దోషములను మాత్రమే చూపవలసినదనియు వ్రాసియుంటిని'', ''పొగడ్తలెక్కువగాను పని తక్కువగాను చేయువారి నేనంత మెచ్చను,'' ''నా తప్పులను శత్రువులు చూపినను కృతజ్ఞతతో స్వీకరించెదను ''

వీరేశలింగంగారిలో ఎన్నో గొప్ప గుణాలున్నప్పటికీ ఆయన తరచుగా భగవంతుణ్ణి నమ్ముకోవటం చిత్రంగా కనిపిస్తుంది అనేకరకాల మూఢనమ్మకాలను ఖండించినవాడు తనే మూఢవిశ్వాసాన్ని ప్రదర్శించటం మరీ చిత్రం 19-6-1913న బెంగుళూరు నుంచి ఆయన కుందూరి వెంకటరత్నంగారికి రాసిన ఉత్తరంలో ''భగవంతుడు తప్పక నాపక్షమున ఉన్నాడు నిస్సంశయముగ నాకాతడు సాయముచేయుచున్నాడు '' అంటే మందు సీసా మూత దానంతట అదే ఎగిరిపడ్డ ఉదంతం ఉదహరించాడు మూఢవిశ్వాసాలన్నీ ఇలా పుట్టినవేకావా?

''నా వెన్నో తప్పులున్నవి'', అని బాహాటంగా ఒప్పుకునేవాణ్ణి తప్పుపట్టి లాభం లేదు సమాజానికీ, దేశానికి అంకితమైనవాడు ఎలా జీవించాలో, ఎలా పనిచేయ్యాలో, అవాంతరాలను ఎలా ఎదుర్కోవాలో ప్రతి ఒకడూ వీరేశలింగం గారి నుంచి నేర్చుకోవాలి ఇంకా 15

సంవత్సరాంతకు పోతాడనగానే ఆయన, ''కొలది కాలములోనే నాకు మృత్యువాసన్న మగునని నేను తలచెదను, '' అని రాయిసం వెంకటశివుడుగారికి రాశాడు ఆయన ఆరోగ్యం అంత చెడ్డది ఏ క్షణాన అయినా మృత్యువు తనను ఎత్తుకు పోతుందనుకుంటూనే ఆయన ఎంతో కృషిచేశాడు అదే ఉత్తరంలో ఆయన '' ఈ సంవత్సరాంతమునకు నాయప్పులన్నియు తీర్చివేయ గోరుచున్నను అప్పుడు నేను ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి తోడ్పడవలెను,'' అని రాశాడు

ఆయన చేసిన ఆంధ్రవాఙ్మయాభివృద్ధి అందరికీ తెలిసినదే

చాలా ప్రయాసపడి ఈ పుస్తకాన్ని తయారుచేసిన మంజుశ్రీగారు అభినందనీయులు

*సృజన, మాసపత్రిక, జూన్-జూలై, 1971*

# 62. పిపీలికాది బ్రహ్మ పర్యంతం

పిపీలికమంటే చీమ బ్రహ్మ అంటే ఆహారమూ, భౌతికసంపదా (లని నిఘంటుకం) పిపీలికం ఆత్మజ్ఞానం కోసం తిరుగుతుంటే బ్రహ్మ సర్పం రూపంలో, ''నువ్వు ఈ లోకంలో ఒకానొక తుచ్ఛపు కష్టజీవివి'' అని చెప్పిందిట దాంతో పిపీలికానికి జ్ఞానోదయమై, సాటి తుచ్ఛపు కష్టజీవులను కూడగట్టుకొచ్చి బ్రహ్మధరించిన పాము రూపాన్ని నిర్మూలించి పిపీలికం బ్రహ్మైక్యం సాధించిదట!

ఈ ఆధునికోపనిషత్తు రచించిన ఆధునిక ఋషి రా వి శాస్త్రి, ఇది మొదట చదివినప్పుడు నా మనస్సు ఆర్క్‌లైట్‌లాగా వెలిగింది నన్నేగాక ఇంకా అనేకవందల మంది మనస్సులు ఇలాగే వెలిగాయిని తెలిసినాక నాకు చాలా ధైర్యం వచ్చింది నేను ఒంటరితనం భరించలేని పిరికివాణ్ణి ''కదిలేదీ, కదిలించేదీ'' లాగే 'వెలిగేదీ, వెలిగించేదీ'' కూడా సాహిత్యానికి గొప్ప ఆభరణం వెలుగులో కదలటం సులువుగద

ఇలా వెలుగుతూ వెలిగించే కథలు ఈ పుస్తకంలో పన్నెండు ఉన్నాయి అన్నింటిమీదా విధిగా ''రా వి శా '' ముద్ర ఉన్నది డాలరు విలవ ఒక చెంపపడి పోతూ ఉంటే ఈ ముద్ర విలువ నానాటికీ రీవాల్యూ అవుతూండటం గమనించదగిన విషయం

కథలను గురించి చెప్పుకునే ముందు ''టైటిల్'' గురించి ఒక ముక్క చెప్పాలి ఇవి ''బాకీ కథలు ఎవరికి బాకీ? ఏ విధమైన బాకీ? ఈ రచయిత ఆంధ్రజ్యోతికి బాకీపడి, కథల రూపేణా తీర్చారు, పీఠికలో పురాణంగారు అన్నట్టు ఇలాటి సంప్రదాయం లేకపోలేదు ఒహెన్రీ ముందు డబ్బు తీసుకుని తరవాత కథలు రాశాడు (కథకు వెయ్యి డాలర్లని జ్ఞాపకం) దాన్ని బాకీ అనక్కర్లేదు, అడ్వాన్స్ పేమెంట్ అనికూడా అనవచ్చు చార్లెస్ డికెన్సును ఒక పుస్తకాలమ్మే ఆయన ''నువు వచ్చునాలుగేళ్ళలో రాసే పుస్తకాలు నాకిచ్చి, నీరాయల్టీ అడ్వాన్సుగా 28వేల పౌన్లు పుచ్చుకో'' అన్నాట్ట రా వి శా అమెరికాలో పుట్టలేదు, ఇంగ్లండులో పుట్టలేదు, అందుచేత ఈ బాకీ అనే అడ్వాన్సు ఎక్కువ పెద్ద మొత్తం అయి ఉండదు

అయితే ఇంకోరకం బాకీ ఉన్నది దాన్ని గురించి కూడా పురాణం ప్రస్తావించారు గాని విపులీకరించలేదు తల్లికీ, తండ్రికీ, గురువుకీ, దేశానికీ ప్రతి మనిషీ రుణపడి ఉంటాడని ఆయన అన్నారు మేధావికి మరో రుణం కూడా ఉన్నది తన తలను పొలంగా మార్చి, దున్ని, ఎరువు

వేసి, పంటను ప్రజలకు పంచటం ఇది తీర్చవలసిన బాకీ - తల బీడుపడిపోయేదాకా - ఆ తరవాత ప్రపంచం శాశ్వతంగా ఆ మేధావికి బాకీ పడి ఉంటుంది ఈ రెండు బాకీలూ ఒకదాన్నొకటి రద్దు చేసుకోవు ఇక్కడ గణిత శాస్త్రం పని చెయ్యదు ఎందుకంటే ఈ బాకీలను డబ్బుగా మార్చగల షరాబు లేడు కొనేవాడికి ఈ పుస్తకం వెల మూడు రూపాయలు అందులో రచయిత రాయల్టీ 30 పైసలు అనుకుందాం కాని, చదివేవాడికీ పన్నెండు కథల విలువ ఎంత? రా వి శా తెలుగు సాహిత్యానికి చేర్చిన విలువ ఎంత? అసలే తేలకపోతే వడ్డీ ఎలా కట్టటం ఇదే మూడు రూపాయలతో మద్రాసులో ఒక మనిషి ఒక డొక్కు సినిమా చూసి వచ్చి దాన్ని రెండు రోజుల పాటు మనసార తిట్టుకోవచ్చు ఆ విషయం పోనివ్వండి

ఇంక కథలకి వద్దాం నేను పన్నెండు ఉపనిషత్తులు శ్రద్ధగా (తెలుగులో) చదివాను వాటిలో చాలా విచిత్రమైన విషయాలున్నాయి కాని అవి ఆధునికుడికి సరిగా అర్థమూ కావు ఉపయోగపడవు కూడా అంతకన్న ''పిపీలికం'' అన్నివిధాలా గొప్పది ఇందులో అనేక సత్యాలున్నాయి

తాత్విక సమస్యలలో చిక్కుకున్న ఒక చీమ, పని పాడు చేసుకొని, జ్ఞానం కోసం బయలుదేరి, గురుదక్షిణలు సమర్పించుకుంటూ ఒక వీధి బడిపంతులు దగ్గిర ప్రాథమిక విద్యా, మరొక సద్బ్రాహ్మడి వద్ద బ్రహ్మవిద్యా నేర్చుకుని, తన సమస్యలు తీరకపోగా, ఒక మహర్షినడిగి మోక్షసాధనం తెలుసుకుని, ''జన్మరాహిత్యమూ, మోక్షమూ ఎందుకు?'' అన్న ప్రశ్నకు సమాధానం తెలుసుకోజాలక ఎలాగైనా చదువుకున్న చీమ గనక తమ జాతి విరోధిని ఒంటరిగా ఎదిరించి, ఆ విరోధి ద్వారా తాను ఎవరో, తన శ్రమ ఫలితం చివరకు ఎవరికి దక్కుతుందో తెలుసుకుని, తాను నాయకత్వం వహించి, ''సోదరులందరికి హితబోధ చేసి, ధైర్యం చెప్పి, వారిని వీరులుగా మార్చి తిరుగుబాటు చేసేందుకు రంగంలోకి'' దూకింది ఈ తిరుగుబాటు ఫలితంగా చీమల పుట్టలో చేరిన రాక్షసాకారపు పాము నెత్తురు కక్కుకుని చచ్చింది!

బందిపోటులను గురించి పత్రికలలో చదివి వాళ్లను నిర్మూలించలేం ముఖాముఖీ అయి కలియబడినప్పుడేగాని దోపిడీ నిలిచిపోదు నిజం! దోచేవాడికీ దోచుకోబడేవాడికీ మధ్య ప్రతిఘటన లేకుండా జీవితం మారదు

జీవితంలో తప్పుడు చదువులూ, నిరర్థకపు చదువులూ ఎలా ఉంటాయో ఈ కథ తేలికగా స్పష్టం చేస్తుంది

వెన్నెల - పడుచు రక్తాన్ని ఉడుకెత్తించే వెన్నెల! కవులను మత్తెక్కించే వెన్నెల (ఆ మత్తులో వారు ఏమేమో రాస్తారు) అయితే మహాకవిని ఎందుకో బహుళ పంచమి జ్యోత్స్న భయపెట్టింది ఒకనాడు ఇవాళ మళ్ళీ రా వి శా ని వెన్నెల భయపెడుతున్నది ఎవరో మిట్టమధ్యాహ్నపు టంధకారాన్ని గురించి రాస్తే ఈ రచయిత పండు వెన్నెలలో చీకటి గురించి రాశారు ''కన్నతల్లీ వెన్నెలా, లోకమంతా వెన్నెలే నీ పాలు పొంగిన వెన్నెలే కాని మాకు మాత్రం దాని నిండా జీరలే పేదనెత్తుటి, వేడి నెత్తుటి జీరలే'' ఈ జీరలకు సంబంధించిన కవితే ఈ కథ వెనకటికి ఒక కాముకుడు, ప్రియురాలు లేక చంద్రుణ్ణి, "You are wasting time on me," అని పాడాడు కాని పేదబ్రతుకులు వెన్నెలలో చీకటి జీరలు కమ్మాయి అదీ జీవితం!

''పక్కింటి అబ్బాయి''లో నిరంజనుడు మన మధ్యతరగతి వాడే మనందరిలోనూ ఉన్నవాడే వాడు తనలాంటి దరిద్రులను తనవాళ్లుగా చూడలేదు వాడి ఆశలు పైకి రావాలనే,

కాని ఒంటరిగా, స్వయంకృషితో పైకి రావాలని తనను బాధించే సమస్యలు అందరికీ పోవాలన్న దృక్పథం వాడిలో ఉండదు బల్లిలాటి పిల్లాణ్ణి చూసి, పుల్లల్లాటి ఆడవాళ్ళను చూసి వాడికి కోపం వస్తుంది గాని ఆవేదన కలగదు "అసలు ఆ పిల్లడు ఏడుపు ఆరంభించేదాకా (ఆరంభించి తన పరీక్ష చదువుకు భంగం కలిగించేదాకా) ఆ పిల్లడు ఉన్నాడన్న సంగతే మర్చిపోయేడు నిరంజనుడు" అదీ వాడితత్వం తన పక్కనే దారిద్ర్యమూ, దైన్యమూ, అనారోగ్యమూ, అసహాయతా ఉన్నా వాడికి చీమ కుట్టినట్టుండదు నోరు చేసుకు అడిగినా వాళ్లకి ఓ రిక్షా తెచ్చిపెట్టడు "మీతో నాకు సంబంధం లేదు" అంటాడు తాను పరీక్షకు చదువుకునేటందుకు అడ్డం తొలిగితే వాళ్ళ గతి ఏమైందని కూడా వాడు ఆలోచించడు

నిరంజనుడికి తగిన ఉద్యోగమే దొరికింది - ప్రజలపై పన్నులు విధించే ప్రభుత్వ ప్రత్యేక శాఖలో ప్రధానోద్యోగి పని!

దీనుల జీవితాలను చిత్రిస్తూ రా వి శా రచించిన అనేక కథలలో "బుద్బుదం" ఒకటి నీటిలో పుట్టిన బుడగ నీటిలోనే లయమవుతుంది, జీవితం బుద్బుదం లాటిది, చావుబతుకులు మిధ్య నిజమే, కాని మనిషికి చావుబతుకుల మధ్య ఉన్నదే నిజం దాని అవతల ఉన్నది మిధ్య అదీగాక, "నీటి బుడగ పోయినపుడు నీటిబుడగ లేడుస్తాయోలేదో కాని, మనిషి పోతే మాత్రం మనుష్యులేడుస్తారు" మనుషులు జీవించటమే కాదు, ఒకరి జీవితాన్ని ఒకరు పంచుకుంటారు - ఇది మరో నిజం

పెట్టుబడిదారీ సమాజంలో మనుషులు కూడా విక్రయ వస్తువులే వెయ్యి రూపాయల ప్లీడర్లుంటారు బేడాపరక ప్లీడర్లుంటారు అలాగే డాక్టర్లూనూ అయితే వీరివల్ల సహాయం పొందవలసిన వాళ్ళూ, పొందలేకపోయే వాళ్ళూ మాత్రమే మానవులు తమ ఖరీదు ముట్టనప్పుడు చావనున్న వాళ్ళను కాపాడకపోవటం వాళ్ళకు "తప్పు" కాదు కాని నరసయ్యలాటి "మనుషులకు" చావుబతుకుల్లో ఉన్న వాళ్ళను - వాళ్ల వెల చీటీలు అంటించుకున్న విక్రయ వస్తువులే అయినా సరే - తనకు కాపాడే శక్తి ఉన్నప్పుడు కాపాడకపోవటం "తప్పు" అనే అనిపిస్తుంది అతను "మనిషి" కనక! ఇదే "తప్పు" కథ

"జాతక కథ" హాస్య కథ ఆరోనెల్లో చచ్చిపోయిన వాడి జాతకం చూసి ఓ దైవజ్ఞుడు, ఆ జాతకుడు వెయ్యేళ్లు రాయిలాగా బతుకుతాడని చెబుతాడు - చాలు!

వ్యాపారం చేసుకునేవాడు కూలీలకు అచ్చంగా పచ్చిమంచినీళ్ళే పోస్తే హెచ్చు లాభమే వస్తుంది కాని కూలీలు చచ్చిపోయి నష్టం కొద్దిగా రావచ్చు అందుచేత వ్యాపారం "సోషలిజం" అవలంభించాలి అది ఎలాగా? "వారిని మనము కొనవూపిరితో వుంచవలెను మనిషికి ఇంత ఎండుగడ్డీ, ఇంత (ఉప్పుబెడ్డ కలిపిన) మంచినీరూ అని నిర్ణయించి, వారు చావకుండా చూచుకొనండి" ఈ దివ్యమైన సందేశం "పాతదే కథ"లో ఉన్నది ఈ సోషలిజం వ్యాపారుల నుంచి గాక భూకామందుల నుంచి వచ్చినట్టు ఈ కథ చెబుతున్నది

"క్రియాసిద్ధిస్సత్త్వే భవతిమహతాం, నోపకరణే" అన్నది మనకు చాలా కాలంగా తెలుసు అయినా మావో అణుబాంబును కాగితపు పులి అన్నందుకు మన వాళ్లు చాలామంది ముక్కు మీద వేలేసుకున్నారు పై సమస్యను నలుగురు పూరించినట్టు కథ అందులో ఒక మహాత్ముడు రాముడు అతను కోతులనూ, కొండముచ్చులనూ వెంట బెట్టుకుపోయి,

మహాబలసంపన్నుడైన రావణుడి ఉక్కు కోటలను ఛేదించాడు ఆ ప్రయత్నంలో ఉన్న రాముడికి ఒక బెదురుగొడ్డు పోయ యత్నించిన పిరికిమందు ''బెదురు'' అన్న కథగా రూపొందింది ఈ కథను ఈనాటి పరిస్థితులకూ ప్రజా విప్లవానికీ ఎలా అన్వయించుకోవాలో ఎవరైనా తెలుసుకోవచ్చు

''షోకుపిల్లి'' ఉన్నత కుటుంబ జీవితాన్ని చిత్రిస్తూనే వెటకారం చేసే రచన ఒక ఘరానా కుటుంబం వాళ్లు పెంచుకునే పిల్లికి ''అహింస పిల్లి, వెజిటేరియన్ పిల్లి, సోషలిస్టు పిల్లి'' అన్న అపఖ్యాతి రావటం పెద్ద క్రైసిస్! కాని జంతువులు తమ జాతి లక్షణాలను ఎప్పటికైనా ప్రదర్శిస్తాయి ''షోకుపిల్లి'' పిట్టను పట్టేస్తుంది అప్పుడు ఘరానా ఇంటిపెద్ద చెబుతాడు, ''ఒఫ్‌కోర్స్, ఆ పిట్టన్నాపి మనం విచారించాలనుకోండి! పూర్‌బర్డ్! ఏ జీవికి ఆ ఆహారం భగవంతుడే ఏర్పాటు చేసేడు మనం దానికి అడ్డుపడకూడదు మనతిండికి ఎవరైనా అడ్డుపడితే మనం ఊరుకుంటావా?

''ఈ మాటలన్నాక ఆయనెందుకోగాని చిరాకుపడ్డారు -'' ఈ మాట తిండి లేని మనుషులకూ వర్తిస్తుందని కాదు, తమకూ జంతువుకీ సామ్యం తెచ్చుకున్నందుకు!

''వేతనశర్మ'' ఆంధ్రజ్యోతి వారపత్రికలో అచ్చవుతూనే సంచలనం కలిగించిన కథ వేతనశర్మ కలకాలం ప్రజల నోళ్లలో నానగలడు '' ప్రభుత్వోద్యోగులకి వేతనశర్మే మొట్టమొదటి పీఠాధిపతి ఆ తరువాత వేతనశర్మలే కార్మికనాయకులుగా కూడా రూపొందడంతో ప్రభువులంతా సకల ధన కనక వస్తువాహనాలతో తులతూగుతు ప్రశాంతంగా జీవించుతూ వొస్తున్నారు ఎక్కువ జీతాల కోసం సమ్మెలే తప్ప, సమసమాజం కోసం విప్లవాలు వద్దంటారు ప్రభువులు అవునంటారు ప్రభుత్వోద్యోగులు ( ఉరఫ్ వేతనశర్మలు )

ప్రభువులకు లాభించే ఏ గొప్ప సత్యాన్ని వేతనశర్మ ప్రవచించాడు?

''సమాజం పూర్తిగా మారితేనే గాని జీవితాలు బాగుపడని వాళ్లు విప్లవాలు తెస్తారు చావుకి తెగిస్తారు మనం ఆ కోవకి చెందుతామా? చెందం! సమాజం ఇలానే ఉన్నప్పటికీ మనకు బాగుపడే అవకాశాలున్నాయి మనకు వేతనాలు పెరిగితే రాజులూ మారనవసరం లేదు రాజ్యాంగమూ మారనవసరం లేదు, రాజవర్గానికి చావా బతుకా అని ఉన్నట్టి ఈ విప్లవ సమయంలో మనం రాజవర్గానికి స్పష్టంగా, 'మాకు వేతనాలతోనే సంబంధం ఉంది కాని విప్లవాలతో సంబంధం లేదు' అని చెప్పినట్లయితే వారు చాలా సంతోషించి మనకి మరో పిడికెడైనా ఇచ్చి తీరుతారని నాకు ఎంతో నమ్మకం ఉంది '' లని వేతనశర్మ తనతోటి కరణాలతో చెబుతాడు

''ద్వైతాద్వైతం'' ఒక రకం భావచిత్రణ అందులో రెండు భాగాలు మొదటి దాన్ని అరణ్యంలో దేవుడు, రెండోదాన్ని నగరంలో దేవుడూ అనవచ్చు తన స్వశక్తిలో విశ్వాసం గల పులి తన శక్తులేవీ తనను కాపాడలేని పరిస్థితిలో దేవుడియందు విశ్వాసం ఉంచి, తనకు మేలు జరిగాక ఆ దేవుణ్ణే బలపరుస్తూ ప్రచారం చేస్తుంది రెండో భాగంలో ఒక ఆడ మేకపిల్ల సంఘం యొక్క ప్రభావం వల్ల దైవభక్తి అలవరచుకుని, ఆపత్సమయంలో భగవంతుణ్ణే ప్రార్థించి కూడా పులివాత పడి పోతుంది అలా చచ్చిపోకుండా తప్పించుకుపోయిన దాని అన్న మేక భగవంతుడి రక్షణను ఎంతమాత్రమూ నమ్మదు ''భగవంతుడంటాడు '' అని (ఎందుకో!) ఒప్పుకుంటుంది ''కాని, అతను మనకి మన కోసం మనయెడల మన మంచికి ఉండదుండడు ఉండడు కాక ఉండడు '' అంటుంది

''రవ్వ'' అనేది చాలా చిన్న కథ అయితే దాని వెనుక ఉన్న చరిత్ర చాలా పెద్దది ఇదే విషయం తీసుకుని బెంగాలులో తారాశంకర్ బెనర్జీ పెద్దనవల రాశాడు నిరుపేదల కొండల మధ్యా, అరణ్యాలలోనూ, పాములూ, జెర్రులూ నివసించే ప్రాంతాలలోనూ చెమటోడ్చి నేల బాగు చేసి వ్యవసాయ క్షేత్రాలు ఏర్పాటు చేస్తారు తరవాత కామందులయో, జమీందార్లు వచ్చి వంచన చేసో, దొంగపత్రాలు సృష్టించో వాటిని కాజేస్తారు చెమటోడ్చిన వాళ్లు కడుపు మండి ఎదిరిస్తే చట్టబద్ధంగా వారి చేత రక్తం కూడా కార్పిస్తుంది అలాటి తిరుగుబాట్లకు నక్సల్బరీ అన్న తిట్టు పేరూ, అలాంటి ప్రభుత్వాలకు సోషలిస్టు కితాబూ రావటం కద్దు

ఇదీ కథల వైనం రా వి శాస్త్రి ఈ దేశపు ఈ కాలపు మేధావివర్గంచేత బ్రహ్మరథం పట్టించుకోగల రచయిత ఆయిన కథలు చదివినాక చదువక ముందున్న స్థితిలో ఉండగలవాడు పరమజడుడై ఉండాలి ఆయనలో ప్రచారగుణం ఉన్నది పాఠకుణ్ణి కాలరు పట్టుకు నిలవేసే లక్షణం ఉన్నది శిల్పవైవిధ్యం ఉన్నది నూతన ప్రయోగాలు చేసే సమర్థత ఉన్నది అలాంటి రచయిత విప్లవ సాహిత్యం తరఫున నిలబడటం విప్లవ సాహిత్యోద్యమానికి అంచనా కట్టవీలు లేనంత ఉపకారం ఈ పుస్తకంలోని కథలు అన్నీ కాకపోయినా కొన్ని అయినా విప్లవ సాహిత్యానికి ఆభరణాలు మధ్యతరగతి పునాదులు కదిలించడానికి అందులోని ప్రతి కథా ఉపయోగపడుతుంది ఇలాంటి ''డైనమైట్'' రా వి శాస్త్రి సృష్టించినంతగా మరే వర్తమాన రచయితా సృష్టించలేదని చెప్పాలి

*- ముద్రణ సృజన, మాసపత్రిక జూన్ 1972*
*పునర్ముద్రణ కళలు, శాస్త్రీయ విజ్ఞానం, విరసం ప్రచురణ, అక్టోబరు 1980*

# 63. శ్మశాన శాంతి

ఆధునిక కథాసాహిత్యానికి రాచకొండ విశ్వనాథశాస్త్రి ఒక కోపూ, కాళీపట్నం రామారావు మరొకకోపూ కాస్తున్నారంటే అది అతిశయోక్తి కాదు ఇద్దరూ 'అట్టడుగు' వాళ్ళను గురించి రాయగలరు, వాళ్ల దృక్పథాన్ని చైతన్యవంతంగా చిత్రించగలరు

మధ్యతరగతికి చెందిన కథకులు మధ్యతరగతి జీవితం గురించే అభూతకల్పనలు చేసి ''కీర్తి'' గడిస్తున్న ఈ కాలంలో, రామారావులాగా అధోగతి జీవితాన్ని వాస్తవంగా చిత్రించటం అపూర్వమనాలి

''నా కథలు పొడుగ్గా వుంటాయనీ, అవి చదువుకోవటానికి హాయిగా నడవ్వనీ కొందరు మిత్రులు చెబుతూ ఉంటారు అయినా కొన్ని కథలు పొడుగ్గానే తప్ప రాయలేకపోయాను'' అంటారు రామారావు ''సంజాయిషీ''లో

చిన్న కథకు శిల్పం శాసించటం అవివేకమనీ, దాని వైవిధ్యానికి అంతులేదనీ పాశ్చాత్య విమర్శకులు ఏనాడో ఒప్పుకున్నారు అయితే చిన్న కథ స్వరూపం యిలా ఉండాలన్న భావం కొందరిలో కలగటానికి కారణం సాధారణంగా దానికి ఉండే మధ్యతరగతి స్వభావం ''సరదా''కు చదివే కథలు అట్టేసేపు పట్టకూడదు మతాబా వెలిగినట్టు వెలిగి ఆరిపోవాలి కాస్సేపు నేత్రపర్వం చేసి తప్పుకోవాలి కాని రామారావు కథలు మతాబాలు కావు హాండ్‌గ్రనేడ్‌లు అవి పేలి, వాటి శకలాలు చుట్టూ చాలా దూరం ధ్వంసం చేస్తాయి

కథలు చెప్పటంలో ఒక్కొక్కప్పుడు రామారావుది పురాణ పద్ధతి భారతంలో భీష్ముడు దుర్యోధనుణ్ణి ఘోషయాత్రకు వెళ్ళవద్దని ఒక్క ముక్క చెప్పి ఆగిపోడు, ఆ సందర్భాన్ని పురస్కరించుకుని కొన్ని పేజీలు మాట్లాడతాడు అది ఇవాళ మనకు బోరుకొట్టొచ్చు కాని భీష్ముడి సలహాకన్న ఆ ప్రసంగమే పరితకు ముఖ్యమని పౌరాణికుడి అభిప్రాయం అసలైన జీవితసత్యాలు అందులోనే ఉన్నాయి గోర్కీ రాసిన 'అమ్మ'ను ఒక పార్యగ్రంథంగా ఒక మిత్రుడు పేర్కొన్నాడు ఈ పుస్తకంలోని ''శాంతి'' ఒక పార్యకథ అని నేను పేర్కొంటాను

''శాంతి''కథను కావాలంటే మూడు పేజీలలో చెప్పొచ్చు, కాని ఆ మూడు పేజీల కథ ఎవరైనా రాయొచ్చు దానికి విశిష్టత ఏమీ వుండదు అందులోని ఆర్థిక - సాంఘిక రాజకీయ సత్యాలే ఆ కథకు ఆయువుపట్టు

కథపేరు ''శాంతి'', ఈ శాంతిని గురించి ఈ కథ ఏమంటుంది?

''శాంతి అహింస అనే పదాలను గందరగోళం చేస్తున్నారు (చాలామంది) గాంధీగారి (అహింస) ఉద్యమంవల్లకూడా దేశంలో బోలెడు అలజడి లేచింది మార్పు ఎప్పుడూ శాంతి మార్గాన వచ్చే అవకాశంలేదు

''కొట్టేచేతిని పట్టుకోడవము, తిట్టే నోటికెదురుతిరగడం కూడా శాంతికి భంగకరాలంటారు (చాలమంది) క్రూరమృగం నిన్ను పట్టుకుతింటోంది కదిల్తే కల్లోలం తప్పదు కదా, కదలకుండా భోంచెయ్యనియ్ అదేనా నువుకోరే శాంతి? బాకో, చాకో చూపి దోపిడిదొంగ నిన్ను దోస్తాడు తిరగబడితే రక్తపాతం తప్పదు అంచేత కిక్కురుమనకు అదేనా నువ్ చెప్పే శాంతివాదమంటాడు (కవి) ''

జీవితం నిలవుండదు, 'నిలవున్నపెరుగు పులుస్తుంది, పురుగులు పడుతుంది జీవితంమాట వేరేచెప్పాలా? మార్పు మంచికి జరిగినా, చెడుకు జరిగినా ఘర్షణ తప్పదు

అయితే మరి శాంతి నినాదం ఎవరిది? 'స్వేచ్ఛగా మసలడానికోయిల్లూ, కడుపు నిండా తినేందుకు తిండీ, కట్టేందుకు ఖరీదైనగుడ్డా అందినవాళ్లందరికీ శాంతి కావాలి ''

మరి శాంతికి నిర్వచనం? ''న్యాయమైన కోరికలు మేం (కార్మికులు) ఒదులుకోప్పోతే శాంతికి భంగం కలుగుతుంది తీర్చవలసిన కోరికలు వారు (యజమానులు) తీర్చప్పోతే శాంతికి భంగంకాదు శాంతియుతమైన సంప్రదింపుల్లో యింతకాలంవూ వారు మొరాయించింది అశాంతికి దారితీసేది కాదు చట్టసమ్మతంగా మేం రేపు సమ్మె చేయబోతే అది అశాంతికి దారి తీస్తుంది ఆ నిప్పురవ్వతో దేశమంతా మండిపోతుంది ''

దేశమంతా మండించడానికి పనివాడి చేతిలో ఉన్న ఆయుధం ఏమిటి? దానిపట్ల యజమానులవైఖరి ఏమిటి?

''యజమానులకుండే అంగబలం, అర్థబలంతో వాళ్లు కొనగల కోర్టుల్నీ, పోలీసుల్నీ, జైళ్లనూ వాళ్ల రక్షణకిచ్చింది యీ దేశంలో వున్న వ్యవస్థ ఏమీలేని పనివాడి చేతిలో ఒకే హక్కు - సమ్మెచేసే హక్కు - మిగిల్చింది రాజ్యాంగం ఆ సమ్మెచేసే హక్కును ఆయనగారు (యజమాని) తాకట్టుకోరేపద్ధతి - దొంగకావలివాణ్ణి, 'నీ కఱ్ఱ యిచ్చెయ్, నీతోటలో కోసుకున్న పళ్లు నీకు పెడతాననడం''

ఇంతకీ ప్రభుత్వం అవలంబించే అహింస ఎలాటిది?

''స్వతంత్రం వచ్చేక ఎన్నో చిన్న చిన్న ఉద్యమాలు నడిచేయి - భాషా రాష్ట్రోద్యమాలు, విద్యార్థుల అలజళ్లు, అధికారుల దౌర్జన్యాలకు నిరసనగా - పెరిగేధరలకు వ్యతిరేకంగా ప్రజలతో ఉద్యోగులతో నడిపినవి, ఉక్కు ఉద్యమం, హిందీ వ్యతిరేకోద్యమం వంటివి ఇవేవీ వ్యవస్థలు మార్చటానికి కాదు ప్రభుత్వాలను కూలదోయటానికికాదు (ప్రాంతీయ ప్రభుత్వాలను విజయవంతంగా కూలదోసే ఉద్యమాలు నడపటం పాలక వర్గం గుత్తహక్కు) - ఎంతకూ ప్రజలగోడు వినిపించుకోని నాయకుల ఉదాసీనతకు అలిగి, నిరసనగా నడిచినవి, అలాంటి వాటిని సహితం మాటిమాటికీ అహింసా మంత్రాన్ని జపించే నాయకులు, శాంతి సమరాల్లో కాకలుతీరిన రాజకీయ యోధులు ఏ పద్ధతిలో యెదుర్కొన్నారు?'' ఈ ఉద్యమాలలో నిరుద్యోగులు ఎంతమంది బలి అయారన్నది ఈ దేశంలో ప్రతి పిల్లవాడికీ చెప్పవలసినసంగతి

ఇదే వైఖరి సమ్మెలనుగురించి - రాజ్యాంగం ఒప్పుకునేవాటినిగురించి సైతం ఉన్నది ''సమ్మె చేస్తామన్నామే కాని యజమాని తలకొట్టి మిల్లు గుమ్మానికి వేలకడతామనలేదు అయినా మేం అంతమాట అనేసినట్టు గొడవజరుగుతోంది ''

ఈ అధ్వాన్న సరిస్థితికి మూలకారణం ఏమిటి? కల్లెక్టరురావు అంటాడు

''దేశంకోసం, జనం కోసం ఏదైనా చెయ్యవచ్చుననే వుద్దేశ్యంతో నేనిందులో కొచ్చేను (ఉద్యోగంలోకి), కాని అధికారానికీ స్వేచ్ఛకీ ఎన్నిపరిమితులన్నాయో ఇందులోకొచ్చాకే తెలిసింది, ''అంటే ఆయన యీ దేశంలో రాజకీయ నాయకులుగా చలామణి అయేవారు ఎంత అజ్ఞానులో విడమర్చి చెప్పేరు ''కనీసం ఎకనమిక్స్, హిస్టరీ, జాగ్రఫీలలోనైనా మన రాజకీయ నాయకులకు ఓనమాలు తెలియవు ఆ అజ్ఞానంలోనే వాళ్లు దేశానికి సంబంధించిన పెద్ద పెద్ద విషయాలమీద అభిప్రాయాలు ప్రకటిస్తారు శాసనాలు చేస్తారు పరిపాలనావ్యవహారాల్లో అడుగడుగునా అడ్డుతగుల్తారు రాజకీయాలపట్ల ఆసక్తి వున్నవాళ్లూ, నిస్వార్థంగా జనంకోసం పనిచేయగల విద్యావంతులూ వుద్యోగాలే చేస్తూంటారు ఏ ఉద్యోగాలకీ అర్హతలేనివాళ్ళూ, స్వార్థం తప్ప ఇంకే ప్రేరణలేనివాళ్లూ మాత్రమే రాజకీయాల్లో చేరుతున్నారు దేశంలో అన్నవస్త్రాలకరువుంది అది ఘోరమైందే కాని అంతకన్నా ఘోరమైంది - అటు ప్రజలగ్గాని, ఇటు ప్రభుత్వానిగ్గాని శాస్త్రీయజ్ఞానం పట్ల విజ్ఞానులపట్ల ఆసక్తి , గౌరవం లేకపోవడం''

ఇది పాక్షికసత్యం మాత్రమే కల్లెక్టరుగారు ''నడుమ సిరివచ్చి కలసిన పాడు బుద్ధు''లను మాత్రమే విశ్లేషించారు కాని వీళ్లకు సిరి కట్టబెట్టినవాళ్లు శిఖరాన ఉన్నారు

కల్లెక్టరుగారి మాటలు వాళ్లకు వర్తించవు వాళ్లు బఫూన్‌లు కారు మూఢులు కారు, శాస్త్రజ్ఞానం విలువ తెలియనివాళ్లూ కారు వాళ్లు తమ పథకాలను అమలు పరుచుకునేటందుకు ఏయే వెడగు బుద్ధులను ఎక్కడెక్కడ ఉంచాలో, శాస్త్రజ్ఞానాన్ని ఎంతవరకు ముందుకు నడిపించాలో, పేదజనాన్ని హింసాయుత జీవితానికి ఎలా అంటిపెట్టి ఉంచాలో బాగా అంచనాకట్టగలవాళ్లే అందుచేత అసలు రాజకీయ సామాజిక సమస్య ఒకటే

ఈ కథలో ఇంకా చాలా పరమసత్యాలున్నాయి మచ్చుకి - పెట్టుబడిదారు దృక్పథం

''దొంగిలించే దానికన్నా దోచితే చిక్కేది ఎక్కువ '' నిరపాయంకూడా

''పోటీ తలెత్తకముందే నువ్ పెరిగిపోవాలి ''

పెట్టుబడిదారు దేశంకోసం ఏదోచేస్తున్నాడనీ, దేశంకోసం దివాలా ఎత్తిపోయే పరిస్థితిలో తనను తాను పెట్టుకుంటున్నాడనీ ఒక వాదనవుండేది ఇది పెద్ద పెట్టుబడిదార్లకు వర్తించదన్న విషయం నేను నా అనుభవంలో చాలాసార్లు చూశాను ఈ విషయం ఇందులోకూడా ఉన్నది

''లోగడ మేనేజ్‌మెంట్ ఎంత అవకతవకగా నడిపినా అది (పరిశ్రమ) బతికి బట్ట కట్టింది ''

పెట్టుబడిదారుకూ కష్టాలు లేకపోలేదు

''(పెట్టుబడిదారు పట్టాభి) నాయకుల్నీ, ప్రభుత్వాన్నీ అదరగొట్టగలిగేడు తన చేతికింది పనివాళ్లను మాత్రం చేతికిందకు తేలేకపోయాడు '' కారణం వాళ్ల నాయకుడు విశ్వనాథం ఏ పార్టీకో అంటిపెట్టుకున్నవాడైనా అంత ఇబ్బందిలేకపోను ఏ బంధనాలు లేకపోవడంవల్లా మొత్తం యూనియనంతా ఒక్కటిగా అతని వెనక ఉండడం వల్లా ఆ మనిషి ఒంటినిపట్టిన పీడలా వేధిస్తున్నాడు ''

పెట్టుబడిదారుకు ''సర్వైవల్'' ముందు! దానితరవాతే సిద్ధాంతాలన్నీ '' అదే పీడకవర్గం పరిస్థితిలో ఉన్న పెద్ద దౌర్బల్యం పీడితవర్గాల ''సర్వైవల్'' గట్టిగా సిద్ధాంతాల పునాదిమీద ఆధారపడి ఉంది అందుకే పాపం బూర్జువా డెమోక్రాట్‌లు బెదిరినప్పుడల్లా డెమోక్రసీకి తిలోదకాలిస్తారు పుస్తకాలను నిషేధిస్తారు నిరాయుధుల మీద కాల్పులు చేయిస్తారు వాళ్లు పైకి చెప్పే సిద్ధాంతాలు వాళ్ళని ఆదుకోవు

ఈ కథలో ఇంకా అనేకరకా సత్యాలున్నాయి

''బతకవలిసే జీవికి బాలారిష్టాలు చేసే మేలు ఇంతా అంతాకాదు , లక్షతయ్యారీలూ, వాక్సీనులూ చేయ్యలేని పని ఒక్క జబ్బు చెయ్యగల్దుగదా '' మాట విద్యాధికులలో ఎందరికి తెలుసు?

''సామ్రాజ్యాలు స్థాపించడం కష్టం కాదు, ఏలడంలో ఉంది అసలు కష్టం ''

''కూర్చునే కొమ్మను నరికేజాతి అన్ని కాలాల్లోనూ, అన్ని దేశాల్లోనే ఉంది ఈ దేశం ప్రత్యేకత ఏమిటంటే దాని నాయకత్వానికి ఇంకోదేశం నుండి ఆదేశాలు రావాలి''

''డెమోక్రటిక్ దేశాల్లో పగ్గాలన్నీ ప్రభుత్వం చేతిలోనే ఉండవుకదా? అదొక్కటే ఉన్నంతలో కొంత సుగుణం'' - పెట్టుబడిదార్లకు కాని ప్రజలు మేలుకుంటే ఈ పెట్టుబడిదార్లే డెమోక్రసీకి స్వస్తి చెప్పి, ఫాసిస్టు రాక్షసత్వంనుంచి రక్షణపొందగలరు వారి ''రాజు''కు చాలా కాపులున్నాయి

''వాళ్ల (కార్మికుల) దృష్టిలో పెట్టుబడిదారు పట్టపగలు గుట్టుచప్పుడు కాకుండా దోచే దోపిడీదొంగ, జనంతాలూకు అజ్ఞానంమీదా, ఆకలిమీదా, ఆరెంటిబాధా లేనివాళ్లలో తన ప్రభావం ద్వారా నాటి దురాశమీదా బతికే రాక్షస జంతువు, దాని అంట్లగిన్నెల కోసం కక్కుర్తిపడే మధ్యతరగతివండే వంటమనిషీనీ, పెట్టేచేతనీ గుర్తించదు

ఈ సందర్భంలో చెప్పబడిన మధ్యతరగతికి సామ్యంగా ఇదే కథలో పట్టాభిగారి కుక్కలు సజెస్ట్‌కావటం గమనార్హం పట్టాభి కుక్కలు - కనీసం వాటిలో ఒక అల్సేషియన్ - వంటమనిషిని చూసి, ''తిండి పెట్టే మనిషికదా - అనుమానం వేస్తే ఆమెను చూసి కూడా మొరుగుతుంది!''

ఒక కథలో ఇలాటి వాక్యాలు ''కోట్'' చెయ్యటానికి ఉండటం సాధ్యమా అని కథ చదవనివారికి ఆశ్చర్యం కలగొచ్చు ముందే చెప్పినట్టు, ఇది ఒక పొరంలాటికథ

''వీరుడు- మహావీరుడు'' చిన్న కథ గొప్ప నీతిగల రసవత్తరమైనకథ

''శ్రీరామనవమి సంబరాల్లో గంజిపేట రౌడీకీ అల్లిపురం వస్తాదుకీ 'టగ్గాఫార్' పడింది ఇద్దరూహోరాహోరీ కొట్టేసుకుంటున్నారు అల్లిపురం వస్తాదు సెట్టంత మనిషి అడు ఒక్కొక్క గిల్లంతా యిస్తే మూడు మూడు పిల్లి మొగ్గలేస్తున్నాడు ఈ గంజిపేట గుంటడు పడి వూరుకోడే 'లంజకొడకా! కొడతావురా, చిన్నోణ్ణిచేసి కొడతావా? ఇడిపించటానికొచ్చి కొడతావా? నీ నెత్తురు కళ్ల జూస్తాను' అంటూ మళ్లా మళ్లా పైకొస్తాడు గొప్ప పౌరుషంలే మనిషిసూస్తే వస్తాదులో నాలుగోవంతుకాదు, పదోవంతైనా ఉంటాడా అనిపిస్తాడు ఈడు ఆడితో దెబ్బలాడడమంటేమాటలేటి? అందులోను అంతకుముందొకడితో కలబడి కొంత చిదిగున్నాడు అయితే మనిషికా ఫైటింగ్ స్పిరిటు వొక్కొక్కప్పుడిలా వొచ్చేస్తాది ఎలాటప్పుడు? 'న్యాయం నీ పక్కనుండాల, అవతలోడు ఫౌలుగేమాడాలి అదేమంటే, దౌర్జన్యానికి దిగాల జనం అవతలోడిబలానికి జడిసి అన్యాయానికి నోరెత్తకుండా వున్నారని నువ్వు గ్రహించాల ఆ జనం పిరికితనం చూసి ఆడిజులుం మరీమరీ పెరిగిపోతుండాల''
సరిగ్గా అలాంటైంలో వోచ్చేడు కొత్తపేటశాండో వచ్చి 'ఏటది?' అన్నాడు అమాంతం ఎళ్లి ఆడి కుడిచెయ్యి టక్ని అందుకున్నాడు పట్టుకున్న ఆ చెయ్యి ఎనక్కి తిప్పుతూ అన్నాడు ఎవడితో? గంజిపేట రౌడీతో, అంటే దెబ్బలుతింటున్నావాడితో, ఏమనీ? ' ఇంక శాంతించు '' మెలిదిప్పినచెయ్యి సరిచేసి పట్టుకుని, చెయ్యితోపాటు శవంలాటి ఆ మనిషినీ ఒక్కదుట్న యెనక్కులాగి ఒకిసురు ఇసిరేశాడు శాండో, ఆ దెబ్బకు మూడంతర్లు కొట్టి తెరిచిపెట్టిన అల్లిపురం వస్తాదు కబంధహస్తాల్లో పడ్డాడు రౌడీ అడికి తగినపని చేసే నన్నట్టుగా వెన తిరిగైనా చూడకుండా వెళ్లిపోయాడు శాండో ''

కథ యింతే కాని ఈ కథకుసంబంధించిన విశ్లేషణా, ఒకానొక పాత్ర చిత్రణ ఈ కథకు అసలైన ఆయువుపట్టు

ముందు విశ్లేషణ

''మీరు నేను తన్నుకుంటుంటే ఇంకోడోచ్చి యింట్రఫియరవడం, అలాటప్పుడు చుట్టూ ఉన్న జనం చూస్తూ వూరుకోడమా? ఆడు వొస్తాదైతే? ఆడు ఒక్కడు జనం వందమంది తలో చేయీ ఏసేస్తే ఏమవుతాడు వస్తాదు కాదు ఆణ్ణి పుట్టించిన జేజెమ్మయినా భూమిలోకిదిగడిపోతాడు అదేంకాదుట, కోడిపుంజులో గొర్రెపొటేళ్లో కుమ్ముకుంటూంటే సూస్తారూ'' అలా సూస్తన్నారు జనం

''శాండో ఎందుకీణ్ణి సైడుచెయ్యలేదు? ఈళ్ళిద్దరూ అల్లిపురం వస్తాదుని కొట్టలేరనా? ఆడు ఊఁ అంటె ఆడెనకున్న శిష్యులే భక్షించేస్తారు అయితే అంతతో పోయిందేటి? అల్లిపురంలో యింకేవస్తాదుల్లేరా? గొప్పకిపోయి ఆర్తజనత్రాణమూ, అండర్‌డాగ్‌పక్షమూ అన్నాడంటే అప్పుడు కొత్తపేట శాండోల్నందర్నీ దింపాల ముగ్గులోకి, దింపేడో పుచ్చెలెగిరిపోతాయ్ పోలీసులొస్తారు ఒకటాగొడవ? రెండో వొరల్దువారే! టౌన్లో హేమాహేమీలంతా యిన్వాల్వవాలసొస్తది కొత్తపేట శాండో అందుకే 'నేగ్గా' ఆ గొడవ అలాగే పీస్‌ఫుల్‌గా సెటిల్‌చేసేశాడు (పీస్‌ఫుల్‌గా అన్న మాట లక్షలు చేస్తుంది!)

''అయితే ఇక్కడోసిన్న పోయింటుంది అదే, ఆడిఒంటికి మొప్పంవస్తే అడుఅలాగ ఒగ్గేసునా? ఒగ్గడు, నిజమే అప్పుడాడి పేటోళ్లనందర్నీ పిలుస్తాడు అసలాడు పిలవక్కర్లేదు

ఆడి బక్తులు అగ్గిలో దుకేస్తారు బిగ్‌పవర్‌లో ఉన్న ఆకర్షణే అది ఏలెవెల్లోనైనా బిగ్గా స్మాలూ తేడాలు వుండనే వుంటాయి

''కొత్తపేట శాండోలాజిక్కు మనకందదుగాని అందితే అదే సరైనదనిపిస్తాది నన్నడిగితే గంజిపేట నీరుడికి ఆ మర్యాదలా జరగవలసిందే లేప్పోతేనేం ప్రమాదం అలాటోళ్లు ఏటనుకుంటారంటే, జనం సూజూస్తూ అన్నేయాలు జరగనిస్తారా? అనుకుంటారు అనుకుని - 'న్యాయం ధర్మం' - పెద్దపెద్ద కబుర్లతో చిక్కుల్లో పడతారు పడి 'నైసీనులు సృష్టిస్తారు'

ఇలా విశ్లేషణం చేసిన పాత్ర అన్నిటికన్నా కథకు ముఖ్యమైనది ఇతగాడి కథ చెప్పేవాడుకూడా కొట్లాటజరిగేచోట చేరిన జనం గురించి చెబుతూ, '' ఆళ్లమద్దె నేనే కసింత నదరైన మనిషిని'' అని చెప్పుకుంటాడు విషయమంతా తెలుసుకున్నాక 'సెప్పొద్దూనాకు మాచెడ్డకోపం వచ్చింది తంతున్నవాడిమీదకాదు - తాపులు తింటున్న వాడిమీదకాదు చూస్తున్న జనం మీద చెప్పకేవిఁ ఆడి (గంజిపేట రౌడీ) పౌరుషం తల్చుకుంటే నీకిప్పటికీ ఒళ్లు జల్దరిస్తుంది గొప్ప పౌరుషంలే ఒక్కొక్కసారి (చూస్తున్నంతసేపూకాదు!) ఏఁవనిపించీది తెలుసా ఏఁధైతదైంది ఎళ్ళి నేనూ వస్తాదు గాడిమీద కలియ్‌బడిపోదునా అనుకునేవాణ్ణి కాని కుదరదు ఏంచేత? ఏసుకున్న 'టెర్లిన్ బట్టలు సిరిగిపోతాయ్ ఎన్నడూ దెబ్బలాడి నోళ్లంకాం ఆడుసూడమోతే వస్తాదు దెబ్బలాడ్డమే ఆడి బిజినెస్సు సుఖాన్నున్న ప్రాణం దుఃఖాన పెట్టుకోడం తప్ప లాభవేటీ'

ఈ పాత్రకుండే అంతరాత్మను మొత్తని రబ్బరుతోచేశారు అందరూ దెబ్బలు తిన్నవాణ్ణి తుంతుంటే, ''ఆడిమంచి కోరేనేనూ ఆడి మీద ఒ చెయ్యేసేసేను'' అని కథ ముగిస్తాడు

వీణ్ణి నీచుడంటామా? అమెరికావాళ్లు వియత్నాంలోచేసే పైశాచిక కృత్యాలను సమర్థించే మన ఘరానా మనుషులకంటె వీడు నీచుడా?

ఇటువంటి కథను కాళీపట్నం రామారావే రాయాలి

''కళ అనేది మానవ స్వభావం'' అనిబర్క్ నిర్వచించాడట

రామారావు కళ అయినా స్వభావాన్ని చిత్రించే విధానాన్ని బట్టి ఆయన స్వభావాన్ని గ్రహించవచ్చు రామారావులో వెన్నలాటి మృదుత్వమూ, కార్చిచ్చులాటి తీవ్రతా ద్రావకంలాగా అతి సూక్ష్మమైన జాగాలలో ప్రవేశించేశక్తీ ఉన్నయి ఈ గుణాలన్నీ ''చావు''కథలో స్పష్టంగా కనిపిస్తాయి

ఈ ''చావు'' కథ జీవంతో తొణికిసలాడుతుంది మధ్యతరగతికి సంబధించిన జీవం కాదు, మాల పేటకు సంబంధించిన జీవం ఎన్నిసార్లయినా చదవబుద్ధిపుట్టే ఈ కథ నాకు చాలా విషయాలు స్ఫురింపజేసింది

మధ్య తరగతి రచయిత ఇలాంటి కథను ఇంత ''ఇంటిమేట్''గా రాయటం ఎలా సాధ్యం?

మాలపేటలో పుట్టిపెరిగినవాడికి ఈ కథలోని విషయాలు తెలిసి ఉండవచ్చు - కాని ఆ విషయాలను రాయగలగటం అంతగాసాధ్యం కాదు

అట్టడుగు జీవితం గురించి రాయాలని విరసం కథకులు నిర్ణయాలు చేస్తున్నారు రాయటానికి ప్రయత్నిస్తున్నారు అట్టడుగు జీవితం గురించి రాసిన మాత్రాన అది పాఠకుడి

అనుభూతి అయిపోయేటట్లు చెయ్యటం సాధ్యమా? ఈ కథ ఆపని చేస్తున్నది. పుస్తకంలో సగానికిపైగా ఆక్రమించుకున్న ఈ కథ చదివినంతసేపూ పాఠకుడు మాలపేటలో ఉండి ఆ జీవితంలో మునిగి తేలుతాడు.

మధ్యతరగతి కథకుడు మధ్యతరగతి జీవితం గురించికూడా ఇంత ''వివిడ్''గా రాయటం చాలా అపూర్వమైనవిషయం.

All art is contajious అని ఏ నలభై ఏళ్ల క్రితమే విని ఔననుకున్నాను. కాని పట్టుకుని వదలని రచనలుగా అనుభవంలో చాలా కొద్ది. ఆ కొద్దిలో కాళీపట్నం రామారావు కథలున్నాయి.

''చావు''లో కథ టూకీగా ఏమిటంటే;

పేటలో ఒక ముసలిది చచ్చింది. శీతాకాలం, పేటవాళ్లు నాలుగుడబ్బులు సంపాదించుకునేరోజులు. రాత్రికి రాత్రి శవాన్ని దహనమో, ఖననమో చేసి, మళ్లా తెల్లారు జామునే పేటంతా పనుల్లోకి పోవాలి. ముసలిదాన్ని పాతెయ్యటం గడియపని. కాని అందుకు అభ్యతరాలున్నాయి. శవాన్ని పాతేస్తే ప్రాణి దానిచుట్టూ తిరుగుతుందని కొందరి మూఢవిశ్వాసం. దహనం చెయ్యాలంటే కట్టెలు కావాలి. అవి దొరకవు. అర్ధరాత్రిపూట ఎవరిని లేపి కట్టెలు ముష్టెత్తుతారు? ఎత్తినా ఎవరు ''అయ్యో, పాపం:'' అని యిస్తారు. కట్టెలు ఎత్తుకురావచ్చు. అందుకు పాపభీతి. మనిషిభీతీకూడా అడ్డంవస్తాయి.

తీగెకదిలిస్తే డొంకంతా కదిలిందన్నట్టు, ముసలిదాని శవం మీదుగా అట్టడుగువాళ్ల మొత్తం జీవితమూ, వాళ్ళ మధ్య సహకారభావమూ, విభేదాలూ, వారి మూఢవిశ్వాసాలూ, వాస్తవసమస్యలూ సూక్ష్మాతిసూక్ష్మంగా, హృదయాలలో గుచ్చుకునేలాగు ఈ కథలో చర్చించబడ్డాయి.

దారిద్ర్యమూ, బాధా, సాంఘికదోపిడీ, అజ్ఞానమూ చిత్రిస్తే జుగుప్సాకరంగా ఉంటుంది గనక అట్టడుగు జీవితం గురించి రాయరాదనే సిద్ధాంతం ఒకటి ప్రచారంలో ఉన్నది. ఆ సిద్ధాంతానికి ఈ కథచెంపపెట్టు, ఇది సౌందర్యంతో తొణికిసలాడే కథ అని బాధ్యతాయుతంగా చెప్పగలను. ఈ సౌందర్యానికి వెనక కవితేలేని వాస్తవికతా, స్వభావ చిత్రణా, పురోగమనానికి అవసరమైన భావచైతన్యమూ తీర్చిదిద్దినట్టున్నాయి. అసమర్థుడైన రచయిత చేతిలోపడితే ఈ పాత్రలూ, వారి మనసత్తత్వాలూ ఎలా ఛిద్రించి ఉండేవో తలుచుకుంటే భయంవేస్తుంది.

అభ్యుదయ కాముకులందరూ మాలపేటల్లోకివెళ్లి వారి జీవితంలో పాల్గొనలేక పోవచ్చు. వాళ్లు ఈ కథ మళ్ళీ మళ్ళీ చదివి అంత అనుభవమూ పొందవచ్చు. ఇంతకన్నా ఈ అమోఘరచనగురించి వివరించటం నాకిష్టంలేదు.

*సృజన, జూలై, 1972*

# 64. బ్రౌన్ జాబులు (1832-1857)

బంగోరె మాటలలో

" నాలుగు యూనివర్సిటీలు, పద్నాలుగు ఎకాడమీలు, సవాలక్ష సమితులు, ఘనత వహించిన ఐరావతం వంటి ప్రభుత్వం ఈ ఇరవై అయిదేళ్ళలో చేయలేనిపనిని బ్రౌన్ ఒక్కడు ముప్పయి ఏళ్లలో చేసిపెట్టి పోయాడు బృహన్నిఘంటువులు సమకూర్చి పెట్టి పోయాడు మహాభారతం మొదలు, మనుచరిత్ర, వసుచరిత్ర వంటి ప్రబంధాలదాకా, వేమనపద్యాలు, సుమతి శతకం మొదలు తాతాచార్యుల కథలు వంటి 'సలీసు' గ్రంథాల దాకా, వందలాది తెలుగుకావ్యాలు, కథలు కాలగర్భంలోకలిసిపోకుండా పునరుద్ధరించి పెట్టిపోయాడు తాటియాకుల్లో తప్పులు తడకలుగా ఉన్న కావ్యాలకు మోక్షం కలిగించి, శుద్ధ ప్రతులు తయారుచేయించి పోయాడు పండితులను నియమించి వ్యాఖ్యలు వ్రాయించాడు ఒక్కమాటలో చెప్పాలంటే తేజోవిహీనంగా ఉన్న తెలుగు వాఙ్మయానికి పునర్వికాసద్వారాలు తెరిపించి పోయాడు బ్రౌన్

" 140 ఏళ్ళ క్రితం పునాదినుంచి నిర్మించుకొంటూవచ్చి ఆయన ఇంతపనిచేసి పోయాడు "

"బ్రౌన్ గీచిన గిరిదాటి మనం నేటికీ ఒక్క అడుగైనా ముందుకు వేయలేక పోతున్నామనుకోవలసి వస్తున్నది తన జీతంలో ముప్పాతిక మువ్వీసందాకా తెలుగు సాహిత్య పునరుద్ధరణకే ఖర్చుపెట్టిపోయాడా అనిపిస్తుంది మద్రాసులో ఓరియంటల్‌మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ మొత్తంలో దాదాపు మూడింట రెండు వంతులదాకా ఆక్రమిస్తున్న బ్రౌన్ సేకరణలను పరిశీలిస్తే ఎవరికైనా ఈ భావం కలక్కపోదు "

బ్రౌన్ జాబుల విషయానికి వస్తే -

"బ్రౌన్ సేకరించిన జాబులు 16 సంపుటాలు దగ్గరదగ్గర 6వేల పేజీలున్నాయి తెలుగుదేశపు నాలుగు చెరగులనుండి పండితులు, పామరులు, ముక్కు మొగం తెలియనివాళ్లు వ్రాసినవీ, అడపాదడపా ఆయన ప్రత్యుత్తరం వ్రాయించిన నకళ్లూగాక, వివిధ జిల్లాల కలెక్టర్లకూ, జడ్జీలకు క్రింది ఫాయానౌకర్లూ, ఉద్యోగస్తులు, సామాన్యజనం వ్రాసుకొన్న అర్జీలు విజ్ఞాపనలు, అంతేగాక ఆనాటి తెలగు వారు స్త్రీలు పురుషులు వ్యక్తిగత పరిధిలో వ్రాసుకున్న సంసారపక్షపు జాబులు, కొన్ని సమకాలిక తెలుగుపత్రికలలో వచ్చిన సంపాదకలేఖలు, వార్తలు, వ్యాఖ్యలు ఎన్నింటినో ఆయన కాపీ చేయించి క్రోడీకరించి పెట్టిపోయాడు ఈ జాబుల వైశాల్యం 1790 నుండి 1854 దాకా "

మహాసముద్రంనుంచి బంగోరె ఎన్నుకున్నది తెలుగు జర్నలిజంకు సంబంధించిన కొన్ని జాబులను - 1832 నుంచి 1857 - మాత్రమే వీటిలో వ్యక్తమయే తెలుగు జర్నలిజం చరిత్రే ఈ గ్రంథం సారాంశం

తెలుగులో అచ్చుపని 1806 ప్రాంతంలో ప్రారంభమయిందనీ, 1830 దాకా అందులో ఎదుగూ బొదుగూలేదనీ, 1835 నాటికి (ఇంగ్లీషువారు నడిపినవిగాక) హిందువులు నడిపిన ప్రెస్‌లు కనీసం 8 ఉండేవనీ, తెలుగు, తమిళపత్రికలుండేవనీ, బ్రౌన్ అన్నాడు

1832 జనవరి 4న ఫోర్ట్‌సెంట్ జార్జ్ గెజెడ్ ప్రచురణ ఆరంభమయింది

1833లో తొలి తెలుగు, తమిళపత్రిక వెలువడినట్టు దివరెండ్ జె లాంగ్ అనే ఆయన రిపోర్టు, ''ఆ తెలుగుపత్రిక ఊరు పేరేమిటో తెలియదు''

''మనకు తెలిసిన మొదటి తెలుగుపత్రిక ''వృత్తాంతిని'' దీన్ని గురించిన ప్రస్తావనలు బ్రౌన్ జాబుల్లో ఉన్నాయి ఈ పత్రికమీద ప్రభుత్వం 1838లోనే నిఘాపెట్టింది అందుచేత ఇది కనీసం 1838లో ప్రారంభమై 1841 దాకా నడిచింది ఇది ఆగిపోతూనే ''వర్తమాన తరంగిణి'' (1842 జూన్ 8న) పుట్టింది ఈ పత్రిక నుంచి ఎన్నో జాబులు, వృత్తాంతాలూ, వార్తలూ, విశేషాలూ కాపీచేయించి బ్రౌన్ భద్రపరిచాడు తన నిఘంటువులో కొన్ని మాటలను ఈ పత్రిక నుంచి తీసుకున్నాడు (అప్పటికి గ్రాంధికభాషావాదం పుట్టలేదు వ్యావహారికభాషా, ప్రాంతీయాలూ పుష్కలంగ రచనలకెక్కేవి )

''వృత్తాంతిని''లో బ్రౌన్ వద్ద ఉండిన జ్యోతిషగ్రంథాల, వైద్య శాస్త్ర గ్రంథాల వివరాలు పడ్డాయి ఆమీదట రాజమహేంద్రవరం కాపరస్తుడయిన బొమ్మరాజు నాగేశ్వరరావు అనే ఆయన ''ది 8 శపటంబరు 1839 సం॥''న ''మహారాజశ్రీ సీ పీ బ్రౌన్ యిస్కోయరు ( ఎస్క్వైర్) దొరగారి సుముఖానకు'' ఒక జాబురాస్తూ, బ్రౌన్ వద్ద ఉన్న అయిదు జ్యోతిష గ్రంధాలను నకళ్ళురాయించి, బంగీ పోస్టుద్వారా పంపమని కోరాడు అదే ఉత్తరంలో తనవద్ద ఉన్న జ్యోతిషగ్రంధాల పేర్లు చెప్పి, వాటిని బ్రౌన్‌కు పంపుతానన్నాడు

జర్నలిజంతో ముడిపడినవే రీడింగ్ రూములు రాజమండ్రిలో జడ్జిగా పనిచేసిన జేమ్స్ టామస్ 1839లో రాజమండ్రిలో ఒక రీడింగ్ రూమ్ స్థాపించాడు అందులో చిన్న ఇంగ్లీషు, తెలుగు పుస్తకాలూ, పత్రికలూ ఉండేవి రోజుకు వందమంది వచ్చి అక్కడ చదివేవారు చిత్రమేమిటంటే ఆ తరవాత దాదాపు 30 ఏళ్లకు విశాఖపట్నంలో మొదటి లైబ్రరీ స్థాపించినట్టు ''తెలుగు సంస్కృతి'' సంపుటంలో రాసి వున్నది

జేమ్స్ టామస్ భార్య ఇంగ్లండుకు రాసిన ఉత్తరాలలో తన భర్త స్థాపించిన రీడింగ్ రూమ్ గురించేగాక, మద్రాసునుంచి వెలువడే తెలుగు పత్రిక ('వృత్తాంతిని') గురించి 1839 జనవరి 10 నాటి ఉత్తరంలో ఇలా అన్నది

''చాలా చిత్రమైనది రచనలు ఇంగ్లీషునుంచి తర్జుమా అవుతాయి చెత్తసరుకు ఉదాహరణకు రాణిగారి పడక వర్ణన, అడవి చాపమీద, పైన ఏమీ కప్పుకోకుండా పడుకుంటుందిట! ఇటీవల సంచికలో మద్రాసు గవర్నరు ఇచ్చిన విందు వివరాలున్నాయి దానికి చాలామంది దేశీయులు ఆహ్వానించబడ్డారట ''

ఈనాడు పత్రికలలో బాక్సులు కట్టివేసేవి ఇంతకన్న ఘనంగా ఉన్నాయా?

బ్రౌన్ లేఖలలో ''వృత్తాంతిని'' కి ఒక పాఠకుడు రాసిన లేఖ ఉన్నది అందులో ఆయన పెళ్లిళ్ళలో జరిగే దుర్వ్యయం గురించీ, 'దాసీ'ల నృత్యాలు ఏర్పాటు చెయ్యటం గురించీ రాశాడు ఈయన వాస్తవదృష్టి గలవాడుగా కనిపిస్తాడు తన లేఖ (15-2-1841) చివరలో ''యీ కాకితము చదివేవారు తోడుతోనే తమ యింట్లో పెండ్లి ప్రయోజనాలు వస్తే కచ్చేరియుంచడము యిప్పుడే మానుతారని నేను యెంచలేదు గాని దినం పేరట, యిందులో వ్రాసియుండే సంగతులు యెంచుకొని కచ్చేరి యుంచక మానుతారనే యెడల నేను సందేహిచలేదు'' అన్నాడు

ఈ పెద్దమనిషి కచేరీలలో ఆడే ''దాసీల'' పట్ల చాలా ఔదార్యం కూడా చూపాడు ''15 సంవత్సరాలకు మునుపు కచ్చేరీలకు వచ్చేవారు నాట్యమాడుతూ యుండే దాసీకి రూపాయలు వేసే మర్యాదకద్దు నర్తనము చేసేదానికైనా యేదైనా ప్రయోజనము కద్దా అనిచూస్తే, కచేరికి వచ్చినవారు రూపాయీలు వెయ్యక వెళ్లిపోయినారు మర్యాదలను తప్పి సభలో నిలుచుండి సౌజ్ఞలచేతనున్ను, యుక్తులచేతనున్ను కొన్ని హాస్యాల నంతా బయలుచేసి, లజ్జవిడిచి, మానముచెడి ఇంత కష్టపడ్డవెనుక ఇంటి యజమానుడివద్దకివెళ్లి దేహీ అని అడిగితే అతనికి యిష్టం వచ్చినమట్టుకు ఏమి ఇచ్చినా తీసుక్కు పోతున్నారు గనుక వీరికిని కష్టానికి తగిన ఫలప్రాప్తి లేదు'' అన్నాడు

గిడుగు రామమూర్తిగారు ఈ జాబును తన 'గద్యచింతామణి'లో ప్రచురించారట

''వృత్తాంతిని'' నిలిచిపోయి ''వర్తమాన తరంగిణి'' వచ్చింది ఈ పత్రిక ప్రస్తావన బ్రౌన్ జాబులలో విశేషంగా కనిపించటమేగాక, ఈ పత్రిక తొలి సంవత్సరపు (1842-3) ఫైలునుకూడా భద్రంచేశాడు బ్రౌన్

1847 జనవరిలో ఈ పత్రిక బ్రౌన్‌కు పుస్తకాలు అచ్చువేసే పని పెట్టుకుని, మహాభారతం అచ్చువేసిపెట్టింది ఈ సందర్భంలో, తొలి భారతముద్రణ ఎప్పుడు జరిగిందన్న సమస్యగురించి ఖండవల్లి లక్ష్మి రంజనం, దివాకర్ల వెంకటావధాని ప్రభృత పండితులు కొనసాగించిన, 'కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల బొక్కసాలనుండి గ్రాంట్లుగా లభించిన లక్షల రూపాయల మ్రింగివేసిన ''ఆంధ్ర మహాభారత సంశోధిత ముద్రణ ప్రతిపథకం'' చూస్తే, ''బ్రౌన్ భద్రపరచి పోయిన ఈ పత్రిక ఫైలును చూడాలనే ధ్యాసే ఈ పండితులకు లేదు,'' అని బంగోరె ఆక్షేపణ

ఈ పుస్తకంలో ''ఆనాటి నక్సలైట్లు'' అన్న ఒక చిన్న విభాగం ఉన్నది ఇందులో 1843 నాటి ఒక అయిటమూ, 1847 నా మరొక అయిటమూ ఉన్నాయి మనకు వీటి ప్రాముఖ్యం ఏమిటంటే, 1857 కు పూర్వం ఉండిన స్థితిని ఇవి సూచిస్తాయి 1857లో బ్రిటిషువారిమీద జరిగిన తిరుగుబాటు బ్రిటిషువాళ్ళు సిపాయిల కలహం అన్నారు మనవాళ్లు తొలి స్వాతంత్ర్య సమరం అన్నారు మార్క్సిస్టు దృక్పథంలో అది రైతులు సాగించిన విప్లవం వారికి నాయకత్వం వహించటానికి చమురుకాళ్ల ఫ్యూడల్‌లు తప్ప లేకపోవటంలో అది విఫలమయింది అందుచేత, ఈరెండు అంశాలలోనూ ఉదహరించిన వ్యక్తులను ''నక్సలైట్లు'' అనటంలో బంగోరె అవగాహన పూర్తిగా రైటుకాకపోతే ఇక్కడ ఒక్కందుకే బంగోరెను తప్పుపట్టాలి 1843 ఉత్తరం ముందువేసి, 1847 ది తరవాతవేస్తే ప్రభుత్వ దృక్పథంలో కలిగిన పరిణామం కళ్లకుకట్టినట్టు కనిపించి ఉండేది చూడండి

''కడపజిల్లాలో చేరిన వక గ్రామమందుండే రహితు విషయములో ఆ గ్రామ కరణం (ఒకానొక వేతనశర్మ) కొన్ని అక్రమములను జరిగించి అతణ్ని పారాలో వుంచినందున గర్భిణిగా నుండిన అతని భార్య యీ కరణం వద్దకి వచ్చి తన పెనిమిటిని విడిచిపెట్టమని అడిగినంత అతను ఆ ప్రకారం జరిగించనందున సదరు స్త్రీ వుదాసీనముగా మాటలాడెను అంతట ఆ కరణానికి కోపమువచ్చి ఆ స్త్రీ కడుపుమీదతన్నగానే కొన్ని నిముషములకు అది మృతి బొందెను తరువాత దాని పెనిమిటి హెడ్డాఫ్ పోలీస్ వారివద్దనున్న మెజస్ట్రేటువారివద్ద నున్న ఫిర్యాదు చేసుకున్నంతట యీ అధికార్లవల్ల న్యాయం చిక్కనందున చెన్నపట్టణముకు వచ్చి గవర్నరుగారికి అర్జీయిచ్చుకొనెను ఐతే ఆ అర్జీకి జవాబు పుట్టనందున ఈ ఫిర్యాది గవర్నరుగారు సవారి వెళ్ళుతూ వుండగా బండిని అడ్డగించుకొని గుఱ్ఱముల లగాములను

...ట్టుకున్నంతట యితణ్ని మెజిస్ట్రేటు వారి వద్దకు అంపిరి అంతట మెజిస్ట్రేటు వారియెదుట యీ ఫిర్యాది చెప్పిన సంగతులు న్యాయానుగుణంగా వున్నందున యీ విషయములు కడపజిల్లా కలకటరుగారికి పోలీసు వారు వ్రాసి అంపినట్టు కనుపడుచున్నది యిందున గురించి ఈ ఫిర్యాదికి న్యాయం కలుగునని నమ్ముచున్నాము ''

*-వర్తమాన తరంగిణి, 1843, జూన్ 29*

దీని అనంతరం నాలుగేళ్లు పూర్తిగా నిండక మునుపే మరొక సంఘటన

''ఈ మే నెల 18 తేదీ మంగళవారమునాడు మన గవర్నమెంటు ఆలోచన సభాధ్యక్షులు సుమారు 12 ఘంటలకు సభాస్థలియందు వచ్చి ప్రవేశించేటప్పుడు ప్రథమ ఆలోచనకర్తయైన మోస్టు నోబల్ గవనరు మార్క్విసాఫ్ ట్విడేల్‌గారు సదరణే గవరన్‌మెంట్ హజారమువద్దకి వారి రథము(?) దిగి కాలి నడకన వెళ్లేటప్పుడు కింది యుద్యోగస్తుల వల్ల అన్యాయము పొందిన నొక వ్యాజ్యకాపు యెన్నిమార్లు అధికారులకు అర్జీ యిచ్చికొన్నప్పటికిన్ని జవాబు లేకపోవుటచే గవనరుగారి యెదిటికి తను పొందిన అన్యాయమును చెప్పుకోవలెనని ప్రాణభీతిని పోగొట్టుకోబడిన వాడై బహు ధైర్యముతో హజారము వద్ద పోవుచుండే గవనరుగారితో సంధించిపైబడి - గవనరుగారి మొలకట్టులో చెయిపెట్టి పట్టుకొని న్యాయము చెప్పి పొమ్మనుమని వదలకపోయినందున ప్రాణమును తెగించిన వ్యాజ్యకాపు న్యాయాన్యాయమును విచారించకుండా జయిలుఖానాకు పంపించినట్టు విన్నాము

*- వర్తమాన తరంగిణి, 1847 మే 27*

ఈ రెండు వార్తలనూ ఈ క్రమంలో చదివితే ''పరిణామం'' బోధపడుతుంది రైతులకు చిన్న పెద్ద ఉద్యోగులంతా ద్రోహం చేసిన వాళ్ళే అగ్ర పాలక వర్గం పట్టించుకోలేదు కాలం గడిచేకొద్దీ పీడితులలో తిరుగుబాటు తీవ్రత పెచ్చింది, వారికి న్యాయం జరుగుతుందని పత్రికలు ఆశించే అవకాశం తగ్గింది

పై రెండూ వ్యష్టి తిరుగుబాట్లేగాని విప్లవోద్యమాలు కావు అంతమాత్రాన వారు వీరులు కాదనగలమా ఈ కాలపు నపుంసక జర్నలిస్టులలాగా కాకుండా ఆనాటి వర్తమాన తరంగిణి అన్యాయం జరిగిన వారి దృక్పథంతో, వారి ధైర్య సాహసాలను మెచ్చుకుంటూ రాసింది ఈనాటి విప్లవోద్యమ వార్తలను కూడా యివ్వటానికి నోచుకోని ఘరానా పత్రికలు మనకున్నాయి 150 ఏళ్ళలో తెలుగు జర్నలిజం సాధించిన అభివృద్ధికి ఇదొక మచ్చుతునక

జాతీయోద్యమం కూడా ఆనాడు జర్నలిజమును ఆవేశించింది అయితే అప్పటి జాతీయవాదంలో మతాభిమానమూ, ప్రాచీన సంస్కృతి పట్ల అభిమానమూపాలు ఎక్కువ ఈనాడు కూడా ఆ జబ్బులతో బాధపడుతున్న మనం ఆనాటి పరిస్థితిని నిందించే పని లేదు కాగా, ప్రభుత్వాన్ని దుయ్యబట్టటంలో వర్తమాన తరంగిణి ఈనాటి అనేక పత్రికల కన్న ఎక్కువ పౌరుషమే చూపిందనాలి

ఈ దిగువ ఉదహరించిన రచనలన్నీ బ్రౌన్ సేకరణలే

''గొప్ప కొద్ది తరగతి గల గౌనరుమెంటు తరఫునే టీవి యుద్యోగస్తులందరు స్వామిద్రోహము విశ్వాస ఘాతుకము చేయుటయే గాక జిల్లాలోని కాపు(రైతు)లను మిక్కిలి శ్రమ పెట్టుచున్నారనియు శిరస్తా తహశ్శీలుదారు కొత్వాలు రికార్డుకీపరు మొదలయిన హోదాలలో ప్రవేశించేవారందరు కొద్ది కాలములోగా విస్తరించి ద్రవ్యమార్జించుచున్నారనియు కాపులయొక్క స్వాతంత్ర్యములను చెరుచుటయే గాక వారి వద్ద నుండి విశేషముగా లంచము పుచ్చుకొనుచున్నారనియు స్పెక్టేటరు పత్రికాకారుడు తెలియజేసియున్నాడు ''

హిందువులు క్రైస్తవమతం పుచ్చుకుంటే యిలాటి కష్టాలు తప్పుతాయని ఆ పత్రికాకారుడు రాశాట్ట

'మేలు చేసిన వానికి కీడు చేయడము వలన జయము కలుగుచుండెడి యీ దుష్కృత కాలమందు హిందూలకిటువంటి బుద్ధి కలిగియున్నట్టయిన యింగిలీసువారి ప్రభుత్వమేల యీ దేశమునందు స్థిరపడియుండును(?) కిరస్తుమతస్థులు చేయుచుండెడి యక్రమములు వక్కాణింప శక్యములేకనున్నవి

'' ఈ యింగిలీషువారు చేసిన మోసములు తంత్రములు దుర్మార్గములు మొదలయినవి యంగులాండు - ఫ్రాన్స్-జర్మని-స్కాట్లెండు మొదలగు దేశ చరిత్రల యందు వ్రాసి యుండుటను యెల్లవారు చూచియుండలేదా(?) హిందురాజులతో చేసుకొన్న యొడంబడికెలకతిక్రమించి మిత్రద్రోహముచేత వారి సంస్థానములను నాశనము చేసిన సంగతి పోయిన సంవత్సరము ఏప్రిల్ నెలలో హానరేబిల్ కోర్టాఫ్ డిరెక్టరులవారి ఎదుట మేస్టరు సలివెన్‌గారు చేసిన ప్రసంగము దృష్టాంతముగ నుండలేదా(?) కాబట్టి పత్రికాకారులు తమ యభిప్రాయములను తెలియజేయడమందు లోకుల యొక్క సుగుణదుర్గునాములను చక్కగా నాలోచించవలసినది ధర్మము -

''ఈ హిందూ దేశమునందు ప్రభుత్వము చేయుచుండెడి యింగ్లీషు దొరతనము వారి కోర్టులయందు నియమింపబడియున్న న్యాయాధిపతులు తాము లోబడవలసిన చట్ట నిబంధనములకతిక్రమించి స్వదేశపు కాపులయొక్క ప్రాణ మానసొత్తులకుభంగముకలుగునట్లు నిర్భయముగ చేయుచుండెడి తీర్పులను గురించియు - మతములను జెరుచుటయే ముఖ్యావశ్యకమైన పనిగా బూనుకొనియుండెడి మిష్నేరులకు చేయుచుండు సహాయ్యమును గురించియు - హర్‌మేజిష్ట్ రాణి గారికి మన్విచేసుకొనే నిమిత్తమీ పట్టణమునందు గల గొందరు హిందూ ప్రముఖులు యోచించుచున్నట్టు విన్నాము ''

అయితే సదరు హిందూలు సముదాయముగా నుండెడి తమ స్వాతంత్ర్యములను కాపాడుకొనే విషయమునందు జాలములనియు - తెగలనియు కుడియడమ కక్షులనియు - యీ మొదలయిన నియమములను వర్జించి యైకమత్యమును వహించి తమ ప్రాణమాన సొత్తులను కాపాడుకొనే విషయమై తగిన కట్టుబాటుల నేర్పరచికొనిన పిదప కంపినవారి వలన కలుగుచున్న కొరతలను పార్లమెంటు వారికి తెలియజేసికొనినట్టయిన న్యాయము చేయదురని నమ్మవచ్చును స్వదేశస్థులలోనటువంటి కట్టుబాటు లేకపోవుటచేతనే కదా సాధారణముగా వర్తకము చేసికొనుటకు వచ్చిన యింగిలీషువారీ దేశము నాక్రమించుకొని వారి జయస్తంభము నాచంద్రార్కముగా నాటియుంచుటకు తగిన కృషిచేయుచున్నారు-

సుమారు 250 సంవత్సరముల క్రిందట యప్పటి హిందూదేశపు రాజులు నిష్కపటులుగా నుండుటచేత తంత్రము గల యీ యింగిలీషు మనుష్యులు సదరు హిందూ దేశపు రాజులచే ననేక సన్మానములను బొంది మిత్రద్రోహము చేయుటకారంభించి మాయోపాయములచేత గొన్ని యధికారములు సంపాదించుకొని యీ దేశమునందు తామే ప్రభుత్వము చేయుటకు చేసిన కృషి ఫలితమైనపిదప ప్రజావశీకరణము కొరకు పూర్వపు రాజులకంటే తమ ప్రభుత్వము మిక్కిలి నీతి గలదిగా కొంతకాలము కనుపరుచుచువచ్చి తమ మతము నీ దేశమునందు వ్యాపింపజేసిన పక్షంబున తమ దొరతనము బలపడుటకు సాధకముగా నుండునని నిశ్చయించి, మందమందలుగా మిషినేరి సమూహములను హిందూ దేశమునందంతట వ్యాపింపజేసి, పట్టణములు - పల్లెలు మొదలగు స్థలములయందు మిషినేరి పాఠశాలలను స్థాపించియుండుటచే నా పాఠశాలలు అజచర్మం కప్పుకొనియున్న వ్యాఘ్రములనే సంగతి హిందూలు తెలిసికొనక తమ చిన్నవాండ్లనచ్చటికి పంపుటవలన స్వమతమునందు జ్ఞానశూన్యులయిన బాలురకు మిషినరీలు తమ మత విషయమును బోధించి మిథ్యామతులుగా జేసి, కిరస్తు మతములో చేర్చుకొనుచున్నారు

"సుమారు 40 సంవత్సరములకు పూర్వము హిందూ దేశమునకు మిషినేరులు రాకూడదని చేసియున్నారనే యత్తరువుకు విరోధముగా ప్రకృతము హానరేబిన్ కోర్టువారీ హిందూ దేశమునకు మూకమూకలుగా మిషనేరులను బంపుట కేల సమ్మతింతురు (?) ఆ మిషినేరులకు సర్కారు యిలాకాతో చేరిన యూరోపు వుద్యోగస్థులు మిక్కిలిప్రీతితో గొప్ప మొత్తములనేలయిత్తురు (?)"

ఇలాంటి జాతీయోద్యమ స్వభావాన్ని మనం సులువుగా విశ్లేషించవచ్చు ఈ రచనలో వలసపౌరులమైపోతామన్న భయం ఉన్నదిగాని, అయిపోయామన్న భావం ఇంకా రాలేదు నిజానికి బ్రిటనును పాలించేవారూ, కుంపుణీని శాసించే వారూ ఒకటి కాదు, వలసలు గుదిబండలని భావించే వాళ్ళింకా బ్రిటన్‌ను పరిపాలిస్తున్నారు పరపరిపాలన మన వాళ్ళకు కొత్త కాదు రాజులు మారేవారు రాజ్యాల సరిహద్దులు మారేవి అస్తమానమూ యుద్ధాలు జరిగేవి మధ్యమధ్య ముస్లిముల పరిపాలన రానురాను బుడతకీచుల - ఫ్రెంచి వాళ్ళు - ఇంగ్లీషువాళ్ళు ఈ అనుభవాల మధ్య కుంపణీ పరిపాలన కొంతకాలం ప్రాణానికి హాయినిచ్చింది అది సామాన్య ప్రజల జీవితాలలో అశాంతి తగ్గించి, వాటిని ముందుకు నడుపుతున్నట్టు కనబడింది

ఆ సమాజంలో అట్టడుగువాడు రైతు పరిపాలనలో ఉండిన పీడన భారమంతా రైతుపైనపడింది సామాజిక సంబంధాలలో సంచలనం కలిగింది దురన్యాయం కొట్టవచ్చినట్టు కనబడుతున్నది దానిమీదట మిషనరీలు వచ్చిపడి ఒక మతవైరుధ్యం తెచ్చిపెట్టారు ముస్లిము పాలకులు కూడా మతవైరుధ్యాలు తెచ్చిపెట్టారు గాని, మతాభిమానాన్ని జాతీయభావంగా చెయ్యలేదు చిత్రమేమిటంటే, ముక్కాలు శతాబ్దం గడిచిన అనంతరం జాతీయ విమోచనోద్యమం నడిపిన వారు ఇదే జాతీయ భావాన్ని ఇంచుమించు ఇలాగే ప్రదర్శించారు గాంధీ అహింస అనేడిదానికి జతచేర్చాడు అవతల సామ్రాజ్యవాదం ఫాసిజంలాంటి వెర్రితలలు వేసి, అంతర్గత వైషమ్యాలు కారణంగా శిథిలమైపోకపోతే గాంధీ నడిపిన జాతీయోద్యమం

ఏమీ సాధించి ఉండేది కాదు దీనికితోడు ప్రజలలో విముక్తి పోరాటపాటవం గాంధీ గీసిన గిరులు దాటి పొంగింది రష్యా ప్రభావం విస్తరించింది హిట్లరును ఓడించిన ఘనతను భారతీయులు స్టాలిన్‌కిచ్చారు గాని చర్చిలుకూ, రూజువెల్టుకూ ఇయ్యలేదు న్యాయంగా ఆలోచిస్తే సామ్రాజ్యవాదం ఫాసిజం భూతంచాటున దాగయత్నించిన అనంతరం ప్రజా విప్లవం తప్ప జాతీయ విమోచనకు మరొక మార్గం లేకుండా పోయింది అందుకే మనం వలసనుండి అర్ధవలసకూ, రాజకీయ పీడననుండి ఆర్థికపీడనకూ, వలస విధానం నుండి నయావలస విధానానికీ మారి "స్వతంత్రులం" అయామనుకుంటున్నాం

మిగిలిన అన్ని విషయాలూ వదిలేసినా జర్నలిజం వరకే చూసుకుంటే ఏమి మారింది?

"సృజన", "పిలుపు" పత్రికల సంపాదకులు వరవరరావు, యం టి ఖాన్‌లను ఘనత వహించిన ఆం ప్ర ప్రభుత్వం అంతరంగిక శాంతిభద్రతల పరిరక్షణ చట్టం క్రింద అరెస్టు చేసి జైల్లోకుక్కిన వార్తను ఇప్పుడే చదివాను అలనాడు గాడిచెర్ల హరిసర్వోత్తమరావు మళ్ళీ ఇప్పుడు వీరు, పత్రికా సంపాదకులుగా జైలుకు వెళ్ళారు తెలుగు జర్నలిజం చరిత్ర వికాసానికి గర్వపడుతున్నారు వళ్ళు ఉడుకెక్కుతున్నది "-

అవును, జర్నలిజంలో ముందడుగు ఉన్నది ప్రభుత్వమే దిగజారుతున్నది

*- సృజన, మాసపత్రిక, జూన్, 1974*

# 65. కుట్ర

కాళీపట్నం రామారావుగారు ఈ చిన్నసైజు రచనతో సాహిత్య రంగంలో ఒక కొత్తరకం బాంబు పేల్చారు ఇది కథా, ఉపన్యాసమా? ఏకపాత్రా? (మొనొలాగా?) అన్నీనూ!

అసలు జరిగిందేమిటంటే, "దగ్గర దగ్గర నూటేభైమంది ముద్దాయిల్లు, వెయ్యిమంది సాక్షుల్లు!"

" ఏటీ? దొమ్మీ కేసా?" అన్నాడు భీమారావనే ఆయన

"కాదు కాన్స్పిరసీ!" అన్నారు

ఆ మాట వినగానే ప్రసంగించే ఆయనకు నవ్వొచ్చింది నవ్వు రాదా? " "ఇద్దరో ముగ్గురో మధ్య రహస్యంగా జరిగితే అది కుట్ర నూర్నూటేభైమంది జనవేటి - ఆళ్ళపక్షాన కాదు నీ పక్షాన పలకాడానికొచ్చినోళ్ళే వెయ్యిమంది సాక్షులు! అంత సాక్ష్యంతో జరిగిందీ అంటే, అది పబ్లీగ్గా జరిగిందన్నమాట ఏటేనా కావచ్చుగాని, కుట్ర మాత్రం కాదు కుట్ర అనడమే ఓ పెద్ద కుట్రంటాను తిరుగుబాటనడానికి నీకు నామోషీ ఏటి?"

"లాఫుల్‌గా ఏర్పడ్డ గవర్నమెంటును కూల్దోయ్యటం, అందుకు ప్రయత్నించడం నేరవే దాన్ని కుట్రనే అంటారు" అన్నాడు పేడిశర్మ

దాంతో ఫ్యూజ్ అంటుకుంది బాంబు పేలింది ఆ మహానుభావుడు పంచాంగం విప్పేసరికి తిరుగుబాటు తప్ప అంతా కుట్రేనని తేలింది!

ఓ సంస్థ పెట్టు, దానికి "బైలా"లుంటాయి అందులో కుట్ర ఆ "బైలా"లకి ఎమెండ్మెంటు తెచ్చినా అందులో కుట్ర

మన రాజ్యాంగం రాసినవాళ్లు, '' ఒక్కొక్కళ్లూ ముక్కోటి కాన్స్టిట్యూషన్‌లు తిరగేసి, బోర్లించి యాకకి యాకా, తొక్కి తోకా పీకేసి, అసలు పదార్థమంతా జీర్ణించుకొన్నోళ్లట ఎలాటెలాటి ఆర్టికిల్సులో ఎలాటి బొక్కలుంటాయో, దేనిదేని ఉచ్చులెంతెంత గట్టివో, రాసిన రాజ్యాంగం మీదికి దాడి జరక్కుండా ఉండాలంటే మేకు బందులు ఎక్కడెక్కడ ఎలాకొట్టాలో, అయన్నీ తెలీకుండానే సూడకుండానే రాయించుకుంటారేటి?''

అనగా ఏమిటీ? చట్ట సమ్మతంగా ప్రభుత్వాలు మార్చలేవు ''మరి నువ్వలాగ, అంతకంతల్లేని గదిలో కాపరమెట్టి, ఉన్న ఒక్క గుమ్మానికీ మంచం అడ్డేస్తే, ఆ కాపరం చక్కబెట్టదలచినోడికి రెండే రెండు దార్లు నిశిరాత్రి నీ పీక పిసికేడం మొదటిది - లేదా, గోడలు బద్దలుకొట్టేయ్యాల! - మూడోదారి, మరి లేదు ''

''నన్నడిగితే కుట్రనదగ్గది ఏదన్న జరిగితే రాజ్యాంగం రాసినప్పుడే జరిగుండాల ''

ఇది పేలిన బాంబు తాలూకు ఒక పెళ్ళ ఈ కథ ముగిసే లోపల పబ్లిక్ సెక్టార్, ప్రైవేట్ సెక్టార్

''అసలు ఎకానమీ అన్నమాటకి అర్థం ఏటో ఎంతమందికి ఎరికా? మన నాయకులకి తెలుసుకోవలసిన అవసరం లేదు ''

''గాంధీ గారు తమ కేడర్ని ఖద్దరొడకమన్నాడు ఎళ్తే జైళ్ళకెళ్ళమన్నాడు ఇండస్ట్రియలార్గనైజేషన్ లాటి సమస్యల మీద పుస్తక పరిజ్ఞానమైనా సంపాదించమన్నాడా?''

ఫలితం, కేపిటలిస్టులూ, కోటీశ్వర్లూ ఏనాడో తయారుచేసిన బొంబాయి ప్లానుకు మసిపూసి మారేడుకాయ చేసి దాన్నే మిక్సెడ్ ఇకానమీ అన్నారు

మొత్తం ఆర్థికరంగమంతా కుట్రే ఈ కుట్రకు బ్రెన్ మద్దతు ఓ వేళ మనం ఈ చెప్పే ఆయన్ని నమ్మకపోతే -

''దేశానికి 'మణిదీపం' జవ్హార్లాల్ నెహ్రూ ఏఁవన్నాడు? నేనింతా జనం కోసం నా ప్లాన్‌లన్నీ ఏయిస్తే కోటీశ్వర్లు మరీ కోటీశ్వర్లయి, పేదవాళ్లు ఇంకా పేదవాళ్ళయిపోయేరన్నాడు? కళ్ళ నీళ్ళు తిరుగుతుంటే -

''ఆయన అబద్ధఁవాడతాడా? లోపాయికారీ సంగతులన్నీ మనకి తెలీప్పోవచ్చు ఆయనకి తెలీవా? లేప్పోతే ఆయనగారివి మొసలికన్నీళ్ళు అందామా?

''అంచేత ఈ ప్రోసెస్‌లో ఎక్కడో ఏదో కుట్ర జరిగిందన్నది ఖాయం

''అలాగ కోట్లకొద్దీ జనాన్ని దగా చేసి నోర్లేని జనం కరువూ, కాటకాలూ, నిరుద్యోగంలోమాడుతూంటే ఉన్న కోట్లు చాలక, ఇంకా ఇంకా, కోట్లు మీద కోట్లు కూడేసేవాళ్ళందరూ క్షేమంగానే ఉన్నారు ''

'' ఎంచేతా? వాళ్ళు చేసే ఘోరాలన్నీ లాఫుల్‌గానే జరుగుతుండి ఉండాలి లేప్పోతే, అతివాదుల్నీ, ఉగ్రవాదుల్నీ, మరింకోళ్ళనో యింకోళ్ళనో అర్ధానపుటడువుల్లో వేటాడిన ప్రభుత్వం, ఏం - పది మంది మధ్యే వున్నారు, ఈ పాపిష్ఠి జనాన్ని వేటాడలేదేమిటి?''

ఇంతకన్న కుట్ర ఏం ఉంటుంది

*అరుణతార, త్రైమాసిక పత్రిక, ఫిబ్రవరి-మే, 1979*

# 66. ప్రజల మనిషి – ఒక పరిచయం

ఇది ఆధునిక సాహిత్యంలో అరుదైన పుస్తకం - పుస్తకం గురించి పుస్తకం ! సరి అయిన పుస్తకాలు సరి అయిన క్రమంలో చదవడం బడీ ఉపాధ్యాయుడు లేని చదువు బడి చదువుకన్న ఎన్నో రెట్లు మనోవికాసాన్ని లోకజ్ఞానాన్నీ కలిగిస్తుంది అలాంటి పుస్తకాలలో వట్టికోట ఆళ్వారుస్వామి రచించిన ''ప్రజల మనిషి'' ఒకటి

దానిమీద వ్యాఖ్యానంగా ఈ పరిచయ గ్రంథం రాశారు వరవరరావు వ్యాఖ్యానాలు రెండు రకాలుగా వుండవచ్చు ''విజయ విలాసం'' మీద తాపీవారి ''హృదయోల్లాస వ్యాఖ్య'' కావచ్చు కాళిదాసు మీద మల్లినాథసూరి ''సంజీవనీ వ్యాఖ్య'' కూడా అటువంటిదే ఈ రకం వ్యాఖ్యలు రచయిత ప్రతిభను వ్యక్తం చెయ్యడానికీ, పఠితకు రసానందం మరింతగా కలగటానికీ తోడ్పడుతాయి

కాని ఈ వ్యాఖ్య అలాటిది కాదు ఇది మాతృకలోని సామాజిక ప్రయోజనాన్ని వివరిస్తుంది మాతృకలోని అసందర్భాలను ఎత్తిచూపి పాఠకుడి అవగాహనలో పొరపాట్లు రాకుండా శ్రద్ధ తీసుకుంటుంది ఇది మాతృక విలువను హెచ్చువేస్తుంది

ఈ ''పరిచయం''లో తొమ్మిది అధ్యాయాలున్నాయి మొదటిదానిలో కథాసంగ్రహము రెండవదానిలో ఆశయమూ వున్నాయి మిగిలిన అధ్యాయాలలో నవలలో చరిత్ర ఏ విధంగా ప్రతిబింబితమైనదీ వివరించబడింది

ఈ నవలలోని ప్రత్యేకత ఏమంటే, ఇది గాలివేని రాసిన ఊహాచిత్రం కాదు తెలంగాణాలో 1938కి పూర్వం అంటే స్టేట్ కాంగ్రెసు అవతరణ జరిగినదాకా ఉండిన జీవితం వాస్తవంగా, ప్రజల చరిత్రగా చిత్రించబడింది అంతేకాదు, దీని రచయిత వట్టికోట ఆళ్వారుస్వామికీ ఈ నవలలోని ప్రజల మనిషి కంఠీరవానికి చాలా పోలికలున్నట్టు కనిపిస్తుంది అలాటి రచనలే జాతి ఉన్నంత కాలమూ శిలాక్షరాలలా నిలిచిపోయేది

కంఠీరవం సదాచారకుటుంబంలో పుట్టి కూడా రైతు జీవితంలో ప్రజల మనిషిగా మొదటి అడుగు వేశాడన్నారు అతని ప్రేరణతో తమ జీవిత పోరాటాన్ని ముందుకు తీసుకుపోయిన ప్రజలు అతనంతగా మారలేదు ఇందులో వింత ఏమీ లేదు జీవితంలో విప్లవకర పరిణామాలు కలిగి కొత్త జీవితం ప్రారంభించినప్పుడు విప్లవ పరిణామాలకు అర్హమైన వర్గం ''కట్టుబట్టలతో'' అందులోకి ప్రవేశించగలదు కాని వారి నాయకులు తమ జీవితంలో ఎంతో మార్పు తెచ్చుకుంటే గాని ఆ నాయకత్వానికి అర్హులుకాలేరు మార్పు జరిగినాక మాత్రం నాయకుల జీవితంలో కన్న విప్లవించిన వర్గం జీవితంలో ఎక్కువ మార్పు వస్తుంది అంతేకాదు, ఆ మార్పే విప్లవానికి కొలబద్ద

ఈ నవలలో మతం మార్పులకు చాలా ప్రాధాన్యం ఇయ్యబడింది ఇది చారిత్రక కారణాల వల్ల అంటే ముస్లిం మతస్థులైన పాలకులు, హీనకులాల వాళ్ళకు మతం ఇప్పిస్తే వాళ్ళు తామంతా ''రాజబంధువులు'' అయినట్లు తృప్తిపడి, అమలులో వున్న వ్యవస్థతో రాజీ పడతారని భ్రమపడ్డారు అలాటి భ్రమ అట్టడుగు మనుషులకు ఆరంభంలో ఉండటం అసహజం కాదు నీటిలో మునిగేవాడు గడ్డిపోచను గట్టిగా పట్టుకొంటాడట కాని అలాంటి ఆలోచనతోనే

ఆర్యసమాజం కూడా ముస్లిములయిన హిందువులను తిరిగి హిందువులుగా మార్చడానికి పూనుకొన్నది ముస్లిములుగా మారిన హిందువులు కాకుండా ముస్లిములుగా పుట్టిన వారే హిందూ మతం పుచ్చుకుంటామంటే ఆర్యసమాజీకులు వారిని ఏ కులంలో పెట్టి ఉండేవారో నా ఊహకు ఆనాడు గాని ఈనాడు గాని అందలేదు ఇంతకూ కటికదరిద్రులు హిందువులలోనూ, ముస్లింలలోనూ వున్నారు

ఈ మతం మార్పులు ఎంత నిరుపయోగమో వరవరరావుగారు చాలా విపులంగా ఈ పుస్తకంలో చాలా చోట్ల వివరించారు

కంఠీరవం ప్రజల మనిషి కావటానికి ఎక్కిన మెట్లన్నీ చాలా చక్కగా విశ్వసనీయంగా నవలలో వివరించబడ్డాయి అతను జైలులో, జీవితం గురించి జీవితంలో ఉన్నదాని కన్న ఎక్కువ నేర్చుకున్నాడు - తరవాత గ్రంథాలయాలలో జీవిత సత్యాలను గురించి జ్ఞానం సంపాదించాడు అయితే ఇది శుష్కజ్ఞానం ఆచరణతోగాని దీనికి జీవం ఏర్పడదు పుస్తక జ్ఞానం ముడిసరుకు అనుభవం దాన్ని సానబెట్టి ధగధగలాడె వజ్రంలా తయారుచేస్తుంది ఆలోచనను చైతన్యవంతం చేస్తుంది కంఠీరవం వాస్తవం తెలుసుకుని ఆలోచనలో పడితే ''వర్ణబేధాలు, కులకట్టుబాట్లూ, ఉచ్చనీచభావాలూ ఎంత అగాధాన్ని నిర్మిస్తాయో కొట్టవచ్చినట్టు స్ఫురించాయి ''

ప్రజల మనిషిగా రూపొందుతున్న కంఠీరవంలో సహజంగా ఉండే ఒక దౌర్బల్యాన్ని ఆళ్వారుస్వామి చాలా చక్కగా చిత్రించాడని నాకు అనిపిస్తుంది అతను తన వారిని తన మూసలోకి మార్చడానికి యత్నిస్తాడు ''మీ విశ్వాసాలను పట్టుదలలనూ నేను వెక్కిరిస్తున్నాననుకోండి, నేనెరగని ఆచారాలు కావుగా అయినప్పటికీ నా జైలుజీవితంలో వాటిపై శ్రద్ధ, విశ్వాసం సడలిపోయింది కల్పితములైన అడ్డుగోడలు అనిపించాయి'' అంటాడు

ఎంత అమాయకత్వం! ''నేను మారను మీరు మారండి'' అంటే ఎవరైనా వింటారా? కాని అతను అలా అనడంలో ఎంత సౌజన్యం ఉన్నది! అలానే ''మీవి మూఢాచారాలు, మీరు ఇక్ష్వాకుల కాలంలో వున్నారు '' అని తన వారిని ఆక్షేపించవచ్చు కాని అది ప్రజల మనిషి అయేవాడి లక్షణం కాదు

కంఠీరవం పాత్ర పరిణామంలో వరవరరావుగారు మరొక చక్కని విషయం బయటపెట్టారు '' ఒక రకంగా సాంఘిక విషయాల్లో ఆయన (కంఠీరవం) చైతన్యం గ్రామ చైతన్యం కన్నా చాలా హెచ్చుస్థాయిలో వున్నది అదే భూసమస్య లాంటి ఆర్థిక చైతన్యం విషయంలో గ్రామీయులు కొందరైనా కంఠీరవానికే పాఠాలు చెప్పేంతగా రాటుదేలారు ''

ఎందుచేత? కంఠీరవం జైల్లో ఎదుర్కొన్న వైరుధ్యాలు, పరిష్కరించినవీ సాంఘికమైనవి గ్రామీయులు ఎదుర్కొన్న సమస్య ఆర్థికమైనది ఆచరణకు సంబంధం లేకుండా జ్ఞానం వికసించదు

ఈ పుస్తకంలో చర్చించిన మరొక ముఖ్య విషయం గ్రంథాలయోద్యమం ప్రజల మనిషికి ఎలా దోహదం చేసిందీ బ్రిటిషిండియాలో కూడా జాతీయోద్యమ కాలంలో గ్రంథాలయాలూ, పఠనమందిరాలూ చాలా గొప్ప పాత్ర నిర్వహించాయి బ్రిటిష్‌పరిపాలనకు ఎలాంటి సంబంధమూ లేని పరిస్థితులలో ఉండి, మిగతా ప్రపంచానికి వెలిగా వున్న

తెలంగాణాలో రాజకీయ చైతన్యానికి తోడ్పడే వార్తలు, ఎంత ముఖ్యపాత్ర వహించి ఉంటాయో ఊహించుకోవచ్చు నిజాము సరిహద్దులలో కొద్ది సంవత్సరాలలో జరిగిన మార్పు నేను స్వయంగా ఎరుగుదును 1931 చివరిలో హన్మకొండలో కొందరు ''కాంగ్రెసు'' అభిమానులు అతి రహస్యంగా సభచేస్తూ నన్ను కూడా పిలిచారు అంతా కలిసి ఒక డజనుమంది ఉన్నారని నాకు జ్ఞాపకం ఒకటి రెండు తీర్మానాలతోనూ, చిన్న గోష్ఠితోనూ సభ ముగిసింది తర్వాత ఆంధ్ర మహాసభ పుట్టడానికీ, స్టేట్ కాంగ్రెసు అవతరించడానికీ ఎంతో కాలం పట్టలేదు

ఇలాంటి శీఘ్ర పరిణామంలో గ్రంథాలయాల పాత్ర ఉండవకపోవడం సాధ్యం కాదు ఈ పాత్రను మార్క్సిస్టు దృక్పథంతో అర్థం చేసుకోవచ్చు ఆర్థిక - భౌతిక పునాది మీద ఏర్పడే సాంస్కృతిక రాజకీయ వ్యవస్థ పునాదిబీటలు వారినపుడు దానికనుగుణంగా తాను మారుతూ, పునాదిలో రావలసిన తానే పునాది అవుతుంది ఈ ''భావ'' పునాది మీదనే అసలైన భౌతిక- ఆర్థిక పునాదిలో మార్పులు తీసుకువచ్చే కార్యాచరణ కొనసాగుతుంది తెలంగాణాలోని ఫ్యూడల్ వ్యవస్థ బీటలు తీయడమే కాదు తీవ్రమైన భూకంపాలు తిన్ననేలలాగా అయిపోయిన స్థితిలో గ్రంథాలయోద్యమం ''సూపర్‌స్ట్రక్చర్''ను చైతన్యవంతం చేయడానికి అన్ని రంగాలలోనూ పని చేసింది (అదేమి చిత్రమో, కావ్యకన్యక మార్క్సిస్టులను ఎరించిందని సురవరం ప్రతాపరెడ్డి అన్నారు కారా!)

ప్రజా పోరాటానికి సహజ ప్రేరణలు చాలవు అన్నమ్మ ఒంటరిగా జరిపిన పోరాటం నెగ్గలేదు ఎందుచేత? ఆమె ''సూపర్‌స్ట్రక్చర్'' జోలికి పోలేదు పోగల స్థితియు లేదు ''కులం కట్టుబాట్లు, విశ్వాసాలు, ఆచారవ్యవహారాలు విషయంలో ఆమె అప్పటిదాకా వున్న ఫ్యూడల్ విలువలను ప్రశ్నించనేలేదు ''వీటికీ తన తరగతి కష్టజీవుల ఆర్థిక సాంఘికావసరాలను ఏమి సంబంధం ఉన్నదీ అన్నమ్మ గ్రహించలేదు '' రాజకీయ పోరాటంలో భాగంగా సాంస్కృతిక పోరాటం కూడా నిర్వహించబడితే తప్ప'' వీటిని గురించి ప్రశ్నలు రావు

''మనం చేసే పనుల వల్ల చెప్పే మాటల వల్ల కష్టం గాని, నష్టం గాని ఇతరులకు కలుగకుండా చూడడం చాలా ప్రధానం'', అంటాడు కంఠీరవం ఇతరులంటే కంఠీరవం ప్రాతినిధ్యం వహించుచున్న వాళ్ళే గాని రామభూపాలరావులు కారనుకోండి అయినా ఈ మాటను బట్టి కంఠీరవం తాను ప్రజల మనిషి అయే ధోరణిలో ఎంత మృదువుగా పోతున్నాడో తెలియటమే గాక, అతను బాగు చేయదలచుకొన్న ప్రజలు మానసికంగా ఎంత దుర్బలంగా వున్నారో కూడా తెలుస్తుంది పోరాటాలలో రాటుదేలిన ప్రజలను గురించి, నాయకత్వంలో బాగా ముందుకు వచ్చిన నాయకుడు ఇంత జాగ్రత్తపడే అవసరం వుండదు అతను తన తల్లినీ, వదిననూ తనతోబాటు వెంకటేశ్వరరావు ఇంట ఉండమంటాడు గాని వారి మూఢాచారాలు మానమన్నాడు - భావాలను మార్చడమనేది ఆచరణలో ఆదర్శప్రాయమైన నడత వల్ల (పరిస్థితులు కలిగించే కనువిప్పు వల్ల కూడా - కొ కు ) రావలిసిందే తప్ప తొందరపడి రుద్దకూడదు, అన్నమాట ఈ దశకు వర్తిస్తుంది ఉద్యమం గాడిలో పడినాక కట్టుబాట్లూ, క్రమశిక్షణా ఎలాగూ ఉండనే ఉంటాయి

''ప్రజా చైతన్యానికి ఇరుసు భూమి సమస్య'' అన్న విషయానికి కూడా ఈ పుస్తకం చాలా ప్రాముఖ్యం ఇచ్చింది మార్క్సిజం అవతరించి, కమ్యూనిస్టు పార్టీలు ప్రజాపోరాటాలను

వర్గ పోరాటాలుగా రూపొందించడం ఆరంభించక పూర్వం ఎన్నో శతాబ్దాలుగా రైతు పోరాటాలు సాగాయి ఒక దేశంలో కాదు, అనేక దేశాలలో

3000 పైచిల్లర సంవత్సరాల క్రితం క్రీ పూ 1170లో ఈజిప్టు ప్రభుత్వం రైతులకు రెండు నెలల జీతం బాకీ పడింది ఒకనాడు అకస్మాత్తుగా రైతులు లిబిస్ నగరంలోని నెక్రోపోలిస్‌కు ఊరేగింపుగా వెళ్తూ '' ఆకలి! ఆకలి!'' అంటూ నినాదాలు చేస్తూ, చివరకు దున్నిన పొలాల గట్ల మీద బైఠాయించారు ఇలా మూడు రోజులు సమ్మె చేసి, ముగ్గురు అధికారులు చెప్పినా వినలేదు చివరకు ఒక నెల జీతం ఇచ్చారు అయినా సమ్మె కొనసాగింది మరో వారం తర్వాత రెండోనెల జీతం కూడా పుచ్చుకొని గాని వాళ్లు సమ్మె చాలించలేదు లిఖిత చరిత్రలో ఇది మొట్టమొదటి రైతు తిరుగుబాటు కాని అలిఖిత చరిత్రలో ఇతర దేశాలలో ఇంకా ఎన్ని జరిగాయో? అయితే తిరుగుబాట్లు తామై జీవితంలో మౌలికమైన మార్పులు తేలేదు ఆ మార్పులు కారణాంతరాల వల్ల జరిగాయి అసలైన విప్లవాలు అచ్చుగా భూమి సమస్య నుంచి రావు, వచ్చే మాటైతే రైతులే విప్లవాలు తేగలుగుదురు

రామ భూపాలరావు తన ఫ్యూడల్ దర్జాలాంఛనాలన్నిటితో సహా ఆంధ్ర మహాసభలోకి అడుగుపెట్టగలగడం అతన్ని ఎరిగిన సామాన్య ప్రజలకు ఆశ్చర్యం కలిగించిందేమోగాని ఈ వర్గంవాళ్ళు కొంతమందిని అభ్యుదయివాదులన్నట్టుగా ఎందుకు భ్రమపెట్టగలరు? ''వ్యవస్థలోని వర్గ సంబంధాలలో మౌలికమైన తేడాలు రాని మేరకు దోపిడీ వర్గాలు కొన్ని విషయాలను సహిస్తాయి దొరలతో, పెత్తందార్లతో, భూస్వామ్య వ్యవస్థతో మేధావులకు, విద్యావంతులకు ఉండే చొరవ, చనువు, స్వాతంత్ర్యం ఫ్యూడల్ సంబంధాలను ప్రశ్నించనంతవరకే! నిజం!

ప్రజాశత్రువులు ఏం చేసినా న్యాయంగానే కొంత కాలం చలామణీ అవుతుంది కాని ప్రజలలో చైతన్యం పెరిగిన కొద్దీ, ప్రజాశత్రువుల అక్రమాలను నేరాలుగా గుర్తించవలసి వస్తుంది అప్పటికీ న్యాయమూర్తులు, ''భూమి సమస్యను శాంతిభద్రతల సమస్యగా మార్చి పక్కదారి పట్టించే కుట్ర'' చేస్తారు

ప్రజల ప్రతిఘటనలు ''నిస్సందేహంగా మెట్లు మెట్లుగా ప్రజల చైతన్య స్థాయిని పెంచాయి '' వారు ఓడిపోయినప్పుడు కూడా ''ప్రతి ఓటమి గర్భంలో విజయం దాగి ఉంటుంది '' ఇది కూడా నిజమే కాని ప్రజాశత్రువుల ఓటమిలో విజయం దాగి ఉండదు ఎందువల్ల? చారిత్రక దశ సంఘర్షణలు, ఒక పక్షానికే అనుకూలంగా ఉండి, ఆ పక్షానికి చెందిన ఓటమినీ విజయాలను కూడా సరి అయిన సామాజిక పరిణామం దిక్కుగా నెట్టుతుంది ఆ మాటకు వస్తే ప్రజాశత్రువుల విజయంలో ఓటమి దాగి ఉంటుందన్నది కూడా అంత నిజమే ఇందుకు ఉదాహరణలు రామభూపాల్‌రావు లాంటి వారి విజయాలలోనే చూడవచ్చు

'' ఆచార్య కుటుంబం భూమి విషయంలో రచయిత న్యాయం చేయలేదు'' అన్న వరవరరావు వాదన నాకు సమర్థనీయంగా కనిపించలేదు నిజమే, ''రఘునాధాచార్యుల భూమిని దొర తీసుకొన్న దాని మీద ఊళ్ళో ఎటువంటి ప్రతిస్పందన కనిపించలేదు '' ఎందుకు కనిపించాలి? రఘునాధాచార్యులుకూ, భూమికీ ఉన్న అన్యోన్యం, ఏ కొమురయ్యకో తాను

చేసే భూమితో ఉన్న అన్యోన్యం కాదు అందుకే స్వయంగా రఘునాధాచార్యులే ''యిచ్చింది మీరు, తీసుకొన్నదీ మీరే'' అంటాడు

రఘునాధాచార్యుల ఆండాళమ్మ అన్నట్లు, ''వాళ్ళు చాకిరి చేస్తున్నారు వెట్టిచాకిరీయే '' అంత మాత్రాన వాళ్ళు సమాజానికి చెందిన శ్రామికవర్గం ఎలా అవుతారు! దొరకు సొంత సేవక వర్గం అవుతారు కొద్దికాలం జమీందార్ల దగ్గిర కారుడ్రైవరుగానూ, సేవకుడుగానూ ఉన్నవారిలో జమీందార్ల దుర్గుణాలుండటం మనలోచాలామందికి తెలిసి ఉండాలి ''దున్నేవాడిదే భూమి'' అన్న భావం రచయితకు ఉండటం సహజమే గాని, ఆ ఒక్క కారణంగా రచయిత ఆచార్ల భూమి విషయం అన్యాయం చేశాడంటే నమ్మశక్యంగా లేదు

ఏమైనా ఈ గ్రంధం రచించటంలో వరవరరావుగారు చేసిన కృషిచాలా ప్రశంసనీయమైనదీ అరుదైనదీనూ ఇది చదివేవారికి చరిత్రనే అధ్యయనం చేస్తున్నంత తృప్తి కలుగుతుంది ఇలా పుస్తకాలను గురించి పుస్తకాలు శరపరంపరగా వస్తే బాగుండును అనిపిస్తుందే గాని, ''ప్రజల మనిషి'' లాంటి పుస్తకాలు ఎన్ని ఉన్నాయి వరవరరావు లాటి విషయజ్ఞులు ఎందరున్నారు అని ప్రశ్నించుకుంటే సమాధానం ఒక్కటీ రాదు

*- అరుణతార, త్రైమాసిక, ఫిబ్రవరి-మే, 1979*

# 1. బాల వాఙ్మయం

కొన్ని శతాబ్దాల పాటు మోడు పడిపోయిన భారతీయ సంస్కృతి, పారతంత్ర్యం తొలగిపోయి స్వాతంత్ర్యం రాగానే చిగురుస్తున్నది ఈ సంస్కృతి ఏ స్థాయిలో నిలిచి పోయిందో అదే స్థాయిలో మళ్లీ పునర్వికాసం పొందటం సాధ్యం కాదు ఎందుకంటే చరిత్ర ప్రభావం వల్ల మన సమాజం అనేకమైన ఆర్థిక, సాంఘిక ప్రభావాలకు గురి అయింది, ప్రపంచ సంస్కృతి యొక్క ప్రభావం కూడా మన పైన ఉన్నది ముఖ్యంగా రాకపోకలకూ, వార్తా ప్రసారాలకూ సౌకర్యాలు ఏర్పడిన ఈ కాలంలో పురోగామి దేశాల ప్రభావం వెనకబడి ఉండే అన్ని దేశాలపైనా ఉండి తీరుతుంది ఏ దేశంలో వస్తూత్పత్తి ఎక్కువగా ఉన్నది? ఏ దేశంలో ప్రజలు చేతినిండా పనీ, కడుపునిండా తిండీ, వంటి నిండా బట్టా, ఆరోగ్యమూ, దీర్ఘాయువూ కలిగి ఉన్నారు? ఏ దేశంలో వ్యక్తులకుస్వేచ్ఛా స్వాతంత్ర్యాలు హెచ్చుగా ఉన్నాయి? ఎక్కడ ప్రజల మధ్య సమిష్టి కృషీ, సహకారమూ ఫలవంతంగా ఉన్నది? ఇటువంటి ప్రశ్నలూ వాటి సమాధానాలూ ప్రపంచ ప్రజలందరికీ కావాలి ''మనకు ఇంకొకరితో సంబంధం లేదు మనం నడవవలసిన మార్గం వేదకాలంలోనే నిర్ణయమయింది'' అనే వారు కూపస్థ మండూకాలు కాక తప్పదు, భారతదేశం స్వాతంత్ర్యాన్ని కోల్పోయేనాటికి ఆర్థికంగా గాని, పారిశ్రామికంగా గాని, సాంస్కృతికం గాని ఏ ఇతర దేశానికి తక్కువగా లేదన్న సంగతి మనం జ్ఞాపకం ఉంచుకోవాలి ఒక్క సాంఘిక పరిణామంలోనే వెనకబడింది యంత్ర నాగరికత మన దేశాన్ని జయించగలిగింది కత్తి పట్టిన వీరాధి వీరుణ్ణి తుపాకీ గల పిరికి పంద జయిస్తాడు

మనం ఈనాడు నిర్మించుకునే సంస్కృతిలో అంతర్జాతీయ లక్షణాలుండటం మనకే శ్రేయస్కరం మన దేశీయ నాయకులు ఆర్థిక, రాజకీయ, వస్తూత్పత్తి రంగాలలో ఇతర దేశాలను వాంఛనీయమైనమట్టుకు అనుసరించటానికే ప్రయత్నిస్తున్నారు ఇదే విధానం సాంస్కృతిక రంగాలలో కూడా అమలు జరిగేటట్టు కళాకారులూ, తదితరులూ చూడాలి

అంతర్జాతీయ దృక్పథం కావాలన్నంత మాత్రం చేత జాతీయ సాంప్రదాయాలు విడిచిపుచ్చాలని కాదు అలా విడిచిపుచ్చటం భావదాస్యానికీ, కృతక సంస్కృతికీ దారి తీస్తుంది

''పాతకొత్తల మేలు కలయిక'' అన్న నినాదాన్ని మహాకవి గురజాడ మనకు అందించాడు ఇది అనుకోవటానికి ఎంత సులువైన మాటో ఆచరణలో అంత కష్టమైనది సంస్కృతిని పెంపొందించటమనేది ఏ తరంలోనైనా సృజనాత్మకమైన కృషే మనం కొన్ని పుస్తకాలు చదివి, కొన్ని భావాలు అలవరచుకుని సంస్కారం పొందాము గనక మన పిల్లలూ, వాళ్ళ పిల్లలూ అవే పుస్తకాలు చదివి అవే భావాలు అలవరచుకుని తమకు కావలసిన సంస్కారం యావత్తూ సంపాదించ గలుగుతారనుకోవటం పొరపాటు సంస్కృతి సృజనాత్మకమైనదని గుర్తించని వారే కొత్తపాతల మేలు కలయికలనే సూత్రాన్ని విడిచిపుచ్చి మార్పులేని ప్రాచీన సంప్రదాయాలనో, అరువు సంస్కారాన్నో ఆశ్రయిస్తారు

## 2

మనం ఏక్షణాన పీల్చే ప్రాణవాయువు ఏ చెట్టునుంచి వచ్చినదీ చెప్పటం ఎంత కష్టమో, మనిషికి సంస్కృతి ఏయే మూలలనుంచి సంక్రమించేదీ చెప్పటం కూడా అంత కష్టమే పిల్లలు కొద్ది నెలల వయసులోనే పరిసరాల ప్రభావాలకు మానసికంగా కూడా గురికానారంభిస్తారు మురికి పేటలలో పెరిగే పిల్లలలో రెండేళ్లు నిండని వాళ్ళలోకూడా కుసంస్కారపు ఛాయలు కానవస్తాయి పిల్లల సంస్కృతికి ఆరంభంలో దోహదం చేసేది గృహ వాతావరణం అసూయ, అహంకారమూ, ఆప్యాయతా, ఆత్మసంయమమూ, వెకిలితనమూ, గాంభీర్యమూ, ధైర్యమూ పిరికితనమూ, లోభమూ, ఔదార్యమూ మొదలైన గుణాలు పెద్దలలో నిత్యమూ చూస్తూ అవి మానవ స్వభావానికి సహజమైనవనుకుని వాటిని పిల్లలు అలవరచుకుంటారు

ఈ విధంగా పిల్లలు తమ వాతావరణం నుంచి గ్రహించి అలవరచుకునే గుణాలను న్యాయంగా సంస్కృతి అనరాదు మనుషులకు అప్రయత్నంగా అలవడే గుణాలలో మంచి వాటిని బలపరచి చెడ్డవాటిని నిర్మూలించి వ్యక్తులను సంస్కరించటమే సంస్కృతి

వ్యక్తుల చైతన్యంలో ఉండే వైవిధ్యాన్ని తొలగించి ఏకముఖం చెయ్యటం సంస్కృతి యొక్క మహదాశయం సంస్కృతీ ప్రభావంచేత వ్యక్తులు సమాజమవుతారు సమాజాలు జాతి అవుతాయి భారతీయులంతా బహిశ్శత్రువును ఒక జాతిగా ఎదుర్కొగలిగి ఉండినట్టయితే మన దేశానికి పారతంత్ర్యం సులువుగా వచ్చి ఉండేది కాదు కత్తులే తుపాకులను కూడా జయించి ఉండేవి కూడాను గాంధీజీ మనని ఒక జాతిగా తయారుచేయబట్టే మనం తిరిగి స్వాతంత్ర్యం పొందగలిగాం

## 3

మనిషికి డబ్బూ, ఆరోగ్యమూ ఎంత అవసరమో సంస్కృతి అంత అవసరం ఒకప్పుడు సంస్కృతి ఉన్నత కులాలకూ, విరామంగల వారికీ మాత్రమే ఉండేది రోజల్లా కాయకష్టం చేసేవారు దాదాపు పశుతుల్యులుగానే ఉండే వారు ఇది వారి పొరపాటు కాదు ఆనాటి సామాజిక వ్యవస్థలోగల లోపం అప్పుడుకూడా జనసామాన్యం సంస్కృతీ విహీనులుగా ఉన్నారనుకోవటానికి లేదు కాని వారి సంస్కృతి జడమైనది సంప్రదాయసిద్ధమైనది దేశానికి విపత్తు సంభవించినప్పుడు అది ఎందుకూ పనికి రాలేదు కాని క్లిష్ట సమయాలలో కొందరు సామాన్య మానవులు కూడా తమ సంస్కృతిని ప్రదర్శించిన ఘట్టాలు లేకపోలేదు

ఈ నాడు పిల్లల సంస్కృతి పెంపొందించటానికి జరుగుతున్న కృషి పూర్వం ఎన్నడూ జరగలేదు ఈ ప్రజాయుగంలో సంస్కృతి ప్రతి ఒక్కరి సొత్తూ అవుతుంది సంస్కృతిని ప్రతి ఒక్కరికీ అందుబాటులోకి తీసుకురావటానికి సాధనాలున్నాయి బాలసాహిత్యమూ, బాల వాఙ్మయమూ క్రమంగా వృద్ధి చెందుతున్నది ప్రభుత్వం బాలవాఙ్మయాన్ని ప్రోత్సహించటానికి పోటీలు పెట్టి బహుమతులు కూడా ఇస్తున్నది ఇంతవరకు ఇది హర్షించదగిన విషయమే

ఇదే సమయంలో మనం పిల్లలకు అందించదగిన సంస్కృతి గురించి స్పష్టమైన అభిప్రాయాలు ఏర్పరచుకోవటం అవసరం

ఈనాడు వెలువడే బాల సాహిత్యంలో అనేక శాఖలు కనిపిస్తున్నాయి పురాణ గాథలు, చరిత్రాంశాలు, సాంఘిక విషయాలు, శాస్త్రజ్ఞానం, కథలు, గేయాలు వగైరా వీటిలో కొన్ని అనుసరణలూ, అనువాదాలూ కాక తప్పదు పురాణ కథలూ, శాస్త్రజ్ఞానమూ, ఇతర దేశాలకు సంబంధించిన జానపద కథలు ఇటువంటివి ఇటువంటి విషయాలకు సంబంధించిన పుస్తకాలలో రచయిత తన ఉపజ్ఞను భాషలోనూ, భావ వ్యక్తీకరణలోనూ మాత్రమే చూపగలడు

చారిత్రాంశాలూ, సాంఘిక విషయాలూ పిల్లల కోసం రాసేటప్పుడు రచయిత పిల్లలలో సాంస్కృతిక బీజాలు వేసే అవకాశం హెచ్చుగా ఉంటుంది గేయాలలో ఈ అవకాశం మరింత జాస్తి

# 4

మనకు సంప్రదాయ సిద్ధంగా బాల వాఙ్మయమంటూలేదు చిన్న పిల్లలచేత పెద్దలకు పనికి వచ్చే శతకాలే వల్లెవేయించే వారు సంస్కృత విద్యార్థులు శబ్దమంజరీ, అమరకోశమూ కంఠస్థం చేసి ఏకంగా రఘువంశం ఎత్తుకునే వారు బాల రామాయణం నిజానికి పెద్దల రామాయణమే

కొత్తగా వచ్చినప్పటికీ బాల వాఙ్మయ సంప్రదాయం చాలా మంచిది అయితే నేటి దేశ కాలపరిస్థితులకు అనుగుణంగా ఈ బాల వాఙ్మయం తయారుకావాలి కేవలం పాశ్చాత్య బాల సాహిత్యాన్ని అనుకరించిన మాత్రాన ప్రయోజనం లేదు ప్రాచీన సంస్కృతి నెపం పెట్టి డజను బొమ్మల రామాయణాలూ, డజను బొమ్మల భారతాలూ అచ్చుకొట్టి దేశం మీద విరజిమ్మికూడా లాభం లేదు

కేవలం వ్యాపార దృష్టితోనూ, లాభా కాంక్షతోనూ బాల సాహిత్యం సృష్టించేవాళ్లు ఏమంత ప్రయోజనకరమైన బాల వాఙ్మయం సృష్టించలేరని సూటిగా చెప్పవచ్చు బాల సాహిత్యం సృష్టించటంలో వ్యాపార దృష్టి మాత్రమే ప్రధానంగా పెట్టుకున్నవాళ్లు కొన్ని దేశాలలో సృష్టించే వాఙ్మయం పిల్లలకు మానవత్వం లేకుండా చేసి రాక్షసులుగా తయారు చెయ్యటం జరుగుతున్నది అటువంటి సాహిత్యం మన దేశంలోకి దిగుమతి కాకుండా ప్రభుత్వం తగు చర్యలు తీసుకోవలసి వచ్చింది కూడానూ

ఆ సంగతి అలా ఉండగా కేవలం వ్యాపార దృష్టితో చూసినప్పటికీ ఇప్పుడు వెలువడే బాల వాఙ్మయంలో చాలా భాగం అసమర్థంగా ఉన్నది పిల్లల పుస్తకాలు ప్రచురించే వారిలో చాలా మంది సమర్థులైన రచయితల కోసంగాని, చిత్రకారుల కోసంగాని కొంచెమైనా ఆత్రం కనబరచటం లేదు ఇతరులకంటే ముందుగా తమ పుస్తకాలు బజారులో కెక్కించి అమ్మి నాలుగు డబ్బులు చేసుకుందామన్న ఆదుర్ద ఒకటే వారిలో కనిపిస్తుంది ఇది ఆరంభదశాల క్షణం కావచ్చు

ఈ లక్షణంతో బాటు మరొక లక్షణం కూడా కానవస్తున్నది అదేమిటంటే ఎప్పుడైనా ఒక మంచి పుస్తకం వెలువడటమూ దానికి సమర్థులైన ప్రచురణకర్త లేకపోవటమూనూ

ఈనాటి బాలవాఙ్మయం గురించిన అసలు సమస్య మన దేశం యొక్క జాతి యొక్క భవిష్యత్తుతో ముడిపడినది ఈ సమస్యను పరిష్కరించటంలో ఎన్నో ద్వంద్వాలు ఎదురు తగులుతాయి

మనం స్వాతంత్ర్యం సంపాదించుకున్నాం భవిష్యత్తు నిర్మించుకుంటున్నాం ఇందులో వ్యష్టిస్వాతంత్ర్యమూ, సమిష్టికృషీ కూడా ప్రతిబింబించాలి ఈ కాలపు పిల్లలలో ఘనకార్యాలు చేసి, కీర్తి, ధనమూ సంపాదించుకోవాలన్న కోరికా ఉండాలి తమ కీర్తి, కృషి దేశ శ్రేయస్సుకు అనుకూలించాలనే ఆదర్శము ఉండాలి, ఇతరుల హక్కులను పాటించే స్వార్థంతోబాటు, తమ హక్కులను కాపాడుకునే స్వార్థంకూడా ఉండాలి ఈ ద్వంద్వాలు జీవితంలో తండోపతండాలుగా ఎదురవుతాయి వీటిని గడిస్తే గాని వ్యక్తి గానీ, జాతీగానీ పురోగమించటం సాధ్యం కాదు పిల్లలకు అన్నీ మంచి నీతులే చెప్పి ఎందుకూ కొరగాకుండా చెయ్యవచ్చు అహింసను మనం అన్నిరంగాలలోనూ పరమ ధర్మంగా ఆమోదిస్తున్నాం కాని అచ్చుగా అహింసనే అవలంబించినవాడు పిరికి వాడు కావచ్చు దౌర్జన్యాన్ని నైతిక బలంతో ఎదిరించే వాడూ కావచ్చు అహింస మాత్రమే బోధించి దాన్ని అవలంబించే వారిలో ఉండే తేడాను ఉపేక్షించినట్టయితే సంఘంలో సంస్కారులూ, సంస్కార హీనులూ ఒకటే అయిపోతారు

నిజమైన సంస్కారం వర్తమాన కాలంలో వ్యక్తికీ, జాతికీ, దేశానికీ కలిగే సమస్యలను పరిష్కరించ జాలినదిగా ఉండాలి పరిస్థితులతో బాటు సంస్కారం మారటంలో తప్పులేదు అస్పృశ్యతను ఒకప్పుడు సంఘంలో ప్రవేశపెట్టిన వారి ఆనాటి సంస్కృతిని మనం ఖండించనూ లేము ఈనాడు అస్పృశ్యతనే కాదు కుల తత్వాన్ని సయితం ఆమోదించనూ లేము మనజాతి ఎటుగా పురోగమించాలో తెలిసినప్పుడు రేపటి పౌరులైన ఈ నాటి బాలలకు ఎటువంటి సంస్కృతి అవసరమో నిర్ణయించటం మేధావులకు కష్టమైనపని కాదు అందుకు అనుకూలమైన బాలవాఙ్మయాన్ని సృష్టించటం సుని సూత్రమైన పని కాదనీ, అది వాస్తవంగా సృజనాత్మక కృషి అనీ మనం ఎంత స్పష్టంగా గ్రహించితే అంతమంచిది

*ఆంధ్రప్రదేశ్, మాసపత్రిక, నవంబరు 1960*

# 2. బాల సాహిత్యం

మన దేశంలో బాల సాహిత్యమని ఇప్పుడిప్పుడే వస్తున్నది బెంగాలీ, హిందీ మొదలైన భాషలలో రెండవ ప్రపంచయుద్ధానికి పూర్వం కూడా బాల పత్రికలుండినట్టు తెలుస్తుంది తెలుగులో మాత్రం బాల పత్రికలు స్వాతంత్ర్యం వచ్చేరోజులోనే బయలుదేరాయి

నా చిన్నతనంలో బాల సాహిత్యమంటూ వేరేలేదు నాకు చదవటమూ రాయటమూరాగానే సుమతీ శతకం కంఠస్థం చెయ్యమన్నారు వావిల కొలనువారు రచించిన పాకెట్ సైజు కథలు పుస్తకాలేవో ఉండేవి భాగవతం నుంచి కుచేలోపాఖ్యానం, రుక్మిణీ కళ్యాణ, ప్రహ్లాద చరిత్ర, గజేంద్రమోక్షం లాంటి కథలు చదివాను వాటిలోని కొన్ని పద్యాలు నాకిప్పటికింకా జ్ఞాపకం ఉన్నాయి

అర్ధశతాబ్దం క్రితం ఇదే బాల సాహిత్యం నిజానికిది పిల్లలకోసం ప్రత్యేకించి రాసిన సాహిత్యంకాదు పెద్దల సాహిత్యమే పెద్దల సాహిత్యంలో పిల్లలకు పనికి వచ్చేదంతా పిల్లల సాహిత్యంగా చలామణీ కావటం మన సంప్రదాయం ఈ కారణంచేతనే మనం ఈ రోజు బాల సాహిత్యం గురించి పాశ్చాత్యుల అభిప్రాయాలు అరువు తెచ్చుకొని లాభం లేదు

ఇంచుమించు ఇరవై ఏళ్లుగా బాలసాహిత్యంతో నాకు గల సంబంధాన్ని బట్టి బాల సాహిత్యం ఎలా ఉండాలి, ఎలా ఉండకూడదు అన్న అభిప్రాయాలు కొన్ని ఏర్పరచుకున్నాను కొంతకాలమయాక వీటికి కాల దోషం పట్టవచ్చు ప్రస్తుతానికి ఈ నా అభిప్రాయాలు సముచిత మయినవని భావించి వాటిని ఇక్కడ చెబుతున్నాను

పశు పక్ష్యాదులు పాత్రలుగా గల నీతి కథలూ, దేవతయూ, రాక్షసులూ, మాంత్రికులూ, అతీత శక్తులూ మొదలైన వాటితో కూడిన దేవతా కథలూ, గడచిపోయిన యుగాలకూ, సమాజానికీ సంబంధించిన జానపద కథలూ (Fairy Tales) బాల సాహిత్యంలో ప్రముఖ స్థానం కలిగి ఉంటాయి

**వాస్తవికత**

పైన చెప్పిన కథలలో వాస్తవికతకు చోటులేదు ''బుల్లి చేప చేత మాట్లాడించటంలోనే ఉన్నది చిక్కంతా!'' అన్నాడట ఆలివర్ గోల్డ్‌స్మిత్ చేపలూ, కాకులూ, ఎలుకలూ మాట్లాడటం వల్ల వాస్తవికత పోతుందని అతను భయపడి ఉంటాడు కాని బాల సాహిత్యంలో అలాంటి వాస్తవికత అనవసరం పిల్లలు తాము వినే (చదివే) కథలలోని సన్నివేశాలనూ, సంఘటనలనూ తమ పరంగా అన్వయించుకోనవసరంలేదు వాళ్లు వాటికి ఎడంగా ఉండే ఆనందం పొందాలి అనగనగా ఒక రాజు ఆ రాజుకు ఏడుగురు కొడుకులు ఏడుగురు కొడుకులూ వేటకు వెళ్లి ఏడు చేపలు తెచ్చి ఎండ వేశారు ఏ రాజు? ఏడుగురు చేపల వేటకు పోయి ఏడుచేపలేనా తెచ్చారు? ఏడు చేపలు ఎండవేస్తే ఎవరి ముక్కులోకి? ఇలాంటి సందేశాలువేటికీ కథలో తావు లేదు

కొన్ని నీతికథలను ఆధునికం చెయ్యాలని కొందరు ప్రయత్నిస్తారు ఇది పొరపాటు మాంసం ముక్క నోటకరచుకున్న కాకిని నక్క, ''కాకి బావా, కాకి బావా! ఒక్క పాట పాడు!'' అనగానే ఈ ఆధునిక కాకి మాంసం ముక్కను కాలికింద పెట్టుకుని, పాటపాడి నక్కను ''ఫూల్'' చేస్తుంది ఇది నీతికథ కాదు జర్నలిజం

పిల్లల కథలు వర్తమాన జీవితానికి సంబంధించి ఉండాలనీ, అందులో వాస్తవికతకు చోటు కలిగించాలనీ కొందరు కొన్ని రకాల రచనలు చేస్తారు మాటవరుసకు ''సీతపుట్టినరోజు పండుగ'' అనుకొండి సీతకు పుట్టిన రోజు పండుగ చేస్తారు బామ్మ తలంటి పోస్తుంది నాన్నారు తెచ్చిన కొత్త పూలపరికిణీ కట్టుకుంటుంది మామయ్య తెచ్చిన పూలజాకెట్టు వేసుకుంటుంది అన్నయ్య తెచ్చిన కొత్త రిబ్బను, ఎంచక్కా పెట్టుకుంటుంది అమ్మ పూరీలు, జిలేబీలూ, మైసూరు పాకూ, బాదం హల్వా చేసి పెడుతుంది ఇదే విధంగా తంతు జరిగిపోతుంది ఇది పిల్లల కథకాదు పెద్దవాళ్లు నెలల పిల్లలతో (వాళ్లకర్థమవుతుందనుకునీ, వాళ్ల భాషేమాట్లాడుతున్నామనుకునీ) ''ఓంతిలా? ఆయికావాలా?'' అన్నట్టుగానే ఉంటుంది ఇలాంటి కథకూడానూ ఇటువంటి కథలు మరీ జాస్తి చదివితే పిల్లలకు తమ పరిసరాల మీద

చాలా రోత పుడుతుంది సినిమాలో చూపే ప్రేమ నిజమనుకున్న వాడు వాస్తవ జీవితంలోని ప్రేమ చూసి అనుకున్నట్టుగా పిల్లలు పెద్దలయాక, వంచింప బడ్డామనుకోగలరు ఎందుకంటే ఈ కథల్లో ఉండేది 'స్టెరిలైజ్' చేసిన జీవితం వాస్తవంగా ఉన్నట్టు భ్రమ గొల్పే అవాస్తవం చేపలూ, కొంగలూ మాట్లాడే కథలు ఇలా మోసం చెయ్యవు

మౌలికభావాలు :

బాల సాహిత్యం పిల్లల మెదడులో కొన్ని మౌలికమైన భావాలను బలంగా నాటాలి ధైర్యసాహసాలూ, నిజాయితీ, స్నేహపాత్రత, త్యాగబుద్ధీ, కార్యదీక్షా, న్యాయమూ మొదలైనవి జయించటం ద్వారా సంతృప్తిని కలిగించే కథలు, ఎంత అవాస్తవంగా ఉన్నా పిల్లల మనస్సులకు చాలా మేలు చేస్తాయి దురాశా, ఓర్చలేని తనమూ, అధికార గర్వమూ, క్రూరత్వమూ, కృతఘ్నతా, అధర్మమూ స్వార్థమూ మొదలైనవి శిక్షించబడటం కూడా పిల్లలకు తృప్తి నివ్వాలి

కొన్ని కొన్ని సద్గుణాలు ఒక్కొక్క సమయంలో దౌర్బల్యంగా పరిణమించటమూ, ప్రమాదం తెచ్చిపెట్టటమూ జరుగుతుంది భూతదయ చాలామంచిది నిస్సహాయులపట్ల దయ చూపటం వరకు ఇబ్బందిలేదు, కాని దుర్మార్గుల పట్ల చూపే దయ ప్రమాదాలకు దారితీస్తుంది అందుచేతనే, బోనునుంచి పులిని విడిపించిన బ్రాహ్మడి కథలో ముఖ్యాంశం బ్రాహ్మడి జాలికాదు అది తెచ్చిపెట్టిన ప్రమాదమే ఆ ప్రమాదాన్ని నక్క యుక్తిగా తప్పిస్తుంది యుక్తి కథలకు బాల సాహిత్యంలో స్థానం ఉంది

స్థూలంగా చెప్పాలంటే, పిల్లలలో దౌర్బల్యాన్ని పెంపొందించేది మంచి బాల సాహిత్యంకాదు మహాసత్త్వుల కథలు ఉత్తమ బాలసాహిత్యం ఒక లక్ష్యం పెట్టుకున్నాక మహాసత్త్వుడైనవాడు ఎన్ని ప్రమాదాలనూ లక్ష్యపెట్టడు అటువంటి పాత్రలుగల కథలు ఎంత హెచ్చుగా చదివితే పిల్లలకు కారెక్టర్ అంత బాగా ఏర్పడుతుంది మన దేశాలలాంటి పేద దేశాలలో పిల్లలకు డబ్బుమీద దృష్టి ఏర్పడటం కన్న ''కారెక్టర్'' ఏర్పడటం చాలా అవసరం

రాక్షసులను మనుషులు జయించటమూ, ధనికులను వాళ్ల సేవకులు భంగ పరచటమూ, అతి సామాన్యమైన వ్యక్తులలో అసాధారణ శక్తులుండటమూ లేదా వారి కవి లభ్యం కావటమూ ఇలాటి ఇతి వృత్తాలు గల జానపద కథలు ప్రపంచ మంతటా ఉన్నాయి వాస్తవ సాంప్రదాయాలు ఎదురు వెళ్లే ఈ కథలు చదవటం వల్ల కూడా పిల్లలకు కొంత లాభం ఉన్నది ముఖ్యంగా, చిన్న పిల్లలకు దొంగల భయమూ, దయ్యాల భయమూ లాటివి అతి తేలికగా అబ్బుతాయి ఆ భయాలను తగ్గించే దొంగల కథలూ, దయ్యాల కథలూ పిల్లలు చదివి ఉండటం మంచిది

దేవుడి మీద భక్తినీ, మత విశ్వాసాలనూ ప్రచారం చెయ్యటానికే రచించిన కథలు పిల్లలకు చెప్పటం అంత మంచిది కాదు కథల్లో దేవతలూ, భక్తులూ ఉండరాదని కాదు దేవుణ్ణి నమ్ముకుంటే అన్ని సుఖాలూ ఒనగూడుతాయన్న అభిప్రాయాన్ని పెద్దలు కలిగి ఉండటం ఎంత తప్పో, పిల్లలకు ఇవ్వటం అంతకు పదింతలు తప్పు కథలో నెగ్గవలసినది మనుష్య యత్నమూ, మనిషి సద్బుద్ధీనూ ఇది చాలా ముఖ్యం

రచనా విధానం

బాల సాహిత్యం రాసేటప్పుడు కథనం పెద్ద వాళ్ళు పిల్లల్లా మాట్లాడుతున్నట్లు ఉండాలనుకోవటం నా బుద్ధికి చాదస్తంగా కనిపిస్తుంది ''అప్పుడేయమిందను కున్నారూ?''

''రాజుకో కూతురుందనుకున్నాం కదూ?   చూశారా, వాడి దుర్మార్గం వాణ్ణి ఏ స్థితికి తెచ్చిందో నూ?'' ఇలా అడుగడుగునా బాల పాఠకులను తట్టుతూ ఉండడం అనవసరం అనుకుంటాను

రచనలో వ్యర్థ పదాలూ, ప్రకృతి వర్ణనలూ, సౌందర్య వర్ణనలూ పిల్లలను అంతగా ఆకట్టవు ''కీకారారణ్యం,'' ''కటిక చీకటి'', ''పండు వెన్నెల,'' ''పెద్ద కెరటాలతో ఉప్పెన'' ఇలాటి మాటలతో వాళ్లు ఎంతైనా ఊహించుకోగలరు

పాత్రలు చాలా మంచివాళ్లయినా కావాలి, చాలా చెడ్డవాళ్లయినా కావాలి, చాలా తెలివిగలవాళ్లయినా కావాలి, వట్టి మూర్ఖులైనా కావాలి, చాలా అందంగానైనా ఉండాలి, వికారంగానైనా ఉండాలి ఓమాదిరి మంచీ, సుమారైన తెలివీ, ఎటూగాని అందమూ బాలసాహిత్యానికి అనవసరం, పాత్రల అంతస్సంఘర్షణలుకూడా అంతే

పిల్లల కోసం రాయటం ఒక గొప్ప కళ తెలుగులో ఆ కళలు చెప్పుకోదగినంతగా వృద్ధి చేసిన వారెవరూ ఉన్నట్టు కనపడదు కొందరు పాత్రోచిత భాష ప్రవేశపెట్టాలనీ హీన పాత్రలచేత యాసగా మాట్లాడించటంలాటి ప్రయోజనాలు చేస్తారు నా దృష్టిలో ఇది గూడా ఈనాటికి పొరపాటే కథల్లో సంభాషణలు ఉండక తప్పదు కాని వాటిలో అంత వాస్తవికత నిరుపయోగం

**బాలగేయాలు, ఇతరరచనలు**

అదృష్ట వశాత్తు ఈనాడు మనలో చక్కని బాలగేయాలు రాసే వారున్నారు నిజానికి పెద్ద వాళ్ల కన్న పిల్లలు గేయాలను ఎక్కువగా ఆనందించ గలరు బాల గేయ రచనలు పిల్లలకు ఎంతగా అందుతున్నాయో నాకు తెలీదు కొన్నిటికి బహుమతులు కూడా లభించాయనుకుంటాను

పిల్లలకు విజ్ఞానం కూడా కొంత వరకు అవసరమే ఈ స్పూత్నిక్ - హైడ్రోజన్ బాంబు యుగంలో వాళ్లు తెలుసుకోదగిన వైజ్ఞానిక విషయాలు ఎన్నో ఉన్నాయి ఆకాశానా, భూమి మీద, సముద్రం అడుగునా ఎన్నో పరిశోధనలు జరుగుతున్నాయి ఆరోగ్య సంబంధమైన అంశాలు చిన్నతనంనించీ తెలుసుకోదగినవి ఎన్నయినా ఉన్నాయి అడివిలో చెట్ల లాగా ఈనాటి పిల్లలు వీటిని గురించి ఏమీ తెలుసుకోకుండా పెరగటం చాలా తప్పు

**బాల గ్రంథాలు**

బాల గ్రంథాలు చూడటానికి అందంగా ఉండాలి అచ్చు చక్కగా ఉండాలి బొమ్మలు ఊహలను కదిలించేవిగా ఉండాలి వాటిలో ఎలాటి అచ్చు తప్పులూ ఉండరాదు

అవి చవగ్గా కూడా ఉండాలి

పెట్టుబడిదారీ వ్యవస్థలో ఈ రెండూ కుదరవు అందుకని కమ్యూనిజం వచ్చేదాకా ఈ సమస్యను తడిపి ఉంచటానికీ వీల్లేదు

ఈ సమస్యను పరిష్కరించటానికి ప్రస్తుతం ఉన్న మార్గాలు ఏవంటే

ఒకటి, పిల్లలకోసం వేసే పుస్తకాలకు ప్రభుత్వం, లేక ప్రభుత్వాలు సబ్సిడీలు ఇవ్వటం

రెండు, ప్రచురణకర్తలు ఈ పుస్తకాలను అనేక వేల సంఖ్యలో ముద్రించటం (లక్షల సంఖ్యలో కాకపోతే )

పుట్టిన రోజు పండుగలకూ, ఇతర పండుగలకూ పెద్ద వాళ్లు పిల్లలకు మిఠాయి వగైరాలతో బాటు చక్కని పుస్తకాలు కూడా బహూకరించటం ఇతర దేశాలలో ఇరవై అయిదు రూపాయల ఖరీదు చేసే పిల్లల పుస్తకాలు సైతం అచ్చువుతున్నాయి పెద్దవాళ్లు బహూకరించకపోతే నిత్య ఖర్చులో నుంచి పిల్లలు అలాటి పుస్తకా కొనటం సాధ్యమా?

పిల్లల పుస్తకాల ప్రచురణ ఆంధ్రలోనే చాలా వెనుకబడి ఉన్నట్టు కనబడుతుంది మంచి ముద్రణాలయాలు లేకపోవటమూ, బాల పుస్తకాల ప్రచురణ పెట్టుబడిదార్లను ఆకర్షించకపోవటమూ, అందుకు కారణాలు కావచ్చు పిల్లలకు తగినట్టుగా బొమ్మలు వేసే చిత్రకారులు కూడా చాలా తక్కువగా ఉన్నట్టు కనిపిస్తారు

పిల్లల పుస్తకాలకు గిరాకి రాగానే అందరూ బొమ్మల రామాయణాలూ, భారతాలూ ప్రచురించారు రామాయణ భారతాలు పిల్లలకు అనవసరమనను గానీ, వాటికన్నచాలా మంచి బాల సాహిత్యం ఉన్నది రాసేవాళ్ళూ, వేసేవాళ్ళూ ఉంటే

*ముద్రణ సంవేదన, త్రైమాసిక పత్రిక, జూలై - అక్టోబరు 1969,*
*పునర్ముద్రణ సాహిత్య ప్రయోజనం, విశాలాంధ్ర ప్రచురణాలయం*
*అక్టోబరు 1969*

# 3. పిల్లల సాహిత్యం

సృష్టిలోని ప్రాణికోటిలో మానవుడు ఒక్కడే సంకేతాల ద్వారా సాటి మనిషికి తన అనుభవాన్ని అందించగలవాడు ఆ సంకేతాలు మాటలు, మానవుడి జీవితంలో అవి అత్యంత ప్రాముఖ్యం వహిస్తాయి మాటలే లేకపోతే మానవ సమాజం ఇతర జంతువుల సాంఘిక స్థాయిని మించి ఇంతగా అభివృద్ధి కాకపోను విద్య మొదలుకొని రాజకీయ ఉద్యమాలదాకా మనిషి జీవితమంతా మాటలపైనే ఆధారపడి ఉన్నది వాక్కును ఒక దేవతగా ఆరాధించి, సృష్టికర్తను ఆమెకు భార్యగా చేశారు మనిషి అనుభవం ద్వారా తెలుసుకునే దానికి పరిమితి ఉన్నది గాని, పుస్తకాల ద్వారా తెలుసుకునే దానికి పరిమితి అంటూలేదు అందుచేతనే సాహిత్యం మానవ సంస్కృతిలో అత్యున్నత స్థానం అందుకున్నది

ఈ పరిస్థితిలో పిల్లలకు కూడా వారికి తగిన సాహిత్యం ఉండాలని వేరే చెప్పనవసరం లేదు ఏ సాహిత్యమైనా ఎవరికోసం ఉద్దేశించబడుతుందో వారి మానసికపరిణతికి అనుగుణంగా ఉండాలి ఆటవికులు శృంగార శాకుంతలం చదివి ఆనందించలేరు ఎవరు చదివే సాహిత్యం వారికి ఆసక్తికరంగా ఉండటమేగాక, వారి జీవితానుభవానికి అందేదిగా కూడా ఉండాలి పిల్లలకైనా అంతే అయితే ఈ ఒక్క ప్రమాణమే చాలదు పెద్దవాళ్ళయినా కేవలమూ తమ నిత్య జీవితాన్నియధాతథంగా కథలుగా రాస్తే అటువంటి కథల నుంచి సాహిత్య ప్రయోజనాన్ని పొందలేరు సాహిత్యం అన్నది నిత్యానుభవం నుంచి కొత్త అనుభూతులను కలిగించాలి అలా చేయని సాహిత్యం పాఠకుడి దృక్పథాన్ని విస్తరించి, విశాలం చేయలేదు పిల్లల సాహిత్యమైనా అంతే

పిల్లల గ్రహణశక్తి, జీవితానుభవమూ చాలా పరిమితంగా ఉంటాయి, కాని వారి ఊహాశక్తి బలంగా ఉంటుంది శృంగారమూ, కరుణా, భీభత్సమూ మొదలైన రసాలు వాళ్ళకు అనుభూతి కలిగించవు క్రోధమూ, అద్భుతమూ, హాస్యమూలాంటివి వాళ్లు గ్రహించ గలరు బల పరాక్రమాలూ, న్యాయమూ, అన్యాయమూ, కష్టసుఖాలూ వాళ్లకు బోధపడేటట్టు చెప్పవచ్చు

పిల్లల సాహిత్యంయొక్క స్వరూప స్వభావాలను మనం స్థూలంగా నిర్ణయించవచ్చు పిల్లలను మాటలు ఆకర్షిస్తాయి మాటల అర్థం కన్నా మాటలే వాళ్ళను ఎందుగా ఆకర్షిస్తాయి మరీ చిన్న పిల్లలకు చెప్పే కథల్లోనూ, గేయాల్లోనూ ''మాటల పసందు'' చాలా అవసరం ''చిన్నచెంబుతో నీళ్ళు'' అన్న పద్యం నన్ను నాలుగో ఏటనే ఆకర్షించింది దాని అర్థం ఏమిటో నాకిప్పటికీ తెలీదు మళ్ళీ మళ్ళీ వచ్చే మాటలు పిల్లల్ని చాలా ఆకర్షిస్తాయి ఏడుగురు రాజు కొడుకులు వేటకు వెళ్లి, ఏడు చేపలు తెచ్చి ఎండేస్తే, ఒక్కచేప ఎండలేదు ''చాపా, నువ్వెందుకు ఎండలేదు,'' అని అడిగితే పిల్లలకు రక్తిగా ఉండదు ''చాపా, చాపా, ఎందుకు ఎండలేదు''? అని అడగాలి

ఇంతకన్నా మంచి ఉదాహరణ తన పేరు మరిచిపోయిన ఈగకథ ఈగ వెళ్లి పేదరాసి పెద్దమ్మను తన పేరు అడుగుతుంది పెద్దమ్మ తనకు తెలీదనీ, తన కొడుకును అడుగమని అంటుంది ఈగ వెళ్లి పెద్దమ్మ కొడుకును, 'పెద్దమ్మ కొడుకా, నాపేరేమిటి?'' అనిఅడిగితే రక్తిలేదు 'పేదరాశి పెద్దమ్మా, పెద్దమ్మకొడుకా, నాపేరేమిటి?'' అని అడుగుతుంది ఇంకా కథ సాగినాక, 'పేదరాసి పెద్దమ్మా, పెద్దమ్మ కొడకా, కొడుకుచేతి గొడ్డలీ, గొడ్డలి కొట్టే చెట్టు, చెట్టుమీద పిట్టా నాపేరేమిటి?'' అని అడుగుతుంది మాటల గొలుసు ఇలా పెరగటం పిల్లలకు గొప్ప ఆనందం ఉన్నది

పిల్లలు పెరుగుతున్న కొద్దీ తాము చదివే రచనల స్వభావం కూడా గ్రహింపుకు రావటం మొదలవుతుంది అయినా ఆ సాహిత్య స్వరూపం వాళ్ళకు తగినట్టుగా ఉండాలి ''రామయ్య తన పొలంలో పని చేస్తున్నాడు'', అని కథ మొదలుపెట్టటం కన్న, '' ఒక ఊళ్లో రామయ్య అనే రైతు ఉండేవాడు'', అని మొదలు పెట్టటమే మంచిది ఈ దశలో కథల భాష వారికి తెలిసిన భాషకు చాలా దగ్గిరిగా ఉండబడాలి (నా చిన్నతనం రోజుల్లో నేను ఒకటి రెండు చిన్న పిల్లల పుస్తకాలే ఉండేవి అవి కూడా గ్రాంథిక భాషలో ఉండేవి కనీసం భాషా విషయంలో ఈనాటి పిల్లలు మాతరం వాళ్ళకన్నా చాలా అదృష్టవంతులు )

పిల్లలు పాఠ్య పుస్తకాలలో నుంచి కొన్ని తమకు పనికివచ్చే కథల నుంచి కొత్త మాటలు త్వరగానూ, సరిగానూ నేర్చుకునేటట్టు కనబడతారు ''కుక్క మొరుగును, గాడిద ఓండ్రపెట్టును సింహము గర్జించును'', అని పాఠం చెప్పిన దానికన్న కథల్లో కుక్కలు మొరగటమూ, గాడిదలు ఓండ్రపెట్టటమూ, సింహాలు గర్జించటమూ తగిన సందర్భాలతో సహా పిల్లల మనస్సుకు బాగా పట్టుకుంటాయి

పిల్లలు ఎదిగేకొద్దీ వాళ్ల సాహిత్య స్వరూపమూ, స్వభావమూ కూడా మారుతూ వస్తాయి వయసు వారీగా పిల్లల సాహిత్యం సృష్టించటం చాలా గొప్పవిద్య విద్య తెలిసినవాళ్లు ఈనాడు తెలుగువారిలో ఎవరైనా ఉన్నారా అని నాకు సందేహం లేకపోలేదు ఈనాడు పిల్లల పత్రికలనే వాటిలో వచ్చేది పిల్లల సాహిత్యం కాదు అది చాలా వరకు జానపద సాహిత్యం పిల్లలు

ఆత్రంగా దాన్ని చదువుతున్నారు అంతమాత్రాన అది నికరమైన పిల్లల సాహిత్యం కాదు నేను కూడా నా చిన్నతనంలో భారత కథామంజరి చాలా ఆత్రంగానే చదివాను

అయితే ఈనాటి పిల్లల సాహిత్యం నిరుపయోగమని చెప్పను ఇది చదివిన వాళ్లు పెద్ద వాళ్ళయి, అసలు సాహిత్యం చదవటానికి తయారుగా ఉంటున్నారు మన దేశంలో ఉన్న విచిత్రమైన పరిస్థితి ఏమంటే, పిల్లల పత్రికల క్రింద చలామణీ అయేవాటిని వయోవృద్ధులు కూడా చదువుతున్నారు అన్ని వయసుల వాళ్లకూ పనికివచ్చే ఒక రకమైన సాహిత్యం బాల సాహిత్యంగా ఈనాడు చలామణీ అవుతున్నది

*అఖిలభారత తెలుగు బాలల మహోత్సవం, 1974*
*బాలానందం, అఖిల భారత బాలల మహోత్సవం ప్రత్యేక సంచిక*
*ఉత్సవ తేదీలు అక్టోబరు 23, 24, 26, 26, 1974*

# 4. తెలుగులో బాలల సాహిత్యం

''చినచెంబుతో నీళ్ళు, శీకాయ ఉదకంబు
అల్లంబు, బెల్లంబు, అరిటి పండు
తేనెతో మాగిన తియ్యమామిడి పండు
అచ్చన్న వరదాళు, బుచ్చికేశవులు ''

నాకు నాలుగేళ్లు నిండకమునుపే కంఠస్థమైన సర్రియలిస్టు పద్యం యిది ఎవరు చదవమన్నా విసుగులేకుండా చదివేవాణ్ణి నాయుడు పిల్లలతోనూ, నాకన్న చాలా పెద్ద పిల్లలతోనూ తిరుగుతూ అడలపాటలు - ''కొండామీదా వెండీ గిన్నా - కొక్కిరాజా కాలూ విరిగే'', ''కాళ్ళ గజ్జీ, కంకాళమ్మా'' లాటివి నానోటికి వచ్చాయి

ఆ రోజుల్లో పద్యానికీ, వచన కవిత్వానికీ తేడా లేదు ''అనగా అనగా ఒక రాజు ఆరాజుకు ఏడుగురు కొడుకులు ఏడుగురూ వేటకెళ్ళి ఏడు చేపలు తెచ్చారు ఏడు చేపలూ ఎండేస్తే ఒక్క చేపా ఎండలేదు చేపా, చేపా ఎందుకెండలేదు? గడ్డి అడ్డం వచ్చింది గడ్డీ, గడ్డీ ఎందుకడ్డం వచ్చావు? ఆవు మెయ్యలేదు ఆవూ, ఆవూ ఎందుకు మెయ్యలేదు? గొల్లాడు కాయలేదు గొల్లాడా, గొల్లాడా ఎందుకు కాయలేదు? అవ్వ బువ్వ పెట్టలేదు అవ్వా, అవ్వా ఎందుకు బువ్వ పెట్టలేదు? పాప ఏడుస్తున్నది? పాపా, పాపా ఎందుకేడుస్తున్నావు? చీమ కుట్టింది చీమా, చీమా ఎందుకు కుట్టావు? నా బంగారు బొక్కలో వేలుపెడితే నే కుట్టనూ?''

వేదాన్నయినా ఒక్క పిసరుమార్చ చ్చునేమోగాని, ఈ కథను ఎంతమాత్రమూ మార్చటానికి (నాకు) అధికారం లేదు నేను దీనిని ఎట్లా నేర్చుకున్నానో, అట్లాగే అరవై ఏళ్ళ అనంతరం నా మనుమరాళ్ళకు చెప్పాను

ఏది బాలసాహిత్యం? నాకు అక్షరాభ్యాసం చేయించిన పంతులుగారు నాచేత సుమతీశతకం అప్పచెప్పించాడు అందులో ఉన్న విషయాలు అనేకం నేను పెద్దయ్యాక గాని అవగాహనకాలేదు ఇంకొంచెం పెద్దయ్యాక క్లాసు పాఠాలకు సంబంధం లేకుండా రుక్మిణీ

కళ్యాణమూ, కుచేలోపాఖ్యానము (పోతన గారివి) కంఠస్థం చేశాను గజేంద్రమోక్షంలో ''లావొక్కింతయు లేదు'' తప్ప ఇంకేదీ కంఠస్థం చెయ్యలేదు - కారణం తెలీదు

చెప్పొచ్చిందేమంటే నా బాల్యంలో బాల సాహిత్య మంటూ ఏమీ ఉన్నట్టు గుర్తులేదు పిల్లలకు సాహిత్య పరనావశ్యకత అంటూ ఉంటుందనటానికి నావంటి వాళ్ళం స్వచ్ఛందంగా చదివిన పెద్దవాళ్ల పుస్తకాలు చిన్న పిల్లలకు తగిన భాష అంటూ కూడా లేదు మేం ఆనాడు చదివిన బాల సాహిత్యంలో భాష బతికున్న వాళ్ళ తెలుగు కూడా కాదు

ఇంగ్లీషులో కూడా ఇదే గమనించాను ఒకతరానికి చెందిన సాహిత్యం సంగ్రహపరచి, సుగమం చేసి, మరో తరానికి బాల సాహిత్యంగా రూపొందించారు బాసర్ కథలూ, షేక్స్పియర్ నాటక కథలూ పిల్లల కోసం ఇంగ్లీషులో ఏనాడో రాశారు ''రాబిన్సన్ క్రూసో'', ''గలివర్స్ ట్రావెల్స్'', ''అరెల్‌స్టీవెన్‌సన్'' నవలలూ పిల్లలకు పనికివచ్చేలాగా రచించటం జరిగింది

ఇది ఒకరకం బాల సాహిత్యం రాసినవారు లేకపోయినారు గాని, నా చిన్నతనంలో నేను పురాణకథలన్నిటినీ, సంస్కృత భాషలో చదవవలసి వచ్చేసరికి ఎక్కువ చదివే అవకాశం లేకపోగా ప్రాచీన సాహిత్యంతో స్థూలపరిచయం లేకుండా పోయింది

బాల సాహిత్యం ప్రయోజనాలలో ఒకటి ప్రాచీన సాహిత్యం గ్రంధాలతో ప్రధమ పరిచయం ఒకటి అని నా నమ్మకం కిందటి ప్రపంచయుద్ధం తరువాత ఇలాటి సాహిత్యం ''బొమ్మల'' - పుస్తకాలద్వారానో, ''చందమామ'' లాటి పిల్లల పత్రిక ద్వారానూ వెలువడింది

''చందమామ'' నిజంగా పిల్లల పుస్తకమా అని దబాయించి అడిగేవాళ్ళం మాతరం వాళ్ళం బాలసాహిత్యం కింద చదవటంతో పోక, కంఠస్థం చేసిన సాహిత్యం గురించి ఏమంటారో? ఈనాడు వెలువడే పిల్లల పత్రికలను నిజంగా పిల్లలు చదువుతున్నారు వాటిలో భాష కూడా పిల్లలకు అందుబాటులో ఉంటున్నది నాకున్న కొద్ది అభ్యంతరం ఏమిటంటే నుడికారం అప్పుడప్పుడూ దెబ్బతింటున్నది

ఇంకోరకం బాల సాహిత్యం జానపదకథలు, పూర్వసాహిత్యం జాతి సంస్కృతి తాలూకు సరిహద్దులను దాటిపోదు జాతి సంస్కృతిలో మార్పులు వస్తే బాల సాహిత్యంలో కూడా మార్పులు వస్తాయి స్వాతంత్ర్యం తరువాత మన పిల్లలకు పాత పాశ్చాత్య సాహిత్యం ముఖ్యం కాకుండా పోయింది కాని మన దేశభాషలలో వెలువడిన ప్రాచీన సాహిత్యంతో పరిచయం మరింత అవసరం కాలేదా? మన ఈనాటి బాల సాహిత్యంలో ఆ సాహిత్యాల ఛాయలేవీ?

జానపద సాహిత్యం అలాకాదు అది మానవజాతి అంత విస్తృతమైనది అన్నిదేశాల పిల్లలూ అన్ని దేశాల జానపద సాహిత్యాన్నీ తెలుసుకోవచ్చు జానపద సాహిత్యం ఎల్లలు లేని మహాసముద్రం అది మానవజాతి పురోగమనానికి అడుగడుగునా పునాదిగా పనిచేసింది మనుషులకు వేరువేరు పరిస్థితులలో అవసరమైన భావజాలాన్ని కథలరూపంలో శాశ్వతంగా ఉంచింది

జానపద కథలలోని దుష్టపాత్రలు ఏనాటికీ దుష్టపాత్రలే హీరోలు ఏనాటికీ హీరోలే పిసినిగొట్టులూ, బలమదాంధులూ, ధనమదాంధులూ, దుష్టపాలకులూ, కుట్రదార్లూ నాశనం కావాలి సజ్జనులూ, నిస్సహాయులూ రక్షించబడాలి ఇది వాస్తవ జీవితానికి ప్రతిబింబం కాదు వాస్తవ జీవితానికి ఆదర్శం

వాస్తవ జీవితం వేరు పరిణామదశలలో అనేక "అక్రమాలను" ఆమోదించింది, గొప్ప చేసింది కూడా జాతి జీవితం మారి, రాజ్యాలూ, రాజరికాలూ, వచ్చినప్పుడు రాజుకు దైవత్వం ఆమోదించారు కాని జానపద కథలలో మంచిరాజులూ, చెడ్డరాజులూ తప్ప దైవాంశగల రాజులుండరు చెడ్డరాజులు శిక్ష పొందుతారు అలాగే ఫ్యూడల్ వ్యవస్థ పూర్తిగా అధికారులు ప్రజలను దోచుకు బతికడం మీద ఆధారపడింది కాని జానపద కథలలో ప్రజా పీడితులైన రాజోద్యోగులు తప్పక శిక్షపడతారు స్మృతులు కూడా ఆమోదించిన వడ్డీవ్యాపారం జానపద కథలలో దుర్మార్గపు వృత్తి ఈ విధంగా వాస్తవ జీవితానికీ, జానపద కథలకూ ఎన్ని తేడాలైనా గమనించవచ్చు రాజ కుమార్తె కాపువాడి కొడుకును పెళ్లాడితే జానపద సాహిత్యంలో అది విడ్డూరంకాదు జీవితంలో అపూర్వం మొత్తం మీద జానపద సాహిత్యంలోని ధార్మిక, నైతిక విలువలు జీవితంలోని వాటికన్నా హెచ్చు శాశ్వతమైనవిగా కనబడతాయి పిల్లలకు ఇలాంటి సాహిత్యం ఉన్నత లక్ష్యాల మీద గురి నిలుపుతుంది

బాలగేయాలను గురించి కూడా ఒక్కమాట చెప్పుకోవచ్చు ఆధునిక యుగంలో అనేకమంది బాలగేయాలు రాశారు, రాస్తున్నారు అయితే ఇవాళ పుట్టి రేపు విస్మరించబడే గేయాలకు బాలసాహిత్యంలో విలువ లేదు జానపద కథల విషయంలో లాగే బాలగేయాలకు కూడా మన్నిక గీటురాయి

ఇవాళ కృత్రిమ జానపద కథలు అనేకంగా వస్తున్నాయి అలాగే బాలగేయాలూనూ వీటి మన్నిక ముందు ముందుగాని తెలియదు

పాశ్చాత్యదేశాలలో బాలసాహిత్యం కింద బళ్ళకొద్దీ తయారవుతున్నది ఇది ప్రాచీన సాహిత్యం తాలూకు లఘురూపంకాదు, జానపద కథలూ కాదు - ఆధునిక జీవితం గురించి ఆకర్షవంతంగానూ, చాలా వరకు వాస్తవిక దృష్టితోనూ చేసిన రచనలు ఇవి పిల్లల భావనాశక్తిని పెంచుతాయనిగాని, వారికి నైతిక బలాన్నికలిగించి మానవసంబంధాలలో ఉదార లక్షణాలను బలపరుస్తాయనిగాని నాకు నమ్మకం కలగటం లేదు కాని ఆనాటి నాగరిక ప్రపంచం ఇటువంటి బాలసాహిత్యాన్ని సృష్టిస్తున్నది

అన్ని రకాల బాల సాహిత్యంలోనూ మరీ చచ్చుది బాలలకోసం, బాలల గురించి, బాలలు రచించేది! ఇటువంటి బాలసాహిత్యం కూడా తెలుగులో రావటం జరిగింది

*శ్రీ రాజ్యలక్ష్మీ ఫౌండేషన్ సమర్పించు ప్రత్యేక సంచిక "రాజకమలం" - ఎడిటర్ - పురాణం సుబ్రహ్మణ్య శర్మ - 1981*

# 1. సాహిత్య విమర్శ - రాచకీయాలు

ఇదే శీర్షికతో ''పాప'' రచించిన వ్యాసం ఒకటి 22 అక్టోబరు '' ఆనందవాణి'' సంచికలో పడింది అందులో రచయిత ప్రకటించిన అభిప్రాయాలూ, విశ్వాసాలూ చర్చనీయంశాలే గాక, ఇదే ధోరణిలో అనేక మంది చదువుకున్న వాళ్లు రాజకీయాలను గురించీ, సాహిత్యం గురించీ వాటికిగల పరస్పర సంబంధం గురించే ఆలోచిస్తున్నట్టు రూఢి అవుతూ ఉంది శ్రీ జి వి కృష్ణారావుగారు కొంతకాలం క్రితం రచించి ప్రకటించిన ''కావ్యజగత్తు'' చదివిన వారికి ''పాప'' గారి వాదనలోలోపం ఏమిటో సులభంగానే తెలిసిపోతుంది అయినా ఈ వ్యాసంలో గల అభిప్రాయాలను గురించి కొన్ని ముక్కలు నా సొంతాన రాయటానికి ''ఆనంద వాణి'' సంపాదకులు అనుమతీ, పరితల అనుమతీ, ''పాప'' గారి అనుమతీ వేడుకుంటున్నాను

వ్యాసం చివరను పై రచయిత తమ వాదం యొక్క సారాంశాన్ని రెండు ముక్కల్లో చెప్పారు ఒకటి, '' ఏకాలపు కవిత్వాన్ని ఆ కాలపు విశ్వాసాలనించి విడదీసి చూడ్డం పొరబాటు విశ్వాసాలకు విలువ మారుతుంది విలువ మారినంత మాత్రాన ఆ విశ్వాసాలు మొదటి నించీ అనర్థదాయక మయినవని అనడానికి వీలులేదు '' ఈ ముక్కల్లో ఉన్న భావం కనిపించినంత సరళం కాదు ఏ పన్నెండో శతాబ్దంలోనో రచించిన ఒక కావ్యం ఆ శతాబ్దంవారి విశ్వాసాలకు - ఆశకంలో విశ్వాసాలంటూ ఉన్నవారి అభిప్రాయాలకు - పూజ్యార్హంగా తోచి ఉండి నట్టయితే దాని విలువను మనం సంశయించటం పొరపాటని రచయిత ఉద్దేశం అయితే ఈ ఉద్దేశంతో మనం ఏకీభవించ నవసరంలేదు ''మనుచరిత్ర'' కృష్ణదేవరాయలకి గొప్ప గ్రంధమా కాదా అనేది నన్ను బాధించనవసరంలేదు నేనీనాడా గ్రంధాన్ని చదవవలసివస్తే అది నాకు సాహిత్యం అవునా కాదా అని తప్పక విచారిస్తాను విశ్వాసాలు మారతవన్నారు గనక విశ్వాసాల వెంట సాహిత్యం గురించి అభిప్రాయాలూ మారాలి లేని పక్షంలో అనేక అభిప్రాయాలతోనూ విలవలతోనూ కూడుకుంటూ వచ్చిన అత్యుత్తమ సాహిత్యం గంపెడు పెరిగి మనకు ఊపిరాడకుండా పోతుంది

అట్లాకాక రచయిత యొక్క ఉద్దేశం మనం పాత సాహిత్యాన్ని విమర్శించేటప్పుడు ఈనాటి విశ్వాసాలతో విమర్శించ కూడదని అయి ఉంటే అదీ ఆటే సమంజసం కాదు ఎందుకంటే మనం పాత సాహిత్యాన్ని విమర్శించటం ఆ సాహిత్యం వెనుక ఉన్న విశ్వాసాలను తప్ప మరి దేన్ని విమర్శించగలం? మనుచరిత్ర కృష్ణదేవరాయల అభిప్రాయాల ప్రకారం కూడా గొప్ప గ్రంధం కాదని నిరూపించటానికి ఎవడు పూనుకోగలడు? ఈనాటి విమర్శకుడు చేయగలిగినదల్లా కృష్ణదేవరాయల ఆనాటి అభిరుచిని ఈనాటి సంస్కారంతో విమర్శించటం మాత్రమే, ''పాప''గారు విమర్శించిన వ్యాసకర్త ఎవరో చేస్తున్న పని ఇదే - రకరకాల ఆదర్శాలను విమర్శిస్తూ ఉన్నాడు ''పాప'' గారి అభ్యంతరం ఏమిటి?

విశ్వాసాలకి విలువ మారినంత మాత్రాన అవి మొదటినుంచీ అనర్థదాయకమైనవి కాదనటం చర్చనీయాంశం విలువలు మారటమనేది సాంఘిక పరిణామం వెంట ఏర్పడుతూ వచ్చింది మార్క్సిస్టు భాషలో దోపిడి చేసిన వర్గాలవారు ఏర్పరచిన విలువలు దోపిడికి గురి అయిన వర్గాల వారి విజృంభణతో మారటం జరిగింది దోపిడి విధానానికి బాహ్యంగా ఉంటూ వచ్చిన విలువలు ఎప్పుడూ మారలేదు దోపిడీ అయిన వర్గం వారికి

నోరులేనంతకాలమూ వారి విలువలకు చలామణీ ఉంటూవచ్చింది అంత మాత్రాన ఆ విలువలు కొంత కాలంపాటు న్యాయమైనవిగా ఉండి అటు పిమ్మట వాటికి వృద్ధాప్యం వచ్చిందనుకోవటానికి ఆధారంలేదు ఈ విషయం ముందు మళ్ళా చర్చిస్తాం

''పాప'' గారి రెండో సిద్ధాంతం ''ఫలాని రకపు కవిత్వం వ్రాయాలని పదిమంది కూర్చుని తీర్మానించిన కారణం చేత మంచి కవిత్వం రాదు రాజకీయాలలోలాగ సాహిత్యం సమిష్టి మీద నడపవలసిన ఉద్యమంకాదు

ఫలాని రకపు కవిత్వం వ్రాయాలనీ పదిమంది కూర్చుని తీర్మనించాలని ఎవరూ అనరు ఫలాని రకపు కవిత్వం రాయటం మానాలని తీర్మానించటం జరుగుతుంది, అందులో తప్పులేదు జీవితం గురించి తగుమాత్రం తెలిసినవాళ్ళకి ఏరకం కవిత్వం ఏసమయంలో సంఘానికి హానికరంగా పరిణమించేదీ తెలుస్తుంది వీళ్లని మనం విమర్శకులంటాం విమర్శకుడి ఉత్తమ ప్రయోజనం అద్భుతగలటం (కార్లయిలులో ఏకీభవించనందుకు నన్ను ''పాప'' గారు మన్నిస్తారు గాక!) కళల తాలూకు సమర్థతాసమర్థతలు భావుకులు నిర్ణయిస్తారు సామాన్య ప్రజను అవి బలవత్తరంగా ఆకర్షించగలవు వాటివల్ల సంఘానికి ప్రమాదం జరగకుండా ఆపగలవడెవడు? విమర్శకుడు సంఘం కళల ద్వారా నిర్వీర్యం కాకుండా చూడటం విమర్శకుడి ఉత్తమ ధర్మం

ఇక సాహిత్యం రాజకీయాల్లోలాగ సమిష్టి మీద పడవలసిన ఉద్యమం కాదనటానికి ఆధారం ఏమిటి? రాజకీయాలు సమిష్టి మీద పడటానికీ మాత్రమే వేళ అయిందని, సాహిత్యానికింకా వేళ కాలేదని ''పాప'' గారు దేన్ని బట్టి నిర్ణయించారు? చాలా మందిమి ఈ రెంటికీ ఒకటే వేళ అనుకుంటున్నాం

జీవితం ''వ్యాప్తి'' చెందుతున్నది ఒకప్పుడు సాంఘిక చైతన్యం - కదలించే శక్తి మాత్రమే కాదు కదలగల శక్తి - సంఘంలో కొద్ది మందిని ఆవరించి ఉండేది మనకళ్ళ ఎదట గ్రంధకర్తలు సినేరియోలు రాయటం ప్రారంభిస్తున్నారు పదిమంది కోసం సాహిత్య సృష్టి అయే రోజులు వెళ్ళినై, ఇప్పుడు సాహిత్యం లక్షలమంది మీదుగా వెళుతున్నది ఏశక్తులైతే జనసామాన్యానికి వోటింగు అధికారం తెచ్చినాయో, ఆ సాంఘిక శక్తులే చవుక పుస్తకాలు సాధ్యం చేసినై ఒక్కొక్క కవి ఒక్కొక్క పద్ధతిగా వ్రాసి పారేసిన తరువాత ''సాహిత్యానికి రూపం ఏర్పడటం'' మాట ఎట్లా ఉన్నా ఆ పారేసిన సాహిత్యంలో చాలా భాగం ప్రజలు ఏరుకోకుండా చూడటానికొక ఉద్యమం అవసరం అవుతుంది

''పాప'' గారు ఈ సందర్భంలో ఒక పెద్ద భ్రమలో పడుతున్నట్టు నాకు తోస్తున్నది, కలం పట్టి రాయగల ప్రతివాడూ automatic గా సంఘాని కుపకరించే సాహిత్యమే రాస్తాడనీ, అతన్ని ప్రేరేపించే ప్రేరణలు సంఘ విద్రోహకరంగా ఉండటాని కవకాశం లేదనీనూ ఇది నిజమయితే ''పాప'' గారు నమ్మకంగా పొరబడుతున్నారు ఆయనొక్కసారి చుట్టూ కలయ చూస్తే ఈ అభిప్రాయం తప్పక మారుతుంది సాహిత్యం మంటే పద్యాలేకాదు పాకిస్తాను కావాలనే వాళ్ళూ, వొద్దనేవాళ్ళూ, ఫలాని రాజకీయ సిద్ధాంతాలు తప్పనేవాళ్ళూ, కాదనే వాళ్ళూ నిత్యమూ సాహిత్యం సృష్టిస్తున్నారు

ఈ సాహిత్యం నుంచి రాజకీయ వాతావరణంతో కూడుకున్న కథలు మరో మెట్టు మాత్రమే ఈనాటి జర్మనుల ప్రవృత్తులకీ, హిట్లరు వాళ్ళ చేత చదివించిన సాహిత్యానికీ, రష్యనుల మనస్తత్వానికీ, వాళ్ళు చదువుతూ వచ్చిన సాహిత్యానికీ సంబంధం లేదని ఎవరనగలరు?

ఇక వ్యాసంలో ''పాప'' గారెత్తుకున్న కొన్ని విషయాలు చూతాం ''సుకవితా యద్యాస్తి రాజ్యేనకిం?'' అని ఎవరో అన్నారట ఎవరన్నారో నాకుతెలీదు ఎందుకన్నదీ ''పాప''గారు చెబుతున్నారు ఒప్పుకోవచ్చు కాని దాన్నివిమర్శించిన వారి మీద ''పాప'' గారు కూడా కొంచెం కోప్పడ్డారు ఈ సందర్భంలో నేను మరో ఉదాహరణ చెబుతాను వెనక తిరువాన్కూరు మహారాజు ''పని చాలా గౌరవనీయమైనది'' అన్నాట్ట ఈ ముక్కనా చిన్నతనంలో ఓ పార్య పుస్తకంలో చదివాను ఆ మాట అన్న తిరువాన్కూరు మహారాజు నిజంగా కష్టపడి పని చేసిన వాడే అయి ఉండొచ్చు ఆ పెద్ద మనిషి మీద నాకెటువంటి సంశయమూ లేదు కాని ఈ సంగతి నాతో చెప్పే పెద్దమనిషిని చాలా శంకిస్తున్నాను పని చాలా గౌరవనీయమైన దనటంలో నేనూ తిరువాన్కూరు మహారాజావారూ ఏకీభవించాం

కాని ఈ మధ్య వచ్చిన పెద్దమనిషి మాటేమిటి? ఇతను నాచేత పని చేయించటానికీ ముక్క పారంలో పెట్టలేదని నాకేమిటి నమ్మకం? మరో ఉదాహరణ ఫ్రాంక్ కాప్రా Meet John Doe అనే చిత్రం తీశాడు ఆ చిత్రంలో ఒక వ్యక్తి మీద అభిమానం కొద్దీ లక్షల మంది జనం కళ్లబ్బులు సాగిస్తారు ఈ జనానికి రాజకీయాలతో ఎటువంటి సంబంధమూ ఉండరాదనేది సమర్థించటం చిత్రంయొక్క ప్రధానాశయం ఇందులో ద్రోహబుద్ధి ఉందని రాజకీయాలలో వాస్తవిక వాదులకి వెంటనే తెలిసి పోతుంది సాహిత్య చరిత్రకూ, రాజకీయ చరిత్రకూ, మానవ చరిత్రకూ గల సంబంధాన్ని ఆమోదిస్తూ ''పాప'' గారు తాత్విక చరిత్ర కూడా ఉంటుందంటున్నారు ఈ తాత్విక చరిత్ర మనం మిగిలిన చరిత్రలను బట్టి ఊహించరానిది ఎంతమాత్రమూ కాదు, యదార్ధ తత్వాన్ని దోపిడి విధానాల కనుకూలంగా సంస్కరించగా ఆ దోపిడి విధానం అమలులో వున్న సంఘం తాలూకు తాత్విక చరిత్ర అవుతుంది దోపిడి విధానంలో మార్పు కలిగినప్పుడల్లా యధార్ధ తత్వాన్ని ఆవేశించి ఉండే సంస్కరణ కూడా తదనుగుణంగా మారుతుంది బూర్జువా వర్గాలు పై చెయ్యిగా ఉన్నంతకాలమూ బానిసలను గురించిన తత్వ విచారమే జరగలేదు కాని పారిశ్రామిక విప్లవం జరిగి, తమకాయకష్టాన్ని అమ్ముకునేటందుకు స్వతంత్రజీవులు కావలసి వచ్చేసరికి సాంఘికతత్వ చరిత్రలో కూడా విప్లవం జరిగి బానిసత్వం చట్టం ద్వారా నిర్మూలించబడింది ఆ విధంగానే రేపు ప్రపంచ వ్యవస్థ నిర్మాణం అయేటప్పుడు అమెరికా వారిది పెద్దనోరై ఇండియా వంటి దేశాలకు బలవంతాన అయినా స్వాతంత్ర్యం అంటగడతారు రహస్యం యేమిటంటే వాణిజ్యపు దోపిడికి బానిసదేశాలు అనువైనవి కావు ఇందులో ఇంతకంటే రహస్యం లేదు

''నాలుగు వర్ణాలూ పేచీ పూచీ లేకుండా కాలక్షేపం చేసిన రోజులుండి ఉంటాయి,'' అంటున్నారు ''పాప''గారు చెన్నపట్నం జూలో ఇటువంటి శాంతి నేను చూశాను ఒక అలవలో రెండు పాములూ రెండు కప్పలూ ప్రశాంతంగా నివసిస్తూ ఉన్నై నా అనుభవం మీద చెప్పాలంటే కప్పలకీ పాములకీ తగిన సఖ్యత! ఇదే సఖ్యతతో చాలాకాలంగా మనం బానిసత్వం ఆమోదించి ఉన్నాం రుమేనియాలో మిత్రమండలివారు కాలు పెట్టేవరకూ జర్మనులకూ పౌరులకూ ఏమీ పొరుపూ పొచ్చుమూ లేనేలేదు! రాను రాను విలువలు మారి ఆఖరుకు తక్కువ కులాలవారు కులకట్టు ప్రకటించి అగ్రవర్ణాల మీద తిరుగుబాటు చెయ్యటం సంఘానికెంతో మేలయిందని ''పాప'' గారామోదించి నట్టయితే నాలుగు వర్ణాలేర్పడినప్పుడే సంఘానికి ద్రోహం జరిగిందని నేను వేరేనిరూపించ నవసరం లేదు

''వర్గ పోరాటం'' మొదటినించీ లేదని ''పాప''గారు సంశయించ నక్కరలేదు వర్గపోరాటానికి రెండు పక్షాలూ సమబలం గలవి కానక్కర్లేదు పారిశ్రామిక యుగారంభంలో, పనివాళ్లకు నోరేలేని రోజుల్లో, పెట్టుబడిదార్లు పని వాళ్లనెంత అమానుషంగా దోచుకున్నారో, వారిని ఎటువంటి పరిస్థితుల్లో ఉంచారో, ఓవెన్ తన వర్గానికే ఎందుకెదురు తిరిగాడో తెలిస్తే ''పాపా''గారు వర్గపోరాటం యొక్క తత్వం గుర్తిస్తారు ఏ వర్గ పోరాటమూలేనిదే మానవులు పాకీ పని చెయ్యటానికీ, మంగలి పని చేయటానికీ, చాకలిపని చెయ్యటానికీ ఎందుకు పాల్పడతారో ''పాప'' గారు చెప్పాలి వర్గపోరాటం ఉండి ఉండటానికి ప్రోలిటేరియట్ కాని, ఈనాటి రకపు వర్గ చైతన్యం కాని అవసరం లేదు ఈనాటి సరికొత్త పారిశ్రామిక దోపిడికి ఫలితం ప్రోలిటేరియట్

''సర్వ స్వతంత్రుడైన రాజు పరిపాలన క్రింద రాజ్యాలున్నప్పుడు కూడా జాతి మొత్తం మీద ఉచ్చులో ఉండడం, జీవంతో కలకలలాడుతూండడం చరిత్రలో లేకపోలేదు'' అంటున్నారు ''పాప''గారు కాని అజ్ఞానమూ, కలకలా సంఘంలో ఏ భాగాన్ని ఆవేశించినట్టు? బ్రిటిషువారిని భారతీయ చరిత్ర రాయనిస్తే అందులో సహజంగా బ్రిటిషువారి పరిపాలనకు తోడ్పడి బాగుపడిన తరగతులవారి కలకల బోలెడుంటుంది చేతులు తెగగొట్టించుకుని పరిశ్రమలనూ, శిల్పులనూ కోల్పోయిన వారి కలకల ఏమీ ఉండదు, పెట్టుబడిదారీ విధానంలో ఉన్నకుళ్లు యావత్తు బయట పడింది వ్యాపార విజృంభణలోకాదు దాని వెంటే వచ్చిన డబ్బు కాటకాల సమయాల్లో ఇతరదోపిడి విధానాలు చరిత్ర కూడా అదే ఈ సంగతి మార్క్సు చదివిన ''పాప'' గారికి నేను నొక్కి చెప్పనవసరం లేదు '' ఒక్కొక్క వ్యవస్థలోనూ సహజంగా ఉన్న లోపాలు తెలిసిపోయి, అప్పుడు మానవుడు ఆయా వ్యవస్థలను మార్చడానికి ప్రయత్నిస్తాడు అవును ఆయా వ్యవస్థల్లో సహజంగా ఉండే లోపాలు ఆయా వ్యవస్థల్లో ఉండే దోపిడివిధానం ద్వారా ఏర్పడినవి, దాన్ని మార్చడానికి ప్రయత్నించే మానవుడు అంతదాకా దోపిడికి గురి అయిన మానవుడు ఇటువంటి మార్పులతోనే జీవితం ''వ్యాప్తి'' చెందుతూ వస్తున్నది ''మానవుడు'' అనే ముక్క అన్నియుగాలలోనూ ఉండిన అందరు మానవులకూ ఉమ్మడిగా వాడటానికి ''పాప''గారు ప్రయత్నించారు ఈ ప్రయత్నం వల్ల ''పాప''గారు సత్యం తెలుసుకోలేరు

''రాజనీతీ, దండనీతీ, వ్యక్తి సంఘంలో ఏర్పడ్డ నిబంధనలూ, అన్నీ కూడా సమిష్టిమీద అందరూ సుఖంగా బ్రతకడానికని ఏర్పరుచుకున్నవే,'' ఇది చాలా వింత విశ్వాసం! ఈనాటికి కూడా ప్రజా ప్రభుత్వాలు ప్రపంచమంతటా ఏర్పడ లేదు ఇంతమంది మానవులు మేలుకున్నప్పటికీ అందరికీ ఒక న్యాయచట్టం లేకుండా ఉంది, ప్రజా ప్రతినిధులే ప్రజలను బట్టబయలుగా గోతుల్లోకి తోస్తున్నారు! ''పాప'' గారు ఏనాటి సంఘం గురించి పై ముక్క అంటున్నది ఊహించరాకుండా ఉంది

''వాల్మీకి శ్రీ రామచంద్రమూర్తిని దేవుణ్ణిచేసి పొగిడినందువల్ల అతను ఈనాటి రాజకీయ సూత్రాల ప్రకారం సామ్రాజ్యవాది అనడం అసలైన విమర్శకాదు వాల్మీకి విశ్వాసంలో నైర్మల్యం ఉంది, స్వచ్ఛత ఉంది అందులో గొడవలు ఏమీలేవు అతనికి తెలిసిందల్లా రాముడు మంచివాడనీ, అతని ప్రవర్తన లోకానికి మంగళ కరమనీ ''

''పాప'' గారికి చారిత్రక దృష్టి లేదంటాను రాముడు అనార్య స్త్రీలని చంపాడు ముక్కులూ చెవులూ కోయించాడు, ఇతర జాతుల సహాయం పొంది వాళ్ళలో బలవంతులైన వారినీ, రావణుణ్ణీ చంపాడు సుగ్రీవుణ్ణీ, విభీషణుణ్ణీ భ్రాతృ ద్రోహులుగా తయారుచేశాడు, వాళ్ళ రాజకీయాల్లో జోక్యం కలిగించుకొని తన ఏజెంట్లకు పట్టం కట్టాడు, ముక్కు మూసుకుని తపస్సు చేసుకుంటున్న శూద్రుడి గొంతు కోశాడు, దక్షిణ వాసులను రావణుడి ''బారి'' నుండి ''విడిపించినందుకు'' పరిహారం కింద రామేశ్వరంలో ఒక ఈశ్వరాలయం - వాళ్ళ దేవుడికి గుడి కట్టించి తన పేరు ఆ ఈశ్వరుడి పేరుతో జోడించ నిచ్చాడు ఒకప్పుడు ఈ శివుని విల్లే విరిచి తనశాండోతనం రుజువు చేసుకొన్నప్పటికినీ! ఈ అపర (పూర్వ!) హిట్లరు తాలూకు చరిత్రను ఇతరుల ప్రేరణ మీద వాల్మీకి ఒక మహత్తరమైన మైన్‌కాంఫ్ గ్రంథంగా రచించాడు రాముణ్ణి గురించి సరియిన భావం వాల్మీకికి లేదనటం చాదస్తం - కేవలం పొరపాటు కాదు రాముణ్ణి గురించి ఏమనుకున్నదీ మనం సులభంగానే ఊహించవచ్చు, రామాయణంలో కీర్తించబడిన మహానుభావులు పట్టెడుమందిలోనూ గట్టిగా అరడజను అనార్యులు లేరు వాళ్లల్లోయిద్దరు క్విజ్లింగులూ, ఒక పల్లెవాడూ, ఒక ఊరూ పేరూ లేని ముసలిదీనూ! రాముడి వాతబడిన బలవంతులైన అనార్యులు రాక్షసులూ, దుర్మార్గులూనూ!

ఇదంతా చెబితే ''పాప'' గారు తప్పుపడతారు నేను వాల్మీకి దృష్టినించి రామాయణం చూడటం లేదంటారు! అవును, చూడటం లేదు నేను రామాయణం ఆమోదించ గలిగితే హిట్లరునూ, ఫాసిజమునూ ఆమోదించగలగి ఉండేవాణ్ణే

వాల్మీకి యుగంలో సామ్రాజ్యవాదం వాణిజ్యార్థం కాకపోవచ్చు, వ్యాసుడికి పెట్టుబడిదారీకి చెందిన దోపిడి విధానం తెలియక పోవచ్చును, కాని దోపిడీ విధానం వెనక ఉన్న సంఘ విద్రోహ శక్తులు వాల్మీకి నాటి నుంచి హిట్లరు నాటి వరకూ ఒక రకంగానే ఉన్నవనీ, వ్యాసుడి కాలం నుంచి మార్క్సు కాలం వరకూ బుద్ధిమంతుడు దోపిడిని గుర్తించి ఎదిరించటంలో ఒకే వైఖరి అవలంబించాడని మనకు స్పష్టంగా రుజువవుతూ ఉంది

''పాప'' గారన్నట్టు మార్క్సు చారిత్రక పరిశోధనా విధానాలని ''ఫ్రాయిడు'' వంటి విజ్ఞాన శేఖరులు కొందరామోదించక పోయి ఉండవచ్చు, కాని మార్క్సు మూల సిద్ధాంతాలుదోపిడి చేసే వర్గాలవారి ప్రచారాల మీదా, వారు ఆకాశానికెత్తే సాహిత్యం మీదా కాక, కొన్ని శాస్త్రీయమైన సూత్రాల మీద యధార్థతత్వంతో కూడుకొని ఉన్నవనేదే ప్రధానాంశం ''లోకాన్ని అంతనీ కవితా వస్తువుగా చేసి కవిత్వం చెప్పు''లంటే లోకం చాలా పెద్దది గానూ, జీవితం చాలా క్లిష్టంగానూ తయారయి కూచుంది లోక వ్యవహారాలు ఒకదాన్నుంచి ఒకటి విడిరాకుండా ఉన్నై అమెరికను చిత్రాలలో శృంగార కళనించి రష్యాపై విరుద్ధ ప్రచారమూ, ప్రోరూజువెల్టు ఎన్నికల ప్రచారమూ విడదీయటానికి స్టీము రెంచిలు అవసరం అవుతున్నవి ఇంత చండాలంగా తయారైన జీవితంలో కొంత మందికి మార్క్సు పుస్తకం ఆధునిక వేదమల్లే కనిపిస్తే, అందుకు వాళ్ళు క్షంతవ్యులు కాకపోతారా అనుకుంటున్నాను

*ముద్రణ ఆనందవాణి వారపత్రిక, 12-11-1944*

*పునర్ముద్రణ సాహిత్య ప్రయోజనం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, అక్టోబరు 1969*

# 2. రచయితలకొక హెచ్చరిక

ఇది సంధ్యాసమయం ప్రపంచమంతటా మానవ జీవితంలోకొంత శాశ్వత పరివర్తన కలగబోతున్నది వివిధ వృత్తుల వారు, వివిధ విశ్వాసాల వారు ఒకసారి చుట్టూ కలయజూసుకోవలిసిన సమయం వచ్చింది రాజకీయాలూ, ఆర్థికాలూ, మతాలూ, ఉద్యోగాలూ, ఆచారాలూ వెనక ఉన్నట్టు ముందుండబోవు

ఈ సంధిలో రచయితల భావి పరిణామం ఏమిటి?

ఇదివరకల్లా ఏదో బూటకం ఆడి భేషజం చేసి రాతగాళ్ళనిపించుకోవటానికి సులువు మార్గాలవలంభించాం జీవితం మన కోసం వేచి ఉండలేదు జీవిత ప్రవాహాన్ని మనం తృణమాత్రం అరికట్టలేదు అందులో కలిగిన మార్పులకి మనం ఏ విధంగానూ సహాయపడలేదు కనీసం ఈ రకంగా జరగబోతుందని జోస్యం కూడా చెప్పలేదు మనలో ఎవరన్నా జోస్యం చెప్పి ఉంటే అది నిజమయిన దాఖలా కూడా లేదు

మన సమాజం కూడా మన ఎడల అల్పసంతుష్టే కనబరుస్తూ వచ్చింది మనలో ఉన్న కొద్ది శిల్పానికి ఆహ్లాదం కనబరిచింది మన అనుభవాన్ని గాని, వివేచనా శక్తిని గాని సమాజం స్తనశల్యపరీక్ష చెయ్యలేదు బిరుదులూ, సన్మానాలూ చాలా చౌకగా లభించినాయి మన ప్రేమ కథల్లో మానవ ప్రేమ లేకపోయినా, మన వాస్తవిక రచనల్లో అర్థం లేని ఊహాలే జాస్తిగా ఉన్నా సమాజం మనని అటే విమర్శించలేదు ఆఖరుకు మనం అభ్యుదయ రచనలు రాయటానిక్కూడా సులువుమార్గాలవలంబించాం

ఇకముందు ఈ విధంగా వెళ్లదనుకోవటానికి చాలా కారణాలున్నాయి మొదటి ప్రబలమైన కారణం, ప్రజా సమూహాలని చరిత్ర తట్టి నిద్ర లేపోతున్నది "మనం ఏ ప్రపంచంలో ఉన్నాం? ఈ ప్రపంచం ఏయే కేంద్రాల మీద పరిభ్రమిస్తున్నది? మన జీవితాలకు కాలవలు గట్టి మురికి కూపాల్లోకి ప్రమోంపజేస్తున్న శక్తులేమిటి?" అనే సందేహాలు వారిని బాధించటం జరుగుతుంది వాళ్లకి అబద్ధపు సమాధానాలివ్వటానికి తయారుగా ఉండే సంఘద్రోహులున్నారు మన రాతల్లో వారికి సమాధానాలు కనపడని పక్షంలో చాలా దుష్ప్రచారాలనే నమ్ముతారు అందుచేత మనం ముందుగా మన కనీస ధర్మాలని గుర్తించటం అవసరం

రాతగాడి కనీస ధర్మాలేమిటి? విజ్ఞానమూ, అనుభవమూ, వివేచనా, శిల్పమూ - ఈ నాలుగూ రాతగాడి ఆయుధాలు, విజ్ఞానం ఎప్పుడూ బయటి నుంచి రావలిసిందే పుస్తకాలూ, సంపర్కమూ విజ్ఞానం పెంపొందిస్తాయి అనుభవం విజ్ఞానాన్ని సమగ్రం చేస్తుంది వివేచన చారిత్రకమైన అవశ్యకతను నిర్ణయిస్తుంది - ఎందుకంటే ఎంత విజ్ఞానానుభవాలతో కూడుకున్న రచనలయినా కాలానుగుణ్యమైన ఆవశ్యకతను గుర్తించనట్టయితే వ్యర్థ రచనలే అవుతాయి శిల్పం, లేక రచించే శక్తిపై మూటికన్నా అల్పమైనది

ప్రస్తుతం మనలో శిల్పం మించి అటే దూరం వెళ్లిన వారు అరుదు మిగతా మూటిలోనూ ముఖ్యంగా మనం కృషి చెయ్యాలి ప్రత్యేకించి విజ్ఞానానుభవాల్లో మనం సంతుష్టి అనేది పొందనే రాదు ఓ పాతిక సంవత్సరాలు రాయగారాయగా ప్రపంచాన్ని సింహావలోకనం చేసే శక్తి దానంతట అదే వస్తుందనుకోవటం కల్లో మాట

ముందు విజ్ఞానం విషయంలో మన రచయితలం ఏ సామాన్యపు కమ్యూనిస్టు చదివే పుస్తకాలు కూడా చదవం రాజకీయాలను గురించి మనకు, రోజూ పత్రిక తిరగేసే వాళ్లకున్న జ్ఞానం కూడా లేదు అనుభవం విషయంలో, ప్రజలతో కలిసి పని చేసే కార్మిక కర్షక సంఘాల వారిలో మాట్లాడే అర్హత కూడా లేని స్థితిలో ఉండి కవిశార్దూలాలూ, కథక సింహాలూ కాగలుగుతున్నాం మన వివేచన గురించి వేరే వర్ణించనవసరం లేదు, ఏ వారపు దినపత్రికలయినా చదివి ఆ వారంలో వెలువడిన వార, మాసపత్రికలు తిరగేస్తే జీవితానికీ, మనం రాసే విషయాలకూ సంబంధం లేదని ఇట్టే బోధపడిపోతుంది మనం ఒక కథ రాసినా, నవల రాసినా, వ్యాసం రాసినా, గీతం రాసినా సందర్భశుద్ధి ఉండటం లేదు

ఏ చెత్తో రాసి మనం ఇంత కీర్తి దురద తీర్చుకోగలుగుతున్నప్పుడు కష్టపడి ఈ కృషి యావత్తూ ఎందుకు చెయ్యాలి? చెయ్యని పక్షంలో మనం అప్రయత్నంగా సంఘ విద్రోహులం అయిపోయే కాలం వస్తున్నది వెనకటి యుద్ధంలో కొన్ని దేశాలు తటస్థంగా ఉండగలిగినాయి ఈ యుద్ధంలో తాటస్థ్యం వహించిన వారు మానవ ద్రోహుల కింద చేర్చబడ్డారు ఈ మార్పే సంస్కార ప్రపంచంలోనూ రాబోతున్నది - వచ్చేసింది కూడానూ రచనలకొక సాంఘిక విలువ దానంతట అదే ఏర్పడుతున్నది అది రచనల మహిమ కాదు, కాల మహిమ కాల మహిమని కూడా సకాలంలో గుర్తించలేని మనం రచయితలమనిపించుకునేటందుకు అర్హులం కాకుండా పోగలం అప్రయత్నంగా మనం సంఘ విద్రోహుల కాంపులోకి వెళ్ళకుండా ఉండగలందుల్కైనా మేలుకోవటం అవసరం మేలుకున్న తరవాత మనం ఏ పక్షాన చేరుతామో నిర్ణయించుకోవటం మన చేతుల్లో ఉంది

ప్రఖ్యాత రచయిత అనటోల్ ఫ్రాంసు వార్ధక్యంలో కమ్యూనిస్టు పక్షపాతి అయిపోయినాడు మన ప్రఖ్యాత హిందీ రచయిత ప్రేమచందు ఆఖరు దశలో ప్రజా రచయితగా మారాడు ఈనాడు డజన్ల లెక్కన హిందీ రచయితలు కమ్యూనిస్టు పార్టీ పక్షపాతులై పోతున్నారు మన దేశంలో కాంగ్రెసు ఉద్యమానికి పూర్వం రాజకీయాలను పాటించిన సారస్వతపరులు అరుదు కాంగ్రెసు తెచ్చిపెట్టిన విప్లవం రచయితల్ని చాలా భాగం రాజకీయవాదంలోకి దింపింది కాని అది కూడా ఆటే దూరం వెళ్లలేదు ఈ యుద్ధంలో ప్రజల బుర్రల్లో ఆలోచనలు రేపిన రాజకీయ వర్గం కమ్యూనిస్టు పార్టీ పూర్వం కాంగ్రెసు పిలుపు వినని రచయితలే పొరపాటు చేస్తూ వచ్చారో ఈనాడు కమ్యూనిస్టు పార్టీ పిలుపు వినని రచయితలా పొరపాటే చేస్తున్నారు అందుకని రచయితలందరూ కమ్యూనిస్టు పార్టీలో చేరిపొమ్మని నా సలహా కాదు - ఎవరు ఏ స్థితిలో ఏ పార్టీలో చేరతారో నిర్ణయించే భౌతికాంశాలు చాలా ఉంటాయి, వాటినిక్కడ చర్చించటం అప్రస్తుతం కాని నా సలహా అల్లా రచయితలు చెవులూ, మనస్సులూ మూసుకోవద్దని, రాజకీయ రంగంలో జరిగే దుష్ప్రచారాలకి మోసపోనూవద్దు ఆ ప్రచారం గురించి నిర్లిప్తులుగానూ ఉండవద్దని

క్రియకు, ఫలాని విషయాలు రాయి, అని రచయితకు ఎవరూ చెప్పలేరు, చెప్పరు బియ్యానికి, ఈ విధంగా ఉడకమని ఎవరు చెబుతారు? రాసే ఉత్సాహ శక్తులు రచయిత అంతస్సులోనుంచే రావాలి కాని ఆ అంతస్సుకు ఏర్పడే అంతరాయాలు గాని కల్మషంగాని బయటి నుంచే వస్తుంది దాన్ని నేర్పుగా తొలగదోసుకోమని హెచ్చరించే హక్కు ఎవరికైనా ఉంది ఆత్మనిర్ణయం చేసుకోమని హెచ్చరించటం నిర్బంధించటం కాదు

తెలుగు రచయితలు ఈ విషయమై సావధానంగా ఆలోచించి, ఈనాటి జీవితానికి పరిణామం ఇస్తున్న అసంఖ్యాకమైన శక్తుల్లో మన కలాలు గైరుహాజరు కాకుండా చూడటమే గాక వాటికి ఉన్నత స్థానం ఉండేటట్టు కూడా చూసుకుంటారని ఆశిస్తున్నాను

ఏచేత్తో రాసి మనం ఇంతకీర్తి కారి చెట్లకొమ్మల వేళ్ల కంటుకుంటుంది పూలు ఆశగా ఆకాశంలో చూస్తాయి అవసరం అయినప్పుడు ప్రకృతి సర్దుమణుగుకోబడుతుంది

కొత్త సాహిత్యం పాత్రల భావ ప్రకటనకూడా రచయిత భావ ప్రకటనకు ఏమాత్ర లీసిపోదు, ఒక పాత్ర కేసి ఇంకోపాత్ర, "మా ఇంట్లో ఇవాళ బెండకాయ కూర చేసుకోవాలని మాకు ఆలోచన కలగనేలేదని నీకు తెలీదా?" అన్నట్టు చూడగలడు మానవుడు ఒక్క చూపుల్లోనే గాక, నవ్వులోనూ, నడకలోనూ, తల వంచుకోవటంలోనూ, తల ఎత్తటం లోనూ, కోటుకు బొత్తాములు పెట్టకోవటంలోనూ, సిగిరెట్టుపొగ లోపలికి పీలవటంలోనూ, అదేపొగను నోట్లో నుంచీ ముక్కుల్లోనుంచి బయటికి వదిలటంలోనూ, నిప్పుపుల్ల వెలిగించటంలోనూ, ఒకటేమిటి, చేసే ప్రతి పనిలోనూ కూడా మనుష్య మాత్రుడు ప్రకటించలేని భావాలు అతి సునాయాసంగా ప్రకటించేస్తారు కొత్త సాహిత్యంలో పాత్రలు

కథా శిల్పంలో కూడా కొత్త పోకడలు లేకపోలేదు ఉదాహరణకు, ఒక కథలో కొత్తగా భార్యాభర్తలైన స్త్రీ పురుషులుంటారు ఇందులో పుంలింగం కథకుడు, తనకు భార్యమీద ఎంత ప్రేమ ఉందో చూపటానికి స్త్రీ పాత్రను "రాణీ గారు" అంటూ ఉంటాడు "రాణీగారు నా హృదయంలోకేసి చూసింది అప్పుడు రాణిగారు ఆపుకోలేక పటుక్కున నవ్వింది" ఇత్యాది నువ్వటం మంటే జ్ఞాపకం వచ్చింది ఈ కథలో నాయికా నాయకులిద్దరూ మొదటినుంచీ కొసవరకే నవ్వుతూనే ఉంటారు నవ్వేటందుకేమీ ఉందనికాదు, కేవలం వాళ్ల ఆనందాన్ని వ్యక్తం చేసేటందుకు మాత్రమే కథానాయకుడు ( ఇక్కడ కథకుడు కూడానూ) రాణీగార్ని "విమలా" అని మెల్లిగ పిలుస్తాడు అప్పుడు రాణీగారు కథకుడి కళ్లలోకి అదోరకంగా చూసి తుబుక్కున నవ్వి, " ఏమిటా చిలిపివేషాలు" అంటుంది దానికి కథకుడు దబుక్కున నవ్వుతాడు రాణీగారు, "నన్ను సినిమాకు తీసుకువెళ్లమని ఎన్నిసార్లు వేడుకున్నా త్రోసివేస్తూనే ఉన్నారుగా!" అంటుంది ఇద్దరూ గబుక్కున నవ్వుతారు

మానవమాత్రులు అయినవాళ్ళూ, కానివాళ్ళూకూడా, ఎన్నిరకాలగా నవ్వొచ్చో అన్నిరకాలుగానూ కథలో పాత్రలు నవ్వుతాయి చదువుకు పోతున్నకొద్దీ ఆ నవ్వు అంటువ్యాధిగ పరిణమించి మనంకూడా పుటుక్కున లేక చటుక్కున లేక తళుక్కున నవ్వుతాం

కొత్త సాహిత్యం ఆనందమివ్వదనటానికి లేదు

*ఆంధ్రజ్యోతి, మాసపత్రిక, సెప్టెంబరు 1945*

# 3. సాహిత్యమూ, రాజకీయాలూ

"ఈ అభ్యుదయ సాహిత్యమంతా బాగానే ఉంది గానీండి, ఇందులోకి రాజకీయాలు తెస్తారేమోనని భయంగా ఉంది" అన్నారొకరు

అటువంటి దుష్కర్మ జరక్కుండా ఏమిటి ఉపాయమని అడిగాం

"ఈ ఉద్యమంలోంచి కమ్యూనిస్టుల్ని బహిష్కరిస్తే సరి!" అని సమాధానం వచ్చింది

కనుక రాజకీయాలను సాహిత్యానికెడంగా ఉంచటం ఎవనివల్లా కాదు

సాహిత్యానికి రాజకీయాల స్పర్శ ఉండరాదనే మూఢవిశ్వాసం మొదటి నుంచీ ఉన్నది కాదు వాల్మీకీ, వ్యాసుడూ పచ్చి రాజకీయాలు రాసేశారు, పైపెచ్చు, గెలుపొందిన పక్షాన చేరారు

ఆది తెలుగుకవి అయిన నన్నయ భట్టారకుడు, రాజరాజు చంద్రవంశం వాడు గనక భారతం రాశాడు, సూర్యవంశం వాడై ఉంటే మనకూ రామాయణం తొలిగ్రంథమై ఉండును

బమ్మెర పోతరాజుగారు తమ భాగోతాన్ని రాజులకంకితం ఇవ్వకుండా వాళ్లని మనుజేశ్వరాధములని తిట్టి, శ్రీరామ చంద్రుడికి అంకితం ఇవ్వటం పెద్ద రాజకీయ ఉద్యమం ఈ రోజుల్లో అయితే పోతరాజును జైల్లో పెట్టి మంచురాళ్ళ మీద కూచోబెట్టి ఉండేవారు

అసలా రోజుల్లో కలిగిన చైతన్యం యావత్తూ సాహితీపరులు కల్పించి నట్టే కనిపిస్తుంది తిక్కన సోమయాజి సభాపర్వం ఎత్తుకుంటూనే రాజుల మనస్తత్వాల మీది విసిరిన విసుర్లకు మనుమసిద్ధి మొదలైన వాళ్ళు కుళ్ళి చచ్చి ఉండాలి - అప్పటికి చావకుండా ఉంటే ఖడ్గతిక్కన సోమయాజులకు దగ్గిర బంధువేను

★ ★ ★

రాజకీయాలంటేనే అసలే ప్రజలకో విధమైన ఏవగింపు ప్లీడరీ చేసే వాడూ, రాజకీయాల్లో దిగినవాడు కూడా అన్ని రకాల దుష్టకార్యాలూ చెయ్యటం తప్పనిసరి అని నలుగురూ అనుకోవటం కద్దు

ఇటువంటి అభిప్రాయం ఉండే కాలాలు 1921లో కలిగిన రాజకీయ చైతన్యంలో ప్లీడర్లు రాజకీయాల్లోకి ప్రవేశించటం మూలంగా ప్రజలకు . .యాల గురించి ఉండే దురభిప్రాయం మరింత బలపడింది

రాజకీయ కక్షల్లో జనసామాన్యాన్ని ఆకర్షించటానికి పెద్ద కారణం ఏమంటే మహాత్ముడు రాజకీయ వేత్తలకు ఉన్నతాదర్శాలుండాలని ఆదేశించటమే అయినప్పటికీ ఈనాడు కూడా ఏ దుర్మార్గమైనా ప్రజలు సహించాలంటే అది రాజకీయంగానే చెయ్యాలి అందుచేతనే వివేకంగల రౌడీలూ, గూండాలూ ఏ రాజకీయ పక్షంలో సందు దొరికితే ఆ రాజకీయపక్షంలో దూరి తాము చెయ్యదలచిన ఘోరాలన్నీ యధేచ్ఛగా చేసుకుంటున్నారు

ఈ పరిస్థితుల్లో, సాహిత్యంలోకి రాజకీయాలు రావడం సాహిత్యానికపకారమనే విశ్వాసం ప్రచారం చెయ్యటం మన రాజకీయాల కాట్టే మంచిది కాదేమో

★ ★ ★

ప్రజలను సాహిత్యం నుంచీ, సాహిత్యాన్ని రాజకీయాలనుంచీ, రాజకీయాలను ప్రజలనుంచీ కాపాడాలని రకరకాల వాళ్లు చేసే ప్రయత్నాలు చూస్తుంటే ముచ్చటేస్తుంది యదార్ధ సాహిత్యంలో యదార్ధ జీవితం తాలూకు యదార్ధ సమస్యలుండి ఆ సాహిత్యంవల్ల ప్రజలు చెడిపోతారేమోనని కొందరికి బెంగ

సాహిత్య ప్రచారం మత ప్రచారం మాదిరిగా పనిచేసి ప్రజలలో చైతన్య కలిగిస్తుందనే భయం కొందరికి జాస్తి ప్రభుత్వాలు ఇటువంటి భయం ప్రకటించడంలో అగ్రతాంబూలం పుచ్చుకుంటై మాటవరసకి 'ముందడుగు' నాటక ప్రదర్శన నిషేధం తీసికొండి ఆ నాటకం

చూసే ప్రజలు సంఘానికపకారంగా పరిణమిస్తారని మద్రాసు ప్రభుత్వం పాపం చాలా భయపడి సంఘ క్షేమం కోసం ఆ నాటకాన్ని ప్రదర్శించకుండా నిషేధించింది సత్యహరిశ్చంద్రీయ నాటకం చూసి ప్రజలు నిజం నేర్చుకుంటారనే ఆశ ఏ ప్రభుత్వానికీ ఉన్నట్టు కనిపించదు నేను హరిశ్చంద్ర నాటకం ముప్పయ్యారుసార్లు చూశాను, కోర్టువారు నా మాట నమ్మాలి!'' అని ఏ సాక్షిగానిఅంటే కోర్టువారు నమ్మే ఆశలేదు చింతామణి నాటకం చూసి బోగంవాళ్లు తమ వృత్తి మానుకున్నట్టు ఒక్క నిదర్శనమూ లేదు అయినా ప్రభుత్వాలు అప్పుడప్పుడూ ప్రజాక్షేమం కోసం కొంత సాహిత్యాన్ని అణచిపెడుతూ ఉంటై అదోవేడుక

సాహిత్యాన్ని రాజకీయాలనుంచి కాపాడే వారిని గురించి ఇప్పుడు మనదేశంలో ప్రత్యక్షంగా చూస్తున్నాం

భమిడిపాటి కామేశ్వరరావుగారు రాసిన ఒక నాటకంలో ఒక పాత్ర కొయ్య తుపాకీ పట్టుకొని, లావాటి వేపు మరో పాత్రకేసి బారుచేసి పెట్టి ''దీన్ని ఎలా కాల్చాలో నాకు చెబుతావా, నిన్ను చంపనా?'' అని బెదిరిస్తుంది రెండో పాత్ర, '' ఉండరా బాబూ కొంచెం జ్ఞాపకం తెచ్చుకోనీ!'' అని వేడుకుంటుంది

ఇది చాలా ఛాందస హాస్యమని పెదిమ విరిచిన వారున్నారు కాని ఇటువంటి ఛాందస హాస్యానికి రాజకీయాల్లో స్థానం ఉందని గుర్తించిన హిట్లరు తనను బలవంతుడు కాకుండా అడ్డుపడినట్లైతే బ్రిటనును హతమారుస్తానని ఛేంబర్లేనును హడలగొట్టి కోతిపుండంతవాడు బ్రహ్మరాక్షసి అయినాడు

ఈ నాడైనా మన రాజకీయవేత్తలు ఈ ఛాందస హాస్యంలో పరమార్థం గ్రహించినవారై ఎలక్షను ఉపన్యాసాలలో ''మీరు మీ ఓట్లు మాకే వెయ్యండి లేకపోతే మేం ఎలక్షన్లో గెల్చి - మేం గెలవకుండా, బ్రహ్మదేముడాపలేడు! మాకు వోట్లివ్వని వాళ్ల భరతం పట్టిస్తాం'' అని నిప్పులు కక్కుతున్నారు

*ఈ విధంగా రాజకీయాలను ప్రజలనుండి కాపాడే మహనీయుల రాజకీయాలు దిగ్విజయం పొందుగాక!*

*ప్రతిభ, త్రైమాసిక పత్రిక, సంపుటి-8, సంచికలు -3,4, అక్టోబరు 1945 - మార్చి 1946*

*పునర్ముద్రణ 1 సాహిత్య ప్రయోజనం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1969, అక్టోబరు*

*2 నూతన మాసపత్రిక, 1980 అక్టోబరు-నవంబరు*

# 4. చిన్నకథ : సామాజిక వ్యవస్థలో మార్పు

మొదటి ప్రపంచ యుద్ధానంతరం తల యెత్తిన ప్రజాస్వామిక శక్తులతో జననం పొంది, వ్యక్తి వాదం యొక్క అండను అభివృద్ధి చెంది, వ్యావహారిక భాష యొక్క సహాయంతోనూ, పత్రికల విజృంభణ తోనూ ప్రజలలో అమితమైన వ్యాప్తి చెందిన తెలుగు కథ దాదాపు రెండవ ప్రపంచ యుద్ధం ఆరంభమయే వరకూ అవిచ్ఛిన్నంగా సాగింది

అయితే 1932 అనంతరం ఏర్పడిన ఆర్థిక కాటకం మొదలుకొని చిన్నకథ వెనక అండగా ఉండిన సామాజిక స్వరూపంలో కొత్త పరిణామాలు సాగాయి ఈ పరిణామాల

వైనం వెంటనే తెలియరాలేదు వాటి కుదుళ్లు చాలా దూరానే ఉండి పోయాయి అయినప్పటికీ చిన్న కథకు తోబుట్టువయిన భావగీతం అప్పుడే పతనం కాసాగింది చిన్న కథకూడా కేవలం వ్యక్తి వాదాన్ని బలపరిచినంతవరకూ అధోముఖయాత్ర సాగించింది

మానవ సమాజంలో ఆతరుణంలో ఆరంభమైన నూతన పరిణామాలేమిటో ఈనాడు మనం సులభంగా తెలుసుకోగలం

మొదటి ప్రపంచ యుద్ధానంతరం కొత్త మూసలోకి ప్రవేశించిన మానవ సామాజిక వ్యవస్థ ఆమూసలోనే ఘనీభవించుకు పోవటానికి బదులు తిరిగి కొలిమిలో ప్రవేశించసాగింది ప్రజాస్వామిక శక్తుల సహాయంతో కెయిజరు జర్మనీ సామ్రాజ్య దాహాన్ని కట్టించిన డెమోక్రసీ రాజ్యాలు - బ్రిటను, అమెరికా, ఫ్రాన్సు వగైరాలు సామ్రాజ్యవాదాన్ని విడనాడనూలేదు, ప్రజాస్వామిక శక్తులను మన్నించనూలేదు బ్రిటను ఇండియాకు చేసిన వాగ్దానాలకు ఫలితంగా బ్రిటిషు సామ్రాజ్యవాదం దేశంలో మరింత విలయ తాండవం సాగించింది ప్రజాస్వామికాలకూ, వ్యక్తి వాదానికీ డెమోక్రసీలే - గర్భవిరోధులుగా పరిణమించాయి ఇండియాలోని ప్రజాస్వామిక శక్తులు కాంగ్రెసు అండను, గాంధీ నాయకత్వంతో సంఘర్షణ ఆరంభించాయి

ఇటువంటి జాతీయోద్యమాలను అణచటంలో తృప్తి చెందక సామ్రాజ్యవాదులు, ప్రజాస్వామిక సూత్రాలను వల్లె వేస్తూనే, ప్రజాస్వామ్యాలమీద మరొక ధ్వజం కూడా ఎత్తారు ప్రజాస్వామ్యాలకు గర్భ శత్రువూ, సామ్రాజ్య వాదం యొక్క భీకరాతి భీకర స్వరూపమూ అయిన ఫాసిజమును ఎగదోయసాగారు బ్రిటను, అమెరికా, ఫ్రాంసు మొదలైన దేశాలలో హిట్లరు, ముసోలినీలకు గొప్ప ప్రచారం జరిగింది వారికి ''డెమోక్రసీలు'' ధన సహాయంకూడా చేశాయి ప్రజాస్వామ్యాలూ, వ్యక్తి వాదమూ ఏమయినట్టు?

ఇదే సమయంలో ఇంకొక పరిణామం కూడా కలంపట్టి చరిత్ర లిఖించ సాగింది అది రష్యాలో జరిగిన విప్లవం ఈ విప్లవం ప్రధానంగా పెట్టుబడిదారీ విధానాన్ని హతమార్చినా, పెట్టుబడిదారీ డెమోక్రసీలలో ఉండే వ్యక్తి వాదాన్నికూడా నిర్మూలించింది నిజానికి, పెట్టుబడిదారీ కింద వ్యక్తి వాదమంటే స్వలాభం కొరకు మాత్రమే సంపదను సృష్టించే హక్కు మాత్రమే మిగిలిన వ్యక్తి స్వాతంత్ర్యాలన్నీ ఈ స్వాతంత్ర్యానికి ఆహుతి అవుతూ ఉండేవి అందుచేతనే డెమోక్రసీలలో దారిద్ర్యమూ నిరుద్యోగమూ మొదలైన సాంఘిక పీడలు నిత్యమూ ఉండేవి మధ్య మధ్య ఉత్పత్తి మితిమీరి ఆర్థిక కాటకాలు కూడా సంభవించేవి అటువంటి కాటకంలో ఆహార పదార్థాలుధ్వంసం చేయబడేవి కూడానూ

మనిషిని మనిషి ఆర్థికంగా దోపిడి చేసే హక్కును రష్యా విప్లవం రష్యాలో నిర్మూలించింది ఉత్పతి సాధనాలు సమాజపరం చేయబడి ఒక నిర్దిష్ట ఉత్పత్తి విధానాన్ని అనుకరించి సంపద సృష్టి కాసాగింది నిరుద్యోగమూ, నిరక్షతా నిర్మూలింప బడ్డాయి

1930 తరువాత పెట్టుబడిదారీ ప్రపంచాన్ని కల్లోల పరిచిన ఆర్థిక కాటకం ఛాయలు రష్యాలో కనిపించలేదు

కాని రష్యాలో ప్రజాస్వామ్యాలు లేవన్నారు రష్యా ఒక పెద్ద జైలనీ, అందులో అందరూ నిర్బంధంగా పని చేసే బానిసలనీ, అక్కడ కొద్దిమంది నియంతృత్వం సాగిస్తున్నారనీ ప్రచారం చేశారు హిట్లరు సర్పాన్ని పాలుపోసి పెంచినవారే ఈ ప్రచారం సాగించి ఉండటం గమనించదగిన సంగతి అయినా ఈ ప్రచారం చాలా వరకు పారిందనే చెప్పాలి

రష్యాలోనే నిజమైన ప్రజాస్వామ్య అమలు జరుగుతున్నదని చెప్పినవారు లేకపోలేదు, కాని వీరి గొంతు సరిగా వినిపించలేదు

అయితే రష్యాలోని ప్రజాశక్తులు రెండవ ప్రపంచయుద్ధంలో పరీక్షకు వచ్చాయి నియంతృత్వం వెనక ఉన్న పైశాచిక బలాన్ని రష్యా ఎదర్కొవటానికి సిద్ధపడుతుందా, దానితో రాజీపడుతుందా? దాన్ని జయించ గలుగుతుందా, లొంగి పోతుందా? జయించటానికి ఎంత స్వార్థ త్యాగం చేస్తుంది?

ఈ ప్రశ్నల కన్నిటికీ రెండవ ప్రపంచ యుద్ధం సరి అయిన సమాధానా లిచ్చింది నియంతృత్వం కింద పీడించబడే రష్యా ప్రజలు హిట్లరు భూతాన్ని అంత గట్టి దెబ్బ కొట్టి ఉండరు డెమోక్రసీ దేశాలలో కూడా హిట్లరు అభిమానులువైదొలగి ప్రజాస్వామిక వ్యక్తులను బలపరుస్తూ రష్యాతో చేతులు గలపగల వారే యుద్ధం సాగించటం కూడా జరిగింది

రెండవ ప్రపంచ సంగ్రామంలో గెలిచిన ప్రజాశక్తులే అనేక పెట్టుబడిదారీ దేశాలలో సోషలిష్టు పార్టీను ముందుకు నెట్టాయి

''బూర్జువా వ్యక్తి వాదం'' అనబడేది రెండవ ప్రపంచ యుద్ధంలో నశించిందని చెప్పాలి దాని స్థానే ఒక విధమైన ''సోషలిష్టు సమిష్టివాదం''పైకి వచ్చింది పెట్టుబడిదారీ విధానంలో ఉత్పత్తి సాధనాలు ప్రజల సమిష్టి సమస్యలను పరిష్కరించ లేవన్నది స్పష్టమయింది ఆ విధానం వెంట దారిద్ర్యమూ, ప్రజా పీడనా, యుద్ధ భయమూ, నిరుద్యోగమూ, ఉండి తీరవలసిందే

ఎవడి దారిద్ర్య సమస్యను వాడు తీర్చుకోలేడు వ్యక్తిక్షేమం మీద సమిష్టిక్షేమం ఆధారుపడవలసి ఉంది సమిష్టి ఆర్థిక పథకాలు లేకుండా మామూలు ప్రజా స్వామ్యాలు కూడా అమలు జరగవు

నిజమే, ఈ సత్యాలను ఎలుగెత్తి చాటిన వారు కమ్యూనిష్టులు ఇది కమ్యూనిజమయేటట్లయితే కమ్యూనిజంలో సత్యమున్నదనైనా ఒప్పుకోవాలి లేదా ఈ సత్యాలు గ్రహించటానికి కమ్యూనిజం అవలంబించనవసరం లేదనైనా ఒప్పుకోవాలి కాస్త చరిత్ర జ్ఞానం ఉన్నవారు ఈ చిక్కుల్లో పడ్డారు

బ్రిటను ఒక విధమైన సోషలిష్టు వ్యవస్థను అమలు జరపటానికి పూనుకున్నది ఇతర దేశాలు కూడా ఇటువంటి ధోరణిలోనే పడ్డాయి మామూలు కళాకారుడి సమస్య ఏ రాజకీయ పార్టీని బలపరచాల, రాజకీయ విప్లవం ఎట్లా సాధించాలి అని కాకపోవచ్చు కాని మానవ సమాజాన్ని కదిలించే నూతన శక్తులనూ, మానవ సమాజంలో జరుగుతున్న నూతన పరిణామాలను అవగాహన చేసుకోకుండా అతను కళా రచన ఎట్లా చేస్తాడు?

కొన్ని యేళ్ళ క్రితం తాను వలచిన స్త్రీ కొరకు తండ్రి ఇచ్చే ఆస్తిని విసర్జించిన వాణ్ణి గురించి కథ రాసి భళీ అనిపించుకోవటం సాధ్య మయింది లేదా తాను అభిమానించే స్నేహితుడి కొరకు తాను పెళ్లాడదలచిన కన్యను త్యాగం చేసిన వాణ్ని గురించి కథ రాసి అందులో గొప్పతనం చూపటం సాధ్యమయిపోయింది కాని రానురాను జీవితంలో యిటువంటి హీరోయిజముకు స్థానం లేకుండా పోతుంటే కథకుడేం చెయ్యాలి? నిత్య జీవితంలో కళ్ల ఎదట కనిపించే వ్యక్తులకు ''త్యాగం'' చెయ్యటానికి పిత్రార్జితాలు లేకుండా పోతూ ఉండె పెళ్లాడితే పెళ్లాన్ని పోషించటం ఎట్లాగా అన్న సమస్య ఎదురవుతూ ఉండె - మరొకడి కోసం ఆ కన్యను వదలుకోవడం మాట

దేవుడెరుగు! మామూలు పౌర ధర్మాలూ వ్యక్తి ధర్మాలూ నిర్వర్తించటానికే కటకటలాడే మధ్యతరగతి వాళ్ళు సంఘం మెచ్చుకునే పనులెక్కడ చెయ్యగలరు?

1942 అనంతరం వ్యాప్తి చెందిన సామాజిక భావాల దృష్టితో అంతకు పూర్వం వచ్చిన కథా సాహిత్యాన్ని చూస్తే అందులో చాలా భాగం అయదార్థంగానూ, అవాస్తవంగానూ, కనిపించ సాగింది సత్య నిరతి, త్యాగబుద్ధి, ప్రజ్ఞ మొదలైన వ్యక్తి సుగుణాలు రాణించాలంటే అవతల గొప్ప సాంఘికాశయం ఉండవలసిన అగత్యం ఏర్పడింది ఈ అగత్యం నానాటికీ హెచ్చుతున్నది

ఈ నాటి సమాజంలో సంఘవిద్రోహక శక్తులేవి? వ్యక్తి విశిష్టతా, త్యాగమూ, ధర్మబుద్ధి, సమాజాభిమానమూ, అభ్యుదయకాంక్ష ఈనాటి జీవితంలో ఎటువంటి స్వరూపం దాల్చగలవు? మానవజాతి ఎటుపోతున్నది? ఎటుపోవాలి? దారిద్ర్యమూ, అనారోగ్యమూ, సంకుచితత్వమూ, యుద్ధభయమూ, కులతత్వాలూ, మత తత్వాలూ, ఇటువంటి సాంఘిక పీడలు నిర్మూలమై ప్రజలు స్వేచ్ఛగా, అవాంతరాలు లేకుండా, విభేదాలు పోగొట్టుకుని, తమ ఆర్థిక విజ్ఞాన నైతిక జీవితాలను గట్టిపునాది మీద నిర్మించటానికి మార్గమేది? ఇటువంటి ప్రశ్నలకు కళాకారులు సమాధానాలు అన్వేషిస్తున్నారు సమాధానాలు చెబుతున్నారు కూడాను

కథకులు కూడా ఈ సమస్యలకు ఎడంగా నిలబడి ఉండలేరు ఇటువంటి ప్రశ్నలకు వీరు సరిఅయిన సమాధానం తెలుసుకున్నకొద్దీ కథలు జీవితానికి మరింత సన్నిహితంగా వచ్చి జీవిత సత్యాన్ని చిత్రించ గలుగుతాయి

ఒక్క మాట స్పష్టంగా చెప్పవచ్చు తెలుగులో చిన్న కథ ఇంకా విస్తృత ప్రజలను తన దగ్గరికి లాగుకొంటుంది గాని ప్రజలకు దూరంగా మాత్రం వెళ్లదు, ఇది వరకులాగా ఇది కేవలమూ వ్యక్తి వాదాన్నే ఆధారం చేసుకోక సమిష్టివాదాన్ని - జీవితం తాలూకు సమష్టివాదాన్ని - బలపరుస్తూ సాగుతుంది చిన్నకథ తెలుగులో పుట్టినప్పుడు కొత్త రకం రచయితలు సాహిత్యరంగంలో అడుగు పెట్టారని అనుకున్నాం రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వం చైతన్యరహితంగా ఉన్న అనేక ప్రజావర్గాలు ఇప్పుడు చైతన్యం పొందుతున్నాయి ఈ వర్గాలలోనుంచి ఉత్తమ కథకులు ముందుకు రావలసి ఉన్నది తెలుగులో చిన్న కథ యింకా ఉన్నత శిఖరాలు అందుకోవలసి ఉన్నది

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 31-3-1950*

*పునర్ముద్రణ సాహిత్య ప్రయోజనం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, అక్టోబరు 1969*

# 5. చిన్నకథ : అభ్యుదయోద్యమం

సాహిత్యంలో అభ్యుదయోద్యమం బయలుదేరింది యుద్ధానికి పూర్వమే, కాని చాలాకాలం ఇది మనదేశంలో వ్యాప్తికి రాలేదు జీవితాన్ని వాస్తవిక దృష్టితో చూసి, అర్థం చేసుకుని సాహిత్య పరమార్థం సంఘానికంతటికీ వర్తించేటట్టు చేయటం అభ్యుదయోద్యమం ఆశయం

ఉద్యమం తెలుగుదేశంలో కాస్త వ్యాప్తి సంపాదించగానే, కొందరు దీన్ని ప్రచ్ఛన్న రాజకీయోద్యమమనీ, ఇది కమ్యూనిజం యొక్క మారురూపమనీ ప్రచారం సాగించారు దీనికి స్థూలమైన కారణ మేమిటంటే కమ్యూనిస్టు పార్టీవారు దీనిని పూర్తిగా బలపరచడమే

గాక కొంతవరకూ నిర్వహించారు కూడానూ అభ్యుదయోద్యమం ద్వారా కమ్యూనిజం బలపరుచుకోటానికి కాకపోతే వాళ్లు దీనికోసం ఎందుకు తాపత్రయ పడాలి? అది వరలో కాంగ్రెసు దేశభక్తులు ఒక సాహిత్యంలో గాదు, ఏ కళలోనూ ఆసక్తి కనపరచలేదు లక్షలాది ప్రజలు వాళ్లనను రాజకీయరంగంలో బలపరుస్తున్నప్పుడు, కనీసం తమ ఆదర్శాలను కళలు బలపరచాలని అయినా వాళ్లు ఆశించలేదు

దీనికి కూడా కారణం ఉన్నది కాంగ్రెసువారు అవలంబించిన రాజకీయ సిద్ధాంతాలు కళారంగానికి ఒక కార్యక్రమం ఇవ్వలేదు ఇతర రాజకీయ సిద్ధాంతాలతో పోలిస్తే కాంగ్రెసుకు సిద్ధాంతాలు నిజంగా విశాలమైనవే కాని ఆ సిద్ధాంతాలు సమగ్రమైన సాంఘిక సిద్ధాంతాలు కాలేక పోయాయి

ఈ లోపం మార్క్సిజంలో లేదు ఉన్నంతలో అది సమగ్ర సాంఘిక పరిణామవాదం అది కేవలం విశ్వాసాల మీదనే ఆధారపడక శాస్త్రదృక్పథం కలది మార్క్సిజం యొక్క మూలసూత్రాలను రాజకీయాలకే కాక, శాస్త్రాలకూ, కళలకూ కూడా అనువర్తింప జేయవచ్చును ఇతర సాంఘిక సిద్ధాంతాలకన్న అది సాంఘిక పరిణామాలను ఎక్కువ వివరంగా నిర్ధారణ చేస్తుంది అందుచేతనే అనేకమంది ప్రసిద్ధ శాస్త్రవేత్తలూ, కళాకారులూ, రాజకీయ వేత్తలూ మార్క్సిజమును అవలంబించటం జరిగింది అందుచేతనే మార్క్సిజమును అవలంబించిన కళోద్యమాన్ని కూడా బలపరచడం జరిగింది

అభ్యుదయోద్యమం మార్క్సిజము పునాదిగా గల సాహిత్యోద్యమం దీనిద్వారా కమ్యూనిష్టులు తమ రాజకీయ ప్రచారం సాగించుకున్న పక్షాన, అభ్యుదయోద్యమం ప్రచ్ఛన్న రాజకీయోద్యమమని విమర్శించటానికి అవకాశం ఉండేది కాని అటువంటిది జరగలేదు

అభ్యుదయోద్యమం అనేక మంది కొత్త రచయితలను సృష్టించింది (యదార్థమైన ఉద్యమానికి ఇంతకంటె మంచి రుజువులేదు ) ఈ ఉద్యమంలో సృష్టి అయిన సాహిత్యంలో నూతన సాంఘిక చైతన్యం కనిపించింది దీనితోబాటు కందుకూరి, గురజాడ మొదలైన పాతరచయితలకు కొత్త ప్రచారం వచ్చింది ఇదంతా కమ్యూనిష్టు ప్రచారమే నన్న వాళ్లు కమ్యూనిజము గురించి గాని, సాహిత్యం గురించి కాని, అవగింజంత గూడ జ్ఞానం లేనివాళ్లు

ఈ సందర్భంలో జరిగిన శోచనీయమైన విషయమేమిటంటే ఒక వంక కమ్యూనిష్టులు తమకుకొన్ని సాంఘిక విశ్వాసాలున్నవని రుజువు చేస్తూ అభ్యుదయోద్యమాన్ని బలపరుస్తూ ఉంటే, మరొకవంక పదవులలో ఉన్న మన కాంగ్రెసు నాయకులు తమ సిద్ధాంతాలలో తమకే విశ్వాసం లేనట్టు రుజువుచేసుకున్నారు ''ముందడుగు'' నాటకం మీది నిషేధాన్ని వారు తొలగించక పోవటానికీ, ''మాభూమి,'' ''పాంచజన్యం'' మొదలైనవి నిషేధించడానికీ కారణం అణుమాత్రమైనా లేదు

చిన్న కథ స్వతహాగా ప్రజాజీవితానికి చాలా సన్నిహితంగా సృష్టి అయిన సాహిత్య స్వరూపంకనక అభ్యుదయోద్యమం దాని అభివృద్ధికి ఎంతో సహాయకారి అయినప్పటికీ అభ్యుదయ కథలు రాదగినంత విరివిగా రాలేదు దీనికి కారణం, ప్రసిద్ధంగా కథలు రాసేవారిలో యథార్థమైన మార్క్సిస్టు దృక్పథమూ, జీవితంలో పూర్తి పరిచయమూ తక్కువ కొత్తగా రచనలు సాగించిన వారికి అనుభవమూ, రచనా సామర్థ్యమూ తక్కువ ప్రస్తుతం అభ్యుదయ

కధకులకు కావలసినది ప్రోత్సాహమూ, జీవితాన్ని గురించిన పరిజ్ఞానమూ మన సంఘంలో అనేక వృత్తుల వారున్నారు అతి దారుణమైన ఆర్థిక సాంఘిక సమస్యలలోపడి కుళ్ళు తున్నవారున్నారు వీరందరూ తమ సాహిత్యాన్ని తాము సృష్టించుకోవాలి

కళా సృష్టిలో ఉన్న రహస్యమేమంటే దుఃఖంతో కుమిలిపోయ్యే వాడు అశ్రుకవిత్వం రాయలేడు తన దుఃఖాన్ని పూర్తిగా అవగాహన చేసుకున్నప్పుడే దానికొక కళారూపం ఇవ్వటం సాధ్యమవుతుంది జీవితాన్ని అర్థం చేసుకోవటానికి కేవలం జీవితానుభవం చాలదు కొన్ని సాంఘిక సిద్ధాంతాలు కూడా అవసరం భార్యలతో కాపరం చేసేవారందరూ దాంపత్యధర్మాలు తెలిసిన వారనుకోవటం పొరపాటు దాంపత్య ధర్మాలను గురించి శాస్త్రజ్ఞానం ఉండటం అత్యవసరం మార్క్సిస్టు భావాలు అలవరచుకొని వాటిద్వారా జీవితాన్ని అర్థం చేసుకుని, మరొక వంక రచనాసామర్థ్యం పెంపొందించుకున్న వాళ్లు ఏవర్గానికి చెందినవాళ్ళయినా చక్కని అభ్యుదయ రచనలు సాగించే అవకాశం ఉంది

ఒక వంక కమ్యూనిష్టులకు ఉపయోగపడుతున్నాయనే ఉద్దేశ్యంతో మార్క్స్ సిద్ధాంతాలను బహిష్కరించేవారూ, మార్క్స్ సిద్ధాంతాలలో తప్పులు ఏరేవారూ ఆ సిద్ధాంతాల స్థానే కొత్త సిద్ధాంతాలు - నిర్దుష్టమైనవీ ఉపయోగపడేవీ - ప్రచారం చెయ్యాలిగాని కేవలమూ అభ్యుదయోద్యమాన్ని తూలనాడి ఏమీ ప్రయోజనం సాధించలేరు ఏవో సాంఘిక సిద్ధాంతాల ఆధారం లేకుండా మన కళలూ సాహిత్యమూ అభివృద్ధి అవుతాయన్నది కేవలమూ భ్రమ

*ముద్రణ తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 7-4-1950*
*పునర్ముద్రణ విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, అక్టోబరు 1969*

# 6. రచయితల కర్తవ్యం

మన దేశంలోని అనైక్యతకు కారణాలేమిటి? వాటిని తొలగించటానికి రచయితలు ఏం చెయ్యాలి? ఈ సమస్యలను గురించి చర్చించటానికి ఢిల్లీలో రచయితల గోష్ఠి జరిగింది దానికి నెహ్రూ స్థానే ప్రారంభించుతూ డా॥ రాధాకృష్ణన్, మనదేశాన్ని విచ్ఛిన్నం చేస్తున్న పీడకులలో కులతత్వాన్ని, మతతత్వాన్ని పేర్కొన్నారు రాజకీయాలలోనూ, పరిపాలనలోనూ, ఇటీవల ఎన్నికలలోనూ ఈ దుష్టశక్తుల నగ్న స్వరూపం ఎంతగా కానవచ్చినదీ వివరించారు అంతా చెప్పి ''రచయితలు ఉన్నత భావాలను, సామరస్యం పెంపొందించే భావాలను, సత్యమైన భావాలను వెలిబుచ్చినట్టయితే అవి ప్రజలలో వ్యాప్తి చెంది సక్రమమైన, సముచితమైన అభిప్రాయాలను కలిగిస్తాయి'' అని సలహా ఇచ్చారు

పూర్వం రామాయణం లాంటి మహాకావ్యాలలాగే ఈనాడు కూడా కొత్తరకం మహాకావ్యాలు వెలువడినట్టయితే వాటి ప్రభావం చేత దేశప్రజలమధ్య ఐక్యభావం కలుగుతుందని ఒక పంజాబీ రచయిత్రి అన్నారు

రచయితలూ రాజకీయ ప్రముఖులూ సమైక్యంగా పనిచెయ్యాలని ఒక ఉత్కళ రచయితా, లౌకిక వ్యవహారాలలో మత ప్రసక్తి రాగూడదని ముల్కరాజ్ ఆనంద్, రచయితలు మానవుల ''ఆత్మ''లను అవగాహన చేసుకుని చిత్తశుద్ధితో రచనలు చేయ్యాలని ఒక కాశ్మీరు కవీ - రకరకాలుగా అన్నారు

పెద్దలు, పెద్ద వేదిక మీదినుంచి,పెద్ద విషయాలను గురించి మాట్లాడేటప్పుడు భావాలు కూడా కొంచెం పెద్ద ఎత్తునే నడవటం సహజం అయినా డా॥ బి రాజన్ గారు సాహసించి చిన్న సత్యం బయట పెట్టారు రచయిత కూడా వాతావరణానికి దాసుడే, దాని ప్రభావం నుంచి తప్పించుకోలేడు అతను కూడా ఒక పౌరుడే పౌరధర్మాలు అతనికీ తప్పవు

మరొక విద్యావేత్త కూడా చిన్న విషయం చెప్పారు అనైక్యతా భావం మానవ ప్రకృతికి స్వతహాగా ఉండేది కాదు, ఉత్తమ రచనలెన్నడూ ఐక్యతకు ద్రోహం చెయ్యవు, అటువంటి ప్రమాదం చెత్త రచనల నుంచే పుడుతుంది ప్రజలలో పరనాసక్తి కలిగించే చర్యలు కలగాలి

ఢిల్లీలో జరిగిన ఈ గోష్టినిజంగా ఫలప్రదంకావాలంటే ముఖ్యమైన రాజకీయ నాయకులను పిలిచి, మంచి రచయిత చేత ఉపన్యాసం ఇప్పించవలసింది

నాకు తెలిసినంతవరకు ఈ కాలపు ఉత్తమ రచయితలందరూ రాజకీయ వేత్తలకన్న సంస్కృతికంగా కొన్ని దశాబ్దాలు ముందున్నారు ' ఏ పదో శతాబ్దపు ప్రమాణాలను పునరుద్ధరించటానికి నడుములు కట్టి ప్రభుత్వ అకాడమీ నలంకరించి కొద్ది మంది మినహాయింపు అవుతారు గాక!)

రాజకీయ వాదుల దృష్టిలో అనైక్యత అంటే ఏమిటో ఊహించటమే సామాన్యులకు కష్టంగా ఉంది భాషారాష్ట్రాల సూత్రాన్ని ఆమోదించి కొన్ని రాష్ట్రాలు ఏర్పడ్డాక కూడా "మనకు కూడా మా రాష్ట్రం దయ చేయండి" అని అడిగిన ఆంధ్రులనూ, మహారాష్ట్రులనూ మందుగుండేసి కాల్చి, తరువాత "భాషావాదంతో దేశం యొక్క ఐక్యత మంట గలిసిపోతోంది" అన్నారు రాజకీయ ప్రముఖులు!

మద్రాసులో అఖిల భారత సాహిత్య సదస్సు జరిగినప్పుడు వేరువేరు భాషలలో ప్రముఖులైన రచయితలు కలుసుకుని, పరిచయం చేసుకుని ఎంత ఆనందించారో నేను కళ్లారా చూచాను తారాశంకర్ బెనర్జీగారికి జరిగిన గౌరవం బెంగాల్ ముఖ్యమంత్రికి కూడా జరిగి ఉండదు

అసలు అనైక్యత అంటే ఏమిటి? రాష్ట్రీయ కాంగ్రెసులోనే రెండేసీ, మూడేసీ చీలికలుండటమూ, వాటిని అతకటానికి డజన్ల కొద్దీ మంత్రులను నియమించటమూ ఐక్యత సాధించే ప్రక్రియా? తమకు నచ్చని రాష్ట్ర ప్రభుత్వాలనూ, తమ మెజారిటీ లేని మునిసిపల్ సంఘాలనూ తుడిచిపెట్టెయ్యటమూ ఐక్యత అంటే? కేంద్రానికి తమ రాష్ట్రాలపై సవతి తల్లి ప్రేమ ఉన్నట్టు ప్రజలలో అభిప్రాయం కలగనివ్వటమూ, కమిషనులను వేసి, వారి రిపోర్టులు తమకు నచ్చనప్పుడు వాటిని బుట్టదాఖలు చెయ్యటమూ ఐక్యత అవుతుందా?

ఈ దేశంలో ఐక్యత లోపిస్తే అందుకు బాధ్యులు రాజకీయవాదులు తప్ప రచయితలు కారు రచనలద్వారా బ్రహ్మచార్లు కూడా బతికే ఆస్కారంలేని ఈ దేశంలో రచయితలు ఆధునిక రామాయణాలు రాసి దేశాన్ని ఏకం చెయ్యగలరంటే నమ్మదగిన విషయం కాదు పనికి వచ్చే భావాలను రచయితలు ఎప్పుడు ప్రచారం చేస్తూనే ఉన్నారు వాటిని చదవటానికి దేశంలో తగినంత అక్షరాస్యతేలేదు

రాధాకృష్ణన్ గారన్నట్టు, సాంఘికంగానూ, రాజకీయంగానూ సమాధి పొందిన కులమత తత్వాలను పైకి తవ్వి తీసి రాజకీయ లాభాలకూ, పదవీ స్వార్థాలకూ వాడుకుంటున్న వాళ్లు

రాజకీయవాదులు యుద్ధం మధ్య కాలంలో కూడా కోరలు తీసిన పాముల్లాగా అయిపోయిన జమిందారీ దుష్ట శక్తులను పాలుపోసి పెంచినవారు, ధనిక స్వాములకు అచ్చుపోసి ప్రజలను విరుచుకు తినమని పంపకం చేసినవాళ్లు రాజకీయవాదులు జమీందార్లకూ, మాజీ ప్రభువులకూ భరణాలూ అవీ ఇచ్చి వాళ్ల తురాయీలను నిలబెట్టమనిగాని, ''డబ్బు సంచుల' ఆమోదంతో దేశం యొక్క దుస్థితిని సరిచెయ్యాలని గాని అడిగిన నిజమయిన రచయిత దేశంలో ఒక్కడుంటాడా?

హత్య చేసిన వాణ్ణి విచారించేటప్పుడు కూడా హత్యకు కారణాన్ని బహు శ్రద్ధగా పరిశీలిస్తారు న్యాయమూర్తులు దేశం చిన్నాభిన్నంగా ఉంటే ఏరచయితకు గాని ఏం ఒరుగుతుంది? కుల తత్వాలనూ, మత తత్వాలనూ రెచ్చగొట్టి పరువుగల రచయిత ఏం బావుకుంటాడు? అతి సామాన్య కథకుడికి కూడా తన కథ హిందీలోకిగాని, బెంగాలీ లోకి గాని, మరే ఇతర భారతీయ భాషలలోకి గాని తర్జుమా అయిందంటేనే పరమానందం కలుగుతుందే! - అందువల్ల నయాపైసా తనకు ముట్టకపోయినా!

నన్నడిగితే జన సామాన్యం చేత రాజకీయవాదులు అనిపించుకోవటానికి వెరవని మాటలలో సహస్రాంశం కూడా పరువుగల రచయిత అనిపించుకోడు నిజం చెప్పి దుర్మార్గపు పరిపాలకుల తుపాకులకు బలి అయి వీరుల జాబితాలోకి ఎక్కిన రచయితలు ప్రపంచంలో ఉన్నారు మీద ఉమ్మేయించుకున్న రచయితలు లేరు - పరువూ ప్రతిష్ఠాగల రచయితలమాట చెబుతున్నాను, అది రాజకీయవేత్తలకే చెల్లు!

రచయితలుగా బతికే అవకాశంలేని మన దేశంలో కొద్దిమంది రచయితలు రాజకీయవేత్తలకు అమ్ముడయితే పోవచ్చు, భరణాలు పుచ్చుకుంటే పుచ్చు కోవచ్చు, కాని సాటి రచయితలు కొంతవరకు వారిని సానుభూతితో చూడగలరు అలా అమ్ముడయినవారు సత్యాన్ని నిర్దాక్షిణ్యంగా ఖూనీ చేస్తే వారిని ఏ విధంగా చూడాలో ప్రజలే నిర్ణయించుకోగలరు

రాజకీయవేత్తలు తమకాలాన్ని యావత్తూ 'మెజారిటీ' పోగుచేసుకోవటానికే వినియోగించక, రచయితలు జీవితం గురించి ఏమనుకుంటున్నా తెలుసుకొనటానికి వినియోగిస్తే దేశం ఏకం కావటానికి మొదటి మెట్టు ఏర్పడవచ్చు

*విశాలాంధ్ర, దినపత్రిక, 8-4-1962*

# 7. దృష్టి బేధాలు

ప్రకృతి ప్రతి ప్రాణికీ విడివిడిగా కళ్ళిచ్చి ప్రపంచాన్ని నీ దృష్టితో చూడు అని ఆశీర్వదించింది మనమంతా యధాశక్తి ఆ పనే చేస్తున్నాం కాని ఆధునిక నాగరిక మానవుడు తన కళ్ళతో తృప్తి పడలేడు ఏదైనా నమ్మశక్యంకాని దృశ్యం కనిపించినప్పుడు ఇంగ్లీషువాడు పక్కవాణ్ణి (ఇంగ్లీషులో) 'నేను చూసేదే నువ్వూ చూస్తున్నావా?'' అని అడుగుతాడు మన తెలుగువాడైతే ''నా కళ్ళను నేను నమ్మలేకుండా వున్నాను'' అంటాడు ఇదే భావాన్ని మిగిలిన వాళ్ళు కూడా ఏదో విధంగా వ్యక్తం చేస్తారనుకోవచ్చు

తేలేదేమంటే ఒకరి కళ్ళకు మరొకరి కళ్ళు సాయం కావలసిన పరిస్థితులు జీవితంలో అప్పుడప్పుడు కలుగుతుంటాయి లైలామజ్నూల కథ చాలా మందికి తెలుసు లైలా అందగత్తె

కాదని ఒకలాగా కొద్దిమందికే తెలిసి ఉంటుంది ఎవరో మజ్నూతో ''ఒరే ఈ అనాకారి పిల్లను ఎలా ప్రేమించావురా?'' అని అడిగితే ''అనాకారి పిల్లా? నా కళ్లు పెట్టుకు చూడు'' అన్నట్ట

దీన్ని బట్టి అందరిక కళ్ళూ ఒకటే చూడవని తెలుస్తుంది

అక్కడే చిక్కొచ్చింది ప్రపంచాన్నంతా తలా ఒకరకంగా చూస్తుంటే చిక్కు కదా?

చిక్కంటే జ్ఞాపకం వచ్చింది ఒకప్పుడు నాకు భయంకరమైన తాత్విక సందేహం వచ్చింది నేను పసుపూ, తెలుపూ, ఎరుపూ అనుకుంటున్నది, మరొకరు అనుకుంటున్నది, ఇంకొకరు అనుకుంటున్నదీ వేరొకరు అనుకుంటున్నాదీ ఒకటేనా అని - అది ఋజువు చేసే ఆధారం ఏదీ నాకు కనుచూపు మేరలో కనబడలేదు కానీ ఇంతలోనే ఒక తాత్విక సమాధానం కూడా దొరికింది నాకు పచ్చన అనిపించినట్టు గానే అందరికీ అనిపించక పోతేనేం? ఒకే రంగును అందరూ పచ్చన అని ఆమోదిస్తే పని గడిచిపోతుందిగా! ఒక ఎర్రరంగును చూస్తే గొడ్లన్నీ బెదురుతాయి గదా!

అందరి కళ్ళు ఒకటే చూడనప్పుడు ఈ తాత్విక సంతృప్తికి అవకాశం లేకుండా పోతుంది

భోక్తలు నలుగురూ ఏకగ్రీవంగా ''పులుసులో ఉప్పు తక్కువ అయిందీ అంటే వంట చేసిన ఇల్లాలు వడ్డనకాని పులుసులో మరింత ఉప్పు వేస్తుంది కాని ఒక్కరు ఉప్పు తక్కువ యిందనీ, ఒకరు ఎక్కువయిందనీ ఒకరు టంచనుగా సరిపోయిందనీ అంటేనే చిక్కు

ప్రశ్న ఎవరి కళ్ళు వారికున్న వెందుకు? అందరూ ప్రపంచాన్ని వేరు వేరుగా చూడటానికా? అందరూ ఒకే రకంగా చూడటానికా?

ఈ ప్రశ్నను సాగదీసినట్టయితే మానవ జాతి అంతా రెండు పక్షాలుగా చీలి మరోహోమానికి దిగిపోవచ్చు అందుచేత మనం ఈ ప్రశ్నను ఇలాగే ఒదిలేసి వాస్తవంగా జరుగుతున్న దేమిటో చూద్దాం

స్థూలంగా చూసినట్టయితే సమిష్టి వాదం కన్నా వ్యష్టివాదమే ప్రపంచంలో అధికంగా చలామణి అవుతున్నట్లు కనిపిస్తుంది వ్యష్టివాదం స్వేచ్ఛా చిహ్నం అంటారు ధనికవర్గాలు మెచ్చే రాజకీయ వేత్తలు వారనేదే నిజమైతే ప్రపంచంలో చాలా స్వేచ్ఛ ఉన్నట్టు కనిపిస్తుంది

''నీకు ఎవరి శైలి ఇష్టం అంటే నాశైలే నాకిష్టం'' అన్నాడు శ్రీశ్రీ

శైలి గురించి ఇష్టా ఇష్టాలంటూ ఉన్నవాళ్లలో చాలా మందికి తమ శైలే అన్నిటికన్నా బాగుంటుందనుకోవాలి ఫలానా రచయిత వండర్‌ఫుల్‌గా రాస్తాడు అని ఎవరన్నా అన్నప్పటికీ తనశైలిని తక్కువ చేస్తాడనుకోనవసరం లేదు ఇతరులమోహాలను మెచ్చుకున్నా మనమొహం మనకు నచ్చినట్టు

తనకంపు తనకింపు (సామెత)

''ఒకని భృతి కాను మరియు వేరొకని మృతిగ'' (సామెత)

''ప్రపంచాన్ని మీ కళ్ళతోనే చూడండి అని లోకోక్తులు కవులు కూడా చెప్పగా వింటున్నాం ప్రపంచం చేతనయిన మట్టుకు ఈ సలహాను పాటిస్తూనే ఉన్నది

కాని కొన్ని శాస్త్రీలు ప్రపంచాన్ని దాని మానాన బతకనియ్యవు

ఈ శాల్తీలలో అగ్రస్థానం శాస్త్రవేత్తలది వాళ్ళు గిరీశం ధోరణితో ''అనుకోడాలు పనికి రావోయ్ బావా'' అంటారు వాళ్లకు వాస్తవజ్ఞానం కావాలిట అందులో దృష్టి బేధానికీ, వ్యక్తి స్వేచ్ఛకూ ఏమీ ఆస్కారం లేదుట అందుకే స్వేచ్ఛా ప్రియులమైన భారతీయులం శాస్త్రజ్ఞానాన్ని అంతదూరాన అస్పృశ్యంగా వుంచుతున్నాం

శాస్త్రవేత్తలకు విరుద్ధమైనవాళ్లు గదా అనుకుంటే మతవాదులు కూడా తమ మాట వినేవాళ్లంతా తమ దృష్టిలోనే చూడాలని పట్టుబడతారు ఎవడైనా కళ్ళు తెరచి తన దృష్టికి ఏం కనిపించేది చూస్తానన్నట్టాయెనా వాణ్ని తక్షణం వెలివేస్తారు

అన్నిటికన్నా వ్యష్టిదృష్టిని హెచ్చుగా అరికట్టజూపేది వ్యాపార రంగం (వీళ్ళ రాజకీయ ప్రతినిధులే స్వేచ్ఛను గురించి ఎక్కువగా అరుస్తుంటారు) ప్రకటనలు చూడండి ''ఫలానా టూత్‌పేస్టు వాడకపోతే మీ నోరు కంపు కొడుతుంది, మీ పళ్ళు రాలిపోతాయి'' ''ఫలానా బిళ్ళలు మింగి మీరు మళ్ళీ నవ్వుతారు ఫలానా చిత్రం తప్పక చూడండి'' అని ప్రకటనలు మనకు చెబుతాయి అవి మనని ఆలోచించుకోనివ్వవు ఏ ఒక్క ప్రకటన అయినా పచ్చి అబద్ధం చెబుతున్నదని మనం అన్నామో మనని కోర్టుకీడ్చి పరిహారం కింద మనకున్నదంతా ధారపోయించటానికి తగిన చట్టం ఉన్నది మనం ఎటువంటి సినిమాలు చూడాలో, ఎటువంటి పాటలు విని, ఎటువంటి దృశ్యాలు చూసి కామోద్రేకం తెచ్చుకోవాలో। నిర్ణయించే వాళ్ళు లక్షలు ఆర్జించగలుగుతున్నారు వ్యాపారం మూడు పువ్వులూ ఆరు కాయలుగా ఉండే ప్రతి సందర్భంలోనూ జనబాహుళ్యం మరొకరి దృష్టిలో చూస్తున్నారని మనం గట్టిగా నమ్మవచ్చు

రాజకీయవాదులున్నారు వీళ్ళలోకి 'వరస్టు' కమ్యూనిస్టులు వాళ్ళు మనని మార్క్సిస్టు లెనినిస్టు కళ్ళతో జీవితాన్ని చూడమంటారు వీళ్ళ ఆటలు సాగనిచ్చేట్టయితే అందరికీ పనీ తిండి ఉంటే ఉంటాయేమోగాని స్వేచ్ఛ మాత్రం వుండదని కొందరు అంటారు అనటమే కాదు నిరుద్యోగ భయమూ, ఉపోషాల భయమూ కన్న కూడా స్వేచ్ఛ లేకపోవటమే పెద్ద విపత్తని కొందరిని నమ్మించగలుగుతున్నారు కూడా

ఎటు చూసినా వ్యష్టి దృష్టికి శత్రువులే కాని వాళ్ళ మధ్య సామరస్యం లేదు శాస్త్రజ్ఞులకు, మతాలవాళ్ళకు పొత్తు కలవదు వ్యాపార ధర్మం వాళ్ళకూ, కమ్యూనిస్టులకూ క్షణం పడదు ఇందువల్ల చాలా అనర్థాలు ఏర్పడుతున్నాయి

ఇటువంటి చిక్కులుంటాయనే శంకరాచార్లు గారు అసలు దృష్టి అన్నదే పచ్చి అబద్ధమని చూసేదేదీ నిజం కాదనుకోవటమే సరి అయిన దృష్టి అని ఖండితంగా చెప్పేశాడు బ్రహ్మజ్ఞానం అనేది మాత్రమే నిజమైన జ్ఞానమనీ దాన్ని తెలుసుకొన్నాననుకున్న వాడు ఏమీ తెలీని వాడేనని తెలీదని, తెలుసుకున్నవాడే నిజమైన బ్రహ్మజ్ఞాని అని ఉపనిషత్తులు చెప్పాయి

అటువంటి పుణ్యభూమి మనది।

*ఆంధ్రజ్యోతి వారపత్రిక, 23-2-1968*

# 8. ఇజాలు : నిజాలు

" సృజనలో వ్యాసాలు అయోమయంగా ఉండటం మాట కాదు గాని, తెలుగు పాఠకులు(అభాగ్యులు) చదవవలసిన రచనల యొక్క తత్వం ఎలాంటిదో బెర్ట్రాండ్ రసెల్, టి యస్ ఇలియట్, బెర్గ్‌సన్, జేమ్స్ జాయిస్, వర్జీనియావుల్ఫ్ కూడానేమో, వీళ్ళ నుంచి తెలుసుకోవాలంటే అది నేల విడిచిన సాము అవుతుందని నా వ్యక్తిగతమైన సందేహం మన సాహిత్యం ఇప్పటికే చదివేవాళ్ళకు కొన్ని మైళ్ళ ఎడంలో నడుస్తున్నది మనకి రాజకీయ స్వాతంత్ర్యం వచ్చినా(?) సాహిత్య సామ్రాజ్యవాదం నుంచి విముక్తి లేదా? మనం రచించేవన్నీ విశ్వసాహిత్యపు కొలబద్దలతోనే కొలవాలా? ఇవి rhetorical questions కాదు నా అనుమానాలు వాటికి సమాధానాలు తెలుసుకునేదాకా నాకు సృజన వ్యాసాలు కొన్ని అయోమయంగా ఉండటం తప్పనిసరేననుకుంటాను కవిత్వం రాసేవాళ్ళకు కొంత pose వేసే అర్హత ఉండవచ్చు నాబోటి పచ్చి వచనం రాసే వాడికి modesty తప్ప గత్యంతరం లేదు

మరొక విషయం రాయవలసి ఉంది ఉన్నట్టుండి అకస్మాత్తుగా మనవాళ్ళకు 'ఇజము'ల మీద ఒక విముఖత్వం పుట్టుకొచ్చింది దీన్ని బాలగంగాధరతిలక్ గారే ప్రారంభించారో ఆరుద్రగారో నాకు కచ్చితంగా తెలియదు వరవరరావుగారి రచనలు కూడా చూశాను ఈ విముఖత్వాన్ని కొంచెం analyse చేస్తే మార్క్సిజమూ, కమ్యూనిజమూ మాత్రమే కనిపిస్తున్నాయి హిందూయిజం, బుద్ధిజం, గాంధీయిజం, కాపిటలిజం(సిద్ధాంతమేకాదు) మొదలయినవి ఈ విముఖత్వాన్ని ప్రేరేపించే శక్తి గలవి కావు అందుచేత తిట్టదలిస్తే కమ్యూనిజం, మార్క్సిజములను పేరు పెట్టే తిట్టవచ్చు సర్వనామాల చాటున దాగనవసరం లేదు ఈ రెండు ఇజములనూ అందరూ ఆమోదించాలని నేను అనను కాని ఏ ఇజమూ అవసరం లేకుండా మన యువకవులు ఎక్కడికి పారిపోదలచారో అదైనా తెలిస్తే బాగుండును అన్ని ఇజములకూ అతీతమైన జీవిత సత్యాన్ని తెలుసుకోవాలని నేను తహతహలాడిపోతున్నాను

ఈనాడు కమ్యూనిస్టు వ్యతిరేకత ఒక తీవ్రమైన, నగ్నమైన, జాతీయ, అంతర్జాతీయ రాజకీయోద్యమంగా తీవ్ర రూపం దాల్చుతున్నది వియత్నాంలో అది ఆదికాలపు దేవదానవ సమరం ప్రమాణాలను అందుకున్నది ( ఎవరు దానవులో నేను చెప్పనక్కరలేదు) ఈ సమయంలో మార్క్సిజం లెనినిజం గురించి పార్టీ వాళ్ళు గుద్దులాడుకుంటున్నారు దాన్ని గురించి కవులూ, కథకులూ రాసేదేమీ లేదు కూడా అందుచేత మన రచయితలు పారిపోదలిస్తే కమ్యూనిజం నుంచే పారిపోవాలి మిగతా ఇజములన్నీ absolutely safe

*ముద్రణ సృజన, త్రైమాసిక, ఫిబ్రవరి - ఏప్రిల్, 1968*

# 9. విప్లవ ప్రచారం

ఏదో ఒక కుంటిసాకు పెట్టి విరసం సభ్యులను అరెస్టు చేస్తూ వస్తున్నది కొందరు విరసం సభ్యులు ప్రభుత్వాన్ని కూలదొయ్యటానికి కుట్ర చేస్తున్నారని ఆరోపణ ఉన్నదని పత్రికలో చదివాను ప్రతిపక్షాలన్నీ కలిసి పడగొట్టలేని ప్రభుత్వాన్ని నలుగురు విరసం సభ్యులు ఎలా పడగొట్టగలరు? ఊహించటం అసాధ్యం విరసం ఆశయం ఒక ప్రత్యేక ప్రభుత్వాన్ని పడగొట్టటం మటుకు కాదు అది ఎన్నికల పోటీ ఆశయం విరసం ఆశయం పూర్తిగా సామాజిక వ్యవస్థను మార్చి, ప్రజలకే సమస్త అధికారమూ దక్కేటట్టు చెయ్యటానికి తగిన భావనా సంచలనం కలిగించటం - ఇది ప్రజాస్వామ్యానికి ఎంతమాత్రమూ విరుద్ధం కాదు బూర్జువా ప్రజాస్వామ్యానికి ఎగువ మెట్టు విప్లవాలు విజయవంతమైన అనంతరం కూడా రష్యా, చైనాలలో కమ్యూనిస్టులు కాని వాళ్ళూ ఇతర పార్టీల వారూ అధికారాన్ని పంచుకోవటం జరిగింది విప్లవం వల్ల ఆదేశాలు - ఆదేశాల ప్రజాజీవితం - కొన్ని వేల రెట్లు మెరుగు కాలేదని ఆ దేశపు శత్రువులు కూడా అనలేరు

ఇంతకూ నేను చెప్పేదేమంటే, రచయితల అరెస్టులు ప్రజలపైన నేరుగా తగిలే దెబ్బ విరసం రచయితల కన్నా ప్రజల మేలు కోరే వారు ఉండబోరు ప్రజలు ఈ సంగతి స్పష్టంగా గ్రహించి, వారి అరెస్టుల ద్వారా ప్రాథమిక ప్రజాస్వామ్యం దెబ్బ తింటున్నదని తెలుసుకొని, ప్రభుత్వం చీటికీమాటికీ ఇలాంటి ప్రజా వ్యతిరేక చర్యలకు పూనుకోకుండా చూసుకోవాలి

*- సృజన మాసపత్రిక, జూలై 1974*

# 1. నాల్గవ అభ్యుదయ రచయితల సమావేశం

మద్రాసు మహానగరంలో జనవరి 17, 18, 19 తేదీలలో త్యాగరాయనగరం వాణీమహలులో ఆంధ్ర అభ్యుదయ రచయితల సమావేశం - కాదు, ఉత్సవం - జయప్రదంగా జరిగింది

ఇది నిజంగానే ఉత్సవం ఎందుచేతనంటే దీని వెనక మద్రాసులోని ఆంధ్ర ప్రముఖులనేకులున్నారు దీని ముందు ఆంధ్ర దేశంలో వున్న మహాకవులెందరో ఉన్నారు న్యాయమూర్తి గోవిందరాజాచారి గారు అధ్యక్షులుగానూ, రామానుజరావునాయుడు, నార్ల వెంకటేశ్వరరావు, నీలంరాజు శేషయ్య, దేవులపల్లి కృష్ణశాస్త్రి, తాపీ ధర్మారావునాయుడు గార్ల వంటి పెద్దలు సభ్యులుగానూ ఆహ్వాన సంఘం ఏర్పాటయినప్పుడే ఈ ఉత్సవానికి గట్టి పునాది ఏర్పడింది

రేణుకా పిక్చర్సు నిర్వాహకులు చిత్తూరు నాగయ్యగారూ, స్వతంత్ర ఫిలిమ్సు నిర్వాహకులు కోవలమూడి ప్రకాశరావుగారి వంటి ఉదారులూ ఆహ్వాన సంఘ సభ్యులకు వూతమిచ్చి అనేక విధాల తోడ్పడి, ఈ ఉత్సవం విజయవంతంగా కొనసాగటానికి ఆధారాలు కల్పించారు

ఆహ్వాన సంఘ కార్యదర్శి కృష్ణశాస్త్రిగారి తియ్యని పిలుపునకు వశులైతేనేమి, అభ్యుదయ రచయితల మీద పెరుగుతూ వస్తున్న అభిమానం వల్లనైతేనేమి, దేశంలో వున్న ప్రముఖ రచయితలు ఉత్సవంలో పాల్గొనడానికి వచ్చారు కారణాంతరాల చేత రాలేని పెద్దలు ఆశీస్సులు పంపారు పిలుపునకు సమాధానాలివ్వని వారిని వేళ్ళమీద లెక్కించవచ్చు

పిలకా నరశింహమూర్తిగారు అవ్యవధిగానే అయినా, చిత్రకళా ప్రదర్శనం ఒకటి ఏర్పాటు చేసి, ఈ సమావేశానికి శోభ కలిగించటానికి పూనుకున్నారు మొక్కపాటి కృష్ణమూర్తిగారు, సీతాదేవిగారు, పైడిరాజుగారు మొదలయిన ఆంధ్ర చిత్రకారుల చిత్రాలు తెప్పించారు చిత్రకారులు కూడా వచ్చారు

న్యాయమూర్తి రాజమన్నారుగారు ఈ ఉత్సవానికి సారధ్యం ఒప్పుకున్నారు క్వాజా అహమ్మద్ అబ్బాన్‌గారు ఉత్సవాలను ప్రారంభించటానికి ఒప్పుకున్నారు నెల్లూరు నాటక సంఘం వారూ, కృష్ణా గుంటూరు మండలాల వైజ్ఞానిక దళాల వారూ ప్రదర్శనలిచ్చి ఈ ఉత్సవానికి తోడ్పడడానికి అంగీకరించారు మద్రాసు పట్టణంలో వున్న విద్యార్థి సంఘాలలో నుంచి వాలంటీర్లు ముందుకొచ్చారు

అభ్యుదయ రచయితల సంఘం గర్వించటానికింతకంటె ఏం కావాలి? ఉత్సవాలు జయప్రదం కావటానికి ఇంతకంటె ఏం కావాలి?



మొదట తెనాలి, తర్వాత బెజవాడ, కిందటేడు రాజమండ్రి, ఇప్పుడు మద్రాసు -

సమావేశానికీ సమావేశానికీ అభ్యుదయోద్యమం ముందడుగు వేస్తున్నది ఏయేటికాయేడు కొత్తగా వచ్చిన పెద్దలీ ఉత్సవాలలో పాల్గొంటున్నారు సాహిత్యం సంకుచిత దృష్టితో గాక ఉదాత్తంగానూ, ఉన్నత సాంఘికాశయాలతోనూ, ప్రజలపరంగానూ, అభ్యుదయకరంగానూ

ఉండాలనే భావం సాహితీపరులకు కొత్తది కాదు కాని ఈ ఆశయాలకు దోహదం చేసి కృషి చేసిన సాహిత్య సంస్థలన్నిటికన్నా అభ్యుదయ రచయితల సంఘం ముందుకు పోయింది కనుకనే మూడేళ్ళలోపుగా ఈ సంఘం దేశంలో ఇంతగా చర్చలను రేపి, ఇంతమంది రచయితలను కూడగట్టుకుని 'తెలుగుతల్లి' పత్రికనూ, 'అభ్యుదయ' పత్రికనూ ఇంత విజయవంతంగా నడిపి, అభ్యుదయ ప్రచురణలు సాగించుతూ ఈనాడు దేశంలో ఉన్న మేటి రచయితలను ఈ ఉత్సవాలకు రప్పించుకున్నది

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, వెంద్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు, వేదుల సత్యనారాయణశాస్త్రిగారు, పుట్టపర్తి నారాయణాచార్యులుగారు, భమిడిపాటి కామేశ్వరరావుగారు మొదలైన పెద్దలు ఈ వేదిక మీద కొత్తగా నిలబడి, వివిధ విషయాలను గురించి తమ అభిప్రాయాలను ప్రకటించారు

వీరందరూ ఒక్కసారిగా అభ్యుదయ రచయితలతో ఏకమైపోకపోవటానికి కారణాలున్నాయి అభ్యుదయ రచయితల కార్యక్రమంతోటీ, ఆశయాలతోటీ పూర్తి పరిచయం వున్న రాజమన్నారు, గోవిందరాజాచారిగార్ల వంటి పెద్దలకూ, ఇవాళే దీని విషయం తెలుసుకోవటం ప్రారంభించిన పెద్దలకూ తేడా వుంది

అదీకాక, ఈ నాలుగేళ్ళుగా అభ్యుదయ రచయితల సంఘం అనేక విధాల దుష్ప్రచారానికి గురి అయి వున్నది ఈ దుష్ప్రచారం సాగించిన వారంతా స్వార్థపరులనీ, అజ్ఞానులనీ అనటానికి కూడా వీలులేదు ఇందులో అనేకమంది కార్యాచరణతో నిమిత్తం లేకుండా తమ సందేహాలన్నింటినీ తాత్వికంగానే నివృత్తి చేసుకోవాలని ప్రయత్నించే వారున్నారు "ఏది అభ్యుదయ సాహిత్యం?" అంటే సమాధానం చెప్పి ఒప్పించటం తేలిక కాదు "అభ్యుదయ సాహిత్యం ఏది?" అంటే నన్నయభట్టు నాటి నుంచి నేటి వరకూ సమాజంతో పాటు నడిచిన సాహిత్యం చూపవచ్చు

తెలుగులో అభ్యుదయ సాహిత్యానికి తొమ్మిది వందల ఏళ్ళ వయసు అభ్యుదయ రచయితల సంఘం వయసు నాలుగేళ్ళు మాత్రమే ఈ నాలుగేళ్ళ కాలంలోనే ఈ సంఘం పత్రికలు నడిపింది, పుస్తకాలు ప్రచురించింది గిడుగు రామమూర్తి, కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, కొమర్రాజు లక్ష్మణరావుగారు మొదలైన మహనీయుల వర్ధంతులు జరిపి ప్రత్యేక సంచికలు కూడా ప్రకటించింది కిందటి సంవత్సరం నుంచీ ఏటా సాహిత్య పాఠశాల నడపటానికి ఉద్యమించింది

దేశంలో వున్న రచయితలందరూ ఈ ఉద్యమంలో చేరి కృషిచేసిన కొద్దీ ఈ ఉద్యమం సమగ్రమవుతుంది ఈ ఉద్యమానికి ప్రాణప్రతిష్ఠ సరిగా జరిగిందనటానికి నిదర్శనం నానాటికీ ఇందులోకి పెద్దలు రావటమే



"ఈ సమావేశానికీ నవ్య సాహిత్య పరిషత్సమావేశానికీ తేడా ఏమిటి?" అని కొందరడిగారు రచయితల సమావేశాలన్నీ ఒకటిగానే వుంటాయి అభ్యుదయ రచయితల సంఘం ఒక తరగతి రచయితల మీద కత్తిగట్టిన సంఘం కాదు, దేశంలో వున్న రచయితలందర్నీ అభ్యుదయ సాహిత్య రచనకు పురికొల్పటమే దీని ఆశయం దీని ప్రణాళిక దీనికున్నది ఈ

ప్రణాళికకు అందరి ఆశీస్సులూ సంపాదించటమే దీని కర్తవ్యం ఈ సంఘం గురించి నిన్నటి వరకూ - నేటివరకూ - అపోహలతో వున్న వారు సహితం వచ్చి ఇందులో పాల్గొనటమే దీనికి పెద్ద ఆశీర్వచనం ఆ విషయం తమ ఆఖరు ఉపన్యాసంలో దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు స్పష్టంగా చెప్పారు

ఈ సమావేశాల్లో అభ్యుదయ రచయితల 'గొంతు' వినిపించలేదని ఒక విమర్శ వచ్చింది కాని ఇది పూర్తిగా నిజం కాదు

''రచయితల సంఘానికి ముందున్న వాళ్ళం, ఈ సంఘం సరిగా నడిచేటట్లు ప్రబోధించే బాధ్యత మనది ''

''రచయితలు అధోగతిలోవుండి ఏమీ పట్టించుకోకుండా వుంటే ప్రజలు ముందుకెట్లా నడుస్తారు?''

''రచయితలకు సంఘంలో తగిన గౌరవమూ, పలుకుబడీ రావాలి రచయిత అయినవాడు రీవిగా నిలబడాలి ఇది ఇట్లాగూ అని నలుగురికీ చెప్పాలి నలుగురూ తన మాట వినేటట్లు చేయాలి''

'పేదవాళ్ళకెన్నో సమస్యలున్నాయి వాళ్ళు దారిద్ర్యంలోనూ, అజ్ఞానంలోనూ పడి కుమిలిపోతున్నారు వాళ్ళ గోడెవరు చెబుతారు? వాళ్ళు చెప్పుకోలేరు మనం చెప్పాలి చెప్పటం మనకే చేతకాకపోతే, వాళ్ళకి చేతనవుతుందా?''

''మనని ధనవంతులూ, అధికార్లూ వచ్చి పీపు చరచనక్కర్లేదు సామాన్య ప్రజలు వినేటట్టు మనం పలికితే చాలు ''

- ఇటువంటి అభిప్రాయాలు ఈ సమావేశంలో ప్రకటించబడినాయి ఇటువంటి విశ్వాసాల మీదే అభ్యుదయ రచయితలు ఇల్లు కట్టుకున్నారు

ప్రత్యేకించి దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఆఖరున చేసిన ఉపన్యాసం ఒక కావ్యం అదే అభ్యుదయ రచయితల ''గొంతు'' అది విన్న తర్వాత అనేకమంది సభికులలో కొత్త చైతన్యం వచ్చింది



ఈ సమావేశం ద్వారా ఒక్క విషయం రూఢి అయింది

అభ్యుదయ రచయితల వార్షిక సమావేశాలు కొద్దిపాటి అంగబలంతో ఆఖరు నిమిషపు ఏర్పాట్లతో, ఒకటి రెండు రోజుల కార్యక్రమంతో, ఒకటి రెండువేల మంది ప్రజలు మాత్రమే పట్టే హాలులో జరపటం అసాధ్యం ఉన్న పరిస్థితులలో చాలా అన్యాయాలు జరిగాయి ఉపన్యాసకులకు టైము చాలలేదు ఆహ్వానాలు పంపిన వారికే చోటు చూపవలసి వచ్చింది వైజ్ఞానిక ప్రదర్శనలు కూడా క్లుప్తీకరించవలసి వచ్చింది పోనుపోను, ఈ ఇబ్బంది జాస్తి అవుతుంది ఈ సమావేశాలకు అసంఖ్యాకులైన ప్రజలు రావాలి ఆధునిక అభ్యుదయ రచనలు వినాలి వాటి ప్రదర్శనలు చూడాలి దేశంలో వున్న ప్రఖ్యాత రచయితలలో పరిచయం చేసుకోవాలి, వారి అభిప్రాయాలు వినాలి సాహిత్యం కొద్ది మందికేనవే అభిప్రాయం రచయితలలో పోతున్నట్టే ప్రజలలో కూడా అంతరించి, ఈ సమావేశాలు తమ కొరకేననే అభిప్రాయం ప్రజాసామాన్యంలో విస్తరించాలి ఈ విషయం అభ్యుదయ రచయితల సంఘం

గుర్తించి, ముందు సమావేశాలు ఆదర్శవంతంగా జరపాలి "మరో రెండు సంవత్సరాలకు చూడండి ఈ ఒక్క సంస్థే దేశంలో నిలబడి వుంటుంది" అన్నారొకరు ఇదే జరిగితే అభ్యుదయ రచయితల సంఘం మీద చాలా పెద్ద భారం పడుతుంది

*ముద్రణ అభ్యుదయ, మాసపత్రిక, మార్చి 1947*

# 2. అభ్యుదయ గామి

"అభ్యుదయ రచయితల సంఘంలో చేరుతావా" అని నా మిత్రుణ్ణి అడిగాను

"కొత్త సాహిత్య పరిషత్తా?" అన్నాడు నా మిత్రుడు

అవునన్నాను

"కొత్త సాహిత్య పరిషత్తులకెంతైనా స్థానం ఉంది మనదేశంలో ఎందుచేతనంటే మన సాహిత్యం మీద విమర్శలేదు అసలు సాహిత్యమే చదవరు విమర్శ లెవరు చదువుతారు? కొత్త సాహిత్యోద్యమాల వల్ల విమర్శలేని లోటు తీరిపోతుంది అదీ కాక మన రచయితలకు పేరు ప్రఖ్యాతులు బొత్తిగా ఉండటంలేదు వాళ్ళు అప్పుడప్పుడూ కొత్త సాహిత్య పరిషత్తుల్లో చేరి ఉపన్యాసాలిస్తూంటే గాని ఎవరూ గమనించరు అందుచేత-ఈ-దీనిపేరేమిటి? - ఈ అభ్యుదయ సాహిత్యోద్యమాన్ని నేను కూడా బలపరుస్తున్నాను కాని ఈ ఉద్యమం రాజకీయాల జోలికి పోతుందని చూచాయగా విన్నాను అది చాలా పొరపాటు-" అని ప్రారంభించాడు నా మిత్రుడు

"ప్రజాస్వామ్యమంటే రాజకీయాల్లో వేలుపెట్టే హక్కు ప్రతివాడికీ ఉండటం కాదా? అన్నాను

"అయితే అవునుగాక! ఉత్తమ కళారాధకులూ, శాస్త్రజ్ఞులూ, వైజ్ఞానికులూ, రాజకీయాలజోలికి పోరాదు సాహిత్యం కాంగ్రెసు కార్యక్రమాన్ని బలపరుస్తూ, గాంధీజీ ప్రబోధాలు ప్రచారం చేస్తే చాలు రాజకీయాలనవసరం"

"అభ్యుదయ రచయితలు పాక్షిక రాజకీయాలకు ఎడంగా ఉంటారు" అన్నాను

"అదే నేనూ కోరేది అయినా, ఈ సంస్థకు రాజకీయాలతో సంబంధంలేదని రుజువు చేసేటందుకు, కమ్యూనిస్టులకిందులో స్థానం లేదని ప్రకటిస్తే బాగుంటుంది" అన్నాడు నా అమూల్య మిత్రుడు

*ఆనందవాణి, వారపత్రిక, 20-7-1947*

# 3. సాహిత్యంలో సాంఘిక చైతన్యం

డ్రేసఫ్‌ను అక్రమంగా ద్వీపాంతరవాసం పంపిన ఫ్రెంచి మిలిటరిస్టులు రూపు లేకుండా పోయినారు కాని డ్రేసఫ్‌కు జరిగిన అన్యాయాన్ని తనదిగా చేసుకుని పోరాడిన ఫ్రెంచి రచయిత ఎమిలీజోలా, తాత్కాలికంగా దేశం విడిచి పారిపోయినా, ప్రపంచ సాహిత్యంలో శాశ్వత స్థానం సంపాదించుకున్నాడు టాల్‌స్టాయ్, గోర్కీ, ఈనాడు అమెరికాలో హోవర్డ్‌ఫాస్ట్ మొదలైన రచయితల రచనలు బహిష్కరించబడ్డాయి కాని సాహిత్యంలో ఉండే సాంఘిక చైతన్యం

పోలీసు వారంట్లనూ, ప్రభుత్వపు ఉత్తరువులనూ లక్ష్యపెట్టరు డికెన్స్, వీరేశలింగం వంటి రచయితలు తమకు గల సాంఘిక చైతన్యాన్ని నలుగురి సొత్తూ చేసి, సాంఘిక పరిస్థితులలో అవసరమైన మార్పులు తీసుకురాగలిగారు

కొందరు రచయితలలో వారి సాహితీశక్తే సాంఘిక చైతన్యాన్ని పెంపొందించింది వారు తమ రచనల ద్వారా ప్రజలకు సన్నిహితంగా వస్తూ తద్వారా తమలోని సాంఘిక చైతన్యాన్ని పెంచుకున్నారు ఇటువంటి వాడే ఏ భాగవతకర్త పోతన్న ఆయన మొదట్లో రాజులను కొలిచి, అక్కడి వాతావరణంతో పూర్తిగా అసంతృప్తి చెంది, చివరకు పొలం దున్నుకుంటూ భాగవతం రాసి, దాన్ని ''మనుజేశ్వరాధములకు - కూళలకు - కర్ణాటకిరాట కీచకులకు- అమ్మి'' ఆ 'పడుపుకూడు' భుజించనన్నాడు ధూర్జటి కవి కూడా రాజులనాశ్రయించి మన్ననలు పొందినవాడే అతడు కూడా ''రాజుల్ మత్తులు, వారి సేవ నరకప్రాయింబు'' అన్నాడు

ఈ విధంగా ఉత్తమ సాహితీపరుల సాంఘిక చైతన్యం ముందుండటమే కాక ముందుకు నడుస్తూ సంఘాన్ని నడిపిస్తూ వచ్చింది

అయితే గొప్ప రచయితలందరికి సాంఘిక చైతన్యం ఒక్కటే గీటురాయిగా ఉండలేదు సాంఘిక చైతన్యం సమగ్రంగా ఉన్నవారంతా కలాలూ, గంటాలూ పట్టలేదు కొందరు రాజకీయాలలో పని చేశారు మంత్రిత్వాలు నిర్వహించారు కొందరు యుద్ధాలు కూడా చేశారు తిక్కన్న వంటి వారు తమ సాంఘిక చైతన్యాన్ని ఇటు సాహిత్యానికీ, అటు రాజకీయాలకూ కూడా వినియోగించారు సాహిత్యంమీద అభిలాషా, సాహిత్యంతో పరిచయమూ, రచనా నైపుణ్యమూ, సాహితీ కృషీ కలిగిన వారే రచయితలైనారు

ఇటువంటి సాంప్రదాయాలన్నీ ఇటీవలి కాలంలో తారుమారయాయి దానికి కారణం సంఘంలో కలుగుతూ వచ్చిన మార్పులే

ఏ యుగంలోనైనా కూపస్థమండూకాల వంటి రచయితలు, తమ రచనాశక్తిని దగ్గరలో ఉండే ధనికులకు ధారపోసి పొట్ట పోసుకున్న రచయితలూ ఉండే ఉంటారు కాని ఈ యుగంలో కూపస్థమండూకాల సంఖ్య చాలా హెచ్చింది

దేశంలో రెండు శతాబ్దాల బానిసత్వ ప్రభావం వల్ల ప్రజలలో చదువుకున్న వారికి కూడా రాజకీయాలతో ఎట్టి సంబంధమూ లేకుండా పోయింది దీనితోబాటు జీవితం మీద రాజకీయ శాసనం కూడా, ఏ మనుజేశ్వరాధముల కాలంలోనూ లేనంతగా, పెరిగిపోయింది జీవితం స్తంభించి, సాంఘిక చైతన్యం కూడా చాలా వరకు కరడుగట్టుకుపోయింది అత్యధిక సంఖ్యాకులకు జీవితాన్ని శాసించే శక్తులను గురించిన జ్ఞానం గాని, ఆ శక్తులను మార్చే శక్తి గాని లేకుండా పోయింది ఈ దుస్థితిలో ఎన్నో విశ్వాసాలు మూఢ విశ్వాసాలు గానూ, ఎన్నో ఆచారాలు దురాచారాలుగానూ పరిణమించాయి మన సమాజానికి ఆధునిక ప్రపంచంలో గణ్యత లేకుండా పోయింది ఈ అంధకారం నుండి బయటకు వచ్చే దశలో వీరేశలింగం గారి వంటి వారు బానిసత్వం మీద గాక, అది తెచ్చి పెట్టిన సాంఘిక దుష్ఫలితాలపై ధ్వజమెత్తి సాహిత్యం సృష్టించారు వీరేశలింగంగారి సాహిత్యంలో సాంఘిక చైతన్యం చాలా కనిపిస్తుంది కాని ఆయన లక్ష్యం సంఘ సంస్కరణ దాటిపోలేదు ఆ కాలపు సాహిత్యంలో విప్లవ

బీజాలు గల సాంఘిక చైతన్యం గురజాడ రచనలలో ఇంకా హెచ్చుగా కనిపిస్తుంది గురజాడ గారి 'దేశభక్తి'లో వుండే సాంఘిక చైతన్యం వీరేశలింగంగారి రచనలలో ఏ మూలా కనిపించదు

ఈ యుగపు రచయితలలో కూపస్థమండూకాల సంఖ్యా ప్రమాణం హెచ్చటానికి మరొక కారణం అచ్చుయంత్రాల పెరుగుదలా, పత్రికల సంఖ్య హెచ్చటమూ, చవుకబారు సాహిత్యం విజృంభించటమూనూ సాహితీపటిమ లేని వారిని ఉన్నవారితోనూ, సాంఘిక చైతన్యం లేని వారిని ఉన్నవారితోనూ చాలా వరకు సమంగా చేశాయి అచ్చుకూటాలు జర్నలిజం సాహిత్యాన్ని వెళ్ళగొట్టింది

చవుకబారు నాణెం ఖరీదైన నాణాన్ని వెళ్ళగొట్టింది పరనం నిత్య వినోదాలలో ఒకటై, సినిమా చూడడం నీతిగా తయారయింది పెట్టుబడిదారీ వ్యవస్థ చవుకబారు సాహిత్యానికి అండగా నిలిచింది ప్రకటనలు పత్రికలకు ఆర్థికంగా సహాయపడ్డాయి గాని సాహిత్య గ్రంథాలకు తోడ్పడలేదు

రచయితలందరూ మధ్యతరగతికి చెందినవారు కళ్ళ ఎదుట ప్రత్యక్షంగా జరుగుతున్న సాంఘిక విప్లవ పరిణామంలో మధ్యతరగతి ప్రముఖ పాత్ర నిర్వహించటం లేదు నిజానికి మధ్యతరగతికి ఈ అవకాశం దాటిపోలేదు మధ్యతరగతిలో విప్లవశక్తులున్నంత మేరకు సాంఘిక చైతన్యం సాహిత్యంలో ప్రతిబింబిస్తూనే వుంది కాని ఇది ఎంత మాత్రమూ చాలదు మధ్యతరగతికి చెందవలసిన సాంఘిక పరిణామం ఇంకా ఎంతో ఉన్నది ఉదాహరణకు, రచయితగానూ, కళాకారులు గానూ పొట్ట పోసుకోగలిగిన వారు నూటికి ఒకరిద్దరు కూడా లేరు మన కవులూ, కథకులూ, చిత్రకారులూ, గాయకులూ తమ జీవనోపాధులను ఇతరత్రా చూసుకుంటున్నారు 1917లో కూడా రష్యా ఈనాటి ఇండియా అంత వెనకబడి పోలేదని, ఒక సోవియట్ మిత్రుడు చెప్పాడు అందులో అసత్యం ఏమీ ఉండదు విప్లవకాలంలో రష్యన్ రచయితలు రచయితలుగా బ్రతుకుతూ వచ్చారు అందుచేత వారిలో మధ్యతరగతికుండవలసిన సాంఘిక చైతన్యం సమగ్రంగా వారి రచనలలో ప్రతిబింబించింది గొగోల్ వంటి రచయితలు ఇంకా ముందుకి కూడా వెళ్ళి సాహిత్యాన్ని శ్రామిక వర్గాలకందించగలిగారు

ఈ కాలపు రచయితలలో సాంఘిక చైతన్యం లోపించటంతో వారికి సాంఘిక చైతన్యమంటేనే భయం కూడా ఉన్నది రాజకీయాలను దూరంగా ఉంచటం వారి నినాదం రాజకీయ విధానం లేకుండా ఈనాడు, ప్రజాస్వామిక పద్ధతి అవలంబించిన స్వతంత్ర దేశం ఏదీ లేదు ఎవరికీ సరి అయిన సాంఘిక చైతన్యం సాధ్యం కాదన్న భావం వారి రాజకీయాలంటే భయమైనట్లేమన్నా వారికి భయం దేనియందైనా ప్రబలమైన విశ్వాసం గల రచయిత దాన్ని ప్రచారం చెయ్యకుండా ఉండలేడు వీరేశలింగం గారు ప్రచారమంటే భయపడలేదు కాని మన రచయితలలో చాలా మందికి ప్రచారమంటే భయం నిజానికి ఈ రచయితలకు ప్రచారం చెయ్యటానికైనా ఏమీ లేదు వారి గొప్పతనం తప్పిస్తే

ఈ యుగపు సాంఘిక పరిస్థితులను మార్క్సు సిద్ధాంతాల నుండి వేరు చేయడం సాధ్యం కాదు మార్క్సిస్టు సాహిత్యం కొంతయినా చదవకపోతే ఈనాటి సమాజాలనూ, ఆర్థిక పరిస్థితులనూ, రాజకీయాలనూ వీటి మధ్య గల సంబంధాలను సమగ్రంగా అర్థం చేసుకోవటం సాధ్యం కాదు అయితే ఈనాటి మన రచయితలలో మార్క్సిస్టు దృక్పథం

గురించి తెలిసిన వారు చాలా తక్కువ మంది ప్రపంచంలో సగ భాగం మార్క్సిస్ట్ సిద్ధాంతం ఆధారం మీద రాజకీయ, ఆర్థిక, సాంఘిక వ్యవస్థలను ఏర్పాటు చేసుకున్నది ఆ సగం ప్రపంచం మీద మిగిలిన దేశాల పాలకులు కత్తికట్టి నీతినీ, మానవ ధర్మాన్నీ కూడా పరిత్యజించి రాక్షసుల్లాగా, పిశాచాల్లాగా ప్రవర్తిస్తున్నారు ఇట్లా ఎందుకు జరుగుతున్నదని మన రచయితలు ప్రశ్నించుకోవటం లేదు

## అభ్యుదయ సాహిత్యోద్యమం

ఆంధ్రలో అభ్యుదయ సాహిత్యోద్యమం సాగినప్పుడు ''అభ్యుదయం అంటే ఏమిటి? అభ్యుదయ రచయిత యొక్క కర్తవ్యాలు ఏమిటి?'' అన్న విషయమై తర్జనభర్జనలు జరిగాయి గాని రచయిత యొక్క రాజకీయ చైతన్యం ఏ స్థాయికి వస్తే ఆ రచనలు చెయ్యగలుగుతాడన్న సమస్యను ఎవరూ తడవలేదు అభ్యుదయోద్యమం అయోమయంలో పడి నినాదాల వెంట పరుగెత్తిపోవటానికి కారణం మధ్యతరగతి - రచయితల తరగతి - సక్రమ పరిణామం ఎదకపోవడమేననడానికి సందేహం లేదు పెట్టుబడిదారీ దేశాలలో రచయితలకుండే ప్రపంచ జ్ఞానమయినా మన అభ్యుదయ రచయితకు లేదు, ఉండే అవకాశం లేదు శ్రామికుల పట్ల సానుభూతి అన్నది ఆదర్శంగా ఉన్నదేగాని, వారి జీవితాలతో సక్రమమైన పరిచయం లేదు మన సంఘంలో అనేక వృత్తులవారున్నారు వారి సమస్యలను గురించి గాని, వారి పనిని గురించి గాని, ఆఖరుకు వారి పరికరాలను గురించి గాని మన రచయితలకు తెలియదు ఎంతో వైవిధ్యం గల ఆంధ్రుల జీవితంలో సహస్రాంశం కూడా సాహిత్యంలో ప్రతిబింబించలేదు అది ఎవరి తప్పు కాదు వృత్తిచేత రచయిత అయిన వారు లేరు రచయితలుగా పెద్ద పేరు తెచ్చుకున్న వారిలో మేష్టర్లున్నారు జర్నలిస్టున్నారు, ప్లీడర్లున్నారు డాక్టర్లున్నారు అచ్చంగా రచయితలు మాత్రమే అయిన వారు దాదాపు లేరనే చెప్పవచ్చు

కాని అభ్యుదయ సాహిత్యోద్యమం వృధాపోయిందని చెప్పటానికి వీలులేదు దాని ప్రభావం చాలా మంది రచయితల మీద ప్రసరించింది కొత్తగా రచనలు సాగించే వారిలో చాలా మంది వాస్తవిక జీవితాన్ని తమ రచనలలో ప్రతిబింబింపచేయటానికి ప్రయత్నిస్తున్నారు కాని వీరికి రచనాశక్తి చాలదు వీరి రచనలలో చాలా భాగం బహిష్కరించబడను కూడా వచ్చు సాంఘిక చైతన్యాన్ని పెంపొందించే పత్రికల సంఖ్య హెచ్చితే ఇలాంటి రచయితలకు అవకాశాలు హెచ్చుతాయి ఇటువంటి పత్రికలు కూడా అభివృద్ధి చెందుతున్నాయి కాని సాహిత్యం పురోగమించాలంటే ఇది మాత్రమే చాలదు సాంఘికచైతన్యాన్ని పెంపొందించే ఇతర సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక ఉద్యమాలన్నిటితోనూ చేతులు కలిపి సాహిత్యోద్యమం నడపాలి అట్లా నడిచిననాడు ఈ ఉద్యమాలన్నీ ఒకదానినొకటి బలపరుస్తూ జాతిని ఉత్తేజపరచగలవు

*- విశాలాంధ్ర దినపత్రిక, ప్రారంభ సంచిక, 22-6-1952*

# 4. రాష్ట్రేతరాంధ్రులూ : సాహిత్యాభిలాష

గత ఏప్రిల్ మాసంలో నేను ఢిల్లీ, బొంబాయి నగరాలకు వెళ్ళి అక్కడ ఒక విషాదకరమైన విషయం తెలుసుకున్నాను రాష్ట్రేతరాంధ్రులందరికీ ఈ చిన్న హెచ్చరిక చెయ్యటం నా ధర్మమని తోచి ఈ నాలుగు ముక్కలూ రాస్తున్నాను

మద్రాసు, బొంబాయి, కలకత్తా, పూనా, ఖర్గపూరు, జెంషడ్పూరు, ఢిల్లీ మొదలైన పట్టణాలలో ఆంధ్రులు ప్రబల సంఖ్యలో వుంటున్నారు స్వరాష్ట్రంలో వున్న ఆంధ్రుల కంటె కూడా వీరు మంచి పద్ధతిలో వుండటమే గాక వీరిలో చాలా మంది యావద్భారత ఖ్యాతీ, గొప్ప పదవులూ గలవారై, ఆంధ్రులకు గర్వకారణంగా కూడా వుంటున్నారు వీరి కృషీ, దీక్షా,సామర్ధ్యాల ఫలితంగా ఆయానగరాలలో ఆంధ్ర మహాసభలూ, కొన్ని చోట్ల ఎడ్యుకేషన్ సొసైటీలు నడుస్తున్నాయి

రాష్ట్రేతరాంధ్రులలో సాహిత్యాభిలాష గల యువకులు చిన్న చిన్న కూటాలు పెట్టి కళా వ్యాసంగాలు కూడా జరుపుతున్నారు ఒక కవిగాని, నటుడుగాని, గాయకుడు గాని రావటం జరిగితే, వారు ఆ వచ్చిన మనిషిని తమ ఆప్తుడుగా భావించి ఆదరించి గౌరవిస్తారు ఇది కూడా గర్వించదగిన సంగతి

అయితే ఇలాటి కళాభిలాషకు తగిన ప్రోత్సాహం లేదని నేను ఢిల్లీలో తెలుసుకుని చాలా విచార పడటం జరిగింది ఢిల్లీలోని ''రసన'' వారు ''వాచలి'' అనే పేరుతో ఆధునిక కధకుల చక్కని రచనలు ఒక సంపుటిగా ప్రచురించారు ఇది వేసినవారు ధనకాంక్షతో పుస్తకాలు ప్రచురించే పబ్లిషర్సు కారు సాహిత్యంపై గల తీపికొద్దీ చేతి సొమ్ము వ్యయం చేసి తమ ఉత్సాహాన్ని ప్రకటించు కొన్నవారు

ఇంత ఉత్సాహంతో వారు ఈ పుస్తకం అచ్చు వేశాక వారిని నిరుత్సాహం ఎదుర్కొన్నది ఆ పుస్తకాలు ఎలా అమ్మాలో, ఎక్కడ అమ్మాలో, తాము చేతి నుంచి పెట్టిన మొత్తమైనా తిరిగి ఎలా సంపాదించుకోవాలో వారికి తెలియలేదు దేశంలో బోలెడన్ని కధా సంపుటాలు వెలువడి అమ్ముతున్నాయి ''వాచవి'' అమ్మకపోదు కాని దానిని అమ్మిపెట్టేవారు ''రసన''కు దొరకలేదు

''రసన'' వారు ఇలాంటి పరిస్థితిలో ఇంకొక పుస్తకం వెయ్యటానికి సాహసించలేదు అంతే కాదు ఇతరచోట్ల గల ఆంధ్రుల స్థితి కూడా ఇంతేనన్న మాటే గద! కలకత్తాలో వాళ్ళు గాని, బొంబాయిలో వాళ్లుగాని ఉత్సాహంతో ఒక పుస్తకం వేయ ప్రయత్నిస్తే వారికి చేతులు కాలాయన్నమాటే!

ఇది నిజంగా శోచనీయం ఈ విషయంలో నాకొకటి తోచింది ఢిల్లీలో వేసిన పుస్తకం వెయ్యి కాపీలు కలకత్తా, బొంబాయి, పూనా, ఖర్గపూరు, జంషేడ్పూరు మొదలైన నగరాలలోని ఆంధ్ర మహాసభలు తమ సభ్యులకు ఎందుకు విక్రయించలేవు? రాష్ట్రేతరాంధ్రుల సాంస్కృతికావసరాలు మరింత హెచ్చుగా ఉండటం సహజం కదా? దేశం కాని దేశంలో ఉండి సంస్కృతీ సంబంధాలు కూడా తెంచుకుంటే ఇక వారికి మిగిలే ఆంధ్రత్వమేమిటి? తమిళదేశం మధ్య దిగబడిపోయిన ఒకనాటి ఆంధ్రులకూ, రాష్ట్రేతరాంధ్రులకూ తేడా లేకుండా పోవటం వాంఛనీయమా? రాష్ట్రేతరాంధ్రులు తమ సాటివారు సంస్కృతీపై గల మమకారంతో అచ్చువేసే

పుస్తకాలను కొనటం తమ విధిగా భావించవచ్చునని నాకు తోచింది వ్యాపార దృష్టితో ఆంధ్రాలో ప్రచురించబడే పుస్తకాలను వారు ప్రోత్సహించవచ్చు, మానవచ్చు వాటిని కొనటంలో కేవలం తమ 'అభిరుచులను' బట్టి వ్యవహరించవచ్చు కాని ''వాచవి'' లాంటి ప్రచురణలను ఇతర రాష్ట్రేతర నగరాలలోని ఆంధ్రులు చిన్న చూపు చూడతం నాకు చాలా దారుణంగా తోస్తున్నది (దాని కాపీలు బొంబాయి పంపితే మూడు అమ్ముడయాయట!)

ఈనాడు ఆంధ్రలో అతి సామాన్య కుటుంబీకులు కూడా పుస్తకాల కోసం డబ్బు ఖర్చు చేస్తున్నప్పుడు మహానగరాలలో నుంచి ఉద్యోగాల చేసుకుంటున్నవారు ధనాభావంచేత పుస్తకాలు కొనలేరనుకోవటం సాధ్యం కాదు ఇది ఆంధ్ర సంస్కృతి పట్ల వారికి గల అలక్ష్యమూ, అనాదరణా తప్ప మరేమీ కాదు

సంస్కృతికి సంబంధించిన విషయాలలో రాష్ట్రేతరాంధ్ర మహాసభలూ, ఎడ్యుకేషనల్ సొసైటీలూ ఇప్పటికన్నా ఇంకా హెచ్చు ఔదార్యం వహించాలి ఒక్క రాష్ట్రేతరాంధ్రులు ప్రచురించే పుస్తకాలే గాక ఆంధ్రలో ప్రచురితమయ్యే మంచి పుస్తకాలను సయితం బయట ఉన్న ఆంధ్రులకు అందజేయటానికి ఈ సంస్థలు తోడ్పడవచ్చు ఇందువల్ల ఆ సంస్థలకు కొంత ఆర్థిక లాభం కూడా వుంటుంది చౌకబారు సాహిత్యం ముమ్మరంగా వున్న ఈ రోజులలో ఉత్తమ సాహిత్యానికి ఆంధ్రలో కూడా చెప్పుకోదగిన ఆదారం లేదు రాష్ట్రేతరాంధ్రుల ఆదరణ నిజమైన సాహిత్య సేవ చేస్తున్న వారికి చాలా దోహదకారిగా వుంటుంది

కొంత తప్పు రాష్ట్రేతరాంధ్ర సాంస్కృతిక సంఘాలలో ఉంటే ఉన్నదేమో! ఎవరైనా పేరుమోసిన కళాకారుడు వచ్చినపుడు సభ చేసి ఆయనను ఉపన్యాసం ఇవ్వమనటం తప్ప తన చుట్టూ ఉండే ఆంధ్రులలో కళాతృష్ణ రేకెత్తించటానికి వారు అంతగా కృషిచేయటం లేదేమో! ఇలాంటి కృషీ, దోహదమూ జరిగితేనే గాని రాష్ట్రేతరాంధ్రుల అభిరుచి ముందుకు పోదు అభిరుచి ముందుకు పోని పక్షంలో ఆంధ్రలో చలామణి అవుతున్న చౌకబారు సాహిత్యమే రాష్ట్రేతరాంధ్రుల లోనూ ప్రచారం పొందుతుంది

*ముద్రణ తెలుగు విద్యార్థి, మాసపత్రిక, జూలై 1958*
*సాహితీ స్రవంతి శీర్షికనుంచి*

# 5. కళాకారుడి స్వేచ్ఛా, ప్రతిబంధకాలు

కళాకారుడి సాంఘిక పాత్ర గురించి మనం శాస్త్రీయంగా ఆలోచించేటప్పుడు ఆదర్శ దృష్టితో ఆలోచిస్తాం రసాయనవేత్తలు నీరూ, రాగీ, గంధకమూ, ప్రాణవాయువూ మొదలైన వాటి గుణాలను నిర్వచించేటప్పుడు పరిశుద్ధమైన ద్రవ్యాలనే మనసులో ఉంచుకుంటారు, కాని ఇవేవీ ప్రకృతిలో నిష్కల్మషంగా దొరకవు అదేవిధంగా కళాకారుడు వాస్తవ జీవితంలో అనేక ప్రతిబంధకాలకు లోనై కళాసృష్టి చేస్తాడు ఇందులో కొన్ని వ్యక్తిగతమైనవి కొన్ని ఆయా కళల స్వభావాన్ని బట్టి ఏర్పడేవి మరికొన్నిజీవితం తెచ్చిపెట్టేవి

వ్యక్తిగతంగా ఏర్పడే ప్రతిబంధకాలే ఎన్నో విధాలుగా ఉంటాయి కళాకారుడి అనుభవమూ, ప్రపంచ జ్ఞానమూ, సాంఘిక శక్తుల అవగాహనా క్రమంగా పెరిగే అవకాశం ఉన్నప్పటికీ, ఎప్పటికప్పుడు పరిమితంగానే ఉంటాయి వాటికి సమగ్రత అంటూ ఉండదు అనుభవం చీకటిలో దీపం ఉండేచోట అంతా బాగానే కనిపిస్తుంది దానికి దూరంగా ఉండేది అస్పష్టంగా ఉంటుంది మరీ దూరంగా ఉండేది బొత్తిగా కనిపించదు

ఈ లోపాన్ని కళాకారుడు కొంతవరకు ఇతరుల అనుభవాన్ని అరువు తెచ్చుకుని పూడ్చుకుంటాడు ఇతరుల అనుభవాలంటే, ఎవరి అనుభవాలన్న సమస్య వస్తుంది జీవిత సంఘటనలు అందరిలోనూ ఒకే రకం చైతన్యాన్ని కలిగించవు గాంధీని హత్య చేసినట్టు తెలియగానే పిండివంటలు చేసుకున్న వాళ్ళున్నారు, ఆ రాత్రి భోజనం సయించని వాళ్ళూ ఉన్నారు అందుచేత కళాకారుడు అందరి అనుభవాలనూ స్వీకరించ లేడు తాను ఎవరి అనుభవాలను స్వీకరించగలడో, తన అనుభవంతో ఎవరి అనుభవాలు మేళవిస్తాయో నిర్ణయించుకోవాలి ఈ అన్వేషణలో కళాకారుడు తన ''సమాజాన్ని'' తాను వెతుక్కోవాలి

కళాకారుణ్ణి ఒంటికంటి రామలింగంగానూ, ఇతర జనులకు అతీతంగా ఉండి, తన ఏకాంత సమాధిలో నుంచి మహత్తర కళాస్రవంతిని సృష్టించే గారడీవాడుగానూ చిత్రించే చిత్రం పూర్తిగా అసత్యమని నా దృఢ నమ్మకం ఇటువంటి ''వ్యక్తివాదం'' పురస్కరించుకుని కళలు సృష్టించే వారు కొందరు లేకపోలేదు కాని వారు అసాధారణ వ్యక్తులూ, ''రుషుల'' వంటి వారూ ఐతే తప్ప వారి కళలకు చెప్పుకోదగిన విలువ ఉండదు, ఈ తరగతికి చెందిన కళాకారులలో తక్కువ రకం వారు తయారుచేసే కళలలో కనీసం ఒక క్రమ పరిణామమైనా ఉండదు, విరుద్ధ ధోరణులు కూడా కనిపిస్తాయి ఒక కళాఖండం పాశ్చాత్య దేశాల నుంచి దిగుమతి అయినట్టుంటే, మరొకటి ప్రాచ్యతత్వజ్ఞాన సమ్మిళితమై ఉంటుంది, ఇంకొకటి సోషలిస్టు ధోరణిలో ఉంటుంది, వేరొకటి కమ్యూనిస్టు వ్యతిరేకతతో నిండి ఉంటుంది ఆ కళాకారుడు రేపు ఏం సృష్టించబోతాడో అతడి ఆప్తులే ఊహించలేరు

ఇటువంటి అరాజక పరిణామాలను అదుపులో ఉంచాలంటే, కళలకు సంబంధించిన ఉద్యమాలు చాలా అవసరం ఈ ఉద్యమాలు కళాకారులకు అత్యవసరమైన ''సాంఘిక'' వాతావరణాన్ని కలిగిస్తాయి కళాకారుడి కృషికి మార్గాలు ఏర్పాటు చేసి కళలకు పుష్టీ, క్రమ పరిణామమూ కలిగిస్తాయి అప్పుడే కళల ప్రభావం సంఘంపైన కూడా బలంగా ఉంటుంది

ఈ విషయం అభ్యుదయ కళాకారులు ఒకప్పుడు స్పష్టంగా రుజువు చేశారు ప్రజా

నాట్యమండలి ప్రదర్శనాలు లక్షలాది జనాన్ని చైతన్యవంతం చేశాయి వాళ్ళ బుర్రకథలనూ, వీధి భాగోతాలనూ, నాటకాలనూ జనం ఎగబడి చూసి ఆనందించారు ఆ ఉద్యమం వెనక పడగానే ఆ కళలు కొడిగట్టిపోయాయి 'ముందడుగు', 'మాభూమి' నాటకాల స్థానాన్ని 'ఉద్యోగ విజయాలు', 'చింతామణీ' ఆక్రమించాయి బుర్రకథల స్థానాన్ని హరికథలు ఆక్రమించాయి వీటిని ఆనందించే వారి మధ్యనైనా తామంతా ఒకే ప్రజ, ఒకే కళానుభూతి పొందుతున్నాం అన్న భావాలు లేవు!

ఈ విషయంలో మనం పాశ్చాత్య దేశాల నుంచి నేర్చుకోదగినది ఆటే లేదు అక్కడి కళాకారులు వ్యక్తివాదాన్ని అవలంబిస్తారు అక్కడ కళల వెనక ఉద్యమాలంటూ ఉండవు, వాటికి బదులుగా కొన్ని ఫాషనులుంటాయి వీటిని ఫాషనులని ఎందుకంటున్నానంటే, ఇవి కూడా ఉద్యమాలలాగే నడిచినప్పటికీ వీటిని నడిపించేది ఏ ఒక సాంఘిక సిద్ధాంతమూ కాదు 'డాడాయిజం', 'సర్రియలిజం' ప్రజలను చేరలేక అంతరించిపోయాయి ఇటువంటి ఫాషనులు పాశ్చాత్య కళారంగాలలో ఎప్పుడూ పుడుతూనే ఉంటాయి, వీటిని కొంతకాలం పోషించే వారు ఎప్పుడూ ఉంటూనే ఉంటారు కొత్త వింతా, శిల్పాల తాలూకు గారడీలూ, ధూర్తత్వమూ ఈ ఫాషనులకు ప్రచారాన్ని ఇస్తాయి క్రమంగా ఈ ఫాషను అంతరించిపోతుంది

జీవితాన్ని సార్థకంగా చిత్రించే స్వేచ్ఛ కళాకారుడికి ఉండి తీరాలి ఈ స్వేచ్ఛకు ఎటువైపు నుంచి అడ్డంకి ఎదురైనా ఆ వైపుగా సంఘ వ్యతిరేక శక్తులున్నాయనుకోవచ్చు ఒకప్పుడు మతం పేరిట కళలను అణగదొక్కారు, నిర్మూలించారు ఈనాడు రాజకీయాల పేరిట కళలను అణగదొక్కటం హెచ్చుగా జరుగుతున్నది కమ్యూనిస్టు రాజకీయవాదులు గురజాడ వారిని అమరజీవి అనంగానే, గురజాడకు "కామ్రేడ్" బిరుదు తగిలించీ, శ్రీశ్రీని మహాకవి అంటే, శ్రీశ్రీని గురించి అవహేళనగా రాసీ, తమ "కళాభిమానాన్ని" వ్యక్తం చేసుకున్న పత్రికలున్నాయి

ఇది ఎంత హేయమైన పద్ధతో కొంచెం ఆలోచిస్తే పరమమూఢుడికి కూడా బోధపడుతుంది దేశంలో అనేక రాజకీయ పార్టీలుంటాయి ప్రతి రెండు రాజకీయ పార్టీల మధ్యా 'వైరం" ఉండనే ఉంటుంది గనక ఏ రాజకీయ పార్టీ ఆమోదించే కళలనూ ఇతర పార్టీలు ఆమోదించరాదు అటువంటి పరిస్థితిలో సంఘానికి కళలంటూ పనికే రావు, అన్ని పార్టీలు ద్వేషించే కళలను మాత్రమే ఎవరూ ద్వేషించరు! అందరూ ఆమోదించే కళలంటూ ఉండడానికి వీలే లేదు!

ఇంత బుద్ధిహీనమైన వైఖరిని కమ్యూనిస్టు విద్వేషులు మాత్రమే అనుసరించారు గనక ఆటే ఇబ్బంది లేకపోయింది ఇతర పార్టీలు కళాకారుల పట్ల అంత శ్రద్ధ చూపనూ లేదు, ఒకవేళ చూపితే ఆ కళల పట్ల కమ్యూనిస్టులు ద్వేషం ప్రకటించనూ లేదు అందుచేత ఉన్మాదం దేశంలో పెచ్చుపెరగకుండా కొద్దిలోనే సమసిపోయింది

కళాకారుడి స్వేచ్ఛకు సాంఘికంగా కూడా కొన్ని ప్రతిబంధకాలున్నాయి ఒకటి ఆర్థికమైనది కళాకారుడు కళాస్రష్టగా బతకగలగాలి కళాకారులను ప్రభుత్వం ఏదో విధంగా పోషించని పరిస్థితుల్లో ప్రజలు పోషించాలి ప్రజలకూ కళాకారుడికీ మధ్య ధనిక వర్గమూ, స్వలాభాపేక్షా, అజ్ఞానమూ, పక్షపాత బుద్ధీ, వర్గ విద్వేషమూ, ఒకొక్కప్పుడు కళాద్వేషమూ

కూడా కనబడని గోడలుగా నిలబడతాయి ప్రజలకు అభిరుచులను కలిగించే శక్తి కళాకారులనుకొన్న వారికి జీతాలిచ్చి నియోగించే పెట్టుబడిదారులకూ, కళా పారిశ్రామికులకూ హెచ్చుగా ఉంటుంది ప్రజలు ఏ రకం సినిమాలు చూడాలన్నది నిర్ణయించగలిగిన వారు సినీ నటులు కారు, రచయిత కాదు, ఆర్టుడైరెక్టర్లు, మ్యూజిక్ డైరెక్టర్లూ కారు - ప్రొడ్యూసర్లు అలాగే ప్రజలు ఏ రకం కథలూ, వ్యాసాలూ చదవాలన్నది నిర్ణయించే వారు పత్రికాధిపతులు

ఇది రాజకీయ వైషమ్యంలాగా కేవలం బుద్ధి జాడ్యజనితం కాదు జీవిత వ్యవస్థలోనే స్వతస్సిద్ధంగా ఉండి కళలయొక్క అభివృద్ధికి పెద్ద అంతరాయంగా ఉన్నది అందుచేత కళాకారుడికి రెండే మార్గాలు "ఈ పరిస్థితులతో పోరాడటానికి తన కళను సాధనంగా వినియోగించటం, లేదా, నిస్వార్థంగా కళాసృష్టి చేస్తూ దాని ప్రచారాన్ని నింపాదిగా సాగనివ్వటం"

రెండో పద్ధతి ఓటమి పద్ధతి అనుకోవద్దు కళాకారుడు తన కళాసృష్టిని జీవనోపాధిగా పెట్టుకోకుండా ఉంటే ఏ పెట్టుబడిదారూ చేయూతనివ్వకుండానే తన కళ ప్రజలకు సంక్రమించేలాగు చేసుకోవచ్చు వెనకటి కాలంలో తిక్కన సోమయాజీ, పోతనా తమ రచనలను పెట్టుబడిదార్ల సహాయంతోనే ప్రచారం చేసుకోలేదు అయినా, వారి రచనలు ప్రచారం కావటమే గాక ఇంకా నిలిచి కూడా ఉన్నాయి

మొదటి పద్ధతి కేవలం కళాకారుడు ఒక్కడే చేయగలది కాదు కళలు ఏనాడూ విప్లవాలు తేలేదు, తేలేవు కాని విప్లవకరమైన సంఘ శక్తులను అవి బలపరచగలవు అందుకు గాను ప్రతి కళాకారుడు కృషిచేయవలసిందే కనక పై చెప్పిన రెండు పద్ధతుల మధ్యా వైరుధ్యం ఏమీ లేదు

*విశాలాంధ్ర, దినపత్రిక, 4-2-1962*

# 6. భారతీయ కల్పనా సాహిత్యం (అఖిల భారత రచయితల మహాసభలో చర్చలు)

ఇటీవల కేరళలో జరిగిన అఖిల భారత రచయితల అయిదవ సమావేశంలో సాహిత్యానికి సంబంధించిన చర్చలు అనేకం జరగాయి కవిత్వమూ, కల్పనా సాహిత్యమూ, నాటకాలూ, సినిమాలూ, చిత్రకళా, సంస్కృతీ, విమర్శ వగైరాలను గురించి వీటిలో కల్పనా సాహిత్యం గురించి జరిగిన చర్చకు నేను పౌరోహిత్యం చెయ్యటం జరిగింది

కల్పనా సాహిత్య విభాగం కింద చేరే కథా, నవలా అనే వాటి మధ్య గల తేడాలను టూకీగా వివరించి, చర్చలో పాల్గొనే వారు కొన్ని అంశాలను ప్రతిపాదించినట్టయితే వాటిపైన చర్చ జరుపుదామని నేను ముందుగా సూచించాను

శ్రీయుతులు జి ఆంజనేయులు, ఆరిగపూడి రమేశచౌదరి, మత్తూరి కృష్ణమూర్తి, గురుముఖ్‌సింగ్ జీత్, మనోజదాస్, రాజేంద్రయాదవు, జె హెచ్ కిస్లర్(అమెరికా), ఆర్ ఎస్

సుదర్శనం, నిత్యానందమహాపాత్రో, శ్రీమతి అనితాషీల్ గంగాధరన్, కె దొరస్వామి, చునిలాల్ మొదియా మొదలైన వారు వేరు వేరు అంశాలు ప్రతిపాదించారు వాటిలో ముఖ్యమైనవి

1 కధానికా, నవలా రచనలలో శిల్పం పాటించబడటం లేదు చాలా మంది కధానికను సాగదీస్తూ పోతే నవల అవుతుందన్నట్టు కనబడతారు

2 దేశంలో కొన్ని మంచి కధలైతే వచ్చాయిగాని ప్రపంచ సాహిత్యంలో నిలబడగల ఉత్తమ భారతీయ నవల ఒక్కటి కూడా వెలువడలేదు

3 భారతీయ రచయితలు ఇంగ్లీషులో రాయరాదనటం తప్పు మన దేశంలో కొద్దిమంది రచయితలు ఇంగ్లీషులో మాత్రమే రాయగలరు వారినాభాషలో రాయవద్దంటే రాయటం మానుకోవలసిందే (భారతీయులు తమ స్వతంత్ర రచనలను దేశ భాషలలోనే చేయాలన్న సూచన వాత్స్యాయనగారి అధ్యక్షోపన్యాసంలో చేయబడింది )

4 తగినంత పబ్లిసిటీ లేకనే మన నవలలు ప్రాముఖ్యం చెందకుండా ఉన్నాయి ఇతర దేశాలలో ప్రచురణకర్తలు మామూలు నవలలకు కూడా వల్లమాలిన పబ్లిసిటీ ఇచ్చి లోకానికంతకూ తెలివిడి చేస్తారు

5 భారతీయ సాహిత్యానికి ఒక విశిష్ట జాతీయ స్వరూపం ఉండటం సాధ్యమే (భారతీయ సాహిత్యం ఒక విశిష్ట జాతీయ రూపాన్ని పెంపొదించుకోవాలన్న సూచన కూడా వాత్స్యాయనగారిదే)

6 మన భారతీయులకు కవిత్వం చెప్పటం చాతనయినట్టుగా కల్పనాసాహిత్యం సృష్టించటం చేతకాదు

7 ధారావాహికలు సాహిత్యాన్ని కంపు చేస్తున్నాయి వీటికి గిరాకీ జాస్తి కొన్ని ధారావాహికలు రచన ఆరంభం కాకముందే ప్రకటించబడుతున్నాయి

8 ''భారతీయత'' అవసరం ఆర్ కె నారాయణ్‌వంటి రచయిత (ఇంగ్లీషు నవలలతో) విజయం సాధించగలిగినదీ తన రచనలలోని ''భారతీయత'' కారణంగానే

9 జీవితం నిరాశాజనకంగా ఉంటుంది రచయిత జీవితాన్ని తన బుద్ధితో కల్పన చెయ్యాలి

10 భారతీయ నవలలు బాగా లేకపోవటానికి కారణం వాటిలో వుండే విషయానికీ, విధానానికీ అతక్కపోవటం నవల బూర్జువా స్వభావం కలిగి ఉండాలి(క్రిప్లర్ సూచన)

ఇలాటి సూచనలు జరిగాక చర్చ సాగింది ఈ చర్చలో అనితాషీల్ మొదలైన వారు చాలా మంది పాల్గొన్నారు అయితే చర్చించబడిన అంశం ఒకే ఒకటి కల్పనా సాహిత్యానికి ఒక జాతీయ స్వరూపం ఉంటుందా? ఉండదా? ఈ ప్రశ్నను క్షుణ్ణంగా చర్చించిన మీదట కల్పనా సాహిత్యానికొక జాతీయ స్వరూపం ఉండటానికి అవకాశం లేదని తేల్చారు

ఇతర అంశాలపై చెప్పుకోదగిన చర్చ ఏమీ జరగలేదు ఎవరి విశ్వాసాలను వారు వ్యక్తం చేసుకున్నారే తప్ప, తమ విశ్వాసాలను సమర్థించుకొనటానికి గాని, తమకు విరుద్ధంగా వుండే విశ్వాసాలను ఖండించటానికి గాని ఎవరూ ముందుకు రాలేదు

జీవితం తాలూకు ఆర్థిక, నైతిక, రాజకీయ సంఘర్షణల ప్రభావం కల్పనాసాహిత్యం మీద వుండటం గురించి ఎవరూ ప్రస్తావించలేదు అందుచేత ఆ సాహిత్యం

పరిణామరహితమైనదన్నట్టుగానే అందరూ మాట్లాడారు కిస్లర్ కూడా బూర్జువా దశ దాకా వచ్చాడు ఆ తరువాత జరిగే పరిణామాన్ని ప్రస్తావించలేదు

ఈ రచయితల మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షుడూ, ఫాక్ట్ (FACT) పరిశ్రమల నిర్వహణకర్తా అయిన శ్రీ ఎం కె కె నాయర్ ఈ చర్చను ఆమూలాగ్రం విని, మధ్యలో తాము రెండు ముక్కలు చెప్పటానికి అనుమతి కోరారు ఆయన చెప్పినది ఇది

ఆయనా, మరి ముగ్గురూ పారిశ్రామిక సంస్థను వ్యవస్థాపించటానికి మూడేళ్ళపాటు అహోరాత్రాలు కృషిచేశారు చివరకు ఉత్పత్తి ప్రారంభమైన క్షణంలో వారు పొందిన ఆనందం వర్ణనాతీతం ఆనందబాష్పాలు రాలుస్తూ ఒకరినొకరు కావిలించుకున్నారట

''ఇలాటి సన్నివేశాలు కథలలో ఎందుకు చిత్రించరూ?'' అని అడిగారాయన ఆయన తన వర్గంయొక్క ఆనందాన్ని చిత్రించే సాహిత్యం కావాలనుకోటం స్వాభావికమే కాని అది ఆ పరిశ్రమలో పని చేసిన కార్మికుల దృష్టిలో ఎంతనీరసమైన సాహిత్యం అనిపించుకుంటుందో ఆయన ఆలోచించలేదు నిజానికి ఆయన సూచన గురించి మిగిలిన వారు కూడా ఎలాటి వ్యాఖ్యానమూ చేయలేదు కారణం, వారికి వర్గ దృక్పథం పట్టకపోవటమే అయి ఉంటుంది

*- విశాలాంధ్ర, దినపత్రిక, 14-1-1966*

# 7. సాహిత్య సమారాధన

పనస కాయలు - అనాసపళ్ళు - నేంద్రం అరటిపళ్ళు - కర్రపెండలం అక్షరాస్యతకూ, అంతులేని పత్రికలకూ, కథాకళీ నృత్యానికీ, అందమైన ఆచారాలకూ పుట్టినిల్లు

కాంగ్రెసుకు పచ్చివెలక్కాయ - కమ్యూనిస్టులకు తొలి సింహాసనం - కమ్యూనిస్టులకు నేషనల్ పార్కు

కేరళ

అఖిల భారత రచయితల అయిదో సమావేశం డిసెంబరు ఆఖరువారంలో కేరళలో జరిగింది చాలా బాగా - ఎంతో గొప్పగా - అసదృశంగా - చరిత్ర ప్రసిద్ధంగా జరిగింది అఖిల భారత రచయితలకు ఆతిధ్యం ఇచ్చిన వారు తమకు గల ఆర్థిక స్తోమతనూ, అధికారపు పలుకుబడినీ అద్భుతంగా నిరూపించుకున్నారు అంతేకాదు సాహిత్య ప్రపంచంలో ప్రసిద్ధులనదగిన వారు కొంతమంది అయినా నిర్వాహకుల వెనక గట్టిగా ఉన్నారన్న సంగతి కూడా రుజువయింది

సభలు ఉద్యోగమండలం క్లబ్బు ఆవరణలో ఏర్పాటయాయి ఉద్యోగ మండలం ఎర్నాకులానికి ఎనిమిది మైళ్ళ దూరాన కొత్తగా వెలసిన పారిశ్రామిక నగరం ఇక్కడ ఎరువులూ, రసాయనిక పదార్థాలూ ఉత్పత్తి అవుతాయి ఇక్కడ ఉండేది పబ్లిక్ సెక్టార్ పరిశ్రమ దీని నిర్వహణకర్త శ్రీ ఎం కె కె నాయర్ కిరీటం మినహాగా రాజు రచయితల మహాసభల భారాన్ని మోసిన ఆహ్వాన సంఘానికి అధ్యక్షుడు

రచయితల సమావేశానికి 250 పైగా వచ్చారు - రచయితలూ, విమర్శకులూ, కళాకారులూనూ కొందరు సకుటుంబంగా కూడా వచ్చారు యాత్రికులుగా

అందరికీ బసా, భోజనాలూ, వాహన సౌకర్యాలూ రాజోపచారంగా అమరాయి ఈ ఏర్పాట్లను రాష్ట్ర ప్రభుత్వమే చేసినా ఇంత బాగా ఉండవేమో వాలంటీర్లు మరమనుషుల్లాగా పని చేశారు వీరిలో చాలా మంది స్థానిక పరిశ్రమలో ఉద్యోగులే

ఆహుతులకు కేరళ దర్శనం ఏర్పాటు చేశారు ఇందుకుగాను ఉపయోగించిన వాహనాలు కూడా ఇక్కడి పరిశ్రమకు సంబంధించినవే

అఖిల భారత రచయితల అయిదవ సమావేశానికి అధ్యక్షత వహించిన వారు సచ్చిదానంద హీరానంద వాత్స్యాయన "అజ్ఞేయ" అనే పేరుతో కవిగా ప్రసిద్ధుడు ఈయన తన అధ్యక్షోపన్యాసంలో "భారతీయత" అనే నినాదం లేవదీశారు ఈ నినాదం గురువాక్యమై వివిధ చర్చలలో ప్రతిధ్వనించింది ఆధునికత్వమూ, సంప్రదాయమూ అనే వాటిని గురించి కూడా చర్చలు జరిగాయి

భారతీయ కళాకారులు భారతీయత లేని కళలు సృష్టించడానికి ప్రత్యేక కృషి చేయవలసి ఉంటుందేమో గాని భారతీయత కోసం ప్రత్యేక కృషి చేయనవసరం లేదని ఎవరైనా అనుకుంటారు అలాటప్పుడు "భారతీయత" అన్న నినాదం దేనికో అర్థం కావటం లేదు

అట్లాగే సంప్రదాయం కూడా కాలానుగుణమైన మార్పులు చెందుతూ ఎప్పటికప్పుడు ఆధునికత్వాన్ని సాధించుకుంటూ ఉంటుంది కాలప్రభావం వల్ల సంప్రదాయంలో విప్లవ పరిణామాలు కలగటం కూడా కద్దు అంతమాత్రాన సంప్రదాయానికీ, ఆధునికత్వానికీ మధ్య సహజ వైరుధ్యం ఉందనుకోనవసరం లేదు అయినప్పటికీ ఈ విషయాలను గురించి చర్చలు జరిగాయి

పది పదిహేనేళ్ళ క్రితం కూడా సాహిత్య చర్చలలో "వాస్తవికత" "కళాప్రయోజనం" "అభ్యుదయ దృక్పథం" "విషయమూ - విధానమూ" "స్వరూపమూ - స్వభావమూ" మొదలైన విషయాలకు ప్రాముఖ్యం ఉండేది ఇప్పుడవన్నీ పాతబడిపోయాయని వాత్స్యాయన్‌జీ అన్నారు నిజమే కావాలి, చర్చలలో ఎక్కడా వాటి ప్రసక్తి లేదు

రేపు సమావేశం ముగుస్తుందనగా ఒక సువార్త వినవచ్చింది భారతీయ జ్ఞానపీఠం వాళ్ళు శ్రీ జి శంకరకురూప్‌కు లక్ష రూపాయల బహూకృతి ఇస్తున్నామని ప్రకటించారు అఖిల భారత రచయితలు కేరళలో సమావేశమై వున్న తరుణంలో ఒక కేరళ మహాకవికి దైవికంగా ఈ ఘన సన్మానం జరిగింది దైవికమే అయి వుండాలి మరి

శంకర్‌కురూప్‌గారికి ఈ బహూకృతి వస్తున్నందుకు సంతోషించని వారు నాకు కనబడలేదు ఏ కారణంచేతనో ఆయన సభలకు రాలేదు ఆయనలాగే శ్రీ తగడి శివశంకరం పిళ్ళెలాటి ప్రసిద్ధ కేరళ రచయితలు అరడజనుమంది సమావేశాలకు రాలేదు ఇతర ప్రాంతాల నుంచి రాని ప్రసిద్ధులు - శ్రీశ్రీ లాంటి వాళ్ళు - ఇంకా కొందరున్నారు

ఆహుతులకు అంపకాలతో పాటు శంకరకురూప్ గారి అభినందన సభ కూడా జరిగింది ఆయన గౌరవార్థం అఖిల భారత రచయితలూ, కళాకారులూ లేచి నిలబడి హర్షధ్వానాలు చేశారు నాలుగు రోజులపాటు జరిగిన ప్రసంగాలన్నీ కలిపినా ఆ హర్షధ్వానాలకు సరికావనుకున్నాను

రెండు లక్షలు ఖర్చు చేసి అఖిల భారత రచయితలకు రాజోపచారాలు జరిపిన వారే ప్రభుత్వ పరిశ్రమల నుంచి అకారణంగా - ఉత్పత్తి హెచ్చుగా సాగే సమయంలోనే - కొంతమంది మనుషులను బర్తరఫ్ చేశారట కార్మికులు ఒకనాడు నినాదాలు చేసి కరపత్రాలు పంచిపెట్టారు ఆ కరపత్రంలో ఉండే విషయాలు నమ్మవద్దని నిర్వాహకులు మాట వరసగా చెప్పారేగాని, అందులో వున్న అబద్ధాలేమిటో వివరించారు కారు

మొత్తం మీద ఒక చిత్రం జరిగిందన్నది స్పష్టం - కొండ మీది కోతిని తీసుకురాగలిగిన వాళ్ళు అఖిల భారత రచయితలను సంతోషపెట్టటానికి మహత్తరమైన కృషి చేశారు వారి ద్వారా దెబ్బతిన్న కార్మికులు ''రచయితలారా, మా పక్షాన మీ గొంతులు విప్పండి మాకు జరిగిన అన్యాయాన్ని ఖండించండి'' అని ఆ రచయితలనే ప్రాధేయపడ్డారు

అఖిల భారత రచయితలు ఇంతటి గౌరవానికి అర్హులా అన్నదే నా సందేహం

*- జనశక్తి, ద్వైవారపత్రిక, 22-1-1966*

# 8. సాహిత్యంలో విప్లవోద్యమం

దేశం స్వతంత్రమైనాక సాహిత్యమైతే పెరిగింది గాని, తెలుగులో సాహిత్యోద్యమం సన్నగిల్లి, క్రమంగా నశించింది కవులూ, కథకులూ, నవలాకారులూ సొంతదారులు వెతుక్కున్నారు అయితే వారిలో అభ్యుదయ సాహిత్యోద్యమం ప్రభావం పడిన వారు ''సరదా''కి రాసేవారికన్నా మైలేన సాహిత్యం సృష్టించారు వారు అభ్యుదయ రచయితల సంఘంలో సభ్యులై ఉండినా ఉండకపోయినా అభ్యుదయ రచయితలే మార్క్సిజం తెలుసుకున్నా, తెలుసుకోకపోయినా మార్క్సిస్టు దృక్పథంకలవారే ఈ రచయితలలో కొందరు యువకులు అభ్యుదయ రచయితల సంఘం అవతరించే నాటికి పుట్టనుకూడా లేదు అటువంటి రచయితలను కొంతమందిని నేను స్వయంగా ఎరుగుదును

అభ్యుదయ రచయితల కింద టెక్నికల్‌గా చలామణీ అయే వారందరూ మార్క్సిస్టులై ఉండాలని చాలా కాలం క్రితం స్థూలంగా అనుకున్నాం అవసరం లేదన్నమాట ఈనాడు వినిపిస్తుంది కమ్యూనిస్టులమని చెప్పుకుంటున్న వారు కూడా ఈ మాట అంటున్నారు దానికి వారు చెప్పే కారణం ఏమిటంటే, అనాదిగా అభ్యుదయ రచనలు ఉంటూనే ఉన్నాయని నిజమే, వేమన తన కాలపు జీవితాన్ని విమర్శిస్తూ పద్యాలు చెప్పటానికి మార్క్సిస్టు కావలసిన అవసరం లేకపోయింది కాని ఈనాడు అభ్యుదయ రచనలు చేసేవాడు మార్క్సిస్టు, లేక మార్క్సిస్టు దృక్పథం కలవాడు, కావటం తప్పనిసరికదా? 'మార్క్సిస్టు కానక్కరలేదు' అన్న మాటలో 'మార్క్సిస్టు వ్యతిరేకి అయినా యిబ్బంది లేదు' అన్న భావం ఇమిడి ఉన్నదా, లేదా? ''మార్క్సిస్టు కానక్కరలేదు మార్క్సిస్టు వ్యతిరేకి కాకపోతే చాలు'' అనే పక్షంలో మార్క్సిస్టూ కాక, మార్క్సిస్టు వ్యతిరేకి కానివాడు ఏమిటవుతాడు? ఊహకు అందటం లేదు

ఇందులో అనేక అర్థాలకు తావు కన్పిస్తుంది ''మార్క్సిస్టు కాకుండానే అభ్యుదయ రచయిత కావచ్చు'' అన్న వారిలో కొందరి ఉద్దేశం, మార్క్సిస్టు వ్యతిరేకులు కూ' డా అభ్యుదయ రచనలు చేయవచ్చునని కావచ్చు మరికొందరి ఉద్దేశంలో మార్క్సిస్టులంటే కమ్యూనిస్టులని

కావచ్చు - కమ్యూనిస్టు కానివాడు కూడా అభ్యుదయ రచయిత కావచ్చునని కావచ్చు ఈ రెండో అభిప్రాయంతో ఎవరికీ పేచీ వుండనవసరం లేదు

అయితే కొందరు అభ్యుదయ రచనలకూ, అభ్యుదయ రచయితలకూ తేడా చూడటం లేదు ''శ్రీశ్రీ 'మహాప్రస్థానం' రాసేనాటికి మార్క్సిస్టు కాడు'' అంటున్నారు ఆనాడు శ్రీశ్రీ తాను అభ్యుదయ రచయితననీ చెప్పుకోలేదు అభ్యుదయ రచయితలమని గాని, మార్క్సిస్టులమని గాని చెప్పుకోని వారు కూడా జీవితాన్ని సరిగా అవగాహన చేసుకున్న మేరకు అభ్యుదయ రచన అనిపించుకోనిది చేయవచ్చు అభ్యుదయ రచయితలు తప్ప అభ్యుదయ రచనలు చేయలేరనీ, అభ్యుదయ సాహిత్య సృష్టి వారి గుత్తాధికారమనీ ఎవరూ, ఏనాడూ అని వుండలేదు అభ్యుదయ రచయితను అని చెప్పుకుంటూ అభ్యుదయ సాహిత్యోద్యమంలో ప్రవేశించిననాడు కనీసం అభ్యుదయ వ్యతిరేక రచనలు చెయ్యకుండా ఉండగలందులకైనా మార్క్సిజం తెలుసుకుని ఉండటం అవసరమంటే అందులో ఆక్షేపించటానికేమున్నదో నాకు తెలియటం లేదు

మార్క్సిజముకూ, మంచి సాహిత్యానికీ ఏమీ సంబంధం లేదని వాదిస్తూ ''మంజువాణి'' పత్రిక శ్రీశ్రీ కుటుంబరావుల ఘనత వారి సాహిత్యంలో ఉన్నదిగాని వారి మార్క్సిస్టు దృక్పథంలో లేదని రాసింది సాహిత్యానికి టెక్నిక్ ప్రధానమనే వారందరిదీ ఇదే వాదం శ్రీశ్రీ రాసినా, కుటుంబరావు రాసినా మార్క్సిస్టు అవగాహనతో కూడుకున్న రచనలే అందరికీ నచ్చాయి అవే ఇతర భాషల్లోకి తర్జుమా అయాయి సరదాకి రాసినవి మర్నాడే గాలికి కొట్టుకుపోయాయి

అభ్యుదయ సాహిత్యోద్యమం సాధించిన సత్ఫలితాలు ఈనాటికీ కనిపిస్తూనే ఉన్నాయి వీరేశలింగం, గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి త్రయానికి ఈనాడు చాలా గణన వచ్చింది! అందుకుగాను అభ్యుదయ సాహిత్యోద్యమం చేసిన కృషి అమూల్యమైంది ఆనాడు ఉద్యమం చల్లిన భావబీజాలు ఇప్పటికింకా మొలకెత్తుతూనే ఉన్నాయి అభ్యుదయ సాహిత్యోద్యమం ఆధునిక తెలుగు సాహిత్యంలో ఒక big leap forward సాధించి, అంతరించిపోయింది అటుతరువాత సాహిత్యోద్యమం అంటూ లేదు

ఈ పరిస్థితిలో ఆకస్మికంగా హైదరాబాద్‌లో అభ్యుదయ సాహిత్య సదస్సు ఏర్పాటయింది ఏర్పాటు చేసిన వారూ, కార్యభారాన్ని మోస్తున్న వారూ, ఆధ్వర్యం వహిస్తున్న వారూ అభ్యుదయ సాహిత్యోద్యమంతో హిస్టారికల్‌గా గాని, స్పిరిచువల్‌గా గాని ఎలాటి సంబంధమూ కలవారుగా కనిపించలేదు ''విశాలాంధ్ర'' గ్రూపు మాజీ అభ్యుదయ రచయితల సంఘ సభ్యులు అందులో పాల్గొంటున్నారు అయితే వారితోబాటు అభ్యుదయ సాహిత్యోద్యమాన్ని వ్యతిరేకించే వారూ అందులో పాల్గొంటున్నారు ఇలాటి సన్నివేశం 1947లో మద్రాసులో జరిగింది అక్కడ జరిగిన అభ్యుదయ రచయితల మహాసభ ప్లాట్‌ఫారం అభ్యుదయ వ్యతిరేకులకు ఇవ్వబడింది అది చాలా విషాదకరమైన సంఘటన తిరిగి అలాటి విషాదకర సంఘటనకు హైదరాబాదులో ప్రాతిపదిక ఏర్పడింది

ఈ సదస్సుతో తిరిగి సాహిత్యోద్యమం ఆరంభమవుతుందని నేను తలచలేదు అందుచేత నేను అందులో పాల్గొనలేదు ఆ సదస్సుకు హాజరై, ఆ వేదిక మీద నిలబడి కొత్త ఉద్యమం ప్రారంభం కావటానికి తగిన దోహదం చేసే శక్తులు నా దగ్గిర ఉన్నాయని నేననుకోలేదు ఐతే

నేను సదస్సును బహిష్కరించుతున్నట్టు ఎవరికీ చెప్పలేదు అయినా, ఇంకా సదస్సు చాలా రోజులుందనగానే కొందరు ఆహూతులకు, నేను సదస్సుకు ఎందుకు వెళ్లటం లేదో వివరించవలసిన అవసరం ఏర్పడింది నేను వెళ్లటం లేదని మానుకున్న వాళ్లు ఒకరిద్దరికి మించరనుకుంటాను దిగంబరకవులూ, వరవరరావూ మరికొందరూ తాము సదస్సును బహిష్కరిస్తున్నట్టు పత్రికలో ప్రకటన కూడా చేశారు శ్రీశ్రీ, రమణారెడ్డిగార్లు, నేను వెళ్లలేకపోవటానికి కారణాలు తెలిసి కూడా హైదరాబాదు వెళ్లారు వాళ్లు సదస్సును బహిష్కరించే ప్రేరణ దిగంబరకవుల నుంచి వచ్చినట్టు కనబడుతుంది

హైదరాబాదు ''అభ్యుదయ సాహిత్య సదస్సు'' ప్రత్యక్షంగా సాహిత్యోద్యమాన్ని ప్రారంభించలేకపోయినా పరోక్షంగా ప్రారంభించి ఉండటం చిత్రం విప్లవ రచయితల సంఘం ఏర్పడింది

''విరసం'' రాత్రికి రాత్రే ఆవిర్భవించినట్టు పత్రికలు రాశాయి కాని ఇది నిజం కాదు దీనికి ముందు చాలా ఆలోచనా, సంప్రతింపూ ఉన్నాయి విశాఖలో జరిగిన శ్రీశ్రీ సన్మానంతో ఈ సంప్రతింపులు ఆరంభమయాయి ఆ సన్మానంలో వివిధ రచయితల పరిణామస్థాయిలే గాక, తెలుగు యువకులలో సాహిత్యానికున్న రెస్పాన్స్ కూడా చాలా స్పష్టంగానే తెలియవచ్చింది ఈ యువతరం ముందుకువచ్చి ''సరసశృంగార'' కవిత్వం చదవటానికి ఎంతమాత్రమూ లేదు శ్రీశ్రీ సన్మానానికి వచ్చిన కవులలో దిగంబర కవులు(జ్వాలాముఖి, నిఖలేశ్వర్) అవలీలగా ప్రాముఖ్యం సంపాదించుకున్నారు

అసలు సంగతేమిటంటే, 'విరసం' పుట్టకపూర్వమే విప్లవ-తిరుగుబాటు కవిత్వం పుట్టింది ప్రతిఘటనను ఎదుర్కొన్నది ప్రచారం అయింది దిగంబర కవిత్వమవునా కాదా, వాళ్లు వాడే అశ్లీలాలు గర్హ్యమైనవి కావా - ఇలాటి సమస్యలు చాలా బయలుదేరాయి కాని అందులో కాల ప్రభావమూ, ఒక విధమైన సామూహిక లక్షణమూ ఉండటం చేతనే దిగంబర కవిత్వానికి ప్రచారం ఏర్పడిందన్న సంగతి చాలా మంది గుర్తించలేదు

దిగంబర కవులు ఆధునిక కవిత్వంలో ఒక కొత్తదారి చూపారు ఈ దారిలోనే వచ్చారు 'తిరుగబడు' కవులు వీరూ, వీరి కవిత్వాన్నీ అభిమానించే యువతరం వాళ్లూ విప్లవ సాహిత్యోద్యమం రావాలని కాంక్షించటం స్వాభావికం వీరు శ్రీశ్రీని తమకేసి లాక్కోవటం ఎంతమాత్రమూ అస్వాభావికం కాదు ప్రపంచాగ్నికి తానుసైతం సమిధనొక్కటి ఆహుతిచ్చిన శ్రీశ్రీ ఈ యుగానికి ఆదివిప్లవకవీ, తిరుగుబాటు కవీనూ అందుచేతనే విప్లవ-తిరుగుబాటు కవులు అతన్ని వదులుకోలేదు, అతను వాళ్లవెంట నడవకుండా ఉండలేదు

నేను ఇందులోకి ఎలా వచ్చానో చెప్పటం అవసరం నేను 'విప్లవ' కథలు రాసిన వాణ్ణి కాను దిగంబర కవులను సీరియస్‌గా పరిగణించిన వాణ్ణీ కాను నేను దిగంబర కవిత్వం చదివినంత మేరలో వాళ్లు దేశ పరిస్థితులను ద్వేషించటమూ, తమ ద్వేషాన్ని సాధ్యమైనంత మొరటుగా, ప్రోవొకెటివ్‌గా వ్యక్తం చెయ్యటమూ మటుకే కనబడింది దిగంబర కవిత్వాన్ని సీరియస్‌గా తీసుకున్న వాళ్లు కొందరు ఆ కవిత్వం గురించి నా అభిప్రాయం అడిగితే, వాంతి చేసుకున్న వాణ్ణి చూసి యితరులు వాంతి చేసుకోరు వాళ్లు ద్వేషించేదంతా నేనూ ద్వేషించేదే కాని దిగంబర కవులు ఈ ద్వేషాన్ని ప్రజలలో పుట్టించటం అవసరం అని చెప్పాను

కాని దిగంబర కవుల మూడో సంపుటిలో కొన్ని రచనలు చెరబండ రాజువి చూశాక దిగంబర కవిత్వం మీద గట్టి అభిప్రాయం ఏర్పడింది ఇది నిజమైన విప్లవ - తిరుగుబాటు కవిత్వం ఇది పాతకవిత్వాలను ఔట్ ఆఫ్‌డేట్ చేస్తున్నది అంతకన్న ముఖ్యం - నాకు సంబంధించినంత వరకు ఏమిటంటే, ఈ కవిత్వం ప్రజలకు ఈనాడు అవసరం

అయిదారేళ్ల క్రితమే నాకు నా రచనల వల్ల ప్రయోజనం ఉంటుందన్న విశ్వాసం పోయింది రాయటం మానేశాను కాని కొన్ని పత్రికలు నాచేత బలాత్కారంగా రాయించాయి నా రచనలో నాకు విశ్వాసం లేకుండా చేసినది దేశ పరిస్థితి పాలక వర్గం తన లక్ష్యం ఏదని చెప్పినా, అది ధనిక వర్గాల పక్షానే పరిపాలన సాగిస్తున్నది ప్రభుత్వ తుపాకులు ధనికులకు అంగరక్షలు పేదల స్థితి స్వాతంత్ర్యానంతరం మరింత అధ్వాన్నమయింది కొద్దిమంది కోటీశ్వరులకు మాత్రమే నిజమైన స్వాతంత్ర్యం వచ్చింది కొత్త సామ్రాజ్యవాదం దేశంలో బాగా వేళ్లుతన్నుకున్నది మతమౌఢ్యాన్ని ప్రభుత్వమే పాలుపోసి పెంచుతున్నది డెమోక్రసీ అని రాజకీయవాదులు రొమ్ములుబాదుకుని ఏం లాభం? ప్రజలు ఎన్నుకున్నవాడు తన పార్టీ మార్చడని గ్యారంటీ లేదు ప్రజలు ఓటు వేస్తున్నది పార్టీకా? వ్యక్తికా? ఎన్నుకోబడ్డవాడు పార్టీ మార్చితే వాడి ఎలక్షను ఎందుకు రద్దు కాదు? ఇదేం డెమోక్రసీ? ప్రజలు ఓటు చేసేది వ్యక్తికే అయితే పార్టీ టిక్కెట్లు ఎందుకు?

ఇంత పెద్ద దేశాన్ని పరిపాలించే పద్ధతి ఫార్సు కన్నా హీనంగా తయారయింది ఈ ఫార్సులో పాల్గొనే రాజకీయ పార్టీలన్నీ బఫూన్ పాత్రలు వహిస్తున్నట్లు నాకు అనిపించింది ప్రజలు ఈ పరిస్థితి మీద తిరగబడుతారు - కాదు తిరగబడాలి

తిరుగుబాటు నక్సల్బరీలో ప్రారంభమయింది ఇతర ప్రాంతాలకు పాకుతున్నది నక్సల్బరీ తిరుగుబాటు జరిగినప్పుడు దాన్ని గురించి యెవరో నా అభిప్రాయం అడిగితే, ఒకటి కాదు దేశంలో నూరు నక్సల్బరీలు రాబోతాయి అని జవాబు రాశాను, నేను అట్టే పొరబడలేదు

ఈ తిరుగుబాటు భూస్వాములమీదా, పరమకిరాతకులైన వారి దారుణాల మీదా కాని ఈ భూస్వాములను పాలక వర్గం అదుపులో ఉంచదు ఎందుకంటే, పవిత్రమైన ఈ గాంధీగారి పార్టీ వారికి ఈ హంతక కిరాతకుల అండ అవసరం గిరిజనులకూ, ఆదిమజాతులకూ జరిగే అన్యాయాలను గురించి పార్లమెంటులో మొసలికన్నీళ్లు కార్చటమూ వారిని వధ చెయ్యటానికి తుపాకులవాళ్లను పంపటమూనూ!

ఇప్పుడు దేశంలో సాగినదాన్ని నేను విప్లవంగా భావించటం లేదు అది తిరుగుబాటే కాని ఈ తిరుగుబాటును ప్రజాబాహుళ్యం అర్థం చేసుకొని బలపరిచేనాటికి విప్లవం వచ్చి తీరుతుంది విప్లవం గురించి అందరూ మాట్లాడుతున్నారు ఇందిరాగాంధీగారు విప్లవానికి తన నిర్వచనం యిటీవల ఇచ్చారు కాంగ్రెసు పార్టీ వారి సోషలిజం నిర్వచనంలాగే ఉన్నది ఈ విప్లవ నిర్వచనం

విప్లవం రాకుండానే దేశపరిస్థితి చక్కబడుతుందని అమాయకులు నమ్మవచ్చు మోసగాళ్లు నమ్ముతున్నట్టు నటించవచ్చు కాని పాలక వర్గమూ, అది సంరక్షిస్తున్న ధనిక వర్గమూ విప్లవం వస్తుందని నమ్మి, దాన్ని అణచటానికీ, మొగ్గలోనే తుంచెయ్యటానికి చేయదగినదంతా చేస్తున్నది రాబోయే విప్లవానికి యెదురుగా ఇప్పటినుంచే బారుచేసి ఉంటే, సాయుధ విప్లవం కాక

ఇంకేమి వస్తుంది? దిగంబరకవులు సాయుధ విప్లవం అన్నారని ఉలిక్కిపడటం దేనికి? విప్లవం రాకుండా అడ్డుకునే వాళ్లు మంత్రించిన విభూతి ప్రయోగిస్తున్నారా? తిరుగుబాటును నడిపించే నాయకులు ఒక్కొక్కడూ చచ్చిపోతున్నప్పుడల్లా బూర్జువా పత్రికలు పండుగ చేసుకోవటం లేదా?

ఇంకొక్క విషయం ప్రస్తావించి యీ వ్యాసం ముగిస్తాను విప్లవ రచయితల సంఘం ఒక రాజకీయపక్షాన్ని అనుసరించి వెళ్లటానికి నాకు అభ్యంతరం ఉన్నది రాజకీయ పార్టీలు తిరిగే మెలికలన్నీ సాహిత్యం తిరగటం సాధ్యం కాదు వాళ్ల స్ట్రాటజీలూ టాక్టిక్సూ వాళ్లకే ఉండనివ్వండి సాహిత్యం ప్రజలకూ, ప్రజాజీవితానికీ సంబంధించినది 'విప్లవ రచయితల సంఘం' అన్న పేరులో 'విప్లవం' అన్న మాట భవిష్యత్తును చూస్తున్నది అభ్యుదయం 'విప్లవం' ద్వారానే గాని రాదని గుర్తిస్తున్నది కాంగ్రెస్‌లోని ''అభ్యుదయ'' వాదులలో ఇంకా విశ్వాసాలున్న వారు ఈ కొత్త సంఘాన్ని ఆమోదించరు విప్లవం అంటే విద్వేషమూ, భయమూ ఉండి, పోలీసు అత్యాచారాలంటే భయం లేని వాళ్లూ, పోలీసులు చేసే హత్యలను అహింసగా భావించే వాళ్లూ సహజంగా ఈ కొత్త సంఘాన్ని దుమ్మెత్తిపోస్తారు అవి విప్లవ రచయితల సంఘానికి ఆశీర్వచనాలు

*- సృజన మాసపత్రిక, ఆగస్టు 1970*
*పునర్ముద్రణ సాహిత్యంలో విప్లవోద్యమం,*
*సృజన ప్రచురణ, అక్టోబరు 1971*

# 9. సాహిత్య రంగంలో నూతన పరిస్థితి

తెలుగుదేశంలో సాహిత్య సంస్థలకు ఏనాడూ కొదువ లేదు కాని సాహిత్యోద్యమాలు కొద్దిగానే వచ్చాయి గిడుగు రామమూర్తిగారి వ్యావహారిక భాషావాదం దేశవ్యాప్తమైన తరువాత నవ్య సాహిత్యోద్యమం బయలుదేరింది అది కృశించిపోవటం నేను కళ్లారా చూశాను నవ్య సాహిత్య సభలలో పాల్గొంటూ వచ్చిన వారిని చూస్తుంటే, ఈ ఉద్యమానికి లక్ష్యం లేకుండా పోతున్నదా అనిపించింది బందరులో బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన సభలో నేను తెలికిచర్ల వెంకటరత్నం మాస్టరుగారిని అడిగాను ''కనీసం వ్యావహారిక భాషను ఆమోదించని వారికి నవ్య సాహిత్య పరిషత్తులో స్థానం లేదని నియమం పెట్టకూడదా? అది జరగలేదు

గమ్యం స్పష్టంగా లేని కారణంచేత నవ్యసాహిత్యోద్యమం సన్నగిల్లిపోయింది అది క్షీణదశలో ఉండగా అభ్యుదయ సాహిత్యోద్యమం వచ్చింది అప్పట్లో దాన్ని వ్యతిరేకించిన వారి వైఖరులనూ, మనస్తత్వాలనూ బట్టి అది ఎంత అవసరమైన ఉద్యమమో స్పష్టమయింది నవ్య సాహిత్యోద్యమం చెయ్యలేకపోయిన అనేక పనులను అభ్యుదయ ఉద్యమం చేసింది గురజాడ, గిడుగు, కందుకూరిగార్లు సాహిత్యానికీ, సమాజానికీ చేసిన మహత్తర సేవను ఆంధ్రులు మళ్లీ స్మరణకు తెచ్చుకున్నారు అభ్యుదయోద్యమం పట్ల ద్వేషం గల శుంఠలు ''కామ్రేడ్ కందుకూరి'' ''కామ్రేడ్ గురజాడ'' అన్న బిరుదులు కూడా ప్రసాదించారు

(అలాటి శుంఠలే ఈనాడు దిగంబర కవులు వగైరాలను ''నక్సలైట్స్'' అంటున్నారు) చిత్రమేమంటే, సాహిత్యానికి రాజకీయపు రంగు పూసేవాళ్ళే సాహిత్యం చేత రాజకీయాలకు ఊడిగం చేయించుకునేటందుకు ముందుగా తయారవుతారు రాజకీయాలకూ, సాహిత్యానికీ మధ్య గోడలుండాలని నేను ఎన్నడూ అనుకోలేదు ఆధునిక జీవితంలో ప్రతి ఒక్కరికీ రాజకీయ భావాలు కలిగి ఉండే హక్కు ఉన్నది రచయితలకు ఆ హక్కుతో బాటు సామర్థ్యంకూడా ఉన్నది సాహిత్యం స్వచ్ఛందంగా ఒక రాజకీయ ధోరణిని బలపరిస్తే అది రాజకీయ ధోరణికి ఒక కాంప్లిమెంట్ అన్నమాట కేవలమూ ఒక రాజకీయ ధోరణిని బలపరచటానికే సాహిత్యం సృష్టించేవాళ్లు రాజకీయాలకు అమ్ముడు పోయినవాళ్ళే వాళ్ళు సృష్టించేది చెత్త అది నిలవదు అటువంటి సాహిత్యం ఏనాడూ నిలవలేదు

అభ్యుదయ రచయితలో కమ్యూనిస్టు పార్టీకి అమ్ముడుపోయారని ప్రచారం చేశారు కాంగ్రెస్ పార్టీవాళ్ళకు అమ్మడుపోతే ఎంతో లాభమూ, కమ్యూనిస్టు పార్టీకి అమ్ముడుపోవటంలో లాభం లేకపోగా అపారమైన నష్టమూ ఉండినకాలంలో ఈ మాట పుట్టించారు మహామేధావులు!

అభ్యుదయ రచయితల సంఘమూ, ప్రజా నాట్య మండలీ అద్భుతమైన కృషిచేశాయి అంతులేని చైతన్యం ప్రజలలో కలిగించాయి కాని దాని ప్రణాళిక స్వాతంత్ర్యానికి పూర్వం రూపొందించబడినది అది రాజకీయ రంగంలోకూడా సులువుగానే అవులు జరుగుతుందనిపించింది ఆ రోజుల్లో చిన్న పిల్లలను చూసి, ''వీళ్ళు సోషలిస్టు సమాజంలో జీవిస్తారు, అదృష్టవంతులు!'' అనుకునేవాళ్లం (వాళ్ళలో కొందరు ఈనాడు నక్సలైట్ ఉద్యమంలో ఉన్నారు!)

అభ్యుదయ రచయితల సంఘం క్షీణించసాగింది 1949 తరువాత మన స్వాతంత్ర ప్రభుత్వం నీడలోనే కమ్యూనిస్టులు నిజాం రాష్ట్రంలో సాయుధ పోరాటం సాగించవలసి వచ్చిందంటే, ఆనాడే అభ్యుదయ రచయితల సంఘ ప్రణాళికకు కాలదోషం పట్టింది ''అభ్యుదయ'' పత్రికను పునఃప్రారంభించాం కాని ఫలితం లేకపోయింది

ఇటీవల చాలా ఏళ్లుగా అభ్యుదయ రచయితల సంఘం నిర్జీవంగా ఉండిపోయింది అభ్యుదయ భావాలు సాహిత్యరంగంలో విరివిగా వ్యాప్తి చెందాయన్న తృప్తి ఒకవిధంగా అభ్యుదయ రచయితల సంఘం చెయ్యవలసినపని అయిపోయిందన్న తృప్తి నాబోటివాళ్లకు మిగిలాయి

అటు తరువాత సాహిత్యోద్యమంలో ఏర్పడిన స్తబ్దతను దిగంబరకవులు ధ్వంసం చేసారు వీరి తిరుగుబాటు సర్వతోముఖమైనది ఆరంభదశలో అది కేవలమూ నెగెటివ్‌గా ఉన్నట్టు కనిపించడం చేతనో ఏమో, వారిని చాలా మంది సీరియస్‌గా తీసుకోలేదు దిగంబరకవిత్వంకన్న సి విజయలక్ష్మి కవితలో హెచ్చు తిరుగుబాటు కనిపించింది

అయితే రాను రాను దిగంబరకవులు ఒక ఉద్యమంగా పరిణమించారు వారు ఇతర కవులను విమర్శించటంద్వారా సాహిత్యరంగంలో సన్నిహితంగా వచ్చారు అభ్యుదయ రచయితలను పట్టి పీడించిన '' ఇన్‌హిబిషన్'' నుంచి వారు విముక్తులయ్యారు కవులుగాకన్న ఉద్యమకారులుగా వారి స్థాయి చూస్తుండగానే పెరిగింది

ఇటువంటి తిరుగుబాటునే వరవరరావు నాయకత్వం కింద ''తిరుగబడు'' కవులు సాధిస్తున్నారు ఇది ఒక నూతన సాహిత్యోద్యమం ఇది అభ్యుదయ రచయితల సంఘ

ప్రణాళికలో ఇమిడేదికాదు ఈ కవులు ''శ్రామికవర్గ సంక్షేమం'' కోసం భజనలు చేసి తృప్తి పడరు శ్రామిక వర్గాన్ని తిరగబడమంటారు, దేశ పరిస్థితి నానాటికీ విప్లవోన్ముఖమౌతున్నది

నక్సల్బరీలో జరిగినదీ శ్రీకాకుళం వగైరా ప్రాంతాలలో జరుగుతున్నది విప్లవం అని నేనింకా అనుకోవటంలేదు అది తిరుగుబాటే అయితే అక్కడ తిరగబడిన ప్రజల సమస్యలు పరిష్కరించలేకపోగా ఆ సమస్యలు సృష్టించినవారికి తుపాకులు లైసెన్సులూ వారికి అండగా సాయుధ పోలీసులను పంపుతున్నది విప్లవాలు ఇలాంటి చర్యలమీదనే ప్రారంభమవుతాయి

రచయితలు ద్రష్టలయేటట్టుంటే ఇవాళ జరుగుతున్నదాన్ని సమర్థించటంకాదు రేపు జరుగబోయే దానికి వెలుగు చూపాలి విప్లవం ఆరంభం కాక ముందే విప్లవ సాహిత్యం ఆరంభం కావాలి అలాంటి కవిత్వం ఆరంభమయింది ఇది ఉద్యమ రూపం కూడా ధరిస్తున్నది ఈ ఉద్యమానికి ప్రాతినిధ్య వహించే సాహిత్య సంస్థ లేదు అభ్యుదయ రచయితల సంఘం శవ ప్రాయంగా పడి ఉండనట్టయితే అది విప్లవ పరిణామాన్ని సాధించి వుండవలసింది

అది జరుగకపోగా ఈ శవప్రాయపు ఉద్యమాన్ని ఉద్ధరించటానికి సెవెన్ స్టార్స్ సిండికేట్, ఆంధ్ర ప్రభుత్వమూ పూనుకున్నారు అభ్యుదయ రచయిత అయినవాడు విధిగా మార్క్సిస్టు భౌతిక వాదాన్నీ, అభ్యుదయ దృక్పధాన్నీ కలిగి వుండాలి హైదరాబాదులోని సినిమా రంగంలోనూ, రాజకీయ రంగం లోనూ అంతమంది మార్క్సిస్టు అభ్యుదయవాదులుంటారని నేను నమ్మలేకపోయాను అందుచేత వారి ఆహ్వానం అందగానే నేను రావటంలేదని రాసేశాను అయినా నాకు ఆ సదస్సుకు సంబంధించిన ''లిటరేచరు'' 4వ తేదీదాకా వస్తూనే ఉన్నది చాలా ఖరీదైన ఫోల్డర్లూ అవీనూ!

హైదరాబాదులో జరిగిన ''అభ్యుదయ సాహిత్య సదస్సు'' ఏ సాహిత్యోద్యమానికీ ఉపకరించేదికాదు ఇప్పుడు కావలసింది విప్లవ సాహిత్యోద్యమం

*ప్రభంజనం, పక్షపత్రిక, 1-8-1970*
*పునర్ముద్రణ, సాహిత్యంలో విప్లవోద్యమం, సృజన ప్రచురణ, అక్టోబరు, 1971*

# 10. విప్లవ మేధావులు

22 జూలై సంచిక 'జయప్రద' సంపాదకీయం సరిగా ఉన్నది అభ్యుదయ రచయితల ఉద్యమం ఆరంభదశలో అందులో చేరిన వాళ్ల మీద అభాండాలు వేశారు అప్పటి వరకూ గొప్ప రచయితలుగా కనిపించిన వారే 'అరసం'లో చేరగానే కొత్తగా ఏమీ రాయకపోయినప్పటికీ, అకస్మాత్తుగా ఎన్నడూ లేని విమర్శలకు గురి అయ్యారు అసలు ఆరోపణ ఏమిటంటే, అభ్యుదయ రచయితలు కమ్యూనిస్టులకు అమ్ముడు పోయారని - రచయితలకు కాంగ్రెస్ వాళ్లకన్న కమ్యూనిస్టులు హెచ్చు ధర ఇచ్చినట్టు!

ఈ 'రాజకీయ' పైత్యం కారణముగా వారు (విమర్శకులు) అదివరకు మంచి ఆహారం అనుకుని మింగినదాన్నే వమనం చేసుకొనసాగారు

ఇప్పుడూ అదే జరుగుతున్నది సాహిత్యంలో విప్లవ కవిత్వం ప్రారంభమయినప్పుడు రాని విమర్శలు 'విరసం' ఏర్పడటంతో ప్రారంభమయాయి శ్రీశ్రీ కవిత్వాన్ని విమర్శించటానికి లేకపోతే శ్రీశ్రీని విమర్శించు! శ్రీశ్రీ మార్క్సిస్టు కాదని అతనిది అభ్యుదయం కాదని నోరివారు బయటపెట్టారు అతను అవకాశవాది అని కూడా ఆరోపించారు దిగంబర కవులది అభ్యుదయ కవిత్వం కాదని మోటూరి వారు బయటపెట్టారు

దిగంబర కవులు మూడో పుస్తకము వచ్చినప్పుడు కమ్యూనిస్టు పత్రికలు సమీక్షించి మెచ్చుకున్నాయి చెరబండరాజు, నిఖిలేశ్వర్ మొదలైన వారి కవితనుంచి కొటేషన్లు ఇచ్చాయి కాని అదంటూ ఇవాళ గత చరిత్ర ఇప్పుడంతా రాజకీయ పాక్షికదృష్టి!

రాజకీయ దృక్పథం ఉండవలసినదే కాని విప్లవ రచయితలు ఒక రాజకీయ పక్షం కొంగు పట్టుకొని వెళ్ళరు అంతవరకూ రూఢిగా చెప్పగలను వాళ్ళను ప్రేరేపించేది ప్రజా జీవితము దాని భవిష్యత్తూనూ

రాజకీయంగాను, ఆర్థికంగానూ సాంఘికంగానూ, విప్లవ పరిణామాలు కలగనిదే, ఈ దేశం ముందడుగు వెయ్యదు అటువంటి పరిణామాన్ని తుపాకులతో నిరోధించే దుష్ట శక్తులు దేశంలో కొల్లలుగా ఉన్నాయి విప్లవ సాహిత్యోద్యమాన్ని ప్రతిఘటించే వాళ్లు తెలుసో తెలియకో వాళ్ల కాపుకాస్తున్నారు అది మహాదారుణం దేశమూ, ప్రజలు విప్లవానికి సిద్ధంగాలేరని ఒక వాదన ఇవాళ కాకపోతే రేపు ఉంటారు ఇంకో పదేళ్ల కుంటారు విప్లవం జరిగాకనే విప్లవ సాహిత్యోద్యమం రావాలని ఎక్కడన్నా ఉందా? ''విప్లవం 'అన్నమాటకే హిస్టీరియా వచ్చే 'మేధావు' లున్న దేశంలో ఏ ఉద్యమమూ లేకుండా విప్లవ పరిణామాలు - ఇందిరాగాంధి గారనుకునేవే అనుకొండి - ఎలా వచ్చేట్టు?

విప్లవ రచయితల మీద కూడా పెద్దభారమే ఉన్నది జీవితంలో సాయుధంగానో, నిరాయుధంగానో, ప్రజలు విప్లవం తీసుకురావలసిన ఆవశ్యకత వారికి అవగాహన అయేటట్టు సాహిత్యం ద్వారా తెలియపర్చటం విప్లవ రచయితల బాధ్యత

సాంఘిక చైతన్యం లేని ప్రజ ఎంత పీడనను అయినా సహించి అణగారిపోవటానికి కూడా అభ్యంతరం చెప్పదు అదే 'శాంతి' అనుకునే వాళ్ళున్నారు అభ్యుదయ వాదులు అలా అనుకోరు అమానుషపరిస్థితుల మీద తిరుగుబాటు ప్రోత్సహిస్తారు అది రక్తదాహం అనుకోవటం మూఢత్వము అన్యాయం హింసకు పూనుకుంటే అన్యాయం, ప్రతి హింసకు పూనుకోవటమే అంతరించి పోవటమో తప్ప మార్గం లేదు

దేశాన్ని ఒక పక్కనుంచి కబళిస్తున్న నయావలస విధానము దానికి అండగా ఉన్న 'జాతీయ' శక్తులూ సత్యాగ్రహానికి లొంగవు

సరయిన పార్టీకి వోట్లు వేస్తే ప్రజల సమస్య పరిష్కారమవుతుందనేది వట్టి భ్రమ

ఈ పరిస్థితులలో ప్రజలను మేల్కొలిపి విప్లవచైతన్యం వారిలో కలిగించటం సాహిత్యము సాధించదగిన కనీస లక్ష్యం

*ముద్రణ జయప్రద, వారపత్రిక, 19-8-1970*

*పునర్ముద్రణ కళలు - శాస్త్రీయ విజ్ఞానం, విరసం ప్రచురణ, సెప్టెంబరు, 1980*

# 11. రచయితలు - మార్క్సిజం - రాజకీయవాదులు

అభ్యుదయ రచయితల ఉద్యమం సాగుతున్న రోజులలో సాహిత్య స్వరూప స్వభావాలను గురించి చాలా మంది అభ్యుదయ అభ్యుదయ దృక్పధంతో ఆలోచనలు చేసి వ్యాసాలు రాశారు అదే విధంగా ఈనాడు విప్లవ సాహిత్యోద్యమం వచ్చిన సందర్భంగా ఎవరి అభిప్రాయాలు వారు బయటపెడుతున్నారు నేను కూడా ''ప్రభంజనం'' లోనూ, ''సృజన'' లోనూ, నా అభిప్రాయాలు వ్యక్తం చేశాను, ప్రయివేటుగా ఉత్తరాలలో కూడా చర్చసాగుతున్నది

నేను శంకరాచార్యులవారిని కాను నా అభిప్రాయాలే కాదు మరెవరు చెప్పిన అభిప్రాయాలైనా విమర్శకు గురి అయితే నిజం తేలుతుంది ఒక్కడి చేతిమీదుగా ఉద్యమాలు నడిచే రోజులు పోయాయి విప్లవ సాహిత్యోద్యమం సామూహిక కృషి

''ప్రజా శక్తి'' (సెప్టెంబరు 12 సంచిక)లో శ్రీ మోటూరి హనుమంతరావుగారు నా అభిప్రాయాలను సుదీర్ఘంగా విమర్శించారు దాదాపు నా అభిప్రాయాలన్నీ పెడదోవే ఉన్నట్టు రుజువు చేయటానికి వారు ప్రయత్నించారు కాని వారు కృతకృత్యులైనట్లు నాకు తోచటం లేదు అసలు నా ఉద్దేశాలు వారికి అవగాహన అయ్యాయన్న నమ్మకం కూడా నాకు కలగటం లేదు హనుమంతరావుగారిలాంటి మేధావికి అవగాహనకాలేదంటే, నా అభిప్రాయాలను నేను సరిగా వ్యక్తం చేయలేక పోయి ఉండాలి అందుచేత వారు అపార్థం చేసుకున్న అంశాలను మరికొంచెం విపులీకరించటానికి ఇప్పుడు ప్రయత్నిస్తాను

(ఈ వ్యాసాన్ని నేను ''ప్రజా శక్తి''కే పంపి వుండవచ్చు అయితే ''ప్రభంజనం''లో పడిన నా వ్యాసాన్ని ''ప్రజాశక్తి''వారు తిప్పి పంపుతూ అందులో తమకు అభ్యంతరకరమైన అభిప్రాయాలున్నాయనీ, వాటికి తాము సమాధానం ఇవ్వవలసి వస్తుందనీ, తమ పత్రికలో అలాంటి చర్చలకు చోటివ్వడం ఇష్టంలేదనీ నాకు తెలిపారు ఏకపక్షంగా చర్చలు జరపటానికి వారికి అభ్యంతరం లేదని మోటూరివారి వ్యాసం బట్టి తెలుస్తున్నది అందుచేత ఈ వ్యాసాన్ని ''ప్రజాశక్తి''కి పంపటం లేదు)

1 అభ్యుదయ రచయిత అంటే నా ఉద్దేశం - అభ్యుదయ సాహిత్యోద్యమంలో పాల్గొనేవాడు మార్క్సిస్టు అయి వుండాలా, అవసరం లేదా అన్నది చర్చకు వచ్చిన అంశాలలో ఒకటి

(ఎ) సాహిత్యంతో అభ్యుదయం అన్నది ఎప్పుడూ ఉంటూనే వస్తున్నది వేమన మార్క్సిస్టు కాడు, కందుకూరి, గురజాడలు మార్క్సిస్టులు కారు అయినా వారిని అభ్యుదయ వాదులుగా మనం ఆమోదించాలి

దీనికి సమాధానం, మానవ సమాజం ఆటవిక దశనుంచి నాగరిక దశకు వచ్చిందంటే అభ్యుదయ కరమైన రాజకీయాలు చాలా అమలు జరిగి వుండాలి అనేకమంది రాజకీయ వేత్తలు మానవాభ్యుదయానికి తోడ్పడి వుండాలి వారంతా మార్క్సిస్టులా? వారు తమ రాజకీయ విధానాలకు మార్క్సిస్టు పతాకం తగిలించుకున్నారా? ఈ యుగాన్నీ, ఈనాటి సమాజాన్నీ, యిందుకు నడపటానికి వెలుగులాగా ఉపయోగపడుతున్నది మార్క్సిజం

మరో రంగంలో ఉదాహరణ కావాలంటే - న్యూటన్ ఆకాలానికి అసమాన శాస్త్రవేత్త కాని ఆయన ప్రతిపాదించిన గతి సూత్రాలు న్యూక్లియర్ కణాల చలనాన్ని విశదీకరించజాలవు

(బి) జీవితాన్ని సరిగా అవగాహన చేసుకున్నవాడు మార్క్సిస్టు కాకుండానే అభ్యుదయ రచనలు చేయవచ్చు అలాంటి రచనలు చేసిన వాళ్ళు అభ్యుదయ రచయితలు కారా?

దీనికి సమాధానం నేను ముందుగానే ఇచ్చుకున్నాను గానీ అది ''రిజిస్టరు కాలేదు ''

అభ్యుదయ రచనలు చేసే అవకాశం అభ్యుదయ రచయితలమని చెప్పుకునే వారికే ఉన్నదని నే ఏనాడూ అనలేదు నాచేత ఎవరూ అనిపించలేదు అభ్యుదయ రచయితలనూ, అభ్యుదయ రచనలనూ కన్ఫ్యూజు చెయ్యవద్దని నేను చాలా స్పష్టంగానే చెప్పాను! అభ్యుదయ సాహిత్యోద్యమాన్ని శాపనార్థాలు పెట్టిన వారిలోనే అభ్యుదయకరమైన పద్యాలు రాసినవారున్నారు వారిని అభ్యుదయ రచయితలుగా మోటూరివారు ఆమోదించినా ఆ రచయితలు అభ్యంతరం చెబుతారు

అభ్యుదయోద్యమాన్ని వ్యతిరేకించివారికి ఎవరికీ జీవితం బొత్తిగా అవగాహన కాలేదని మెటూరివారు అనగలరా? విశ్వనాథ సత్యనారాయణ గారికి చిత్తశుద్ధి లేదని గాని, ఆయన కోరుతున్నది సంఘానికి బాగు కాదనీ అనగలరా? ఆయన రాసిన పద్యాలలో అభ్యుదయకరమైనవి లేవని అనగలరా? కాని విశ్వనాథ వారు, వారి ఎత్తు ధనం పోసినా అభ్యుదయ రచయితనని చెప్పుకోరు ఆయనకు అభ్యుదయ రచయితలు, అభ్యుదయ మనంటున్నాది ఆయన దృష్టిలో అభ్యుదయం కానందునే ఒక్క ముక్కలో చెప్పాలంటే ఆయనకు మార్క్సిస్టు దృక్పథం లేనందున

అభ్యుదయ రచయితను,అని చెప్పుకునే వాడు మార్క్సిస్టు అయివుండాలనటంలో నేను ఏ విధంగా పొరబడ్డాను?

అభ్యుదయం ముదిరి మార్క్సిజం అవుతుందన్నట్టు మోటూరి వారు చెబుతున్నారు సాహిత్య రంగంలో ఈ అభిప్రాయాన్ని ఏ విధంగా అన్వయించుకోవాలో నా బుద్ధికి అందటంలేదు అభ్యుదయం base మార్క్సిజం Supersturcture అనుకోవాలా? మార్క్సిస్టు పునాది మీద అభ్యుదయ భావాలు పెరిగి వస్తాయనుకుంటున్నాను ఇది పొరపాటేనా?

2 విప్లవ సాహిత్యోద్యమం ఒక రాజకీయ పక్షాన్ని ఆధారం చేసుకుని కొంగుపట్టుకుని, లేదా అడుగులో అడుగువేస్తూ నడవ రాదనీ నేను సిద్ధాంతమే చేశాను, పరిస్తితులు మారితే ఈ సిద్ధాంతమూ మారవచ్చు కాని ప్రస్తుత పరిస్థితిలో ఇది సరిఅయిన సిద్ధాంతమే అని నేను నమ్ముతున్నాను, నా నమ్మకాన్ని హనుమంతరావుగారు మార్చలేకపోయారు

పై పెచ్చు నేను అన్ని రాజకీయ పార్టీలనూ నిషేధించినట్టుగా ఆయన అర్థం చేసుకున్నారు ఒక రాజకీయ పక్షం వెంట సాహిత్యోద్యమం నడపటం ఎందుకు సాధ్యం కాదో నేను చెప్పినా, మోటూరి వారిని ఒప్పించలేకపోయాను రాజకీయ పక్షాల స్ట్రాటజీలూ, ట్యాక్టిక్కులూ తిరిగే మెలికలన్నీ సాహిత్యోద్యమాలకు సాధ్యం కావనీ, సాహిత్యం ప్రజాజీవితాన్ని అంటి పెట్టుకోవాలనీ నేను అన్నాను, సాహిత్యోద్యమం ఏదో ఒక పార్టీ పాలసీని అనుసరించి నడవాలనీ అలా జరగని పక్షంలో సాహిత్యానికీ, రాజకీయాలకూ విడాకులేనని, హనుమంతరావుగారి అభిప్రాయంగా కనబడుతుంది

రాజకీయ పార్టీలకూ, సాహిత్యోద్యమానికి ఉండే సంబంధాలను గురించి నా అభిప్రాయాలు మరి కొంచెం స్పష్టం చేస్తాను

(ఎ) రచయితలు రాజకీయాభి ప్రాయాలనుంచి దూరం కారాదు సాహిత్యానికీ, రాజకీయాలకు చాలా సంబంధం వున్నది

(బి) విప్లవ సాహిత్యోద్యమం విప్లవ రాజకీయాలను విధిగా బలపరుస్తుంది రేపు మార్క్సిస్టు కమ్యూనిస్టులు దేశంలో రాజకీయ సాంఘిక విప్లవం తెస్తే, విప్లవ రచయితలు వారి సరసనే ఉంటారు, ఆ విషయంలో మోటూరువారికి ఎలాంటి అనుమానమూ అవసరం లేదు

(సి) రాజకీయ పార్టీలను అనుసరించి రచయితలు నడిచినప్పుడు జరిగేది మోటూరివారు చూసే వుండాలి భారత కమ్యూనిస్టుపార్టీ ''మావో జిందాబాద్'' అనటంమాని, ''మావో ముర్దాబాద్'' అనేసరికి ఒక అభ్యుదయ కవి కలం నుంచి ''వృశ్చిక సంతాన'' లాంటి గేయాలు వెలువడ్డాయి

'మేమే అసలు కాంగ్రెసు'' అనే సిండికేట్ వాళ్ళు, మహారాజుల భరణాలను రద్దు చెయ్యటానికి ఏదో సాకు చెప్పి వ్యతిరేకించారు

ఎలక్షన్ల సర్దుబాటుల్లో మిత్రులూ శత్రులూ మారిపోతుంటారు

రాజకీయ పార్టీలకు భజన సమాజాలుగా రచయితల సంఘాలు తయారయితే చాలా చిక్కులున్నాయి ఇవాళ రష్యాను పొగడాలి, రేపు తిట్టాలి, స్టాలిన్ ఎప్పుడు పతనమవుతాడో, ఎప్పుడు తిరిగి వస్తాడో తెలీదు

రాజకీయ పార్టీలు మారరాదని ఎవరూ అనరు ప్రజాజీవితానికి అనుగుణంగా ప్రజా పార్టీల విధానాలు మారవలసిందే ఆ అవకాశం సాహిత్యోద్యమాలకు ఉండాలన్నదే నేననేది

7 విప్లవోన్ముఖంగా వున్న రష్యా ఉదాహరణను హనుమంతరావు గారు ప్రస్తావించారు విప్లవ పూర్వ రష్యాలో సాహిత్యరంగంలో గోర్కీ వెలిసిన నాటికి బలమైన విప్లవ కృషి సాగుతున్నది లెనిన్ లాంటి అసాధారణ విప్లవ వాది ఉన్నాడు లెనిన్, సాహిత్యంమీద అథారిటి కాకపోయినా గోర్కీవిలువ గ్రహించాడు కానీ గోర్కీ యొక్క రాజకీయ ధృక్పధాలను ఆమోదించాడా! విమర్శించలేదా? అంతమాత్రంచేత సాహిత్యరంగంలో గోర్కీ విలువ ఏం తగ్గింది

విప్లవ సాహిత్యోద్యమం సంగతి అలా వుంచి, అభ్యుదయ రచయిత అన్నవాడికి గల అర్హతలనే మోటూరి వారు చెరిపేశారు ధనికుల విలాసాలనూ, దరిద్రుల కష్టాలనూ చిత్రించినంతమాత్రాన అభ్యుదయ రచయిత కాడన్నారు వియత్నాం పోరాటం గురించి రాసినా అందులో ఏమీ లేదన్నారు

ఎవరు ఎటువంటి రచనలు చేసిన వాడు మోటూరివారి దృష్టిలో అభ్యుదయ రచయిత? మార్క్సిజం తెలియకపోయిన ఒక అభ్యుదయ రచన చేస్తే చాలునని తృప్తిపడే మోటూరి వారు ఇద్దరు (తమదృష్టిలో) అభ్యుదయ రచయితల పేర్లు రెండు అభ్యుదయ రచనల పేర్లు ఇచ్చివుంటే నా బోటి వాళ్ళకు ఉపయోగంగా ఉండును

మరొక్క విషయం ఒక రకం రచనలను నిందించదలచిన వాళ్లు వాటికి రాజకీయ విశేషణాలను, నాజూకయిన బూతులులాగా వాడటం పాతికేళ్ళ నుంచీ నేను చూస్తున్నాను ఒక ఇంగ్లీషు దొరసాని నన్ను ''నువ్వింకా కమ్యూనిస్టు కథలు రాస్తున్నావా'' అని అడిగింది కమ్యూనిస్టు సాహిత్య మంటే కమ్యూనిస్టు సైద్ధాంతిక రచనలని కాస్త బుద్ధి వున్నవారందరికీ తెలుస్తుంది కమ్యూనిస్టులే కథలు రాసినా అవి కమ్యూనిస్టు సాహిత్యం కావు

ఇదివరకు ఇలాంటి రాజకీయ విశేషాలను అతి హీన మేధావులే చేసే వారు వారిని మోటూరి వారి వంటి మార్క్సిస్టు మేధావి అనుసరించటం తగదు సాహిత్యంలో ''ఉగ్రవాదం'' అన్నదానికి అర్థమేమిటి? రాజకీయాలలో '' ఉగ్రవాదం'', ''అతివాదం'' అన్నదానికి అర్థం వుంది ''నక్సలైట్ కవులు'' అనే మాటకు అర్థం వుందా? గిరిజనులు తమ భూములను భూస్వాముల నుంచి కాపాడుకునేటందుకు జరిగే పోరాటాలను రాజకీయంగా నడిపించటానికి పుట్టిన వాళ్ళు నక్సలైట్లు పద్యాలు రాసే వాళ్ళు ఆ పోరాటాలను సమర్థించగానే నక్సలైట్లు అయిపోతారా ''నక్సలైట్ కవులు'' అన్నది హనుమంతరావు గారు తిట్టు మాటగా వాడడం లేదని చెప్పగలరా? (దానికి దిగంబరులు అభ్యంతరం చెప్పక పోయేరు గాక, అది వేరే సంగతి) ఒకప్పుడు కమ్యూనిస్టులను బలపరిచిన రచయితల మీద యాంటీ ప్రోగ్రెసివ్‌లు వాడిన ''తిట్లు'' లాంటివి కమ్యూనిస్టులే తమకిష్టం లేని వారి మీద ప్రయోగించటం చిత్రం

దిగంబరుల మీద దాడి చేసిన మాత్రాన సాహిత్యానికి మహోపకారం జరగదు దిగంబరుల మీద ఈగ వాలరాదని నా ఉద్దేశం ఏనాడూ కాదు వారిమీద వాలే ఈగలను తోలుతానని కంకణం కట్టుకోనూ లేదు దిగంబరులంటే ఓ వీశెడు చింతపండు కాదు వారు మారుతున్నారు, వారి వైఖరి మారి ఒక స్పష్టతను సాధించుకుంటున్నది సాహిత్యంలో నిజమయిన అభిలాష గల వారికి ఈ పరిణామాలు ముఖ్యం మోటూరి వారి దృష్టిలో దిగంబర కవిత్వము వీశెడు చింతపండు అది మార్క్సిస్టు చింతపండు కాదు దిగంబర కవిత్వాన్ని విని ఉత్సాహం చెందుతున్న వేలాది యువకులూ, వారి రచనల పట్ల శ్రద్ధ చూపుతున్న శ్రీశ్రీ ప్రభృత రచయితలూ అజ్ఞానాంధకారంలో పడి కొట్టుకుంటున్నారని మోటూరి వారి నిర్ణయం

అభ్యుదయ రచయితలు మార్క్సిస్టులై వుండాలని మేం స్థూలంగా అనుకున్నది మోటూరి వారికి తెలీదు అదొక తీర్మాన రూపంలో దొరుకుతుందేమోనని వెతికినట్టున్నారు తీర్మానమయితే ''తీర్మానించాం'' అని రాయనా ఇది కొద్దిమందిమి అనుకున్నదే రంకుగాని, బూతు గాని కాదు దాన్ని ఖండించటానికి కూడా మోటూరి వారు ప్రయాస పడ్డారంటే వారి కృషికి, సాహిత్యం పట్ల వారికి గల ఆదరానికి ఏమంత సంబంధం ఉన్నట్టు లేదు నక్సలైట్ రాజకీయ పక్షం మీద వారికి గల రాజకీయ విద్వేషమే మోటూరి వారిని ఈ వ్యాసాలు రాయటానికి ప్రేరేపించి వుంటే, తద్వారా వారు అభ్యుదయ సాహిత్యానికీ, విప్లవ సాహిత్యానికి అంతగా మేలు చేయలేదు

అభ్యుదయ సాహిత్యం మీద కత్తి కట్టి విప్లవ సాహిత్యం వచ్చినట్టు ''ప్రజాతంత్ర''లో ఒక వ్యాసం చూశాను అలాంటి కత్తులేవీ లేవు అభ్యుదయ సాహిత్యోద్యమం మీద వచ్చిన

పరిణామమే విప్లవ సాహిత్యోద్యమం ఇదయినా పెద్ద పెట్టున రాలేదు ఇంకా శైశవ దశలోనే ఉన్నది, కాని దీని ఆవిర్భావానికి దిగంబరులు వహించిన పాత్ర చాలా ప్రధానమైనది

నేటి సమాజంలో రాజకీయాల ప్రభావం సాహిత్యంపైనా, సాహిత్య ప్రభావం రాజకీయాలపైనా ఉండి తీరే మాట నిజమే అందుచేతనే మార్క్సిస్టు కమ్యూనిస్టులు గానీ, మరో ''యిష్టులు'' గాని ఆరంభ దశలో వున్న విప్లవ సాహిత్యోద్యమాన్ని అణగార్చటానికి, తట్ట తగలెయ్యటానికి, అర్థం లేని కృషికి పూనుకోరాదు ఇది నా అభిప్రాయం మాత్రమే!

*తెలుగు వెలుగు, వారపత్రిక, 25-9-1972*
*పునర్ముద్రణ కళలు - శాస్త్రీయ విజ్ఞానం,*
*విరసం ప్రచురణ, అక్టోబరు 1980*

# 12. ఒంటికంటి రామలింగాలు

ప్రతి కళాకారుడికీ రెండు రకాల సమాజాలలో సభ్యత్వం ఉంది ఒక సమాజం అతను సృష్టించే కళను ఆదరించే వారితో కూడినది, రెండోది అతని సాటి కళాకారులతో కూడినది ఈ రెంటిలోనూ అతనికి సహజంగా స్థానం ఉంటుంది

ఈ సమాజాల కలగలుపుతో సాధ్యపడే పరిణామాలు ఒక మహత్తరమైన సాంఘిక పాత్రను నిర్వహిస్తాయి ఈ పాత్రను అర్థం చేసుకోకుండా కళా ప్రయోజనాన్ని అంచనా కట్టటం సాధ్యం కాదనుకుంటాను

మాట వరసకు సాహిత్య రంగం తీసుకుందాం అందులోకి కొత్తగా ఒక యువకవి ప్రవేశించాడనుకుందాం అతను గొప్ప ప్రతిభావంతుడు కానవసరం లేదు బొత్తిగా ప్రతిభా హీనుడూ కానవసరం లేదు సుమారైన ప్రతిభ గల వాడనుకుందాం అతని కవిత్వం కొందరు పాఠకులను కొంతవరకు తృప్తి పరుస్తుంది కొందరి నుంచి అతనికి ప్రోత్సాహం లభిస్తుంది

ఈ కవి కుమారుడు కవిత్వం రాయక పూర్వం పాఠకులలోని వాడే గనుక, అతనికి అభిమానులైన సీనియర్ కవులు కొందరుంటారు ఈ యువ కవి రాస్తూ పోతున్న కొద్దీ తనకు ఎగువనున్న కవులెవరో దిగువనున్న కవులెవరో క్రమంగా తెలిసి వస్తుంది అతనికన్న బాగా రాయగల వారు సైతం, అతని సాంఘిక భావాలూ, కవితాశయాలూ తనకు సన్నిహితంగా ఉన్నట్టు కనిపించినప్పుడు అతనికి ప్రోత్సాహం ఇస్తారు, అతన్ని తమలో ఒకడుగా చూడనారంభిస్తారు అతను స్వీకరించగలిగితే అతనిలో లోపాలు కూడా చెబుతారు ఈ విధంగా అతను కవి సమాజంలో సభ్యుడై పోతాడు కొన్ని విషయాలలో ఇతరుల చేత ప్రభావితుడౌతాడు మరికొన్ని విషయాలలో ఇతని ప్రభావమే ఇతరులపైన వుండవచ్చు ఇది సమాజంలో స్వాభావికంగా జరిగే సంగతే ఈ ప్రభావాలు అతనికీ, ఇతరులకు కూడా మంచే చేస్తాయి కవిగా అతను ఒక ప్రమాణం వరకూ పెరిగే అవకాశం వొస్తుంది ఈ అవకాశం ఇతర కవులతో ఎలాటి సంబంధమూ లేని వాడికి రాదు

సాటి కవుల మధ్యకు ప్రవేశించినట్టుగానే మన పత్రికలో అచ్చుపడినంత మాత్రాన ఒక గేయం తాలుకు సాంఘిక మూల్యం ఏమీ తెలియదు అది రాసిన వాడికి కూడానూ ఎవడు

రాసిన గేయం వాడికి బాగుంటుంది, అద్భుతంగా కూడా ఉంటుంది కాని కవిత్వపు అసలైన విలువలు బయటపడేది ప్రజల మధ్య

మన యువ కవి అనుభవాలు ఇంతటితో అయిపోవు సాహిత్య రంగం అవిభాజ్యం అందులో కథకులున్నారు నాటక కర్తలున్నారు, విమర్శకులున్నారు, రెండు మూడు తరాల రచయితలున్నారు అచ్చగా కవులలోనే నిన్నటి కవులూ, రేపటి కవులూ ఉన్నారు మిగతా సాహిత్య శాఖలలోనూ అంతే

సాహిత్య సభలు జరిగినప్పుడు అన్ని సాహిత్య శాఖలూ ఏకమౌతాయి ఈ సభలు అన్ని రకాల సాహిత్యాన్ని సృష్టించే వారికీ గొప్ప అనుభవం ఎందుచేతనంటే, మామూలు పరిస్థితులలో కథలు రాసే వాడూ, కవిత్వం రాసే వాళ్ళూ, నాటకాలు రాసే వాళ్ళూ తమ తమ ప్రత్యేక శాఖలపైనే అధికంగా దృష్టి ఉంచుతారు కాని సాహిత్య సభలలో ఈ దృష్టి ఇతర శాఖల పైకి మళ్ళక తప్పదు

రచయితలందరూ కీర్తి కండూతితోనూ, తమ పేరు అచ్చులో చూసుకో గలందులకూ రచనలు చేస్తున్నవారైతే ఈ సాహిత్య సభల వల్ల కలిగే ప్రయోజనం ఏమీ ఉండదు - పది మంది జనం ఎదటికి ఒక్కసారి రావటం తప్ప కాని రచయితలకు సాంఘిక దృక్పథాలుంటాయి, తమ రచనలలో వారు వాటిని వ్యక్తం చేస్తారు మన యువ కవి తనలాటి సాహిత్య ప్రయోజనంతోనే కథలు రాసే వాళ్ళనూ, నాటకాలు రాసే వాళ్ళనూ, సాహిత్య విమర్శలు చేసే వాళ్ళనూ కలుసుకుంటాడు కవి సమ్మేళనాలలో సాటి కవులను అంచనా కట్టినట్టే, వారి ప్రభావానికి గురి అయినట్టే ఈ సాహిత్య సభలలో ఇతర సాహిత్య రంగాలలో కృషిచేసే వారిని అంచనా కడతాడు వారి ప్రభావానికి గురి కావటానికి సిద్ధపడతాడు ఇది కూడా రచయిత పెరగటానికి చాలా అనుకూలమైనదే తనకు సోదరుల లాటి వాళ్ళు కథకులలోనూ, ఇతర రచయితలలోనూ ఉన్నారనుకోవటం యువ కవికి చాలా బలాన్ని చేకూర్చుతుంది

అయితే ఇంత వరకూ మనం అనుకున్నది నిర్దుష్టమైన పరిస్థితులలో జరగాలసినది వాస్తవంగా జరిగేది ఇంత నిర్దుష్టంగా ఉండదు సాహిత్య సమావేశాలు కొద్ది మంది రచయితల మధ్య గల సోదరభావాన్నీ, ఆత్మీయతనూ వ్యక్తం చేసే మాట నిజమే కాని కొందరు ఒంటి కంటి రామలింగాలను కూడా అవి చేరదీస్తాయి వాళ్ళు పానకంలో పుడకలు, అపస్వరాలు, తమకన్న చాలా ఉన్నతుల మధ్య తాము కూడా ఉన్నతులమేనన్నట్టు తిరగటానికి, విస్తృతమైన సాహిత్య రంగాలైన సభలకు వేంచేస్తారు అక్కడ తనలాటి వారినో, తమకన్నా హీనులనో చేరదీసి, కాకాపట్టి ఒక విషపు తుట్టెను సృష్టిస్తారు తరువాత, ''వీణ్ణెందుకు గొప్ప చేస్తారు? వాడికసలు ఏం తెలుసు?'' అన్న ధోరణిలో ప్రచారం చేస్తారు

నిజానికి సాహిత్య రంగాలలో అనేక రకాల సాంఘిక విశ్వాసాలకు ఆస్కారం ఉంది అందులోనూ రకరకాల రాజకీయ సిద్ధాంతాలు అమలులో ఉన్న మన దేశంలో సాంఘిక విశ్వాస వైవిధ్యానికి లోటు ఎంత మాత్రమూ లేదు కాని వందమంది రచయితలూ, వెయ్యి మంది ప్రేక్షకులూ చేరగానే అత్యున్నతమైన సాంఘిక దృక్పథానికి తప్ప మరొకదానికి తావుండదన్నది అనుభవంలో రుజువవుతున్న సంగతి ఈనాడు ఏ విస్తృత సాహిత్య సభలోనూ అమెరికా రాజకీయాలను సమర్థించటం గాని, కమ్యూనిస్టు వ్యతిరేకతను విరివిగా ప్రచారం

చెయ్యటం గాని సాధ్యం కానట్టు కనబడుతుంది అందుకుగాను వేరే సభలు కొద్దిమంది రచయితలతోనూ, ప్రేక్షకులతోనూ ఏర్పాటు చేసుకోవాలి

ఈనాడు పరిస్థితి ఎలా ఉన్నదంటే, అందరూ సోషలిస్టు వ్యవస్థనే కోరే రచయితలైనా, అందరి ధ్యేయమూ సాంఘిక విప్లవమే అయినా, రచయితల మధ్య చిన్నచిన్న తేడాలు కనిపిస్తున్నాయి వాటిని గురించి ఘర్షణలు కూడా జరుగుతున్నాయి ఈ తేడాలు వాస్తవమైనవి వీటిని కొట్టి పారెయ్యటానికి వీలు లేదు వీటి మూలంగా సాహిత్య ప్రపంచంలో కూడా కొంత ''పోలరైజేషన్'' జరుగుతున్నది ఇవి కుడి ఎడమల తేడాలే ఈ తేడాలకు ప్రాముఖ్యం రావటంతో రచయిత మరికొంచెం ఎడమకు జరగటమో పూర్తిగా కుడివైపు తప్పుకోవటమో జరగవలిసిన పరిస్థితి ఏర్పడుతున్నది మనకన్న కొంచెం ఎడమగా ఉన్నవాడి వెనక నిలబడి అందరమూ ఒకే శ్రేణిలో ఉన్నట్టు నటించే అవకాశం తగ్గుతున్నది ఇది అన్నిటికన్నా ఈనాడు చాల బలవత్తరమైన సామాజిక ప్రభావం దీని ప్రభావం పెరిగిన కొద్దీ ఒంటికంటి రామలింగాలకు సాహిత్య రంగంలో కాలు నిలదొక్కుకొనేందుకు ఏమాత్రమూ అవకాశం లేకుండా పోతుంది

*ముద్రణ 1970*

# 13. ఉద్యమ ప్రారంభం

ఈ విధమైన ఉద్యమానికి గత ఆరేళ్ళుగా నేను ఎదురు చూస్తున్నాను

ఆరేళ్ళ క్రితమే రాయటం మానుకున్నాను విశాఖలో శ్రీశ్రీకి సన్మానం జరిగిన పిమ్మట ఉత్సాహం తిరిగి పుంజుకొన్నది అక్కడ ఉత్తేజం కలిగింది జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లతో మాట్లాడాను అంతకుపూర్వం వారిపై నాకు గల అభిప్రాయాలు మారిపోయాయి వారూ నేనూ ఒకటిగానే ఆలోచించాము

వి ర సం పెడితే ఎలా ఉంటుందని ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి కృతవిక్మైన హైదరాబాదు సదస్సు కని శ్రీశ్రీ వెళ్ళడమే మేలైనది అక్కడ నీళ్ళు పాలు తేలికొత్త ఉద్యమానికి పునాది ఏర్పడింది నేను అందుకు అంగీకరించాను నాకది కొత్త జీవితం

1930లో అర్థశాస్త్ర గ్రంథం చదివాను అది తృప్తి కాలేదు ''మార్క్స్ కేపిటల్'' చదివాను, మారిపోయాను నేటి అ ర సం లో విప్లవ దృక్పథం లేదు శ్రామిక వర్గం పట్ల పేట్రనైజింగ్ దృక్పథం కనిపిస్తున్నది శ్రామికవర్గం జీవితం తెలియందే రాయటం సాధ్యం కాదు కలం పారేసి పాణిగ్రాహిలా కార్యరంగంలో దూకిన వారికే అది సాధ్యం విప్లవ పోరాటాలు, జీవితాలు, వారి కష్టాలు, సన్నిహితంగా తెలియనిదే వారిని గురించి రాయలేము

కథకులు ఏ జీవితం గురించి రాయదలిచినా, ఆ తరహా జీవితం గురించి సమగ్రంగా తెలుసుకొని, వీలైతే అనుభవించి రాయండి

*(విరసం తొలి మహాసభల ప్రతినిధుల సమావేశం*
*(ఖమ్మం, 8-10-1970)లో ప్రసంగం)*
*ముద్రణ విరసం ప్రత్యేక సంచిక, సెప్టెంబరు 1971*

# 14. ఉద్యమ వ్యాప్తి

దాదాపు 1964 నుంచీ సాహిత్య రంగంలో ఒక స్తబ్ధత ఏర్పడింది అభ్యుదయ సాహిత్యోద్యమంలో అభ్యుదయం నిండుకుని, ఉద్యమంగా చచ్చిపోయింది విశాఖలో శ్రీశ్రీకి జరిగిన షష్టిపూర్తి సన్మానం సందర్భం గా సాహిత్య రంగంలో మళ్ళీ చెలరేగిన సంచలనం మాకు ఆశాజనకంగా కనిపించింది కొత్త ఉత్సాహాన్ని కలిగించింది ఈ సందర్భంలో సాహిత్య రంగంలో జరుగుతున్న పోలరైజేషన్‌ని అడ్డుకునేందుకు అభ్యుదయ సాహిత్యోద్యమ శవాన్ని తవ్వి తీసే ప్రయత్నం వ్యర్థమై విప్లవ రచయితల సంఘ శిశువు పుట్టింది ఇది బలంగా పెరుగుతుందని నా విశ్వాసం

*- (విరసం తొలి మహాసభల బహిరంగ సభ*
*(ఖమ్మం, 9-10-1970) లో ప్రసంగం)*
*ముద్రణ జయప్రద, వారపత్రిక, 21-10-1970*

# 15. విప్లవ సాహిత్య సమస్యలు

సాహిత్యం దేవుళ్లకు అనుకూలంగా రానివ్వండి, రాజులకు అనుకూలంగా రానివ్వండి, ధనస్వాములకు అనుకూలంగా రానివ్వండి, మధ్యతరగతికి అనుకూలంగా రానివ్వండి - అది నూటికి తొంభైపాళ్లు మధ్యతరగతి నుంచే వచ్చింది ఆఖరుకు వ్యాసవాల్మీకులు కూడా ఆ కాలపు మధ్యతరగతి వాళ్లే అయి ఉంటారనిపిస్తుంది, ఎందుకంటే ఆనాటి జీవితానికి వాళ్లు పురోగాములుగాగాని, ప్రజాసామాన్యంలో చేరిన వాళ్లుగా గాని కనపడరు

ఈ యుగంలోనే - అంటే, ధనస్వామ్యం మళ్లీ, ప్రజాజీవితాన్ని విషపూరితం చేయనారంభించిన దశలో - సంఘ శక్తులు సామాన్య ప్రజలలోకి చొచ్చుకుపోవటం జరిగింది శ్రామిక - పీడిత ప్రజల కోసం సోషలిస్టు - కమ్యూనిస్టు పార్టీలు వచ్చాయి వాటి నాయకత్వం కూడా మధ్యతరగతి వారే చేపట్టాలని మార్క్సిజం - లెనినిజం చెప్పింది

ఈ విధంగా ఈ యుగంలో రాజకీయ సాహిత్య రంగాలు రెంటిలోనూ మధ్యతరగతి బాధ్యతలు చేరి కలుసుకున్నాయి మధ్యతరగతి రచయితలకు రాజకీయ అవగాహన ఎంత అవసరమో రాజకీయ నాయకులకు సాహిత్యం తోడ్పాటు కూడా అంత అవసరమే - ఆ సాహిత్యమూ, ఆ రాజకీయాలూ ప్రజా క్షేమాన్ని ఆకాంక్షించేవి అయి ఉంటే

రాజకీయాలకూ, సాహిత్యానికీ పరస్పరం ఉండే ప్రభావం అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడ్డనాడు స్పష్టమయింది దేశంలో శ్రామిక వర్గ రాజకీయాలు తల ఎత్తగానే అభ్యుదయ సాహిత్యం వెలువడింది పేదవాడి కష్టాలు మధ్యతరగతి కావ్య వస్తువయ్యాయి ఎందుచేత? వాటి పరిష్కారం దిగంతాలలో పొడచూపుతున్నది గనక, ఆ పరిష్కార మార్గాలలో కృషిచేసే రాజకీయ శక్తులు ఆవిర్భవించాయి కనక

అయితే ఆరాజకీయ శక్తులూ, ఆసాహిత్యమూ కూడా పరిస్థితుల ప్రభావంతో గుంటపూలు పూయనారంభించాయి కాని పూర్తిగా అంతరించలేదు వాస్తవ జీవిత చిత్రణ

జరుగుతూనే వచ్చింది కవులూ, కథకులూ జీవితంలో రాజీ పడిపోక, ''కళాస్వాదనతత్పరులు'', ''వద్దుబాబో'', అంటున్నా పేదల కష్టాలను గురించీ, ధనికుల, అధికారుల అవినీతిని గురించీ సాహిత్యం వెలువడుతూనే వచ్చింది మధ్యతరగతి మనస్తత్వాన్ని స్త్రీల సమస్యలను గురించిన వాస్తవ చిత్రణ కూడా కొనసాగింది

ఈ పరిస్థితిలో నక్సల్బరీ తిరుగుబాటు వచ్చింది అది సాయుధమైన తిరుగుబాటు - విప్లవానికి నాంది సామాన్య ప్రజలు చాలా కష్టాలను సహించగలరు వాళ్లు విప్లవానికి ఒడిగట్టారంటే, చంపటానికీ, చావటానికి సిద్ధపడ్డారంటే, వారి జీవితం చావు కన్న దుర్భరంగా తయారయిందన్నమాట ప్రభుత్వం వారి జీవిత సమస్యను పరిష్కరించలేకపోయిందన్నమాట అమెరికాలో Panthers ను వ్యవస్థాపించిన హ్యూయీ పి న్యూటన్, "The people never make revolution The oppressors by their brutal actions cause the resistance by the people", అన్నాడు

తిరుగుబాటుకు పరిష్కారం తుపాకులూ, పోలీసులూ, సైన్యమూ అయేమాటుంటే అది విప్లవంగా మారటం తథ్యం దాదాపు కాలు శతాబ్దం గడిచినా ఒక్క ప్రజా సమస్యను పరిష్కరించలేని ప్రభుత్వం - తన మనుగడ కోసం క్షుద్రమైన రాజకీయపుటెత్తులకు దిగిన పాలక వర్గం - దేశంలో విప్లవాన్ని తనంతటతానే తెచ్చిపెట్టుతుంది జీవిత సమస్యలతో రాజీ లేని పరిస్థితి ఈనాడు గిరిజనులకూ, హరిజనులకూ, కార్మికులకూ, రకరకాలుగా విద్యార్థులకూ ఏర్పడింది మిగతా వర్గాలకు ఏర్పడనున్నది

ఈ పరిస్థితిని దూరదృష్టి గల సాహితీవేత్తలు గుర్తించకుండా ఉండటం అసాధ్యమైన స్థితిలో విప్లవ సాహిత్యం అనదగినది పుట్టుకొచ్చింది రాజకీయపుటెత్తులను ఫార్స్ కింద జమ కట్టిన మధ్యతరగతి వాళ్లు అనేక మంది తిరుగుబాట్లను బలపరిచేందుకూ, నడిపించేందుకూ ముందుకు దూకారు వారు ఆహుతి కావటం వల్ల జరుగుతున్నది విప్లవం కాకపోదు ఇది ప్రాంతీయంగానే ఉన్నా, తాత్కాలికంగా అణగారిపోయినా, మళ్లీ ఇంకో రూపంలో తిరిగి ప్రజ్వలించక దేశ స్థితి చక్కబడదన్న భావాన్ని కలిగిస్తున్నది ప్రభుత్వమే

ఈ విషయాన్ని స్పష్టంగా గుర్తిస్తున్న వాళ్లు విప్లవ రచయితలు వీళ్లు సృష్టించేది విప్లవ సాహిత్యం

విప్లవ సాహిత్యం దేనికి కృషి చేస్తుంది? ఆ కృషి ఎలా చేస్తుంది? ఈ రెండు ప్రశ్నలూ విప్లవ రచయితల ముందున్నాయి

అందులో మొదటి ప్రశ్న తీసుకుందాం విప్లవ సాహిత్యం వెళ్లి సాయుధ పోరాటాలు చెయ్యదు - అది స్పష్టం, కాని విప్లవ పోరాటాలను సమర్థిస్తుంది, విప్లవ భావాలు లేని వారిలో వాటిని ప్రకోపింపజేస్తుంది విప్లవానికి అడ్డంగా ఉండే సంకుచిత భావాలనూ, వర్గాలనూ ఖండిస్తుంది విప్లవ వ్యతిరేకులు నీతి అనీ, ధర్మమనీ, న్యాయమనీ ప్రచారం చేసే నల్లమందుకు విరుగుడు వేస్తుంది

రెండవ ప్రశ్న అంత తేలికగా కొరుకుడుపడని ప్రశ్న

కవుల పని తేలిక, కల్పనా సాహిత్యం రాసే వాళ్లదే,కష్టం అన్న అభిప్రాయం ఒకటి ఉన్నది కవి నినాదాలు ఇవ్వగలడు, ఉద్బోధలు చెయ్యగలడు, ఉద్రేకాన్ని రెచ్చగొట్టగలడు నిజమే

కాని అందులోనూ గురి తప్పే నినాదాలూ, గాడిలో పడని ఉద్బోధలూ ఉంటాయి ఎంత ఉద్రేకపూరితమైన కవిత్వమైనా మేధస్సును వశపరచుకోకుండా సాఫల్యం పొందదు అన్నీ విప్లవగేయాలే అయినా వాటిలో తారతమ్యాలుంటాయి కొన్ని ఉపన్యాసంలాంటివి కూడా వచ్చాయి

కల్పనాసాహిత్యం వాస్తవ జీవితాన్ని చిత్రించాలి, విశ్లేషించాలి, వ్యాఖ్యానించాలి, విమర్శించాలి వాస్తవికత అంటే అసలుకు సరియైన నకలు దించటం ఏమాత్రమూ కాదు జరిగినది మాత్రమే గాక జరగటానికి అవకాశం ఉన్నదీ, జరగదగినదీ కూడా వాస్తవికతలో చోటు చేసుకుంటుంది ముఖ్యమైనదేమంటే జీవితసత్యాన్ని వ్యక్తం చెయ్యటం గొంతెమ్మ కోరికలు వాస్తవికత అనిపించుకోవు అందులో జీవిత సత్యం ఉండదు సోషలిస్టు యుటోపియాలు ఎవరైనా రాయొచ్చు, ఎన్నయినా రాయొచ్చు కాని వాటి వల్ల ప్రయోజనం ఉండదు

తెలియని జీవితం గురించి ఎలా రాయటమన్నది ఒక ప్రశ్న కన్నదీ, విన్నదీ రాయటానికి టెక్నికల్‌గా ఆక్షేపణ లేదు కాని కన్నదాన్ని దూరం నుంచి చూసినట్టే రాయాలి, విన్నదాన్ని కబురులాగే రాయాలి లేనిపక్షంలో చిత్రణ హాస్యాస్పదంగా తయారవుతుంది

ఏ రచయితా తాను సృష్టించే పాత్రలన్నీ కాలేడు కాని రాచకొండ విశ్వనాధశాస్త్రి, కాళీపట్నం రామారావులాంటి రచయితలలో ఉండే ప్రతిభ ఏమిటంటే వాళ్లు తాము సృష్టించే పాత్రలను ఎంత శాతం objective గా చిత్రించాలో తూచినట్లు గుర్తించి నూటికి నూరుపాళ్లు విశ్వసనీయంగా చేస్తారు

విప్లవ కథా సాహిత్యం ఒక విలక్షణమైన మార్గాన్ని అన్వేషించాలనే తాపత్రయం రచయితలను అంతగా బాధించనవసరం లేదనుకుంటాను విప్లవోన్ముఖులైనవారి జీవితాలను ప్రత్యక్షంగా చిత్రించాలంటే ఆ జీవితాన్ని గురించి చాలా వివరంగా, ముఖ్యంగా ఆ జీవితంలోని జీవ చైతన్యాన్ని సమగ్రంగా, తెలుసుకోవటం అవసరం

విప్లవ కథకులు తమ ఎదురుగా ఉన్న జీవితంలోని పరిష్కారం కాని సమస్యలను గురించి తప్పక రాయవచ్చు, రాజీవిధానాలు అవలంబించకుండా ఉంటే మనకు అలాంటి రచనలు ఉన్నాయి ''నిజం'' నాటకంలో రాజీ ఏమీలేదు నిరపరాధికి ఉరి పడితీరుతుంది జీవితం లోని ట్రాజెడీను కామెడీలుగా మార్చటానికే విప్లవం ''సార్వభౌమ రావులు'' ఏమవుతారనేది చరిత్రే తేల్చివేస్తున్నది ''నిజం'' నాటకానికి సీక్వెల్ తప్పక ఉన్నది

మధ్యతరగతి జీవితాలనిండా రాజీధోరణి కనిపిస్తుంది విప్లవ దృక్పథం లేనినాడు ఆపద్ధతులను సహించవచ్చు, విప్లవ వ్యతిరేకి వాటిని ఘనంగా శ్లాఘించనూవచ్చు కాని విప్లవరచయిత వాటిని తీవ్రంగా ఖండిస్తాడు తన ఖండనలో ఎక్కువ సత్యం ఉన్నదని పాఠకుణ్ని నమ్మిస్తాడు తీవ్రమైన కమ్యూనిస్టు వ్యతిరేకులు 'ముందడుగు', 'మాభూమి' నాటకాలు చూసి, వాటిలో ఉండిన జీవిత సత్యాన్ని మనస్ఫూర్తిగా ఆమోదించటం నేనెరుగుదును

ఈనాటి మధ్య తరగతి జీవితం వ్యంగ్య సాహిత్యానికి గొప్ప ముడిసరుకు ఇందులో కపట అభ్యుదయ వాదులున్నారు, పాము పడగ నీడబట్టిన కప్పగాళ్లున్నారు, వొట్టి గొడ్డు అరువుల వాళ్లున్నారు, కీర్తి కండూతిగాళ్లున్నారు, ఆచరణలో తోక పీకుడు గాళ్లున్నారు,

వీళ్లందరినీ బట్టబయలు చేయటం అవసరం కాదా? అభ్యుదయోద్యమం తెల్లనివన్నీ పాలని నమ్మి నడుచుకున్నది అదే దాని అధోగతికి దారితీసింది విప్లవ సాహిత్యోద్యమం ఆ రొంపిలోకి దిగకుండా జాగ్రత్తపడాలి విప్లవ రచయిత ఎలాంటి గాలిమేడల లోనూ విశ్వాసం ఉంచరాదు

సింబాలిజంకు బొత్తిగా స్థానం లేకుండా చెయ్యటం కూడా ఈ దశలో వాంఛనీయం కాదు వాస్తవ జీవితం విప్లవోన్ముఖమైన కొద్దీ సంకేతాలకు పస దానంతట అదే తగ్గుతుంది యదార్థ జీవిత చిత్రణకన్న కూడా సంకేతాలు జీవితాన్ని మరింత లోతుగా మధించి ఉన్న జీవిత సత్యాన్ని మరింత స్పష్టంగా వ్యక్తం చేస్తాయి ఆ కారణం చేతనే ''పిపీలికం'' ఉదాత్తమైన రచన ''నల్లులు'' కూడా అలాటిదే

విప్లవ సాహిత్యంలో పీడిత, తాడిత వర్గాల జీవితమూ, విప్లవకారుల జీవితమూ రానురాను హెచ్చుగా ప్రతిబింబిస్తుందన్నది నిర్వివాదం కాని ఆ సాహిత్యంలో ఇతర జీవిత రంగాలు ప్రతిబింబించే అవకాశం ఉండదనుకోవటం సరికాదు విప్లవ పరిణామాలు స్పృశించకుండా వదిలే జీవిత రంగం ఏదీ ఉండదు ''నా జీవితంలో వాంఛనీయమైన విప్లవ పరిణామాలేమీ లేవు నేను ఇతర వర్గాల జీవితంలో విప్లవ పరిణామాల కొరకే కలం పడతాను!'' అనే విప్లవ రచయిత ఏనాడూ ఉండడనుకోవచ్చు మధ్యతరగతి జీవితంలో రాదగిన విప్లవ పరిణామాల కొరకు జరగదగిన కృషీ, దాని వైఫల్యమూ చిత్రించినా కూడా ఆలాటి రచనకు విప్లవ సాహిత్యంలో తప్పక చోటు ఉంటుందనుకుంటాను

రచయితలు తమ పరికరాలనుతమ ఉపజ్ఞతోనే తయారు చేసుకునే కార్మికులు వారి కృషికి శుష్క సూత్రాల కన్న అనుభవమూ, అవగాహనా, కళా కృషీ ఎక్కువగా తోడ్పడతాయి విప్లవ సాహిత్యోద్యమంతో సాహిత్యం మరింత వైవిధ్యం సాధిస్తుందనుకోవటం సబబు గాని, సంకుచిత మవుతుందనుకోవటం సరికాదు మనస్సంకోచాలు విసర్జించిన నాడు సాహిత్యంలో సంకుచితత్వానికి తావుండదు సంకుచితత్వంతో తీసుకుంటున్నది గాడి తప్పిన ప్రణయ, డిటెక్టివు, సెక్స్ సాహిత్యాలు, సినిమా సాహిత్యం, రేడియో సాహిత్యం ఆ దుస్థితి విప్లవ సాహిత్యానికి ఉండకూడదు, ఉండదు కూడాను

*ముద్రణ విరసం బులిటన్, 1970*

*పునర్ముద్రణ సాహిత్యంలో విప్లవోద్యమం, సృజన ప్రచురణ, అక్టోబరు 1971*

# 16. సాహిత్య రంగంలో సంఘర్షణ

జీవితం అన్ని రంగాలలోనూ సంఘర్షణ ఉంటుంది సాహిత్య రంగానికి మినహాయింపు లేదు అన్ని సంఘర్షణలూ కొన్ని కొన్ని పరిస్థితులలో వైషమ్యాలుగా పరిణమిస్తాయి సాహిత్యరంగంలోనూ అంతే

శతాబ్దంలోనే పండితులూ పండితులూ తిట్టుకుని ఒకరి నొకరు శాపనార్థాలు పెట్టుకొనడం మనకు తెలుసు సామాన్యంగా సాహిత్య విమర్శ అన్నది ఓ రకమైన యుద్ధ రంగం లాగుండేది మొదట్లో ''సిద్ధాంత విభేదాలు'' లేవు తిట్టేవాడు, తిట్టబడేవాడూ, ఎదురు తిట్టేవాడూ, అందరూ పూర్వలాక్షిణికులనే ప్రమాణంగా చూసేవారు

(విశ్వనాథ వారి రామాయణ కల్పతరువు గురించి ఇటీవల వచ్చిన విమర్శలు కూడా ఇటువంటివే)

గిడుగు రామమూర్తి గారు కృషి చేసిన మీదట ఆరంభమైన నవ్య సాహిత్యానికీ, పండితులకూ మధ్య ఏర్పడిన రంధి మొట్టమొదటగా సిద్ధాంత విభేదాల వల్ల ఏర్పడినదిగా కనిపిస్తుంది అక్కిరాజు ఉమాకాన్తమ్ గారు భావకవుల మీద తీసిన దెబ్బ సిద్ధాంత విభేదంతో కూడినదే అయితే భావకవులు దానికి ఎదురు దెబ్బ తీయనవసరం లేకుండానే జయించారు కారణం సాహిత్య పిపాసువులు అత్యధిక సంఖ్యాకులు వారి పక్షాన వుండి పోయారు నవ్య సాహిత్యం పురోగమించిందిగాని మొక్క పోలేదు

తరువాత తెలుగు సాహిత్యంలోకి అభ్యుదయ వాదం వచ్చింది దీన్ని ప్రతిఘటించినవారు విధిగా సిద్ధాంత విభేదాలనే ఆశ్రయించవలసివచ్చింది అందులోనూ రాజకీయసిద్ధాంతాలు

సాహిత్య రంగంలో జరిగే సంఘర్షణలలోకి సాహిత్యేతర సిద్ధాంతాలు రావటం ఒక ''నిమిత్తం'' ఒక శకునం సాహిత్య ప్రభావం ఇతర జీవిత రంగాల మీద ఏర్పడినప్పుడే అటువంటిది జరుగుతుంది ఇది సాహిత్యం యొక్క నూతన పోకడ దృష్ట్యా ఒక విధంగా మంచిది

శతాబ్దాల క్రితం సాహిత్యంలోకి మత సంఘర్షణలు వచ్చినమాట నిజమే జైన, బౌద్ధ సాహిత్యాలు నాశనమైన మాట నిజమే ఇంకా వెనక్కుపోతే వేదాలలోనే కొంత భాగం నాశనమైందని చెబుతారు అయితే, పనితీరిపోయిన సాహిత్యమే నాశనమయింది గాని, నిజంగా పనికి వచ్చే సాహిత్యాన్ని ప్రజలు నాశనం కానివ్వలేదు ఇది నా వ్యక్తిగత విశ్వాసం మాత్రమే ఇదే విధంగా ఆధునిక సాహిత్యాన్ని కులతత్వంతో తిట్టినవాళ్ళున్నారు ''మాల కవిత్వం'' ''శూద్ర కవిత్వం'' లాటి మాటలు నేను కూడా విన్నాను అలాటి తిట్లుపడ్డ రచనలు నాశనం కాలేదు గౌరవం కూడా సంపాదించుకున్నాయి అలాగే ''కమ్యూనిస్టు సాహిత్యం'' ''సంకరం సాహిత్యం'' ''నాస్తిక రచనలు'' అనిపించుకున్న మంచి అభ్యుదయ సాహిత్యం ఏమాత్రమూ దెబ్బతినలేదు పై పెచ్చు ''రష్యా మానస పుత్రులు'' అని ఇతరులను తిట్టినవాళ్ళు తాము కూడా రష్యా మానసపుత్రులు కావటం కూడా జరిగింది వీరేశలింగంగారి రచనలను - ప్రచారాత్మక రచనలను - పండితులు నానాతిట్లుతిడితే ఆ తిట్లు ఆ రచనలకు ఆశీర్వాదాలల్లే పనిచేసి ఆయన పుస్తకాలు ఆకాలంలోనే ఆయనకు వేలకొద్ది రూపాయిలు సంపాదించిపెట్టాయి! కృష్ణ దేవరాయల ఆస్థానంలోని బ్రాహ్మణ కవి పండితులు ''వసుచరిత్ర'' కర్తను చాలా తక్కువ చేసి చూశారని చాటువుల సాక్ష్యం ఉన్నది అది నమ్మదగిన సాక్ష్యం కాకపోదేమో, ఏమైనా ''వసుచరిత్ర''కు వచ్చినన్ని నకళ్లు తరువాత కాలంలో ఏ బ్రాహ్మణ ప్రబంధానికీ వచ్చినట్లు కనబడదు

కృష్ణ శాస్త్రిని తిట్టారు శ్రీశ్రీని తిట్టారు ఇంకా ఎందరినో ఆధునికులను తిట్టారు కేవలమూ అసూయతో తిట్టటం ''సంఘర్షణ'' అన్న గౌరవపదానికి అర్థంలేదు వైషమ్యంలో కూడా హీనాతిహీనం

ఇటీవలి కాలంలో దిగంబర కవులు సంఘర్షణను రెచ్చగొట్టారు దిగంబర కవిత్వం నిజంగా కవిత్వంకాదు అందులో ఇంకేమున్న దన్నా నేను ఒప్పుకుంటాను'' అని నాకు రాసిన ఒక మిత్రుడు మొదలుకుని, వాళ్ళను నక్సలైట్ల కింద చిత్రించి పోలీసుల చేత కాల్పించాలన్నంత

దూరం పోయిన విమర్శకులు కూడా ఉన్నారు వారిలో కొందరు అహింసాయుతంగా విప్లవం సాధించే ఉద్దేశంతో ఉన్నారు కూడాను నక్సలైట్లు చేసేది మాత్రమే హింసగనుకనూ, నక్సలైట్లనూ, నక్సలైట్లుగా పోలీసులకు అనుమానం తగిలినవారినీ కాల్చి పారెయ్యటం హింస కాదు గనుకనూ, వారిలో మన సిద్ధాంత సాలిత్యం చూడరాదు!

ఇది ఇలా ఉండగా ''విరసం'' ఉద్భవించింది అందులో మాజీ దిగంబరులు కనీసం సగం మంది వున్నారు సంఘర్షణ తప్పనిసరి మామూలు సంఘర్షణ కాదు వైషమ్యంతో కూడిన సంఘర్షణ కుక్క కొక చెడ్డపేరు పెట్టి ఉరితియ్యమని ఇంగ్లీషు సామెత విప్లవ రచయితలకొక చెడ్డపేరు పెట్టాలి అందుకుగాను ఎవరి ఉపజ్ఞ వారు ప్రదర్శించాలి

మొట్టమొదట దొరికేది విరసంవాళ్ళు హింసావాదులు తుపాకులు తీసుకొని గెరిల్లా యుద్ధాలు చేసేవారికీ వీరికీ తేడా లేదు ప్రశ్న - శ్రీశ్రీ, కుటుంబరావు స్టెన్ గన్లు తీసుకుని శ్రీకాకుళం పోతారా? సమాధానం ''పాపం వాళ్ళు షష్టిపూర్తి చేసుకున్నారు ఇంకేం పోతారు ''

వీళ్ళు విప్లవం చెయ్యమని ఇతరులను హెచ్చరిస్తారా?'' తాము చెయ్యరా? విరసం సభ్యులు, ఏ కమ్యూనిస్టు (మార్క్సిస్టు లెనినిస్టు) పార్టీ సభ్యులో తెలియక!''

పెట్టుబడిదారు - ఫ్యాక్టరీ యజమాని - తొంభై మందికి తాను చెయ్యని పనులు చెబితే వీళ్ళకు అభ్యంతరం లేదు దానికీ దీనికీ సామ్యం తెస్తున్నానని కాదు ఎక్కడైనా చెప్పేవాళ్ళూ చేసేవాళ్ళూ ఒకరుగా ఉండ నవసరం లేదన్నది కూడా వీళ్ళు గమనించడానికి చెప్పాను

''శ్రీశ్రీ సినిమా పాటలు రాసి బ్రతకటంలేదూ? కుటుంబరావు పెట్టుబడిదార్లను ఆశ్రయించుకుని బతకటం దేనికీ? రావిశాస్త్రి హంతకుల తరఫున వాదిస్తాడటగా?'' ఇటువంటి ప్రశ్నలు వాజలనటం కాస్త కటువుగానే ఉంటుంది గాని, అందులో అసత్యం లేదు పై ముగ్గురూ వర్గ సమాజంలోనే జీవిస్తున్నారు రావిశాస్త్రి సోషలిస్టు సమాజంలో ఉన్నాడే అనుకున్నా ఆయనను దేశద్రోహుల పక్షాన వాదించడానికి సోషలిస్టు ప్రభుత్వమే నియమించవచ్చు!

ఇవన్నీ ఉండగా వ్యక్తి దూషణ ఉండనే వున్నాయి ఫలానావాడు తాగుబోతు ఫలానివాడు జూదగాడు ఫలాన వాడు ముండలమురాకోరు ఈ వ్యక్తి గత విషయాలు రచయితలు అయిన వారిలోను కాని వారిలోను అనేక లక్షల మందిలో ఉండవచ్చు అది ఈ విమర్శకులకు అభ్యంతరం లేదు 'విరసం' లో చేరాడన్నప్పుడే ఇవి బ్రహ్మాండమైన ఆక్షేపణలుగా పైకి వస్తాయి ఎందుకు? నేను చాలా మందిని అడిగాను ఒక్కరూ చెప్పలేదు కాంగ్రెస్ నాయకులలో ఈ పనులు చేసేవారు చాలా మంది ఉన్నారు వారు కాంగ్రెసులో ఉండటానికి పనికి రానివారని నాకు తట్టలేదు ఎందుకంటే, నేను కాంగ్రెసు పార్టీ అభిమానిని కాను గనుక, ''విరసం'' సభ్యులూ, అభిమానులూ కాని వారు విరసం సభ్యులలో ఆదర్శ లక్షణాలు కావాలని కోరటంలో అంతరార్థమేమిటి? ఇది కూడా నాకు తెగనిసమస్యే అవుతున్నది

''ఫలాని విరసం సభ్యుడు సత్యనారాయణ వ్రతం చేసుకున్నాడట, ఫలానాయన తిరుపతికి వెళ్లాడట '' ఈ రకం విమర్శలు ప్రైవేటంత కొట్టిపారేసేవి కాకపోయినా, విరసం సభ్యులు కూడా సంసార జీవితం జీవిస్తున్నారు గనుక వారి భార్యల విశ్వాసాలను పాటించినందువల్ల తప్పు లేదనుకుంటున్నాను విప్లవ సాహిత్యోద్యమం కోసం వాళ్ళ పెళ్ళాలని, అన్నదమ్ములను వెలివేసిన కారణంగా మరింత విప్లవ సాహిత్యం వస్తుందని నేననుకోవడంలేదు లోలోనన్నా

అనుకున్నట్టు తెలిస్తే వారి శానిటీని తప్పక శంకిస్తాను సోషలిస్టు దేశాలలో కూడా వ్యక్తుల మత విశ్వాసాల జోలికి ప్రభుత్వం పోదన్నది అందరికి తెలిసిన సంగతే

ఇదంతా నేను ఆత్మరక్షణకోసం చెబుతున్నానుకోనవసరం లేదు నేను మత విశ్వాసాలను, పూజా పునస్కారాలను ఏనాడో వదిలివేశాను నాకు విశ్వాసం మనిషిలోనే కాని దేవుడిలో లేదు

*ముద్రణ జయశ్రీ, మాసపత్రిక, జనవరి, 1971,*
*(సంక్రాంతి ప్రత్యేక సంచిక)*
*పునర్ముద్రణ సాహిత్యంలో విప్లవోద్యమం, సృజన ప్రచురణ, అక్టోబరు, 1971*

# 17. విప్లవ కథా సాహిత్యం

అభ్యుదయోద్యమం వాసన తగలని రచయితలు పత్రికలకి కథలు రాసినా, సినిమా కథలు రాసినా కూడా మనిషి మనస్తత్వం మారితే సంఘం బాగుపడుతుంది అనే వైఖరిలో ఉండేవారు ఈనాటికీ ఉన్నారు గాని, వాళ్ళని ఎవరూ సీరియస్‌గా తీసుకోవటం లేదనుకుంటాను ఇది ఒక విధమైన సంస్కరణ వాదం

అభ్యుదయ వాదం అవలంబించిన వారిలో కూడా అనేకులు, మార్పు మనిషికి బహిరంగానూ, సామాజిక వ్యవస్థ లోపలనూ వస్తేనేగాని సమాజ స్వరూపం అభ్యుదయకరంగా మారదని గుర్తించికూడా, ఆ మార్పులు తెచ్చే బాధ్యత ఇంచుమించు పూర్తిగా ఇతరులకు - అభ్యుదయ దృక్పథంగల రాజకీయ వర్గాలకు వదిలేసి, జనాన్ని వర్గరహిత సమాజం కేసి సుముఖులను చెయ్యటానికీ, సమాజాన్ని విమర్శించటానికీ ఎక్కువగా పాటు పడ్డారు పారతంత్ర్యం పోయి స్వాతంత్ర్యం వచ్చింది, పెట్టుబడిదారీ పోయి సామ్యవాద వ్యవస్థ, రాజకీయ సంఘర్షణ ఫలితంగా అదే వస్తుంది, సామ్యవాదం వెంబడే వర్గరహిత సమాజమూ, నిరక్షరతా, నిరుద్యోగ దారిద్ర్యాదుల నిర్మూలనా, వైద్య సౌకర్యాలూ, న్యాయమైన ఆర్థిక వ్యవస్థా, దేశం యొక్క అభ్యున్నతీ క్రమంగా వచ్చి దేశం నందనవనమై కళకళలాడుతుంది అని నమ్మారు ఇది ప్రగతివాదం

అయితే ఇదేమీ జరగలేదు స్వాతంత్ర్యం వచ్చింది గాని దానివెంబడి నిరక్షరత పోలేదు దారిద్ర్యం పెరిగింది మాజీ దేశద్రోహ వర్గాలు పాలక వర్గాలతో లీనమైపోయాయి రానురాను అసమానతా, అవినీతి, జీవితంలో సంఘర్షణా పెచ్చుమీరాయి అల్పసంఖ్యాక వర్గాలు అందలా లెక్కాయి హీనంగా ఉన్నవాళ్లు మరింత అణగారి పోయారు 30 ఏళ్ల పోరాట ఫలితంగా లభించిన ఈ స్వాతంత్ర్యాన్ని ఒక వంక డబ్బు సంచులూ, పోలీసు తుపాకులూ సంరక్షించ వలసిన దుస్థితిరాగా, మరో వంక పాత వలస విధానం స్థానంలో నయావలస విధానం వచ్చి దేశాన్ని గావుపట్టు పట్టేసింది

ఈ స్థితిలో రచయితలు విప్లవ వాదాన్ని అవలంబించటం జరిగింది

విప్లవం అన్నది ఊర్ధ్వజ్వాల కిందినుంచి పైకి మండుతుంది విప్లవ సాహిత్యవాదం అన్నది చైతన్య ప్రజల నుంచి పుట్టుకు రావాలని గుర్తిస్తుంది తమ కృషి లేకుండా ఏదో ఒరిగి ఒళ్లోపడుతుందన్న భ్రమ ప్రజలలో లేకుండా చేయటానికి ప్రయత్నిస్తుంది జీవితాన్ని

అమూలాగ్రం విమర్శిస్తుంది కాని ప్రజలకు లేనిపోని ఆశలు పెట్టి, వారి జవసత్వాలను నిద్రపోనివ్వదు

విప్లవ సాహిత్యం కవితలో ఉన్నంత పదునుగా కథలలో ఉండే అవకాశం లేదని యువ కథకుల బాధ రెండు విషయాలు గుర్తుంచుకోవాలి

కవిత్వంలో ఉన్న నినాదాలు కేవల నినాదాలుగా ఎక్కువ సాఫల్యం పొందలేవు వాటి వెంట కూడా వాస్తవమైన, విశ్వసనీయమైన తర్కం ఉండాలి ''విప్లవం చెయ్యి'', అనగానే తుపాకీ తీసుకునేవాడు ఉంటే వాడు, ''దాన్ని అవతల పారెయ్యి!'' అన్నగానే పారేసేవాడుగానే ఉంటాడు

మానవ మనస్తత్వం ఎలా ఉంటుందంటే, హీనుడు తన హైన్యాన్ని వీలయినంత వరకు గుర్తించకుండా తిరుగుతాడు ''యామ'' అనే రష్యన్ నవల గురించి, ''The horror of it is that there is no horror,'' అన్నారు అందులో పడుపు వృత్తి చేసుకుంటున్నవాళ్లు, తాము హేయంగా జీవిస్తున్నామని గుర్తించరు (అలా వేశ్యలు తమను తాము తిట్టుకుంటున్నట్టు చేసే రచనలు పచ్చి అబద్ధాలు!) ఒకవేళ మరీ దుర్భరమైన స్థితిలో తన జీవితాన్ని తానే తిట్టుకోవలసివస్తే నాడు ''ప్రారబ్ధం'' అనో, ''నాకన్న ఇబ్బందిపడే వాళ్లు ఉన్నారు'', అనో మనసును సమాధాన పెట్టుకునేటందుకు తగిన భావాలు వాళ్ల సంస్కృతిలో ఎప్పుడూ ఉంటాయి

ఇలా సమాధానపడే శక్తి ఈనాడు మధ్య తరగతి వాడికి ఉన్నంతగా మరే వర్గానికీ లేదు పైవర్గం వాళ్ళు తమ క్షేమం కోసం హత్యలు చెయ్యటానికి సిద్ధంగా ఉన్నారు కింద వర్గం వాళ్ళు తమ హక్కుల కోసం చావటానికైనా సిద్ధమవుతున్నారు ఈ రెండు వర్గాల వైఖరికీ పారస్పర్యం ఉన్నదన్న సంగతి కూడా గుర్తించలేని గుడ్డి స్థితిలో ఉన్నది మధ్యతరగతి

దురదృష్టవశాత్తు ఈనాడు కథలు రాసే వాళ్లలో అధిక సంఖ్యాకులూ, చదివేవాళ్లలో ఇంకా అధిక సంఖ్యాకులూ ఈ మధ్య తరగతివాళ్లు తమకు కుడి ఎడమల మధ్య జరిగే ఈ సంఘర్షణలో జీవిత వాస్తవం ఉన్నదని మధ్య తరగతికి తెలియజెప్పటం అవసరం మధ్యతరగతి ఆత్మవంచనను, కృత్రిమ విలువలను, దిగలాగుడు మనస్తత్వాన్నీ, తాము తప్పుగా పరిగణించే జీవిత ధోరణులతో రాజీపడి పోరాటంకన్న శ్మశాన శాంతిమేలని భావించే వైఖరినీ తీవ్రంగా ఖండిస్తూ కథకులు కథలు రాయవచ్చు

సాహిత్యం నుంచి విప్లవం పుట్టదు సాహిత్యమూ, విప్లవమూ కూడా జీవితం నుంచి అట్టడుగున ఉన్న ప్రజలనుంచి, పుడతాయి ఈ రెండూ కలిసే కేంద్రం ప్రజా జీవితం ఈ కలయిక సంభవించని నాడు రెంటికీ సంపర్కం ఉండదు

''ప్రజలలో విప్లవ శక్తులు విజృంభించకుండానే జీవితంలో విప్లవ పరిణామాలు వస్తాయి ఈ విప్లవ పరిణామాలను కాంగ్రెసు అభ్యుదయవాదులు తెస్తారు, లేదా మరొక లెఫ్టిస్టుపార్టీ తెస్తుంది'' అనే వారు విప్లవ సాహిత్య వాదాన్ని ఆమోదించరు, వ్యతిరేకిస్తారుకూడానూ

ప్రజల నుంచే విప్లవ చైతన్యం రావాలని నమ్మిన ఏ రచయిత అయినా విప్లవ సాహిత్య రచనకు తనకున్న అవకాశం మేరకు పూనుకోవచ్చు ప్రజలలో విప్లవ చైతన్యం కలిగించటానికి ఏయే శక్తులు ఏయే మేరకు కృషిచేస్తున్నట్టు కనబడితే ఆ శక్తులను ఆ మేరకు సమర్ధించవచ్చు

''విరసం వాళ్ళు సాయుధ విప్లవం కావాలంటారటగా!'' అని ముక్కుమీద వేలేసుకునే వాళ్ళున్నారు శ్రీశ్రీ అన్నట్టు గుడ్డు పగలగొడితేగాని ఆమ్లెట్ రాదు అందులోనూ ఈ

మనదేశంలో ప్రతి స్వల్ప విషయాన్ని నరబలితోనే సాధించవలసిన రాజకీయ పరిస్థితి ఉన్నది భాషా రాష్ట్రాలు అడగటం పెద్ద విప్లవం కాదు భాషా రాష్ట్రాలు ఏర్పడటానికి ఎంతమంది బలికాలేదు!

కాంగ్రెసు మార్క్సు సోషలిజం తీసుకురావటానికి ధనిక వర్గాల పార్టీలతోనూ, మతోన్మాదుల పార్టీలతోనూ ఏకం కావటానికి సిద్ధంగా ఉన్న ''సున్నా'' కాంగ్రెసును చూస్తే ''ష్వీక్'' జ్ఞాపకం వస్తాడు అతను యుద్ధరంగానికి పోతున్నానంటాడు ''యుద్ధరంగం ఇటుంటే నువు అటుపోతున్నావేం?'' ''అంటే, నేనిటే యుద్ధ రంగానికి పోతాను,'' అంటాడు ష్వీక్ హాస్యపాత్ర మన పదవీవ్యామోహ రాజకీయాలని చూసి నవ్వాలనైనా మనకు తట్టటంలేదు

అందుచేత, చెప్పవచ్చిందేమంటే, మధ్య తరగతి జడ్డి మనస్తత్వాన్ని అంటిపెట్టుకుని ఉన్నవిప్లవ విముఖతను వదిలించటానికి కృషిచేసే రచనలకు కూడా విప్లవ సాహిత్యంలో స్థానం ఉన్నది జీవితాన్ని విమర్శించక తప్పదు ఆ విమర్శ వెనక విప్లవంలో విశ్వాసం ఉండటం ప్రధానం

*ముద్రణ సృజన (మాసపత్రిక) ఫిబ్రవరి, 1971*
*పునర్ముద్రణ సాహిత్యంలో విప్లవోద్యమం, సృజన ప్రచురణ అక్టోబరు, 1971*

## 18. సాహిత్యం మీద ప్రభుత్వం దాడి

ప్రజాతంత్రంలో భావప్రకటనా స్వాతంత్ర్యం విధిగా ఉంటుందని సిద్ధాంతం కమ్యూనిస్టు దేశాలలో భావ స్వాతంత్ర్యం ఉండదనీ, అందుచేత కమ్యూనిజం కన్న ప్రజాతంత్రం గొప్ప దనీ వాదం ఈ సిద్ధాంతాన్నీ, వాదాన్నీ పదేపదే స్మరణచేసేవాళ్లు ఒకటి గమనించరు అల్ప సంఖ్యాకవర్గం అధిక సంఖ్యాకులను పాలించేటప్పుడు భావ ప్రకటనా స్వాతంత్ర్యం లేకపోతే సాంఘిక పరిణామం స్తంభించిపోతుంది కమ్యూనిజం అవలంబించిన దేశాలలో ప్రజలే పాలకవర్గం అయినప్పుడు భావ ప్రకటనా స్వాతంత్ర్యం పేరిట అల్పసంఖ్య గలవాళ్లు సమాజ వికాసానికి అడ్డుపుల్లలు వేస్తారు

ఇంతకన్న ముఖ్యమైనదేమంటే అసమ సమాజంలో ప్రజాతంత్రం ఉండదు అది బూటకపు మాట ప్రజాతంత్రం అమలు జరిగినట్టయితే మనదేశంలో ప్రజలు ఇంత అధోగతిలో ఉండరు, వారి పైన పోలీసులు ఇంతగా విలయతాండవం చెయ్యరు, 'మేము మీకు సోషలిజం తెచ్చి ఇస్తాము'' అని ఎలెక్షన్ల సంరంభంలో పాలక వర్గీయులు ప్రజలకు చెప్పరు సోషలిజం, విప్లవంలాగే ఎక్కడినుంచో దిగుమతి చేసేదీ, ఒకరు ఇచ్చేదీ కాదు, ప్రజలేదాన్ని పోరాడి తెచ్చుకుంటారు ప్రజలలో చైతన్యాన్ని పెంపొందించేవారే సోషలిజంకు దోహదం చెయ్యగలరు విప్లవం లేకుండా సోషలిస్టు వ్యవస్థ ఏర్పడదు ఎక్కడా ఏర్పడలేదు - కొంతమంది కుత్సితపు బుర్రల్లో తప్ప ప్రజల ప్రమేయం లేకుండానూ, శాంతియుతంగానూ సోషలిస్టు వ్యవస్థ ఏర్పరుస్తామని వాగ్దానాలు చెయ్యటంకన్న ప్రజా ద్రోహం మరొకటి లేదు

ఈ సంగతి సామాన్య ప్రజలకందరికీ తెలుసునా? తెలుసునని నాకు అనుకోవాలనే ఉంది కాని అది ఆత్మవంచన అవుతుందని భయపడుతున్నాను కాంగ్రెసు అబద్ధాలాడిందని

తెలిస్తే అంత భారీగా కాంగ్రెసుకు ఓట్లు పడవు అయినా ఎన్నికలలో వోటు వెయ్యని సుమారు 46 శాతం వోటర్లకు రాజకీయ పరిజ్ఞానం ఉండవచ్చునని ఆశిస్తున్నాను

విద్యార్థులలోనూ, యువకులలోనూ కూడా నాకు విశ్వాసం ఉన్నది దానికి కారణం చెబుతాను చాలాచోట్ల సాహిత్య సభలలో కవితా పఠనమూ, ఉపన్యాసాలూ జరిగినప్పుడు ప్రేక్షక శ్రోతలు విప్లవకవిత్వాన్నీ విప్లవ భావాలనూ హర్షించినట్టుగా వెనకపీకుడు కవిత్వాలను హర్షించ లేదు గాంధీతత్వం బోధించ జూచిన కవులను "పాడ" నివ్వకుండా దింపెయ్యటం జరిగింది ఇది ఒకచోట కాదు వందచోట్ల జరిగింది జరుగుతున్నది

ఇందుకేమిటి కారణం? ఈ విప్లవ సాహిత్యాన్నీ, విప్లవ భావాలనూ హర్షించే లక్షలాది యువకులూ, యువకులు కానివాళ్ళూ, విద్యార్థులూ, రాజకీయంగా మార్క్సిస్టు - లెనినిస్టులు కాకపోవచ్చు కాని వాళ్లు మానసికంగా విప్లవ సాహిత్యాన్ని విప్లవ భావాలనూ స్వీకరించి, వాటిద్వారా చైతన్యం పొందటానికి సిద్ధంగా ఉన్నారు అంతేకాదు, వాళ్లకు పాండురోగపు సాహిత్యం అవసరం లేదు వ్యష్టిగా వాళ్లు సెక్సు సాహిత్యమే చదివినా, సమిష్టి మీద వాళ్లకు కావలసినది విప్లవ సాహిత్యం విప్లవ సాహిత్యాన్ని ప్రతిఘటించే వాళ్లు అల్ప సంఖ్యాకులు అత్యల్ప సంఖ్యాకులని కూడా చెప్పగలను వారిలో పలాయనతత్వమో, స్వార్థమో, అసూయో, పచ్చి అజ్ఞానమో ఉన్నట్టు రుజువు చెయ్యటం కష్టం కాదు విప్లవ సాహిత్యం సృష్టించే వారికీ, ప్రచారం చేసే వారికీ ఇలాటి మానసిక వ్యాధులు లేవు ఉండే అవకాశం కూడా లేదు నక్సలైట్లకు స్వార్థం అంటగట్టడం ఎంత అసమంజసమో, విప్లవ సాహితీపరులకు ulterior motives అంటగట్టడం కూడా అంత అసమంజసమే అమాయిక మనస్తత్వం గల వాళ్లు స్వార్థాన్ని సహించి అర్థం చేసుకున్నట్టుగా నిస్వార్థాన్ని అర్థం చేసుకోలేరు ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వాలను ప్రతిపక్షాలు కూలదొయ్యటానికి అవాచ్యపు పనులెన్ని చేసినా అదంతా సబబుగానే కనపడుతుంది బూర్జువా పరిపాలన అంతం కావాలనటం మటుకు రాజద్రోహం! ప్రజలే పాలకులు కావాలన్నది దేశ ద్రోహం!

ఇలాటి ఆరోపణలతో ఆంధ్ర ప్రభుత్వం విప్లవ సాహిత్యం మీద దాడి ప్రారంభించింది దేశానికి సోషలిజం తెచ్చి, నిరుద్యోగాన్నీ, దారిద్ర్యాన్నీ, అసమానతలనూ తొలగిస్తామని వాగ్దానాలు చేసే పార్టీ పరిపాలించే చోట సోషలిజం కావాలనీ, దారిద్ర్యాన్నీ జీవితం కుళ్లునూ ప్రజలే తొలగించుకోవాలని హెచ్చరించే సాహిత్యం మీద ఏ మొహం పెట్టుకుని దాడి సాగించింది? ఈ సాహిత్యాన్ని చూసి దేనికి గుండెదడ? విప్లవ రచయితల ఇళ్ళమీద అర్ధరాత్రి దాడులూ, సోదాలూ దేనికి? ఇటువంటి పనులు బ్రిటిషు పరిపాలనలో కొంత అర్థం ఉన్నది బ్రిటిషు వాళ్ళు మనకు భావ స్వాతంత్ర్యమూ, సోషలిజమూ ఇస్తామని వాగ్దానాలు చెయ్యలేదు, మనం ప్రజాతంత్రానికి కూడా పనికిరామని సర్టిఫికేటిచ్చారు!

విప్లవ సాహితీపరులను "నక్సలైట్లు" అని ఆంధ్ర ప్రభుత్వం అంటున్నది సాహిత్యోద్యమానికీ రాజయోద్యమానికీ చుట్టరికం ఉంటుంది కాని రెండూ ఒకటి కాదు ఆంధ్ర ప్రభుత్వానికి రాజకీయోద్యమాలను గురించీ, సాహిత్యోద్యమాలను గురించీ కూడా తెలియదు లాగుంది విప్లవ రచయితలు ఇతర సాహిత్యోద్యమాలకు రాజకీయ బిరుదులు ఎన్నడూ తగిలించరు విరసం పుట్టే సమయంలోనే అభ్యుదయ సాహిత్యోద్యమం కొత్త

మేకప్ చేసుకుని ముందుకు వచ్చింది కాంగ్రెసు మంత్రులు దాన్ని ఆశీర్వదించారు గదా అని దాన్ని ఎవరూ కాంగ్రెసు సాహిత్యోద్యమం అనలేదు అతకని పేర్లు పెట్టేవారు మూఢులను మోసపుచ్చవచ్చు కాని తమ కుళ్లుకంపు మాత్రమే బయట పెట్టుకుంటారు

''ఝుంఝు''లో సైన్యంలో చేరవద్దని హెచ్చరిక ఉన్నదని ఒక ఆక్షేపణ, రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతుండగా చార్లీచాప్లిన్ ''గ్రేట్ డిక్టేటర్''లో సైనికులను యుద్ధం చెయ్యవద్దని హెచ్చరిస్తాడు తీవ్రంగా యుద్ధం జరుగుతుండగా కూడా ఆ చిత్రం నడిచింది దాన్ని ఎవరూ నిషేధించలేదు! సైన్యంలో చేరే వారిని వద్దని చెబుతూ కవిత్వం రాస్తే కూలిపోయే విషమ దశలో ఉన్నదా ఆంధ్ర ప్రభుత్వం! ఇలాటి చర్యలు చూస్తే ఈ దేశాన్ని ఏ మతిమాలిన వాళ్లు పరిపాలిస్తున్నారో అర్థం కాదు

రచయితలూ, కవులూ అన్న తరువాత వాళ్లు అంతో ఇంతో మేధావులుగానే ఉంటారు ఎలెక్షను ప్రచారాల మీటింగుల్లో మాట్లాడేటప్పుడు రాజకీయ నాయకులు భాగవతార్ల వైఖరి అవలంబించటమే ప్రమాదకరంగా ఉన్న ఈ కాలంలో రచయితల పట్ల కాస్త గౌరవం ఉంచటం శ్రేయస్కరం ప్రజాస్వామ్య రాజకీయ ఆదర్శాలను తోసిపుచ్చి, తమకు నచ్చని రచనలు చేసే మేధావులను దొంగల్లాగానూ, కేడీలలాగానూ చూడదలుచుకున్నప్పుడు ఈ రచయితల వెనక ప్రజలున్నారనీ, పాలకులకూ పాలితులకూ మధ్య ఉండే బంధం కన్న చాలా దృఢమైన బంధం ప్రజా కవులకూ ప్రజలకూ మధ్య ఉన్నదనీ, తమ గుండెదడకు మూలకారణం ప్రధానంగా అదేననీ, ప్రజల మేలు తప్ప రచయితకు మరొక ఆశయం ఏమీ లేదని గుర్తుంచుకోవటం మంచిది

ఫాసిస్టు పద్ధతులు అవలంబించదలచిన పాలకులు చరిత్రను సింహావలోకనం చేసుకోవటం మేలు నిజాన్ని ఏనాడూ ఎవరూ అణచలేకపోయారు సూర్యుడి చుట్టూ భూమి తిరుగుతున్నదన్నందుకు ఆ మాట అన్న వాళ్లను సజీవంగా తగలబెట్టిన వాళ్ళను చరిత్ర గాడిదలను చేసింది జర్మను, ఇటలీ ఫాసిస్టులు సోదిలోకి లేకుండా పోయారు అమెరికను ఫాసిస్టులు ఇండో చీనాలో ఉడ్డుగుడుచుకుంటున్నారు, అమెరికను మేధావుల చేతనే తిట్లు తింటున్నారు ఫాసిస్టుతత్వంలో అంధత్వం ఉన్నది అందుచేతనే ఫ్రెంచి వాళ్ళను చూసి అమెరికనులు గుణపాఠం నేర్చుకోలేకపోయారు గాంధీ వారసులమని చెప్పుకునే వాళ్లు ఫాసిస్టులకు వారసులు కావటానికి ఉబలాటపడటం చిత్రం!

ఈ దేశంలోని పాలక వర్గాల క్షేమం కోరవలసిన అవసరం లేకపోయినా వారి క్షేమం అవ్యాజంగా కోరి చెబుతున్నారు మీరు నిత్యమూ వర్ణించే ప్రజాస్వామ్యాన్ని చేతలలో గౌరవించండి తిరుగుబాటు చేస్తున్న వారు చావుకూ, బతుకుకూ మధ్య సరిహద్దు చెరిగిన వాళ్లనీ, వాళ్ళు అవలంబించేది ప్రతిహింసే గాని హింస కాదనీ గుర్తించండి మీకు నిజంగా అహింసలో విశ్వాసం ఉన్నట్టయితే జీవితంలో ఉన్న దారుణ హింసను గుర్తించి, దాన్ని తుపాకులతో కాపాడటం మానండి విప్లవం అనే మాటను తేలుమంత్రంలాగా వాడకండి మీరు నిజంగా విప్లవ పరిణామాలు తెచ్చే సద్బుద్ధి గల వారైతే విప్లవం కోసం సకల కష్టాలను ఎదుర్కొనే వారి మీద దాడులు మానండి ప్రజా జీవితంలో విప్లవ చైతన్యం మందకొడిగా

ఉండటాన్నీ, వారిలో రాజకీయ పరిజ్ఞానం హీనదశలో ఉండటాన్నీ మీ స్వార్థానికి వినియోగించుకుని ప్రజలను మభ్యపెట్టకండి

ఇవేవీ మీరు చేయరు మీకసలు విప్లవకరమైన కార్యక్రమం లేదు ఆర్థికంగానూ, సామాజికంగానూ మన దేశం అపహాస్యంపాలు అవుతుంటే మీకు పట్టలేదు ఆసియావాసులను ఆసియా వాసుల చేత చంపించి డివిడెండ్లు సంపాదించే అమెరికా ఆశయానికి మీరు ఆలోచించిన విరుగుడు ఏమిటి? ఉన్న అక్షరాస్యులకే ఉద్యోగాలు లేకుండా ఉంటే చదువుకునే వాళ్లకు విద్యా సంస్థలలో సీట్లు లేకుండా ఉంటే, మీరు దేశంలో నిరక్షరత లేకుండా ఏం చెయ్యగలరు? మన దేశపు ఆస్పత్రులలో చికిత్స కోసం చేరే వారిని అధికారులు అధమతరగతి పౌరుల కింద చూడకుండా మీరేం చెయ్యబోతున్నారు? (డబ్బున్న వాళ్ళు ప్రైవేటు నర్సింగ్‌హోములకు పోయి వేలకువేలు చెల్లిస్తారు ) రోజుకు రూపాయి సంపాదించలేని కోట్లాది జనం సమస్య మీరు ఏ విధంగా తీర్చబోతున్నారు? మీకు పనికివచ్చే కార్యక్రమం ఏదీ లేదు మా విరసం రచయితలు ప్రజల తిరుగుబాటు మీద నమ్మకం పెట్టుకున్నారు చాతనయితే దాన్ని అబద్ధం చెయ్యండి దేశంలో విప్లవ పరిణామాలు రావటం మాకు ప్రధానం అవి ఎవరు తెచ్చినా మేము ఆహ్వానిస్తాం వాటిని ప్రజలే సాధించగలరని మా దృఢ విశ్వాసం మీకు లేకపోవచ్చు, మాకు ప్రజలలో విశ్వాసం ఉన్నది మీకు వాళ్ల వోటులోనే విశ్వాసం ఉండిన పక్షంలో ఎప్పటికైనా దెబ్బతింటారు మీ రాజకీయాలు ప్రస్తుతం ఫార్సు తప్ప మరేమీ కాదు రాజభరణాలు రద్దు చెయ్యటానికి మీకు ఒక్క వోటు తక్కువయింది? ఎవరికీ మెజారిటీ లేని చోట నాలుగు సీట్లున్న వాళ్లు గూడుపురాణీలో విజయం సాధించి ప్రభుత్వం ఏర్పాటు చేస్తున్నారు! ఇటువంటి రాజకీయాలను మేము ఆదరించలేం ప్రజలను ఆదరించవద్దని హెచ్చరించే నైతిక హక్కు మాకున్నది మా అభిప్రాయాలు మీకు చేదుగా ఉంటే మమ్మల్ని ''బయటి ప్రతిపక్షం''గా తీసుకోండి ఏ ప్రతిపక్షం మీద దాడి చేసి మీరు మీ రాజకీయ ఆదర్శాలను నిలబెట్టుకోలేరు ఇది ముమ్మాటికి నిజం

*ముద్రణ సృజన, మాసపత్రిక ఏప్రిల్ 1971*
*పునర్ముద్రణ 1 రాయలసీమ, వారపత్రిక 22-5-1971*
*2 సాహిత్యంలో విప్లవోద్యమం, సృజన ప్రచురణ, అక్టోబరు 1971*
*3 సృజన, నూరో సంచిక, ఫిబ్రవరి 1980*
*4 సృజన సంపాదకీయాలు, పెర్స్పెక్టివ్స్ ప్రచురణ, జనవరి 1990*

# 19. తక్కువ రకం రచనలు

అందరు కళాకారులలోనూ శ్రేణులుంటాయి అందరూ అత్యుత్తమ నవలాకారులూ, అత్యుత్తమ కధకులూ, అత్యుత్తమ కవులూ, అత్యుత్తమ గాయకులూ, అత్యుత్తమ చిత్రకారులూ, అత్యుత్తమ నటులూ అనిపించుకోలేరు అందులోనూ కళలకు నకిలీ గీటురాళ్లు పుష్కళంగా ఉన్న ఈనాటి మన సంస్కారంలో కళాకారుల తారతమ్యాలు నిర్ణయించటం మరీ కష్టం కవిత్వాన్ని ఏమీ అనలేని స్థితిలో కవియొక్క వ్యక్తిగత జీవితాన్ని తూర్పారబట్టే విమర్శలు మనం చూస్తున్నాం పబ్లిసిటీ ఊదరతో అత్యుత్తమ కళాకారుడనిపించుకోవటం కూడా ఈనాడు సాధ్యమే కొన్ని వాతావరణాలు భూతద్దాలలాగే కళాకారుడి విశిష్టతను అనేక రెట్లు చేసి చూపుతాయి అలాటి వాతావరణాలను సినిమాలూ, రేడియోలు, విశేష వ్యాప్తి గల పత్రికలూ సమకూర్చుతున్నాయి ఇటీవల కృష్ణశాస్త్రి గారిని, "ఫలాని సినిమాలో పాటలు రాసింది మీరేనా?" అని అభినందనపూర్వకంగా అడిగారట!

**Industrial reserve army** లాగా **reserve cultural army** కూడా ఉన్నది రాసే వారిలోనూ, పాడేవారిలోనూ, నటించటం నేర్చినవారిలోనూ, నృత్యం అభ్యసించినవారిలోనూ ఏ శాతం ప్రజలకు పరిచయం అవుతున్నది? ఎవరూ అంచనాలు వెయ్యలేదు గ్రే తన ఎలిజీలో అజ్ఞాత మిల్టన్‌లనూ, షేక్స్‌పియర్‌లనూ కీర్తించాడు ఏ సినిమా పాట అయినా వింటుంటే, " ఇంతకన్న బాగా పాడగలవారు అజ్ఞాతంగా ఎందరున్నారో!" అనిపిస్తుంది పెట్టుబడిదారీ సంస్కృతి గొప్ప ప్రతిభను పైకి తెస్తుందన్న నమ్మకం ఒకటి ఉన్నది అది మూఢనమ్మకం ప్రతిభను అణగద్రొక్కటానికి పెట్టుబడిదారీ సంస్కృతిలో ఉన్న సదుపాయాలు మరే సంస్కృతిలోనూ లేవేమో అందుచేతనే, పెట్టుబడిదారీ సంస్కృతికి పరాకాష్ఠ అనదగిన సినిమాలలో ఏ రంగంలో చూసినా ఒక కొత్త వ్యక్తి రావటానికి అయిదు నుంచి పదేళ్ల దాకా పడుతున్నది అది అలా ఉండగా, సినిమా కళాకారులలో ఉత్తములెవరు అన్న విషయమై బుర్రలు పగులగొట్టుకునేటంత అభిప్రాయభేదాలున్నాయి

దీనికి కారణం కళలకు నకిలీ గీటురాళ్లు మాత్రమే కాదు - ఒక స్థాయిలో ఏ గీటురాయీ లేకపోవడం కూడాను ఒకప్పుడు, ఎవరు గొప్పకవి అన్న దాన్ని గురించి ప్రతివాడికీ అభిప్రాయం ఉండేది కాదు, అభిప్రాయం ఉండదగిన వాళ్ళే అభిప్రాయం చెప్పే వాళ్లు అలాగే గాయకులను గురించీ, నటులను గురించీనూ ఒక అపూర్వమైన ప్రతిభావంతుడైన కళాకారుడు అవతరించినప్పుడు ఆ విషయం వెంటనే తెలుసుకోగల వాళ్లు బహుశా ఏ అయిదారుగురో ఉంటారు వారి అంచనాను ఆమోదించే వారు వందల సంఖ్యలో ఉండవచ్చు ఆ కళాకారుడి ఖ్యాతి వేల మందికి పాకేసరికి చాలా కాలం పట్టేది

ఇప్పుడు అదంతా పోయింది ఇవాళ ఒక సినిమా విడుదల అవుతుంది రేపు, ఆ చిత్రంలో ఒక పాత్ర ధరించిన ఒక కొత్త వ్యక్తికి అంతులేని ఖ్యాతి రావచ్చు ఆ చిత్రం నడుస్తూండగానే ఆ వ్యక్తికి అరడజను బుకింగులు రావచ్చు ఇది సంభవమూ, సాధ్యమూ మాత్రమే కాదు జరిగింది ఆ వ్యక్తి ప్రతిభను నిర్ణయించినది ఎవరు? సాధారణ సినిమా

ప్రేక్షకులు వాళ్ళ అర్హతల ప్రసక్తి లేదు ఆ సినిమా చూడటానికి వాళ్లు టికెట్లు కొనటమే వారి అర్హత వాళ్ళకు నచ్చిన వ్యక్తి రేపు మరొక సినిమాలో కనిపిస్తే వాళ్ళంతా వచ్చి చూసి ఆ సినిమాకు డబ్బులిస్తారు

ప్రజాస్వామ్యంలో ప్రజలే తమకు హెచ్చుగా నచ్చే కళలను ఎన్నుకోవటంలో తప్పేమిటని అడగవచ్చు పెట్టుబడిదారీ సంస్కృతిలో కళలు ప్రజాకళలుగా రూపొందటం సాధ్యం కాదు పెట్టుబడిదారీ కళలకు వాపే గాని బలుపు ఉండదు కొంచెం ఆలోచిస్తే ఇది నిజమని ఎవరికైనా తెలుస్తుంది

మళ్లీ సినిమాలనే తీసుకుందాం ఏ పాత్రనైనా ధరించి క్యారెక్టర్ యాక్టర్ అనిపించుకోగల వాడు సినిమాలకు అవసరం లేదు ఈ సంగతి చాలా మందికి తెలియలేదు ఫలాని నటుడు ఏ తరగతి పాత్రతో మొట్టమొదట జనాన్ని బలంగా ఆకర్షిస్తే ఆ తరగతి పాత్రలతోనే అతను నాలుగు కాలాల పాటు నిర్మాతలకు డబ్బు చేసి పెట్టగలడని సినిమా పెట్టుబడిదారి సంస్కృతి చెబుతుంది

ఈ పద్ధతి చెరుకు నుంచి రసం తీసే పద్ధతి పెట్టుబడిదారీ సంస్కృతిలో కళాకారుడు ఆత్మహత్య ద్వారానే ఉన్నతికి రాగలడు ఒక నటుడు ఒకటి రెండు దశాబ్దాల కొద్ది కాలంలో 200 పాత్రలు, ఇంచుమించు ఒకే రకానివి ధరిస్తాడు ఒక ప్లేబాకు గాయకుడు రెండువేల పాటలు పాడతాడు ఒక మ్యూజిక్ డైరెక్టర్ మూడువేల పాటలకు స్వరకల్పన చేస్తాడు ఈ పద్ధతి కళాకారుణ్ణి పీల్చి పిప్పిచేసే పద్ధతి కాక మరేమిటనిపించుకుంటుంది? వాపు అనక దీన్ని బలుపు అంటారూ?

నిజంగా ప్రజలకు ఉపకరించే కళలు ప్రజల కళావసరాలను పురస్కరించుకుని ముందుకు సాగుతాయి అవి పెట్టుబడిదారీ నుంచి దగాపడిన వారికి కావలసినవి ఇవే కళలు ఒక దశలో వారు ఎంత కొద్ది సంఖ్యలో ఉన్నా, వారి సంఖ్య పెరిగి తీరుతుంది వారి కోసం 'వాస్తవమైన కళలు' సజీవంగా ఉండాలి వాటిని గుర్తించే వారు, వాటి వ్యాప్తికి దోహదం చేసే వారూ ఉండాలి ఇది కనీసావసరం

అలాటి వారు సమాజంలో ఉంటూనే ఉన్నారు దానికి సందేహం ఏమీ లేదు అయితే అటువంటి వారికి కళలకు చెందిన తాత్విక దృష్టి ఒకటి అవసరమని నేను అనుకుంటున్నాను అది చాలామందిలో లోపించిందని కూడా నాకు అనిపిస్తుంది

పురోగామి భావాలు కల వారు ఒక సమాజంలో వ్యక్తుల వంటి వారు ఒక కుటుంబంలో వ్యక్తులకున్నట్టే ఈ సమాజంలో వారికి కూడా అనేక విషయాలలో తేడాలుంటాయి ఈ తేడాలు విచ్ఛిత్తికి కారణం కారాదు

పురోగమనం కళలకు అతి ముఖ్య లక్షణం అని నిర్ణయించుకున్నాక, ఆ లక్షణానికి విరుద్ధంగా ఉండే కళలను తీవ్రంగా ఖండించవచ్చు వాటిని పూర్తిగా నిషేధించవచ్చు కాని అత్యున్నతమైన ఆశయంతో వెలువడే వాటిని - పురుగేరుతూ కూర్చోవటం పచ్చి బూర్జువా సంస్కృతి లక్షణం కళాకారులను పురుగేరుతూ వచ్చి, చిట్టచివరకు ఏ ఒక్కణ్ణో కొండ కొమ్మున నిలబెట్టటం పెట్టుబడిదారీ కళాపారిశ్రామికుల ధనార్జన పోటీలో చెల్లుతుంది అది క్షయ లక్షణం మరణానికి దారి తీస్తుంది

కాని ఉన్నతాశయాలూ, సాంఘిక పురోగమనమూ కాంక్షించే వారికి వెయ్యి గొంతులు ఏకం కావాలి ఎంత బలహీనమైన గొంతైనా అది ''మనదే'' అన్న మమత ఉండాలి అన్నీ బలమైన గొంతులుండవు ఏ సాహిత్యంలోనైనా రచయితల మధ్య తారతమ్యాలుంటాయి ముందు శ్రేణిలో చాలా కొద్దిమందే ఉంటారు మిగతా వారి మాటేమిటి?

బూర్జువా సంస్కృతిలో వ్యక్తి ఆనందం మించిన ఆశయం ఉండదు ''నాకు గొప్ప అనిపించిన కవి రాస్తేనే చదువుతాను నాకు గొప్ప రచయితగా తోచిన వాడి నవలలే చదువుతాను నాకు గొప్ప గాయకుడనిపించిన వాడి పాటే వింటాను - '' ఈ ధోరణిలో ప్రజా కళలు అభివృద్ధి కావు ఏనాడూ కాలేదు ప్రతి యుగంలోనూ వచ్చిన ఉత్తమ కళలు ప్రజలను ఏకం చేశాయి గాని, విడనీయలేదు అదే వాటికి అప్పట్లో ఉండిన బలం

రచనలలో తారతమ్యాలు ఎలాగూ ఉంటాయి వీటిని గురించి విమర్శకుడికి ఉండే భావాలే ప్రజలకూ ఉంటాయనుకోవటం భ్రమ, రచనలలో ఉండే పాటి వ్యత్యాసం, ప్రజల గ్రహణశక్తిలోనూ ఉంటుంది ఆశయశుద్ధి గల రచన ప్రజలలో ఏదో ఒక స్థాయిలో ఉండే వారికి అందితీరుతుంది మన విమర్శకులు(కొందరు) విషయంకన్న విధానం ముఖ్యమనుకునే అపోహ వదిలించుకోవాలి మనకందరికీ అంతో ఇంతో బూర్జువా సంస్కృతీ మాలిన్యం ఉన్నది అది ఒకంతట వదలదు '' ఇందులో కవిత్వం లోపించింది ఇక్కడ వాక్య నిర్మాణం కుంటుపడింది ఈ పంక్తి బాగా ధ్వనించటం లేదు '' అనే ధోరణి నుంచి మన విమర్శకులు పూర్తిగా బయటపడకపోవచ్చు కాని వాటిని ప్రచారం చేసి తమ పరిశీలనాశక్తిని లోకానికి చాటటానికి తహతహలాడటం చాలా అనవసరమనుకుంటున్నాను

సాహిత్య ఉద్యమాలు ఎంతలో చప్పున ఆకాశం ఎత్తు పెరిగేదీ, ఎంతలో తీసిపోయేదీ నేను నాలుగు దశాబ్దాలుగా చూస్తున్నాను ఉద్యమం మందకొడిగా ఉన్నప్పుడు దాన్ని ప్రాణంతో కాపాడిన రచయితలే నా ఉద్దేశంలో నిజమైన మహా రచయితలు వినే వాళ్ళు తక్కువవుతున్నట్టు కనబడగానే, అంతదాకా అందరికన్న గట్టిగా బాకా ఊదినవాడు బాకా అవతల పారేసి, అదే బాకాను తమకున్న శక్తితో ఊదయత్నించే వారిని ఎదిరించేవాడు వట్టి పాపిష్టివాడు అలాటి వాళ్లంతా సినిమా రంగానికి పోయి పిప్పి కావటం మంచిది

ఇవాళ తెలుగు సాహిత్యంలోకి విప్లవోద్యమం వచ్చింది ఇది రావణుడి కాష్టం విప్లవం వచ్చేదాకా ఇది కొనసాగితీరుతుంది దీని జ్వాలలు ఒకప్పుడు తక్కువగా వుండవచ్చు ఒకప్పుడు పెద్దగ ఎగయవచ్చు కాని ఇందులో వేసే ప్రతి చిన్న కట్టె కూడా పవిత్రమయినది ఆ విషయం విమర్శకులు గుర్తుంచుకోవాలి తారతమ్యాలు సరిచేయటానికే విప్లవం ాావాలి లేని పక్షంలో విప్లవం వచ్చినా ఒకటే, మానినా ఒకటే అలాటప్పుడు విప్లవ రచనలలో తారతమ్యాలను పని పెట్టుకొని ప్రచారం చెయ్యటం తప్పని నాకు తోస్తుంది ఈనాడు వచ్చే విప్లవ కవిత్వమూ, విప్లవ కథలూ సమమైన చైతన్యం నుంచి పుట్టినవి కావు సమంగా చైతన్యాన్ని రేకెత్తించేవీ కావు కాని అన్నీ ఒకే చరమాశయం గలవి విమర్శకులు వాటిని, లెన్సు సూర్యకిరణాలను కేంద్రీకరించి అగ్నిని పుట్టించినట్టు, కేంద్రీకరించి చైతన్యాన్ని వృద్ధిపరచాలి

*సృజన, మాసపత్రిక, 1971 ఆగస్టు*
*పునర్ముద్రణ సాహిత్యంలో విప్లవోద్యమం,*
*సృజన ప్రచురణ, 1971 అక్టోబరు*

# 20. కాగితపు పులులు

నేను ''బకాసుర'' రాసేనాటికి ''కాగితపు పులి'' అన్న మాట వినలేదు కాని బకాసురుణ్ణి ముసలి వాణ్ణి గాను, కళ్ళకు పొరలు కమ్మిన వాణ్ణిగానూ చిత్రించేను ఇందుకు కొందరుమాత్రులు ఆక్షేపణ తెలిపారు ఈ లాటి వాణ్ణి చంపడంలో భీముడి గొప్ప ఏముందన్నారు

నిజానికి, నేను భీముడి హీరోయిజం చూపటానికి ''బకాసుర'' రాయలేదు రియాక్షన్ అనేది ముసిలిగానూ చత్వారం గలది గాను ఉంటుందని తప్పనేను ఊహించుకోలేను ఆక్షేపించిన మిత్రులతో ఆమాటే అన్నాను

చిన్నతనంలో నా ఎదుట హేతురహితమైన విశ్వాసాలు చెప్పిన వాళ్ళంతా ముసలివాళ్లు వాళ్ళు వయసులో, చూడటానికి కూడా గతించిన కాలానికి ప్రతినిధుల్లాగే కనిపించే వారు ఎవరన్నా వయసు మళ్ళినవాడు ' ఆధునిక' భావాలు పలికితే, నాకు ఆ మనిషిలో యౌవనమూ, ధైర్యమూ కనిపించి ఆనందం కలిగేది చెళ్ళపిళ్ళవారు వ్యావహారికం రాస్తే అందులో నాకు యౌవనం కనిపించేది వీరేశలింగంగారి స్వీయ చరిత్ర చదివినప్పుడు ''వృద్ధుణ్ణని చెప్పుకుంటాడు గాని ఆయన కన్న ముసలి వాళ్ల పాతికేళ్ళ వాళ్ళలో ఎందరు లేరు? ఆయనతో పోలిస్తే వాళ్లంతా ఎంత పిరికి వాళ్ళు!'' అనుకునేవాణ్ణి

చెప్పొచ్చిందేమంటే, నేను నా జీవితమంతా కాగితపు పులుల చూస్తూనే వస్తున్నాను ఏనాడో 'మొండివాడు'' కథ రాసినప్పుడే నాకు ధైర్యం గల వాళ్ళంటే యిష్టం విరసం రచయితలు జీవితంలో ఎదురయ్యే కాగితపు పులులను గుర్తించాలి, బయటపెట్టాలి తమ రచనల ద్వారా జాతికి యౌవనమూ, ధైర్యమూ ఇవ్వాలి చత్వారమూ, ముసలి బుద్ధులూ గలవాళ్ళను అణచి పారెయ్యకుండా సామాజిక విప్లవం రాదు విప్లవానికి అడ్డంగా ఉండేదివాళ్లే వారి వెనక పైశాచిక శక్తులు ఉంటాయి బకాసురుడికి అండగా ఏకచక్రపుర రాజ్యాంగం ఉన్నట్టు అవి రక్తపాతం కలిగించగలవు అనేక దారుణాలు చెయ్యగలవు కాని అవి కూడా కాగితపు పులులే ఆ సంగతి గ్రహించటానికి యువకత్వమూ ధైర్యమూ కావాలి ఒక జాతి అంతా భీమసేనుళ్లు కావాలి అలాంటి జాతిముందు కాగితపు పులులు ఎగిరిపోతాయి

విరసాన్ని వ్యతిరేకించేవారు ఎంతసేపు చెప్పినా ఏం చెబుతారు?

కాగితపు పులులను రెచ్చగొట్టవద్దంటారు

రక్తపాతం చేసే హక్కు కాగితపు పులులకే తప్ప పీడిత ప్రజలకు ఉండదంటారు

కాగితపు పులుల ఆనందం కోసం జోల పాటలు పాడమంటారు

విప్లవాలు చేయవలసిన వాళ్ల జీవితాలలోకి తొంగి చూడవద్దనీ, అక్కడ ఆనందమూ అందమూ లేవనీ అంటారు అందమూ, ఆనందమూలేనిచోటనేగదా వాటిని ప్రతిష్టించాలి?

కాగితపు పులులను అణచకుండా ఆ పని జరగదు గద?

విప్లవరచయిత అయినవాడు పిరికి మందు తాగడు గద?

అందుచేతవారు అన్నిరకాల కాగితపు పులులనూ, సైజుల వారీగా నిర్మూలిస్తూ ప్రజలను చైతన్యవంతులను చేస్తూ ముందుకు సాగుతారు

*ముద్రణ విరసం ప్రత్యేక సంచిక, సెప్టెంబరు 1971*

# 21. సాహిత్యంలో వైరుధ్యాల పాత్ర

సృష్టి అంతటా వైరుధ్యాలున్నాయని మార్క్సిస్టులు నమ్ముతారు సజీవమైన వాటిలోనే గాక నిర్జీవమైన పదార్థాలు కూడా వైరుధ్యాలకు గురి అవుతాయి ప్రతి మార్పు వెనకా వైరుధ్యాల సంఘర్షణ ఉంటుంది మన తత్వవేత్తలు చెప్పే ద్వంద్వాలకూ ఈ వైరుధ్యాలకూ తేడా ఉన్నది అయినప్పటికీ వీటిని కూడా ద్వంద్వాలని అనవచ్చు ఇవి మార్క్సిస్టు ద్వంద్వాలు

ఈ ద్వంద్వాలను గురించి మార్క్సిస్టు మేధావులందరూ ప్రస్తావించారు వీటిని గురించి మావో 1937లోనూ, 1957లోనూ రచించిన వ్యాసాలు చరిత్ర ప్రసిద్ధమైనవిగా భావించబడుతున్నాయి

ద్వంద్వాలు అంతర్గతంగానూ, బహిరంగంగానూ కూడా ఉంటాయి ముఖ్యంగా మానవులు అంతస్సంఘర్షణకూ, బహిస్సంఘర్షణకూ కూడా గురి అవుతూ జీవిస్తారు ఈ సంఘర్షణలలో ముఖ్యమైనవీ, అముఖ్యమైనవీ, వైషమ్యంతో కూడుకోనివీ, వైషమ్యంతో కూడుకున్నవీ అని రకరకాలుగా ఉంటాయి చివరి రెండు రకాల సంఘర్షణలు తారుమారు కావటం కూడా జరుగుతుంది

''సార్వత్రికమైనదీ, నిరపేక్షమైనదీ'' అని చెప్పిన ద్వంద్వ స్వభావాన్ని మావో మనుష్యుల జీవితంలో అనుక్షణమూ, అన్ని దశలలోనూ అనువర్తించేదిగా నిర్వచించి, 'అపజయం నుంచి జయం పుట్టుతుంది' 'ఒకటి రెండవుతుంది', 'కీడు నుంచి మేలు కలుగుతుంది' మొదలైన సూక్తులు చెప్పాడు

పురోగమనానికి ద్వంద్వాల అవగాహన అవసరం వైరుధ్యాలను అధిగమించకుండా ఎవరూ ముందుకు పోలేరు జీవితంలో ప్రధాన వైరుధ్యాలు ఏ దశలో ఏవో, వైషమ్యంతో కూడిన ద్వంద్వాలు ఏవో స్పష్టంగా అర్థం చేసుకోని వాడు వాటిని దాటి పురోగమనం సాధించలేడు

రచయితలకు కూడా ఈ బాధ్యత ఉంటుంది రచయితకు రాయాలని ఉండేదీ, రాయగలిగినదీ ఒకటిగా ఉండవు ఆరంభ దశలో రచయిత ఈ రెంటి మధ్యా తెగ నలిగిపోతాడు రాయటం గురించి గొంతెమ్మ కోరికలు మానుకున్నప్పుడో, తనకు చేతనైనది రాయటానికి సమాధానపడినప్పుడో రచయిత ఈ సంఘర్షణ నుంచి బయటపడతాడు

అటు తరువాత కొత్త సంఘర్షణలు ఎదురవుతాయి తాను రాసేదీ, తనకు రచయితగా ఖ్యాతి తెచ్చేదీ, తనకు డబ్బు సమకూర్చేదీ, తాను ప్రయోజనాత్మకంగా రాయవలసినదీ రచయితకు వేరువేరుగా కనుపిస్తాయి ఈ సంఘర్షణ నుంచి ఏ దిక్కుగా రచయిత బయటపడతాడనేది ఆ రచయిత యొక్క శాస్త్రీయ అవగాహనపై ఆధారపడి ఉంటుంది కీర్తి, డబ్బు వ్యక్తిగతమైన ఆశయాలు ప్రయోజనం కోరి రాయటమనేది సాంఘికమైన ఆశయం తన అభ్యుదయం కోసం రాసేవాడికన్న సంఘం యొక్క అభ్యుదయం కోరి రాసేవాడు గొప్ప రచయిత

అయితే సంఘం యొక్క అభ్యుదయం కోరి రాసేవాడికి హెచ్చు కీర్తి ఎందుకు రాగూడదు? ఈ రెంటికీ వైషమ్యం నిజానికి రచయితది కాదు చాలావరకు సంఘానిది అన్ని సంఘాలూ తమ మేలు కోరిన రచయితను ఆకాశానికెత్తవు సాంఘిక హింసలకు గురి అయిన ఉత్తమ రచయితలు లేకపోలేదు భారతంలో హితం చెప్పిన విదురుడు దుర్యోధనుడికి విషంగా కనిపించాడు

సమాజానికంతకూ ఒకే స్వభావం ఉండదని మనకు తెలుసు సమాజంలో ఎన్ని రకాల వర్గాలుంటాయో అన్ని రకాల స్వభావాలూ ఉంటాయి రచయిత సంఘ శ్రేయస్సును శాస్త్రీయంగా అర్థం చేసుకుంటే దాన్ని ఒక వర్గంయొక్క శ్రేయస్సుగా మాత్రమే అర్థం చేసుకోగలడు ఇలా అర్థం చేసుకోవటానికి కూడా సంఘ స్వభావం తెలియాలి మార్క్సుకు పారిశ్రామిక రంగంలోని శ్రామికులేపైకి రావలసిన వర్గంగా కనిపించారు లెనిన్ కర్షక కార్మికులను జోడించి చూశాడు మావో ప్రధానంగా కర్షకవర్గం మీదనే తన దృష్టి ఉంచాడు కాలాలను బట్టి, దేశాలను బట్టి ఇలా మార్పులు ఏర్పడ్డాయి

సమాజం కూడా వివిధమైన ద్వంద్వాలతో కూడి ఉంటుంది ఆ ద్వంద్వాలను అధిగమించకుండా అది ముందుకు పోలేదు ఆ ద్వంద్వాలలో కూడా ముఖ్యమైనది ఏది, వైషమ్యంతో కూడుకున్నది ఏది, ఏయే ద్వంద్వాలను అధిగమించటానికి ఎలాటి సాహిత్యం అవసరం అన్న ప్రశ్నలకు రచయితలు సమాధానాలు వెతుక్కోవాలి, తెలుసుకోవాలి

పరిపాలనా వ్యవస్థా, ఆర్థిక వ్యవస్థా, రక్షకబలాలూ, సంపదను సృష్టించే సాధనాలూ, ఆహారాలూ, ఇళ్ళూ, ఆస్పత్రులూ, బడులూ, ఉద్యోగాలూ, పనులూ మొదలైన ప్రజావసరాలూ - ఇవన్నీ సంఘం యొక్క స్థితిని తెలియబరుస్తాయి ఈ అన్ని రంగాలలోనూ ఉండే ద్వంద్వాలను పరిష్కరించే పద్ధతి మీద సంఘం యొక్క పురోభివృద్ధి ఆధారపడుతుంది ఉదాహరణకు పాలకవర్గంలో అధికార దుర్వినియోగానికీ, లంచగొండితనానికీ గల అవకాశాలు పాలన ధర్మంతో సంఘర్షిస్తాయి ఈ సంఘర్షణలో ఒక పక్షం నెగ్గితే పాలన క్షీణిస్తుంది, రెండో పక్షం నెగ్గితే సంఘం ముందుకు పోతుంది

కొందరు ''యథాస్థితి'' వాదులుంటారు వాళ్ళనే మనం కుడిచి కూర్చున్న వాళ్ళంటాం ఉన్నచోటి నుంచి కదలకుండా పదివేల మైళ్ళు ప్రయాణం చేస్తాననటం ఎంత అర్థం లేనిదో, యథాస్థితి వాదం అంత అర్థం లేనిది పైగా, యథాస్థితి అన్నది సృష్టిలోనే లేదు అటువంటిదే ఉంటే వైరుధ్యం సార్వత్రికమైనది నిరపేక్షమైనదీ అన్న మాట అబద్ధం అవుతుంది ప్రతి ద్వంద్వమూ ఏదో ఒకవైపుకు పరిష్కారం అవుతూ ఉంటుంది, కొత్త ద్వంద్వాలు ఏర్పడుతూ ఉంటాయి

సాహిత్యం ఒక సాటిలేని సామాజిక శక్తి దాని ప్రభావం జీవితంలోని అన్ని రంగాలపైనా ఉండవచ్చు మనిషి భావాలు మారకుండా మనిషి మారడు మారని మనిషి మార్పులకు గురి కాకుండానూ ఉండడు అంటే, అంతస్సంఘర్షణలను అధిగమించే ప్రయత్నం చేయలేనివాడు, బాహిర సంఘర్షణలు ఎటు ఈడిస్తే అటు పోతాడు ఒక రష్యను రచయిత ఒక బుల్లి కథ రాశాడు వీధిలో ఉన్న రాతిని ఎవడో కుర్రవాడు ఒక తన్ను తన్నాడట '' ఆహా, నేను ఎంత వేగంగా ప్రయాణం చేస్తున్నాను,'' అనుకున్నదిట రాయి అది ఎక్కడో వచ్చిపడి, అదే తన గమ్యం అని కూడా అనుకుని ఉంటుంది విప్లవాలు ఆరంభమయినప్పుడు వాటిలో పాల్గొనే వాళ్లు చాలా అల్ప సంఖ్యాకులుంటారు అది విజయవంతమైనాక దాన్ని వ్యతిరేకించే వాడు దాదాపు ఒకడూ ఉండడు ఇలా బాహిర సంఘర్షణలతో ముందుకు కదిలి పురోగమించే వాడు భవిష్యత్సమాజానికి బలం చేకూర్చడు

అందుకే మావో ప్రతి ఒకడిలోనూ చైతన్యం కావాలంటాడు కొద్ది మంది వ్యక్తులు, 'మేము మీ జీవితాలను తీర్చిదిద్దుతాం మీరు గమ్మున ఉండండి'' అనే వైఖరి అభ్యుదయానికి దారి తీసే వైఖరి కాదు సామాన్య ప్రజలు, నెహ్రూ చెప్పినట్టు, ఎంత ఉచ్చనాగరికతలో కూడా హీనులుగా ఉండిపోవటం చైతన్యం లేని కారణం చేతనే

యధాస్థితి వాదులకన్న ఒక ఆకు ఎక్కువ చదివిన వాళ్ళు రాజవప్పంతులు మనస్తత్వం గల వాళ్ళు గిరీశం మీద ''దెబ్బకు దెబ్బ'' తీయటం రాజవప్పంతులు పద్ధతికాదు

ప్రభుత్వం ఏర్పాటు చేసిన కోర్టుల్లోనూ పోలీసుల్లోనూ రాజవప్పంతులుకు పూర్తి విశ్వాసం ఉన్నది అలాగే పాలక వర్గం ఆశీర్వదించే సాహిత్యం రాయటమే ఉత్తమ రచయిత ధర్మమని నమ్మే వాళ్లున్నారు ప్రభుత్వానికి సయించని సాహిత్యం రాయటమెందుకు? జైళ్లకు పోవటమెందుకు? అంటే వారు ప్రభుత్వరంగంలో మార్పు ఆశించరు, ''మీ జీవితాలలోని ద్వంద్వాలను మీరే పరిష్కరించుకోండి'' అని జనానికి చెప్పరు, ఎలాగో కృతయుగం దానంతట అది దేశంలో అవతరిస్తుందని వారి నమ్మకం ఈ నమ్మకానికి ఆధారం ఏమిటో వారికే తెలియాలి వీరు యధాస్థితివాదులో, రాజవప్పంతుళ్ళో తెలుసుకోవటం కష్టం

ప్రజలలో విశ్వాసం లేని వాళ్ళు ప్రజా జీవితాన్ని ఉద్ధరిస్తారా? పెట్టుబడిదారీ విధానంతో ఉన్నత దశకు వచ్చిన దేశం, వెనుకబడి ఉన్న దేశాన్ని పెట్టుబడిదారీ విధానంతో పైకి రావటానికి సహాయపడుతుందా? ఈ రెండు విశ్వాసాలూ మన దేశంలో ప్రత్యక్షంగా అమలులో ఉన్నాయి

ప్రతి ఒక్క పౌరుడూ చైతన్యవంతుడు కావాలన్న మావో ఆచరణలో దాన్ని రుజువు చేశాడు ఆయన తన పార్టీ మీదికి 3 కోట్ల రెడ్‌గార్డ్‌లను ఉసికొల్పాడు ఇది చరిత్రలో అపూర్వం అంటుంది, హాన్‌సుయిన్ మావో లక్ష్యం చీనాలో 70 కోట్ల మావోలు తయారుకావాలని!

ఉత్త సిద్ధాంతం నిరుపయోగం ప్రతి సిద్ధాంతమూ ఆచరణలోనే తన సత్యాన్ని రుజువు చేసుకుంటుంది రచనలకు కూడా ఇదే వర్తిస్తుంది కాని రచనలలోని సత్యం రుజువు కావటం అంత తేలిక కాదు పెట్టుబడిదారు లాభాలకూ, కూలీల జీతాలకూ మధ్య వైరుధ్యం ఉన్నదని ఎవడైనా ఒప్పుకుంటాడు కాని అది సర్వోదయ పద్ధతిలో పరిష్కారమవుతుందా, కార్మిక సంఘ చైతన్యంతో పరిష్కారమవుతుందా, విప్లవం ద్వారా గాని పరిష్కారం కాదా అన్న దాన్ని గురించి అభిప్రాయభేదాలున్నాయి అది ప్రధానమైన వైరుధ్యమా లేక వైషమ్యమా, లేక అప్రధానమైన సాదా వైరుధ్యమా?

మావో లెక్కన పీడిత పీడక వర్గాల మధ్య ఏర్పడే వైరుధ్యాలు వైషమ్యాలు అవి పరిస్థితుల మార్పుతో వైషమ్యాలు కాకుండా పోవచ్చు అంతర్యుద్ధం జరగకముందు కూడా చీనాలోని స్థావరాలలో కమ్యూనిస్టులకు బలం చేకూరినప్పుడు పెద్ద భూస్వాములూ, వర్తకులూ వారితో సహకరించారు కొమింటాంగు పరిపాలన కింద కన్నా కమ్యూనిస్టు పరిపాలనలో వారికి జీవితం కాస్త మెరుగయింది

మన దేశంలో అలాటి పరిస్థితుల మార్పు ఏమీ రాలేదు ధనికులు మరింత ధనికులూ, దరిద్రులు మరింత దరిద్రులూ అవుతున్నారు వారి మధ్య గల ద్వంద్వం పోయిన కొద్దీ తీవ్రమవుతున్నది ఈ ద్వంద్వాన్ని అధిగమించటానికి ప్రభుత్వం తలపెట్టిన చర్యలేవీ శాస్త్రీయ

దృష్టిలో పని చేసేవి కావు ఉక్కు పరిశ్రమను జాతీయం చేయటం ధనిక వర్గానికే లాభమని అమెరికా వారు బాహాటంగా చెప్పారు బాంకులను జాతీయం చేయటం పేద రైతులకు లాభించటం లేదని విజ్ఞులు చెబుతున్నారు

శాస్త్రీయంగా ఆలోచించామనుకుని విప్లవ రచయితలు జనాన్ని తిరగబడమనీ, సాయుధ విప్లవం చెయ్యమనీ ఉద్బోధిస్తూ రచనలు చేశారు వీరు చెప్పేది సత్యమని ఆచరణలో ఎలా రుజువయేటట్టు? ప్రభుత్వం ఆ విషయం రుజువు చెయ్యటానికి పూనుకున్నట్టున్నది విప్లవ రచనల మీద నిషేధాలూ, విప్లవ రచయితల అరెస్టులూ ప్రారంభమయాయి

తిరుగుబాటూ, హత్యలూ అన్నవి సిద్ధాంతరీత్యా అట్టడుగున నలిగే వర్గం వారు ఏ ప్రేరణా లేకుండా చేసేవి అచ్చుగా హత్యలే అయితే వ్యక్తిగతమైన పగతోనో, స్వార్థంతోనో చేసేవి దేశంలో ఈనాడు స్వార్థరహితమైన హత్యలు చేస్తున్న వారు నక్సలైట్‌లు అనబడే వారూ, పోలీసులూనూ చచ్చేవారంతా గాని, చంపే వారంతా గాని నక్సలైట్లు అనటానికి కూడా ఆధారం లేదు కొన్ని ప్రాంతాలలో పోలీసులు తమకు అనుమానంగా ఉన్న ప్రతి కుర్రవాణ్ణీ పట్టుకుపోతున్నట్టు కనబడుతుంది వియత్నాంలో చచ్చినవాడల్లా వియత్మిన్ అన్నట్టుగా, ఇక్కడ మన దేశంలో పోలీసుల చేత చంపబడిన వాడల్లా నక్సలైట్‌గా జమ కట్టబడుతున్నాడు

చెప్పవచ్చిందేమంటే తిరుగుబాటుకు సిద్ధంగా ఉన్న వారే తిరుగుబాటు చెయ్యమన్న బోధలు వింటారు అలా వినే వాళ్లు పీడితులు విప్లవ కవుల రచనలు నష్టపరిచేది భూస్వాములనూ, ఇతర పీడకులనూ వారిని కాపాడటానికే ప్రభుత్వం విప్లవ రచయితలపై దాడి ప్రారంభించిందనుకోవాలి విప్లవ కవులకూ ప్రభుత్వానికీ మధ్య ఉన్నది వైషమ్యమని ప్రభుత్వం ఆచరణలో రుజువు చేస్తున్నది ఈస్టిండియా కంపెనీ కాలంలో బ్రిటిషు వర్తకుల లాభాల కోసం బ్రిటిషు ప్రభుత్వం సేనలను ఈ దేశంలో ఏర్పాటు చేయించింది అయితే ఆ ప్రభుత్వం పేద ప్రజలను ఉద్ధరించే ఫోజు పెట్టలేదు సోషలిజం తెస్తాననే మన ప్రభుత్వం పీడకవర్గం తరపున ఎందుకు హింసాకాండ సాగిస్తున్నది ఈ ప్రభుత్వానికి సాహిత్యంలో విశ్వాసం ఉన్నదా? ఉంటే ఎలాటి సాహిత్యంలో విశ్వాసం ఉన్నది? వందిమాగధ సాహిత్యంలోనా? భజన సాహిత్యంలోనా? ఇంత పెద్ద దేశంలో చెలరేగే వైషమ్యాలను అధిగమించటానికి సాహిత్యం చేసే కృషి ఎలా ఉండాలని ప్రభుత్వం అనుకుంటున్నది? సాహిత్యం పట్ల అవాస్తవికమైన దృక్పథం అవలంబించి, ప్రాథమిక ప్రజాస్వామ్య సూత్రాలనే ఎందుకు దిగజార్చుతున్నది? తీవ్రమైన తిరుగుబాట్లూ, విప్లవ శక్తులూ లేని అమెరికాలోని ప్రజాస్వామ్యం మట్టి కరిస్తే, ఈ దేశంలో - నూటికి తొంభై మందికి ప్రజాస్వామ్య సంప్రదాయాలు తెలియని చోట - విప్లవవైఖరి అవలంబించని ప్రభుత్వం ప్రజాస్వామ్యాన్ని దక్కించగలదా? వ్యక్తుల విషయంలోలాగే ప్రభుత్వాలు కూడా పురోగమించకపోతే తిరోగమించక తప్పదు యథాస్థితి వాదం వ్యక్తులకు ఎంత నిరర్థకమో, ప్రభుత్వాలకూ అంతే నిరర్థకం ద్వంద్వాలను అధిగమించుకుంటూ ముందుకు పోవటమే విప్లవం విప్లవం హింసాయుతమైతే, విప్లవ వ్యతిరేకత మరింత హింసాయుతం పోలీసులు చేసే అత్యాచారాలు విప్లవకారులు ఎన్నడూ చేయరు

*సృజన, మాసపత్రిక, 1971 అక్టోబరు*

*పునర్ముద్రణ సాహిత్యంలో విప్లవోద్యమం, సృజన ప్రచురణ, 1971 అక్టోబరు*

# 22. ఉద్యమం (లేఖ)

''తరుణ'' నవంబరు సంచికలో ''విరసంలో హిపోక్రసీ - కవిత్వంలో డిప్లొమసీ'' అన్న ''పి ఎస్ ఆర్ '' రచన చూశాను రచయిత దృక్పథం అవగాహన కావటం లేదు

విప్లవవాదులకూ, విప్లవకారులకూ తేడా ఉన్నదా లేదా? అచ్చంగా విప్లవకారులే విప్లవాలు చేస్తారా? ''కవిత్వంలో విప్లవాలు రావు'' అన్నదాన్ని ఎలా తీసుకోవాలి? కవిత్వం విప్లవాలు చెయ్యదు, నిజమే చేయించదని చెప్పగలమా? దేవుడు అనేమాట (నుడికారంలో) వాడిన వాడు మార్క్సిస్టు అవగాహన లేని వాడనేనా? భారతంలో నుంచి పద్యం చదివితే భారతాన్ని విప్లవ గ్రంధమని ఆమోదించినట్టేనా? విప్లవవాదులు ఆకాశం నుంచి ఊడిపడరు గద? విప్లవ సాహిత్యమైనా!

జీవకణంలో న్యూక్లియస్ కాక సైటోప్లాజం వగైరాలుంటాయి విరసం ఒక ఉద్యమం సాహిత్యోద్యమం అందులోకి వచ్చేవారంతా విప్లవవాదులనే అనుకుంటాం విప్లవకారులు కానవసరం లేదు కిందటి ప్రపంచ యుద్ధంలోకమ్యూనిస్టు పార్టీ యుద్ధాన్ని బలపరిచింది కమ్యూనిస్టులందరూ తుపాకులు తీసుకుని పాలోమంటూ యుద్ధంలోకివెళ్ళిపోలేదు యుద్ధాన్ని వ్యతిరేకించిన వారు శత్రువుల్లాగే వారిని చూశారు

ఇంతకూ, విరసం హిపోక్రసీ అయితే ఇది ఎవరిని వంచించటానికి? కవిత్వంలో డిప్లమసీ దేన్ని సాధించటానికి? విప్లవ సాహిత్యోద్యమం పి ఎస్ ఆర్ గారికి నచ్చకపోతే అది వేరే కథ అలాంటివారు చాలా మంది ఉన్నారు వారిలోనూ వీరూ జమ జనసంఘానికీ ఆర్ ఎస్ ఎస్ కూ ఉన్న సంబంధమే నక్సలైట్లకూ విరసానికి ఉన్నదని ఆరోపిస్తున్నారుగాని అది ఏ రూపంలో ఉండటానికి అవకాశం ఉన్నదీ కూడా వారు సూచించటం లేదు విరసం రచనలు నక్సలైట్లకు పనికిరావని న్యాయమూర్తులు చెప్పినదాంతో వీరూ ఏకీభవిస్తున్నారు విరసం కార్యరంగంలోకి ఏ రూపంలో వస్తుంది? ''నక్సలైట్ కవులు'' అన్న మాటలో అర్థం ఏమన్నా ఉంటుందా? రాజకీయ పార్టీ సాహిత్యాలన్నీ సామాన్యంగా సిద్ధాంత గ్రంధాలుగా ఉంటాయి నక్సలైటు కవితా, సోషలిస్టు కథా, పెట్టుబడిదారీ నవలా, కమ్యూనిస్టు నాటకమూ - ఇలాంటివి ఎవరూ అర్థం చేసుకోలేరు ఒక రకం సాహిత్యం, ఒక రాజకీయ దృక్పథం గల వారికి ప్రత్యేకంగా నచ్చవచ్చు అంతమాత్రాన అది ఆ పార్టీ సాహిత్యం అనిపించుకోదు చలం సాహిత్యం, శరత్ సాహిత్యం, లత సాహిత్యం లాటి మాటలు అడ్డుగోడలుగా ఉపయోగించబడుతున్న మన దేశంలో నక్సలైట్ కవులూ, కమ్యూనిస్టు కథకులూ లాంటి మాటలు చలామణీ అవుతాయేమో!

*ముద్రణ తరుణ, మాసపత్రిక, డిసెంబరు 1971*

# 23. విప్లవ కథలు

విప్లవ కవులూ, విప్లవ రచయితలు, విప్లవ కథకులు, విప్లవ రాజకీయవాదులు, విప్లవ సంఘ సంస్కర్తలు - వీరందరిదీ ఒకటే లక్ష్యం అది సాంఘిక విప్లవాన్ని సాధించటం వీరందరూ ఒకే లక్ష్యం గురించి ఆలోచించగా, ఆ లక్ష్యాన్ని సంఘం చేరుకోవటానికి వేరు వేరు మార్గాలు సూచిస్తారు

విప్లవం అంటే పైపై సంస్కరణలు కాదనీ, సామాజిక వ్యవస్థ యొక్క పునాదులే మారాలనీ, కొత్త పునాదులపై కొత్త సామాజిక సంబంధాలు ఏర్పడాలనీ అందరికీ తెలిసినదే

మాట వరుసకు విప్లవ ఫలితంగా సమాజంలో యజమాని - బానిస సంబంధాలుండవనీ, ఎక్కువ తక్కువ కులాలుండవనీ, అంటరానితనమూ, దాని ఉద్ధరింపుకు ప్రణాళికలూ ఉండవనీ, పరిపాలనలో అవినీతీ, లంచగొండితనమూ, పక్షపాతమూ ఉండవనీ? వ్యక్తికి నిజమైన గౌరవం ఉంటుందనీ, అధిక సంఖ్యాకులు కుక్కబతుకు బతకరనీ, పెత్తందారీ పోయి, నిజమైన నాయకత్వం వస్తుందనీ, ఇప్పుడు పోలీసు తుపాకులతోనూ, కుర్చీల చాటునా విజృంభించి, వీర విహారం చేస్తున్న సంఘ వినాశకర శక్తులు తల ఎత్తితే వాటి తలలు చితుకుతాయనీ బుద్ధిమంతులు సులువుగా ఊహించవచ్చు

అయితే ఈ విప్లవ దశ వడ్డించిన విస్తరి కాదు మంత్రాలుచదివి ఆవాహన చేస్తే వచ్చేది కాదు అనేకవేల చిన్న, పెద్ద సంఘర్షణలను జరిపి, వందలాది వేలాది వైరుధ్యాలను అధిగమించి, ఎంతో నరబలీ, రక్తపాతమూ దీక్షతోనూ, సరి అయిన అవగాహనతోనూ కూడిన ఆలోచనా విధానం అమలు జరిపితే గాని ఇప్పుడు మనమున్న దశ నుంచీ విప్లవ దశకు చేరుకోలేదు

ప్రతి సామాజిక వ్యవస్థనూ మార్పు చెందకుండా ఉంచటానికి దోహదం చేసే ''జడత్వం'' ఆ సమాజ నిర్మాణం అంతర్లీనంగా ఉంటుంది ఆ ''జడత్వం'' సామాజిక మూఢ విశ్వాసాల రూపంలో ఉంటుంది వాటిని social inhibitions అనవచ్చు ఏ అస్పృశ్యుడూ తన అస్పృశ్యతను బుద్ధిపూర్వకంగా నమ్మడు ఏ స్త్రీ కూడా బుద్ధిపూర్వకంగా తన భర్త శవంతోపాటు చితిలో కాలి చావదు ఏ శూద్రుడూ తాను బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకన్నా హీనంగా పుట్టానని బుద్ధిపూర్వకంగా ఆమోదించడు ఏ బాల వితంతువూ బుద్ధిపూర్వకంగా దిష్టిబొమ్మలాగా బతకదు ఈ ఉదాహరణలన్నింటిలోనూ ''బుద్ధి'' అన్నది సాంఘిక విశ్వాసాల రూపంలో ఆయా వ్యక్తుల బుర్రలో ప్రవేశించి వారి మెదడును జడంగా ఉంచేస్తుంది అది మహాశక్తి, ఆ మహాశక్తితో పోరాటం సాగించకుండా సంస్కరణలే సాధ్యం కావు (తాను బాగు చేయదలచుకున్న వాళ్ళే తన కృషికి ప్రతిబంధకంగా ఉంటున్నారని వీరేశలింగంగారు వాపోయారు) విప్లవం కోరే వారు ఈ మహాశక్తి పాటు ఆయుధ బలాలను కూడా ఎదుర్కోవాలి విప్లవ రచయితలను జైళ్ళలోకి తొయ్యటం ప్రారంభించిన హాస్యాస్పదమైన ''ప్రజాస్వామిక'' పాలకులు గల మన దేశంలో విప్లవ రాజకీయ చర్యలు ఎటువంటి ప్రతిఘటన ఎదుర్కోవాలో చెప్పనవసరం లేదు

విప్లవ కథకులు ప్రజలలో ఉన్న సాంఘిక జడత్వం ఖండించాలి ఈనాటి సంఘ నిర్మాణానికి సిమెంటులాగా పని చేస్తున్న విశ్వాసాలను ప్రజల మెదడుల నుంచి కరిగించాలి

ప్రజల విప్లవంకేసి పురోగమించటానికి అవాంతరంగా ఎదురయ్యే వైరుధ్యాలను మానసికంగా అధిగమించే మేధాశక్తిని కలిగించాలి

ఒక్క ముక్కలో చెప్పాలంటే, ప్రజలు విప్లవోన్ముఖులు కావటానికి అడ్డంగా వున్న వందలాది చిన్న, పెద్ద సంకెళ్ళను ఒక్కొక్కటిగా ఊడగొట్టటం విప్లవ రచయితల లక్ష్యం తుపాకులు తీసుకుని గెరిల్లా యుద్ధాలు చేసే వారిని కీర్తించటంతో విప్లవ సాహిత్యం ఆగదు, ఆగరాదు ఆ విప్లవ వీరులకూ, విప్లవం వల్ల బాగుపడదగిన అసంఖ్యాక ప్రజానీకానికీ మధ్య ఎన్నో అగాధాలున్నాయి వాటిని పూడ్చటం విప్లవ రచయితల పని విప్లవ కవులు విప్లవ సత్యాలను సూటిగా, ఘాటుగా, సునిసూత్రంగా చెప్పగలరు జీవితాన్ని వాస్తవికంగా చిత్రించే కథకులు హేతుబద్ధంగా ప్రజల మనస్సులను విప్లవోన్ముఖం కాకుండా బంధించే సంకెళ్ళు చాలా ఉన్నాయి వారి అవగాహనను ముందుకు పోకుండా అరికట్టే ముడిద్రవ్యాలను క్షాళన చెయ్యటమూ విప్లవ కథకుల పని

ప్రజలను విప్లవ వ్యతిరేకారంధకారంలో ఉంచుతున్న దుష్ట శక్తులు వాటంతట అవే బయటికి వస్తున్నాయి వాటి నగ్నస్వరూపం ప్రజల ఎదటికి వస్తున్నది వాటి దుష్టస్వభావాన్ని వివరించడమే రచయితల కర్తవ్యం

Social inhibitions గురించి చెప్పాను ఏ సమాజంలోనూ రచయితలు వాటి నుంచి విముక్తి పొంది ఉంటేనే సమాజాన్ని ముందుకు నడిపించగలుగుతారు "వితంతువులు తిరిగి పెళ్ళాడటం పాపమేమో!" అని లోపల పీకుతున్నంత కాలమూ ఏనాడూ వితంతు వివాహం చేయించలేడు "అమెరికను యుద్ధ యంత్రాన్ని మనం ఎదుర్కొగలమా? అన్న భయం వియత్నాం వారికుంటే వారు అమెరికన్ బలాల చేత మట్టి కరిపించేవారా? "విప్లవ విశ్వాసం" లేని రచయిత విప్లవ రచనలు చేయలేడు విప్లవ కథకులు మానసికంగా విప్లవకారుల స్థాయిని బలంగా అందుకుంటే గాని, తమ కథల ద్వారా ప్రజల విప్లవ విశ్వాసాన్ని బలపరచలేరు

మనం జ్ఞాపకం ఉంచుకోవాలి, చదువుకున్నవారిలో కూడా దేశభక్తి అంటే పాలక వర్గం పట్ల భక్తి అనుకుంటున్న వారున్నారు

మనం మరిచిపోగూడదు! రోజూ హాట్ హాట్ సంపాదకీయాలురాసే వాళ్ళు, తమ పాలసీకి వ్యతిరేకంగా ఒక సంపాదక లేఖను ప్రచురించలేని పిరికిపందలు కావచ్చు నల్లేరు మీద నడిచే బళ్ళన్నీ కంకరరాళ్ళ మీద నడవలేవు

మనం చూస్తూనే ఉన్నాం! తిరుగుబాటు చేసే యువకులను కాల్చి చంపించే ప్రభుత్వం అభ్యుదయ నిరోధక పార్టీల చేత నానా తిట్లూ తింటుంది, తమ పరిపాలనకు ఎసరు తెచ్చే "కుడి" వాళ్ళను చూస్తూ చూస్తూ శిక్షించలేదు ప్రభుత్వాలకు జడత్వం ఉంటుంది అది ఒక్కొక్కసారి ఆ ప్రభుత్వం నాశనానికే దారి తీస్తుంది అయినా విప్లవ వ్యతిరేక ప్రభుత్వాలు తమ జడత్వం నుండి బయటపడటానికి ప్రయత్నించవు

కథకుడికి ఇవన్నీ ముడి పదార్థాలే భయమూ, దౌర్జన్యమూ, ఆత్మద్రోహమూ అసత్య ప్రమాణాలూ, ఇవి పీడకులలోకనిపించినప్పుడల్లా అవి పీడకవర్గం కవచంలో చిరుగులే అని నమ్మవచ్చు

మనం ఈనాడు ''నూరు నక్సల్బరీలకు'' ఎంత దూరంగా ఉన్నామంటే విప్లవ రచయితలు ఈనాడు చేసే రచనలు అత్యధిక సంఖ్యాకులకు అత్యుత్తమ సాహిత్యమనిపించితే ఆశ్చర్యం ఎలా ఉండదు ''ఝుంఝు'' అమ్మకాలు దీన్ని ప్రత్యక్షంగా రుజువు చేశాయి అందుకే ప్రభుత్వం ''ఝుంఝు''ను చూచి బెదిరింది

విప్లవ కథలు కూడా ప్రజలకు జీవిత నగ్నసత్యమనే ప్రగాఢ విశ్వాసాన్ని కలిగించి, వారి ఆలోచనా ధోరణులను విప్లవాభిమానంతో నింపుతూ పోవాలి విప్లవ కథకులు ఇతివృత్తాలను ఎక్కడి నుంచి తీసుకుంటారో, ఎలాటి శిల్పాలను ప్రయోగిస్తారో ఒకరు చెప్పేది కాదు

కాని ఒక్కటి నిజమని నా నమ్మకం - విప్లవవాసన లేని కథలలో వైవిధ్యం లేదు చైతన్యం లేదు, అవి పాఠకులను రంజింపవచ్చు గాని, నిజంగా కదిలించలేవు ఆ కథ పరిధి చాలా చిన్నది విప్లవ కథల పరిధి జీవితమంత పెద్దదిగా ఉండాలి

*- ముద్రణ సృజన, జనవరి 1972*

# 24. సాహిత్యంలో విప్లవోద్యమం

ఈ సందర్భంలో నేను మీద వేసుకున్న బాధ్యత గురించి కొంత చెప్పవలసిన బాధ్యత నా పైన పడింది దీనికి ముఖ్య కారణం ఫిబ్రవరి సృజనలో ప్రభాకర్‌రెడ్డి వ్యాసం

విరసం ఏర్పడేనాటికి నేను సాహిత్యంలో విప్లవోద్యమం వస్తే దాన్ని బలపరచటానికి తగిన స్థితిలో ఉన్నాను నేనుగా విప్లవ సాహిత్యాన్ని సృష్టించటం సాధ్యం కాదని నాకు తెలుసు అయినా యువతరం కవులు ఆధునిక సాహిత్యంలో విప్లవ భావాలను ప్రవేశపెట్టడం చూశాను నానాటికీ జడత్వాన్ని పెంచుకుంటూ నిర్జీవ స్థితికి చేరుకుంటున్న వర్తమాన తెలుగు సాహిత్యం విప్లవ సాహిత్యోద్యమంతో తిరిగి చైతన్యం పొందగలదని నాకు నమ్మకం పూర్తిగా కలిగింది విప్లవ కవితల ప్రభావం యువతరం మీద యెలా ఉన్నదీ ప్రత్యక్షంగా చూశాను

అయితే విప్లవ రచయితల సంఘంలో ప్రముఖ పాత్ర వహించాలన్న కోరిక గాని, వహించగలనన్న దృఢ నమ్మకం గాని నాలో లేకపోయాయి అయితే విరసం స్థాపనకు కృషి చేసిన యువకులు పట్టుబట్టి నన్ను ఉపాధ్యక్షుణ్ణి చేశారు నా మూలంగా విరసంకు లాభం ఉండే పక్షంలో నేను దానికి అడ్డు తగలదలచుకోలేదు

విరసం పుట్టటంతోనే భొక్కసాలు ప్రారంభమయాయి ప్రతిఘటన ఆరంభమయింది ఈ ప్రతిఘటన రాజకీయ పార్టీల నుంచీ, రచయితల నుంచీ కూడా వచ్చింది (రచయితలలో హెచ్చు భాగం రాజకీయ పార్టీలను ఆశ్రయించిన వారే అనుకోండి)

సాహిత్యోద్యమాలను రాజకీయ పార్టీల దృక్పథం నుంచి దెబ్బ తీయటం నాకు పాత కథే కాని విరసం ఒక రాజకీయ పార్టీ గొడుగు కింద, ఆ పార్టీ ఆశీస్సులతో పుట్టినది కాదు ఇదీ జీవితంలో తలయెత్తిన తిరుగుబాటు శక్తుల నుంచి, ఆ శక్తులను బలపరచటానికి పుట్టినది అందుచేత విరసం పుట్టుకను మరొక లెఫ్టిస్టు పార్టీ పుట్టుక కింద జమకట్టి ఆంధ్రలో ఉండే లెఫ్టిస్టు పార్టీలు అనబడేవి దాని మీద దాడి చేశాయి!

విరసంపైన జరిగిన దాడులతో విరసం సభ్యులను సాటి రచయితలు దుమ్మెత్తి పోయటం జరిగింది విరసం సభ్యులు లొంగుతారనో, తిరపతికి వెళ్ళారనో, సత్యనారాయణవ్రతాలు చేసుకున్నారనో, ఇద్దరు పెళ్ళాలను పెట్టుకున్నారనో వంకలు వెతికి, వాళ్ళు మార్క్సిస్టులు కారని దుష్ప్రచారాలు ప్రారంభించారు ఒక్క ముక్కలో చెప్పాలంటే విప్లవ రచయితలకూ, విప్లవ రచనలకూ అవినాభావ సంబంధం ఆపాదించారు ఇలాటి విమర్శలు విరసం సభ్యుల నుంచీ లేదా విప్లవ సాహిత్యం పట్ల ఆదరం కల వారి నుంచి వస్తే అర్థం చేసుకోవచ్చు విరసంకు విరోధులైన వారు యెందుకు బెంగపడుతున్నట్టు? విరసం సభ్యుల మూలంగా విప్లవ సాహిత్యోద్యమం పతనమవుతుందని వారు సంతోషించవచ్చుగా

వాళ్ళు చేసినవి కపటవిమర్శలు, పాక్షిక విమర్శలు వాటికి సమాధానం ఇచ్చాను నా సమాధానానికి ఎవరూ జవాబు చెప్పలేదు - చెప్పలేరు ఆ సమాధానం మిత్రుడు టంకసాల అశోక్‌కు నచ్చకపోవటం నేను అర్థం చేసుకోగలను అతను విరసం సభ్యుడు సాటివాళ్ళలో గల లోపాలను సమర్థించటం అతనికి బాధగానే ఉంటుంది నేను సమాధానం ఇచ్చింది విరసం సభ్యులను మభ్యపెట్టటానికి కానే కాదు కాని విరసంలో ప్రముఖుల మీద వ్యతిరేకులు దుమ్ము చల్లినప్పుడు వారిని సమర్థించటం గాని, అంతకుముందు తానే విరసం సభ్యుల బలహీనతలను విరసం పరిధిలో విమర్శించటం గాని అశోక్ చెయ్యలేదు ఎందువల్ల? ఇది ఆలోచించదగిన విషయం అనుకుంటున్నాను

అటు తరవాత యువ రచయితలు - ముఖ్యంగా కథకులు తాము విప్లవ సాహిత్యం ఎలా సృష్టించాలనే సమస్యతో సతమతమయారు నేను కథలూ, నవలలూ రాయటం మానేసినప్పటికీ, ఆ యువకులు తెచ్చిన ప్రశ్నల మీద దీర్ఘంగా ఆలోచించి, నాకు తోచిన భావాలను ఎప్పటికప్పుడు ఒక్కొక్క వ్యాసంగా పత్రికలకు పంపుతూ వచ్చాను నిజానికవి చర్చ నిమిత్తం రాసినవే గాని రచయితలకు ఆదేశాలు కావు చర్చలు జరిగాయి కూడా ఆ వ్యాసాలు పుస్తక రూపంలో వెలువడాలని నేను కోరలేదు సృజన ప్రచురణగా దాన్ని వెలువరిస్తాయని వరవరరావుగారు అన్నప్పుడు, ఆ వ్యాసాలలో ఎలాంటి లోపాలుంటాయోనన్న అనుమానంతో, జాగ్రత్తగా ఎడిట్ చేయించమని హెచ్చరించాను

విప్లవోద్యమానికి గురుపీఠంగా ఉండాలన్న కోరిక నాకు ఏ కోశానా లేదు ఎవడన్నా ''గురువు'' ఫోజు పెట్టిన వాణ్ణి చవట వెధవ కింద పరిగణిస్తాను విప్లవ రచయితల మధ్య తారతమ్యాలు పరిగణించటం కూడా నాకు సమ్మతం కాదు

నిజానికి నా వ్యాసాలను ఎప్పటికప్పుడు ఉద్యమంలో వాళ్ళు పూర్తిగా విమర్శించి ఉండవలసింది ప్రభాకర్‌రెడ్డి గారైనా ఉన్న లోపాలన్నింటినీ విమర్శించారనుకోను నేనా వ్యాసాలు రచించిన పద్ధతిలోతడువుకోవటం చాలా ఉన్నది అలా రాసిన వాటిలో ఎన్ని రకాల ప్రమాదాలైనా రావచ్చు తప్పులు చెయ్యకుండా ఉండే హక్కు, చేసినా అవి తప్పులు కావనే హక్కూ ఒక్క గురుపీఠాలకే ఉంటుంది!

దేశకాలాలను బట్టి మార్క్స్, లెనిన్, మావోలకు వర్గ ప్రాముఖ్యం తేడాగా కనిపించిందాన్ని నేను రాసినప్పుడు అది నిజమేనని నమ్మే రాశాను నా వాక్యంలో ప్రభాకర్‌రెడ్డి గారికి స్ఫురించిన అర్థాలు నాకు స్ఫురించలేదు అది పూర్తిగా మార్క్సిజానికి వ్యతిరేకమని ప్రభాకర్‌రెడ్డి గారు

చెప్పినదాకా నాకు తెలీదు అయితే ఆ వాక్యం విప్లవ సాహిత్యోద్యమానికి నష్టం కలిగించకపోతే నేను అంతగా బాధపడను

''తిరుగుబాటు'', ''విప్లవం'' అనే మాటలకు నా నిర్వచనం ఏమిటని ప్రభాకర్‌రెడ్డిగారు అడుగుతున్నారు ఇలాటి మాటలకు కూడా తలా ఒక నిర్వచనమూ ఉండటం హాస్యాస్పదం సాధారణంగా విప్లవాలు తిరుగుబాటు నుంచే పుడతాయనుకుంటాం అన్ని తిరుగుబాట్లూ విప్లవ స్థాయిని అందుకోలేవు తిరుగుబాటు సాంఘిక పరిస్థితులలోనూ, ఉత్పత్తి విధానాలలోనూ, ఉత్పత్తి సంబంధాలలోనూ మౌలికమైన మార్పులను సాధించినప్పుడు విప్లవం అనిపించుకుంటుంది శ్రీకాకుళంలో గాని, నక్సల్‌బరిలో గాని ఇటువంటి పరిణామం జరగలేదన్న ఉద్దేశంతో అక్కడ జరిగినది విప్లవాలు కావన్నాను నేనిలా అనుకోవటంలో ప్రాముఖ్యత ఏదన్నా అంటే అది రాజకీయమైనదే కావాలి కాని ఒకటి చెప్పగలను నాకు తిరుగుబాట్ల మీద కూడా అంతులేని గౌరవం ఉంది విప్లవాలుగా పరిణతి చెందలేకపోయినంత మాత్రాన నేను తిరుగుబాట్లను తక్కువ చూపు చూడను

*సృజన, మాసపత్రిక, మార్చి 1972*

## 25. భావ పరివర్తన – విరసం

"Before a brand-new social system can be built on the site of the old, the site must be first swept clean Old ideas reflecting the old system unavoidably remain in people's heads for a long time They do not easily give way" - Mao

(పాత వ్యవస్థ మీద సరికొత్త సాంఘిక విధానం నిర్మించాలంటే, మొదట పాత వ్యవస్థను శుభ్రంగా ఊడ్చెయ్యాలి పాత వ్యవస్థను ప్రతిబింబించే పాత ఆలోచనలు అనివార్యంగా ప్రజల మనసుల్లో చాలాకాలం వుంటాయి అవి అంత సులభంగా కొత్త వాటికి దారియియ్యవు - మావో )

మానవ సమాజం ఎన్నో రూపాలలో ఉండగలదో, ఏరూపం నుంచి ఏరూపానికి పరిణతి పొందిందో ఆ పరిణామాల వెనక ఉండిన భౌతిక కారణాలు ఏమిటో ఈనాడు విద్యావంతులకు చాలా మందికి తెలుసు విద్యాధికులు కాని వారికి కూడా అపరిణత సమాజాలను గుర్తించే శక్తి ఉంటుంది ఇల్లూ వాకిలీ లేకుండా సంచార జీవితం గడుపుతూ, ఏ చెట్లకిందనో కుటుంబాలతో సహా కొద్ది రోజులు ఉండిపోతూ, ఎలుకలనూ, పిల్లులనూ పట్టితింటూ జీవించే లంబాడీల సామాజిక వ్యవస్థ మనకన్న అపరిణతమైనదని గ్రహించటానికి పెద్దగా విజ్ఞానం అవసరం లేదు అలాగే మన దేశంలో ఆదిమ జాతుల వాళ్ళూ, ఆటవిక జాతుల వాళ్ళూ ఉన్నారు వారికీ ఒక సామాజిక వ్యవస్థా, కొన్ని నియమాలూ ఉన్నాయి నిజం చెప్పాలంటే ఆ సామాజిక వ్యవస్థలో ఉన్న కొన్ని మంచి లక్షణాలు మన వ్యవస్థలో లేవు - నిజం చెప్పటమూ, పరస్పర సహకారమూ, సమిష్టి జీవనమూ మొదలైనవి అయినా అవి అపరిణత సమాజాలే వాటికి కాలదోషం పట్టింది ఇలాటి అపరిణత సమాజాలలో ఉండే ''స్వచ్ఛ సౌందర్యాలను'' అర్థంచేసుకున్న నాగరిక

మానవులు వాటిని అలాగే కొనసాగనివ్వమని అభ్యర్థిస్తారు "ఆదిమజాతుల వాళ్ళకు ఇనపనాగలి ఇవ్వకండి వాళ్ళు బాధపడతారు", అన్నాడు వెరియర్ ఎల్విన్

కొయ్యనాగళ్లు మాని ఇనపనాగళ్ళు వాడమంటేనే బాధ కలుగుతుందంటే, వేటాడి జీవించేవాళ్ళు వ్యవసాయం చేసట్టి గ్రామాలు ఏర్పాటు చేసుకుని, స్థిర నివాసాలు కల్పించుకుని, చాలా విస్తృతమైన సమాజాలలో నివసించటం ప్రారంభించాలంటే ఎంతబాధో మనం ఊహించవచ్చు అవును అది సామాజిక వ్యవస్థలో ఒక విప్లవ పరిణామం విప్లవ పరిణామాలు "బాధ" లేకుండా సాధ్యం కావు మారుమూల పల్లెటూరి వాళ్ళు ఏ మహానగరానికో వచ్చి, రెండు రోజులు కూడా ఉండలేక, తిరిగి తమ గ్రామాలకు పారిపోయి హాయిగా ఊపిరి పీల్చుకోవటం మనకు తెలుసు ఒకే సమాజంలో రెండు పొరల మధ్య అంత అంతరం ఉన్నది ఆ పల్లెటూరి వాడికి ఈ మహానగరం జీవితంలోని వేగమూ, "అనాచారమూ", "విశృంఖలత్వమూ" దుర్భరమనిపిస్తాయి

మొత్తం సమాజంలో కాలక్రమాన విధిగా జరిగే విప్లవ పరిణామాలు, వాటికి సిద్ధంగా లేనివాడికి ఇంకెంత దుర్భరమనిపించవచ్చు,

మరొకవ్యక్తిని తీసుకుందాం వాడూ గ్రామం నుంచి మహానగరానికి వచ్చిన వాడే అయితే వీడు గ్రామీణ జీవితం పైన మానసికంగా ఎదిగినవాడు అంతకన్న పరిణత జీవితం నగరంలో ఉన్నదని గ్రహించినవాడు వాడికి మహానగరం తనకు గ్రామంతో పోలిస్తే, స్వర్గంలాగుంటుంది మొదటివాడికి వేగం అనిపించినది వీడికి చైతన్యం, విశృంఖలత్వంగా కనిపించినది స్వేచ్ఛ అనాచారంగా కనిపించినది మూఢాచారాల నుంచి విముక్తి వీడు కుగ్రామానికి తిరిగిపోలేడు పోతే యేమాత్రమూ సుఖపడడు ఖైదులోకో అరణ్యంలోకో పోయినట్టు బాధపడతాడు వీడు మెట్టు ఎక్కేశాడు

కాని అంతటితో వాడికి మోక్షం లభించదా? లేదు వీడు ఈ మహానగర జీవితం నుంచి స్వీకరించగలడుగాని దానికి ఏమీ ఇయ్యలేడు తనకు గ్రామంలో ఉన్న పొలాలూ పుట్రలూ అమ్మేసి ఒక వెలుగు వెలిగి ఆరిపోతాడు

విప్లవ పరిణామాలు సంఘంలో తోసుకు వచ్చినప్పుడు వాటికి మానసికంగా సిద్ధంగా ఉన్నంత మాత్రాన చాలదు వాటికి అనుగుణంగా జీవిత విధానాన్ని మలచుకోవలసి ఉంటుంది

మన జీవితం కీకారాణ్యంకన్న అధ్వాన్నంగా ఉన్నది ఈ జీవితంలో శ్రామికులూ, పాటకులూ, దరిద్రులూ మనుషుల్లాగా బతకటం అసంభవం వాళ్ళు సమష్టిగా తలుచుకుంటే జీవితాన్ని క్షణంలో స్తంభింపజేయగలరు (నిన్న బ్రిటిషు బొగ్గుగని పనివాళ్ళు ఏం చేశారో చూడండి) నాగరికత అలాంటి శక్తిని వారి చేతికి ఇచ్చింది గాని మన సామాజిక వ్యవస్థ వారికి కడుపునిండా తిండి కూడా ఇవ్వదు అందుచేత ఈ సామాజిక వ్యవస్థకు అంగరక్ష వారిలో భావచైతన్యం లోపించటమే

వలస పాలన మన దేశంలో సాగినప్పుడు పాశ్చాత్యులు మనని కొంతవరకైనా సామాజికంగా అభివృద్ధి కానిచ్చారు వారిది సత్పరిపాలన అనలేం ఒకవేళ అందామన్నా సత్పరిపాలన కన్న స్వపరిపాలన మేలు మనకు స్వపరిపాలన రానే వచ్చింది తమ పాలకులను ప్రజలే ఎన్నుకునే పరిస్థితిలో దేశంలోని అన్ని వర్గాలూ కొంతవరకైనా బాగుపడి ఉండవచ్చు కాని అది జరగలేదు

అందుకు రెండు కారణాలున్నట్టు నాకు తోస్తుంది ఒకటి, బూర్జువా ప్రజా స్వామికానికి కాలదోషం పట్టడం రెండు, మన దేశంలో బూర్జువా ప్రజాస్వామికం నుంచి లాభం పొందే మనస్తత్వం పాలితులకు గాని, పాలకులకు గాని లేకపోవటం

ప్రపంచం మొత్తం మీదనే బూర్జువా ప్రజాస్వామికానికి నూకలు చెల్లాయనటానికి చాలా ఆధారాలున్నాయి ఇంగ్లండు అమెరికాలలో ఏ పక్షం పాలనాధికారం వహించినా ఒకే విధమైన ప్రజాద్రోహం జరుగుతూ ఉండటం చూస్తున్నాం పీడితుల పట్లా అంతర్జాతీయ అవినీతి పట్లా ''బై పార్టిజాన్'' విధానాలు చక్కగా కొనసాగుతున్నాయి కుమ్ములాటలు పార్టీల మధ్య జరిగినప్పుడు వాటికి ప్రజాభ్యుదయంతో ఎలాటి సంబంధమూ ఉండటం లేదు ఇంతకన్న ''శ్రామికవర్గ నిరంకుశత్వం'' ప్రజలకు ఎన్నో రెట్లు మేలు చేస్తూ ఉండటం కూడా మనం చూస్తున్నాం అవే ఈనాడు గట్టి దేశాలు వాటి కోసమే ''ఫ్రీ వరల్డ్'' పురాణకాలపు రాక్షసత్వాన్నీ, పైశాచికత్వాన్నీ ఒక వంక అవలంబిస్తూ, మరొకవంక పతనావస్థలో పడిపోతోంది ఈ విషయం రాజకీయ విజ్ఞులకు వదిలేస్తాను

మనం బూర్జువా ప్రజాస్వామికానికి కూడా సిద్ధంగా లేమని రోజూ మన పత్రికలు చెబుతున్నాయి వెనక ఒక కాంగ్రెసు మంత్రి ఒక చోట ఉపన్యాసం చేస్తూ ''మీరు మా ప్రతినిధిని గెలిపించలేదు? మేము మీ ప్రాంతానికి సదుపాయాలు ఎందుకు చేయాలి'' అన్న అర్థం వచ్చేట్టు మాట్లాడాడట (తరవాత తాను అలా అనలేదన్నాడనుకోండి, కాని ఆ మాట అచ్చేసిన పత్రిక మీద దావా పడెయ్యలేదు మరి)

నిన్నటి (4 మార్చి) '' ఆంధ్రజ్యోతి'' పత్రికలో ఇలా ఉన్నది ''డబ్బు తీసుకున్నా ఓట్లు (అంటే వోట్లు) మాకు వెయ్యండి'' శ్రీ ఇస్మాయిల్ విజ్ఞప్తి

అభ్యర్థులు వోట్ల కోసం డబ్బివ్వటం గురించి శ్రీ ఇస్మాయిల్‌కు అభ్యంతరం లేదు ఆ ఆచారాన్ని ఆయన ఆమోదిస్తూ, వోటర్లకు కృతఘ్నత మప్పుతున్నారు శ్రీ ఇస్మాయిల్ వోటర్లను ఇచ్చిన మాట నిలుపుకోవద్దంటున్నారు శ్రీ ఇస్మాయిల్ ఈ మాటను కాంగ్రెసు అధిష్ఠానవర్గం తరఫునే అంటున్నారనుకోవాలి ఈయన రాష్ట్ర కాంగ్రెస్ అడ్‌హాక్ కమిటీ అధ్యక్షులు

ఇంతకన్నా కూడా విలువైన ముక్క శ్రీ వి బి రాజు (తెలంగాణా నాయకులు, పార్లమెంటు సభ్యులు) సెలవిచ్చారు ''రాష్ట్రంలో కాంగ్రెసుకు మెజారిటీ రాకుంటే రాష్ట్రపతి పాలనే!''

కాంగ్రెసేతర పార్టీలు ప్రాంతీయంగా నెగ్గినట్టయితే వాటిని తోసిపారేసేటందుకు తగిన ఏర్పాటు మన రాజ్యాంగంలో ఉన్నదని ప్రజలకు శ్రీ వి బి రాజు గారు జ్ఞాపకం చేస్తున్నారు ప్రజలు శుంఠలన్న భావంతో వారు అలా జ్ఞాపకం చేసి ఉంటారు లేకపోతే ఇందులో కొత్త సత్యం ఏమీలేదు స్వతంత్ర భారత చరిత్ర నిండా ఇది ఉన్నదే ఈ దేశాన్ని కాంగ్రెసు తప్ప మరే పార్టీ కూడా పరిపాలించలేదు పరిపాలించజాలదు

ఇది ప్రజాస్వామ్యం కాదు కాదని ప్రజలకు తెలీదు ప్రజాస్వామ్యమంటే ప్రజలకు తెలీనంతకాలమూ మనకు ప్రజాస్వామ్యం ఉండటానికి వీల్లేదు

ఎన్నికలు ఉండటమే ప్రజాస్వామ్య లక్షణమన్నది అపోహ ఏయే నియోజక వర్గాలలో ఏయే కులాల వోటర్ల సంఖ్య ఎంత ఉన్నదో బాహాటంగా ప్రదర్శించి, కులం వాళ్ళు తమకులం

వాడికే వోటు వేస్తారన్న అభిప్రాయాన్ని రాజకీయంగా వినియోగించుకుంటున్నారు అభ్యర్థుల ఎన్నికా, వారికి పోటీదార్లను ఎన్నుకోవటమూ ఇదే ప్రాతిపదికపై జరుగుతున్నది

ఇది కూడా ప్రజా స్వామ్యం కాదు (కులాలవారీ వోట్లు గణజీవితానికి చెందినవి) అయితే ఈ కుల ప్రాతిపదిక దాఖలాలు చూపుతున్నది, ఫలితాలు ఇస్తున్నది

ఎన్నికల ద్వారా సోషలిజం వస్తుందా, రాదా అన్నది అనవసరమైన ప్రశ్న వాటి ద్వారా ఇప్పటి పరిస్థితిలో మనదేశానికి బూర్జువా ప్రజాస్వామ్యం కూడా రాదు ఇంకెప్పుడో వస్తుందని నమ్మకోవటం అవివేకం

వెనుకబడిన దేశాలు ముందుకు రావాలంటే సోషలిజమే శరణ్యమని నెహ్రూ ఏనాడో అన్నాడు ఆమాటకు కాలదోషం పట్టలేదు గనకనే మన పరిపాలకులు ఆ మంత్రాన్ని శివపంచాక్షరిలా జపిస్తున్నారు

మనదేశంలో సోషలిస్టు ఆర్థిక వ్యవస్థా, కమ్యూనిస్టు సమాజమూ ఏర్పడాలంటే సమాజంలో విప్లవ కరమైన మార్పులు రావాలి రేపు రాబోయే మార్పులకు అనుగుణంగా ఇవాళ ప్రజల దృక్పథాలు మారాలి లాండ్రీ మూసేసి చెప్పులషాపు పెట్టినంత సులువు కాదు ప్రజల బుద్ధులూ, నమ్మకాలూ ఉన్న వ్యవస్థను వీలయినంత వరకు ఆధారం చేసుకుని కొనసాగుతాయి కొన్ని సందర్భాలలో అవి నూరేళ్ళ, వెయ్యేళ్ళ క్రితం ఉండిన సామాజిక వ్యవస్థలను ఆధారంగా చేసుకుని కూడా నిలబడతాయి రేపు రాబోయే వ్యవస్థకు అనుగుణంగా భావాలను తీర్చిదిద్దుకోవటనేది మహామేధావులకు తప్ప సాధ్యంకాదు ఆ రావలసిన, రాదగిన, రానున్న వ్యవస్థ ఎంత సునిశితంగా చూడగలిగితే అంత ద్రష్ట మార్క్స్, లెనిన్, మావోలు ఆజాతికి చెందిన ద్రష్టలు అందుకే నిజమైన మేధావులు అలాంటి ద్రష్టలను అనుసరిస్తారు

ఈనాడు మనం మనచుట్టూ చూసే మూఢాచారాలూ, దేవుడి ముడుపులూ, నిలువు దోపిడీలూ, రాజకీయవంచనలూ, ప్రగతివాదులపైనా, ప్రతిపక్షాలపైనా హత్యాకాండలూ, భయంకరమైన అజ్ఞానమూ, దారిద్ర్యమూ - ఇవి పోయి తీరుతాయి దైవికంగా కాదు, ఇవి ప్రకృతికీ, మానవ ప్రకృతికీ విరుద్ధం గనక నిజం జ్ఞానంద్వారా కాకపోతే అనుభవం నుంచి అయినా తెలుస్తుంది గనక! ఈ వ్యవస్థ మారుతుంది ఆ మార్పు ఎలా ఉండాలో కూడా మనం ఊహించవలసిన పనిలేదు మనకన్న తక్కువ పరిణతి గల సామాజిక వ్యవస్థలను మనం గుర్తిం గలుగుతున్నాంగాని మనను అధిగమించిపోయిన సమాజాలను మనం గుర్తించలేకుండా ఉన్నాం కారణం వెనకచూపు ముందుచూపు లేకపోవటం

రానున్న పరిణామం విప్లవ పరిణామమని గుర్తించలేనివాళ్ళు చాలా మంది ఉన్నారు కాంగ్రెసుకు దండిగా వోట్లు వెయ్యడం తప్ప ఇంకేమీ అవసరంలేదని పాలకవర్గం కేకలు పెడుతున్నది ఇది కాంగ్రెసు మార్కు రాజకీయవిజ్ఞానం అనుకోవాలి కాబోలు

నామటుకు నాకు మన సమాజం యొక్క పరిణత ఒక మహాయజ్ఞం రూపంలో తప్ప కన్పించటంలేదు కుగ్రామం నుంచి మహానగరానికి వెళ్ళేవారిలో రెండురకాలను గురించి మొదట చెప్పాను ఆ రెండురకాల వాళ్ళూ రానున్న విప్లవానికి ఉపకరించనివాళ్ళే మొదటిరకం వాళ్ళు సోషలిస్టు వ్యవస్థను చూసి హడలిచస్తారు రెండో రకం వాళ్ళు అందులో మంచి చూసి కూడా దానికి అనుగుణంగా తమ జీవితాలను మార్చుకోలేక దానికి బలి అయిపోతారు

పై రెండు రకాలూగాక సామాజిక విప్లవాన్ని సర్వశక్తులతోనూ ప్రతిఘటించే అమిత బలసంపన్నమైనవర్గం ఉన్నది ఆయుధాలూ, ఆయుధధారులూ వారి పొత్తు వారి ప్రతిఘటన బలాన్ని బట్టి రక్తపాతం జరుగుతుంది - జరుగుతూనే ఉన్నది

ప్రస్తుత పరిస్థితిలో ప్రజలకు తమ జీవితం గురించి నిజం తెలియాలి రాబోయే సమాజం గురించి తెలియాలి అందులో వారు నిర్వహించే పాత్ర, దాన్ని అవతరింప జేయటంలో వారు నిర్వహించిన పాత్రా అర్థంకావాలి

ఈ జ్ఞానం ప్రజలకు ఎలా కలిగేటట్లు వారిలో ప్రాథమిక చైతన్యం కలిగాక ఆచరణజ్ఞానానికి తోడవుతుంది కాని ఆ ప్రాథమికచైతన్యం ఎలా కలుగుతుంది సినిమాలు కలిగించవు రేడియో ప్రసంగాలు కలిగించవు ప్రాచీన సాహిత్యం కలిగించదు వర్తమాన సాహిత్యంలో చాలాభాగం నిష్ప్రయోజనం (అది కూడా మతంతో పోటీ చెయ్యగల నల్లమందే ) ఈ పని విప్లవ సాహిత్యం వల్లనే కావాలి

విప్లవానికి పూర్వం చీనా మనదేశం కన్న ఏమంత ముందులేదు అలాంటి దేశాన్ని విప్లవాభిముఖం చెయ్యటానికీ, నూతనదశకు చీనా ప్రజలను సుముఖులను చెయ్యటానికీ మహాయజ్ఞం జరిగింది యుద్ధాలూ, ప్రతీపశక్తుల విధ్వంసమూ, రక్తపాతమూమాట అటుంచి, విప్లవం విజయవంతం అయాకకూడా సాంస్కృతికవిప్లవం అనేకదశలలో జరిగింది మావో ప్రజల మనస్సులనే గాక కేడర్ల మనస్తత్వాన్ని కూడా మార్చటానికి అపార కృషి చేశాడు "మావో థాట్" విస్తృతంగా ప్రచారమయింది

ఇదంతా "బ్రేన్ వాషింగ్" (భావక్షాళన) అని ప్రచారం చేశారు

ప్రతి దేశంలోనూ, ప్రతికాలంలోనూ, ప్రజలకు ఏదోవిధమైన భావక్షాళన జరుగుతూనే ఉన్నది మతాన్నిమించిన "బ్రేన్ వాషింగ్" మరి ఉండదు దాన్ని మనం కనీసం మూడువేల ఏళ్లుగా అనుభవిస్తున్నాం అందుకే మనదేశంలో ప్రత్యక్షజీవితం కన్న లోకాంతరాలు యదార్థం, ఈజన్మకన్న పూర్వ జన్మ ఎక్కువనిజం, మనిషికష్టాలకు మనిషే బాధ్యుడు వెంకటేశ్వరస్వామి ఉద్యోగాలిస్తాడు, ఆరోగ్యం ఇస్తాడు, (డబ్బు పుచ్చుకుంటాడన్నది అముఖ్యమైన నిజం!) ఎన్నికలలో గెలిపిస్తాడు, చెత్తపిక్కర్లను కూడా కనీసం నూరురోజులు నడిపిస్తాడు

మన దిక్కుమాలిన సమాజంలో జబ్బుచేస్తే అది గాలి అనో, చేతబడి అనో అనుకునేవాళ్లు లక్షల సంఖ్యలో ఉన్నారు

_ ప్రజలను సోషలిజముకు కాదు సరేగదా, ప్రజాస్వామ్యానికైనా అనుగుణంగా తయారు చెయ్యటానికి ఆవడిసోషలిస్టు పాంథికులు ఏం చేస్తున్నారో తెలుసుకోవాలనుకోవటం తప్పుకాదు ఏమీ చెయ్యటం లేదనుకోవటం కూడా తప్పుకాదు ఎందుచేతనంటే ప్రజల అజ్ఞానాన్ని బలపరచటానికి ఎన్నికల సమయంలో మరింత తీవ్రకృషి జరుగుతున్నది గనక

జనసామాన్యంలో క్షాళన కావలసినది చాలా ఉన్నది వారి జీవితానుభవాన్ని ఆధారం చేసుకుని రచయితలు ప్రజలను పీడించే తప్పుడు ఆలోచనావిధానాలను తప్పక క్షాళనం చెయ్యాలి అందుకు ఇప్పుడు జరిగే కృషి ఎంతమాత్రమూ చాలదు

*సృజన, మాసపత్రిక, ఏప్రిల్ 1972*

# 26. విప్లవ వాస్తవికత

విప్లవ సాహిత్యకారులు ముఖ్యంగా అన్వేషించదగినది జీవితంలోని విప్లవ వాస్తవికత ఇలాంటి పదం ఇంతవరకు మన మధ్య పుట్టలేదు కాని ఈ మాటను గురించి లోతుగా ఆలోచించటం చాలా అవసరం

జీవిత వాస్తవికతలు బహువిధాలుగా ఉండటం మనం గమనిస్తున్నాం సమస్యలు తాతా, బిర్లాల దగ్గరినుంచి డవాలీ బంట్రోతు దాకా అందరికీ ఉంటాయి కోటీశ్వరుడు తమ వ్యాపార సామ్రాజ్యాలను విస్తరించే కృషిలో నిద్రాహారాలు కోల్పోయి, టెన్షన్ హెచ్చి జబ్బుపడతారు రెండో చివర కుచేలుళ్ళు పిల్లలకు గంజి కూడా పొయ్యలేక మనోవ్యాధి పడతారు, వాళ్ళ పిల్లలు తిండిలేక మంచం పట్టేస్తారు

జీవితంలో మత వాస్తవికతా, బూర్జువా వాస్తవికతా, మానవ వాద వాస్తవికతా, ఫ్యూడల్ వాస్తవికతా - ఇలా రకరకాల వాస్తవికతలు ఉన్నాయి ఒక వాస్తవికతను మాత్రమే ఆశ్రయించగల వాడికి మిగిలినవి అప్రస్తుతం అవుతాయి

డిప్రెషన్ రోజుల్లో మా ఇంట్లో ఒక ప్లీడరుగారు అద్దెకు ఉండేవాడు నాలాగే ఆయన కూడా అప్పుల కారణంగా ఉన్న స్థిరాస్తి అంతా పోగొట్టుకున్నాడు ఆయన దగ్గరికి ఒకనాడు ఒక క్లయింటు వచ్చి, "ప్లీడరుగారూ, ఇప్పుడు నవరసు ధర ఎంత ఉంటుంది?" అన్నాడు వెంటనే ప్లీడరుగారు వెర్రిగా నవ్వనారంభించాడు క్లయింటు బిత్తరపోయాడు ప్లీడరుగారు తాను సంబాళించుకుని, "మీకేమన్నా పిచ్చా? ఈరోజుల్లో బంగారం ధర ఎంతైతే ఎవడిక్కావాలి?" అన్నాడు

నేను కూడా జీవిత వాస్తవికతను ప్లీడరుగారి దృష్టితోనే చూస్తూ ఉండిన కారణం చేత ఆయన చివరకు అన్న మాట నాకు పరమ సత్యం అనిపించింది బంగారం ధరకు క్లయింటు జీవితంలో స్థానం ఉన్నది ప్లీడరు గారి జీవితంలో (నా జీవితంలో కూడా) ఆ సమయంలో స్థానం లేదు తరవాత ఆయనగారి జీవితం మార్పు చెంది ఉండవచ్చు ఆయన నూరు సవర్ల బంగారం కొని ఉండవచ్చు అది వేరే విషయం

ఏనాడైనా మనం మాట్లాడేటప్పుడు అవతలి వాడు పాటించే జీవిత వాస్తవికతను గ్రహించి ప్రసంగించాలి ఒక కుర్రవాడు హిందీ సినిమా తారల అభ్యంతర జీవితాల తాలూకు రసవత్తర విషయాలు మాట్లాడటం మొదలు పెట్టేసరికి, నాకు వాటిలో ఆసక్తి ఏమీ లేదని మృదువుగా చెప్పి విషయం మార్చవలసి వచ్చింది

సాహిత్యం మొదలైన కళలలో కూడా అంతే కార్మికుల ముందు నైరూప్య చిత్రకళ ప్రదర్శిస్తే వాళ్ళు వెళ్ళిపోతారు

మానవ స్వభావం పరిపక్వమై ఉందని గాని, ప్రతి ఒక్కరికీ తమ జీవితం తాలూకు వాస్తవం అవగాహన అవుతుందని గాని నేను అనటం లేదు అజ్ఞానమూ, భ్రమలూ, అపోహలూ, మనందరినీ అంతో ఇంతో ఆవేశించి ఉంటున్నాయి మనం వాటినుంచి బయటపడే ప్రయత్నంలో ఉన్నప్పుడు కళలనూ, ఇతర సాధనాలనూ ఆధారం చేసుకుంటాం

విశ్వనాధ వారు తాము ఆర్ష సంప్రదాయంతో జీవిస్తున్నట్టు భ్రమపడవచ్చు ఔత్సాహికులైన యువకులు కొందరు కుటుంబరావు, శ్రీశ్రీ, రాచకొండలు సోషలిస్టు సమాజంలో ఎందుకు జీవించటం లేదని ఆక్షేపించవచ్చు మా పొరుగున ఉన్న ఒక తమిళ క్రైస్తవుడు రేడియోలో పాశ్చాత్య సంగీతం తప్ప పెట్టడు, అది క్రైస్తవ సంగీతమని అతని భ్రమ కావచ్చు ఇంగ్లండు చలి దేశం గనక మనవాళ్ళు ఈ దేశంలో సూట్లూ, బూట్లూ, మేజోళ్ళూ, మఫ్లర్లూ వేసుకు తిరగటం ఒకప్పుడు జరిగింది అరేబియాలో నీటి ఎద్దడి గనక ఇక్కడి ముసల్మానులు స్నానం చెయ్యటం మాని, నెలల తరబడి బట్టలు మార్చుకోకపోతే వారి జీవిత వాస్తవికత వారికి తెలియదనే అనుకోవాలి

సన్యాసులు కిరీటాలు పెట్టుకుని, ఏనుగులను పోషిస్తూ, పల్లకీలలో ఊరేగుతూ, దివాణాలు వెలగబెట్టుతుంటే అందులో విడ్డూరం ఏమీ లేనట్టు భావించే జాతికి అపోహలు తక్కువవుతాయా? అపోహల నుంచి అపోహలు తుట్టెలు పుట్టుకొస్తాయి నిజం మారుతుంది గాని దానికి అనుగుణంగా విశ్వాసాలు మారవు కులాలన్నవి భౌతిక కారణాలుండబట్టే పుట్టాయనుకోవచ్చు కాని ఆ భౌతిక ఆధారాలు ఏనాడో అదృశ్యమయాయి ఈనాటి కులాలు అవాస్తవమైనవి వర్గాలే నిజమైనవి కాని కులతత్వం గగన సౌధం లాగా నిలబడే ఉన్నది మాదిగలు తమ కన్న తక్కువ కులమని గట్టిగా నమ్మే మాలలు మిగిలిన కులాలు తమకన్న ఎక్కువైనవనే నమ్మకం నుంచి ఎలా విముక్తులైతారు? చెవులు వినపడకుండా పోయిన వాళ్ళకు కొందరికి కణతల వద్ద ఉండే నరాలు కొద్దిపాటి శ్రవణ శక్తి నిస్తాయట అలాగే ఆర్థికమైన పునాది అంతరించిపోయిన కులవ్యవస్థకు ఈనాడు ఆధారంగా ఉన్నవి తిండి అలవాట్లూ, మాటయాసా, కట్టూ, బొట్టూ మొదలైన క్షుద్ర సంకేతాలు

ఈ దుర్భ్రమల నుంచి వ్యక్తులు స్వానుభవంతో బయటపడడం అసంభవం కాదుకాని, దాదాపు అసాధ్యమే సామాజిక వాతావరణం వ్యష్టి అనుభవాలను భాసించనివ్వదు సోడా తాగటం పాపమనుకునే పెద్ద వాళ్ల మధ్య పెరిగే కుర్రవాడు తప్పు లేదని తెలిసి కూడా రహస్యంగా సోడా తాగుతాడు నా చిన్నతనంలో పిల్లలు సినిమాలు చూడటం చాలా తప్పుగా భావించే పెద్దవాళ్ళు ఉండేవాళ్ళు తమ చుట్టూ ఉండే వాళ్ళ సలపరితం లేకపోతే చాలా మంది తమ కుమార్తెలకు కట్నాలు పోసి పెళ్ళి చేసే ప్రయత్నం కట్టిపెట్టి, చదివించి, ఉద్యోగాలు చేయిస్తారు

అందుచేత ఈ పని సాహిత్యం మొదలైన సామాజిక సాధనాల ద్వారా సాగాలి వీరేశలింగం గారు చేయించిన విధవా వివాహాల కన్న ఆయన రచనలు తెలుగు జాతిలో హెచ్చు భావపరివర్తన తెచ్చి ఉండాలి నిజానికి జీవిత వాస్తవికతను ప్రచారం చెయ్యటానికి సాహిత్యాన్ని మించినది లేదు ''ఆనాడు రావణాసురిడి గతి ఏమయింది? దుర్యోధనుడు పాండవులకు ద్రోహం తలచకపోతే ఎంత గొప్పగా బతకవలసిన వాడు!'' అనే ధోరణిలో మాట్లాడే వాళ్ళు ఈనాడింకా ఉన్నారు! వాళ్ళు తమ జీవిత సత్యాలను రెండు వేల ఏళ్ళ నాటి సాహిత్యంలో వెతుక్కోవటం శోచనీయం

అదీగాక ఈనాటి జీవితపు వాస్తవికతల నన్నిటినీ నిరూపించే సాహిత్యం లేదు ''మన భూమి వంటి చల్లని భూమి లేదు'' అన్న కవి ఆధునికుడే అయినా, అందులో తాతా బిర్లాల

వాస్తవికతే ఉన్నది జీవితం ఈ భూమిలో అట్టుడికిపోతున్న వారికి మాట వచ్చి అబద్ధంగా తోస్తుంది బెంగాలు లోని విప్లవవాదుల నడగండి పోలీసులకు చిక్కి కాల్చబడ్డవారిని అడగండి పోలీసుల చేత చెరచబడిన అనాధ స్త్రీలనడగండి

జీవితంలో విప్లవ వాస్తవికత అనేది ఉన్నది ప్రజలు పరిస్థితుల మీద తిరగబడుతున్నారు బూర్జువా విలువలకు కూడా మంచినీళ్ళు పుట్టటం లేదు మానవతా వాదం ప్రభుత్వం హింసాకాండను విమర్శించినప్పటికీ, అహింసా కాండకు కారణభూతమైన వ్యవస్థలో మార్పునూ, ఆ మార్పుకు సాధనమైన విప్లవాన్నీ గుర్తించలేదు మామూలు మనుషులు సూక్ష్మ రూపంలో దేన్నీ చూడలేదు ఏదైనా బృహత్పరిణామంలో వారి ఎదట కనబడాలి గెలిచినది ధర్మయుద్ధం విజయవంతమైన విప్లవాలు మంచివి అసంఖ్యాకులూ, అధిక సంఖ్యాకులూ అయిన ప్రజలు జీవితంలో ప్రేక్షకుల పాత్ర మించి నిర్వహించలేరు భవిష్యత్తును నిర్ణయించే సత్యాల పట్ల వారు అంధులనే చెప్పాలి ఆ కారణం చేతనే విప్లవ సాహిత్యం జీవితంలోని విప్లవ వాస్తవికతను ప్రదర్శించాలి

జీవితంలోని విప్లవ వాస్తవికతను అన్వేషించటం విప్లవ రచయితల పని అది శ్రీకాకుళం గిరిజనులకు కనిపించినంత స్పష్టంగా, సుబ్బారావు పాణిగ్రాహికి అవగాహన అయినంత స్ఫుటంగా అందరికీ అందదు కాని శాస్త్రవేత్తలు విలువైన ఖనిజాలనూ, మణులనూ, పాత రాతియుగపు జీవితావశేషాలనూ అన్వేషించినట్టుగా రచయితలు తమ చుట్టూ ఉండే జీవితం లోని విప్లవ వాస్తవికతను అన్వేషించాలి వజ్రాల కన్న కూడా విలువగలది ఈ విప్లవ వాస్తవికత దాని అన్వేషణ కొనసాగిన కొద్దీ బలమైన విప్లవ సాహిత్యం వస్తుంది అన్వేషకులు ఈ వాస్తవికతను అది పుష్కలంగా లభించే చోటనే - అట్టడుగు జీవితాల్లో - అన్వేషించాలని వేరే చెప్పనవసరం లేదు మణుల కోసం ఎడారులలో వెతకరు

*- సృజన, మాసపత్రిక, మే 1972*

# 27. వి.ర.సం. విప్లవ రాజకీయాలు

ఈ రెంటికీ ఉండవలసిన సంబంధం గురించి విరసం పుట్టిన నాటినుంచీ చర్చ జరుగుతూనే వస్తున్నది రెంటికీ సంబంధం ఉండరాదనటం అర్థంలేని మాట వెనకటికి ఒక ప్రబుద్ధుడు, "కమ్యూనిస్టులు లేకుండా పోతేగాని కమ్యూనిజం రాదు " అన్నట్టుంటుంది సంబంధం ఉంటుంది అయితే అది ఎలాటిది? ఏ రూపంలో ఉండాలి? ఈ ప్రశ్నలకు సమాధానం స్పష్టంగా తెలుసుకోవటం విప్లవ సాహిత్యోద్యమానికీ, విప్లవానికీ కూడా చాలా మేలు చేస్తుందనటానికి సందేహంలేదు

విప్లవ సాహితీ పరులు విప్లవ కార్యాచరణ పట్లా అందులో పుట్టుకొచ్చే ఆటుపోట్ల పట్లా శ్రద్ధ చూపుతారనేది నిర్వివాదం అయితే అలాటి శ్రద్ధ విప్లవం వాంఛించే వారందరూ చూపుతారు విరసం సభ్యులకది ప్రత్యేక హక్కేమీ కాదు విప్లవ సాహిత్యానికీ విప్లవానికి గల విశిష్ట సంబంధం స్పష్టమయే పక్షంలో విరసంకూ విప్లవ కార్యాచరణకూ ఉండదగిన ప్రత్యేక సంబంధం కూడా స్పష్టమవుతుంది

విప్లవ రచయిత తనకు పరిమితమైన బాధ్యతను విప్లవాచరణ పట్ల ఎలా నిర్వర్తించగలడు?

విప్లవకవి విప్లవ వైతాళికుడు కాగలడు విప్లవ రచయిత జీవితంలో తాను గమనించిన విప్లవ పరిస్థితులకు అనుగుణంగా ప్రజలలో తన రచనలద్వారా విప్లవ చైతన్యాన్ని రేకెత్తించగలడు విప్లవాలను '' ఎగుమతి'' చెయ్యటం ఎంత అసంభావ్యమో, విప్లవ పరిస్థితి లేని చోట ప్రజలలో విప్లవ చైతన్యాన్ని రేకెత్తించటం కూడా అంత అసాధ్యం అదేవిధంగా, తాను ప్రత్యక్షంగా జీవితంలో విప్లవ పరిస్థితిని చూడలేని రచయిత తన రచనలద్వారా ప్రజలలో విప్లవ చైతన్యాన్ని విజయవంతంగా కలిగించటం కూడా అనూహ్యమే అటువంటి రచయిత చిత్తశుద్ధీ, విప్లవోద్రేకాలూ ఎంతమాత్రమూ తోడ్పడవు అతడు కృతక విప్లవసాహిత్యం మాత్రమే సృష్టించ గలుగుతాడు ప్రత్యక్ష జీవితంలోవిప్లవ పరిస్థితి ఉండవచ్చు, అతనిలో విప్లవోత్సాహం ఉండవచ్చు కాని అతను వాస్తవవిప్లవ పరిస్థితిని అవగాహన చేసుకోలేకపోతే, అది అతని ''ఆచరణ'' లోపం అవుతుంది విప్లవ కారుడికి ఉన్నట్టే విప్లవ రచయితకు కూడా అతని '' ఆచరణ'' ఉన్నది విప్లవ రచనలను తీర్చిదిద్దే ఆచరణ వేరు, విప్లవాన్ని ముందుకు తీసుకుపోయే ఆచరణ వేరు విప్లవ సిద్ధాంతం విప్లవ రచయితల వంతు అనీ, విప్లవాచరణ విప్లవకారుల వంతనీ కొందరు అనుకుంటున్నట్టు కనిపిస్తుంది ఇది పూర్తిగా తప్పు విప్లవ సాహిత్యానికీ, విప్లవాచరణకు ఒకే సిద్ధాంతం విప్లవ సిద్ధాంతాలను కొత్తగా తీర్చిదిద్దే బాధ్యతను విరసం సభ్యులు చేపట్టటం పచ్చి అహంకారమవుతుంది మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్, మావోలు నిర్వచించిన విప్లవ సిద్ధాంతాలకు విప్లవ కళలు ఒక ఆచరణరూపం విప్లవ కార్యక్రమం మరొక ఆచరణరూపం విప్లవ విజయానికి రెండురకాల ఆచరణలూ సమర్థంగా కొనసాగటం అవసరం రెండు రకాల ఆచరణలలోనూ అవకతవకలు జరుగుతాయి, వాటిని సరిదిద్దుకోవాలి విమర్శా, ఆత్మ విమర్శా రెండు రంగాలలోనూ జరగాలి

విప్లవ మహానాయకులైన లెనిన్, స్టాలిన్, మావోల లాటివారు భావ విప్లవానికి చాలా ఉన్నతమైన విల్లువ ఇచ్చారు విప్లవ కళలు ఏ విధంగా విప్లవాచరణకు దోహదం చెయ్యాలో వివరించారు విప్లవ కళలు విప్లవాకారులకు అదనపు ఆయుధాలు వాటిని వారు తామై తయారు చెయ్యలేరు ఆ పని విప్లవ కళాకారులే చెయ్యాలి అలాగే విప్లవ కారులకు బ్రహ్మాస్త్రాలుగా ఉపకరించే కళలను తయారుచేసే పనిని కళాకారులు దీక్షతో తయారుచేసి వారి కృషికి బలం ఇవ్వాలి విప్లవ సంఘర్షణలో సాయుధులై పోరాడటం విప్లవ కళాకారులకు, సాధ్యం కాదు ఈ విధంగా విప్లవ శ్రమవిభజనతో విప్లవ కళాకారులూ, విప్లవ కారులూ శక్తివంతంగా తమ విధులు నిర్వహించాలి ఎవరు తమ విధులు సరిగా నిర్వహించకపోయినా రెండోవారి పని కష్ట సాధ్య మవుతుంది ఇందులో కూడా ఒక తేడా వున్నది భావ విప్లవం సరిగా సాగటం ఎక్కువ ముఖ్యం, ఎందుకంటే అది విప్లవ కార్యక్రమానికి ప్రాతిపదిక విప్లవ కార్యాచరణకు తగిలే దెబ్బలు విప్లవ సాహిత్యోద్యోమాన్ని అంతగా బాధించవు దీన్నిబట్టి విరసంకూ విప్లవ పార్టీలకూ గల సంబంధం చాలా స్పష్టంగా గ్రహించవచ్చు

విప్లవ రాజకీయ పార్టీలు విప్లవ సాహిత్యోద్యమం పట్ల అత్యంత శ్రద్ధాసక్తులు కనబరుస్తాయి , విప్లవ రచయితలు విప్లవ పురోగమనం పట్ల శ్రద్ధాసక్తులు కనబరుస్తారు

ఇక్కడ ఒకరికొకకు నాయకత్వం వహించే సమస్యలేదు విప్లవ కారుడు విప్లవ సాహిత్యాన్ని సృష్టించలేడు, విప్లవ రచయిత సాయుధ సమరం సాగించలేడు

రెండు పనులూ నిర్వర్తించిన వాళ్ళున్నారు కాని వాళ్ళు ఎక్సెప్షన్, రూల్ కాదు ఉదాహరణకు, అన్ని రకాల విప్లవకారులకూ విప్లవ సాహిత్యరంగంలో కృషి చేసే అవకాశం ఉన్నది అలాగే విరసం సభ్యుడు తుపాకీ పట్టుకుపోతే విప్లవకారులు నిషేధించరు కాని భావ విప్లవం బందూక్ తోనూ, సాయుధ విప్లవం కలంతోనూ సాగదన్న విషయం స్పష్టంగా గుర్తించాలి ఒకదాని ప్రభావం మరొకదానిమీద ఉంటుంది విప్లవ చైతన్యం ముందుకు పోయినకొద్దీ భావవిప్లవం పదునెక్కుతుంది భావ విప్లవం విస్తరించిన కొద్దీ విప్లవం కూడా పురోగమించ గలుగుతుంది అందుకే మావో, లూసన్ కొనసాగించిన విప్లవ రచనలకూ, విముక్త స్థావరాలలో వెలువడవలసిన కళలకూ ఉండవలసిన తేడా వివరించి చెప్పాడు

భావ విప్లవానికీ, విప్లవానికీ మధ్య ఉండే సంబంధాల హద్దులను కూడా మనం సరిగా గుర్తించాలి భావ విప్లవ పురోగమన దశలూ, విప్లవ పురోగమన దశలూ ఒకదానికొకటి అనుగుణంగా ఏర్పడవు భావ విప్లవం క్రమ వికాసంతో ముందుకు పోవాలి విప్లవ పురోగమనం ముందుకూ వెనక్కూ నడుస్తూ ముందుకు పోతుంది రెండు రంగాలలోనూ జరిగే పొరపాట్లు పూర్తిగా భిన్నంగా ఉంటాయి ఈ కారణంచేత, ఒక రంగం మందకొడిగా ఉన్నప్పుడు రెండో రంగం జోరుగా ముందుకు పోవచ్చు

ఈ కారణంచేతనే నేను ప్రారంభం నుంచీ విప్లవ రాజకీయాలకు విరసంను దృఢంగా బంధించటం మంచిది కాదని వాదిస్తున్నాను విప్లవ రాజకీయ దృక్పథంతో విప్లవ రచనల్పై విమర్శనలు చూస్తున్నాను వాటిలో లోపించినది చిత్తశుద్ధి అయితే, లేక విరసాన్ని అవమానించాలన్న దుర్బుద్ధి అయితే, మనం విచారించే పని లేదు కాని ఇలాటి విమర్శలలో లోపించేది భావ విప్లవ పంథాను గురించిన అవగాహన దీనివల్ల విప్లవ సాహిత్యోద్యమానికి ఎక్కువ దెబ్బ

విప్లవాచరణ పట్ల ఈనాడు ''మార్క్సిస్టు-లెనినిస్టుల''మని వ్యవహరించే వారి మధ్యనే అభిప్రాయ భేదాలున్నాయి వేరువేరు దశలకు అనుకూలించే సిద్ధాంతాలను ఏకరువు పెట్టి కొంత నేల విడిచిన సాము చెయ్యటం జరుగుతున్నట్టు కనబడుతుంది మితవాద అతివాద సంఘర్షణల కోలాహలంలో సరి అయిన పంథా విప్లవకారులకే అయోమయం అయిపోయే పరిస్థితిలో వివిధ పంథాల వాళ్ళు, తాము కళాకారులు అయినా కాకపోయినా, విరసం కార్యకలాపాలను తీర్చిదిద్ద యత్నించటం మంచిది కాదు విప్లవ రచయితలలోనే కొందరు విరసం మట్టికొట్టుకు పోతున్నదన్న భావం ప్రకటిస్తున్నారు ఇది అతిశయోక్తి అని నా నమ్మకం విరసం చాలా అద్భుతంగా పని చేస్తున్నదని నేను అనను అది ఇంకా బాగా పని చేయవచ్చు చెయ్యాలి ''విప్లవ మేధావుల''కు విప్లవ భవిష్యత్తు కొంతవరకైనా దర్శించే శక్తి కావాలి కాలక్రమాన విప్లవంతో చేరిపోయే వర్గాలన్నిటినీ వారు చైతన్యవంతం చెయ్యాలి ప్రోలిటేరియన్ నాయకత్వం లేని కారణంచేత మన దేశంలో బూర్జువా విప్లవం కూడా విఫలం కావటమూ, దేశం నయావలస, ఫ్యూడల్ శక్తులకు మరింతగా ఆధీనం కావటమూ జరిగింది ప్రోలిటేరియన్ (మార్క్సిస్టు-లెనినిస్టు) నాయకత్వం లేని తిరుగుబాట్లు దేశమంతటా జరుగుతున్నాయి శ్రామిక విప్లవానికి బద్ధశత్రువులుగా ఉండబోయేవాళ్ళు వాటికి నాయకత్వం వహించబోతున్నారు

ఇలా తిరుగుబాటు చేస్తున్నవారిలో అట్టడుగు వర్గమే కాక ఇంకా అనేక వర్గాలున్నాయి ఈ వర్గాలలో విప్లవ చైతన్యం కలిగించటానికి విరసం కృషి చేస్తున్నట్టు కనబడదు విరసం సభ్యులు మార్క్స్టులు కానవసరం లేదనే ఒక క్షుద్ర వాదన ఒకప్పుడు బయలుదేరింది మార్క్సిజం - లెనినిజం అవగాహన లేని వాడికి విప్లవ పరిస్థితులలో ప్రతి తిరుగుబాటూ విప్లవంలో ఒక భాగంగానే కనబడుతుంది ఈనాటి మన దేశ పరిస్థితి ఎట్లా ఉన్నదంటే, జనసంఘం వాళ్ళూ, ఫాసిస్టులూ, అమెరికా ఏజెంట్లు కూడా జనంలో విప్లవం తీసుకురాగలరు ప్రజలలో ఉన్న తిరుగుబాటు మనస్తత్వాన్ని రాజకీయవాదులు విప్లవానికి అనుకూలంగా ఉపయోగించుకోక, విప్లవ మేధావులు విప్లవంగా అపోహపడటం జరిగితే మార్క్సిజం - లెనినిజం నిద్రపోతున్నదనుకోవాలి ''మార్క్సిజం-లెనినిజం'' వేదంలాగా భట్టీయం వెయ్యడానికాదు, పరిస్థితుల సారాన్ని సమగ్రంగా అవగాహన చేసుకోవటానికి ఈ పని విరసం సభ్యులూ చెయ్యాలి విప్లవకారులూ చెయ్యాలి ఎవరితోక పట్టుకుని ఎవరు పోవాలన్నది తక్షణ సమస్య కాదు సరిఅయిన పంథాలో నడిస్తే రెండు తోకలు వాటంతట అవే కలుస్తాయి

*ముద్రణ ఎరుపు, విరసం బులిటిన్-2, జూలై, 1974*

# 28. సాహిత్యోద్యమాలు

ఆధునిక మానవుడి జీవితంలో అనేక కళలకు, విద్యలకు చోటున్నది మానవుడు, పాశవిక దశలో ఉండగానే అతడికి కొన్ని కళల అవసరం కలిగింది వాళ్ళు పాటలూ, నృత్యాలు చేస్తారు ఆహారాన్ని ఏరుకోటమూ, వేట జీవనాధారంగా గల ఆదిమవాసులు కలహారి ఎడారిలో ఇప్పటికీ ఉన్నారు! వాళ్ళ పాటలు, నృత్యాలు చాలా అందంగా ఉంటాయట తొలి దశ నుంచి కొంచెం పైకి ఎదిగిన వాళ్ళు చిత్రలేఖనమూ శిల్పమూ నేర్చారు ఆ దశలోని అనాగరికులు ఫ్రాన్సులో రచించిన గుహాచిత్రాలు అద్భుత కళా నైపుణ్యంతో కూడకున్నవని ఈనాటి కళాకారులే ఒప్పుకుంటున్నారు అవి ఇరవై లేక ముప్పైవేల ఏళ్ళనాటివి

అయితే సామాజిక పరిణామ దశలలో కళల సార్థకత మారుతూ వస్తున్నది ప్రాచీనుల కళలలో 'శ్రుతి' ఛాయలుండేవి చరిత్రయుగంలో కూడా కళలకు మతం వాసన పోలేదు ఈ విషయాన్ని పురాణాలే గాక మన సంగీత విద్వాంసులు పాడే కీర్తనలు కూడా రుజువు చేస్తాయి శిల్పులు కూడా దేవతల విగ్రహాలనే చెక్కారు మనుషుల విగ్రహాలు చెక్కటం అన్నది పాశ్చాత్యుల నుంచి మనం అరువు తెచ్చుకున్నది

సాంప్రదాయకంగా వస్తున్న కళా ప్రయోజనాలను మనం భుజాన వేసుకుని మొయ్యనవసరం లేదు ఈనాడు ఈనాటి సమాజం కోసం వెలువడే కళల ప్రయోజనమూ, విద్యల ప్రయోజనమూ మనం నిర్ణయించుకోవచ్చును

సాహిత్యము(కవితలూ, కథలూ, వ్యాసాలు), సంగీతమూ, నాటకాలూ, చిత్రలేఖనము, సినిమాలూ, సర్కసులూ మొదలైనవి ఈనాటి ప్రజల అవసరాల క్రింద జమ అవుతున్నాయి దేశంలో సగం మంది కటికపేదలుగా వున్నప్పటికీ ఈ కళలు అంతో ఇంతో అందరికీ అవసరమనిపిస్తాయి వీటన్నిటి ప్రయోజనము ఒక రకమైనది కాదు మన వాళ్ళు లలితకళలు అన్న వర్గీకరణకు కూడా అర్థం వున్నట్టు కనపడదు

సాహిత్యం సామాజిక జీవిత పురోగతిలో అత్యంత ప్రముఖ పాత్ర వహిస్తున్నదని డ్వాక్టర్ హాన్‌సుయిన్ ఇటీవల బొంబాయిలో ప్రసంగిస్తూ చెప్పినట్లు, తగిన సాహిత్య సహకారం లేకుండా సామాజిక పురోగమనం ఎన్నడూ జరగలేదు సమాజం తిరిగిన ప్రతి మలుపులోనూ పురోగామి రచయితలు తిరోగాముల ద్వారా దురన్యాయాలకు గురికావటం జరిగింది రేపటి సమాజాన్ని ఇవాళ చూడగలగడమే పురోగామి రచయిత లక్షణం

సాహిత్యంకన్న సంగీతం వున్నతమైనదిగా భావించే వాళ్లున్నారు కాని సంగీతానికి ఇటువంటి సామాజిక లక్షణం లేదు లల్లాయి సంగీతమయితే పామర జనానికి వినోదంగా ఉంటుంది శాస్త్రీయ సంగీతమైతే శ్రోతలకు వ్యక్తిగతమైన ఆనందాన్నీ, మనోవికాసాన్నీ ఇస్తుంది కాని అది జనాన్ని సామూహికంగా కదిలించి ముందుకు నడిపించలేదు మంచి సంగీతం ఆరోగ్యాన్ని పెంపొందిస్తుందన్నా నేను నమ్మగలను నాటక ప్రదర్శనలకు సినిమా ప్రదర్శనలకు మనుష్యులను సమష్టిగా కదిలించే శక్తి వున్నది కాని అవి అల్పజ్ఞుల చేతిలో సర్కసు ప్రదర్శనలలాగా కేవలం వినోద కార్యక్రమంగా వుండిపోవచ్చు సినిమాలకన్న జంతువుల సినిమాలకు, సర్కస్ సినిమాలకు హెచ్చు లాభాలు రావడం గమనార్హం!

మరొక లలితకళ - చిత్రకళ వ్యంగ్య చిత్రాలు కూడా కలుపుకుని సామాజికుల మనస్సును చైతన్యవంతం చెయ్యగలదు కాని దాని ప్రభావం చాలా పరిమితమైనదిగా కనిపిస్తుంది

పైన చెప్పినదాన్ని బట్టి సామాజిక ప్రయోజనం దృష్ట్యా ఏ యితర కళా సాహిత్యాన్ని పోలదు అందుకే కాల ప్రభావం యితర కళల మీద కన్నా సాహిత్యం మీద యెక్కువగా వుంటుంది కర్ణాటక సంగీత విద్వాంసులు రెండు శతాబ్దాల నాటి పాటలు యింకా పాడుతూనే వున్నారు వాళ్ళకు ఆ పాటలూ, వాటిలోని మాటలూ అర్థం కానవసరం కూడా లేదు తమిళ గాయకులు ఒకప్పుడు త్యాగయ్యగారి కృతులను హత్య చేసి అఖండఖ్యాతినార్జించారు ఒక సంప్రదాయాన్ని బట్టి పోతూ చిత్ర లేఖనమూ, శిల్పమూ చేసే వాళ్ళకు లోకానుభవం ఏమీ అవసరం లేదు అనాదిగా వస్తున్న సంప్రదాయం తెలిస్తే చాలు సహజమైన చిత్రాలు చిత్రించే వాడు తనకు కనిపించేది చిత్రిస్తాడు నైరూప్య చిత్రకారుడికి చత్వారం వున్నా ఇబ్బంది లేదు యధార్థ వ్యక్తుల ప్రతిమలు చెక్కే వారికి ఆ వ్యక్తులు తెలిసివుంటే చాలు ఆ వ్యక్తుల స్వభావం కూడా తెలిసి దాన్ని ప్రతిమలో చూపగలిగితే అది అత్యుత్తమ చిత్రకళ సామాజిక పరిజ్ఞానంతో పని లేదు

అందుచేతనే సాహిత్యోద్యమాలు వచ్చినట్టుగా ఇతర కళలకు సంబంధించిన ఉద్యమాలు రాలేదు కొన్ని కళారీతులను గురించి ఉద్యమాలు వచ్చి ఉండవచ్చు కవిత్వంలో వచన కవిత ఉద్యమంలాగా అలాంటి ఉద్యమాల గురించి కాదు నేను చెప్పేది నిజమైన సాహిత్యోద్యమాలు సామాజిక ప్రతిఘటనను ఎదుర్కొన్నాయి వ్యావహారిక భాషోద్యమంగాని, భావ కవితోద్యమంగాని, అభ్యుదయ సాహిత్యోద్యమం గాని కొత్త ఫాషన్లుగా బయలుదేరినవి కావు ఆ ఉద్యమాలలో సమాజంలో జరుగుతున్న మార్పులూ, జరగవలసిన మార్పులూ ప్రతిబింబించాయి ఈ ఉద్యమాలను తీవ్రంగా ప్రతిఘటించిన వారున్నారు ఆ ఉద్యమాలలో పాల్గొన్న తొలి మేధావులు మొదట నిరసనకు గురి అయి తరువాత ఆరాధనీయులయ్యారు

సాహితీ సమితి పుట్టటం నాకు తెలుసు అది చాలా చిన్న ఉద్యమం భావకవులు దాన్ని పెద్దది చేశారు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు కాలేజీలకు వచ్చి విద్యార్థుల ముందు తమ రచనలూ,

ఎంకిపాటలూ, ఇతర రచనలూ పాడి ప్రచారం చేశారు నవ్య సాహిత్య పరిషత్తు పుట్టినాక సాహిత్యోద్యమం దేశమంతటా విస్తరించింది ఆ సంస్థ తాలూకు వార్షిక సమావేశాలు మహాసభలుగా మూడేసి రోజులు పండగల్లాగా జరిగేవి రచయితగా పేరున్న వారిలో నవ్య సాహిత్య ఉద్యమాన్ని ప్రతిఘటించిన వారు లేరు మూడు తరాల రచయితలు ఆ ఉద్యమంతో ఏకమయ్యారు దానికి వెన్నుపూసలాగా ఉండినది వ్యావహారిక భాషోద్యమం 'భారతి' మొదలుకొని రెండో ప్రపంచ యుద్ధకాలందాకా వెలువడిన పత్రికలు దాదాపు అన్నీ నవ్యసాహిత్యోద్యమాన్ని ఆక్రమించుకున్నవే

నవ్య సాహిత్యోద్యమానికి ప్రతిఘటన లేకుండా పోయేనాటికి అభ్యుదయ సాహిత్యోద్యమం వచ్చింది నవ్య సాహిత్యం కన్నా అభ్యుదయ సాహిత్యం సమాజంలో రావలసిన మార్పులను మరింత స్పష్టంగా అర్థం చేసుకున్నది ఆధునిక చరిత్రలో అత్యంత పైశాచికమైన ఫాసిస్టు శక్తులను ఎదుర్కొనడానికి పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద దేశాలు సోషలిస్టు రష్యాతో రాజీపడవలసి వచ్చింది సోషలిస్టు సామాజిక వ్యవస్థ పురోగామి అనడానికి అంతకన్నా వేరే నిదర్శనం అవసరం లేదు ప్రపంచ మానవుడు సమసమాజం కేసి సామాజిక పురోగమనం సాగిస్తున్నాడు ఈ పరమసత్యాన్ని అభ్యుదయ సాహితోద్యమం అవలంబించింది

అయితే యుద్ధం అయిపోగానే పెట్టుబడిదారీ దేశాల దృక్పథంలో తిరోగమనం ఏర్పడింది అవి సోషలిస్టు వ్యవస్థను నిర్మూలించటానికి కుట్ర సాగించాయి పాతవలస విధానం చావుదెబ్బ తిన్నా కొత్త వలస విధానం ఒకటి రూపొంది జాతీయ విమోచన పొందిన దేశాలకు ఆర్థిక స్వాతంత్ర్యం లేకుండా చేసింది అభ్యుదయ సాహిత్యోద్యమ లక్ష్యం సరియైనదే కాని దాని సాధన కొరకు ప్రజలలో విప్లవ చైతన్యం కలగాలి సోషలిస్టు వ్యవస్థ సహజంగా ఏర్పడదు ప్రజలు వర్గరహిత వ్యవస్థ కోసం పోరాడి, విప్లవం చెయ్యాలి

ఈ సత్యాన్ని గుర్తించుతూ విప్లవ సాహిత్యోద్యమం వచ్చింది ఈ సాహిత్యోద్యమం యెదుర్కొన్న తీవ్ర ప్రతిఘటనను లోగడ ఏ సాహిత్యోద్యమమూ యెదుర్కొని ఉండలేదు దానినిబట్టి విప్లవ సాహిత్యం జీవితంలోని అతి జటిలమైన వైరుధ్యాలను యెదుర్కొంటున్నదన్నమాట అదే దాని బలం ఈ కాలానికి విప్లవ సాహిత్యమే సరిఅయిన సాహిత్యమని జనసామాన్యం తమ అనుభవం ద్వారా తెలుసుకుంటారు విప్లవ సాహిత్యం అవతరించింది ధనికుల కోసం కాదు పదవులలో వున్న వారి కోసం కాదు అట్టడుగున పడి వుండి సమాజంలోని కుళ్ళునంతటినీ భరిస్తున్న సామాన్య ప్రజల కోసం తమ కోసం సాహిత్యోద్యమంలోకి దిగి చోరుల్లాగా, హంతకుల్లాగా జైళ్ళకు పోయిన విప్లవ రచయితలు తమకు ఎంత సన్నిహితులో ప్రజలు కొంత కాలానికైనా గ్రహించకపోరు అట్టడుగు ప్రజల జీవితాలలో తెలుపూ, నలుపూ తప్ప మధ్యస్థమయిన రంగులు లేవు విప్లవ సాహిత్యంలో కూడా అంతే అన్ని సాహిత్యాలకన్నా కూడా ఏ మాత్రమూ రాజీ ఆమోదించని సాహిత్యం విప్లవ సాహిత్యం దానికి తప్ప ఈ దేశంలో ఇతర రకాల సాహిత్యాలకు భవిష్యత్తు లేదు

*ముద్రణ ఆంధ్ర సాహిత్య సమితి, భిలాయి, ద్వాదశాబ్ద వార్షికోత్సవ సాహిత్యమాలిక, 1978*

*పునర్ముద్రణ ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 16-4-1982*

# 29. సాహిత్య ప్రభావం

అరుణతార (24)లో సి హెచ్ మధు ప్రసంగ వ్యాసం బాగా ఆలోచనను రేపే విషయాలతో కూడుకున్నది

'నేటి కవిత్వం క్షీణ దశలో ఉన్నది '' దీనికి తిరుగులేని సాక్ష్యం ఏమంటే, ''విప్లవ కవిత వెల్లువలో బూర్జువా కవిత్వం క్షీణ దశలోనికి రాలేదు ''

''ఒక కవిత చదివిన తర్వాత ఒక వారం, లేదా, ఒక దినమంతా మన గుండెలలో ఆడుతూ ఉంటే అది మంచి కవితే బూర్జువా ఆలోచనా ధోరణి గల వానికి బూర్జువా కవిత్వం అలాంటి అనుభూతినివ్వాలి విప్లవ ఆలోచనల శ్రామికునికి విప్లవ కవిత్వం ఈలాంటి అనుభూతినివ్వాలి ఈనాడు వస్తున్న కవిత్వం అలాంటి ఏ అనుభూతినీ ఎవరికీ యివ్వటం లేదు ''

దీనికి ఒక కారణం, నేను లోగడ ఒక వ్యాసంలో సూచించినట్టు, ఇది సాహిత్యంతో జీవితాన్ని చైతన్యవంతం చేసే యుగం కాకపోవటం కావచ్చు కాని ఈ సమస్యను ఇంకా లోతుగా విశ్లేషించవలసిన అవసరం ఉన్నట్టు కనబడుతుంది ఆ ప్రయత్నమే ఈ వ్యాసం ఇందులో నేను రాస్తున్న అంశాల మీద నలుగురూ ఆలోచిస్తే నిజం తేలవచ్చు (కింది గీతలు సంపాదకుడివే)

మధు చెప్పిన పై విషయాలు ''చదివిన'' సాహిత్యానికే పరిమితమైనట్టు కనిపిస్తుంది ''చదివే'' సాహిత్యానికి మంది ''వినే'' సాహిత్యానికీ తేడా ఉన్న సంగతి మనకు తెలుసు చదువుకుంటే మనిషిని అంతగా చలింపజెయ్యలేని కవిత్వం, చదువుకుంటే పది మంది విన్నప్పుడు చాలా రెట్లు సంచలనం కలిగించవచ్చు అలాంటి కవితలు వస్తూనే వున్నాయి మధు ఆక్షేపణలు చాలావరకు చదువుకునే రచనలకే వర్తించినట్టుగా, ఇది సాహిత్యానికి యుగం కాదని నేనన్నది కూడా చదువుకునే సాహిత్యానికే వర్తిస్తుంది

మంది సాహిత్యానికి - సంస్కృతీ ప్రదర్శనలకు—ఈ ఆక్షేపణలు వర్తించమనుకుంటున్నాను

ఒక పురోగామి సాహిత్య సంస్కృతి దాని పూర్వ సంస్కృతికి కాలదోషం పట్టించాలన్న సూత్రం రైటే! విప్లవ సాంస్కృతిక ప్రదర్శనలతో బూర్జువా సాంస్కృతిక ప్రదర్శనలు ఈనాడు పోటీ చెయ్యగలవా, శ్రీశ్రీ '' ఊగరా, ఊగరా'' అన్న నక్సలైట్ పాట చదివితే జనంలోవచ్చే ఆవేశం ఏ బూర్జువా కవిత గాని కలిగించగలదా? ప్రజానాట్యమండలి బుర్రకథల విజయం చూసి, కాంగ్రెసు బుర్రకథలు రాయించారు, పాపం!

విప్లవకవిత ముందు బూర్జువా కవిత నిలవలేదని పదేళ్ళ క్రితం శ్రీశ్రీ షష్టిపూర్తి సందర్భంలో విశాఖపట్నంలోనే రుజువయింది దురదృష్టవశాన నేను విప్లవ సాంస్కృతిక ప్రదర్శనలకు మరీ దూరంగా ఉండిపోయాను అవి విజయవంతంగా ప్రజాదరణ పొందుతున్నాయని వింటే నాకు ఆశ్చర్యం కలగలేదు

సరి అయిన కవిత తుపాకీగుండులాంటిది మామూలు తుపాకీగుండు అరంగుళం లక్ష్యాన్ని కొట్టితే, కవిత ప్రజల ముందుకు వచ్చినప్పుడూ వందలూ, వేలూ గుండెలకు గురి అవుతుంది! ఇందుకు సందేహం లేదు మధు చెప్పినట్టు ఇది బూర్జువా కవితకు వర్తించాలి - దానికి ఏనాడో కాల దోషం పట్టి ఉండకపోతే

లక్ష్యం! దాన్ని గురించి ఆలోచించకుండా సాహిత్యం గురించి గాని, ప్రత్యేకించి కవితను గురించి గాని ఆలోచించి లాభం లేదు వ్యక్తులను ప్రభావితులను చేసే సాహిత్యం మందిని

అంతగా ప్రభావితులను చేయలేకపోవచ్చు ఒక నాటి బుర్రకథలు వినటానికి బాగున్నట్టుగా చదవటానికి బాగుండేవి కావు ఆ మాటకు వస్తే ''రక్తి'' కట్టడమనేది పది మంది కలిసి అనుభవించే కళలకే వర్తిస్తుంది గాని, ఒంటరిగా కూర్చుని చదువుకునే వానికి వర్తించదు

నా అయిదో ఏటి నుంచీ ఈనాటిదాకా కూచిపూడి ప్రదర్శనలు ఎన్నో చూశాను వాటిని పుస్తక రూపంలో తెస్తే, సాహిత్య ఎకాడమీ వారి ప్రచురణల్లాగా, ఒక్కటీ అమ్మదు - ప్రదర్శనలు చూడటానికి ఎంతో బాగున్నా కూడా

విప్లవ కవిత్వమంతా మంచిదేనని వాదించటం లేదు వెయ్యిమంది విని చైతన్యం పొందే కవితలనూ, చదువుకుంటే '' ఆనందం'' కలిగించే వాటినీ ఒకే కొలబద్దతో కొలవవద్దు

ఇంకో సంగతి మిగిలిన కళారూపాలలాగే విప్లవ రచనలలో కూడా మూసపద్ధతి ప్రవేశిస్తుంది సాహిత్యతత్వం తెలిసిన విమర్శకులు ఈ మూసపోతలను సులువుగా గ్రహించవచ్చు అసలైన కవిత ''ధ్వనే'' వేరు

మరొకటి ప్రాంతీయ భాషా సమస్య ఈ సమస్యలను గురించి కూడా లోతుగా ఆలోచించవలసిన అవసరం ఉన్నది

ప్రాంతీయ భాషకూ, పదజాలానికీ భాషలో స్థానం లేదని ఎవరూ అనలేదు నన్నయభట్టూ, తిక్కనసోమయాజీ వేరువేరు పదాలను వాడారు ప్రాచీన తెలుగులో అపభ్రంశాలన్నీ ''తజ్జలు''గా సాధువులయాయి ''మిత్తి'' ''ముత్తి'' లాటి మాటలు అపభ్రంశాలనటానికి సందేహం ఉందా?

ఆధునిక కాలానికి వస్తే, ''కన్యాశుల్కం''లోని మాండలిక భాష తెలుగులో చేరిపోలేదా? రాచకొండ విశ్వనాధశాస్త్రి విశాఖ ''యాస''కు ఆధునిక తెలుగు సాహిత్యంలో ఉన్నత స్థానం రాలేదా? కాళీపట్నం రామారావు రాసిన ఇంకా అట్టడుగు వాళ్ళ భాషను నిషేధించటానికి ఎవరికైనా దమ్ములున్నాయా? అల్లం రాజయ్యవాడే ''ప్రజల'' భాషలో ఎంత అందం! అయితే ఇక్కడ కూడా ''చదివే'' సాహిత్యానికీ ''వినే'' సాహిత్యానికి మాండలిక భాషతో గల సంబంధం వేరువేరుగా ఉంటున్నది

విశాఖపట్నం జిల్లా యాస తెలిసిన వాళ్ళకు ''కన్యాశుల్కం''గాని, రాచకొండ నాటకాలు గాని, ''గుంటూరు, కృష్ణా'' జిల్లాల యాసతో ఆడితే, నటన ఎంత గొప్పగా ఉన్నా, రక్తి కట్టకపోగా బాధ కలుగుతుంది ఆ నాటకాలే సరి అయిన యాసతో ఏ నెల్లూరు జిల్లాలోనో, కడప జిల్లాలోనే ఆడితే, వాటి ''స్వారస్యం'' అక్కడి ప్రేక్షకులకు పూర్తిగా లభించకపోవచ్చు

అల్లం రాజయ్య నాటిక ''జన్నెకోడె'' ఆంధ్రలో అన్ని ప్రాంతాలలోనూ రక్తి కట్టుతుందా? నాకు నమ్మకం లేదు

కాని ప్రాంతీయ నుడికారంలో రాజయ్య రాచకొండకు తీసిపోడనడానికి సందేహం లేదు

ఇదే ''లక్ష్యం'' యొక్క ప్రాధాన్యం ఉమ్మడి సాహిత్యంలో ప్రవేశించటానికి సంపూర్ణమైన అర్హత గల ''మాండలిక'' సాహిత్యం శ్రవ్యంగా మండలానికే పరిమితం అవుతున్నది

ఎప్పటికైనా మాండలికాలన్నీ పర్యాయపదాల కింద చలామణీ అయే రోజు రావచ్చు అప్పుడు ఒక జాతి యొక్క భాషా, సాహిత్యాలు అవిభాజ్యాలవుతాయి అంతదాకా చదువుకునే రచనలూ, వినే రచనలూ వేరువేరుగా ఉండక తప్పదు

ముఖ్యంగా నా నమ్మకం ఏమంటే, విప్లవ సాహిత్యం ''వినే సాహిత్యం''గా రూపొందటం ఎక్కువ అవసరమని ప్రధానంగా ''చదువుకునే'' కథలూ, నవలలూ విప్లవ సాహిత్యంలో అంతగా రావేమో।

*30-12-79*

నోట్

అల్లం రాజయ్యగారి(అ రా ) కోరిక మేరకు కుటుంబరావుగారు రాసిన రెండు వ్యాసాలలో ఒకటి 'సృజన'లో అచ్చుపడింది మరొకటి అచ్చు ఆలస్యం కారణంగా నిలిచి వుంటే, అ తా కోసం తెప్పించుకున్నాను - ముగ్గురి అనుమతితోనే ఆ యిద్దరి వుత్తరప్రత్యుత్తరాలు సేకరించి, వాటిని ' ఎడిట్' చేసి అచ్చుకిస్తున్నాను

ఈ రెండు వ్యాసాలలోనూ కుటుంబరావు గారు(కొ కు ) చెప్పదలచిన ప్రధానాంశాలు ఇవి అంటూ 12-1-80 నాటి లేఖలో ఆయన అ రా కు యిలా రాశారు

''ఈ కాలంలో సాహిత్యం ప్రజాజీవితాన్ని మార్చగలిగే అవకాశాలు లేవు ఒకప్పుడు మతాలకు జీవితాన్ని పరిణితి పొందించే శక్తి ఉండేది ఉదా బౌద్ధం, జైనం, ఇస్లాం, క్రైస్తవం ఈ మతాలు తమతమ కాలాలలో జీవితంలో విప్లవ పరిణామాలు తీసుకు రాగలిగాయి ఈనాడే గాదు దాదాపు వెయ్యేళ్ళ క్రితమే వాటి ప్రభావం తగ్గిపోయింది జీవితంలో విప్లవ పరివర్తన కలిగించే శక్తి ఆధ్యాత్మిక విశ్వాసాల నుంచి, లౌకిక భావాలకు సంక్రమించింది ఫ్రెంచి విప్లవానికీ, అమెరికన్ విప్లవానికీ రచనలు చేసిన దోహదం ఇంతా అంతా కాదు ఆ యుగం కూడా అయిపోయింది ఈనాడు రాజకీయ చైతన్యం తప్ప మరేదీ ప్రజా జీవితంలో విప్లవ పరిణామాలు కలిగించలేదు రష్యన్ విప్లవానికీ, అంతకన్న చాలా తక్కువగా చీనా విప్లవానికీ సాహిత్యం తోడ్పడిందని నా నమ్మకం

అయితే ఇది ప్రజాసాహిత్య రూపాలకు వర్తించదు విప్లవ కవిత్వం చదవండి, పాటలు పాడండి, నాటకాలు ఆడండి - వాటి సామూహిక ప్రభావం అద్భుతంగా ఉంటుంది 'చదువుకునే సాహిత్యం - వినే సాహిత్యం, అని నేను వర్గీకరిస్తున్నాను వినే సాహిత్యం విప్లవ పరిణామాలకు తోడ్పడుతుంది అది విప్లవ రాజకీయ చైతన్యంలో ఒక భాగం। వ్యక్తులు చదువుకునే సాహిత్యానికి ఆశక్తి ఉన్నప్పటికీ, చాలా దుర్బలంగా ఉంటుంది ఈ యుగానికి చైతన్యం పొందవలసింది వ్యక్తులు కాదు సమూహాలు। వ్యక్తులుగా కదిలిన వారు కవిత్వాలు రాస్తూనే ఉన్నా సి హెచ్ మధు విప్లవ సాహిత్యం రావటం లేదంటున్నాడు నిజమే, రావటం లేదు। వచ్చినది పని చెయ్యటం లేదు ఆ మాట అంతరాలలో అందరు గుర్తిస్తున్నారు అందుకే రాయలేకపోతున్నారు వి ర సం ఇంకా ఆరేళ్ళకు పుట్టుతుందనగా, అంటే 1964లో - కమ్యూనిస్టు పార్టీ చీలుతుందనగా - నాకు అభ్యుదయ రచనల సామాజిక ప్రభావం మీద ఒక్కసారిగా విశ్వాసం పోయి, రాయటం మానేశాను తిరిగి విరసం పుట్టినాక నేను సిద్ధాంతపరంగా మార్క్సిస్టులకు పనికి వస్తాయనుకునే వ్యాసాలు రాస్తున్నాను తప్ప, కథల జోలికి (వ్యంగ్యాలు తప్పిస్తే) పోవటం లేదు

''నా అనుభవం వెనుక ఏదన్నా సత్యం ఉంటే అది నేను ఈ ఉత్తరంలో చెప్పిన మూడు అంశాలలో ఉండాలి అయితే ఇది నిజమా, కాదో, ఇందులో నా అపోహలు ఉన్నాయేమో నలుగురు కూర్చుని చర్చిస్తేగాని తేలదు

(కింది గీతలు - సం॥)

''ఈ సందర్భంలోనే ఇంకో విషయం గురించి కూడా నా అభిప్రాయం ఒకటి సృజనకు పంపిన వ్యాసంలో చెప్పాను అదేమిటంటే -

''మాండలిక పదాల ఉపయోగం తప్పు కాదు మాండలిక భాష, సాహిత్యంలో తిక్కన కాలం నుంచి వస్తూనే ఉన్నది దానికి చదువుకునే సాహిత్యంలో చోటున్నది కాని జనం వినే సాహిత్యంలో చోటు లేదు జనాన్ని చైతన్యవంతులను చేయాలంటే వారి నుడికారంతోనూ, వారి సమష్టి సంస్కృతితోనూ నిండిన రచనలు కావాలి అల్లం రాజయ్య నాటకం తెలంగాణా ప్రజా సమూహాలను కదిలించినట్టుగా నెల్లూరు జిల్లావాళ్ళనూ, రాయలసీమ వారినీ కదిలించదు దీన్ని గురించి ఎవరూ అభ్యంతరం చెప్పలేరు కాని విప్లవ రచయితలు 'చదువుకునే' రచనలతో ప్రజలలో విప్లవచైతన్యం తీసుకురావటానికి చేస్తున్న ప్రయత్నం సరిఅయినది కాదని నేనంటే కొందరు ఒప్పుకోకపోవచ్చు నా ప్రతిపాదన సరిఅయినదైతే విప్లవ సాహిత్యం ప్రాంతీయ రూపాలు ధరించి, మొత్తం జనాన్ని ఒక గమ్యానికి అభిముఖులను చేయాలి ''

తమ ''విశ్లేషణ''ను గుడ్డిగా ఆమోదించనవసరం లేదనీ, ఆలోచించి చర్చించమనీ కొ కు సలహా చెప్పారు అంతక్రితం అ రా 10-1-80న కొ కు కు రాసిన లేఖలో, కథలు ఎక్కువగా రాకపోవడం గురించి తన వ్యథ వెలిబుచ్చారు వ్యాపార పత్రికల్లో వస్తూన్న కథలన్నీ 'చెత్త' అని అంటూ, యువ రచయితలు కథలు రాయటంలో ఇబ్బందులు, వాటిని అధిగమించడం, అసలు జీవితం నుంచి సంఘటనలు ఏరుకొని కథలుగా ఎట్లా రాయడం - యిలాంటి విషయాల గురించే అనుభవజ్ఞులైన కొ కు ను సలహా అడిగారు అంతేకాదు - యీ సలహాలను వ్యాసంగా రాయమన్నారు దీన్ని పురస్కరించుకుని రాసినవే కొ కు వ్యాసాలూ, తర్వాత అ రా తో నడిపిన ఉత్తరప్రత్యుత్తరాలూ 'తన అవగాహన' ఒక్కటే సరైందనే వితండవాదం కాదు కొ కు ది ''ఆలోచించ''మన్నారు, ''చర్చించ''మన్నారు, నలుగుర్నీ - ముఖ్యంగా వి ర సం సభ్యుల్ని

దీనికి జవాబుగా అ రా రాసిన లేఖ(18 జనవరి)లో ముఖ్యాంశాలు, ఆయన మాటల్లోనే, యివీ - '' ఆయా కాలాల్లో పరిణామ క్రమాన్ననుసరించే మిగతా శక్తులతో కలిసి విప్లవ పరిణతి ప్రజల్లో కలగడానికి సాహిత్యం కూడా దోహదం చేసింది వ్యవసాయ విప్లవంలో కంటె కార్మిక విప్లవాల్లో మీరన్నట్టు సాహిత్యం పాత్ర హెచ్చుగానే కన్పిస్తుంది అమెరికా విప్లవంలో కూడా రైతాంగ సెక్షను మీద చదువుకునే సాహిత్యం ప్రభావం అంతగా ఉన్నట్టుగా కనిపించదు దీని కారణం, నాటికి నేటికి రైతాంగంలో చదువగలిగిన వారి సంఖ్య స్వల్పం కావడం అవుతుందేమొ? రాజకీయాలకు, కళారూపాలకు మధ్య ఐక్యతతో వైఫల్యం వలన అట్లా అనుకోవడానికి ఆస్కారమేర్పడిందేమో! రాజకీయాలకు, కళారూపాలకు మధ్య ఐక్యత పూర్తిగా సాధ్యమైతే అలాంటి కళారూపం, అది చదువుకునేదైనా వినేదైనా, ప్రజా జీవితంలో విప్లవ పరిణామాలు కలిగించగలదని నేను అభిప్రాయపడుతున్నాను

'రైతాంగ విప్లవంలో తప్పనిసరిగా 'వినే సాహిత్యం' ప్రభావం హెచ్చుగా ఉంటుంది పోరాట ప్రాంతాల్లో అలాంటి విప్లవ సాహిత్యం చాలా పుట్టుకొచ్చింది అయితే అందులో మౌఖిక సాహిత్యం ఎక్కువగా ఉండడం, బాగా పరిశీలిస్తే తప్ప తెలుసుకోలేము ఉదా॥ అనేక

పాటలు, జనం చెప్పుకునే కథలు ఒక తాలూకా నుండి మరొక తాలూకాకు విప్లవ పరిస్థితి పురోగమించడంతో ఈ 'నోటి' సాహిత్యం చాలా విన్నాను, చూశాను - ''

- అంటూ, గ్రామాల్లో జనం సామూహికంగా తన కథలు చదువుకోవడం, డైలాగులకు డైలాగులే తన ముఖం మీదే పునరుచ్చరించడం, అందులోని పాత్రల్లా నటించడం వగైరా స్వానుభవ విషయాలు రాశారు అ రా ఇలా 'చదువుకున్న' కథల వల్ల ఏ మేరకు ప్రజల్లో విప్లవ పరిణతి కలిగిందనే విషయాన్ని తేల్చి చెప్పడం కష్టమేనంటూ, 'రైతుకూలీ సంఘాల పుట్టుకకు రాజకీయం ప్రధాన కారణమే అయినా రెండు రకాల సాహిత్యం ఎంతో కొంత దోహదం చేశాయని (Sic) చెప్పాలి'', అని తేల్చారు సి హెచ్ మధు అభిప్రాయంతో తనకు గల పేచీని ప్రస్తావిస్తూ, మాండలికం గురించి మరింత వివరంగా చర్చలు జరగాలని హైదరాబాదులో గద్దరూ, మధూ, యితర మిత్రులూ కలిసి అనుకొన్నామని తెలిపారు ''భౌతికపరంగా ఉన్న అసమానతలు భాషాపరంగా(కూడా) ఉంటాయి 'ప్రజల భాష తెలియకుండా ప్రజలలో కళల గురించి సారస్వతం గురించి మాట్లాడడమేమిటి?' అన్న మావో మాటననుసరించి ప్రజల భాషలో మనం రచనలు చేయడం అవసరం ''

దీనికి జవాబు(21 జనవరి)లో కొ కు కొన్ని విషయాలను మరింతగా వివరించారు ఒకటి, Rights of man వుదాహరణగా, ''అమెరికా విప్లవానికి రచనల దోహదం చాలా ఉన్నది,'' అన్నారు ''విప్లవానికి సాహిత్యం ద్వారా కలిగే సహకారం అచ్చుగా అక్షరాస్యతకు సంబంధించింది కాదేమో ''

''వ్యక్తులలో కలిగే సాహిత్య ప్రభావం సమష్టి చర్యకు దారి తీస్తుందా'' అని ప్రశ్న వేసి, ''ఈనాడు ఆ దశ దాటిపోయిందా అన్నది చర్చనీయం'' అని ఒక సమస్య లేవనెత్తారు ఇక, రాజకీయాలకూ కళా రూపాలకూ ఐక్యత అంటూ అ రా చెప్పిందాన్ని తీసుకుని, '' ఈ రెంటికీ ఆశయం ఒకటే అయితే ఐక్యత ఉన్నట్టేనా? లేదా, రెండూ ఒక సిద్ధాంతంపై ఆధారపడి ఉండాలా? మొదటిది సరికాదనుకుంటాను'' అని తీర్మానించారు

'మౌఖిక', 'లిఖిత' (వినే, చదువుకునే) సాహిత్యం ''గొడవ'' మనకు అనవసరం అంటూ, ''లిఖించినదే చదువుకుంటే వచ్చే ఫలితమూ వేరుగా ఉంటుంది మినీ కవితలు కొన్ని చదువుకోవటానికి బాగా ఉంటాయి పదిమందికి వినిపిస్తే వాళ్ళను కదిలించలేవు మంచి విప్లవ రచన 'వింటే' చైతన్యం పుట్టించేదిగా ఉండాలని ప్రయత్నిస్తున్నాను'' అని చర్చను యింకో వైపుకు తిప్పారు

మాండలికం విషయాన్ని మళ్ళీ తెచ్చి, ''ప్రజల భాషలలో తేడాలున్నట్టే, ఒకభాషలోని మాండలికాలలో కూడా తేడాలున్నాయి 'ప్రజల భాష' అన్నది ప్రాంతీయ ప్రజల భాష గనక, వేరువేరు ప్రాంతాల ప్రజల తెలుగులోనే తేడాలు ఉంటాయి 'వినే' సాహిత్యం ఏ ప్రాంతపు భాషలో ఉంటే ఆ ప్రాంతపు ప్రజలను హెచ్చుగా చైతన్యవంతులను చేస్తుంది 'చదువుకునే' సాహిత్యం మటుకు అన్ని ప్రాంతాల భాషలలోనూ ఉండవచ్చు అలాటి సాహిత్యం ఒక భాషకు ఒకటే ఉంటుంది కాని ప్రజలపై ప్రభావం కలిగించే సాహిత్యం ప్రాంతీయ భేదాలు కలదై వుండటం సమష్టి ప్రయోజనాలకు అవసరమన్నది నా ప్రతిపాదన ఏ మాండలిక రచన అయినా అన్ని ప్రాంతాల వారిలోనూ, చదివినా, విన్నా, ఒకే విధంగా చైతన్యం కలిగించేటట్టుంటే నా అభిప్రాయం తప్పు అవుతుంది ''

మినీ కవితల విషయంలో కొ కు రాసిందానితో తను ఏకీభవించక, ''నాకైతే మినీ కవిత చదవడం కంటె వినడంలోనే ఎక్కువగా ఆకట్టుకుంటుంది'' అంటూ మినీ కవితలు రాసే కవుల నుంచి తాను స్వయంగా విన్న విషయం తెలిపారు

మాండలికం ఆయా మండల ప్రజలలోనే ఎక్కువగా కదిలిస్తుంది గాని అందరినీ కాదంటూ, తమ భాషలో వచ్చిన పత్రికా రచనలే ప్రజలు చదివించుకుని వింటారనే స్వానుభవాన్ని కూడా తెలిపారు సాహిత్యం సిద్ధాంతంతో మిళితమైనప్పుడు, ఆ సిద్ధాంతం అవసరమైన చారిత్రక దశలో, ''చదువుకునే సాహిత్యానికి కూడా మంచి ప్రయోజనమే లభిస్తుంది'' అన్నారు

మరో మూడు రోజులకే(జనవరి 31) కొ కు అ రా కు మరింత వివరంగా జాబు రాశారు 21న తాను రాసిన ఉత్తరంలోని కొన్ని విషయాలను అ రా సరిగా అర్థం చేసుకోలేదని తనకు స్పష్టమవుతున్నదనీ, అర్థమయేలా తానే రాయకపోయివుండవచ్చుననీ అని, తన పాయింట్లు వరసగా వివరించారు

''(1) అమెరికా విప్లవంలో అచ్చుగా భావాలదే ప్రధాన పాత్ర అని నా ఉద్దేశం కానేకాదు సాహిత్యం విప్లవంలో ఆసారి వహించిన పాత్ర ఇటీవల వహించే అవకాశం లేదని దీనికి ఒక కారణం ఇది కావచ్చు, విప్లవించగల ఆనాటి వర్గం వ్యక్తిగతంగా రాజకీయ భావాలతో ప్రభావితులు కాగల వారిది కావచ్చు ఇది సరి అయిన అంచనా అని నా దృఢ నిశ్చయం ఇంగ్లండులో బూర్జువా విప్లవం చేసిన వాళ్ళు వ్యష్టిగా చైతన్యం పొందగలవాళ్ళు ఈనాడు మన దేశంలో విప్లవించే వర్గం సమష్టిగా మాత్రమే చైతన్యం పొందగలదని నా అంచనా చరిత్ర ముందుకు నడిచిన కొద్దీ విప్లవాలు జరిపే వర్గాలు అట్టడుగుకు పోతాయి

'మైనారిటీ చర్య మెజారిటీ చర్యగా మారకుండా ఏ విప్లవమూ విజయం కాదు కాని ఈ మార్పు రావటానికి ప్రధాన అంశం నాయకత్వ దక్షత 'ఎక్కడి చైతన్యస్థాయిననుసరించి అక్కడ సాహిత్యం కూడా రూపం మార్చుకున్నది' అని మీరన్నమాటే నేను చదువుకునే సాహిత్యానికీ, వినే సాహిత్యానికీ గల తేడాలో వ్యక్తం చేశాను

''(2) 'మినీ' కవితలన్నీ వినటానికి బాగుంటాయా? ఒక్క వ్యక్తి రియాక్షన్ తీసుకునేటట్టయితే (క్రింది గీతలు కొ కు వే) చదవటానికీ వినటానికి ఉన్న తేడా నేను చెప్పేది కానేకాదు మందిమీద రియాక్షన్ రావాలంటే చదవటానికి( ఒక్క మనిషి వినటానికీ) బాగున్నవన్నీ పనికిరావు 'వినే' రచనలు అని నేను అన్నప్పుడల్లా 'మంది' వినే రచనలనే నా అభిప్రాయం కొన్ని మినీ కవితలు ప్రజాబాహుళ్యాన్ని చైతన్యం చెయ్యటానికి కూడా పనికిరావచ్చు కాని నేను చదివి బాగున్నాయన్న వాటిలో చాలా భాగం సామూహిక చైతన్యం కలిగించగలిగేవిగా లేవు

''(3) 1921 నుంచీ 30 దాకా వచ్చిన జాతీయోద్యమాలలో ఆంధ్రపత్రికలో వార్తలూ, సంపాదకీయాలూ చిన్నచిన్న గ్రామాలలో (సర్కారు జిల్లాలలో) సమష్టిగా, మధ్యమధ్య వ్యాఖ్యానిస్తూ వినేవారు భాష గ్రాంధికం వినే వారి భాష కాదు అయినా సమష్టి రియాక్షన్ చాలా బలంగా ఉండేది ఈనాడు అది సాధ్యమా? నాకు తెలీదు నేను ఏ గ్రామంలో గాని అడుగుపెట్టి 40 ఏళ్ళయింది

''అదీకాక ఆ సమష్టిపరనం తెచ్చినది విప్లవ చైతన్యం అనలేం ఇవాళ నేను చెబుతున్నది అచ్చుగా ప్రజలలో విప్లవ చైతన్యం కలిగించగల సాహిత్యం గురించి

''(4) నేను రాసిన కథలు చదువుకునేవే అవి వ్యక్తుల మీద ప్రభావం చూపి ఉంటే అది విప్లవ చైతన్యం కాదనటానికి అవకాశం లేదు చదివే సాహిత్యం రాకూడదని నా ఉద్దేశం కాదు అందులోనే ప్రాంతీయ భాషా సాహిత్యాలకు స్థానం ఉండేది అయితే అది విప్లవ సాహిత్యంగా పనికివస్తుందా? ఇదే నేను మిమ్మల్ని నలుగురితో చేరి చర్చించమన్నాను ఒంటరిగా ఆలోచించవద్దు

*అరుణతార, 1979 డిసెంబరు, 1980 మార్చి*

# 1. ప్రసాద్‌తో

ఈవేళ మార్క్సిస్టు కాకుండా లాభం లేదు పనికిమాలిన మార్క్సిస్టే అయినా సరే మార్క్సిస్టు అయి తీరాలి

ప్రతి విరసం సభ్యుడి దగ్గర నుంచి నేను చాలా నేర్చుకుంటున్నా నాకు రాసే వారూ అంతే, నాతో మాట్లాడే వారూ అంతే ఇది ఎప్పుడూ ద్విముఖమైన భావ ప్రసారమే

మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానం విరసం ప్రణాళికలోంచి తీసివేయాలనడం వెర్రితనం మార్క్స్ మేధావి లెనిన్ రాజకీయపరుడు మావో విప్లవకారుడు మనిషిని విముక్తి చేయమన్నాడు మార్క్స్ చైతన్యవంతం చేయమన్నాడు లెనిన్, సొంతం పరివర్తన చేయమన్నాడు మావో పెట్టుబడిదారీ సమాజాన్ని విశ్లేషించడంతోనే సరిపోయింది మార్క్స్‌కు సాహిత్యం గురించీ దాని పాత్ర గురించీ ఎక్కువగా చెప్పలేదు ఆ మాటకొస్తే లెనిన్ కూడా వూరికే టాల్‌స్టాయ్‌ని విశ్లేషణ చేశాడే గాని అంతకు మించిపోలేదు సాహిత్యాన్ని ఆయుధం చేసిన వాడు స్టాలిన్ అతనికి అది చారిత్రకావసరం మావో మరింత ముందుకి వెళ్ళాడు సోషలిజంను కాపాడాడు స్టాలిన్ వెనక్కు మళ్ళడం కాకుండా అన్ని జాగ్రత్తలు తీసుకున్నాడు మావో చైనా విషయం యేమి చెప్పడమైనా తొందరబాటే చైనాను సమర్థించే విషయంలో గాని గర్హించే విషయంలో గానీ మనం అతి ఆతురత చూపగూడదు వేచి చూద్దాం

ఉపరితల నిర్మాణంను తక్కువ అంచనా వేయడం తప్పు సాహిత్యం కూడా అందులో భాగమే పైగా ఆరువేలేళ్ళుగా మానవజాతిలో పేరుకున్న భావాల బూజు దులపాలంటే సాహిత్యం చాలా చాలా అవసరం భాష గురించి మార్క్స్ ఎంత చక్కగా రాశాడు! అన్నీ మానవ జ్ఞానంలో శాఖోపశాఖలని అతను ఎంత లోతుగా పరిశీలించాడో ఆశ్చర్యం వేస్తుంది

మార్క్సిస్ట్ జ్ఞాన సిద్ధాంతం నేను మావో నుంచి నేర్చుకున్నా మావోను తప్పిస్తే మార్క్సిస్ట్ జ్ఞాన సిద్ధాంతం లేనట్టే సాహిత్యానికి జ్ఞాన సిద్ధాంతంతో సమీప సంబంధం ఉంది

ఒక భావజాలంగా మార్క్సిజం బాగా విస్తరించింది ఈనాడు మార్క్సిజం తెలియనివాడు లేడు డికెన్స్, బాల్జాక్, హ్యూగో నాటికి మార్క్సిజం ఒక సిద్ధాంతంగా రాలేదు వాళ్ళు ముగ్గురూ వాస్తవికతావాదంకి మంచి సేవ చేశారు కాని ఏది తోవ అనడానికి మార్క్సిజం చదివితీరాలి

జానపద రూపాలకు నేను సొంతం వ్యతిరేకిని కాను ఆనాటి నాజర్ 'బెంగాల్ కరువు' బుర్రకథ కూడా నిన్నటి కథే సందేశం ఇవ్వడం, రేపేం చెయ్యాలో చెప్పటం జానపద రూపాలలో సాధ్యం కాదు ప్రారంభ దశలో వాడినా, ఎల్లకాలం వాటినే పట్టుకు పాకులాడుతామనడం సరికాదు వీధిభాగోతం, సిమ్లా భాగవతం వంటి వాటిలో వ్యంగ్య పాత్రీకరణలు వున్నాయే గాని పాత్రలు లేవు ప్రజా నాట్యమండలి 'మాభూమి' తప్ప మిగతావి విఫలం 'మాభూమి'లో వాస్తవ పాత్రలు ఉన్నాయి ఇతివృత్తంతో బాటు రూపం మారి తీరాలి యిప్పుడో మరొకప్పుడో జానపద రూపాల నుంచి, పౌరాణిక నాటకాల నుంచి మనం ఏమీ నేర్చుకోలేం నామట్టుకు నేను కురుక్షేత్రంను గయోపాఖ్యానంను చస్తే చూడను చూసి

ఆనందించడం చేయలేను చూశాక ఏమీ మిగలదు నాటకాలలో పాటలు పెట్టడం పెద్ద బూతు ఆ విషయంలో ఆత్రేయకు జేజేలు అయితే నేను పాటకు వ్యతిరేకినికాను విడిగా పాటలు పాడండి! ప్రజలను లేవగొట్టడానికి పాట బాగా పనికి వస్తుంది నేను కాదనను 'గొల్లసుద్దులు'- కూర్చున్నోళ్ళు గోత్రాలు నించునోళ్ళు గోత్రాలు సి ఐ డి ల కెరుకని గొల్లసుద్దుల్లోనే అననక్కర్లేదు నేను 1930లో తెనాలిలో కాంగ్రెసు మీటింగుకి వెళ్ళాను ఒక హెడ్ కానిస్టేబుల్ తల వంచుకుని రిపోర్టు రాసుకుంటున్నాడు 'ఆ రిపోర్టు రాసుకొనే అతన్ని సరిగ్గా రాసుకోమనండి' అనేసరికి అంతా అతనికేసి చూశారు అతగాడు బిత్తరపోయి కాగితాలు చంకనపెట్టాడు కనక ఉపన్యాసాలు కూడా మంచి సత్ఫలితం యిస్తాయి కొత్త రూపాలని మనం తప్పకుండా తయారుచేసుకోవాలి ఎప్పటికీ పాతవాటితో కాలం గడుపుదామనుకోవడం తప్పు

1941లో నేను ' ఆంధ్రపత్రిక'లో పని చేస్తున్నా పేరిస్‌లో బస్ కోసం నిల్చున్నా శ్రీశ్రీ అటు వెళుతూ నన్ను చూసి వెనక్కు వచ్చాడు ''మూడణాలున్నాయా?'' అని అడిగి చకచకా వెళ్ళిపోయాడు నాలుగో అణా అక్కర్లేదంటాడు శ్రీశ్రీలో లోభదృష్టిలేదు అయితే అతడికెప్పుడూ అక్కరే

శంకరాచార్యులవారు నాస్తికులను తిట్టినట్టుగా మధు(సూదనరావు సం ) మార్క్సిస్టేతరులని తిడుతున్నాడు ఇది తప్పు పీఠాధిపతి మనస్తత్వం పోవాలి మనం లోపాలే చూపే విధంగా ఉండకూడదు మన వైఖరి గుణాలనూ చూడగలిగేలా ఉండాలి

ఆర్ యస్ సుదర్శనం మార్క్సిజం గురించి పట్టించుకోవలసి రావడం మనకు బలం సూచించే విషయం అతనిలో లోట్లు ఒడుపుగా ఎత్తిచూపాలి కమ్యూనిస్టు గవర్నమెంటు వస్తే స్వేచ్ఛ ఉండదని వాపోయాడు ఇది తప్పు జె వి యస్ (జె వి స్టాలిన్ సం ) చెప్పిన మాటలు రికార్డయి వున్నాయి ''పంచవర్ష ప్రణాళిక మీద పద్యాలు రాయాలని మేము కవులను బలవంతపెట్టం ప్రణాళికల్లేకుండా పురోగతి లేదని గుర్తించే పరిస్థితులను కవులకు చూపెడతాం '' అంతేగాని, మనం రూళ్ళకర్రతో (చిత్ర) కళను గీయం అలాగే పేముబెత్తంతో పద్యాలు రాయించం

వ్యాపార దృష్టి కళారంగంలోకి బాగా పాకింది జీవితంలో కష్టాలు పడే వాళ్ళు వెండితెర మీద కష్టాలు చూడ్డానికిష్టపడరని మన సినీ నిర్మాతలు బుకాయించుతారు ఇది తప్పు అలా అనే వాళ్ళు కష్టాలు పడని వాళ్ళూ, కష్టాలెరగని వాళ్ళూను మునిని ధర్మరాజు అడుగుతాడు - మాలాగా కష్టాలు పడ్డవాళ్ళెవరైనా ఉన్నారా అని, అప్పుడే ''నలోపాఖ్యానం'' చెబుతాడు అదీ కథ

ఏదైనా ఆచరణలో పరీక్ష కానిదే నమ్మకూడదు ''నలోపాఖ్యానం'' చివర నలుడికి అశ్వహృదయం వస్తే ఋతుపర్ణుడికి అక్ష విద్యవచ్చునని రాశాడు అంటే, చెట్ల ఆకులు చూడగానే ఎన్ని ఉన్నాయో చెప్పడం అలా చెప్పగానే, లెక్కబెడితే, నిజంగా అన్నే ఉన్నయి ఏ విద్యకయినా ఒక క్రమం ఉంటుంది క్రమంలోనే సమగ్రత వస్తుంది ఏ దశలోనైనా ఆ క్రమంను మనం వివరించడం చెయ్యవచ్చు ఇది ఏమంత కష్టమైనది కాదు

*ఇష్టాగోష్ఠి తేది 5-10-1979*

*అరుణతార, త్రైమాసిక పత్రిక, జులై-అక్టోబరు 1980*

# 2. కృష్ణాబాయితో

''నన్ను డాక్టరు(దక్షిణామూర్తి) గారు ఒక ప్రశ్న అడిగారు - విప్లవం తర్వాత, ఇప్పటిదాకా ఉన్న సాహిత్యం కాలదోషం అవుతుంది గదా అని, చాలా మంది ప్రశ్న నేనెప్పుడూ ఆలోచిస్తూంటాను మన ఇతిహాసాలలో రామాయణం పెద్దది కాని, భారతంలో ఉపాఖ్యానాలు చాలా మంచివి ఉన్నాయి రష్యాలో రామాయణాన్ని అంత అభిమానించారంటే అదంతా రాజకీయం అనిపిస్తూంది మన దేశంతో మంచి సంబంధాల కోసం వేసే యెత్తుల్లో అదీ ఒకటి కావచ్చు అక్కడ విప్లవం తర్వాత సహకార(వ్యవసాయ) క్షేత్రాల గురించి వచ్చిన ఒక నవల గురించి నేను గొప్పగా ఒక రష్యన్ విమర్శకుడి దగ్గర చెబితే, ఆయన దాన్ని పట్టించుకోనే లేదు మనకి నిజాలు తెలీవు గదా!''

అతీతశక్తుల గురించి యువకులు ప్రశ్నిస్తే, ''వాటిని బాగా స్టడీ చేసి మార్క్సిస్ట్ దృక్కోణం నుంచి విశ్లేషించాలి'' అన్నారు

(క్రితంలో) తాము తెనాలిలో వుంటున్నప్పుడు నార్ల వగైరాలు తమని చూడ్డానికి వచ్చారు ఒకసారి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు నా గెస్ట్(అతిథి) ఆయనతో మాట్లాడాక, నా రచనాధోరణి మారిపోయింది అందాకా పుస్తకాల భాషగా ఉండేది ''ఆడవాళ్ళు మాట్లాడుకునేవి వినవోయ్, అసలైన తెలుగు వస్తుంది'' అన్నారు(శ్రీపాద)

*ఇష్టాగోష్ఠి తేది 25-11-1979*
*అరుణతార, త్రైమాసిక పత్రిక, జూలై-అక్టోబరు 1980*